"మధుర ప్రశాంత సమాలోచనలకు
నేను గతస్మృతుల్ని ఆహ్వానించినప్పుడు"

అహమ్మద్‌నగరంకోట జైలులో
1942 ఆగస్టు 9 నుండి
1945 మార్చి 28 వరకు
నాతో వున్న నా సహచరులకు,
తోటి ఖైదీలకూ —

# తొలిపలుకు

నేనీ పుస్తకాన్ని అహమ్మద్‌నగర్ కోటలో ఉండగా 1944 ఏప్రిల్ నుంచి సెప్టెంబరువరకు అయిదు నెలల్లో వ్రాశాను. నాతోపాటు ఖైదులో ఉన్న సహచరులలో కొందరు సహృదయతతో దీని వ్రాతప్రతిని చదివి, అనేక అమూల్య సూచనలిచ్చారు. దీనిని ఖైదులోనే సరిచూచేటప్పుడు ఆ సూచనల నుపయోగించుకుని, కొన్ని చేర్పులు కూర్చాను. అయితే, నా యీ రచనలోని భావాలకు ఏఒక్కరూ బాధ్యులు కారనీ, లేక వా రామోదిస్తారని భావించనవసరంలేదనీ నేను ప్రత్యేకంగా చెప్పనక్కరలేదనుకుంటాను. కాని, వారితో కలసి, అనేకసమాలోచనలూ, చర్చలూ జరుపడంవల్ల భారతీయచరిత్ర, సంస్కృతుల వివిధ దృక్పథాలను గురించి నా మనసులో మసకగావున్న భావాలు విస్పష్టరూపందాల్చాయి. అందుకు వారికి నా హృదయపూర్వకకృతజ్ఞత తెలుపుకోకతప్పదు. కొద్దికాలంపాటైనా జైల్లో ఉండడం ఆనందదాయకం కాదు, ఇక అనేకసంవత్సరాలు ఉండాలంటే ఎంతకష్టమో చెప్పనక్కరలేదు. కాని, అసమాన సామర్థ్యం, సంస్కృతి, తాత్కాలికోద్రేకాలనుకూడా అధిగమించిన విశాలమానవదృక్పథమూ గల వ్యక్తులతో అత్యంతసన్నిహితంగావుండే సదవకాశం లభించినది గనుక, ఈ కారావాసం కూడా నా అదృష్టమే.

అహమద్‌నగర్ కోటలో నా సహచరులుగా ఉన్న పదకొండు మందీ భారతదేశవైవిధ్యాన్ని ప్రదర్శించే ముచ్చటైన వ్యక్తులు. వా రనేక విధాలుగా భారతరాజకీయాలకే గాక, అధునాతనపాండిత్యాలకు, వర్తమాన భారతదేశ వివిధదృక్పథాలకు ప్రతినిధులు. భారతదేశ ప్రధాన సజీవభాషల్లో దాదాపు అన్నిటికీ, భారతదేశాన్ని గతంలోను వర్తమానంలోకూడా గాఢంగా ప్రభావితంచేసిన ప్రాచీనభాషలకూ ప్రాతినిధ్యం లభించింది. ఆ భాషల స్థాయి తగచ్చుగా ఉన్నతపాండిత్య

ధోరణిలో ఉండేది. ప్రాచీనభాషల్లో సంస్కృతం, పాళీ, అరబ్బీ, పారశీకమూ, ఆధునికభాషల్లో హిందీ, ఉరుదూ, బెంగాలీ, గుజరాతీ, మరాఠీ, తెనుగు, సింధి, ఒడ్రభమూ మాట్లాడేవా రుండేవారు. నా సా ర్థ్యమే పరిమితిగా, ఈఅన్ని భాషాసంపదలనుండి నాకు లాభించేఅవకాశ కలిగింది. నా సహచరులందరికి నేను కృతజ్ఞుడనే కాని, మౌలానా అబ్దుల్ కలాం ఆజాద్, గోవిందవల్లభపంత్, నరేంద్రదేవ్, ఎం. అస ఫాలీగార్లను ప్రత్యేకంగా పేర్కొనాలి. వారిలో ఆజాద్ అపారవక్తృ త్వప్రతిభ నన్నెంతో ఆనందపరచడమేగాక, ఒక్కొకసారి ఉక్కిరిబిక్కిరి చేసివేసేది.

నే నీ పుస్తకాన్ని ముగించి ఒకటింబాతికేండ్లు గడచింది. ఇందులో కొన్నిభాగాలు ఇప్పటికే కాలదోషంపట్టాయి. తర్వాత చాలా సంఘటనలు జరిగాయి. దీనిని తిరుగవ్రాయాలనీ కొంతచేర్చాలనీ నాకు అనిపించింది. కాని, ఆ ప్రేరణను నిగ్రహించుకున్నాను. నిజానికి మరోవిధంగాచేసే అవకాశమూ లేదు. ఎందువల్లనంటే, జైలు వెలుపలిజీవితం విభిన్నంగా ఉంటుంది. దీర్ఘాలోచనకు, రచనావ్యాసం గానికీ తగువ్యవధి వుండదు. నేనువ్రాసినదాన్ని మళ్ళీ చదవడమే అసాధ్య మైపోయింది. నేను దీన్ని ఆదిలో చేతితోనే వ్రాశాను. జైలునుంచి విడుదలైనతర్వాత టైపుచేయించాను. ఆ టైపుచేసినది చదివే తీరికే చిక్కలేదు. పుస్తకప్రచురణ ఆలస్యమైపోతూంటే నా కుమార్తె ఇందిర యీ భారాన్ని స్వీకరించి, నన్ను తప్పించింది. ఈ పుస్తకం ఏచేర్పులూ, మార్పులూ లేకుండా జైల్లోవ్రాసినది యథాతథంగా ఉండిపోయింది. చివర "తాజాకలం" మాత్రం చేర్చాను.

ఇతరగ్రంథకర్తలు తమరచనలనుగురించి ఏమనుకుంటారో నాకు తెలియదు. కాని, నేను కొన్నాళ్ళక్రితంవ్రాసినదాన్ని, కొంతకాలానికి మళ్ళీచదువుతూంటే, ఒకవిధమైన విచిత్రానుభూతి కలుగుతుంది. ఆ గ్రంథం జైల్లో సంకుచితవిలక్షణవాతావరణంలో రచించబడినదై,

ఆతర్వాత జైలుబైట చదవడం సంభవిస్తే, ఆ విచిత్రానుభూతి యిబ్బడి ముబ్బడిగా ఉంటుంది. నాకు సన్నిహితుడైనా, భిన్నమైన మరోవ్యక్తి రచించినగ్రంథాన్ని చదువుతున్నట్లు తోస్తుంది. ఇది బహుశా, నాలో జరిగినమార్పుయొక్క పరిమాణం కావచ్చు. దీనిని గుర్తిస్తాను కాని, పూర్తిగా కాదు.

ఈ పుస్తకాన్నిగురించి కూడా అలాంటిఅనుభూతే పొందాను. ఇది నా రచనే, కాని, నేటి నా మనోభావాలనుబట్టి పూర్తిగా నాదే ననలేను. నాలో అనేకరకాలవ్యక్తిత్వాలు కొంతకాలం వుండి, ఏదో ఒక్కొకస్మృతిని మాత్రమే వదలిపెట్టి, అంతర్హితమైపోయాయి. అలాంటి వ్యక్తిత్వాల్లోనిదే ఒకటి ఈ పుస్తకాన్నిరచించినదనిపిస్తోంది.

జవహర్‌లాల్ నెహ్రూ

ఆనందభవనం
అలహాబాదు
1945 డిసెంబరు 29.

## మా మాట

రెండువందల ఏండ్లుగా పరాధీనమై కృంగిపోయిన భారతదేశం స్వతంత్రమై, పురోగమిస్తూ, ప్రపంచంలో ప్రధానదేశంగా పరిగణింపబడుతున్నది. అట్టి మన దేశచరిత్ర, సంస్కృతి, కళలనుగురించి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ ఆధ్యాత్మిక, నైతిక, సాంఘిక, రాజకీయార్థిక దృక్పథాలతో వ్యాఖ్యానించి, విశ్వమానవాళికి భారతదర్శనావకాశం కల్పించారు. విశ్వసాహిత్యంలో మహోత్తమకృతిగా ప్రసిద్ధిచెంది, అనేకానేక భాషలలోకి అనువదింపబడి లక్షలాదిప్రతులు కోట్లాది పాఠకులచే మననం చేయబడిన ఈ 'భారతదర్శనము'ను ఆంధ్రపాఠక లోకానికి సంతోషపూర్వకంగా సమర్పిస్తున్నాము.

తెలుగు అనువాదాన్ని ప్రచురించే అవకాశం కలిగించిన శ్రీ జవహర్‌లాల్‌గారికి, వారి ప్రైవేటు కార్యదర్శి శ్రీ ఎం. ఒ. మత్తయ్ గారికి మా కృతజ్ఞతాభివందనాలు. అడిగినంతనే తెనుగులోకి అనువాదం చేసిన శ్రీ బి. ఎస్. మూర్తి (M. P), శ్రీ క్రొవ్విడి లింగరాజుగార్లకు, ఈ గ్రంథప్రచురణకు ప్రోత్సహించి, అనేకవిధాలుగా సహాయపడిన శ్రీ పిడికిటి మాధవరావుగారికి, శ్రీ పోలవరపు శ్రీహరిరావుగారికి మా ధన్యవాదములు తెలుపకతప్పదు.

ఆంధ్రపాఠకసోదరులీ ఉత్తమగ్రంథాన్ని సముచితంగా ఆదరించ గలరనే మా పూర్తివిశ్వాసం. ఇంకను మేమిట్టి గ్రంథములను విరివిగా ప్రకటించి మా పాఠకులకు అందించగల్గుటకు ప్రోత్సాహమిత్తురని ఆశించెదము.

విజయవాడ
౹౬-3-1958

గద్దె లింగయ్య
సంపాదకుడు

# విషయసూచిక

## ౧ అహమ్మద్ నగరుకోట



## ౨ బేడెన్ వీలర్-లాసేన్



## ౩ సింధులోయ సంస్కృతి

## ४ భారతీయాన్వేషణ



## ५ గతయుగాలలో

## 6. నూతన సమస్యలు

## 8 చివరిదశ (1) బ్రిటిష్‌పరిపాలన సంఘటితమగుట, జాతీయోద్యమారంభము

## ౭ చివరిదశ (2) జాతీయత-సామ్రాజ్యతత్వం



## ౮ చివరిదశ (3) ద్వితీయప్రపంచయుద్ధం

## ౧౦ మళ్ళీ అహమ్మద్‌నగరంకోట

# భారత దర్శనము

## అహమ్మద్ నగరుకోట

### 20 మాసములు

**అహమ్మద్‌నగరుకోట. 13 ఏప్రిల్ 1944**

మమ్మల్ని ఇక్కడికి తీసుకొచ్చి 20 మాసాలు దాటిపోయింది. తొమ్మిదవసారి ఖైదులో ఇరవై మాసాలు గతించిపోయాయి. మే మిక్కడకొచ్చినప్పుడు చీకటిరాత్రినాటి సన్నని చంద్రవంక మమ్మాహ్వానించింది. శుక్లపక్షం ప్రారంభమైంది. అప్పటినుంచి ప్రతి నెలపొడుపూ నా జైలుజీవితంలో ఒకనెల పూర్తియైన సంగతిని జ్ఞాపకానికితెస్తూఉండేది. క్రిందటిసారి జైలుకూడా అల్లాగే గడచిపోయింది. అప్పుడు దీపావళి వెళ్ళిన శుక్లపక్షంలో జైలులో ప్రవేశించాను. చంద్రుడు నాకు కారాగారవాసంలో ఎప్పుడూ పరమమిత్రుడు. ఆయనతోడి సహచర్యం ఈ ప్రపంచంయొక్క సౌందర్యాన్ని, జీవితంలోని అభివృద్ధి నాశాలను, చీకటి వెలుతురుల గమనాలను, జీవన్మరణాలు ఒకదానివెంట ఒకటి అనంతంగా వెంటాడించే ప్రకృతిలీలను నాకు జ్ఞప్తికితెస్తూ ఉండేది. సాయంకాలము, రాత్రివేళ, అరుణోదయానికి పూర్వమూ చంద్రుని అన్నికళలనూ అవస్థలనూ చూస్తూవచ్చాను. రోజులను, మాసాలనూ గుణించుకోవడానికి చంద్రుడెంతో సహకారి కదా! చంద్రుని అవస్థలను బట్టి, కళలనుబట్టి కాస్తంత ఇంచుమించులో నెల, తిథి తెలుసుకోవచ్చును. కొద్దిగా సర్దుబాటుచేసుకుంటే చంద్రుడే ఒక పంచాంగం. గ్రామసీమల్లో వ్యవసాయంచేసుకునే రైతులకు మాసాలు, కార్తులు, ఋతువులు తెలుసుకోవడానికి ఆ శీతాంశుడే సాధనం.

మే మిక్కడ కొచ్చిన తొలిరోజుల్లో మూడువారాలపాటు ప్రపంచానికీ మాకూ ఏవిధమైన సంబంధం లేదు. ఉత్తరప్రత్యుత్తరాలు,

వార్తాపత్రికలు, రేడియో, బంధుమిత్రులతో మాట్లాడే సావకాశాలు, ఏమీ లేవు. మామీద కాపలాకాస్తున్న ఉద్యోగస్థులకు తప్ప, అక్కడ మా ఉనికికూడా అభేద్యమైన రహస్యంక్రింద లెక్క. కాని దేశానికం తకూ మే మెక్కడున్నామో తెలుసును.

కొన్నాళ్ళకు మాకు వార్తాపత్రికల నిచ్చారు. మరికొన్ని వారాలైనాక దగ్గరబంధువులతో కుటుంబవ్యవహారములకు సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరాలను సాగనిచ్చారు. కాని ఈ ఇరువైనెలలనుంచి పైవారినెవ్వరినీ మాతో కలుసుకోనివ్వలేదు. మాకిచ్చే వార్తాపత్రికలలో చాలా భాగాలకు మసిపూసేవారు. అయినప్పటికీ, ప్రపంచంలో సగభాగాన్ని పొట్టనేట్టుకుంటున్న యుద్ధంయొక్క స్థితిగతులు, ముఖ్యంగా మన భారతప్రజలపట్ల ఎల్లా వర్తిస్తున్నదీ ఒకమాదిరిగా తెలుస్తూనే ఉండేది. వేలాదిప్రజలు విచారణలేకుండా డిటెన్షన్ క్యాంపుల్లోనూ, కారాగారాల్లోనూ మ్రగ్గిపోతున్నారనీ, వందలాదిజనం కాల్చిచంపబడ్డారనీ, వేలసంఖ్యలో విద్యార్థులు స్కూళ్ళనుంచీ కాలేజీలనుంచీ వెళ్ళగొట్టబడ్డారనీ, మొత్తం దేశవ్యాప్తంగా ఒకవిధమైన సైనికపరిపాలన (మార్షల్ లా) నడుస్తోందనీ, దేశమంతా భయభ్రాంతంగానూ భీభత్సంగానూ ఉందనీ తప్ప మరేసంగతులూ వివరంగా మాకు తెలియలేదు. వేలకొలదీ దేశభక్తులు ఏవిధమైన విచారణ లేకుండా ఖైదుల్లో మాకన్న చాలా బాధలుపడుతున్నారు. వాళ్ళకి ఇంటర్వ్యూలు, ఉత్తరాలు, వార్తాపత్రికలు, ఆఖరుకు పుస్తకాలుకూడా లేవు. ఆరోగ్యకరమైన ఆహారంకూడా లభ్యంకాకపోవడం వలన కొందరు రోగాలపాలైనారు. ఆప్తులైనవారు కొందరు సరియైన చికిత్సాసౌకర్యాలను పొందలేక ప్రాణాలనుకూడా పోగొట్టుకున్నారు.

ఇండియాలో అప్పటికి చాలామంది యుద్ధఖైదీలు ముఖ్యంగా ఇటలీదేశస్థులు ఉండేవారు. మనవారి స్థితిగతులను వాళ్ళతో పోల్చిచూచాం. యుద్ధఖైదీలవిషయమై జినీవా సాంప్రదాయాలను వారిపట్ల వర్తింపచేసేవారు. కాని భారతీయఖైదీలకూ, డిటెన్యూలకూ ఆ సౌకర్యాలను వర్తింపజేసే సత్సాంప్రదాయాలుకాని, చట్టాలుగాని, నిబంధనలుకాని లేవు. కాలానుగుణ్యంగా బ్రిటిష్‌పాలకులు తమ దయాదాక్షిణ్యానుసారంగా చేసే నిబంధనలే దిక్కు.

## త్రికాటకం

ఇంతలో ఘోరాతిఘోరం, హృదయవిదారకం అయిన కబురు వొచ్చిపడింది. మలబారులో, బిజాపూరులో, ఒరిస్సాలో, అన్నిటికన్నా కూడా సారవంతమైన వంగదేశంలో క్షామదేవత తాండవించింది. వేలాది స్త్రీలు, పురుషులు, పసిపిల్లలు తిండిలేక మృత్యువువాతపడ్డారు. కలకత్తాలోని మహాభవనములఎదుట మనుష్యులు తిండిలేక మరణించారు. అసంఖ్యాకమైన గ్రామాలలో రోడ్లు, గుడిసెలు, పొలాలు శవమయమైపోయాయి. ప్రపంచమంతటా యుద్ధంలో ఒకళ్ళనొకళ్ళు చంపుకుంటున్నారు. సాధారణంగా ఆ చావు క్షణికం. పైగా వీరోచితమైన చావు. అంతేకాకుండా ఒక సిద్ధాంతంకోసమో, ఒక లక్ష్యసిద్ధికో సంభవించే మరణం. జీవితాలను సరిదిద్దుకోలేకా, అదుపులో పెట్టుకోలేకా ఈ పిచ్చిప్రపంచంలో విధాయకంగా అలాంటి మృత్యువు సంభవమవుతోంది. మృత్యువు సామాన్యంగా అన్నిచోట్లా పరిపాటే అయింది. కాని ఈ కాటకంవల్ల సంభవించిన మరణాలకేమీ తలాతోకా కనబడదు. వాటికేమీ లక్ష్యంకాని, కారణంకాని, అవసరంకాని లేదు. మానవుని అసమర్ధత, కర్కోటకత్వమే వాటికి కారణం. గత్యంతరంలేక నెమ్మదిగా ప్రాకులాడుతూ భయోత్పాతం కలిగించే గుంటకళ్ళతో, కొనఊపిరులతో కృశించిన మానవశరీరాల చరమావస్థ. అహితమైన ఆ సంగతులన్నిటిగురించి మాట్లాడడంకాని, వ్రాయడంకాని ఉచితం కాదంటారు పరిపాలకులు. అలా వ్రాస్తే ఒక దురదృష్టమైన సంఘటనను ఇతివృత్తంచేయడమే అవుతుంది. ఇండియాలోనూ, ఇంగ్లండులోనూ ఉన్న అధికారులు అసత్యపూరితమైన నివేదికలను ప్రచురించారు. కాని ప్రత్యక్షంగా కనబడే శవాలను తేలిగ్గా కాదనడానికి వీలులేదు.

క్షామదేవత విలయతాండవంచేస్తూ వంగప్రజలను పొట్టనుపెట్టుకుంటుంటే, మహోన్నతపదవులందుండే అధికారులు, యుద్ధకాలంలో లభించిన అధికైశ్వర్యంవల్ల, భారతదేశంలోని వ్యవసాయకులకు తినలేనంత ఆహారం లభించిందన్నారు మొదట్లో. తరువాత ఆ క్షామానికి బాధ్యతవహించవలసినది రాష్ట్రప్రభుత్వమేఅనీ, లండన్‌లోని ఇండియా

ఆఫీసువారుకాని, ఇండియాలోని బ్రిటిష్ అధికారులుకాని అందులకు బాధ్యులుకారనీ చెప్పేరు. బ్రిటిష్ రాజప్రతినిధి అనంతమైన తన అధికారాన్ని ప్రయోగించి రాష్ట్రీయస్వాతంత్ర్యాన్ని త్రోసిరాజని, వందల కొద్దీ జబర్దస్తీ శాసనాలను చేశారు. ప్రపంచంలోని నిరంకుశపరిపాలకుల్లోకల్లా అగ్రగణ్యుడైన వైస్రాయిచిత్తవృత్తినను సరించి నడిచే నిరంకుశపరిపాలనమే రాజ్యాంగవిధానమైనది. ఐ. సి. యస్. ఉద్యోగులు, పోలీసుఉద్యోగస్థులు రాజ్యపాలకులైనారు. వైస్రాయి తరఫున బాధ్యత వహించిన గవర్నరుకే వారు బాధ్యులు. మంత్రులంటూ ఉన్నట్లయితే వాళ్ళని లక్ష్యపెట్టవలసిన అగత్యం గవర్నర్లకు లేదు. మంచివాళ్ళయినా కాకపోయినా మంత్రులు, గవర్నర్ల చిత్తవృత్తికి దాసులవడంచేత ఆయన ఆజ్ఞలను జవదాటడానికి సాహసించలేకపోయారు. అథవా పేరుకు వారి తాబేదారులైనా, ఉద్యోగస్థులనిర్ణయాలను మంత్రులు కాదనలేకపోయేవారు.

ఆఖరుకు ఏదో జరిగింది. కొంతసహాయం జరిగింది. కాని పర్యవసానమేమంటే పది, ఇరువై, ముప్పై-కొన్ని లక్షలమంది చనిపోయారు. ఆ భీభత్సపురోజుల్లో ఎంతమంది తిండిలేక మరణించారో, ఎందరు రోగపీడితులై శాశ్వతంగా అనారోగ్యంవాతబడ్డారో ఎవ్వరి కెరుక? ఎందరు జీవచ్ఛవాల్లాఉన్నారో! ఇప్పటికీ క్షామభీతి, రోగభీతి మాత్రం దేశంలో మిగిలిపోయింది

ప్రెసిడెంటు రూజ్వెల్టు చతుస్సూత్ర స్వాతంత్ర్యాన్ని ప్రకటించారు. అందులో ఒకటి దారిద్ర్యనిర్మూలనం. అయినప్పటికీ ధనవంతమైన ఇంగ్లండు, అంతకన్నా ధనవంతమైన అమెరికాకూడా భారత దేశంలో లక్షలాదిజనం క్షామపీడితులై చచ్చిపోతుంటే చీమకుట్టినంత మాత్రమైనా చలించలేదు. ధనంవల్ల ఏమీ ప్రయోజనంలేదనీ, ఆహార పదార్థాలను పంపించడానికి యుద్ధంమూలాన్ని ఓడలు లేవని చెప్పేరు. వంగదేశక్షామాన్ని గురించి ప్రభుత్వాలు ఎంతో తేలికగా ప్రచారం చేసినా, ఎన్ని అభ్యంతరాలు కల్పించినా, అమెరికా ఇంగ్లండు దేశాలలోని ఉదారులైన సహృదయులూ ఇంకా ఇతరులూ మనప్రజల కనేక విధాల తోడ్పడ్డారు. అన్నిటికన్నా చైనా ఐర్లండు ప్రభుత్వాలు, తాము స్వతహాగా ధనవంతమైన ప్రభుత్వాలు కాకపోయినప్పటికీ, వాళ్ళ కెన్ని

కష్టాలున్నప్పటికీ, స్వయంగా క్షామబాధ నెరుగున్నవారవడంచేత హిందూదేశంబాధను గుర్తెరిగి ఉదారంగా సహాయంచేశాయి. హిందూదేశప్రజలకు జ్ఞాపకశక్తి మెండు. ఏసంగతి మరచినా ఉదారంగాచేసిన ఇలాంటి సహాయాన్ని హిందూదేశ మెన్నటికీ మరువజాలదు.

## 3 ప్రజాస్వామ్యంకోసం యుద్ధం

ఆసియాలోనూ, ఐరోపా ఆఫ్రికా ఖండాల్లోనూ, పసిఫిక్, అట్లాంటిక్, ఇండియా మహాసముద్రాల్లోనూ భయంకరమైన యుద్ధం చెలరేగింది. చైనాలో ఏడు సంవత్సరాలనుంచీ, యూరోపు ఆఫ్రికాల్లో 4½ సంవత్సరాలనుంచీ 28 మాసాలు ప్రపంచమంతటా ఫాసిజం నాజీజంలమీద యుద్ధంసాగింది. ప్రపంచంలో ఆధిక్యతకోసం సంఘర్షణసాగింది. ఇన్నేళ్ళల్లోనూ, దాదాపు మూడు సంవత్సరాలపాటు ఈ జైల్లోనో మరోజైల్లోనో కాలక్షేపంచేశాను.

ఫాసిజం అన్నా, నాజీజం అన్నా నేనేకాకుండా భారతదేశంలో చాలామంది చిరాకుపడుతుంటారు. చైనాదేశంమీద జపాన్దురాక్రమణ భారతదేశానికి చాలా కష్టం కలిగించి, శతాబ్దాలనాటి మైత్రిని తిరిగి రేకెత్తించింది. అబిసీనియామీద ఇటలీ చేసిన దురాగతమైన దండయాత్ర ఇండియాకు చాలా మనస్తాపం కలిగించింది. జకోస్లోవేకియాకు జరిగిన పరాభవానికి మనం చాలా బాధపడ్డాం. స్పెయిన్ ప్రజాస్వామికప్రభుత్వం ఫాసిజంతో బహు ఓపికతో పోరాడి, అసాధారణమైన వీరత్వాన్ని ప్రదర్శించి పడిపోవడం నాకూ, ఇంకా చాలమందికి వ్యక్తిగతంగాకూడా చాలా విచారాన్ని కలిగించింది.

ఫాసిజమూ నాజీజమూ ప్రత్యక్షంగా జరిపిన దురాక్రమణలు మాత్రమే మనకు బాధాకరంకాలేదు. వాళ్ళు గావించిన దురాగతాలు హింసాకాండమాత్రమే కాదు, వాళ్ళు శుద్ధనగ్నంగా ప్రతిపాదిస్తూవచ్చిన వారిసిద్ధాంతాలు మరీ బాధను కలిగించాయి. ఏమంటే చిరకాలంగా శతాబ్దాలనాటినుంచి మనం విశ్వసిస్తున్న జీవితసిద్ధాంతాలకు అవి విరుద్ధం. మనజాతికి సంబంధించిన విషయా లనేకం మన స్మృతిపథం నుంచి తప్పిపోయినా, ప్రత్యక్షంగానూ గుంభనగానూ మన కిటీవల కలిగిన అనుభవంవల్లనే నాజీసిద్ధాంతాల్ను ఘనల నెక్కడికీడ్చుకెడ

తామో తెలుసుకోగలిగేం. ఎందుచేతనంటే చాలాకాలంనుంచి ఆ సిద్ధాంతాలను, విధానాలను అవలంబించిన ప్రభుత్వంవలన బాధలు పడ్డాం. అందుచేతనే నాజీజం, ఫాసిజం లంటే మన దేశం శీఘ్రంగానే చాలా చికాకుపడింది.

1936 సంII మార్చి నెలలో ముస్సోలినీఆహ్వానాన్ని నేను ఎట్లా నిరాకరించానో నాకు బాగా జ్ఞాపకం ఉంది. అప్పట్లో చాలామంది బ్రిటిష్ రాజనీతిజ్ఞులు ముస్సోలినీని, ఆయన పరిపాలనాపద్ధతులను ప్రశంసిస్తూ ఉండేవారు. వారే తరువాత, ఇటలీ శత్రువర్గంలో చేరినప్పుడు ఫాసిస్టునాయకుడైన డ్యూస్‌నుగురించి చాలా కఠినంగా మాట్లాడేరు.

మరి రెండు సంవత్సరాలైనపిమ్మట నాజీప్రభుత్వం నన్ను జర్మనీ కాహ్వానించింది. నేను నాజీతత్త్వానికి వ్యతిరేకమని తమకు తెలియుననీ, అయినప్పటికీ జర్మనీ స్థితిగతులను స్వయంగా చూడవచ్చుననీ కూడా ఆ ఆహ్వానంలోనే వ్రాశారు. వారి కతిథిగాగాని, లేక స్వంతంగాగాని రావచ్చుననీ, నా పేరుతోటిగాని, ప్రచ్ఛన్నంగా గాని రావచ్చుననీ, ఎక్కడికైనాసరే స్వేచ్ఛగా వెళ్ళడానికి సావకాశముందనీ కూడ వ్రాశారు. కాని, నేను మర్యాదగా క్షమించమన్నాను. అలాంటి ఆహ్వానాన్ని కాదని, అప్పట్లో ఇంగ్లండు ప్రధానమంత్రికికూడా పరిచయం తక్కువవడంచేత దూరస్థంగానున్న జెకొస్లొవేకియా కెళ్ళేను.

మ్యూనిక్‌కు ముందు నేను బ్రిటిష్‌మంత్రివర్గంలోని ప్రముఖులను కొందరినీ, రాజకీయవేత్తలు కొందరినీ కలుసుకుని వారితో ఫాసిస్టు, నాజీ విధానాలకు నా ప్రతికూలతను తెలియచేయడానికి సందేహించలేదు. వారు నా అభిప్రాయాలను హర్షించలేదు. చాలా విషయాలను దృష్టిలో పెట్టుకుని ఆలోచించవలసిఉంటుందని చెప్పేరు.

జెకొస్లొవేకియా ఇరుకునపడినపుడు, ప్రేగ్‌లోనూ, సూడెటన్ లాండులోను, లండన్‌లోనూ, ప్యారిస్‌లోనూ, అప్పట్లో జినీవాలో సమావేశమవుతున్న లీగ్ అసెంబ్లీలోనూ ఫ్రెంచి బ్రిటిష్ రాజనీతిజ్ఞుల చాతుర్యము నాకు విస్మయాన్ని, విసుగును కలిగించింది. హిట్లరంటే ఒకవిధమైన భయంతోపాటు మరొకవిధమైన భక్తి కూడా వారి ఆంతర్యంలో ద్యోతకమయింది. సాంత్వనపరచడం అన్నా కూడాచాలదు విధివిచిత్ర మేమంటే, ఫాసిజంమీద, నాజీజంమీద యుద్ధంజరుగుతుంటే,

నేనూ, నాలాంటివాళ్ళూ జైల్లోఉండడం, హిట్లర్ముసోలినీలకు సలాములుపెట్టేవాళ్ళూ, చైనామీద జపాన్దురాక్రమణను హర్షించేవాళ్ళూ ప్రజాస్వామికపతాకాన్ని, స్వాతంత్ర్యపతాకాన్ని ఎగురవేస్తూ ఉండడం.

హిందూదేశంలోకూడా ఈ మార్పు చాలా విచిత్రమే. ఇతర చోట్లవలెనే ఇక్కడకూడా ప్రభుత్వభక్తిపరాయణు లున్నారు. ప్రభుత్వాల నాశ్రయించుకొని వారికనుసన్నల్లో మెలగుతూ వారి అభిప్రాయాలనే ప్రకటిస్తూ, ఇచ్చకాలాడుకుంటూ, వారి తోకపట్టుకుని వ్రేలాడుతూఉంటారు. కొద్దికాలంక్రితందాకా వారంతా హిట్లరు ముసోలినీలను ఆదర్శపురుషులని యథావిధిగా ప్రశంసిస్తూ సోవియట్ యూనియనును ఆడిపోస్తూ ఉండేవాళ్లు. వాతావరణంతోపాటు వారూ మారిపోయారు. వారంతా పెద్దపెద్ద ప్రభుత్వోద్యోగులు. ఫాసిస్టు నాజీ ప్రాతికూల్యతను వారు ఘంటాపథంగా ప్రకటిస్తూ, ప్రజాస్వామికాన్ని గురించి ప్రశంసలుకూడా చేస్తూఉంటారు. చరిత్ర తలక్రిందైవ్యవహారాలు వికటిస్తే వీళ్ళేమిచేసేవాళ్లాఅని ఆశ్చర్యం కలుగుతూ ఉంటుంది. కాని అందులో ఏముంది? ఎవరు అధికారంలోకొస్తే వారికే పూలదండలువేసి స్వాగతపత్రాలను సమర్పిస్తారు.

యుద్ధంరావడానికి చాలాకాలం ముందునుంచీ నా మనస్సులో యుద్ధంగురించే ఆలోచన ఉండేది. దానిని గురించి తరుచు ఆలోచిస్తూ ఉండేవాడిని. ఆవిషయమై మాట్లాడేవాడిని. వ్రాసేవాడిని. అలాంటి యుద్ధంలో మహత్తరమైన సిద్ధాంతాలు పరిష్కారమవుతాయనీ, ఆ సంఘర్షణ పర్యవసానంగా భారతదేశంలోనూ ప్రపంచంలోనూ కూడా మహత్తరమైన విప్లవాత్మకమైన మార్పులు వస్తాయనీ, కనుక అలాంటి సంఘర్షణలో ఇండియాదేశం పాల్గొనాలనీ నా అభిప్రాయం. అప్పట్లో భారతదేశానికొచ్చిన భయమేమీ లేదు. ఏవిధమైన దండయాత్ర సాగే సావకాశం లేదు. అయినా భారతదేశం పూర్తిగా పాల్గొనాలనే నా కోరిక. కాని స్వతంత్రదేశంగా సమానస్థాయిలో మాత్రమే అలా పాల్గొనడం సాధ్యమని నా విశ్వాసం.

ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ అభిప్రాయం కూడా అంతే. కాంగ్రెస్ ఒక్కటే ఇంతకాలంనుంచీ ఫాసిస్టు, నాజీతత్వాలకీ,సామ్రాజ్య

తత్త్వానికీ ప్రతికూలంగా ఉన్నది. స్పెయిన్, జెకొస్లొవేకియా ప్రజా స్వామికానికీ, చైనాకూ దోహదమిచ్చినది కాంగ్రెస్.

ప్రస్తుతం రెండుసంవత్సరాలనుంచి కాంగ్రెస్ చట్టవిరుద్ధసంఘంగా ప్రకటింపబడింది. ఏవిధంగానూ పనిచేయడానికి వీలులేకుండాపోయింది. కాంగ్రెసే కారాగారంలో ఉన్నది. రాష్ట్రశాసనసభల్లోని కాంగ్రెస్ పక్ష ప్రతినిధులు, శాసనసభల స్పీకర్లు, మాజీమంత్రులు, పురపాలక సంఘాల అధ్యక్షులు అంతా జైళ్ళల్లోనే ఉన్నారు. కాని ప్రజాస్వామికం కొరకు, అట్లాంటిక్ ఛార్టరుకోసం చతుస్స్వాతంత్ర్యం పేరిట యుద్ధం సాగుతూనే ఉంది.

## ४ ఖై దు లో

ఖైదులో కాలంస్వభావం కూడా మారిపోతుందనుకుంటాను, వర్తమానం లేనట్లే తోస్తుంది. గతంనుంచి వేరుచేసే భావాలేమీ కన బడవు. జైలుబైట జరిగే చైతన్యవంతమైన పనిపాటలకు సంబంధించిన వార్తలు ఏవో కలలు మాత్రంగా ఉంటాయి. ఆగస్టే కామ్టే చెప్పి నట్లు భూతకాలస్మృతులచే ఆవరించుకొనిపోయి శవప్రాయంగా జీవి తాలు నడుస్తూఉంటాయి. ముఖ్యంగా ఖైదులో ఉన్నవాళ్ళు పాత కాలంనాటి స్మృతులు మననంచేసుకుంటూ భవిష్యత్తును గూర్చిన మధురస్వప్నాలుకంటూ కాలక్షేపంచేస్తూ ఉంటారు.

గతంలో ఒకవిధమైన నిశ్చలగాంభీర్యత శాశ్వతత్వమూ ఉం టాయి. చిత్రపటంలాగున, శిలావిగ్రహం కంచువిగ్రహాల్లాగున మార్పు లుండవు. ఎన్ని తుపానులొచ్చినా ఎన్ని తారుమారులైనా దానిదర్జా హుందా దానికుంటూనే ఉంటుంది. ఏవైనా చికాకులవల్ల మనస్తాపం కలిగినవారికి ప్రశాంతి నిస్తూఉంటుంది. గతంలో ఒకవిధమైన శాంతి, భద్రతలున్నాయి. కొందరికి ఆధ్యాత్మసంబంధమైన అనుభూతికూడా కలుగుతుంది. కాని గతానికీ, వివాదములతోను, సంఘర్షణలతోనూ నిండిఉన్న వర్తమానానికి గట్టి లంకె కలుపకపోతే జీవితమే లేదు. ఏవిధ మైన ఆవేశం లేకుండా కేవలం ఒక కళగా దానిని ఉపాసించాలి.

మనం గతానికి బందీలైపోతాము. దానిబాపతు అచంచలత్వం మనకు అంటుకుంటుంది.

జైలులో మానసిక కాలక్షేపం తేలిక. మన మేమీ పనిచేయనక్కరలేకుండానే జైలులోని నిత్యతంతుకు దాసులమైపోతాం. అయినా గతం మనలను విడిచిపెట్టదు. మనమూ, మనకున్నది అంతా గతంలో నుంచి వచ్చిందే. దానిలో పుట్టి దానిలో మునిగిఉన్నాం. గతాన్ని తెలుసుకోకుండా ఉంటే వర్తమానంకూడా అవగాహనకాదు. గతాన్ని వర్తమానంతో కలిపి భవిష్యత్తుకు ముడిపెట్టడము, అలా కలపలేనిచోట తెంపుచేసుకోవడం, ఆలోచిస్తూఉండడం, పనిచేయడం—ఇవన్నీ జీవితానికి చైతన్యం కలిగిస్తాయి.

ఏదైనా ఒక గొప్పపని జరిగిందంటే అది ఆ జీవుడి హృదయాంతరాళంలోనుంచి పైకొస్తుంది. అలాంటివ్యక్తియొక్క గతచరిత్ర, అతని జాతిచరిత్ర, సాంప్రదాయం కొంతవరకు కారణభూతమవుతూఉంటాయి. జాతికి సంబంధించిన స్మృతులు, తాతముత్తాతల సాంప్రదాయాలు, పరిసరప్రాంతాల ప్రభావం, చిన్ననాటినుండీ కలిగే శిక్షణానుభవం, ఇవన్నీ అద్భుతంగా సమ్మిళితమైపోయి, కార్యాచరణకు పురిగొల్పుతాయి. ఆ కార్యాచరణయే భవిష్యత్తును నిర్ణయంచేస్తుంది. 'వర్తమానం పరిశుద్ధమైన కన్యవంటి ఘడియ' అన్నాడు శ్రీ అరవిందఘోషు. భూతకాలాన్నీ, భవిష్యత్తునూ విభజించే నస్తి నాస్తిగాఉండే[ఉన్నదా లేదా అనిపించే] సున్నితమైన సరిహద్దు. 'పరిశుద్ధమైన కన్య' అనేమాట చక్కగా ఉంది. అనగా భవిష్యత్తు అనే మేలిముసుగును తొలగించుకుని, పరిశుద్ధమైన హృదయంతో మనలను స్పర్శించి తక్షణమే నిర్జీవమైన గతంలో కలసిపోతుంది. దానిని కలుషితం చేసేది మనమేనా? లేక వర్తమానమే అంత పరిశుద్ధం కాదేమో! ఎన్నిచెప్పినా గతంయొక్క చారిత్రక తళుకుబెళుకులతో అది కలసిమెలసి ఉండకేమవుతుంది?

వేదాంతధోరణిలో ఆలోచిస్తే మానవస్వాతంత్ర్యం అంటూ ఉన్నదా అనే సంశయం కలుగుతోంది. గతంలో జరిగిన అనేక సంఘటనలే చాలవరకు అప్రయత్నంగానే మానవుడిమీద విజయం ప్రాప్తి

దుతూ ఉంటాయి. అతనికి ఐచ్ఛికంగా స్ఫురించే అనుభూతికూడా పైకి స్వతంత్రమైన ఉపజ్ఞగా తోచినా, దానికికూడా గతంతో బంధనాలు ఉండవచ్చు. 'మానవుడు తనకు తోచినపనేమో చేస్తాడు. కాని అతనికి కావలసినవిధంగా పని తోచదు'.అన్నాడు షోఫెన్‌హార్. అయితే కేవలం ప్రారబ్ధతత్వంమీద ఆధారపడితే అకర్మణత్వమే ఫలిత మవుతుంది. అనగా జీవికి మృత్యువన్నమాటే. కనుక ఆ ప్రారబ్ధతత్వం నాకు ఎంతమాత్రమూ గిట్టదు. బహుశా ఆ గిట్టకపోవడంకూడా కొంత వరకు గతంయొక్క ఫలితమే కావచ్చు.

మామూలుగా, పర్యవసానమంటూ లేని ఇలాంటి వేదాంత రహస్యసమస్యలను నే నంతగా మనస్సుకు పట్టించుకోను. కాని జైల్లో ఏకాంతంగా ఉన్నప్పుడు అప్రయత్నంగానే ఆలాంటి ఆలోచనలు కలుగుతుంటాయి. ఒకొ్కక్కప్పుడు, మంచి పనిరద్దీలో ఉన్నప్పుడు, బాధాకరమైనసంఘటన కలిగినప్పుడు మనస్సుకు నిశ్చింతత్వాన్ని కలిగించి ఒకవిధమైన ఉపశమనదాయకంగా కూడా అలాంటి ఆలోచనలు కలుగుతుంటాయి. సాధారణంగా ఏదో పనీ, దానిని చేయాలనే ఆలోచనే నన్నావహించిఉంటుంది. పని చేయడానికి సావకాశం లేకపోతే, దానికి తయారవుతున్నట్లే భావించుకుంటాను.

నాకు ఏదోపని చేయాలనే అభిలాష చాలాకాలంనుంచి ఉంది. అంటే అనాలోచితంగా ఏదోచెయ్యాలని చేసేపని కాదు. ఆలోచన ఫలితంగా ప్రవాహతుల్యంగా ఉత్పన్నమయ్యేపనే. ఆలోచనఫలితంగా కార్యాచరణ జరిగి, పని పూర్తిఅవడం, తత్ఫలితంగా తిరిగి విస్తృతంగా ఆలోచించుకోవడం. ఆలోచనకూ పనికీ సమన్వయం కుదురుతూ ఉన్నప్పుడే నాకు జీవితంయొక్క పరిపూర్ణతనుగురించిన అనుభూతి కలుగుతూఉంటుంది. కాని ఆలాంటిఘడియలు చాలా అపురూపంగా సంభవిస్తుంటాయి. సాధారణంగా ఆ రెంటికీ సమన్వయం కుదురదు. వాటిని సమన్వయపరచడంలో ఆశాభంగంకలుగుతూ ఉంటుంది. చాలాకాలంక్రితం, నేను ఏపనిలోనిమగ్నుడనై ఉండేవాడినో, ఆ పని లోని ఆవేశమే నన్నెక్కువగా ఆవహించిఉండేది. చిన్ననాటి ఆ రోజులు ఇప్పుడు చాలాదూరమైపోయాయి. కేవలం ఏళ్ళు గడవడంవల్లనే కాదు. తదుపరి సంపాదించిన విశేషమైన అనుభవంవల్లా, బాధాకరమైన స్మృతు

లవల్లాకూడా పాతకాలంనాటి ఉల్లాసం చాలా తగ్గింది. స్వాధీనంలో ఉండని ఉద్వేగంకూడా తమాయించింది. రాగద్వేషాలు కొంచెం వశంలోకొచ్చాయి. ఆలోచించడమనే భారమే ఒక అంతరాయంలా ఉంది; ఒకప్పుడు ఒకే నిశ్చయంతో ఉండిన మనస్సులో నేడు సంకోచం దాపురించింది. బహుశా అది వయస్సు ప్రభావం కావచ్చును. కాక నేటికాలలక్షణమే కావచ్చును.

అయినప్పటికీ ఇప్పటికికూడా ఏదైనా పనొచ్చేసరికి ముందుకు దూకాలనే ఒక ఆవేశం కలుగుతుంది. తరుచు ఆలోచనతోపాటు సంఘర్షణకూడా కలుగుతూ ఉంటుంది. ప్రమాదభూయిష్టమైన రంగాల్లో దూకి, మృత్యువుతో చెలగాటాలాడాలనే ఒక ఆనందదాయకమైన అనుభూతి కలుగుతూఉంటుంది. మృత్యువంటే నాకేమీ ఆప్యాయత లేదు కాని, అదంటే భయంకూడా లేదు. జీవితమంటే వైరాగ్యంకాని విముఖత్వంకాని నాకు లేదు. సుఖమైన జీవితాన్ని నేను ప్రేమిస్తాను. ఇప్పటికీ ఆ జీవితం నన్ను ఆకర్షిస్తుంది. నాకు ఇష్టమైనవిధంగా అనుభవించాలని కుతూహలపడుతుంటాను. కాని ఎన్నో అదృశ్యమైన అంతరాయాలు నన్ను ఆవరించినాయి. అయితే ఆ కుతూహలమే నన్ను జీవితంతో చెలగాటాలాడిస్తోంది. దానికి కేవలం దాసుణ్ణి కాకుండా అంచులదగ్గరనుంచే తొంగిచూస్తున్నాను. బహుశా నేను వైమానికుడినైతే బాగుండేది. జీవితం మందకొడిగానూ,నిదానంగానూ ఉండి, విసుగు కలిగినట్లయితే, ఒక్కసారి మేఘాల్లోకి చొచ్చుకుపోయి ఇలా పాడుకునేవాడినేమో!

ఈ జీవితంతో, ఈ మరణంతో
అన్నివిషయాలూ సరిపోల్చుకుని, సరితూచుకుని పరిశీలించాను!
అన్నింటినీ స్మృతిపథంలోకి తెచ్చుకుని ఆలోచించాను!
గడచినకాలమంతా వ్యర్థంగా కనుపించింది!
భవిష్యత్తులో బ్రతకడం నిరర్థకమనిపించింది!!

## 2 గతము, వర్తమానము

ఏదో ఒకపని చేయాలనీ, పనిచేస్తూనే జీవితానుభవాన్ని పొందాలనీ ఒక కాంక్ష ఎప్పుడూ నన్ను వేధిస్తూ పనికి పురిగొల్పింది.

ఆలోచించడమనేదికూడా ఒకపనే అయినా, ఒకవిషయాన్నిగురించి నిలకడగా ఆలోచించడంకూడా చేయదలచుకున్న పనిలో భాగమే. జీవితానికి, కర్మకు సంబంధించనివిషయం కాదు. గతం వర్తమానానికి దారితీస్తుంది. వర్తమానంలో చేసేపని ఏదో ఒక భవిష్యత్తుకు కారణభూతమవుతుంది. భూత వర్తమాన భవిష్యత్తులు మూడున్నూ అన్యోన్యసంబంధం కలిగినవే. విడదీయడానికి వీలులేకుండా ఒకదానికొకటి పెనవేసుకుంటాయి.

పైకి ఏమీ పనిపాటలు లేనట్లుగా కనుబడే నా జైలుజీవితం కూడా భవిష్యత్తులో జరుపదలచినపనులనుగురించి ఆలోచిస్తూఉండడం చేత, జీవితాన్ని దుర్భరంచేసే వెలితిలేకుండా కాలక్షేపం జరిగేది. ప్రత్యక్షంగా కార్యక్షేత్రంలో దూకడానికి నాకు సావకాశం కలుగనప్పుడు, గతచరిత్రను ఆ దృష్టితోనే సమన్వయించుకున్నాను. నేను స్వయంగానే చారిత్రాత్మకమైన కొన్నిఘట్టాల్లో పాల్గొనడంవల్లను, వాటిని ఆవిధంగా రూపొందించడంలో నా తాహతుకొద్దీ పనిచేసిఉండడం చేతనూ; కొంతవరకు చరిత్రతో నేను మమేకంకావడం తేలికైనపనిగానే ఉండేది.

నాకు చరిత్రతో పరిచయం చాలా ఆలస్యంగానే అయింది. అదైనా మామూలుగా ఏవో కొన్నిగాథలను, కొన్ని ముహూర్తాలను కంఠస్థంచేసి, వాటిమీద నాజీవితానికి సంబంధంలేని కొన్నిఊహలను, నిర్ణయాలను చేయడంకాదు. అలా చేస్తే చరిత్ర నాకేమీ ప్రయోజనకారి కాదు. ముందు జీవితానికి సంబంధించిన విషయాల్లోగాని, మానవాతీతమైన విషయాల్లో కాని నాకసలే ప్రవేశం లేదు. ప్రత్యక్షమైన శాస్త్రజ్ఞానం, ఈకాలపు సమస్యలు, మన జీవితానికి సంబంధించినసమస్యలే నన్నాకర్షించాయి.

కొంత ఆలోచనా, ఉత్సాహమూ, కార్యస్ఫురణా అన్నీకలసిన ఒక మిశ్రమ అనుభూతి లీలగా నాకు గుర్తుంది. అదే నన్ను కార్యాచరణకు పురికొల్పింది. కార్యాచరణ మళ్ళీ నన్ను ఆలోచనలో పెట్టె వర్తమానాన్ని అవగాహనచేసుకోవాలనే కాంక్షను కలిగించేది. వర్తమానంయొక్క వేళ్ళు గతంలో ఉన్నాయి. కనుకనే గతాన్ని శోధించడానికి పూనుకున్నాను. వర్తమానాన్ని అర్థంచేసుకోవడానికేమైనా

కీటుకులు ఉంటే, దొరుకుతాయేమోననే ఆశ. గత చారిత్రకఘట్టాలను గురించి మహాపురుషులగురించి ఆలోచించడంలో నేను తన్మయుడ నైనప్పటికీ, వర్తమానంయొక్క ఆధిక్యతను నే నెప్పుడూ విస్మరించలేదు. అప్పుడప్పుడు నేనూ గతానికి చెందినవాడినే అని అనుకున్నప్పటికీ, ఆ గతమంతా ఇప్పుడు నాదే అనే భావంకూడా కలుగుతూఉంటుంది. గతచరిత్ర నేటిచరిత్రలో లీనమైపోయి, సుఖదుఃఖములతో కూడిన శుద్ధ సత్యమైనది.

గతం వర్తమాన మవుతున్నట్లే, వర్తమానంకూడా గతంలోకి పోతూఉంటుంది. ఒక్కొక్కప్పుడు నేడు జరుగుతున్న సంఘటనల మధ్యనే, అమాంతంగా గతాన్ని సింహావలోకనంచేస్తున్నామా అని పిస్తుంది. వర్తమానానికి గతానికి గల సంబంధాలను కనుక్కునే ప్రయత్నంలోనే 'పన్నెండేళ్ళ క్రిందట ప్రపంచచరిత్రలోని ఘట్టాలు' అనే గ్రంథాన్ని నా కుమార్తెకు ఉత్తరాల పూర్వకంగా వ్రాశాను. చిన్నపిల్లకు వ్రాసిన లేఖలవడంచేత చాల తేలికగానూ ఆషామాషీ గానూ వ్రాశాను. కాని ఆ వ్రాతలలో నూతన విషయాలను తెలుసు కోవాలనే ఆత్రత, సంచారకాంక్ష స్పష్టమవుతుంది. సాహసోపేతమైన జీవితాన్ని గడపాలనే అభిలాషతో, అనేకరకాల జీవితాన్ని గడిపేను. నాకన్న పెద్దలైనవారితో సహచర్యంచేశాను. జైలులో కావలసినంత తీరుబడి ఉండేది. ఫలానా వేళకు ఇంతపని చేసితీరాలనే తొందరేమీ లేదు. కనుక నా మనస్సును, అప్పటి చిత్తవృత్తిననుసరించి స్వేచ్ఛగా ఆలోచనకు వదలిపెట్టేను. గతమనే ఎండిపోయిన ఎముకలకు మాంసం రక్తం పట్టేటంతవరకూ ఆలోచిస్తూఉండేవాడిని.

తరువాతకూడా అలాంటి ఇటీవలిఘట్టాలు, మనుష్యుల విష యంలోకూడా ఇలాంటి అన్వేషణాదృష్టే, నాచేత స్వీయచరిత్రను వ్రాయించింది.

ఈ పన్నెండేళ్ళలోనూ నేను చాలా మారిపోయాననుకుంటాను. నాలో ఆలోచనాపరత్వం ఎక్కువైంది. బహుశా శాన్తంత నిదానము, వివేచనాశక్తి, నిర్లిప్తత ఎక్కువైనాయనుకుంటాను. పూర్వంలాగున విపత్సమయాలలో ఒళ్లుమరచిపోవడంలేదు. కష్టాలు మునుపటికన్న ముమ్మరంగా వస్తున్నా, అందువల్ల కలిగే సంక్షోభంయొక్క ఉధృతం

మునుపటికన్న తగ్గింది. స్వల్పకాలంమాత్రమే ఉంటోంది కూడా. నా తత్త్వం మొరటుతేరుతోందా లేక నిష్కామ్యంగా తామరాకుమీద నీటిబొట్టులా సంచరించడంవల్లనా అని నాకే ఆశ్చర్యం కలుగుతుంది. కాకపోతే కేవలం వయస్సువల్లనా, శరీరంలో పాటవం తగ్గడంవల్లనా, జీవితంమీద మమకారం క్షీణించడంవల్లనా? జైళ్ళలో ఏండ్లతరబడి పడుండడంచేత చికుకెరటాల్లా మనస్సులో ఏవో క్షణికమైన ఆలోచనలు కలుగుతూ పోతూ కాలం ఎగిరిపోతూఉండడంచేతనా? సంక్షుభితమైన మనస్సు ఏదో ఉపశాంతిని కోరుతుంది. అనేక అఘాతాలవల్ల ఇంద్రియాలు మొద్దుతేరిపోతాయి. ప్రపంచమంతా కష్టములతోనూ, దుష్టత్వంతోనూ నిండిపోయిందనిపిస్తుంది. కనుక కాస్తంత ఎక్కువ తక్కువలలో విశేషమేముందనిపిస్తుంది. మనదగ్గరనుంచి ఎవ్వరూ తీసుకుపోజాలని దొక్కటే: ధైర్యంతోనూ హుందాతోనూ పని చెయ్యడం. మన జీవితానికొక లక్ష్యాన్ని కల్పించిన ఆదర్శాలను వదలకపోవడం. కాని అది రాజకీయవేత్త మార్గం కాదు. ఈమధ్య నెవ్వరో ఒకాయన మృత్యువు, జన్మించిన ప్రతివారికీ జన్మహక్కన్నాడు. ఒక శుద్ధసత్యాన్ని చక్కగా చెప్పేడు. నిజంగా ఆ జన్మహక్కును ఎవ్వరూ కాదనలేరు. ఇంతవరకెవ్వరూ అలా అనలేదు. కాని సాధ్యమైనంతవరకు దానిని మరచిపోవడానికి, వీలైతే తప్పించుకోవడానికి అంతా ప్రయత్నిస్తూనే ఉంటాం. ఏమైనా ఆయన చెప్పినమాట బహుపొందికగా ఉంది. జీవితంమీద విసుగెత్తినవారందరికీ కావాలంటే విమోచనామార్గం ఉంది. ఆ మార్గం మన స్వాధీనంలోనే ఉంది. జీవితంమీద ఆధిపత్యాన్ని పొందలేకపోతే మృత్యువునైనా సాధించవచ్చు. నిస్పృహ తగ్గించుకోడానికిదొక కమ్మని ఆలోచన.

## ౬. జీవితతత్త్వము

ఆరేడుఏండ్ల క్రిందట ఒక అమెరికాదేశపు గ్రంథప్రచురణకర్త ఒక అభిప్రాయవేదికను ప్రకటింపదలచి, నా జీవితతత్వాన్ని గురించి ఏదైనా వ్యాసం వ్రాయమన్నారు. అభిప్రాయమైతే ఆకర్షణీయంగానే తోచింది కాని, కొంచెం సంకోచించాను. ఆలోచించినకొద్దీ విముఖత్వం కలిగింది. చివరకు వ్యాసాన్ని వ్రాయలేదు. ఇంతకూ నా జీవితతత్వ

మేమిటి? నాకే తెలియదు. కొన్నిసంవత్సరాలక్రితమైతే నా కాలాటి సంకోచమే కలిగేదికాదు. అప్పట్లో నా లక్ష్యమునకు, ఆలోచనకు ఇదమిత్థమనే నిర్దిష్టత ఉండేది. అవి క్రమంగా మాసిపోయినాయి. ఇటీవలి కొద్ది సంవత్సరాల్లో ఇండియాలో, చైనాలో, యూరపులో, ప్రపంచమంతటా గంద్రగోళంరేగి, ప్రపంచం తారుమారై, విషాదాన్ని కలిగించే స్థితిగతులు ఏర్పడ్డాయి. భవిష్యత్తు ఇదివరకు నా మనస్సుకు కనబడేటంత స్పష్టంగా కనుబడడంలేదు. అగమ్యంగా ఛాయామాత్రంగా కనుబడుతోంది.

మూలసూత్రాలకు సంబంధించిన సంశయాలు మాత్రం నేను చేయదలచుకున్న కార్యాని కే విధంగానూ అడ్డొచ్చేవి కావు. కాకపోతే ఆ పని చేయడంలో వెనుకటి వాడి తగ్గింది. నా చిన్నతనంలో మోస్తరుగా నేను తలుచుకున్న పనిని సాధించడానికి, ఎన్ని అడ్డంకులొచ్చినా త్రోసిపుచ్చి, హుటాహుటిగా ఒక లక్ష్యానికేసి ఎగిరే భాణం లాగున ఎగురలేకున్నాను. ఏదో కర్మచేయాలనే దృఢసంకల్పం ఉన్నది కనుక నేను పనిచేస్తూనేవచ్చాను.

ఆ చేసేపని నా ఆదర్శాలకు అనుగుణ్యంగాకూడా ఉండడమో, ఉందని నే ననుకోవడమోకూడా ఒక కారణం. కాని చూచినకొద్దీ రాజకీయాల యెడల విముఖత్వం రోజురోజూ పెరుగుతూవచ్చింది. క్రమంగా జీవితంయెడల నాకుండే ధృక్పథమే మారిపోతున్నట్లు తోచింది.

నిన్న మొన్నటి ఆదర్శాలు, లక్ష్యాలు నేటికి కూడా ఆలాగే ఉన్నాయి కాని, వెనుకటి తేజస్సు పోయింది. వాటిదగ్గరకెళ్ళినా, ధగధగమెరిసే అందం పోయి హృదయానికి, శరీరానికి పుష్టినివ్వడం మానేసింది. తరచు దుర్మార్గం జయించవచ్చును. కాని అంతకన్నా అధ్వాన్నమేమంటే విస్పష్టంగా కనబడే ధర్మం వికృతరూపం దాల్చడం. కొన్ని తరాలపాటు సాధనచేసి, అనేక కష్టనష్టాల కోరిస్తేకాని నేటి మానవుడు మోహము, హింస, మోసము ఇత్యాది అవలక్షణాల కతీతుడై జీవించలేనంత నికృష్టస్థితిలో కొచ్చాడా అనిపిస్తుంది. ఈలోగా ఈ నికృష్ట మానవస్వభావాన్ని మార్చడానికి జరిగే ప్రయత్నాలన్నీ విఫలం కావలసిందేనా ?

లక్ష్యాలు, వాటిని సాధించే మార్గాలు అంత అవిభాజ్యమైనవా? ఒకదానికొకటి పరస్పరంగా ఉండవలసినవేనా? ఒక్కొక్కప్పుడు లక్ష్య సాధనకు ఉపయోగింపబడిన మార్గాలు లక్ష్యాన్నే హతమార్చవలసిన దేనా ? కాని స్వార్థపరత్వముతో కూడిన మానవతత్వానికి మంచి మార్గాలు అతీతం కావచ్చును. అలాంటప్పు డేంచేయాలి? అకర్మ అనగా ఏపనీ చేయకపోవడం, ఓటమి నంగీకరించడం, దుర్మార్గానికి తలొగ్గడమే.

జీవితసమస్యలను పరిశీలించడంలో ఆదిలో నా దెప్పుడూ శాస్త్రీయదృక్పథమే. 19, 20 శతాబ్దాల శాస్త్రజ్ఞానంలో నా కంతటి విశ్వాసము. పేచీపూచీలు లేని సుఖజీవనం వల్లనూ, దారుఢ్యం, శక్తి, ఆత్మవిశ్వాసం ఉండడంచేతనూ శాస్త్రజ్ఞానమందు నా కలాంటి నమ్మకం. ఏదో లీలగామాత్రం 'మానవత్వం' నాకు నచ్చింది. నేడు సర్వే సర్వత్రా బుద్ధికౌశల్యంగలవారంతా అంగీకరించి అమలుపరుస్తున్న మతం—హిందూమతం కానివ్వండి, క్రైస్తవమతం, ఇస్లాము, బౌద్ధమతం కానివ్వండి — న న్నెప్పుడూ ఆకర్షించలేదు. ఏవో కొన్ని ఆచార వ్యవహారాలు, మూఢనమ్మకాలు వగైరాలతో మతం నిండిపోయిందని నా నమ్మకం. అందుచే అది శాస్త్రీయమైన దృక్పథం మాత్రం కాదు.

అందులో ఒకవిధమైన మాంత్రికశక్తికూడా ఉంది. హేతువాదంతో నిమిత్తంలేకుండా మూఢవిశ్వాసాలకు దారితీస్తుంది. మంత్ర తంత్రాలమీద ఆధారపడేటట్లు చేస్తుంది. అయినప్పటికీన్నీ మానవ స్వభావం గాఢంగా కాంక్షించే ఒక లోపాన్ని మతం పూర్తిచేస్తుంది. అందుచేతనే ప్రపంచంలో అశేషజనమున్నూ ఏదో ఒకమతానికి దాసులు కాక తప్పడంలేదు. ఆ మతం పేరిటనే చాలామంది ధర్మాత్ములైన స్త్రీ-పురుషులు వెలిసేరు. దాని పేరిటనే అల్పమనస్కులు, మూఢవిశ్వాసముగలవారు, దుర్మార్గులైన నిరంకుశులుకూడా బయలు దేరినారు. మతమే మానవజీవితానికి కొన్ని మూల్యముల నేర్పాటు చేసింది. వాటిలో కొన్ని నేడు అమలులో లేకపోవచ్చును. కొన్ని నష్టదాయకం కావచ్చును. మరికొన్ని నేటికిన్నీ మానవుని నైతిక, ధార్మికజీవితానికి పునాదులైనాయి.

స్థూలంగా చెప్పాలిసొస్తే మతం మానవునికి అందుబాటులో నున్న శాస్త్రజ్ఞానానికి అతీతమైన అనుభవమని చెప్పాలి. ఒకవిధంగా చూస్తే ఎరుకలోనున్న శాస్త్రవిజ్ఞానంయొక్క విస్తరణయే మతం. భౌతికశాస్త్రజ్ఞానానికి మతానికి ఎక్కడా పోలిక లేకపోయినా సైన్సు పరిణామమే మతం. మనచుట్టూ మనకు అగోచరమైన విషయాలెన్నో ఉన్నాయనేమాట నిస్సందేహం. సైన్సు ఎన్నో అమోఘమైన విషయాలు కనిపెట్టినా, ఈ విషయాన్ని ఇంకా గ్రహించలేకుండా ఉంది. కాని ప్రయత్నంమాత్రం మానలేదు. సాధారణంగా సైన్సు ఈ పరిశోధన కవలంబించే సాధనాలు భౌతిక, ఆలంకారిక, ఆధ్యాత్మికమైన అగోచరవిషయాలను తెలుసుకోవడానికి చాలకపోవచ్చును. జీవితమంటే కేవలం మనం చూచేది, వినేది, అనుభవించేది మాత్రమే కాదు. అది ఎప్పటికప్పుడు మారుతూనే ఉంటుంది. నిరంతరం కంటి కగోచరమైన ఒక ప్రపంచంతో జీవితం సన్నిహితంగానే ఉంటుంది. జీవితపరమావధిని గురించి భౌతికశాస్త్రం మన కేమీ బోధించేది లేదు. శాస్త్రజ్ఞానం పలువిధాలుగా వ్యాప్తిచెందుతోంది. అజ్ఞానం అచిరకాలంలో మన కగోచర మనుకుంటున్న ప్రపంచంలోకి కూడా పాకి, జీవితపరమావధిని తెలుసుకోడానికి ఉపయోగపడవచ్చును. అథవా మానవజీవితంయొక్క రహస్యాలను శోధించడానికైనా వెలుగుచూపిస్తుంది. ప్రత్యక్షప్రమాణములనిచ్చే శాస్త్రజ్ఞానానికీ, మతానికీ చిరకాలంగా ఉన్న పేచీ మరొక నూతన పరిణామాన్ని పొందవచ్చును. మతసంబంధమైన అనుభవాలను శాస్త్రజ్ఞానముతో అన్వయించుకొనవచ్చును. మతం మంత్ర తంత్రాల్లోను, ఆధ్యాత్మికచర్చలలోను, వేదాంతంలోను లీనమయిపోతుంది. మహాపురుషులైన మంత్ర తంత్రవేత్తలు ఈ దేశంలో ఉండేవారు. అందులో కొందరు జనాకర్షణపొందిన మహనీయులు. వారిని ఆత్మవంచనచేసుకునే మూర్ఖులని కొట్టిపారేయ[illegible]నికి వీలులేదు. కాని సంకుచితమైన మంత్రతంత్రాలు నాకు చిరా[illegible]గిస్తాయి. అవేవో తలాతోకా లేని వ్యవహారంలా కనుపిస్తు[illegible] ఖచ్చితమైన కట్టుబాట్లలో ఉంచకుండా స్వకీయమై[illegible] పరిత్యజించి, ఏదో ఆవేశమహాసముద్రంలో ఈ [illegible] అనుభూతి

ఒక్కొక్కప్పుడు అంతర్గర్భితమైయున్న వెలుగును చూపవచ్చును. కాని మరొకప్పుడు ఆత్మవంచనకుకూడా దారితీయవచ్చును.

ఆధ్యాత్మిక మీమాంస, వేదాంతం మనస్సును బాగా రంజింప చేస్తాయి. వాటి అనుభూతి నానందించడానికి మంచి మేధాసంపత్తి కావాలి. తర్క, మీమాంస శాస్త్రానుభవం ఉండాలి. ఇంతకూ నిజమో కాదో తెలియని కొన్ని మూలసూత్రాలను ప్రమాణంగా అంగీకరించాలి. మేధావులైనవారంతా కొద్దో గొప్పో ఈ వేదాంతవివేచనచేయకమానరు. అలా చేయకపోతే ఈ ప్రపంచంలో ఉండే అనేక దృక్పథాలను నిర్లక్ష్యంచేసినట్లే అవుతుంది. కొందరికీ వ్యవహారంలో ఎక్కువ ఆసక్తి కలుగవచ్చును. వయస్సునుబట్టి కూడా దానియందలి అభిలాష మారుతూఉంటుంది. పురాణకాలంలో ఆసియాలోనూ, ఐరోపాలోనూ కూడా భౌతికవ్యవహారాలకన్న ఆధ్యాత్మికసమస్యల కెక్కువ ప్రాధాన్యత ఉండేది. అందుచేత విధిగా వేదాంతవివేచనం ఎక్కువగా ఉండేది. నేటి నవనాగరికయుగంలో మానవుడు ఎక్కువగా బాహ్యవ్యవహారాలలోనే చిక్కుకున్నాడు. అలాంటివాడు కూడా స్వయంగా ఒడుదుడుకుసమస్యలలో చిక్కుకొని మానసికబాధకులోనైనప్పుడు ఆధ్యాత్మికచింతను, వేదాంతాన్ని శరణనక తప్పడంలేదు.

మనకందరికీ జీవితతత్వాన్నిగురించి ఛాయామాత్రంగా కొన్ని అభిప్రాయాలున్నాయి. కాలమానపరిస్థితులనుబట్టి కొన్నివిషయాలను అనాలోచితంగానే అంగీకరిస్తాం. చిన్నప్పటినుంచీ పెరిగిన మతంలోని కొన్ని ఆధ్యాత్మికసూత్రాలను మనలో చాలామంది 'కిం' అనకుండా అంగీకరిస్తాం. ఇలాంటి ఆధ్యాత్మికచింతజోలికి నే నెప్పుడూ పోలేదు. నిజానికి ఆకాశపంచాంగమంటే నాకు చిరాకు. అయినప్పటికీ పాతకాలం నాటిదో, కొత్తకాలంనాటిదోఏదోఒక శాస్త్రబద్ధమైన ఆధ్యాత్మికవివేచననో, వేదాంతమార్గాన్నో అనుసరించాలనే మానసికాభిలాష నన్నావహిస్తూనేవుంది. నా [illegible] కులో అంత సుఖం కలుగలేదు గనుక దాని ప్రభావంనుండి [illegible] టూ వచ్చాను.

ప్రధ [illegible] ఈ ప్రపంచంలో ఈ జీవితంలోనే. మరొక ప్రపంచం, [illegible] నాకు లేదు. ఆత్మ అనే పదార్థమంటూ ఉన్నదో [illegible] లోనాకు తెలియదు. ఇవి ఎంతటిముఖ్య

కొన్ని రాజకీయపరిణామాలు సొంత మనస్కరించేవికావు. కేవలం అధికారదురాక్రమణకోసం జరిగే రాజకీయకుట్రలుగానే కనబడేవి. ఈ పరిణామాలెలావున్నా, మానవసమాజాన్ని అభివృద్ధిచేయడానికి మొదట్లో ఉండే ఉత్సాహం ఇప్పుడు లేకపోయినా, మొత్తంమీద మానవసమాజంయొక్క క్షేమాన్ని అద్భుతంగా పెంపొందించి, ప్రపంచానికే ఆరని వెలుగు చూపించినది రష్యా. ప్రపంచం అభివృద్ధిచేయగల ఒక నూతననాగరికతకు రష్యా పునాదివేసింది. నేను వ్యక్తిస్వాతంత్ర్యాన్ని ప్రేమించేవాడిని. దానినరికట్టే నిర్బంధాలు నాకు రుచించవు. కాని అనేక ప్రతిబంధకాలతో కూడిన ఈ సాంఘికవ్యవస్థలో వ్యక్తిస్వాతంత్ర్యానికి కూడా కొన్ని హద్దులుండాలనిపిస్తోంది. [సాంఘికరంగంలో కొన్ని హద్దుపద్దులకు లోబడే వ్యక్తిస్వాతంత్ర్యాన్ని నిరూపించుకోవాలి.] గొప్పదైన స్వాతంత్ర్యాన్ని రక్షించుకోవడానికి కొన్ని చిన్న చిన్న స్వేచ్ఛలను వదలుకోవాలి.

మార్క్సుసిద్ధాంతాలలో చాలావరకు నాకు అంగీకారమే. మనస్సుకూ పదార్థానికీ ద్వైధీభావం లేకపోవడం, పరిణామసిద్ధాంతం, కర్మసిద్ధాంతం కార్యకారణతత్వం ఇత్యాది హేతువాదం నాకిష్టం. అంతమాత్రాన నాకది పూర్ణమైన సంతృప్తినిచ్చిందనలేను. నామనస్సులో ఉన్న సంశయాలన్నిటిని అది తీర్చలేదు. నాకు తెలియకుండానే ఏవో కొన్ని ఆదర్శాలు, అభిప్రాయాలు వేదాంతంలాంటివి ఛాయామాత్రంగా నా మనస్సుకు తట్టుతూఉంటాయి. మనస్సుకూ, ప్రత్యక్షంగా కనబడే పదార్థానికీ ఉండే తేడా మాత్రం కాదు. మనస్సుకు అతీతమైనది. అంతేకాకుండా ఈ ఆలోచనలవెనుక [illegible] ఒకటున్నది. ఆ నైతిక
దృష్టి నిరంతరం వృద్ధిఅవుతున్న [illegible] ఆలోచించేమనిషి
వయస్సునుబట్టి, కాలాన్నిబట్టి [illegible] కాని కొన్ని
నైతిక ప్రాతిపదికసూత్రాలు [illegible] డా ఉం
టాయి. కమ్యూనిష్టులవ [illegible] చ
పరిత్యజించడ [illegible]
కొన్ని [illegible]
డేవి [illegible]

సమస్యలగురించే ఆలోచించుకోవాలన్న అభిప్రాయం నాలో స్థూలంగా ఉండేది. పర్యవసాన మేమైనా మానవునివిజ్ఞానాన్ని పెంపొందించుకోవడానికి చాలా సావకాశాలున్నాయనీ, ఆ విజ్ఞానాన్ని మానవసౌఖ్యంకోసం, సమాజవికాసంకోసం ఉపయోగించుకోవచ్చుననీ మాత్రం నిశ్చయంగా కనుబడుతోంది. పూర్వకాలంలోలాగే, కొంతవరకు నేడు కూడా, జగత్తుయొక్క ఆంతర్యాన్ని, పరమార్థాన్నీ తెలుసుకోవడానికి దీక్షతో కృషిచేసేవారున్నారు. ఈనాడు వ్యక్తికీ, సంఘానికీ సంబంధించిన సమస్యలకు వాళ్ళు దూరమవుతున్నారు. దాని ఆంతర్యాన్ని తెలుసుకోలేకపోతే వాళ్ళు నిస్పృహచెంది ఏమీచేయకుండా కూచుంటారు, లేదా ఏదో ఒక పిడివాదంలోపడి కాలక్షేపంచేస్తుంటారు. నిస్సందేహంగా మనం తొలగించుకోగలిగిన సాంఘిక అనాచారాలను లోపాలను ప్రారబ్ధమనీ, మానవస్వభావాన్ని మార్చడం ఎవ్వరితరమనీ, సంఘనిర్మాణం అంతేననీ, పూర్వజన్మసంచితమైన కర్మ అనీ అనుకుంటూ మాట్లాడక ఊరకుంటారు. సహేతుకంగా ఆలోచించడం మానేసి మూఢనమ్మకాల్లో పడతారు. అసంబద్ధమైన సాంఘికవిద్వేషాలు, అలవాట్లు పెరుగుతుంటాయి. శాస్త్రజ్ఞానమూ, శుద్ధహేతువాదమూ మనకు కావలసిన జ్ఞానసంతృప్తి నొసగనిమాట నిజం. జీవితంలో జరుగుతుండే ప్రతిసంఘటనకీ అనేక కారణా లుంటాయి. ఆ కారణాలు ఒకదానికొకటి లంకెపడివున్నాయి. వాటినన్నిటిని గ్రహించడం అసంభవం. కాని వాటిలో ప్రకోపించిన కొన్ని శక్తులను పరిశీలించీ, అనేక ప్రయోగాలనుచేసీ, అనుభవంవల్లనూ, తప్పులుచేసి దిద్దుకుంటూ ఈ అజ్ఞానతిమిరంలో ... గా సత్యాన్ని, విజ్ఞానాన్ని కొంత సాధించవచ్చు...

అ... ...వాని కనుగుణ్యంగా ఉండడంచేత

మా... ...గా సహాయపడుతోంది.

...సంఘటనఫలితములుగాని,

...విస్పష్టంగా

...శం

మార్క్సుతర్వాత జరిగిన పరిణామాల నన్నిటినీ లెనిన్ మార్క్సు సిద్ధాంతానుగుణ్యంగా మలిపేడు. తరువాత నాజీ, ఫాసిస్టు సిద్ధాంతాలు ఉత్పన్నంకావడం జరిగింది. శాస్త్రజ్ఞానమూ, దాని ప్రయోగమూ అపారంగానూ, త్వరితంగానూ వృద్ధికావడంవల్ల ప్రపంచస్వరూపమే త్వరితంగా మారిపోయి కొత్తసమస్యలను లేకెత్తిస్తోంది.

కనుక సామ్యవాదసిద్ధాంతంలోని మూలసూత్రాలను నే నంగీకరించినా, వాటిని లోతుగా తరచడంవల్ల వచ్చిన అనేక తగాదాలను ఎన్నడూ పట్టించుకోలేదు. శుద్ధ సిద్ధాంతతత్వపరిశీలనచేసి భాష్యాలను పెంచే భారతీయ వామపక్షాలంటే నాకు భర్జించలేదు.

జీవితంలో అనేక క్లిష్టసమస్య లుంటాయి. మనకు ఇప్పటికి తెలిసిన జ్ఞానాన్నిబట్టిచూస్తే జీవితం ఏదోఒక సిద్ధాంతానికి కట్టుబడిపోయేటంత అసంబద్ధమైనది కాదు. నాకు సంబంధించినంతవరకు వ్యక్తికి, సంఘానికి గల సంబంధబాంధవ్యసమస్యలే సమస్యలు. ప్రశాంతంగానూ, పరిపూర్ణంగానూ జీవించడం, బాహ్యాంతరజీవితాల సమన్వయం, వ్యక్తులకు మతాలకు ఉండవలసినసంబంధం, వ్యక్తులు నిరంతరం ఉన్నదానికంటె వృద్ధిలోకొస్తూఉండడం, సాంఘికాభివృద్ధి, విరామంలేకుండా మానవుడు సాహసంగా ముందడుగువేస్తుండడం—ఇవే నా సమస్యలు. ఈ సమస్యలు పరిష్కరింపబడాలంటే పరిశీలనాశక్తి, సరియైన విషయజ్ఞానం, శాస్త్రవిజ్ఞానపద్ధతుల కనుగుణ్యంగా నడిచే లక్షణం ఉండాలి. ఎల్లప్పుడూ సత్యాన్వేషణకు ఈ పద్ధతులే ఉంటాయనుకోవడం తప్పే. కళలు, సాహిత్యం, పద్యరచన మొదలైనవాటి సంగతి వేరు. కనుక అప్రయత్నంగాకలిగే స్ఫురణశక్తినీ సత్యాన్ని అన్వేషించి ఇతరమార్గాలను వదలకూడదు. శాస్త్రవాదానికి కూడా అది అవసరమే. హేతువాదానికి అతీతంకాకుండా, ప్రయోగంవల్ల అనుభవంవల్ల గ్రహించిన శాస్త్రజ్ఞానానికి మనం కట్టుబడాలి. మానవుని దైనందిన జీవితానికి సంబంధంలేని ఆకాశపంచాంగానికి దూరంగా వుండాలి. నేటి సమస్యలను చైతన్యవంతమైన వేదాంతమే పరిష్కరించాలి.

మనకాలంలో జరిగిన వివిధ అభివృద్ధికార్యాలను చూచి పొంగిపోయే మనం, కాలబద్ధులమైన ఖైదీలం, వివిధయుగాల్లో మనపూర్వులు

వారిరోజులలో కాలానికి బందీలైనట్లే, మన పూర్వీకులవలెనే మన యుగంలోనివారు కూడా మనదృక్పథమే సత్యాన్వేషణకు సరియైన మార్గ మనుకొని ఆత్మవంచన చేసుకోవచ్చును. దానినుంచి తప్పుకోవడం కష్టం. అదొక మాయే అయితే ఆ మాయనుండి బయట పడలేము.

ఏమైనా సహేతుకమైన శాస్త్రజ్ఞానంవల్ల మానవజీవితంలో విప్లవాత్మకమైన మార్పులు కలిగినాయని నా దృఢవిశ్వాసం. అంతే కాకుండా శాస్త్రజ్ఞానంవలన చాలా అమోఘమైన మార్పులు రావడానికీ, అవ్యక్తమనుకొన్నదానినికూడా తెలుసుకోవడానికీ కొత్త దారులు దొరికినాయి. శాస్త్రజ్ఞానం సాధించిన మహత్తరవిషయాలందరికి తెలిసినవే. ఆర్థికంగాచూస్తే హానీహానీగా ఉండే, సంపత్తి నది కొల్లలుగా మార్చింది. వేదాంతానికిచెప్ప అగమ్యం, అగోచరం అనుకున్న ఎన్నోవిషయాలు తేటతెల్లమవుతున్నాయి. దూరము, కాలము, శక్తి వీటిసంబంధమైన సిద్ధాంతాలు భౌతికప్రపంచాన్ని సంపూర్ణంగా మార్చేశాయి. పదార్థస్వభావం, అణుస్వభావస్వరూపవివరణం, విద్యుత్ శక్తి, వెలుతురు, పంచభూతముల పరివర్తనం మొదలైన విషయాల్లో మానవుని జ్ఞానసంపత్తి చాలా పెరిగిపోయింది. మానవుడు ప్రకృతితో తన కెట్టి సంబంధమూ లేదనుకునేకాలం గతించింది. ప్రకృతి ప్రసాదించే శక్తిమీదనే మానవుని భవిష్యత్తు ఆధారపడివుంది.

శాస్త్రజ్ఞానం విస్తృతంకావడంవల్ల మానవుని భావాలు వికాసంపొందేయి. తత్ఫలితంగా శాస్త్రవేత్తలుకూడా వేదాంతానికి దగ్గరగానే వస్తున్నారు. వారు పరస్పరవిరుద్ధమైన వివిధనిశ్చయాలకు వస్తున్నారు. కొందరి కీ శాస్త్రవిజ్ఞానంలో ఒక కొత్త సమైక్యత స్ఫురిస్తోంది. కేవలం ఏమైతే అవుతుందనే అజాగ్రత్తకు ఎవరూ సిద్ధంగాలేరు. బెర్ట్రాండ్ రస్సెల్‌లాంటివారు, 'పార్మినైడ్సుకాలంనుంచీ శుద్ధతార్కికులు ప్రపంచమంతా ఒక్కటే అనే నమ్మకంలోవారు. అది శుద్ధ అబద్ధమని నా నమ్మకం' అన్నారు. 'పర్యవసాన మేమిటో తెలియని కారణాల ఫలితం మానవుడు; అతని పుట్టుక, అభివృద్ధి, కాంక్షలు, భయాలు, అభిమానాలు, నమ్మకాలు అన్నీ అణువులయొక్క అకారణ కలయికల ఫలితమే' అనికూడా అన్నారు. అయినా పదార్థవిజ్ఞానశాస్త్రంలో

జరిగిన గొప్ప పరిశోధనవల్ల ప్రకృతిలో ప్రధానమైన ఒక ఏకత్వం వుందని చాలవరకు నిరూపణవుతోంది. 'ప్రపంచంలోని సృష్టిఅంతా ఒక్కటే పదార్థంలోనుంచి ఉత్పన్నమైనదనే సిద్ధాంతం చాలా పాతదే. ఆలోచనంటూ పుట్టిననాటినుంచీ ఉంది. కాని ప్రకృతిలో ఒక ఐక్యత ఉన్నదనీ, కేవలం తలాతోకాలేని పిచ్చినమ్మకం కాదనీ, విస్పష్టమైన ఆధారాలతోకూడిన శాస్త్రీయసిద్ధాంతమనీ నమ్మే యుగం మనది' అన్నాడు పదార్థవిజ్ఞానశాస్త్రవేత్త కారల్ కె. డారో.

ఇటీవల భౌతికశాస్త్రవేత్తలు కనిపెట్టిన మహత్తరవిషయాలు, అద్వైత వేదాంతసిద్ధాంతాలతో పోల్చిచూస్తే చాలా ఆనందంగా ఉంటుంది. జగత్తంతా ఒక్కటే పదార్థంతో సృష్టిచేయబడిందనీ, ఆ పదార్థంయొక్క పైరూపం మాత్రమే మారుతుందనీ, ప్రపంచంలోని సర్వశక్తులమొత్తం ఒక్కటేననీ మూలసూత్రాలు. ప్రతివస్తువుయొక్క సృష్టికీ హేతువు దానిప్రకృతిలోనే ఉందనీ, ప్రపంచంలో జరిగే సంఘటనలను విపులీకరించడానికి బాహ్యసాధనా లక్కరలేదనీ కూడా అద్వైత సిద్ధాంతమే.

ఇలాంటి అగోచరమైన ఆలోచనల పర్యవసానమునుగూర్చిన చింత భౌతికశాస్త్రమున కక్కరలేదు. ప్రత్యక్షంగా ప్రయోగాలు చేసుకుంటూ, పర్యవసానాలను గమనిస్తూ శాస్త్రం శతవిధాలుగా పురోగమిస్తుంది. ఈ పురోగమనంలో మానవజీవితాన్ని మారుస్తూ, మానవ విజ్ఞానాన్ని పెంపొందిస్తుంది శాస్త్రం ఇంకా జీవితానికి ఆయువుపట్టయిన చిత్రవిచిత్రాలను కనుగొనేస్థితిలోనే ఉండవచ్చును. కాని ఒక నిర్ణీతమైనపంథాలో అనంతమైన తనయాత్రను శాస్త్రం సాగిస్తూనే ఉంటుంది. వేదాంతశాస్త్రవిచారంలోని 'ఎందుచేత?' అనే ప్రశ్నను లక్ష్యపెట్టకుండానే 'ఏవిధంగా?' అని ప్రశ్నిస్తూనే ఉంటుంది. బహుశా మనం ఈ అంతరాయాన్ని దాటలేకపోవచ్చును. అగమ్యం అగోచరం అయిన ఆ పదార్థం అలాగే ఉండిపోవచ్చును. 'మంచిచెడ్డలు' పరస్పరసంఘర్షణలు అసంబద్ధములునైన ద్వంద్వాల సముదాయంగా, నిరంతరం మారుతూ జీవితం ఇలాగే ఉండవచ్చును.

అంతేకాకుండా శాస్త్రజ్ఞానంయొక్క ఈ అభ్యుదయమే ఉసురొకలా పరిణమించవచ్చును. నైతికోన్నతికి, శిక్షణకు, శాస్త్రజ్ఞానం

దూరమైపోయి, దుర్మార్గులు, స్వార్థపరులు, పరపీడనాసక్తులు అయిన వారిచేతుల్లో పడి, నాశనహేతువుగా పరిణమించవచ్చును. అలాంటప్పుడు, తాను సాధించిన మహత్తరవిషయాలనే శాస్త్రం నాశనం చేస్తుంది. ప్రస్తుతం ఈ యుద్ధంమూలంగా అలాంటిస్థితి ఏర్పడుతున్నట్లు కనబడుతోంది. మానవహృదయంలో గొప్ప సంఘర్షణ కూడా నిబిడీకృతమై ఉన్నది.

మానవుని ఉత్సాహం చాలా ఆశ్చర్యకరమైనది. అనేక యుగాల నుంచి మానవుడు తను నమ్మిన ఒక ఆదర్శంకొరకు, ఒక సత్యంకోసం, ఒక విశ్వాసంకోసం, దేశంకోసం, గౌరవంనిమిత్తం తన కామ్యాయమైన సర్వస్వాన్ని ఆఖరుకు ప్రాణాన్నికూడా త్యాగంచేస్తూ వచ్చాడు. ఆదర్శాలు మారుతూఉండవచ్చును. కాని వాటికోసం ఆత్మార్పణంచేసే శక్తి ఇంకా మానవునిలోతగ్గలేదు. అందుచేతనే ఎన్ని అపరాధాలకైనా అతడింకా క్షంతవ్యుడు. ఆతడినిగురించి నిస్పృహచెందనక్కరలేదు. అత్యంతప్రమాదమధ్యమందున్నా మానవుడు తన హుందాతనుగాని, విశ్వాసాలనుగాని పోగొట్టుకోలేదు; ప్రకృతియొక్క అనంతశక్తిముందర అతడొక చిన్న కీటకము. అపారమైన ఈ జగత్తులో ఒక ఇసుకరేణువు. అయినప్పటికీ, తన బుద్ధిచేత పంచభూతాలనూ ఎదుర్కొని వాటిని జయించడానికి సిద్ధపడినాడు. దేవుళ్లెన్నిరకాలుగా ఉన్నా, మానవునిలో దైవాంశ కొంత ఉన్నది. అలాగే అసురత్వంకూడా అతనిలోనే ఉంది.

భవిష్యత్తు అంధకారబంధురంగా ఉన్నది. అయితే కొంతవరకు వెలుగుబాటలు కనబడుతున్నాయి. ఇంతకాలంగా అనేక ఢక్కామొక్కీలకు తట్టుకోగలిగిన మానవుని ఉత్సాహాన్ని అణగగొట్టగలిగిన ప్రమాదమేమీ రాలేదనే విశ్వాసంతో ఆ వెలుగుబాటవెంబడే స్థిరంగా ముందడుగువేయగలం. ఎంత కష్టమైనా జీవితంలో ఒక అందం, ఆనందం ఉన్నాయని గుర్తుంచుకుంటే, సుందరమైన ప్రకృతివనంలో ఎంతకాలమైనా విహరించగలం.

నా ఖైదుజీవితంలో 21 వ మాసం తాపీగా నడిచిపోతోంది. శుక్లపక్షాలు, కృష్ణపక్షాలు ఒకదానివెంట ఒకటి గడచి, త్వరలో రెండు సంవత్సరాలకాలం గడచిపోతోంది. వచ్చే జన్మదినంనాటికి మరోసంవత్సరమ్ము మీదపడుతుంది. గడచిన నాల్గుజన్మదినోత్సవాలు ఈ జైళ్లలో

డూన్ జైల్లోనో గడచిపోయాయి. ఇదివర కెన్నో జన్మదినోత్సవాలు జైళ్ళ ల్లోనే వెళ్ళిపోయాయి. వాటి లెక్క కూడా మరచిపోయాను. ఇంత కాలమూ ఏదో వ్రాద్దామని అనుకుంటూ వచ్చాను. కాని అయిష్టం గానూ ఉండేది. నా స్నేహితులు ఇదివరలోలాగే జైలులో మరొక పుస్తకం వ్రాసేస్తా ననుకున్నారు. నా కదొక అలవాటైపోయింది. అయినా నే నేమీ వ్రాయలేదు. ఇదమిత్థమని ఒక ప్రత్యేకతలేని ఏదో పుస్తకం వ్రాయడమంటే అయిష్టం పుట్టింది. ఏదో వ్రాయడం అంత కష్టంకాదు. కాని వ్రాసినది ఉపయుక్తంగా ఉండవలెనుకదా! నా వ్రాతకాగితాల కట్టలను చూసుకుంటూనే, జైల్లో ఉండగానే, బయటప్రపంచంలో జరిగే మార్పులవల్ల ఆ వ్రాతలు చప్పబడిపోగూడదు. నేను ఇవ్వేళ రేపటి కోసం వ్రాసి ప్రయోజనంలేదు. సుదీర్ఘమైన భవిష్యత్తుకోసం వ్రాయాలి. ఇంతకూ ఈ వ్రాసేది ఎవరికోసం? ఎప్పుడు? బహుశా నేను వ్రాసినది ప్రచురణమే కాకపోవచ్చును. నేను జైలులో ఉండగానే, ప్రపంచంలో గతయుద్ధకాలంలోకంటె విపరీతమైన సంఘర్షణలు, కొట్లాటలు జరుగ వచ్చును. భారత దేశమే రణరంగం కావచ్చును. లేకపోతే అంతర్గత మైన సంక్షోభం కలుగవచ్చును. ఇలాంటి సంభవసాధ్యమైన ఆపత్తు లను గడచినా, భవిష్యత్తుకొరకు ఇప్పుడు వ్రాయబోనడం చాలా సాహసమే. ఏమనగా ఈ నా సమస్యలు నామరూపాలులేకుండా సమసి పోయి వాటిస్థానే కొత్తసమస్య లుత్పన్నంకావచ్చును. ఈ ప్రపంచ మహాసంగ్రామం వెనుకటికన్న కొంత భారీయైనదనిమాత్రమే సంతుష్టి చెందలేను. ఈ యుద్ధం ప్రారంభమైననాటినుంచీ అంతకు ముందునుంచీ మంచికో, చెడ్డకో— ఈ మహాసంగ్రామంవల్ల బ్రహ్మాండమైనట్టిన్నీ, అద్భుతమైనట్టిన్నీ మార్పులు వస్తాయని నామనోనేత్రాలకు గోచర మవుతూవచ్చింది. అలాంటప్పుడు కాలగర్భంలోలీనమైపోయిన సంగతు లనుగురించి నేను వ్రాసిన వ్రాతలవల్ల ప్రయోజన మేమిటి? ఇలాంటి ఆలోచనలన్నీ నన్ను వ్రాయకుండా ఆపినాయి. నామనస్సులో జవాబులు కానటువంటి ప్రశ్నలెన్నో ఉత్పన్నమవుతూఉండేవి.

1940 సం॥ అక్టోబరునుండి 1941 సం॥ డిశెంబరువరకూ డెహ్రా డూన్ జైల్లో నా పాతకొట్లో ఉండగా కూడా ఇలాంటి ఆలోచనలే నన్ను వేధించినాయి. ఆ కొట్లో ఉన్నప్పుడే ఆపుసంవత్సరాల క్రిత

నా స్వీయచరిత్రను వ్రాయడానికి పూనుకున్నాను. అక్కడ పదినెలల పాటు ఏమీ వ్రాయాలనేబుద్ధే పుట్టలేదు. చదువుకోవడం, మొక్కలు పాతడం, పువ్వులమొక్కలతో కాలక్షేపంచేయడంతో సరిపోయింది. చివరకు వ్రాశాను. నా స్వీయచరిత్ర తరువాయిగా దాని నుద్దేశిం చాను. కొద్దివారాలపాటు తొందరగా విరామంలేకుండా వ్రాశాను. కాని నాపని పూర్తికాకుండానే—నాలుగుసంవత్సరాల శిక్షాకాలం పూర్తికాకుండానే—నాకు విడుదలవచ్చింది.

నేను చేయబూనినపని పూర్తికాకపోవడం అదృష్టం. ఏమంటే, పని పూర్తిఅయివుండినట్లయితే, ప్రచురణచేయాలనే సంకల్పం కలిగి ఉండేది. ఇప్పుడు దానిని చూచుకుంటే, దాని నిరుపయోగం తెలిసింది. చాలావరకు పాతబడి చప్పబడిపోయింది. దానిలో వ్రాసిన విషయాలు వాటి ప్రాముఖ్యతను గోల్పోయి, కాలగర్భంలో లీనమైపోయాయి. తరువాత జరిగిన మహత్తరసంఘటనలు వాటిని పూడ్చిపెట్టేశాయి. నాకు వాటియందలి అభిరుచి పోయింది. నా మనస్సుకు హత్తుకుపోయిన కొన్ని స్వానుభవాలు మాత్రం మిగిలిపోయాయి; కొందరు మహా వ్యక్తులతోనూ, సంఘటనలతోనూ పరిచయం కలుగడం, పైకి భిన్న భిన్నంగా కనుబడిన ఆశ్చర్యకరమైన ఏకత్వం కల భారతప్రజలతో సన్ని హితత్వం, కష్టాలు, వాటిని జయించడంవల్ల కలిగే ఆనందం, కొన్ని ఘనకార్యాలు చేయడంవల్ల కలిగిన సంతోషం—ఇవిమాత్రం మిగిలి ఉన్నాయి. ఈ విషయాలనుగురించి ఎవ్వరూ అంతగా వ్రాయకపో వచ్చును. మానవుని ఆంతరంగికజీవితంలోని కొన్ని అనుభవాల్లోనూ, ఆలోచనల్లోనూ ఒక గుంభన ఉంటుంది. దానిని ఇతరులకు చెప్పడానికి సాధ్యంకాదు. కాని ఆ వ్యక్తికి సంబంధించినంతవరకు, దానిప్రభావం పనిచేస్తూనే ఉంటుంది. వాటిప్రభావం వల్లనే మనిషి జీవితంయెడల, స్వదేశ, పరదేశములపట్ల తన అభిప్రాయాలను మార్చుకుంటూ సరి దిద్దుకుంటాడు.

ఇతరజైళ్ళలోలాగునే అహమ్మద్‌నగరం కోటలో కూడా ప్రతి రోజూ చాలాగంటలు తోటపనితోనే కాలక్షేపంచేస్తూ ఉండేవాడిని. ఎండవేళప్పుడు కూడా నేలనుత్రవ్వి పదునుచేసి పూలమొక్కలకు మళ్ళు తయారుచేసేవాడిని. అక్కడినేల బొత్తుగా చెడ్డది. గులకరాళ్ళూ,

చెత్తా చెదారం, కూలిపోయిన ఇస్కు, పురాతన స్మారకచిహ్నలబాపతు మట్టిబెడ్డలు వగైరాలతో నిండిఉండేవి. ఆ కోట అనేక యుద్ధాలు, కుట్రలు జరిగిన చరిత్రాత్మకమైనస్థలం. దానిచరిత్ర చాలా పాతదీ కాదు, అంత ప్రముఖమైనదీ కాదు. దానిచరిత్రలో చెప్పుకోదగినకథ ఒక్కటే. అక్బర్ సేనలు ఆ కోటను ముట్టడించినప్పుడు, చాంద్‌బీబీ అనే ఒకసుందరి కత్తి చేతబట్టి సేనలను నడిపించి కోటను రక్షించింది. చివరకు ఆమెస్వజనంలోనివాడే ఒక డామెను హత్యచేశాడు.

ఈ విషాదచరిత్రగల ఈ భూమిని త్రవ్వుతుంటే పాతగోడలు, గుంచీలు, భవనాలు బయటపడుతుండేవి. పురావస్తుశాఖవారి అనుజ్ఞ లేనికారణంచేత లోతుగా త్రవ్వడానికి వీలులేకపోయింది. అంతేకాకుండా మాకు సాధనసంపత్తీ లేదు. ఒకసారి ఒక గోడరాతిమీద బహు సుందరంగా చెక్కబడిన తామరపువ్వు కనుబడింది. బహుశా అది గుమ్మంమీద అమర్చబడినరాయి కావచ్చును. ఈ సందర్భంలో డెహ్రాడూన్‌లో జరిగిన ఒకసంగతి జ్ఞాపకానికొస్తోంది. మూడుసంవత్సరాల క్రిందట మొక్కలనాటుకోసం త్రవ్వడంలో ఒక పాత స్మారకచిహ్నం కనుబడింది. కొంచెంలోతులోనే పురాతనమైన రెండు స్తంభాలు కనుబడ్డాయి. కొంచెం ఆవేశంతో వాటిని పరీక్షచేశాం. అవి మున్ఫైనలభైసంవత్సరాలక్రితం ఉరిస్తంభాలుగా ఉపయోగపడ్డాయని తేలింది. ఆ జైలులో చాలా కాలంక్రిందటనే ఉరితీసే ఏర్పాటును తీసేశారు. ఆ చెట్టు వగైరా చిహ్నలన్నిటిని మాపుచేశారు. నేను, నా తోటిఖైదీలు దుశ్శకునసూచకమైన ఈ చిహ్నలను కనిపెట్ట తీసివేసినందుకు పరమానందభరితులమయ్యాము.

తవ్వుగోల వదలిపెట్టి కలం చేపట్టేను. డెహ్రాడూన్ జైలులో వ్రాసిన అసంపూర్ణవ్రాతలకు పట్టినగతే దీనికీ పట్టవచ్చును. స్వయంగా పాల్గొనడానికి స్వేచ్ఛ లేనందున వర్తమానాన్నిగురించి నేను వ్రాయలేను. వర్తమానంలో కార్యాచరణావసరాన్నిగురించే నేను వివరంగానూ, తేలిగ్గానూ వ్రాయగలను. జైలులో బయట జరిగేవన్నీ ఛాయామాత్రంగానే గోచరమవుతుంటాయి. ప్రత్యక్షంగా దానిలో దూకి అందువల్లకలిగే అనుభోగాన్ని పొందలేను. నిజానికి అది వర్తమానమని అనలేను. అలాగని అచంచలమైన గతమూ కాదు. పోనీ

మహాప్రవక్తవలె భవితవ్యాన్నిగురించీ వ్రాయలేను. భవిష్యత్తును ఆవరించియున్న ముసుగును తొలగించి, నా యిష్టమొచ్చిన వస్త్రాలంకారం చెయ్యాలనికూడా నా మనస్సు తరచు ఉబలాటపడుతుంది. కాని ఇవి అసాధ్యమైనఊహలు. భవిష్యత్తు అనిశ్చితం, అగోచరంగానే ఉంది.

గతం అలాగే ఉంది. కాని నేను పండితుడిలాగున కాని, చరిత్రకారునిలాగునకాని గతాన్నిగురించి వ్రాయలేను. నాకు అలాటి జ్ఞానంకాని, తయారీకాని లేదు. అసలలాంటి పనికి ఉండవలసిన మనోభావంకూడా లేదు వర్తమానానికి చేరిఉన్న గతమైతే, అది నా కొక విధమైన ఉత్తేజాన్నిచ్చి వర్తమానంలో కలసిపోతుంది. అలా కాకపోతే అది నిర్జీవమైన న్నుత్సాహపరచదు. ఇదివరకు వ్రాసినట్లే వ్రాయాలంటే గతాన్ని ప్రస్తుతపు ఆలోచనలకు లంకెపెట్టి వ్రాయవచ్చును. ఈ చరిత్ర వ్రాయడంవల్ల 'గోథే' చెప్పినట్లు గతంయొక్క భావాన్ని కొంత తగ్గిస్తుంది.

గత చరిత్రలోని మంచిచెడ్డలభారం చాలా ఎక్కువైనది. ఆ భారం ఉక్కిరిబిక్కిరికూడా చేస్తుంది. అందులోనూ, పురాతనమైన నాగరికతకు చెందిన ఇండియా, చైనా దేశాలకు ఈ భారం మరీ బాధాకరం. 'శతాబ్దాల వివేకంతోపాటు, వాటి పిచ్చికూడా మనకెక్కుతుంది. వాటికి వారసులు కావడం ప్రమాదం' అన్నాడు తత్వవేత్త నీష్కీ. నాకు సంక్రమించిన వారసత్వం ఏమిటి? వేలాదిసంవత్సరాలుగా మానవజాతి సాంధించినదానికి, మానవజాతి ఆలోచనకు, అనుభవాలకు, సుఖదుఃఖాలకు, జయాపజయాలకు, చిరకాలంగా మానవుడు చూపిన చూపుతున్న సాహసాలకు అంతకూ ప్రపంచంలోని మనుష్యులందరితోపాటు నేనూ వారసుడను - కాని, భారతీయులకుమాత్రం ఒక ప్రత్యేక వారసత్వం ఉన్నది. మనకు ప్రత్యేకించినదీ, మన రక్తమాంసాలలో జీర్ణమైనదీ, మన మిల్లా ఉండడానికి కారణభూతమైనదీ, ముందు మన భవితవ్యాన్ని రూపొందించేదీ ఒకటున్నది. ఈ ప్రత్యేక వారసత్వము, వర్తమానచరిత్రపై దాని ప్రభావమునుగురించి నేననేక విధములుగా మనస్సులో తర్జనభర్జనలు చేశాను. దానినిగురించే నేను వ్రాయదలచుకున్నాను. అందులో ఉండే కష్టాలు, చిక్కులు నన్ను భయపెడుతున్నాయి. దాని పైఅంచులు మాత్రమే నేను తట్టగలను.

ఆ విషయాన్ని నేను కూలంకషంగా చర్చించలేను. కాని, అలాంటి ప్రయత్నం చేయడంలో నా మనస్సు మెరుగుతేలి ముందు ఆలోచనకు, కార్యాచరణకు దారితీస్తుందని నా ఆశ.

ఈ విషయంలో నా ధోరణి విధిగా నా స్వకీయమే. నా మనస్సులో ఒక భావం ఎల్లా ప్రవేశించిందో, ఏరూపందాల్చి ఏవిధంగా నన్ను నడిపించిందో వివరిస్తాను. అసలు విషయానికి సంబంధంలేని కొన్ని కేవలం స్వానుభవాలుకూడా ఉంటాయి. కాని నా మనస్సును నా దృక్పథాన్ని అవెల్లా మార్చినాయో అవి నిరూపిస్తాయి. ఇతర దేశాలగురించీ, వాటి ప్రజలనుగురించీ, మన అభిప్రాయాలు అనేక విషయాలమీద ఆధారపడుంటాయి. ముఖ్యంగా, స్వంతంగా వాళ్ళతో సన్నిహితత్వం ఏర్పడితే వారిని బాగా అర్థంచేసుకుంటాం. ఏదేశ ప్రజలతోనైనా స్వంతంగా సన్నిహితమైన సంబంధం పెట్టుకోకపోతే వాళ్ళ నపార్థంచేసుకుంటాం. మనం వేరు, వాళ్ళు వేరు అనే భావం ఏర్పడుతుంది.

మనదేశంలోనే, మన కనేక వ్యక్తిగతమైన సన్నిహితత్వాలేర్పడ్డాయి. అందువల్ల మన మనస్సులలో, మన దేశస్థులనుగురించి ఒక సమగ్రమైన బొమ్మ ఏర్పడుతుంది. నా మనస్సునిండా అలాంటి చిత్రపటాలెన్నో ఉన్నాయి. కొన్ని స్పష్టమైన బొమ్మలు, సజీవంతో నా కేసి చూస్తూ జీవితపరమావధులను నాకు జ్ఞాపకంచేస్తున్నట్లగుపడుచున్నాయి. ఇదంతా ఎప్పుడో జరిగిన ఏదో కథను చదువుతున్నట్లనిపిస్తుంది. మరికొన్ని బొమ్మల్లో జీవితాన్ని మధురస్మృతులతో నింపే స్నేహం, సహచర్యం కనబడుతోంది. అసంఖ్యాకులైన భారతీయులు, స్త్రీలు, పురుషులు, బిడ్డలు ఎంతోమంది గుంపులుగుంపులుగా చేరి నా కేసి చూస్తున్నట్లు, వేలాదిజనంనేత్రాల్లోని కథ నర్థంచేసుకోవడానికి నేను ప్రయత్నిస్తున్నట్లు నా మనోనేత్రాని కగపడుతోంది.

ఈ కథను నేను స్వీయచరిత్రకు సంబంధించిన గాథతో ప్రారంభిస్తాను. నా స్వీయచరిత్రలో ఆఖరున వ్రాసిన ఘట్టాల అనంతరం నా మనస్సెట్టిస్థితిలో ఉందో గ్రహించడం సులభం. అట్లని దీని నొక స్వీయ చరిత్రను చేయను. కాని కొన్ని వ్యక్తిగతమైన గాథలు తరుచుగా దొర్లక తప్పదు.

ప్రపంచయుద్ధం సాగిపోతోంది. ప్రపంచాన్నంతనూ కబళించ గలిగిన మహాసంరంభం బయట జరుగుతుంటే, అహమ్మద్‌నగరం కోటలో బందీగా కూచుంటే అప్పుడప్పుడు పళ్ళుకొరుక్కోక తప్పేది కాదు. చిరకాలంగా నే నూహించుకుంటూఉండిన మహత్కార్యాలు, సాహసకృత్యాలు బయట జరుగుతుంటే లోపల చేతులునలుపుకుంటూ కూచోవలసొస్తే ఆగ్రహం కాక మరేమొస్తుంది! పంచభూతాలకు సంబంధించిన ఒక మహా భూకంపమో, వరదో వస్తే దాని నేదృష్టితో చూస్తానో అలాంటి మమకారరహితమైనదృష్టితో చూడడానికి ప్రయత్నిస్తాను. ఆ ప్రయత్నంలో జయించడం సంభవం కాదనుకోండి. కాని నేను ఇతరులవల్ల అపాయంనుంచీ, ద్వేషాన్నుంచీ, ఆవేశంనుంచీ ఆత్మరక్షణచేసుకోవాలంటే మరొకమార్గం లేదు. సర్వసంహారకారకమైన ఆసురత్వం తాండవిస్తున్నప్పుడు, నా స్వంతబాధలు అంతగా కనుబడవు.

'ప్రపంచంకళ్ళన్నీ రక్తస్ఫూర్తితో ఎర్రనై చూస్తున్నా, మనం మాత్రం తొణుకూ బెణుకూ లేని శాంతంతో, మసగలేని దృష్టితో ప్రపంచముఖాన్ని చూడాలి' అని గాంధీజీ 1942 సం॥ ఆగస్టు 7వ తేదీని చెప్పినమాటలు జ్ఞప్తికివచ్చాయి.

4)

# బేడెన్‌వీలర్ - లాసేన్

## కమల

1935 సం॥ సెప్టెంబరు 4 వ తేదీని ఆల్మోరా జైలునుంచి హఠాత్తుగా నన్ను వదలిపెట్టేరు. నా భార్య చాలా ప్రమాదస్థితిలో ఉందని వార్తవచ్చింది. అప్పుడామె జర్మనీదేశపుఅడవులలో బేడెన్‌వీలరు శానిటోరియంలో చికిత్సపొందుతోంది. మోటారులోను, రైలులోను ప్రయాణంచేసి మరునాటి ఉదయానికి అలహాబాద్ చేరుకున్నాను. ఆవేళ మధ్యాహ్నమే విమానంలో యూరోపుకు ప్రయాణం సాగించాను. సర్వీసువిమానంలో కరాచీ, బాగ్దాద్, కెయిరోలమీదుగా అలెగ్జాండ్రియా చేరేను. అక్కడనుంచి ఒక సముద్రవిమానం బ్రిండిసీకి తీసుకెళ్ళింది. అక్కడనుంచి స్విడ్జర్లాండ్‌లోని బేల్ పట్టణానికి చేరి, చివరకు సెప్టెంబరు తొమ్మిదవతేదీకి బేడెన్‌వీలరు చేరుకున్నాను. అనగా విడుదలైన 5 వ రోజుకి, అలహాబాదులో బయలుదేరిన నాల్గవనాటికన్నమాట.

నేనామెను చూచేసరికి, ఆమె యథాప్రకారంగా ధైర్యంతో కూడిన చిరునవ్వుతోనే నాకు స్వాగతమిచ్చింది. ఆమె చాలా నీరసంగా వుండడంచేతనూ, బాధ ఎక్కువగా ఉండడంచేతనూ అంతగా మాటాడలేకపోయింది నేను వెళ్ళినతర్వాత మరునాడు, ఆతర్వాత మరికొన్నినాళ్ళకు ఆమె బాగా తేరుకుంది. నేను వెళ్ళడం అంతవరకు సుగుణమే. కాని ఆ ప్రమాదస్థితి అలాగే ఉండి, మెల్లగా ఆమెప్రాణంతీసింది. ఆమె చనిపోతుందనే అభిప్రాయాన్నికూడా మనసుకు పట్టించుకోలేక, ఆమెకు కొంచెం సుఖువుగా వుంటోందనుకున్నాను. ఆ గడ్డుస్థితి కాస్తంత గడచిపోతే ఇక ఫర్వాలేదనుకున్నాను. వాళ్ళ అలవాటు ననుసరించి వైద్యులు నా కాశకల్పించారు. అప్పటికి తాత్కాలికంగా ప్రమాదం దాటడంచేత కాస్తంత నిలద్రొక్కుకుంది. చాలాసేపు కబుర్లు చెప్పుకోడానికి వీలుగా వుండేటంత ఆరోగ్యం కుదుటబడలేదు. ముక్తసరిగా మాట్లాడుకుంటూవుండేవాళ్ళం. ఆమెలో ఏమాత్రం అలసట చిహ్నాలు కనుబడినా అంతటితో కబుర్లు మానేసేవాడిని. అప్పుడప్పుడు

ఆమె కేదైనా చదివి వినిపించేవాడిని. పెరల్ బక్ వ్రాసిన 'గుడ్ అర్త్' అనే పుస్తకం అలా చదివి వినిపించాను. అలా చదవడం ఆమె కిష్టం గానే ఉండేది. కాని ఆ చదు వెంతకాలమో సాగలేదు.

ప్రొద్దున్నా, సాయంకాలమూ ఆ చిన్న ఊళ్ళో వున్న నా మకాంనుంచి శానిటోరియంకు నెమ్మదిగా నడిచివచ్చి కొన్నిగంట లామెతో కాలక్షేపంచేస్తూవచ్చాను. ఎన్నో సంగతులు ఆవిడతో చెప్పాలని వుండేది. కాని నిగ్రహం చూపవలసివచ్చేది. ఒకొ్కక్కప్పుడు పాతస్మృతులనుగురించీ, ఉభయులకూ ఇష్టులైన స్నేహితులను గురించీ కొంచెం చర్చించుకునేవాళ్ళం. వాళ్ళు ముందు ముందు ఏం కానున్నదీ ఆలోచించుకొనేవాళ్ళం. ఆమె జబ్బుస్థితిలో వున్నా ముందు సంగతు లాలోచిస్తూనేవుండేది. ఆమెకండ్లలో తేజస్సు ఎంతమాత్రమూ తగ్గలేదు. ముఖంలో చిరునవ్వు అలాగే ఉంది. ఆమెను చూడడాని కొచ్చిన పాతస్నేహితులు, వా రూహించుకున్నదానికంటె బాగానే వుందని సంతోషపడ్డారు. తేజోవంతమైన ఆ కళ్ళను, ఆ చిరునవ్వును చూచి వారు భ్రమపడేవారు.

ఆకురాలుకాలంలో సాయంసమయమప్పుడు నేను నా మకాం లోని గదిలో కూర్చునేవాడిని. లేకపోతే పొలాలకడ్డుపడో అడవుల లోనో షికారు చేస్తూవుండేవాడిని. అలాంటప్పుడు ఆమె ప్రత్యేకవ్యక్తి త్వాన్ని వ్యక్తపరచే చిత్రపటాలెన్నో వరుసగా నా మనస్సుకు గోచర మయ్యేవి. మా వివాహమై ఇరువైఏండ్లయింది. అయినప్పటికీ నైతిక ఆధ్యాత్మికసంబంధమైన కొత్తవిషయాల నెన్నింటినో తెలుసుకొని ఆశ్చర్యచకితుడనయేవాడిని. నేనామెను అనేకవిధాలుగా ఎరుగుదును. మరీ ఇటీవల ఆమెతత్వాన్ని అవగాహనచేసుకోవడానికి చాలా ప్రయ త్నంచేశాను. అలాటి అవగాహన నేను చేసుకోకపోలేదు. కాని ఆమెను నిజంగా నే నెరుగుదునా లేక నే నామె నర్థంచేసుకున్నానా అనే సంశ యం నాలో నాకే కలుగుతూవచ్చింది. అర్థంచేసుకోలేని గొప్ప విశేష మేదో ఆమెలో ఉండేది. ఆమె చూపులో చూపుకలిపి చూస్తుంటే, ఎవరో కొత్తమనిషి నాకేసి చూస్తోందా అనిపించేది.

చిన్ననాడు బడిలో చదివిన చదువు తప్ప యథావిధిగా పెద్ద విద్యాలయాల్లో ఆమె చదువుకోలేదు. మామూలు విద్యావిధానంలో

ఆమెమనస్సు తయారుకాలేదు. ఆమె మాయింటికొచ్చినప్పుడు అమాయకమైన పిల్లలాగే వచ్చింది. కాని, ఈకాలపు పిల్లలవలె దడబిడలతో ఆర్భాటంతో రాలేదు. ఆమె ఎప్పుడూ చిన్నపిల్లలాగే ఉండేది కాని వయస్సు గడచినకొద్దీ ఆమెకండ్లల్లో గంభీరత, తేజస్సు ఎక్కువయ్యాయి. ఆమెముఖం చూస్తుంటే ప్రశాంతమైన సరస్సులాగుండేది. కాని దాని వెనుక తుఫానుకూడా గోచరమయ్యేది. ఆమె నేటి నవనాగరికపుపిల్లల వంటిది కాదు. వాళ్ళఅలవాట్లు ఆమెకు లేవు. వెకిలితనం అసలే లేదు. కాని నవీనపద్ధతులకు తేలికగానే అలవాటుపడింది. ప్రధానంగా ఆమె భారతనారి. అందులోనూ కాశ్మీరస్త్రీ. ఎంతో మానసం, ఉన్నతి గలిగినది. ఒక్కొక్కప్పుడు చంటిపిల్ల, మరొకప్పుడు వయస్సుమళ్ళిన స్త్రీ. ఒక్కొక్కప్పుడు అవివేకి, మరొకప్పుడు వివేకవంతురాలు. పరాయి వాళ్ళ సమక్షంలోనూ, ఆమెకిష్టంలేని మనుష్యులయెదుట ఎంతో భిడియంగా ఉండేది. బహుముకసరిగా ఉండేది. ఆమె కావ్తలైనవారి దగ్గర పరిచయస్థులదగ్గర ఎంతో ఆనందంగా కేరింతాలుకొడుతూ ఉండేది. ఏవిషయంలోనైనా చటుక్కున ఒక నిర్ణయానికొచ్చేది. ఆ నిర్ణయం ఎల్లప్పుడూ న్యాయం కాకపోవచ్చును. కాని మంచో చెడ్డో మనస్సుకు తట్టి ఒక అభిప్రాయానికొస్తే దానిని వదలిపెట్టేదికాదు. ఆమెకడుపులో దుర్భావాలను దాచుకోవడ మెరుగదు. ఎవరిమీదనైనా తనకిష్టంలేకపోతే తెలిసిపోయేది. దానిని దాచడానికెన్నడూ ప్రయత్నించలేదు. ఆమెవలె సద్భావంతోకూడిన కార్యదీక్షగల మనిషిని మరొకరిని నేను చూడలేదు.

## ౨ వివాహము - తర్వాత

మా వైవాహికజీవితంలోని ప్రథమఘట్టాలను జ్ఞాపకంచేసుకుంటే నా కామెయెడల ఎంతటి ప్రేమ వాత్సల్యాలున్నా ఆమెను మరచినాననే చెప్పాలి. ఆమెకు విధిగా నేనొసంగవలసిన అనేకవిధములైన సహచరభాగ్యాన్ని ఇవ్వలేను. ఏమంటే, నేనాకాలంలో గాలో ధూళో ఆవహించినవాడిలాగున్నాను. ఏవో కలలుగంటూ నేను విశ్వసించిన ధర్మంకోసం నా యావత్తుశక్తిని ధారపోశాను. నాచుట్టూవుండే మనుష్యులు నీడలుమాత్రంగా కనుపించేవారు. నేను పట్టిన పని

కోసమే ఎప్పుడూ కష్టించేవాడిని. ఆ విషయమై మాత్రమే ఆలోచించేవాడిని. మరొకపని చేయటానికి నాకు శక్తి చాలేదికాదు.

అయినప్పటికీ ఆమె నెన్నడూ నేను మరువలేదు. తిరిగి తిరిగి జీవి సుఖమైన విశ్రమస్థానానికి చేరుకున్నట్లే ఆమెదగ్గరకు చేరేవాడిని. నేను చాలా రోజులు పరాయిఊళ్ళల్లో ఉన్నప్పుడు, ఆమెను తలచుకునేటప్పటికి మనశ్శాంతి కలిగేది. త్వరితంగా ఇంటికి చేరుకునేవాడిని. నేను తిరిగితిరిగి అలసటచెంది ఇంటికొచ్చినప్పుడు ఆమె నన్నాదరించి, ఉపచారంచేసి నాకు మానసికంగానూ, శారీరకంగానూ కూడా శక్తిని పూరించియుండకపోతే నే నేమిచేయగలిగేవాడిని?

ఆమె నా కొసంగిన ప్రేమాదరణలను స్వీకరించాను. మొదటి రోజుల్లో తిరిగి ఆమె కేమివ్వగలిగేను? బహుశా నే నా విషయంలో ఏమీ చెయ్యలేదనే అనాలి. అలాంటి అభిప్రాయం ఆమెమనస్సులో ఉండినదేమోకూడా! మానసము, స్వాభిమానము ఆమె కెక్కువగా ఉండేవి. అందుచేతనే న న్నెప్పుడూ ఏవిధమైన సహాయం కోరేదికాదు. బహుశా ఆమె కే సహాయం కావలసినా అందరికంటే ఎక్కువగా చేసేవాడినే. అయినా ఏమీ అడిగేదికాదు. న న్ననుసరించిఉండే ఛాయా మాత్రంగానే కాకుండా, స్వాతంత్ర్యసంగ్రామంలో స్వయంగా పాల్గొనాలని ఆమె అభిలాష. లోకంకోసం, ఆత్మతృప్తికోసంకూడా తాను ప్రత్యేకంగా పాల్గొనాలని అనుకుంది. ప్రపంచంలో అంతకన్నా నాకు సంతోషదాయకమైన విషయం మరొకటి లేదు. కాని నిరంతరం రాచకార్యాలలో నిమగ్నుడనైన నేను ఆమెహృదయంలోని గాఢమైన ఈ కోర్కెను తెలుసుకోలేకపోయాను. తరుచుగా ఖైదులో ఉండడంవల్ల ఆమెదగ్గర ఎక్కువకాలం ఉండలేకపోయాను. అథవా, నేను దగ్గరగా ఉండే సావకాశమొస్తే ఆమెకు జబ్బుచేసేది. రవీంద్రనాథఠాగూరు వచించిన నాటకంలోని 'చిత్ర' పాత్ర చెప్పినట్లుగా ఆమె నాతో మాట్లాడుతున్నట్లుండేది.

'నేను చిత్రను. ఆరాధింపదగిన దేవతను కాను. జాలిపడి నిర్లక్ష్యంగా త్రోసివేయదగిన కీటకాన్నీ కాను. ప్రమాదకరమైన పనుల్లోనూ, సాహసోపేతమైన పనుల్లోనూ, నీతోకూడాఉండి నీ జీవితధర్మ నిర్వహణంలో భాగస్వామినిగా ఉండనిస్తే నా నిజమేమిటో నీకు తెలు

స్తుంది.' కమల ఆ మాటలైతే నోటితో అనలేదు కాని, నెమ్మదిగా ఆమెకండ్లలోనుంచి అట్టి సుదేశాన్ని నేను అందుకోగలిగేను.

1930 సంవత్సరం మొదటిరోజుల్లో ఆమెకోరికను నేను పసికట్ట ...గిగేను. మే ముభయులం కలిసి ఆనాటిఉద్యమంలో పనిచేశాం. ఆ అనుభవంలో ఒక నూతనమైన ఆనందాన్ని పొందేను. కొద్దిరోజులలో రాజకీయాకాశాన్ని కారుమేఘాలు ముట్టేస్తున్నాయి. జాతీయవిప్లవం పొంగులేస్తూ వస్తోంది. ఆ రోజులు మాకు చాలా ఆనందాన్నొసంగిన రోజులు. కాని ఆ సుదినా లెంతకాలమో ఉండలేదు. ఏప్రిల్ నెల ప్రారంభంలోనే దేశవ్యాప్తంగా శాసనోల్లంఘనోద్యమం, దాని ననుసరించి ప్రభుత్వనిర్బంధవిధానం జోరుగా చెలరేగేయి. మళ్ళీ నేను ఖైదులో ప్రవేశించాను.

మగవాళ్ళు చాలామంది కారాగారప్రవేశమయ్యారు. స్త్రీలు ముందుకొొచ్చి స్వాతంత్ర్యోద్యమనిర్వహణకు పూనుకున్నారు. ఇది అపూర్వ సంఘటన. స్వాతంత్ర్యోద్యమాల్లో స్త్రీలు పాల్గొంటూనే వచ్చారు. కాని ఇలా వరదపొంగులా రావడమే విశేషం. ఈ విపరీతమైన పొంగు బ్రిటిష్‌ప్రభుత్వాన్ని, వాళ్ళ మగవారినీకూడా ఆశ్చర్యచకితుల్ని చేసింది. ఉన్నతశ్రేణికిచెందినస్త్రీలు, గడపదాటి ఎరుగని కాంతలు, ధనికవర్గంలోనివారు, రైతుకుటుంబములవారు, కార్మిక కుటుంబములవారు, వారువీరనుభేదం లేకుండా వేలాదిస్త్రీలు ముందుకొచ్చి, ప్రభుత్వమును ధిక్కరించారు; పోలీసులాఠీని ఎదుర్కొన్నారు. వారు చూపించిన సాహసం, ధైర్యం చాలా అద్భుతం. అంతే కాదు, వారు కనుపర్చిన నిర్మాణశక్తి అత్యాశ్చర్యకరం.

నేము నైనీజైలులో ఉండగా భారతనారీమణుల వీరకథనాన్ని విన్నప్పుడు, నాకుకలిగిన ఆనందం, గర్వం జన్మలో మరువజాలను. ఆనందంచేత హృదయముప్పొంగిింది. గ్రుడ్లలో నీరు తిరిగింది. మాటలు రాలేదు.

మా తండ్రిగారు కొద్దిరోజులలో నైనీజైలులో ప్రవేశించారు. మాకు తెలియని విషయాలెన్నో వారు చెప్పేరు. బయట ఆయన శాసనోల్లంఘనోద్యమానికి నాయకుడు. దేశమంతటా స్త్రీలు ఈవిధంగా ముందుకొచ్చి సంఘర్షణలోకిదిగడం ఆయనకిష్టంలేదు. స్త్రీలు, వృద్ధులు

వేసవికాలపు మండుటెండల్లో వీధులవెంట తిరిగి పోలీసులతో పేచీలు పడడం, పాతకాలపువాడవడంచేత ఆయన హర్షించేవాడు కాడు. కాని ప్రజలయొక్క ఉత్సాహధోరణి నాయనకనిపెట్టి ఎవ్వరినీ నిరుత్సాహపరచ లేదు. తనభార్యను, కోడల్ని, కూతుళ్ళను సహితం వద్దనలేదు. దేశ మంతటా స్త్రీలు కనబరచిన శక్తిసామర్థ్యాలను, ధైర్యసాహసాలను గురించి చాలా ఆశ్చర్యంగా మాతో చెప్పేరు. తనఇంట్లోని ఆడపిల్లల విషయంలో ఎంతో ఆప్యాయతతోనూ గర్వంగానూ చెప్పేరు.

నాన్నగారి సూచనప్రకారంగా 1931 సం॥ జనవరి 26 వ తేదీని భారతదేశమంతటా స్వాతంత్ర్యదినవర్ధంతి జరిగింది. బహిరంగసభలలో స్వాతంత్ర్యతీర్మానము పునశ్చరణ చేయబడినది దేశమంతటా పోలీసులు ఈ సభలను నిషేధించి లాటీలతో తుపాకులతో చెదరగొట్టేరు. ఈ ఉద్యమాన్ని నాన్నగారు జబ్బుతో మంచంమీదనుండే నిర్వహించారంటే, నిజంగా అది సంస్థయొక్క నిర్మాణకౌశలమనే అనాలి. ఏమంటే పత్రికలుగాని,పోస్టాఫీసులుగాని, టెలిగ్రాం,టెలిఫోనులనుగాని, ముద్రణాయంత్రాలనుగాని ఉపయోగించుకోడానికి వీలులేని రోజులు. అయినప్పటికీ ఈదేశమంతటా మారుమూలలోని కుగ్రామాలలో సహితం ఒకే రోజున ఒకేగంటకు సభలుజరిగి ఆయా రాష్ట్రభాషలలో స్వాతంత్ర్య తీర్మానం చదివి ఆమోదింపబడింది. ఈ తీర్మానం ఆమోదింపబడిన పది రోజులకు నాన్నగారు స్వర్గస్థులయ్యారు.

స్వాతంత్ర్యతీర్మానం చాలా దీర్ఘమైనది. అందులో స్త్రీలను గురించి ఈవిధంగా ఉదహరింపబడింది.

'మాతృదేశానికి ప్రమాదం వచ్చినప్పుడు భారతస్త్రీలు ఇంట్లోనున్న సుఖాన్నొదిలి, అద్భుతమైన ధైర్యసాహసములతో స్వాతంత్ర్య సంరంభములో దుమికి పురుషులతోపాటు కదంకలిపి, త్యాగాలలోనూ విజయాలలోనూ పాల్గొన్నందుకు వారిని ప్రశంసిస్తూ, వారి సేవకు జోహారు లర్పిస్తున్నాము.'

ఈ ఉత్పాతంలో (పోంగులో) కమల ధైర్యవంతమూ ప్రశంసనీయమూ అయిన పాత్రను ధరించింది. అలహాబాదుపట్టణంలో ఎన్నదగిన కాంగ్రెసుసేవకులంతా జైళ్ళకు పోగా, పట్టణంలో ఉద్యమాన్ని నడిపించేభారం అనుభవంలేని కమలభుజాలమీద పడింది. అనుభవం

లేకపోయినా, ఆ లోపాన్ని గుర్తున్న స్వాతంత్ర్యావేదన, శక్తీ పూరించాయి. కొద్దినెలల్లోనే ఆమెచేసినపనికి అలహాబాదునగరం గర్వపడింది.

మళ్ళీ నాన్నగారిజబ్బులోను, చనిపోయినప్పుడు నేనూ కమల కలుసుకున్నాం. ఒకరినొకరు బాగా అవగాహనచేసుకొని, ఒక సమస్థాయిలో, కొత్తప్రాతిపదికమీద కలుసుకున్నాం. కొన్ని నెలలైన తర్వాత, మొదటిసారిగా అమ్మాయిని వెంటబెట్టుకొని మేముసింహళంలో కొద్దిరోజులపాటు విశ్రాంతితీసుకున్నప్పుడు—అదే ఆఖరుసారి అయింది. కొత్తగా ఒకరి నొకరు బాగా అర్థంచేసుకున్నామా అనిపించింది. ఇన్ని సంవత్సరాలనుంచీ పెంపొందిన మా సహచర్యం ఇప్పుడు కొత్తగానూ ఎక్కువ సన్నిహితంగానూ ఏర్పడిన ఈ అన్యోన్యతకు నాందిమాత్రమే ననిపించింది.

మేమందరం త్వరలోనే ఇంటికొచ్చేశాం. ముందుగా పనిలో పడ్డాను. పిమ్మటమళ్ళీ జైలులోపడ్డాను. ఇక మేముభయులంకలసి విశ్రాంతి తీసుకోవడం కాని, పనిచేయడంకాని, ఆఖరుకు కలసి కాలక్షేపంచేయడం గాని జరుగలేదు. రెండేసి సంవత్సరాల పరిమితిగల రెండు జైలుయాత్రల మధ్య కొద్దిరోజులుమాత్రం కలిసి ఉన్నాం. ఈ రెండవ శిక్షాపరిమితి పూర్తికాకుండానే కమల మరణశయ్యమీద ఉన్నది.

1934 సంవత్సరం ఫిబ్రవరిలో కలకత్తాప్రభుత్వం వారంటుమీద నన్ను అరెస్టుచేశారు. నా బట్టలు సర్దడానికి కమల నాగదిలోకెళ్ళింది. ఆమెదగ్గర శలవు తీసుకోడానికి నేనూ లోపలికెళ్ళాను. అమాంతంగా నన్ను కౌగలించుకొని, స్పృహతప్పి పడిపోయింది. ఆమె ఇలాచేయడం చాలా కొత్తసంగతే. జైలుకెళ్ళడం చాలా మామూలువిషయంగా భావించి సంతోషంగా ఏ హంగామాచేయకుండా ఉండడాని కలవాటు పడ్డాం. బహుశా మామూలు సితిగతుల్లో ఒకరి నొకరు కలుసుకోవడం ఇదే ఆఖరుసారి అని ఆమె కేమైనా స్ఫురించిందేమో!

ఇప్పుడిప్పుడే ఒకరినొకరు బాగా అర్థంచేసుకొని, ఒకరి అవసరం ఇంకొకరి కెక్కువగా కావలసిన సమయంలోనే, రెండేసి సంవత్సరాల కారాగార శిక్షలు రెండు మమ్మల్ని ఎడబాటుచేశాయి. జైల్లో సుదీర్ఘమైన దినాలను గడుపుతున్నప్పుడు ఈ ఆలోచన వస్తూఉండేది. కాని మేముభయులం కలసిఉండేరోజులు తప్పకుండా తిరిగివస్తాయని ఆశిం

చాను. ఇన్ని సంవత్సరాలు ఆమె ఎట్లాకాలంగడిపిందో కదా! నే నూహించగలనుకాని, తెలియడంమాత్రం తెలియదు. జైలులో నన్ను చూడడాని కొచ్చినప్పుడుగాని, మధ్యమధ్య కొద్దికాలంపాటు ఇంట్లో ఉన్నప్పుడుకాని, సాధారణంగా సాయిలా పాయిలాగా జీవితం వెళ్ళబుచ్చుకుంటే ఒకరికొకరేమి బాధకలిగిస్తామో అని ఎవరిమట్టుకు వారు నిగ్రహంతో ఉండేవాళ్ళం. కాని ఆమెకేదో బాధగాఉన్నదని, చాలా విషయాలనుగురించి ఆమెకు మనస్తాపంగా ఉందనీ, ఆమెమనస్సుకు శాంతిలేదనీ మాత్రం స్పష్టంగా తెలుస్తుండేది. నేను దగ్గరుంటే ఆమెకు చాలా సహాయపడగలిగేవాడినే కాని, జైల్లోఉండి చేయగలిగిన దేమీలేదు.

## 3 సంబంధబాంధవ్యాలు

బేడెన్‌వీలర్‌లో ఒంటరిగా గంటలతరబడి కూచున్నప్పుడు ఇలాంటి ఆలోచనలు పరంపరగా వచ్చాయి. జైలువాతావరణంనుంచి అంత తేలిగ్గా తప్పుకోలేకపోయాను. చాలాకాలంగా ఆ వాతావరణానికలవాటుపడిపోయాను. ఈ కొత్తపరిసరాలు నా కంత మార్పుగా కనబడలేదు. నేను నాజీరాజ్యంలో ఉన్నాను. నా కెంతో అహితమైన విపరీతసంఘటనలెన్నో జరిగిపోతున్నాయి. కాని నాజీ నిరంకుశత్వం నా జోలికి రాలేదు. ఆ నల్లడివిలో ఒక మూలనున్న ప్రశాంతమైన గ్రామములో దానిచిహ్నా లేమీ అగుపడలేదు. బహుశా నా మనస్సు ఇతరత్రా నిండుగా ఉండడంచేత దానికి చోటులేకపోయిందేమో! నా గత జీవితమంతా కన్నులకుకట్టినట్లుగా కనుబడుతూ వచ్చింది. ఆ ప్రక్కనే కమల నిలబడుండేది. భారతస్త్రీలకు—స్త్రీలోకానికే—ఆమె చిహ్నమైంది. ఒక్కొక్కప్పుడు మా కత్యంతప్రియమైన భారతభూమినిగురించి, నాకు కలిగిన అభిప్రాయాలతో చిత్రంగా ఆమె కలిసిపోయేది. కమల ఎవరు? ఆమె అంతర్య మేమిటి? నే నామెను తెలుసుకున్నానా? న న్నామె తెలుసుకుందా? నేనుకూడా తేలిగ్గా తెలుసుకోగలిగిన మామూలు మనిషిని కాను. నాలోనూ కొన్ని నిగూఢమైన అగాధములున్నాయి. కొన్ని నాకే అగమ్యంగా ఉంటాయి. అందుచేతనే ఆమె నన్ను చూసి అప్పుడప్పుడు భయపడేదేమో ననుకుంటాను. ఏమంటే

పెళ్ళిచేసుకోడానికి నేను ఎంతమాత్రమూ తగినవాడిని కాను. కమలా నేనూ కొన్నింటిలో చుక్కెదురుగానూ, మరికొన్నింటిలో మమేకంగానూ ఉండేవాళ్ళం. ఒకరి లోపాల నింకొకరు పూరించేవాళ్ళంకాము. . ా ఇద్దరిమధ్య మా బలమే మా పాలిటి బలహీనతగా పరిణమించి... మా ఇద్దరిమనస్సులూ పూర్తియైన ఏకీభావంగాని, పూర్తియైన భిన్నత్వాన్నిగాని పొందలేకపోయినాయి. సంసారపక్షంగా అన్నిటికీ తలూపుతూ మామూలు గృహస్థజీవితంలోని హంగామాను మే ముభయులమూ హర్షించనివాళ్ళమే. భారతదేశపు బజారులలో, నా బొమ్మ కమలబొమ్మ కలిసిఉన్న పటాలను అమ్ముతుంటారు. అందులో ఒకదానిమీద ఆదర్శదంపతులుఅని వ్రాయబడుంది. చాలామంది మమ్మల్ని గురించి అలాగే అనుకుంటారు. కాని ఆ ఆదర్శాన్ని అర్థంచేసుకోవడం, దాని నిముడ్చుకోవడం చాలా కష్టం. అయినా సింహళంలో విశ్రాంతితీసుకుంటున్నప్పుడు మనలో మన కెన్ని అభిప్రాయభేదాలూ, కష్టాలూ ఉన్నా జీవితం మనతో ఎన్ని చెలగాటాలు దోబూచులాడినా, మనం చాలా అదృష్టవంతులమని కమలతో చెప్పినమాట నాకు బాగా జ్ఞాపకం. పెండ్లి చాలా స్వల్పవిషయమనీ, వేలాదిసంవత్సరాల అనుభవంవల్ల కూడా ఆ అభిప్రాయం మార్పుచెందలేదనీ ఆమెతో అన్నాను. పెండ్లిచేసుకుని అన్నివిధాలా పటాపంచలైపోయినవారిని మనకళ్ళతో చూశాం. బంగారంలాంటివాళ్ళు మట్టిఅయిపోవడం చూచాం. ఒక్కొక్కప్పుడు కీచులాడుకున్నా, ఒకరిమీద ఒకరు ఆగ్రహించుకున్నా, మా ఉభయుల ఏకత్వానికే మూలమైన తేజోకణాన్నెప్పుడూ ఆరనివ్వలేదు. అందుచేతనే మన మెంతో అదృష్టవంతులమని కమలతో నేనంటే ఆమె ఔనంది. జీవితం మా ఉభయులకూ కొత్తవిశేషాల నెరుకపరచి ఒకరినొకరు బాగా తెలుసుకునే దివ్యదృష్టిని ప్రసాదించింది. మానవుల మధ్య ఎలాంటి సంబంధం ఉండాలి అనే దొక సమస్య. అది చాలా ప్రధానమైన సమస్య. రాజకీయ ఆర్థిక లావాదేవీలలో ఈ ముఖ్యవిషయాన్ని మనం వదిలేస్తుంటాం. వివేకపూరితమైన పురాతన భారత నాగరికతలోనూ, చైనా నాగరికతలోనూ ఈ సమస్య అలక్ష్యంగా వదలివేయబడలేదు. వాళ్ళు మానవునికి హుందానిచ్చే కొన్ని సాంఘిక మర్యాదలను పెంపొందించారు. వాటిలో లోపాలుంటే ఉండవచ్చును.

కాని, నిస్సందేహంగా వ్యక్తి కొక హుందా నిచ్చాయి. ఆ హుందా నేడు భారతదేశంలో కనుబడదు ఇతరత్రా అనేకవిధాలుగా అభ్యుదయం సాధించిన ఐరోపాలో మాత్రం అదెక్కడుంది? ఒకవేళ అలాంటి హుందా అక్కరలేదని భావించబడుతోందేమో! హుందానూ, అభ్యుదయాన్నీ, పాతకాలపు వివేకాన్నీ, ఈకాలపు శాస్త్రజ్ఞానాన్నీ కలప సాధ్యమనుకుంటాను. అలాంటి కలయిక సాధ్యంకాకపోతే రెంటినీ దగ్ధంచేయడమే శరణ్యమనేస్థితికి వచ్చాం.

## ఆ 1935 సంవత్సరం - క్రిస్తమస్

కమలఆరోగ్యస్థితి కొంచెం బాగుపడింది. అంత పెద్దమార్పు కాకపోయినా గతవారాల్లోపడ్డ ఆత్రతమీద శ్రమమీద బాగా నయమనిపించింది. దేహస్థితి ప్రమాదం గడచి కాస్తంత కుదురులో పడింది. అదే పెద్దవిశేషం ఒక నెలపాటు ఆ స్థితి నిలబాటుగా ఉంది. ఆ సావకాశం చూచుకుని, మా అమ్మాయి ఇందిరతో కలసి ఇంగ్లండు వెళ్ళేను. నే నింగ్లండు వెళ్ళి ఎనిమిది సంవత్సరాలైంది. చాలామంది స్నేహితులు ఒక్కసారి రమ్మనమని బలవంతపెట్టేరు.

ఇంగ్లండునుంచి తిరిగొచ్చాక బేడెన్‌వీలర్‌లో మామూలు కార్యక్రమంలో నే పడ్డాను. శీతకాలం ప్రవేశించింది. ప్రకృతంతా మంచుతో తెల్లబడిపోయింది. క్రిస్టమస్ సమీపించడంతోనే కమల ఆరోగ్యస్థితి మళ్ళీ తిరుగుముఖంపట్టింది. మరల ప్రమాదస్థితిలో పడింది. కొనఊపిరి మాత్రం శరీరాన్నంటిపెట్టుకొని ఉంది. 1935 సం॥ ఆఖరురోజుల్లో ఆమె ఎన్నిరోజులు, ఎన్నిగంటలు బ్రతుకుతుందో తెలియకుండా ఆ మంచులోనూ, బురదలోనూ కాళ్ళీడ్చుకుంటూ తిరిగేను. తెల్లటి మంచుతో కప్పబడిన ప్రశాంతమైన ఆ శీతకాలపు దృశ్యము నాపాలిటి మరణానంతర శాంతిలా కనుబడింది. గతంలో నాకుండిన ధైర్యం, ఆశ అడుగంటినాయి.

కాని, కమల ఈ ఉపద్రవాన్నికూడా ఎదుర్కొని బ్రతికింది. ఆమెకు కొంచెం నయమైంది. ముఖంలో ఆనందం తొణికిసలాడింది. బేడెన్‌వీలరునుంచి తనను మార్చేయమని కోరింది. ఆ స్థలమంటే ఆమెకు విసుగుపుట్టింది. మరొక సంగతేమంటే, అక్కడ చికిత్సపొందుతున్న

ఐరిష్ పిల్లవాడు మరణించాడు. ఆ పిల్లవాడామెకు అప్పుడప్పుడు పువ్వులు పంపుతూ ఉండేవాడు. ఒకటి రెండుసార్లు చూచిపోయాడు కూడా. అతడు కమలకన్న ఆరోగ్యంగానే ఉండేవాడు. కొద్దిగా నడడానికికూడా అతడికి అనుజ్ఞ ఇవ్వబడింది. ఆతని హఠాన్మరణవార్తను ... ములకు తెలియకుండా ఉంచాలని మేము చాలా ప్రయత్నించాం. కాని, మా ప్రయత్నాలు సాగలేదు. జబ్బుగా ఉన్నవాళ్ళు, అందులోనూ శానిటోరియముల్లో చికిత్సపొందే దురదృష్టవంతులకు, వాళ్ళకు తెలియకుండా దాచాలనుకునే అనేకవిషయాలను తెలుసుకొనే ఆరవ ఇంద్రియ మొకటి పుట్టుకొస్తుంది.

జనవరి నెలలో కొద్దిరోజులపాటు ప్యారిస్‌లో ఉన్నాను. అక్కడనుంచి లండన్ వెళ్ళేను. ఏప్రిల్‌లో జరుగబోయే కాంగ్రెస్ మహాసభకు రెండోసారి నన్ను అధ్యక్షునిగా ఎన్నుకున్నట్లు వార్తవచ్చింది. స్నేహితులు ముందుగానే చెప్పిఉన్నారు కనుక, ఆ వార్త వస్తుందనుకుంటూనే ఉన్నాను. కమలను ఆ స్థితిలో వదలివెళ్ళడమా, లేక కాంగ్రెస్ అధ్యక్షపదవికి రాజీనామా ఇవ్వడమా అనే విషమసంధిలో పడ్డాను. ఆమెతోకూడా ఆలోచించాను. అధ్యక్షతకు రాజీనామా ఇవ్వవద్దనే ఆమె అభిమతం. ఆమెఆరోగ్యం కొంచెం బాగుంది. కనుక మళ్ళీ తిరిగిరావచ్చనుకున్నాము. 1936 సంవత్సరం జనవరి ఆఖరున కమలను బేడెన్‌వీలరునుండి స్విడ్జర్‌లాండ్‌లో లాసేన్‌దగ్గర ఒక శానిటోరియంకు మార్చేశాం.

## 8 మరణం

స్విడ్జర్‌లాండుకు మారడం నాకు, కమలకూ ఇష్టంగానే ఉంది. ఆమె కాస్తంత సంతోషంగా ఉంది. స్విడ్జర్‌లాండులో ఆ ప్రాంతం నేను బాగా ఎరుగున్నదవడంచేత నాకూ బాగానే ఉంది. ఆమె ఆరోగ్యస్థితిలో అంతగా మార్పేమీ కనుబడలేదు. వెంటనే ఏమీ ప్రమాదం కూడా ఉన్నట్లు తోచలేదు కొంతకాలంపాటు అలాగే ఉంటుందనుకున్నాను. నెమ్మదిగా కొంచెం ఆరోగ్యం కుదుటబడవచ్చనికూడా అనుకున్నాను.

ఇలాఉండగా, భారతదేశంనుంచి వెంటనే రావలసినదంటూ మిత్రులు తొందరచేస్తూవచ్చారు. నా మనస్సులోకూడా నిలకడలేని ఆవేదన బయలుదేరింది. దేశంసంగతే ఎప్పుడూ ఆలోచిస్తూ వచ్చాను. కొన్నిసంవత్సరాలుగా ఖైదులో ఉండడంచేత, తదితరకారణాలచే ప్రజాహితకార్యాల్లో పాల్గొనడానికి వీలు చిక్కలేదు. నన్ను బంధిస్తున్న బంధనాలను తెగగొట్టుకోవాలని గిజగిజలాడేను. లండన్, పారిస్ పట్టణాలకు వెళ్ళడంవల్లను, భారతదేశంనుంచి వచ్చే వార్తల వల్లను ఒకసారి బయటికొచ్చాక మళ్ళీ వెనుకకు పోలేకపోయాను.

ఈ విషయాన్ని కమలతో చర్చించి డాక్టరుగారితో సంప్రదించాను. నేను భారతదేశానికి పోవాలనే వారుభయులూ నిశ్చయం చేశారు. డచ్‌వారి కె. యల్. యం. విమానంలో చోటుకూడా ఏర్పాటుచేసుకున్నాను. ఫిబ్రవరి 28 వ తేదీని నేను లాసేన్‌లో బయలుదేరుటకు ముహూర్తం పెట్టుకున్నాం. ఇన్నియేర్పాట్లు అయినాక నేను తనను వదలిపెట్టివెళ్ళడం కమలకు ఎంతమాత్రం హితవుగా లేదని నాకు స్పష్టంగా తెలిసింది. అయినా ఆమెమాత్రం తనంతగా నా ప్రయాణాన్ని ఆపమని అడుగలేదు. నేను ఇండియాలో చాలాకాలం ఉండననీ, రెండుమూడు నెలలలో తిరిగి వచ్చేస్తాననీ ఆమెతో చెప్పాను. కావాలంటే అంతకన్న ముందుగా కూడా వచ్చేస్తానన్నాను. ఒక్క టెలిగ్రాంతో వారంతిరగకుండా విమానంలో ఆమెదగ్గరుంటానన్నాను.

నేను బయలుదేరవలసినరోజు నాలుగైదునాళ్ళుంది. దగ్గరనేఉన్న 'బెక్స్'లో ఇందిర చదువుకుంటోంది. కడసారిగా మాతో ఉండడానికి ఆమెకూడా వచ్చింది. నా ప్రయాణం ఒక వారం పదిరోజులు ఆపుచేయమని డాక్టరు సూచించాడు. అంతకుమించి ఆయనేమీ చెప్పలేదు. నేను వెంటనే అంగీకరించి మళ్ళవారం వెళ్ళే డచ్‌విమానంలో చోటు రిజర్వుచేసుకున్నాను.

ఆఖరురోజులు ఇలా గడచినకొద్దీ, కమల ఆరోగ్యస్థితిలో కనుపించీ కనుపించకుండా ఉండేమార్పు వచ్చినట్లుతోచింది. ఆమె దేహస్థితి అంతగా మార్పులేకుండా అలాగేఉన్నది. కాని మనస్సుయొక్క ప్రవృత్తి బాగా మారినట్లు కనుబడింది. తన్నెవరో పిలుస్తున్నారనీ, ఎవ్వరో తనగదిలో ప్రవేశిస్తున్నట్లూ చెప్పేది. కాని ఎవ్వరూ ఉండేవారుకాదు.

ఫిబ్రవరి 28వ తేదీ ఉదయం కమల కన్ను మూసేసింది. ఇందిర దగ్గరనే ఉంది. ఇన్ని నెలలనుంచీ మాతోటే ఉండి ఎంతో విశ్వాసపాత్రుడుగా నుండిన డాక్టర్ అటాల్ కూడా దగ్గరే ఉన్నాడు.

దగ్గరగానున్న స్విడ్జర్లాండుపట్టణాల్లో ఉన్న స్నేహితులు కొద్దిమంది వచ్చారు. లాసేన్‌లోని స్మశానానికి ఆమెను తీసుకెళ్ళేం. నిరంతరం చిరునవ్వుతో కళకళలాడే ఆ ముఖం సుందరమైన ఆ శరీరం కొద్ది నిముషాల్లో భస్మమైపోయింది. ఎంతో శక్తితోనూ, తేజస్సుతోనూ, జీవంతోనూ నిండిన ఆ శరీరంతాలూకు భస్మం ఒక చిన్న పాత్రలో ఇమిడింది.

## ముస్సోలినీ

లాసేన్‌లోనూ యూరపులోను నన్ను బంధించిన బంధం తెగిపోయింది. నా కక్కడుండవలసినపనేమీ లేదు. ఆ బంధంతోపాటు నా హృదయంలోని బంధంకూడా ఒకటి తెగిపోయింది. ఆ సంగతి నాకు మెల్లగానే తెలిసింది. ఏమంటే అవి నాకు చాలా దుర్దినాలు. నామనసు సరిగా పనిచేయలేదు. నేను, ఇందిర కొన్నిరోజులు ప్రశాంతంగా గడపాలని మాంట్రెక్సుకు పోయాం.

నేను మాంట్రెక్సులో ఉండగా లాసేన్‌లోని ఇటలీ ప్రభుత్వప్రతినిధి నన్ను కలుసుకొని, నాకు కలిగిన వియోగానికి సీనార్ ముస్సోలినీ గాఢసంతాపాన్ని తెలియచేశాడు. నే నెప్పుడూ ముసోలినీని చూచి ఉండలేదు. ఇతరమైన సంబంధాలుకూడా లేవు. అందుచేత ఆయన కనబరచిన సానుభూతికి నాకు కొంచెం ఆశ్చర్యం కలిగింది. నా కృతజ్ఞతను తెలియపరచవలసినదిగా కాన్సలును కోరేను.

అంతకుముందే కొన్ని వారాలక్రిందట ముస్సోలిని నన్ను చూడవలెనని కుతూహలపడుతున్నట్లు ఒక స్నేహితుడు వ్రాశాడు. నేను రోమ్ నగరంరావడం అసంభవమని తెలియచేశాను. తర్వాత నేను ఇండియాకు వెళ్ళిపోవాలనుకునే సమయానికి ఈ సందేశం మళ్ళీ వచ్చింది. ఈసారి ఇంకా ఎక్కువ ఆత్రం, పట్టుదల కనిపించాయి. ఆయనను కలవడం నాకు ఇష్టంలేదు. కాని నేను ఆమాట బేమర్యాదగా చెప్పదలచుకోలేదు. మామూలుగా, ఆయనను చూడకూడదనే అభిప్రాయాన్ని మార్చు

కునేవాడినే. ఏమంటే ఆ ముస్సోలినీ ఎలావుంటాడో చూడాలనే సరదా నాకు లేకపోలేదు. కాని అప్పట్లో అబిసీనియామీద దురాక్రమణ, దురంతాలు జరుగుతున్నప్పుడు, నేనాయనను కలుసుకుంటే అనేక విధాలైన ఊహాగానాలు బయలుదేరేవి. ఫాసిస్టుప్రచారకులు దానిని గోరంతలు కొండంతలుగా చేసిఉండేవారు. నేనెంత కాదన్నా ప్రయోజనం ఉండేదికాదు. ఇటలీకి వెళ్ళిన భారతీయ విద్యార్థులు తదితరులుకూడా వారిఅనుజ్ఞ లేకుండా వారికి తెలియకుండా కూడా ఫాసిస్టుప్రచారానికి వినియోగించబడిన సంగతి నాకు తెలుసును. 1931 సం॥ రంలో ఒక ఇటాలియన్ పత్రిక గాంధీజీతో మాట్లాడినట్లు ప్రకటించిన సర్వాబద్ధపు ఇంటర్వ్యూ సంగతి తెలిసిందే.

నా స్నేహితునికి, నేను ముస్సోలినీని కలియడానికి వీలులేదని వ్రాసేశాను. ఏవిధమైన అపార్థాలకూ సావకాశంలేకుండా టెలిఫోన్ కూడా చేశాను. ఇదంతా కమల బ్రతికున్నప్పుడే జరిగింది. ఆమెమరణానంతరం, ఇతరకారణాలమూలాన్నూ, నేను ఎవరితోనూ మాట్లాడే స్థితిలో లేనని మరొకసారి కబురు అందచేశాను.

నేనీ విషయమై ఇంతకుముందు జాగ్రత్తపడడానికి కారణం లేకపోలేదు. డచ్చివిమానం రోమ్‌నగరంమీదుగా పోతుంది. అక్కడ ఒక సాయంకాలమూ, ఒకరాత్రీ గడపక తప్పదు.

మాంట్రెక్సులో కొద్దిరోజులున్నాక నేను జినీవా చేరి అక్కడనుంచి మార్సెల్సుకు వచ్చాను. అక్కడ కె. యల్. యం. విమానం ఎక్కాను. సాయంకాలం కొంచెం ఆలస్యంగానే విమానం రోమ్‌నగరం చేరింది. విమానాశ్రయందగ్గరే సీనార్ ముస్సోలినీతాలూకు ఉన్నతోద్యోగి నాకొక ఉత్తరాన్ని అందచేశాడు. ముస్సోలినీ నన్ను చూడటానికి చాలా కుతూహలపడుతున్నాడనీ, 6 గంటలకు సమావేశం ఏర్పాటుచేయబడిందనీ ఆ ఉత్తరంలోని సారాంశం. నేను ఆశ్చర్యపడి ఇదివరలో నేను పంపిన కబుర్లసంగతి జ్ఞాపకంచేశాను. ఏర్పాట్లన్నీ జరిగిపోయాయనీ, ఇపుడు మార్చడానికి వీలులేదనీ ఆ ఉద్యోగి అన్నాడు. అంతేకాదు, ఈ సమావేశం జరుగకపోతే అతని ఉద్యోగంకూడా పోతుందన్నాడు. ఈ సమావేశంసంగతి ఎంతమాత్రం పత్రికలలో పడదనీ,

ముస్సోలినీని కొద్దినిముషాలపాటు దర్శనంచేస్తే చాలసి ఒక్కసారి కరచాలనంచేసి, నాభార్య మరణించినందు. సానుభూతి తెలియచేయాలనిమాత్రమే ముస్సోలినీ కుటు తున్నాడని ఆ ఉద్యోగి ఎంతో బలవంతంచేశాడు. ఒక్క గంట యులము బహు మర్యాదగా తర్కించుకున్నాం. ఉభయులమూ శ్రమపడ్డాం. సమావేశకాలం దగ్గరకొచ్చింది. చివరకు నామాటే చెల్లి నేను ఆయనను కలియడానికి వీలులేదని ముస్సోలినీకి టెలిఫోనులో కబురుచేశాం. ఆ సాయంకాలమే ముస్సోలినీ కొక ఉత్తరం పంపేను. ఆయన దయతో పంపిన ఆహ్వానాన్ని అంగీకరించడానికి సావకాశం లేనందుకు చింతిస్తూ ఆయన పంపిన సానుభూతిసందేశానికి కృతజ్ఞత తెలియచేశాను.

నా ప్రయాణం సాగింది. కెయిరోలో కొందరు పాతస్నేహితులు కలిశారు. తర్వాత పశ్చిమాసియా ఎడారులమీదనుంచి విమానం పోతుంది. ప్రయాణసన్నాహాలలో అంతవరకూ నామనస్సు లగ్నమై ఉంది. కెయిరోగడచి తూర్పుగా విమానం ఎడారులమీదనుంచీ ఎగిరి పోతూఉంటే, ఒక్కసారి నా ఒంటరితనం భయంకరంగా వేధించింది. ప్రపంచం శూన్యంగానూ నిరుపయోగంగానూ తోచింది. నేను ఒంట రిగా ఇంటికి తిరిగొస్తున్నాను. కాని ఆ యిల్లు ఇక నాయిల్లు కాదు. అక్కడే నాప్రక్కన ఒకబుట్టలో చితాభస్మపాత్ర ఉన్నది. కమలపేరు చెప్పి మిగిలినది ఆ భస్మం. మేముకన్న మధురస్వప్నాలన్నీ హతమై పోయి, వాటితోపాటే భస్మమైపోయాయి. ఆమె ఇక లేదు. కమల లేదు లేదు. ఈ మాటలే నా మనస్సులో పదేపదే ధ్వనించాయి.

నా స్వీయచరిత్రసంగతి జ్ఞప్తికొచ్చింది. ఆమె భోవాలీ శాని టోరియంలో చికిత్సపొందుతున్నప్పుడు, ఆమెతో నా జీవితచరిత్రను గ్రంథస్థంచేయడం గురించి సంప్రదిస్తూ ఉండేవాడిని. నేను వ్రాస్తున్న ప్పుడు ఒకటి రెండు అధ్యాయాలు ఆమెకు చదివి వినిపించేవాడిని. ఆమె కొంతభాగమే చూచింది. కొంతభాగమే విన్నది. మిగిలినభాగము ఆమె చూడదు. జీవితగ్రంథంలో మిగిలిన అధ్యాయాలను మే ముభ యులము కలసి వ్రాయలేము.

ద్రాదు చేరడంతోనే నా స్వీయచరిత్రను ప్రకటిస్తున్న
రణకర్తలకు 'స్వర్గస్తురాలైన కమలకు' అంకితం చేస్తూ
పంపేను.

కరాచీ చేరేను. జనసమూహం, పాతస్నేహితులు కనుబడ్డారు.
క్కడ నుంచి అలహాబాదు చేరి, అమూల్యమైన కమలచితాభస్మాన్ని
మహావేగంతో ప్రవహిస్తున్న గంగమ్మగర్భంలో కలిపేశాం. మన
పూర్వీకు లెందరిచితాభస్మాన్ని ఆ తల్లి సముద్రానికి చేరవేసిందో
ఎవరి కెరుక! మన తరువాతవారెందరో గంగలో కలసి తమ అంతిమ
ప్రయాణం చేయవలసిఉందో!

# అన్వేషణ

## గతచరిత్ర

నాకు కొంచెం ప్రాజ్ఞతవచ్చి స్వబుద్ధితో ఆలోచించడం మొదలు పెట్టినప్పటినుండీ, ఎప్పుడూ భారతదేశాన్నిగురించే ఆలోచిస్తుండేవాడిని. భారతదేశాన్ని సరిగా అర్థంచేసుకోవాలనే నా ప్రయత్నం. నా చిన్న తనాన్ని స్మరణకుతెచ్చుకొని అప్పట్లో భారతదేశాన్నిగురించి నా మనస్సులో ఉండిన అభిప్రాయాలను స్మరణకుతెచ్చుకుంటూ ఉంటాను. కొత్తపాతల మేలుకలయికతో నెమ్మదిగా మారుతున్న ఈ దేశాన్ని గురించి ఆలోచించకుండా ఉండడం ఎల్లాగు? భారతదేశంయొక్క గమనము ఒక్కొక్కప్పుడు నాకు సంతృప్తికలిగిస్తుంది. మరొకప్పుడు సిగ్గును విషాదాన్ని కలిగిస్తుంది. నాచుట్టూ అగుపడే మూఢవిశ్వాసాలు ఆచారాలు, అర్థంలేని అభిప్రాయాలు, అన్నిటికన్న మన రాజకీయదాస్యం, నికృష్టమైన దారిద్ర్యం చూస్తే నాకు సిగ్గేస్తుండేది.

నేను పెద్దవాడినై, భారతస్వాతంత్ర్య కార్యకలాపాలలో నిమగ్నుడనైన పిమ్మట, హిందూదేశాన్ని గురించిన ఆలోచనతప్ప మరొక ఆలోచనే లేదు. నన్నింతగా ఆవహించి, లీలామాత్రంగా కనుబడే ఒక లక్ష్యసిద్ధికి ఇంతతీవ్రంగా నిరంతరం నన్ను కార్యాచరణకు పురిగొల్పుతున్న ఈ భారతదేశ మేమిటి? బహుశా వ్యక్తిగతమైన మానసంవల్ల జాతీయగర్వంవల్ల ఇలాంటి కోరిక నాలో ముందుగా పుట్టిందనుకుంటాను. ఒక జాతి మరొక జాతిమీద అధికారం చేయదలచుకున్నప్పుడు దానిని ప్రతిఘటించి, స్వేచ్ఛాజీవితాన్ని కాంక్షించడం ప్రపంచంలోని మానవులందరికీ సహజమే. మహత్తరమైన పురాసంస్కృతిగల భారతదేశము, శృంఖలాబద్ధమై ఎక్కడో దూరముగానున్న చిన్న దీవికి దాస్యంచేయడం చాలా దుర్మార్గమనిపించింది. ఆ నిరంకుశరాజ్యపాలన వలన భారతదేశం దరిద్రస్థితికొచ్చి నికృష్టమైన పతనంపొందడం అంతకన్న దుర్మార్గమనిపించింది. నేనూ, నాలాంటి ఇతరులు స్వాతంత్ర్యసంరంభంలో దూకడానికి ఇంతకంటె బలమైన కారణం ఏమి కావాలి?

కాని, నాలోనాకు కలిగిన సంశయాలకు ఈ సమాధానం చాల లేదు. భౌతికంగానూ, భౌగోళికంగానూ ప్రత్యక్షమవుతున్న ఈ హిందూ దేశంకాక ఇంకేమైనా ఉన్నదా? దీని గతచరిత్ర ఏమిటి? అప్పు డామె కున్న బలమేమిటి? ఆ శక్తి నామె ఎట్లా పోగొట్టుకుంది? ఈ దేశం కేవలం కొన్నికోట్లజనానికి ఆశ్రయమేనా? లేక ఇంకా కొంత శక్తి వంతంగా ఉన్నదా? ఈ నవప్రపంచంలో ఆమె ఇముడగలదా?

విశాలమైన అంతర్జాతీయదృక్పథం నాలో కలుగడానికి కారణం వుంది. ఆలోచించినకొద్దీ మన దేశం ఎవ్వరితోనూ అంటీ ముట్టకుండా ఉండడం అసాధ్యమనిపిస్తుంది. మంచిదికాదు కూడాను. ఇతర దేశా లతో రాజకీయంగానూ, ఆర్థికంగానూ, విజ్ఞానాత్మకంగానూ బాగా సన్నిహితంగా ఉండే భారతదేశాన్నే నేను సాక్షాత్కారంచేసుకో గలుగుతున్నాను. భవిష్యత్తుకు ముందు వర్తమానం, దానికిపూర్వం అనేక తికమకలతో కూడిన గతం ఉంది. దానిని అవగాహనచేసుకో వడానికే నేను వెనుకకుచూచాను. భారతదేశం నా రక్తంలో ఉంది. ఆ పేరు తలుచుకుంటే అప్రయత్నంగా నా శరీరం గగుర్పొడుస్తుంది. అయినప్పటికీ, భారతదేశాన్ని అవగాహనచేసుకొనేటప్పుడు ఏవిధమైన మమకారం లేకుండా పరాయి విమర్శకునిధోరణిలోనే ఆలోచిస్తుం టాను. నేడు జరుగుతున్న విషయాలను విమర్శిస్తాను. నేను చూచిన పాతకాలపు అనాచారాలను ఖండించాను. నేను కొంతవరకు పాశ్చాత్య దృష్టితో, అందులోను సస్నేహమైన పాశ్చాత్యదృష్టితోనే భారత భూమిని పరిశీలించాను. దాని దృక్పథాన్ని, స్వరూపాన్ని మార్చి ఒక నవ్యత్వాన్ని కలిగించడానికి చాలా ఆత్రపడ్డాను. కాని నాలో నాకే ఎన్నో సంశయాలు కలిగేయి. భారతదేశపు పాత సాంప్రదాయాలను రద్దుచేయదలచుకున్న నాకు భారతదేశమంటే ఏమిటో తెలుసునా? మన దేశంలో తుడిచిపెట్టవలసిన దెంతో ఉంది. తుడిచేసితీరాలి. కాని ఆ సంస్కృతి, సాంప్రదాయాల్లో ఏదో మహత్తరమైన, సజీవమైన శక్తి లేకపోతే, వేలాది సంవత్సరాలుగా నాగరికప్రపంచంలో భారత దేశం ఉత్కృష్టస్థానాన్ని అలంకరించి ఉండిఉండదు. ఆ మహత్తేమిటి?

పశ్చిమోత్తర ప్రాంతంలోని సింధులోయలో మహెంజొదారో కొండమీద ఒకసారి నిలబడి చూచాను. 5 వేల ఏండ్లక్రితం నిర్మాణం

చేయబడిన ఇళ్ళు వీధులుగల పురాతనపట్టణం కనుబడింది. అప్పటికే ఆ నాగరికత బాగా పురాతనమైనది. పరిపూర్ణంగా వికసించిందికూడా. సింధులోయలోని సంస్కృతి, వేలాది సంవత్సరములు మానవుడుచేసిన ...షిఫలితమనీ, అదిప్పటివరకూ అలాగే నిలబడుండనీ, అది పరిపూర్ణంగా భారతీయసాంప్రదాయానుగుణ్యమనీ, నవభారతనాగరికతకు కూడా అదే పునాది అనీ ప్రొఫెసర్ చైడ్ వ్రాశాడు. ఏ సంస్కృతైనా నాగరికతైనా 5, 6 వేల ఏండ్లకుపైగా ఈరీతిగా సజీవంగా ఉండడమనేది చాలా ఆశ్చర్యకరమైన విషయం. ఏదో కదలకుండా ఉండడంకూడా కాదు. ఎన్నో నాగరికతలతో పొత్తు కలుపుకుంటూ మార్పులు చెందుతూ ఈవిధంగా సహజత్వాన్ని పోగొట్టుకోకుండా ఉండడం గొప్ప విశేషం. పర్షియా, ఈజిప్టు, గ్రీసు, చైనా, అరేబియా, మధ్య ఆసియా, మధ్యధరాసముద్రదేశాల ప్రజలతో భారతదేశానికి సన్నిహితమైన సంబంధబాంధవ్యా లుండేవి. భారతదేశం తన ప్రభావాన్ని ఇతరదేశాలమీాద ప్రసరింపచేసింది. ఇతరదేశాలప్రభావంకూడా ఇండియామీాద ప్రసరించింది. కాని భారతదేశపు సాంస్కృతికపునాదులు చాలా గట్టివవడంచేత పై ప్రభావా లెన్ని ప్రసరించినా, అవి చలించ లేదు. అన్ని తాకిడులను తట్టుకోగలిగింది. ఈ బలంయొక్క ఆంతర్యమేమిటి? దేనివల్ల ఆ పునాదుల కీ బలం చేకూరింది?

భారతదేశచరిత్ర చదివేను. అనంతమైన పురాణసాహిత్యాన్ని కొంతవరకు చవిచూచాను. అందులోని భాషాపటుత్వం, భావనాశక్తి వాటి రచయితల ధీశక్తి న న్నెంతో ముగ్ధుణ్ణి చేశాయి. చైనానుంచీ, మధ్య ఆసియానుంచీ, పశ్చిమఆసియానుంచీ ఏనాడో ఈ దేశానికొచ్చి చాలాకాలం సంచారంచేసి తమ అనుభవాలన్నింటినీ గ్రంథస్థంచేసినమహనీయులతోపాటు భారతదేశమంతా తిరిగేను.తూర్పుఆసియాలో అంగోర్, బరోబుదూర్ వగైరా అనేకచోట్ల భారతీయులు సాధించిన విశేషాలను మననంచేసుకున్నాను. మన పురాణాలలోనూ, మనఇతిహాసాల్లోనూ, మన సాహిత్యంలోనూ ఎన్నోవిధాలుగా చిత్రింపబడి ప్రశంసింపబడిన హిమాలయపర్వతాలలో సంచారంచేశాను. పర్వతాలంటే నాకుండే ప్రీతి, కాశ్మీర్‌తో నా కున్న బాంధవ్యంవల్లకూడా నేను హిమాలయసంచారంచేశాను. అక్కడ నేటి జీవితంయొక్క శక్తిని, జీవాన్ని,అం

దాన్ని చూచాను. అంతకంటె కూడా యుగయుగాలుగా అక్కడుండిన సౌందర్యాన్ని కూడా ఆనందించగలిగేను. ఆ మహాపర్వతాలలో ఉద్భవించి మన మైదానాలలో ప్రవహిస్తున్న మహానదులు నన్నాకర్షించాయి. మన చరిత్రలోని ఎన్నో ఘట్టాలను జ్ఞప్తికి తెచ్చాయి. మన దేశం హిందూ దేశమని పిలువబడడానికి కారణమైన సింధునదిని చూచాను. వేల కొలది సంవత్సరాలుగా ఆ మహానదిని దాటి ఎన్నో తెగలు, జాతులు, సైన్యాలు మన దేశాని కొచ్చాయి. ఇటీవలిచరిత్రలో కనుబడకపోయినా, పాతచరిత్రలో ప్రముఖస్థానము వహించిన బ్రహ్మపుత్రానదిని చూచాను. ఈశాన్యపర్వతపంక్తిని గుండెల్లో ఛేదించుకుంటూ కొండలమధ్య అడవులమధ్య గంభీరంగా ప్రవహిస్తోంది. నృత్యం, గానం, ఆటపాటలతోసహా అనేక మధురగాథలకు నిలయమైన యమునానదిని సందర్శించాను. అన్నిటికన్న మిన్నయైనది గంగానది. చరిత్ర ఎరిగినప్పటినుంచి నేటివరకూ లక్షలాదిప్రజలను ఆకర్షించి, భారతీయ హృదయాలను బంధించిన మహాతల్లి, గంగావతరణస్థానందగ్గరనుంచి సముద్రుని కౌగిలించుకొనేవరకూ పురాణకాలంనుంచి నేటివరకూ భారతసంస్కృతిచరిత్రే అనాలి. అక్కడే ఎన్నో సామ్రాజ్యాలు లేచాయి. అంతర్ధానమైపోయాయి. మహానగరాలు వెలసినాయి. మానవుడు చేసిన సాహసకృత్యాలెన్నో అక్కడే జరిగాయి. భారత దేశంలోని మహామేధావులైన ఋషులకు, మునులకు అదే నిలయం. భోగత్యాగాలకూ, నిమ్నోన్నతాలకూ, అభివృద్ధినాశాలకూ జీవన్మరణాలకూ అన్నిటికీ గంగమ్మచరిత్రయే చరిత్ర. అలాంటి గంగాదేవిని సాక్షాత్కారంచేసుకున్నాను.

అజంతా, ఎల్లోరా, ఎలిఫెంటా గుహాలలో రకరకములైన పూర్వశిల్పాలను, శిథిలాలును, విగ్రహాలను, రంగులచిత్రాలను చూచాను. ఢిల్లీ, ఆగ్రాపట్టణములలోని అందమైన భవనాలను కూడా చూచాను. అవి ఇటీవలి యుగానికి చెందినవి. వాటిలోని ప్రతి రాయి భారత దేశచరిత్రను చెపుతున్నట్లుంటుంది.

నా స్వస్థలమైన అలహాబాదులోను, హరిద్వారంలోనూ జరుగుతూఉండే కుంభమేళావంటి పుష్కరమహోత్సవాలకు పోతూఉండేవాడిని. అక్కడ వేలాది సంవత్సరములుగా లక్షలాది ప్రజలు ఇండియా

లోని అన్నిరాష్ట్రాలనుంచీ వచ్చి గంగలో మునగడం చూచాను. 1300 సంవత్సరాలక్రితం చైనానుండి వచ్చిన యాత్రికులు, తదితరులు ఈ ఉత్సవాలను వర్ణిస్తూ వ్రాసిన వ్రాతలు నేను చదివేను. అప్పటికే ఆ వే లు చాలా ఏండ్లనుంచి జరుగుతున్నాయనీ, అవెప్పుడు ప్రారంభ మయ్యాయో ఎవరికీ తెలియదనీ వ్రాశారు. కొన్నివందలూ, వేలూ తరాలుగా ఇంతమంది భారతీయుల నీవిధంగా గంగ ఆకర్షిస్తున్నదంటే ఆ విశ్వాసం చాలా అద్భుతమనే చెప్పాలి.

నేను చదివిన చరిత్రకు అనుగుణ్యంగా, నే చేసిన సంచారాల వల్ల భారత దేశచరిత్రలోని అపూర్వాంశము లెన్నిటినో గ్రహించగలి గేను. బుద్ధిబలంవల్ల సంపాదించుకున్న జ్ఞానానికి, ఉత్సాహపూరితమైన అనుభవంకూడా తోడైంది. నా మనస్సులో చిత్రించుకున్న భారత దేశ పటానికి మెల్లగా ఒకస్వరూపం ఏర్పడింది. నా తాతముత్తాతలదైన యీ భారతభూమిలో అసంఖ్యాకంగా జనం బయలు దేరేరు. అందులో కొందరు నవ్వేవాళ్ళు; మరికొందరు ఏడ్చేవాళ్ళు; కొందరు ప్రేమించే వాళ్ళు; మరికొందరు బాధపడేవాళ్లు. వారిలో కొందరు జీవితాన్ని కూలంకషంగా ఎరిగినవారు. వారి అపూర్వ బుద్ధివిశేషంవల్లనే వేలాది సంవత్సరాలైనా చెక్కుచెదరకుండా ఉండిన, ఒక మహా సంస్కృతిని నిర్మాణంచేశారు. ఇలాంటి మహనీయులు సాధించిన ఘనకార్యాల చిత్రాలెన్నో నా మనోనేత్రంఎదుట తాండవించేవి. ఏ యాత్రాస్థలాన్ని చూచినా, దానికి సంబంధించిన మహాపురుషులు నాకు సాక్షాత్కరించే వాళ్ళు. కాశీకి దగ్గరగా ఉన్న సారనాథ్ బౌద్ధక్షేత్రంలో బుద్ధుడు తన ప్రథమ సందేశాన్ని వినిపిస్తున్నట్లే నా కగుపడేది. ఇప్పటికి దాదాపు 2500 సంవత్సరాలైనా, ఆయన అమూల్య సందేశం నా చెవుల్లో గిం గురుమన్నది. అశోకుని రాతిస్తంభాలు, వాటిమీదనున్న శాసనాలు, చక్రవర్తుల్లో చక్రవర్తియైన ఒక మహాపురుషుని గురించి నాతో మాట్లా డుతున్నట్లుండేవి. ఫతేపూర్‌సిక్రీదగ్గర అక్బర్ తన సామ్రాజ్యానంతనూ మరచి, వివిధ మతాచార్యులతో చర్చలు, గోష్ఠులు సాగిస్తూ మాన వుని అనంతసమస్యలకు పరిష్కారమార్గముల నాలోచిస్తున్నట్లు కన్ను బడ్డాడు.

ఈరీతిగా భారత ఇతిహాసంలోని అనేక ఘట్టాలు, నిమ్నోన్నతాలు, జయాపజయాలు, అన్నీ రంగులచిత్రాలులాగున నా కగుపడ్డాయి. అయిదువేల సంవత్సరాలచరిత్ర, సంస్కృతి, సాంప్రదాయం తెంపులేకుండాఉండడం చాలా గొప్పమాట. ఒక్క చైనాకుమాత్రమే అలాంటి తెంపులేని సంస్కృతి ఉందని చెప్పవచ్చు. అంతటి మహోన్నతమైన, సుందరమైన భారతసంస్కృతి నేటి దౌర్భాగ్యస్థితిలో ఏమ్మయిపోయింది. అంతటి గొప్పదేశం బ్రిటన్‌కు తోకగా దాస్యంలో ఉన్నది. ప్రపంచమంతా సర్వనాశనహేతువైన యుద్ధం చెలరేగి మానవులను పశువులుగా చేసేస్తోంది. కాని 5 వేల ఏండ్లనాటి ఆ దృశ్యాలు నాకొక కొత్త దృక్పథాన్నిచ్చాయి. అందువల్ల వర్తమాన స్థితిగతులంత భారంగా కనబడుటలేదు. బ్రిటిష్‌పరిపాలన 180 సంవత్సరాలూ, సుదీర్ఘమైన భారత ఇతిహాసంలో ఒక చిన్న విషాదఘట్టం మాత్రమే. భారతదేశం మళ్ళీ తన తొల్లిటి ఔన్నత్యాన్ని పొందితీరుతుంది. అప్పుడే విషాదఘట్టంలో తుది అధ్యాయాని కొచ్చేశాం. ప్రపంచంకూడా ఈనాటి ఘోరపరిస్థితులను గడచి, కొత్త పునాదులమీద నిర్మింపబడుతుంది.

## ౨ జాతీయత - అంతర్జాతీయత

భారతదేశాన్నిగురించి ఆలోచించుకున్నప్పుడల్లా కాస్తంత హద్దుపద్దుల్లో నా కొక ఆవేశం కలుగుతుంది. దాని స్వరూపమే జాతీయత. చాలామందిలో ఆ హద్దుపద్దులు ఉండవు. మా కాలంలోని ఇండియాకు జాతీయత తప్ప మరొక శరణ్యం లేదు. అదొక సహజమైన, సబబైన పరిణామం. దాస్యంలో ఉన్న ఏదేశమైనా ముందుగా జాతీయస్వాతంత్ర్యాన్ని పొందాలని తహతహపడడమే న్యాయం. అందులోనూ, ఘనమైన వ్యక్తిత్వమూ, విశిష్టమైన పూర్వసాంప్రదాయాలూ గల భారతదేశం ఆవిధంగా ఆవేదనపడడం మరీ న్యాయం. అంతర్జాతీయత ప్రభావం వల్లనూ, కష్టజీవులఉద్యమాల తాకిడివల్లనూ, జాతీయత మాసిపోతోందని కొందరు అభిప్రాయపడుతున్నారు. ప్రపంచమంతటా ఇటీవల జరిగిన సంగతులనుబట్టి చూస్తే, ఆసంగతి నిజంకాదని స్పష్టపడుతోంది. ప్రజలను కదపి, చైతన్యవంతులనుచేసి కార్యాచరణకు

పురిగొల్పేదింకా జాతీయతే. సమిష్టిజీవనం, సమిష్టిలక్ష్యం ఇత్యాది భావాలన్నీ ఆజాతీయతను అంటిపెట్టుకునే ఉంటాయి. మధ్యతరగతులకు చెందిన బుద్ధిమంతులుకొందరు మెల్లగా జాతీయతాభావానికి దూరమగుతూ వచ్చారు. అథవా అలా అనుకున్నారు. అంతర్జాతీయదృక్పథంతో కార్మికోద్యమాలను, కష్టజీవులఉద్యమాలను నడిపించేవారుకూడా జాతీయతవైపుకే మొగ్గుతున్నారు. జాతీయత ఈవిధంగా పునరుద్దీపితం కావడంవల్లనూ, దాని అవసరము విరివిగా గుర్తింపబడడంవల్లనూ పాత సమస్యలస్వరూపం మారిపోయి కొత్తసమస్య లుత్పన్నమైనాయి. చిరకాలంగా పాతుకుపోయిన సాంప్రదాయాలను తేలికగా గోకివారేయడానికిగాని, రద్దుచేయడానికిగాని సాధ్యపడదు. మంచి ఇరుకుసమయాల్లో అవి ప్రకోపించి మానవుల మనస్సును పూర్తిగా ఆక్రమించేస్తాయి. తరుచుగా జనాన్ని ఉద్వేగపరచి ఎంతటి త్యాగానికైనా ఆయత్తపరచి అసాధ్యమైనపనులు చేయించడానికి ఈ సాంప్రదాయాలను ఉపయోగిస్తూఉండడం కూడా చూస్తూనేఉన్నాం. పాత సాంప్రదాయాలను చాలావరకు అంగీకరించి, కొత్త స్థితిగతులకూ భావాలకూ అనుగుణ్యంగా మార్పుచేయాలి. దానితోపాటే కొత్త సాంప్రదాయాలను కూడా సృష్టించాలి. జాతీయతాభావం దేశంలో బలంగా లోతుగా స్థిరపడుంది. అది భవిష్యత్తుకు బొత్తుగా సంబంధంలేని నిరర్థకమైన ఆదర్శం కాదు. కాని అనివార్యమైన కొత్త ఆదర్శాలు, భావాలు ప్రభవించాయి. అవే అంతర్జాతీయత, కష్టజీవుల సమైక్యత మొదలైన ఆదర్శాలు. ప్రపంచంలో సంఘర్షణ తగ్గి కాస్తంత శాంతి ఏర్పడాలంటే ఈ ఆదర్శాలన్నింటిని ఏదోవిధంగా సమన్వయపరచి ఏకీకరణంచేయాలి. మానవసహజమైన జాతీయతను గుర్తించి దాని కుచితమైన స్థానాన్ని ఇవ్వాలి. కాని దాని ప్రభావాన్ని కొంచెం హద్దులలో ఉంచాలి.

కొత్త ఆదర్శాలతోనూ, అంతర్జాతీయభావాలతోనూ నిండిన దేశాల్లోనే జాతీయతయొక్క ప్రభావం పూర్ణంగా ఉన్నది. అలాంటప్పుడు భారతదేశంలో దానిప్రభావ మెన్నిరెట్లుంటేమాత్రం ఆశ్చర్యమేముంది ? మానవజాతీయతాతత్త్వం మన దర్జాకు లోపమనీ, మన స్వాతంత్ర్యవాంఛ సంకుచిత మనస్తత్వాన్ని సూచిస్తుందనీ కొందరంటారు. ఈ మాట అనేవారి అభిప్రాయం, మనం బ్రిటిష్

సామ్రాజ్యంలోనూ, నానాజాతిసమాఖ్యలోనూ మైనసువాటాదార్లుగా ఉండటమే, నిజమైన అంతర్జాతీయత అనిపించుకుంటుందని కాబోలు! వాళ్ళు చెప్పే అంతర్జాతీయతంటే బ్రిటిష్‌వారి సంకుచితజాతీయతే అనే సంగతి వారు గ్రహింపలేకున్నారు. అలాంటి అంతర్జాతీయతను భారత దేశం ఎన్నడూ అంగీకరించదు. హిందూదేశంలో జాతీయభావ మెంత గాఢంగా ఉన్నా, నిజమైన అంతర్జాతీయతను అంగీకరించి, అంతర్జాతీయ సహకారమును, సహచర్యమును పెంపొందించుటలో ముందడుగు వేసింది. స్వతంత్ర దేశమైనా, ఆ సహకారంకోసమే కొంతవరకు ప్రపంచ సంస్థలకు తలయొగ్గినది.

### 3 ఇండియా బలం - బలహీనత

భారతదేశంయొక్క బలానికి మూలమేది? ఆ బలం క్షీణించ డానికి కారణమేమి? అనే అన్వేషణ చాలా తికమకలతోకూడిన పెద్ద వ్యవహారం. కాని ఇటీవల కలిగిన క్షీణదశకు కారణం స్పష్టంగానే తెలు స్తోంది. శాస్త్రజ్ఞానాన్ని, మానవసౌఖ్యంకోసం వినియోగించే సాంకేతిక విజ్ఞానాన్ని సాధించలేకపోయింది ఇండియా. అనేకవిషయాల్లో చిరకా లంగా వెనుకబడున్న యూరోపు దానిని సాధించి అభివృద్ధిచెందింది. శాస్త్రజ్ఞానంవల్ల కలిగిన ఉత్సాహమే, అనేక కొత్తవిషయాలను కని పెట్టాలనే సాహసానికి పురిగొల్పింది. కొత్త పరిశోధనలు, సాంకేతిక విద్య, పశ్చిమయూరపుఖండంలోని దేశాలకు సైనికబలాన్నిచ్చాయి. అందుచేత వారు తూర్పుదేశాలపై విజృంభించి అధికారం చలాయిం చడం తేలికైంది. ఇదొక్క ఇండియా కథే కాదు; ఆసియాఖండమం తటా ఇంతే అయింది.

ఇలా ఎందుకు జరిగిందో తెలుసుకోవడం చాలా కష్టం. పూర్వ కాలంలో భారతదేశంలో సాంకేతిక పరిజ్ఞానానికి, బుద్ధికుశలతకూ లోటుండేది కాదు. కొన్ని శతాబ్దాలనుంచి క్రమంగా ఆ ప్రతిభ దిగ జారింది. జీవితంమీద ఆకాంక్ష, కృషి తగ్గినకొద్దీ, స్వయంనిర్మాణశక్తి కూడా తగ్గి అనుకరణస్వభావం పెరిగిపోతుంది. ప్రకృతిలోనూ, ప్రపం చంలోనూ, ఉన్న దుర్గ్రాహ్యమైన సంగతులను ఛేదించి చూడాలనే విప్లవాలోచన బయలుదేరినప్పుడు, దాన్ని నెదుర్కోవడానికి కేవల

భాష్యకారుడు తన వ్యాఖ్యానాలను, విమర్శనలను గుప్పించేస్తాడు. బ్రహ్మాండమైన చిత్రకళానైపుణ్యము, శిల్పము పోయి, చిన్నచిన్న చెక్కడాలు బయలుదేరుతాయి. వాటిలో భావోన్నతి కాని, శిల్పనైపుణ్యంకాని ఉండవు. భాష తేలికగా కనుపడినా, పుష్టి, పటిష్ఠత కలిగిన సాహిత్యం పోయి దానిస్థానే కేవలం అలంకారమాత్రమైన మాటలపోగుసాహిత్యం బయలుదేరుతుంది. పాలుపొంగే భారతనాగరికజీవనాన్ని దూరస్థమైన విదేశాలలో వ్యాపింపచేయాలనే కుతూహలం విజయయాత్రోత్సాహం క్రమంగా అంతరించిపోయి, సముద్రాలు దాటివెళ్ళడం కూడా అపరాధ మనేటటువంటి ఛాందస నిషేధాలు ప్రత్యక్షమైనాయి. పూర్వకాలంలో బాగా నిదర్శనంగా కనబడుతూఉండే హేతువాదయుక్తమైన విషయవివేచన పోయింది. అందువల్ల బహుశా శాస్త్రజ్ఞానం బాగా వృద్ధియైయుండేది కాని, దానిస్థానే వేచనాశూన్యమైన మూఢనమ్మకాలు, అర్థంలేని విగ్రహారాధన వెలిసేయి. భారతీయజీవితం, నిర్జీవమైన గతంలోనుంచి మందకొడిగా ప్రవహించే సెలయేరైపోయింది. అత్యంతభారమైన గతం, నేటి భారతజీవితాన్ని క్రుంగదీసేస్తోంది. ఒకవిధమైన మత్తు ఆవహించింది. ఈవిధంగా బుద్ధి స్తంభించిపోయి, శరీరం శోషించిపోయిన భారతదేశం క్షీణదశకొచ్చి, కదలలేని స్థితిలో ఉండడంలో ఆశ్చర్యం లేదు. ఇండియా ఇలా ఉండగా ప్రపంచంలోని ఇతరదేశాలు ముందుకు సాగేయి.

అయినప్పటికీ, ఇది పూర్తిగా నిర్దుష్టమైన. పరిపూర్ణ సమీక్ష కాదు. ఏమంటే, తెరపీ తెంపూ లేకుండా జీవితం ఇంతకాలం ఇలా స్తంభించిఉంటే బహుశా ఎక్కడో అక్కడ పూర్తిగా తెగతెంపే అయిపోయి ఉండేది. దాని శిథిలాలమీద మరొక కొత్తనిర్మాణం బయలుదేరే ఉండేది. అలాంటి తెంపు లేకపోగా ఒక వరుసక్రమం కనబడుతూనే ఉంది. మధ్యమధ్య ఒక్కొక్కసారి పునరుద్దీపన పొందుతూ ఉండడం, అవి కొంతకాలంపాటు తేజోవంతంగా విలసిల్లడంకూడా కద్దు. భారతసంస్కృతిలో, కొత్తవిషయాలను ఆకళింపుచేసుకుని పాతవాటితో సమన్వయంచేయడానికి చేయబడిన ప్రయత్నాలు నేటికీ ద్యోతకమవుతూనే ఉన్నాయి, పాతపద్ధతులు పై స్వరూపాన్ని అలా ఉంచుకుని, లోపల చాలా మార్పులు చెందేయి. కాని సజీవమై, శక్తివంతమైన

దేదో ఒకటి అలాగే చలనంలేకుండా ఉన్నది. పాత కొత్తల మేలు కలయికలకోసం ఆశిస్తూ, ఏదో ఒక కోరికను సాధించాలనే ఆకాంక్ష కనుబడుతోంది. ఈ ఆకాంక్షయే కొత్తవిషయాలను జీర్ణంచేసుకుంటూ, పాతభావాలను సంరక్షించుకుంటూ, సజీవంగా ఉంచుతోంది. చిరకాలంగా భారతీయులకు, జీవితస్వప్నమొకటున్నదో, లేక అది కేవలం కలతనిద్రలోని పలవరింతో తెలియదు. బహుశా ప్రతిదేశంలోని జనానికీ ఏదోఒక దుర్గ్రాహ్యమైన పరమావధి ఉంటుంది. భారతీయుడ నవడంచేత హిందూదేశంవిషయంలోకూడా ఏదో ఒక సత్యం, ఒక దుర్గ్రాహ్యమైన లక్ష్యం ఉందని నేను నమ్ముతున్నాను. ఎక్కడా తెంపు లేకుండా వరుసగా వేలసంవత్సరాలుగా, వందల తరాలవారిని తీర్చిదిద్ద గలిగిన నాగరికతకు ఒక అవినాశనమైన శక్తి వుండితీరాలనుకుంటాను. అథవా యుగయుగాలుగా కాలగర్భంలోంచి అట్టిశక్తిని ఎప్పటికప్పుడు స్వంతంగానే స్వీకరించి, పునరుద్దీపనంచేసుకోగల శక్తి ఆ నాగరికత. వుండివుండాలి.

అలాంటి బలాన్నిచ్చేబావి ఏదైనా వున్నదా? వుంటే అదెండిపోయిందా? లేక అలా బలాన్నొసంగే ఊటలేమైనా గుంభితంగా వున్నాయా? అవిప్పుడెక్కడున్నాయి? మనబలాన్ని మళ్ళీ పూరించగల శక్తులింకెక్కడున్నాయి? మనది చాలా పురాతనమైన జాతి. అనగా చరిత్ర ప్రారంభమైననాటినుంచి అనేకజాతులు అప్రయత్నంగా మనలో లీనమైపోయాయి. మన ఉచ్చదశంతా గతించి, అంత్యదశ కొచ్చి, ముసలివాళ్ళలాగున శక్తివిహీనులమై, శాంతిని కాంక్షిస్తూ నిద్రపోతున్నామా?

మార్పులుచెందకుండా వుండే ప్రజలు కాని జాతులు కాని వుండవు. ఒకరితో ఒకరు కలసి నెమ్మదిగా మారుతూనే వుంటాయి. ఒకొక్కప్పుడు కొన్నిజాతులు నాశమైపోయినట్లే కనుపించి, మరల గభాలున కొత్తజాతిగా పైకొస్తూవుంటాయి.

సుస్థిరంగా వ్యాపించిన పూర్వ నాగరికతలెన్నో హఠాత్తుగా మాసిపోతూవుండడం, వాటిస్థానే బలవత్తరమైన కొత్తనాగరికతలు బయలుదేరడం చరిత్రలో ఎన్నోసారులు జరిగింది. ఒక నాగరికతకుగాని, జాతికిగాని అంతర్భూతంగా బలాన్నిచ్చే జీవశక్తి ఒకటుంటుందనుకుం

టాను. లేకపోతే ముసలివాడు యువకుడులా వ్యవహరించడం సాధ్యం కానట్లే, మానవుని ప్రయత్నంకూడా వృథాయే.

ప్రస్తుతం, ప్రపంచంలో ఇలాంటి జీవశక్తి ముఖ్యంగా మూడు దేశాల్లో కనబడుతోంది. అమెరికా, రష్యా, చైనా. ఈ కలయిక కొంచెం విచిత్రమే! అమెరికాప్రజల మూలం, పాత ప్రపంచంలో వున్నా, వాళ్లుమాత్రం కొత్తజాతి. పాతజాతుల సాంప్రదాయభారాలు ఛాందసాచారాలు వాళ్ళను బంధించవు. అందుచేత వాళ్ళలో అనంత మైనవుత్సాహశక్తి ద్యోతకమైనదంటే ఆశ్చర్యంలేదు. అలాగే కెనడా వారు. ఆస్ట్రేలియాప్రజలు, న్యూజిలాండు జనంకూడా పాతప్రపంచంతో అనుబంధాన్ని తెంపుచేసుకోవడంచేత, క్రొత్తజీవితాన్ని స్వేచ్ఛగా అనుభవించగలుగుతున్నారు.

రష్యనులు కొత్తజాతివారు కారు. కాని వారు తమ పాతసంస్కృతిని పూర్తిగా హతంచేసేశారు. చరిత్రలో ఎక్కడా సాదృశ్యం లేనివిధంగా వారు పునర్జన్మెత్తేరు. ప్రపంచాన్ని ఆశ్చర్యచకితులను చేసేటంత అద్భుతమైన శక్తిని, ప్రతిభను సంపాదించి యౌవనాన్ని పొందేరు. వాళ్ళుకూడా మూలంకొరకు తమ పాతచరిత్రను పరిశోధిస్తున్నారు కాని, నిజానికి వారి దొక కొత్తజనాభా. కొత్తజాతి. కొత్త సంస్కృతి.

ఏ జాతైనా, తగిన బలిసమర్పణంచేసి, కష్టపడి సామాన్యజనంలో నిబిడీకృతమైయున్న శక్తినీ, బలాన్నీ ప్రకోపింపచేయుగలిగితే, చాలా శక్తివంతమైనజాతి కాగలదని, రష్యా ధృవపరుస్తోంది ప్రస్తుతం నడుస్తున్న ఈ యుద్ధంలోకూడా ఎన్నో ఘోరకృత్యాలు, భీభత్సాలు జరిగినా, దానిఫలితంగా ఈ దగ్ధపటలాన్ని నిర్జించి బ్రతికినవారిలో నుంచి శక్తివంతమైన కొత్తజాతు లుత్పన్నంకావచ్చును.

ఈ ముగ్గురిలోనూ చైనాప్రజలలో ఒక విశేషముంది. వాళ్ళ జాతి అమెరికాలాగున కొత్తదీ కాదు, రష్యాలాగున నఖశిఖపర్యంతం కదలింపబడిన విప్లవంలోనూ పడలేదు. ఏడుసంవత్సరాలపాటు జరిగిన భయంకరమైన యుద్ధం వాళ్ళను మార్చిందనడాని కేమీ సందేహం లేదు. చైనా ప్రజలలో కలిగినమార్పు కేవలం యుద్ధంవల్లనేనా, కాక అంతకన్నా బలవత్తరమైన కారణాలున్నాయా, కాక రెంటికలయిక

వల్లనా అనే విషయం నేను ఇదమిత్థమని చెప్పలేను. కాని, చైనా దేశ ప్రజల శక్తినిగ్రహం నన్నాశ్చర్యచకితుని చేసింది. ఉక్కుముక్కకుండే బలం కలిగిన చైనా ఎందుకు అడుగునపడిందో నేనూహించుకోలేకున్నాను.

చైనాప్రజల్లో నాకు కనుబడిన ధారణశక్తే, అప్పుడప్పుడు మాత్రం భారతప్రజల్లోకూడా నాకు కనుబడుతూ వచ్చింది. ఈ విషయంలో నేను కేవలం నిష్పాక్షికమైన అభిప్రాయం చెప్పడంసాధ్యంకానిదేమో! నా కోరికలు, నా ఆలోచనకు ప్రతిబంధం కలిగిస్తాయనుకుంటాను. నేను ఈ దేశంలో చేస్తుండే సంచారాల్లో భారత ప్రజల్లో ఆలాంటి ధారణశక్తి ఎక్కడున్నదా అని వెతుకుతుంటాను. మన వాళ్ళల్లో ఆ ధారణశక్తి ఉంటే త్వరలో బాగుపడగలం. ఆ జీవశక్తే లేకపోతే మన రాజకీయప్రయత్నాలు, హంగామా అంతా కేవలం నాటకప్రాయమే. అందువల్ల కలుగబోయే ప్రయోజనం లేదు. వెనుకటిలాగే కాలక్షేపమాత్రంగా ప్రజలజీవితం సాగిపోయే రాజకీయ ఏర్పాట్లకు నే నంత సుముఖుడనుకాను. ప్రజల్లో అనంతమైన జీవశక్తి అణగిమణిగి ఉంది. దానిని ప్రజ్వలింపచేసి, జాతిని నవయౌవనంతో తొణికసలాడేటట్లు చేయాలని నా అభిలాష. భారత దేశపు స్థితిగతులను బట్టి, ప్రపంచంలో ద్వితీయస్థానాన్ని ఆక్రమించడం అసంభవం. ఉంటే అగ్రశ్రేణిలో ఉంటుంది. లేకపోతే అడుక్కడుతుంది. అంతేకాని, మధ్యే మార్గం నాకిష్టంలేదు. అలాంటి మధ్యమార్గం సాధ్యమనికూడా నేననుకోను.

కడచిన పాతిక సంవత్సరాలనుండీ భారతస్వాతంత్ర్యంకొరకు బ్రిటిష్‌వారితో పోరాటాన్ని సాగిస్తున్న నాకు, నాబోటివారికి ఈ దేశాన్ని పునరుద్దీపితంచెయ్యాలనే కోరికే గాఢంగా ఉన్నది. కష్టభూయిష్టమైన కార్యాచరణవల్ల, త్యాగంవల్ల, బుద్ధిపూర్వకంగా ప్రమాదాల నెదుర్కోవడంవల్ల, అక్రమాలను అన్యాయాలను ప్రతిఘటించడంమూలంగా, భారతప్రజలను నిద్రమేల్కొల్పి ఉత్సాహపరచి వారిలో అంతర్గతంగానున్న జీవశక్తిని ప్రకోపింపచేయాలని మా సంకల్పం. మేము బ్రిటిష్‌ప్రభుత్వంతో ఎంత సంఘర్షణపడ్డా ప్రధానంగా మా దృష్టి మా ప్రజలమీదనే ఉండేది. ప్రజాక్షేమం దృష్టిల్లో

ఉన్నంతకాలం, దానిని పెంపొందించడానికి మాత్రమే రాజకీయప్రయోజనాలు ఉపయోగపడతాయి. అందుచేతనే మేము సాధారణరాజకీయవాదులవలె సంకుచితంగా వ్యవహరించలేదు. మా దేశంలోనూ పరాయి దేశాల్లోనూకూడా కేవల రాజకీయవేత్తలు, మా పట్టుదలకు అమాయకత్వానికీ ఆశ్చర్యపడుతూ మమ్మల్ని విమర్శించారు. మేము అవివేకంగాప్రవర్తించామో వివేకంగా ప్రవర్తించామోరాబోయేచరిత్రకారులు నిర్ణయించాలి. మా ఆదర్శాలు భవిష్యత్తును చూడగలిగిన మహోన్నతములు. కేవలం అవకాశవాదులైనరాజకీయవేత్తల కవి అవివేకంగా తోచవచ్చును. కాని భారతప్రజల రాజకీయ ఆర్థికప్రతిపత్తిని వృద్ధిచేయడమేకాకుండా ఆధ్యాత్మికంగానూ మానసికంగానూ కూడా వారి నున్నతస్థాయి కెత్తవలెనన్న ప్రధానలక్ష్యాన్ని మేమెన్నడూ విస్మరింపలేదు. ప్రజాసామాన్యంయొక్క ఆంతరంగిక బలాన్ని పెంపొందించడంకోసమే మేము మాశక్తినంతా కేంద్రీకరింపచేశాం. ఆ బలంకలిగినపుడు మిగిలినవి వాటంతటవే సిద్ధిస్తాయి. మూర్తీభవించిన అహంకారమైన విదేశపరిపాలనకు పిరికిపందలమై కొన్ని తరాలుగా దాసానుదాసులమైన సిగ్గును ముందుగా తొలగించుకోవలసియున్నది.

## ౪ భారతాన్వేషణం

పుస్తకాలు, పురావస్తువులు, శాసనాలు గత సంస్కృతి, భారతదేశాన్నిగురించి కొంత తెలుసుకోనేందుకు నాకు సావకాశమిచ్చాయి. కాని, ప్రధానంగా నాకు కలిగిన సంశయాలకు జవాబురాలేదు. అవన్నీ గతానికి సంబంధించినవే. ఆ గతానికీ నేడు జరుగుతున్న విషయాలకూ నిజమైన సంబంధం ఏమైనా ఉన్నదా అనే నా అన్వేషణ. మాధ్యమికయుగానికిచెందిన కొన్ని ఆచారవ్యవహారాలు, దుర్భరమైన దారిద్ర్యం అనేకకష్టాలు, మధ్యతరగతిప్రజల పైపైమెరుగుల నవ్యత్వం వీటికలయికే వర్తమానజీవితం. నాకు నాతరగతి ప్రజలంటే గౌరవంకాని అభిమానం కాని లేదు. కాని విధిలేక, భారత స్వాతంత్ర్యసమరంలో వారి నాయకత్వాన్నే కాంక్షించవలసివచ్చింది. మధ్యతరగతిప్రజలు బోనులో బంధింపబడినట్లుగా బాధపడ్డారు. దానినుండి విమోచనపొంది ఆత్మవికాసం పొందాలని గిజగిజలాడేరు. కాని బ్రిటిష్‌పరిపాలనాబంధంలో

పడివున్నంతకాలం ఆలాంటి వికాసాని కేమీ తావులేదని గ్రహించి మధ్యతరగతిప్రజలు తిరుగుబాటుచేశారు.

కాని ఆ తిరుగుబాటు మనలను అణగద్రొక్కిన పరిపాలనా చట్రంమీద కాదు. ఆ చట్రాన్ని అలాగే ఉంచి దానిని త్రిప్పే బ్రిటిష్ వారిని మాత్రం తొలగించాలని వారి అభిప్రాయం. అసలు ఈ మధ్య తరగతి ప్రజలు బ్రిటిష్ పరిపాలనాచట్రం తయారుచేసినవారేకదా! అందుచేత దానిని పూర్తిగా రద్దుచేసే దమ్ము వారికి లేకపోయింది.

గ్రామాల్లోని సామాన్యప్రజలలో ఉద్దీపనం కలిగించాలనే క్రొత్త ఉత్సాహం దేశంలో బయలుదేరింది. బుద్ధిమంతులైన యువకులకు ఈ అభిప్రాయం కలిగేసరికొక క్రొత్త భారతదేశం ప్రభవించింది. ఈ ధీమంతుల కిదివరకు గ్రామీణప్రజల ఉనికియే గుర్తులేదు. గుర్తున్నా వారి నెన్నడూ గణించనేలేదు. గ్రామీణప్రజల్లో దుర్భరమైన బాధలనేకంగా ఉన్నాయి. వాటి పరిష్కారమార్గాలు దుర్భేద్యమవడమే కాకుండా మామూలుగా మన గ్రామప్రజలనుగురించి మనకున్న అభిప్రాయాలే మార్చుకోవలసివచ్చింది. ఈ తతంగంలోనే భారతదేశం నిజస్వరూపాన్ని మేము చూడగలిగేం. ఇందువల్ల కొన్ని విశేషాలు తెలుసుకున్నా కొన్ని ఆంతరంగిక సంఘర్షణలుకూడా సంభవించాయి. ఈ క్రొత్త అనుభవం మా సహచరులలో వారివారి పూర్వానుభవం కొద్దీ అనేక భావాలను కలిగించింది. ఇందులో కొందరికి గ్రామాల్లోని ప్రజల్తో ఇదివరకే సన్నిహితమైన సంబంధం ఉండడంచేత వారి కేమీ ఆశ్చర్యం కలిగించలేదు. కాని నాకు మాత్రం అది నిజంగా క్రొత్త సంగతే. నా ప్రజలలో అనేక లోపాలు, బలహీనత ఉన్నాయనే సంగతి నాకు తెలియకపోలేదు. కాని గ్రామీణప్రజలలో నన్నాకర్షించిన విశేషమేదో ఉన్నది. దానిని నిర్వచనంచేయడం నావల్లకాదు. ఆ విశేషం మన మధ్యతరగతిప్రజల్లో కనుబడదు.

సామాన్యప్రజల భావాలను నేను వీలైనంతవరకు సిద్ధాంతాలుగా అంగీకరించను. భారతప్రజలలో ఎన్నిరకాలవారున్నా, వారి సంఖ్యాబలమెంతున్నా, వారందరూ ఒకేజాతికిచెందిన వ్యక్తులుగానే నేను భావిస్తున్నాను. వారిని చిన్నముఠాలుగా భావించలేను. ప్రజలదగ్గరనుండి ఏదో మహత్కార్యం జరుగుతుందని నేను ఆశించలేదు కనుక ఆశా

భంగం కలుగడమనేది లేదు. నే ననుకున్నదానికంటే ఎక్కువ విశేషమే నేను వారిలో చూడగలిగేను. దానికి కారణం పురాతన నాగరికతలో నుండిన సాంప్రదాయాలు, శక్తులు ఏ కొద్దోగొప్పో వారింకా నిలబెట్టుకో గలిగేరు. చాలావరకు 200 సంవత్సరాలనుంచి దెబ్బలుతింటున్నా ..లనాటి ఆ నాగరికతలో ప్రశస్తమైన భాగాలు మిగిలేఉన్నాయి. వాటితోపాటు చెడ్డసాంప్రదాయాలు, పొల్లు కూడా మిగిలింది.

1920—30 సంవత్సరాలలో నేను నా రాష్ట్రంలో మాత్రమే పనిచేస్తూఉండేవాడిని. ఉత్తరప్రదేశంలోని 48 జిల్లాల్లోనూఉన్న పట్టణాలు గ్రామాలు అన్నీ తెగతిరిగేను. ప్రతి గ్రామంలోనూ సంచారంచేశాను. ఉత్తరప్రదేశమంటే భారతభూమియొక్క హృదయమన్నమాట. పురాతన నాగరికతకు, మధ్యయుగాల నాగరికతకూ అది ఉనికిపట్టు. 1857 వ సంవత్సరంనాటి మహావిప్లవం ప్రజ్వరిల్లినచోటు. నిర్దాక్షిణ్యమైన హింసామార్గములవల్ల ఆ విప్లవ మక్కడే అణగగొట్టబడింది. ఎన్నోజాతులు, నాగరికతలు ఆ క్షేత్రంలోనే కలగాపులగమై రూపాంతరాలు చెందేయి. ఈ పదేండ్లల్లోనూ సంయుక్తపరగణాలలోని పశ్చిమ, ఉత్తరప్రాంతాలలో నివసించే జాట్‌లను పరిచయం చేసుకున్నాను. వారు మంచి బలసంపన్నులు. భూమిమీద కష్టించి బాగా సారంతీస్తారు. ధైర్యసాహసాలు, స్వాతంత్ర్యభావం వాళ్ళముఖం మీద ఉట్టిపడుతూఉంటుంది. యు. పి. లోని తదితరులకన్న జాట్‌లు ధనవంతులు. ఇస్లాంమతాన్ని స్వీకరించినా తమ కులమన్నా, తమ తాత ముత్తాతలన్నా చాలా గర్వపడుతూఉండే రసపుత్రరైతులను కలుసుకున్నాను. కుటీరపరిశ్రమలవల్ల జీవిస్తూ, తమ హస్తనైపుణ్యముచేత అందచందమైన వస్తుసామగ్రిని సృష్టించే హిందూ ముసల్మాన్ చేతిపని వారిని చూచాను. అయోధ్యలోను, ఇతర తూర్పుజిల్లాల్లోనూ, తరతరాలుగా అణగద్రొక్కబడి నికృష్టమైన దారిద్ర్యాన్ని అనుభవిస్తూ, విమోచనకు ఏవిధమైన సావకాశం లేకపోయినా ఏదో ఆశతో జీవిస్తూ ఉండే పేదకృషికులను తెలుసుకున్నాను.

ఇక 1930-1940 సంవత్సరాల్లో జైలు బయట ఉన్నకాలంలో ముఖ్యంగా 36-37 ఎన్నికలసంరంభసందర్భమున ఇండియా దేశమంతటా పట్టణాల్లోనూ పల్లెల్లోనూ తిరిగేను. ఒక్క వంగదేశగ్రామాలు

తప్ప తదితర రాష్ట్రాలలోని గ్రామాల్లో బాగా సంచారంచేశాను. దురదృష్టవశాత్తు వంగగ్రామాలను నేను ఎక్కువగా చూడలేదు. గ్రామ సంచారాల్లో విశేషంగా రాజకీయ ఆర్థిక విషయాలనుగురించే మాట్లాడేను. తాత్కాలింగా ఎన్నికలు మొదలైనవాటిచేఆవేశంకలిగినా నా మనస్సుఅంతకన్న బలీయమైనఆలోచనలతోనిండిఉండేది. సువిశాల మైన ఈభారతభూమిని, అందులో ఉండే ప్రజలను తెలుసుకోవాలనే కుతూహలం నన్నావహించింది. అనంతమైన, బహుముఖమైన భారతభూమి సౌందర్యము నాకండ్లకు కట్టినట్లు నన్ను పరవశుణ్ణిచేసింది. ఈ సౌందర్యాన్ని చూచినకొద్దీ, దానిలో ఉండే ఆంతర్యభావాలను నేనుగాని ఇతరులుగాని గ్రహించడం చాలా కష్టమనిపించింది. సువిశాలమైనభారత దేశపు మైదానాలు, జనంలోని భిన్నత్వాలు నాకు అవగాహన కాక పోలేదు. కాని, భారతహృదయం యొక్క గంభీరత మాత్రం నా కందలేదు. అప్పుడప్పుడు మాత్రం నన్ను ముగ్ధుణ్ణిచేసే దృశ్యాల వుపతుండేవి. ఒకే రాతిమీద ఒకటిగా ఎన్నో శాసనాలు వ్రాసినా, అన్నీ దేనికదే సుస్పష్టంగా కనబడే పురాణశాసనంలా కనబడింది భారత దేశం. తెలిసో తెలియకో ఈ విషయాలన్నీ మనస్సును ఉద్రిక్తపరచేవి. దానితో భారతవ్యక్తిత్వం అనేకసమస్యలను తెచ్చిపెట్టేది. సమాధానం రాని ప్రశ్నలను కురిపిస్తూ ఉండే ఒక భీకరస్వరూపం దేశమంతటా కనుబడేది. మనదేశప్రజల్లో భిన్నత్వమూ, వివిధత్వమూ ఎంతగా కనుపించినా, ఎక్కడ చూచినా అద్భుతమైన ఏకత్వంకూడా ఉన్నది. అనేక యుగాలుగా, మనం ఎన్నిరాజకీయఇక్కట్లల్లోపడినా, ఆ ఏకత్వమే మనల నొక్కటిగా నుంచగలిగినది. భారతసమైక్యత, నాకు కేవలం భావచిత్రమేకాదు, నన్ను ఉద్రిక్తపరచి పరవశునిగా చేసే అనుభవం. ఎన్ని ప్రళయాలొచ్చినా, ప్రమాదాలొచ్చినా, రాజకీయవిచ్ఛిన్నాలు కలిగినా ప్రధానంగా ఉండే భారతసమైక్యత కెన్నడూ విఘాతం కలుగలేదు.

ఈ హిందూదేశాన్ని గురించి కాని మరోదేశాన్నిగురించి గాని ఏదో ఒక వర్గంయొక్క నివాసస్థానంగా వర్ణించడం పొరబాటు. భారత దేశంలో ఉండే భిన్నత్వము, కులాలు, మతాలు, జాతులతేడాలు వారివారి నాగరికతల్లో ఉండే అంతస్థులు నాకు తెలియకపోలేదు. అయి

నప్పటికీ, చిరకాలంగా ఒకే నాగరికతను, సాంప్రదాయాలను, దృక్ప థాన్ని కలిగిన దేశంలో వారిలో వారికే స్వల్పమైన అభిప్రాయభేదా లున్నా, ఒక ఏకత్వాన్ని సూచించే భావవిశిష్టత విస్పష్టంగా కను బడుతుంది. చైనాలో ఈ విషయం బాగా దృష్టాంతంగా కనుబడుతుంది. పాతకాలంనాటి చైనా దేశపు అధికారితో మాట్లాడినా, నేటి కమ్యూ నిష్టుతో మాట్లాడినా ఏకత్వం స్పష్టంగా కనుపిస్తుంది. హిందూ దేశంలో కూడా ఏకత్వసూచకమైన ఈ భావాన్ని నేనన్వేషిస్తున్నాను. ఈ అన్వే షణ విషయంలో కొంచెం సరదాఉన్నా, కేవలం సరదాకు మాత్రమే ఈ పని చేయడంలేదు. ఈ భావాన్ని వెతకి పట్టడంవల్ల, నా దేశాన్ని నా ప్రజలను అవగాహనచేసుకునే సాధనాలు దొరుకుతాయని నాఆశ. భవిష్యత్తును గురించిన ఆలోచనలకు, కార్యాచరణకు మార్గం దొరుకు తుందని నా విశ్వాసం. రాజకీయాలు, ఎన్నికలు నిత్య నైమిత్తిక వ్యవ హారాలు, తాత్కాలికంగా ఉద్రిక్తపరచేవి. కాని భారతదేశంయొక్క మహత్తర భావిని, గట్టిగా, సురక్షితంగా, అందంగా నిర్మాణం చెయ్యా లంటే, పునాదులు లోతుగా తీయాలి.

## ౭ భారతమాత

నా సంచారంలో జరుగుతుండే బహిరంగసభల్లో తరుచుగా మన హిందూదేశాన్నిగురించి భరతుడు పాలించిన భారతదేశంగా వర్ణిస్తుండే వాడిని. భరతుడు మన పురాణాల్లోని రాజు. ఆతడు పాలించిన భూమి అవడంచేతనే మనదేశం భారతభూమిగా పేరుపొందింది. ఈ కథలన్నీ గ్రామాల్లో జరిగే సభల్లోనే చెప్పేవాడిని. పట్టణాలు శాస్త్రంత తెలివి మీరడంచేత ఈ కథలు వారి కంతగా నచ్చవు. కాని శాస్త్ర హద్దు పద్దుల్లోఉండే గ్రామంలోని రయితుజనానికి, మనం స్వాతంత్ర్యంకోసం పోరాడుచున్న ఈ విశాలదేశాన్నిగురించి చాలా చెప్పేవాడిని. ఒక భాగానికి మరొకభాగానికి భౌతికస్వరూపంలో ఎన్నితేడాలున్నా హిం దూదేశమంతా ఒక్కటేననీ, దేశం నాలుగుదిశల్లో నివసించే కృషీ వలులసమస్యలూ ఒక్కటేననీ, స్వరాజ్యంవస్తే అది ఏ కొందరికిమాత్ర మేకాకుండా అందరికీ శ్రేయోదాయకమనీ చెప్పేను. ఉత్తరాన్ని కైబర్ పాస్‌దగ్గరనుంచి దక్షిణాన్నున్న కన్యాకుమారి అగ్రంవరకూ నే చేసిన

సంచారాలనుగురించీ, ఎక్కడికెళ్ళినా రైతులు ఒకేరకమైన ప్రశ్నలు వేస్తున్నారనీ చెప్పేను. నిజానికి ఎక్కడైనా వాళ్ళబాధ లొక్కటేకదా! లేమి, అప్పులు, భూఖామందులఒత్తిడి, ఋణదాతలబాధ, దుర్భరమైనశిస్తులు, పన్నులు, పోలీసులవేధ, ఇవన్నీ అందరికీ సమానంగానే విదేశప్రభుత్వం మననెత్తిన పెట్టింది. ఆ పరప్రభుత్వం పోతేనే, మన కందరకూ ఒక్కసారే విమోచనం కలుగుతుందని ప్రజలతలకెక్కించాము. భారతదేశమంతా ఒక్కటిగానే భావించాలనీ, కొంతవరకు ప్రపంచమంతా ఒకటిగానే చూడాలనీ నచ్చచెప్పేను. ఈ తతంగంలో చైనా, స్పెయిన్, అబిసీనియా మధ్యమయూరపుఖండం, ఈజిప్టు, పశ్చిమాసీయాల్లో జరిగిన స్వాతంత్ర్యపోరాటాల చరిత్రను చెప్పేను. రష్యా సోవియటురాజ్యంలో జరిగిన అద్భుతమైన మార్పులగురించి, అమెరికాలో జరిగిన అభివృద్ధినిగురించి ఎంతో చెప్పేను. ఈపని అంత తేలిక కాదు కాని, నే ననుకున్నంత కష్టమూ కాదు. మన పురాణాలు, ఇతిహాసాలు, కథలు వగైరాలన్నీ వారి కిదివరకే బాగా తెలిసుండడంవలన భారతదేశంయొక్క నిజస్వరూపస్వభావాలను యీవరకే గ్రహించారు. దేశం నాల్గుమూలలా బాగా సంచారంచేసి, దేశంలోని పుణ్యక్షేత్రములను సందర్శించినవారెందరో ఉన్నారు. ప్రథమ యూరోపు మహాసంగ్రామంలో విదేశాల్లో పోరాడిన సిపాయిలనేకమంది ఉన్నారు. 1930 సంవత్సరం తదనంతరం, ధరవరల పతనంవల్ల కలిగే ఫలితాలనుగురించి కూడా చెప్పేను.

ఒకొక్కప్పుడు నేను మీటింగులోకి రావడంతోనే జనమంతా ఒక్కసారి భారతమాతకూ జై అంటూ ఆహ్వానిస్తారు. ఒకొక్కప్పుడు నేను ఆ నినాదానికర్థమేమిటని జనాన్నే అడిగేవాడిని. భారతమాత అంటే ఎవ్వరు? ఆమెవిజయాన్ని వారెందుకు కాంక్షిస్తున్నారు? నా ఈ ప్రశ్నలు వాళ్ళకి నవ్వూ, ఆశ్చర్యాన్ని కలిగించేవి. ఏం జవాబు చెప్పాలో తెలియక ఒకళ్ళముఖాలింకొకళ్ళు చూసుకునేవారు. ఏమీ తోచక నాకేసి తెల్లపోయిచూచేవాళ్ళు. ఒకసభలో నేను తరచితరచి ఆ విషయాన్నే ప్రశ్నించేసరికి ఒక జాట్ కృషీవలుడు లేచి భరతమాతంటే ఈభూమి అన్నాడు. ఏ భూమి? మీఊరిభూమా? లేక మీ రాష్ట్రమా, ఏమిటి? అని ప్రశ్నించాను. అలా ప్రశ్నలు జవాబులతో

కాలక్షేపంచేసేవాళ్ళం. ఆ భారతమాతను గురించి చెప్పమని అడుగుతూఉండేవారు. వాళ్ళడిగినప్రకారం భారతదేశాన్నిగురించి వాళ్ళకు తెలిసినదానికంటె ఎన్నోవిశేషాలను చెప్పేవాడిని. ఆహారాన్నుత్పత్తి చేసే పర్వతాలు, నదులు, అరణ్యాలు, మైదానాలు మొదలైనవి మన ... ఆప్యాయమైనవి. కాని అన్నిటికన్న వాటి నాశ్రయించుకొని నివసించేజనం మరీ కావలసినవాళ్ళు. ఈ కోట్లాదిజనమే ముఖ్యంగా భారతదేశం. ఆ మాటే 'మీరే ఈ భారతమాత సుమా' అని చెప్పేసరికి ఆ భావం వారితలకెక్కి, వారికళ్ళూ ముఖం తేజోమయమైపోయేవి. ఒక పెద్ద విషయాన్నేదో కనిపెట్టినట్లు ఆనందించేవాళ్ళు.

## ౬ భిన్నత్వం - ఏకత్వం

హిందూదేశప్రజలలో భిన్నత్వం చాలా హెచ్చు. ఆ భిన్నత్వం స్పష్టంగా పైకే కనబడుతుంది. పైపై వేషభాషల స్వరూపంలోనే కాకుండా అలవాట్లలోనూ, లక్షణాల్లోనూకూడా ఈ భిన్నత్వం ద్యోతకమవుతూ ఉంటుంది. వాయువ్యదిశనున్నపఠాన్‌కూ బాగా దక్షిణాన్నున్న అరవసోదరునికీ పైకి ఏమాత్రం పోలికఉండదు. వాళ్ళజాతులే వేరు. ఒడ్డు పొడుగుల్లో, ఆహారవిహారాల్లో, వేషభాషల్లోవాళ్ళకేమీ పోలికలే లేవు. పశ్చిమోత్తరప్రాంతంలో, మధ్య ఏషియా చిహ్నాలు పోలికలు కనుబడుతుంటాయి. కాశ్మీర్‌లోవలెనే అక్కడకూడా చాలావరకు హిమాలయపర్వతాలకవతలవైపు ఆచారవ్యవహారాలే కనుబడుతాయి. పఠాన్‌ల నృత్యం రష్యావారి కోసక్‌నృత్యంలాగే ఉంటుంది. ఇంత భిన్నత్వమున్నా పఠాన్‌లోనూ, తమిళునిలోనూకూడా భారతీయలక్షణాలు మాత్రం ఒక్కలాగే గోచరమవుతుంటాయి. ఇందులో పెద్ద ఆశ్చర్యమేమీలేదు. ఆఫ్ఘనిస్తానం కూడా ఒకప్పుడు, కొన్నివేల సంవత్సరాలపాటు ఇండియాతో కలిసేఉండేది. ఆఫ్ఘనిస్తానంలో ఉండే తురుష్కులు, తదితర మధ్యఆసియావాసులు, మహామ్మదీయమతానికి పూర్వం బౌద్ధులుగా ఉండేవారు. బాగా పురాణకాలంనాటి కెడితే, హిందూమతస్థులే. పశ్చిమోత్తరరాష్ట్రం భారతసంస్కృతీ కేంద్రాల్లో చాలా ముఖ్యమైనది. ఇప్పటికీ పురాతన శిథిలాలు ఎన్నో బయటపడుతుంటాయి. తక్షశిలవంటి విశ్వవిద్యాలయకేంద్రాల పురా

శిల్పశకలాలెన్నో బయటపడినాయి. రెండువేల సంవత్సరాలక్రిందట ఆ తక్షశిలకు యావద్భారతదేశంనుంచే కాకుండా ఆసియాఖండం అంతటి నుంచీకూడా, విద్యార్థులు వస్తూ ఉండేవారు. మతాలు మారినా, అచట ప్రజల మానసికప్రవృత్తియొక్క మూలము లంతగా మారలేదు.

పఠాన్లూ తమిళుల సామ్యం రెండు కొనల్లో ఉన్నసంగతి అనుకోండి. మిగిలిన భాగాలు ఈ రెండిటిమధ్యస్తంగా ఉంటాయి. ఏ రాష్ట్రానికా రాష్ట్రానికే ప్రత్యేక లక్షణాలున్నాయి. ప్రత్యేకతకన్నా కూడా ప్రస్ఫుటంగా కనుబడేవి భారతీయ ఐక్యతాచిహ్నాలు. బెంగాలీలు మరాఠీలు,గుజరాతీలు, తమిళులు ఆంధ్రులు,ఓఢ్రులు, ఆస్సామీయులు, కన్నడులు,మలయాళీలు,సింధీలు, పంజాబీయులు,పఠానులు, కాశ్మీరులు, రాజపుత్రులు,ఇంకా హిందూస్థానీ మాతృభాషగాగల మధ్యభారతనివాసులు, వందలాది సంవత్సరాలుగా వారివారి ప్రత్యేకతను కాపాడుకుంటూనేవచ్చారు. కాని అందరిలోనూ ఒకేభారతీయతఉండడమే విశిష్టత. జాతీయసాంప్రదాయాలు, నైతికసూత్రాలు, మానసికప్రవృత్తులు ఆచార్యవ్యవహారాలు, మంచిచెడ్డలు అందరిలోనూ ఒకేమాదిరిగాఉంటున్నాయి. నిత్యజీవితంలోనూ, దానికి సంబంధించిన సమస్యల యడలనూ ఒక విధమైనఅధ్యాత్మికదృక్పథం అందరిలోనూ ఒకేవిధంగా ప్రస్ఫుటమవుతోంది. ఈ సాంప్రదాయంలో ఏదోఒక సజీవమైన మహత్తరశక్తి ఉన్నది. పురాతన చైనాలాగునే పురాతన భారతదేశంకూడా ఒక సర్వసమగ్రమైన ప్రపంచం, ఒకప్రత్యేకమైన నాగరికత. విదేశ నాగరికతలొచ్చి వాటిప్రభావాన్ని మన నాగరికతమీద ప్రసరింపచేశాయి. కాని చివరకి మనదానిలో కలసిపోయాయి. వాటిని సంలీనంచేయడంలో కొన్ని పేచీలువచ్చాయి. నాగరికతఅంట్లూ పుట్టినప్పటినుంచీ, ఒకవిధమైన ఐక్యతనే హిందూదేశం కాంక్షిస్తూ ఉండేది. ఐక్యతంటే ఏవో కొన్ని భావాలను పైనుంచి తీసుకొచ్చి జనంనెత్తిమీద రుద్దడం కాదు. ఎవరి మతనమ్మకాలను, ఆచారవ్యవహారాలను వారు స్వేచ్ఛగా అనుసరించుకునే సహనంవల్లనే ఆ ఐక్యత సాధింపబడింది. అన్యమతాచారాలను సహించి ఊరుకోడమే కాకుండా వాటిని పెంపొందించింది హిందూదేశం.

ఎన్ని కట్టుదిట్టాలున్నా ప్రతి చిన్న దేశంలోనూ కూడా చిన్నవో పెద్దవో కొన్ని తేడా లగుపడుతూనే ఉంటాయి. మరొక దేశంతో పోల్చినప్పుడు మాత్రం ఈ దేశంలోని ఐక్యత బయటపడుతుంది. రెండు దేశాలు కలిసేచోట ఈ తేడా లంతగా కనుబడకపోవడం కూడా సహజమే. నవజీవనంలో ఈ తేడాలు తగ్గింపుచేసుకుని, ఒకవిధమైన ఏకత్వం కోసం ప్రయత్నాలు జరుగుతున్నాయి. పురాతనయుగాల్లోనూ, మధ్యకాలంలోనూ కూడా జనానికి జాతీయతంటే ఈనాటి విశాలభావం ఉండేదికాదు. ప్రాంతీయాభిమానం, మతం, కులం, సాంస్కృతిక సంబంధాలు ఎక్కువ ప్రాధాన్యతవహించేవి. అయినప్పటికీ చరిత్రను శోధించినంతవరకు భారతీయుడైనవాడు ఈ దేశంలోని ఏ రాష్ట్రంలోనైనా ఏ ప్రాంతంలోనైనా సుఖంగా స్వేచ్ఛగా సంచరించగలిగేవాడు. ఏప్రాంతాన్నికూడా పరాయిదేశంగా భావించవలసిన అగత్యం కలుగలేదు. దేశంసరిహద్దులుదాటి వెడితే ఉండే కొత్త అతనికి ఇక్కడగుపడలేదు. అందులోనూ, హిందూదేశంలో ఉద్భవించిన మతాలు వ్యాపించిన పరదేశాల్లో భారతీయుని కంత కొత్తనిపించదు ఇతరదేశాలలో ప్రభవించిన మతాలనవలంబించిన క్రైస్తవులు, పారశీకులు, యూధులు, ముస్లింలు, కొంతకాలం ఈ దేశంలోఉండేసరికి సాటూత్తూ భారతీయులైపోయినారు. మతం మారినంతమాత్రాన వాళ్ళలో భారతీయలక్షణాలేమీ మారలేదు. ఇతరదేశస్థులు వారిని పరాయివారైన హిందూదేశస్థులుగానే పరిగణించారు. వారిమతంవారైనంతమాత్రాన అన్యదేశస్థులు భారతీయులను వారివారుగా గణించుకోలేదు. ఏ క్రైస్తవదేశంలోనైనా భారతీయక్రైస్తవుడు భారతీయుడే. టర్కీలోనైనా అరేబియాలోనైనా భారత మహమ్మదీయుడు భారతీయుడుగానే లెక్కకొచ్చేస్తాడు.

మన జన్మభూమినిగురించి బహుశా మనమందరం – ఎవరికితోచిన విధంగా వారు–మన మనస్సుల్లో ఒక చిత్రాన్ని లీలగా నిర్మించుకుంటూ మనుకుంటాను. బహుశా ఏ ఇద్దరువ్యక్తులుగాని ఒకవిధమైన చిత్రాన్ని ఊహించుకోరు. నేను భారత దేశాన్నిగురించి ఆలోచించినపుడల్లా, నా కనేకవిషయాలు కళ్ళకుకట్టినట్లగుపడతాయి. చిన్నచిన్న గ్రామాలు, వాటినిచేరిఉండే విశాలమైన వ్యవసాయపుభూములు

ణాలు, మహానగరాలు, వర్షాకాలంరావడంతోనే, అంతవరకూ నెరి యలుతీసి ఉండి అతిశీఘ్రంగా పచ్చబడ్డ వ్యవసాయక్షేత్రాలు, నిరంతరం ప్రవహిస్తూఉండే నదీనదాలు, కైబర్ కనుమల సుందరదృశ్యం దక్షిణ కడనున్న కన్యాకుమారిఅగ్రం, భారతీయప్రజలు, మంచుచే ఆవరింప బడిన మహోన్నత హిమాలయపర్వతాలు, వసంతకాలం క్రొత్తక్రొత్త పువ్వులతో కళకళలాడే కాశ్మీరలోయలు అన్నీ అగుపడుతుంటాయి. వీటిలో కొన్ని మనసుకు బాగా హత్తుకుంటాయి. నాకు ఈ కొండల దృశ్యమే చాలా ఆనందంకలిగిస్తుంది. వేడిప్రదేశాలకంటె చాలా ఆనందం కలిగిస్తుంది. ఆ దృశ్యాన్నే మనస్సులో చిత్రించుకుని జాగ్రత్త పెట్టుకున్నాను. ఇంతకూ ఏదృశ్యమైనా ఒకటే. హిందూదేశంలో ఏ వాతావరణం లేదు? భూమధ్యరేఖనంటే ప్రదేశాల మహోష్ణం మొదలు కొని, సమశీతోష్ణం, అతిశీతలంవరకూ అన్ని వాతావరణాలూగల ప్రదేశాలూ ఉన్నాయి.

## ౭ హిందూదేశంలో సంచారం

1936 సం॥ ఆఖరుభాగంలోనూ, 1937 సం॥ మొదట్లోనూ నేను హిందూదేశమంతటా విసుగు విరామం లేకుండా తుపానువేగంతో తిరిగేను. రాత్రి పగలు తేడాలేకుండా విశ్రాంతికూడా లేకుండా తిరిగేను. దేశవ్యాప్తంగా ఎన్నికలు జరుగుతూండడంచేత, దేశం నాలుగుమూలల నుంచీ నన్ను రమ్మనమని తొందరచేస్తూవచ్చారు. నేను వెడితే ఎన్ని కలలో తప్పకుండా కాంగ్రెస్‌అభ్యర్థి గెలుస్తాడని ఒక అభిప్రాయం. నేను చాలావరకు కారులోనే తిరిగేను. కొంతవరకు రైలుప్రయాణం, విమానప్రయాణంకూడా చేశాను. దగ్గరప్రదేశాల కెళ్ళవలసివచ్చిన ప్పుడు ఏనుగుమీద,గుర్రంమీద,ఒంటెమీదకూడా ప్రయాణంచేశాను. అప్పుడప్పుడు చిన్నచిన్న స్టీమర్లు, లాంచీలుకూడా ఉపయోగించా. సైకిలుపై, ఆఖరుకు కాలినడకనుకూడా వెళ్ళవలసివచ్చేది. రోడ్లకు దూ రంగా ఉండి దారీ తెన్నూలేని గ్రామాలకు వెళ్ళవలసొచ్చినప్పుడు ఈ వాహనాల నుపయోగించక తప్పలేదు. నాతో ఎప్పుడూ రెండు దూర శ్రవణయంత్రాలుండేవి. అవి లేకపోతే పెద్దపెద్ద మహాసభల్లో జనానికి నామాటవినబడడమే అసంభవమయ్యేది. ఆ యంత్రాలను ఎన్నడూ

చూచి ఎరుగని బెలూచిస్థాన్, టిబెట్ సరిహద్దులవరకూ వానిని నాతో పాటే ఊరేగించాను. ప్రొద్దున్న మొదలు రాత్రి బాగా పొద్దుపోయే వరకూ సంచారంచేస్తూవచ్చాను ఎక్కడికెళ్ళినా బ్రహ్మాండమైన సభలు ఆయత్తంగా ఉండేవి. మధ్య మధ్య దారిపొడుగునా జనం అతి ఓర్మితో నాకోసం బారులుతీరి కనిపెట్టుకుండి ఆపుచేస్తూఉండేవారు. ఈ ఆగడంవల్ల ముందు కార్యక్రమం ఆలస్యమయ్యేది. కాని ఏమైతే మాత్రం అమాయకులైన గ్రామీణప్రజల ఆదరణను త్రోసి పుచ్చడం ఎలాగు? ఆలస్యంమీద ఆలస్యమయ్యేది. పెద్ద పెద్ద సభల్లో వేదికమీద కెళ్ళడానికి తిరిగిరావడానికికూడా చాలా నిముషాలుపట్టేది. ప్రతినిముషం విలువైనదే. ఈ నిముషాలన్నీ చేరి గంటలైతే రాత్రిఅయ్యే సరికి బోలెడంత ఆలస్యమయ్యేది. శీతకాలపు చలిలో వేలాది ప్రజలు, కుశలమైన బట్టలతో, వణుకుతూ శాంతంగా అలాగే కూచునుండేవారు. మొత్తంమీద రోజూ కార్యక్రమం 18 గంటలకు డేకేది. ఆనాటికివిశ్రాంతి తీసుకునేచోటుకెళ్ళేసరికి అర్ధరాత్రిఅయిపోయేది. ఒకసారి కర్నాటక రాష్ట్రంలో సంచారంచేస్తున్నప్పుడు అన్నిహద్దులూ అతిక్రమించాం. ఫిబ్రవరి మధ్యలో కర్నాటకదేశంలో పర్వతాలు అడవుల మధ్యనుంచి దారులు బాగాలేని ప్రయాణంచేయాలసొచ్చింది. ప్రొద్దున్న 8 గంట లకు ప్రారంభించిన ప్రయాణం మరునాటి ఉదయం 7 గంటలవరకూ సాగింది. దారిలో పెద్దసభలు ఆరు, లెక్కలేనన్ని చిన్న సభలు జరిపి తెల్లవారుఝామున 4 గంటలకు ఆఖరుసభ జరిపించాం. అది అంతకు 7 గంటలు ముందు జరుగవలసినది. ఆ సభ ముగించుకుని మరొక 70మైళ్ళ ప్రయాణంచేసి 7 గంటలకు మకాం చేసుకున్నాం. మొత్తం ప్రయాణం 415 మైళ్ళు. మళ్ళీ ఉదయం 8 గంటలకు మరునాటి కార్యక్రమం ప్రారం భించాం. అంటే 23 గంటలు ఏకధాటీగా సంచారమైంది.

ఎవ్వరో శ్రమపడి అంచనాలువేయగా ఈనాలుగైదునెలల్లో నా మీటింగులకు స్వయంగా హాజరైన జనం ఒక కోటిమంది అని తేలింది. వీరుగాక రోడ్డుప్రక్కసమావేశాల్లో నేను చూచిన జనం మరోకొన్ని లక్షలుంటారు. ఒక్కొక్క పెద్దసభలో సుమారు లక్షజనందాకా ఉం డేవారు. 20 వేలజనం హాజరైనసభలు సాధారణసభలక్రిందనే లెఖ్ఖ. ఒక్కొక్కప్పుడు ఊరిలోఉండే స్త్రీలు పురుషులు, పాపలు, అశేషంగా

ఖాళీచేసి ఊరివెలుపల మైదానంలో కూచుని నారాకను నిరీక్షించడం చూచి ఆశ్చర్యపడేవాడిని.

శరీరం తూలిపోకుండా, ఇంత వత్తిడిగల కార్యక్రమాన్ని ఎల్లా నిర్వహించానో నాకే తెలియదు. అది నాకూ ఆశ్చర్యంగానేఉంటుంది. బహుశా నాశరీరం క్రమంగా ఇలాంటి సంచారజీవితానికి అలవాటైపోయిందనుకుంటాను. ఊరూ ఊరూ మధ్య ప్రయాణంలో కారులోనే ఒక అరగంటసేపు నిద్రపోయేవాడిని. ఊరుదగ్గరకొచ్చేటప్పటికి లేవవలసి వస్తే మహాభారంగా ఉండేది. కాని లేవకతప్పేదికాదు. జయజయధ్వానాలుచేసి ప్రజలు లేపేసేవారు. సంచారాల్లో భోజనం బాగా తగ్గించేశాను. రాత్రివేళ భోజనం తరుచు మానేసేవాడిని. అభోజనంగాఉంటే తేలికగాఉండేది. కాని నిజంగా నాకు శక్తినిచ్చి నన్ను రక్షించినది అపారమైన ప్రజోత్సాహం, ప్రేమ. నే నెక్కడికెళ్ళినా అవే నన్ను చుట్టుముట్టేవి. ఇలాంటి ప్రేమాదరణలకు నేను అలవాటైపోయాను. కాని ఏరోజుకారోజే కొత్తగా ఆశ్చర్యంగా మాత్ర ముండేవి.

## ౨ ఎన్నికలు

నా సంచారంయొక్క ప్రధానోద్దేశ్యం రాబోయే ఎన్నికలు. సాధారణంగా ఎన్నికల్లో జరిగే తంత్రాలు పద్ధతులు నాకంతగా రుచించలేదు. ప్రజాస్వామికవిధానంలో ఎన్నికలు విధాయకంగా జరిగితీరాలి. వాటిని త్రోసేయడం అసాధ్యం అయినప్పటికీ ఎన్నికల్లో తరుచు మానవుని దుస్వభావమే బయటకొస్తోంది. యోగ్యుడైనవాడే విధిగా జయిస్తాడని చెప్పడానికి వీలులేదు. కాస్తంతస్వాభిమానంకలవాళ్ళూ, ముందుకు చొచ్చుకెళ్ళడానికి ఏ పద్ధతినైనా అవలంబించడానికి భిడియపడేవాళ్ళూ, ఇందులో ప్రవేశించడానికి వెనుకాడుతారు అయితే రాటుపోటులకాగగలిగి మొద్దుతేరినచర్మంగలవారూ, పెద్దగా నోరూవాయీగలవారూ ఎటుపడితేఅటు మలుపుకోగలిగిన అంతరాత్మలుగలవారూ మాత్రమేనా ప్రజాస్వామికాన్ని గుత్తకుపుచ్చుకోవలసినవారు?

ముఖ్యంగా, ఎన్నుకోవలసినవారిసంఖ్య తక్కువగానున్నప్పుడు, ఎన్నికదురంతాలు చాలా ఎక్కువగా ఉంటాయి. ఎన్నికదారులసంఖ్య బాగా పెరిగినపిమ్మట ఈ దురంతాలు కొంత తగ్గినాయి. ఎన్నికదా

రులసంఖ్య చాలా పెద్దదైతే ఒకప్పుడు తప్పుడుసమస్యలమీదనో అస త్యప్రచారంవల్లనో, మతంపేరుమీదనో, జనాన్ని ఉద్రిక్తపరచి తప్పు దారినిపట్టించవచ్చును. ఆ అనుభవమూ అయింది. ఏమైనా మొత్తం మీద ఎన్నికవర్గం పెద్దదిగా ఉంటేనే దుర్మార్గులకు సావకాశం తక్కు వగా ఉంటుంది. నా అనుభవంవల్ల వీలైనంత విశాలమైన నియో జకవర్గం ఉండడమే మేలనిపించింది. ఆస్తి అర్హతమీదనో, చదువు అర్హతమీదనో ఆధారపడి ఎన్నికదారులను సంకుచితపరచడంకంటె విశాలమైన ఎన్నికవర్గాన్నే విశ్వసించడం మంచిదని నా అభిప్రాయం. ఆస్తిసంబంధమైన అర్హత ఏవిధంగాచూచినా మంచిదికాదు. చదువు అర్హత అవసరమనీ మంచిదనే తోస్తుంది. కాని కేవలం అక్షరాస్యుడో కొద్దిగా వచ్చీరాని చదువుగలవాడో చెప్పేమాటకు వ్రాయడం చదు వడం చేతకాకపోయినా మంచి లోకజ్ఞానమూ, అనుభవమూ కలిగి ప్రాజ్ఞుడైన రైతు మాటకంటె ఎక్కువ విలువనివ్వడానికి, ఆతనిలో ఏమీ ప్రత్యేకత నాకగుపడడంలేదు. ఆ సంగతల్లాఉండగా రైతుసమస్య ప్రధానమైనప్పుడు, ఆతడి అభిప్రాయమే ముఖ్యం. వయస్సువచ్చిన స్త్రీ పురుషులందరికీ వోటుహక్కు ఉండాలనే నా అకుంఠితమైనవిశ్వా సం. అందువల్ల కొన్నిచిక్కులున్నాయని కూడా నాకు తెలుసును. హిందూదేశంలో వయోజనవోటింగుకు చెప్పబడే అభ్యంతరాలు అంత గాగణింపదగినవికావు. ధనికవర్గాలు, ప్రస్తుతంలో ప్రత్యేక సౌకర్యా లనుభవిస్తున్న కొన్నివర్గాలవారు, వారికుండేభయంవల్ల చెప్పేమాటే.

1937 సం॥ రాష్ట్రశాసనసభలకు జరిగిన ఎన్నికలు సంకుచిత ఎన్నికదారులతోనే జరిగినవి. మొత్తం జనాభాలో నూటికి 12 గురికి మాత్రమే వోటుహక్కుండేది. అంతకు పూర్వముండిన ఎన్నికహక్కు మీద ఇది చాలా ఎక్కువే. సంస్థానాలు కాక సుమారు 3 కోట్ల మంది జనానికిప్పుడు వోటుచేసే హక్కు కలిగింది. సంస్థానాలు మినహా దేశమంతటా ఎన్నికలు జరిగేయి. ప్రతి రాష్ట్రంలోనూ రాష్ట్రశాసన సభను ఎన్నుకోవలసిఉంది. చాలా రాష్ట్రాల్లో ఎగువసభలు కూడా ఉన్నవి. అందుచేత రెండువిధాల ఎన్నికలు జరుగవలసిఉంది. అభ్య ర్థులసంఖ్య వేలమీద నడిచింది.

ఈ ఎన్నికలలో నా అభిప్రాయం, చాలామంది కాంగ్రెసువాదుల అభిప్రాయంకూడా మామూలు ఎన్నికల ధోరణి ననుసరించలేదు. అభ్యర్థులైన వ్యక్తులనుగురించి నే నంతగా పట్టించుకోలేదు. స్వాతంత్ర్యంకోసం కాంగ్రెస్ సాగిస్తున్న జాతీయోద్యమానికి దేశవ్యాప్తంగా సానుకూలతను కలిగించాలనే నా అభిప్రాయం. ఎన్నికల మానిఫెస్టోలోని కార్యవిధానానికి ప్రజామోదాన్ని పొందడంకూడా నా లక్ష్యం. ఈ ఆదర్శం సిద్ధిస్తే అంతా బాగానే ఉంటుంది. అలాకాకపోతే ఏకొందరో గెలిచినా ఓడినా నాకొకటే.

నే నెప్పుడూ ఆదర్శాలను గురించే ప్రజలను హెచ్చరిస్తూ వచ్చాను. అభ్యర్థులను గురించి అంతగా మాట్లాడేవాడినికాను. వాళ్ళు మన మహోద్యమానికి పతాకధారులు మాత్రమే. అందులో చాలా మందిని నేను స్వయంగా ఎరుగను. వందలకొద్దీ ఆ పేర్లను మనసుకు పట్టించుకోవలసినంత కారణం నా కేమీ కనుబడలేదు. భారతస్వాతంత్ర్యానికీ, దానికోసం జరిగే పోరాటాలకీ, కాంగ్రెసుకీ వోట్లనిమ్మని అడిగేను. స్వాతంత్ర్యం వచ్చేదాకా పోరాటం సాగిస్తామనే ఒక్క వాగ్దానం తప్ప మరేవాగ్దానం నేను చెయ్యలేదు. మా లక్ష్యాన్ని బాగా అర్థం చేసుకొని అంగీకరించి, మా కార్యక్రమంతో ఏకీభవించి పనిచేయడానికి సిద్ధపడితేనే కాంగ్రెస్‌కు వోటుచేయవలసినదని ప్రజలను హెచ్చరించాను. ఈ కార్యక్రమంతోగాని, లక్ష్యంతోగాని ఏకీభవించకపోతే వోటుచేయవద్దనే చెప్పేను. అభ్యర్థులు తమ కిష్టులు కనుక వోట్లిస్తామంటే అక్కర లేదన్నాను. అవి దొంగవోట్లే. వోట్లు, ఎన్నికలు, సుదీర్ఘమైన మన స్వాతంత్ర్య ప్రయాణంలో ఎంతోదూరం తీసుకెళ్ళవు. మన లక్ష్యాన్ని కార్యక్రమాలను బాగా అవగాహనచేసుకుని మనసా అంగీకరించి, తరువాత జరుగవలసినపనిలో పాల్గొనకుండా, వోట్లు మాత్ర మిస్తే మనలను మనమే దగాచేసుకున్నట్లే. దేశాన్ని మోసంచేసినట్లే. మన ప్రతినిధులుగా నిజాయితీగల మంచివ్యక్తులుండాలి. కాని కేవలం వ్యక్తులుమాత్రం గణనకురారు. లెక్కకొచ్చేది మన లక్ష్యం, దాన్ని సాధించదలచుకున్న సంస్థ, ఎవరి ఏ స్వాతంత్ర్యంకోసం మనం దీక్షవహించామో ఆ దేశం క్షేమం. ఆ స్వాతంత్ర్యమంటే ఏమిటో బాగా తర్జనభర్జన చేశాను. కోట్లప్రజలకు దానివల్లకలుగవలసిన ప్రయోజనమేమిటోఆలోచించాను.

తెల్లవాళ్ళ ఆధిపత్యం పోయి నల్లవారి ఆధిపత్యం కాదు మనం కోరేది. నిజమైన ప్రజారాజ్యాన్ని కోరుతున్నాం. ప్రజలకోసం, ప్రజల దారిద్ర్యాన్ని, దౌర్భాగ్యాన్ని తొలగించడం కోసం, ప్రజల రాజ్యాన్ని మనం కాంక్షిస్తున్నాం.

నా ఉపన్యాసాలన్నిటికీ అదే నా పల్లవి. వ్యక్తులతో సంబంధం కలిగించుకోకుండా లక్ష్యాలను వ్యక్తపరచడంవల్లనే నేనీ ఎన్నికల సంరంభంలో ఇముడకలిగేను. అభ్యర్థులవిజయాన్నిగురించి నేనంతగా మనసును కలతపెట్టుకోనేలేదు. అంతకన్న పెద్ద సమస్యలమీదనే నా మనస్సు లగ్నమైంది. నిజానికి ఎన్నికలను ఆ దృష్టితో పరిశీలించడమే న్యాయం. వ్యక్తులైన అభ్యర్థులవిజయానికికూడా ఆ దృక్పథమే మంచిది. అందువల్ల ఆ అభ్యర్థి, ఆయనఎన్నికసంరంభమూ జాతీయ పోరాటమనే ఉన్నతస్థాయికి లేస్తాయి. లక్షలాది పేదప్రజలు, చిరకాలంగా తమ్ము బాధిస్తున్న దారిద్ర్యపిశాచాన్ని నాశనంచేయడానికి సాగిస్తున్న జాతీయపోరాటం అంతస్థులోకొస్తుంది ఈ ఎన్నికకూడా. నాయకశ్రేణికిచెందిన వందలాది కాంగ్రెస్‌ప్రచారకులనోటనుండి వెలువడిన ఈ అభిప్రాయాలు సముద్రంమీదనుంచి వచ్చిన పరిశుద్ధమైన గాలిపాటులా వచ్చి, సంకుచితాభిప్రాయాలను, ఎన్నికల కుతంత్రాలను తుడిచిపెట్టేశాయి. నా ప్రజలను నేను బాగా ఎరుగుదును. వాళ్ళంటే నా కెంతో ఇష్టం. ప్రజలమనస్తత్వాన్ని తెలుసుకోగల విజ్ఞానాన్ని నాకు వారినేత్రాలతోనే ప్రసాదించారు.

నేను ఎన్నికలను గురించి రోజురోజూ మాట్లాడుతూనే ఉండేవాడిని. కాని నా మనస్సెప్పుడూ దానిమీద లగ్నంకాలేదు. ఎన్నిక ధోరణి పైపైననే వచ్చిపోయేది. వోటర్లనుగురించి మాత్రమే నేనెప్పుడూ ఆత్రతపడలేదు. అంతకన్న పెద్ద విషయమైన కోట్లాది భారత ప్రజానీకంభవిష్యత్తే నిరంతరం నా మనస్సులో ఉండేది. నే నివ్వగలిగిన సందేశమేమైనాఉంటే వారందరికీ చెందవలసిందే. వాళ్ళు వోటర్లు అవునా కాదా అనే వివక్షతలేకుండానే స్త్రీలు పురుషులు పిల్లలు ఆ సందేశాన్నందుకోవలసినదే. అసంఖ్యాకమైన ప్రజలతో మనేకమయ్యే మానసికోత్సాహం నన్నెంతో ఉత్తేజపరచేది. ఆ ప్రజానీకంలో ఒక్కడ్నై వాళ్ళమనోభా- ... ఏకమైపోవడం ఒక్కటేకాదు. అసంఖ్యాక

మైన వారి చూపులు నా చూపుల్లో కలిసిపోయి, నన్ను నిశ్చేష్టునిగా చేసేవి. ఏదో మొదటిసారి కలసిన అనుభవంలాంటిదికూడా కాదు. కారణమెవ్వరూ చెప్పలేరు కాని, చిరకాలంనుంచి ఎరిగున్నవారివలె ఆప్యాయతతో మా దృష్టులు కలిసేవి. నేను సభలో చేతులు జోడించి నమస్కారంచేసేసరికి, నా ఎదుట వేలాదిగా జోడింపబడిన చేతులు లేచేవి. వాళ్ళముఖాలమీాద సస్నేహమైన చిరునవ్వు తొణికిసలాడేది. ఆ సభలోనుంచి నన్నభినందిస్తూ చిరుధ్వని లేచి నన్నాలింగనంచేసుకునేది. ఆ పిమ్మట నా సందేశాన్ని అందిచ్చేవాడిని. వాళ్ళకు నామాటలుగాని, వాటిలో ఇమిడిఉన్న అభిప్రాయాలుగాని ఎంతవరకు తెలిశాయో నేను చెప్పలేను. కాని మాటలకంటే విస్పష్టంగా వాళ్ళ భావాలను తెలియచేసే ఒక అగాధమైన వెలుగు వారినేత్రాల్లో కనుబడేది.

## ౮ సామాన్య జనుల సంస్కృతి

ఈ విధంగా భారతప్రజల వర్తమానస్థితికి సంబంధించిన నాటకాన్ని చూడగలిగేను. గతానికి వాళ్ళను బంధించే కట్టుత్రాళ్ళనూ కనుక్కున్నాను. భవిష్యత్తునందు లగ్నమైనవారిదృష్టినీ గుర్తించాను. ప్రతిచోట వారి వర్తమానజీవితంమీాద, ఏదోవిధంగా పురాతన సంస్కృతియొక్క ప్రభావం కనబడుతూనేఉంది. వేదాంతం, సాంప్రదాయం, చరిత్ర, పుక్కిటిపురాణకథ వీటన్నిటియొక్క కలగాపులగమే వారి సంస్కృతికిఆధారం. వీటన్నిటినీ వేర్వేరుగా విడదీయడం సాధ్యంకాదు. రామాయణం భారతంవంటిపురాణాల అనువాదాలూ, సంగ్రహాలూ వాళ్ళకు బాగా తెలుసును. ఆ పురాణాల్లోని కథలు, వాటిలోని నీతులు వారిమనస్సుల్లో బాగా పట్టున్నాయి. వ్రాయడం చదువడం తెలియని గ్రామప్రజలు పురాణాల్లోని వందలకొద్దీపద్యాలను కంఠోపాఠంగా వప్పగిస్తారు. వాళ్లు మాట్లాడుతుంటే ఆ పురాణాల్లోని కథల్లోనుంచి, వాటి నీతులలోనుంచి ఎన్నోసామ్యాలు దొర్లుతూఉంటాయి. వాటికి సంబంధించిన సామెతలు ధారాళంగా ఉపయోగిస్తుంటారు. లౌకికవ్యవహారాలనుగురించి గ్రామస్థులు మాట్లాడుకుంటుంటే, ఒక్కొక్కప్పుడు అది సాహిత్యగోష్ఠిగా మారుతుండడం నాకు ఎంతో ఆశ్చర్యం కలిగిం

చేంది. నా మనస్సులో చరిత్రకు సంబంధించిన చిత్రాలో. లేక మరో విధంగా ధృవపడిన చిత్రాలో ఉంటే. చదువురాని సాధారణ రైతుమనస్సులో కూడా ఏవో కొన్ని చిత్రాలుంటాయని గ్రహించాను. కాకపోతే ఆయనచిత్రాలకు ఆధారం పురాణాల్లోని వీరులు, వీరవనితలు. చరిత్ర మీద ఆధారం చాలా తక్కువ. కాని ఏ చిత్రమైనా మనస్సులో స్పష్టంగా దృఢంగా మాత్రం ఉంటుంది.

వాళ్ళ శరీరాలను ముఖాలను పరిశీలనగా చూచేవాడిని. చాలా మంది ముఖాల్లో తెలివితేటలు, చురుకుతనం కనపడుతుంది. శరీరాలు నిబ్బరంగా మంచి సౌష్టవంగా ఉంటాయి. స్త్రీలల్లో ఒక హుందా,సున్నితం, చలాకీ, అంతస్థు,దర్జా ఉంది. కాని చాలామంది ముఖంమీద విచారం కనుపించేది. ఆర్థికంగా మిగిలినవాళ్ళకన్న కాస్తంతకలిగిఉన్న కుటుంబాలలోని స్త్రీలు, మామూలుగా అందచందాలతో ఉన్నారు. ఒక్కొక్కప్పుడు గ్రామాల్లో తిరుగుతున్నప్పుడో, లేక రోడ్డుమీద పోతున్నప్పుడో మంచి అంగసౌష్టవం కలిగిన పురుషుడో, లేక సుందరమైన స్త్రీయో కనుబడుతూ ఉంటే నాకు చాలా ఆశ్చర్యంకలిగేది. వాళ్ళు పూర్వకాలపు గుహల్లోని రంగులచిత్రాలను స్ఫురణకు తెప్పించేవారు.హిందూదేశం కొన్ని సంవత్సరాలుగా ఎంతో దారిద్ర్యస్థితిలోనున్నా ఇంకా ఈ కోవ, చావ గల మనుష్యులు ఎల్లాఉండగలిగారా అనే నాకుఆశ్చర్యం కలుగుతుంటుంది. మన దేశస్థితి బాగుపడితే, మనఅభివృద్ధికి ఎక్కువ సావకాశా లేర్పడితే ఈ జనంతో ఏపని చెయ్యలేము ?

దారిద్ర్యం, దాని ఫలితంగా వచ్చే ఇతర వ్యసనాలు దేశమంతా వ్యాపించాయి. ప్రతివాడిముఖంమీద ఈ అవలక్షణం కనుబడుతోంది. జీవితం చితికిపోయి, వికృతరూపం దాల్చి, చెడుగ్గా మారిపోయింది. జీవితాని కొక దారితెన్ను, భద్రత లేదు. ఇదంతాచూడడమేమీ సంతోషదాయకం కాదు, కాని కంటపడక తప్పదు. నిస్పృహా, ఏమొచ్చినా మాట్లాడకుండా భరించే మన తత్వం ఎక్కువైపోయింది. కాని వేలకొద్దీ సంవత్సరాలనుండీ, మన సంస్కృతి సాంప్రదాయములనుంచి లభించిన వారసత్వమైన నెమ్మదీ, సద్భావం మాత్రం అలాగే ఉన్నాయి. ఎన్ని కష్టాలైనా ఆ సత్ శీలాన్ని తుడిచిపెట్టలేకున్నాయి.

# ౧౦ రెండు జీవితాలు

ఈవిధంగానూ, ఇంకా అనేక విధాలుగా గతంలో లీనమైపోయిన భారత ఇతిహాసంలోనుంచి, వర్తమానచరిత్రలోనుంచీ కూడా భారతదేశాన్ని సాక్షాత్కారంచేసుకోవడానికి ప్రయత్నించాను. ఇందుకోరకు గతించినవారి అభిప్రాయాలను అనుభవాలను ఆలోచనలను గ్రహించాను. సజీవులైవున్నవారి ఆలోచనలనుకూడా స్వీకరించాను. అంతులేని ఈ ఊరేగింపులో చివర నిలబడి కష్టంతో నడుస్తూన్నవాళ్ళందరితో కలిసిపోయాను. తర్వాత నేను విడిపోయి కొండకొనమీద నుంచి క్రిందకు చూచినట్లు చూస్తుంటాను.

ఈ ప్రయాణమంతా ఎందుకు? ఈ తెంపులేని ఊరేగింపు ఎందుకు? ఎక్కడికి? ఒకవిధమైన అలసట, నిస్పృహ నన్నావహిస్తాయి. వాటినుంచి తప్పుకోడానికి ఏదోవిధమైన నిస్సంగత్వాన్ని అలవాటు చేస్తుంటాను. క్రమంగా నాబుద్ధి ఇంతవరకూ తయారైంది. నా విషయమై ఎక్కువ శ్రద్ధవహించడం కాని, నాకు ఏంజరిగిందో గణించుకోవడంకాని మానేశాను. ఆ విషయంలో నా మనోరథం నెరవేరినా నెరవేరకపోయినా అనుకోవడం మాత్రం అలాగే అనుకుంటూఉంటాను. పూర్తియైన నిస్సంగత్వం రావడానికి నాలో పెద్ద అగ్నిపర్వతముంది. హఠాత్తుగా నేను తలపెట్టిన నిశ్చయాలన్నీపోయి, వాటితోపాటు నా నిస్సంగత్వమూ పోతుంది.

ఈ విషయంలో నేను చేసిన కొంతసాధనైనా ఊరికేపోలేదు. మంచి పనిరద్దీలో ఒకసారి నిస్సంగుడనై ఆపనిలోనుంచి దూరంగా తప్పుకోగలను. ఒక్కొక్కప్పుడు ఏదో బుద్ధిపుట్టినా, మామూలుపనులన్నీ మరచిపోయి గంటోరెండుగంటలో ఏకాంతంగా ఆలోచనాప్రపంచంలో మునిగి ఒక కొత్తజీవితానందాన్ని అనుభవించగలను. ఏమైనా ఈ రకాలైన జీవితాలు ద్వంద్వంగా నడిచాయి. రెండూకలిసే బంధింపబడ్డాయి, కాని విడివిడిగామాత్రం ఉంటాయి.

# సింధు లోయ సంస్కృతి

సింధుదేశంలోని మహెంజొదారో దగ్గర పశ్చిమపంజాబులోని హరప్పా దగ్గర బయటపడిన శిథిలాలు భారతదేశంయొక్క చరిత్రను చక్కగా విపులపరచే పూరాతనచిహ్నాలు. అవి సింధునదిలోయ సంస్కృతికి సంబంధించిన శిథిలాలు. ఆ శిథిలాలు భారతచరిత్రనుగురించి మనకుండిన అభిప్రాయములను పూర్తిగా మార్చివేశాయి. దురదృష్టవశాత్తు వాటిని త్రవ్వడం మొదలుపెట్టిన కొద్దిరోజులకే ఆ పని మానుకోవలసివచ్చింది. గతించిన పదమూడేండ్లనుంచి ఏమీపనిజరుగలేదు. సామ్రాజ్యపుడాంబుదర్పాలకు డబ్బు లోటుండదు కాని, ఇలాంటి పనులకు మాత్రం డబ్బులేదనే కారణం అడ్డొస్తుంది. నాల్గవదశాబ్దం మొదట్లో ఏర్పడిన డబ్బుఎద్దడివలన ఈ పని ముందాగిపోయింది. ద్వితీయమహాసంగ్రామంవల్ల పూర్తిగా ఆగిపోయింది. ఆఖరుకు త్రవ్వి తీసిన శిథిలాలను జాగ్రత్తపెట్టడంకూడా అశ్రద్ధయిపోయింది. 1931సంవత్సరంలో ఒకసారి 1936 సంవత్సరంలో ఒకసారి నేను మహెంజోదారోకు వెళ్ళేను. నేను రెండోదఫా వెళ్ళినప్పుడు అప్పటికే బయటపడ్డ కొన్ని భవనాలు వానదెబ్బకూ, ఇసుకదుమారాల తాకిళ్ళకూ బాగా దెబ్బతిన్నట్లు తోచింది. 5 వేల ఏండ్లుగా ఇసుకలోనూ, మట్టిలోనూ కప్పబడి సురక్షితంగా ఉండిన శిథిలాలు, బయటపడడంతోనే ఎండవానలకు గురియై శీఘ్రంగా అరిగి తరిగిపోతున్నాయి. అమూల్యమైన ఈ పురాతన శిథిలాలను జాగ్రత్తపెట్టడానికేమీ కృషి జరుగడంలేదు. త్రవ్వగా బయటపడిన నిర్మాణాలను యథాతథంగా భద్రపరచి ఉంచడానికి తన కేమీ ధనసహాయం లభించడంలేదని అక్కడి పురావస్తుశాఖాధికారి చెప్పేడు. గత ఎనిమిదేండ్లుగా ఏమైనదో నాకు తెలియదు. కాని బహుశా చాలావరకవి శిథిలమై కొన్ని సంవత్సరాలనాటికి, మహెంజొదారో ప్రత్యేకత, దాని లక్షణాలు కూడా ఏమ్రమైపోవచ్చును.

ఇది క్షంతవ్యంకాని విషాదవృత్తాంతం. పునర్నిర్మాణంచేయడం అసాధ్యమై, అపూర్వసంపద నశించిపోతుంది. వాటిని బొమ్మలలో

చూడవలసిందే. చరిత్రలో వర్ణించగా చదువుకొని జ్ఞాపకం తెచ్చుకో వలసిందే.

మహెంజొదారోకు హారప్పకూ మధ్య చాలాదూరం. ఈ రెండు చోట్లా శిథిలాలు అప్రయత్నంగా యథాలాభంగా కనుక్కోబడ్డాయి. ఈ రెండు ప్రదేశాల మధ్యనూ పూర్వకాలపు మానవుని హస్తనైపుణ్యాన్ని ప్రదర్శించే శిథిలాలెన్నో ఉండే ఉంటాయి. యావద్భారత దేశంలో ముఖ్యంగా ఉత్తర హిందూస్థానంలో ఈ నాగరికత బహు వ్యాప్తంగా ఉండేది. ఈ శిథిలాలనన్నిటిని త్రవ్వడం, తద్వారా భారత భూమి గతయశస్సును నిరూపించే అపూర్వవిషయాలను తెలుసుకోవడం త్వరలో జరుగవచ్చును. ఈ సంస్కృతికి సంబంధించిన శిథిలాలు, పశ్చిమాన కథియవాడ్‌లోనూ, పంజాబ్‌లోని అంబాలా జిల్లాలోనూ బయటపడ్డాయి. గంగాలోయవరకూ కూడా అవి వ్యాపించిఉన్నా యనుకోవడానికి చాలా సావకాశాలున్నాయి. అవి కేవలం సింధులోయకు మాత్రమే సంబంధించిఉండకపోవచ్చును మహెంజొదారోలో దొరికిన శాసనాల నింకా పూర్తిగా శోధించనేలేదు. తెలిసినంతలోనే అవి చాలా అమూల్యమైన భోగట్టానిస్తున్నాయి. సింధునదీప్రాంతీయమైన సంస్కృతి పరిపూర్ణమైన వికాసాన్నిపొందింది. ఆ పరిపూర్ణత సిద్ధించడానికి కొన్నివేల ఏండ్లు పట్టియుండవచ్చును. ఇందులో ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే, ఈ నాగరికత ప్రధానంగా లౌకికం. మత ప్రాబల్యం సకృతుగా ఉన్నా, దాని కంత ప్రాముఖ్యతగాని గణ్యతగాని లేకపోయింది. తరువాత వికాసంచెందిన నాగరికతకంతకూ అదే నాంది.

దీనిని గురించి సర్ జాన్ మార్షల్ ఇలా వ్రాశాడు —

"మహెంజొదారోలోనూ, హారప్పలోనూ బయటపడిన నాగరికత క్రొత్తదికాదు. కొన్నివేల సంవత్సరాల మానసికకృషియొక్క పరిణామం. ఈ నాగరికత భారతభూమియందంతటా పరివ్యాప్తమైన దనడాని కేమీ సందేహంలేదు. కనుక పర్షియా, మెసపొటేమియా, ఈజిప్టులతోపాటు, ఇండియాలోకూడా నాగరికతాభివృద్ధికి ఏనాడో కృషి ప్రారంభింపబడిదని అంగీకరింపకతప్పదు. భారత దేశమంతటి సంగతి అలా ఉండగా సింధుప్రాంతంలో ఒక విశిష్టమైన నాగరికత ఉండేది. ఆ నాగరికత ఆకాలంలో మెసపొటేమియా, ఈజిప్టు దేశాల నాగరికతల

కేవిధంగాను తీసిపోలేదుసరికదా, కొన్ని విషయాల్లో వాటికన్న ఉత్తమమైనవి."

సింధునదీలోయలోని ప్రజలు ఆకాలపు * సుమేరియా నాగరికతకు సన్నిహితులుగా ఉండేవారు. అక్కాడ్‌లో భారతీయపద్ధతిని నిర్మింపబడిన ఇండ్లు — బహుశా వర్తకులవి కావచ్చును—ఉన్నట్లు కొన్ని ఆధారాలు దొరికినాయి. సింధుదేశపు నగరాలలో తయారైన అపూర్వ వస్తుసంపద టైగ్రిస్, యూఫ్రటిస్ నదీప్రాంతములలోని పట్టణముల వరకూ వ్యాప్తి చెందింది. అలాగే సుమేరియాకళాఖండాలను, మెసపొటేమియా అలంకారసామగ్రిని చూచి సింధుప్రజలు అనుకరించారు. వాణిజ్యం కేవలం ముడిసరకుల్లోనూ, విలాససామగ్రిలోనూ మాత్రమే జరిగేదికాదు. అరేబియాసముద్రరేవులలో పట్టుబడిన చేపలను మహెంజొదారో ప్రజ లారగించేవారని 'గార్డన్ చైడ్' అనే చరిత్రకారుడు వ్రాశాడు.

ఆరోజుల్లోనే ఇండియాలో ప్రత్తితో బట్టలు తయారుచేసేవారు. మార్షల్ ఆనాటి సింధులోయనాగరికతను, మెసపొటేమియా నాగరికతతో పోలుస్తూ ఇలా వ్రాశాడు.

"కొన్ని ముఖ్యమైన విషయాలు చెప్పాలిసొస్తే ప్రత్తినివడికి నూలు తయారుచేసి దానితో బట్టలునేసే నేర్పరితనం అప్పట్లో ఒక్క ఇండియాలో మాత్రమే ఉండేది. ఆ తరువాత రెండుమూడు వేల ఏండ్ల దాకా పాశ్చాత్య దేశాలు ఆ సుఖువును గ్రహించనేలేదు. చరిత్రను మనం శోధించి చూచినంతవరకు ఈజిప్టులోగాని, మెసపొటేమియాలోగాని, పశ్చిమాసియాఖండంలోగాని మరెక్కడగాని మహెంజొదారో ప్రజలు కట్టిన విశాలమైన ఇండ్లు, స్నానశాలలవంటికట్టడాలు మరెక్కడా కనబడవు. ఆదేశాల్లో దేవుళ్ళకు గుళ్ళు కట్టడానికీ, మహారాజులకు గోరీలు కట్టడానికీ చాలా ప్రయాసపడేవారు. కావలసినంత డబ్బు ఖర్చు చేసేవారు. మామూలుజనానికి మట్టికొంపలే, కాని సింధులోయనాగరికతలో అది తారుమారైనది. సాధారణజనానికి ఉపయోగపడే నిర్మాణాలే గొప్పవి. అందమైనవి. ప్రజాసామాన్యంకోసం మహెంజొదారోలో

* యూఫ్రటీస్ నదీతీరస్థమైన దేశం.

నిర్మింపబడిన స్నానపుగదులు, మురుగునీటి పారుదల కట్టడాలవంటివి మరెక్కడా ఎంత గాలించినా కానరావు. చక్కగా కాలిన ఇటుకలతో రెండంతస్థుల మేడలను, స్నానపుగదులు, నౌకరులనివాసములు వగైరా సౌకర్యములతో సామాన్య గృహస్థులుకూడా తమ స్వంత ఉపయోగం నిమిత్తం భవనాలను కట్టుకున్నారు.

ఈ శిథిలాలనన్నిటినీ త్రవ్వించి బయటపెట్టినవాడు, సింధులోయ సంస్కృతి విషయమంతా క్షుణ్ణంగా తెలిసినవాడు సర్ జాన్ మార్షల్. ఆయన ఇలా చెప్పేడు--"సింధుసంస్కృతిలో మతానికీ, చిత్రకళకీ ఒక ప్రత్యేకమైన విశిష్టత ఉన్నది. ఆకాలంనాటి ఇతరదేశాల చిత్ర కళల్లో దాని పోలికలు కనబడవు. ముఖ్యంగా పింగాణీతో పొట్టేళ్ళు, కుక్కలు వగైరా జంతువులను చేయడం కాని, ముద్రికలమీద చక్కని నగిషీపనిచేయడం కాని ఇతరదేశాల్లో లేదు. అందులోనూ పొట్టి కొమ్ములూ, ఉన్నతమైన మూపురముగల ఎద్దులను చెక్కిన ముద్రికలు ప్రత్యేకంగా పేర్కొనదగినవి. చెక్కడపుపనిలోనూ, సౌందర్యమూ, చిత్రకళారచనలోనూ లాలిత్యమూ పుంండా కనుబడుతాయి. ప్రతి గీత ఒక భావాన్ని ప్రకోపింపచేస్తుంది. హరప్పలో బహు సున్నితంగానూ అద్భుతంగానూ తయారుచేయబడిన రెండు మానవవిగ్రహాల వంటి కళాఖండాలను చూడాలంటే గ్రీసుదేశపు పురాణకాలానికి పోవలసిందే. సింధుప్రజల మతాచార వ్యవహారాల్లో ఇతర దేశాలలోని మతాల పోలికలు అనేకంగా ఉన్నమాట నిజమే. చిరకాలంగా వ్యాప్తంలోఉన్న అనేకమతాల సంగతికూడా అంతే. స్థూలంగాచూస్తే వారిమతంకూడా నేటికీ మనకు ప్రత్యక్షంగా కనుబడుతున్న హిందూ మతమనే చెప్పాలి. రెండింటికీ తేడా అంతగా కనుబడదు."

సింధులోయనాగరికత, పర్షియా, మెసపొటేమియా, ఈజిప్టు దేశాల నాగరికతతో వాణిజ్యరీత్యా సన్నిహితత్వాన్ని ఏర్పరచుకున్నట్లు స్పష్టపడుతోంది. అన్నివిషయాలలో వాటికన్న చాలా అతీతంగా కూడా కనుబడుతుంది. అది ధనికులైన వ్యాపారస్తుల కెక్కువ పలుకుబడి ఉండే నాగరికతఅనే చెప్పాలి. ఆనాటి వీథుల్లో చిన్నచిన్న దుకాణాలు వరుసగా అమర్చబడుండేవి. నేటి మన బజారు వీథులలాగే ఉన్నాయి. ఆనాటి మనసగరాల్లోని కళాకారులు పరదేశ మార్కెట్ల

కోసమే సామగ్రిని తయారుచేస్తూఉండేనా రనుకోవాలి. ఈ వస్తు సామగ్రిలో వ్యాపారాన్ని సాగించడాని కొక స్థిరమైన విలువగల నాణెములు ఏవైనా ఉండేవేమో రూఢిగా తెలియడంలేదు. ఆకాలపు గృహస్థులతాలూకు పెద్దపెద్ద ఇండ్లను, వాటికిచేరిఉన్న పెద్ద కొఠారాలను బట్టి, అవి ధనికులైన వర్తకులవనే అనుకోవాలి. వాటిసంఖ్యను బట్టి, వైశాల్యాన్నిబట్టీ చూస్తే, అప్పట్లో వర్తకులు చాలా ధనవంతులుగా ఉండేవారని నిర్ధారణగా ఋజువవుతోంది. అమూల్యమైన బంగారు నగలు, వెండి, నవరత్నాలు, నగిషీలతో నిండిన పింగాణీపాత్రలు ఇత్తడిపాత్రలు, రాగిరేకుపాత్రలు, లోహపు పనిముట్లు, ఆయుధాలు, అక్కడి శిథిలాల్లో దొరికినాయి. చక్కగా ప్లానుప్రకారం తీర్చి దిద్దబడిన వీధులూ, పరిశుభ్రంగా ఉంచడానికి వీలైన మురుగుకాల్వలూ, సమర్థతతో అమలుజరుపబడుచుండిన మ్యునిసిపల్ పరిపాలనయొక్క ఉనికిని ధృవపరుస్తున్నాయి. పట్టణంలో రాజవీధులను, సందులను, సూటిగా నిర్మాణంచేయడాని కవసరమైన నగరనిర్మాణచట్టాలను (టౌన్‌ప్లానింగ్) నిష్కర్షగా అమలుజరిపే శక్తి ఆ మ్యునిసిపాలిటీలకుండే"దనికూడా స్పష్టపడుతోంది. సింధునదివరదలవల్ల పట్టణాలు దెబ్బతిన్నప్పుడల్లా నగర పునర్నిర్మాణానికి సావకాశాలు ఏర్పడేవి" అని వ్రాశాడు చరిత్రకారుడు 'చైడ్.'

ఆనాటి సింధులోయసంస్కృతికాలానికీన్నీ ఈనాటికిన్ని మధ్య అనేక ఖాళీలు ఏర్పడ్డాయి. ఎన్నోశకాలు గడిచిపోయాయి. ఒకశకాన్ని మరొకశకాన్ని కలిపే లంకెలన్నీ కనబడవు. అనేకవిషయాలు జరిగేయి. అనేకమార్పులుకూడా జరిగినాయి. కాని ఆరేడువేల ఏండ్లనాటి సింధుసంస్కృతిని, నేటి నవసంస్కృతితో లంకె కలిపి సమన్వయపరచే తెంపులేని ఏకత్వం, బంధనం ఒకటి ఎప్పుడూ ఉంటూనేవచ్చింది. మహెంజొదారోలోనూ, హారప్పలోనూ ఈనాటికీ అమలులోఉన్న భారత సాంప్రదాయాలు, అలవాట్లు ఎన్నో కనబడుతాయి. కర్మకాండలోనూ, కళా కౌశల్యంలోనూ, జుట్టు బొట్టు కట్టుల్లోనూ, ఆనాటిలక్షణాలు ఇప్పటికీ అలాగే ఉన్నాయి. ఆ నాగరికతయే తన ప్రభావాన్ని చాలావరకు పశ్చిమాసియామీదకూడా ప్రసరింపచేసింది.

అంతటి పురాతనకాలంలోనే భారతదేశం శైశవస్థితిలో లేదు. ఎన్నోవిధాలుగా వృద్ధిలో ఉన్నట్లు కనుబడుతుంది. ఏదో లోకాతీత మైన విషయాలను గురించి మీనమేషాలను లెక్కపెట్టుకుంటూకూర్చొ కుండగా, నిత్యజీవితంలోనూతన సౌకర్యాలనూ, కళావిశేషాలనూ సృష్టించింది. మంచిస్నానాలగదులు, చక్కటి మురుగునీటిప్రవాహాలు వాళ్ళ అభిరుచులకు చిహ్నాలు.

## ౨ ఆర్యుల రాక

ఈ సింధులోయ నాగరికతకు కారకులెవ్వరో, వారెక్కడనుంచి వచ్చారో మన కీనాటికీ తెలియదు. బహుశా వారినాగరికతకూడా దేశీయమేకావచ్చును. బహుశా దక్షిణభారతదేశంలోని సంస్కృతి కూడా ఈ కోవకుచెందినదే అనుకుంటాను. దక్షిణదేశంలోని ద్రవిడ జాతులకూ, వీరికీకూడా చాలా సన్నిహితమైన పోలికలున్నాయని పండితుల అభిప్రాయం. మహెంజొదారోకాలంనాటికి కొన్నివేల సంవత్సరాలకు ముందే వారెక్కడనుంచో భారతదేశంలో ప్రవేశించి ఉండవచ్చును. ఏమైనా స్థూలంగా ఆలోచిస్తే ఈ నాగరికతను సృష్టించినవారంతా భారతీయులే అనుకోవాలి.

ఈ సింధులోయ సంస్కృతి ఎట్లాంతరించిందనే ప్రశ్నకు కొందరు ('గార్డన్ చైల్డ్'కూడా)హఠాత్తుగా సంభవించిన ఏదో అనిర్వచనీయమైన గొప్ప ప్రళయంవల్ల అంతరించిందని చెపుతున్నారు. సింధునది ఉపద్రవ మైనవరదలకు ప్రసిద్ధి. పట్టణాలు, గ్రామాలు ఎన్నోసార్లు కొట్టుకుపోయాయి. వాతావరణంలో గలిగిన మార్పులువల్ల కూడా క్రమంగా పంటభూములమీద ఇసుకమేటలు పడుండవచ్చును. మహెంజొదారో శిథిలాల్లోనే ఇసుకమేటలు తెరలు తెరలుగా పడి భూమి ఎత్తైపోయిన ఆధారాలు కనుబడుతున్నాయి. అందువల్ల ఆకాలపు జనం పాతపునాదులమీదనే ఎత్తుగా కట్టుకున్నట్లు కనబడుతున్నాయి. కొన్ని ఇళ్ళు రెండుమూడు అంతస్థుల భవనాలుగా కనుబడుతూఉన్నా, నిజానికి క్రమంగా భూమిఎత్తు పెరిగినకొద్దీ అవసరాలనుబట్టి పెంపుచేసుకున్న ఇళ్ళే. పూర్వకాలం సింధురాష్ట్రం ధనవంతమైన పంటభూమి. మధ్య యుగంనాటినుంచి అది క్రమంగా ఎడారైపోయింది.

వాతావరణంలో కలిగిన మార్పులు ప్రజల జీవితపద్ధతులలో అనేకమార్పులను కలిగించియుండవచ్చును. కాని మొత్తంమీద చూస్తే, గంగామైదానం, ఇంకా పైవరకూకూడా వ్యాప్తమైన ఈ నాగరికతలో, ఎక్కడో కొన్నిచోట్లతప్ప వాతావరణం పెద్దమార్పులు తెచ్చిపెట్టినదనడానికి వీలులేదు. వీటినిగురించి ఇదమిత్థమని నిర్ణయాలు చేయడానికి తగినంత ఆధారాలు కనుబడవు. బహుశా ఈ పురాతన నగరాలను కప్పేసిన ఇసుకే వాటిని జాగ్రత్తపెట్టియుండవచ్చును. పురాతన నాగరితాచిహ్నాలు కాలక్రమేణా శిథిలమైపోయియుండవచ్చును. ముందు ముందు జరిగే పురావస్తుపరిశోధనలు కొత్తకొత్త సంబంధాలు, విశేషాలు బయలుపెట్టగలవు.

సింధుసంస్కృతికీ, తరువాత వచ్చిన సంస్కృతికీ చాలా పోలికలున్నా, చాలవరకు దానిపరిణామంగానే కనుబడినా స్థూలంగా కనుబడే తేడాలు కొన్ని ఉన్నాయి. తరువాతి సంస్కృతి వ్యవసాయక ప్రాతిపదికమీద జీవితవిధానాన్ని రచించింది. అట్లని పట్టణాలు, నాగరికజీవనం లేవనికాదు. కాని ప్రాతిపదిక వ్యవసాయం. బహుశా వాయవ్యదిశనుండి భారతదేశానికి తండోపతండాలుగా కొట్టుకొచ్చిన ఆర్యులు ఈ వ్యావసాయిక దృష్టిని కలిగించి ఉండవచ్చును. సింధులోయసంస్కృతికి వెయ్యిసంవత్సరాల అనంతరమే ఆర్యులు మనదేశం వచ్చినట్లు విశ్వసించబడుతోంది. అయినా అంతకుపూర్వం కూడా ఆర్యులు అనేక తెగలుగా, వాయవ్యమూలనుంచి మనదేశంలో అప్పుడప్పుడు ప్రవేశించి, మనలో లీనమైపోవడం అసంభవంకాదు. ద్రవిడులు సింధులోయసంస్కృతికి చెందినవారని ఊహించవచ్చును. వారితో వాయవ్యాన్నుంచి వచ్చిన ఆర్యులకలయికతోనే భారతీయసంస్కృతిపెంపు ప్రారంభమైనదని చెప్పవచ్చును. వారుభయుల కలయికవల్లనే భారతీయసంస్కృతీ, జాతులూ ఏర్పడడం ఆరంభించాయి. ఉభయుల ప్రత్యేకలక్షణాలు ఈ జాతులలో ప్రత్యక్షంగా కనబడేవి. తరువాత శకాల్లో చాలాజాతులు చేరాయి. ఇరాన్, గ్రీసు, ఫార్తియా, బాక్ట్రియా, సిథియా దేశస్థులు, హూణులు, తురుష్కులు (ఇస్లాంకు పూర్వం) ఆదికాలపు క్రైస్తవులు, యూధులు, పారశీకులు వగైరాలు వచ్చి చేరారు. ముందు కాస్తంత వేరుగా కనబడ్డా క్రమంగా హిందూ

దేశంలో కలిసిపోయారు. డాడ్వెల్ వ్రాసినట్లు 'అనంతమైన సముద్ర గర్భంలోలాగున' చేరిపోయారు. వర్ణభేదాలతో, ప్రత్యేకంగా ఉండే భారతదేశానికి, విదేశాలనుంచి వచ్చిన అనేకజాతులను, సంస్కృతులను సంలీనంచేసుకొనే ఈ మహత్తరశక్తి ఎక్కడుందా అని ఆశ్చర్యం కలుగవచ్చును. బహుశా ఆలాంటి శక్తి ఉండబట్టే భారతదేశం ఎప్పటికప్పుడు కొత్తశక్తులను సంలీనంచేసుకుంటూ తన జీవశక్తిని నిలబెట్టుకోగలుగుతోంది. ముసల్మానులుకూడా కొత్తగావచ్చినప్పుడు ఈప్రభావానికి లోనుకాకపోలేదు. టర్కీ ముసల్మానులు తమ పూర్వీకులైన శాకులు, యూచీలవలెనే హిందూమతముయొక్క ఆకర్షణకు లోబడి క్రమంగా హిందూమతంలో చేరిపోయారు" అని చరిత్రకారుడు విని సెంటు స్మిత్ వ్రాశాడు.

## 3 హిందూమతమంటే?

విని సెంట్ స్మిత్ పైన ఉదహరించినట్లుగా హిందూమతం, హిందువులు అనే మాటలు ఆ సందర్భంలో ఉపయోగించడం సరికాదని నా అభిప్రాయం. హిందు అనేమాట విశాలదృష్టితో ఉపయోగిస్తే ప్రమాదం లేదు కాని, నేటి మతసంబంధమైన అర్థంతో ఆమాట ఉపయోగించకూడదు. మన పురాణేతిహాసాల్లో 'హిందూ' అనేమాట ఎక్కడా కనుబడదు. క్రీ. శ. 8వ శతాబ్దంలో ఒక తాంత్రికగ్రంథంలో 'హిందూ' అనే పదం వాడబడిందని వింటున్నాము. ఏమతస్థులు కాకుండా ఒక దేశపుప్రజలనేభావంలోనే ఆమాట వాడబడింది. పార్సీల మత గ్రంథమైన అవెస్టాలోనూ, పాతపార్సీభాషలోను ఈమాట ఉపయోగింపబడింది కనుక, చిరకాలంగా వాడుకలో మాత్ర మున్నది. అప్పుడూ తరువాత వేయేండ్లవరకూ కూడా సింధునదికివతలిప్రాంతమైన భారత దేశాన్ని, ప్రజలను పాశ్చాత్యు లా పేరుతో పిలిచేవారు. సింధులోనుంచి వచ్చిన మాటే 'ఇండస్'. ఇండస్ లోనుంచే హిందూ, హిందూస్థాన్ అనే మాట లుత్పన్నమైనాయి. 'ఇండియా'కూడా అందులోనుంచి పుట్టినదే. క్రీ. శ. 7వ శతాబ్దంలో ఇండియా కొచ్చిన చీనాయాత్రికుడు 'ఐ - సింగ్' తన యాత్రావిశేషాలను గ్రంథస్థంచేస్తూ 'ఉత్తరాన్నుంచి వచ్చిన సెంట్రల్ ఏషియావారు, ఇండియా దేశాన్ని 'హిందూ'

అంటారు. కాని అది సరియైన పేరు కాదు. 'ఆర్యదేశం' అనడమే బహుధా ఉచితము' అని వ్రాశాడు. 'హిందూ' అనే పదాన్ని మతానికి ముడి పెట్టడం ఇటీవల జరిగినపనే.

ఆకాలంలో హిందూదేశంలో మతాన్ని సూచించే మాట 'ఆర్య ధర్మం'. ధర్మమంటే నిజానికి మతంకన్న విశిష్టమైనది. 'ధర్' ధాతువులో నుంచి వచ్చింది. అనగా కలసిఉండడం అని అర్థం. ధర్మమనగా సమగ్ర మైన ఆధ్యాత్మికస్వరూపం. నైతికప్రవర్తనావిధానం, ధర్మనిరతి, న్యాయబుద్ధి, మానవునివిధులు, బాధ్యతలు అన్నీ అందులోనే ఇమిడు న్నాయి. ఇండియాలో వెలసిన 'ఆర్యధర్మం'లో వైదికమతాలు, తది తరములుకూడా కలిసేఉన్నాయి. బౌద్ధులు, జైనులుకూడా ఆర్యధర్మమనే వాడేవారు. బుద్ధభగవానుడు తాను సూచించిన మోక్షమార్గాన్ని 'ఆర్యపథ'మనే అన్నాడు

'వైదికధర్మం' అనేమాట పూర్వకాలంలో వేదాల్లో చెప్పబడిన వేదాంతమార్గాలూ, నైతికప్రవచనాలూ, కర్మకాండలూ అన్నిటిని సూచించేటట్లుగా ఉపయోగింపబడింది. అనగా వేదాలను ప్రమాణంగా అంగీకరించేవారంతా వైదికధర్మానికి చెందినవారనే చెప్పవచ్చును.

'సనాతనధర్మం' అంటే పురాతనమతమని అర్థం. ఆ మాటను బౌద్ధ జైన మతాలకుకూడా వర్తింపచేయవచ్చును. కాని నేడు హిందు వులలో కొందరు ఛాందసులు మాత్రం దానిని కేవలం హిందూమతా వలంబుల స్వంతసొత్తుగా భావించుకుంటున్నారు.

బౌద్ధజైనమతాలు వైదికధర్మబద్ధమైన హిందూమతంలోనివి కాని మాట నిశ్చయం. అయినా అవికూడా హిందూదేశంలోనే ఆవిర్భవిం చాయి. భారతీయజీవితంలో, సంస్కృతిలో, వివేకంలో మమేకమైపో యాయి. మనదేశంలోని బౌద్ధుడు గాని జైనుడు కాని హిందువుడు కాకపోయినా భారతీయసాంప్రదాయమైన సంస్కృతినే అనుసరిస్తాడు. అందుచేతనే భారతసంస్కృతిని కేవలం హిందూసంస్కృతి అనడానికి వీలులేదు. తరువాతయుగంలో ఇస్లాంమతప్రభావం చాలా హెచ్చుగా ఉండినా అసలు భారతీయసంస్కృతిమూలాలు మారలేదు. నేడు శత విధాలుగా పాశ్చాత్యనాగరికత, పారిశ్రామికవిప్లవం తాకిడులు తగ్గ

లుతున్నాయి. అందువలన మన సంస్కృతిలో ఎట్టిమార్పులు కలుగు తాయో నిష్కర్షగా చెప్పలేము.

హిందూమతం చాలా అనిర్దిష్టమైనది. స్థిరమైన స్వరూపం కలది కాదు. అందరి కన్నివిధాలుగా సాక్షాత్కారమయ్యే బహుముఖ్య వచనీయం. మామూలు భావంలో దానిని మతమన్నాలో అక్కర లేదోకూడా తెలియదు. పూర్వము, ప్రస్తుతము కూడా, హిందూమత మెన్నోమతాలను, ఆచారాలను అపనాయించుకుంది. కొన్ని పరస్పర విరుద్ధంకూడా. దాని ప్రధానోద్దేశ్యం 'నీబ్రతుకు నువ్వు బ్రతుకుతూ ఎదటివాళ్ళ నిష్టంవచ్చినట్లు బ్రతుకనివ్వడం' లాగే తోస్తుంది. మహాత్మ గాంధీ హిందూమతాన్ని ఇలా నిర్వచించడానికి ప్రయత్నించాడు. "నన్ను హిందూమతాన్ని నిర్వచించమంటే అహింసామార్గాన సత్యాన్వేషణంచేయడమే అని చెప్తాను. దేవునియందు నమ్మకం లేక పోయినవాళ్ళుకూడా తాము హిందువులనుకోవచ్చును. నిరంతర సత్యా న్వేషణమే హిందూమతం. సత్యమతమే హిందూమతం. సత్యమే భగ వంతుడు. భగవంతుని కాదన్నవారున్నారుకాని, సత్యాన్ని కాదన గలవా రింతవరకు లేరు."

సత్యాహింసలగూర్చి ఆవిధంగా గాంధీజీ చెప్పేరు. కాని ప్రసి ద్ధులైన హిందువులు గాంధీజీచెప్పిన అహింస, హిందూమతంలో ఎక్కడా లేదనే అంటారు. అదిపోతే మిగిలినది సత్యమొక్కటే హిందూమతం యొక్కవిశిష్టలక్షణంగా నిలబడిఉంది. కాని అదొక నిర్వచనంమాత్రం కాదు.

కనుక భారతసంస్కృతిని హిందూమతమనడం సబబుకాదు. చరిత్రలోను, పురాణాల్లోనూ వ్రాయబడిన వ్రాతల్లో హిందూభావా లెక్కువగాఉన్నా 'హిందూ' అనేమాట సరికాదు. ఇంకా ఈకాలంలో కూడా ఆ అభిప్రాయంలో 'హిందూ' పదాన్నివాడడం మరీ తప్పు. పురాతనమతం, తత్త్వం కేవలం జీవితంలో ఒక దృక్పథం మాత్రమే అయితేస్థూలంగా భారతసంస్కృతిని హిందూసంస్కృతి అనవచ్చుకాని, హిందూమతంపేర కొన్ని అనుల్లంఘనీయమైన విధులు, మంత్ర తంత్రాలు, కర్మకాండలు మొదలైనవి ఏర్పడినపుడు దానిని సమగ్రమైన భారతసంస్కృతి అనడానికి వీలులేదు. దానికన్న ఒకమెట్టు దిగిందన్న

మాట. క్రైస్తవుడుగాని మహమ్మదీయుడు కాని భారతీయసాంప్రదాయాన్ని సంస్కృతిని అనుసరిస్తూనే, తన మతాన్ని అల్లే ఉంచుకోవచ్చును. మతం మారనక్కరలేకుండానే, అతడు భారతీయుడుగా ఉండవచ్చును.

'ఇండియన్' అనే మాటకు సరియైనపదం 'హిందీ' అంటే మన సంస్కృతికి, చారిత్రక సాంప్రదాయాలకూ సరిపోతుంది. హిందూస్థానీ అనేమాటకు హ్రస్వస్వరూపం 'హిందీ'. పశ్చిమ ఆశియాలో, ఇరాక్‌లో టర్కీలో, ఈజిప్టులో, ఇండియాను 'హింద్' అనే అంటారు. ఇండియాకు సంబంధించిన అన్నివిషయాలను 'హిందీ' అంటారు. మతంతో నిమిత్తం లేకుండానే భారతీయమైన విషయాలన్నిటిని 'హింద్' అనే అంటారు. భారతీయులను అమెరికావారు హిందువులంటారు. నిజానికి వాళ్ళప్రయోగం అంత తప్పుకాదు. 'హిందీ' అని వాడితే మరీ మంచిది. కాని మనదేశంలో హిందీ అంటే దేవనాగరిలిపికి పర్యాయపదమైంది. కనుక దానిని విశాలభావంలోనూ సహజంగానూ వాడడం కష్టం. బహుశా నేటి తరోక్కపతర్కాలన్నీ అంతమైన పిమ్మట 'హిందీ' పదాన్ని దాని సహజస్వరూపంలో వాడతామేమో! ఇప్పుడు భారతీయుడు అనడానికి 'హిందూస్థానీ' అని వాడుతున్నారు. కాని ఇది కొంచెం నోరుతిరగడం కష్టం. పైగా 'హిందీ' అనే మాటకున్న చరిత్రగాని సంస్కృతి కాని లేదు. కనుక పురాతనకాలంనాటి భారత సంస్కృతిని హిందూస్థానీ అని వాడడం కాస్తంత వికృతంగా ఉంటుంది. 'ఇండియన్', 'హిందీ', 'హిందూస్థానీ' అనే మాటల్లో దేనినైనా మన సంస్కృతికి పర్యాయపదంగా వాడవచ్చును. కాని భారతసంస్కృతి, జాత్యభివృద్ధులలో విశిష్టత ఒకటున్నది. ఎంతసేపూ క్రొత్తను సంలీనం చేసుకోవాలనే భావమే ఆ విశిష్టత. దానికి కారణం భారతీయవేదాంత తత్త్వం. విదేశాలనుంచి వచ్చిన నాగరికతలు ఎప్పటికప్పుడే భారత నాగరికతను సవాల్‌చేస్తుండేవి. కాని భారతనాగరికత దాని నెదుర్కొని ఏదో కొత్తమార్గం ద్వారా దానిని తనలో క్రమంగా సంలీనంచేసుకోగలిగింది. ఈ తతంగంలోనే భారతసంస్కృతికి నూతనోజ్జీవనం కలిగింది. కొత్త వికాసం పొందింది. కాని మూలసిద్ధాంతాల్లో మాత్రం ఏమాత్రమూ మారలేదు.

## 8 పురాణాలు - కథలు

సింధులోయసంస్కృతి వెల్లడి కాకముందు భారతసంస్కృతికి సంబంధించి మనకున్న ఆధారాలు వేదాలే. వేదకాలనిర్ణయాన్ని గురించి పాశ్చాత్యపండితులకూ భారతీయపండితులకూ ఎప్పుడూ వివాదమే. పాశ్చాత్యపండితులు నిర్ణయించిన వేదకాలానికి చాలా ముందునాటివే అంటారు మన పండితులు. సాధ్యమైనంత వెనుకకు వెళ్ళి మన పురాతన నాగరికతకు అధిక ప్రాముఖ్యతను సంపాదించాలంటారు భారతపండితులు. వైదికసాహిత్యం క్రీస్తుకు పూర్వం 2 వేలు లేక రెండువేల అయిదు వందలసంవత్సరాలక్రితంనాటిదంటారు ప్రొఫెసర్ వింటర్‌నిజ్. అనగా దాదాపు మహెంజొదారో కాలమే అవుతుంది.

ఋగ్వేదములోని ఋక్కులు క్రీ. పూ. 1500 నాటివని సాధారణంగా పండితులంతా అంగీకరించేవారు. కాని మహెంజొదారో శిథిలాలు బయటపడినప్పటినుంచీ ఇంకా వెనుకటివేమోననే అభిప్రాయం బలపడుతోంది. ఫలానాసంవత్సరమని చెప్పలేకపోయినా, గ్రీసు, ఇజ్రాయిల్ దేశాలసాహిత్యంకన్న వైదికసాహిత్యం ముందనే చెప్పవలసిఉంటుంది. మానవుని అభిప్రాయాలకూ, ఆలోచనలకూ నాందిగానే భావించవచ్చును. వేదాలగురించి 'ఆర్యుని నోటినుండి వచ్చిన తొలిపలుకు' అన్నాడు ప్రొఫెసర్ మాక్స్‌ముల్లర్.

రత్నగర్భమైన భారతదేశంలోకి, మహాప్రవాహంలా వచ్చే ఆర్యులహృదయాల్లోనుంచి వచ్చిన వాగ్ప్రవాహమే వేదాలు. ఆర్యులు తమ అభిప్రాయాలనన్నిటిని ఒక మూలంలో నుంచే తెచ్చారు. ఆ మూలంలోనుంచే ఇరాన్‌లో 'అవస్తా' వికాసంచెంది, భారత భూమిమీద వ్యాప్తి చెందింది. వైదికభాషకున్నూ అవస్తాభాషకున్ను చాలా పోలికలున్నాయి. వేదాలకు సంస్కృతభాషకన్నా, అవస్తాతో ఎక్కువ దగ్గరసంబంధం ఉందని చెపుతారు.

ఏమతాన్ని గురించి ఆమతంవారు తమమతసాహిత్యమే స్వయంభూ అంటారు. అందుచేత వాటినితర్కించి సాధారణ మానవసాహిత్యం లాగున విమర్శించడంవల్ల ఆ మతాలవారికి మనఃక్లేశం కలుగడం తప్ప మరేమీ ప్రయోజనంలేదు. కాని గత్యంతరం లేదు.

మతగ్రంథాలను చదువడానికెప్పుడూ నాకు సంకోచంగానే ఉండేది. వాటిలో ఉండే సర్వజ్ఞత్వం, నాన్యఃపంథా అనేభావం నా కంత రుచించలేదు. మతంపేరిట పైకి కనబడే చిహ్నాలు, బాహ్యాంగా కనబడే ఆచారాలు, సాధన నన్నంత ఉత్సాహపరచియుండనందున వాటిమూలంలో కెళ్ళాలనే బుద్ధిపుట్టలేదు. అయినప్పటికీ, ఆ మతగ్రంథాలను చదువకతప్పలేదు. వాటిని తెలుసుకోకపోవడం ఒక సద్గుణం కాదు. పైగా తెలుసుకోకపోతే నష్టంకూడా ఉంది. ఆ గ్రంథాలుకొన్ని మానవసమాజంమీద అద్భుతమైన ప్రభావాన్ని ప్రసరింపజేశాయి. అంతటి ప్రభావంగల గ్రంథాల్లో ఏదో ఒక మహత్తు, నిరుపమానమైన జీవశక్తి ఉండితీరాలి. ఆ పుస్తకాల్లో కొన్నిభాగాలు నాకు చదవడం కూడా కష్టంగానే ఉండేది. ఎంత ప్రయత్నించినా తగినంత ఆసక్తి కలిగేదికాదు. కాని అందులో కొన్ని భాగాలుమాత్రం వాటిలోని రచనా సౌందర్యంవల్లనే నన్నాకర్షించాయి. ఏదో ఒక లోకోక్తో, వాక్యమో నాకంటబడి, నన్నల్లే చకితుడినిగా చేస్తుండేవి. అలాంటప్పుడు ఏదో ఒక మహత్తు నాకు సాక్షాత్కారమయ్యేది. బుద్ధుడినోటినుండో, క్రీస్తునోటినుండో వచ్చిన కొన్నిమాటలు వాటిలోని నిగూఢార్థములతోసహా నా కండ్లకు కట్టినట్లగుపడేవి. వాటి సత్యము రెండువేల ఏండ్లనాడెట్లన్వయించినదో నేటికీ అట్లే అన్వయిస్తోంది. కాలానికీ, దూరానికీ అతీతమైన ఒక శాశ్వతత్వము, సత్యము అందులో కనబడుతాయి. సోక్రటీస్ ప్రవచనాలు చీనా వేదాంతసూక్తులు చదివినపుడూ, గీతా ఉపనిషత్తులు చదివినపుడూ అలాంటి అనుభవాన్నే పొందేను. నాకు కేవల వేదాంతతత్త్వవిచారంలో అభిరుచి లేదు. నిత్యనైమిత్తిక కర్మకాండలం దాసక్తీ లేదు. నన్నెదుర్కొనే జీవితసమస్యలకు సంబంధంలేని అనేకవిషయాలగురించి నా కేమీ ప్రమేయం లేదు. నేను చదివినదానిలో చాలాభాగముయొక్క అంతర్గతభావాలు నా కర్థమేకాలేదు. రెండవసారి చదివితే కాస్తంత వెలుగు కనబడేది. అగాధంగానూ, నర్మగర్భితంగానూ ఉండిన భాగాలను విధిగా తెలుసుకోవాలనే ప్రయత్నమూ అంతగా చేయలేదు. వ్యాఖ్యానాలు, భాష్యాలు చదువాలనే ఆసక్తికూడా కలుగలేదు. ఆ మతగ్రంథాలనే కాకుండా ఏ పుస్తకాలన్నైనా అందులో వ్రాయబడిన విషయాలన్ను

విధిగా 'కిం' అనకుండా అంగీకరించితీరాలనే భావంతో నే నెన్నడు చదువలేదు. 'అన్యథా శరణం నాస్తి' అనేభావంతోనే నే నా పుస్తకాల దరిచేరిఉంటే అందులోని అనేకవిషయాలు నా తలకెక్కేవేకావు. ఆ గ్రంథాలు, నాకు తెలుసుకోడానికి సాధ్యంకాని, మానవాతీతులైన భగవంతుని అవతారములనోటినుండివచ్చినవని ఊహించుకున్నప్పటి కన్న, చాలా వివేకధనులూ, దూరదృష్టిగలవారూ అయిన ప్రజ్ఞావం తులగు మానవులు రచించినవేనని అనుకుంటేనే, వాటి నెక్కువ ఆనం దించకలిగేవాడిని. ఎక్కువ విశేషాలను వాటినుండి గ్రహించగలిగే వాడిని. మానవుడు ఏదో దైవాంశసంభూతమైన శక్తికి నిమిత్తమాత్ర మైన వాహకుడుగా ఉండడంకంటె, తానే స్వయంగా మానసికంగానూ ఆధ్యాత్మికంగానూ ఉన్నతస్థాయినందుకుని ఇతరుల నుద్ధరించుటలోనే ఘనత ఉన్నదని నా అభిప్రాయం. కొందరు మతప్రవక్తలు మహత్తర మైన ప్రజ్ఞావంతులు. వాళ్ళు మానవమాత్రులుకారని అనుకుంటే నా దృష్టిలో వారి ఘనతంతా పోతుంది. మానవుడు ఏదో ఒక సందేశాన్ని మోసుకుపోయే దూతమాత్రమే కాకుండా, తన బుద్ధిని ఆత్మను పెంపొం దించుకుంటున్నాడన్న భావమే నాకు నచ్చింది. నాకు సంతృప్తి నిస్తోంది.

పురాణాలు కథలుకూడా నాలో ఇలాంటి భావాలనే కలిగిం చాయి. ఈ కథల్లోని విషయాల నల్లే నిజాలుగా భావిస్తే చాలా వికటంగా ఉంటాయి. వాటిని ఆలా కాకుండా కట్టుకథగానే భావిస్తే ఒక కొత్త భావం కలుగుతుంది. చక్కని భావవికాసమూ, సౌందర్యమూ మానవుని కనేకగుణపాఠాలూ,అందులో కనుబడతాయి. గ్రీకుదేవుళ్ళు, దేవతలకూ సంబంధించిన కథల నిప్పుడెవ్వరూ నమ్మడంలేదు. కనుకనే వాటి నానందించగలుగుతున్నాం. వాటినే నమ్మవలసొస్తే, చాలా బాధపడతాం. ఆ బాధలో వాటి సౌందర్యాన్ని ఆనందించలేము. భార తీయపురాణాలు, ఇతిహాసాలు చాలా గొప్పవి. విశాలమైనవి. సుందర మైనవి. అర్థసహితమైనవి. వాటిని రచించిన స్త్రీ పురుషుల మానసిక ప్రజ్ఞకు నా కాశ్చర్యం కలుగుతూఉంటుంది. అందులోని వర్ణనలు, ఊహాలు, కలలు, ఏ బంగారపుగనుల్లోంచి త్రవ్వేరా అనిపిస్తుంది.

మానవునిమేధస్సునుండి జన్మించినట్లుగానే ఈ మతగ్రంథాలను పరిశీలించేటప్పుడు, అవి వ్రాయబడినకాలాన్ని, ఆనాటి సాంఘికవాతా

వరణాన్నీ కూడా గుర్తుంచుకోవాలి. అప్పటికీ, ఇప్పటికీ గడచిన కాలాన్ని మారిన భావాల్నీ, పొందిన అనుభవాలనుకూడా జ్ఞప్తికితెచ్చుకొని ఆకాలానికీ మనకాలానికీ ఎంతవ్యత్యాసమున్నదోకూడా గమనించాలి. ఈ మతగ్రంథాల నావరించియున్న కర్మకాండను, మతాచారాలను మరచిపోయి, ఆనాటి సాంఘికస్థితిగతులలో అవెట్లు వ్యాప్తమయ్యాయో గుర్తించాలి. మానవుని జీవితసమస్యలు కొన్ని శాశ్వతములే. ఆనాటికీ ఈనాటికీ అవి అట్లాగే ఉన్నాయి. అందుచేతనే ఈ పురాణ గ్రంథాల యెడల మన కాసక్తి. వాళ్ళకాలానికి సంబంధించిన కొన్ని సమస్యలలో నేడు మన కంత ప్రసక్తి లేదు.

## ౨ వేదములు

వేదములు పౌరుషేయములనీ, అవి బ్రహ్మముఖతా వెలువడినాయనీ చాలామంది హిందువుల విశ్వాసము. నాకేమో ఆ విశ్వాసం విపరీతంగా తోస్తుంది. అట్టి నిర్హేతుక విశ్వాసంవల్ల ఆదికాలంలో మానవునిబుద్ధి ఎల్లా వికాసం చెందినదీ తెలుసుకోలేకపోతున్నాం. వేదములంటే (విద్ వేద్ = తెలిసికొనుట, అనే ధాతువు ప్రకారము) ఆ కాలపు జ్ఞానంయొక్క సంకలనమని అర్థము. అందులో దైవసంకీర్తనలు, ప్రార్థనలు, బలితతంగము, మంత్ర తంత్రములు, అద్భుతమైన ప్రకృతి వర్ణనలు, మొదలైన వెన్నో కలగాపులగంగా ఉంటాయి. వేదాల్లో విగ్రహారాధన లేదు. దేవుళ్ళూ దేవుడిగుడులూ లేవు. కాని వేదాల యొక్క జీవశక్తి, జీవితచిత్రీకరణము అసాధారణమే. వేదకాలం ప్రారంభమైన ఆదికాలంలో వచ్చిన వైదికార్యులు మామూలు జీవితంపట్ల ఎంతో ఆసక్తిని కనుబరచేవారు. ఆత్మనుగురించి అంతగా తాపత్రయ పడేవాళ్ళుకారు. లీలగా మరణానంతరజీవితమందు అనగా పునర్జన్మలందు విశ్వాసంగలవారు.

క్రమంగా భగవంతుని సారూప్యభావం హెచ్చింది. గ్రీకు ఇతిహాసంలోని దేవతలు ప్రత్యక్షమయ్యారు. ఆ పిమ్మట ఏకేశ్వరవాదం, దానితోపాటే యావత్సృష్టీ ఒక్క పదార్థంలోనుంచే వచ్చిందనే తత్త్వం (మోనిజం) అమలులో కొచ్చాయి. నిరంతరం ఆలోచనలో నిమగ్నులైతే చిత్రమైన ఆలోచనాప్రపంచంలోకి లాక్కెడుతుంది.

ప్రకృతియొక్క రహస్యాలనుగురించి లోతుగా ఆలోచిస్తే ఇంకా తెలుసుకోవాలనే భావం కలుగుతుంది. ఈ పరిణామాలు కలుగడానికి వందలాది సంవత్సరాలు పట్టిఉంటాయి. మనం వేదాల అంతుకనుక్కోబోతే, అనగా వేదాంతంలోకెడితే మనకు లభించేది ఉపనిషత్తులు వాటి తత్వం.

మానవులకు లభించిన ప్రథమ గ్రంథము వేదాలలో మొదటిదైన ఋగ్వేదం. మానవుని బుద్ధివికాసం అందులో బాగా కనుబడుతుంది. కవిత్వంలో తేజస్సు, ప్రకృతియొక్క సౌందర్యం, దాని 'రహస్యం' అన్నీ అందులోఉన్నాయి. 'ఈ పురాతన ఋక్కులలో ప్రపంచంయొక్క అంతర్యాన్ని, దానిలో మానవునిస్థానాన్ని తెలిసికోవడానికి ఏనాడో మానవుడుచేసిన సాహసకార్యాలు, వాటి పర్యవసానములు గ్రంథస్థమైఉన్నాయి. ఆకాలంలో ప్రారంభింపబడిన అన్వేషణ ఎప్పుడూ ఆగనేలేదు'' అని వ్రాశాడు డాక్టర్ మాక్నికల్.

అయినా ఋగ్వేదానికిపూర్వమే వేలసంవత్సరాలక్రితం నాగరికజీవనమూ, నాగరికభావములూ ఉండేవి. ఆకాలంలోనే సింధులోయ నాగరికత, మెసపొటేమియా వగైరాదేశాల నాగరికత, అభివృద్ధిచెందేయి. కనుకనే ''ముందుగా మార్గదర్శకులైన ఋషులకు, మనపూర్వీకులకు'' ఋగ్వేదం అంకితంచేయబడింది.

ఈ ఋక్కులను మహాకవి రవీంద్రనాథఠాగూర్ ఇలా వివరించాడు —

''జీవితంయొక్క మహద్విశేషాన్నిచూచి ప్రజాసముదాయం పడే ఆశ్చర్యంయొక్క కావ్యరూపమే ఋగ్వేదము. జీవితంలోని అనంతమైన రహస్యాన్ని, నాగరికత ప్రారంభదశలోనే గ్రహించగలిగిన మేధావంతుల కావ్యరచన. పంచభూతాలకూ, ప్రపంచంలోని సర్వశక్తులకూ దైవత్వమాపాదించిన అమాయక విశ్వాసంగలవారు. కాని వారివిశ్వాసులలో కొంతధైర్యం, ఆనందం ఉంది. అనంతమైన రహస్యమే, జీవితానికొక ఆనందం. మనస్సునేమీ క్షోభపరచుకోకుండా, ఏదో విశ్వాసంతో'సత్యమంతా ఒకటేకాని, వివేకవంతులు దానినే అనేకవిధాలుగా పేర్కొంటారు' అనే నిశ్చితంలో ఉంటారు.

కాని విషయవివేచనాసక్తి క్రమంగా ప్రవేశించింది. అప్పుడే వేదాల రచయిత 'ఓ విశ్వాసమా! మాకు నమ్మకాన్ని ప్రసాదించు' అని ఆక్రోశించాడు.

పై ఋక్కులకు మాక్సుముల్లరు **To the unknown God** అని నామకరణంచేశాడు.

## ౬ జీవితం

నదులు తమ జన్మస్థానంలో బహుచిన్నవిగా ఉంటాయి. అలాగే భారతీయజీవితంలోని భావాలు, వేదాంత తత్త్వం, సంస్కృతి, సాహిత్యాం ఆదిలో కనుబడీ కనుబడనట్లుత్పన్నమై, క్రమంగా పెద్దవగుతూ వచ్చి మహానదులు పొంగినట్లు పొంగినాయి. ఆవరదల్లోనే సారవంతమైన మట్టినేటలుకూడ పడ్డాయి. ఒక్కొక్కప్పుడీ నదులు అనంతమైన కాలప్రవాహంలో తమ వాలును తప్పించేవి. తీరాలను కోసేసినాయి. అయినప్పటికీ భారతీయనాగరికతలోని ప్రధానలక్షణాలేమీ మారలేదు. జీవితంయెడల ఆకాలపువారికి ఒక విధమైన ఆసక్తి లేకపోతే అలా జరిగుండదు. అలాంటి నిగ్రహం విధిగా మంచి లక్షణమని నా అభిప్రాయం కాదు. అదే జాడ్యానికి, స్తబ్ధతకు కారణం కావచ్చును. హిందూదేశాని కల్లాంటి జబ్బు సోకిందనే అర్థమవుతోంది. ముఖ్యంగా యుద్ధాలవల్ల తదితర ఉపద్రవాలవల్ల మన నాగరికత ఉంటుందా ఊడుతుందా అనుకునే ఈకాలంలో గర్వించదగిన మన అభ్యుదయ నాగరికత తట్టుకోగలిగిందనే సంగతి విస్మరించకూడదు. యుద్ధమనే ఈ మూసలో అనేక లోహాలు కరుగుతున్నాయి. ఈ ద్రవంలోనుంచి, ప్రాక్పశ్చిమాలకు శ్రేయోదాయకంగాఉండే ఒక చక్కని సున్నితమైన ఆకారం బయలుదేరుతుందని ఆశిద్దాం. ఆ స్వరూపంలో మానవసంఘం సాధించిన మంచిఅంతా మూర్తీభవిస్తుంది. పైగా దానికిలేని లోపాలను పూరిస్తోంది. కాని యుద్ధంపేరిట తరుచుగా జరుగుతుండే విధ్వంసకాండలో ఆస్తిపాస్తులు ప్రాణాలతోపాటు, జీవిత... ...కపరమావధిని కల్పించిన లక్ష్యాలుకూడా నాశనమైపోతునా, ...ందుకుకారణం? కొన్నివిషయాల్లో మనమొతముందు... ... కలలోనైనా

ఊహించలేని ఉన్నతస్థాయిలోకెళ్ళినా, మన పారిశ్రామిక నవనాగరిక తలో ఏదో ఒక ముఖ్యమైన పదార్థం లోపించింది. ఆత్మనాశనకారణమైన బీజా లందులోనే ఉన్నాయి.

పరాధీనంలో ఉన్న దేశం, తన పూర్వచరిత్రయొక్క విశిష్టతన తలుచుకుంటూ, ప్రస్తుతదుస్థితిని మరచిపోవడానికి ప్రయత్నిస్తుంది. మనలో చాలామంది కా ప్రమాదకరమైన దురలవాటుంది. మరొకదురలవాటుకూడా బాగా అమలులో ఉంది. ప్రపంచంలో అన్నివిధాల మన మడుగునపడున్నా ఆధ్యాత్మికంగా మన మేదో అంతరిక్షాన ఉన్నామనుకోవడం, ఆకలి, దారిద్ర్యంతో బాధపడుతూ, పరదాస్యంలో ఉండే వారికి, ఆధ్యాత్మికఘనతున్నా, మరేమున్నా రాణించదు. చాలామంది పాశ్చాత్య తత్త్వవేత్తలుకూడా భారతీయులు ఆముష్మికచింతగలవారనే భావాన్ని వ్యాప్తిచేశారు. బహుశా పేదలు, ఈ దేశంలో బ్రతకలేక పరలోకచింత నలవరచుకున్నారేమో! లేకపోతే వారు విప్లవకారులైనా కావాలి. దాస్యంలో ఉండే ప్రజలమాటకూడా అంతే. మనిషికి ప్రాజ్ఞత వచ్చినకొద్దీ, బాహ్యమైన ఆనందాలతో తృప్తిపడడు. జీవితంయొక్క ఆంతర్యాన్ని తెలుసుకోవాలని ఉబలాటపడతాడు. అదేవిధంగా, పెరిగి పెద్దవై ప్రాజ్ఞతసంపాదించిన దేశాలూ, నాగరికతలూకూడా సంతృప్తికరమైన బాహ్యజీవితంతోపాటు, ఒక ఆంతరంగికజీవితంకోసం తహతహపడతాయి. ఆ రెండూకలసికాని లేక ఒకదాని దగ్గరగా మరొకటి పోతుంటేగాని, తాపీగా, ఒడుదుడుకుల్లేకుండా ముందుకుసాగుతాయి. అవి విడిపోతేమాత్రం మనస్సునూ ఆత్మనూ సంక్షోభపరచే తగాదా ఏర్పడుతుంది.

ఋగ్వేదంలోని ఋక్కులకాలంనుంచీ బాహ్య జీవితం, ఆంతర్యంలోని భావాలు సమంగా నడుస్తున్నాయి. ముందుగా రచింపబడిన ఋక్కులలో, ప్రకృతిసౌందర్యం, రహస్యం, జీవితానందం, జీవశక్తి మొదలైన బాహ్యప్రపంచవిషయాలన్నీ ఉన్నాయి. ఒలింపియన్ దేవతల్లాగే అందులోని దేవుళ్ళూ, దేవతలూ మానవస్థాయిలోనివారే. వారు భూమిమీదకు [illegible] చ్చి మనుష్యులతో కలసిమెలసి ఉన్నట్లే లెక్క. దేవతలకీ [illegible] ర్థ్య అనుల్లంఘనీయమైన ఆటంకాలేమీ ఉండేవికావు. [illegible] పనికలిగింది. 'కిం' అంటే 'ఏమిటేది'

అనే తత్త్వవిచారం ప్రారంభమైంది. బాహ్యజీవితం యథాప్రకారంగా పుష్కలంగానే నడుస్తున్నప్పటికీ కంటి కగోచరమై, రూప, రస, గంధ స్పర్శల కతీతమైన పదార్థాన్ని అన్వేషించాలనే ఆకాంక్షవల్ల, బాహ్య జీవితమందలి ఆసక్తి తగ్గింది. ఈ అన్వేషణలక్ష్య మేమిటి? ఈ ప్రపంచంలో ఏదైనా ఒకలక్ష్యమంటూ ఉన్నదా? ఆ లక్ష్యానికనుగుణ్యంగా మానవజీవితాన్ని నడపడంఎట్లు? ప్రత్యక్షంగాఉన్నా ఈ ప్రపంచానికి, అగోచరంగాఉండే మరోప్రపంచానికీ సంబంధంకలిపి, మానవజీవితాని కొక ఋజువర్తన కల్గించడం ఏలాగు? అనే ప్రశ్నలు పరంపరగా బయలు దేరుతాయి. కనుక ఇతర దేశాల్లోలాగునే, హిందూదేశంలోకూడా తత్త్వవిచారం, కర్మ రెండూ జంటగా ముందుకుసాగేయి. ఆయా కాలాన్నిబట్టి, ఒకప్పుడు భావాలకు మరొకప్పుడు పనికి ప్రాధాన్యత కల్గుతూఉండింది. జీవితాన్ని విధాయకంగా నిర్వహిస్తూ, నిష్కామ్యంగా తామరాకులో నీటిబొట్టులా జీవించడమే దీని సారాంశము. అయినా, సంస్కృతియొక్క పరమార్థం ఈప్రపంచాన్ని త్రోసిపుచ్చి, కేవలం పరలోకచింతమాత్రంకాదు. వేదాంతపరిభాషలో ఈ ప్రపంచమంతా మాయగా చర్చింపబడినా, అంతటితో ఆ భావాన్ని కేవలం పరిపూ ర్ణంగా వదిలెయ్యలేదు. పారలౌకికమైన పరమార్థంతో పోల్చినపుడు మాత్రమే ఈ మిథ్యావాదం. అందుచేతనే ఋగ్వేదకాలంనాటి సంస్కృతి జీవితసౌఖ్యాలను, ఆనందాలను అనుభవించాలనే చెపు తూవచ్చింది. బహుశా, మధ్యఏషియాలో బయలుదేరిన మతా ల్లోనూ, నాగరికతలోనూ, ముఖ్యంగా ఆకాలపు క్రీస్తుమతంలోనూ, మనదేశంలోకన్న ఎక్కువగా పారలౌకికభావా లున్నాయనుకొం టాను. 'ఈ భౌతికప్రపంచం నిరర్థకమనే ఆ మతాల ప్రాతిపదిక' అని టి. యి. లారెన్సు వ్రాశాడు. ఈ భావాలవల్ల ఎక్కువ స్వార్థపర త్వమో, లేక ఎక్కువ స్వార్థరాహిత్యమో ఫలితమయింది.

భారతదేశంలో నాగరికత వికసించిన ప్రతికాలంలోనూ ప్రజల జీవితంలో మహత్తరమైన ఆనందం, ఉత్సాహం ఉండేవి. సంగీతసాహిత్య విద్యలు, నృత్యం, వాయిద్యం, నాటకం, చిత్రలేఖనం మొదలైన సమస్త కళలు అభివృద్ధిచెంది జీవితాని కానందాన్నిస్తూఉండేవి. ఆఖరుకు స్త్రీ పురుషసంబంధమునుగూర్చి కూడా బహు సున్నితంగానూ మర్యాద

గానూ శాస్త్రీయశోధన జరిగింది. కేవలం పారలౌకిక విషయాలనే పట్టుకుని బొత్తుగా ఈ ప్రపంచం నిరర్థకమని వదలిపెట్టే సంస్కృతి, ఇలాంటి బహుముఖ ప్రతిభ, శక్తిగల కళలను పెంపొందింపలేదు. అసలు కేవలం పారలౌకికవిషయాలమీదనే ఆసక్తిగల సంస్కృతి ఇన్నివేల సంవత్సరాలు నిలబడడమే అసంభవం.

అయినప్పటికీ, భారతీయతత్వము, సంస్కృతి, ప్రధానంగా పారలౌకికమనీ, ఇహసౌఖ్యమును నిరాకరించినదనీ కొందరి అభిప్రాయం. పూర్వకాలపు మతాల్లోనూ, నాగరికతలోనూ ఈ రెండు సిద్ధాంతాలూ కొద్దో గొప్పో మిళితమయే ఉన్నాయని నా అభిప్రాయం. కాని దరహంమీద చూస్తే భారతసంస్కృతి, పూర్తిగా ఇహసౌఖ్య జీవితాన్ని నిరాకరించలేదు. కొన్ని మతాలవారు రట్టివాదన చేయక పోలేదు. కాని క్రైస్తవమతంకన్న తక్కువగానే చేశారు. బౌద్ధమతం, జైన మతం, లౌకికజీవనానికి దూరంగా ఉండాలని ప్రబోధించాయి. హిందూ దేశచరిత్రలో విరివిగా జనం సంసారాన్ని త్యజించి సన్యాసులైన కొన్ని కొన్ని ఘట్టాలున్నాయి. బౌద్ధవిహారాల్లో, మఠాల్లో చేరి సన్యాసులైనారు. కారణంమాత్రం నా కర్థమవడంలేదు. యూరోపులో, మధ్యయుగంలో, ప్రపంచమంతమైపోయే ప్రళయం వస్తోందనే విశ్వాసం వ్యాప్తమవుతూఉండేది. రాజకీయంగానూ, ఆర్థికంగానూ నిరుత్సాహం చెంది, నిస్పృహపొందిన ప్రజలు సన్యాసానికి పాల్పడతారేమో!

బౌద్ధమతం ఎన్నితత్వాలను, సిద్ధాంతాలను ప్రతిపాదించినా, నిజానికెప్పుడూ ఎందులోనూ అతిగాపోలేదు. మధ్యేమార్గాన్నే అనుసరించింది. కొందరు భావిస్తున్నట్లు, 'నిర్వాణం' కూడా కేవలం శూన్యం కాదు. అదికూడా ఒక నిర్దిష్టమైన అవస్థ. మామూలు మానవుని ఆలోచన కది అతీతమవడంచేత దానిని విశదీకరించడంలో (negative) (నాస్తి — ప్రతికూలభావాన్నిచ్చే) పరిభాష వాడబడింది. భారతీయ తత్వము, సంస్కృతినుంచే ఉత్పన్నమైన బౌద్ధమతంయొక్క పరమలక్ష్యం సన్యాసమే అయితే కోట్లాది బౌద్ధులు భిక్షుకులయ్యేవారే. వాస్తవంలో బౌద్ధదేశాల్లో సన్యాసానికి ప్రతికూలమైన చిహ్నాలేఎక్కువగాఉన్నాయి. అందుకు ప్రత్యక్షమైన నిదర్శనం చైనా. 'ఇహ' జీవితం ఎలా ఉండాలో వారే చూపిస్తున్నారు.

ఈ గలభా ఎందుకొచ్చిందంటే భారతతత్వం జీవితంయొక్క పరమావధికి ఎక్కువప్రాధాన్యతనివ్వడంవల్లనేనని నాఅభిప్రాయం. ఇంకా గొప్పగొప్ప విషయాలను సాధించాలనే అభిప్రాయంతో ఇహజీవిత సౌఖ్యాలను అనుభవిస్తూనే వాటికి దాసులుకాకూడదని దాని ఆంతర్యం. శక్తివంచనలేకుండా నీ ధర్మనిర్వహణం చేస్తూ, ఫలితాలను గురించి విచారపడకుండా పద్మపత్ర మివాంభసా' అన్నట్లుండమని అభిప్రాయం. అదే నిష్కామకర్మయోగం. ఈరీతిగా, కర్మసన్యాసాన్ని చేయకుండా, నిష్కామకర్మ చేయాలని ప్రబోధించింది. ఇతర వేదాంత తత్వాలలోవలెనే భారతీయవేదాంతంలోకూడా ఈ నిష్కామకర్మ యోగమే ప్రధానం. విపులంగా చెప్పాలంటే లౌకిక పారలౌకిక విషయాలను తగుమాత్రమైన పాళ్ళల్లో ఉంచాలని అభిప్రాయం. ఇహంలో కేవలం కర్మకోసమే తాపత్రయపడుతుంటే, పరలోకంసంగతి మరచి పోవచ్చు. అందువల్ల కర్మ దారీ తెన్నూ లేకుండాపోవచ్చును.

భారతతత్వవేత్తల ఆలోచనలో సత్యమున కెక్కువ ప్రాధాన్యత ఇవ్వబడింది. సత్యంమీదనే ఆధారపడి, దానియెడల ఒక ఆసక్తి తత్వవిచారకుల్లో కనబడేది. కేవలం సిద్ధాంతాలను నమ్మవలసినవారు విచక్షణా, వివేచనా లేని అల్పబుద్ధులు మాత్రమేనని వారిభావం. స్వానుభవంవల్ల కలిగిన అనుభూతితోనే వారీ విషయాలన్నింటిని పరిశీలించారు. అగోచరమైన పారలౌకికవిషయాలను శోధించేటప్పుడు కలిగే అనుభూతి ఇతర ఆధ్యాత్మిక అనుభూతులులాగే ఉంటుంది. ఇహప్రపంచానికి సంబంధించిన అనుభవాలకు వాటికీ పోలికే లేదు.

అనుభవాలేమో నాకు తెలియదు. అవి కేవలం ఊహామాత్రములో లేక సత్యాన్ని కనుగొనే ప్రయత్నాలో నేను చెప్పలేను. ఇవి ఆత్మవంచనకూడా కావచ్చును. నా కందులో ఆసక్తి కలిగించే దొక్క విషయమే. ఏవిధమైన జబర్దస్తీగాని, పిడివాదంకాని లేకుండా, బాహ్య జీవితంయొక్క ఆంతర్యం తెలుసుకోవాలనే ఆశయే.

భారతదేశంలో వేదాంతగోష్టి కేవలం వేదాంత తత్వజ్ఞులనుకునే విజ్ఞులకు మాత్రమే సంబంధించిన వ్యవహారం కాదు. జనసామా

న్యంయొక్క మతంలో అతి ప్రధానమహాంశం. ఇండియాలోనూ, చైనాలోనూకూడా వేదాంతం ఏదోవిధంగా జనంలో ప్రవేశించి, వారికొక వేదాంతదృక్పథాన్ని కలిగించింది. కొందరి కది ప్రపంచంలోని చిత్రసంఘటనలకు కారణాలు, న్యాయాలు తెలుసుకోవాలనే ప్రయత్నం. జీవితంయొక్క పరమావధిని తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతోనే బాహ్యజీతంలో ఎన్ని పరస్పరాలున్నా వాటిని ఏకీకరణంచేసే సూత్రాన్ని కనుకోవాలని కొందరు ప్రయత్నిస్తుంటారు. మరికొందరికి ఈ వేదాంతం చాలా సులువైన వ్యవహారం. ఒకలక్ష్యశుద్ధిని, కార్యకారణసంబంధమును కలిగించి, ఎన్నికష్టాలొచ్చినా ఆనందాన్ని గంభీరతను పోగొట్టుకోకుండా ధైర్యాన్నిస్తుంది. "భారత చైనాదేశాల పూర్వవిజ్ఞానం 'టావ్' అనగా సత్యపథం జీవితంలోని వివిధవిషయాలను సమగ్రంచేసి జీవితానందంతో సమ్మిళితంచేయడమే"నని శ్రీ రవీంద్రనాధ ఠాకూర్ డాక్టర్ టావ్-చిట్-ఓకు వ్రాశాడు. ఆలాంటి వివేకం ఇప్పటికీ, చదువను వ్రాయను చేతకాని అమాయకప్రజల్లో పాతుకుపోయింది. ఏడు సంవత్సరాలపాటు భయంకరమైన యుద్ధాల్లోపడికూడా తమ సిద్ధాంతాలయందు విశ్వాసమును పోగొట్టుకోలేదు. మనస్సుల్లో ఆనందాన్ని గోల్పోలేదు. హిందూదేశంలో మన దురవస్థలు చాలాకాలం క్రిందటి నుంచి ప్రారంభమైనాయి. లేమి, నికృష్టమైన దౌర్భాగ్యమూ చాలా కాలంనుంచి మన ప్రజలను వదలిపెట్టటలేదు. అయినప్పటికీ వారు ఆనందంతో ఆడుతూపాడుతూ కేళింతాలుకొడ్తారు. ఆశను వదలలేదు.

## ౭ వర్ణవ్యవస్థ ప్రారంభం

భారతదేశంలో ఆర్యులు ప్రవేశించాక, జాతిభేదాలు, రాజకీయాలు కొత్త సమస్యలైనాయి. ఆర్యులుఓడించిన ద్రవిడులు చాలాపురాతన నాగరికతగలవారు. కాని ఆర్యులు తాము ద్రవిడులకన్న చాలా గొప్పవారమని అహంకారపడుతూ ఉండేవారు. ఈ రెండు తెగలవారికీ మధ్య పెద్ద అగాధమేర్పడింది. వీరుగాక అడవుల్లో సంచారంచేస్తుండే ఆటవిక తెగలవారుండేవారు. ఈ తెగల పోరాటాలవల్లనూ, కలయికలవల్లనూ వర్ణాలు కులాలు ఏర్పడ్డాయి. ఆ వర్ణవిభేదం శతాబ్దాల అనంతరం భారతీయజీవితంమీద తన ప్రభావాన్ని అమోఘంగా వెలిగిం

చింది. బహుశా వర్ణవ్యవస్థ ఆర్యసాంప్రదాయమూ కాదు; ద్రవిడసాంప్రదాయమూ కాదేమో! వివిధజాతులను ఆకాలపు స్థితిగతులకు అనుగుణ్యంగా సాంఘికవ్యవస్థలో అమర్చుటకొక ప్రయత్నం. అందువల్ల, తరువాతకాలంలో చాలా అనర్థం కలిగింది. ఇప్పటికింకా అదొక భారమైన ఇక్కట్టే. కాని తరువాతకాలంలో జరిగిన పరిణామాలనుబట్టికాని, ఇప్పటి ప్రమాణములను బట్టిగాని ఆ వ్యవస్థ మంచి చెడ్డలను నిర్ణయించలేము. ఆనాటి కాలమానస్థితిగతులనుబట్టి, పూర్వకాలపు నాగరికతలన్నింటిలోనూ ఆలాంటి తరగతులవారీవిభజన జరిగింది. చైనాలోమాత్రం ఆలాంటి విభజన జరిగినట్లులేదు. ఆర్యులజాతివారేయైన ఇరానియనులలోకూడా చాతుర్వర్ణవిభజన జరిగింది. కాని మన కులతత్వంలాగున కరడుగట్టిపోలేదు. గ్రీకుదేశపు నాగరికతతో సహా అన్ని నాగరికతలుకూడ విస్తృతమైన దాస్యవృత్తిమీద ఆధారపడుండేవి. ఇండియాలో అలా బహుళవ్యాప్తమైన కార్మికదాస్యం లేదు. అక్కడక్కడమాత్రం కొద్దిగా ఇంటిపనులనిమిత్తం నౌకర్లుండేవారు. ప్లేటో వ్రాసిన 'రిపబ్లిక్' అనే గ్రంథంలో ముఖ్యంగా ఈ చాతుర్వర్ణవిభజనను గురించి పేర్కొన్నాడు.

ఆర్యులు, అనార్యులు అనే విభజనతో వర్ణవ్యవస్థ అంకురించింది. అనార్యులలో ద్రవిడులు, ఆటవికులు అనే విభజన జరిగింది. ఆదిలో ఆర్యులు ఒకేవర్గంగా ఉండేవారు. వారిలో ఏమీ భేదాలు లేవు. ఆర్య అనేశబ్దం భూమి దున్నుట అని అర్థమిచ్చే ధాతువునుండి ఉత్పత్తిఅయింది. ఆర్యులు యావన్మందీ మంచి వ్యవసాయకులు. వ్యవసాయ మొక గొప్ప వృత్తిగా పరిగణింపబడేది. భూమిని సేద్యంచేసే వ్యవసాయకుడే పురోహితుడు, సైనికుడు, వ్యాపారస్థుడు. పురోహితునికి ప్రత్యేక హక్కు లేమీ ఉండేవి కావు. ఆర్యులను అనార్యులను వేర్వేరుగా ఉంచుటకొరకేర్పరుపబడిన వర్ణవ్యవస్థ ఆర్యులనే బెడిసికొట్టింది. ధర్మాలు, వృత్తులు పెరిగి ప్రత్యేకతాభావాలధికమైన పిమ్మట, కొత్త తరగతులు వర్ణవ్యవస్థగా రూపొందినాయి.

ఈ రీతిగా విజేతలైనవారు ఓడిపోయినవారిని నాశనంచేసే కాలంలో, ఈ వర్ణవ్యవస్థ అంతకన్న శాంతియుతమైన పరిష్కారంగా

లభ్యమైంది. అసంఖ్యాకులైన వ్యవసాయకులను తరతమాలు ప్రకారం విభజించగా భూమిదున్ని సేద్యంచేసేవారూ, వ్యాపారస్తులూ, గ్రామీణ పారిశ్రామికులు వైశ్యులైనారు. పరిపాలకులు, సైనికులు క్షత్రియులై నారు. పురోహితులుగానూ విజ్ఞానవేత్తలుగానూ ఉండి జాతియొక్క ఉన్నతభావాలను, లక్ష్యాలనూ రక్షించవలసినవారు బ్రాహ్మణులైనారు. వీరి ముగ్గురిక్రిందనూ సేద్యంచేయలేని మామూలు మోటపనిచేసే కూలీలు శూద్రులైనారు. దేశవాళీతెగలకు చెందినవారిని కూడా చాలమందిని క్రమంగా కలుపుకుని ఈ సాంఘికవ్యవస్థలో అట్టడుగున శూద్రతరహాలో చేర్చేశారు. ఈ కలుపుకోవడమనే తంతు అలా విరామం లేకుండానే జరిగింది. అప్పటికి వర్ణవ్యవస్థ శాస్త్ర ద్రవస్థితిలోనే ఉండినది. నికరమైన కట్టుదిట్టాలకు దానితరువాత చాలాకాలానికే ఈ ఏర్పాట్లన్నీ జరిగేయి. బహుశా రాజ్యాధికారంలోఉన్న తరగతుల వారికి చాలా మినహాయింపు లుండేవనుకుంటాను. ఇతరులను జయించి అధికారమును చేబట్టి విజేతలైనవారు క్షత్రియపరంపరలో చేరేవారు. అలా చేరి ఎవరో ఒక ఆర్యవీరునిసంతతితో సంబంధం కల్పించుటకు కావలసిన సాక్ష్యసంపదను సమకూర్చమని పురోహితుని శాసించేవారు.

'ఆర్య' అనేమాట కేదోవిధమైన జాతి ప్రత్యేకతను సూచించే స్థితి తప్పింది. 'ఆర్య' అంటే గొప్పవాడైన, ఉదారమైన అనే అర్థం వచ్చింది. అలా గొప్పవారు కాకపోతే అనార్యులైనారు. అనార్యులనే మాట సామాన్యంగా ఆటవికులు లంబాడీల తెగలవారిపట్లనే ఉపయోగింపబడుతూవచ్చింది. హిందూమనఃప్రకృతి, ఏవిషయాన్నైనా పూర్తిగా విడగొట్టి ఆలోచించే తత్త్వం కలది. భావాలనూ, సిద్ధాంతాలనూ, ఆఖరుకు నిత్యజీవితకర్మలనుకూడా సుస్పష్టంగా విడదీసే స్వభావంకలది. ఆర్యులు సంఘాన్ని నాలుగువర్ణాలుగా విభజించడమేకాకుండా ప్రతి వ్యక్తి జీవితాన్ని నాల్గు అవస్థలుగాకూడా విభజించారు. మొదటిది బాల్యావస్థ. శరీరాన్ని చక్కగా పెంచడం, విద్యాబుద్ధులు నేర్చుకోవడం, ఆత్మశిక్షణ, ఆత్మనిగ్రహం, బ్రహ్మచర్యాన్ని అనుష్ఠించడం ఈ అవస్థయొక్క విధులు. రెండవది యౌవనం. ఈ అవస్థలో గృహస్థధర్మాలను నిర్వహించడం, మామూలు సాంసారిక ధర్మాలను ఆచరించడం విధాయకం. తృతీయావస్థ కౌమారం. ఈ

అవస్థలో బుద్ధి పరిపక్వంచెందిన రాజకీయవేత్తయై, ఒక హూందాతో, ప్రతిఫలాపేక్ష లేకుండా ప్రజాసేవలో నిమగ్నుడుకావాలి. చతుర్థావస్థ వృద్ధాప్యం. ఈ ఆఖరుదశలో మానవుడు ప్రపంచంలోని నిత్య త్తిక వ్యవహారాలలో కలుగచేసుకోకుండా ప్రశాంతమైన జీవితం గడపాలి. ఈవిధంగాకూడా ఆర్యులు జీవితంలో పరస్పరం ప్రతికూలంగా ఉండే అవస్థలను సమ్మేళనంచేశారు. జీవితానందాలను పరిపూర్ణంగా అంగీకరిస్తూనే, దానిని నిష్కామ్యంగా విడచిపెట్టేరు. ఇండియాలోనూ చైనాలోనూకూడా విద్యా వైదుష్యాలను ఎల్లప్పుడూ ప్రజలు చాలా గౌరవిస్తారు. విజ్ఞానమంటే విద్యాధిక్యతతోపాటు శీలంకూడా ఉంటుందని భావింపబడుతుంది విజ్ఞానవేత్తలకు మహారాజులు, మహావీరులు కూడా పాదాక్రాంతులయ్యేవారు. అధికారాన్ని ఛలాయించేవారు, ధర్మాన్ని పరిపూర్ణవిశుద్ధతతో అమలుజరుపలేరని పురాతనమైన భారతీయసిద్ధాంతం. వారి స్వార్థం, అభిమాన దురభిమానాలు, ప్రజాధర్మ నిర్వాహణాని కంతరాయాలు కలిగిస్తాయని వారిభావం. అందుచేతనే నైతిక విలువలను నిర్ణయించి వాటిని పరిపాలించే బాధ్యతలను, సంసారతాపత్రయాలకు అతీతులై, విజ్ఞానవేత్తలైన ఋషులకు వప్పచెప్పేరు. జీవితసమస్యలను వారు ఏవిధమైన మొగమోటములకూ తావివ్వక, నిష్కామ్యబుద్ధితో పరిష్కరింపగలిగేవారు. జ్ఞాననిధులైన ఈ ఋషిపుంగవులు సమాజంలో అత్యున్నతస్థానాన్ని అలంకరించి అందరిచేత గౌరవింపబడుతూ ఉండేవారు. లౌకికధర్మనిర్వాహకులైన పరిపాలకులు యోధులు ఎంతటి ప్రతిభావంతులైనా వారి తరువాతవారే. వారికుండే పూజ్యత, గౌరవం వీరికి ఉండేదికాదు. కేవలం ధనవంతులకు ఐశ్వర్యవంతులకు గౌరవం ఇంకా తక్కువ. సంగ్రామయోధులు అగ్రస్థానాన్ని వహించకపోయినా చాలా గౌరవానికి పాత్రులయ్యేవారు. చైనాలోవలె వారు నీచంగా చూడబడేవారుకారు.

ఈ సిద్ధాంతమే కొంతవరకు ఇతరదేశాల్లోకూడా అమలులో ఉండేది. యూరపులోని క్రైస్తవరాజ్యంలో మధ్యయుగంలో రోమన్ కాథలిక్ చర్చి ఈలాంటి నాయకత్వాన్నే వహించింది. ఆధ్యాత్మిక, నైతికవ్యవహారములందును, దేశపరిపాలనావ్యవస్థయొక్క సిద్ధాంతములను నిర్ణయించుటలోనూ చర్చిదే పైచెయ్యి. ఆచరణలో రోమ్ నగ

రములోని మతాధికారులు లౌకిక అధికారాలయందే ఎక్కువ ఆసక్తిని చూపించారు. చర్చితాలూకు మతాధికారులే రాజకుమారులైనారు. హిందూదేశంలో బ్రాహ్మణవర్ణం సంఘానికి కావలసిన మేధావులను, వేదాంతులను తయారుచేయడమే కాకుండా, పౌరోహితధర్మం చాలా బలాన్ని సంపాదించి తమ ప్రత్యేకస్వార్థాన్ని సంరక్షించుకున్నది. ఏమైనా భారతీయజీవితంలో ఈ సిద్ధాంతం చాలా గాఢంగా నాటుకుంది. జ్ఞానవంతుడు, దానధర్మాసక్తిగల మంచివాడు, ఆత్మనిగ్రహంకలవాడు ఇతరులకోసం తన స్వార్థాన్ని త్యాగంచేయగలవాడు సంఘంలో ఉత్తమస్థానాలను పొందగలిగేవారు. ప్రత్యేకమైన హక్కులతో సర్వరక్షణలతోకూడిన వర్ణాని కెన్ని అవగుణాలుండాలో అన్ని అవగుణాలూ గతంలో బ్రాహ్మణుని ఆశ్రయించాయి. ఆ వర్ణంలో చాలామందికి విద్య, శీలం రెండూ లేకుండాపోయినాయి. అయినప్పటికీ ప్రజలలో వారియెడల పూజ్యభావమూ గౌరవమూ పోలేదు. అందుకు కారణము వారు ధనికులవడంచేతకాదు. తరతరాలుగా అద్భుత ప్రతిభగల మేధావులను సంఘాని కర్పించడంచేతనే, ప్రజాశ్రేయస్సుకోసం ఆత్మార్పణంచేయగలశక్తివల్లనే, ప్రజాసేవానిరతివలన ప్రతియుగంలోనూ బ్రాహ్మణవర్ణంలో జన్మించిన మహనీయుల ప్రతిభవల్ల ఆ వర్ణమంతా ప్రజలమన్ననల నందుకున్నది. వారికుండే ఉద్యోగాలవల్లకాక వారి శీలసంపత్తిచేతనే ఈ గౌరవాన్ని వారు పొందేరు. విద్య, మంచితనం ఏ వ్యక్తిలోనున్నా ఆ వ్యక్తిని గౌరవించడమే సాంప్రదాయం. బ్రాహ్మణేతరులు, హరిజనవర్గమువారుకూడ అలాగే వారి విద్యావిశేషమువల్ల గౌరవింపబడ్డారు. అందులో కొందరు ఆళ్వారులుగా ఋషులుగాకూడా పరిగణింపబడ్డారు. సైనికాధికారులకూ, రాజకీయోద్యోగస్థులకూ, ఏమైనా కించిత్తు భయపడేవారేమో కాని, వారికి జ్ఞానులకిచ్చే మర్యాదనుమాత్ర మిచ్చేవారుకారు.

ఈనాటికీ ఈ ధనయుగంలోకూడా, విజ్ఞానానికి ప్రాధాన్యత నిచ్చే సాంప్రదాయం ఈదేశంలో అలాగే ఉంది. కనుకనే బ్రాహ్మణుడు కాకపోయినా గాంధీజీ నాయకాగ్రేసరుడై, ఏవిధమైన అధికారము, నిర్బంధము, ధనము లేకుండగనే లక్షలాది ప్రజాహృదయములను ఉప్పొంగించగలిగేడు. ఒకజాతియొక్క సాంస్కృతిక సాంప్రదాయా

లను లక్ష్యాలను తెలుసుకోవడానికిదొక గొప్ప సాధనం. ఒకజాతి ఎటువంటి నాయకుడిని వరిస్తుంది? అదే ప్రశ్న.

పురాతన భారతనాగరికత అనగా ఇండో ఆర్యన్ నాగరికత యొక్క పరమలక్ష్యం ధర్మం. ధర్మమంటే మతాన్నీ వర్ణాన్నీకూడా మించినది. మానవుడు తనయెడలా తోటివారియెడలా నిర్వర్తించవలసిన విధాయకము. యావత్తు ప్రపంచమూ, అందులోనున్న చరాచర రాసుల ఉనికికీ కదలికకూ కారణభూతమైన ప్రధానన్యాయము ఋతం. దాని అంతర్భాగమే ధర్మం. మానవుడు ఈరీతిగా విభజింపబడిన వ్యవస్థలో తానుకూడా ఇమిడిపోయి, దానితో శ్రుతికలిపి జీవించవలసిందే. మానవుడు తన ధర్మాన్ని నిర్వర్తించడంలో న్యాయంగా ప్రవర్తించి ఉంటే సత్ఫలితాలు వాటంతటవే కలిగేవి. కేవలం హక్కుల కెప్పుడూ ప్రాధాన్యత లేదు. ప్రతిచోటా పూర్వకాలపు దృక్పథమంతే. పూర్వపు రోజులకీ ఇప్పటికీ ప్రత్యక్షంగా కనబడే తేడా ఇదే. ఈకాలంలో ఎక్కడ చూచినా హక్కులప్రసక్తే. వ్యక్తిహక్కులు, మతాల హక్కులు, దేశాలహక్కులు, అన్నీ హక్కులే.

## అవిరామంలేని భారతసంస్కృతి

చాలా పురాతనకాలంలోనే, మన సంస్కృతియొక్క పునాదులు ఘట్టిగా పడినాయి. ఆ సంస్కృతి, ఆ నాగరికత అనేకవిధాలుగా తరువాతయుగాల్లో వికాసంపొందింది. ఎన్నిమార్పులొచ్చినా ఈనాటి వరకూ చెక్కుచెదరకుండా ఉంది. ప్రధానలక్ష్యాలు, వాటిని సాధించే సిద్ధాంతాలు రూపొందింపబడ్డాయి. సాహిత్యం, వేదాంతం, లలితకళ, నాట్యకళ తదితర జీవితవ్యాసంగాలన్నీ ఆ లక్ష్యాల ననుసరించీ, ప్రపంచ ధోరణినిబట్టీ సరిదిద్దబడ్డాయి. దానితోపాటే 'నన్నుముట్టుకోకు నామాలకాకి' అనే భావంకూడా ఉద్భవించి, దినదినప్రవర్ధమానంగా పెరిగి, అనుల్లంఘనీయమైన వర్ణవ్యవస్థగా నేటికి పరిణమించింది. దాని ప్రభావం అన్నిటిమీదా ప్రసరిస్తోంది. ఏనాడో, ఆనాటి కాలమాన స్థితినిబట్టి, సంఘానికి సుస్థిరత్వం చేకూర్చడానికీ, దానికి బలాన్నివ్వడానికీ ఏర్పాటుచేయబడిన వర్ణవ్యవస్థ, ఆ సంఘానికే ఖైదుగా పరిణమించింది. మానవుని మనస్సునే బంధించేస్తోంది,

అలాంటి చట్రంలో బంధింపబడినా, సర్వతోముఖంగా అభివృద్ధిచెందాలన్న వాంఛ చాలాగాఢంగానూ బలంగానూ ఉండడంచేత భారతసంస్కృతి దేశవ్యాప్తం కావడమే కాకుండా తూర్పుసముద్రం దాకా వ్యాపించింది. ఎన్నితాకిడీలు ఎంతతరచుగా తగిలినా అచంచలంగా నిలబడింది. సంస్కృతసాహిత్యచరిత్రను రచించిన ప్రొఫెసర్ మాక్డొనెల్ ఇలావ్రాశాడు—భారతదేశసాహిత్యంయొక్క ప్రాధాన్యత దానిలోని అపూర్వతయే. క్రీస్తు పూర్వం 4 శతాబ్దాలకు పూర్వం గ్రీకులు పశ్చిమోత్తరప్రాంతంమీద దండెత్తినప్పుడు, అప్పటికే భారతీయులు విదేశసంపర్కంలేని జాతీయనాగరికత నొకదానిని రూపొందించారు. తరువాత ఎన్నోసారులు పర్షియనులు, గ్రీకులు, సిథియనులు, మహమ్మదీయులు దండయాత్రలు సాగించినా, జయించినా, ఇండో ఆర్యన్ జాతీయజీవనము, సాహిత్యమూ యథాప్రకారంగా చెక్కుచెదరకుండానే వృద్ధిపొందుతూవచ్చాయి. బ్రిటిష్‌వారివశంలో పడేవరకూకూడా పైవారిప్రభావం లేకుండానే సాగిపోయాయి. ఇండో యూరోపియను దేశాల్లో ఇలాంటి అనుభవం ఎక్కడా లేదు. చైనా తప్ప మరే ఇతర దేశంకూడా తనభాషను, సాహిత్యాన్ని, మతవిశ్వాసాలను కర్మకాండలను, నాట్యకళను, సాంఘిక ఆచారవ్యవహారాలను మూడు వేలేండ్లపైనాటి మూలములని చెప్పలేదు. ఆనాటినుండీ నిర్విరామంగా వృద్ధిచెందేయి"

అయినప్పటికీ భారతదేశం ఒకమూల ఒదిగి కూర్చుని ప్రపంచాన్ని అంటీముట్టకుండా ఉండలేదు. ఇన్నివేలఏండ్ల చరిత్రలోనూ ఇరాన్‌వారితోను, గ్రీకులతోను, చైనా, సెంట్రల్‌ఏషియావారితోనూ తదితరులతోనూ సంబంధబాంధవ్యాలను నెరపుతూనేఉన్నది. ఇందరితో సన్నిహితత్వమున్నా భారతసంస్కృతిమూలాలు అచంచలంగా ఉన్నాయంటే, ఆ సంస్కృతిలోనే ఏదో మహత్తరమైన విశిష్టత ఉండిఉండాలి. ఆ విశిష్టతే దానికొక అద్భుతమైన జవసత్వాల నిచ్చిందని చెప్పాలి. మూడునాల్గువేల సంవత్సరాలపాటు తెంపులేకుండా సాంస్కృతికాభివృద్ధిచెందడమే ఒక అద్భుతవిషయం. సుప్రసిద్ధ పండితోత్తముడు, ప్రాగ్దేశాభిమాని మాక్సుముల్లర్ "మూడు వేల సంవత్సరాలకు పైబడిన వయస్సుగల భారతసంస్కృతిలో హిందూభావాల్లో బహుప్

రాతనమైనవాటికిని సరికొత్తవాటికిని ఒక తెంపులేని సంబంధమున్నది" అన్నాడు. 1882 సంవత్సరంలో కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో మాట్లాడుతూ ఆయన ఉత్సాహపూరితుడై ఇల్లా అన్నాడు.

"ప్రపంచంలో—ఐశ్వర్యవంతమైనదీ, శక్తివంతమైనదీ, ప్రకృతి సౌందర్యంగలదీ, కొన్నిచోట్ల సాక్షాత్తూ భూలోకస్వర్గమనదగిన సుందర ప్రాంతాలుగలదేశం ఏదైనా ఒకటుందా అంటే హిందూదేశమని చెప్పాలి. ఏదేశంలో మానవునిబుద్ధి పరిపూర్ణంగా వికసించిందని నన్నడిగితే, ఏదేశంలో మానవునిబుద్ధి, జీవితసమస్యలపై చక్కగా ఆలోచించి కొంతవరకు పరిష్కారమార్గాలను కనపెట్టి, ప్లేటో, కేంట్ వంటి తత్వవేత్తలను సహితం ఆకర్షించగలిగిందని నన్నడిగితే, హిందూదేశమని చెపుతాను. గ్రీకు, రోమను సాహిత్యంలోని భావాలమీద పెరిగిన యూరపులోని మనమూ, యూధులూ మన జీవితాలను సమగ్రం చేసుకోవాలన్నా, నిర్దుష్టంచేసుకోవాలన్నా, మన ఆంతరంగికజీవితాలను పరిశుద్ధంచేసుకోవాలన్నా, నిజమైన మానవజీవితం కావాలనుకున్నా, ఇహసౌఖ్యాలతోపాటు, శాశ్వతసౌఖ్యం లభించాలన్నా, ఇంకా హిందూదేశమే మనకు శరణ్యమని చెప్పక తప్పదు."

మాక్సుముల్లరు తరువాత 50 సంవత్సరాలకు రోమారోలా కూడా అలాగే వ్రాశాడు.

"భూమిమీద బ్రతికున్నవారి కలలన్నీ నిజమై ఆదికాలంనుంచీ వాటి కొక స్థానమేర్పడిన దేశమేదైనా ఉన్నదాఅంటే అది హిందూదేశమే."

## ౬ ఉపనిషత్తులు

క్రీస్తు పూర్వము 800 ఏండ్లకుముందుద్భవించిన ఉపనిషత్తులు, ఇండో - ఆర్యన్ సంస్కృతియొక్క- అభివృద్ధియం దొక పెద్దమెట్టు. ఆర్యులు చాలాకాలంగా స్థిరనివాసమేర్పరచుకున్నారు. పాత కొత్తల మేళవంతో సకలైశ్వర్యదాయకమైన ఒక నాగరికతను వారు పెంపొందించారు. ఆర్యభావాలు, లక్ష్యాలు ఆ నాగరికతలో ప్రధానస్థానమునాక్రమించినప్పటికీ, ఆదిమకాలంనాటి ఆరాధనావిధానం మారలేదు.

వేదాలు గొప్పగా పూజింపబడేవి. కాని కొంతవ్యంగ్యంకూడా ఉండేది. వైదిక దేవతలతో సంతృప్తిపడలేదు. పౌరోహితుల తతంగం హేళనగా చూడబడింది. కాని గతాన్ని పూర్తిగా వదలలేదు. అభ్యుదయానికదే ప్రాతిపదికగా గణింపబడింది.

ఉపనిషత్తుల సారాంశము జ్ఞానాన్వేషణ. మనస్సుతో అన్ని విషయాలను గురించి ఆలోచించి వాటి సత్యాన్ని తెలుసుకోవాలనే ఆకాంక్ష ప్రత్యక్షప్రమాణములమీద ఆధారపడిన నేటి నవీన శాస్త్రజ్ఞానం సాధనంగా ఈ సత్యాన్వేషణ జరుగలేదు. కాని ఏదో ఒక శాస్త్రీయపద్ధతి ననుసరించే అన్వేషణ జరిగింది. మూఢవిశ్వాసంతో ఏపనీ జరుగలేదు. అందులో ఈనాడు అప్రస్తుతమైన విషయాలెన్నో ఉన్నాయి. అందలి ప్రధానవిషయం ఆత్మసాక్షాత్కారం. ఆత్మనూ పరమాత్మనూ తెలుసుకోవడమే పరమావధి. రెండూ ఒకటే బ్రహ్మపదార్థమని చెప్పబడింది. ప్రత్యక్షప్రమాణంగా కనబడుతుండే ఈ బాహ్యప్రపంచం కేవలం మిథ్యగా భావింపబడలేదు.

ఉపనిషత్తులలో చాలా సంశయాలున్నాయి. వాటినిగూర్చి అనేక వ్యాఖ్యానాలు చేయబడ్డాయి. అదంతా వేదాంతులకు పండితులకు వదలిపెట్టవలసిందే. బ్రహ్మపదార్థం ఒక్కటేననీ, యావత్సృష్టి అందులోనుంచి వచ్చినదేననే సత్యమే స్థూలంగా చెప్పబడింది. ఆ విషయమై ఆనాడుండిన అభిప్రాయభేదాలను, వాదోపవాదాలను చర్చించి, వాటిని సమన్వయపరచడమే ఉపనిషత్తులలక్ష్యంలా కనబడుతుంది. అదొకసమన్వయవిధానం. మాంత్రికతాంత్రికములనూ, మానవవిజ్ఞానాని కతీతమైన విషయాలనూ ఉపనిషత్తులు ప్రోత్సహించలేదు. జ్ఞానశూన్యమైన కర్మకాండ వృథాయని చెప్పబడింది. "చాలామంది జ్ఞానులమని పండితులమని అనుకొని 'కాననివాని నూతగొని కాననివాడు చరించునట్లుగా' ఈ కర్మకాండను పట్టుకు ప్రేలాడేవారు. మోక్షాన్ని సాధించలేరు" అని చెప్పబడింది. వేదాలుకూడా క్రిందశ్రేణికి చెందిన సాధారణ జ్ఞానంక్రిందనే పరిగణింపబడేవి. పరమాత్మ జ్ఞానమే జ్ఞానంక్రింద గణింపబడేది ఆత్మశిక్షణ, సత్ప్రవర్తనలేని శుద్ధ వేదాంతవిద్య నిష్ప్రయోజనమని చెప్పబడింది. ఆధ్యాత్మికజ్ఞానసంపాదనతో నిత్యనైమిత్తిక సాంఘిక

ధర్మాలను సమన్వయించేయడానికి నిరంతరకృషి జరిగింది. నిత్యనైమిత్తికవిధులను జరిపించవలసినదే. కాని నిష్కామ్యంగా కుమ్మరిపురుగువతుగా నిర్వహించాలి.

బహుశా వ్యక్తి నిర్దుష్టతకు, పరిపూర్ణతకు ఎక్కువ ప్రాధాన్యత వ్వడంవల్ల సాంఘికదృక్పథం కొంత తగ్గినదేమో! 'వ్యక్తికన్న ఘనమైన దింకొకటి లేదు' అని ఉపనిషద్వాక్యం. సంఘం అప్పటికే సుస్థిరమై వ్రేళ్ళు పాదుకొని ఉండడంచేత మానవుని బుద్ధి ఎక్కువగా వ్యక్తి పరిపూర్ణతమీద కేంద్రీకరించియుండవచ్చును. ఈ అన్వేషణలో మానవునిబుద్ధి స్వర్గాన్ని తన ఆత్మనూకూడా గాలించింది. ఇది కేవలం ఒక్క పురాతన హిందూదేశంయొక్క దృక్పథమేకాదు. చైనా మొదలు గ్రీసుదేశం వరకూ అదే దృక్పథం ఉండి ఉండాలి. హిందూదేశం ఈ దేశాలకు మూలవిరాట్టు.

"ఈ ప్రపంచంలో ఉన్న మానవ సంఘమంతా ఒకరిమీద ఒకరు ఆధారపడవలసినదే" అని మహాభారతంలో చెప్పబడింది.

ఉపనిషత్తుల్లో చర్చింపబడిన ఆధ్యాత్మికవిషయాలను గ్రహించడం నాకు చాలా కష్టం. సాధారణంగా మూఢనమ్మకాలతోనూ కిం అనడానికి వీలులేని విశ్వాసంతోనూ ఆవృతమైన అనేక సమస్యల చిక్కును విడదీయడానికి ఉపనిషత్ విధానము మాత్రము నా కెంతో నచ్చింది. అది కేవలం మతసంబంధం కాక తత్వవిచారంతో కూడుకున్న మార్గం. భావపటుత్వమూ ప్రశ్నించేపద్ధతి హేతువాద సమన్వితం కావడం నాకెంతో సంతుష్టి కలిగించింది. గురుశిష్యన్యాయంలో ప్రశ్నలు, జవాబులు బహు బింకంగా ఉంటాయి. ఉపనిషత్తులంటే శిష్యులు వేసిన ప్రశ్నలకు సమాధానంగా గురువుగారిచ్చిన ఉపన్యాసాలసారమని కొందరంటారు. గురువుగారు చెప్పగా శిష్యులు గ్రంథస్థంచేశారని అభిప్రాయం. ఉపనిషత్తులను గురించి 'హిందూదేశపు వారసత్వం' అనే గ్రంథాన్ని వ్రాసిన ప్రొఫెసర్ థామస్ ఇలా వ్రాశారు-

"చాలా ముఖ్యవిషయాలను గురించి స్నేహితులు చర్చించుకున్నట్లుగానేఉండి ఆ చర్చల్లో చాలా శ్రద్ధాసక్తులు ప్రత్యక్షంగా కనబడడమే ఉపనిషత్తులయొక్క విశేషం."

శ్రీమాన్ సి. రాజగోపాలాచార్యులవారు ఇలా చెప్పారు.

"గొప్ప భావవైశాల్యం, ధారాళమైన ఆలోచన, సత్యాన్వేషణ కోసం కష్టనిష్ఠురాలతో నిమిత్తంలేని శోధనాశక్తిగల ఉపనిషద్గురువులు శిష్యులు ఈ బ్రహ్మాండంలోని బహిరంగరహస్యాల నన్వేషించారు. అందువల్ల ప్రపంచంలోని మతగ్రంధాల్లోకల్లా పురాతనమైన ఈ ఉపనిషద్గ్రంధాలు ఎంతో నవీనంగా ఉండి బహు సంతృప్తినిస్తాయి."

ఉపనిషత్తులప్రధానలక్షణం ఏమంటే, సత్యభారం. 'సత్యమేవ జయతే, నానృతం......................................... జ్ఞానం వెలుగుకోసం తపించడం' అసతోమయ..........

జ్ఞానంకోసం తహతహలాడి పరితపిస్తుండేమనస్సు, తొంగిచూస్తూ వెతుక్కుంటూ, నిరంతరం ప్రశ్నిస్తూఉంటుంది. ఎవరుకోరితే మనస్సు వెలుగుచూపిస్తోంది? ఎవరు ఆజ్ఞాపిస్తే ప్రాణం ధరింపబడుతోంది? ఎవరడిగితే మనుష్యులు మాట్లాడుతున్నారు? కర్ణేంద్రియాన్ని, నేత్రేంద్రియాన్ని ఏదేవుడు శాసిస్తున్నాడు? ఇలాంటి ప్రశ్నలెన్నో ఉత్పన్నమవుతుంటాయి. "గాలి ఎందుచేత స్తంభించదు? మానవునిబుద్ధికి విశ్రాంతి ఎందుకుండదు? నీరు ఎందుకు నిరంతరం ప్రవహిస్తోంది? మానవుని సాహసస్వభావమే ఇదంతా చేయిస్తోంది. ఈ ప్రయాణానికి అంతులేదు. ఐత్తరీయబ్రాహ్మణంలో మనం సాగించవలసిన ఈ అనంత ప్రయాణాన్నిగురించి ఒక పాట బాగా వ్రాశాడు. ప్రతిచరణమునకూ చివర 'చరయవేతి చరయవేతి' అని ఉంటుంది. అంటే 'ఓ బాటసారీ! పదవోయి ముందుకు పదవోయి పద' అని అర్థం.

ఉపనిషదన్వేషణలో వినయంలేదు. సాధారణంగా ప్రతిమతంలో లాగుననే సర్వశక్తిసంపన్నుడైన పరమేశ్వరునికి శరణాగతులవుతుండే విధేయత ఇందులోలేదు. ఇది దేశకాలపరిస్థితులపై మానవునిబుద్ధిసాధించిన విజయమనిచెప్పాలి. "నా శరీరము భస్మమైపోవచ్చును! నా శ్వాస ఆద్యంతరహితమైన వాయువులో లీనమైపోవచ్చును. కాని నేను, నేను చేసిన పనులు నశించవు. ఓ మనసా! ఈ మాటను జ్ఞప్తియందుంచుకో" అని ఉపనిషద్వాక్యము. ప్రాతఃకాలమందు సూర్యోపాసనలో "ఓ తేజోమూర్తీ! సూర్యభగవానుడా! నిన్ను ఇంతగాచేసిన దెవ్వరో అతడే నేను" అని చెప్పబడింది. ఎంతటి మహత్తరమైన ఆత్మవిశ్వాసమోకదా!

ఆత్మ అంటే ఏమిటి? ఇదమిత్థమని చెప్పడం కంటే అది ఏది కాదో చెప్పడం తేలిక. 'ఇది కాదు, ఇది కాదు' అనో లేక 'ఇదే నువ్వు' అనో నిర్వచనం చేయాలి. వ్యక్తులలో ఉండే ఆత్మ పరమాత్మలో నుండి విడిపడిన ఒక కణమని, మరల ధగధగ మండే పరమాత్మయే దానిని మళ్ళీ తనలో లీనంచేసుకుంటుందని భావం. "అగ్ని ఒక్కటేయైనా, అది దేన్ని దహిస్తుందో దాని స్వరూపం దాల్చినట్లే. అలాగే ఆత్మ కూడా ఒక్కటే రూపరహితమైనదైనా వివిధదేహాలలో వివిధత్వం దాల్చింది." సృష్టిఅంతా ఒక్కపదార్థంలోనుంచి ఏర్పడిందేననే ఈ ఉదాత్తభావమే, మనకీ వారికీ మధ్యనున్న అంతరాయాలను తొలగిస్తోంది. ప్రకృతితోను, మానవత్వంతోనూ ఒక సమైక భావాన్ని కలిగిస్తోంది. బాహ్యప్రపంచంలో వివిధత్వము కనబడుతున్నా, ప్రధానంగా ఉండే ఏకత్వాన్ని చాటుతోంది. 'సర్వసృష్టి ఆత్మసంబంధమేనని తెలుసుకున్న వారికి దుఃఖ మెక్కడిది? ఆ ఏకత్వముపై దృష్టిసారించిన వారికి మాయ ఎక్కడిది? ఎవరు ఆత్మలో సర్వమును చూడగలరో, సర్వ సృష్టియందు ఆత్మను చూడగలరో వారికి, అగోచరమైనది లేదు." కుల వర్ణభేదాలకు తదితర బాహ్యభేదాలకూ అతీతమైన యిటువంటి సమగ్ర దృక్పథాన్ని ఇండో ఆర్యనుల తీవ్రమైన ఆత్మవ్యక్తిత్వంతో పోల్చిచూస్తే చిత్రంగానే ఉంటుంది. ఇదొకవిధమైన ఆధ్యాత్మిక ప్రజాస్వామికం. "ఎవ్వరు అందరిలోనూ ఒకే ఆత్మను చూడగలరో, ఒకే ఆత్మలో అందరినీచూడగలరో, అట్టివారు ఎవరినిగాని నిరాదరణదృష్టితో చూడలేరు." ఈ భావం సూత్రప్రాయంగా కనబడవచ్చును. కాని మతవిశ్వాసంలో స్వేచ్ఛ, పరస్పర సహనభావం, తనతోపాటు ఇతర జీవరాసుల క్షేమాన్ని కాంక్షించడం, మొదలైన మంచిలక్షణాలు చైనావలెనే భారతసంస్కృతియందుకూడా విశిష్టంగా ఉండేవి. ఆ లక్షణాలు ఆ కాలపు జీవితంమీద తమ ప్రభావాన్ని వ్యాపింపచేశాయి. మతంలోగాని నాగరికతలో కాని 'నా అన్యః' అనే భావముండేదికాదు. అది పురాతనమైన, వివేకపూరితమైన, అనంతశక్తిసంపన్నమైన సంస్కృతి. ఉపనిషత్తులలో ఒక చిత్రమైన ప్రశ్న, దానికి చిత్రమైన జవాబు ఉన్నది. 'ఈ విశ్వమంతా ఏమిటి? అదెందులోనుంచి ఉత్పన్నమైంది? అదెక్కడికి కెడుతుంది?' అన్నది ప్రశ్న. 'స్వాతంత్ర్యంలో

జన్మించి, స్వాతంత్ర్యంలో భరింపబడి, స్వాతంత్ర్యంలో లీనమైపోతుంది' అని జవాబు. దీనికి సరియైన అర్థమేమిటో మాత్రం నాకు తెలియదు. ఉపనిషత్కర్తలు గాఢమైన స్వాతంత్ర్యభావాభిలాషులనీ, సర్వవిషయాలనూ ఆ దృష్టితోనే చూచేవారనీ మాత్రం స్పష్టం. వివేకానంద స్వాములవా రెప్పుడూ ఆ విషయాన్నే ఘంటాపథంగా చెపుతూఉండే వారు.

ఎంతటి ఊహాప్రపంచంలోనైనా అంత వెనుకకాలాని వెళ్ళి వారి మానసికస్థితి నందుకోవడం అసంభవం. వారు గ్రంథసంచేసే పద్ధతి కూడా మనకు గ్రహణసాధ్యంకాదు. విషయం చిత్రంగా కనబడుతుంది. అనువాదంచేయడం అసంభవం. దాని వెనుకనున్న ఆనాటి జీవితవిధానాన్ని అవగాహనచేసుకోవడం కష్టం. ఎంతో చిత్రంగానూ అసంభవంగానూ కనబడినా, అలవాటుకొద్దీ మనం ఎన్నోవిషయాలను 'కిం' అనకుండా అంగీకరిస్తాం. కాని మనము అర్థంచేసుకోలేని విషయాలు చాలా ఉన్నాయి. ఏమైనా ఉపనిషత్తుల సందేశాన్నిమాత్రం, చరిత్రలో ఎన్నో యుగాలనుంచి జనం భక్తిశ్రద్ధలతో వింటున్నారు. జాతీయవిజ్ఞానాన్ని, ప్రవర్తనను అవి చాలవరకు రూపొందించినవి. 'హిందూ భావాలకు బౌద్ధమతంతోసహా - మూలం ఉపనిషత్తులే. అందులో లేనివి ఎక్కడా లేవు'' అన్నాడు బ్లూమ్‌ఫీల్డ్.

ప్రాచీనభారతవిజ్ఞానం ఇరాన్‌ద్వారా గ్రీసువరకూ వ్యాపించి అచట వేదాంతులకూ విజ్ఞానులకూ వెలుగుచూపించింది. తరువాత కొంతకాలానికి ప్లోటినస్ ఇరాన్ హిందూదేశాలలోని వేదాంతవిషయాలను తెలుసుకోవడానికి ప్రాగ్దేశయాత్రచేశాడు. ఆయన నెక్కువగా ఆకర్షించినది ఉపనిషత్తులలోని విచిత్రవిషయములే. అందులోని భావములే ప్లోటినస్‌ద్వారా సెయింట్ అగస్టీనుకు సంక్రమించినాయి. ఆయనద్వారా అప్పటి క్రీస్తుమతంమీద ఉపనిషత్తులప్రభావం ప్రసరించింది. ఈ విషయాలను ఫ్రెంచి విజ్ఞాని రోమారోలా వివేకానందుని గూర్చి ఆయనవ్రాసిన గ్రంథంలో విపులంగా వ్రాశాడు.

గత 150 సంవత్సరాలనుంచీ భారతీయవేదాంతమును గురించి యూరోపియను విజ్ఞానులు చేస్తున్న పరిశోధనలు వారి కెంతో విజ్ఞానదాయకమైనవి. నిరాశావాదియైన షోపెన్‌హార్ అభిప్రాయాలు గమ

నించదగినవి. "ఉపనిషత్తులలోని ప్రతివాక్యంలోనుంచీ, అగాధమైన అపూర్వమైన మహోత్తమభావాలు ఉత్పన్నమవుతాయి......... మహోన్నతమైన, పవిత్రమైనఉత్సాహంజనిస్తుంది. ప్రపంచంలో ఉపనిషత్తులను చదువడంకన్న ఉపయోగమైనపని, అంతకన్న ఉత్తేజకరమైన పయం మరొకటుండదు.........మహోత్తమవిజ్ఞానంనుండి ఉత్పన్నమైనవి ఉపనిషత్తులు...ఎప్పుడో ఒకప్పుడు అవి సర్వే సర్వత్రా ప్రజల విశ్వాసానికి పాత్రంకాకతప్పదు...ఉపనిషత్పఠనం నా జీవితానికెంతో సంతృప్తిని ఆనందాన్ని కలిగించాయి. నా మృత్యువుకుకూడా ఎంతో ఆనందాన్నిస్తాయి" అన్నాడు షోపెన్‌హౌర్. అందుమీద మాక్సుముల్లర్ పండితు డిల్లా వ్యాఖ్యానించాడు – "షోపెన్‌హౌర్ అనాలోచితంగా, యథాలాపంగా వ్రాసేవాడుకాడు. ఏవో చిత్రమైన భావాలకు ఉప్పొంగిపోయేవాడూ కాడు. వేదాంతవిద్యపట్ల ఆయనకుండిన ఉత్సాహమే నాకూ ఉందని అంగీకరించడానికి నేను భయపడడంలేదు. భిడియపడడంలేదు. నా జీవితంలో నా కెంతో సహాయపడిన వేదాంతవిద్యకు నేను బహుధా కృతజ్ఞుడను."

మరొకచోట మాక్స్‌ముల్లర్ ఇలా వ్యాఖ్యానించాడు. "వేదాంత విజ్ఞానానికి మూలం ఉపనిషత్తులు. ఈ వేదాంతంలో మానవుని ఊహ చరమావధకు పోయింది. ఈ వేదాంతగ్రంథాలు చదువడంతోనే నేను గంటలకొద్దీ కాలక్షేపంచేస్తూ ఆనందాన్ని పొందగలుగుతున్నాను. అవి నాపాలిటి భానుని ఉషఃకాంతులవంటివి.. పర్వతాలమీదనుండి వచ్చే పిల్లగాలులవంటివి. అవి చాలా సుబోధకములు. అర్థంచేసుకుంటే వాటిసత్యం అవలీలగా బోధపడుతుంది"

బహుశా ఉపనిషత్తులనూ, వాటి తరువాత పుస్తకమైన భగవద్గీతనూ గొప్పగా ప్రశంసించినవాడు ఐరిష్ కవి జి. డబ్ల్యు. రస్సెల్. "గోథే, వర్డ్స్‌వర్తు, ఎమర్సన్, థారో మొదలైన నవీనులలో ఇలాంటి శక్తి, వివేకమూ ఉన్నవి. కాని వాళ్ళు చెప్పిన సంగతులు ఇంకా వాటినిమించినసంగతు లెన్నో ప్రాగ్దేశవేదాంతగ్రంథాల్లో ఉన్నాయి. భగవద్గీతలోనూ, ఉపనిత్తుల్లోనూ, సాక్షాత్తూ పరమేశ్వరునికే సాధ్యమైన పరమవిజ్ఞానవిషయాలున్నాయి. వారు అలాంటి విశ్వాసంతో, 'ఇది సత్యం' అని తోచేటట్లు ప్రవచించగలిగినారంటే, వేలాది సంవత్స

రాల జీవితాన్ని, వారు వెనుకకు చూడగలిగి అందలి సంఘర్షణల నన్నిటినో ప్రశాంతంగా ఆకళింపుచేసుకుంటేనే కాని సాధ్యంకాదు. వారి కెరుకలేని విషయాలు లేవు.'' అన్నాడు రస్సెల్.

## ౧౦ వ్యష్టివేదాంతంయొక్క లాభ - నష్టాలు

చక్కని సాధనవలన దేహాన్ని సౌష్టవంగానూ వశంలోనూ ఉంచాలనీ, బుద్ధిని నిర్మలంగా ఉంచాలనీ, ఈ రెంటిని క్రమమైన శిక్షణలో ఉంచితే కాని ఏ విధమైన అభివృద్ధీ సాధ్యంకాదనీ ఉపనిషత్తులు పదేపదే ఘంటాపథంగా చాటుతున్నాయి. జ్ఞానసముపార్జనకుగాని మరేవిధమైన ఫలసిద్ధికి కాని ఆత్మనిగ్రహం, నిష్ఠ, త్యాగం చాలా ముఖ్యం. భారత సాంప్రదాయంలో ఏదోవిధమైన 'తపస్సు' అనే భావం సర్వత్రా వ్యాపించిఉంది. మహాజ్ఞానులకూ, నిరక్షరకుక్షులకూ కూడా తపస్సుయందేవిశ్వాసం. వేలసంవత్సరాలక్రితం ఈవిశ్వాస మెం ఉండేదో ఇప్పుడుకూడా అలాగేఉంది. గాంధీజీనాయకత్వాన దేశ స్వాతంత్ర్యంకోసం నిర్వహింపబడిన ప్రజాఉద్యమాలతత్త్వం తెలుసుకోవాలంటే, ఈ తపస్సుయొక్క విశిష్టతను గుర్తెరుగుట చాలా అవుసరం.

ఉపనిషత్తులను ప్రవచించిన మహాజ్ఞానులు, సునిశితంగా విషయ వివేచనచేసినవారిపద్ధతిని చూస్తే, వాటిని అవగాహనచేసుకోవడానికి సమర్థులైన కొద్దిమందికొరకే వాటిని చెప్పినట్లు స్పష్టమవుతోంది. అశేషజనసామాన్యానికి అవి అందుబాటులోలేవు. నూతనసృష్టిచేయ గలిగినవారి సంఖ్య ఎప్పుడూ తక్కువగానే ఉంటుంది. కాని అధికసంఖ్యాకుల భావాల కనుగుణ్యంగా ప్రవర్తించి, వారిని వివేకవంతులను చేసి ముందుకు నడిపించిననాడు, స్థిరమైన అభ్యుదయదాయకమైన సంస్కృతి వర్ధిల్లుతుంది. అలాంటి సృష్టిచేయగల అల్పసంఖ్యాకవర్గం లేకపోతే సంస్కృతి విధిగా క్షీణిస్తుంది. ఈ అల్పసంఖ్యావర్గానికీ, జనసామాన్యానికీగల సంబంధం తెగిపోయినా సంస్కృతి క్షీణిస్తుంది. సాంఘిక సంబంధబాంధవ్యాలు, ఐక్యత లేకపోతే చివరకు అల్పసంఖ్యాకవర్గం నూతన సృష్టినిచేసే శక్తిని పోగొట్టుకొని వంధ్యత్వాన్నిపొందుతుంది.

లేకపోతే సంఖ్యాబలంగల సంఘంలోనుంచి విజృంభించే మరొక జీవశక్తికి
చోటిస్తుంది.

ఉపనిషత్తులు ఏకాలంలో చెప్పబడ్డాయో, ఆనాటికాలమాన
స్థితిగతు లెట్లాంటివో ఊహించడానికి నాతరంకాదు; మరెవ్వారితరమూ
కాదు. కాని ఆ కాలంలో అధికసంఖ్యాకులైన జనానికి, జ్ఞానులైన
స్వల్పసంఖ్యాకులకు సన్నిహితసంబంధం ఉన్నదని మాత్రం నేను భావి
స్తున్నాను. అథవా వారుభయులమధ్య ఏవిధమైన అగాధమూ లేదనే
చెప్పాలి. వివిధతరతమాలతో నుండిన సంఘంలో, మానసికమైన
తరతమాలుకూడా ఉండేవి. ఆ సంఘం వాటిని అంగీకరించింది. ఎవరి
కనువైన ఏర్పాట్లు వారికి జరిగినవి. అందుచేత సంఘంలో సంఘర్షణలు
రాకుండాఉండేవి. ఉపనిషత్తులుకూడా ప్రజలభావాల కనుగుణ్యంగా,
వారి అలవాట్లననుసరించి వ్యాఖ్యానింపబడ్డాయి. అందువల్ల వాటి
లోని ముఖ్యసారాంశాలు కొన్ని లోపించాయి. వర్ణములతోకూడిన
సాంఘికనిర్మాణంజోలి కెవ్వరూ పోలేదు. దానిని జాగ్రత్తగా భద్రపర
చారు. సర్వం బ్రహ్మపదార్థమే అనే భావం మానవరూపంలో విగ్ర
హారాధన, క్షుద్రదేవతారాధన క్రిందకు పరిణమించింది.

మొత్తంమీద ఉపనిషత్తుల యొక్క మహదాదర్శాలు జన
సామాన్యం దాకా పాకలేదు. కాలక్రమేణ నూతన సృష్టిచేసే అల్ప
సంఖ్యావర్గానికీ, బహుళప్రజానీకానికీమధ్య మానసికవిభేదం విస్పష్టంగా
ఏర్పడింది. కొంతకాలానికి ఆధిభౌతికవాదం, నిరీశ్వరవాదంవంటి కొత్త
ఉద్యమాలు విజృంభించినాయి. ఆపిమ్మట వాటిపర్యవసానంగానే బౌద్ధ
మతం, జైనమతం వెలిశాయి. రామాయణం, భారతం, భాగవతంవంటి
సంస్కృతపురాణగాథ లుద్భవిల్లినాయి. ఆ పురాణాలు పరస్పరవిరు
ద్ధంగా వుండే వివిధభావాలను మతాలను సమన్వయపరచడానికి మరొ
కసారి ప్రయత్నంచేశాయి. ఆకాలంలో నూతనసృష్టిని చేయగలిగిన
అల్పసంఖ్యాకవర్గముల శక్తి, ప్రభావము బాగా ద్యోతకమైనాయి. మరల
అల్పసంఖ్యాకవర్గానికీ జనసామాన్యానికీ మధ్యనున్న బంధనాలు బలిష్ట
మైనట్లు తోస్తుంది. మొత్తంమీద రెండువర్గాలు కదంకలుపుతూనే
వచ్చాయి. ఈ రీతిగా యుగంతరువాత యుగం వెంటాడించి, తత్త్వజ్ఞా
నంలో నూతనసృష్టిని సాగించాయి. నాటక సంగీత సాహిత్య రంగా

ల్లోనూ, శిల్పాది చిత్రకళల్లోను, విదేశాలలో సాంస్కృతికప్రచారము చేయుటలోనూ, దూరదేశములతో వాణిజ్యాది సంబంధముల నభివృద్ధిచేయుటకున్నూ భారీస్థాయిలో కృషి జరిగింది. మధ్యమధ్య, అంతరంగిక కారణాలవల్లనేమి, పైదేశాల జోక్యమువల్లనేమి కొన్ని సంఘర్షణలు, పేచీలుకూడ సంభవించాయి. అలాంటి కష్టాలను గడచి నూతన సృష్టికి, నిర్మాణమునకు ద్విగుణీకృత ప్రయత్నములు జరిగినాయి.

క్రీస్తుశకానంతరం 4వ శతాబ్దంలో జరిగిన బహుముఖ చైతన్యమే ఈలాంటి ఉద్యమాల్లో ఆఖరుదని చెప్పాలి. క్రీస్తు అనంతరం వెయ్యి సంవత్సరాలయ్యేసరికే ఈ కళావైదుష్యానికి క్షీణదశ ప్రారంభమైంది. కాని రక్తంలో జీర్ణమైయున్న కళాపిపాసవల్ల పూర్తిగా నశించక మంచిమంచి కళాఖండాలు సృష్టింపబడుతూనే ఉన్నాయి. కొత్తవైన సాంప్రదాయాలు, చరిత్ర గలిగిన నూతనజాతుల రాకవలనకూడ అలసిసొలసిఉన్న భారతసంస్కృతి కొక కొత్త శక్తీ, వేగమూ లభించాయి. వాటికలయికవలన కొత్తసమస్య లుత్పన్నమై, కొత్తపరిష్కారములకు కారణమైనాయి.

ఇండో ఆర్యనుల వ్యక్తిప్రాముఖ్యత చివరకు వారిసంస్కృతికి మంచిచెడ్డలు రెంటినీ చేకూర్చిందనే తోస్తుంది. చరిత్రలో ఏదో ఒక యుగంలోకాకుండా ప్రతియుగంలోనూ పదేపదే అత్యుత్తమశ్రేణికి చెందినమహాపురుషులను వెలయింపచేసింది. సంస్కృతికి కొన్ని ఆదర్శాలను, ఆధ్యాత్మికదృక్పథాన్ని కలిగించింది. ఆలక్ష్యాలు, ఆదృక్పథం నేటికీ అలానే ఉన్నాయి. కాని ఆచరణలో వాటిప్రభావం అంతగా లేకపోవచ్చును. ఆధ్యాత్మికవాతావరణంవల్లను, అగ్రశ్రేణికిచెందిన నాయకులకార్యాచరణవల్లనూ సాంఘికవ్యవస్థ ఛిన్నాభిన్నంకాకుండా ఉంచగలిగేరు. అలాంటి ప్రమాదం వస్తుందని తోచినపుడు దాన్నెంతో కట్టుదిట్టంచేస్తూవచ్చారు. వారు (అనగా ఇండోఆర్యనులు) అద్భుతంగా వికాసంచెందే నాగరికతను, విజ్ఞానాన్ని సృష్టించారు. చాలావరకది అగ్రశ్రేణిలోనివారివశంలో ఉన్నను, కొంత విధిగా సామాన్యజనంలోకి పాకింది. ఇతరులవిశ్వాసాలయెడల, ఆచార్యవ్యవహారాలయెడల వారెన్నడూ అసహనపడలేదు. అపారమైన సహనంతో వాటిని భరించి, సంఘాన్ని విచ్ఛిన్నంచేసే సంఘర్షణలు తలెత్తకుండాచేశారు.

ఏదోవిధంగా సంఘం తాపీగా, ఏవిధమైన ఒడుదుడుకులు లేకుండా సాగిపోయేటట్లు చూచారు. ఏవో కొన్ని స్థూలమైన సరిహద్దులనేర్పరచి వాటిలోపల ప్రజలకు తమఇష్టంవచ్చిన జీవితవిధానాన్ని అనుసరించ కానికి కావలసినంత స్వేచ్ఛనిచ్చారు. తద్వారా వారు పురాతనమైన, ..ుభవంగలజాతి మాది అని ఋజువుచేశారు. ఇదంతా నిజంగా ఆశ్చర్య కరమైన ప్రయోజకత్వమనడాని కేమీా సందేహం లేదు.

కాని, ఈ వ్యక్తి తత్త్వంవల్ల మానవుడు సంఘానికి చేయవలసిన విధాయకంయెడల కొంత అశ్రద్ధ జరిగిందనే చెప్పాలి. ఏమంటే ప్రతివారి జీవితం విభజింపబడి నిర్ణయింపబడింది. కుశలమైన విస్తీర్ణంగల వర్ణవ్యవస్థ లో ప్రతివారికి కొన్ని విధాయకములు, బాధ్యతలు నిర్ణయింపబడ్డాయి. సంఘమంతటికీ వ్యక్తి కొన్ని విధులను నిర్వర్తించాలనీ, సంఘమంతా ఒకటేననీ, తానుకూడా అందులోని అంతర్భాగమేననే భావం వ్యక్తిలో కల్గించాలన్న ప్రయత్నం జరిగినట్లు కనబడదు. బహుశా ఈభావం అప్పటికి బొత్తిగా కొత్తదనుకుంటాను. బహుపురాతనమైన సాంఘిక వ్యవస్థాపనలలో ఈ భావం కనుబడదు. పురాతన భారతనాగరికతలో ఇలాంటి భావం ఉండడంకూడా సబబుకాదేమో! అయినప్పటికీ, వ్యక్తి ప్రాముఖ్యత, వర్ణభేదాలు, ప్రత్యేకతలు అంతకంతకు హెచ్చుతూనే ఉన్నాయి. తరువాత తరువాత ఈ వర్ణభేదాలు మరీ రెచ్చిపోయి, ప్రజల మనోభావాల్లో సంకుచితత్వ మేర్పడివారిపాలిటి ఖైదై పోయింది. ఇందువల్ల ఎక్కువ కష్టాలకు లోనైన క్రిందివర్గములవారికే కాకుండా, అగ్రవర్ణాలవారికికూడా అది నిర్బంధమే అయినది. మనచరిత్రలో ఇదొక పెద్ద బలహీనత. కులభేదాలు నానాటికి పెరిగినకొలదీ, ప్రజల మనస్సులుకూడా కరుడుగట్టుకుపోయి, జాతియొక్క నిర్మాణశక్తి క్షీణించి పోయింది.

మరొక్క చిత్రమైన సత్యంకూడా గోచరమవుతుంది. ప్రతి విశ్వాసాన్ని, ఆచారాన్ని, మూఢవిశ్వాసాన్ని అన్నిటినీకూడా అపారమైన సహనంతో భరించడంవల్లకూడా కొంత ప్రమాదం జరిగింది. అనేక దురాచారా లనదగినవి స్థిరపడిపోయాయి. అభివృద్ధినిరోధకమైన సాంప్రదాయాలను త్రోసిపుచ్చడానికి ప్రజల కవకాశం లేకపోయింది. పురోహితవర్గాలవారు ఈ సావకాశాన్ని తమ స్వార్థంకోసం వినియో

గించుకుని, ప్రజల మూఢవిశ్వాసాలను ప్రోత్సహించారు. కాని ఈ పురోహితులు క్రైస్తవచర్చిలలోని కొన్నివర్గాల మతాచార్యులంత ప్రబలంగా మాత్రం కాలేదు. ఏమంటే, అట్టి దురాచారాలను ఖండించే ఆధ్యాత్మికప్రవక్తలు ఎక్కడికక్కడ బయలుదేరుతూనే ఉండేవారు. కాని ఈ ఆచారవ్యవహారాలను పెంపొందించే సంఘం జనసామాన్యాన్ని తమ స్వార్థానికి ఉపయోగించుకుంటూనే వచ్చింది.

కనుక, స్వేచ్ఛగా విషయపరిశీలనచేసే తత్త్వమూ, శుద్ధఛాందసాచార అనుసరణమూ, ప్రక్క-ప్రక్కనే కాలక్షేపంచేస్తూవచ్చాయి. దానిఫలితంగానే గురుపీఠాలు, శాస్త్రోక్తాచారవ్యవహారాలను తు.చ. తప్పకుండా పాలించాలనే ఛాందసతత్త్వమూ అభివృద్ధిచెందినాయి. ఎంతవరకూ, 'ఇతి ఆచార్యప్రోక్తః' అని పురాతన గ్రంథాలనుండి ప్రమాణాలను ప్రజలకు చూపించడమే కాని, ఆయాకాలాల్లో కలుగుతున్న మార్పుల కనుగుణ్యంగా వాటిలోని సత్యాల నన్వయించేయాలన్న ప్రయత్నం జరుగలేదు. సృష్ట్యాత్మకమైన ఆధ్యాత్మికశక్తులు నీరసించిపోయి, సహేతుకంగానూ, సజీవంగానూ, పరిపూర్ణంగానూ ఉండే వస్తువులో పైడొలకమాత్రమే మిగిలిపోయింది. శ్రీ అరవిందఘోష్ ఇలా వ్రాశారు. "ఉపనిషత్కాలంనాటివాడు కాని, బౌద్ధనికాలంవాడు కాని, తరువాత పురాణయుగాలవాడుకాని ఎవరైనా ఒక భారతీయుడు నేటి నవభారతదేశానికి దిగొచ్చేటట్లయితే ఆయన తనజాతి, పదింటతొమ్మిదిపాళ్ళు అసలైన పురాతనవిజ్ఞానాన్ని వదలిపెట్టి, కేవలం ఆచారవ్యవహారాలను, ఉట్టిడొలకలను, పీలికలనూ పట్టుకొని దేవులాడడం చూడగలుగుతాడు. బుద్ధిహీనత, స్తబ్ధత్వం, అర్థంలేని అనుకరణం, శాస్త్రజ్ఞానశూన్యత్వం, కళావంధ్యత్వం, నూతనసృష్టిచేయలేని అశక్తత చూచి ఆశ్చర్యపడతాడు."

## ౧౧ ఆధిభౌతికవాదం

మన దురదృష్టమేమంటే, గ్రీసు దేశంలోనూ, భారతదేశంలోనూ, తదితరచోట్లకూడా పురాతన గ్రంథసముదాయాల నెన్నింటినో పోగొట్టుకున్నాం ఈ గ్రంథాలన్నీ తాటాకులమీదనో, భూర్జపత్రాలమీదనో, ఇటీవల కాగితాలమీదనో వ్రాయబడుండడంచేత బహుశా ఈ నష్టం

తప్పదనుకుంటాను. ఉద్గ్రంథాలకు బహుకొద్దికాపీలుమాత్రమే ఉండేవి. అవి శిథిలమైపోయినా ఇతరత్రా నష్టమైపోయినా ఆ గ్రంథం అంతర్థానమైపోవలసిందే. ఆ గ్రంథంలోనుంచి కొన్నిభాగాలు మరొక గ్రంథంలో ఉల్లేఖింపబడితేనో, లేక మరొక గ్రంథంలో ఈ గ్రంథంయొక్క ప్రస్తావనవస్తేనోతప్ప దానిని మనం గుర్తించలేకపోతున్నాం. ఇంతైనా, 50, 60 వేల. పురాతన సంస్కృతగ్రంథాల వ్రాతప్రతులు ఉద్ధరించబడ్డాయి. ఇంకా కొత్తవాటిని గాలించి తీస్తూనేఉన్నారు. పురాతన భారతీయగ్రంథాలమూలాలు కొన్ని ఇంతవరకు దొరకనేలేదు. కాని వాటి అనువాదాలు టిబెట్ భాషలోనూ, చైనాభాషలోనూ దొరికినాయి. మఠాలతాలూకు గ్రంథాలయాలనూ, ఇతర మతసంస్థల గ్రంథాలయాలనూ, కొందరు వ్యక్తుల స్వంత గ్రంథాలయాలనూ గాలిస్తే గొప్ప గ్రంథాలు దొరకవచ్చును. ఆ శోధనతోపాటు, వాటి వ్రాతమూలాలను జాగ్రత్తగా పరిశీలించి, అవసరమైతే వాటిని తర్జుమాచేయించి ప్రకటించాలి. భారతదేశానికి దాస్యవిమోచనం కలిగి, మనం స్వేచ్ఛగా వ్యవహరించుకోవడానికి సావకాశం కలిగినప్పుడు జరుగవలసిన అనేక పనులలో ఈ పనొకటి ముఖ్యమైనది. ఇటువంటి విద్యాసముపార్జనవలన, భారతఇతిహాసంలో అనేక ముఖ్యవిషయాలమీద కొత్త వెలుగులు ప్రకాశిస్తాయి. ముఖ్యంగా ఆనాటి చరిత్రాత్మకసంఘటనలకు కారణభూతమైన సాంఘికవ్యవస్థలు, వాటిమార్పులు బాగా గోచరమవుతాయి. అనేకమారులు ఈ మహాగ్రంథాలు నష్టమైపోయినా, అంతగా చెప్పుకోదగిన ప్రయత్నమేమీ జరుగకపోయినా, 50 వేలకు పైగా సంస్కృతగ్రంథాలు బయటపడినాయంటే, పూర్వకాలంలో సాహిత్య, నాటక, వేదాంతాది మహాగ్రంథముల రచన ఎంతో పుష్కలంగా ఉండేదని స్పష్టమవుతోంది. ఇప్పటికి ఉద్ధరింపబడిన గ్రంథాల వ్రాతమూలాలను బహుజాగ్రత్తగా పరీక్షచేయవలసిఉంది.

ఉపనిషత్తులకాలానికి వెనువెంటనే, ఐహికవిషయసంబంధంగా వ్రాయబడిన గ్రంథాలన్నీ నష్టమైపోయినాయి. ఆ గ్రంథాలపై వ్రాయబడిన విమర్శలూ, ఆధిభౌతికసిద్ధాంతాలను ఖండిస్తూ తరువాత వారు చేసిన వ్యాఖ్యానాల్లోని ప్రస్తావనలుమాత్రమే మిగిలిఉన్నాయి. కొన్ని శతాబ్దాలపాటు ఆధిభౌతికవాదం మన భారతదేశంలో ప్రబలంగా ఉండే

దనడాని కేమీ సందేహం లేదు. క్రీస్తుకుపూర్వం నాలుగుశతాబ్దాలకు ముందు కౌటిల్యుడు రచించిన అర్థశాస్త్ర రాజకీయశాస్త్రములలో ఈ విషయం వ్రాయబడింది. భారత వేదాంతసిద్ధాంతములలో ఆధి భౌతికసిద్ధాంత మొక ముఖ్యమైనదని చెప్పబడింది.

ఇంతకూ ఆధిభౌతికసిద్ధాంతాన్ని అవహేళనచేసి, విమర్శ చేసేవారి నాధారంచేసుకునే ఆ సిద్ధాంతాన్ని గుర్తెరుగవలసిన దుస్థితిలో పడ్డాం. నిజానికి ఆ విమర్శకులు దానిని ఖండించడానికి పడ్డ ఆత్రత వల్లనే వారిదృష్టిలోకూడా అ దెంత ముఖ్యమైనదో తెలుస్తోంది. బహుశా ఆధిభౌతికవాదానికి సంబంధించిన అనేక గ్రంథాలను తరు వాతకాలంలో సనాతనధర్మమునందు విశ్వాసముగలవారును, పురో హితవర్గమువారును ధ్వంసంచేసిఉండవచ్చును.

ఆధిభౌతికవాదం మతంలోనూ, భగవదారాధనలోనూ, తది తర వేదాంతసిద్ధాంతాల్లోనూ స్వార్థపరులవాదాలను ఖండించింది. ఆధిభౌతికసిద్ధాంతులు వేదాలను, పౌరోహితపీఠాలను, సాంప్ర దాయసిద్ధమైన నమ్మకాలను ఖండించి, మతవిశ్వాసాలలో స్వేచ్ఛ ఉండాలంటారు. కేవలం గతంలోని ప్రమాణాలను 'కిం' అనకుండా అంగీకరించకూడదన్నారు. మంత్ర తంత్రాలు, మూఢవిశ్వాసాలు పనికి రావన్నారు. స్థూలంగా చూస్తే, ఈనాటి ఆధిభౌతికవాదులవాదమే వారిదికూడా. గతచరిత్రలోని శృంఖలాలవల్ల ఏవిధమైన నిర్బంధం ఉండ కూడదన్నారు. ప్రత్యక్షంగా కంటికగుపడనివిషయాలమీద ఊహాగా నాలు పనికిరావన్నారు. ఊహాజనితులైన దేవతల నారాధించవద్ద న్నారు. కంటికి గోచరమయ్యే పదార్థమే సత్యమైనదనిన్నీ, తదితరము లైన ఊహలన్నీ సత్యంకావడాని కెంత సావకాశమున్నదో, అసత్యం కావడానికికూడా అంతే సావకాశమున్నదని వారివాదన. కనుక ఈ ప్రపంచమూ, అందులోని వివిధ స్వరూపాత్మకమైన పదార్థమూ మాత్రమే 'సత్' అని వారి సిద్ధాంతం. వారికి స్వర్గం నరకంలాంటి పరలోకాలు లేవు. శరీరానికి సంబంధంలేని ఆత్మ వేరేలేదు. మనస్సు, బుద్ధి మొదలైనవన్నీకూడా పంచభూతాత్మకమే. మానవు డేర్పరచిన మూల్యాలకు ప్రకృతినడకకూ సంబంధం లేదు. మనం అనుకునే మంచి

చెడ్డలకు ప్రకృతికీ సంబంధంలేదు. నైతికప్రవర్తన కేవలం మానవుని సృష్టి.

ఈ సిద్ధాంతాలను గుర్తించాం. చిత్రమేమంటే ఈవిధమైన ఆలోచన రెండువేలఏళ్ళనాటిదని తోచదు. ఈకాలపు ఆలోచనలకే అనుకూల్యంగా ఉంది. ఈ ఆలోచనలు, ఈ సంశయాలు, పాతకాలపు సాంప్రదాయాలకనుగుణ్యంగా వచ్చే అధికారాన్ని ధిక్కరించాలనే ఈ తిరుగుబాటుభావాలు ఎలా ఉత్పన్నమైనాయనే దొక ప్రశ్న. ఆకాలపుసాంఘిక రాజకీయసితిగతు లంతగా మనకు తెలియవు. కాని రాజకీయంగానూ సాంఘికంగానూ ఏదో సంఘర్షణ జరుగుచుండినకాలమని మాత్రం స్పష్టపడుతోంది. ఆ సంఘర్షణలవల్ల విశ్వాసాలు నశించి, విమోచనకోసం మనస్సంతుష్టినిచ్చే, తత్వవిచారంచేయబడినకాల మని తోస్తుంది. ఇలాంటి మానసికసంక్షోభంలోనుంచీ, సాంఘికకల్లోలంలోనుంచీ కొత్తమార్గాలేర్పడి, కొత్తరకమైన వేదాంతసిద్ధాంతాలు రూపొందినాయి. కేవలం ఉపనిషత్తులలోవలె స్ఫురణమాత్రంగా కాకుండా కట్టుదిట్టమైన హేతువాదసహితమైన వేదాంతవిధానా లుత్పన్నమై అనేక రూపాల్లో వృద్ధిచెందేయి. అవే జైన, బౌద్ధ, హిందూ సిద్ధాంతాలు. భగవద్గీత, రామాయణ భారతాది పురాణగాథలు ఈ కాలం నాటివే. వీటికి జననకాలం, ఇదమిత్థమని నిర్ణయించి జాతకచక్రంవేయడం అసాధ్యం. అవన్నీ కలగాపులగంగా ఉంటాయి. బుద్ధుడు క్రీ. పూర్వం 6వ శతాబ్దంనాటివాడు. పైన ఉదహరించిన ఈ సంఘటనలుకొన్ని ఆయనకుముందే జరిగాయి. కొన్ని తర్వాత జరిగినాయి. చాలావరకు ముందూ వెనుకా కూడా జరుగుతూవచ్చాయి.

దాదాపు బౌద్ధమతం ప్రబలంగా లేచిన కాలానికే, పర్షియా సామ్రాజ్యం సింధునదిదాకా వచ్చింది. సరిహద్దులవరకూ చేరిన ఆమహాసామ్రాజ్యంయొక్కప్రభావం కొంతవరకు ప్రజలభావాలమీద ప్రసరించి ఉండవచ్చును. క్రీ. పూ. నాల్గవశతాబ్దంలో అలెగ్జాండరు పశ్చిమోత్తరంగా వచ్చి భారతదేశంమీద దండెత్తేడు. ఆవిషయ మంతగా ముఖ్యమైనదికాదు. కాని తరువాత భారతదేశంలోజరిగిన గొప్పగొప్ప మార్పులకది నాందియైనది. అలెగ్జాండరు చనిపోయినవెంటనే చంద్రగుప్తుడు మహత్తరమైన మౌర్యసామ్రాజ్యాన్ని నిర్మించాడు. చారిత్ర

కంగాచూస్తే, హిందూదేశంలో సువిశాలమైన, బలమైన తొలి సామ్రాజ్య మదేనని చెప్పవలసొస్తుంది. భారతఇతిహాసంలో ఎందరో రాజులు; చక్రవర్తులూ చెప్పబడ్డారు. ఒక పురాణంలోనిగాథంతా, భారతసామ్రాజ్యం కోసం అనగా ఉత్తరభారతసామ్రాజ్యం కోసం జరిగినసంగ్రామచరిత్రే బహుశా పురాతన గ్రీసుదేశంవలెనే, మనభార దేశంలోకూడా అనేక చిన్నచిన్న రాజ్యాలుగా ఉండేవి. కొన్ని విస్తీర్ణం లో పెద్దవైన ప్రత్యేకజాతుల స్వతంత్రరాజ్యాలు. చిన్నచిన్న రాజ్యాలు కూడా ఉండేవి. గ్రీసులోవలెనే వాణిజ్యవేత్తలైనవారి ప్రభావానికి లోబడిన పెద్దపెద్ద నగరరాజ్యాలుండేవి. బుద్ధునికాలంలో ప్రత్యేక జాతులరాజ్యా లెక్కువగా నుండేవి. మధ్యభారతదేశంలోనూ, ఉత్తర ప్రాంతాలలోనూ నాలుగే పెద్దరాజ్యాలుండేవి. ఆఫ్ఘనిస్థాన్‌లోని భాగమైన గాంధారరాజ్య మందులో ఒకటి. ఆనాటి రాజకీయవ్యవస్థావన ఎలాఉన్నా, గ్రామాలలోనూ, నగరాలలోనూ స్వపరిపాలన సాష్ట వంగా జరుగుతుండేది. సామ్రాట్టుయొక్క రారాజరికాన్ని చిన్నరా ష్ట్రాలు అంగీకరించేవి. కాని, వారి దైనందినపరిపాలనలో ఏవిధమైన జోక్యమూ ఉండేదికాదు. గ్రీసులోవలెనే అనాదిసిద్ధమైన ప్రజాస్వా మికవిధానం అమలులో ఉండేది. బహుశా దాని నిర్వహణభారాన్ని ఎక్కువగా అగ్రవర్గాలవారే వహించేవారనుకుంటాను.

పురాతన భారతదేశానికీ గ్రీసుదేశానికీ చాలా భేదాలున్నా ప్రజల జీవితవిధానాల్లో అనేకమైన పోలికలున్నాయని నా అభిప్రాయం. అథీనియన్ ప్రజాస్వామికానికి విఘాతం కలిగించిన పెలొపొన్నిషియన్ యుద్ధం, కొన్నింటిలో మహాభారతయుద్ధంతో పోల్చవచ్చును. గ్రీక్ రాజ్యంపడిపోయి, పట్టణ రాష్ట్ర ప్రజాస్వామికం పోవడంతోనే నిస్పృహ సంశయాలు బయలుదేరినాయి. జాతియొక్క ఉన్నతాదర్శాలన్నీ క్రుంగిపోయాయి. ఐహికవిషయాలకన్న ఆముష్మికవిషయాల ప్రాము ఖ్యత హెచ్చింది. తర్వాతనే ప్రాపంచికసౌఖ్యాలను విసర్జించే సన్యా సము కర్మకాండలతో సుఖభోగయుక్తమైన కొత్తకొత్త వేదాంతవిధా నాలు అభివృద్ధిచెందేయి.

చరిత్రలోని చిన్నచిన్న సంఘటనలను ఆధారంచేసుకుని వివిధ దేశాలను పోల్చడం చాలా ప్రమాదమైనపని. ఒక్కొక్కప్పుడు పరస్పర

విశుద్ధమైన భోగట్టా లభిస్తుంది. అయినప్పటికీ ఆలాంటి అభిలాష కలుగుతుంది. మన మహాభారతయుద్ధానంతరం దేశంలో ఏర్పడిన మానసిక కల్లోలస్థితి, గ్రీకురాజ్యపతనానంతరం గ్రీసుస్థితిని జ్ఞప్తికి తేకమానదు. ర్శాలన్నీ పతనమైపోయి, కొత్తసిద్ధాంతాలకోసం గాలించడం జరి రాజకీయంగానూ, ఆర్థికంగానూ అనేక ఆంతరంగికమైనమార్పులు జరిగి కేంద్రాధికారాన్ని బలహీనపరచే ప్రయత్నాలు జరిగినాయి.

కాని ఈ పోలిక ఎంతోదూరం వర్తించదు. గ్రీకునాగరికత మరి కొన్ని శతాబ్దాలవరకూ యూరోపులో తన ప్రతిభను వెలిగించినా గ్రీసు దేశం మాత్రం నిజానికి ఆదెబ్బకు తట్టుకోనే లేదు. కాని భారత దేశం సంగతి అలాకాదు. మహాభారతయుద్ధానంతరం దేశం వెంటనే అద్భుతంగా తేరుకుంది. ఆ యుద్ధంతర్వాత బౌద్ధునిఅనంతరం వెయ్యి సంవత్సరాలపాటు దేశంలో అపారమైన నిర్మాణశక్తి విజృంభించింది. వేదాంతంలో, సాహిత్యంలో, నాట్యకళలో, గణితశాస్త్రంలో, తదితరమైన లలితకళల్లో, మహాపురుషులు బయలుదేరి మహత్తరమైన సృష్టిని చేశారు. క్రీస్తుశకారంభంలో ఒక ఆశ్చర్యకరమైన శక్తి విజృంభించి, భారతప్రజలను దూరదేశాలకు తరిమింది. భారతీయులు అనేక వలస రాజ్యాలను ముఖ్యంగా తూర్పుసముద్రప్రాంతంలో నిర్మించి, అచట తమ నాగరికతను వ్యాప్తిచేశారు.

## ౧౨ పురాణాలు

పురాతన భారతదేశంలో రెండు మహాపురాణగ్రంథాలు— రామాయణం, మహాభారతం - కొన్నివందల సంవత్సరాలలో రూపొందినాయి. తర్వాతకూడా వాటికి కొన్ని చేర్పులు జరిగివుండవచ్చును. ఇండో ఆర్యనుల ప్రాథమికయుగంనాటి సంఘటనలు ఇందులో కథా వస్తువులు. ఈదేశంలో వాళ్ళు స్థిరనివాస మేర్పరచుకొని, విస్తరించేకాలంలో వాళ్ళ విజయయాత్రలు, అంతర్యుద్ధాలు ఈ కావ్యాల్లో రచింపబడినాయి. ఈ సంఘటనలు జరిగిన కొంత కాలానికి ఈ కావ్యాలు రచింపబడినాయి. ఈ రెండుకావ్యాలలాగున, వేలాదిసంవత్సరాలపాటు, సామాన్యజనులహృదయాలమీద పరిపూర్ణమైన ప్రభావాన్ని చలాయించగలిగిన గ్రంథాలు ప్రపంచంలో

ఎక్కడైనా ఉన్నాయేమో నాకు తెలియదు. ఏనాడో అనంతమైన కాలగర్భంలో జన్మించిన ఈ కావ్యాలు నేటికీ భారతప్రజలజీవితానికి వెలుగునిస్తున్నాయి. నేటికీ అవి భారతీయులకు జీవశక్తిని ప్రసాదిస్తున్నాయి. ఎవ్వరో కొద్దిమందిపండితులు మాత్రం వాటిని సంస్కృత భాషలో చదువుకుంటున్నారు. అన్ని దేశభాషల్లో వాటి అనువాదాలను అనుసరణలను లక్షలాది ప్రజలు పరిచయంచేసుకుని ఆనందిస్తున్నారు. అనేకవిధాలైన కథలు, గాథల ద్వారా ఈ కావ్యాలు భారతప్రజలజీవితంలో కలిసిపోయాయి.

మేధావంతులైన జ్ఞానులకూ, నిరక్షరకుక్షులైన అమాయక గ్రామీణప్రజలకు కూడ, ఎవరిబుద్ధిఅంతరమునుబట్టి వారికి, ఆయా విధంగా జ్ఞానాభివృద్ధిని కలిగించడంలో ఈ కావ్యాలు పెట్టినదిపేరు. భారతీయవిద్యావిధానంలో ఇదొక విశిష్టమైన పద్ధతి. కొంతవరకు పూర్వకాలంనాటి భారతీయుల జీవితరహస్యాలను తెలుసుకోవడానికి ఈ మహాకావ్యాలు బాగా ఉపయోగపడతాయి. సంఘం మెన్నికోతలపాలైనా, ఎన్నికులాలూ మతాలు ఉన్నా, అన్ని అభిప్రాయభేదాలను సరిదిద్ది వాటిని సమన్వయపరచి, వీరోచిత సాంప్రదాయానుగుణ్యంగా నైతికజీవనాన్ని నడుపడానికి వీలైన వాతావరణాన్ని మన పెద్దలెట్లు కల్పించగలిగేరో ఈ కావ్యాలు తెలుపుతున్నాయి. అనేకత్వాన్ని మరగుపరచి, దానిని నిర్జింపగలిగిన ఒక ఏకత్వదృక్పథాన్ని వారు ప్రజాసామాన్యానికి ప్రసాదించగలిగేరు.

నాబాల్యంలో మాఅమ్మా, ఇంకా మరికొందరు ముసలమ్మలు రామాయణభారతాల్లోని కథలనుచెపుతూఉండడంనాకు బాగాగుర్తుంది. యూరోపులోనూ అమెరికాలోనూ చిన్నపిల్లలు దేవతలకథలను వీరుల సాహసాలను శ్రద్ధగా ఆలకించినట్లే నేనూ వాటిని విన్నాను. అందువల్ల నేనప్పుడు సాహసగాథలను, దేవతల చిత్రవిచిత్రకథలనుకూడా రుచి చూడగలిగేను. ప్రతిసంవత్సరం రామాయణకథనంతా నటించే వీథినాటకప్రదర్శనాలకు నన్నుకూడా తీసుకెళ్ళేవారు. వేలాదిప్రజలు తండోపతండాలుగా వాటినిచూచి ఆనందించి ఆ ఉత్సవాల్లో పాల్గొనేవారు. ఆప్రదర్శనాలు కొంచెం మోటుగానేఉండేవి. కాని అందువల్ల నష్టమంతగాకనబడలేదు. కథ అందరికీ తెలిసినదేకదా! పైగా ఉత్సవాలసమయం,

ఈరీతిగా భారతపురాణాలు, పాతసాంప్రదాయాలు నా తలకెక్కి అనేకమైన ఇతర ఊహాలతోపాటు మిళితమైపోయాయి. ఈ కథలన్నీ జరిగినసంగతులేనని నే నెప్పుడూ విశ్వసించానని తోచదు. వాటిలోని ఇంద్రజాలవిమయాలను, మానవాతీతమైన అద్భుతాలను నేను విమర్శించాడిని. అరేబియన్‌నైట్సు కథలు ఎంతవరకు నిజమనుకునేవాడినో, పంచతంత్రంలోని జంతువులకథ లెంత నిజమనుకొనేవాడినో, వీటియందు కూడా అంతేవిశ్వాసముండేది. పశ్చిమఏషియాలోనూ, యూరోపులోను పంచతంత్రంలోని జంతువులకథలు చాలాప్రచారంలోఉన్నాయి. వాటినుంచి వారెంతో సారాన్ని గ్రహించగలిగేరు. నేను కొంచెం పెద్దవాడినైనపిమ్మట, ఇతర కథాదృశ్యాలు నామనసులో ప్రవేశించాయి. భారతీయదేవతల కథలు, పాశ్చాత్యదేవతల కథలు, గ్రీకుపురాణాల్లోని కథలు, జోన్‌ఆఫ్‌ఆర్క్ కథ, అద్భుతదేశంలోని 'ఆలిస్' కథ, అక్బర్ బీరబలులగాథలు, షెర్లాక్‌హోమ్సు, ఆర్థర్‌రాజు ఆతనివీరభటులు, ఝాన్సీరాణి, రాజపుత్రస్థానంలోని వీరగాథలు, అన్నీనామనస్సులో కలపోసినట్లయినాయి. ఇందువల్ల నా తలలో ఒకవిధమైన గలభాగా ఉండేది. కాని ప్రధానంగా భారతీయపురాణగాథలప్రభావమే హెచ్చుగాఉండేది. వివిధమైన కథాసాహిత్యం తలకెక్కిన నా బుద్ధికే, మన పురాణసాహిత్యప్రభావం ఇంతగాఉంటే, సామాన్యజనులమీద ఎంతగా తనప్రభావాన్ని ప్రసరింపచేసిఉంటుందో వేరుగా చెప్పనక్కరలేదు. వైజ్ఞానికంగానూ నైతికంగానూ దానిప్రభావం మంచిదనే నా భావం. కథల్లోని ఊహాశక్తినీ, సౌందర్యాన్నీ నిరాకరించడానికి నా మనస్సు అంగీకరించదు.

భారతీయపురాణగాథలు కేవలం రామాయణభారతాలకు మాత్రమే సంబంధించియుండలేదు. సంస్కృతసాహిత్యంలో అవి వైదికయుగంనుంచీ అనేకరూపాల్లో ప్రత్యక్షమైనాయి. మహాకవులు, నాటకకర్తలు వాటినుండి కథావస్తువులను సంగ్రహించి రసవత్తరమైన కావ్యాలను సృష్టించారు. సౌందర్యవతియైన స్త్రీయొక్క పాదస్పర్శవల్ల అశోకవృక్షం పుష్పిస్తుందని చెప్పబడింది. కామదేవుని సాహసకార్యాలు, ఆయనభార్య రతీదేవి ప్రేమగాథలు, వసంతకాలానికధిష్టానదేవతయైన వారిమిత్రుడు వసంతునికథలూ ఉన్నాయి. అత్యంత సాహసుడైన కామ

దేవుడు తన పుష్పబాణాన్ని సారిస్తూ పరమశివునిమీదనే ప్రయోగించాడు. శివుడు తన తృతీయనేత్రాన్ని తెరచేసరికి అందులోనుంచివచ్చిన మంటలో కామదేవత భస్మమైపోయాడు. తిరిగి అనంగుడుగా పునర్జీవితుడైనాడు.

ఈ కథలలో వీరాధివీరుల సాహసకృత్యములు కథావస్తువులు. ఎన్నికష్టాలొచ్చినా సత్యాన్ని వదలకూడదని, ఆడినమాట తప్పరాదనీ, ప్రాణంమీదికొచ్చినా నమ్మినవారిని ద్రోహంచేయరాదనీ, ధైర్యాన్ని వదలకూడదనీ, సత్కార్యాలు చేస్తుండాలనీ, బహుజనక్షేమంకోసం ఆత్మార్పణంచేస్తుండాలనీ, ఇత్యాది నీతులను ఈ కథలు బోధిస్తాయి. ఈ కథలన్నీ చాలవరకు కేవలం కల్పనలు. కొన్నికథలు కొంత నిజం, కొంత కల్పన. అనుశ్రుతంగా ప్రచారంలో ఉండిన ఒక సంఘటన నాధారంచేసుకుని దానిచుట్టూ చిలువలు పలువలు అల్లి ఉత్ప్రేక్షించబడినవి. నిజము, కల్పన పడుగుపేకలవలె చక్కగా వేరుచేయడానికి వీలులేనంత తరుచుగా నేయబడినాయి. ఆ నేతయే చరిత్రగా పరిణమిస్తోంది. ఈ చరిత్ర ఏమిజరిగిందో చెప్పకపోవచ్చును. ఏమిజరిగిందనిప్రజలు విశ్వసించారో చెపుతుంది. సాహసోపేతులైన మన పూర్వీకు లెంత ప్రతిభావంతులో ఏఆదర్శాలు వారిని ఉత్తేజపరచాయో చాటుతుంది. కనుక నిజం కానివ్వండి, కల్పనకానివ్వండి, ఈ కట్టుకథలన్నీ ప్రజల జీవితంలో మేళవించిపోయాయి. నిత్యజీవితంలోని కష్టాలను విసుగుదలను మరపించి వారిని ఉన్నతస్థాయికి తీసుకొనిపోతున్నాయి. న్యాయమైన జీవితపథాన్ని నడవాలని పదేపదే వారికి జ్ఞాపకంచేస్తుంటాయి. ఆ లక్ష్యం దూరంగాఉన్నా దానిదగ్గరకు చేరడం కష్టంగా ఉన్నా ప్రయత్నంచేయకతప్పదు.

పురాతనమైన రోమన్‌కథలలోని వీరులచరిత్రలు, లుక్రేషియా వీరగాథలు కేవలం కల్పితములేననీ, ఎంతమాత్రమూ నిజంకావనీ విమర్శచేసేవారిని 'గొథే' ఎక్కువగా ఖండించేవాడని చెప్పబడింది. ఏదైనా కేవలం అసత్యమై కల్పనమాత్రమే అయితే దానివలన ఎట్టిఫలితాలు కలుగవనీ, అందంగాఉండి, పాఠకుల నుత్తేజపరుపలేవనీ చెప్పేను. "ఆలాంటి సుందరమైన కథలు కల్పించగలిగిన ప్రతిభ రోమనుల కున్నప్పుడు వాటిని నమ్మేటంత గొప్పవారం మనం కావాలి" అన్నాడు గొథే.

చరిత్రల్లో కొంత నిజముంది. కొంత కల్పనుంది. కొంత కేవలం
నే కావచ్చును. కాని ఆ చరిత్రల్లో ఆకాలపువారి మనోవికా
గా, లక్ష్యాలూ, వారిహృదయమూ చక్కగా ప్రతిబింబిస్తున్నాయి.
దు జరుగబొయ్యేచరిత్రకుకూడా ఇదే పునాది. భవిష్యదాలో
లకు ప్రాతిపదిక. మతము తత్త్వశాస్త్రము పురాతన భారతచరిత్ర
యొక్క భావాలమీద లక్ష్యాలమీద తమ ప్రభావాన్ని చలాయిం
చాయి. జరిగిన సంగతులను జరిగినట్లుగా వ్రాయడంగాని, వాటి నన్నే
సేకరించి గుదిగుచ్చడంకాని వారు అంత ముఖ్యమైనవిషయంగా గణించ
లేదు. అప్పట్లో జరిగిన సంఘటనలు మానవప్రవర్తనపై తమ ప్రభావా
న్నెట్లు ప్రసరింపచేశాయో చూడడమే వారు ప్రధానంగా పెట్టు
కున్న లక్ష్యం. గ్రీకులవలెనే వారు కళాదృష్టితో భావవీథుల్లో విహ
రించగలిగినవారు ముందు ముందు మానవప్రవర్తన కొక నీతిని, వెలుగు
బాటను ప్రసాదించాలనే అభిప్రాయంతో గత సంఘటనలను భావ
సౌష్టవంచేసి కళాసృష్టిని చేశారు.

గ్రీకులు, చైనీయులు, అరబ్బులవలె, పూర్వకాలపు భారతీ
యులు చరిత్రకారులు కారు. ఇది చాలా దురదృష్టమే. అందువల్ల
గతంలో జరిగిన సంగతులు ఫలానా సంవత్సరంలో జరిగినాయని నిర్ధా
రణగా చెప్పడానికి వీలులేకుండా ఉంది. చారిత్రకసంఘటనలు కొన్ని
ఒకదానిలోఒకటి కలిసిపోయాయి. మరికొన్నిటికి పునరుక్తిదోషంపట్టింది.
అందువల్ల అనేక తికమక లేర్పడ్డాయి. ఇప్పుడిప్పుడే ఓర్మిగల ఇతిహాస
పండితులు భారతచరిత్రనిర్మాణానికి అవసరమైన మూలాలను కనిపె
డుతున్నారు. క్రీస్తు అనంతరం 12 వ శతాబ్దంలో కల్హణుడు రచించిన
'రాజతరంగిణి' అనే గ్రంథంలో కాశ్మీర్‌చరిత్ర వ్రాయబడింది. అదొ
క్కటే చారిత్రకగ్రంథమని చెప్పదగినది. మిగతా చరిత్రను సమగ్రం
చేయాలంటే, పురాణాల్లోనూ, తదితరపుస్తకాల్లోనూ ఉత్ప్రేక్షలతో
కూడిన చరిత్రమీద ఆధారపడకతప్పదు. దానితోపాటు ఆనాటి
కొన్ని రికార్డులను, శాసనాలను, కళాఖండాలను, చిత్రకళలను, నాణె
ములను, సంస్కృతకావ్యాలను కొంత ఆధారంగాచేసుకోవచ్చును.
ఆదిలో గ్రీకు, చైనా యాత్రికులు, తర్వాత అరబ్ యాత్రికులు మన

దేశంలో సంచారంచేసి వ్రాసిన రికార్డులుకూడా చాలావరకు ఇందు తోడ్పడుతున్నాయి.

కాని ఈ చారిత్రకదృష్టి లోపించడంవల్ల ప్రజాసామాన్యా విధమైన నష్టమున్నూ కలుగలేదు. అనుశ్రుతంగా తరతరాలుగా వింటూవచ్చిన కథలవల్లనూ, పురాణగాథలవల్లనూ, గతచరిత్రయొ స్వరూపాన్నివారు ఊహించుకోగలుగుతున్నారు. నిజము, కల్పన రెండిటి మిశ్రమమైన ఈ చరిత్ర వారికి క్షుణ్ణంగా తెలుసును. అదే వారికొక వైజ్ఞానిక వైదుష్యాన్ని శాశ్వతంగా కలిగించింది. కాని చరిత్రను పూర్తిగా వదలివెయ్యడంవల్ల నష్టంకలుగకపోలేదు. మన దృష్టిలోనూ, మనస్సు లోనూ ఒకవిధమైన అస్పష్టత కలిగింది. నిజం చెప్పాలిసొస్తే ఒకవిధ మైన మెతక ఏర్పడింది. వాస్తవంలో చాలా కష్టతరమైన వేదాంత విచారం చేయవలసివచ్చినప్పుడు మనవారిబుద్ధికి ఏవిధమైన అస్పష్టతా కలుగలేదు. ఏ విషయాన్నైనా విడదీసి కూలంకషంగా చర్చించడంలో కాని, సమన్వయంచేసి ఆలోచించడంలో కాని, సునిశితంగా విమర్శ చేయడంలో కాని, వారిబుద్ధి ఎప్పుడూ వెనుకాడలేదు. కాని కేవలం చారిత్రకసంఘటనవిషయంలో వారు అంత విమర్శగా పట్టించుకోలేదు. బహుశా దానికి వారు అంతప్రాముఖ్యత నివ్వలేదనుకుంటాను.

నవప్రపంచంలో, శాస్త్రవిజ్ఞానం బాగా వ్యాప్తిచెందుతున్న పిమ్మట, కేవలం నిజానికి ఎక్కువప్రాముఖ్యత ఏర్పడుతోంది. ఏవిషయం లోనైనా లభ్యమైన సాంత్యసంపర్కాలను బాగావిమర్శించే అలవాటు ఎక్కువవుతోంది. సాంప్రదాయసిద్ధంగావస్తూన్న సాంప్రదాయాలనన్ని టినీ విశ్వసించడానికి మనసొప్పడంలేదు. చాలామంది చరిత్రకారు లిప్పుడీ పని సాగిస్తున్నారు. కాని వారిలో మరొకలోపం కనబడుతోంది. సజీవ మైనచరిత్రను సృష్టించడానికిబదులు మక్కికి మక్కిగా విషయాలను నిర్జీవంగా రికార్డుచేస్తున్నారు. చిత్రమేమంటే, ఈనాడుకూడా, బుద్ధిమం తులనుకునేవాళ్ళవిమర్శనాశక్తి కూడా స్తంభించిపోయి, సాంప్రదాయా నికి తలొగ్గుతూ ఉంటుంది. ప్రస్తుతం మన పరాధీనస్థితిలో, మనలనావ హించిన జాతీయతత్వంకూడా కొంతవరకిందుకు కారణంకావచ్చును. మనకు ఆర్థిక రాజకీయస్వాతంత్ర్యం లభించినప్పుడే మనబుద్ధి సహేతుకం గానూ సహజంగానూ పనిచేస్తుంది.

ఈమధ్యనే విమర్శకదృష్టికీ, జాతీయ సాంప్రదాయానికీ సంఘర్షణకలిగే ఒకవిషయం జరిగింది. భారతదేశంలో చాలాచోట్ల విక్రమశకపంచాంగాన్ని అనుసరిస్తారు. దానికాధారం సూర్యసిద్ధాంతం. నెలలుమాత్రం చాంద్రమానం. ఈ పంచాంగంలెఖ్ఖప్రకారం, 1944 సంవత్సరం ఏప్రిల్ నెలతో రెండువేలఏండ్లు పూర్తియై, మరొకసహస్రాబ్దం ప్రారంభమవుతోంది. ఆ శుభసమయాన్నొకపండుగగా దేశమంతటా జరిపించారు. నిజానికది పండుగనదగ్గదే. కాలచర్యలో మరొకసహస్రాబ్దం ప్రారంభమవడం గొప్పసంగతే. ఈ పంచాంగం ఎవరిపేరిట నడుస్తుందో ఆ విక్రమాదిత్యుడు ప్రజలచేత తరతరాలనుంచి గొప్పవీరుడుగా ఆరాధింపబడుతున్నాడు. ఆయనపేరిట లెక్కలేనన్ని కథలు గాథలు దేశమంతటా వ్యాపించడమేకాకుండా, ఆసియాలోనూ యూరోపులోనూ కూడా అనేక రూపాంతరాలుచెంది వ్యాప్తమైనాయి.

విక్రమాదిత్యుడు ఆదర్శప్రాయుడైనరాజు. గొప్పవీరుడు. విదేశములనుండి మనదేశంమీదకు దండెత్తివచ్చినవారినెందరినో తరిమికొట్టిన మహావీరుడుగా ప్రజలాయన నారాధిస్తారు. కాని ఆయనఖ్యాతికి కారణం ఆయన ఆస్థానంలోని వైదుష్యం. ఆయన ఆస్థానంలో 'నవరత్నాలని' ప్రఖ్యాతిబడసిన విజ్ఞాననిధులైన పండితులుండేవారు. సాహిత్యవేత్తలు, సంగీతకళానిధులు ఆ ఆస్థానంలో ప్రకాశిస్తూఉండేవారు. ప్రజలకు సేవచేయాలనే అభిలాషతో, ఇతరులకు సహాయపడవలసొచ్చినపుడు తన సుఖాన్ని అవలీలగా త్యాగంచేసిన అనేకకథలు విక్రమాదిత్యునిగురించి చెప్తుకుంటారు. దాతృత్వానికీ, ఔదార్యానికీ, ధైర్యానికీ వినయానికీ ఆయన ఘనతను సంపాదించాడు. ప్రధానంగా ఆయన మంచివాడై, కళాకారులను ప్రోత్సహించడంవల్లనే పేరు ప్రతిష్టలు పొందేడు. శత్రువులను దరిచేరకుండాచేసిన ఆయనవీరత్వానికంతగా ఆ కథల్లో ప్రచారం జరుగడంలేదు. మనిషియొక్క మంచితనానికీ, స్వార్థత్యాగానికీ ప్రాముఖ్యత నివ్వడమే భారతీయభావంలోని విశిష్టత. సీజరు పేరులాగుననే, విక్రమాదిత్యునిపేరుకూడా ఒకవిధమైన బిరుదైపోయింది. తరువాతకాలపు రాజులెందరో ఆ బిరుదాన్ని వహించారు. విక్రమాదిత్యులనేకమందిఅవడంచేత కొంత తికమకకూడా కలుగుతుంటుంది.

ఇంతకూ, ఈ విక్రమాదిత్యుడెవరు? ఆయన ఏనాటివాడు? చారిత్రకంగాచూస్తే చాలా అస్పష్టంగా కనబడుతుంది. క్రీ. 57 సంవత్సరంలో అనగా విక్రమాదిత్యశకం ప్రారంభమైనప్పుడు రాజుపే రెక్కడా కనబడదు. కాని క్రీస్తు అనంతరం నాల్గవశతాబ్దంలో మాత్రం ఉత్తరభారతంలో ఒక విక్రమాదిత్యుడు ఉండేవాడు. ఆయన మనదేశంమీద దండెత్తివచ్చిన హూణులనెదిరించి వెనుకకు తరిమినాడు. తన ఆస్థానంలో నవరత్నాలనుంచుకున్న విక్రమాదిత్యుడు, ఈ కథలన్నిటికి కారణభూతుడైన విక్రమాదిత్యుడు ఆయన కావచ్చును. కాని క్రీ. త. నాల్గవశతాబ్దంనాటి ఈ విక్రమాదిత్యుడికీ విక్రమశకానికీ సంబంధమేమిటనేదే సమస్య. కాని మధ్యభారతంలోని మాల్వాసంస్థానంలో క్రీ. పూ. 57 వ సంవత్సరంతో ఒక శకం ప్రారంభమైనదనీ, దానిని విక్రమాదిత్యునికి తర్వాత ముడిపెట్టేరనీ ఒకసమాధానం ఉన్నది. కాని ఇదంతా ఇదమిత్థమని చెప్పడానికి వీలులేనివిషయం.

రెండువేలసంవత్సరాలక్రితం ప్రారంభమైన ఈ శకాన్ని, వీరుడైన విక్రమాదిత్యునికి ముడిపెట్టడానికి విద్యావంతులైన ఇతిహాసపండితు లెందుకు చరిత్ర నింత తారుమారుచేసి తాపత్రయపడ్డారోమాత్రం నాకు ఆశ్చర్యంగా కనబడుతుంది. విదేశీయులతో ఆయన జరిపిన పోరాటాలకూ, దేశాన్నంతనూ ఏకఛత్రాధిపత్యంక్రిందకు తీసుకురావాలని ఆయనచేసిన ప్రయత్నాలకూ చాలా ప్రాముఖ్యత ఇవ్వబడింది. నిజానికి ఆయనసామ్రాజ్యం ఉత్తరభారతానికి మధ్యభారతానికిమాత్రమే సంబంధించి ఉండినది.

జాతీయదృక్పథంతోనూ, జాతీయఉత్తేజంతోనూ చరిత్రను పరిశోధించిన దొక్క భారతదేశమే కాదు. ప్రతిదేశమూ ప్రతి జాతీ కూడా గతంలోని చారిత్రకఘట్టాలను తమ కనుకూలంగా మెరుగులు పెట్టడానికి ప్రయత్నంచేస్తూనేవచ్చింది. ఇంగ్లీషువారిచేత వ్రాయబడి, మనం గత్యంతరంలేక చదువవలసిన చరిత్రగ్రంథాలెన్నో ఈ శ్రేణికి చెందినవే. సాధారణంగా బ్రిటిష్‌పరిపాలనను సమర్థించడమే వాటిపని. అంతకుపూర్వం వేల ఏండ్లక్రితం జరిగిన చారిత్రకసంఘటనలను వారు టూకీగా తప్పులతడికగా వ్రాసేశారు. ఇంగ్లీషువారు ఇండియాలో కాలుపెట్టినప్పటినుంచే నిజమైన చరిత్ర ప్రారంభమైన

దని వారిభావం. అంతకుముందు జరిగిన చరిత్రంతా ఈ దైవసంఘట నకు నాంది మాత్రమేనని వారి లెక్క. బ్రిటిష్‌వారి సుగుణసంపత్తిని, పరిపాలనాదక్షతను ఆకాశాని కెత్తవలెననే అభిప్రాయంతో వారు బ్రిటిష్‌కాలంనాటిచరిత్రను కూడా తమ ఇష్టంవచ్చినట్లు మెలికలు త్రిప్పేశారు. ఇప్పు డిప్పుడే నెమ్మదిగా నిజం బయటకొస్తోంది. కాని చరిత్రను తమస్వార్థంకొరకు మెలిపెట్టే ఉదాహరణలకోసం మనం పూర్వచరిత్రలో కెళ్ళనక్కరలేదు. ఆవిషయం నేడు మనం ప్రత్యక్షం గానే చూస్తున్నాం. మనకళ్ళముందర జరిగిన విషయాలను, మనం స్వయంగా అనుభవించిన విషయాలను మెలికలు త్రిప్పేస్తున్నప్పుడు, పాతపురాణా లొక లెక్కా? ఏమైనా, భారతీయులు సాంప్రదాయా లనూ, అనుశ్రుతంగా వచ్చే గాథలనూ చరిత్రగా అంగీకరించే స్వభా వంగలవారనే మాట సత్యం. అంతగా విమర్శచేయకుండానే అంగీక రిస్తారు. ఇలాంటి ఆషామాషీ ఆలోచనావిధానాన్ని మనం వదలి పెట్టాలి.

అయితే, నేను దేవుళ్ళూ, దేవతలూ, వాళ్ళ కథలూ గాథలూ, ఆ కాలమూ అన్నీ వదలిపెట్టి మరొకదారి కొచ్చాను. పూర్వకా లంలో జీవితం సమగ్రమై ప్రకృతిననుసరించి ఉండేది. సృష్టి వైచి త్ర్యాన్ని మానవుడు సంతోషంతోటీ ఆశ్చర్యంతోటీ చకితుడై పరిశీ లించినకాల మది. భూలోకం స్వర్గలోకం ఒకదానికొకటి బహు సమీ పంగా ఉన్నట్లుండే సత్యకాలం. దేవతలు కైలాసంనుంచో లేక తదితర హిమాలయనివాసాల్లోనుంచో దిగొచ్చి, మానవులతో విలాసంగా గడిపేవారు. ఒక్కొక్కప్పుడు మానవులను శిక్షించడానికికూడా వచ్చేవారు. పరిపూర్ణమైన జీవితంలోనుంచీ, అద్భుతమైన ఊహాశక్తి నుంచీ, అనేక గాథలు కల్పనలు ఉద్భవించాయి. అందమైన దేవతా స్త్రీలు, పురుషులు పుట్టుకొచ్చారు. గ్రీకులలాగునే పూర్వకాలపు భారతీయులు సౌందర్యోపాసకులు. ఈ దేవతలపద్ధతిలోని అందచందా లను గురించి ప్రొఫెసర్ గిల్బర్టు మర్రే వ్రాసిన వివరణ, మన భారత దేవతాసృష్టికికూడా వర్తిస్తుంది. "దేవతలు కళావేత్తలకలలు, లక్ష్యాలు, కల్పనలు. మానవాతీతమైన సృష్టిచిహ్నాలు సాంప్రదాయా నికి సగం విరుద్ధమైన దేవతలు, సంశయాత్ములైన వేదాంతులు ఆరా

ధించదగిన దేవత్వం కలవారు. కాని వారిని పూర్తిగా దేవుళ్ళని అంగీ కరించి ఆరాధించేవారరుదు మానవుడు చెక్కిన ఒక సుందరమైన విగ్రహం దేవుడుకాడు. ఆ దేవునిస్వరూపాన్ని సాక్షాత్కారంచేసు కునేందుకు ఒక సాధనం మాత్రమే. అలాగే భగవంతునికూడా ఒక రూపంలో ఊహించుకున్నంత మాత్రాన ఆ స్వరూపమే సత్యంకాదు. ఆ సత్యాన్ని సాక్షాత్కారంచేసుకునే సాధనం మాత్రమే అవుతుంది. కాని ఈ దేవత లెవ్వరూ, అసలు జ్ఞానసాధనకు వ్యతిరేకమైన సిద్ధాం తాలను ప్రతిపాదించలేదు. మానవుని తన ఆత్మప్రబోధానికి భిన్నంగా అపరాధంచేయమని ఎన్నడూ ఆజ్ఞాపించలేదు.” ప్రొఫెసర్ మ్రే వ్రాసిన పైవిషయాలు చాలవరకు మన దేవతలపట్లకూడా సరిపోతాయి.

క్రమంగా వేదకాలంనాటి దేవతాస్త్రీలు, పురుషులు వెనుకబడి పోయూరు. వారిస్థానే జటిలమైన వేదాంత సిద్ధాంతాలు ప్రత్యక్షమైనాయి. కాని ప్రజలమనస్సుల్లో మాత్రం ఆ దేవతలింకా తాండవిస్తూనే ఉం టారు. సుఖదుఃఖాలలో వారికి సహచరులుగానే ఉంటున్నారు. వాళ్ళ మనస్సుల్లోఉన్న ఊహలకు, ఆశలకూ ప్రతిబింబాలుగా ఉంటారు. ఈ దేవతలగాధలనే కథావస్తువులుగా చేసుకుని, మహాకవులు తమ ఊహ నంతనూ వినియోగించేసి కావ్యసృష్టిచేశారు. తమ కళావైదుష్యాన్నం తనూ జొప్పించి నగిషీపనిచేసినట్లుగా కావ్యరచనలుచేశారు. భారత 'పురాణగాధలు' అనే పేరుతో ఈ కావ్యాలలోని కథలను యఫ్. డబ్ల్యు. బెయిన్ చక్కని చిన్నచిన్న గ్రంథాలుగా వ్రాశాడు. అందులో ఒక కథలో ('చంద్రకళ') స్త్రీయొక్క సృష్టినిగురించి చెప్ప బడింది. 'ఆదిలో సృష్టికర్తయైన త్వష్ట' స్త్రీని సృష్టిస్తుండగా మట్టి వగైరా సామగ్రి అయిపోయింది. ఏమిచేయాలో తోచక బాగా ఆలో చించి, చంద్రబింబంలోని గుండ్రతనాన్ని, లతలలోని వక్రత్వాన్ని, తీగెల లోని ఆశ్రితత్వాన్ని, గడ్డిపరకలలోని చంచలత్వాన్ని, దాని కాడలోని సున్నితత్వాన్ని, పుష్పాల్లోని వికాసాన్ని, ఆకులలోని లఘుత్వాన్ని, ఏనుగతొండంయొక్క ఊసుతనాన్ని, లేడిపిల్లచూపులను, తేనెటీగల వరుసలను, సూర్యకిరణాల్లోని అందాన్ని, మేఘాలకన్నీటిధారలను, వాయుప్రసారంలోని చంచలత్వాన్ని, కుందేటిలోని భీరుత్వాని, నెమలి యొక్క అహంకారాన్ని, చిలుకహృదయంలోని మృదుత్వాన్ని, రాతి

లోని కాఠిన్యాన్ని, తేనెలోని మాధుర్యాన్ని, పులిలోని క్రూరత్వాన్ని అగ్నిలోని వేడిని, మంచులోని చల్లదనాన్ని, పక్షులకిలకిలధ్వనినీ, కోకిల కుహూకుహూ ధ్వనిని, కొంగ టక్కరితనాన్ని, చక్రవాకపక్షుల పశ్చాత్తాపాన్నీ కలిపి రంగరించి స్త్రీనిచేసి పురుషుని కర్పించాడు."

## ౧౩ మహాభారతం

పురాణాలు ఫలానాకాలంనాటివని నిర్ధారణచేయడం కష్టం. ఆర్యులు నెమ్మదిగా భారతదేశంలో స్థిరనివాసంచేసుకునే తతంగంలో ఉన్నకాలంనాటి కథలే అందులో వ్రాయబడినాయి. బహుశా చాల మంది రచయితలు వాటిని రచించిఉంటారు. లేకపోతే తరువాత రచయితలు వాటిని చేర్చివుంటారు. రామాయణకావ్యరచనలో ఒక నిర్దిష్టమైన విధానం కనబడుతుంది. మహాభారతం చాలా మహత్తరమైన పురాణకథాసంకలనం తర్వాత కొన్నిచేర్పులుజరిగినా బౌద్ధయుగానికిముందే రామాయణ భారతాలు రూపొంది ఉండాలి.

ఫ్రెంచి చరిత్రకారుడు మిచిలే రామాయణాన్నిగురించి ఇలా వ్రాశాడు—"ఎవ్వరైనా శ్రమించినపిమ్మట విశ్రాంతికావలసినపుడు జీవన ప్రదానంచేసే ఈ (రామాయణ) మహాపాత్రనుంచి కొంతమధువును సేవించాలి......పశ్చిమదేశాల్లో ఏదిచూచినా ఇరుకే. గ్రీసు చాలా చిన్నది. నాక్కడ చాలాక్కిక్కిరిసినట్లుంటుంది. జూడియా బాగా ఉక్కగా ఉంటుంది. అందుచేత నేను సువిశాలమైన ఆశియాఖండంకేసి చూస్తుంటాను. హిందూమహాసముద్రమంత విశాలమై గంభీరంగా ఉండే ఆ కావ్యం (రామాయణం) కనబడుతుంది అపశ్రుతిలేని మహాకావ్యం. అక్కడ ప్రశాంతంగా ఉంటుంది. సంఘర్షణలమధ్య అనంతంగా మాధుర్యం స్రవిస్తుంది. జీవరాసులన్నిటిని ఏకంచేసే ఒకమహాత్మ్యం అక్కడుంది. అదొక అపారమైన, అగాధమైన దయాసముద్రం."

సామాన్యప్రజల ఆదరాభిమానములను చూరగొన్న మహాకావ్యం రామాయణం. అందుకు సందేహంలేదుకాని నిజానికి ప్రపంచంలోకల్లా అత్యుత్తమమైన మహాగ్రంథం భారతం. అదొక బ్రహ్మాండమైన నిర్మాణం. గాథలకు, సాంప్రదాయములకు, పాతకాలపు రాజకీయ సాంఘికసంస్థలకు నిఘంటువువంటిది. పదిపదేను సంవత్సరాలనుంచి

చాలామంది భారతీయపండితులు అనేకప్రతులను పరిశీలించి వాటిని చక్కగా పరిశోధించి, పరిష్కరించి, నికరమైన ప్రతిని ప్రచురించడానికి చాలా భారీప్రయత్నాలు చేస్తున్నారు. వారు కొన్ని భాగాలను మాత్రం ప్రచురించారు. ఆపని యింకా పూర్తికాలేదు. ఇప్పటికీ జరుగుతోంది. మహాఘోరంగా యుద్ధాలు జరుగుతున్న ఈసమయంలోకూడా రష్యాదేశంలోని ప్రాగ్దేశసాహిత్యపండితులు మహాభారతాన్ని రష్యన్ భాషలో ప్రచురించారు.

బహుశా భారతం, విదేశాలనుండి తమ ఆచార వ్యవహారాలతో సహా ఇచ్చటికి వచ్చిన జనం స్థిరపడుతూఉండినకాలంనాటిది కావచ్చును. ఈ ఆచారాలు చాలావరకు ఆర్యులపద్ధతికి వ్యతిరేకం. అందుచేతనే కొన్ని అభిప్రాయాలు, అలవాట్లు, పరస్పరవిరుద్ధంగా కనబడుతాయి. ఆర్యులలో బహుభర్తృత్వం నిషేధం. కాని మహాభారత గాథకు నాయిక (ద్రౌపది) పంచపాండవులకు భార్య. క్రమక్రమంగా స్థానికవాసులతో పైనుంచివచ్చినవారు కలసిపోవడం జరుగుతూవచ్చింది. వైదికమతంకూడా దాని కనుగుణ్యంగానే మారిపోతూవచ్చింది. అప్పుడప్పుడే హిందూమతం సమగ్రస్వరూపాన్ని దాల్చడం మొదలెట్టింది. ఎవరో ఒక్కరు చెప్పినవిషయం మాత్రమే సత్యంకాదనీ, ఒకేసత్యాన్ని అనేకవిధాలుగా చూడవచ్చుననీ, ఒక సహనభావం ఉండడంవల్లనే అట్టి సమీకరణం సాధ్యమైనది. అనేక విశ్వాసాలు, అవి పరస్పరవిరుద్ధములైనప్పటికి భరింపబడినాయి.

మహాభారతంలో భరతునిపేరిట వెలసిన ఈ భారతభూమిఅంతా ఒక్కటే అని నిరూపించడానికి చాలా ప్రయత్నం జరిగింది. భారతదేశానికి ఆర్యావర్తం అనగా ఆర్యులభూమిఅని మరోపేరుకూడాఉన్నది. కాని ఆర్యావర్తమంటే వింధ్య కుత్తరభాగమనే లెక్క. ఆకాలంలో బహుశా ఆర్యులు వింధ్యపర్వతశ్రేణినిదాటి క్రిందకు దిగినట్లుకనుపించదు. ఆర్యులు దక్షిణదేశానికి వ్యాపించడంయొక్క కథ రామాయణం. భారత సామ్రాజ్యాధిపత్యంకోసం సోదరులమధ్య జరిగిన మహాసంగ్రామచరిత్ర భారతం. అది సుమారు క్రీ. పూ. 1400 ఏండ్లక్రితం జరిగిన చరిత్ర. ఇండియా అంతటిని భారతవర్షమనే పేరిట ఒకేదేశంగా ఊహించుకోవడం ప్రారంభమైనకాల మది. నేటి ఆఫ్ఘనిస్తానం, అనగా ఆనాటి గాంధార

దేశంకూడా హిందూదేశభూభాగంగానేఉండేది. 'గాంధార' అనేమాటే ఇప్పుడు 'కందహార్' అయింది. కురురాజుపట్టమహిషి గాంధారి గాంధార రాజపుత్రియే. నేటి నవఢిల్లీ పరిసరాల్లో ఉండిన హస్తినాపురం, ఇంద్రప్రస్థం ఆనాటి ముఖ్యపట్టణాలు.

మహాభారతాన్ని గురించి సోదరి నివేదిత ఇలా చెప్పింది "విదేశీయ పాఠకులకు భారతంలో రెండు ప్రధానవిషయాలు గోచరిస్తాయి. ఒకటి వివిధత్వంలో ఏకత్వం; రెండు భారతదేశమంతా ఒక్కటేననీ, ఒక వీరసాంప్రదాయం కలిగిన ఒకేజాతి అనీ పాఠకులకు తెలియచెప్పడం.

కృష్ణలీలలు జగద్విఖ్యాతిగాంచిన భగవద్గీత, భారతంలోనివే. గీతలోని వేదాంతవిషయాలట్లుండగా, దైనందిన జీవితానికి సంబంధించిన నైతికసూత్రాలు, రాజనీతిశాస్త్రవిషయాలు మొదలైనవెన్నో అందులో చక్కగా విపులీకరింపబడినాయి. ధర్మమనే మూలం లేకపోతే నిజమైన సౌఖ్యమే లేదు. సంఘం కట్టుబాట్లతో వర్ధిల్లనేలేదు. సంఘసంక్షేమమే లక్ష్యం. ఏదోఒక వర్గక్షేమం కాకుండా ప్రపంచంలోని సర్వజీవరాసులక్షేమాన్ని కాంక్షించడమే మహాభారత లక్ష్యం. 'సర్వేజనా స్సుఖినోభవంతు.' కాని ధర్మమంటే స్థూలంగా సత్యాహింసల ఆచరణమేకాకుండా దేశకాలపాత్రానుసారంగాకూడా నిర్వచింపవలసి ఉంటుంది. మూలసూత్రాలు మారవు, కాని కాలానుగుణ్యంగా విధులు, బాధ్యతలు మారుతూఉంటాయి. అహింసనుగూర్చి విశేషంగా చెప్పిన సంగతులు చాలా ఆశ్చర్యంగా ఉంటాయి. అహింసకూ, ధర్మం కోసం కత్తిదూయడానికీ ఏమీ తేడాఉన్నట్లు కనబడదు. మహాభారత కావ్యమంతా ఒక మహాసంగ్రామగాథ. అహింస అనగా మనస్సులో ద్వేషం లేకపోవడమనే తోస్తుంది. ఆత్మనిగ్రహం, రాగద్వేషాలను చిక్కబట్టడమే ప్రధానం; కాని, కేవలం హింసాకాండకు పాల్పడకపోవడం మాత్రమే అహింస కాదు. తప్పనిసరియైతే హింసకు పాల్పడినా, అది ద్వేషరహితం కావాలి.

మహాభారత మొక మహానిధి. దానిలోనుంచి అమూల్యమైన వస్తువుల నెన్నో మనం గ్రహించగలం. వివిధత్వం కలిగి పుష్కలంగా ఉండే జీవితం అందులో ఉంది. సన్యాసానికీ, కర్మత్యాగానికీ భారత ప్రబోధానికీ చాలా దూరం. అందులో నీతిశాస్త్రవిషయాలు చాలా

ఉన్నా, కేవలం ధర్మ సిద్ధాంతాలను చెప్పే గ్రంథం మాత్రమే కాదు. మహాభారతంలోని సారాంశం సూక్ష్మంగా "నీకు అహితవుగానుండే పనిని నువ్వు ఇతరులకు చేయవద్దు" అని చెప్పాలి. సాంఘికసంక్షేమం గురించి మహాభారతంలో విశేషంగా చెప్పబడి ఉండడం గమనార్హం. ఏమంటే, సాధారణంగా హిందూమనస్తత్వంలో సంఘసంక్షేమంకన్న వ్యక్తిపరిపూర్ణతకే ఎక్కువ ప్రాధాన్యత ఉన్నది. "ఏపని సంఘసంక్షేమ దాయకంకాదో, ఏపనిచేస్తే నీవు సిగ్గుపడాలో ఆపని చేయవద్దు." అని భారతం ప్రబోధిస్తోంది.

సత్యం, ఆత్మనిగ్రహం, నిరాడంబరత్వం, ఔదార్యం, అహింస, నిరంతరధర్మాచరణం-ఇవే విజయసాధనాలు కాని, కులగోత్రాధిక్యత కాదు' అనీ, 'శాశ్వతమైన ఐహికసుఖాలకన్న శీల మెక్కువ' అనీ, 'నిజమైన సౌఖ్యానుభవం కష్టపడితేకాని లభ్యంకాదు' అనీ, భారతంలో చెప్పబడింది. ధనార్జనే ప్రధానలక్ష్యంగాగలవారిని గురించి 'పట్టు పురుగు తన ధనంలోనే చచ్చిపోతుంది' అని చెప్పబడింది. 'అసంతృప్తియే అభ్యుదయానికి పురిగొల్పుతుంది' అని చెప్పిన నీతి నిజంగా అభ్యుదయభావాలుకలవారికే చెల్లింది.

వేదాల్లోని దేవతలు దేవుళ్ళూ, ఉపనిషత్తులలోని బ్రహ్మవాదమూ, ద్వైతాద్వైతసిద్ధాంతాలూ, ఏకేశ్వరవాదమూ అన్నీ అందులో ఉన్నాయి. నిర్మాణాత్మకమైన, సహేతుకమైన దృక్పథం కనబడుతుంది. ఆకాలంలో కులభేదా లంత ఉక్కిరిబిక్కిరిగా ఉండేవి కావు. ఒకవిధమైన విశ్వాసం గోచరమవుతుంది. కాని పైనుంచి దండెత్తివచ్చిన శక్తులు ఉన్న స్థితిగతులను తారుమారుచేస్తాయేమో నన్నప్పుడు, ఆ విశ్వాసం కొంత చలించింది. అందుచేతనే ఆంతరంగికంగా సంఘానికి బలంచేకూర్చడానికి ఎక్కువ ప్రయత్నాలు జరిగినాయి. కొత్తనిషేధాలు అమలులోకొచ్చేయి. అంతకుపూర్వం సక్రమంగా ఉండిన గోమాంసభక్షణ పూర్తిగా నిషేధింపబడింది. గొప్ప గొప్ప అతిధులు వచ్చినపుడు గోమాంసముతోనూ, లేగదూడల మాంసంతోనూ ఆతిధ్యమిచ్చినట్లు మహాభారతంలో అక్కడక్కడ చెప్పబడింది.

గీతాసందేశం ఏ ప్రత్యేకమతస్థులకొరకుకాని కులస్థులకొరకుగాని చెప్పబడలేదు. బ్రాహ్మణుడు మొదలు పంచముని వరకూ అందరికీ తన సందేశాన్నందించింది గీత. 'అన్నిమార్గాలూ నాదగ్గరకే చేరుతాయి' అనే గీతాప్రబోధం. గీతయొక్క విశ్వవైశాల్యదృష్టివల్లనే అది అన్ని జాతులవారిచేతను మతములవారిచేతనూ శిరసావహింపబడుతోంది. కాల గర్భంలో అణిగిపోకుండా, ఎప్పటి కప్పుడే పునర్జీవాన్ని పొందే విశేష మేద అందులో ఉన్నది. విషయాన్వేషణ, ఆలోచించి పనిచేయడం, ఎంతటి సంఘర్షణలోనైనా ఒక నిదానంతో నిర్ణయాలకు రావడం, ఇవన్నీ గీతల్లో చెప్పబడిన సంగతులు. భిన్నత్వంలో ఏకత్వం గీతాలక్షణం. నిరం తరం కాలగమనంవల్ల మార్పులుచెందుతూఉండే స్థితిగతులనుండి దూరమైపోకుండా, వాటిలో కలసి, వాటిని స్వాధీనంచేసుకోవడమే గీత ఆంతర్యం. గీతలు వ్రాయబడిన 25 వందల సంవత్సరాలనుండి భారత ప్రజానీకం అనేక మార్పులుచెందింది. అభివృద్ధి నాశాలకు గురియైంది. అనుభవపరంపరలు లభించాయి. అనేక ఆలోచనాపరంపరలుకూడా దాటిపోయాయి. కాని గీతలోమాత్రం సజీవమైనమహత్తేదో ఉంది. మన స్సును బాధించే ఆధ్యాత్మికసమస్యలపరిష్కారమున కేదో ఒకదారి చూపుతోంది.

## ౧౫ పురాతన భారతదేశంలో జీవితవిధానం

పురాతన భారతదేశంలో వేదాంతశాస్త్ర వికాసాన్నిగురించి, ఆధ్యాత్మికవైదుష్యాన్నిగురించీ చాలమంది పండితులూ వేదాంత శాస్త్రకోవిదులూ అనేక పరిశోధనలుచేశారు. చరిత్రాత్మకమైన ఘట్టాలు ఎప్పుడుజరిగినవో తేదీలను నిర్ణయించారు. అప్పటి రాజకీయ విభజనలను స్థూలంగా సూచించే పటాలు తయారుచేశారు. కాని, ఆనాటి ఆర్థిక సాంఘికజీవితాన్నిగురించి అంతగా తర్జనభర్జనచేసినట్లు కనుపించదు. ఆకాలపు ప్రజ లెట్లా జీవించేవారు ? ఏమిపని చేసేవారు ? ఏఏపదార్థాలను ఏవిధంగా ఉత్పత్తిచేసేవారు? వర్తక వ్యాపారా లెట్లా ఉండేవి? ఇత్యాది విషయాల నంతగా తరచినట్లులేదు. ఇప్పుడిప్పుడే ఈ ప్రధానసమస్యపైన పండితులదృష్టి పడినది. కొందరు భారతీయ ఇతిహా సజ్ఞులు, ఒక అమెరికన్ చరిత్రకారుడు, దీనిపై కొన్నిగ్రంథాలురచించారు,

కాని ఇంకా జరుగవలసినపని చాలాఉన్నది. ఈలాంటి సాంఘికవిషయాలను తదితరవిషయాలను తెలుసుకోడానికి, మహాభారతగ్రంథమే ఒక మహాగని. ఇంకా ఇతరగ్రంథాలుకూడా కొన్ని ఉపయోగపడతాయి. కాని ఆ గ్రంథాలనన్నిటిని ఈ దృష్టితో జాగ్రత్తగా పరిశీలించాలి. క్రీ. పూ. నాల్గు శతాబ్దాలకుముందు కౌటిల్యుడు రచించిన అర్థశాస్త్రం ఇలాంటి అమూల్యగ్రంథాలలో ఒకటి. మౌర్యసామ్రాజ్యకాలంలో రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సైనిక వ్యవస్థలనుగురించి ఈ గ్రంథంలో విపులంగా వ్రాయబడింది.

అంతకుముందుసంగతి తెలుసుకోవాలంటే, జాతకకథలను పరిశీలించాలి. అవి బౌద్ధయుగానికి ముందునాటి కథలు. బుద్ధుని అనంతరం కొంతకాలానికి ఈజాతకకథలు సంకలనంచేయబడ్డాయి. బుద్ధుని పూర్వావతారములను గురించి ఆ జాతకకథల్లో ఎక్కువగా వ్రాయబడివుండడం చేత, అవికూడా బౌద్ధవాఙ్మయంగానే ప్రచారమవుతున్నాయి. కాని కథలుమాత్రం అంతకు చాలాపురాతనమైనవి. బౌద్ధయుగానికిముందు ఆకాలపు ప్రజలజీవితవిధానాన్నిగురించి చాలా అమూల్యమైన భోగట్టా వాటినుండి మనకు లభ్యమవుతోంది. జాతకకథలు చాలా పురాతనమైనవనిన్నీ, జానపదవాఙ్మయంయొక్క పూర్ణమైన సంకలనమనీ ప్రొఫెసర్ రైస్ డేవిడ్ వివరించారు. జాతకకథలలోనుంచే తరువాత భారతదేశంలో వెలసిన జంతువులకథలు తదితరకథలు ఉత్పన్నమైనాయి. అవే క్రమంగా పశ్చిమ ఆసియా యూరోపుఖండాలవరకూ వ్యాపించాయి.

భారతదేశంలోని ప్రధానజాతులైన ఆర్యులు, ద్రావిడులు పూర్తిగా కలసిపోతున్నకాలంనాటివి జాతకకథలు. అనేకమైన స్వరూపాల్లో గందరగోళంగా ఉండే సంఘాన్నే 'జాతకములు' చిత్రించాయి. కులాలవారీగా సంఘాన్ని విభజించడానికి అప్పట్లో జరిగిన ప్రయత్నాలన్నిటినీ ఆనాటి సంఘం తిరస్కరించింది. జాతకకథల సాంప్రదాయం, ధోరణి జనతాసాంప్రదాయమనే చెప్పాలి. బ్రాహ్మణపురోహిత సాంప్రదాయం కాని, రాజ్యపాలకులైన క్షత్రియసాంప్రదాయంకాని కాదు.

అనేక రాజ్యాలకూ రాజులకూ సంబంధించిన కాలక్రమ పట్టికలు, వంశవృక్షాలు ఈ కథల్లో ఉన్నాయి. ఆదిలో రాజు ఎన్నోబ

డాడు. పిమ్మట వంశపారంపర్యా కుటుంబంలో పెద్దవానికి మాత్రం ఆ రాజరికపుహక్కు సంక్రమించింది. సాధారణంగా ఆడవాళ్ళకీ వారసత్వపుహక్కు లేదు. కాని కొన్ని సందర్భాల్లో మినహాయింపులు లేకపోలేదు. చైనాలోలాగునే, రాజ్యంలో ఎవరికే అపాయం వచ్చినా దానికంతకూ రాజే బాధ్యుడు. ఎవరికే అపకారం జరిగినా దానితప్పు రాజుదే! మంత్రులసమాలోచనాసభ, రాష్ట్ర శాసనసభలాంటి వ్యవస్థలప్రస్తావన ఆ కథల్లో ఉన్నది. అయినప్పటికీ రాజుమాత్రం నిరంకుశాధిపతి. ఆస్థానలాంఛనాల్లో ఆయన కేమీ ప్రత్యేకవిధులు లేవు. ఆస్థానంలో పురోహితునిది ఉన్నతస్థానం. మతాచరణకు సంబంధించిన తంతుకంతా ఆయనే సలహాదారుడు, బాధ్యుడు కూడాను. అన్యాయంగానూ క్రూరంగానూ ప్రవర్తించిన రాజులమీద ప్రజలు తిరుగుబాటుచేస్తుండేవారు. ఒక్కొక్కప్పుడు నిరంకుశప్రభువును హత్య చేయడంకూడా కద్దు.

గ్రామపాలకపరిషత్తులకు తగినంతగా స్వపరిపాలనా హక్కులుండేవి. భూమిపన్నే ప్రధానమైన ఆదాయం. భూమిశిస్తంటే పంటలో రాజుకోసం కేటాయించబడిన భాగమని అర్థం. ఆ శిస్తు సాధారణంగా ధాన్యంలోనే చెల్లుబాటయేది. మొత్తంపంటలో ఆరవవంతు రాజభాగం. అది వ్యావసాయక నాగరికత. దానికి స్వపరిపాలనాహక్కులుగల గ్రామమే పునాది. ఆలాంటి పది, వంద గ్రామాలను ముఠాలుగా చేసి రాజకీయ ఆర్థిక నిర్మాణం నిర్మింపబడింది. తోటపని, పశుపోషణ, పాడి చాలా భారీగా ఉండేవి. తోటలు దొడ్లూ ఎక్కడపడితే అక్కడే చాలా ఎక్కువగా ఉండేవి. ఫలాలను, పువ్వులను చాలా ఆప్యాయంగా చూచేవారు. పువ్వులలో ఎన్నోరకాలుండేవి. పండ్లరకాల్లో మామిడి, అత్తి, ద్రాక్ష, అరటి, ఖర్జూరం పళ్ళను చాలా ప్రీతితో భోజనంచేసేవారు. పట్టణాల్లో కూరగాయలు, పండ్లు అమ్మే దుకాణాలు, పువ్వులదుకాణాలు చాలా ఎక్కువగా ఉండేవి. ఇప్పటిలాగే అప్పుడుకూడా భారతప్రజలకు పూలదండలంటే చాలా ఇష్టం.

ఆహారంకోసం వేటాడడం ఒక ప్రధానమైన జీవనంగా ఉండేది. మాంసాహారం చాలా వ్యాప్తంగా ఉండేది. చేపలు, కోళ్ళు, లేడి మాంసాన్ని చాలా ఆప్యాయంగా పుచ్చుకునేవారు. చేపలను పెంచే

చెరువులు, జంతువధ్యశాలలు ఉండేవి. కాని ప్రధానంగా నిత్యజీవితంలో వాడబడే పదార్థాలు వరిబియ్యం, గోధుమలు, జొన్నలు, మొక్కజొన్నలు వగైరా. చెరుకులోనుంచి పంచదారను తయారుచేసుకునేవారు. ఇప్పటిలాగే పాలు, పెరుగు, వెన్న వగైరాలంటే చాలా ప్రీతిగా భుజించేవారు. మద్యదుకాణాలుకూడా ఉండేవి. బహుశా సారాయాన్ని వరిఅన్నంలోనుంచి, పండ్లలోనుంచి, చెఱుకులోనుంచి తయారుచేసేవారనుకుంటాను.

ఆకాలంలో లోహాలగనులు, వజ్రాలగనులు బాగా ఉండేవి. బంగారం, వెండి, రాగి, ఇనుము, సీసం, తగరం, ఇత్తడి వగైరా లోహాలు ఉపయోగంలో ఉండేవి. వజ్రాలు, వైఢూర్యాలు, గోమేధికాలు, పుష్యరాగాలు మొదలైన నవరత్నాలు, మంచి ముత్యాలు కొల్లలుగా దొరికేవి. బంగారు, వెండి, రాగి నాణెములు ప్రచారంలో ఉన్నట్లు చెప్పబడింది. వ్యాపారంలో భాగస్వామ్యమూ, వడ్డీవ్యాపారమూ కూడా అమలులోనున్నట్లు కనబడుతుంది.

తయారువస్తువులలో చెప్పదగినవి పట్టుబట్టలు, ఉన్నివస్త్రాలు, దూదిగుడ్డలు, కంబళ్ళు, దుప్పట్లు, రత్నకంబళ్లు వగైరాలు. నూలు వడుకుట, నేయుట, కలంకారీ అద్దకాలు మొదలైన పరిశ్రమలు చాలా విస్తృతంగా అభివృద్ధిలో ఉండేవి. లోహపరిశ్రమ యుద్ధాలకు కావలసిన ఆయుధాలను తయారుచేసేది. గృహనిర్మాణపరిశ్రమలో రాయి, కర్ర, ఇటుకలు ఉపయోగింపబడుతూవచ్చాయి. వడ్రంగులు బళ్ళు, రథాలు, ఓడలు, మంచాలు, కుర్చీలు, బల్లలు, సొరుగులపెట్టెలు, పిల్లలకు ఆటవస్తువులు వగైరా యావత్తు కర్రసామగ్రినీ తయారుచేసేవారు. మేదరపనివాళ్ళు మంచాలు, బుట్టలు, విసనకర్రలు, సూర్యరశ్మి సోకకుండా ఉండే తడకలు వగైరా వస్తువుల నన్నిటినీ అల్లేవారు. పూవులలోనుంచి, మంచిగంధపుచెక్కలోనుంచి రకరకాల సువాసనతైలాలు వగైరా సౌందర్యదాయకమైన వస్తువులు తయారుచేయబడుతుండేవి. అనేకరకాలైన మందులు మూలికల్లోనుంచి తయారుచేస్తూ ఉండేవారు. శవాలు కుళ్ళిపోకుండా ఏదో నూనెపూతవలన కాపాడుతూఉండేవారు.

అనేకరకాలైన సామగ్రిని ఉత్పత్తిచేసే కళాకారులే కాకుండా అనేకమైన ఇతర వృత్తులుకూడా పూర్వకాలంలో అమలులోనున్నట్లు

చెప్పబడింది. ఉపాధ్యాయులు, వైద్యులు, శస్త్రచికిత్సకులు, వ్యాపారస్థులు, సంగీతవిద్వాంసులు, జ్యోతిశ్శాస్త్రపారంగతులు, కూరగాయలూ పండ్లూ అమ్మే విక్రేతలు, నటకులు, నర్తకులు, విప్రవినోదులు, సాముగరిడీలు, తోలుబొమ్మలాటగాండ్రు, చిల్లరవర్తకులు మొదలైనవారందరూ ఉన్నట్లు చెప్పబడింది.

కుటుంబాల్లో దాసదాసీవృత్తి సర్వసాధారణంగానే ఉండేది. వ్యవసాయం తదితర పనులూ కూలీలసహాయంతోనే జరుగుతుండేవి. అప్పట్లోకూడా ఛండాలురనే అస్పృశ్యులు ఉండేవారు. వాళ్ళపని ప్రధానంగా చచ్చిపోయిన జంతువుల్ని పారేయడం.

వర్తకసంఘాలు, వృత్తిసంఘాలు అప్పటికే ప్రముఖస్థానాన్ని ఆక్రమించినాయి. "కొంతవరకు ఆర్థికకారణాలవల్లను, మూలధనం సద్వినియోగంకావడానికీ, ఒకళ్ళతో ఒకళ్ళకు సన్నిహితత్వ మేర్పడడానికీ వర్తకసంఘాలకు చట్టప్రకారం ఉండవలసిన హక్కులకోసం పోరాడడానికి, భారతీయనాగరికత ప్రారంభంనుండీ ఇలాంటిసంఘాలు వుంటూనే వచ్చాయి. ఈ సంఘాలు 18వరకు ఉండేవని జాతకకథల్లో చెప్పబడింది. వడ్రంగులు, తాపీపనివారు, కమ్మరులు, చర్మకారులు– ఈ నాలుగు సంఘాలే లెక్కలోకొచ్చాయి.

పురాణాల్లోకూడా ఈ వృత్తిసంఘాలను గురించి చెప్పబడింది. 'వృత్తిసంఘాలను రక్షించడమే ఐకమత్యం' అని మహాభారతంలో చెప్పబడింది. 'ఆనాటి వర్తకసంఘాలబలం ఎంతగా ఉండేదంటే, రాజుకు కూడా వాటికి ప్రతిబంధకం కలిగించే శాసనాలనుచేసేహక్కు వుండేది కాదు. పురోహితుల తర్వాత రాజుచేత ఎక్కువగా ఆదరింపబడేవాడు ఈ వర్తకసంఘాధ్యక్షుడే.' అని ప్రొఫెసర్ వాష్‌బర్న్ హాప్‌కిన్స్ 'కేంబ్రిడ్జి ఇండియాచరిత్ర'లో వ్రాశాడు. అప్పట్లో శ్రేష్టి అని పిలువబడే వర్తకసంఘాధ్యక్షుడు (అనగా నేటి సేఠ్) సంఘంలో చాలా ప్రముఖస్థానాన్ని వహించేవాడు. జాతకకథల్లో మరొక్క విశేషం కనబడుతుంది. ఒక్కొక్క వృత్తికి సంబంధించినవారొక్కొక్క పాలెంగా కాపురాలుండడం. వెయ్యిమంది వడ్రంపనివారంతా కలసి ఒకగ్రామంగా నివసించినట్లు చెప్పబడింది. అలాగే కమ్మరులు వగైరాలు కమ్మరిపాలెంగా ఏర్పడినట్లు కనబడుతుంది. సాధారణంగా ఈలాంటి పేటలు

ఏదో ఒకనగరానికి దగ్గరగా ఉంటూఉండడంవల్ల ఆ నగరవాసులు వారు తయారుచేసిన వస్తువులన్నిటిని తీసుకొని వారు జీవించడానికి కావలసిన వస్తుసామగ్రిని వారికివ్వడం జరుగుతుండేది. బహుశా ఆ గ్రామమంతా ఒకవిధమైన సహకారపద్ధతిని గుత్తగా ఆర్డర్లు సేకరించి తమలోతాము పంపిణీజేసుకుని తయారుచేసేవారనుకుంటాను ఈలాంటి కేటాయింపు జీవనంవల్లనే కులభేదాలు పెంపొందినాయనుకోవడం కూడా అసహజం కాదు. బ్రాహ్మణులు, ఇతర అగ్రవర్ణములవారిపద్ధతినే ఈ ఉత్పత్తి వ్యాపారసంఘములవారు కూడా క్రమంగా అనుకరించారు.

ఉత్తరహిందూస్థానములో విశాలమైన రహదారులు ముఖ్య పట్టణాలను కలుపుతుండేవి. దారిలో ప్రయాణీకుల విశ్రాంతికొరకు సత్రములు, చావడులు, వైద్యసౌకర్యములు కూడా ఉండేవి.

దేశంలోనే కాకుండా దేశాంతరాల్లో కూడా భారతీయుల వ్యాపారం జోరుగా సాగుతుండేది. క్రీ. పూ. 500 సంవత్సరాలక్రిందట ఈజిప్టుదేశంలో 'మెంగిస్' అనేచోట భారతీయవ్యాపారస్థు లుండినట్లు ఇటీవల కనిపెట్టబడింది. బహుశా ఆగ్నేయాసియా దేశాల్లో కూడా భారతీయులవ్యాపారం బాగానే సాగుతూఉండిఉండాలి. విదేశీయ వ్యాపారం సాగాలంటే ఓడలుండాలి. భారతదేశంలో నదులలో ప్రయాణంచేసే పడవలు, కోస్తావ్యాపారానికి కావలసిన ఓడలుకూడా తయారయ్యేవి. విదేశాలనుంచివచ్చిన వ్యాపారస్థులు ఓడసుంకాలు కట్టినట్లుగాకూడా మన పురాణాల్లో గ్రంథస్థమైంది. జాతకకథల్లో వ్యాపారస్థుల విదేశయాత్రలనుగురించి ఎన్నో ఉదంతాలు కనబడుతున్నాయి. నేలమీద పశ్చిమదిశగా బ్రోచ్ రేవువరకూ ఎడారులగుండా ఒంటెల బాటలు సాగినట్లు కథలున్నాయి ఉత్తరానికి గాంధారదేశం మీదుగా మధ్యఏషియావరకు నాటుప్రయాణాలు సాగేవి. బ్రోచ్ రేవుపట్టణం నుంచి పర్షియన్‌సింధుశాఖకు ఓడలుసాగి బాబిలన్‌కు చేరేవి. నదులలో కూడా ఓడలు ధారాళంగానడిచేవి. గంగానదిమీదనున్న కాశీ, పాట్నా చంపా (భాగల్పూరు) పట్టణాలనుంచి సముద్రంలోకి ఓడలు పయనించి అక్కడనుండి దక్షిణతీరపురేవులకు సిలోన్, మలయాదేశాలకుచేరుతూ ఉండేవని జాతకకథలలో చెప్పబడిఉంది. కావేరినదిమీద కావేరిపట్నం అనేఊరు అంతర్జాతీయవ్యాపారకేంద్రంగావుండి ఐశ్వర్యంతో తుల

తూగుతూ ఉండేదని పాత తమిళకావ్యాలలో చెప్పబడింది. జాతక కథల్లో ఈ ఓడల్లో వందలకొద్దీ వర్తకులు పయనించినట్లు చెప్పబడడం చేత, ఆ ఓడలు బాగా పెద్దవనే అనుకోవాలి.

ఓడలయజమాని నిరంతరం వసూలుచేస్తూఉండే కేవులతో ధనికుడై సముద్రాలమీద స్వేచ్ఛగా సంచారంచేస్తూ వంగ, తక్కోల, చీనా, సౌవీర, సూరత్, అలెగ్జాండ్రియా, కోరమాండల్ తీరం లేక ఓడలుచేరే మరేరేవుపట్టణానికైనా పోగలిగి''నట్లు మిలాందలో చెప్ప బడింది. క్రీ. పూ. ఒక శకాబ్దానికిపూర్వం గ్రీకు దేశపు బాక్ట్రియన్ రాజు ఉత్తరహిందూదేశాన్ని పాలించాడు. తరువాత ఆయన బౌద్ధ మతావలంబియైనాడు.

హిందూదేశంనుంచి దేశాంతరాలకు వెడుతుండిన ఎగుమతులు, పట్టుబట్టలు, మజ్లినులు, సన్నని నూలుబట్టలు, కత్తి-కఠారులు, జరీ పనిచేసిన బట్టలు, లతలు తీగెలు వగైరా అలంకారాలు చేయ బడిన బట్టలు, కంబళ్ళు, సువాసనద్రవ్యాలు, మూలికలు, దంతము, దానితో చేసిన వస్తువులు, బంగారం, బంగారువస్తువులు ముఖ్యమైనవి. వర్తకులు ఈ సరుకుల్లోనే జోరుగా వ్యాపారం చేస్తుండేవారు.

హిందూదేశం, ముఖ్యంగా ఉత్తరహిందూస్థానం ఆయుధాలను తయారుచేయడంలో మంచి ఖ్యాతిని సంపాదించింది. ఉక్కు గట్టిత నానికీ కత్తి-కఠారుల పనితనానికీ బాగా పేరుపొందింది. క్రీ. పూ. 500 సంవత్సరాలక్రిందట భారతీయసేనలు — కాల్బలం, అశ్వికదళం చాలామంది పర్షియన్ సేనలతో కలసి గ్రీసుదేశం వెళ్ళేయి. అలెగ్జాం డరు పర్షియామీద దండయాత్ర సాగించినపుడు కత్తులు ఖడ్గాలు తొందరగా హిందూదేశంనుంచి తెప్పించాడని ఫిరదౌసీ వ్రాసిన షానామా అనే మహా పద్యకావ్యంలో వ్రాయబడింది. ఖడ్గం అనే మాటకు పాత అరబిక్ మాట 'ముహన్నద్' అనగా హిందూదేశంనుంచి తేబడి నది అని అర్థం. ఈమాట ఇప్పటికీ వాడుకలో ఉన్నది.

పురాతనభారతదేశంలో ఇనుము ఉక్కు వగైరాలను తయారు చేయడంలో చాలా కృషి జరిగినట్లు కనబడుతుంది. ఢిల్లీకి దగ్గ రలో ఒక మహత్తరమైన ఇనుపస్తంభం ఉన్నది. ఎండకెండి వానకు తడిసినా, ఎన్నిసంవత్సరాలనుంచో పిసరంతైనా తుప్పుపట్టకుండా అది

అల్లాగే నిలబడుండడం చాలామంది విజ్ఞానశాస్త్రవేత్తల కాశ్చర్యంగా ఉన్నది. దానిమీద వ్రాయబడిన విషయం గుప్తులలిపిలో ఉంది. క్రీస్తు అనంతరం నాల్గవశతాబ్దంనుంచి ఏడవశతాబ్దం వరకూ ఈ లిపి అమలులో ఉండినది. అసలు అంతకుముందే ఆ స్తంభం అలా ఉందనీ ఆ వ్రాతలన్నీ తదుపరి వ్రాయబడ్డాయనీ కొందరు పండితుల అభిప్రాయం.

క్రీ. పూ. నాల్గవ శతాబ్దంలో అలెగ్జాండరు హిందూదేశముపైకి దండెత్తిరావడం సైనికదృష్ట్యా చాలా చిన్నవిషయమే. అది సరిహద్దుల మీద చిన్న దాడిమాత్రమే. దానివలన ఆయనకూ అంతప్రయోజనం కలుగలేదు. సరిహద్దుప్రాంతంలోని ఒక సేనాని ఆయనను బలంగా ఎదుర్కోవడంవలన భారతదేశంయొక్క హృదయస్థానంమీద దండెత్తాలనుకున్న అలెగ్జాండరు, కాస్తంత నిదానించి పునరాలోచనచేయవలసినస్థితిలోపడ్డాడు. సరిహద్దులో ఉన్న ఒక చిన్న సేనానే అంతబలంగా ఎదుర్కొనినప్పుడు, దక్షిణానికెళ్ళినకొద్దీ ఎన్నో పేరెక్కినరాజ్యాలున్నప్పుడు ఏమైపోతామో అనేసందేహంలోపడ్డాడు. బహుశా ఆకారణం చేతనే ఆయనసేనలు వెనుకకు తిరిగిపోవాలని తొందరపడ్డాయి.

అలెగ్జాండరు తన దేశానికి తిరిగివెళ్ళి అక్కడ మరణించాడు. ఆ పిమ్మట సెల్యూకస్ భారతదేశంమీదదండెత్తివచ్చినప్పుడు భారతసేనల శక్తిని చవిచూచాడు. చంద్రగుప్తుడు అతనినోడించి వెనుకకుతరిమివేశాడు. ఆకాలపు భారతసైన్యంయొక్క బలవిశేషం యుద్ధానికి తయారైనగజబలం. ఈకాలపు టాంకులతో వాటిని పోల్చవచ్చును. సెల్యూకస్ హిందూదేశంనుంచి ఇటువంటి ఏనుగులను 500 తనతో తీసుకొనిపోయి ఏషియామైనరులో క్రీ. పూ. 302 సంవత్సరంలో 'ఏంటిగోనస్' మీద చేసిన యుద్ధంలో ఉపయోగించుకున్నాడు. సైనికచరిత్రకారుల అభిప్రాయం ప్రకారం ఆ ఏనుగులవల్లనే సెల్యూకస్ జయించాడు. ఏంటిగోనస్ మరణించాడు. అతని కుమారుడు డిమిట్రియస్ పరారియైనాడు.

ఏనుగులను గుర్రాలను పెంచడం, వాటిని యుద్ధాలకు ఆయత్తపరచడం వీటన్నిటిమీదా పుస్తకాలుండేవి. వాటికి శాస్త్రాలని పేరు. శాస్త్రాలంటే దైవదత్తమైన జ్ఞానమని అర్థం. కాని గణితం మొదలుకొని నృత్యంవరకూ అన్నివిధాలైన వైజ్ఞానిక విశేషాలకూ శాస్త్రాలనేపేరు

పెట్టేరు. నిజానికి మతసంబంధమైన విజ్ఞానానికీ, లౌకిక విజ్ఞానానికీ మధ్య నిర్దిష్టమైన సరిహద్దు లేదు. అవి ఒక దానిలో ఒకటి కలిసిపోయాయి. బ్రతుకుకు తెరువైన ప్రతి విషయాన్ని గురించీ విమర్శజరిగింది.

హిందూదేశంలో వ్రాత చాలా పురాతనకాలంలోనే ప్రారంభమైంది. పాతకాలంనాటి పింగాణీమీద బ్రాహ్మీలిపిలో అక్షరాలు వ్రాయబడ్డాయి. మహెంజోదారోనాటి లిపి ఇంకా పూర్తిగా విడగొట్టబడనేలేదు. భారతదేశమంతటా కనబడే ఈ బ్రాహ్మీలిపిలోనుంచే నిస్సందేహంగా దేవనాగరి వగైరా లిపులన్నీ పుట్టినాయి. అశోకుని శాసనాలు బ్రాహ్మీలిపిలోనే వ్రాయబడ్డాయి. పశ్చిమోత్తరంలో భారతదేశంలో కనబడే శాసనాలు ఖరోష్టిలిపిలో ఉన్నాయి.

క్రీ. పూ. 6, 7 శతాబ్దాలలో సంస్కృతభాషకు పాణిని వ్యాకరణాన్ని రచించాడు. అప్పటికే కొన్ని వ్యాకరణగ్రంథాలున్నట్లు పాణిని [illegible]శాడు. అప్పటికప్పుడే సంస్కృతభాష నిరంతరాభివృద్ధి పొందుతూ చక్కని సాహిత్యాన్ని సృష్టించింది. పాణిని వ్యాకరణం కేవలం వ్యాకరణం మాత్రమే కాదు. 'మానవుని మేదస్సు సృష్టించగలిగిన గొప్ప విషయములలో శ్రేష్టమైనది' పాణిని వ్యాకరణమని సోవియట్ పండితుడు 'చర్‌బస్కీ' వర్ణించాడు. ఈనాటికీ పాణినిని మించిన సంస్కృత వ్యాకరణం మరొకటి లేదు. తరువాతి వ్యాకరణ పండితులు కొంతకలిపి కొన్నివ్యాఖ్యానాలు రచించినా దాని నతిక్రమించగలిగినవారు లేరు. పాణిని గ్రీకులిపినిగురించి తన గ్రంథంలో ఉదహరించడం ఆశ్చర్యమే. అనగా భారతదేశానికీ గ్రీసుదేశానికీ అలెగ్జాండరుకు పూర్వమే కొంత సన్నిహితత్వం ఉన్నదనుకోవాలి.

ఆకాలంలో ఖగోళశాస్త్రమును ప్రత్యేకంగా అభ్యాసం చేస్తూ ఉండేవారు. సాధారణంగా ఖగోళశాస్త్రం జ్యోతిషశాస్త్రంలో మిళితమైపోయేది. వైద్యవిద్యాభ్యాసానికి పాఠ్యగ్రంథాలు, వైద్యశాలలు ఉండేవి. భారతీయ వైద్యశాస్త్రమైన ఆయుర్వేదానికి అధిష్టాన దేవత ధన్వంతరి. ఆ వైద్యగ్రంథాలలో విశేషంగా చెప్పుకోతగిన కొన్ని గ్రంథాలు క్రీస్తుశకాదిలోనే ప్రచారంలో ఉన్నాయి. వైద్యగ్రంథాన్ని రచించినది చరకుడు. శస్త్రచికిత్సమీద గ్రంథాన్ని రచించిన వాడు శుశ్రుతుడు. పశ్చిమోత్తర భారతదేశాన్ని పాలించిన కని

ష్కుని ఆస్థానవైద్యుడు చరకుడు. ఆయన వ్రాసిన గ్రంథంలో ఎన్నో విధాలైన జబ్బులను గురించి, వాటినిదానం కనిపెట్టి చికిత్సచేసే విధానాన్ని గురించీ విపులముగా వ్రాశాడు. శస్త్రచికిత్స, ప్రసవసమయ వైద్యము, స్నానాదిక్రమము, పథ్యపానాలు, ఆరోగ్యజీవనవిధి, శిశుపోషణ, వైద్యవిద్య అన్నీ ఆ గ్రంథంలో ఉన్నాయి. ప్రత్యక్ష పరిశోధనలతోనూ ప్రయోగాలసహాయంతోనూ వైద్యవిద్యాభ్యాసం జరుగుతుండేది. శస్త్రచికిత్సాభ్యాసంలో శవాలను కోసి పరీక్షించినట్లుకూడా కనబడుతుంది. శుశ్రుతంలో శస్త్రచికిత్స కుపయోగపడే అనేక పనిముట్లు పేర్కొనబడ్డాయి. దుష్టాంగఖండనం, ఉదరానికి సంబంధించిన శస్త్రచికిత్స, కడుపుకోసి బిడ్డను బయటికితీయడం, కనుపొరలుకోయడం మొదలైన శస్త్రచికిత్సలు పేర్కొనబడ్డాయి. పుండ్లను క్రిమిరహితంచేయడానికి ధూపాలు వేసేవారు. క్రీ. పూ. 3, 4 శతాబ్దాలలో పశువులరోగాలకు కూడా చికిత్సాలయాలుండేవి. బహుశా జైన, బౌద్ధమతాల్లో అహింసకు ఎక్కువ ప్రాధాన్యత ఉండడం ఇందుకు హేతువు కావచ్చును.

గణితశాస్త్రంలో మన పూర్వీకులైన భారతీయులు సున్నను, దశాంశపద్ధతిని, మైనస్ చిహ్నాన్ని, ఇంతింతని చెప్పడాని కలవిగాని పదార్థాన్ని కొలువడానికి అక్షరాల నుపయోగించడం మొదలైన అపూర్వ విషయాలను ఎన్నిటినో కనిపెట్టేరు. వీటిని కనిపెట్టిన కాలం ఇదమిత్థమని చెప్పడం చాలా కష్టం. ఏమంటే వాటిని కనుగొన్న చాలాకాలానికి అవి ఉపయోగంలోకి వచ్చాయి. మధ్య కొంతకాలం ఖాళీ ఉన్నది. ఏమైనా, అంకెల గణితం, బీజగణితం (ఆల్జీబ్రా) రేఖాగణితం (జామెట్రీ) చాలా పూర్వకాలంనుంచీ భారతదేశంలో వ్యాప్తమైయున్నమాట నిశ్చయం. ఋగ్వేదకాలంనాటికే లెక్కకు పది ప్రాతిపదికైనది. కాలమానములోనూ గణనమానమునందునూ పురాతన భారతీయులప్రజ్ఞ అసాధారణమని చెప్పక తప్పదు. పెద్ద పెద్ద అంకెలకు ప్రత్యేకమైన పేర్లు వారి కుండేవి. అనగా పదులు, వందలు, వేలు, పదివేలు, లక్ష, కోటి, పదికోట్లు, అర్బుదం ఇత్యాదిపేర్లు. గ్రీకులకు, రోమనులకు, పర్షియనులకు, అరబ్బులకు వెయ్యికి లేక పదివేలకు మించిన సంఖ్యామాన ముండేదికాదు.

భారతదేశంలో 18 అంకెలవరకూ ప్రత్యేకపు పేర్లున్నాయి. బుద్ధుడు విద్యాభ్యాసంచేసేకాలంలో ఆయన 50 అంకెలవరకూ నోటబట్టాడని చెపుతుంటారు.

ఇక కాలంవిషయంలోకూడా చాలా చిన్నచిన్న భాగాలను భారతీయు లెరుగుదురు. ఆఖరుభాగం సెకండులో 17వ వంతు. పొడుగు కొలవాలసినప్పుడు చిన్న యూనిట్ 1/.37×7/10 అంగుళాలు. చిన్నవీ పెద్దవీ అయిన ఈ అంకెలన్నీ కేవలం వేదాంతపరంగానే ఉపయోగింపబడ్డాయి. ఏదెల్లాఉన్నా, ఇతరదేశాలలోవలెకాకుండా భారతీయులకు కాలము జాగా ఈ రెంటియొక్క స్పృహ చాలా ఉన్నది. వాళ్ళు చాలా హుందాగా భారీఎత్తున ఆలోచించేవారు. భారతీయ పురాణేతిహాసాలు లక్షలూ కోట్లూ సంవత్సరాలకుపూర్వం జరిగిన జ్ఞానచరిత్రయే. నవీనభూగర్భశాస్త్రపరిశోధనలలో పేర్కొనబడుతూ ఉండే కాలమానాలుకాని ఖగోళశాస్త్రంలో నక్షత్రాలకూ నక్షత్రాలకూ మధ్యఉండే వేలూ లక్షలూమైళ్ళ దూరాలు కాని పూర్వీకులకేమీ ఆశ్చర్యంగా కనబడవు. కనుకనే డార్విన్‌సిద్ధాంతంలాంటి సిద్ధాంతాలు యూరోపుప్రజల్లోలాగున భారతప్రజల నంతగా కలవరపరచవు. యూరోపులోని ప్రజాసామాన్యంయొక్కబుద్ధి కాలమానంలో వెయ్యి సంవత్సరాలకు మించిపోలేదు.

ఉత్తరభారతదేశంలో క్రీ. పూ. 400 ఏండ్లక్రితం అమలులో ఉండిన తూనికలు, కొలతలు అర్థశాస్త్రంలో వివరింపబడినాయి. అంగడులలో తూనికలపైన, కొలతలపైన ప్రభుత్వం చాలా పరిశీలనచేస్తూ ఉండేది.

పురాణాల్లో తరుచుగా అడవులలో నిర్వహింపబడుతుండే విశ్వవిద్యాలయాల ప్రస్తావన కనబడుతుంది. ఏ నగరానికో పట్టణానికో దగ్గరిలోనున్న అడవిలో సైనికశిక్షణ మొదలు సర్వశాస్త్రాలూనేర్పే విశ్వవిద్యాలయాలుండేవి. ప్రఖ్యాతిచెందిన పండితుల సమక్షాన్న, వివిధ ప్రాంతాలనుండి వచ్చిన విద్యార్థులు శాస్త్రాభ్యాసంచేస్తూండేవారు. విద్యార్థులు నగరాలలోని విలాసాలకు లోబడకుండా, ఎక్కువ శ్రద్ధాసక్తులతో శాస్త్రాభ్యాసంచేయడానికీ, శిక్షణతోకూడిన జీవితాన్ని అలవాటుచేసుకోవడానికి వీలుగా అడవులలో ఈ విశ్వవిద్యాలయాలు

నిర్వహింపబడుతూ ఉండేవి. ఆలాంటి విశ్వవిద్యాలయాల్లో ప్రముఖులైన గురువులదగ్గర శిక్షణపొందిన తర్వాత విద్యార్థులు స్నాతకులై తమతమ స్థానాలకుపోయి పౌరధర్మాలను, గృహస్థధర్మాలను నిర్వహించేవారు. ఈ వనవిద్యాలయాలు చిన్నచిన్నవిగా ఉండేవనుకోవాలి. ప్రజ్ఞావంతుడైన ఆచార్యునిదగ్గర ఎక్కువమంది చేరేవారు.

కాశీ ఎప్పుడూ మహావిజ్ఞానకేంద్రమే. బుద్ధునికాలంలోకూడా ఆ పట్టణానికి అదే ప్రఖ్యాతి. బుద్ధుడు కాశీదగ్గర 'హరిణవనం'లోనే తన ప్రథమసందేశాన్నిచ్చాడు. అప్పట్లో ఇతర విశ్వవిద్యాలయాలులాగున కాశీలో విశ్వవిద్యాలయం ఉండేదికాదు. ఒక ఆచార్యునిచుట్టూ చేరి కొందరు శిష్యులు శాస్త్రాభ్యాసంచేస్తూ ఉండేవారు. అందులో పరస్పర మతభేదాలుకూడా ఉండేవి. వారిలో వారికి తీవ్రమైన వాదోపవాదాలు జరుగుతుండేవి.

పశ్చిమోత్తరమున నేటి పెషావర్‌ప్రాంతములో తక్షశిల అనేచోట పురాతనమైన విశ్వవిద్యాలయం చాలా ప్రఖ్యాతిగాంచినది. ముఖ్యంగా విజ్ఞానశాస్త్రములకును, వైద్యశాస్త్రమునకు, కళలకును, అది ప్రశస్తిపొందినది. భారతదేశమంతటనుంచి అక్కడకు విద్యార్థులు చేరుతుండేవారు. జాతకకథలలో, మహారాజుబిడ్డలు, పండితోత్తములైన బ్రాహ్మణవిద్యార్థులు ఒంటరిగా నిరాయుధులై, విద్యాభ్యాసంకొరకు తక్షశిలకు పాదచారులై వెళ్ళినఉదంతాలెన్నో ఉన్నాయి. బహుశా ఆఫ్ఘనిస్థానంనుంచీ, మధ్య ఏషియానుంచీ కూడా విద్యార్థులు వస్తూ ఉండేవారు. దాని ఉనికి ఆలాంటి సావకాశాన్ని ఇచ్చింది. తక్షశిల విశ్వవిద్యాలయస్నాతకుడంటే గొప్పవిలువ, గౌరవం ఉండేవి. తక్షశిలలో వైద్యశాస్త్రం చదువుకున్నవారికి గొప్పవిలువఉండేది. బుద్ధభగవానునికెప్పుడు అనారోగ్యం కలిగినా, తక్షశిల భిషగ్వరుడే చికిత్సచేస్తూ ఉండేవాడని చెప్పబడింది. ప్రఖ్యాత వ్యాకరణశాస్త్రజ్ఞుడు పాణిని కూడా ఆ విశ్వవిద్యాలయంలో చదువుకున్నవాడేనని చెపుతారు.

తక్షశిల బౌద్ధయుగానికి పూర్వమే యుండిన విశ్వవిద్యాలయము. దానిని బ్రాహ్మణవిజ్ఞానపీఠమనే చెప్పాలి. బౌద్ధయుగంలో అది బౌద్ధవిజ్ఞానపీఠమై, దేశదేశాలనుండి బౌద్ధపండితులను ఆకర్షించింది. మౌర్యసామ్రాజ్యంలోని పశ్చిమోత్తరరాష్ట్రమున కది ముఖ్యపట్టణం.

గ్రాని కాదిపండితుడైన మనువు సిద్ధాంతం ప్రకారం, ప్రకారం ఏవిధమైన హక్కులులేవు. స్త్రీగతి చాలాఅధ్వాన్న ప్రలి. తండ్రిమీదనో, భర్తమీదనో, కుమారుడిమీదనో ఎడి ఆమె జీవించాలి. చట్టప్రకారం వాళ్ళు కేవలం మగవారికి ఎవలసిన వస్తువులుగానే భావింపబడేవారు. కాని పురాణాల్లోని అనేక థలు చూస్తే ఈ ధర్మాన్ని అమలుజరిపినట్లు కనబడదు. ఇంటిలోనూ సంఘంలోనూ వారికెంతో గౌరవప్రదమైన స్థానం ఉండేది. ధర్మశాస్త్ర నిర్మాతయైన మనువు ఎక్కడ స్త్రీలు గౌరవింపబడతారో అక్కడ దేవతలు నివసిస్తుంటారు అన్నాడు. తక్షశిల విశ్వవిద్యాలయంలో స్త్రీలు స్నాతకులైనట్లు కనబడదు. కాని ఎక్కడో వారికి శాస్త్రాభ్యాసానికి సౌకర్యాలు ఉండిఉండాలి. ఏమంటే పాండిత్యప్రతిభగల స్త్రీలను గురించిన ఉదంతాలెన్నో ఉన్నాయి. తర్వాతకాలంలోకూడ పండితులైన స్త్రీలు కనబడుతున్నారు. ఈకాలాన్నిబట్టి చూస్తే ఆకాలంలో ధర్మశాస్త్రరీత్యా స్త్రీలకున్న హక్కులు హీనంగానే కనబడుతాయి కాని, పూర్వకాలపు గ్రీసు, రోము దేశాలలోకన్నా క్రైస్తవయుగ ప్రారంభంలోకన్నా, ఆఖరుకు 19వ శతాబ్దప్రారంభంలో కన్నా కూడా ఆనాటిస్త్రీల హక్కులు మేలుగా ఉన్నాయి.

మనువు తర్వాతవారైన న్యాయశాస్త్రవేత్తలు వర్తకవ్యాపారములలో భాగస్వామ్యాన్నిగురించి వివరించారు. యాజ్ఞవల్క్యుడు వర్తకంలోనూ, వ్యవసాయంలోనూ ఉండే హక్కులను విపులీకరించాడు తరువాతవాడైన నారదుడు, 'లాభనష్టాలను ఖర్చులను భాగస్వాములు తమ పెట్టుబడి దామాషాప్రకారమే భరించాలి. నిల్వ, ఆహారమూ, ఖర్చులూ, పన్నులు, రవాణాచార్జీలు, మొదలైన వ్యాపారపు ఖర్చులను నిర్ణయంప్రకారం భాగస్వాములు భరించాలి' అని వ్రాశాడు.

మనువు అభిప్రాయంలో రాష్ట్రమంటే చిన్నరాజ్యం. ఈ అభిప్రాయం కాలానుసారంగా పరిణామంచెంది చివరకు క్రీ. పూ. నాల్గవ శతాబ్దంనాటికి మౌర్యసామ్రాజ్యమైంది. ఆపిమ్మట అది బాగా విస్తరించి దేశాంతరాలతో సంబంధంకూడా కలిగించుకుంది.

క్రీ. పూ. నాల్గవశతాబ్దంలో ఇండియాకొచ్చిన గ్రీకు రాయబారి మెగస్థనీస్ భారతదేశంలో దాస్యవృత్తి లేదని వ్రాశాడు. ఈ విష

యంలో అతను వ్రాసినది సరికాదు. ఆకాలపు ప్ర
కృత్యంలో దాసదాసీజనం ఉన్నట్లూ, వాళ్ళస్థితిగతుల
డానికి ప్రయత్నాలు చేసినట్లున్నూ దాఖలాలున్నాయి.
ఎత్తున, ఇతరదేశాల్లో ఉన్నట్లుగా, కూలినాలిజనంలో నిర్బంధ
ఉండేదికాదు. అందుచేతనే మెగస్థనీస్ దాస్యం పూర్తిగానే
కున్నాడు. 'ఆర్యుని దాస్యవృత్తిలో ఉంచకూడదు' అని చెప్పబడిం
ఎవడార్యుడో, ఎవడనార్యుడో చెప్పడంకష్టం. కాని స్థూలంగా ఆలోచిస్తే
ఆకాలంలో ఆర్యులంటే బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్రులనబడిన
నాల్గుజాతులవారనే అర్థం. అస్పృశ్యులు ఆ వర్గంలో చేరరు.

చైనాలోకూడా హాన్‌వంశీయులకాలంలో కేవలం గృహకృ
త్యానికి మాత్రమే దాసదాసీజనాన్ని ఉపయోగించేవారు. వ్యవసా
సాయపుపనుల్లోగాని భారీగా జరిగే కూలీ వ్యవహారంలోగాని వారి
పని అంతగా ఉండేదికాదు. ఇండియాలోనూ చైనాలోనూగూడా ఇంటి
పట్టున ఉండే ఈ దాసదాసీజనం సంఖ్య చాలా తక్కువ. ఆనాటి
రోమన్ గ్రీకుదేశాలకు ఇండియా, చైనాదేశాలకు ఈ ముఖ్య విష
యంలో సహస్రాంశం తేడా ఉన్నది.

ఆకాలంలో భారతీయులెల్లా ఉండేవారు? ఇంతకాలమైనాక,
వాళ్ళకూ మనకూ ఎంతో తారతమ్య మేర్పడిన పిమ్మట, వా రిలా
ఉంటారని ఊహించుకోవడం చాలా కష్టమే. కాని మనకు తెలిసిన
రకరకాల భోగట్టావలన లీలగా మనకంటికొక స్వరూపం కనబడుతుంది.
వారొకవిధంగా ఆషామాషీగా కాలక్షేపంచేసేవారు. తమ సాంప్రదా
యాలకు గర్వపడేవారు. నిగూఢమైన బ్రహ్మపదార్థాన్ని నిరంతరం
అన్వేషిస్తూ ఉండేవారు. ప్రకృతినిగురించి, మానవజీవిత పరమావధిని
గురించి ఎప్పుడూ పృచ్ఛచేసుకుంటూ ఉండేవారు. తామేర్పరచుకున్న
ప్రమాణాలను, విలువలను గౌరవించేవారు. ఇంతైనా జీవితాన్ని
సుఖంగా ఆనందంగా అనుభవించారు. ఏమీ నదురూబెదురూ లేకుండా
కులాసాగా మృత్యువు నెదుర్కొనేవారు. అలెగ్జాండరు ఉత్తరదేశ
దండయాత్రలో అతనికూడా వచ్చిన గ్రీక్ చరిత్రకారుడు 'అరేన్'
చీకూచింతా లేకుండా కులాసాగా కాలక్షేపంచేస్తున్న భారతజాతిని

పోయాడు. "భారతీయులులాగున నృత్య గీతాలంటే ప్రేమ గల జాతి మరొకటి లేదు" అని ఆయన వ్రాశాడు.

## ౧౬ మహావీరుడు - బుద్ధుడు - వర్ణము

పురాణయుగంనుంచి బౌద్ధయుగ ప్రారంభదశవరకూ, అలాంటి ఆనందమయజీవనమే ఉండేది. రాజకీయంగానూ, ఆర్థికంగానూ ఎప్పటి కప్పుడే మార్పులు కలుగుతుండేవి. ఈ మార్పుల్లోనే ఒకప్రక్కనుంచి కలయిక, మరొకప్రక్కనుంచి వృత్తులవారీగా విభజన జరుగడం ప్రారంభమైంది. భావప్రపంచంలో నిరంతరాభివృద్ధి, దాని వెనువెంటనే సంఘర్షణ రెండూ కనబడేవి. ఉపనిషత్తుల వెనువెంటనే అనేకవిధాలైన ఆలోచనలు, పనులు, ప్రారంభమైనాయి. ఉపనిషత్తులే కర్మకాండల మీద పురోహితులమీద తిరుగుబాటని చెప్పాలి. వాళ్ళకళ్ళముందర జరిగే అనేకవిషయాలపై మానవులబుద్ధి తిరుగుబాటు చేసింది, తత్ఫలితంగానే ఉపనిషత్తులు జన్మించి వృద్ధిగాంచినాయి. తర్వాత కొంతకాలానికి అధిభౌతికవాదం, జైనమతం, బౌద్ధమతం వగైరాలుత్పన్నమైనాయి. వివిధములైన మతాలను సమన్వయపరచడానికి యత్నించింది భగవద్గీత. వీటన్నిటినుంచే భారతవేదాంతంలోని ఆరువిధానాలు పుట్టినాయి. ఈ విధమైన మానసికసంక్షోభం విప్లవం ఎంతగా ఉన్నప్పటికీ, నిరంతరం, జాతీయజీవితం వృద్ధిఅవుతున్నట్లు సుస్పష్టంగా కనబడుతుంది.

జైనమతం, బౌద్ధమతం కూడా వైదికమతంయొక్క బదనికలే. ఒకవిధంగా అందులోనుంచే ఉత్పన్నమైనాయి. వేదాలు ప్రమాణమని ఈ మతాలు అంగీకరించవు. అంతకన్నా ముఖ్యమేమంటే, ప్రపంచానికంతకూ ఆదికారణ మొకటున్నదని వారంగీకరించరు. ఆ విషయమేమీ మాట్లాడరు. రెండుమతాలవారూ కూడా అహింసాసిద్ధాంతాన్నే ప్రధానంగా పేర్కొంటారు. బ్రహ్మచారులైనసన్యాసులతోనూ మతప్రచారకులతోనూ తమతమ మతసంస్థలను కట్టుదిట్టంచేస్తారు. వారి దృక్పథంలో ఒకవిధమైన హేతువాదమూ ప్రత్యక్షప్రమాణమూ ఉన్నది. కాని అగోచరమైన ప్రపంచంతో వ్యవహరించవలసినప్పుడే హేతువాదం అంతగా ఉపయోగపడదు. జైనమతంలోని ఒక ముఖ్య సిద్ధాంతం సత్య మనగా మనదృక్పథాన్ని అనుసరించి మారుతుండే

ప్రమాణమని చెపుతుంది. సన్యాసాన్ని ప్రత్యేకంగా ప్రః
చాలా కఠినమైన జీవితవిధానాన్ని శాసిస్తుంది.

జైనమతస్థాపనాచార్యుడైన మహావీరుడున్నూ, బుద్ధ సమకాలికులు. ఉభయులూ వీరులైన క్షాత్రవంశమందు జన్మిం బుద్ధుడు క్రీ. పూ. 544 సంవత్సరాలక్రిందట 80వ ఏట సిద్ధిపొందె అప్పటినుంచి బౌద్ధశకం ప్రారంభమైంది.

అనగా వైశాఖపూర్ణిమనాడు-బౌద్ధుల సంవత్సరాదినాడు నేనీ విషయాన్ని గురించి వ్రాయడం ప్రారంభించడం తలవనితలంపుగా జరిగిన చిత్రమైన సంఘటన. బౌద్ధసాహిత్యంలో బుద్ధుడు వైశాఖపూర్ణిమ నాడే జన్మించాడనీ, వైశాఖపూర్ణిమనాడే దేహాన్నిత్యజించి నిర్వాణం పొందేడనీ చెప్పబడింది.

సర్వజనాంగీకారమైన మతాలను ఖండించిన ధైర్యం బుద్ధుడిది. ఆయన ఛాందసాచారాలను, మూఢనమ్మకాలను, మంత్రతంత్రాలను మతాచార్యులపద్ధతులను ఖండించాడు. కేవలం ఆధ్యాత్మికదృక్పథం పనికిరాదన్నాడు. మానవాతీతమైన అద్భుతచర్యలు, దేవతలు ప్రత్యక్షమై ఉపదేశాలుచేయడం, భగవంతునితో సంప్రదించడం వగైరా నమ్మకాలను బుద్ధుడు ఖండించాడు. ఆయన ఎంతవరకూ హేతువాదం మీద, అనుభవంమీద ఆధారపడి తన సిద్ధాంతాలను ప్రతిపాదించాడు. నైతికప్రవర్తనకు ప్రాధాన్యత నిచ్చాడు. మానసికతత్త్వశాస్త్ర రీత్యా అన్ని విషయాలను పరిచ్ఛేదంచేసి విషయనిర్ధారణచేసే విధానం బుద్ధునిది. కేవలం ఆధ్యాత్మికతత్త్వవిమర్శలోబడి జనం విసుగుజెందిన రోజులలో ఆయనసిద్ధాంతం కొండలమీదనుంచి వీచిన పిల్లవాయువు వలె హాయినిచ్చింది.

బుద్ధుడు వర్ణవ్యవస్థను సూటిగా విమర్శించలేదు. కాని ఆయన మతంలో వర్ణవిభేదాలను పాటించలేదు. ఆయన ప్రబోధంవలన వర్ణవ్యవస్థ బలహీనమైపోయిందని చెప్పకతప్పదు. ఆయనకాలంలోనూ తర్వాత కొంతకాలంవరకూ కూడా ఈవర్ణవ్యవస్థ అంతగా ఘనీభవించలేదనుకోవాలి. వర్ణవిభేదాలు అంత కరుడుకట్టుకుపోయిన యెడల బహుశా అప్పట్లోజరిగినంత విదేశవర్తకవ్యాపారము సాగివుండేదికాదు. బుద్ధుని అనంతరం 1500 ఏండ్లవరకూ ఇతర పరిసర దేశాలతో భారత

దేశం జోరుగా వ్యాపారాన్ని జరుపుతూనే వచ్చింది. భారత వలస రాజ్యాలు మంచి వృద్ధిలో ఉండేవి. పశ్చిమోత్తరప్రాంతంగుండా విదేశీయులెందరో ఇండియాకు వచ్చి క్రమంగా ఇక్కడే ఉండిపోయి ప్రజలతో కలసిపోయారు.

ఈ కలయికపద్ధతి చూస్తే చాలా చిత్రంగా ఉంటుంది. క్రింద శ్రేణిలో కొత్తకులాలుత్పన్నమైనాయి. పైనుంచి వచ్చి విజేతలైనవారు క్షత్రియకులంలో కలసిపోయేవారు. క్రీస్తుశకానికి కొద్దికాలం ముందూ వెనుకా తయారుచేయబడిన నాణేలను పరిశీలిస్తే, రెండుమూడు తరాల్లోనే త్వరితమైన మార్పులు సంభవించాయని నిర్ధారణఅవుతుంది. మొదటిరాజుకు విదేశీసాంప్రదాయమైన పేరుంటుంది. ఆయన పుత్రుడో పౌత్రుడో వచ్చేసరికి సంస్కృతనామంలోకి మారిపోతుంది. ఆయనకు రాజ్యపట్టాభిషేకంకట్టేకాలానికి క్షత్రియధర్మానుసారమైన తతంగమే నడుస్తూవచ్చింది.

రసపుత్ర క్షత్రియవంశాలు చాలా 'శాక లేక సిథియన్' దాడులకాలంనాటివారివే. క్రీస్తు పూర్వం దరిదాపుగా 200 సంవత్సరాలకు ముందు ఈ దాడులు ప్రారంభమైనాయి. అలా కాకపోతే శ్వేత హూణులకాలంనాటివారు కావాలి. వీరంతా దేశంలోని మతాలను, సంస్థలను నమ్మి, పురాణాలలోని వీరులతో బంధుత్వం కలుపుకునేవారు. వారివంశీకులమని చెప్పుకొనేవారు. నిజానికి క్షత్రియులు పూర్వవంశీయులఘనతమీద ఆధారపడకుండా తమ సాంఘికప్రతిపత్తిమీదను వృత్తిమీదను ఎక్కువగా ఆధారపడేవారు. అందుచేతనే తేలికగా విదేశీయులు కలసిపోయేవారు.

సుదీర్ఘమైన భారత ఇతిహాసంలో, తరచు మేధావులైన మహాపురుషులు వర్ణభేదాలను ఖండిస్తూనే వచ్చారు. ఆచారవిషయమైన కర్మకాండలను తిరస్కరిస్తూనే వచ్చారు. వాటిని వ్యతిరేకిస్తూ బలమైన ఉద్యమాలుకూడా లేచాయి. కాని నెమ్మదిగా పైకి కనుబడకుండానే వర్ణవ్యవస్థ క్రమంగా వృద్ధిచెంది, భారతజీవితం నాల్గువైపులా ఆవరించింది. బహుశా అది అతిక్రమింపరాని ప్రారబ్ధమేమో! వర్ణవ్యవస్థ నెదిరించిన మతస్థులే చివరకొక వర్ణమైనారు. జైనులు మూలమతమైన హిందూమతముపైన తిరుగుబాటుచేసినవారే. వారికీ, హిందూ

మతానికీ ఎన్నో భేదాలున్నా, జైనులుకూడా వర్ణవ్యవస్థను భరించి భరించి చివరకంగీకరించారు. కనుక హిందూమతంయొక్క బదనికగా జైనమతం సాగిపోతోంది. బౌద్ధమతం వర్ణవ్యవస్థ నంగీకరించలేదు. ఆలోచనలోనూ దృక్పథంలోనూ స్వతంత్రపోకడలనే కనుపరచింది. కాని చివరకు ఇండియానుంచే తొలగిపోయింది. అయితే, హిందూదేశం మీద మతంమీద దాని ప్రభావం మాత్రం చాలా హెచ్చు. 1800 ఏండ్లక్రిందట క్రీస్తుమతం ఈ దేశంలో ప్రవేశించి క్రమంగా వ్రేళ్ళు పాతుకుంది. దానితోపాటు మరోరకమైన వర్ణములను పెంపొందించింది. ఇండియాలోని ముసల్మాన్ సాంఘికవ్యవస్థ వర్ణ కులభేదములను ఎంత ఖండించినా వాటిప్రభావం మాత్రం ఇస్లాంమీదకూడా పడక పోలేదు.

మా కాలంలోకూడా వర్ణవ్యవస్థయొక్క జబర్దస్తీని ఛేదించడానికి మధ్యతరగతి ప్రజలలోనుంచి చాలా ఉద్యమాలు బయలుదేరినాయి. కాని ఆ ఉద్యమాలు సామాన్యజనాన్ని ఆకర్షించలేదు. ఇంతలో గాంధీజీ రంగంలోకొచ్చి, సూటిగాకాకుండా భారతీయపద్ధతిని ఈ వర్ణ సమస్యను పరిష్కారంచేశాడు. ఆయనదృష్టి ప్రజాసామాన్యంమీదనే పడింది. ఆయన సూటిగానూ, తీవ్రంగానూ, పదేపదే వర్ణవ్యవస్థను నిరోధించాడు. కాని ఆయన అసలువృత్తులనుబట్టి జరిగిన చాతుర్వర్ణ విభజనను మాత్రం కాదనలేదు. అలా అంటూనే వర్ణవిభేదాలను ఆయన అణగగొట్టేడు. వర్ణవ్యవస్థయొక్క పునాదులను ఆయన కదలించాడు. సామాన్యప్రజలు దాని నిజస్థితిని గ్రహించారు. కాని దానిని ఛేదించడానికి గాంధీజీకన్న బలవంతమైన పనిచేసినది కాలం. అతిబింకంతో చలనంలేకుండావస్తున్న ఈ వర్ణవ్యవస్థ పోక తప్పదని ఇప్పటి కనిపిస్తోంది. మనం ఈవిధంగా ఈ వర్ణవ్యవస్థతో పోరాడుతూ సతమతమవుతుంటే, పాశ్చాత్య దేశాల్లో జాత్యాహంకారమువల్లను, రాజకీయ ఆర్థిక ఆధిక్యతవల్లను కొత్తకులాలేర్పడినాయి. ప్రజాస్వామికపరిభాషలోనే ఈ భేదాలు ఉత్పన్నమైనాయి.

"బుద్ధునికిపూర్వం, క్రీస్తుకు 700 సంవత్సరాలకు పూర్వం గొప్ప ధర్మశాస్త్రప్రవక్త, మహాఋషి యాజ్ఞవల్క్యుడు ఇలా అన్నాడని చెప్పబడింది. "మనమతంవల్లను మనశరీరంమీది రంగు

వల్లనూ మనకు సద్గుణాలు కలుగవు. సద్గుణాలు అభ్యాసంవలన సాధించవలెను. కాబట్టి ఇతరులు తనకేమిచేయకూడదని వ్యక్తి భావిస్తున్నాడో దానిని తా నితరులపట్ల చేయకూడదు.

## ౧౭ చంద్రగుప్తుడు - చాణక్యుడు, మౌర్యసామ్రాజ్యస్థాపన

బౌద్ధమతం హిందూదేశంలో క్రమక్రమంగా వ్యాపించింది. ఆదిలో పాలకులకు పౌరోహితులకూ మధ్య తగాదాగా ప్రారంభమైనా, ఆ మతంలోని నైతికదృక్పథమూ, కర్మకాండలను, పురోహితుల తతంగాన్నీ ఎదుర్కొనే లక్షణమూ ప్రజలనాకర్షించాయి. అదొకవిధమైన సంస్కరణోద్యమంగా బయలుదేరి బ్రాహ్మణమేధావులనుకూడా ఆకర్షించింది. కాని మొత్తంమీద బ్రాహ్మణులు ఆ మతాన్ని ఎదిరించారు. బౌద్ధులను మతద్రోహులన్నారు. పైకి అంతగా కనుపడకపోయినా బౌద్ధమతానికీ బ్రాహ్మణమతానికీ మధ్యజరిగిన పేచీలో క్రమంగా బ్రాహ్మణప్రభావం రోజురోజుకు అడుగంటింది. మరి 250 సంవత్సరాల అనంతరం అశోకచక్రవర్తి బౌద్ధమతాన్ని స్వీకరించి ప్రచారకుల ద్వారా శాంతియుతంగా విదేశాల్లోనూ హిందూదేశంలోనూ కూడా బౌద్ధమతాన్ని వ్యాపింపచేయడానికి తన సర్వశక్తులనూ వినియోగించాడు.

ఈ రెండు శతాబ్దాల్లోనూ భారతదేశంలో అనేక మార్పులు కలిగినాయి. మనదేశంలో ఉన్న జాతులను, చిన్నచిన్న రాజ్యాలను స్వాతంత్రరాజులను అందరినీ కలుపడానికి అనేకవిధాలుగా ప్రయత్నాలు జరిగినాయి. ఒకేఒక సంయుక్తసామ్రాజ్యాన్ని స్థాపించాలనే భావం ప్రబలంగా వ్యాప్తమైనది. ఆ భావంయొక్క ఫలితంగానే పెద్ద సామ్రాజ్యం ఏర్పడింది. పశ్చిమోత్తరప్రాంతంమీదకు అలెగ్జాండరు దండెత్తిరావడంతో ఈ ప్రయత్నాని కొక పరిపూర్ణత సిద్ధించింది. ఆ స్థితిగతుల సావకాశం చూచుకుని, తమ కోరికలను సఫలీకృతంచేసుకోగలిగిన ప్రతిభావంతు లిద్దరు వెలిశారు. చంద్రగుప్తమౌర్యుడు, ఆయన బ్రాహ్మణమంత్రి స్నేహితుడు చాణక్యుడు. వీరి ఉభయులకలయిక బాగా పనిచేసింది. నందరాజులు మగధరాజ్యంనుండి వారుభయులనూ ప్రవాసం పంపేశారు. అప్పట్లో చాలా బలవత్తరంగా నుండిన మగధరాజ్యానికి(నేటిపాట్నా)పాటలీపుత్రం రాజధాని. మగధరాజ్యంనుండి తరిమివేయబడిన చంద్రగుప్త, చాణక్యులు తక్షశిలచేరి అక్కడ నివాస

మున్న అలెగ్జాండరు, గ్రీకుసేనలతో సన్నిహితత్వమును సంపాదించు కున్నారు. అలెగ్జాండరు సాహసకార్యములను చంద్రగుప్తుడు విని ఆయు నవలెనే వీరుడుకావాలని కాంక్షిస్తూ ఉండేవాడు. స్వయంగా అలె గ్జాండరును కలిసేడు. చాణక్య చంద్రగుప్తులు సన్నాహాలుచేసుకుంటూ పొంచికూచున్నారు. బ్రహ్మాండమైన కోరికలతో సమయంకోసం వేచి యున్నారు.

క్రీ. పూ. 323 సంవత్సరంలో బాబిలన్‌లో అలెగ్జాండరు చని పోయాడు. ఆ వార్త తెలియడంతోనే చాణక్య చంద్రగుప్తులు, భారత జాతీయసమైక్యతానినాదాలను లేవదీసి, విదేశీయులను పారద్రోలి వెయ్యాలని ప్రజలను ఉద్రిక్తపరిచారు. తక్షశిలనుంచి గ్రీకుసైనికులను తరుమగొట్టేశారు. జాతీయతానినాదాలను లేవదీసిన ఫలిత మేమంటే చంద్రగుప్తునికి చాలామంది తోడైనారు. ఆవిధంగా మందిమార్బలా లను చేకూర్చుకొని ఉత్తరభారత దేశంగుండా పాటలీపుత్రంమీదకు దం డెత్తేడు. అలెగ్జాండరు చనిపోయిన రెండు సంవత్సరాలకు పాటలీపుత్ర మును స్వాధీనంచేసుకుని చంద్రగుప్త చాణక్యులు మౌర్యరాజ్యస్థాపన చేశారు.

అలెగ్జాండరు అనంతరం, ఏషియామైనరు మొదలుకొని ఇండియా వరకూ ఉన్న దేశాలకు అధిపతియైన ఆయన సేనానాయకుడు సెల్యూ కస్, పశ్చిమోత్తర భారత దేశంలో తిరిగి రాజ్యంస్థాపించాలనే ప్రయ త్నంమీద సైన్యాలతో సింధునదినిదాటేడు. కాని ఆయన ఓడిపోయి నాడు. అందువల్ల ఆఫ్ఘనిస్థానంలోని కొన్ని భాగాలను-కాబూల్, హీరత్ వరకూ చంద్రగుప్తువశం చేయవలసివచ్చింది. చంద్రగుప్తుడు సెల్యూకస్‌కుమార్తైనుకూడా పెళ్ళిచేసుకున్నాడు. ఒక్క దక్షిణ దేశం మినహాగా చంద్రగుప్తునిసామ్రాజ్యం ఉత్తరాన కాబూలువరకును, తూర్పు పడమటి సముద్రతీరములవరకున్నూ వ్యాపించింది. గ్రంథస్థ మైన చరిత్రలో మొదటిసారిగా కేంద్రీకృతమైన విశాలసామ్రాజ్యం ఉద్భవించినది. ఈ సువిశాలసామ్రాజ్యానికి ముఖ్యనగరం పాటలీపుత్రం.

ఈ నూతన సామ్రాజ్యస్వరూపం ఎటువంటిదనే విషయాన్ని గురించి హిందూదేశంలోనూ గ్రీసు దేశంలోను సవిస్తరమైన చరిత్ర ఉన్నది. సెల్యూకస్ పంపిన రాయబారి మెగస్థనీస్ కొంతవర కా

చరిత్రను గ్రంథస్థంచేశాడు. కౌటిల్యవిరచితమైన అర్థశాస్త్రం ఇంకా సవిస్తరంగా తెలియజేస్తోంది. చాణక్యునికి మరోపేరు కౌటిల్యుడు. అతడు మంచి పండితుడే కాకుండా, మౌర్యసామ్రాజ్యాన్ని స్థాపించడంలోనూ, పెంపుచేయుటలోనూ సంరక్షించడంలోనూ చాలా గొప్ప పాత్రను ధరించినవాడు. అందుచేత ఆయన రచించిన గ్రంథంలోని విశిష్టత వేరే చెప్పనక్కరలేదు. చాణక్యుని భారతదేశపు 'మేకియవిల్లీ' అని అంటారు. కొంతవరకు ఆ పోలిక న్యాయమే. కాని నిజానికి ఆయన అంతకంటె గొప్ప మేధాసంపన్నుడు. ఉన్నతిగలవాడు. ఆయన రాజుగారికి కేవలం అనుచరుడుకాడు; సర్వాధికారయుతుడైన సామ్రాట్టుకు సలహాదారుడు. ఆ కాలమునకు సంబంధించిన ముద్రారాక్షస నాటకంవల్ల ఆయనస్వరూపాన్ని, ప్రతిభను గ్రహించవచ్చును. మంచి ధైర్యంగా ఆలోచించి పథకంవేయగలిగినవాడు. ఆత్మగౌరవంగలవాడు. పగసాధించడంలో దిట్ట. అవమానాన్నెంతమాత్రం సహించని సమర్థుడు. తనలక్ష్యాన్నెంతమాత్రం మరువనివాడు. శత్రువును స్వాధీనంచేసుకుని వంచించడానికీ ఏసాధనాన్నైనా ఉపయోగించడానికీ ఆయన వెనుకంజవేయలేదు. అలాంటి బహుముఖప్రజ్ఞావంతుడు రాజ్యాధికారాన్ని చేబూని, చక్రవర్తిని తనపైఅధికారిగాకన్న, అభిమాన శిష్యునిగా మాత్రమే గణిస్తూ ఉండేవాడు.

చాణక్యుడు స్వీయజీవితంలో బహు నిరాడంబరుడు. ఉన్నతాధికారంవల్ల వచ్చే డోలును, ఆడంబరాన్ని ఎంతమాత్రమూ పట్టించుకునేవాడుకాడు. మౌర్యరాజ్యస్థాపనమైనవెంటనే, నిజమైనబ్రాహ్మణ ధర్మప్రకారంగా విశ్రాంతితీసుకుని తపస్సుకు వెళ్ళాలనుకునేవాడు.

తన కార్యసాధనకై చాణక్యుడు ఏపనిచేయడానికైనా వెనుకాడినపాపానపోలేదు. మంచిచెడ్డలగురించి అంతగా తర్జనభర్జనచేయలేదు. కాని తా నవలంబించిన కార్యవిధానము అసలుపనికే భంగం కలిగించవచ్చునన్నంతవరకూ స్పృహ ఆయనకు లేకపోలేదు. 'క్లాజ్విజ్' కన్న చాలాకాలం ముందుగానే, యుద్ధం ఒకవిధంగా రాష్ట్రపరిపాలనాభాగమేనని ఆయన చెప్పినట్లు ప్రతీతి. కాని యుద్ధమే ఒక ఆదర్శంకాకూడదనీ, ఏదోఒక లక్ష్యసిద్ధికి అది సాధనంమాత్రమే అవాలనీ

కూడా చాణక్యుడు చెప్పేడు. కేవలం శత్రువును ఓడించి ఆతని సైన్యాలను నాశనంచేయడమే కాకుండా, యుద్ధంవల్ల సాంఘిక పరమార్థాన్ని సాధించడమే దక్షుడైన రాజకీయవేత్తకు లక్ష్యంగా ఉండాలని ఆయన శలవిచ్చాడు. యుద్ధంవల్ల ఉభయవర్గాలూ నాశనమవడం రాజకీయవేత్తల అవివేకమని ఆయన అభిప్రాయం.

సాయుధులైన సైనికులు జరిపించే కార్యక్రమం యుద్ధం. సైనిక బలంకన్న బలమైనది, యుద్ధం అక్కరలేకుండానే పగరాజును భయోత్పాతునిచేసి, నిర్వీర్యునిగాచేసి, సైన్యాలను వదలి పారిపోయేటట్లుచేసే నీతిస్ఫురణము సైనికబలంకన్న చాలా గొప్పది. కార్యసాధనకొరకు ఏపనైనా చేయడానికి సంశయింపని చాణక్యుడు కుశాగ్రబుద్ధి, ఉదారుడునైన శత్రువును సర్వనాశనంచేయడంకన్న ఆతని లోబరుచుకొనుటయే శ్రేయస్కరమనే సంగతి ఎప్పుడూ మరువలేదు. శత్రువర్గములో కలతలుపుట్టించడంవల్లనే ఆయన తుదివిజయాన్ని సాధించాడు. కాని ఆ విజయసమయంలోనే చంద్రగుప్తమహారాజు తన శత్రురాజుయెడల ఉదారంగానూ, దాక్షిణ్యంతోనూ ప్రవర్తించునట్లు చేశాడని ఇతిహాసం. శత్రురాజుయొక్క మంత్రి తన స్వామియెడల కనుబరచిన భక్తివిశ్వాసములకు, బుద్ధికుశలతకు చాణక్యుడు చాల సంతోషించి, తనమంత్రిత్వపు చిహ్నాలను స్వయముగా తీసుకొనిపోయి ఆయన కప్పచెప్పినట్లు ప్రతీతి. ఓటమివలన ద్వేషమూ, అవమానము కలుగవలసినచోట, సమరసభావమేర్పడి ఒక సామ్రాజ్యానికి సుస్థిరమైన పునాదులు వేయబడినాయి. శత్రువును ఓడించడమేకాకుండా అతని హృదయాన్ని జయించడం జరిగింది.

మౌర్యసామ్రాజ్యం గ్రీకుదేశాలతో, సెల్యూకస్‌తోనూ, ఆయన తరువాతివారితోనూ, పోలిమీ ఫిలడల్ఫస్‌తోనూ సద్భావంతో రాయబారములు నిర్వహించింది. వ్యాపారసంబంధము చాలాకట్టుదిట్టమైనది. మధ్యఆసియాలోని 'ఆక్సస్' నది, కాస్పియన్, నల్లసముద్రముల ద్వారా భారతవస్తుసామగ్రిని యూరోపుకు తీసుకుపోవడానికి నీటి రహదారియైనది. క్రీ. పూ. 3వ శతాబ్దంలో ఈ దారి ఎక్కువ ఉపయోగంలో ఉండేది. మధ్యఏషియా అప్పట్లో చాలా సారవంతమై భోగభాగ్యములతో తులతూగుతూ ఉండేది. తరువాత వెయ్యిసంవత్సరాల

అనంతరం అది ఎండిపోయి, నిస్సారమైపోయింది. రాజుగారి అశ్వశాలలో అరబ్బీగుర్రాలుండేవని అర్థశాస్త్రంలో చెప్పబడింది.

## ౧౬. రాష్ట్రవ్యవస్థ

క్రీ. పూ. 321 సం॥ లో భారతదేశంలోని చాలా భాగాన్ని ఆవరించి, ఉత్తరాన కాబూలువరకూ వ్యాపించిన ఈ రాజ్యం ఎలాఉండేది? అది నిరంకుశపరిపాలన; నాటికీ నేటికీకూడా సామ్రాజ్యాలన్నింటిలోవలెనే ఉన్నతాధికారుల నియంతృత్వాం. పట్టణాల్లోనూ, గ్రామాల్లోనూ చాలావరకు స్థానికస్వపరిపాలన జరుగుతూ ఉండేది. ఎన్నుకోబడిన పంచాయితీపెద్దలు స్థానికవ్యవహారాలను సరిదిద్దుకుంటూ ఉండేవారు. స్థానికస్వపరిపాలనకు చాలా ఘనత ఉండేది. రాజులుగాని, రారాజులుగాని ఆ పరిపాలనలో జోక్యంకలిగించుకునేవారుకారు. అయినప్పటికీ, ముఖ్యమైన పరిపాలనావ్యవహారాలన్నిటిలోనూ, కేంద్రప్రభుత్వముదే పైచెయ్యి. ఆనాటి మౌర్యసామ్రాజ్యపరిపాలనావిధానం ఈకాలపు నియంతృత్వములను పోలియున్నది. వ్యవసాయమే ప్రధానవృత్తిగానుండిన ఆకాలములో ఈరోజుల్లోమాదిరి ప్రభుత్వం వ్యక్తిని తనవశంలో, చెప్పుచేతల్లో ఉంచుకొనే పద్ధతులు అప్పుడు అమలులోలేవు. ఏవో కొన్నిహద్దులపరిమితిలో, వ్యక్తిస్వాతంత్ర్యాన్ని హద్దులలో నుంచడానికి ప్రయత్నం జరిగింది. కేవలం పోలీసుస్టేటుగా మాత్రం ఎన్నడూ లేదు. దేశంలోనూ తదితరదేశాల్లోనూకూడా శాంతిభద్రతలను కాపాడుతూ, పన్నులను వసూలుచేయడంతో మాత్రం వాళ్ళు తృప్తిపడలేదు.

మొత్తంమీద చాలా విస్తృతమైనట్టిన్నీ, కట్టుదిట్టమైనట్టిన్నీ నిరంకుశప్రభుత్వవిధానం అమలులో ఉండేది. గూఢచారులు చాలామంది ఉండినట్లుగా అనేకచోట్ల చెప్పబడింది. వ్యవసాయాన్ని అనేకవిధాలైన హద్దుపద్దుల్లో ఉంచేవారు. వడ్డీరేట్లుకూడా తగిన కట్టుబాట్లలో ఉంచేవారు. ఆహారపదార్థాలమీద, మార్కెట్లమీద, తయారైన వస్తువులమీద, జంతువధ్యశాలలమీద, దూడలపెంపకంమీద, నీటి హక్కులమీద, ఆటపాటలుమీద, వ్యభిచారగృహాలు, త్రాగుడుదుకాణాలమీద కట్టుదిట్టమైన తణిఖీ, అదుపు, ఆజ్ఞలూ ఉండేవి. ఆహారపదార్థా

లను దాచిపెట్టినవారినీ, వాటిని కల్తీచేసి అధికలాభాలను సంపాదించే వారిని కఠినంగా శిక్షించేవారు. వర్తకవ్యాపారాలమీద పన్నులు బాగా విధించేవారు. కొన్ని సందర్భాల్లో మతాచారాలమీదకూడా పన్ను పడేది. దేవాలయపుసొమ్ములు దుర్వినియోగంచేసినా, మతాచారాలలో దుర్మార్గాలు జరిగినా, దేవుళ్ళసొమ్ములు ప్రభుత్వం స్వాధీనం చేసుకునేది. జాతికంతకూ ఏదైనా ఉపద్రవం వచ్చినప్పుడు దాని నాస్తారంచేసుకుని, ద్రవ్యాపహరణంగాని అక్రమ ధనార్జనగాని చేసినవారి ఆస్తులను ప్రభుత్వం స్వాధీనంచేసుకునేది. పురపారిశుద్ధ్యానికి, వైద్యసహాయానికి తగిన ఏర్పాట్లుండేవి. కొన్ని ముఖ్య కేంద్రాలలో వైద్యులు ఉండేవారు. విధవలకు, అనాథులకు, జబ్బుపడినవారికి, అంగవిహీనులకు ప్రభుత్వమే ఉపాధినిచ్చేది. కరువుకాటకాల నివారణకు ప్రభుత్వమే బాధ్యతవహించేది. ప్రభుత్వకొఠారాలలో నిల్వఉన్న ధాన్యాలలో సగం కాటకసమయాల్లో వినియోగపడగలందులకు ప్రత్యేకించబడేవి.

ఈలాంటి చట్టాలు, నిబంధనలు అన్నీకూడా, ఎక్కువగా పల్లెటూళ్ళలోకన్న పట్టణాల్లో అమలుజరిగేవి. అంతేకాకుండా ఈ సిద్ధాంతాలన్నీ మాటల్లోనే కాని, ఆచరణలో లేకపోవడంకూడా సంభవమే. అయినప్పటికీ సూత్రప్రాయంగా చెప్పబడిన ఈమాటలుకూడా బాగానే ఉన్నాయి. గ్రామాలలో ప్రజాస్వామికం, గ్రామస్వాతంత్ర్య బాగా ఆచరణలో ఉండేదనే అనుకోవాలి.

చాణక్యుని అర్థశాస్త్రంలో, ప్రభుత్వ నిర్వహణానికి సంబంధించిన అన్నివిషయాలు, సిద్ధాంతాలు, ప్రయోగాలు, కూలంకషంగా చర్చింపబడ్డాయి. రాజధర్మాలు, మంత్రులవిధులు, రాజసమావేశాలు, పరిపాలనాశాఖలు, రాజ్యతంత్రజ్ఞత, సమరన్యాయము, శాంతిసూత్రాలు మొదలైన యావత్తువిషయాలు ఆ గ్రంథంలో విశదీకరింపబడినాయి. చంద్రగుప్తుని అఖండ సైనికబలంవివరాలు వ్రాయబడినాయి. గజ తురగ రథ పదాతుల బలాన్ని విశదపరిచాడు. సుశిక్షణలేని సంఖ్యాబలం నిరుపయోగమని చాణక్యుని అభిప్రాయం. శిక్షణ, సరియైన నాయకత్వమూ లేకపోతే సంఖ్యాబలం బలహీనతగా పరిణమిస్తుంది. కోటల

నిర్మాణం వగైరా ఇతర రక్షణవిధానాలుకూడా అర్థశాస్త్రంలో వ్రాయ బడినాయి.

వాణిజ్యవ్యాపారాలు, నాయశాస్త్రం, న్యాయస్థానాలు, మ్యునిసిపల్ పరిపాలన, సాంఘికాచారాలు, వివాహము, విడాకులు, పన్నులు ఆదాయం, వ్యవసాయం, గనులు, ఫ్యాక్టరీలు, కళాకారులు, మార్కెట్లులు, తోటలపెంపకం, వస్తువులఉత్పత్తి, వ్యవసాయపు నీటివనరులు, కాలువలు, ఓడలనిర్మాణము, ఓడలవ్యాపారము, వ్యాపారసంఘములు, జనాభా లెక్కలు, మత్స్యపరిశ్రమ, వధ్యశాలలు, విదేశయానానికి సంబంధించిన షరతులు, జైళ్ళు మొదలైన యావద్విషయాలు ఆపుస్తకంలో వ్రాయబడినాయి. విధవావివాహమూ, కొన్నిసందర్భాల్లో వివాహవిచ్ఛేదమూ శాస్త్రసమ్మతంగా అంగీకరింపబడ్డాయి.

చైనాలో తయారైన చీనాపట్టువస్త్రాలను గురించిన ప్రస్తావన ఆ గ్రంథంలో చేయబడింది. వాటికీ దేశీయపట్టువస్త్రాలకూ తేడాకూడా చెప్పబడింది. బహుశా మనపట్టువస్త్రాలు కొంచెం ముదుగుకావచ్చును. క్రీ. పూ. 4వ శతాబ్దంనాటినుంచీ మనదేశానికి చైనానుండి పట్టువస్త్రాలు దిగుమతిఅవుతున్నట్లు స్పష్టంగా ధృవపడుతోంది.

రాజు పట్టాభిషిక్తుడయేసమయంలో ప్రజలసమక్షంలో ఈ విధంగా శపథంచేసేవాడు "నేను మిమ్మల్ని బాధపెట్టినట్లయితే, నేను స్వర్గానికి దూరమైపోయెదనుగాక! నేనూ, నాసంతతి నాశమైపోయెదముగాక"........ప్రజల క్షేమమే తనక్షేమమని రాజు భావించవలెననీ, తనకేది సంతోషకరమో దానిని చేయడంకంటె, ప్రజలకేది సంతోషదాయకమో దానిని చేయడమే సర్వోత్కృష్టమని రాజు భావింపవలెనని చెప్పబడినది. 'రాజు శక్తివంతుడైతే ప్రజలుకూడా శక్తివంతులుగా ఉంటా'రని సిద్ధాంతముచేయబడింది. ప్రజాక్షేమానికి అవసరమైనపనులేమీ రాజుగారిసంతోషంకోసం ఆపకూడదని కూడా చెప్పబడింది. రాజు అక్రమంగా ప్రవర్తిస్తే ఆతన్నితొలగించి మరొకరిని ఆస్థానే నియమించే అధికారం ప్రజలకు ఉండేది.

అనేకంగాఉండే పంటకాలువలుపైన పెత్తనంచేయడానికొక ప్రత్యేకశాఖ పనిచేస్తుండేది. అలాగే విదేశములలో వ్యాపారం సాగించే ఓడల రాకపోకలవ్యవహారం చూడడానికి, ఓడరేవులు వగై

రాలను మంచిస్థితిలో ఉంచడానికీ, దేశంలో నదులపై వంతెనలు నిర్మించి, వాటిగుండా జరిగే వ్యాపారానికి తగిన సౌకర్యాలు కల్పించడానికీ, నీటిరహదారులశాఖ ఒకటుండేది. సైన్యముతోపాటు, దేశ రక్షణ నిమిత్తం ఒక నౌకాదళంకూడా ఉండినట్లుగానే తోస్తుంది.

మౌర్యసామ్రాజ్యకాలంలో దేశంలోవ్యాపారం బాగాసాగుతూ ఉండేది. ముఖ్యపట్టణాలన్నిటిమధ్యను రోడ్లూ, వాటిపైన ప్రయాణికులకు విశ్రాంతిగృహాలు ఉండేవి. పాటలీపుత్రంనుంచి సరాసరి పశ్చిమోత్తరసరిహద్దువరకు దేశంమధ్యగా నిర్మింపబడిన ముఖ్యమైన రోడ్డు రాజపథం అని పిలువబడేది. విదేశవ్యాపారులకు ఎక్కువసౌకర్యాలను కలిగించి, వారిని ప్రత్యేకమర్యాదలతో మన్నించినట్లుగా వ్రాయబడింది. పూర్వకాలపు ఈజిప్టులో శవాలకు పలుచని ఇండియన్ మజ్లిన్‌గుడ్డలు చుట్టపెట్టేవారనీ, అచట ప్రజలు తమబట్టలకు భారతదేశంలో తయారైన నీలిమందుతో రంగులు వేసుకునేవారనీ చరిత్ర చెపుతోంది. పురాతనవస్తువులలో ఒకరకమైన గాజుసామగ్రి కూడా వాడుకలో ఉండేది. గ్రీకురాయబారి మెగస్థనీస్ భారతీయులు సౌందర్యోపాసకులని వ్రాశాడు. తమ ఉన్నతిని పెంచుకునేందుకు ఎత్తైన చెప్పులజోళ్ళు నుపయోగించేవారని ఆయన ఉదహరించాడు.

మౌర్యసామ్రాజ్యంలో విలాసజీవనం బాగా పెరిగిపోయింది. జీవితవిధానంలో తికమక లెక్కువైపోయాయి. ప్రత్యేకాకర్షణలుకూడా హెచ్చిపోయినాయి. వంటపూటకొంపలు, సత్రాలు, చావిళ్ళు, ఫలహారశాలలు,జూదపుగృహాలు విపరీతంగాపెరిగిపోయాయి. ఒకేవృత్తికిచెందినవారందరు కలసి సభచేసుకోవడానికి, ఆపిమ్మట వారంతా కలసి భోజనంచేయడానికీ ప్రత్యేక వసతిగృహాలుండేవి. అనేకతరహాలకుచెందిన నటకులు, గాయకులు, నాట్యవేత్తలు ప్రజల కానందాన్ని చేకూర్చటమే వృత్తిగా పెట్టుకుని ఊరూరా సంచారంచేసేవారు. ప్రతి గ్రామంలోనూ ఈవిధమైన వినోదాలనిమిత్తం వినోదశాల లేర్పడడంవల్ల ప్రజలు ఇంటిపూచీ, పొలంపూచీ లేకుండా విలాసంలోపడిపోతున్నారు. కాబట్టి అర్థశాస్త్రరచయిత వాటిని కొంత తెగనాడేడు. అయినప్పటికీ ప్రజలందరి ఆనందంకొరకు ఏర్పాటుచేయబడిన వినోదప్రదర్శనాలలో తోడ్పడనివాికి దండన విధింపబడేది. రాజు, తాను నిర్మించిన వినోద

శాలలలోనే నాటకములనో, సాము, గరడీ ప్రదర్శనములనో, జంతువుల పందెములనో, తోలుబొమ్మలాటలనో ఏర్పాటుచేస్తూ ఉండేవాడు. ప్రత్యేకపర్వదినములలోమాత్రం వీధులలో దీపములను వెలిగించే 'రు. అప్పుడప్పుడు రాజుగారిఊరేగింపులు, వేటప్రదర్శనాలు జరుగు ంండేవి.

మౌర్యసామ్రాజ్యంలో జనసమ్మర్దం కలిగిన నగరా లనేకంగా ఉండేవి. కాని వాటన్నిటిలో పాటలీపుత్రం ముఖ్యనగరం. ఆ మహా నగరం గంగానదిబడ్డున పొడుగుగా సోన్‌నది గంగను కలిసేటంతదాకా వ్యాపించి ఉండినది. అదే నేటి పాట్నా. దానిని మెగస్థనీస్ ఇలా వర్ణించాడు—"గంగానదితో మరొకనది కలిసేచోట 'పాలిబోత్ర' (పాటలీపుత్రం) అనే మహానగరం ఉన్నది. దాని పొడవు 80 యోజ నాలు. అనగా 9.2 మైళ్ళు. వెడల్పు 17 యోజనాలు లేక 1.7 మైళ్ళు. నగరం నలుపలకలుగానుండి చుట్టూ కర్రగోడచేత ఆవృతమై యుండేది. ఆ కర్రగోడలో మధ్య మధ్య బాణాలను వదలడానికి వీలుగా ఉండే కన్నాలుండేవి. గోడచుట్టూ కోటరక్షణకొరకు 600 అడుగుల వెడల్పున ముప్పదిమూరల లోతున ఒక పెద్ద కందకం ఉండేది. ఆ కందకంలోకే నగరంలోని మురికినీరంతా ప్రవహించేది. చుట్టూ కోటగోడమీద 570 బురుజులున్నాయి. 64 దర్వాజాలున్నాయి."

కోటగోడ మాత్రమే కాకుండా నగరంలోని చాలాఇండ్లు కర్ర తోనే నిర్మింపబడినాయి. బహుశా ఆ భూమికి భూకంపభయం ఉండ డంచేత అలా ఉండేదేమో! 1934 సంవత్సరంలో వచ్చిన భూకం పంవలన మనకిప్పు డీ ఆలోచన స్ఫురిస్తోంది. కర్రా కంపలతో ఇళ్ళు కట్టబడిఉండడంచేత, ప్రతిఇంటా నిచ్చెనలు, త్రాళ్ళు, కొక్కేలు, నీళ్ళకుండలు వగైరా అగ్నిమాపకసాధనాలు సిద్ధంగా ఉండేవి.

పాటలీపుత్రంలో ప్రజలచేత ఎన్నుకోబడిన మ్యునిసిపల్ సంఘం ఉండేది. దానిలో 30 మంది సభ్యులు, ఆరు సమవిభాగాలుగా ఉండే వారు. ఒక్కొక్క విభాగం ఒక్కొక్క కార్యక్రమానికి బాధ్యత వహించేది. భారీపరిశ్రమలు, కుటీరపరిశ్రమలు, జననమరణలెక్కలు, వస్తుసామగ్రి ఉత్పత్తి, యాత్రీకులకు వసతులు కల్పించుట మొదలైన కార్యక్రమాలను ఈ విభాగసభ్యులు నిర్వహిస్తుండేవారు. ధనం, పారి

శుద్ధ్యం, నీటిసప్లయి, పబ్లిక్ భవనాలు, తోటలు వగైరాల పరిపాలనను పురపాలకసంఘమే నిర్వహించేది.

భారతదేశ స్వరూప స్వభావాలను మార్చివేసే ఆర్థిక రాజకీయవిప్లవాలు జరుగుతుంటే, వాటివెనకనే బౌద్ధమతం పొంగిపొంగులుగావచ్చి, అంతవరకు చిరకాలంగా వ్యాప్తిలో ఉన్న మతాలతోనూ, వాటి నాశ్రయించుకున్న అభిమానవర్గాలతోనూ అనేకవిధాలుగా పేచీలుపడడం ప్రారంభించింది. భారతదేశంలో మతసంబంధమైన వాదోపవాదాలంటే జనానికి చాలా ఇష్టం. వాటికన్న కూడా బుద్ధభగవానునివంటి మహావ్యక్తియొక్క వెలుగు ప్రజల నెక్కువగా ఆకర్షించినది. ప్రతిభావంతమైన ఆయనజీవితవిశేషాలు అప్పటి కింకా వారిస్మృతిపథంనుంచి తొలగలేదు. ఆయనసిద్ధాంతాలు పాతవే అయినా, వేదాంతతత్త్వవిచారంచేసే మేధావంతుల కెంతో కొత్తగానూ అపూర్వంగానూ కనుబడి, వారిదృష్టి నాకర్షించాయి. ప్రజలహృదయాంతరాళాల్లో ప్రవేశించాయి, "అన్ని దేశదేశాంతరాల్లోకి పోయి నా సందేశాన్ని బోధించండి" అని బుద్ధుడు తన శిష్యుల నాదేశించాడు. "ధనికులు, పేదలు అంతా ఒక్కటే. నదీనాం సాగరో గతిః అన్నట్లు అన్నికులాలు జాతులు ఈ మతంలో ఒక్కటైపోయాయి" అన్నాడు బుద్ధుడు. ఆయనసందేశం సర్వమానవకళ్యాణం. విశ్వమానవ ప్రేమ. "ఈ ప్రపంచంలో ద్వేషాన్ని ద్వేషంచేత జయించలేము. ప్రేమవల్లనే ద్వేషం తొలగిపోతుంది. మానవుడు ద్వేషాన్ని దయచేతను, దుష్టత్వాన్ని మంచిచేతను జయించునుగాక !"

ఆత్మశిక్షణతోనూ, ధర్మజిజ్ఞాసతోనూ కూడియున్న మహాదాదర్శం అది. 'యుద్ధంలో వెయ్యిమంది యోధులను జయింపవచ్చును. కాని ఆత్మను జయించినవాడే మహావీరుడు. పుట్టుకచేత కాక ప్రవర్తనవల్లనే ఎవ్వడైనను జాత్యున్నతిని సంపాదింపగలడు.' అని ఆయన సిద్ధాంతం. పాపినికూడ నిరాదరణచేయుట బుద్ధుని అభిమతం కాదు. 'పుండుమీద కారం చల్లినట్లుగా అసలే పాపంచేసినవాడిపైన పరుషవాక్యప్రయోగం చేయడమెందుకు?" అన్నాడు భగవానుడు. ఒకరిపై విజయం సాధించడంకూడ అసౌఖ్యకరమైన పరిణామాలకు దారితీస్తుం

దన్నాడు. 'విజయం దేహాన్ని పురిగొల్పుతుంది. ఏమంటే, జయింపబడ్డ వాడు బాధపులోనవుతాడు కనుక' అని శలవిచ్చాడు.

ఈ ప్రచారమంతటినీ బుద్ధుడు భగవంతునిపేరుతో నిమిత్తం లేకుండా, మరొక ప్రపంచం ప్రసక్తి లేకుండా మతంపేరు చెప్పకుండానే సాగించాడు. హేతువాదంమీద, తర్కంమీద, అనుభవంమీద తాను ఆధారపడి ఎవరిమట్టుకు వారే తమబుద్ధితోనే సత్యాన్వేషణం చేయ మని ఆయన జనాన్ని హెచ్చరించాడు. 'నేను చెప్పిన ధర్మాలను కేవలం నాయందుండే భక్తితాత్పర్యాలవల్ల అంగీకరించనక్కరలేదు. అగ్ని బంగారాన్నేవిధంగా శోధిస్తుందో అలా శోధించి అంగీకరించండి' అని శ్రీ బుద్ధభగవానుడు చెప్పేడంటూరు. అజ్ఞానమే అన్నిదుఃఖాలకు మూలము. దేవుడున్నాడోలేడో, పరమాత్ముడున్నాడాలేడా అనే విష యాన్ని ఆయనఎత్తుకోనేలేదు. ఆయన ఉన్నాడనీ చెప్పడు, లేడనీ ఖం డించడు. ఏ విషయమైనా జ్ఞానానికతీతమైనప్పుడు, మన అభిప్రాయాన్ని వెనుకకు పెట్టడం న్యాయం. బ్రహ్మపదార్థమంటే మన మెరిగిన సర్వ వస్తువులకూ సంబంధంలేని ఏదో పదార్థమైతే దానిఉనికిని ధృవపరచ డానికి మనకు తెలిసిన ఏ హేతువాదమూ సరిపడదు. ఏ వస్తువుకూ సంబంధంలేని వస్తువున్నదని తెలిసికోవడం ఎట్లు? యావత్తువిశ్వమూ ఒక దానికొకటి సంబంధించినదని మన మెరుగుదుము. దానికి సంబంధించి ఉండని పదార్థాన్ని మన మెరుగము.' అని భగవానుడు చెప్పేవాడు. కనుక మనం కళ్ళతో చూడగలిగిన ప్రత్యక్షవిషయాలతో సంతృప్తి పడాలని బుద్ధదేవుని అభిప్రాయము.

అలాగే ఆత్మవిషయంలోకూడా ఆయన సుస్పష్టమైన అభిప్రా యాన్ని చెప్పడు. అది లేదనడు. ఉందని నిర్ధారణగానూ చెప్పడు. ఆవిష యాన్నిగురించినమీమాంసలోకే ఆయన ప్రవేశించడు. అదొక గొప్ప విశేషం. ఏమంటే, ఆరోజుల్లో భారతీయమేధాసంపన్నులు వ్యక్తాంతర మైన ఆత్మనుగురించీ, పరమాత్మనుగురించీ, బ్రహ్మపదార్థాన్నిగురించీ, ఇంకా తత్సంబంధమైన ఇతర వేదాంతవిషయాలనుగురించీ చాలా విచారంచేస్తుండేవారు. బుద్ధుడు ఈ తత్త్వవిచారంజోలికి పోనేలేదు. కాని సహజమైన ధర్మమొకటున్నదనీ, ఆ ధర్మమే సుఖదుఃఖాలను,

మంచిచెడ్డలను, సుకృతదుష్కృతాలను శాసిస్తుంటుందనీ విశ్వసించే వాడు.

మనం మన అనుభవంలో 'ఇది అవును...కాదు' అంటూఉంటాం. కాని బాహ్యంగా కనుబడేవిషయాలనల్లా ఉంచి కొంచెం లోతుగాతరిస్తే అవిరెండూ నిజంకాకపోవచ్చును. అసలు జరుగుతున్నవిషయాన్ని వివరించడానికి తగినంతభాష మనదగ్గర లేకపోవచ్చు. 'ఉన్నది...లేదు' అనే స్థితి కది మధ్యస్థంకావచ్చును. లేదా రెంటికీఅతీతంకావచ్చును. మహానది గంభీరంగా ప్రవహిస్తూన్నప్పుడు, ఆ నీరల్లా నిలబడిపోయినట్లే కనబడుతుంది. కాని క్షణక్షణం నీరు మారుతూనేఉంటుంది. కొత్తనీరు ప్రవహిస్తూనే ఉంటుంది. అలాగే అగ్ని, మంటలు మండుతూనే ఉంటాయి. ఒక్కొక్కప్పుడు మంటస్వరూపంకూడా మారకుండానే ఉంటుంది. కాని వాస్తవంలో మంట ప్రతిక్షణం కొత్తదే. అన్నిస్వరూపాల్లోనూ జీవితంకూడా నిరంతరం మారుతూఉండే ఒక మహాప్రవాహం. వాస్తవికత, అంటే ఏవిధమైనమార్పులూ చెందని శాశ్వతస్థితి కాదు. అదొక ప్రకాశమునొసంగే గొప్పశక్తి. నిరంతరం మార్పులుచెందుతుండే ప్రపంచంలో, ఒక విషయం మరొకదానిఫలితమని చెప్పడానికివీలులేదు. మనశరీరాలు మనఆత్మలు క్షణక్షణమూ మారుతూ ఉంటాయి. ఒక్కొక్కప్పుడు ఉన్నదున్నట్లుగానే అమాంతంగా ఏష్యమైపోతుంది. అదేకాకపోయినా అలాంటిదే మరొకటి ఆస్థానే వెలసి మళ్ళీ అంతర్ధానమైపోతుంది. ఒకవిధంగా మనం నిరంతరం పుడుతూ చస్తూఉంటాం. ఈ పరంపరవల్లనే మార్పు అంతగా కనబడదు. ఇదంతా ఒకప్రవాహం; కదలిక; మార్పు.

ఈ తతంగమంతా మనసుకుపట్టించుకోవడానికి మనకు శక్తి చాలదు. ఏమంటే, మనం ప్రత్యక్షంగా గోచరించే విషయాలను గురించి కొన్ని నిర్ణీతమైన పద్ధతుల్లో ఆలోచించడానికే అలవాటు పడ్డాం. కాని, బుద్ధునిసిద్ధాంతాలకూ, నేటి భౌతికశాస్త్రానికీ, వేదాంత తత్త్వమునకూ ఎంతో సాన్నిహిత్యం ఉండడం చాలా ఆశ్చర్యకరమైన విషయం.

బుద్ధునిమార్గము చాలా గంభీరమైన మనస్తత్వవిచారం. కాని ఈనాటి నవీనశాస్త్రములలోని అంతర్యాన్ని, ఆయన ఆనా

డెట్లు గ్రహించాడా అనేది అద్భుతమైనసంగతి. శాశ్వతమైన ఆత్మను గురించిన ప్రస్తావన లేకుండానే మానవజీవితాన్ని కూలంకషంగా చర్చించాడు. ఆలాంటి ఆత్మపదార్థమున్నా అది మనఊహాకతీత మన్నాడు. మనస్సుకూడా దేహంలో ఒక భాగమే నన్నాడు. అనేకమైన మానసిక శక్తు లందులో కలిశాయన్నాడు. వ్యక్తి కొన్ని మానసికశక్తుల సముదాయం. అనేక భావాలతో కూడిన ప్రవాహం. 'మన మేమి యోచించుకుంటున్నామో దానిఫలితమే మనం' అన్నాడు.

బుద్ధుడు ప్రతిపాదించిన నాల్గు సూత్రాల్లోనూ, జీవితంలో కష్టాలనుభవించడం, బాధలుపడడం గొప్పగా చెప్పేడు. కష్టాలకు కారణాలు, వాటినివారణోపాయాలు వివరించాడు. ఆయన శిష్యుల కీవిధంగా ఉపదేశించాడని చెప్పబడింది. "చిరకాలంగా మీరు ఈ జీవితయాత్ర సాగించే సందర్భంలో అనేక దుఃఖాల ననుభవించారు. ఏడ్చేరు. ఆ ఏడ్పులో చతుస్సముద్రాల్లోని నీరుకంటె ఎక్కువగా కన్నీరు కార్చేరు. మీరు ఏ దుఃఖాన్ని ద్వేషించారో అది మీ భాగం. దేనిని మీరు ప్రేమించి కాంక్షించారో ఆ సుఖం మీది కాదు."

ఇలా బాధలుపడినపిమ్మట దానిద్వారా లభిస్తుంది 'నిర్వాణం.' ఆ నిర్వాణమంటే ఏమిటో నిర్వచనంచేయడం అసాధ్యమైనపని. ఆ విషయంలో అనేక అభిప్రాయభేదాలున్నాయి. సామాన్యమైన ఊహ కతీతంగా ఉండే ఒక అవస్థను అందరి కర్థమయేట్టుగా వర్ణించాలంటే మనకున్నభాష చాలదు. కొందరిమతంప్రకారం నిర్వాణమంటే ఆరిపోవడం; నాశం. కాని ఆ నిర్వచనాన్ని బుద్ధు డంగీకరించ లేదని చెప్తారు. అదొకవిధమైన అమోఘ చైతన్యమని బుద్ధుని అభిప్రాయమంటారు. అసత్యమైన కృత్రిమవాంఛల నాశమేకాని, ఉట్టి ఆరిపోవడంకాదు. కాని దానినిర్వచనం అదికాదు ఇదికాదని వ్యతిరేకార్థకంగా చెప్పవలసిందేకాని ఇదమిత్థమని చెప్పడానికి వీలులేదు.

ఆ పరిపూర్ణమైన ఆత్మార్పణానికీ, స్వార్థానికీ మధ్యేమార్గం బుద్ధునిది. తన శరీరాన్ని ఎక్కువగా హింసపెట్టడంవల్ల తన బలాన్ని దుర్వినియోగంచేసుకోవడంవల్ల సరియైనమార్గాన అభివృద్ధిచెందలేడు. మధ్యేమార్గమే ఆర్యులమార్గం. మంచివిశ్వాసం, మంచిలక్ష్యం, సరియైనఆదర్శాలు, సరియైన మాటపొందిక, ధర్మానుసారప్రవర్తన,

న్యాయప్రవర్తన, న్యాయమైన జీవనోపాధి, న్యాయమైన ప్రయత్నం, సరియైనబుద్ధి, సరియైన ఆలోచన ఇవే ఆర్యపథాలు. ఇదంతా ఆత్మో పలబ్ధిమార్గం. దయాధర్మబిచ్చం కాదు. ఈవిధమైన ఆలోచనలద్వారా మానవుడు తన్నుతాను జయించుకుంటే ఇక ఆతనికి పరాజయమంటూ ఉండదు. తన్నుతాను జయించిన మనిషి విజయాన్ని, భగవంతుడు కూడా పరాజయంగా మార్చలేడు.

బుద్ధుడు తన శిష్యులకు వారెంతవరకు అవగాహనచేసుకోగలిగి ఆచరణలో పెట్టగలుగుతారో, అంతవరకే బోధించాడు. జీవిత సర్వ స్వాన్నిగురించి పరిపూర్ణంగా ఆయన బోధించలేదు. ఒకప్పుడు ఆయన కొన్ని ఎండిపోయినఆకులను తనగుప్పెట్లో గ్రహించి తన ప్రియ శిష్యుడైన ఆనందుని పిలచి 'నా చేతులోని ఆకులుగాక ఇంకేమైనా ఆకు లున్నాయా?' అని అడిగేసరికి ఆనందుడు 'ఆకురాలుకాలంలో, నాలుగు మూలలా అసంఖ్యాకంగా ఆకులు రాలిపోతున్నాయి.' అని జవాబు చెప్పేడు. అందుమీద బుద్ధభగవానుడు ఇల్లా అన్నాడు— "ఆవిధంగానే నేను కొద్ది సత్యాలను మాత్రమే మీకు తెలియచేశాను. ఇవిగాక తెలిసికోవలసిన సత్యాలు, ధర్మాలు అసంఖ్యాకంగా ఉన్నాయి."

## ౨౦ బుద్ధునికథ

బుద్ధునికథ నేను బాగా చిన్నవాడినిగా ఉన్నప్పుడే నన్నా కర్షించింది. యువకుడైన సిద్ధార్థుడు, అంతరంగంలో ఎంతో సంక్షోభపడి, ఎన్నో బాధలకోర్చి బుద్ధుడుగా పరిణామంచెందిన కథ నా మనసు కెంతో నచ్చింది. ఎడ్విన్ ఆర్నాల్డు రచించిన 'లైట్ ఆఫ్ ఏషియా' నా అభిమానగ్రంథాలలో ఒకటైంది. తరువాత నేను నా రాష్ట్రంలో సంచారంచేస్తుండినకాలంలో బుద్ధచరిత్రకు సంబంధించిన క్షేత్రాలను ప్రత్యేకంగా పనికట్టుకుని సంచారంచేయడానికి కుతూహలపడుతుండే వాడిని. ఈ క్షేత్రాలు చాలవరకు మా ఉత్తరప్రదేశంలోనూ దగ్గర లోనూ ఉన్నాయి. నేపాళరాష్ట్రి సరిహద్దులో బుద్ధుడు జన్మించాడు. ఈ రాష్ట్రమంతా సంచారంచేశాడు. బీహారులోని గయాక్షేత్రంలో బోధిచెట్టుక్రింద కూచుని బోధిసత్త్వుడైనాడు. ఇక్కడే ఆయన ప్రప్రథ మంగా తన సందేశాన్ని వినిపించాడు. ఇక్కడే నిర్యాణంచెందేడు.

ఈనాటికీ బౌద్ధమతం విశేషంగా వ్యాప్తిలోఉన్న దేశాలకు నేను వెళ్ళినప్పుడు, ఆ దేశాలలోని బౌద్ధదేవాలయాలను, మఠాలను సందర్శించాను. అక్కడుండే భిక్షువులను తదితర భక్తులను కలసి వారితో మాట్లాడి బౌద్ధమతంవల్ల వారికి కలిగిన ప్రయోజనాలేమిటో తెలుసుకోడానికి ప్రయత్నించాను. ఆ దేశాలమీద బౌద్ధమతప్రభావం ఎలా వ్యక్తమైఉన్నదో పరిశీలించాను. నవజీవనాన్ని వా రెల్లా సరిపుచ్చుకుంటున్నారో చూచాను. అక్కడ నాకు నచ్చనివిషయాలు చాలా ఉన్నాయి. చాలా హేతుబద్ధమైన సిద్ధాంతాలు మాటలపుట్టలైనాయి. మతాచారతతంగం పెరిగిపోయింది. మతగురువుల ధర్మప్రవచనం ఎక్కువైపోయింది. బుద్ధుడెంత వారించినా ఆధ్యాత్మికచర్చ, మంత్ర తంత్రములగారడీ కూడా వ్యాప్తమైఉంది. బుద్ధుడు వద్దన్నప్పటికీ, ఆయనను దేవుడినిగా చేసేశారు. ఆయనవిగ్రహాలు పెద్దవిగా తయారు చేయించి, దేవళాల్లోనూ తదితరస్థలాల్లోనూ నెలకొల్పేరు. వాటిని నేను చూస్తున్నప్పుడు, బుద్ధుడు వీటినిచూచి ఏమనుకొనేవాడా అని సంకోచపడ్డాను. బౌద్ధసన్యాసులు చాలామంది అమాయకులు. ఏమీ తెలియనివారు. వాళ్ళకు కాకపోయినా వాళ్ళకాషాయివస్త్రాలకైనా ప్రజలు మ్రొక్కాలని అహంకారపడుతూఉంటారు. ఏ దేశాచార సాంప్రదాయముల ననుసరించి ఆ ప్రకారంగా బౌద్ధమతం మార్పు చెందింది. బహుశా ఆలాంటి పరిణామం సహజమే కావచ్చును.

నేను సంచారంచేసిన బౌద్ధదేశాలలో నాకు నచ్చినవిషయాలను కూడా చాలావాటిని చూచాను. బౌద్ధమఠాల్లోనూ, వాటికిచేరియున్న విద్యాలయాల్లోనూ, ప్రశాంతంగా విద్యాభ్యాసంచేయడానికీ, ఆలోచించడానికీ చక్కని వాతావరణం కనబడింది. చాలామంది బౌద్ధభిక్షువుల ముఖాల్లో ఒకవిధమైన హుందా, నెమ్మది, ప్రాపంచికవ్యవహారాల యెడల నిష్కామ్యత, మమతారాహిత్యము ప్రస్ఫుటమవుతుంటాయి.

ఇదంతా నేటి జీవనవిధానానికి సరిపడుతుందా, లేక దానిబాదర బందీనుండి తప్పించుకోవడాని కిదొక మార్గమా? నేటిజీవిత సంఘర్షణలో ఈ జీవిత విధానాన్ని చొప్పించి, నేడు మనల నావహించియున్న ఆశను, దుడుకుతనాన్ని, దౌర్జన్యాన్ని తగ్గించలేమా?

బుద్ధునిసిద్ధాంతములోని నిస్పృహతత్త్వం నాకు నచ్చలేదు. జీవితంలో ఎదుర్కోవలసిన సమస్యలొచ్చినపుడు వాటిని వదలిపెట్టి దూరంగా పోవడంకూడా నేను హర్షించను. మనసా నేను ఏమతానికి దాసుడను కాను. పరిపుష్టిమైన జీవనమన్నా, ప్రకృతి అన్నా నాకెంతో ఇష్టం. జీవితంలోకలిగేసంఘర్షణలను నేను ద్వేషించను. నేను నిత్యమూ చూస్తున్న సంగతులు, నా అనుభవాలు ఎంత బాధాకరమూ, దుఃఖ కరమూ అయినప్పటికీ నా తత్వాన్ని మార్చలేదు.

బౌద్ధమతం నిరుత్సాహయుతమైన శాంతమతమా? అని ప్రశ్న. దానిని విశదీకరించినవారు ఆలాగే చెప్పవచ్చును. దానిభక్తులు కూడా ఆవిధంగానే అర్థంచేసుకుని వుండవచ్చును. ఆ మతంలోని సూక్ష్మాతి సూక్ష్మములను గురించి కాని, తరువాత సంక్రమించిన వాసనలను గురించి కాని ఇదమిత్థమని నే నేమీ చెప్పడానికి సమర్థుడనుకాను. కాని బుద్ధునిగురించి ఆలోచించినప్పుడు మాత్రం నాకు అలాంటి భావాలేమీ కలుగవు. నిరుత్సాహం, శాంతిమీదనే ఆధారపడుండే మతం ప్రపంచం లో ఇంతమంది ప్రతిభావంతులైన ప్రజల నాకర్షింపగలుగుతుందని నే నూహింపజాలను.

అసంఖ్యాకులైన చిత్రకారులు అపారమైన ప్రేమతో బుద్ధుని ఆకారన్ని రాతితోనూ, చంద్రకాంతశిలలతోనూ, కంచుతోనూ చిత్రించారు. వారంతా ఆ చిత్రాల్లో భారతీయతత్త్వంలోని ఒక మహత్తర భావాన్ని రూపొందించారని తోస్తుంది. పద్మపత్రంమీద ఆసీనుడై, ప్రశాంతంగా, ఏవిధమైన ఉద్వేగం కాని కోరికగాని లేకుండా, ప్రపంచంలోని నిత్యసంఘర్షణలతో ఏమీ నిమిత్తంలేకుండా, మన కందుబాటులో లేనట్లు కనబడుతాడు. మరొక్కసారి తేరిపారచూస్తే కదలికలేని ఆ మూర్తిలో ఒకవిధమైన అపూర్వ ఉద్వేగం,జుగుప్స గోచరమవుతాయి. నిమీలితనేత్రుడైన ఆ మూర్తివంతంలోనుంచి అత్యద్భుతమైన ఆధ్యాత్మికశక్తి తొణికసలాడి, ఒక జీవశక్తిని విజృంభింపచేస్తుంది. ఎన్నోవేల సంవత్సరాలు గతించినా, మొన్నమొన్నటివాడులాగే కనబడుతాడు. ఆయనధ్వని మనచెవుల్లో వినబడుతున్నట్లే ఉంటుంది. జీవితంలోని సంఘర్షణలకు భయపడి పారిపోవద్దనీ, వాటిని నిర్భయంగా ప్రశాంతంగా ఎదిరించి జీవితాభివృద్ధిని సాధించమని ఆయనప్రబోధిస్తున్నట్లే ఉంటుంది.

ఎప్పటిలాగే ఈనాడుకూడా వ్యక్తియొక్క మహత్తు గణనీయం కాకతప్పదు. బుద్ధునివలె నేటికికూడా తలచుకుంటే శరీరం ఝల్లుమనే టంతగా తన ప్రభావాన్ని మానవులపై వ్యాపింపచేసినవ్యక్తి మహాను భావుడనడానికేమీ సందేహంలేదు. 'ప్రశాంతమైన మూర్తివంతము, సమస్తజీవకోటులపైన దయ, బాధలుపడుచున్న జీవరాసులయెడ సాను భూతి, నైతికస్వేచ్ఛ, ద్వేషరాహిత్యము మొదలైన సద్గుణములయొక్క పరిపూర్ణ మూర్తిభావమే బుద్ధుడు' అన్నాడు బార్తో. ఆలాంటి మహా పురుషుని కన్న దేశానికీ, జాతికీ మహత్తరమైన అనంతమైన వివేకసంపద, బలసంపద ఉన్నాయంటే ఆశ్చర్యమేమీలేదు.

## ౨౧ అశోకుడు

మౌర్యవంశీయుడైన చంద్రగుప్త మహారాజు భారతదేశానికి పాశ్చాత్యదేశాలతో కలిగించిన సంబంధబాంధవ్యాలు ఆయన కుమారుడైన బిందుసారుని రాజ్యపాలనలో కూడా యథాతథంగా ఉంటూనే వచ్చాయి. పాటలీపుత్రనగరానికి ఈజిప్టురాజుదగ్గరనుంచీ, పశ్చిమాశియా పరిపాలకుడైన సెల్యూకస్ కుమారుడు ఆంటియోకస్ దగ్గరనుంచీ రాయబారులు వచ్చారు. చంద్రగుప్తుని మనుమడైన అశోకమహారాజుకాలంలో ఈ సంబంధాలు, రాకపోకలు మరింత హెచ్చినాయి. ఆయనకాలంలో బౌద్ధమతవ్యాప్తివలన భారతదేశ మొక అంతర్జాతీయకూడలి అయింది.

క్రీ. పూ. 273 సంవత్సరంలో అశోకుడు సామ్రాజ్యాని కధిపతి యైనాడు. అంతకుపూర్వం, విశ్వవిద్యాలయకేంద్రమైన తక్షశిల నగ రంలో పశ్చిమోత్తరపరగణా రాజప్రతినిధిగా పనిచేశాడు. అప్పటికే మౌర్య సామ్రాజ్యం భారతదేశంలో చాలాభాగంవరకూ వ్యాపించింది. మధ్యఆసియాలోనికికూడా వ్యాపించింది. ఆగ్నేయభాగం దక్షిణదే శంలో కొంతభాగం మాత్రం సామ్రాజ్యంలో చేరలేదు. భారతదేశా న్నంతనూ ఏకచ్ఛత్రాధిపత్యంలోనికి తీసుకురావలెననే ఆశ అశోకుడికి కలిగింది. వెంటనే ఆయన కళింగరాష్ట్రంమీద దండయాత్ర ప్రారం భించాడు. కళింగరాష్ట్రమంటే నేటి ఒరిస్సా, ఆంధ్రలోని కొంతభాగము. కళింగప్రజలు చాలా పట్టుదలతో అశోకునిసైన్యాలను ఎదిరించారు.

కాని చివరకు అశోకుని సైన్యాలు జయించాయి. ఆ యుద్ధంలో చాలా మంది సైనికులు హతమైనారు. ఆ వార్త వినడంతోనే అశోకుని మనస్సు చాలా క్షోభించింది. యుద్ధమంటే అసహ్యము, విముఖత్వమూ కలిగింది. చరిత్రలో ఆయన మహా విజేతగా ప్రఖ్యాతిచెందేడు. కాని ఆ విజయోత్సాహంలోనే ఆయన యుద్ధాలలో పాల్గొనరాదని శపథం పట్టేడు. ఒక్క దక్షిణదేశం తప్ప యావద్భారతదేశమూ ఆయన రాజరాజరికత్వాన్ని అంగీకరించింది. కావాలంటే ఒక్కతృటిలో ఆయన దక్షిణదేశాన్నికూడా స్వాధీనంచేసుకోగలిగిన శక్తివంతుడై యున్నాడు. కాని బుద్ధునిప్రబోధఫలితంగా యుద్ధకార్యక్రమాన్ని విరమించుకున్నాడు. దానిస్థానే ఆయన విజయాలను ఇతర రంగములలో సాధించి విఖ్యాతుడైనాడు.

అప్పట్లో అశోకునిమనస్సులో ఏ అభిప్రాయాలుండేవో, ఆయన ఏ రీతిగా ప్రవర్తించాడో తెలుసుకోవడానికి ఆయన రాళ్ళమీద, లోహాలమీద చెక్కించిన ప్రవచనాలే సాక్ష్యం. భారతదేశమంతటా వ్యాప్తమైఉన్న ఆ ప్రవచనాలు ఇప్పటికీ ఉన్నాయి. ఆయనసందేశాలను అవి ఆనాటిప్రజలకేకాకుండా ఈనాటిప్రజలకుకూడా అందచేస్తున్నాయి. ఒక శాసనంలో ఇలా వ్రాయబడింది: "పూజ్యులైన అశోకచక్రవర్తి దీక్షనుపూనిన ఎనిమిదవయేట కళింగరాజ్యాన్ని జయించారు. లక్షా ఏభైవేలమంది కాళింగులు బందీలుగా తీసుకొనిపోబడ్డారు. లక్షమంది చంపబడ్డారు. అసంఖ్యాకులుగా జనం చనిపోయారు..........కళింగ రాజ్యాన్ని స్వాధీనంచేసుకున్నతర్వాత పరమపవిత్రులైన చక్రవర్తిలో ధర్మనిష్ఠ, తపస్సంపన్నత అధికమైనాయి. అంతకుపూర్వం స్వాధీనం కాని దేశాన్ని స్వాధీనంచేసుకోవడంకొరకు హత్యాకాండ, నిర్బంధాలు తప్పవు కనుక, కళింగరాజ్యంలో జరిగిన హత్యాకాండకు చక్రవర్తి మనస్సు సంక్షోభించింది. అందుచేత మహారాజులుంగారికి చాలా విచారమూ మనస్తాపమూ కలిగినవి."

అశోకుడు ఇకముందు ఇలాంటి హత్యలను కాని, నిర్బంధములను కాని భరించడనీ, కళింగరాజ్యంలో జరిగిన దురంతాల్లో వందో వంతు, వెయ్యోవంతుకూడా సహించడనీ ఆ శాసనంలో వ్రాయబడింది. నిజమైన విజయాన్ని మనుష్యులహృదయాలమీద సాధించాలనీ, ధర్మ

దీక్షవల్ల, పవిత్రతవల్ల మాత్రమే అలాంటి విజయం సాధ్యమనీ ఆయన వ్రాశాడు. అలాంటి విజయాలు తన దేశంలోనూ పరదేశాల్లోనూ సంభవించినాయని కూడా అశోకచక్రవర్తి శాసనాల్లో వ్రాయించాడు. ఆ శాసనంలో ఇంకా ఇలా వ్రాయబడింది:

"చక్రవర్తియెడల ఎవరైనా అపచారం చేసినా, వీలైనంతవరకు దానిని ఆయన సహించవలసినదే. ఆయన రాజ్యంలోని ఆటవికజనాన్ని కూడా ఆయన చాలా దయతో పాలిస్తారు. వారిని సరియైనమార్గంలో పెట్టడానికి ప్రయత్నిస్తారు. అలా చేయకపోతే ఆయనకు చాలా పశ్చాత్తాపం కలుగుతుంది. సమస్తజీవరాసులు నిర్భయంగానూ నిగ్రహంతోనూ, సంతోషంతోనూ, మనశ్శాంతితోనూ జీవించాలని శ్రీ చక్రవర్తిగారి కోరిక."

ఈనాటికీ ఇండియాలోనూ ఆశియాలోనూకూడా ఎంతో ప్రేమపాత్రుడైన అశోకచక్రవర్తి బౌద్ధమతసిద్ధాంతాలను ప్రచారంచేయడానికి కంకణంకట్టుకున్నాడు. ధర్మదీక్షనుపూని, ప్రజాక్షేమంకొరకు కష్టించాడు. ఆత్మోద్ధరణకోసం తపోనిష్ఠనుపూని, లోకంలో జరుగుతుండే పనులను చూస్తూ ఆయన ఊరుకోలేదు. ప్రజలకుసంబంధించిన పనిపాటులలో నిమగ్నుడైనాడు. అందుకు సర్వథా తన సంసిద్ధతను వెల్లడించాడు. "నేను భోజనంచేస్తున్నా, అంతఃపురంలోఉన్నా, పడకగదిలో ఉన్నా, ఉద్యానవనవిహారంలో ఉన్నా, మరెక్కడున్నా, సర్వవేళలందు నా వేగులవారు నాదగ్గరకువచ్చి, ప్రజావ్యవహారముల మంచిచెడ్డలను నాకు తెలియచేయవలసినదే...నే నేప్రదేశంలో ఏ అవస్థలో ఉన్నా, ప్రజాసంక్షేమంకోసం పాటుపడవలసినవాడినే."

అశోకునిరాయబారులు, సందేశకులు సిరియా, ఈజిప్టు, మెసిడోనాసిర్నీ, ఎపిరస్ మొదలైన దేశాలకు పోయి, అచట ఆయన శుభాకాంక్షలను, బుద్ధునిసందేశాన్ని ఆయాప్రజలకు అందిచ్చారు. మధ్యఆసియాకు, సయాం, బర్మాదేశాలకుకూడా ఆయన తనరాయబారులను పంపేడు. తనకొడుకు మహేంద్రుని, కూతురు సంఘమిత్రను దక్షిణమున సింహళమునకు పంపించాడు. ఎక్కడి కెవరిని పంపినా ఏవిధమైన బలప్రయోగంచేయకుండా, జనులహృదయాలకు, మనస్సులకు నచ్చేటట్లుగా ప్రబోధంచేయించాడు. తాను బౌద్ధుడైనా, అన్యమతాల

యడల గౌరవాన్ని, సహనాన్ని ప్రదర్శించాడు. ఒకానొక శాసనంలో ఆయన ఇలా ప్రకటించాడు:

"అన్నిమతాలు, కులాలు ఏదో ఒకకారణంవల్ల గౌరవపాత్రములే. అన్యమతమును గౌరవించడంవల్ల మానవుడు వారిని గౌరవించడమేకాకుండా తన మతానికికూడా ఎంతో ఘనమైన సేవచేసినవాడవుతున్నాడు"

బౌద్ధమతం హిందూదేశంలో కాశ్మీరదేశంనుండి సింహళద్వీపం వరకూ త్వరత్వరగా వ్యాప్తిచెందింది. నేపాళదేశంలో ప్రవేశించి పిమ్మట టిబెట్, చైనా, మంగోలియా దేశాలలోకూడా వ్యాప్తమైంది. హిందూదేశంలో ఈ మతం వ్యాప్తిచెందడంవల్ల శాఖాహారులసంఖ్య పెరుగడమూ, మద్యపానంచేసేవారిసంఖ్య తగ్గడమూ సంభవించింది. అంతవరకు బ్రాహ్మణ, క్షత్రియులు ధారాళంగా మాంసమును భుజించి సారాయము సేవించేవారు. జంతుబలి నిషేధింపబడింది.

విదేశాలతో సంబంధబాంధవ్యాలెక్కువవడంచేత వ్యాపార వాణిజ్యాలుకూడా వృద్ధిచెందిఉండాలి. మధ్య ఆసియాలో (ఇప్పటి సింగ్‌కియాంగ్) ఖోటాన్‌లో ఒక భారతీయనగరం ఉండినట్లు చరిత్రకాధారాలు కనబడుతున్నాయి. భారతవిశ్వవిద్యాలయాలు ముఖ్యంగా తక్షశిల పరదేశవిద్యార్థులను చాలామందిని ఆకర్షించింది.

అశోకుడు గొప్ప గొప్ప శిల్పాలను కట్టించిన నిర్మాత. కొన్ని గొప్ప గొప్ప భవనాలను నిర్మించడానికాయన విదేశాలనుండి పనివాళ్ళను పిలపించినట్లు చెపుతారు. ఆయన నిర్మాణంచేసిన భవనాలలో కొన్నిస్తంభాలలోని శిల్పచాతుర్యం పెర్సిపోలిస్‌ను స్ఫురణకు తెస్తూఉండడం చేత అలా ఊహించవలసొస్తున్నది. కాని అంతటి ప్రాచీనశిల్పఖండాల్లోకూడా భారతీయచిత్రకళాసాంప్రదాయాలు స్పష్టంగా కనుబడుతున్నాయి.

పాటలీపుత్రనగరంలో అశోకనిర్మితమైన రాజభవనంలో, అనేక స్తంభాలమీాద నిర్మాణం చేయబడిన చావడిని, 30 సంవత్సరాలక్రిందట మన పురాతనవస్తుపరిశోధకులు త్రవ్వి బయటపెట్టేరు. సుమారు రెండువేలసంవత్సరాలక్రిందట ఆ కొయ్యస్తంభాలను అక్కడ ఉంచిననాడు ఎంత సాఫుగా, నునుపుగా ఉండినాయో, నేడు

కూడా అలాగే ఉన్నాయి. కర్రను చెడిపోకుండా ఉంచడమూ, కర్రకూ కర్రకూ అతుకుపెట్టేటప్పుడు అతుకు కనుపడకుండా అంచులు కలుపడమూ, చూపరుల కెవ్వరికైనా ఆశ్చర్యాన్ని, సంభ్రమాన్ని కలిగించకమానదు. ఆ నిర్మాణమంతా బహు జాగ్రత్తతోనూ సున్నితంగానూ నిర్మింపబడింది. బహుశా ఈనాడు ఆ పనికి మించిన పని నెవ్వరూ చేయలేరు. వాస్తవంలో ఆ నిర్మాణంవంటి నిర్దుష్టమైన పని మరొకటి లేదు" అని ఇండియాప్రభుత్వ ఆర్కియాలాజికల్ డిపార్టుమెంటు ఉద్యోగస్థుడు డాక్టర్ స్పూనర్ తన నివేదికలో వ్రాశాడు.

మనదేశంలో ఇతరప్రాంతాల్లోకూడా బయటబడిన పూర్వకాలపు భవంతులతాలూకు కొయ్యదూలాలు, వాసాలు చెక్కుచెదరకుండా దొరికినాయి. ఇది ఎక్కడైనా ఆశ్చర్యకరమైన సంగతే. అందులో అతి శీతోష్ణాలవల్లనూ, చెదపురుగులవంటి వివిధ కీటకముల వల్లనూ ఎక్కువగా చెడిపోవడానికి వీలైన హిందూదేశంలో మరీ ఆశ్చర్యకరమైన సంగతి. ఆ కొయ్యను చెడిపోకుండా ఉంచడాని కేదో ప్రత్యేకమైన సాధకం ఉండి వుండాలి. అదేదోమాత్రం నేటికీ అభేద్యమైన రహస్యమేనని నా నమ్మకం.

పాటలీపుత్రానికీ (నేటి పాట్నా) గయాక్షేత్రానికీ మధ్య నలంద విశ్వవిద్యాలయంతాలూకు చిహ్నాలున్నాయి. ఆ విద్యాలయ మెప్పుడు ప్రారంభమైనదో తెలుసుకోడానికి విస్పష్టమైన ఆధారాలేమీ లేవు. అశోకునికాలంలో దానినిగురించిన చారిత్రకాధారాలు కనుబడవు.

అశోకుడు క్రీ. పూ. 232 సంవత్సరంలో మరణించాడు. ఆయన 41 సంవత్సరాలు దీక్షతో ప్రజాపాలనచేశాడు. ఆయునను గురించి హెచ్. డి. వెల్సు ఇలా వ్రాశాడు : "ప్రపంచచరిత్రలో అనేక వేలమంది రాజులపేర్లు, మహారాజులపేర్లు, చక్రవర్తులపేర్లు క్రిక్కిరిసి ఉన్నాయి. వాటన్నిటిలోనూ అశోకునిపేరు ఒక్కటే మహత్తరప్రకాశంతో వెలిగే తారలాగున కనుబడుతుంది. వోల్గానుంచి జపానువరకూ ఈనాటికీ ఆయనపేరును అతి పవిత్రంగా స్మరిస్తారు. చైనా, టిబెట్, ఇండియా దేశాలు అశోకునిసిద్ధాంతాలను త్యజించినా, ఆయన మహాత్మాసంప్రదాయాన్ని మాత్రం సురక్షితంగా ఉంచారు. అసంఖ్యాకులైన జనులు నేటికి ఆయనదివ్యస్మృతితో ఆనందిస్తూనే ఉంటారు."

# గతయుగాలలో

## గుప్తులకాలములో జాతీయవాదము, సామ్రాజ్యవాదము

మౌర్యసామ్రాజ్యం అంతర్ధానమయింది. దానిస్థానే వచ్చిన శుంగవంశం దానికంటె తక్కువ వైశాల్యమునే పాలించింది. దక్షిణాన పెద్దపెద్ద రాజ్యాలేర్పడుతున్నాయి. ఉత్తరాన బాక్ట్రియనులు (ఇండో-గ్రీకులు) కాబూలునుంచి పంజాబువైపు విస్తరిస్తున్నారు. వారు మెనాండర్ ఆధ్వర్యాన పాటలీపుత్రముపై దండెత్తారు. కాని, ఓడించబడి, తరిమివేయబడ్డారు. ఆ మెనాండరే భారతదేశపు వాతావరణానికీ, ఆత్మకూ ముగ్ధుడై బౌద్ధుడయ్యాడు. ఆయనే 'మిళిందరాజు' గా బౌద్ధ కథలలో ప్రఖ్యాతివహించి, ఋషివలె గౌరవించబడినాడు. భారత, గ్రీకు సంస్కృతులసమ్మేళనంనుంచి గాంధారదేశపు (ఆఫ్ఘనిస్థానము, సరిహద్దురాష్ట్రములు కలసి) గ్రీకు-బౌద్ధకళ ఆవిర్భవించింది.

మధ్యభారతదేశంలోని సాంచీ సమీప 'బెస్‌నగర్' వద్ద క్రీ. పూ. 1వ శతాబ్దికి చెందిన నల్లరాతిస్తంభం ఒకటుంది. 'హెలియోడరస్ ధ్వజ' మనబడు ఆ స్తంభంమీద ఒక సంస్కృతశాసనం వుంది. దీనినిబట్టి మనసరిహద్దులలోనికి వచ్చిన గ్రీకులు ఏవిధంగా భారతీయులుగా పరిణమించారో, ఏవిధంగా మనసంస్కృతిని అవగాహనచేసుకున్నారో సూక్ష్మంగా తెలియగలదు. ఆ శాసనం యీవిధంగా అనువదింపబడింది : "దేవాదిదేవుడైన వాసుదేవుని (విష్ణువు) యీ గరుడధ్వజం-గ్రీకుమహారాజగు ఆంటియల్సిడాస్ వద్దనుండి, ప్రజారక్షకుడగు కాశీపుత్ర భగభద్రుడు తన రాజరికపు 14వ సంవత్సరమును గడుపుచుండగా రాయబారిగా వచ్చినవాడును, తక్షశిలనివాసుడును, డియోన్ పుత్రుడును, విష్ణుభక్తుడునునగు హెలియోడరస్‌చేత యిచట నిలుపబడినది."

"ఈ మూడు అమర సూత్రములు బాగా అనుసరింపబడినప్పుడు, స్వర్గమునకు నడుపును—ఆత్మసంయమనము, ఆత్మత్యాగము (ధర్మము), ఆత్మశుద్ధి."

మధ్య ఆసియాలోని ఆక్సస్ మైదానములో—శకులు లేక సిథియనులు (సెయిస్తాన్ - శకస్తాన్) స్థిరపడిపోయారు. ఇంకా తూర్పు నుంచి వచ్చిన "యో-చీ" లు వారిని ఉత్తరభారతంలోనికి పారద్రోలారు. ఈ శకులు మతాంతరులై బౌద్ధులు, హిందువులు అయ్యారు. "యో-చీ" లలో ఒక శాఖయగు కుషానులు ఆధిక్యతను నెలకొల్పుకొని, ఉత్తర హిందూస్థానమువరకు తమపాలనను వ్యాపింపచేసుకున్నారు. వారు శకులను యింకా దక్షిణానికి తరిమివేయగా, శకులు కథియవాడ్, దక్కనులకు పోయారు. ఆతర్వాత కుషానులు ఉత్తరభారతమంతటినీ, మధ్య ఆసియాలో ఎక్కువభాగాన్నీ తమ సామ్రాజ్యంగా చేసుకున్నారు. వారిలో కొందరు హిందూమతాన్ని, ఎక్కువమంది బౌద్ధమతాన్ని స్వీకరించారు. వారి రాజులలో సుప్రసిద్ధుడగు కనిష్కుడు బౌద్ధగాథలలోనికెక్కిన మహాపురుషులలో ఒకడు. ఆ గ్రంథాలాయన గొప్పపనులనూ, ప్రజాక్షేమకార్యకలాపాలనూ ఉగ్గడిస్తాయి. కనిష్కుడు బౌద్ధుడైనప్పటికీ—జొరాష్ట్రిమతసూత్రాలుకూడా కొంతవరకు కలసిన మిశ్రమమతమే ప్రభుత్వమతంగా వున్నట్లు కనిపిస్తుంది. సరిహద్దుల నతిక్రమించి ఆవరించిన యీ కుషానుసామ్రాజ్యానికి రాజధాని నేటి పెషావరు సమీపాన వుండేది. పురాతన తక్షశిలావిశ్వవిద్యాలయం కూడా దాపుననే వుండడంవల్ల, ఇచట అనేకదేశాలవ్యక్తులు కలుసుకుంటూ వుండేవారు. భారతీయులకు ఇచట సిథియనులు, యో-చీలు, ఇరానియనులు, బాక్ట్రియన్ గ్రీకులు, తురుష్కులు, చైనీయులతో సంబంధాలేర్పడడంవల్ల, ఒకరిసంస్కృతీప్రభావం మరొకరిసంస్కృతిపై పడేది. వీరి పరస్పరసమ్మేళనాలవల్ల ఒక తీవ్రలక్షణంగల శిల్ప, చిత్రలేఖనావిధానం ప్రభవించింది. చారిత్రకంగా, యీకాలంలోనే చైనా, భారత దేశాలమధ్య మొట్టమొదటి సంబంధాలు యేర్పడ్డాయి. క్రీస్తుశకం 64 వ సంవత్సరంలో చైనారాయబారవర్గం ఒకటి ఇండియాకు వచ్చింది. చైనా ఇండియాకు బహుమతిగా తెచ్చిన పీచ్, పియర్ వృక్షాలు స్వల్పమైనప్పటికీ, ఎంతో సంతోషంతో స్వీకరింపబడ్డాయి. సరిగా గోబీయెడారిసరిహద్దుపై గల టర్ఫాన్, కుఛాలవద్ద భారత, చైనా, ఇరాను సంస్కృతుల మహాకర్షణీయచిహ్నాలు తలెత్తినవి

కుషానుయుగంలో ఒకక్లిష్టత బౌద్ధమతాన్ని రెండుశాఖలుగా - మహాయాన, హీనయానాలుగా - విభజించింది. ఆరెంటిమధ్య గొప్ప వాదోపవాదాలు చెలరేగాయి. భారతీయసాంప్రదాయంప్రకారం, ఈవివాదాన్ని - దేశం నలుమూలలనుంచీ వచ్చిన ప్రతినిధులమహాసభలలో చర్చకుపెట్టారు. ఈ సామ్రాజ్యానికి మధ్యస్థానంలోవున్న కాశ్మీరు ఈ చర్చల సభలతోనూ, సాంస్కృతికకార్యకలాపాలతోనూ నిండిపోయింది. ఈ వాదోపవాదాలసందర్భంలో ఒకరిపేరు ప్రముఖంగా కనిపిస్తుంది. ఆయన నాగార్జునుడు; క్రీ. శ. ప్రథమశతాబ్దివాడు. ఆయన బౌద్ధపాండిత్యంలోనూ, హిందూ వేదాంతతత్వంలోనూకూడా ప్రజ్ఞానిధి గనుక, ఆయనవ్యక్తిత్వం సమకాలికులందరికంటె మహోన్నతమయినది. ఆయనవల్లనే భారతదేశంలో మహాయానబౌద్ధము సఫలమయింది. మహాయానసిద్ధాంతము చైనాకు వ్యాపించగా, హీనయానసూత్రాలు సింహళ, బర్మాదేశాలకు వ్యాపించాయి.

కుషానులు తమంతతాము భారతీయులుగా పరిణమించి, భారతీయసంస్కృతిని పోషించారు. అయినప్పటికీ - అంతర్గతంగా వారిపాలనపట్ల జాతీయుల వ్యతిరేకభావము కొనసాగుతూనేవుంది. ఆ తర్వాత, అనేక తెగలు ఇండియాలోనికి వసుగెత్తుకురావడంతో, క్రీ. శ. నాలుగవశతాబ్దంలో ఈ జాతీయవాద, విదేశీవ్యతిరేకోద్యమం ఒక రూపును దాల్చింది మరొక గొప్ప పాలకుడు చంద్రగుప్తుడను పేరుగలవాడు. యీ దుండుడుకుతండాలను తరిమికొట్టి, శక్తివంతమూ, మహావిశాలమూనగు సామ్రాజ్యాన్ని స్థాపించాడు.

ఆవిధంగా క్రీ. శ. 320 లో ప్రారంభమైన సామ్రాజ్యగుప్తుల యుగం యుద్ధాలలో, కళలలో, శాంతిస్థాపనలో అజేయులైన ప్రఖ్యాత పాలకులను వరుసగా సమర్పించింది. వరుసగా దండయాత్రలు రావడంవల్ల, విదేశీ వ్యతిరేకభావన పెంపొందింది. పురాతన బ్రాహ్మణ, క్షత్రియ వర్గాలు తమ మాతృదేశాన్నీ, సంస్కృతినీ సంరక్షించుకోవాలనే దృక్పథంతో ఆలోచించక తప్పలేదు. భారతీయులలో కలసిపోయిన విదేశీ వర్గాలను భారతీయులుగా అంగీకరించారు. కాని, కొత్తవారి రాకను బలంగా ఎదురించారు. పురాతన బ్రాహ్మణసూత్రధర్మాల ప్రాతిపదికపై ఏకపాలనారాజ్యాంగాన్ని నిర్మించ ప్రయత్నించారు. కాని,

పూర్వపు ఆత్మవిశ్వాసం సన్నగిలసాగింది; ఈ ఆదర్శాలలో ఒకరకమైన పాషండకఠినత (యథాప్రకృతికి విరుద్ధమైన లక్షణం) పెంపొంద సాగింది ఇండియా శారీరకంగానూ, నైతికంగానూ ఒక సంకుచిత, కాఠిన్య గుహాంతర్భాగాన ముడుచుకుపోసాగింది.

అయినప్పటికీ ఆ గుహ తగినంత వెడల్పూ ఎత్తూ కలిగియే వుంది. లోగడ, అనగా ఆర్యులు తా మెరిగిన ఆర్యావర్తము లేక భారతవర్షమునకు వచ్చినప్పుడు, భారత దేశము నెదుర్కొనిన సమస్య—క్రొత్తజాతి దాని సంస్కృతికీ, దేశంలోని పాతజాతి దాని నాగరికతకూ సమ్మేళనావిధానమును, మధ్యేమార్గమును నిర్మించుటే. దానికే భారత దేశహృదయ మంకితమై, భారతీయార్యసంస్కృతియను బలీయమగు పునాదులపై చిరకాలం మనగల పరిష్కారాన్ని సాధించింది. ఇతరవిదేశశక్తులు వచ్చాయి, కలసిపోయాయి; కాని వాటివల్ల పెద్ద తేడా ఏమీ యేర్పడలేదు. భారత దేశానికి వర్తకాదులద్వారా విదేశాలతో అనేక సంబంధాలేర్పడినప్పటికీ; ముఖ్యంగా అంతర్ముఖియైనదే గాని, పరిసరాలలో జరుగుతున్న విశేషాలను గమనించలేకపోయింది. కాని, ఇపుడు విచిత్రమైన ఆచారాలుగల విచిత్రజాతులు తరుచుగా దండెత్తివచ్చి కలగుండుపరుస్తున్నాయి. ఇండియా యిక నీ కంపాలను లెక్క జేయకుండా వుండలేదు. ఈ కంపనలు దాని రాజకీయనిర్మాణాన్ని ఛిన్నాభిన్నంచేయడమేగాక, సాంస్కృతికాదర్శాలనూ, సాంఘికనిర్మాణాన్నికూడా ప్రమాదంలో ముంచేటట్లున్నాయి. దీనిపై కలిగిన ప్రతిసంచలనం ముఖ్యంగా జాతీయవాదస్వభావం గలది. అందులో జాతీయవాదంలో తరచుగావుండే సంకుచితత్వమూ, బలమూకూడా వున్నాయి. మతము, తత్వము, చరిత్ర, సాంప్రదాయము, ఆచారము, సంఘనిర్మాణముల సమ్మిశ్రమమే బ్రాహ్మణమతం లేక (తరువాతకాలపుపేరులో) హిందూమతం. ఇది తన విశాలావకాశంలో భారతీయజీవితంలోని ప్రతి అంశాన్నీ యిముడ్చుకుంది. ఇదే జాతీయవాదానికి చిహ్నమయింది. ఇది నిజానికి ఒక జాతీయమతం. జాతియొక్క, సంస్కృతియొక్క గాఢలక్షణాలకు యిది ఆకర్షణీయంగా వుంటుంది. ఆ లక్షణాలే నేటిప్రపంచంలో ప్రతి దేశంలోనూ జాతీయవాదానికి పునాదులుగావున్నాయి. భారతీయ భావనకు సంతానమైన బౌద్ధమతమునకుకూడా – జాతీయవాదచరిత్ర

లేకపోలేదు. బౌద్ధందృష్టిలో ఇండియా బుద్ధుడు నివసించి, బోధించి మరణించిన పవిత్రభూమి; ప్రఖ్యాత పండితులు, మునులు బౌద్ధాన్ని వ్యాపింప జేసినభూమి; కాని బౌద్ధమతస్వభావం అంతర్జాతీయమైనది. అశోక ప్రపంచమతం. అందువల్లనే అది పెంపొందినకొలదీ దాని యీ స్వభావం మరింత స్పష్టమయింది. ఆవిధంగా చూస్తే - మరలమరల జాతీయవాదపునరుద్ధరణకు, పాతబ్రాహ్మణమతమే చిహ్నంకావడం సహజమే.

ఈ మతమూ,తత్వమూ భారతదేశంలోని వివిధమతాలూ, జాతులపట్ల సౌహార్ద్రత, గౌరవాలను ప్రదర్శించేవి. తమ విశాలనిర్మాణంలో ఆ యితరులను యిముడ్చుకుంటూనేవున్నాయి. కాని, పరాయివారి ఒరపిడినుండి తమ్ము తాము రక్షించుకునేందుకు, అవి కఠినలక్షణాలను అలవరచుకోసాగాయి. అలా చేయడంలో - తాము రేకెత్తించిన జాతీయవాదం, సామ్రాజ్యవాదలక్షణాలు పొందడంకూడా తరచుగ సంభవించింది. (జాతీయవాదపుబలం పెరిగినకొలదీ సామ్రాజ్యవాదపుటహంకారలక్షణాలు అలవడడం సహజమే.) గుప్తులయుగం విజ్ఞానవంతము, బలిష్ఠము, ఉత్తమసాంస్కృతికము, అపారశక్తియుతము నగుటచే ఈ సామ్రాజ్యవాదలక్షణాలు త్వరితంగా పెంపొందాయి. ఆ యుగపు గొప్పపాలకులలో నొకడగు సముద్రగుప్తుడు "ఇండియన్ నెపోలియన్" అని పిలువబడినాడు. సారస్వత, కళాదృక్పథాలలో చూస్తే యీ యుగం స్వర్ణయుగం.

నాలుగవ శతాబ్దితొలిదశనుంచి సుమారు 150 యేడ్లకాలం, గుప్తులు శక్తి, సంపదలుగల ఉత్తరదేశాన్ని పాలించారు. వారితరువాత వచ్చిన పాలకులు మరొక 150యేండ్లు పాలించినప్పటికీ, వారపుడు రక్షణకే చాలనివారయినందున, సామ్రాజ్యం కృంగి, కృంగి చిన్నదై పోయింది. మధ్యఆసియానుంచి కొత్త దండయాత్రికులు వచ్చి యీ సామ్రాజ్యాన్ని ముట్టడించడం యెక్కువయింది. ఈ దండయాత్రికులను శ్వేతహూణులు అనేవారు. వారు 'అట్టిలా' ఆధ్వర్యాన యూరపును కొల్లగొడుతున్నట్టే, మనదేశాన్ని కొల్లగొట్టసాగారు. వారి బర్బర ప్రవర్తన, రాక్షసక్రూరత్వమూ ప్రజలను రెచ్చగొట్టాయి. యశోవర్మ ఆధ్వర్యాన అన్నిభారతీయరాజ్యాలప్రజలూ ఏకమై, శ్వేత

హూణులను ఢీకొన్నారు. హూణులశక్తి పరాభూతమయింది. వారి నాయకుడు 'మిహిరగులుడు' మన బందీయైనాడు. కాని గుప్తులవారసుడగు బాలాదిత్యుడు మాత్రు దేశ సాంప్రదాయం ప్రకారం, అతనిని దయదలచి, భారత దేశమునుంచి వెళ్ళిపోయేందుకు సమ్మతించాడు. ఈ ఉపకారవర్తనకు ప్రతిఫలంగా, మిహిరగులుడు మరొకసారి దాడెత్తివచ్చి, తన ప్రాణదాతపై స్వామిద్రోహతుల్యంగా విరుచుకుపడి ఆక్రమించాడు.

కాని ఉత్తరభారతంలో హూణులపరిపాలన కొద్దికాలమే (అర్థశతాబ్దికిలోపు) నిలువగలిగింది. తర్వాతకూడా హూణులలో అనేకమంది చిన్నచిన్న సర్దారులుగా ఇండియాలో వుండిపోయి, అప్పుడప్పుడూ అరాజకాలు సృష్టించడం, మరి అనేకులు భారతమానవాంబుధిలో మిళితమైపోవడమూ జరిగింది. ఈ సర్దారులలో కొందరు క్రీ. శ. 7వ శతాబ్ది ఆరంభంలో దురాక్రమణలకు పూనుకోగా-కనోజ్ రాజగు హర్షవర్ధనుడు వారిని ధ్వంసంచేశాడు. ఈ హర్షుడే, తరువాత ఉత్తర, మధ్యభారతములను కలిపి బలమైనరాజ్యాన్ని స్థాపించాడు. ఆయన పక్కా బౌద్ధుడు. కాని, ఆయనబౌద్ధం హిందూమతానికి పోలివుండే మహాయానానికి చెందినట్టిది. ఆయన బౌద్ధ, హిందూమతాలు రెంటినీ ప్రోత్సహించాడు. ఆయనకాలంలోనే ప్రఖ్యాత చైనాయాత్రికుడు హుయాన్‌సాంగ్ ఇండియాకు వచ్చాడు. (క్రీ. శ. 629). హర్షవర్ధనుడు కవి, నాటకకర్త. అతని ఆస్థానంలో కవులు, చిత్రకారులు అనేకులుండేవారు. సాంస్కృతికకార్యకలాపాలకు ప్రఖ్యాత కేంద్రమయిన ఉజ్జయిని అతని రాజధాని. ఇస్లాంమతం అరేబియాయెడారుల్లో పుట్టి, అతివేగంగా ఆఫ్రికా, ఆసియాలవైపు వ్యాపిస్తున్న సమయంలో, క్రీ. శ. 648 లో హర్షవర్ధనుడు పరమపదించాడు.

## దక్షిణ భారతం

మౌర్యసామ్రాజ్యం కృంగి, కృంగి నశించిపోయిన తరువాత వేయేండ్లవరకూ దక్షిణాపథంలో గొప్ప గొప్ప రాజ్యాలు పరిఢవిల్లినాయి. ఆంధ్రులు 'శకులను'ను ఓడించారు. కుషానులకాలంలోకూడా ఆంధ్రసామ్రాజ్యం వుంది. తరువాత పశ్చిమాన చాళుక్యసామ్రాజ్యం ఉదయించింది. అట్టుతరువాత రాష్ట్రకూటులరాజ్యం, ఇంకా దక్షిణాన

పల్లవులు ఉన్నారు. వారే ఇండియానుంచి బైటికి సాహసయాత్రలను ప్రోత్సహించి వలసల నేర్పాటుచేసినవారిలో ముఖ్యులు. ఆ తరువాత వచ్చిన చోళసామ్రాజ్యం ద్వీపకల్పమంతటినీ వశంచేసుకుని, దక్షిణ బర్మా, సింహళాలనుకూడా జయించింది. చోళుల చివరి ప్రఖ్యాత చక్రవర్తి రాజేంద్రుడు క్రీ. శ. 1044 లో మరణించాడు.

దక్షిణభారతం సున్నితమైన వృత్తులకూ, సముద్రవ్యాపారానికీ ప్రసిద్ధిగాంచినది. వారు సముద్రాధిపత్యం వహించినందున, వారి ఓడలు దూర విదేశాలతో వాణిజ్యంనెరపాయి. అచట కొన్ని గ్రీకుల వలసలు ఉండేవి; రోమన్‌నాణెములుకూడా లభించాయి. చాణక్య రాజులు, పర్షియాపాలకులగు 'సాసనిడ్'లవద్ద పరస్పర రాయబార కార్యాలయాలు ఉండేవి.

ఉత్తరభారతంమీద తరచుగా దండయాత్రలు జరుగడంవల్ల దక్షిణభారతం ప్రత్యక్షంగా సంచలించే అవసరం లేకపోయింది. కాని ఇందువల్ల అనేకమంది ఉత్తరంనుంచి దక్షిణానికి వలసలురావ సంభవించింది. అలా వచ్చినవారిలో తాపీపనివారు, చేతివృత్తులవారు, నిపుణ కార్మికులు ఎక్కువ. అందువల్లనే దక్షిణభారతం పురాతన కళాత్మకసాంప్రదాయాలకు కేంద్రం కాగా, ఉత్తరభారతం దండయాత్రికులతో వచ్చిన నూతనప్రభావాలకు అస్తవ్యస్తమైపోయింది. ఈ పరిణామం తరువాత శతాబ్దాలలో మరింత ఎక్కువగా జరగడంవల్ల, హిందూపురాతన ధర్మాచారాదులకు దక్షిణభారతమే నిలయమయింది.

### 3 శాంతియుతపురోభివృద్ధి - యుద్ధవిధానాలు

మరల మరల జరిగిన దండయాత్రలు, సామ్రాజ్యం తరువాత సామ్రాజ్యం ఏర్పడటంవంటి విశేషాలను క్లుప్తంగా సమీక్షించటంవల్ల ఇండియాలో అపుడు ఏమిజరుగుచుండినదో, ఆ అసలుచిత్రాన్నితప్పురూపం లోచూపించుతుంది. ఇంతకుముందు రచింపబడిన విశేషాలు వేయిసంవత్సరాలకు మించినకాలానివని గుర్తుంచుకోవాలి. ఆకాలంలో దేశం సుదీర్ఘసమయాల్లో శాంతియుత, క్రమబద్ధపరిపాలనల ననుభవించింది.

మౌర్యులు, కుషానులు, గుప్తులూ, దక్షిణాన ఆంధ్రులు, చాళుక్యులు, రాష్ట్రకూటులు మొదలగువారూ – ఒక్కొక్కరు రెండు

మూడువందలేసియేండ్లు పరిపాలనసాగించారు. అంటే; బ్రిటిష్సామ్రాజ్యం ఇప్పటికి ఇండియాలోవున్నంతకాలం కంటె, పై ప్రతి ఒక్కరూ ఎక్కువకాలమే పాలించారన్నమాట. దాదాపు యివన్నీకూడా దేశీయమైనవంశాలే. ఉత్తరసరిహద్దుకావలనుంచి వచ్చిన కుషానులుకూడా త్వరలోనే ఈదేశానికనుగుణ్యంగా మారి, దాని సాంస్కృతిక సాంప్రదాయాలననుసరిస్తూ, భారతదేశంలోని భారతీయపాలకుల వలెనే పరిపాలించారు. ఇరుగుపొరుగురాజ్యాలమధ్య అప్పుడపుడూ సరిహద్దుతగాదాలూ, చిల్లర సంఘర్షణలూ వుండేవి. కాని, దేశం మొత్తంమీద శాంతియుతపాలన నెలకొనివుండేది. పరిపాలకులు కళ, సాంస్కృతికకార్యకలాపాలను ప్రోత్సహించడానికి గర్వపడేవారు. ఈ కార్యకలాపాలు రాజ్యసరిహద్దులను దాటిపోయేవి. ఇండియా అంతటా సారస్వత, కళాచరిత్ర ఒక్కటేగదా! మత, తత్వసంబంధమైన ప్రతి వివాదమూ వెంటనే ఉత్తర, దక్షిణాపథాల్లో నలుమూలల వ్యాపించి, చర్చింపబడేది.

ఒకవేళ రెండురాజ్యాలమధ్య యుద్ధం జరిగినా, రాజ్యంలో ఏదైనా రాజకీయవిప్లవం జరిగినా కూడా – ప్రజల కార్యకలాపాలలో చెప్పదగ్గ జోక్యం వుండేదికాదు. పంటలను ఏవిధంగానూ నష్టపరచరాదనీ, భూమి కేవిధమైన హానిని ఉద్దేశ్యపూర్వకంగాచేసినా నష్టపరిహారం యిచ్చుకోవాలనీ, యుద్ధాలు సాగించుతున్న పాలకులకూ, గ్రామస్వపరిపాలనాసంఘాలనాయకులకూ మధ్య ఒడంబడికలు జరుగుతున్నట్లు కొన్నిపత్రాల ఆధారాలున్నాయి. సహజంగా విదేశాలనుంచి దండెత్తి వచ్చేవారికిగాని, అసలు అధికారంకోసమే యుద్ధంజరిగినపుడుగాని ఇట్టి ఒడంబడిక వర్తించదు.

పురాతన భారతీయార్యయుద్ధసాంప్రదాయాన్ని కచ్చితంగా అమలుజరిపేవారు; "న్యాయసమ్మతంకానివిధానాల నవలంబించకూడదు; పవిత్రసిద్ధాంతంకోసం జరిగే యుద్ధాన్ని పవిత్రంగానే జరపాలి" ఈ ఆదర్శానికీ, ఆచరణకూ యెంతవరకూ పొంతనవుండేది అనేవిషయం వేరు. విషబాణాలు ప్రయోగించడం, దాచిన ఆయుధాలతో తలపడడం, నిద్రించేవారిని చంపడం, శరణార్థులైగాని, రాయబారులుగాని, వచ్చిన వారిని చంపడం నిషేధింపబడ్డాయి. చక్కని భవనాలను ధ్వంసంచేయ

రాదని ప్రకటించబడింది. కాని, యీ దృక్పథం చాణక్యునికాలంలో మారజొచ్చింది. శత్రువును ఓడించేందుకు తప్పనిసరయితే ఎక్కువ విధ్వంసకరములు, మోసకరములు నగు విధానాల నవలంబించవచ్చు నని ఆయన అంగీకరించాడు.

చాణక్యుడు తన "అర్థశాస్త్రము"లో యుద్ధాయుధాలను గురించి చెబుతూ, వందమంది నొకేసారి చంపగల యంత్రాలూ, ఒక రకమైన ప్రేలుడుమందుఆయుధాలూ వున్నవని వర్ణించడం మనం ప్రత్యేకంగా గమనించదగ్గది. ఆయన గోతులలో (క్రెంచీలు) నుంచి యుద్ధంచేయడంకూడా వర్ణించాడు. వీటన్నిటియొక్క అసలు స్వరూపా లెట్టివో మన మిపుడు చెప్పడం సాధ్యంకాదు. బహుశా గారడీవిద్యలను బోలిన కట్టుకథలలోని విశేషాల సూచనలేనేమో ! ప్రేలుడుమందు ఆయుధాలంటే తుపాకి లేక బాంబు అనేందుకు తగిన ఆధారాలు లేవు.

ఇండియాదీర్ఘచరిత్రలో కష్టమయమైన సమయాలు అనేక వున్నాయి. అగ్ని, ఖడ్గము, కరువు, మొదలగునవి విజృంభించి, దేశాన్ని అల్లకల్లోలంచేసి, ప్రజాశాంతి భగ్నమైనఘట్టము లెన్నో ఉన్నవి. అయినప్పటికీ, దానిచరిత్రనంతటినీ వీక్షిస్తే - యూరపుదేశాలకంటె ఇండియా ఎక్కువకాలాలపాటు శాంతియుత, క్రమబద్ధజీవితం గడిపిం దని తేలుతుంది. ఈ యథార్థం తురుష్క, ఆఫ్ఘన్‌దండయాత్రలకాలం నుంచి, మొగలుసామ్రాజ్యవిచ్ఛిన్నకాలంవరకూగల బహుళ శతాబ్దాలకాలానికికూడా వర్తిస్తుంది. బ్రిటిష్‌ప్రభుత్వమే ఇండియాలో మొట్టమొదటిసారిగా శాంతిభద్రతలను నెలకొల్పినదనే దురభిప్రాయం ఊహాతీతమైన దుర్భ్రమ మాత్రమే. బ్రిటిష్‌ప్రభుత్వం ఇచట స్థాపింపబడినకాలంలో - ఇండియా మున్నెన్నడూలేనంత హీనస్థితిలో వున్న దనీ, రాజకీయార్థికవ్యవస్థ విచ్ఛిన్నమైయున్నదనీ అనడం సత్యమే. అసలు ఆ పరిపాలన నెలకొనగలగడానికి ఆ పరిస్థితియే కారణం.

## ౪ భారతదేశపుస్వాతంత్ర్యకాంక్ష

"తూర్పుప్రపంచం తుఫానుముందర తలనువంచుకొనియెం
క్షమాహృదయియగు తీవ్ర జుగుప్సాభావముతో;
సైనికదళములం గర్జనచేస్తూ పోనిచ్చెను ఆమె,
మరల వెంటనే ఆలోచనలలో మునిగిపోయె (నామె.)"

—ఒక కవిగారిలా వర్ణించాడు. ఈ పంక్తులు తరచుగా వుదహా రింపబడుతూంటాయి. ప్రాచ్యం లేక దానిలో ఒకభాగమైన భారత దేశం ఆలోచనలను వ్యసనంగా వరించిందనేది యథార్థం. తాము ప్రత్యక్షకార్యవాదులమనుకునేవారికి అసంబద్ధంగా, అర్థరహితంగా కనిపించే విషయాలనుగురించే ఆమె తరచు ఆలోచించేది. ఆమె ఎప్పుడూకూడా ఆలోచనలనూ, ఆలోచనాపరులనూ (మేధావం తులు) గౌరవించేది; కత్తిపట్టేవారినీ, భాగ్యవంతులనూ అంతకంటె ముఖ్యులని భావించ నిరాకరించేది. తాను శోచనీయస్థితికి పడిపోయిన రోజుల్లోకూడా, ఆమె ఆలోచనలకే అంటిపెట్టుకొనియుండి, అందు కొంత ఊరటపొందినది.

కాని, ఇండియా తుఫానుముందు ఓరిమితో తలవంచిందనడం గాని, విదేశీసైనికదళాలు తనమీదుగా వెళ్ళడాన్ని చూస్తూ వూరు కున్నదని అనడంగాని యథార్థంకాదు. ఆమె ఎప్పుడూ అట్టివాటి నెది రిస్తూనేవుంది. కొన్నిసార్లు సఫలమయింది, కొన్నిసార్లు విఫలమయింది. తాత్కాలికంగా విఫలమయినప్పటికీ, ఆమె మరచిపోక, మరో ప్రయ త్నానికై సిద్ధపడింది. ఆమెవిధానాలు రెండురకాలు : వారితో పోరాడి తరిమివేయడం; తరిమివేయలేనివారిని తనలో యిముడ్చుకోవడం. అలెగ్జాండర్ యొక్క సైనికదళాలను ఆమె ఎదిరించింది; తగినంత సాఫల్యం పొందింది; అతడు మరణించిన వెంటనే ఉత్తరానగల గ్రీకుపటాలాలను తరిమివేసింది. తరువాత, మిగిలిపోయిన గ్రీకులను, ఇండో - సిథియను లను తనలో యిముడ్చుకుని జాతీయైక్యరూపాన్ని స్థాపించుకుంది. హూణులను తరాలతరబడి పోరాడి తరిమివేసింది. మిగిలినవారిని యిముడ్చుకుంది. అరబ్బులు వచ్చినప్పుడు ఇండస్ వద్దే ఆగిపోయారు. తురుష్కులు, ఆఫ్ఘనులు క్రమంగా మాత్రమే ఈవలికి వ్యాపించగలి గారు. ఢిల్లీసింహాసనంమీద దృఢంగా కూర్చోవడానికి వారి కనేక శతాబ్దాలుపట్టింది. అది ఒక నిరంతర, సుదీర్ఘసంఘర్షణ. ఈ సంఘ ర్షణ జరుగుతూండగానే, యిముడ్చుకోవడం, భారతీయులనుగా మల చడం అనే ద్వితీయవిధానంకూడా పూర్తిగా అమలుజరుగుతూవుంది. చివరికి దండయాత్రికులుకూడా భారతీయులే అయిపోయినారు. విభిన్న శక్తుల ఏకీకరణ, ఆ శక్తులలోకదానిలో ఒకటి మిశ్రమమై ఒకేజాతిగా

రూపొందుట అనే పురాతన భారతీయాదర్శానికి అక్బర్ మహత్తర ప్రతినిధియైనాడు. అతడు భారతదేశమే తన మాతృదేశమన్నాడు. అతడు కొత్తగా వచ్చినవా డయినప్పటికీ అతన్ని యిండియా ప్రేమిం చింది. ఇందువల్లనే దృఢమైన పునాదులమీద మహత్తరమైన సామ్రా జ్యాన్ని నిర్మించగలిగాడు. అతని తరువాతిపాలకులు యీ విధానాన్ని, యీ భారతీయవిజ్ఞానాన్ని అనుసరించినంతకాలమూ వారిసామ్రాజ్యం మనగలిగింది. ఈ విధానాన్ని విడచి, జాతీయాభ్యుదయగమనాన్ని వ్యతి రేకించగానే, వారిబలం తగ్గిపోయింది; వారి సామ్రాజ్యం ఛిన్నాభిన్నమై పోయింది. కొత్త ఉద్యమాలు తలలెత్తాయి. అవి సంకుచితదృక్పథం గలవైనప్పటికీ, ఒకానొక తీవ్ర జాతీయవాదాన్ని ప్రతిబింబించాయి. అవి శాశ్వతంగా పాదుకొనేందుకు తగినంత బలంగలవి కానప్పటికీ, మొగల్‌సామ్రాజ్యాన్ని నాశనంచేసేందుకు సరిపోయినవి. అవి కొంత కాలం ఫలవంతంగానే వున్నాయి. కాని, ఎప్పుడూ ఎక్కువగా గతం లోకే చూస్తూ, దాన్ని పునరుద్ధరించాలని ఆలోచనలుజరిపాయి. తాము విస్మరించలేని, అధిగమించలేని విశేషాలెన్నో జరిగినవనీ, గతం ఎన్నటికీ వర్తమానంస్థానాన్ని ఆక్రమించలేదనీ, తమకాలంలోని ఆ వర్త మానంకూడా సబద్ధత, క్షీణతలతో కూడియున్నదనీ వారు గ్రహించలేక పోయారు. ఈ లోపంవల్ల – మారే ప్రపంచంతో పరిచయంలేకపోయి నందున, ఇండియా ఎంతో వెనుకబడిపోయింది. కొత్తదృక్పథం, కొత్తవ్యూహాలు, కొత్తశక్తి పునాదులుగా పాశ్చాత్యప్రపంచంలో ఒక కొత్త బలీయప్రపంచం పైకి లేస్తున్నదనేసంగతి వారు గుర్తించ లేదు. వారికే మాత్రమూ తెలియని ఈ కొత్తప్రపంచానికి 'బ్రిటన్' ప్రతినిధి. బ్రిటిష్‌వారు సఫలులయ్యారు. కాని, ఉత్తరాన వారు సరిగా స్థిరపడకపూర్వమే సిపాయీలకలహం ప్రజ్వరిల్లింది. అదే స్వాతంత్ర్య సమరంగా పరిణమించి, దాదాపు బ్రిటిష్‌పాలననే అంతమొందించినంత పనిచేసింది. విదేశీయులఅధికారానికి లొంగరాదనేదీక్ష, స్వేచ్ఛాస్వాతం త్ర్యాలకై కాంక్ష భారతీయులలో ఎప్పుడూ వుంటూనే వచ్చాయి.

మనం మడిగట్టుకున్నట్టుండే మనుషులం. మనగతచరిత్ర, వారసత్వాలకు గర్విసూ దాన్ని భద్రపరచుకునేందుకు చుట్టూ గోడలూ కోటలూ నిర్మించప్రయత్నిస్తాం. స్వజాత్యభిమానమూ, కులకట్లుబాట్ల



కాఠిన్యత పెంపుదల వున్నప్పటికీకూడా - తమజాతి స్వచ్ఛందంగావున్నదని గర్వించే యితరులవలెనే - మనంకూడా అనేకజాతుల విచిత్రమిశ్రమంగా తయారయ్యాం. అది ఆర్య, ద్రవిడ, తురేనియ, సెమిటిక్, మంగోలియాజాతులమిశ్రమం. ఆర్యులిచటికి అనేకతండాలుగా వచ్చి ద్రావిడులతో కలసిపోయారు. తరువాతి వేలాదిసంవత్సరాలలో యితర వలసప్రజలు, తెగలు - మెడియనులు, ఇరానియనులు, గ్రీకులు, బాక్ట్రియనులు, పార్థియనులు, శకులు, కుషానులు, తురుష్కులు, తురుష్క-మంగోలియనులు మొదలగువారు - చిన్నపెద్ద తండాలుగా వచ్చి భారత దేశంలో స్థిరపడిపోయారు. డాడ్‌వెల్ తన 'ఇండియా' గ్రంథంలో యిలావ్రాశాడు; "భయంకరయుద్ధలక్షణాలుగల తెగలు అనేకసార్లు దాని (ఇండియాయొక్క) ఉత్తరమైదానములపై దండెత్తి, రాజుల నోడించి, దానినగరాలనుపట్టుకొని ధ్వంసంచేసి, కొత్త రాజధానులను, కొత్తరాజ్యాలను తాముగా నిర్మించుకుని, మానవప్రవాహంలో కలిసిపోయారు. తమ వారసులకు - త్వరగా కరగిపోయే విదేశ రక్తఛాయను, విదేశీఆచారాల నామమాత్రావశిష్టాలను మాత్రమే యివ్వగలిగారు. అవికూడా-పరిసరముల బలీయవాతావరణంలో ఛాయాభాగాలుగా మారిపోయినవి."

బలీయమైన పరిసరాలు ఎందువల్ల ఏర్పడ్డాయి? భౌగోళిక, వాతావరణాలప్రభావం, భారతదేశపుగాలియే దీనికి కొంతవరకు కారణం. ఇండియాచరిత్రారంభంలో - అది యింకా బాల్యంలో స్వచ్ఛందంగావున్నదశలో దాని అంతరాత్మపై ఒకానొక బలీయమైన ఊహా సంచలనం, ఒక తీవ్రవాంఛ, లేక జీవితపరమార్థాన్నిగురించిన భావన - హత్తుకుపోయివుంటుంది. అదే, తప్పకుండా పైప్రశ్నకు సమాధానం. అలా హత్తుకుపోయినముద్ర శాశ్వతంగా వుండిపోవడమేగాక, దానితో పరిచయంకలిగిన ప్రతివారినీ తదనుగుణంగా సంచలింపచేస్తుంది. పైగా,

వా రెంత విభిన్నులైనప్పటికీ తనలో యిముడ్చుకుని, తనరూపునే వారికి స్తుంది. ఈ దేశంలో అభివృద్ధిచెందిన నాగరికతను కాంతివంతంచేస్తూ చరిత్రలోని యుగయుగాలనుంచీ ప్రజలను ప్రభావంతంచేస్తున్న అగ్ని కణం ఈ ఆత్మసంచలనమేనా, ఈ భావనయేనా?

భారతీయనాగరికతాభివృద్ధికి ఆధారంగా ఒకానొక ఆత్మ సంచలనం, లేదా ఒక జీవితభావన ఉన్నదనడం అసంబద్ధమనీ, ఊహా గానమనీ అనిపిస్తుంది. ఒకేఒకవ్యక్తిజీవితంకూడా వంద నిధులనుంచి ఆధారభూతాల నుపయోగించుకుంటుంది. అలాంటప్పుడు ఒకజాతియొక్క జీవితంగాని, ఒక నాగరికతయొక్క జీవితంగాని ఇంకెంతో క్లిష్టంగా వుం టుందిగదా! భారతదేశంమీద ఆటుపోటులవలె అనంతమైన ఊహాలు నడయాడుతూవుంటాయి. అందులో అనేకం పరస్పరవైరుధ్యం కలిగి వుంటాయి. ఒకానొక సిద్ధాంతాన్ని రుజువుచేసేందుకు ఆ వ్యూహాలలో కొన్నింటిని యేరుకుని వాదించడం బహుసులభం. దానిని ఖండించేం దుకు కావలసిన ఊహాగుచ్ఛంకూడా అంత తేలికగానే దొరుకుతుంది. ఇలాంటిది ప్రతిదేశంలోనూ కొంతవరకు సాధ్యమవుతుంది. పురాతన మైన విశాలభారతదేశంలో-చనిపోయినవాని అనేక విశేషాలు బ్రదికి యున్నవానినికూడా అంటిపట్టుకొనియుండే కర్మభూమిలో అది మరింత తేలిక. అతిక్లిష్టమైన మహావిశేషాన్ని అతిసాధారణమైన పోలికలతో చూడడంలో విస్పష్టమైన ప్రమాదంకూడా వుంది. ఆచరణ, ఆలోచనల పరిణామాలమధ్య స్పష్టమైన పోలికలు వుండడం బహు అరుదు. ఒక ఆలోచన మరోఆలోచనలో చొచ్చుకుపోతుంది. ఆలోచనలుకూడా తమ బాహ్యరూపాన్ని మార్చకుండా, అంతర్విశేషాలను మార్చు కుంటాయి. లేదా మారుతున్న ప్రపంచానికంటె వెనుకబడిపోయి, ప్రపంచానికి భారంగా వ్రేలాడుతూంటాయి.

యుగయుగాలుగా, నిరంతరం మనం మారుతూనేవున్నాం. కాని, ఏ ఒక్క ప్రత్యేకసమయంలోనూ, దానికిముందు జరిగిన సమ యంలోవలె వుండలేదు. జాతిపరంగా, సంస్కృతిపరంగాకూడా మనం లోగడవున్నస్థితిలో ఈరోజున లేము. నాచుట్టూ - ఇండియాలోనూ ఇతరదేశాలలోనూ 'మార్పు' అనేది పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ ముందుకు నడుస్తూఉండడం చూస్తున్నాను. అయినప్పటికీ, భారత,

చైనా నాగరికతలు అతీతమైన మన్నికగుణాన్ని, పరిస్థితుల కనుగుణ్యంగా మారేగుణాన్ని కలిగియున్నవనే యథార్థాన్ని నేను మరువలేను. వేలాదిసంవత్సరాలుగా – అనేక మార్పులూ, అనేక విపరీత సంఘర్షణలూ జరిగినప్పటికీ – ఈ రెండుదేశాలూ తమ ప్రాథమిక ప్రత్యేక స్వభావాన్ని సంరక్షించుకోవడంలో విజయవంతమయ్యాయి. అవి తమ పురాతనఆశ్రయాలకే చాలావరకు కట్టుబడివుండడం ఏకారణంగానైనప్పటికీ – అది మంచిగాని, చెడుగాని, లేక మంచిచెడులమిశ్రమంగాని, అదొక శక్తివంతమైన విశేషమనేది నిస్సంశయం. కాకపోతే అది యింతకాలం మనగలిగేదిగాదు. బహుశా అది తన ప్రయోజకత్వాన్ని ఎన్నడో కోల్పోయి, అప్పటినుంచీ ఒకభారంగా, ఒకఅడ్డంకిగా తయారైవుండవచ్చు. లేక తరువాతియుగాల మహత్తరలక్షణాలు దానిలోని మంచిని దిగ్బంధంచేసియుండడంవల్ల, అది పురాతన శరీరావశిష్టాలుమాత్రమే మిగిలిన ఖాళీగుల్లవంటిది కావచ్చును.

అభ్యుదయమనే భావానికీ, భద్రత, నిశ్చలత అనే భావాలకూ మధ్య ఎల్లప్పుడూ ఒకానొక సంఘర్షణ వుండక తప్పదనుకుంటాను. ఈ రెంటికీ పొంతన కుదరదు. మొదటిది మార్పునుకోరుతుంది. రెండవది మార్పులేని సురక్షితాశ్రయాన్ని – విశేషాలన్నీ యథాతథంగా కొనసాగడాన్ని వాంఛిస్తుంది. అభ్యుదయమనేభావన పాశ్చాత్యదేశాలలో కూడా కొత్తగా కలిగిన అభిప్రాయమే. అందువల్ల ఈ భావన ఆధునికమైనట్టిది. పురాతన, మధ్యయుగాల నాగరికతలు ఎక్కువగా – గతసువర్ణచరిత్రనూ, తరువాతి క్షీణతనూగురించి మాత్రమే ఆలోచించేవి. ఇండియాలోకూడ గతాన్ని ఎప్పుడూ పొగడుతూండేవారు. ఇచ్చట నిర్మించబడిన నాగరికత ముఖ్యంగా నిశ్చలత, భద్రతలనే పునాదులుగా చేసుకుంది. ఈదృక్పథంలో, పాశ్చాత్యదేశాలలో తలెత్తిన ఏనాగరికతకంటె కూడ మన నాగరికత ఎంతో ఎక్కువగా ఫలవంతమైనది. కులపద్ధతి, సంయుక్తకుటుంబాలపై ఆధారపడిన సాంఘికవ్యవస్థ – ఈప్రయోజనాన్ని సాధించింది. ఇది కుటుంబము, కులకూటములకు సాంఘికభద్రతలను కల్పించడంలోను, ముసలితనము, శక్తిహీనత, తదితర కారణములచేత తనను తాను పోషించుకొనలేని వ్యక్తులకు ఒకరకమైన భీమావంటి భద్రతను కల్పించడంలోనూ విజయం సాధించింది. ఈ యేర్పాటు

బలహీనులను ఆదుకొనేదైనప్పటికీ, కొంతవరకు బలిష్ఠుల కాటంక మవుతుంది. అది, అతీతశక్తుల (చెడు లేక అదృష్టవంతము) ఖర్చు మీద సామాన్యులను పోషిస్తుంది. అది అందరిస్థితినీ - పెంచిగాని తగ్గించిగాని ఒకేస్థాయికి మారుస్తుంది. అందులో వ్యక్తిత్వానికి తావులేదు. భారతీయవేదాంతశాస్త్రము ఎంతో వ్యక్తిప్రాధాన్యత గలదైనప్పటికీ, వ్యక్తి ఆత్మపరిపక్వదశవరకూ పెంపొందాలనే విషయాలనే కలిగియున్నప్పటికీ, భారతీయసాంఘికవ్యవస్థ మాత్రం కుల ప్రధానమై, మంది లేక కూటములమీదనే దృష్టినిలుపునట్టిది కావడం కుతూహలకరమైనవిషయం. వ్యక్తి తనకునచ్చినది విశ్వసిస్తూ, తనకిష్ట మైనది ఆలోచిస్తూవుండేందుకు పరిపూర్ణస్వేచ్ఛ వుంది. కాని, అతడు కుల, సాంఘికకట్టుబాట్లకుమాత్రం పూర్తిగా బద్ధుడైవుండాలి.

కూటములలో యింత కట్టుబాటుపద్ధతు లున్నప్పటికీ, ఎంతో అనుగుణ్యమైనసౌలభ్యతకూడావుంది. ఆచారంవల్ల మార్పుచెందని సాంఘిక నియమంగాని, చట్టంగాని ఏదీలేదు. కొత్తకూటములుకూడా తమ స్వంత ఆచారాలు, విశ్వాసాలు, సాంప్రదాయాలు అనుసరించవచ్చును. అయినా మొత్తం సంఘవ్యవస్థలో వారుకూడా భాగస్వాములుగానే భావించబడేవారు. ఈ సౌలభ్యము, పరిస్థితులను సమన్వయించుకునే లక్షణాలే, విదేశీయులను గూడ మనలో యిముడ్చుకొనుటకు కారణమైనవి. దీనికంతటికీ వెనుక - కొన్ని ప్రాథమిక నైతికసూత్రాలు, జీవితాని కొక తత్త్వయుతమైన దృక్పథం, ఇతరమానవులపద్ధతులపట్ల సహన భావము వున్నాయి.

స్థాయి, భద్రతలే ముఖ్యాదర్శంగా వున్నంతకాలము, యీ సంఘవ్యవస్థ చాలావరకు విజయవంతంగా కొనసాగింది. ఆర్థికమైన మార్పులు దాన్ని లోబరచుకున్నప్పుడుకూడా, అది తదనుగుణంగా మార్పువిధానంవల్ల సజీవంగా వుంటూవచ్చింది. దానికి వచ్చిన అసలు సవాలు దాని పురాతనస్థబ్ధభావాలలో యిముడలేని సామాజికాభ్యుదయమనే నూతన సంచలనాత్మకదృష్టివల్లనే. అది పశ్చిమఖండంలో వలెనే తూర్పుఖండంలోకూడా ఏనాటినుంచో నెలకొనివున్న సాంప్రదాయాలవేళ్లనే పెకలించసాగింది. పశ్చిమఖండంలో అభ్యుదయమే ఎక్కువగా ధ్వనిస్తున్నప్పటికీ, భద్రత కావలెననే ఒత్తిడికూడా పెరుగు

తున్నది. ఇండియాలో భద్రత అనేదే లేనందువల్ల; ప్రజలు తమ పాత గొందులనుంచి బైటపడి, ఎక్కువ భద్రతనిచ్చే అభ్యుదయవిధానాలు అవసరమని భావించడం జరిగింది.

పురాతన, మధ్యయుగములనాటి భారతదేశంలో యిటువంటి 'అభ్యుదయప్రసవాలు' లేకపోయింది. కాని, మార్పును, నిరంతరఅనుగుణ్యాతకుగల ఆవశ్యకత గుర్తింపబడినది. అందువల్లనే విభిన్నతల ఏకీకరణను ఎంతో ఆసక్తిచూపబడింది. ఈ ఏకీకరణాసక్తి విదేశశక్తులకు సంబంధించినంతవరకే గాక, వ్యక్తియొక్క బాహ్య అంతరప్రకృతులకు మధ్య, మానవునికీ ప్రకృతికీ మధ్యకూడా జరుపనుత్సహించేది, నేడు కనిపిస్తున్న పెద్ద పెద్ద అగాధాలూ, అంతరాలూ నాడున్నట్లు తోచదు. ఈ సర్వవ్యాప్త సాంస్కృతికచరిత్రయే - ఇండియాలో విభిన్నతలున్నప్పటికీ, సమైక్యత నెలకొన్నట్లు స్ఫురింపజేసింది. రాజకీయ వ్యవస్థకు వేరులాగా గ్రామస్వరాజ్యపద్ధతి వుండేది. ఎందరు రాజులు వచ్చి పోయినా యీ పునాదులుమాత్రం చలించలేదు. ప్రభుత్వశక్తి ఎంత ఎదురులేనిదిగా కన్పించినప్పటికీ, సాంప్రదాయం చట్టనిబంధనలవల్ల వందరకాలుగా ఆకట్టబడేది. ఏపాలకుడూ గూడ గ్రామకూటముయొక్క హక్కులు, అవకాశాలలో జోక్యంకల్పించుకోగలిగిలేడు. ఈ సాంప్రదాయకహక్కులు, అవకాశాలు వ్యక్తికీ, సంఘానికీ ఒక విధమైన స్వేచ్ఛను కల్పించే హామీలుగా వుండేవి.

నేటి భారతీయప్రజలలో రాజపుత్రులకంటె భారతీయులుగా పేర్కొనదగ్గవారూ, వారికంటె భారతీయసంస్కృతి, సాంప్రదాయాలకు గర్వించేవారూ మరెవ్వరూ వుండరు. వారు గతంలో చేసిన వీరోచిత కృత్యాలు ఆ సాంప్రదాయంలో భాగాలైపోయాయి. అయినప్పటికీ, రాజపుత్రులలో అనేకులు ఇండో - సిథియనులనుండి, హూణులనుండి ప్రభవించినవారే నంటారు. భారతదేశంలో 'జాట్'లకంటె బలిష్ఠుడు, సమర్థుడూ అయినరైతు మరెవ్వడూ వుండడు. జాట్ భూమికే అంకితమై, తనభూమిలో ఎవరు జోక్యంకల్పించుకున్నా ఏమాత్రమూ సహించలేని రైతు. కథియవాడులో పొడవుగా అందంగా వుండే రైతుకూడా అట్టివాడే. మనప్రజల్లో కొందరి మూలజాతులను క్రమంగా పరిశీలించి పోల్చుకోవచ్చునుగాని, ఇతరులమూలాలను తెలుసుకోవడం అసంభవం.

కాని, ఎవరిమూల మేజాతియైనప్పటికీ అందరూకూడా స్పష్టంగా భారతీయులైపోయి, భారతీయసంస్కృతిలో పాలు పంచుకుంటూ, దాని గతచరిత్ర, సాంప్రదాయాలు తమవేనని గౌరవభావంతో చూచుకుంటున్నారు.

విదేశాలనుండి ఇండియాకు వచ్చి యిమిడిపోయిన ప్రతిశక్తీ కూడా, తనగుణాల్లో ఏదో ఒకదాన్ని ఇండియాకు ఇచ్చినదనీ, ఇండియానుంచి అనేకగుణాలను తాను పుచ్చుకున్నదనీ తేలుతున్నది. అది తాను బలపడడానికే గాక, మొత్తం దేశాన్ని బలపరచేందుకుకూడా పనికివచ్చింది. కాని, విదేశీశక్తి ఏదైనా మడిగట్టుకున్నట్లుండిపోతే, భారతదేశపు నానావిధ సాంస్కృతికజీవితంలో భాగస్వామినియై, పాలు పంచుకొనలేకపోతే – దానిప్రభావం చిరకాలం వుండేదికాదు. చివరికి అది నశించిపోవడమేగాక, ఒక్కొక్కప్పుడు భారతదేశానికి కొంత హానిని కలిగించేది కూడాను.

## ఇండియా – ఇరాన్

భారతీయజీవితము, సంస్కృతులతో సంబంధాలుకలిగి, సంచలింపజేసి, సంచలితులైన అనేక జాతులలో ఇరాన్ దేశీయులు ముఖ్యులు. వారు అందరికంటె ముందు ఇచటికి రావడమేగాక, అందుకు ఎడతెగని ప్రయత్నాలు చేసినవారుకూడాను. ఈ సంబంధం నిజానికి ఇండో–ఆర్యన్‌నాగరికతఆరంభానికి పూర్వమే జరిగింది. ఎందువల్లనంటే – ఒకే తెగనుంచి ఇండో–ఆర్యనులూ, ఇరానియనులూ శాఖలై వేర్వేరు విధానాలనవలంబించారు. జాతిగా సంబంధం కలిగివుండడమేగాక, వారిపూర్వమతాలు, భాషలుకూడా ఒకేమూలం గలవి. వేదమతానికీ జొరాష్ట్రియన్‌మతానికీ ఎన్నో సామ్యాలున్నాయి. వేదసంస్కృతము, అవెస్తులభాషయగు పురాతన 'పహలవి' భాష దగ్గరపోలికలు కలిగి వుంటాయి. ఆర్యభాషలన్నింటికీ కొన్ని మూలపదాలు సమంగావున్నట్లే–గ్రాంథికసంస్కృతభాషలోగల అనేకపదాలు పర్షియన్‌భాషలోనూ వున్నాయి. ఈ రెండుభాషలూ వేర్వేరుగా పెంపొందాయికూడా. ఈ భాషలు, అంతకంటె ఎక్కువగా వారివారి కళలు, సంస్కృతులు వారి పరిసరవాతావరణాలనుబట్టి ప్రభావితాలయినాయి. పర్షియన్ కళ

దాని భూమితోనూ, ప్రకృతిదృశ్యాలతోనూ అతిసన్నిహితసంబంధం కలిగియున్నట్లు కనిపిస్తుంది. అసలు, ఆ వాతావరణంవల్లనే ఇరానులో నిరంతర కళామయసాంప్రదాయాలేర్పడ్డాయి. అదేవిధంగా భారతీయాద్యుల కళాసాంప్రదాయమూ, ఆదర్శాలూ మన హిమాలయపర్వతాలు, సుందరారణ్యాలూ, ఉత్తరభారతమందలి మహానదుల వల్లనే ఉద్భవించాయి.

ఇండియావలె ఇరానుకూడా సంస్కృతీపునాదులు బలీయమైనవి కావడంవల్ల - తనపై దండెత్తివచ్చినవారిని సంచలింపచేయడం, తనలో యిముడ్చుకోవడం జరిగింది. అరబ్బులు క్రీ. శ. ఏడవశతాబ్దంలో ఇరానును జయించారు. త్వరలోనే ఇరాన్‌సంస్కృతిచే సంచలితులై, తమ ఎడారి సాధారణ జీవితవిధానాలను వదలివేసి, ఇరానుయొక్క కళామయ జీవితసాంప్రదాయాలను అనుసరించసాగారు. యూరపులో ఫ్రెంచిభాషవలె, ఆసియాలో పారసీకభాష నాగరికతగల ప్రజలభాష అయింది. ఇరానుకళలు, నాగరికత పశ్చిమాన కాన్‌స్టాంటినోపుల్‌నుంచి, తూర్పున గోబీయెడారిసరిహద్దులవరకు వ్యాపించినాయి.

ఇండియాలో ఇరానీప్రభావం ఎడతెగకుండావుంది. ఆఫ్ఘను, మొగలుల యుగాలలో పారసీకమే రాజభాషగా వుండేది. బ్రిటిష్ పరిపాలనాప్రారంభంవరకూ యిదే కొనసాగింది. ఆధునిక భారతీయభాషల్లో పారసీకపదాలు కోకొల్లలు. సంస్కృతంనుంచి పుట్టినభాషలకు యిది సహజమే. హిందూస్థానీభాష స్వయంగానే మిశ్రమభాష గనుక, అందు పారసీకపదాలుండడంలో ఆశ్చర్యంలేదు. కాని, ద్రావిడభాషలుకూడా పారసీకభాషవల్ల ప్రభావితమయ్యాయి. భారతదేశము గతంలో, గొప్ప పారసీకకవులను కొందరిని సృష్టించింది. నేడుకూడ హిందూ మహమ్మదీయులలో అనేకమంది పారసీకభాషాపండితు లున్నారు.

సింధులోయనాగరికతకు సమకాలిక ఇరాను, మెసపొటేమియా నాగరికతలతో కొన్ని సంబంధాలున్నవనడంలో సందేహంలేదు. కొన్ని చిత్రాలు, ముద్రికలు స్పష్టమైన పోలికలు కలిగివున్నాయి. అకేమియన్ కాలానికి ముందే ఇరాను, ఇండియాలమధ్య సన్నిహితసంబంధాలున్నట్లు కొన్ని రుజువులున్నాయి. అవెస్తా (జొరాష్ట్రియన్ మత

గ్రంథం)లో ఇండియా ఉదహరింపబడింది. పైగా అందులో ఉత్తర హిందూస్థానాన్ని గురించిన ఒక వర్ణనకూడా వుంది. మన ఋగ్వేదంలో పర్షియాను గురించి సూచనలున్నాయి. పర్షియనులను 'పార్శవులు' అనీ, కొంతకాలానికి 'పారసీకులు' అనీ పిలిచేవారు. ఆ పదమునుంచియే 'పార్శీ' శబ్దం వుద్భవించింది. పార్థియనులను 'పార్థవులు' అనేవారు. అందువల్ల బహు పురాతనకాలంనుంచీ కూడా ఇండియా, ఇరానుల మధ్య సాంప్రదాయికంగా పరస్పర జిజ్ఞాసాసంబంధా లుండేవని తేలుతున్నది. ఆ తరువాత రాజాధిరాజగు 'సిరూస్ ది గ్రేట్'తోకూడా మనకు సంబంధాలు వున్నట్లు ఆధారాలు వున్నాయి. సిరూస్ తన దండయాత్రలో భారతసరిహద్దులను - బహుశా కాబూలు, బెలూచిస్థానములను - చేరుకున్నాడు. క్రీ. పూ. 6 వ శతాబ్దంలో డరయస్ చక్రవర్తికాలంలో పర్షియన్ సామ్రాజ్యము వాయవ్యభారతంవరకూ వ్యాపించింది. సింధు, బహుశా పశ్చిమపంజాబులో కొంతభాగమూ ఆ సామ్రాజ్యంలో అంతర్భాగాలైనవి. భారతదేశచరిత్రలో దానిని 'జొరాష్ట్రియన్‌యుగం' అనడం కద్దు. బహుశా ఆ మతప్రభావం ఎక్కువగా వ్యాపించివుండాలి. సూర్యారాధన ప్రోత్సహింపబడింది.

డరయస్ సామ్రాజ్యంలోకెల్లా భారతరాష్ట్రమే(అతనిక్రింద గల భారతభూభాగం) ఎక్కువ సంపదలు, ఎక్కువ జనవత్తిడి కలిగియుండేది. సింధు ఆకాలంలో నేటిలాగా ఎండుటెడారివలె లేదన్నమాట. భారతప్రజలకుగల సంపదలు, జనబాహుళ్యముల గురించియు, వారు డరయస్‌కు చెల్లించుచుండిన కప్పమును గురించియు హెరొడోటస్ యిట్లా వర్ణించాడు: "మనకు తెలిసిన అన్నిదేశాలలోకంటె, భారతదేశంలో జనసమ్మర్దం ఎక్కువ. ఇతరులకంటె హెచ్చు మదింపుమీద వారు పన్నులు చెల్లించేవారు. (ఇది) 360 టేలెంటుల బంగారురజము (పదిలక్షల స్టర్లింగ్ పౌనులకంటె ఎక్కువ.)" పర్షియన్ సైనికబలంలో గల భారతీయవిభాగంలో పదాతిదళము, అశ్వికదళము, రథములు గలవని హెరొడోటస్ వర్ణించాడు. తరువాతి పత్రాలలో గజబలము గూడ ఉదహరింపబడింది.

క్రీ. పూ. 7 వ శతాబ్దానికి ముందునుంచి, తరువాత అనేక తరాలవరకూ - పర్షియా, ఇండియాలకుమధ్య వ్యాపారకారణంగా

సంబంధాలుండేవనడానికి కొన్ని ఆధారాలున్నాయి. ముఖ్యంగా బాబిలన్‌తో వ్యాపారంజరిపేందుకు భారతీయులు పర్షియన్ అఖాతముగుండానే పోవలసివచ్చేది. క్రీ. శ. 6 వ శతాబ్దినుంచీ సిరూస్, డరయుస్‌ల దండయాత్రలవలన ప్రత్యక్షసంబంధాలు పెరిగినాయి. అలెగ్జాండరు జయించిన తర్వాత చాలాకాలం ఇరాను గ్రీకుల క్రిందనే వుంది. ఇండియాతోగల సంబంధాలు కొనసాగుతూనే వున్నాయి. అశోకుని నిర్మాణాలపై పెర్సిపోలిస్ వాస్తుశిల్పప్రభావం వున్నదంటారు. వాయవ్య భారతం, ఆఫ్ఘనిస్థానములలో పెంపొందిన గ్రీకు – బౌద్ధచిత్రకళాప్రభావం ఇరానువరకూ వ్యాపించింది. గుప్తులకాలము (క్రీ. శ. 4, 5శతాబ్దాలు) కళలు, సంస్కృతీకలాపాలకు ప్రసిద్ధినొందిన యుగము గనుక – అప్పుడు కూడా ఇరానుతో సంబంధాలు కొనసాగుతూనే వున్నాయి.

ఇండియా సరిహద్దుభూములగు కాబూలు, కాందహారు, సెయిస్తాన్‌లు అనేకసార్లు భారతరాజ్యభాగాలుగా వుండేవి. అవే భారతీయుల, ఇరానుల సమావేశ స్థలాలుగా వుపయోగపడ్డాయి. పార్థియనులు ఆ భాగాన్ని "శ్వేతభారతం" అనేవారు. ఫ్రెంచి తత్వవేత్తయగు జేమ్స్ డార్ మెస్టలర్ ఈ ప్రదేశాన్నిగురించి యిలా వ్రాశాడు: "ఈ ప్రదేశాలలో హిందూనాగరికతయే ఎక్కువ. క్రీ. పూ. క్రీ. శకంలోను 2 శతాబ్దాలకాలం, యీ ప్రాంతాలను శ్వేతభారతమని పిలిచేవారు కూడాను. ముస్లిములదండయాత్రలు వచ్చేనాటివరకూ ఇవి ఇరానీ ప్రభావంగలవిగా గాక భారతీయప్రభావాన్నే కలిగియుండేవి."

విదేశీవ్యాపారులు, యాత్రికులు ఉత్తరభారతంలోనికి వచ్చేందుకు భూమార్గం వుంది. కాని, దక్షిణభారతం సముద్రవ్యాపారం ద్వారానే యితర దేశాలతో సంబంధాలుపెట్టుకుంది. పర్షియాను 'సాస్సనిడ్'లు పాలిస్తున్నకాలంలో వారిరాయబారులు దక్షిణభారతంలోని ఒకరాజు ఆస్థానంలో వుండేవారనీ, ఆ రాజుయొక్క రాయబారులు పర్షియాలో వుండేవారనీ చారిత్రకాధారాలు ఉన్నాయి.

తురుష్క, ఆఫ్ఘను, మొగల్ దండయాత్రలు వరుసగా ఇండియాను జయించడంవల్ల – మన దేశానికి, పశ్చిమఆసియా[illegible] లకు సంబంధబాంధవ్యాలు త్వరితంగా పెంపొందా[illegible] బ్దిల్లో (యూరపులో పునరుజ్జీవనోద్యమం జరుగుతు[illegible]

ప్రభావంవల్ల - సమర్ఖండ్, బొఖారాలలో "తైమూరిడ్ పునరుజ్జీవనోద్యమం" వికసిస్తున్నది. ఈ ఉద్యమంలో విజయవంతుడైన బాబరు (తైమూర్ వంశంలో ఒక యువరాజు) క్రమంగా ఢిల్లీ సింహాసనం ఎక్కి-కూర్చున్నాడు. అది 16 వ శతాబ్ది తొలిభాగం. ఇరాను సఫావీలపాలనక్రింద కళలను పునరుజ్జీవింపజేసుకుంటున్నది. దాన్ని ఇరానుకళల స్వర్ణయుగమని పిలుస్తారు. అట్టి సఫావీరాజువద్దకే బాబరుకుమారుడగు హుమాయూను శరణార్థిగా వెళ్ళాడు. ఆయన సాయంతోనే తిరిగి ఇండియాకు వచ్చాడు. మొగలుపాలకులుకూడ ఇరానుతో అత్యంత సన్నిహితసంబంధాలుంచుకున్నారు. అనేకమంది పండితులూ, కళాకారులూ ఇరానునుంచి ధారాళంగావచ్చి మొగల్ ఆస్థానాలలో అదృష్టదేవత నారాధించేవారు.

భారతీయాదర్శాలు, పారసీకచైతన్యము మిశ్రమమైన కొత్త రకపు వాస్తుశిల్పం ఆరంభమయింది. ఢిల్లీ, ఆగ్రాలలో అత్యంత సుందరమైన మహోన్నతభవనాలు వెలిశాయి. ఇట్టివాటిలో అతి ప్రసిద్ధమైనది తాజ్‌మహల్. ఫ్రెంచితత్త్వవేత్తయగు ఎం. గ్రౌసెట్ దాన్ని "భారతదేశశరీరంలో మూర్తీభవించిన ఇరానుజీవాత్మ" అన్నాడు.

ఆదిలోనూ, చరిత్రఅంతటిలోనూ ఇరాను, ఇండియాలవలె అత్యంత సన్నిహితంగా మెలగిన దేశాలు మరెక్కడా లేవు. ఈ సుదీర్ఘ సన్నిహిత, గౌరవసంబంధాలకు సంబంధించిన చివరి జ్ఞాపకచిహ్నం దురదృష్టకరమైనదికావడం విచారకరం. రెండువందలఏండ్లక్రితం నాదిర్‌షా ఇండియాపైకి దండెత్తివచ్చాడు. అది తక్కువకాలమే జరిగినా, మహాభయంకరమైనట్టిది.

తర్వాత బ్రిటిష్‌వారు వచ్చారు. మన యిరుగుపొరుగు ఆసియా వాసులతో మనకు సంబంధాలను కలిపిన ద్వారాలన్నీ వారు బంధించివేశారు; త్రోవలన్నీ మూసివేశారు; సముద్రాలమీదుగా కొత్తదోవల నేర్పరచి, యూరపుకు - ముఖ్యంగా యింగ్లాండుకు - మనల్ని దగ్గర జేశారు. కాని, ఇండియా, ఇరాను, మధ్యఆసియా, చైనాలమధ్య భూ...లు వుపయోగించకుండా అరికట్టారు. ఈ ఆధునికయుగంలో ...శ్యాలు యేర్పడినందున మన పూర్వస్నేహాలను ...కాశాలు లభించాయి. ఈవిధంగా ఇతరఆసియా

దేశాలతో మనకుగల సంబంధబాంధవ్యాలు హఠాత్తుగా ఆగిపోవడం కూడా బ్రిటిష్‌పరిపాలనాదుష్ఫలితాలలో ఒకటి.

కాని, ఒకానొక సంబంధంమాత్రం శాశ్వతంగా వుండిపోయింది. అది నేటి ఇరానుతో గాదు, పురాతనకాలపు ఇరానుతో. 13 వందల సంవత్సరాలక్రితం, ఇస్లాంమతం ఇరానుకువచ్చినపుడు – పురాతన జొరాష్ట్రియస్ మతస్తులు వేలాదిగా మనఇండియాలోనికి వలసవచ్చేశారు. ఇచట స్వాగతంపొంది, పశ్చిమతీరాన నివాసాలు ఏర్పరచుకున్నారు. ఇతరులజోక్యం లేకుండా – వారిమత సాంప్రదాయాచారాలనే అనుసరిస్తూ గడిపారు. వారూ ఇతరులవిషయాలలో జోక్యంకల్పించుకోలేదు. వారినే పార్సీలు అంటున్నాం. వారు ఎంత ప్రశాంతంగా, నిరాడంబరంగా ఇండియాలో యిమిడిపోయారో, అయినప్పటికీ ఒక ప్రత్యేక సంఘంగా, తమ పురాతనాచారాలనే గట్టిగా అంటిపెట్టుకుని ఎలా గడుపుతున్నారో పరిశీలిస్తే గణనీయంగా వుంటుంది. వారు తమసంఘానికి వెలుపలివారితో వివాహసంబంధాలు జరపడం నిషిద్ధం. దానిని మీరిన సంఘటనలు అతిస్వల్పం. ఇండియాలో స్వకులంలోనే వివాహసంబంధాలు జరగడం ఆచారమేగనుక, ఇది ఆశ్చర్యకరం కాలేదు. వారి జనసంఖ్య పెంపుదల చాలా నెమ్మదిగా జరుగుతున్నది. ఇప్పటికీ పార్సీలు ఒక లక్షకు మించరు. వారు వ్యాపారదక్షులై, కొందరు భారతపరిశ్రమల అధినేతలుకూడా అయ్యారు. వారికి ఇరానుతో ఎలాంటి సంబంధబాంధవ్యాలూ లేవు. వారు పూర్తిగా భారతీయులైపోయారు. అయినప్పటికీ వారు తమ పురాతన సాంప్రదాయాలను, పురాతన మాతృదేశపు స్మృతులనూ మరచిపోరు.

ఇరానులో ఇటీవల ఇస్లాముకుపూర్వముగల పురాతన నాగరికతవైపు దృష్టి మరలుతున్నట్లు స్పష్టంగా తెలుస్తున్నది. దీనికి మతంతో సంబంధంలేదు. అది సంస్కృతికి, జాతీయవాదానికి సంబంధించిన మార్పు. ఇరానుకు బహుకాలం నిలచిన పురాతన సంస్కృతీ సాంప్రదాయాలను పరిశీలించి, వాటినుండి ఆత్మగౌరవాన్ని పొందడమే నేటి ఇరాను ధ్యేయం.

ప్రపంచపరిణామాలూ, ఒకేరకపు ప్రయోజనాలూ – ఆసియా దేశాలు ఒకదానినొకటి గమనించి నడచుకునేట్లుగా – వత్తిడిచేస్తు

న్నాయి. యూరోపియనుల పాలనాయుగం ఒక పీడకలవలె తొలగి పోయింది. పూర్వకాలపు జ్ఞాపకాలు ఆసియాదేశాల పూర్వమైత్రినీ, సంయుక్త సాహసకార్యాలనూ గుర్తుచేస్తున్నాయి. ఇండియా అనతి కాలంలోనే ఇరానుకు మరింత చేరువ (ఇప్పుడు చైనాతోవలె) కాగల్గ దనడంలో సందేహంలేదు.

రెండు నెలలక్రితం, ఒక ఇరానీ సాంస్కృతికరాయబారవర్గనాయ కుడు అల్హాబాదునగరంలో యిలా చెప్పాడు: "ఇరాను, ఇండియా ప్రజలు యిద్దరు సోదరులవంటివారు. ఒక పారసీకకథలోవలె, ఆ యిరు వురూ విడివడి; ఒకరు తూర్పుకూ, మరొకరు పశ్చిమానికీ వెళ్ళారు. వారికుటుంబాలు పరస్పరం మరచిపోయాయి. వారిమధ్య మిగిలి పోయిన సామ్యం ఒక్కటే. పాతపాటలచరణాలేవో గుర్తున్నాయి. వాటిని తా మిప్పటికీ తమవేణువులపై ప్రయోగించి ఆనందిస్తున్నారు. ఈ సంగీతచరణాలవల్లనే, అనేక శతాబ్దాల అనంతరంకూడా, వారొకరి నొకరు గుర్తించుకుని, తిరిగి కలుసుకోగలిగారు. అదేవిధంగా మేము పూర్వపరిచయమైన సంగీతచరణాలను మా వేణువులపైవూది వినిపిం చేందుకు ఇండియాకు వచ్చాము. మా భారతీయసోదరులు వీటిని విని, మమ్మొ తమవారినిగా గుర్తించి, ఇరానుసోదరులతో ఏకంకాగలరని ఆశిస్తున్నాము."

## ఇండియా, గ్రీసు.

పురాతన గ్రీసుదేశము యూరోపియన్నాగరికతకు జన్మభూమి యని భావిస్తారు. ప్రాచ్య, పాశ్చాత్యఖండాలమధ్య గల ప్రాథమిక విభేదాలను గురించి ఎంతో వ్రాశారు. నా కిది అర్థంకాదు. ఇందులో ఎక్కువభాగం నాకు అస్పష్టంగా, అశాస్త్రీయంగా కనుపిస్తుంది. యథార్థ సహితమైన ఆధారాలు కనుపించవు. ఇటీవలివరకూ యూరపులోని మేధావులు విశిష్టతగల ప్రతివిశేషమూ గ్రీసులోగాని, రోములోగాని పుట్టివుంటుందని వూహించేవారు. సర్ హెన్రీ మెయినే ఒకానొకచోట "ప్రకృతిలోని అంధశక్తులు దప్ప, మూలంలో గ్రీసుకు సంబంధించని దేదీ యీ ప్రపంచంలో కదులాడదు" అన్నాడు. గ్రీకు, లాటిను భాష లను, పురాణాలను కూలంకషంగా అభ్యసించిన యూరోపియన్ పండి

తులకు ఇండియా, చైనాలనుగురించి తెలిసినది అతిస్వల్పం. అయినప్పటికీ, ప్రొఫెసర్ ఇ. ఆర్. డాడ్స్ – "గ్రీకునాగరికత ప్రాచ్య మాగాణమున పుట్టినది. ప్రాచ్య మూలమునుండి అది యెన్నడూ పూర్తిగా విడివడిపోలేదు. పండితప్రకాండులమనసులలో మాత్రమే యీ వేర్పాటు జరిగింది" అని ఉద్ఘాటించాడు.

యూరపులో పాండిత్యమనేది చాలాకాలం వరకూ గ్రీకు, హీబ్రూ, లేటినుభాషలకే పరిమితమయింది. ఆ విజ్ఞానంనుంచి వుద్భవించిన ప్రపంచచిత్రం మధ్యధరాప్రపంచం మాత్రమే. వారి ప్రాథమికభావన పూర్వకాలపు రోమనులభావానికంటె మెరుగుకాదు. కాకపోతే, దానికి కొద్దిగా మార్పులూ, చేర్పులూ మాత్రం చేశారు. అదే భావన – చరిత్ర, భౌగోళిక రాజకీయాలు, సంస్కృతి, నాగరికతాభావాలను పాలించి, నడవడమేగాక, విజ్ఞానశాస్త్రాభివృద్ధికి ఆటంకంకూడా అయింది. ప్లేటో, అరిస్టోటిల్ వారిమేదస్సులలో నిండిపోయారు. ఆసియాప్రజలు లోగడ ఏమేమిచేశారో, వాటివిజ్ఞానం యూరోపియనుల మెదళ్ళకు తేమగా తగిలినప్పటికీ, దాన్ని హృదయపూర్వకంగా ఆమోదించలేకపోయారు. దాని కొకవిధమైన అప్రయత్ననిరోధాన్ని ఏర్పరచారు. దాన్ని తాము పూర్వం చిత్రించుకున్న చిత్రాల్లో ఒకదానితో పోల్చుకో ప్రయత్నించారు. పండితులే యిలాంటి నమ్మకాలు కలిగివుంటే – ఇక గ్రంథాలు చదువని అసంఖ్యాకప్రజానీకం, తూర్పు పశ్చిమఖండాల మధ్య ప్రాథమికంగానే ఎంతో భేదం వున్నదని భావించడంలో ఆశ్చర్యంలేదు. యూరపుయొక్క పారిశ్రామికాభివృద్ధి. భౌతికాభివృద్ధిని సాధించడంతో – ప్రజలలో యీ భేదభావం మరింత పాదుకుపోయింది. మరొక విచిత్రహేతువాదపరిణామంతో – ఆధునికయూరపు, అమెరికాలకు పురాతనగ్రీసే తల్లీ, తండ్రీ అయింది. ప్రపంచపు గతచరిత్రకుసంబంధించిన అదనపు వివరాలు కొద్దిమంది మేధావులలో మాత్రం ఈ విశ్వాసాన్ని కదలించివేసినాయి. ప్రజానీకానికి సంబంధించినంతవరకు శతాబ్దాలక్రితపు నమ్మకాలే కొనసాగినాయి. వారి అంతరాత్మల పైభాగాలమీద ఏవో భూతాలు తిరుగాడేవి. అవి తాము వూహించుకుని సృష్టించుకున్న కనుచూపుమేరలో అంతర్థానమయ్యేవి.

యూరపు, అమెరికాలు ఎక్కువ పారిశ్రామికంగా వున్నవి; ఆసియా ఈవిషయంలో వెనుకబడివున్నదని సూచించడానికి తప్ప - యీ "ప్రాచ్య, పాశ్చాత్యఖండా" లనే పదాల వుపయోగం దేనికో, నే నర్థంచేసుకోలేను. ఈ పారిశ్రామికవిశేషంకూడా ప్రపంచచరిత్రకు కొత్తవిషయం. అది ప్రపంచాన్ని ఎంతో మార్చింది, ఇంకెంతో మార్చనున్నది. ఈవిషయంలో మరిదేనికీ లేనంతశక్తి దీనికి వున్నది. హెలెనిక్ నాగరికతకూ, యూరోపు లేక అమెరికానాగరికతకూ ఎటువంటి భౌతికసంబంధమూ లేదు. "సుఖంగా వుండడమే అసలు కావలసిన ముఖ్యవిషయం" అనేది ఆధునికవిశ్వాసం. (ఇది దుర్విశ్వాసమనే సంగతి వేరు.) ఇది గ్రీకు లేక ఏ పురాతనసారస్వతానికి వెనుకగల ఆదర్శానికైనా పూర్తిగా విదేశీయమైనభావన. "సర్వసమాన సమ్యగ్దృష్టి, సర్వసహజీవనంలోనే సంగీతమధురిమ" అనేవాటిని సృష్టించగల, తమ చెయిదాల నన్నింటినీ పాలించగల ఒక తత్త్వశాస్త్రంకోసం, ఒకానొక మతంకోసం గ్రీకులు, భారతీయులు, చైనీయులు, ఇరానియనులు నిరంతరాన్వేషణలో మునిగిపోయారు. ఈ ఆదర్శం జీవితంలోని ప్రతిముఖానా (సారస్వతం, కళ, వ్యవస్థలు) వెలువడుతుంది. అది ఉచితాన్నెరిగేశక్తినీ, పరిపూర్ణతనూ సృష్టిస్తుంది. బహుశా ఈ అభిప్రాయాలు పరిపూర్ణసమర్థనీయాలు కాకపోవచ్చు; జీవితపు వాస్తవికపరిస్థితులు యింతకు భిన్నంగా వుండియుండవచ్చు. అయినప్పటికీకూడా, గ్రీకుల దృక్పథానికీ, ప్రయత్నాలకూ ఆధునిక యూరపు, అమెరికాలు ఎంత దూరంగావున్నాయో గుర్తించడం అవసరం. ఆ గ్రీకులనే వీరు తమ తీరిక సమయాల్లో, బహుధా ప్రశంసిస్తారు. తమ హృదయాంతరాళాల్లోగల ఒకానొక వాంఛను తృప్తిపరచుకునేందుకు, తమకు పూర్వ మెపుడో గ్రీకులతోగలసంబంధాలను తలచుకుంటారు; ఆధునికజీవితపు కఠిన భయంకర ఎడారులమధ్య ఒక నీటిమడుగును చూచేందుకా అన్నట్లు గ్రీసువైపు మరలుతారు.

తూర్పు, పశ్చిమఖండాలలోగల ప్రతి ఒక్క దేశానికీ ఒక్కొక్క వ్యక్తిత్వం, ఒక్కొక్క సందేశం వుంది. ప్రతిదేశమూ జీవితసమస్యలను పరిష్కరించేందుకు, తన ప్రత్యేకవిధానాలలో ప్రయత్నించింది. గ్రీసు ఒక ప్రత్యేకదేశం. జ్ఞానిపథంలో అది మహోన్నతమైనది. ఇండియా

అంతే; ఇరానూ అంతే పురాతన భారతదేశం, పురాతన గ్రీసుదేశం పరస్పరం విభిన్నమైనవి. అయినప్పటికీ, అవి ఒకేవిధమైనవి. అనేక మహావిభేదాలున్నప్పటికీ, చైనా, భారతదేశాలు ఆలోచనావిధానాలలో కవలలవంటివైనట్లే గ్రీసుకూడాను. వాటన్నిటికీ ఒకేవిధమైన విశాల, సునిశిత, సహానదృక్పథం వుండేది. జీవితంలో, ఆశ్చర్యకరమైన సౌందర్యంలో, అగణితవైవిధ్యంగల ప్రకృతిలో ఆనందాన్ని పొందేవి. కళలపట్ల ప్రేమ, పురాతనజాతి సంచితంచేసుకున్న అనుభవాలనుండి వుద్భవించే విజ్ఞానం అన్నిటికీ వుండేవి. అందులో ప్రతిఒక్కటీ - తనజాతిలోని విశిష్టతను బట్టి, ప్రకృతివాతావరణప్రభావాన్నిబట్టి, జీవితంలోని యితరదృక్పథాలకంటే ఏదో ఒకేదృక్పథాన్ని ఎక్కువగా అవలంబిస్తూ - పెంపొందాయి. ఈ అవలంబనావిశేషంమాత్రం భేదించింది. గ్రీకులు ఒకజాతిగా వర్తమానాన్నే ఎక్కువ ప్రేమించి, తమచుట్టూవున్న సౌందర్యంలోనే లేక తాముసృష్టించినదానిలోనే ఆనందం, మాధుర్యం పొందుతూవుండియుండవచ్చును. భారతీయులుకూడా వర్తమానంనుంచి యీ ఆనంద, మధురిమలను పొందారు. అదేసమయంలో వారిదృష్టి యింకా లోతైన విజ్ఞానంవైపు మళ్ళింది. వారిమనసులు విలక్షణమైన ప్రశ్నలతో సతమతమయ్యాయి. చైనీయులు ఈ ప్రశ్నలనూ, వాటి విచిత్రాంతరాలనూ ఎరిగికూడా, వాటిలో చిక్కుకుపోకుండా తెలివిగా తప్పించుకున్నారు. ప్రతిఒక్కరూ తమ విభిన్నవిధానాల్లో జీవితపు పరిపూర్ణతను, సౌందర్యాన్ని ప్రకటించేందుకు ప్రయత్నించారు. ఇండియా, చైనాలకు బలవత్తరమైన పునాదులూ, దీర్ఘతరమైనమన్నికశక్తీ వున్నాయని చరిత్ర రుజువుచేసింది. అవి ఎంతో కదలించివేయబడినప్పటికీ, ఎంతో క్షీణించిపోయినప్పటికీ యింతవరకు నిలచేవున్నవి. భవిష్యత్తు అగోచరంగదా! పురాతన గ్రీసుదేశం ఎంత మహత్తరలక్షణాలుగలదైనప్పటికీ, కొద్దికాలమే జీవించగలిగింది. అది సాధించిన రసవత్తరవిజయాలు, తరువాతి నాగరికతలపై బరపిన ప్రభావము, సుఖసమృద్ధులతో మనిన కొద్దికాలపుస్మృతులు మొదలగువానిలోతప్ప - ఆ గ్రీసు ఔన్నత్యం మృతప్రాయమయింది. బహుశా వర్తమానంలోనే మునిగిపోవడంవల్ల కాబోలు - భూతవిశేషమైపోయింది.

యూరపుజాతులు తమనుతాను హెలెనిక్ అంతర్యంగల గ్రీసు నాగరికతకు బిడ్డలమని చెప్పుకున్నప్పటికీ, వారికంటే ఇండియాయే పురాతన గ్రీకుదృక్పథానికీ, అంతర్యానికీ దగ్గరగావుంది. హేతుబద్ధమైన ఆలోచనలను అరికట్టే దృఢాభిప్రాయాలను మనం వారసత్వంగా పొందాము గనుక-మన మీా పై సత్యాన్ని మరచిపోవచ్చును. ఇండియా మతతత్వహృదయిని; ఊహావినోదిని ; లేనిలోకాలవిశ్వసించేది; యీా ఇహపట్ల పెద్దఆసక్తిలేనిది; ఇటుతరువాత, ఈ లోకంతరువాత అనే కలలలో నిదురించేది అంటారు. మన కిదే చెబుతారు. బహుశా యీావిధంగా చెప్పేవారు ఇండియా అలా వ్యూహాల్లోమునిగిపోయి,ఊహావినోదాలలో చిక్కుకుపోవాలని ఆశిస్తారనుకుంటాను. అలా జరిగితే, ఈ ఆలోచనాపరులఅడ్డంకి లేకుండా, తాము యీా ప్రపంచాన్ని ఆక్రమించుకుని, దానిపరిపూర్ణతను స్వంతంచేసుకుని, దాని ఆనందాలన్నీ పొందాలని ఆశించవచ్చును. అవును; ఇండియా ఇటువంటిదే. అంతేకాదు; ఇంతకంటే ఎక్కువ లక్షణాలుకూడా గలది. భారతదేశం బాల్యదశలోని అమాయికత, నిర్లిప్తత లెరుగును; యౌవనంలోని వ్యసనతరకాంక్ష, నిర్భీకతల నెరుగును; సుదీర్ఘబాధ, ఆనందానుభవంవల్ల పక్వదశలో కలిగే పరిపక్వవిజ్ఞానాన్నికూడా ఎరుగును. పైగా ఆమె యీా బాల్య, యౌవన వృద్ధాప్యదశలను మరలమరల ఎన్నోసార్లనుభవించింది. వయసు, వైశాల్యాల మహత్తర అంతర్ముఖదృష్టి ఆమెను భారంగా వంచాయి. అవమానకరఆచారాలు, దురాచరణలు ఆమెను కొరికి తిన్నాయి. జలగలవంటి అనేక పరభాగ్యోపజీవులు ఆమెను అంటుకొనియుండి రక్తాన్ని పీల్చివేశాయి. కాని, యీాఅన్నింటివెనుకా యుగయుగాలబలము, అంతరాత్మలో వెలిగే పురాతనజాతి విజ్ఞానమూా వున్నాయి. మన మెంతో పురాతనులం గనుక - అనేక శతాబ్దాలు మనచెవుల్లో తమరహస్యాలు చెబుతాయి. అయినప్పటికీ గతయుగాలలోని కలలజ్ఞాపకాలు మనల్ని విడువకపోయినప్పటికీ మరలమరల యౌవనవంతులం అయ్యే దెలాగో మనకు తెలుసు.

ఇన్నియుగాలుగా ఇండియా బలిష్ఠంగా మనగల్గడం ఒకానొక రహస్యసూత్రంవల్లనో, లేక ఏ రహస్యవిజ్ఞానంవల్లనో కాదు. మృదుమానవత్వము, వైవిధ్య సహనశీలసంస్కృతి, జీవితాన్నీ దాని విలక్షణ

విధాలను లోతుగా అర్థంచేసుకొనియుండడం – యివే ఇండియాకు గల శక్తులు. దాని సమృద్ధ బలిష్ఠత యుగయుగపారంపర్యంగా దాని సారస్వతము, కళలద్వారా ప్రవహిస్తుంది. దీని చిహ్నములోని కొద్దిభాగము మాత్రమే మన కిపుడు వుంది. ఇంకా దాగియున్నదిగాని, ప్రకృతిచేత, మానవునిపశుత్వంచేత నాశనంచేయబడినదిగాని ఎంతో వుంటుంది. ఎలిఫెంటాగుహాలలోని "త్రిమూర్తి" – శక్తివంతంగా, తీక్షణమైన కనులతో, గాఢమైన విజ్ఞానము, తెలివితేటలతో మనవైపు (ఎత్తునుండి) చూస్తూవుంటుంది. ఇదే భారతదేశపు బహుముఖ శిలా విగ్రహం కావచ్చును. అజంతాకుడ్యచిత్రాలు – మృదుత్వముతో జీవిత సౌందర్యాలపట్ల ప్రేమతో, యింకేదో లోతైన, లోకాతీతమైన సూచనలతో నిండివుంటాయి.

భౌగోళికంగానూ, వాతావరణంలోనూ గ్రీసు, ఇండియాకు భిన్నమైనటువంటిది. అక్కడ సహజమైన నదులుగాని, అడవులుగాని, మహావృక్షాలుగాని లేవు. ఇండియాలో యివన్నీ సమృద్ధిగా వున్నాయి. ఎనలేనివైశాల్యమూ, భయానకంగామారేస్వభావంగల సముద్రం గ్రీకులపై మిక్కిలి ప్రభావాన్ని కలుగజేసింది. ఇండియాలో-తీరవాసులలోతప్ప – అట్టి ప్రభావం తగలలేదు. విశాలమైదానాలు, పెద్ద పెద్ద పర్వతాలు, మహానదులు, గొప్ప అడవులు గల ఇండియా ఒక భూమధ్యప్రదేశం వంటిది. గ్రీసులోకూడా కొన్ని పర్వతా లున్నాయి. భారతీయులు తమ దేవుళ్ళనూ, ఋషులనూ హిమాలయపర్వతాగ్రాలపై నిలిపినట్లే – గ్రీకులు తమ దేవుళ్ళకు ఆశ్రయంగా 'ఒలింపస్' నెన్నుకున్నారు. రెండు దేశాలవారూ పురాణాలను పెంపొందించుకున్నారు. వాటిలో చరిత్రాంశాలుకూడా కలసివుంటాయి. అందులో ఏది యథార్థమో, ఏది కల్పనో విడమర్చ వీలుండదు. పురాతన గ్రీకులు సుఖభోగులనిగాని, నిస్సంగులని గాని చెప్పలేము. వారు ఆనందం చెడ్డది, అవినీతికరమైనదని విసర్జించలేదు. కాని, ఆధునికు లెక్కువగా చేస్తున్నట్లు, వారు ఆనందం, భోగాలకై ప్రత్యేకంగా ప్రాకులాడనూలేదు. మనలో అనేకమందిని బాధింపజేసే తటపటాయింపుగుణాలు వారికి లేవు. జీవితాన్ని జీవించడమే వారి ధ్యేయం. ఏ పనిచేస్తుంటే ఆ పనిలోనే నిమగ్నులైపోయేవారు. ఆ విధంగా వారు మనకంటె ఎక్కువ సజీవులుగా జీవించారనిపిస్తుంది.

మన పురాత సారస్వతాన్నిబట్టి పూర్వపు ఇండియాలోగూడ అటువంటి జీవితమే వుండేదని తెలుస్తుంది. ఇండియాలో జీవితానికి నిస్సంగత్వం ముఖ్యమనేభావన వుండేది. (ఇది తరువాతి యుగాలలో గ్రీసులోకూడా వ్యాపించింది) కాని; ఇది కొందరికే పరిమితమైయున్నందువల్ల మొత్తం దేశీయులజీవితాన్ని విలక్షణంచేయలేదు. జైన, బౌద్ధమతాలప్రభావం వల్ల యీ దృక్పథం మరింత ప్రబలమైనమాట నిజం. అయినప్పటికీ, జీవితగమనసారాన్ని యిది భౌతికంగా మార్చియుండలేదు.

'జీవితం' ఉన్నదున్నట్లుగా స్వీకరింపబడి, పరిపూర్ణంగా అనుభవింపబడింది ఈ రెండుదేశాలలోనూకూడా. అయినప్పటికీ, మహోకరకమైన అంతర్గతజీవితం అన్నిటికంటె మహోన్నతమైనదనే విశ్వాసం వుండేది. ఇదే జిజ్ఞాసకూ, ఊహావ్యాపకానికీ దోవతీసింది. కాని, తెలుసుకోవాలనే కుతూహలం - కర్మధారయఅనుభూతివైపుగాక, స్పష్టంగా యథార్థాలని ఆమోదింపబడిన కొన్ని దృక్పథాలపై ఆధారపడి హేతువాదంతోనే కొనసాగింపబడేది. విజ్ఞానశాస్త్రీయవిధానం రాకముందు - ప్రతిదేశంలోనూ సామాన్యంగా అనుసరింపబడిన దృక్పథం యిదే. బహుశా, ఈ వూహాలోకజిజ్ఞాస కొద్దిమంది మేధావంతులకు మాత్రమే పరిమితమై వుండేది. అయినా, సామాన్యపౌరులు కూడా దానిచే ప్రభావితులై, తమ కూడలిప్రదేశాలలో (రచ్చచావడి, వటవృక్షం, దేవాలయప్రాంగణం వగైరా) యితర విషయాలన్నీ చర్చించుకున్నట్లే, వేదాంతతత్వవిశేషాలుకూడా చర్చించుకునేవారు. జీవితరీ సంఘప్రధానంగా వుండేది. ఇప్పటికీ యిండియాలో - ముఖ్యంగా గ్రామసీమలలో ఇలానే వుంది. సంతప్రదేశం, దేవాలయ (మసీదు) ప్రాంగణం, నీళ్ళబావి, పంచాయితీచావడి, రచ్చచావడి మొదలగు చోట్ల ప్రజలు కలుసుకుని, దైనందినవార్తలను, తమ అవసరాలను గూర్చి చర్చించుకునేవారు. ఆవిధంగా ప్రజాభిప్రాయం ఏర్పడి, వెలిబుచ్చబడేది. ఇట్టి చర్చలకు కావలసినంత తీరుబడికూడా వుండేది.

అయినప్పటికి, హెలెనిజం (గ్రీకుమతం) మహత్తరవిజయాలలో ఒక ప్రత్యేక అనన్యవిజయం వుంది. అది ప్రయోగవిజ్ఞానశాస్త్రాన్ని ప్రారంభించిన సూచనలున్నాయి. గ్రీసులోకంటె, హెలెనిజం వ్యాపించిన అలెగ్జాండ్రియా ప్రాంతంలో యిది ఎక్కువ పెంపొందింది.

ముఖ్యంగా క్రీ. పూ. 330 నుండి 130 వరకుగల రెండుశతాబ్దాలూ విజ్ఞానశాస్త్రాభివృద్ధి, యాంత్రిక నిర్మాణాలకు చరిత్రప్రసిద్ధిచెందాయి. దీనితో పోల్చదగ్గఘనత ఏదీ ఇండియాలో లేదు. అసలు 17వ శతాబ్దం తరువాత విజ్ఞానశాస్త్రం దాడుసాగించేవరకూ - ప్రపంచంలో మరే దేశంలోనూ యిట్టిఘనత లేనేలేదు. మహాసామ్రాజ్యం వున్నప్పటికీ; దాని ప్రభావం మరెంతో వైశాల్యానికి వ్యాపించియున్నప్పటికీ, హెలెనిక్ నాగరికతతో సన్నిహితసంబంధాలున్నప్పటికీ, అనేకజాతుల అనుభవ, విజ్ఞానాలనుండి సారాన్ని గ్రహించే అవకాశాలున్నప్పటికీ - రోము దేశం-విజ్ఞానశాస్త్రం, నూతనయంత్రాలనిర్మాణం, యాంత్రికాభివృద్ధులకు ఏమాత్రమూ కృషిచేసియుండలేదు. యూరపులో సాంప్రదాయకమైననాగరికత పతనమైపోయినతర్వాత, అరబ్బులే విజ్ఞానశాస్త్రజ్యోతిని సలక్షణంగా వెలిగించుతూ మధ్యయుగాలలో అనన్య ప్రసిద్ధులయ్యారు.

అలెగ్జాండ్రియాలో యిట్టి శాస్త్రీయ కార్యకలాపాలు, నిర్మాణాలు విరివిగా జరగడానికి ఆకాలపు సంఘప్రభావమే కారణమనేది నిస్సంశయం. విరివిగాపెరుగుతున్న సంఘబలం, సముద్రయానం కలసి అనేక ఆవశ్యకతలను సృష్టించడమే పైకారణం. ఇండియాలో సంఘావసరాలు, పెరుగుతున్న వ్యాపారం, క్లిష్టముఖమైన సంఘనిర్మాణం కలసిచేసిన వత్తిడిఫలితమే - సంఖ్యాగణిత, బీజగణిత సూత్రాలు, సున్నాగుర్తు, స్థలానికి విలువనిర్ణయించే పద్ధతులు భారతీయులచే కనుగొనబడ్డాయి. కాని, పురాతన గ్రీకుప్రజలందరిలోనూ శాస్త్రీయ జిజ్ఞాస ఎంతవరకు వున్నదీ అనేది చెప్పలేము. వారిజీవితం వారితాత్విక దృక్పథం ఆధారంగా, మానవునిలోని ప్రకృతిలో తానుయిమిడి మధురిమ నాస్వాదించాలనే కోరికతో - సాంప్రదాయకవిధానాలనే అనుసరించివుండాలి. జీవితాన్ని ఆ దృక్పథంతో చూడడమే - గ్రీసు, ఇండియా దేశాలమధ్యగల పోలిక. ఇండియాలోవలెనే గ్రీసులోకూడా, సంవత్సరాన్ని ప్రజలపండుగలనుబట్టి విభజించారు. ఈ పండుగలు రాబోయే ఋతువులను గుర్తికితెస్తూ, మానవుని ఆ యా ఋతువులకనుగుణమైన ప్రవృత్తికి సిద్ధంచేస్తాయి. ఇండియాలో మన కిప్పటికీ యిట్టి వసంత కాలపుపండుగ, పంటలకాలపుపండుగా వున్నాయి. శిశిరఋతువు అనంతరం దీపాలపండుగ 'దీపావళి', వసంతఋతువు తొలిదశలో 'హోలీ',

పురాణసాంప్రదాయకవీరుల పూజించు పండుగలూ (విజయదశమి మొ॥) వున్నాయి. ఇట్టి కొన్ని పండుగలలో యిప్పటికీ గ్రామీణు లందరూ కలసి జానపదాలు పాడడం, జానపదనృత్యాలు (కృష్ణుడు గోపికలతో కలసి చేయు 'రాసలీల' వంటివి) ఆచారంగానే వుంది.

పురాతనభారతంలో స్త్రీలను వేరుగా చాటునవుంచడం లేదు. ఇది రాజ, ఉన్నతవంశాలలో కొంతవరకు వుండేది. అప్పటిఇండియాలో కంటె, గ్రీసులో ఈ స్త్రీలవేర్పాటు ఎక్కువగా వుండేదనుకుంటాను. మనపూర్వగ్రంథాలలో ప్రతిభ, పాండిత్యంగల స్త్రీలనుగురించి అనేక రచన లున్నాయి. వారు బహిరంగచర్చలలో పాల్గొనడంకూడా తరచు జరుగుతూవుండేది. వివాహం గ్రీసులో దాదాపు ఒక తాత్కాలిక ఒడంబడికవంటిది కాగా, ఇండియాలో ఇతరరకాలు కొన్ని ఉదహరింప బడినప్పటికీ, ముఖ్యంగా వివాహ మొక పవిత్ర శాశ్వతసంబంధంగా యెంచబడేది.

గ్రీకుస్త్రీలకు ఇండియాలో చక్కని ఆదరణ లభించేదనడం స్పష్టం. మన పురాతన, నాటకాలలో రాజస్థానాలలోవుండే పరిచారి కలు గ్రీకులు అనే విషయం అనేకసార్లు పేర్కొనబడింది. గ్రీసునుంచి ఇండియాకు బరిగాజా (పశ్చిమభారతంలోగల బ్రోచ్) రేవుకు వచ్చే దిగుమతులలో 'బాలగాయకులు, అందమైన పరిచారికలు' ముఖ్యమై నట్లు వ్రాయబడింది. మెగస్తనీసు మౌర్యచంద్రగుప్తుని జీవితాన్ని వర్ణిస్తూ: "రాజుగారిభోజనం పరిచారికలచేత తయారుచేయబడుతుంది. ద్రాక్షాసవాన్నికూడా వారే అందించుతారు. భారతీయులందరూ యిట్టి పానీయాన్ని సేవిస్తారు" అని వ్రాశాడు. ఒక పురాతన తమిళ కవి – "యవనులు (అయోనియనులు లేక గ్రీకులు) తమ భద్రనౌకలలో దెచ్చిన శీతల సువాసనగల ద్రాక్షాసవము" అని వర్ణించాడుగనుక, భార తీయులుపయోగించిన పానీయంలో కొంతభాగం గ్రీసు, దానివలసల నుండియే వచ్చిఉండాలి. పాటలీపుత్రంరాజు (బహుశా అశోకునితండ్రి యగు బిందుసారుడు) గ్రీసురాజగు ఆంటియోకస్‌కు ఒకలేఖవ్రాస్తూ – మధురద్రాక్షాసవము, ఎండు అత్తిపండ్లు, ఒక సోఫీవేదాంతిని కొని, పంపవలసినదిగా కోరినాడని గ్రీకులచరిత్రలో వుంది. ఆంటియోకస్

విగ్రహారాధన గ్రీసునుండియే ఇండియాకు వచ్చిందనే భావన కౌతుకంగా వుంటుంది. వేదమతం విగ్రహారాధనకు వ్యతిరేకం. ఆ కాలంలో దేవాలయాలే వుండేవికావు. అంతకుముందుగల మతవిశ్వాసాలలో, విగ్రహపూజాసూచనలు వుండియుండవచ్చును. కాని, ఈఆచారం వ్యాప్తిలోలేదు. బౌద్ధం ఆదిలో విగ్రహారాధనను పూర్తిగా నిరోధించింది; బుద్ధునివిగ్రహాలుగాని, చిత్రాలుగాని చేయరాదని శాసించింది. కాని, గ్రీకుకళాప్రభావం ఆఫ్ఘనిస్థానము, భారతసరిహద్దుప్రాంతాలలో బలంగా వ్యాపించి, పరిసరాల ప్రజల నాకర్షించింది. అయినా, ఆదిలో బుద్ధునివిగ్రహాలు చేయబడలేదు. అపోలో (గ్రీకు దేవుడు) బోధిసత్వాల శిల్పాకారాలలో (బుద్ధుని పూర్వపు అవతారాలని విశ్వసించబడేవి) కనుపించసాగాడు. క్రమంగా బుద్ధునివిగ్రహాలు, చిత్రాలు వచ్చాయి. ఇది, కొన్ని హిందూమతలక్షణాలతో విగ్రహారాధనకు ప్రోత్సాహమిచ్చింది. (వేదమతంలో యిట్టిది జరుగలేదు.) పారసీక, హిందూస్థానీ భాషలలో విగ్రహం లేక ప్రతిమ పర్యాయపదం 'బుట్'. ఈ పదం 'బుద్ధ' పదసంజనితం.

మానవుడు జీవితంలో, ప్రకృతిలో, ప్రపంచంలో ఒక రకమైన మధురిమను చూచేందుకు తాపత్రయపడినట్టుంది ఆ కోరిక – అది సమర్థనీయం కానీ, కాకపోనీ – మనసుయొక్క ఒకానొక ఆవశ్యకతను తృప్తిపరచాలి. పురాతనతత్వవేత్త లెప్పుడూ దీనికొరకే అన్వేషిస్తున్నారు. ఆధునిక విజ్ఞానశాస్త్రవేత్తలుకూడా యిట్టి భావసంచలనానికి లోనవుతున్నారు. మన ప్రణాలికలు, కార్యక్రమాలు, విద్య, సాంఘిక రాజకీయవ్యవస్థలపై మనకుగలభావాలు అన్నీకూడా తమవెనుక – ఐక్యత, మధురిమలకై అన్వేషణాదృష్టిని కలిగేఉంటాయి. ఇపుడు, సముద్ధులైన వివేచనాపరులూ, తత్వవేత్తలూ "ఈ ప్రాథమికాభిప్రాయం తప్పు. ఈ ప్రపంచం ఒకానొక హఠాత్ప్రమాదకారణంగా జనించింది. ఇందులో ఒక క్రమపద్ధతినిగాని, ఐక్యతనుగాని చూడాలనుకోవడం దుర్భ్రమ" అని మనకు చెబుతున్నారు. అది యథార్థమే కావచ్చు. కాని, యీ ప్రాథమిక పొరపాటుభావన, యీ విశ్వాసం ఇండియా, గ్రీసు, తదితర దేశాలలో ఐక్యతను చూడాలని జరిగిన అన్వేషణ ప్రత్యక్షఫలితాలను సాధించింది, జీవితంలో ఒకమధురిమను, ఒక

స్థాయీభావాన్ని, ఒకసౌఖ్యాన్ని సృష్టించింది. ఈ విషయంలో సందేహ ముండవలసిన అవసరంలేదు.

## ౮ ప్రాచీన భారతీయ నాటకరంగం

పురాతన భారతీయనాటకాలనుగురించి యూరోపియనులు ప్రప్రథమంగా తెలుసుకోగానే (కనిపెట్టగానే), అది గ్రీకునాటకాల నుంచి పుట్టిందనీ, లేక గ్రీకునాటకాలప్రభావం ఎక్కువగాగలదనీ అనేక సూచనలు బయలుదేరాయి. అప్పటివరకూ పురాతననాటకమేదైనా వున్నదని మనకు తెలియదు గనుకనూ, అలెగ్జాండరుదండయాత్రల తర్వాత గ్రీకులవలసరాజ్యాలు భారతసరిహద్దులలో నెలకొల్పబడినవి గనుకనూ ఈసూచనలకు కొన్ని ఆధారాలుండవచ్చునని తోస్తుంది. ఈ గ్రీకువలసరాజ్యాలు అనేకశతాబ్దాలు కొనసాగాయి కనుక, గ్రీకు నాటకప్రదర్శన లాప్రాంతాలలో తెలిసియుండవచ్చును. 19 వ శతాబ్ద మంతటా యూరోపియన్ విజ్ఞానులు యీవిషయాన్ని సునిశితంగా పరిశీలించి, చర్చలుజరిపారు. ఇప్పుడు భారతీయనాటకరంగానికి మూలం పూర్తిగా స్వతంత్రమైనదనీ, దానిని పాలించే భావనలు, పొపుదలలు పూర్తిగా స్వతంత్రమైనవనీ అందరూ అంగీకరిస్తున్నారు. ఋగ్వేదశ్లోకాలలోను, సంభాషణలలోను ఒకరకమైన నాటకసాంప్ర దాయం వుంది గనుక, భారతీయనాటకరంగానికి మూలబీజాలు ఆకాలం నాటివని చెప్పవచ్చును. రామాయణ, మహాభారతాలలో 'నాటక' ఉదాహరణలున్నవి. కృష్ణునిగాథలలో అది గేయ, గాన, నృత్యరూ పాలతో ఒక ఆకృతిని పొందసాగింది. క్రీ. పూ. 6 వ శతాబ్దిలోని వ్యాకరణవేత్తయగు పాణిని కొన్నినాటకరూపాలను ఉదహరించాడు.

నాటకకళకు సంబంధించిన శాస్త్రీయగ్రంథం (నాట్యశాస్త్రము) క్రీ. శ. 3 వ శతాబ్దిలో వున్నదని అంటారు. కాని, ఇది అంతకుముందే గల నాటకగ్రంథాలఆధారంతో సమగ్రంగా రచింపబడివుంటుంది. నాటకకళ పూర్తిగావికసించి, బహిరంగప్రదర్శన లెక్కువగాజరుగుతున్న పుడే యిట్టి లక్షణగ్రంథం రచించవీలవుతుంది. అంతకుముం దెన్నో రచనలు జరిగివుండాలి. దానివెనుక ఎన్నోశతాబ్దాల క్రమాభ్యుదయం వుండివుండాలి. ఇటీవల ఛోటానాగపూరులోని రాంఘర్ కొండలలో

పురాతన నాటకరంగస్థలనిక్షేపం కనుగొనబడింది. అది క్రీ. పూ.
శతాబ్దినాటిదట. ఇది "నాట్యశాస్త్రము" లో వర్ణింపబడిన సాధా
వర్ణనకు సరిపోయినలక్షణాలు కలిగివుండడం గమనించదగ్గవిశేషం.

సంస్కృతనాటకము క్రీ. పూ. 3 వ శతాబ్దినాటికే పూర్తిగా
కసించియున్నదని యిపుడు విశ్వసింపబడుచున్నది. కొందరుపండితులు
. పూ. 5 వ శతాబ్దినాటికే అలావున్నదంటున్నారు. మనకులభించిన
ాటకాలలో — అంతకంటె పూర్వపు నాటకాలనూ, వాటిరచయిత
నూ గురించిన ఉదాహరణలున్నవి. కాని ఆ గ్రంథాలు మన కిప్పటికీ
ించలేదు. అట్టి నాటకరచయితలలో భాసు డొకడు. తరువాతి
ాటకకర్త లాయన నెంతో ప్రశంసించారు. ఈ శతాబ్ది ఆరంభంలో
ాసునినాటకాలలో 13 ఒకేసారి లభించాయి. క్రీస్తుశకారంభంలో
ని, కొంచెంముందుగాని జీవించియున్న "అశ్వఘోషు"ని నాటకాలే
వకు లభించిన సంస్కృతనాటకాలన్నింటిలోనికి పురాతనమైనవి.
తాళపత్రాలపైగల వ్రాతప్రతుల అవశేషభాగాలు మాత్రమే.
త్రమైనవిశేషమేమిటంటే, ఈ గ్రంథాలు గోబీయెడారిసరిహద్దున
"తుర్ఫాన్"లో దొరికాయి. అశ్వఘోషుడు పవిత్రబౌద్ధుడు. ఇంకా
ద్ధచరిత్ర"నుకూడా రచించాడు. ఇది ఇండియా, చైనా, టిబెట్టులలో
ద్దిపొందింది. లోగడ ఒక భారతీయపండితుడే దీనిని చైనాభాష
ికి అనువదించాడు.

ఈ గ్రంథాలు లభ్యంకావడంవల్ల, భారతీయనాటకచరిత్రకు
త పరిపుష్టికలిగింది. ఇంకా కొన్నిగ్రంథాలు, నిక్షేపాలు లభించి,
తీయసంస్కృతీవైభవంలోని ఆకర్షణీయనాటకశాఖపై కొత్తవెలుగు
ించవచ్చును.

కాళిదాసుని "శాకుంతలము"ను 1789 లో సర్ విలియంజోన్స్
ంలోనికి అనువదించేవరకూ, భారతీయనాటకకళను గురించి
రోపియనులకేమీ తెలియదు. దీన్నిప్రథమంగా సందర్శించడంతో
రోపియన్ విద్యావంతులలో బ్రహ్మాండమైన సంచలనం కలిగింది.
టకం అనేకసార్లు ముద్రించబడింది. సర్ విలియంజోన్సుగారి ఆంగ్లా
దంనుంచి — జర్మన్, ఫ్రెంచి, డేనిష్, ఇటాలియన్ భాషలలోనికి

అనువాదాలుజరిగాయి. గొథే "శాకుంతల" నాటకంచే బలీయం
ఆకర్షింపబడి, ఘనంగా ప్రశంసించాడు. సంస్కృతనాటకాలకు
ఉపోద్ఘాతం వ్రాయడం సామాన్యసాంప్రదాయం. ఆ ప్రకారం కాళిద
"శాకుంతల"మునకు ఉపోద్ఘాతం వ్రాశాడు. దాన్నిచూచినతర్వాత
గొథే తన "ఫాస్ట్" గ్రంథానికి ఉపోద్ఘాతంవ్రాశాడంటారు. సంస్కృత
సారస్వతంలో కాళిదాసునుమించినకవి, నాటకకర్త లేడని అందరు
ప్రశంసిస్తారు.

కాళిదాసు యింకా కొన్నినాటకాలనూ, కావ్యాలనూ రచి
చాడు. అతనికాలాన్ని స్పష్టంగా చెప్పలేము. కాని, 4వ శతాబ్ది చి
రలో గుప్తవంశజుడగు రెండవ చంద్రగుప్తవిక్రమాదిత్యునికా
ములోనివాడైయుండవచ్చును. ఉజ్జయినిలోనే నివసించాడు. ఆ ఆ
నంలోని నవరత్నాలలో ఒకడని నానుడి. అతని విశిష్టత పూర్తి
గుర్తింపబడి, ఆతనిజీవితకాలంలోనే అనన్యప్రసిద్ధిబడసినాడనేది నిశ
శయం. అతడు మహా అదృష్టశాలి. జీవితం అతన్ని ప్రియపుత్రుని
చూచుకున్నది. అతడు జీవితముయొక్క కాఠిన్యము, అంపపుకో
కంటె ఎక్కువగా దానిసౌందర్యము, మృదులాలిత్యములనే అనుభ
చాడు. ఈ జీవితంపట్ల, ప్రకృతిసౌందర్యంపట్ల ఆయనకుగల ఈ ప్రేమ
అతనిరచనలే వ్యక్తంచేస్తున్నాయి.

కాళిదాసుని మహాకావ్యాలలో "మేఘదూత" ఒకటి.
ప్రేమికుడు బంధితుడై, ప్రేయసికి దూరంచేయబడి, వర్షాకాల
తన విరహవేదనాసందేశాన్ని ఆమెదగ్గరకు గొంపోమని, ఒక మేఘ
అడుగుతాడు. ఈ కావ్యానికీ, కాళిదాసుకూ అమెరికన్ పండిత
"రైడర్" గొప్పప్రశంసను సమర్పించాడు. ఆయన యీ కావ్య
రెండుభాగాలనూ సూచిస్తూ ఇలావ్రాశాడు :- "మొదటి సగ
బాహ్యప్రకృతియొక్క వర్ణన. అయినప్పటికీ, మానవానుభూతి మి
వుంది. చివరిసగభాగం ఒకమానవహృదయచిత్రీకరణ. అయిన
ఆ చిత్రం సహజ సుందరచట్రంలో బిగించబడింది. ఇదెంత
త్కారసౌష్టవాలతో రచించబడిందీ అంటే-ఇం దేసగభాగం గొ
ఎవరూ చెప్పలేరు. ఈ మహాకావ్యాన్ని మూలభాషలో (సంస్
చదివినవారిలో కొంద రొకభాగంచేతా, కొందరు మరొకభా

సంచలింపజేయబడ్డారు. యీ ప్రపంచం మానవునికి తగ్గట్లుగా నిర్మింపబడలేదు. మానవాతీతమైన జీవితంలోని ఘనతనూ, దానివిలువనూ గ్రహించగలిగినపుడే, మానవుడు పరిపూర్ణస్థాయికిచేరుకుంటాడు – అనే సత్యాన్ని కాళిదాసు 5 వ శతాబ్దిలోనే అవగాహనచేసుకున్నాడు. యూరపు 19 వ శతాబ్దివరకూ దీన్ని నేర్చుకోనేలేదు. ఇప్పటికీ పూర్తిగా అర్థంచేసుకోలేదు. కాళిదాసు ఈ సత్యాన్ని పట్టుకోగలిగాడంటే, అదే ఆతని మేధాసంపత్తికి ఎనలేని పొగడ్త. గొప్పకవితకు రూపశైలి ఎంత అవసరమో, ఈ జ్ఞానంకూడా అంత అవసరం. కవితాప్రవాహం అరుదుగాదు; మేధాశక్తి అసాధారణంకాదు; కాని, ఈ రెండు మహత్తర గుణాలకలయిక సృష్ట్యాదినుండి యిప్పటివరకు ఏ పదిసంద్రెండుసార్లో మాత్రమే సంభవించివుంటుంది. ఈ మధురసమ్మేళనాగుణము కలిగియున్నందువల్లనే, కాళిదాసును అనాక్రియన్, హొరేస్, షెల్లీలస్థానంలో వుంచలేము. ఆయన సొఫోక్లెసు, వర్జిల్, మిల్టన్‌లస్థాయికి చెందినకవి."

బహుశా కాళిదాసునినాటకాలకు ముందే, మరొక ప్రసిద్ధ నాటకము ప్రదర్శింపబడిఉంటుంది. అది శూద్రకుని "మృచ్ఛకటికము" (మట్టిరథం). అది చక్కని కృతకనాటకం. అయినా నాటినాగరికత, మానవహృదయాలను మనకళ్ళకుగట్టే వాస్తవికత కూడా కలిగియుండి, మనల్ని సంచలింపజేస్తుంది. క్రీ. శ. 400 ప్రాంతంలో – అదీ రెండవచంద్రగుప్తునికాలంలోనే – విశాఖదత్తుని "ముద్రారాక్షసము" (రాజముద్రిక లేక రాజరికచిహ్నమగు ఉంగరం) అను మరొక గొప్ప నాటకం ప్రదర్శింపబడింది. ఇది పౌరాణికగాధగాని, ప్రేమగాధగాని కలియని స్వచ్ఛంద రాజకీయనాటకం. అందలికథ మౌర్యచంద్రగుప్తుని కాలంనాటిది. నాటి ముఖ్యమంత్రియగు చాణక్యుడు (అర్థశాస్త్ర రచయిత) యిందు నాయకుడు. కొన్నివిధాలుగా యిది నేటి ఎన్నదగిన నాటకమే.

7వ శతాబ్ది ఆరంభములో ఒక కొత్త సామ్రాజ్యాన్ని స్థాపించిన హర్ష చక్రవర్తి నాటకకర్తకూడాను. అతనినాటకాలు మూడు, మనకిప్పుడున్నాయి. క్రీ.శ. 700 ప్రాంతాలలోవున్న "భవభూతి" సంస్కృత సారస్వతాకాశంలో మరొక ధ్రువతార. ఆయనకవితాసౌందర్యం

ఎక్కువగా భాషపై ఆధారపడివుంటుందిగనుక, అనువాదం అంత సులభం కాదు. అయినా, ఇండియా అంతటా ప్రసిద్ధినొంది - కాళిదాసు తరువాత అతడే మహాకవియని ప్రశంసింపబడ్డాడు. ఆక్సుఫర్డ్ విశ్వవిద్యాలయంలో సంస్కృతాచార్యుడుగావుండిన విల్సన్ ఈ మహాకవు లిరువురిని గురించీ యిలా వ్రాశాడు: "భవభూతి, కాళిదాసుల కావ్యాలలోవలె-అంతటి సుందర సంగీత మధురభాషనూ, అంతటి మహోన్నత గంభీరశైలినీ మనం ఊహించడమే దుస్సాధ్యం."

సంస్కృతనాటకప్రవాహం కొన్ని శతాబ్దాలపాటు ప్రవహించింది. కాని, 9 వ శతాబ్ది తొలిదశలోని మురారికాలమునుండియు దానివిశిష్టత సన్నగిలసాగింది. ఆ సన్నగిలుట, క్రమంగా క్షీణించుట, జీవితకార్యక్రమాలన్నింటిలోను ద్యోతకమవుతున్నకాల మది. నాటకకళ క్షీణించుటకు ఆఫ్ఘను, మొగలుయుగాలలో రాజపోషణ లేకుండుట, నాటకము కళారూపము గనుక ఇస్లాంమతం నిషిద్ధస్వభావముతో చూచుట కొంతవరకు కారణమనియు, ముఖ్యంగా అది జాతీయ మతముతో పెనవేసుకొనియుండుట అనియూ కొందరు సూచించినారు. ప్రజలకనుగుణ్యమగు ప్రదర్శనలు కొనసాగుతూనేవున్నా, నాటక సారస్వతము విద్యావంతులకు మాత్రమే అర్థమగునది యగుటచే, రాజపోషణపై ఆధారపడియుండకతప్పలేదు. పైపాలకవర్గాలలో మార్పులవల్ల యిట్టిఫలితము కలిగియుండవచ్చును గాని, పూర్తిగా యిదే కారణమనుటకు తగు ఆధారబలం లేదు. అస లా మార్పులు (రాజకీయమైనవి) రాకపూర్వమే సంస్కృతనాటకశాఖ క్షీణించసాగినట్లు ఆధారములున్నవి. అట్టిమార్పులుగూడ అనేక శతాబ్దాలవరకు ఉత్తర భారతమునకే పరిమితమైయుండినవి. కనుక, సంస్కృతనాటకకళలో తగు శక్తియున్నట్లయితే,దక్షిణభారతములోనైనా తన సృజనాత్మకజీవితము కొనసాగించియుండెడిదిగదా! అప్పుడప్పుడూ కొన్ని మార్పులూ చేర్పులూ ఉన్నప్పటికీ, ఆఫ్ఘను, తురుష్క, మొగలుచక్రవర్తులు (స్వల్పకాలపు ఛాందసులపాలనలోతప్ప) భారతీయసంస్కృతిని పూర్తిగా ప్రోత్సహించారు. ముస్లింఆస్థానాలు, భాగ్యవంతులు భారతీయసంగీతాన్ని పూర్తిగా, యథాతథంగా ఉపయోగించుకున్నారు. ఈ శాఖలో మహాపండితులనేకులు ముస్లిములే. నున

సారస్వతాన్ని, కవిత్వాన్నికూడా వారు ప్రోత్సహించారు. ప్రఖ్యాత హిందీకవులలో ఎందరో ముస్లిములుకూడ ఉన్నారు. బీజపూరు సుల్తానగు ఇబ్రహీం ఆదిల్‌షా హిందీ, భారతీయసంగీతాలమీద సమగ్ర లాక్షణికగ్రంథం రచించాడు. మన కవిత్వము, సంగీతములలో హిందూదేవుళ్ళ, దేవతల ప్రశంసించుట ఉన్నప్పటికీ అవి ఆమోదింపబడినవి. పురాతనగాథాసూచనలు, నానుడులు ఉపయోగింపబడుచునే ఉండేవి. ముస్లింపాలకులు విగ్రహములను తయారుచేయుటను, మరికొన్ని స్వల్పవిషయములను వ్యతిరేకించిరేగాని, అసలు కళారూపములను అణచివేయుట కేమాత్రమును ప్రయత్నించియుండలేదు.

ఆకాలములో ఇండియాలో అనేకవిధానాలు క్షీణించుచున్నట్లే, సృజనాత్మకసంచలనం మందగించినట్లే, సంస్కృతనాటకరచనాదులుగూడ సన్నగిల్లినవి. ఆఫ్ఘనులు, తురుష్కులు ఢిల్లీచక్రవర్తులు కాకపూర్వమే యీ దశ ప్రాప్తించింది. తరువాత పారసీకము రాజభాషయగుటచేత, సంస్కృతము కొంత వ్యతిరేకత నెదుర్కొనవలసివచ్చివుంటుంది. కాని, అన్నిటికంటె ముఖ్యకారణం - సంస్కృతమునకు, దైనందినజీవితంలో ప్రజలు వాడుచున్న భాషలకు మధ్య
ంతో భేద అగాధము లేర్పడుటయే అనవచ్చును. క్రీ. శ. 1000 సం॥
కి ప్రజలుమాట్లాడుచున్న భాషలలో (వాటినుండియే నేటి మన
లు రూపొందినవి) సారస్వతసృష్టి ఆరంభమైనది.

టికీగూడా మధ్యయుగాల్లో అంతటా, ఇటీవల
ప్రదర్శింపబడుతూనే యుండుట
గారి "మిడ్‌సమ్మర్ నైట్స్‌డ్రీమ్"
నికి అనువదించబడింది. పురాతన
బయల్పడుచున్నవి. 1890 లో
గ్లిన్ లెపీ తయారుచేశాడు.
కాలు

ములో విద్యాగంధముగల పాత్రలు సంస్కృతమును మాట్లాడగా, సామాన్యులు-సాధారణంగా స్త్రీలు(కొన్నివట్ల మార్పులుండవచ్చును) ప్రాకృతభాషను మాట్లాడేవారు. పద్యాలూ, పాటలూ సంస్కృతంలో వుండేవి. నాటకాలలో వీటిభాగం ఎక్కువ. ఇట్టి భాషామిశ్రమమువల్ల నాటకకళ సామాన్యులకు దగ్గరై యుండవచ్చును. ఇది గ్రాంథిక భాషకూ, ప్రజాకళయొక్క ఆవశ్యకతకూ ఒక ఒడంబడిక, ఒక మధ్యే మార్గంవంటిది. అయినప్పటికీ, పురాతననాటకకళ విద్యావంతులగు ప్రేక్షకులకొరకే (రాజాస్థానములు మొదలగునవి) ఉద్దేశింపబడినకళ. ఫ్రెంచి విషాదాంతనాటకములు వాటికథావిషయాలలో వాస్తవజీవితానికి పెడముఖంగా వున్నందువల్ల సామాన్యప్రజలకు దూరమై, ఒక సాంప్రదాయిక ప్రేక్షక సమాజాన్ని సృష్టించుకొన్నది. ప్రొఫెసర్ లెవీ వీటిని మన సంస్కృతనాటకములతో పోల్చినాడు.

ఈ ఉన్నత సారస్వతనాటకప్రదర్శనలేగాక - ప్రజాభిమానం పొందిన నాటకప్రదర్శనలుకూడ విరివిగాఉండేవి. భారతీయపురాణాలు చరిత్రలలోని కథలతో (ఈ కథలు ప్రజలందరికీ తెలిసివుండేవి. నాటకీయసాంకేతికములకంటె, ప్రదర్శనాడంబరాని కెక్కువ ప్రాధాన్యత నిచ్చేవి. ఇవి ప్రాంతీయప్రజలభాషలోనే ఉండుటచే, ఆప్రాంతానికే పరిమితమై ఉండేవి. సంస్కృతనాటకాలుమాత్రం భారతదే విద్యావంతులందరికీ తెలిసినభాషలో వుండడంవల్ల భారతదేశమ ప్రదర్శింపబడేవి.

సంస్కృతనాటకాలు ...
రంగస్థలాలంకరణకు, ప్రేక్షకు...
కూడా వుండేవి. గ్రీసుదేశంలో...
నాటకములలో స్త్రీపాత్రలను
నాటకాలలో ప్రకృతినిగు...
...గాంతీ ఉన...

జ్ఞప్తికి తెస్తాయి. అయినా గ్రీకునాటకాలు, సంస్కృతనాటకాల కెంతో భిన్నంగావుంటాయి.

గ్రీకునాటకాలకు పునాది విషాదం, చెడ్డకు సంబంధించినసమస్య. మానవు డెందుకు బాధపడాలి? ప్రపంచంలో 'చెడు'అనే దెందుకుంది? దేవునియొక్క, మతంయొక్క సృష్టివైచిత్ర్యం. పాపం—మానవు డెంత దయనీయుడు! ఒక్కరోజువయస్సేగల శిశువు, సర్వశక్తివంతమైన కర్మ (యుగయుగాలుగా మానవుని బంధిస్తూ, తాను మారనిచట్టం) కెదురుగా తన అంధ, లక్ష్యవిహీనఉద్యమాలతో పెనగులాడేవ్యక్తి. మానవుడు బాధలనుభవిస్తూ నేర్చుకోవాలి. అత డదృష్టవంతుడైతే యీ పెనగులాటనుంచి పైకిలేస్తాడు.

"తుఫానునుంచి తప్పించుకుపోయి, ఆశ్రయాన్ని చేరినవాడు
అలసిపోయిన సముద్రంమీద, హాయిగా వుండగలడు;
పెనగులాటనుండి బైటపడి పైకిలేచిన స్వతంత్రుడు
సుఖంగా వుండగలడు; ఎందువల్లనంటే, జీవితకళ
విచిత్రంగా చిత్రించబడింది. బంగారం కలవాడూ,
బలంగలవాడూ తన సోదరుని మించిపోగలడు;
లక్షలాది మానవులు పైపైన తేలుతూ, ప్రవహిస్తూ,
నురుగులవలె అగణితఆశలతో పొంగిపోతూంటారు;
వారు ఆశల నీడేర్చుకోవచ్చు, లేకనూపోవచ్చు,
వారి ఆశ లంతరించనూవచ్చు, వ్యసనతరమూకావచ్చు
కాని, సుదీర్ఘదివసాలు గడచిపోతున్నాయనీ,
జీవించడమే ఆనందమనీ,
అలా భావించినవాడే స్వర్గాన్నిచేరినట్లనీ,
ఎవరు తెలుసుకోగలరు?"

మానవుడు బాధలనుభవిస్తూ నేర్చుకుంటాడు. జీవితాన్ని ఎలా ఎదుర్కోవాలో అలవరచుకుంటాడు. అంతేకాదు, చిట్టచివరి రహస్యం నిగూఢంగానే వుండిపోతుందనీ, తనప్రశ్నలకు సమాధానాలు దొరకనే లేదనీ, మంచి చెడుల పొడుపుకథాసమస్యను పరిష్కరించనేలేదనీ

అర్థంకాని రహస్యానికి అనేకరూపాలున్నాయి;
దేవుడు తెచ్చే అనేక విషయాలకు-ఆశాలేదు, భయమూలేదు
మానవు లెదురుచూచే అంత్యం రానేరాదు,
మానవుడూహించనట్టి మార్గం వుండనేవుంది.”

గ్రీకు విషాదాంతనాటకాలతో పోల్చదగ్గ శక్తీ, హుందాగలవేవీ సంస్కృతంలో కనిపించవు. విషాదాంతం అంగీకరింపబడలేదు గనుక, సంస్కృతంలో విషాదాంతనాటకమే లేదు. నాటకకర్తలు ప్రజలలోగల మతవిశ్వాసాన్ని ఆమోదించినవారే అయినందున, ఇటువంటి ప్రాథమికప్రశ్నలు చర్చకేరావు. ఇట్టివాటిలో పునర్జన్మ, హేతువు, ఫలితములకు సంబంధించిన సూత్రాలుకూడా వున్నాయి. ఇపుడు సంభవించేదేదైనాసరే, పూర్వజీవితంలోజరిగిన ఒకదానియొక్క ఫలితమేనని భావిస్తున్నందున, ప్రమాదవశాత్తూ (అకారణంగాజరిగిన కీడు) అనే ప్రసక్తే వుండదు. మానవుడు పోరాడవలసిన(అతని ప్రయత్నాలు నిష్ఫలమన్నప్పటికీ) అంధశక్తులవల్ల జోక్యంఉండదు. తత్వవేత్తలూ, ఆలోచనాపరులూ యీ సామాన్యవివరాలతో తృప్తిపడలేదు. అసలు మూలకారణాలనూ, పరిపూర్ణవివరణలనూ అన్వేషించేందుకు వారెప్పుడూ తమ గతంవైపే వెడుతున్నారు. కాని, జీవితం యీవిశ్వాసాల ఆధారంతోనే సాగుతున్నది గనుక, నాటకకర్తలు వాటినెదురించలేదు. సంస్కృతనాటకాలూ, కవిత్వమూ మొత్తంమీద భారతీయాత్మతో ఏకీభవి ంనట్టివేగాని, ఉన్నసాంప్రదాయాల నెదురించినసూచనలు కనిపించవు. నాటకరచనకు ఖచ్చితమైననియమాలు ఏర్పరచబడ్డాయి. వాటిని భంగపరచడం సులభంగాదు. అయినప్పటికి, కర్మకు సాత్వికంగా లొంగిపోవడమన్నదిలేదు. నాయకు డెప్పుడూ అన్నిఅవాంతరాలనూ ఎదుర్కోగల సమర్థుడు, ధైర్యవంతుడు అయివుండేవాడు. ముద్రారాక్షసములో నాయకుడగు చాణక్యుడు “అమాయకులే దైవానుగ్రహంమీద ఆధారపడతారు. వారు తమశక్తులపై ఆధారపడేబదులు, గగనంలోని తారలకేసిచూస్తూంటారు” అని విమర్శించాడు. ఈ నాటకాలలో కొంతకృత్రిమలక్షణంకూడా ఉంది. కథానాయకుడెప్పుడూ నాయకుడుగానే ప్రవర్తిస్తాడు. క్రూరు డెల్లవేళలా క్రూరత్వాన్నే ప్రదర్శిస్తాడు—

అయినప్పటికీ, సంచలనాత్మకమైన సంఘటనలూ, మనసులను కదలించేరంగాలూ, ఒకరకమైన జీవితప్రాతిపదికా వుంటాయి. ఈజీవితం-వాస్తవ, అవాస్తవాలు కవియూహలతో, సుందరతరమైనభాషతో, పడుగుపేకలుగా అల్లబడినట్లు, కలలోనిచిత్రమువలెను ఉంటుంది. అది నిజమో కాదో ఖచ్చితంగాచెప్పలేనుగాని, ఈ నాటకాలనుబట్టి, నాటి భారతదేశం శాంతియుతంగా, దృఢతరంగా, తనమూలాలను తెలుసుకుని, తన ప్రశ్నలకు సమాధానంపొందినట్లుండేదని తోస్తుంది. అది గంభీరంగా ప్రవహిస్తూంటుంది. సుడిగాలులూ, తుపానులూ దాని పై భాగాన్నిమాత్రమే అలలుగా కదిలించి [illegible] సిద్ధాంతనాటకాలలోవలె భయంకర బడబానలాలవం[illegible], అది మానవత్వంతో తొణికిసలాడుతూ, కళామ[illegible]బద్ధమైనవిక్యత కలిగియుండేది. సిల్వైన్ లెవీ—"భారతీయ[illegible]జ్ఞానముసృష్టించిన అన్నింటిలోను, నాటకమే యిప్పటికీ అత్యంత[illegible]ప్రదాయినిగా ఉంది" అన్నాడు.

ప్రొఫెసర్ ఏ బెర్రీడేల్ కీత్ యిలాకూడా వర్ణించాడు: "భారతీయకవిత సృష్టించినవాటిలోకెల్ల సంస్కృతనాటకమే మహోన్నతమైనదని మనం సకారణంగా భావించవచ్చు. భారతసారస్వతకర్తలు చిత్తశుద్ధితో సృష్టించి సాధించిన సారస్వతకళయొక్క పరమోద్దేశాన్ని—దాని సారాంశాన్ని—అంతటినీ తనలో నిక్షేపించుకున్నది సంస్కృత నాటకం......బ్రాహ్మణుడు—ఈ విషయంలోనూ, ఇంకా నేకవిషయాలలోనూ విరివిగా నిందించబడినవాడు—వాస్తవానికి భారతదేశపు విజ్ఞానశిష్టతకు మూలాధారుడు. అతడు భారతీయతత్వశాస్త్రాన్ని సృష్టించినట్లే, తన తెలివితేటలను మరొకకృషిలో ప్రయోగించి, భావగర్భిత సంచలనాత్మకనాటకకళను సృష్టించినాడు"

శూద్రకుని మృచ్ఛకటికమునకు ఆంగ్లానువాదం, 1924 లో న్యూయార్కులో ప్రదర్శింపబడింది. దాన్నిగురించి (నేషన్) పత్రికయొక్క నాటకవిమర్శకుడు జోసెఫ్ ఉడ్ క్రచ్ యిలా వ్రాశాడు; "సిద్ధాంతవాదులు చెప్పే స్వచ్ఛందకళాప్రదర్శనముయొక్క అకలంకమైన ఉదాహరణను (ఎక్కడైనా సాధ్యమైతే) యిక్కడా చూడవచ్చు. ఇక్కడ ప్రేక్షకుడు తూర్పుఖండపు వాస్తవవిజ్ఞానాన్నిగురించి అంతర్ముఖుడై ఆలోచించవచ్చు. ఈ విజ్ఞానం ఏదో నిగూఢసిద్ధాంతంలో

వుండదు. సాంప్రదాయకక్రైస్తవమతానికంటె వాస్తవమైన, గంభీరమైన మృదుమత్వంలో యిమిడిఉంటుంది. క్రైస్తవమతసాంప్రదాయం 'హెబ్రాయిజం' యొక్క కఠినపవిత్రతవల్ల పూర్తిగా మలినంచేయబడింది. ......ఈ నాటకం పూర్తిగా కృత్రిమమైనది. అయినప్పటికీ, మానవుల్ని పూర్తిగా కదలించగలది. దీనికికారణం, అది వాస్తవికతనుపోలినదికావడం గాదు, వాస్తవమైనదవడమే. ......... రచయిత ఎవరైనా అయివుండవచ్చు—అతడు 4 వ శతాబ్దంలోనివాడో 8 వ శతాబ్దిలోనివాడో అనవసరం. అతడు మంచివాడు, విజ్ఞాని. ఆ మంచితనం, ఆ విజ్ఞానం – [illegible] లనుగాగిన్స్ పదాలు కాదు, నీతిసిద్ధాంతియొక్క మెత్తని కలంపో [illegible] కావు – హృదయంలోనుంచి వెలువడినట్టివి. యౌవనం, [illegible] నసౌందర్యంపట్ల అతనికిగల గాఢసౌహార్ద్రత అతని స్వచ్ఛందతకు పదునుపెట్టింది. సులభమైన కథ, కొత్తరకపు మలుపులు, సంఘటనలతో – మృదుమానవత్వము, ఆత్మవిశ్వాసకరమగు మంచితనములను నిరూపించే సాధనంగా చేయవచ్చునని గ్రహించగలిగిన జ్ఞానవృద్ధు డా రచయిత. ఒక స్థిరస్థాయి చేరుకున్న నాగరికతమాత్రమే అట్టి నాటకాన్ని సృష్టించగలదు. ఒకనాగరికత తా నెదుర్కొనే సమస్యలను అన్నిముఖాలా ఆలోచించగలిగినపుడు, అది ఒకరకమైన ప్రశాంతమైన సహజస్థాయీస్థానంలో కూర్చుంటుంది. బర్బరయుగాలనుంచి వారసత్వంగావచ్చిన నైతికభావనలకూ, కొత్తగామేల్కొనిన హృదయస్వచ్ఛందతకూ జరిగిన సంఘర్షణ షేక్స్పియర్లో అంతులేని తుఫానువంటి సంచలనాన్ని కలిగించింది. ఈ తీవ్రమైన కల్లోలంతో ఆ ఆంగ్లకవి సృష్టించిన మేక్బెత్, ఒథెల్లోలు ప్రేక్షకుల నెంతో సంచలింపజేయవచ్చునుగాని – వారు బర్బరనాయకులుమాత్రమే కాగలరు. మనకాలపు వాస్తవికనాటకం కూడా ఇట్టి కల్లోలవాతావరణపు సృష్టియే. కాని, సమస్యలు పరిష్కారమైపోయి, వ్యసనకాంక్షలు విజ్ఞానయుతనిర్ణయాలవల్ల అణగిపోయినపుడు, రూపంమాత్రమే మిగులుతుంది....మన యూరోపియన్ చరిత్రలో ఎక్కడాకూడా ఈ నాటకంవంటి పరిపూర్ణనాగరికమైన రచన లేదు."

## సంస్కృత భాషా ప్రతిష్ఠత

సంస్కృతభాష ఆశ్చర్యకరమగునంత సౌభాగ్యవంతమైనది; స్వయంప్రకాశవంతమైనది; వివిధ శాఖలూ ఏపుగా పెరిగినట్టిది. అయినప్పటికీ, సమగ్రంగా, వ్యాకరణనియమబద్ధంగా వుంటుంది. ఈ వ్యాకరణాన్ని 2600 యేండ్లక్రితం పాణిని యేర్పరిచాడు. సంస్కృతం వ్యాప్తిగాంచింది, తన సౌభాగ్యాన్ని పెంచుకుంది, మరింతనిండుగా, మరింతసుందరంగా తయారయింది. కాని, తన మూలబీజాలనుమాత్రం విడువలేదు. క్షీణించేకాలంలో అది తన శక్తిని కొంత కోల్పోయింది. శైలిలోని సరళత తగ్గింది. క్లిష్టమైనరూపాలలో, సుదీర్ఘమైన అలంకారాలలో సమాసాలలో యిరుక్కుపోయింది. పదాల నొకటిగాకలుపు సౌలభ్యా న్నేర్పరచిన వ్యాకరణసూత్రము భాషాకోవిదులచేతులలో తమ తెలివితేటలను ప్రదర్శించుటకుపయోగించిన డాంబికమార్గమైపోయింది. అట్టివారు అనేకపదాల నీ సూత్రముతో గుదిగుచ్చి అనేకపంక్తుల నాక్రమించే వాక్యాలను సృజించేవారు.

సర్ విలియంజోన్స్ 1784 లోనే ఇలాచెప్పాడు: "సంస్కృతభాష-దానిపుట్టుక ఎటువంటిదైనప్పటికీ – బహుచక్కని నిర్మాణంగలది. గ్రీకుభాషకంటె పరిపూర్ణమైనది. లేటినుకంటె సున్నితమైనది. ఆ రెంటికంటె పరిపూర్ణసౌందర్యం గలది. అయినప్పటికీ ఆ రెంటితో బలీయమైన పోలి కలుగలది. క్రియా మూలములలోను, వ్యాకరణరూపాలలోను, దగ్గరి పోలిక లున్నాయి. ఇదేదో హఠాత్ ఘటనవల్ల సంభవించేదికాదు. వాటి పోలిక లెంత బలీయమైనవంటే – ఏ బహుభాషావేత్తకూడా – అవి ఒకే ఒక నిక్షేపంనుంచి పుట్టినవని (ఆ నిక్షేపం యిప్పుడులేకపోయినా) విశ్వసించకుండా వుండలేడు"...

విలియంజోన్స్ తరువాత అనేకమంది యూరోపియన్ పండితులు (ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్, తదితరులు) సంస్కృతాన్ని అభ్యసించి, "సాదృశ్యభాషాశాస్త్ర"మను ఒక క్రొత్తశాస్త్రానికి పునాదులువేశారు. ఈ శాస్త్రంలో జర్మన్ పండితులు ముందంజవేశారు. 19 వ శతాబ్దపు జర్మన్ పండితులవల్లనే సంస్కృతభాషాపరిశోధన విరివిగా జరిగినందున వారిని మనం అభినందించాలి. ప్రతిజర్మన్ యూనివర్సిటీలోనూ తప్పక

సంస్కృతశాఖ వుండేది. దానికి ఒకరిద్దరు ఆచార్యులుండేవారు. భారతీయపాండిత్యం గణనీయమైనదయినప్పటికీ, పూరాతనపద్ధతిలోనిదై, విమర్శనాదృష్టికలిగిఉండేదిగాదు. కొంతవరకు అరబ్బీ, పారసీకభాషలతోతప్ప, ఇతర విదేశీపురాతనభాషలతో పరిచయంవుండేదిగాదు. యూరోపియనులసముత్సాహంవల్ల ఇండియాలోకూడ కొత్తరకపు పాండిత్యం ప్రభవించింది. అనేకమంది భారతీయులుయూరపుకు (సాధారణంగా జర్మనీకి) వెళ్ళి, పరిశోధక, విమర్శక సాదృశ్య అధ్యయనవిధానాలను తెలుసుకుని, తరిఫీదుపొందేవారు. వీరికి యూరోపియనులకు లేని ఒక అదనపు సౌలభ్యమూ వుండేది, కొంత అసౌలభ్యమూ వుండేది. వారికి — ముందే వూహించుకున్న మూఢనమ్మకాలు, సాంప్రదాయకంగా సంక్రమించిన ఆచార విశ్వాసాలు కొన్ని యేర్పడివుండడంవల్ల నిష్పాక్షికవిమర్శకు అవి అడ్డంకులయ్యేవి. ఇది అసౌకర్యం కాగా, వారికిగల అదనపు సౌలభ్యంమాత్రం మహత్తరమైనది. భారతీయపండితులు రచనయొక్క ఆంతర్యంలోనికి చొచ్చుకొనిపోయి, ఆ ఆంతర్యం వికసించిన పరిసరాల వాతావరణాన్ని హృదయంలో చిత్రించుకుని, ఆ రచనలోని అంతర్భావంతో కలసి నడిచే శక్తి, సామర్థ్యంగలవారు.

భాష వ్యాకరణము, భాషాపరిశోధనలకంటె ఎన్నోరెట్లుగొప్పది. ఒకజాతి, ఒకసంస్కృతియొక్క విశిష్టతకు కవితాశాసనంవంటిది భాష; ఆజాతిని, ఆసంస్కృతిని మలచిన ఆలోచనల, వూహాల 'సజీవమూర్తి' భాష. పదాలు తరతరానికీ తమ అర్థాలను మార్చుకుంటాయి. పాతభావనలు కొత్తభావనలుగా పరిణమిస్తాయి కాని, తరచుగా తమ పాతదుస్తులను మాత్రం మార్చుకోవు. ఒక పాతపదముయొక్క లేక సమాసముయొక్క అర్థాన్ని, అంతకంటే దాని ఆంతర్యాన్ని గుప్పిటికితెచ్చుకోవడం చాలాకష్టం. ఆ పాతకాలపు అర్థాన్నీ, ఆ భాషను పూర్వకాలంలో వుపయోగించినవారిమనస్సులనూ సూచనప్రాయంగానైనా తెలుసుకోవాలంటే, ఒకరకమైన భావనావైచిత్రి, కవితావేశం అవసరమవుతాయి. ఆ భాష ఎంత సౌభాగ్యవంతమూ, ఎంతవిశాలమూ అయితే, దాన్ని అర్థంచేసుకోవడం అంతకష్టం. సంస్కృతంలో అనేక పురాతన భాషలలోవలెనే కవితాసౌందర్యము, గంభీరభావమూ

•గల పదాలు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి. అందు ప్రతిపదంచుట్టూ అనేకభావన లుంటాయి. భావన, దృక్పథాలలో విదేశీయగుణంగల భాషలోనికి యిట్టిపదాలను అనువదించలేము. ఆఖరుకు సంస్కృత వ్యాకరణము, తత్వశాస్త్రములుకూడ కవితారూపంలోనే ఉన్నాయి. ఒక పురాతన శబ్దార్థకోశముకూడ కవితారూపంలోనే వున్నది.

మనలో సంస్కృతం చదువుకున్నవారికిగూడ ఆ పురాతనభాషా హృదయంలోనికి ప్రవేశించి, నాటి పురాతనప్రపంచంలో నివసించు చున్నట్లు అనుభూతిపొందడం సులభసాధ్యంకాదు. అయినప్పటికీ మనం పురాతనసాంప్రదాయాలకు వారసులం గనుక, ఆ పురాతన ప్రపంచవాసనలు మనల నింకా వదల్లేదు కనుక, కొంతవరకు అట్టి అనుభూతిని పొందవచ్చును. సంస్కృతకవిత, తత్త్వశాస్త్రిలలోని అనేక విశిష్టపదాలు విదేశీభాషలలోనికి అనువదింపవీలులేనివైనప్పటికీ, మన ప్రజాభాషలలో సజీవభాగాలుగా నిలచివున్నాయి. సంస్కృతభాషకూడ-ప్రజలభాషగా ఏనాడో మరణించినప్పటికీ, ఆశ్చర్యకరమైన పటుత్వాన్ని కలిగియున్నది. కాని, విదేశీయులకు వా రెంతభాషావేత్తలయినప్పటికీ, దీన్ని అవగాహనచేసుకోవడం బహుకష్టం. దురదృష్టవశాత్తూ పండితులూ, విజ్ఞానవేత్తలూ కవులైవుండడం అరుదు. పైగా, పండితుడైన కవిమాత్రమే ఈ భాషను వ్యాఖ్యానించగలడు. ఇక, వట్టి పండితుల వల్ల మనకులభించే వ్యాఖ్యానం "అస్పష్టమైన భావచ్ఛాయలు, పైకి స్పష్టంగా కనిపించే అర్థాలు మాత్రమే"నని ఎం. బార్త్ వ్రాశాడు.

సాదృశ్యభాషాపరిశీలన ఎంతో అభివృద్ధిచెంది, సంస్కృతభాష బాగా పరిశోధించబడింది. అయినప్పటికీ, ఈ భాషను భావనా వైచిత్రి, కవితావేశాలతో పరిశీలించాలనే దృక్పథంతోచూస్తే - పై పరిశోధనలఫలితం గొడ్రాలువంటి నిష్ప్రయోజకతమాత్రమే. సంస్కృతమునుండి ఆంగ్లంలోనికిగాని, ఇతరభాషలలోనికిగాని చేయబడిన అనువాదాలలో ఏఒక్కటిగాని మూలంవిలువకుతగినది లేక న్యాయంకలిగించేది అని చెప్పదగ్గదిగా లేదు. ఈ కృషిలో భారతీయులూ, విదేశీయులూకూడ విభిన్నకారణాలవల్ల విఫలులయ్యారు. ఇది శోచనీయం. సౌందర్యము, ఊహ, గాఢాలోచనలు నిండుగాగల ఒక విశేషాన్ని—

భారతీయవారసత్వమైనదేగాక, మానవజాతికంతటికీ వారసత్వంకాగల. ఒక విశేషాన్ని - యీప్రపంచం కోల్పోయినట్లయింది.

'బైబులుయొక్క అధికారయుతప్రతి'కి ఆంగ్లానువాదం—కఠిన క్రమశిక్షణ, గౌరవపూరితదృక్పథము, అంతఃకరణలతో చేయబడింది. అందువల్ల అదొక మహాగ్రంథమగుటయేగాక, అది ఆంగ్లభాషకు పుష్టినీ, శోభనీ ప్రసాదించింది. పురాతనగ్రీకు, లేటినుగ్రంథాలను అనువదించేందుకు యూరోపియన్ పండితులు, కవులు తరతరాలుగా మనఃపూర్వకంగా శ్రమించి, వివిధ యూరోపియన్ భాషలలో చక్కని అనువాదాలు ప్రకటించారు. అందువల్ల సాధారణప్రజలుకూడ ఆ పురాతన సంస్కృతులప్రభావాన్ని పంచుకుంటూ, తమ నిరామయజీవితాలమధ్య ఆగ్రంథాలలోని సత్యాన్ని, సౌందర్యాన్ని కొంతవరకు చూడగలుగుతున్నారు. దురదృష్టవశాత్తు - సంస్కృతంపట్ల యిట్టి కృషి యింతవరకూ జరగలేదు. అదెప్పుడు జరుగుతుందో, అసలు జరుగుతుందో లేదో నేను చెప్పలేను. మనపండితులు సంఖ్యలోనూ, పాండిత్యంలోనూ పెంపొందుతున్నారు, కవులకూ కొఱతలేదు. కాని, యీరెండూ ఉన్నా వీటిమధ్యగలతేడా పెద్దది. ఇంకా పెరుగుతూనేఉంది. మన సృజనాత్మకసంచలనాలు మరోవైపు మరల్చబడ్డాయి. నేటిప్రపంచం మనమీద చేసే అనేకవత్తిడులవల్ల తీరుబడిగా పురాతనగ్రంథాలు అధ్యయనం చేసేటంతవ్యవధి లభించడం కష్టం. ప్రత్యేకంగా భారతదేశంలోని మనం మరోవైపుకు దృష్టిమరల్చి, చిరకాలంగా వృథావ్యయంచేసిన కాలాన్ని యిప్పుడు కూడదీసుకోవలసిఉంది. గతకాలంలో, పురాతన గ్రంథాధ్యయనంలో అతిగా నిమగ్నులమైపోయాము. మనలోని సృజనాత్మకచైతన్యాన్ని కోల్పోయినందున - మన మెంతో గౌరవిస్తున్నామని చాటుకునే ఆ పురాతనగ్రంథాలుకూడా మనల్ని ఉత్తేజితుల్నిచేయలేక పోతున్నాయి. భారతీయఉద్గ్రంథాలు అనువాదంచేయబడుతూనే ఉంటాయని నా విశ్వాసం. పండితులు సంస్కృతశబ్దాలు, పేరులు వర్ణక్రమంప్రకారం వ్రాయబడేటట్లూ, అన్నివిరామచిహ్నాలూ తగుచోట్లఉండేటట్లూ, అనేకఅర్థాలూ, వివరణలూ, సాదృశ్యాలూ వుండేటట్లూ జాగ్రత్తవహిస్తారుకూడాను. నిజానికి, అనువాదాలను మనఃపూర్వకంగా, శబ్దాలను వదలకుండా పూర్తిగానే చేస్తారు. కాని

సజీవఆంతర్యంమాత్రం తప్పించుకుపోతుంది. జీవము, ఆనందము, అతి సౌందర్యము, సంగీతమాధుర్యము, ఊహాసాహసం నిండియున్నగ్రంథం ఈ అనువాదంవల్ల చప్పగా, యౌవనసౌందర్యవిహీనంగా తయారవుతుంది. వీటికితోడు పండితునిగదిలోనిదుమ్ము, అర్థరాత్రివరకూ వెలిగిన చమురువాసనా తప్పకుండా ఉంటాయి.

సంస్కృతం మృతభాషయై (ప్రజలవాడుకలోలేదనే అర్థంలో) ఎంతకాలమయిందో నాకు తెలియదు. కాళిదాసునికాలంలో కూడా అది ప్రజలభాష కాదు. ఇండియాఅంతటా విద్యావంతులకు తెలిసిన భాషగామాత్రమే ఉండేది. అది అలాగే అనేకశతాబ్దాలు ఉంది. ఒకప్పుడు ఆగ్నేయాసియా, మధ్యఆసియాలలోగల భారతీయవలసలకు కూడా వ్యాపించింది. 7 వ శతాబ్దంలో కంబోడియాలో సంస్కృత పద్యగానమూ- బహుశా నాటకప్రదర్శనమూ ఉన్నట్లు చారిత్రకాధారాలు ఉన్నాయి. తాయిలండ్ (సయాం) లో యిప్పటికికూడా కొన్ని ఆచారాలసందర్భంలో సంస్కృతం ఉపయోగిస్తున్నారు. భారతదేశంలో సంస్కృతానికిగల పటుత్వం అద్భుతం. 13 వ శతాబ్ది ఆరంభంలో ఆఫ్ఘను పాలకులు ఢిల్లీసింహాసనాన్ని అధిష్టించిన తరువాత, పారశీకము రాజభాష అయింది. క్రమంగా ఇండియాలోని విద్యావంతులందరూ సంస్కృతాన్నివదలి, పారసీకాన్ని అభ్యసించారు. ప్రజలభాషలుకూడ పెంపొంది, సారస్వతశాఖలు వృద్ధిచెందాయి. ఇంతజరిగినా, సంస్కృతంలోని విశిష్టత క్షీణించసాగింది. అయినా, సంస్కృతం వాడుకలో ఉంటూనేవచ్చింది. 1937 లో త్రివేంద్రంలో జరిగిన ప్రాచ్యభాషాపరిషత్తుకు అధ్యక్షతవహించిన డాక్టర్ ఎఫ్. ఎఫ్. థామస్, సంస్కృతం భారతదేశంలో గొప్ప ఏకీకరణ శక్తిగా ఉండేదనీ, ఇప్పటికీ దానిఉపయోగం బహుళవ్యాపితమనీ అన్నాడు. ఒకసరళరూపంలోఉండే సంస్కృతం (బేసిక్ సంస్కృతం) నేటి భారతదేశానికంతటికీ వాడుకభాషగా ప్రోత్సహించవలసిఉన్నదని కూడా ఆయన స్పష్టంగా సూచించాడు. ఆయన, లోగడ మాక్సుముల్లర్ చెప్పినదానితో ఏకీభవిస్తూ, ఈ వాక్యాల నుదహరించాడు: "ఇండియాలో గతానికీ, వర్తమానానికీ అంతరాయంలేని సంబంధ సూత్రం దృఢంగాఉంది. అనేక సాంఘికభూకంపాలు, మతసంస్కర

ణలు, విదేశీదండయాత్రలు జరిగినప్పటికీకూడా - సంస్కృతమే యీ విశాలదేశమంతటా ఇప్పటికీ వాడుకలోనున్నదని చెప్పవచ్చు. ఇదే ఆ అద్భుతమైనసూత్రం...ఒకశతాబ్దంపాటు ఆంగ్లపరిపాలనా, ఆంగ్ల భాషాబోధనా జరిగిన తర్వాత, ఇప్పటికీ సంస్కృతం బాగా అర్థంచేసుకోబడుతున్నదనీ, డాంటేకాలంలో యూరపులో లేటిను భాషనర్థంచేసుకోగలిగినవారికంటె యీ సంఖ్య ఎక్కువనీ నా నమ్మకం.''

డాంటేనాటియూరపులో లేటిను నర్థంచేసుకున్నవారి సంఖ్య ఎంతో నాకు తెలియదు. నేడు ఇండియాలో సంస్కృతాన్ని అర్థంచేసుకోగలవారెందరోకూడా తెలియదు. కాని, ఇట్టివారిసంఖ్య ఎక్కువే ననీ, దక్షిణభారతంలో మరీ ఎక్కువనీ చెప్పగలను. నేటి భారతీయార్య భాషలు - హిందీ, బెంగాలీ, మరాఠీ, గుజరాతీ మొ॥వి తెలిసినవారికి సులభంగామాట్లాడగల సంస్కృతాన్ని అర్థంచేసుకోవడం కష్టంకాదు. నేటిఉరుదూభాషలోకూడా (అదిపూర్తిగాభారతీయార్యభాష) నూటికి 80 పదాలు సంస్కృతంనుంచి పుట్టినట్టివే. సంస్కృత, పారసీకభాషల లోని మూలబీజపదాలు ఒకేరకంగా వుంటాయిగనుక, ఒకానొక శబ్దం సంస్కృతంనుంచి పుట్టిందా, పారసీకంనుంచి జనించినదా అనేది తేల్చడం చాలాకష్టం. విచిత్రమైనసంగతేమిటంటే, దక్షిణభారతంలోగల ద్రావిడభాషలు ఆర్యభాషలకు విభిన్నమైన మూలములుగలవైనప్పటికీ, అవి అనేక సంస్కృతపదాలను తమలో కలుపుకున్నాయి. ఆ భాషలశద్దజాలంలో సగభాగం సంస్కృతశబ్దసంబంధాలను కలిగి వున్నాయి.

మధ్యయుగాలలోనూ, ఆధునికయుగారంభంలోనూ కూడా అనేక విషయాలమీద (నాటకములుకూడా) గ్రంథాలు సంస్కృతంలో రచింపబడుతూనే వుండేవి. వాస్తవానికి, నేడుకూడా అప్పుడప్పుడూ క్రొత్త సంస్కృతగ్రంథాలూ, పత్రికలూ వెలువడుతూనేవున్నాయి. ఇప్పటి రచనల స్థాయి ఉన్నతమైనదిగాని, సంస్కృతసారస్వతానికి వన్నె దెచ్చేదిగాని కాదు. కాని, ఆశ్చర్యమైన విషయమేమంటే- యుగయుగాలుగా కూడా సంస్కృతానికిగల పటుత్వం కొనసాగుతూ వుండడమే. ఒక్కొకసారి బహిరంగసభలలోకూడ సంస్కృతంలో ఉప

న్యాసాలు జరుగుతున్నాయి. సహజంగా శ్రోతలు చాలవరకు ప్రత్యేకాసక్తిగల కొద్దిమందే కావచ్చును.

ఈవిధంగా సంస్కృతం వాడబడుతూనే వుండడంవల్ల, ఆధునిక భారతభాషల సహజపురోగమనానికి కొంత ఆటంకం కలుగుతున్నది. విద్యావంతులైన విజ్ఞానులు ఈ ఆధునిక భాషలు మొరటుభాషలనీ, అని సృజనాత్మకరచనలకుగాని, పాండిత్యప్రకర్షకుగాని తగినవిగావనీ, అట్టివన్నీ సంస్కృతంలోనే వ్రాయబడివున్నవనీ (కొన్ని పారసీకంలో కూడా) భావించేవారు. ఈ గొప్ప అడ్డంకి, వున్నప్పటికీకూడా-క్రమంగా ప్రాంతీయభాషలు పరిపుష్టితో రూపొందాయి. కొన్ని శతాబ్దాలుగా సారస్వతరూపాలను పెంపొందించుకొని, సారస్వతనిధులను సృష్టించుకున్నాయి.

నేటి థాయ్‌లండ్‌లో సాంకేతిక, శాస్త్రీయపదాలు, ప్రభుత్వావసరాలకు కావలసినపదాలు వారు సంస్కృతంనుంచి పరివర్తించుకుంటారు. ఇదెంత గమనీయమైన మహావిశేషం!

పురాతనభారతీయులు "ధ్వని" కి అత్యంతప్రాముఖ్యత నిచ్చేవారు. అందువల్లనే వారిరచనలు వచనంగానీ, పద్యంగానీ - తాళ, గాన (సంగీత) లక్షణాలు కలిగిఉంటాయి. పదాలను కచ్చితంగా ఉచ్చరించడానికి ప్రత్యేక కృషిచేయడమేగాక, అందుకొరకై శ్రమపడి నియమ నిబంధనలుకూడా ఏర్పరచారు. పూర్వకాలంలో నోటితోనే విద్యనేర్పేవారు; గ్రంథాలు పూర్తిగా కంఠస్థంచేయబడేవి. ధారణాశక్తితోనే ఆ గ్రంథాలు తరతరాలకు ప్రాకవలసివుంది. అందువల్ల యీ ఉచ్చారణపద్ధతులు నిర్ణయింపబడడం మరింత ఆవశ్యకమయింది.

పదములఉచ్చారణకు ప్రత్యేకంగా శ్రద్ధతీసుకోవడంవల్ల, వాటిధ్వనికి తగిన అర్థంకూడా ఉండాలని ప్రయత్నాలు జరిగాయి. ఈ రెండు లక్షణాలతోనూ ఏర్పడినవాక్యాలు ఒక్కొక్కప్పుడు బహుసుందరంగానూ, మరొకప్పుడు మొరటు, కృత్రిమ మిశ్రమాలుగానూ తయారవుతాయి. దీన్నిగురించి ఇ. హెచ్. జాన్‌స్టన్ యిలా వ్రాశాడు: "భారతదేశపు పురాతనకవులకు శబ్దధ్వనులలోగల వివిధాంతరాలఆకళింపు సునిశితంగా ఉండేది. దీనికిపోల్చదగ్గ సారస్వతాలు ఇతర

దేశాలలో చాలా అరుదు. అట్టి ధ్వనిప్రధానశబ్దాలసమ్మేళనం ఎల్లప్పుడూ ఆనందదాయకంగానేవుంటుంది. అయినప్పటికీ, కొందరుధ్వనితో అర్థాన్నికూడా మేళవింపజూస్తారు. ఆ విధానంవల్ల భావగాంభీర్యం చాలావరకు లోపించవచ్చు. పైగా అట్టికవులు చాలతక్కువ. ఒక్కొక్కసారి ఒకటి, రెండే హల్లులనుపయోగించి కవితనల్లడంలో భాషను చిత్రవధలపాల్జేసినసందర్భాలుకూడా వున్నాయి."

పురాతనకాలములో నిబంధింపబడిన ఉచ్చారణనియమాలను కచ్చితంగా పాటిస్తూ, వేదాలను వల్లెవేయడం యిప్పటికీ ఉంది.

సంస్కృతంలోనుంచి పుట్టినందున, భారతీయార్యభాషలు అని పేర్కొనబడేవి - హిందీ, ఉరుదు (హిందూస్థానీ) బెంగాలీ, మరాఠీ, గుజరాతీ, ఒరియా, అస్సామీ, రాజస్థానీ (హిందీలో మరొకరూపం) పంజాబీ, సింధీ, పుస్తు, కాశ్మీరీభాషలు. ద్రవిడభాషలు - తమిళం, తెనుగు, కన్నడం, మళయాళం. ఈ 15 భాషలు మాట్లాడే ప్రదేశాలను కలిపితే దాదాపు ఇండియా ఏర్పడుతుంది. ఈ భాషలలో హిందీ—దాని ఉరుదూరూపంతోకూడా కలిపిచూస్తే - భారతదేశమంతటా వాడుకలోవున్నది. ఇది మాట్లాడబడనిప్రాంతాలలో కూడా అర్థమవుతూనేఉంది. ఈ ముఖ్యభాషలుగాక మిగిలినవి, నాగరికతనుపొందక, అడవి, కొండజాతులచేతనే పరిమితప్రదేశాలలో వాడబడుచున్నవి. ఇండియాలో 500 కు మించిన భాషలుగలవని తరచుగా చెప్పేకథ భాషాపరిశీలకుల కట్టుకథయే. సెన్సెస్ కమీషనర్ కూడా ఒకే భాషను వేర్వేరు ప్రాంతాలవారు వాడుకలో విభిన్నయాసలతో పలుకుటనుబట్టి అనేకభాషలుగా వ్రాయడం, చిన్నచిన్న కొండజాతులవారు తమ తండాలలో మాత్రమే మాట్లాడేభాషలనుకూడా లెక్కించుట, బెంగాలు, అస్సాము సరిహద్దులలోగల ప్రతి అడవిజాతి భాషను వేర్వేరుగా పేర్కొనుట మొదలగువాటివల్ల భాషలసంఖ్యనెంతో పెంచాడు. ఇట్టి వందలాదిభాషల్లో ఎక్కువభాగం యీ బర్మాసరిహద్దులలోనే - ఒక్కొక్కటి కొన్ని వందలమందికో, మరొకటి రెండువేలమందికో పరిమితమై వుంటాయి. ఇట్టి సెన్సెస్ కమీషనర్ల లెక్కలప్రకారం యూరపులో కొన్నివేలభాషలు ఉండాలి. జర్మనీలోనే 60 భాషలున్నాయని లెక్కగట్టారు.

ఇండియాలోగల వాస్తవమైన భాషాసమస్యకు యీ రకాలతో సంబంధంలేదు. అది ఒకే భాషకుగల రెండులిపులకు రెండు సారస్వత రూపాలకు పరిమితమైనది. అది హిందీ – ఉరుదు. మాట్లాడడంలో వాటి మధ్య పెద్దతేడాలేమీ కనిపించవు. వ్రాతలోనికివచ్చేసరికి (ప్రత్యేకంగా గ్రాంథిక శైలిలో) పెద్దతేడా లేర్పడతాయి. ఈ తేడాలను తగ్గించి, ఒకే రూపాన్ని పెంపొందించేందుకు ప్రయత్నాలుచేశారు; ఇంకా చేస్తున్నారు. ఇట్టి ప్రయత్నాలఫలితమే హిందూస్థానీ. ఇదే ఇండియా అంతటా అర్థంకాగల జాతీయభాషగా వృద్ధిపొందుతూంది.

సంస్కృతంనుంచి పుట్టిన, భారతీయార్యభాషయగు పుస్తూ–వాయవ్య సరిహద్దురాష్ట్రంలోనూ, ఆఫ్ఘనిస్థాన్‌లోనూ ప్రజల భాషగావుంది. మన ఇతరభాషలకంటె, ఆ భాషపై పారసీకప్రభావం ఎక్కువగావుంది. ఈ సరిహద్దురాష్ట్రం లోగడ అనేకమంది సంస్కృత పండితులను, వేదాంతులను, వ్యాకరణవేత్తలను సృష్టించింది.

సిలోనుభాష సింహాళీస్. ఇదికూడా సంస్కృతంనుంచి పుట్టిన భారతీయార్యభాషయే. సింహళప్రజలు తమమతాన్ని (బౌద్ధము) ఇండియానుండి పొందడమేగాక, జాతిపరంగా, భాషాపరంగాకూడా భారతీయులవంటివారే.

సంస్కృతము యూరోపులోని పురాతన, ఆధునికభాషలకు సోదరివంటిదని ఇప్పు డందరూ అంగీకరిస్తున్నారు. స్లావొనిక్ భాషలలో కూడ సంస్కృతభాషతో సంబంధంగల మూలశబ్దాలూ, రూపాలూ వున్నాయి. యూరోపియన్ భాషలలో – లిథూనియన్‌భాష, సంస్కృతభాషకు అతిసమీపంగా వుంటుంది.

## ౧౦ బౌద్ధతత్వము

బుద్ధుడు తానునివసించినప్రాంతపు ప్రజలభాషనే – సంస్కృత జన్యమగు ప్రాకృతభాష – ఉపయోగించేవాడని ప్రతీతి. సహజంగా ఆయనకు సంస్కృతం తెలిసినప్పటికీ, తాను ప్రజలభాషలో ప్రసంగించి సామాన్యులందరినీ ఆకర్షింపదలచినాడు. బౌద్ధుల ఆదిగ్రంథాలలోగల పాళీభాష యీ ప్రాకృతభాషనుండి పుట్టినదే. బుద్ధనిర్వాణానంతరం చాలాకాలానికి ఆయనసంభాషణలను, చర్చలను, ఇతరవిశేషాలను పాళీ

భాషలో గ్రంథస్థంచేశారు. వీటిఆధారంతోనే సిలోను, బర్మా, సయాములలో బౌద్ధమతము వ్యాపించింది. అక్కడ హీనయానబౌద్ధము వాడుకలో ఉన్నది.

బుద్ధునిఅనంతరం కొన్నివందలయేండ్లతరువాత ఇండియాలో సంస్కృతభాషాపునరుజ్జీవనం జరిగింది. బౌద్ధపండితులు తమతత్వగ్రంథాలను సంస్కృతంలో వ్రాశారు. బౌద్ధప్రచారానికై ఉద్దేశింపబడిన అశ్వఘోషునినాటకాలూ, ఇతరరచనలూ సంస్కృతంలోనే వున్నాయి. ఈ భారతీయబౌద్ధపండితుల సంస్కృతగ్రంథాలు చైనా, టిబెట్టు, మధ్య ఆసియాలకు వ్యాపించి, మహాయానబౌద్ధాన్ని బలపరిచాయి.

బుద్ధునిప్రసవించినయుగంలో – ఇండియాలో మహత్తరమైన మానసికాందోళన, తత్వజిజ్ఞాస ప్రబలివున్నాయి. ఇండియాలోనేకాదు ఆకాలంలోనే లావో-సే, కన్‌ఫ్యూషియస్, జొరాస్టర్, పైథాగరస్‌లు తమదేశాలలో జన్మించారు. ఇండియాలో యీపరిస్థితులు భౌతికవాదము, భగవద్గీత, బౌద్ధమతము, జైనమతములపుట్టుకకు కారణమైనవి. ఇంకా అనేకరకాలతత్వాలు జనించినవిగాని, క్రమంగా పూర్వపుభారతీయతత్వరూపాలలో కలసిపోయినవి. ఆలోచనలు వివిధకోణాలలో సాగుతూ ఒకదానినుంచి మరొకదానికిపోవడం, కొన్నిపట్ల ఒకదానినొకటి దాటిపోవడం సంభవించాయి. విభిన్నరకాల తత్వశాస్త్రాలు బుద్ధతత్వంతోపాటు వికసించాయి. బౌద్ధంకూడ తనలోని విభిన్నతలతో అనేకశాఖలను ప్రసవించింది. తత్వజిజ్ఞాస క్రమంగా క్షీణించి, పాండిత్యప్రకర్షకూ, తర్కవాదాలకూ స్థానమిచ్చింది.

పరలోకసంబంధమైనవిషయాలమీద పండితవివాదచర్చలకు దిగరాదని బుద్ధుడు తనప్రజల కెన్నోసార్లు బోధించాడు. "ఏవిషయంతరువాతివిశేషాన్నిగురించి మాట్లాడలేవో, అప్పటినుంచీ మౌనంగావుండు" అని ఆయన చెప్పాడు. జీవితంలోనే సత్యాన్నిచూడవచ్చు. జీవితానికి వెలుపలనున్న విశేషాన్నిగురించి వాదించడంలో సత్యం కనుపించదు. కనుక, అది మానవమేధకు అందనిదవుతుంది. బుద్ధుడు మానవజీవితంలోని నైతికదృక్పథాలను ఎక్కువగా నొక్కిచెప్పాడు. ఆకాలంలో పరలోకవిషయికమైన చమత్కారాలనుగురించి ఆలోచించడంతోనే మనసులు నిండివున్నందున-యీ నైతికవిలువల్లు విస్మరింపబడి, క్షీణించిపో

యాయని ఆయన బాధపడ్డాడు. తొలిదశలో బౌద్ధము, బుద్ధుని యీ తాత్త్విక, సహేతుక భావనలను ప్రతిబింబించుతూ, మానవానుభవము లనే తనఅన్వేషణలకు ఆధారంచేసుకున్నది. అనుభవపూర్వకప్రపంచంలో పరిపూర్ణపవిత్రజీవి అగుపించడు. అందువల్ల ఆ విశేషాన్ని ఒక ప్రక్కకు నెట్టివేశారు. "సృష్టికర్తయగు దేవుడు" అనే భావనకూడా హేతువాదపూర్వకమైనరుజువుకు నిలువలేదు గనుక, దాన్నికూడా చర్చించనక్కరలేదన్నారు. ఏమైనప్పటికీ, 'అనుభవము' అనేది ఉండనే ఉంది. ఇది ఒకవిధంగా 'వాస్తవ'మైన విశేషమే. ఇది సజీవంకాగల ఒకశక్తి. ఎప్పుడూ ఉన్నరూపాన్నుంచి మరోరూపానికి మారుతూండేది. కాక మరేమవుతుంది? అందువల్ల ఈ మధ్యస్థపు 'వాస్తవాల'ను అంగీకరించి తమ అన్వేషణలను ఈ గీతలగుండా, మనస్తత్వఆధారంతో ముందుకు సాగించారు.

బుద్ధుడు నాటిమతంపై విప్లవకారుడైనప్పటికీ, దేశంలోగల పురాతనవిశ్వాసంనుంచి తెగతెంపులుచేసుకోలేదు. శ్రీమతి రైస్ డేవిస్ యిలావ్రాసింది: "గౌతముడు పుట్టినది, పెరిగినది, బ్రతికినది, మరణించినదికూడా 'హిందువు' గానే.....బుద్ధుడుచెప్పిన తత్వశాస్త్రము, మూలసూత్రములలో, పురాతనమతవిధానాలలో ఏదోఒకరూపంలో వున్నసారాంశంకంటె అంతగాఅధికమేమీఉండదు. ఆయననేర్పిన నైతిక బోధలలో అనేకము పురాతనహిందూమతగ్రంథాలలోకూడ కనుపించును. బుద్ధునికిగల స్వకీయప్రత్యేకత ఏమిటంటే - అనేకమంది అంతకుపూర్వమే చక్కగా చెప్పినదానినే యీయన చెప్పినప్పటికీ, ఈయన వాటిని అనుగుణ్యంగా పెంపొందించి, పవిత్రతరంచేసి, క్రమబద్ధంచేసి చెప్పడమే ఆ గొప్పతనం. ఎందరోమహాప్రసిద్ధులగు హిందూతత్వజ్ఞానులు ఎన్నడో ఆమోదించిన సమానత్వ, న్యాయసూత్రాలనే- బుద్ధుడు హేతుబద్ధమైనవాదనతో సూత్రాలను చేయడంలోనే ఉంది ఆయనప్రత్యేకత. ఆయనకూ, ఇతరబోధకులకూమధ్య గల ముఖ్యభేదం ఏమిటంటే - ఆయనయొక్క గాఢతపన, విశాలప్రజాసేవానుకంపములే."

అయినప్పటికీ, బుద్ధుడు సమకాలికమైన సాంప్రదాయిక మతాచరణలకు వ్యతిరేకంగా విప్లవబీజాలను నాటాడు. ఊహించగలిగిన స్వ

తత్వశాస్త్రాన్నయినా సరే, అదొకసిద్ధాంతంగావున్నంతకాలమూ, ప్రజల ప్రాథమికవిశ్వాసపరిధిలో వున్నంతవరకు దాన్ని ప్రబోధింపవచ్చును. అందువల్ల బుద్ధుడునేర్పినతత్వశాస్త్రాన్నిగాని, అతనిసిద్ధాంతాన్నిగాని వ్యతిరేకించడంలేదు. ప్రజలసాంఘికజీవితంలో, ప్రజలవ్యవస్థలలో జోక్యం కల్పించుకోవడాన్నే నిరసించాలి. పురాతనవిధానంలో ఆలోచనా స్వేచ్ఛ, ఎటుబడితేఅటుమలచుకోగలమృదుత్వమూ వున్నాయి. ఏరకం అభిప్రాయానికైనా అందులో తావుంది. కాని, ఆచరణలో అది పాషాణసమమైనది. ఆచారాలను అనుసరించకపోతే కఠినంగా చూడ బడేది. అందువల్ల, తప్పనిసరిగా బౌద్ధము పురాతనమతంనుంచి వేరుదారి పట్టింది. బుద్ధనిర్వాణానంతరం యీ రెంటిమధ్య తేడా మరింత పెరిగింది.

బౌద్ధమతం తొలిరూపు క్షీణించనారంభించడంతో 'మహాయాన' విధానం పెంపొందింది. తొలిరూపునే 'హీనయానం' అంటారు. ఈ మహా యాన ప్రాభవంలోనే బుద్ధుడు దేవుడుకావడం, దేవునికివలె పూజ, ఆరాధనలు జరుగడం ఆరంభమైంది. గ్రీకులఆధ్వర్యానగల వాయవ్య సరిహద్దునుండి బుద్ధవిగ్రహం ప్రవేశించింది. దాదాపు యీ సమయం లోనే బ్రాహ్మణీయము, సంస్కృతపాండిత్యములు పునరుజ్జీవం పొంద సాగాయి. హీనయాన, మహాయానములమధ్య క్రోధపూరితమైనవివాదం చెలరేగి, చర్చలు, వైరుధ్యాలు అనంతరచరిత్రనిండా కొనసాగాయి. హీనయానాన్ని అవలంబించే సిలోను, బర్మా, సయాందేశాలు మహా యానాన్ని అనుసరించేదేశాలబౌద్ధాన్ని చిన్నచూపుచూచాయి. వీరూ వారి నలాగే చూచారనుకుంటాను.

హీనయానము చాలవరకూ పురాతనసిద్ధాంతపవిత్రతను అనుస రిస్తూ, ఆ సూత్రాలను పాళీభాషలో బిగించుకుంది. మహాయానము ఏ దేశపు స్పష్టదృక్పథానికి అనుగుణంగా ఆ దేశంలో తననుతాను మలచు కుంటూ, అనేకవిషయాలను సహనంతో చూస్తూ బహుముఖాలుగా వ్యాపించింది. భారతదేశంలో అది ప్రజలమతానికి దగ్గరగా రాసాగింది. చైనా, జపాను, టిబెట్టులలో వేర్వేరువిధాలుగా రూపొందింది. బుద్ధుడు 'ఆత్మ'ఉనికినిగురించి నాస్తికదృక్పథాన్ని వెల్లడించాడు. తొలి బౌద్ధు లలో అత్యంత మేధావులైనకొందరు యీ దృక్పథాన్ని విడిచిపెట్టడమే గాక, అది తప్పని ఖండించారు.

అత్యంత మేధావంతులైన ప్రసిద్ధులనేకమంది వున్నారు. ఇండియా ప్రసవించిన అట్టిమేధావులలో నాగార్జునుడు అనన్యసామాన్యుడు. ఆయన క్రీస్తుశకారంభ కాలంలో కనిష్కునిపాలనలోనివాడు. మహాయానసిద్ధాంతాలను రూపొందించడానికిఆయనేముఖ్యబాధ్యుడు. ఆయనఆలోచనాశక్తీ, ధైర్యమూ గణనీయములు. అనేకమందికి దుష్టనిందలుగానూ, విస్మయంగానూ కనుపించేటటువంటి నిర్ణయాలకురావడానికి ఆయన భయపడేవాడుకాదు. నిర్దాక్షిణ్యమైన హేతువాదంతో ఆయన తనవాదనలను కొనసాగిస్తూ, ఆఖరుకు తానునమ్మినదాన్ని కూడా తానే తప్పని ఖండించేవరకూ వెళ్ళేవాడు. ఆలోచన తన్ను తాను తెలుసుకోలేదు; తననుదాటి బైటికి వెళ్ళలేదు; అంటే, మరొక ఆలోచనను తెలుసుకోలేదు. ప్రపంచంలేనిదే దేవుడు లేడు; దేవుడు లేనిదే ప్రపంచం లేదు. ఈ రెండూకూడా సరిసమానరూపాలే. ఈవిధంగా ఆయనవాదన సాగి సాగి చివర కేమీ మిగలదు. సత్యానికీ తప్పుకూ భేదంలేదు. దేనినైనా అర్థంచేసుకోవడానికిగాని, అర్థంచేసుకోలేకపోవడానికిగాని అవకాశమే లేదు. వాస్తవంకానిదానిని ఎవరైనాసరే ఎలాఅపార్థంచేసుకోగలరు? ఏదీ వాస్తవంకాదు. ప్రపంచం ఒక భావనామాత్రపుఉనికినే కలిగివుంది. అది గుణములు, సంబంధములుగల ఒక ఆదర్శవిధానం మాత్రమే. వీటిని మనం విశ్వసిస్తాం. కాని, స్పష్టంగా వివరించలేము. అయినా, యీ అనుభవమంతటివెనుక ఇంకేదో వున్నదని సూచిస్తాడాయన. అది, "నిరామయం". దాన్ని ఊహించగల శక్తి మనకు లేదు. ఎందువల్లనంటే, మనం ఊహించడమనేపరిణామంతో అది ఒకానొక సంబంధమో సారూప్యమో కలది అవుతుంది.

ఈ 'నిరామయా' న్ని బౌద్ధతత్వశాస్త్రంలో 'శూన్యత' (సున్న గుర్తుకు పదము శూన్యత) అంటారు. కాని, మనము'ఖాళీ' 'ఏమీలేకుండుట' అనుకొనేదానికంటే ఇది చాలా భిన్నమైనది. మనఅనుభవంలో గల ప్రపంచంలో దానిని 'ఏమీలేకుండుట' అనకతప్పదు. దానికితగిన సరైనపదం లేదు. లోకాతీతవాస్తవికతగలమాటలలో దానిఅర్థం చెప్పాలంటే ప్రతి వస్తువులోనూ ఏదో సర్వోత్కృష్టత, నిగూఢత ఉంటాయని చెప్పాలి. ఒక ప్రఖ్యాతబౌద్ధపండితుడు "శూన్యతవల్లనే ప్రతిదీ 'సాధ్య' మవుతున్నది. అది లేనిదే ప్రపంచంలో ఏదీ 'సాధ్యం'కాదు"అన్నాడు.

ఇదంతా మనల్ని 'లోకాతీతశాస్త్రం'(పరలోకాన్ని గురించి చెప్పే తత్వం) ఎక్కడికి తీసుకుపోతుందో తెలియజేస్తుంది. ఇట్టి ఊహాలహ్యా లనుగురించి జాగ్రత్తగావుండమని బుద్ధుడు హెచ్చరించినదానిలో ఎంత విజ్ఞత వున్నదీ దీన్నిబట్టి తెలుస్తుంది. అయినప్పటికీ, మానవమేధ తనకుతానుబందీగావుండేందుకు అంగీకరించదు. తనకు అందనిదూరాల్లో వున్నదని తెలిసికూడా, ఆ విజ్ఞానఫలంకోసం చేతులుచాస్తూనేవుంటుది. బౌద్ధమతతత్త్వంలోకూడా లోకాతీతవిశేషాలు వికసించాయి. కాని, అవి మన స్తత్వదృకథ్పంమీదఆధారపడి ప్రవేశపెట్టబడినాయి. మనసు యొక్క మనస్తత్వస్థితులఅంతరాలను చూడగలిగిన బౌద్ధులమేధాశక్తి ఆశ్చర్యకరమే! ఆధునికమనస్తత్వశాస్త్రంలోచెప్పబడిన * "అంతరాత్మలోని కళ్ళెంలేనివ్యక్తి"నిగురించి బౌద్ధులానాడే స్పష్టంగా వూహించి, చర్చించారు.

బౌద్ధంలో నాలుగు స్పష్టమైనశాఖ లేర్పడ్డాయి. రెండు శాఖలు హీనయానానికీ, రెండు మహాయానానికీ చెందినవి. ఈ బౌద్ధ తత్వవిధానాలన్నింటికీ ఉపనిషత్తులే మూలం. కాని, అవి వేదాలయాజమాన్యాన్ని అంగీకరించవు. ఈ వేదాలతిరస్కారమే, వాటిని అదే కాలంలో జన్మించిన హిందూతత్వవిధానాలకంటె భిన్నమైన ప్రత్యేకతగలవిగా చేసింది. ఈ హిందూవిధానతత్వాలు వేదాల నామోదిస్తాయి, ఒకరకమైన భక్తిభావాన్ని వెల్లడిస్తాయి. కాని ఏ తప్పూలేనివనిమాత్రం అంగీకరించవు. ఆచరణలో వేదాలతో ఏమంత్రప్రమేయం లేకుండానే, తమదోవలననుసరిస్తాయి. వేదాలూ, ఉపనిషత్తులూ అనే కరకాలుగా చెప్పాయి. అందువల్ల తరువాతి తత్వవేత్తలు – ఒకదృక్పథంకంటె, మరోదృక్పథాన్ని నొక్కి చెబుతూ, ఆ పునాదిమీద తమ కొత్తవిధానాన్ని నిర్మించుకునే వీలు కలిగింది.

బౌద్ధతాత్వికులఆలోచనలు, నాలుగుబౌద్ధశాఖలలోనూ విస్పష్టంకావడానికిగల హేతుబద్ధపరిణామాలను ప్రొఫెసర్ రాధాకృష్ణన్

Note,— * Sub - conscious self = మనకుయిదమిత్థమని తెలియకుండానే ఆత్మలో వుండేభావం; ఇది మనమానసికాజ్ఞలతో నిమిత్తంలేకుండానే పనిచేస్తూ ఉంటుంది. (అనువాదకుడు)

యీవిధంగా వర్ణించాడు. ఈ పరిణామం ద్వంద్వమైన లోకాతీత శాస్త్రంతో ప్రారంభమవుతుంది. పదార్థాలను ప్రత్యక్షంగా తెలుసుకోవడమే విజ్ఞానం అంటుంది. తరుదాతిదశలో వాస్తవాన్ని ఆకళింపు చేసుకునేందుకు భావనలు వాహకాలుగా లేక మధ్యవర్తులుగా చేసుకోబడతాయి. ఆవిధంగా మనసుకూ, వస్తువుకూ మధ్య ఒక తెర ఏర్పడుతుంది. ఈ రెండుదశలూ హీనయానంలో రెండుశాఖలు. మహాయాన శాఖలు యింకాముందుకు పోయి, ఊహాచిత్రాలవెనుకగల వస్తువులను నిషేధించాయి. అనుభవాన్ని మనసులోకలిగే భావపరంపరలుగా తేల్చివేశాయి. సాపేక్షసిద్ధాంతము, అంతరాత్మలోని కళ్ళేంలేనివ్యక్తీ కూడా ప్రవేశించాయి. చివరిదశలో (ఇది నాగార్జునునిమాధ్యమికతత్వము లేక మధ్యేమార్గము) మనసును భావనాసంపుటిమాత్రమే నని అనేశారు. ఇక మనకు మిగిలిన సారాంశం- మనం స్పష్టంగాచెప్పలేని భావనలు, "అంతరాత్మకుఅనిపించడాలు" అనేఆధారరహిత విభాగాలు మాత్రమే.

ఆవిధంగా మనం చివరికి చేరుకునేదెక్కడికి? గాలివంటిశూన్యం దగ్గరకే. లేక స్పష్టమైన మన మనసులు గ్రహించలేని ఒకానొకచోటికి. దాన్ని వర్ణించనూలేము, వివరించనూలేము. మనం దాన్నిగురించి మహా చెప్పగలదేమంటే, అదొకరకమైన "తెలివిడి" అని - 'విజ్ఞానం' అనీ.

మనం మన సత్వశాస్త్రప్రకారం,లోకాతీతతత్వపరిశీలనప్రకారం యీనిర్ణయానికివచ్చాం. నిరామయమును లేక కనుపించని ప్రపంచాన్ని గురించినవూహాచిత్రాన్ని యీనిర్ణయం స్వచ్ఛమైన 'తెలవిడిగా' మారుస్తున్నది. అదే శూన్యత అంటున్నది. మనం వుపయోగించగల, అర్థం చేసుకోగలమాటలవల్ల యింతకంటె తేలేదేమీ వారు చెప్పలేదు. మన వాస్తవప్రపంచంలో నైతికసంబంధాలకు స్పష్టమైనవిలువ లున్నాయని మాత్రం కచ్చితంగా చెప్పారు. అందువల్ల మనజీవితాల్లోనూ, మానవ సంబంధాలలోనూ- మనం, నైతికసూత్రాలకుకట్టుబడి, మంచివాళ్ళంగా బ్రతకాలి. ఆ జీవితానికీ, యీ ఊహామాత్రపుటునికిగల ప్రపంచానికీ- మనం హేతువాదాన్నీ, విజ్ఞానాన్నీ, అనుభవాన్నీ అన్వయించుకోవాలి. అస్పష్టమైనది (లేక దానిపేరేమైనాకానీండి) సుదూరాన ఎక్కడో వుంటుంది; అందువల్ల వీటెని దానికి అన్వయించకూడదు.

## ౧౧ హిందూమతముపై బౌద్ధమతప్రభావము

పురాతనార్యమతంమీదా, నాటి ఇండియాలోగల ప్రజావిశ్వాసాలమీదా బుద్ధునిబోధలవలన కలిగిన ప్రభావం ఏమిటి? మత, జాతీయజీవితాలలోని అనేకదృక్పథాలపై అది శాశ్వతమైనప్రభావాన్ని ప్రసరించిందనేందుకు సందేహంలేదు. బుద్ధుడు తానొకనూతనమతస్థాపకుడనని భావించియుండకపోవచ్చును. తనను తానొక సంస్కర్తగా మాత్రమే భావించియుండవచ్చును. కాని, అతనిసంచలనాత్మకవ్యక్తిత్వమూ, అనేక మతసాంఘికాచారాలనుఖండించే శక్తివంతమైన సందేశాలూ – అప్పటికి బలంగాపాతుకుపోయిన మతగురువుల (పూజారుల)తో సంఘర్షణకుదారితీయకతప్పలేదు. ఆయన నాటిసాంఘికార్థికవ్యవస్థలను కూకటి వ్రేళ్ళకంటా పెకలించేవాడనని చెప్పలేదు. వాటిప్రాథమికస్థానాలను ఆమోదిస్తూ, వాటిచుట్టూ పెరిగిన చెడుగులను మాత్రమే ఖండించాడు. ఏమైనప్పటికీ, ఆయన ఒకరకమైన సాంఘికవిప్లవకారునివలెనే ప్రవర్తించాడు. అందువల్లనే అప్పటికిఉన్న సాంఘికనిర్మాణాన్నే కొనసాగించాలనేతాపత్రయంగల బ్రాహ్మణవర్గానికి కోపకారణుడయ్యాడు. హిందూతత్వము విశాలంగాపరచుకున్న శాఖలలో దేనికోఒకదానికి బుద్ధునిబోధలను అన్వయించుకునేఅవకాశం లేకపోలేదు. కాని, బ్రాహ్మణాధిక్యతనే ఖండిస్తున్నాడంటే అది వైపరీత్యం!

బ్రాహ్మణీయం బలహీనంగాఉన్న మగధలోనే మొదట్లో బౌద్ధం వ్రేళ్ళూనుకున్నదనేవిషయం గమనార్హం. అది క్రమంగా పశ్చిమానికీ, ఉత్తరానికీ వ్యాపించింది. అనేకమంది బ్రాహ్మణులుకూడా అందులో చేరారు. ప్రారంభంలో అది క్షత్రియోద్యమనే. కాని, ప్రజాకర్షణకలది. బహుశా ఆతరువాత చేరిన బ్రాహ్మణులవల్లనే, బౌద్ధము మరింత తాత్విక, లోకాతీతశాస్త్రమార్గాలలో పెంపొందిఉంటుంది. ముఖ్యంగా బ్రాహ్మణబౌద్ధులవల్లనే మహాయానరూపంకూడా ఏర్పడి ఉండవచ్చును. ఎందువల్లనంటే ఈ రూపం తొలిదశలో చాలావరకు నాటి ఆర్యవిశ్వాసాన్నే పోలిఉండేది.

బౌద్ధము భారతీయజీవితాన్ని శతవిధాలుగా సంచలింపజేసింది. అది వేయిసంవత్సరాలకాలం ఎదురులేని, సజీవ, సంచలనాత్మక, బహు

శవ్యాప్తమతంగా ఇండియాలో ఉన్నదని మనం మరువరాదు. ఇదే ఇంత ప్రభావానికీ కారణం. అది క్రమంగా క్షీణిస్తున్న దీర్ఘకాలంలోనూ, ప్రత్యేకమతంగా గుర్తింపబడడం పూర్తిగా ఆగిపోయినతర్వాతకూడా జాతీయజీవనవిధానంలో, ఆలోచనలలో హిందూమతంలో ముఖ్య భాగంగా ఉంటూనేఉంది. అది ఒకమతంగా ప్రజలచేనిరాకరించబడినప్పటికీ, అదివేసినముద్రలు చెరిగిపోకుండాఉండిపోయాయి. అవి జాతిజీవిత పురోగమనాన్ని ఎంతో ప్రభావితంచేశాయి. ఈ శాశ్వతప్రభావానికి మూఢవిశ్వాసంతోగాని, తత్వసిద్ధాంతంతోగాని, మతవిశ్వాసంతోగాని సంబంధంలేదు. బుద్ధునిలోని, బౌద్ధంలోని నైతిక, సాంఘిక, ఆచరణల ఆదర్శవాదమే మనప్రజలను ప్రభావితంచేసి, మాయనిచిహ్నాలను వదలిపోయింది. యూరపు క్రైస్తవమతంలోని అంధవిశ్వాసాలను లెక్కచేయనప్పటికీ, ఆమతంలోని నైతికాదర్శాలవల్ల ప్రభావితమయింది. ఇస్లాములోని విశ్వాసాలనూ, మతాచారాలనూ ఆమోదించలేని అనేక మందిప్రజలు దానియొక్క సాంఘిక, ఆచరణల మానవదృక్పథానికి వశులైనారు. బౌద్ధంవిషయమూ అంతే.

ఇండియాలోని ఆర్యమతం యీ దేశానికిమాత్రమే పరిమితం చేయబడిన జాతీయమతం. ఆ మతంవల్లరూపొందుతున్న సాంఘిక కుల విధానాలు యీవిషయాన్ని మరింత రూఢిపరుస్తున్నాయి. మతబోధ కులవ్యవస్థ లేర్పడడంగాని, మతాంతరీకరణచేయడంగాని, ఇండియావెలుపలకుదృష్టిసారించడంగానిలేదు. ఇండియాలోనే తననిరాటంకధోరణిలో, ఆత్మాంతర్గతవిధానంలో పయనిస్తూ, పాతవారినీ, కొత్తవారినీ తనలో యిముడ్చుకుంటూ, అలాచేరినవారితోతరచుగా కొత్తకులాలను సృష్టిస్తూ, సాగిపోయింది. ఆరోజుల్లో విదేశయాత్రాసౌకర్యాలు అంతగాలేనందున, విదేశాలకువెళ్ళేఅవసరాలుతలెత్తడం తక్కువైనందున, ఆర్యమతానికి విదేశాలకేసి దృష్టిలేకపోవడం సహజమే. వ్యాపారాదులవల్ల అట్టి విదేశీసంబంధాలు వున్నప్పటికీ, అవి భారతీయజీవిత విధానాలను సంచలింపజేయగలిగినవి కావు. భారతీయజీవితమహాసముద్రం సర్వపరిపుష్టమైనది. విశాలంగా, వైవిధ్యంగా వుండి, ఎట్టిప్రవాహానికైనా పూర్తిఅవకాశం యివ్వగలిగింది. తన్నుతా తెలుసుకుని, అంతర్ముఖియై, తనసరిహద్దులకావల ఏమిజరిగినా అంతగా పట్టించుకో

లేదు. ఈ సముద్రకేంద్రంలోనే ఒక క్రొత్తజల ఉవ్వెత్తున పైకిలేచింది. అది పిచికారీవలె క్రొత్తసుగంధజలాన్ని వెదజిమ్మింది. అది వెనుకటిఉప రితలనిశ్చలతను అల్లకల్లోలంచేసి, మానవుడూ, ప్రకృతీ, నిర్మించిన పాతసరిహద్దులను లెక్కచేయకుండా వెల్లువలై ప్రవహించింది. బుద్ధ బోధలు అనే యీ ఆకర్షణ జాతికే; కాని, అది జాతిని అధిగమించిన ఆకర్షణకూడాను. అది వర్గ, కుల, జాతి అంతరాలను పాటించలేదు. అది ప్రపంచానికే "ఉత్తమజీవితం గడపమని" పిలుపు!

బుద్ధునికాలపు భారతదేశానికి ఇదొక నవ్యపథం. ఆమార్గాన్ని పెద్దయెత్తున అనుసరించిన మొట్టమొదటివాడు అశోకుడు. విదేశాల లోని తనరాయబారులద్వారా మతబోధకులపంపుటద్వారా బహుళ వ్యాప్తికి కారకుడయ్యాడు. ఆవిధంగా భారతదేశం ప్రపంచాన్ని గురించి తెలుసుకోసాగింది. క్రీస్తుశకారంభంలో అనేక భారతీయవలస రాజ్యాలు యేర్పడినకార్యక్రమానికి ఇదే ముఖ్యకారణం కావచ్చును. హిందూపాలకులు సముద్రాలమీదుగా యీ సాహసయాత్రలు నడి పారు. వాటితో బ్రాహ్మణమతతత్త్వమూ, ఆర్యనాగరికతకూడా వెళ్ళాయి. స్వయంపరిపుష్టినికలిగియున్న మతమూ—నాగరికతా పర స్పరసంబంధాలులేని ప్రత్యేకతలతో కులాలను రూపొందిస్తున్న యివి— విదేశాలకుపోవడం అసాధారణవిశేషమే. ఈమార్పుకు ఏదో శక్తివంత మైన కుతూహలం, వారిప్రాథమికదృక్పథాన్నే మారుస్తున్న ఒకానొక విశేషం కారణమయివుంటాయి. ఆ కుతూహలం. అనేకకారణాలవల్ల ఏర్పడివుండవచ్చును. వ్యాపారము, పెంపొందుతున్న సాంఘికావస రాలు ముఖ్యకారణాలు కావచ్చును. కాని, దృక్పథంమార్పుకుమాత్రం బౌద్ధము, అది కల్పించిన విదేశీసంబంధాలే కారణం. ఆకాలంలో హిందూమతానికి తగినంత సంచలనశక్తీ, పైకిపొర్లే సముత్సాహమూ వున్నాయి. కాని, అది లోడగ విదేశాలవైపు దృష్టిసారించలేదు. ఈ క్రొత్తమతంలోని ప్రాపంచికదృష్టియొక్క ముఖ్యఫలితం యీ సంచల నాత్మకశక్తిని విదేశాలకు ప్రవహించేటట్లుచేయడమే.

వేదమతంలోను, ప్రజల యితర మతవిధానాలలోను గల మత కార్యకలాపాలూ, పూజాదికర్మకాండలూ, ముఖ్యంగా జంతుబలులూ నశించాయి. వేదాల్లోనూ, ఉపనిషత్తులలోనువున్న అహింసాతత్త్వం

బౌద్ధమువల్ల, అంతకంటెఎక్కువగా జైనమతంవల్ల ప్రాముఖ్యతను వచ్చాయి. జీవితంపట్ల కొత్తగౌరవమూ, జంతువులపట్ల దయ ఏర్పడ్డాయి. ఈ అన్నింటివెనుక మంచిజీవితం, ఉన్నతజీవితం నడుపుకోవాలనే ప్రయత్నం వున్నది.

బుద్ధుడు నిస్సంగసన్యాసంలో నైతికవిలువ వున్నదనే వాదాన్ని తిరస్కరించాడు. కాని, ఆయనబోధలమొత్తంప్రభావం – జీవితంపట్ల నిరాశాదృష్టినే కలిగించింది. ఇది ప్రత్యేకంగా హీనయానంలోనూ, అంతకంటె జైనమతంలోనూ స్పష్టంగా కనిపిస్తుంది. వానిలో పారలౌకికం మీద అధికాసక్తి, స్వతంత్రులంకావాలనే కాంక్ష, ప్రపంచపుభారాలనుండి విముక్తులంకావాలనేకాంక్ష వుండేవి. బ్రహ్మచర్యం ప్రోత్సహింపబడింది; శాకాహారంవాడుక ఎక్కువయింది. బుద్ధునికి పూర్వం కూడా యీ భావనలన్నీ వున్నాయి. కాని అప్పుడు ఆసక్తి ఇతరములపట్లవుండేది. ఆర్యులఆదర్శం పరిపూర్ణ, సర్వతోముఖజీవితం మీదనే కేంద్రీకరింపబడేది. విద్యార్థిదశలో బ్రహ్మచర్యము, క్రమశిక్షణ అవలంబించబడేవి. గృహస్థులు జీవితకార్యకలాపాలన్నింటిలోను పాల్గొంటూ, లైంగికసంబంధాలు అందులో భాగంగానే భావించేవారు. ఆతరువాత క్రమంగా ఐహికవిషయాలను వదలుతూ, వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవడానికీ, ప్రజాసేవచేయడానికీ ప్రాముఖ్యతనిచ్చేవారు. వృద్ధులైనతరువాత, జీవితపుచివరిదశలోమాత్రమే – జీవితపుసాధారణకర్మలు, సంబంధాలను వదలి – సన్యాసస్థాయికి చేరుకునేవారు.

లోగడ సన్యాసప్రకృతిగలవారు చిన్నచిన్నకూటములుగా అరణ్యాలలో వుంటూ, విద్యార్థుల నాకర్షించేవారు. బౌద్ధమువచ్చినతరువాత పెద్దపెద్ద బౌద్ధసన్యాసులవిహారాలూ, సన్యాసినీవిహారాలూ ఏర్పడి, ప్రజల నెక్కువగా తమవైపు ఆకర్షించుకోసాగాయి. నేటిబీహారు రాష్ట్రం పేరే అట్టి 'విహారం'నుండి జనించినదంటే, ఆ విశాల ప్రాంతమంతా ఎన్నివిహారాలతో నిండివున్నదో వూహించుకోవచ్చు. అట్టి విహారాలు విద్యాసంస్థలుగా లేదా పాఠశాలలకు, విశ్వవిద్యాలయాలకు సంబంధించినవిగా వుండేవి.

ఇండియాలోనేగాక, మధ్యఆసియాఅంతటా పెద్దపెద్ద బౌద్ధవిహారా లుండేవి. 'బాఖ్'లో వేయిమంది బౌద్ధసన్యాసులు వుండే ఒక

ప్రసిద్ధవిహార మున్నట్లు చారిత్రకాధారాలున్నాయి. దీన్ని "నవవిహార" అనేవారు. అదే పారసీకంలో "నౌబహార్" అయింది.

బౌద్ధము అనేకకాలాలపాటు పరిఢవిల్లిన చైనా, జపాన్, బర్మా లలోకంటె ఇండియాలో పారలౌకిక (ఇతరలోకాలకుసంబంధించిన) విషయాలోచన కెక్కువ స్థానమివ్వడానికి కారణమేమిటి? నాకు తెలియదు గాని, ప్రతిదేశంలోని జాతీయపరిస్థితి బలీయంగావుండడం వల్ల బౌద్ధము దేశాని కొకవిధంగా మలచబడినదని అనుకుంటాను. ఉదాహరణకు చైనానుతీసుకుంటే, అది కన్‌ఫ్యూషియస్, లావో-సే మొదలగుతత్త్వవేత్తల బలీయసాంప్రదాయాలను కలిగివుంది. అయిన ప్పటికీ, చైనా, జపానులు హీనయానంకంటె నిరాశాదృక్పథం ఎక్కువ గాగల మహాయానబౌద్ధాన్ని స్వీకరించాయి. ఈ అన్నిసిద్ధాంతాలు, తత్త్వాలకంటె ఎక్కువ పారలౌకికచింత, ఇహజీవితవిముఖత్వాలుగల జైనమతంకూడా భారతదేశంపై తనప్రభావాన్ని ప్రసరింపజేసింది.

బౌద్ధము ఇండియాపైప్రసరించినప్రభావాలన్నిటికంటె విలక్షణ మైనదీ, ఆ మతంయొక్క మూల దృక్పథానికే వ్యతిరేకమైనదీ ఐన మరో విశేషంవుంది. ఇది కులాలకుసంబంధించింది. కులాలప్రాథమికమూలాలను అంగీకరించినప్పటికీ, కులవ్యవస్థలను బౌద్ధం ఖండించింది. బుద్ధునికాలం నాటికి కులపద్ధతులు అనుగుణ్యంగామలచుకోగలవిగానే వున్నాయికాని, తరువాతకాలంలోవలె పాషండసమం కాలేదు. ఆనాటికి కులాలవేర్పా టుకు సమర్థత, వ్యక్తిత్వము, వృత్తులకే ప్రాముఖ్యతయివ్వబడింది. కాని, పుట్టుకకుప్రాధాన్యతలేదు. బుద్ధుడుకూడా సమర్థత,సముత్సాహము,క్రమ శిక్షణగలవ్యక్తినిగురించి బ్రాహ్మణశబ్దమునే ప్రయోగించాడు. ఛాందో గ్యోపనిషత్తులో ఆకాలంలో కులము లేదృక్పథంలో చూడబడే డివో తెలుపు చక్కనికథ ఒకటున్నది.

అది సత్యకాముని కథ. అతనితల్లి జాబాల. సత్యకాముడు గౌతమముని (బుద్ధుడుకాదు) శిష్యుడై విద్యనభ్యసింపదలచాడు. ఆయ నవద్దకు వెళ్ళేముందు తల్లిని "నే నే గోత్రీకుణ్ణి?" (ఏ వంశం, ఏ తెగ వాడిని) అని ప్రశ్నించాడు. ఆమె "నాకు తెలియదు బిడ్డా! నాయౌవ నంలో నా తండ్రియింటిలో అతిథ్యబాధ్యతలను నిర్వర్తిస్తున్నకాలంలో నిన్ను ప్రసవించాను. నీవు ఏవంశానికిచెందుతావో నాకు తెలియదు,

నా పేరు జాబాల. నీపేరు సత్యకాముడు. నీవు "సత్యకామజాబాలుడ" నని చెప్పుకో. (జాబాలకొడుకగు సత్యకాముడు)" అని చెప్పింది.

సత్యకాముడు గౌతమునివద్దకు వెళ్ళగా, ఆయన వంశాన్ని గురించి ప్రశ్నించాడు. అతడు తల్లి చెప్పినమాటలే చెప్పాడు. అదివిని గురువు "నిజమైన బ్రాహ్మణుడుతప్ప మరెవరూ యిట్లా చెప్పలేరు. వెళ్ళి సమిధలు తీసుకుర్రా, నేస్తం! నేను నిన్ను గురుకులంలో చేర్చుకుంటాను. నీవు సత్యాన్ని విడనాడలేదు" అన్నాడు.

బహుశా బుద్ధునికాలంలో బ్రాహ్మణకులంమాత్రమే దృఢంగా వుండేదనుకుంటాను. క్షత్రియులు (పాలకవంశము) తమ వంశానికీ, వంశాచారాలకూ గర్వించేవారు. కాని, పాలకులైనవ్యక్తులకూ, వంశాలకూ వారితలుపులు తెరువబడేవుండేవి. మిగిలినవారిలో ఎక్కువమంది వైశ్యులు, రైతులు. ఇవి గౌరవనీయమైన పేరులే. ఇంకా కొన్నివృత్తుల కులనామాలుకూడా వుండేవి. కులహీనులు, అంటరానివారు అనబడేవారు చాలా తక్కువగా కనిపిస్తారు. వారు బహుశా అరణ్యావాసులూ, శవవాహకులూ మొదలగు వృత్తులవారు అయివుండవచ్చు.

బౌద్ధ, జైనమతములు విరివిగా అహింసాప్రబోధంచేయడంవల్ల వ్యవసాయం హీనవృత్తిగా భావించబడింది. ఎందువల్లనంటే భూములుసేద్యంచేయడంవల్ల అనేకజంతువులు నాశనమైపోయాయి. భారతీయార్యులకాలంలో అత్యంతగౌరవంపొందిన యీ వృత్తి, దానికెంతో ప్రాథమికవిలువవలున్నప్పటికీ, దేశంలోని అనేకప్రాంతాలలో గౌరవాన్ని కోల్పోయింది. భూమినిదున్నేవారే సాంఘికగౌరవపుకొలమానంలో దిగువకువచ్చేశారు.

బౌద్ధము బ్రాహ్మణక్రతుతంతులకూ, పూజాకర్మకాండలకూ, ఏమానవప్రాణిని హీనంగాచూచేందుకైనా, ఏమానవుడుపెంపొందడానికైనాఅవకాశాలనునిరాకరించడానికీ, ఉత్తమజీవితానికిపోకుండాచేయడానికీ పూర్తిగా వ్యతిరేకమైనవిప్లవం. కాని, అదే బౌద్ధం తనకు తెలియకుండానే అసంఖ్యాకులగురైతులస్థానాన్ని పతనంచేసింది. ఈ తప్పుకు కారణం బౌద్ధానిదేననడం పొరపాటు. ఇతర దేశాలలో బౌద్ధం యిట్టి పని చేయలేదు. కులపద్ధతిలోనేగల ఒకదుష్టశక్తి దానిని యిటువైపుకు నడిపించివుంటుంది. జైనమతం దాన్ని మరింత ముందుకుతోసింది. (అహింా

పాతత్వాన్ని వ్యసనంగా అనుసరించడవల్ల) బౌద్ధంకూడా యీ పరిణామానికి తోడ్పడకపోలేదు.

## ౧౨. భారతదేశంలో హిందూమతం బౌద్ధమతాన్ని ఏవిధంగా తనలో యిముడ్చుకున్నది ?

ఎనిమిది తొమ్మిదేళ్ళక్రితం నేను పేరిస్‌లోవుండగా ఆంద్రే మాల్‌రా నాతో సంభాషణప్రారంభించుతూనే ఒక విచిత్రప్రశ్న వేశాడు- "సువ్యవస్థితమైనబౌద్ధాన్ని ఇండియానుంచి వెయ్యేండ్లక్రితమే ఏ పెద్దసంఘర్షణా లేకుండా త్రోసివేయగలగడానికి హిందూమతానికిగల శక్తి ఏమిటి ?" అనేది ఆయనప్రశ్న. అనేకదేశాలచరిత్రను వికృతం చేసిన మతయుద్ధాలవంటివి లేకుండా, విశాలవ్యాప్తిగాంచిన ఒకమతాన్ని హిందూమతం తనలో ఎట్లాయిముడ్చుకోగలిగింది? ఈ ఊహాతీతమైన చర్యను సాధించేందుకు నాటిహిందూమతపటిష్ఠత, బలము ఎటువంటివి? ఇండియాకు ఇప్పటికికూడా యీ అంతర్పటుత్వము, బలము వున్నాయా? ఉన్నట్లయితే ఆమెకు స్వాతంత్ర్యము, గొప్పతనము తప్పక చేకూరగలవు.

ఒక ఫ్రెంచివిజ్ఞాని కార్యవాదికూడా అయినప్పుడు ఇట్టిప్రశ్న వేయడం సహజమే. అయినప్పటికి, యూరపు, అమెరికాలలోని ప్రజల్లో కొద్దిమందిఅయినా యిలాంటి విషయాల బాదరబందీపెట్టుకోరు. వారు దైనందినసమస్యలలోనే మునిగితేలుతూంటారు. ఈ ప్రాపంచికసమస్యలు మాల్‌రాకు కూడా వున్నాయి. కాని, ఆయన మేధ శక్తివంతమైనది. పరిశీలనాత్మకమైనది. ఆ మేధతో తనకు కనుపించగలచోటల్లా – గతంలోగాని, వర్తమానంలోగాని – ఆలోచనలలో, మాటల్లో, వ్రాతల్లో, అంతకంటెముఖ్యంగా క్రియలో, చావుబ్రతుకులఆటలో – వెలుగుకోసం వెదకుతాడు.

మాల్‌రాదృష్టిలో యీప్రశ్న పండితకుతూహలంవంటిదికాదు. ఆ ప్రశ్న ఆయనలో నిండివుంది. మేం కలుసుకోగానే అదిపైకిప్రిదిలింది. అది నామనసుకునచ్చినప్రశ్న. లేదా, అదేప్రశ్నను నా మనసు పదే పదేవేసుకుంటున్నది. కాని, నాకుగాని ఆయనకుగాని తృప్తినీయగల

సమాధానం నావద్ద లేదు. సమాధానాలకూ, వివరాలకూ కొదువ లేదు. కాని, అవి సమస్యయొక్క కీలకస్థానాన్ని చేరుకోగలవికావు.

ఇండియాలో బౌద్ధము బలవంతంగా, హింసాపూర్వకంగా, ఒక కార్యక్రమప్రకారం నాశనంచేయబడలేదనేది స్పష్టం. అప్పుడప్పుడూ హిందూపరిపాలకునికీ, శక్తివంతంగాపెరిగిన బౌద్ధసంఘానికీ (బౌద్ధసన్యాసులసంఘం) మధ్య స్థానికమైనసంఘర్షణలు జరిగాయి. వీటికి సామాన్యంగా రాజకీయమూలకారణా లుండేవి. అందువల్ల మతపరంగా గమనించదగ్గవికావు. హిందూమతం బౌద్ధంవల్ల పూర్తిగాతొలగించబడలేదనికూడా మనం గుర్తుంచుకోవాలి. బౌద్ధం అత్యంతప్రాభవంతోవున్న కాలంలోకూడా హిందూమతం విశేషప్రచారంలోనే వుంది. బౌద్ధం ఇండియాలో సహజమరణాన్నేపొందింది. లేక అది క్రమంగా మరొకటిగామారిపోయి అదృశ్యమయింది అనడం సబబు. "ఇండియా దేనినైతే ఎరువు తెచ్చుకుంటుందో, దాన్నిమార్చుకుని, తనలోఐక్యంచేసుకునే విశిష్టగుణాన్ని కలిగివుంది" అంటాడు కీత్. విదేశాలనుంచిగాని, విదేశీయమైనవాటినుంచిగాని ఎరువుతెచ్చుకున్నవాటికే యిదివర్తిస్తే, తన మనసు, తన ఆలోచనలలోనుంచే బైటపడిన ఒకానొకవిశేషంపట్ల ఇంకా బాగా వర్తిస్తుందిగదా! బౌద్ధము భారతదేశీయవుత్పత్తియేగాక, అంతకుముందరి ఆలోచనలతో, వేదాంత (ఉపనిషత్తుల) తత్వముతో సన్నిహితంగా వున్నట్టిది. ఉపనిషత్తులసారంకూడా – బ్రాహ్మణుల పూజారితనాన్ని, క్రతుతంతులను అపహసించింది. కులప్రాధాన్యతను కుదించివేసింది.

బ్రాహ్మణీయమూ, బౌద్ధమూ ఒకదానినొకటి ఢీకొనుటయేగాక, ఒకదానిప్రభావం మరొకదానిమీద ప్రసరించుకున్నాయి. సిద్ధాంతసంబంధమైనసంఘర్షణలున్నప్పటికీ, లేక ఆ సంఘర్షణలవల్లనే తత్వశాస్త్రవిషయంలోనూ, ప్రజావిశ్వాసంలోనూ ఒకదానికొకటి మరింత చేరువయ్యాయి. ప్రత్యేకంగా, మహాయానం బ్రాహ్మణమతవిధానము, రూపాలకు దగ్గరయింది. అది తననైతికఆదర్శాలు సురక్షితంగాఉన్నట్లయితే – మరిదేనితోనైనాసరే సమాధానపడడానికి సిద్ధంగాఉండేది. బ్రాహ్మణీయము బుద్ధుణ్ణి ఒక అవతారంగా, దేవుడుగా చేసింది. బౌద్ధమతమూ అదేపని చేసింది. మహాయానం అతివేగంగా వ్యాపించింది,

కాని, ఆవ్యాప్తితోపోల్చితే విశిష్టతనూ, ప్రత్యేకతనూ కోల్పోయింది. విహారాలు భాగ్యవంతమైనాయి. స్వార్థపరులకు కేంద్రాలయినాయి. క్రమశిక్షణ సన్నగిలింది. ప్రజలపూజావిధానాలలో తాంత్రికమూ, మూఢాచారమూ ఎక్కువయ్యాయి. బౌద్ధము ఇండియాలో వెయ్యేండ్లున్నతరువాత క్రమంగా క్షీణించసాగింది. ఆకాలంలో దానిజాడ్యస్థితిని శ్రీమతి రైస్ డేవిడ్స్ ఇలావర్ణించింది: "జాడ్యంవంటి ఈ ఊహాల ప్రభావం మరీఎక్కువయినందువల్ల, గౌతమబుద్ధుని నైతికబోధలు దాదాపు కనుమరుగైపోయాయి. సిద్ధాంతాలు పుట్టాయి, వికసించాయి. ప్రతికొత్తఅడుగూ, ప్రతివాదనా మరొకదాన్ని కోరసాగింది. ఆఖరుకు మెదడుసృష్టించినకృత్రిమస్వరూపాలతో ఆకాశమంతా నిండిపోయింది. లోకాతీతచమత్కారాల తళుకుబెళుకులక్రింద, ఆ మతస్థాపకుని సరళ, ఘన ఆశయాలన్నీ ఊపిరాడకనశించాయి."

ఈ వర్ణన, నాటిబ్రాహ్మణీయమూ, దానిశాఖలూ అనుభవిస్తున్న "జాడ్యమువంటి ఊహలు", "మెదడుసృష్టించినకృత్రిమస్వరూపాల"కు కూడా సరిగ్గా సరిపోతుంది.

భారతదేశంలో సాంఘిక, మానసిక పునరుజ్జీవనము, సంస్కరణలు ప్రారంభమైనకాలంలోనే బౌద్ధముకూడా ప్రారంభమైంది. అది ప్రజలలో నవజీవనోచ్ఛ్వాసనుపోసింది. ప్రజలబలాలలోని కొత్తనిక్షేపాలను ఉపయోగించింది. కొత్తతెలివితేటలనూ, నాయకత్వసమర్థతనూ వెలికితెచ్చింది. అశోకచక్రవర్తిసాధికారప్రోద్బలంవల్ల త్వరితంగా వ్యాపించి, ఇండియాలో అత్యంతప్రధానమతమయింది. అది ఇతరదేశాలకుకూడా వ్యాపించింది. బౌద్ధపండితులు ఇండియానుంచి విదేశాలకూ, విదేశాలనుంచియిచటికీ ధారాప్రవాహంగా రాకపోకలుసాగించారు. ఈ ప్రవాహం అనేకశతాబ్దాలు కొనసాగింది. 5 వ శతాబ్దిలో చైనాయాత్రికుడు ఫాహియాన్ ఇండియాకువచ్చినపుడు (బుద్ధునితర్వాత వెయ్యేండ్లకు) బౌద్ధమతం దానిజన్మభూమిలో స్పష్టవంగా పరిఢవిల్లుతున్నట్లు గ్రహించాడు. 7 వ శతాబ్దంలో, అంతకంటెప్రసిద్ధుడైన చైనాయాత్రికుడు హుయాన్‌సాంగ్ ఇండియాకు వచ్చినపుడు, బౌద్ధం క్షీణిస్తున్న సూచనలున్నవని (కొన్ని ప్రాంతాలలో బలీయంగా ఉన్నప్పటికీ)

గ్రహించాడు. క్రమంగా, బౌద్ధసన్యాసులు, పండితులు అసంఖ్యాకంగా చైనాకు వెళ్ళారు.

ఈలోపుగా 4,5 శతాబ్దాలలో, గుప్తచక్రవర్తులఆధ్వర్యాన బ్రాహ్మణమతము, హిందూసంస్కృతి పెద్దఎత్తున పునరుజ్జీవనం పొందుతున్నవి. ఇది ఏవిధంగానూ బౌద్ధవ్యతిరేకోద్యమం కాదు. కాని, ఇది బ్రాహ్మణీయానికి బలాన్ని, ప్రాముఖ్యతనీ పెంచింది. బౌద్ధమతంలోని పారలౌకికానికి ప్రతిక్రియగా రూపొందింది. చివరి గుప్తులు చాలా కాలం హూణదండయాత్రికులతో పోరాడడంతో గడుపవలసివచ్చింది. చివరికి వారిని తరిమివేసినప్పటికీ, దేశం బలహీనమై, క్షీణపరిణామాలు ఆరంభించాయి. ఆతరువాతకూడా కొన్నికొన్ని సత్ఫాలనలు వచ్చాయి. కొందరు ప్రఖ్యాతపురుషులు పైకివచ్చారు. కాని, బ్రాహ్మణీయము, బౌద్ధమూకూడా క్షీణిస్తూ అనేక దురాచారాలకు తావిచ్చాయి. ఆ రెంటినీ వేరుపరచడం కష్టసాధ్యమయింది. బ్రాహ్మణీయం బౌద్ధాన్ని తనలో యిమిడ్చివేసుకున్నప్పటికీ, దానిలోకూడా అనేకమార్పులు జరిగాయి.

8 వ శతాబ్దంలో, భారతతత్వవేత్తలలో అత్యుత్తముడగు శంకరాచార్యుడు మతబోధకగణాన్నితయారుచేయ నారంభించాడు. అనగా హిందూసన్యాసులమఠాలు స్థాపించాడు. ఇది బౌద్ధసంఘములకు అనుసరణ. అంతకుముందు బ్రాహ్మణమతంలో సన్యాసులసంస్థలంటూ వుండేవికావు. చిన్నచిన్న సన్యాసకూటాలు, లేక ఆశ్రమాలవంటివే వుండేవి.

బెంగాలు, సింధుప్రాంతాలలో కొన్నిక్షీణరూపబౌద్ధశాఖలు కొనసాగాయి. బౌద్ధమతం ఇండియాలో వ్యాపితమతంగా లేకుండా పోయింది.

## ౧౩ భారతీయతత్వశాస్త్రదృక్పథం

ఒకభావం మరొకభావానికి దారితీసినప్పటికీ, ప్రతిభావమూ జీవితపుమార్పానికే సంబంధించివున్నప్పటికీ, మానవమేధయొక్క హేతుబద్ధసంచలనం ఒక్కొక్కసారి విడమర్చి చెప్పలేగలదైనప్పటికీ, ఆ భావన లొకదానిమీదుగా ఒకటి నడుస్తాయి. క్రొత్తదీ, పాతదీ ప్రక్కప్రక్కల

సాగుతాయి; ఒకదానికొకటి జతపరుపవీల్లేనట్లుగా, తరచుగా ఒకదానినొకటిఖండించుకునేట్లుగా తయారవుతాయి. ఆఖరుకు ఒకేవ్యక్తిమేధస్సు కూడా పరస్పరవైరుధ్యాలపుట్ట. అతనిచేయిదాలను పరస్పరసంబంధం కలవిగాచేయడం కష్టం. ఒకేజాతి సంస్కృతిలోఅన్నిస్థాయిలకు చెందిన ప్రజలనూ కలిగివుంటుంది. వారు తమలోనూ, తమ ఆలోచనలలోనూ విశ్వాసాలలోనూ, కార్యకలాపాలలోనూ ఆ యా స్థాయిలనే ప్రదర్శిస్తారు. గతకాలంనుంచి యీనాటివరకూగల వివిధకాలాలనుగూడా ప్రతిబింబిస్తారు. బహుశా వారికార్యకలాపాలు చాలావరకు నేటిసాంఘిక, సంస్కృతులస్థాయికే సంబంధించియుండవచ్చు. లేకపోతే యీ జీవిత నదీప్రవాహంలో వారు ఏ సుడిగుండంలోనో చిక్కుకుపోవచ్చు. లేదా ఏకాకిగా నెట్టివేయబడవచ్చు. కాని, ఈ కార్యకలాపాలవెనుక ఆదిమ కాలపువిశ్వాసాలూ, హేతుపూర్వకంగాని నమ్మకలూ తప్పకుండా వుంటాయి. పారిశ్రామికంగా పురోగమించినదేశాలలో ప్రతివ్యక్తీ అత్యాధునాతనంగా తయారైనవస్తువునో, కనిపెట్టబడినదానినో ఉపయోగించుకోవడం లేక దానిప్రయోజనాన్ని పొందడం – చెప్పకుండాజరిగేపనే. అట్టివారిలోకూడా హేతుబుద్ధి నమ్మనటువంటి, జ్ఞానం ఆమోదించనటువంటి విశ్వాసాలూ, దృఢాభిప్రాయాలూ వుండడం ఆశ్చర్యకరం. తగిన హేతుబుద్ధి, విజ్ఞానములులేని రాజకీయవేత్త తనవృత్తిలో విజయుడు కావడం సంభవించవచ్చును. ఒకన్యాయవాది గొప్పవాదనాసమర్థుడూ, న్యాయశాస్త్రకోవిదుడూ అయినప్పటికీ, ఇతరవిషయాలు బొత్తిగా తెలియనివాడుకావచ్చును. ఆధునికయుగానికి ప్రత్యేకప్రతినిధియైన విజ్ఞానశాస్త్రవేత్తకూడా తన గ్రంథాలయంనుంచి తన పరిశోధనాలయంనుంచి వైటికివెళ్ళగానే విజ్ఞానశాస్త్రంయొక్కదృక్పథాన్నీ, విధానాన్నీ తరచుగా మరచిపోతాడు.

మనదైనందినజీవితాల భౌతికవిశేషాలపై తమప్రభావాన్ని ప్రసరించేసమస్యలపట్లకూడా ఇదే జరుగుతుంది. తత్వశాస్త్రము, పారలౌకికచింతనలలో యీ సమస్యలు బహుదూరమై, క్షణభంగురమై మన దైనందినజీవితానికి స్వల్పసంబంధం కల్గిఉంటాయి. మనం కఠినక్రమశిక్షణను, మనసుపై అధికారాన్ని పొందకపోయినట్లయితే మనలో అనేకమందికి ఈసమస్యలు ఏమాత్రం అందుబాటులోఉండవు. అయినప్ప

టికీ, మనకు తెలిసో, తెలియకో మనలో ప్రతిఒక్కరికీకూడా ఏదోఒక రకమైన 'జీవితతత్వభావం' ఉండనేఉంది. దాన్ని మనం ఆలోచనాపూర్వకంగా యేర్పరచుకోనియుండనట్లయితే వారసత్వంగావచ్చిఉంటుంది. ఇతరులనుంచి స్వీకరించబడి, స్వయంరూఢమని అనుకోబడివుంటుంది. లేకపోతే, మనం ఆలోచనలప్రమాదాలనుండి తప్పించుకునేందుకు, ఒక సురక్షితప్రదేశాన్ని ఎన్నుకున్నట్లు, ఒక మతధర్మాన్నో, మత మూఢ్యాన్నో, జాతీయ ప్రయోజనాన్నో, అస్పష్టంగా, తృప్తికరంగా వుండే మానవత్వాన్నో స్వీకరించవచ్చు. తరచుగా మనలో యివి అన్నీ, మరికొన్నీ కలసిఉండనూవచ్చు. ఒకదానికొకటికి సంబంధమూ లేకపోవచ్చును. అప్పుడు మనలో బహుముఖాలైనవ్యక్తిత్వాలు యేర్పడి, ఒక్కొక్కటి ఒక్కొక్కకక్ష్యలో పనిచేస్తూవుంటాయి.

బహుశా పురాతనకాలంలో మానవవ్యక్తిత్వంలో ఐక్యత, పొందిక ఎక్కువగా ఉండిఉంటాయనుకుంటాను. మరి ఔన్నత్యాన్ని సాధించిన కొందరువ్యక్తులవిషయంలోతప్ప, ఆకాలపు వ్యక్తిత్వం నేటి వ్యక్తిత్వపుస్థాయికి తక్కువదిగానే వుండిఉంటుంది. మానవాళి పయనిస్తున్న యీ పరిణామయుగంలో మనం యీ వ్యక్తిత్వఐక్యతను ఛిన్నాభిన్నంచేయగలిగాము. కాని, ఇంతవరకూ దానిస్థానం ఆక్రమించుకోగలమరొకదాన్ని కనుగొనలేకపోయాం. మనం యిప్పటికీ మూఢ్యమత విధానాలను పట్టుకుని వ్రేలాడతాం నిష్ప్రయోజకమైన ఆచారాలనూ విశ్వాసాలనూ పాటిస్తాం. అయినప్పటికి మనం విజ్ఞానశాస్త్రసమ్మతమైన విధానాలలో బ్రతుకుతున్నట్లు భావించుకుంటాం. బహుశా విజ్ఞానశాస్త్రం జీవితాన్ని వీక్షించడంలో చాలాసంకుచితంగాప్రవర్తించి, జీవితపుఅతిముఖ్యదృక్పథాలను విస్మరించింది. అందువల్ల వ్యక్తిత్వంలో కొత్తఐక్యతను, ప్రశాంతిని సృష్టించేందుకు తగుపునాదిని ఏర్పరచలేకపోయింది. బహుశా అది యిప్పుడీ కొత్తపునాదిని క్రమంగా పెంపొందిస్తున్నది. కనుక పురాతనకాలంలో వున్నదానికంటె ఉన్నత స్థాయిలో మానవవ్యక్తిత్వప్రశాంతిని మన మిక సృష్టించుకోగలం.

కాని, అసలుసమస్య మానవవ్యక్తిత్వపుసరిహద్దుల నధిగమించి పోయింది గనుక,ఇపుడు మరింతకష్టతరమూ, మరింతక్లిష్టమూ అయింది. పురాతన, మాధ్యమికయుగాలలోని సంకుచితపరిధులలో ఒకరకమైన

మధురవ్యక్తిత్వాన్ని పెంపొందించడం సులభమైయుండవచ్చు. ఆ గ్రామమో, పట్టణమో మాత్రమే ప్రపంచంగా కనుపించిన ఆకాలంలో సాంఘికవ్యవస్థను, ప్రవర్తననుగురించి కొన్నినిర్దుష్టమైన అభిప్రాయా లుండేవి. వ్యక్తి, కూటమీ బైటితుఫానులనుంచి రక్షణ పొందుతూ, స్వయంపోషక జీవితాలు గడిపేవారు. ఈనాడు వ్యక్తిదృష్టి ప్రపంచమంత విశాలమైపోయింది. సాంఘికవ్యవస్థనుగురించిన వివిధాభిప్రాయాలు పరస్పరం సంఘర్షిస్తున్నాయి. వాటివెనుక రకరకాలజీవితతత్వ విధానా లున్నాయి. ఒకానొకప్రదేశంలో రేగిన సుడిగాలి మరొక ప్రాంతంలో తుఫానును సృష్టిస్తుంది. ఇంకొకప్రాంతంలో వాయుదిగ్బంధనాన్ని కల్పిస్తుంది. అందువల్ల ఒకవ్యక్తి ప్రశాంతిని సాధించాలంటే దానిని ప్రపంచమంతటాగల ఒకానొక సాంఘికప్రశాంతి బలపరచవలసి ఉంటుంది.

ఇండియాలో ఇతరదేశాలలోకంటె చాలాఎక్కువగా సాంఘిక వ్యవస్థపట్లగల పురాతన అభిప్రాయం, దానివెనుకగలజీవితతత్వవిధానం ఈరోజుకుకూడా కొంతవరకూ పటుత్వంగా కొనసాగుతూనేవున్నాయి. వాటిలో ఒకరకమైనపవిత్రత సంఘాన్నిస్థిరపరచి, దాన్నిజీవితపరిస్థితులకు అనుగుణ్యంగానడుపగలగుణం లేకపోయినట్లయితే, అవి ఇంతకాలం మనగలిగేవికావు. వాటిలోనేగలదుర్గుణాలు ఈపవిత్రతను అధిగమించిపోయాయి. అందువల్లనే అవి చివరికి విఫలమైపోయి, భారంగా, అడ్డంకిగా తయారై జీవితసత్యానికి విడాకులిచ్చాయి. ఏమైనప్పటికీ, నేడు వాటిని మనకుసంబంధంలేని వెలిపదార్థాలుగా భావించలేము. వాటిని ప్రపంచసంబంధపరంగా వీక్షించి, దానితో మధురంగా మేళవించాలి.

“ఇండియాలో మతం ఒకమూఢనమ్మకంవంటిది కాదు. అది ఆత్మవికాసానికిచెందిన విభిన్నస్థాయిలకూ, జీవితపువిభిన్నవ్యవస్థలకూ సమన్వయంచేయబడి, మానవప్రవర్తనకు ఆచరణీయమైనసూత్రం” అన్నాడు హేవెల్. మూఢనమ్మకం జీవితంతో ఏసంబంధమూలేనిదైనప్పటికీ, నమ్మబడుతూనేవుండవచ్చును. కాని, ఆచరణీయమైనసూత్రం ఆచరణలో పనిచెయ్యాలి, జీవితంతో సమన్వయంకావాలి. లేకపోతే జీవితాన్నేఅడ్డగిస్తుంది. దాని ఆచరణయోగ్యత, దానిజీవితసమన్వయత, మారేపరిస్థితులకనుగుణంగామారేదానిసమర్థతా – ఇవే ఆ సూత్రానికి

ప్రయోజనకరమైన రుజువులు. అది అలాచేయగలిగినంతకాలమూ దాని ప్రయోజనాన్ని సాధించుకుంటుంది. నిర్ణయింపబడినవిధిని నిర్వహిస్తుంది. ...తంలోని ఒకముఖపులో అది వేగంగా పనుగె త్తినట్లయితే సాంఘికావసరాలతోగలసంబంధాన్ని కోల్పోతుంది. దానికీ జీవితానికీ మధ్యగల దూరం పెరుగుతుంది. దానిపటుత్వాన్నీ, ప్రత్యేకతనూ పూర్తిగా కోల్పోతుంది.

పారలౌకికసిద్ధాంతాలూ, ఊహాలత్వాలూ ఎప్పుడూ మారుతూ వుండే జీవితపుచె త్తనుగురించికాక, దానివెనుకగల శాశ్వతసత్యాన్ని (అలాంటిదొకటివుంటే) గురించి మాత్రమే చర్చిస్తాయి. అందువల్ల బాహ్యామార్పులవల్ల చలనంలేని ఒకరకమైన శాశ్వతత్వం (స్థిరత్వం) వాటికి వుంది. కాని, అవి వాటినివ్యూహించిన మానవహృదయాల స్థాయిని, అవిపెరిగినవాతావరణాన్నిబట్టి తయారయినటివే. ఇది చెరగనిసత్యం. వాటిప్రభావం వ్యాపించినట్లయితే, ఒకజాతియొక్క సాధారణ జీవితతత్వవిధాన్నే మార్చివేస్తాయి. ఇతరదేశాలలోకంటె ఇండియాలో తత్వశాస్త్రం – దాని ఉన్నతస్థాయి కొద్దిమంది ప్రత్యేకవ్యక్తులకే పరిమితమైనప్పటికీ–ఎక్కువగా అనుసరింపబడుతున్నది. అందువల్లప్రజల మనసులలో ఒకానొక ప్రత్యేకదృక్పథాన్ని పెంపొందజేయడంలోనూ, జాతియొక్క దృక్పథాన్ని రూపొందించడంలోను దీనిప్రభావం బలంగా వుంటుంది.

ఈ పరిణామానికి బౌద్ధతత్వము ప్రముఖపాత్ర నిర్వహించింది. మధ్యయుగాలలో ఇస్లాము జాతీయదృక్పథంమీద తనముద్రను వేసింది. ఇస్లాంమతాన్ననుసరించి యేర్పడిన సాంఘిక, మతవ్యవస్థలకూ, హిందూమతానికీ మధ్యగల అగాధానికి వారధిగా, కొత్తశాఖలను సృష్టించేపరిణామానికి, ఇస్లాం ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూకూడా పనిచేసింది. కాని, మొత్తంమీద ఎక్కువప్రభావాన్ని ప్రసరింపజేసినవి భారతీయతత్వశాస్త్రంలోని ఆరురూపాలే (షడ్దర్శనములు). ఇందులో కొన్ని తామే బౌద్ధప్రభావానికి లోనయ్యాయి. వాటినన్నిటినీకూడా పురాతనసాంప్రదాయికాలుగా భావిస్తారు. అయినప్పటికీ, వాటి దృక్పథాల్లోను, నిర్ణయాల్లోను తేడా లున్నవి. సమానలక్షణాలుకూడా వున్నాయి. భారతీయమతవిశ్వాసాలలో అనేక రూపా లున్నాయి.

ఒకటి దేవునిఉనికినినమ్మే ఈశ్వరవాదం. ఇంకొకటి అనేక దేవుళ్ళున్నారనే వాదం. స్వచ్ఛమైన మోనిజం ఒకటి. అసలు దేవుడే లేడనే నిరీశ్వర వాదం మరొకటి. (ఇది పరిణామవాదమే పునాదిగా కలిగివుంటుం. ) వీటిలో ఆదర్శవాదమూ వుంది, వాస్తవికవాదమూ వుంది. భారతీయ మేధస్సు సర్వగుణసహితంగా, బహుగుణక్లిష్టంగా ఉంటుంది. అట్టిమేధ స్సుయొక్క వివిధముఖాలు వాటియొక్క ఏకత్వ, భిన్నత్వాలలో చూపబడుతాయి. మాక్స్‌ముల్లర్ ఈ రెండువిశేషాలనూ విస్పష్టం చేశాడు. "......ఈ సత్యం నామనస్సుపై ఎంతో గాఢమైన ముద్ర వేసింది...ఈ ఆరువిధానాల వైవిధ్యానికి వెనుక ఒక సంయుక్తనిక్షేపం, జాతీయ, ప్రజాతత్వశాస్త్రం అనదగ్గది వుంది...దానినుండి ప్రతిఆలో చనాపరుడూ తనప్రయోజనాలకవుసరమైనదాన్ని తీసుకోవచ్చును."

ఈ అన్నివిధానాలలో ఒక సంయుక్తవిశ్వాసం వుంది. "ఈ ప్రపంచం క్రమబద్ధమైనది. అది నియమప్రకారం ప్రవర్తిస్తుంది. దానిలో ఒక బ్రహ్మాండమైనమధురిమ వుంది". అటువంటివిశ్వాసం ఏదోఒకటి అవసరం. లేకపోతే, దాన్ని వివరించేందుకు ఏవిధానమూ వుండదు. క్రియాకర్మసిద్ధాంతం పనిచేసినప్పటికీ వ్యక్తి తనలక్ష్యాన్ని (గమ్యాన్ని) తానే రూపొందించుకునేందుకు కొంతస్వేచ్ఛకూడా వుంది. పునర్జన్మలో నమ్మకం, నిస్వార్థప్రేమ, నిష్కామకర్మలయందు దృఢభావమూ వున్నాయి. హేతువాదాన్నీ, హేతుబుద్ధినీ ఆసరాచేసుకుని వాదనలో ప్రయోజనకరంగా వినియోగించారు. కాని, ఈ రెంటికంటెకూడ "అంతరాత్మప్రబోధం" గొప్పదన్నారు. ఒకవిషయానికి, తనఅవధికి ఆవలనున్నదానికికూడా ప్రయోగింపగలంతవరకూ – సాధారణవాద నను హేతువాదపుపునాదులమీదనే కొనసాగించేవారు. "ఈ విధా నాలు యథార్థంగా పురాతనసాంప్రదాయికాలే. అవి పవిత్రమతగ్రం థాల నామోదిస్తాయి కాని, జీవితపుటునికిలోగల సమస్యలను మానవ శక్తులతో ఎదుర్కొంటాయి. మతగ్రంథం ఆచరణప్రయోజనాల కన్నింటికీ పనికివస్తుంది. కాని దానిసహాయంలేకుండానేగాక, తరచుగా దానిమూలాశయానికే వ్యతిరేకమైన హీనవిధానాల్లోకూడా సాధింప బడినఫలితాలకు ఆమోదముద్రను వేసేందుకు మాత్రం ఉపయోగిస్తుంది." అంటాడు ప్రొఫెసర్ కీత్.

## ౧౪ షడ్దర్శనములు

తత్వశాస్త్రంలో భారతీయవిధానాల తొలిదశలను చర్చించాలంటే మనం బౌద్ధయుగానికిపూర్వచరిత్రను మళ్ళీ పరిశీలించాలి. అవి క్రమక్రమంగా యేర్పడ్డాయి. బ్రాహ్మణీయవిధానాలు, బౌద్ధవిధానాలు తరచుగా పరస్పరం విమర్శించుకుంటూ, సూత్రాలను యిచ్చిపుచ్చుకుంటూ సమకాలికంగా పెంపొందినకాలంకూడా వుంది. అనేకరకాలుగా వున్న భారతీయతత్వశాస్త్రవిధానాలలో ఆరువిధానాలు విస్పష్టంగా రూపొంది, ప్రత్యేకతల నేర్పరచుకున్నాయి. అందులో ప్రతిఒక్కటీ ఒక్కొక్క స్వతంత్ర దృక్పథాన్ని, ఒక్కొక్క ప్రత్యేకవాదాన్ని కలిగి వున్నాయి. కాని ఒకదానికొకటి ఏ సంబంధమూలేనట్టివి కావు. ఒక పెద్ద ప్రణాలికలోని వివిధభాగాలవంటివనడం సమంజసం. ఆ ఆరువిధానాలు (1) న్యాయ (2) వైశేషిక (3) సాంఖ్య (4) యోగ (5) మీమాంస (6) వేదాంతాలు.

న్యాయవిధానం పరిశీలనాత్మకంగా హేతుబద్ధంగా వుంటుంది. అసలు 'న్యాయ'మంటేనే, హేతువాదం, లేక సరిగా కారణమాలోచించేశాస్త్రం. ఇది అరిస్టోటిల్‌యొక్క సిలోజిజమ్‌వలె వుంటుంది. కాని, యీ రెంటిమధ్య ప్రాథమికమైన భేదాలున్నాయి. న్యాయవాదం వెనుకగలసూత్రాలను మిగతావిధానాలన్నీ ఆమోదించాయి. ఒక విధమైన మానసికక్రమశిక్షణకొరకు - పూర్వ, మధ్యయుగాల్లోను, నిన్న మొన్నటివరకుకూడా, మనపాఠశాలల్లో, విశ్వవిద్యాలయాల్లోను న్యాయవిధానం నేర్పబడేది. ఇండియాలోని ఆధునికవిద్యావిధానం దీన్ని వదలివేసింది. కాని, పురాతనపద్ధతిలో సంస్కృతవిద్యనేర్పబడేచోట్లమాత్రం న్యాయవిధానం పాఠ్యభాగాలలో ముఖ్యంగావుంటూనేవుంది. అది, తత్వశాస్త్రఅధ్యయనానికి ఎనలేనిపునాదిని యేర్పరుపగలదని భావించడమేగాక, ప్రతి విద్యావంతునికీ అత్యవసరమైన మానసికశిక్షణగా యెంచబడింది. యూరపువిద్యావిధానంలో అరిస్టోటిల్ హేతువాదానికెట్టి ప్రాముఖ్యత వుందో, దీనికి భారతీయవిద్యావిధానంలో అట్టి ఆధిక్యత ఉంది.

ఆధునిక శాస్త్రీయవిధానంలో, లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకుని పరిశోధనజరుగుతుంది. ఈ న్యాయవిధానం యిందుకు భిన్నమైంది. అయినప్పటికీ, అది దానికిగలవిధానంలో విమర్శనాత్మకంగా, శాస్త్రీయంగా వుంటుంది. ఒకానొక విశ్వాసంమీద ఆధారపడకుండా, జ్ఞానలక్ష్యాలను విమర్శనాపూర్వకంగా పరిశీలించి, హేతుబద్ధమైన రుజువులు చేసుకుంటూ, ఒక్కొక్క అడుగే ముందుకు వెళుతుంది. హేతువాదపు గీటురాయిమీదనిలువని కొన్ని ఊహలు యీ వాదంవెనుక ఒక విశ్వాసంవలె వున్నాయి. కొన్ని సిద్ధాంతాలను ఆధారంచేసుకున్నతరువాత, పైనచెప్పినట్లు యీవిధానం నిర్మించబడింది. జీవితంలోనూ, ప్రకృతిలోనూ ఒకరకమైన ఐక్యత, మధురిమ లున్నాయని భావించబడింది. భగవంతునిఉనికిమీద, వ్యక్తులఆత్మలమీద, అణువణువూ సంచలించే ప్రపంచంమీదా విశ్వాసం వుంది. వ్యక్తి ఒక్కశరీరమే కాదు, లేక ఆత్మయేకాదు, ఆ రెంటియొక్క సమ్మేళనము. కొన్ని ఆత్మలు, ప్రకృతి కలసిన మిశ్రమచర్యయే "సత్యం"గా భావించబడింది.

వైశేషికవిధానం, అనేకమార్గాలలో న్యాయవిధానంవలెనే ఉంటుంది. వ్యక్తులు, పదార్థాలు ప్రత్యేకప్రత్యేకంగా ఉండటాన్ని యిది నొక్కి చెబుతుంది. ఇదే ఈప్రపంచపు అణుశక్తిసిద్ధాంతాన్ని యేర్పరచింది. ఈవిధానమే ధర్మసూత్రం (నైతికన్యాయం) ప్రపంచాన్నిపాలిస్తున్నదనిచెప్పి, ఆ వాదంచుట్టూ తిరుగుతుంది. దేవుడున్నాడనే వునాదిని స్పష్టంగా అంగీకరించదు. న్యాయ, వైశేషిక, ఆదిబౌద్ధాలమధ్య అనేకవిషయాలలో సారూప్యత ఉంది. మొత్తంమీద యివి వాస్తవదృక్పథాన్ని అవలంబిస్తాయి.

సాంఖ్యవిధానం బౌద్ధయుగానికిపూర్వంగల అనేక హిందూ తత్వవిధానాల కలగూరగంపనుండి,కపిలమహర్షి (క్రీ. పూ. 7 వ శతాబ్దం) రూపొందించిందే అంటారు. రిచర్డ్ గార్బే "ప్రపంచచరిత్రలో మొట్టమొదటిసారిగా మానవమేధయొక్క పరిపూర్ణ స్వేచ్ఛ, దానిశక్తులయందు దానికిగల సంపూర్ణవిశ్వాసం కపిలునిసిద్ధాంతంలో ప్రదర్శింపబడ్డాయి" అన్నాడు.

సాంఖ్యం బౌద్ధంపెంపొందినతర్వాత, బాగా సంఘటితమైనవిధానంగా తయారైంది. ఈ సిద్ధాంతం పూర్తిగా తత్వశాస్త్ర, పారలౌకిక

శాస్త్రసంబంధమైన భావన. ఇది మానవుని మేధస్సులో పుట్టినదేగాని–, లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకుని పరిశీలనజరపడంతో ఏసంబంధమూ ఉన్నదికాదు. అసలు దానికిఅందుబాటులోలేనివిషయాలను అలా పరిశీలించే అవకాశంకూడా ఆనాడు లేదు. బౌద్ధంవలెనే సాంఖ్యంకూడ హేతువాద పూర్వకమైన అన్వేషణవిధానాలను అవలంబించింది. ఏ అధికారపు సమర్థనతోను నిమిత్తంలేకుండా, హేతుబద్ధమైన వాదనతోనే, అనగా, బౌద్ధముయొక్క మూలసూత్రాలనవలంబించియే, బౌద్ధసవాలును ఎదుర్కొన్నది. ఈ హేతుబద్ధదృక్పథంవల్ల దేవుడే ఉండరాదు. అందువల్ల సాంఖ్యవిధానంలో దేవునిప్రత్యక్షపుటునికీ లేదు, పరోక్షశక్తీ లేదు. అనగా ఏకేశ్వరవాదనా లేదు, అంతా ఈశ్వరుడేననేవాదనా లేదు. దాని దృక్పథం నాస్తికం గనుక, మానవాతీతశక్తిగలమతంయొక్క పునాదులను పెకలించివేసింది. ఒకదేవునిచేత యీప్రపంచం సృష్టింపబడలేదు. అది ఎడతెగని పరిణామంవల్ల ఏర్పడింది. అది, శక్తికీ (లేక శక్తులకూ) పదార్థానికీమధ్య జరిగే ప్రతిక్రియల ఫలితంగా ఉద్భవించింది, అనాలి. ఇందులో ఆ పదార్థంకూడా శక్తియే కావచ్చును. ఈ పరిణామం నిరంతరకార్యకలాపం.

సాంఖ్యాన్ని 'ద్వైత'మని (ద్వంద్వమగుతత్వశాస్త్రము) కూడ అంటారు. అది 'ప్రకృతి', 'పురుషుడు' అనే రెండుప్రాథమికసాధనలను పునాదులుగాచేసుకొని నిర్మించబడడమే దీనికికారణం. ప్రకృతి ఎపుడూ సంచలిస్తూ మారుతూఉండే ప్రకృతి, లేకశక్తి. పురుషుడు ఎన్నడూ మారని క్రియాశక్తి, లేక ఆత్మ. అనేకపురుషులు, లేకఆత్మలు, లేకఆత్మ ప్రబోధమువంటి ఏవో విశేషాలూ ఉన్నాయి. పురుషునిప్రభావంవల్ల (పురుషునికి స్వయంగా చలనశక్తి లేదు) ప్రకృతి పరిణామంచెందుతూ ఎడతెగని ఉనికిగల ప్రపంచానికి దోవతీస్తుంది. క్రియాకర్మ అంగీకరింపబడింది. కాని, ఫలితం (కర్మ) కూడా కారణం (క్రియ)లోనే యిమిడి ఉంటుందని చెప్పబడింది. క్రియ, కర్మ అనేవి, ఒకేఒకవిశేషంయొక్క, పరిణామంపొందని, పొందిన రూపాలు అవుతాయి. కాని, మన వాస్తవికదృష్టిలో క్రియ, కర్మలు విభిన్నమైన వేర్వేరుప్రత్యేకతలు గలవి, కాని,ప్రాథమికంగా వాటిలో సారూప్యత(సమానలక్షణాలు)లున్నాయి.

ఆవిధంగా వాదన సాగిపోతూ వుంటుంది. ఈ వాదనలో తేలే దేమిటి? చైతన్యవంతంకాని ప్రకృతి (లేక శక్తి) నుండి పురుషుని (స్వచైతన్యము) ప్రభావంవల్లనూ, కారణభూతసూత్రంవల్లనూ ప్రకృతి (ప్రపంచం) యేర్పడింది. ఈ ప్రపంచప్రకృతిలో బహువిధాల క్లిష్టత, వివిధరకాల మూలభూతాలు (మూలపదార్థాలు) వుంటాయి. ఇలా యేర్పడిన ప్రకృతి ఎప్పుడూ మారుతూ, మార్పుతో పెంపొందుతూ వుంటుంది. ఈ ప్రపంచంలోని అతిసూక్ష్మవిశేషంనుంచి అత్యున్నత విశేషంవరకూ ఒక ఏకత్వమూ, ఒక అవిచ్ఛిన్నతా వుంటాయి. ఈ భావనఅంతా కూడా అప్రత్యక్షమైనవిశేషం. ఈ వాదన కొన్ని మూల సూత్రాలమీద ఆధారపడి, సుదీర్ఘంగా, క్లిష్టంగా, హేతుబద్ధంగా వుంటుంది.

పతంజలి నిర్ధరించిన యోగవిధానం – ముఖ్యంగా శరీరానికి, మనసుకు క్రమశిక్షణను కలిగించే విధానం. అదే మానసిక, ఆత్మిక శిక్షణకు దారితీస్తుంది. పతంజలి యీ పురాతనపద్ధతిని స్పష్టంగా రూపొందించడమే గాక, పాణిని రచించిన సంస్కృతవ్యాకరణానికి ప్రసిద్ధమైన వ్యాఖ్యానంకూడా రచించాడు. 'మహాభాష్య' మనబడే యీ వ్యాఖ్యానం, పాణినిరచనవంటి గొప్పకావ్యమే. ప్రొఫెసర్ చెర్‌బాట్‌స్కీ (లెనిన్‌గ్రాడ్) యిలావ్రాశాడు: "ఇండియాకు ఆదర్శప్రాయమైన శాస్త్రీయసారస్వతరచన పతంజలిమహాభాష్యంగల పాణిని వ్యాకరణమే."

'యోగం' యిపుడు యూరపు, అమెరికాలలోకూడా బాగా తెలిసినపదం. కాని, అర్థమయింది తక్కువ. వారు దీన్ని బుద్ధునివలె నిశ్చలంగాకూర్చుని,నాసికాగ్రాన్ని చూస్తూవుండడంవంటి విచిత్రాచారం అనుకుంటారు. శరీరంతో విచిత్రమైన గమ్మత్తులుచేయగలకొందరు యోగశాస్త్రపండితులమన్నట్లు నటించి అమాయకుల్నీ, విచిత్రాలు చూడాలని తాపత్రయపడేవారినీ ఆకర్షించి, మోసంచేస్తారు. వాస్తవానికి యీవిధానం శారీరకచర్యలకంటె ఉన్నతమైనది. మనసును సరియైన క్రమశిక్షణలోవుంచడంవల్ల, ఉన్నతమైన ఆత్మచైతన్యాన్ని పొందవచ్చుననే మానసికభావనమీద యీ యోగవిధానం ఆధారపడుతుంది. ప్రపంచాన్నిగురించిగాని, సత్యమనేదాన్నిగురించిగాని

ముందుగానే వూహించుకున్న అప్రత్యక్షసిద్ధాంతాలపై ఆధారపడ కుండా, తనకుతాను ఆవిషయాలను తెలుసుకోగలిగేందుకు వుద్దేశింప బడినదీవిధానం. అందువల్ల ఇది పరిశోధనావిధానం. ఆపరిశోధనకు బాగా పనికివచ్చే అనుకూలపరిస్థితులుకూడా అందులో సూచించబడ్డాయి. అందువల్ల తత్వశాస్త్రంలోని ఏవిధానము ఏ మూలసిద్ధాంతాలుగల దైనప్పటికీ, యోగవిధానాన్ని అనుసరించవచ్చును. ఆఖరుకు నిరీశ్వర వాదులైన సాంఖ్యయోగానుచరులుకూడా, ఈయోగవిధానాన్ని అనుష్ఠించవచ్చును. అందువల్ల పతంజలి నిర్ధరించిన సిద్ధాంతభాగాలకు ప్రాముఖ్యత అంతగా లేదు. కావలసినది ఆ విధానాన్ని ఉపయోగించుకోవడమే. * దేవునినమ్మడమనేది యిందులో ముఖ్యభాగం కాదు. కాని, ఒకానొక దేవునిరూపాన్ని నమ్మి, అతనిపట్ల భక్తిచూపడంవల్ల మనసును కేంద్రీకరించడం సులభసాధ్యమవుతుందనీ, ఆవిధంగా ప్రయోజనాన్ని పొందవచ్చుననీ సూచింపబడింది.

యోగంలోని ఆ తరువాతిదశలు, ఒకరకమైన సహజజ్ఞానసంజనితమైన అంతర్దృష్టికి లేక ఒకపరవశస్థితికీ (దీనినే గూఢమతవాదులు చెబుతూంటారు) తీసుకుపోతాయని విశ్వసింపబడుతున్నది. ఇది ఇంకాముందరి విజ్ఞానానికి ద్వారాలనుతెరచే ఒకరకమైన ఉన్నతమానసికస్థితియో, లేక ఒకరకమైన స్వకీయయోగనిద్రో నాకు తెలియదు. ఒకవేళ మొదటిదే సంభవమైతే, రెండవదికూడా తప్పకుండా సంభవిస్తుంది. అంతేగాక, యీ యోగానుష్ఠానం విచ్చలవిడిగా జరిగితే, అది మనసుకుసంబంధించినంతలో అనేకదుష్పరిణామాలకు కారణమవుతుందని మనకు తెలుసు.

కాని, యీ 'ధ్యానం, భక్తి' చివరిదశకుచేరకముందే శారీరక, మానసిక క్రమశిక్షణలను అలవరచుకోవాలి. శరీరం తగినట్లుగా, ఆరోగ్యవంతంగా, ఠీవిగా, చురుకుగా, దృఢంగా, బలంగా వుండాలి. శరీరాన్ని స్వాధీనంచేసుకునేందుకు కొన్ని శారీరకప్రయోగాలు నిర్ణయింపబడ్డాయి. సాధారణంగా ఊపిరిని గాఢంగా, దీర్ఘంగా పీల్చుకోవాలని సూచించబడింది. శరీరాన్ని కష్టపెట్టవలసిన అవసరంలేదు.

* బౌద్ధం యోగశిక్షణలో అనేకరూపాలు పెంపొందించుకున్నది. వాటిలో కొన్ని యోగవిధానాన్ని పోలివుంటాయి, కొన్ని భిన్నంగా ఉంటాయి.

గనుక వీటిని 'ప్రయోగాలు' అనరాదనుకుంటాను. అవి కొన్ని శరీర రీతులుమాత్రమే. వాటినే 'ఆసనా' లంటారు. అవి సరిగాచేయబడితే, శరీరాన్ని హాయిగా, బలంగా తయారుచేస్తాయి. అవి శరీరాన్ని ఆయాసపెట్టవు. సామాన్యంగా అనుసరించబడే శారీరకపరిశ్రమలు (జెర్క్, హాస్, జంప్ మొదలైనవి) మనిషి వగర్చేటట్లూ, అలసిపోయేటట్లూ చేస్తాయి. కాని, యీ పురాతన భారతీయవిధానాలు (ఆసనాలు) అలాటివి కలిగించకుండానే శరీరాన్ని సౌష్టవపరుస్తాయి. కుస్తీ, ఈత, స్వారి, కత్తియుద్ధం, సాము, గదాయుద్ధం మొదలగు యితరవిధానాలు,ఆటలు, ఇండియాలోకూడా అనుసరింపబడుతున్నవే. కాని, పురాతన ఆసనవిధానం ఇండియాలోనేగల ప్రత్యేకవ్యాయామమనీ, అది మనతత్త్వశాస్త్రానికి తగియున్నదనీ గుర్తించాలి. ఆసనాలు వేసేటపుడుకూడా శరీరంలో ఒకరకమైన ఠీవి, స్వచ్ఛందప్రశాంతతా వుంటాయి. మనసుకు శ్రమలేకుండా, శక్తి దుర్వ్యయంకాకుండా; బలమూ, సౌష్టవమూ పొందవచ్చు. అందువల్ల, ఏ వయసువారైనా వీటిని అనుసరింపవచ్చును. ప్రత్యేకంగా వృద్ధులకుతగినఆసనాలుకూడా వున్నాయి.

ఈ ఆసనాలలో అనేకరకాలున్నాయి. అనేకసంవత్సరాలుగా నేను అవకాశందొరికినపుడు కొన్నిసరళమైనఆసనాలు వేస్తున్నాను. మనసుకూ, శరీరానికీ అయోగ్యంగావుండే అనేకరకాల వాతావరణాలలో, అట్టిపరిస్థితులమధ్య తరచుగానివసించే నేను, ఈ ఆసనాలవల్ల ఎంతోలాభంపొందాననిఅనుకుంటున్నాను. యోగవిధానంలోగలకొన్ని ఉచ్ఛ్వాస, నిశ్వాస నియమాలనుకూడా నేను అలవరచుకున్నాను. నేను శరీరానికి సంబంధించిన ప్రాథమికాభ్యాసాలను దాటిపోలేను. నా మనసుమాత్రం ఇదుకులోబడని చిలిపి పిల్లకాయలా వుంది. అది అతి తరచుగా క్రమశిక్షణను ఉల్లంఘిస్తూ వుంటుంది. శరీరక్రమశిక్షణలో ఆహార, పానీయాలు తగినవే స్వీకరించడం, తగనివి వర్జించడం కూడా వుంటుంది. ఈ శరీరశిక్షణతోపాటు, యోగం వర్ణించిన నీతిభాగంకూడా అనుసరించబడాలి. ఆ నీతులు తృప్తి, అహింస, సత్యపాలనలు. అహింసఅనేది శారీరకహింసను విడనాడడంమాత్రమే కాదు, దురాలోచనను, ద్వేషాన్నికూడా వర్జించాలి.

ఇవన్నీ ఆచరిస్తే, జ్ఞానశక్తులను అదుపులో పెట్టుకోవచ్చునంటారు. తరువాతిదశ భక్తిధ్యానములు. చివరిదశ ఏకాగ్రత. అది అనేకరకాల రాజజ్ఞానశక్తులను కలిగించుతుంది.

యోగ, వేదాంతవిధానాలను స్పష్టంగా ప్రబోధించిన ఆధునికులలో శ్రేష్ఠుడగు వివేకానందుడు యోగపరిశోధనాగుణాన్ని, దాన్ని హేతుబద్ధంచేయడాన్నీ గట్టిగా చెప్పాడు—"యోగవిధానాలలో ఏదీ కూడా హేతువాదాన్ని వదలదు. ఏదీ నిన్ను మోసగించి, నీ హేతుబుద్ధిని ఏరకపుపూజారులచేతుల్లోనూ పెట్టివేయదు.....ప్రతియోగవిధానమూ, నీవు నీహేతుబుద్ధిని వదలవద్దనీ, దాన్నే అంటిపెట్టుకునివుండమనీ చెబుతుంది". యోగ, వేదాంతాల ఆంతర్యాలు విజ్ఞానశాస్త్రపు ఆంతర్యాన్ని పోలినవే అయినప్పటికీ, అవి విభిన్నసాధనల నవలంబిస్తాయనేమాట నిజం. అందువల్లనే వీటిమధ్య ముఖ్యమైన భేదాలు ఏర్పడ్డాయి. యోగవిధానంప్రకారం – "ఆంతర్యం తెలివితేటలకుమాత్రమే పరిమితంకాదు. భావనయే క్రియ. అసలు క్రియలేనిదే భావనకు విలువే లేదు." ఉత్తేజమూ, సహజజ్ఞానమూ ఆమోదింపబడ్డాయి. కాని, అవి మోసానికిదారితీయవా? దీనికిసమాధానంగా వివేకానందుడు "ఉత్తేజం హేతుబుద్ధిని వ్యతిరేకించరాదు......మనం ఉత్తేజం అనేది హేతుబుద్ధియొక్క పురోగమనస్థాయియే. సహజజ్ఞానానికి చేయకునేత్రోవ కూడా హేతుబుద్ధియే......వాస్తవమైన ఉత్తేజంఏదీకూడా హేతుబుద్ధిని వ్యతిరేకించదు. అలాచేస్తే, అది ఉత్తేజం కానేకాదు...ఉత్తేజం ప్రతిఒక్కరి మేలుకొరకు వుపయోగపడాలి. అది పేరుకో, కీర్తికో, స్వలాభానికో ఉపయోగపడరాదు. అది ఎల్లప్పుడూ నిస్వార్థమై ప్రపంచపుమేలుకే వినియోగపడాలి" అన్నాడు.

మరొకవిధంగా—"అనుభవంనుంచిమాత్రమే విజ్ఞానం జనిస్తుంది. విజ్ఞానశాస్త్రాలకూ, భౌతికవిజ్ఞానంకొరకూ మనంవుపయోగించే పరిశోధనావిధానాలనే మతానికిగూడా అన్వయించాలి."అటువంటి పరిశోధనవల్ల ఏమతమైనా ధ్వంసమయిపోతే, అది అయోగ్య నిరుపయోగ, మూఢవిశ్వాసంతప్ప మరేమీకాదు. అట్టిది ఎంతతొందరగా అదృశ్యమైపోతే అంత మంచిది....తాము హేతుబుద్ధియొక్క దృక్పథానికి లోబడవలసినఅవసరంలేదనే ప్రత్యేకహక్కును మతాలు ఎందుకుచాటు

కుంటారో ఎవరికీ అర్థంకాదు...ఏ మహానుభావుడో చెప్పాడని రెండుకోట్ల దేవుళ్ళను గుడ్డిగానమ్మకం కంటే, హేతుబుద్ధిననుసరిస్తూ మానవాళి మొత్తంగా నాస్తికులైపోవడమే మంచిది......బహుశా సాఃన్యజ్ఞానశక్తుల నధిగమించి, ఈ లోకానికావలనున్నదాన్ని సూక్ష్మంగా చూడగలిగిన ప్రవక్తలున్నారేమో! మనంకూడా అలాచేయగలిగినపుడే దీన్ని నమ్ముదాం, అంతకుముందు నమ్మవద్దు." హేతుబుద్ధి దృఢమైనది కాదనీ, అది తరచుగా పొరపాటుపడుతూంటుందనీ అంటారు. హేతుబుద్ధియే బలహీనమైనదైతే, ఒక్కమతాచారులసంఘమే అంతకంటె గొప్పమార్గబోధకులని ఎందుకనుకోవాలి? "నేను నా హేతుబుద్ధికే కట్టుబడివుంటాను. దానికి అనేకబలహీనతలున్నప్పటికీ, దాని ద్వారామాత్రమే సత్యాన్నిచేరుకొనేఅవకాశం వుంది...అందువల్ల, మనం హేతుబుద్ధినిమాత్రమే అనుసరించాలి. హేతుబుద్ధిననుసరించి కూడా ఏరకమైనవిశ్వాసానికీ చేరలేకపోయినవాళ్ళను మనం సానుభూతితో చూడాలి...ఈ రాజయోగాన్ని అధ్యయనంచేయడంలో, ఏ మతమూ, ఏ విశ్వాసమూకూడా అవసరంలేదు. నీఅంతటనీవు తెలుసుకునేవరకూ దేన్నీ విశ్వసించవద్దు." అంటాడు వివేకానందుడు.

వివేకానందుడు ఎడతెగకుండా 'హేతుబుద్ధి'ని నొక్కిచెప్పడం, దేనినైనా నమ్మకంతోనే స్వీకరించడానికి నిరాకరించడం ఎందువల్ల? ఆయనకు, మేధస్సు సర్వస్వతంత్రమైనదనేవిశ్వాసం మరీ ఎక్కువగా వుండడమూ, తన దేశంలోనే 'అధికారం' చేయగలిగిన చెడుగులను చూడడమూ దీనికి కారణం. "అధికారాన్ని చివరి అంతస్తువరకు తీసుకుపోయిన యీ దేశంలో నేనుపుట్టినందున ..." 'పురాతన యోగ విధానాలనూ, వేదాంతాన్ని యీ హేతుబుద్ధివిహితంగా ఆయన వాఖ్యానించాడు. అలా వ్యాఖ్యానించే అధికారం ఆయనకు ఉంది. కాని, ఎంతక్షుణ్ణమైనపరిశోధన, హేతుబుద్ధులు వాటివెనుక ఉన్నప్పటికీ, అవి సామాన్యుని అందుబాటులోలేని, అర్థంకానిప్రాంతాలతో వ్యవహరిస్తాయి. మనకు తెలిసిన, మనకుఅలవాటైన యీప్రపంచానుభవాలకు పూర్తిగా భిన్నమైనటువంటి మానసిక, ఆత్మైకప్రపంచానికే సంబంధించినవిశేషాలు వాటిలో వున్నాయి. ఆ పరిశోధనలూ, అనుభవాలూ ఇంద్రియాలకుమాత్రమే పరిమితంకాలేదు. వాటిచిహ్నాలు

క్రై) స్తవగూఢమతవాదులలోనూ, పారసీక సూఫీమతవాదులలోనూ, మరికొందరిలోనూ కూడా వున్నాయి. ఈ అనుభవాలు ఒకదానికొకటి ఎంతపోలివుంటాయో ఆశ్చర్యకరం. రోమారోలా యీవిశేషాన్ని యిలావర్ణించాడు: "ఈ పోలికలు, మతఅనుభవాలలోని యథార్థాలు, ఎడతెగకుండా సంభవించడాన్ని సర్వసమానతను రుజువుచేస్తాయి. జాతి, కాలం అనే విభిన్న వేషాలు ధరించినప్పటికీ వాటిలోవుండే దగ్గరిపోలికలు మానవాత్మలోని నిరంతరఏకత్వాన్ని ధృవపరుస్తాయి; (అవి ఆత్మకంటేకూడా లోతుకువెడతాయి. ఆత్మ తనలోనికే తాను త్రవ్వకోనవలసినట్టిది) మానవాళిని నిర్మించేవస్తువులను గుర్తింపజేస్తాయి."

అందువల్ల యోగం పరిశోధకవిధానం. అది వ్యక్తియొక్క ఆత్మ సంబంధమైన విశేషానికి వెనుకగల పరిస్థితినికూడా పరిశీలిస్తుంది. ఆ విధంగా మనసుయొక్క అదుపునూ, కొన్ని భావనలనూ యేర్పరుస్తుంది. ఆధునికమన స్తత్వశాస్త్రం దీన్ని ఎంతవరకూ ప్రయోజనకరంగా ఉపయోగించుకోగలదో నాకు తెలియదు. కాని, అలాంటిప్రయత్నం చేయదగ్గ విలువైనదని నా నమ్మకం. యోగాన్ని అరవిందఘోష్ యిలా వర్ణించాడు: "రాజయోగమంతా ఆధారపడే భావన, అనుభవం యిది: మనఆంతరంగిక జ్ఞాపకశక్తులు, వానికలయికలు, కార్యక్రమాలు, జీవశక్తులు వేర్వేరుచేయబడగలవు. మళ్ళీ కొత్తరకంగా మేళవింపబడి, అంతకుముందు సాధ్యంకానిపనులు సాధించేందుకుగాని, కొత్తరకపు పనులు సాధించేందుకుగాని, ప్రయోగింపబడగలవు; లేదా ఒకేఅంతర్గత పరిణామంతో మరోరూపానికి మార్చబడి, ఒక కొత్త సంయోగంగా రూపొదించబడగలవు."

తత్వశాస్త్రంలోనిమరొకవిధానం మీమాంస. ఇది ఆచారకర్మ కాండలకుసంబంధించివుండే, అనేకదేవుళ్ళనారాధనేవాదానికి దారితీస్తుంది. ఆధునికప్రజలహిందూమతము, హిందూన్యాయశాస్త్రముచాలవరకు యీమీమాంసవల్లనే రూపొందించబడ్డాయి. దీనిధర్మాలు కూడా, పైవానియేర్పాటులో ముఖ్యపాత్రవహించాయి. హిందువులలో గల అనేకదేవుళ్ళనారాధనేవాదం చాలా విచిత్రమైంది. దేవతలకు అనేక ప్రత్యేకశక్తులున్నప్పటికీ వారు సృష్టిక్రమంలో మానవునికంటె తక్కువస్థాయిగలవారుగా భావించబడుతుంది. జీవాత్మ హీనస్థితినుండి,

అత్యుచ్ఛస్థితికి చేరుకునే జన్మపరంపరలలో మానవజన్మయే ఉత్తమజన్మ యని హిందూమతమూ, బౌద్ధమూకూడా విశ్వసిస్తాయి. దేవతలు కూడా యీ మానవజన్మవల్లనే అట్టిస్వేచ్ఛను, గుర్తింపును పొందగలుగుతారు. ఈ భావం సామాన్యంగా విశ్వసించే అనేకదేవుళ్ళున్నారనేవాదనకు చాలాభిన్నమైంది. బౌద్ధులు మానవుడుమాత్రమే అత్యున్నతబుద్ధత్వసిద్ధిని పొందగలడంటారు.

చివరివిధానం వేదాంతం. ఇది ఉపనిషత్తులలోపుట్టి అనేకరకాలుగా, అనేకరూపాలుగా పెంపొందింది. ఇది ప్రపంచం బహురూపాలుగల ఒకేఒకపదార్థం అనేతత్వంమీద ఆధారపడివుంటుంది. సాంఖ్యంలోని ప్రకృతి, పురుషులు వేర్వేరుపదార్థాలు కావనీ, ఒకేవాస్తవం(పరిపూర్ణత)యొక్క రెండుభిన్నరూపాలనీ వేదాంతవాదన. తొలివేదాంతం పునాదులమీద శంకరాచార్యుడు అద్వైతం నిర్మించాడు. నేటిహిందూమతంలో యీ దృక్పథమే ఎక్కువగా అవలంబించబడుతోంది.

ఈ సిద్ధాంతంప్రకారం 'చివరిసత్యం' అంటే తాత్వికదృష్టిలో ఆత్మయే (పరిపూర్ణాత్మ) కనుక ఇది 'సర్వందేవమయం, దేవుడేసర్వం' అనే వాదనను పునాదిగాచేసుకుంటుంది. అదేకర్త, (అంతఃకరణ), మిగిలినదంతాకర్మ (బాహ్యమైనది). మన మనసులు పరిమితమైనప్రపంచం చేత బంధింపబడివున్నాయి. అందువల్ల పరిపూర్ణాత్మ ప్రతిదానిలోనూ ఎలావుంటోంది? ఒకటే అనేకంగా ఎలాకనిపిస్తోంది? అలాకనిపిస్తూకూడా తనపరిపూర్ణతను యెలానిలుపుకోగలుగుతోంది? పరిపూర్ణాత్మ విభజింపబడనిదీ విభజింపలేనిదిగదా – అనేప్రశ్నలకు హేతువాదం ప్రకారం సమాధానం దొరకదు. ఉపనిషత్తులు యీ ఆత్మను యిలా వర్ణించాయి, (దీన్నివర్ణనఅనవచ్చునో, లేదో): "పరిపూర్ణత అది, పరిపూర్ణత యిదీ కూడాను: పరిపూర్ణతనుంచే పరిపూర్ణత జనిస్తుంది; పరిపూర్ణతనుంచి పరిపూర్ణతను తీసివేసినప్పటికీ పరిపూర్ణతయే మిగులుతుంది."

శంకరాచార్యుడు విజ్ఞానాన్నిగురించి ఒకక్లిష్టమైన, చమత్కారమైనసిద్ధాంతాన్ని నిర్మించాడు. కొన్నివిశ్వాసాలనుంచిబయలుదేరి, హేతుబద్ధమైనవాదనతో ఒక్కొక్కఅడుగేముందుకువేస్తూ, అద్వైతపుపూర్ణవిధానంవరకూ తీసుకెళ్ళాడు. వ్యక్తిఆత్మ ఒకప్రత్యేకవస్తువు కాదు.

కొన్ని గుణాలు పరిమితంగావున్నప్పటికీ అది పరిపూర్ణాత్మయే. పరిపూర్ణాత్మ ప్రపంచమంతటాగల "ప్రదేశం" అయితే, వ్యక్తిఆత్మ ఒకజాడీలోగల 'ప్రదేశం' అనుకుంటే యీవాదన సరిపోతుంది. దైనందినఆచరణకోసం వాటిని భిన్నమైనప్రత్యేకతలు గలవిగా పేర్కొనవచ్చు. అయితే, యీ ప్రత్యేకతలు పైకికనిపించేవేగాని, వాస్తవాలు కాదు. వ్యక్తికి ప్రపంచంతో ఏకత్వం, పరిపూర్ణాత్మతో సమైక్యత వున్నదని గుర్తించడంలోనే స్వేచ్ఛ వుంది.

మనకు పైకికనిపిస్తున్నయీప్రపంచం యీసిద్ధాంతంప్రకారం ఒక వాస్తవానికి ప్రతిబింబంమాత్రమే అవుతుంది. అనగా వాస్తవం ఊహాజనితమైనప్రదేశంమీద ప్రసరింపజేసిన ఛాయాచిత్రమే యీ కనుపించే ప్రపంచం. దీనినే మాయ అన్నారు. (భ్రమఅనడం న్యాయంకాదు.) కాని, అది శూన్యం కాదు. ఉనికికీ, శూన్యానికీమధ్యగలరూపం. అదొకరకమైన సాపేక్షపుఉనికి. అందువల్ల యీ 'సాపేక్షత' మనల్ని 'మాయ' యొక్క అర్థానికి దగ్గరగా తీసుకుపోతుందనుకుంటాను. ఈ వాదంప్రకారం ఇక ప్రపంచంలో మంచి ఏది, చెడు ఏది? అవికూడా ఘన పదార్థంలేని ఛాయలూ, ప్రతిబింబాలూమాత్రమేనా? అంతిమపరిశీలనా నిర్ణయం ఎటువంటిదైనప్పటికీ మన ఈ గోచరప్రపంచంలో యీ నైతిక ప్రత్యేకతలకు ప్రాముఖ్యతా, చెల్లుబడీ వున్నాయి. వ్యక్తులు పరస్పర సంబంధీకులుగా బ్రతికినంతకాలమూ అవికూడా (మంచిచెడ్డలు) సంబంధం, సమంజసం గలవే.

పరిమితంచేయబడిన ఈ వ్యక్తులు, అపరిమితమైనదాన్ని ఊహించుకోలేరు. వారు పరిమితమైన, దానిబాహ్యరూపాన్ని మాత్రమే వూహించుకోగలరు. అయినప్పటికీ, యీ పరిమితరూపాలూ, భావనలుకూడా చివరికి అపరిమిత, పరిపూర్ణతలలోనే ఉండిపోతాయి. అందువల్ల మత స్వరూపం ఒకసాపేక్ష విశేషం మాత్రమే అవుతుంది ప్రతివ్యక్తి తనకు చేతనైనట్టి భావాలను యేర్పరచుకునేందుకు స్వతంత్రుడైఉంటాడు.

బ్రాహ్మణీయం వ్యవస్థీకరించిన కులప్రధానమైనసాంఘికజీవితాన్ని జాతియొక్క విజ్ఞానానికి, అనుభవరాశికి ప్రాతినిధ్యంవహించేయేర్పాటుగా శంకరాచార్యులు అంగీకరించాడు. కాని ఏ కులానికిచెందిన వ్యక్తియైనా ఉత్తమవిజ్ఞానాన్ని పొందగలడని వాదించాడు.

శంకరాచార్యుని దృక్పథంలోనూ, తత్వశాస్త్రంలోనూ ఒకరకమైన నిస్సంగత్వం ఉంది. ప్రపంచసాధారణకార్యకలాపాలనుంచి తనను తానుతప్పించుకుని, ప్రతివ్యక్తి చేరవలసిన అంతిమలక్ష్యాన్ని, ఆత్మస్వతంత్రతను అన్వేషించాలని ఆయనప్రబోధం. ఆత్మత్యాగమూ, నిర్మోహమూ అలవరచుకోవాలని పదేపదే ఉద్ఘాటించాడు.

ఏమైనప్పటికీ శంకరుడు ఆశ్చర్యకరమైన శక్తి, విశాలమైనసంచలనమూగల వ్యక్తి. అంతర్ముఖుడై, ఏ మారుమూలలఅరణ్యానికో పోయి, తన స్వీయపరిపూర్ణతకోసం అన్వేషిస్తూ, ఇతరులందరికీ ఏమిసంభవిస్తున్నదో పట్టించుకోని – 'తప్పించుకుతిరిగే' – మన స్తత్వంగలవాడుకాడు. దక్షిణభారతంలో ఆమూలనున్న మలబారులోపుట్టి, భారతదేశమంతటా నిరంతరంగా సంచరించాడు. లెక్కలేనంతమందిని కలుసుకుంటూ, వాదిస్తూ, చర్చిస్తూ, హేతుబుద్ధిని ప్రవేశపెడుతూ, ఎదుటివారికినచ్చజెపుతూ, తన తీవ్రఆసక్తి, మహత్తరచైతన్యాలలో కొంతభాగాన్ని వారిలో ప్రవేశపెడుతూండేవాడు. ఆయన తనబాధ్యతలను గాఢంగా గుర్తించినవ్యక్తి. కన్యాకుమారిఅగ్రంనుంచి హిమాలయాలవరకూ తన రంగస్థలమేనని భావించినవాడు. ఆ ప్రదేశాన్నంతటినీ ఒకేశక్తి సాంస్కృతికంగా ఏకంచేసిందని భావించినవాడు. అదే భావనతో ఉత్తేజితుడైనవాడు. (ఇట్టి ఉత్తేజం అనేకరూపాలుగా బయల్పడవచ్చును.) ఆకాలపు భారతీయహృదయాన్ని కల్లోలంచేస్తున్న విరుద్ధప్రవాహాలను ఏకీకరణచేసేందుకు గట్టిగా ప్రయత్నించాడు. ఆ విభిన్నత్వాన్నుండి, ఏకదృక్పథాన్ని రూపొందించేందుకు శతధా కృషిచేశాడు. 32 యేండ్లఅల్పవయోవ్యవధిలోనే అనేక దీర్ఘజీవితాలు కలిసిచేసినంతఫలితాన్ని సాధించాడు. తనశక్తివంతమైన మేధ, మహత్తరవ్యక్తిత్వాలతో, ఆయన భారతభూమిపై వదలిపోయినముద్ర యిప్పటికీ స్పష్టంగా కనిపిస్తోంది. ఆయన తత్వవేత్త, పండితుడు, నాస్తికుడు, ఆస్తికుడు, కవి, పావనుడు, అంతకంటె ముఖ్యంగా ఆచరణశుద్ధిగల సంస్కర్త, సమర్థుడైన నిర్మాత. ఇన్నిగుణాలుకలసిన విచిత్రవ్యక్తి. ఆయన బ్రాహ్మణీయవ్యవస్థలోనే మొట్టమొదటిసారిగా పది మతబోధకసంఘాలను నిర్మించాడు. అందులో నాలుగు ఇప్పటికీ సమర్థవంతంగా సాగుతున్నాయి. ఆయన దేశం నాలుగుమూలలా నాలుగు మఠాల్నుకూడాఏర్పరిచాడు. మైసూరు

రాష్ట్రంలోని శృంగేరిలో ఒకటి, తూర్పుకోస్తాయందలిపూరీలో ఒకటి, పశ్చిమతీరాన కథియవారులోని ద్వారకలో మూడవది, హిమాలయాం తర్భాగానగల బదరీనాథ్‌లో నాలుగవది వున్నాయి. భూమధ్యరేఖా ప్రాంతపు దక్షిణభారతంలో పుట్టిన యీబ్రాహ్మణుడు, 32 వ ఏట, మంచుగడ్డతో కప్పబడియుండే హిమాలయపర్వతశిఖరాలలో కేదార నాథ్‌లో మరణించాడు.

సంచారం కష్టతరమూ,దుస్సాధ్యమూ అయినకాలంలో రవాణా అతినెమ్మదిగా నాటుసాధనాలలోజరిగేకాలంలో ఈ విశాల దేశమంతా అనేకసార్లు శంకరాచార్యుడు సంచరించడం గణనీయమైన విశేషం. ఈ యాత్రలవెనుకగలఉద్దేశ్యమూ, తనవుద్దేశ్యాలేగలవారిని ప్రతిచోటా కలుసుకుని వారితో సంస్కృతంలో సంభాషించడమూ, (ఆనాటిభారత దేశమంతటా విద్యావంతులభాష సంస్కృతమే) ఆ పూర్వకాలంలోనే భారత దేశంలోగల ఐక్యతను స్పష్టంచేస్తున్నాయి. ఆనాడుగాని, అంతకు ముందుగాని, అట్టియాత్రలు అరుదు కాదు. రాజకీయవిభేదాలున్నప్ప టికీ అనేకులు తరచుగా దేశాటనలుచేస్తూనేవుండేవారు. కొత్తగ్రంథాలు పయనించేవి. ప్రతికొత్తసిద్ధాంతమూ వేగంగా వ్యాపించి, దేశమంతటా కుతూహలకరమైన చర్చలకూ, తీవ్రవాదాలకూ కారణమయ్యేది. విద్యావంతులమధ్య సమానమైన వైజ్ఞానిక, సాంస్కృతిక జీవితం వుండ డమేగాక, సామాన్యజనంకూడా దేశమంతటాగల పురాణప్రసిద్ధమైన పుణ్యక్షేత్రతీర్థయాత్రలకై సంచారంచేస్తూఉండేవారు. ఈవిధంగా సంచ రించడం, రాకపోకలు, రకరకాలప్రజలు కలుసుకోవడం మొదలైనవాటి వల్ల, భారతీయులందరికీ ఒకేరకపుభూమీ, ఒకేరకపుసంస్కృతీ వున్న వని ప్రజలు బాగా గ్రహించేవీలు కలిగిందనుకుంటాను. ఇలా యాత్రలు చేసేవారిలో అగ్రకులాలవారే కాదు, అన్నికులాల, వర్గాల స్త్రీ, పురు షులూ వుండేవారు. ప్రజలదృష్టిలో యీయాత్రలనుగురించిన మత ప్రాముఖ్యత ఎటువంటిదైనప్పటికీ, వారు నేటివలె యీ యాత్రలను శెలవులనుగడపడంగా, ఆనందాన్నిపొందడంగా, దేశంలోని వివిధభాగా లనూ చూడడంగా కూడా భావించేవారవవచ్చును. ప్రతియాత్రాస్థలం లోనూ ఇండియాలోవుండే వివిధ ఆచారాల, దుస్తుల, భాషల ప్రతి నిధులూ, అన్నివర్గాల ప్రతినిధులూ నివసించేవారు. అయినప్పటికీ

తామందరూ ఒకేచోట కలుసుకొనేటట్లుచేసిన ఏకసూత్ర బాంధవ్యాలనూ, తమరూపాలలోని దగ్గరిపోలికలనూ సదా గుర్తుంచుకుని, ఐక్యభావుకులుగా మెలగేవారు. ఇట్టిపరస్పరబాంధవ్యానికి ఉత్తర, దక్షిణ భాషలతేడాలుకూడా అడ్డంకులుకాలేదు.

ఇవన్నీ అప్పుడుండేవి. ఈసంగతి శంకరునికి తెలుసుననడంలో సందేహంలేదు. ఈ జాతీయఏకత్వానికి, సారూప్యభావనకు మరింత బలంచేకూరుద్దామని ఆయన భావించివుంటాడు. ఆయన జ్ఞాన, తత్వ, మతరంగాలలో కృషిచేసి, దేశమంతటా మరింత భావనైక్యతను పెంపొందించప్రయత్నించాడు. ఆయన సామాన్యప్రజారంగంలోకూడా అనేకవిధాల కృషిచేశాడు. అనేకమూఢనమ్మకాలను విచ్ఛిన్నంచేసి, తన తత్వశాస్త్రాశ్రయపు ద్వారాలను ప్రవేశించేశక్తిగలవారందరికీ తెరచివుంచాడు. తనమఠాలను దేశం నలువేపులా వుంచడంద్వారా, సాంస్కృతికంగా భారతీయైక్యతను బలపరచేభావనను సృష్టించదలచివుంటాడు. అంతకుముందుకూడా దేశస్థులందరికీ ముఖ్య యాత్రాస్థలాలుగా ఉన్న, యీ నాలుగుక్షేత్రాలూ శంకరునిమఠాలవల్ల మరింత ప్రాముఖ్యతను పొందాయి.

పురాతనభారతీయులు తమ పుణ్యయాత్రాస్థలాలను ఎంత చక్కగా యెన్నుకున్నారు! అవన్నీ చాలావరకు సుందరప్రకృతిమధ్య వున్నాయి. కాశ్మీర్‌లోని అమరనాథ్ ఒక మంచుగుహవంటిది. కన్యాకుమారి అగ్రానికి సమీపానగల రామేశ్వరంలోని కన్యకాపరమేశ్వరీ దేవాలయం దక్షిణాగ్రాన వుంది. వారణాసి, హరిద్వారం, గంగానది మిట్టపల్లాల పర్వతసానువుల్లోనుంచి మైదానప్రాంతానికి దూకేచోట వున్నాయి. గంగ యమునతో కలసేచోట ప్రయాగ (అలహాబాదు) వుంది. యమునాతీరంలోని మధుర, బృందావనము శ్రీకృష్ణలీలా గాథలతో నిండినప్రదేశాలు. బుద్ధుడు తన జ్ఞానోత్తేజాన్ని పొందినచోటే బుద్ధగయ. ఇంకా దక్షిణాన యిట్టివే అనేకం. అక్కడి పురాతనదేవాలయాలు శిల్పసౌందర్యమునకుకాణాచులు, సుప్రసిద్ధాలు. ఈ పుణ్యస్థలాలన్నింటినీ సందర్శించడంవల్ల భారతీయకళలయొక్క వివిధరూప, విశిష్టతలు అవగాహనకాగలవు.

బౌద్ధం వ్యాప్తిగల మతంగా ఇండియాలో లేకుండాచేసింది శంకరుడే నంటారు. తరువాత, బ్రాహ్మణీయం దాన్ని తనలో యిమిడ్చి వేసుకుంది. కాని, శంకరునికిపూర్వమే బౌద్ధం దిగజారిపోయింది. శంకరు విరోధు లైన బ్రాహ్మణులు కొందరు, ఆయన మారువేషంలోవున్న బౌద్ధుడు అనేవారు. బౌద్ధమతం ఆయనమీద అనన్యమైన ప్రభావాన్ని ప్రసారించిన దనేమాట యథార్థం.

## ౧౫ ఇం డి యా - చై నా

బౌద్ధమతమువల్లనే చైనా, భారత దేశాలు సన్నిహితమై, అనేకసంబంధాల నేర్పరచుకున్నాయి. అశోకునికిపూర్వం అట్టిసంబంధాలున్నవో లేవో మనకు తెలియదు. ఆరోజుల్లోకూడా చైనానుంచి సిల్కువచ్చేది గనుక, సముద్రవ్యాపారం ఉండివుంటుంది. అంతేగాక, అంతకుముందు యుగాలలోకూడ భూమార్గమూ, ప్రజలవలసలూ వుండిఉండాలి. ఎందువల్లనంటే, ఈశాన్యభారతసరిహద్దులలో కొందరు ప్రజలలో మంగోలియా శారీరకలక్షణాలు యిప్పటికీ కనుపిస్తాయి. నేపాలులో యివి మరీ స్పష్టంగా వుంటాయి. అస్సాము (పూర్వపు కామరూప దేశము) బెంగాలులలోకూడ యివి ద్యోతకమవుతాయి. ఏమైనా, చారిత్రకంగా చెప్పాలంటే, అశోకుడుపంపిన బౌద్ధయాత్రికులే చైనాకుమార్గమేర్పరిచారనాలి. వారివల్ల చైనాలో బౌద్ధమతం వ్యాపించింది. తరువాత వేయిసంవత్సరాలవరకూ ఈ రెండు దేశాలమధ్య బౌద్ధులరాకపోకలు తరచుగా జరిగాయి. వారు, గోబీయెడారిగుండా మధ్య ఆసియాలోని మైదానాలు, కొండలగుండా, ఎత్తైన హిమాలయాలగుండా దూరమూ ప్రమాదభరితమూ నగు దారిని ప్రయాణాలుచేశారు. ప్రయాణమార్గంలోనే అనేకులు చనిపోయేవారు. నూటికి 90 మంది యిలా చనిపోయారని, ఒకచోట వ్రాయబడింది. ప్రయాణం కొనసాగించి, గమ్యస్థానాన్ని చేరినవారిలోకూడా అనేకమంది తిరిగి స్వదేశానికి పోకుండా, చేరిన దేశాన్నే మాతృదేశంగా యెంచి అక్కడే వుండిపోయారు. మరొక దగ్గరదారికూడా వుందిగాని, అది యింతకంటె సురక్షితమైనదికాదు. అది ఇండోచీనా, జావా, సుమత్రా, మలయా, నికోబర్ దీవులమీదుగా పోయే సముద్రమార్గం. దీన్నికూడా తరచుగా ఉపయోగించేవారు,

కొందరు వచ్చేటప్పుడు భూమార్గాన్నీ పోయేటప్పుడు సముద్రమార్గాన్నీ వాడుకునేవారు. బౌద్ధమూ, భారతీయసంస్కృతీ మధ్యఆసియా అంతటనూ, ఇండోనీషియాలో కొన్నిప్రాంతాల్లోనూ విరివిగా వ్యాపించింది. ఈ విశాలప్రాంతాలన్నిటా అనేక బౌద్ధారామములుగా, అధ్యయనకేంద్రాలూ వున్నాయి. అందువల్ల భారత చైనాయాత్రికులకు భూ, జలమార్గాలలో ఏ ప్రాంతానఅయినా, ఈ ఆరామాలలో స్వాగతాతిథ్యాలు లభించేవి. ఒక్కొకసారి చైనాపండితులు ఇండోనీషియాలోని భారతీయవలసప్రదేశాలలో ఒకచోట కొన్నినెలలు ఆగి, సంస్కృతం నేర్చుకుని, తర్వాత ఇండియాకు వచ్చేవారు.

చారిత్రకాధారాలనుబట్టి మొట్టమొదట చైనా వెళ్ళిన భారతీయ పండితుడు కశ్యపమతంగుడు. 'మింగ్‌టీ' చక్రవర్తిపాలనాకాలంలో – బహుశా ఆయన ఆహ్వానంమీదనే – క్రీ. శ 67 లో అతడు చైనాచేరుకున్నాడు. ఆయన లో నదీతీరానగల 'లోయాంగ్'లో స్థిరనివాసమేర్పరుచుకున్నాడు. ఆయనవెంట ధర్మరక్షకుడను నతడుకూడ వెళ్ళాడు. తరువాత చైనాకు వెళ్ళిన ప్రఖ్యాతపండితులలో బుద్ధభద్ర, జినభద్ర, కుమారజీవ, పరమార్థ, జినగుప్త, బోధిధర్మ అనేవారున్నారు. ఇందులో ప్రతిఒక్కరూ తమవెంట తమఆశ్రమవాసులను (సన్యాసులు, శిష్యులు) కూడ తీసుకువెళ్ళారు. క్రీ. శ. 6 వ శతాబ్దంలో 3 వేలమంది బౌద్ధసన్యాసులూ, 10 వేల భారతీయకుటుంబాలూ ఒక్క లోయాంగ్ రాష్ట్రంలోనే వుండేవారట.

ఇలా చైనా వెళ్ళిన భారతీయపండితులు తమవెంట సంస్కృతగ్రంథవ్రాతప్రతులను తీసుకువెళ్ళేవారు. వాటిని చైనాభాషలోనికి అనువదించడమేగాక, కొందరు చైనాభాషలో స్వయంగా గ్రంథాలువ్రాశారు. వారు చైనాసారస్వతానికి, కవిత్వానికీ ఎంతోపుష్టిని చేకూర్చారు. క్రీ. శ. 401 లో చైనా వెళ్ళిన కుమారజీవుడు బహుగ్రంథరచయిత. ఆయన వ్రాసినవాటిలో 47 గ్రంథాలు మనకు లభించాయి. ఆయన చైనాభాషశైలి చాలాబాగుంటుందట. ఆయన ప్రసిద్ధభారతీయవిజ్ఞానియగు నాగార్జునునిజీవితచరిత్రను చైనాభాషలోని కనువదించాడు. జినగుప్తుడు క్రీ. శ. ఆరవశతాబ్ది ఉత్తరార్థంలో చైనా వెళ్ళాడు. అతడు 37 సంస్కృతగ్రంథాలను చైనాభాషలోని కనువదించాడు. ఆయన

జ్ఞానసంపదకు ముగ్ధుడై టాంగ్‌వంశీయుడైన ఒక చక్రవర్తి ఆయనకు శిష్యుడైనాడు.

చైనా, భారతదేశాలమధ్య యిరువైపులవారి రాకపోకలూ ఉండేవి. అనేకమంది చైనాపండితులుగూడా మనదేశానికి వచ్చారు. తమ యాత్రలకుసంబంధించిన వివరణాపత్రాలను వదలినవారిలో ఫాహియాన్, సుంగ్ యున్, హుయాన్‌సాంగ్, యీసింగ్ ముఖ్యులు. ఫాహియాన్ 5 వ శతాబ్దంలో వచ్చాడు. ఆయన చైనాలోనే కుమారజీవునిశిష్యుడైనాడు. అతడు ఇండియాకు బైలుదేరేముందు గురువుగారివద్ద శెలవుతీసుకోవడానికి వెళ్ళాడు. కుమారజీవుడు అతనితో - ఎప్పుడూ మతవిషయికమైన జ్ఞానసముపార్జనకే ప్రయత్నించవద్దనీ, భారతప్రజలజీవితాన్నీ, అలవాట్లనూ కొంతవరకైనా వివరంగా పరిశీలించమనీ, అందువల్ల చీనావారు భారతదేశస్వభావాన్నీ, భారతీయుల్నీ అర్థంచేసుకునేఅవకాశం కలుగనీయమనీ గట్టిగా చెప్పాడు. పాహియాన్ మన పాటలీపుత్ర విశ్వవిద్యాలయంలో అధ్యయనంచేశాడు.

చైనాయాత్రికుల్లో సుప్రసిద్ధుడు హుయాన్ సాంగ్. చైనాలో 'టాంగ్' వంశమూ, ఉత్తరభారతంలో హర్షుడూ సామ్రాజ్యాలను ప్రతిభావంతంగా పాలిస్తున్న 7 వ శతాబ్దంలో ఆయన వచ్చాడు. ఆయన భూమార్గాన, గోబీయెడారి, టుర్‌ఫాన్, కచ్చా, టామ్‌ఖండ్, సమర్‌ఖండ్, బొఖ్, ఖోటాన్, యార్‌ఖండ్‌లమీదుగా వచ్చి, హిమాలయాలను దాటాడు. తనప్రయాణంలో తా నెదుర్కొన్న కష్టాలనూ, ప్రమాదాలనూ, మధ్యఆసియాలోని బౌద్ధపాలకులనూ, బౌద్ధఆరామాలను, అచటి తురుష్కులు పక్కాబౌద్ధులుగావుండడాన్ని వర్ణిస్తూ ఒకగ్రంథంవ్రాశాడు. ఆయన ఇండియాలో ప్రతిప్రాంతాన్నీ సందర్శించాడు. వెళ్ళినచోటల్లా గౌరవమర్యాదలు పొందాడు. ఆయన చూచిన స్థలాలను ప్రజలనుగురించీ, విన్న విచిత్రకథలూ, ఊహాతీతమైన విశేషాలనూ గ్రంథస్థంచేశాడు. పాటలీపుత్రానికి సమీపానవున్న నలందా విశ్వవిద్యాలయంలో యేండ్లతరబడి గడిపాడు. నాటి 'నలందా' లో వివిధ విద్యాశాఖలు వుండేవి. అచటికి దేశంనలుమూలలనుంచీ విద్యార్థులు వచ్చేవారు. అక్కడ దాదాపు పదివేలమంది సన్యాసులూ, విద్యార్థులూ నివసించేవారట. అచట, హుయాన్‌సాంగ్ 'న్యాయశాస్త్ర

కోవిద' (ఎం. ఎల్.) పట్టం పొంది; చివరికి ఆ విశ్వవిద్యాలయానికి ఉప ప్రధానోపాధ్యాయు డయ్యాడు.

ఆయనగ్రంథం – "సి–యూ–కీ" అనగా, పశ్చిమ (ఇండియా) రాజ్యసమాచారము – చదువదగ్గ అనేక కౌతుకవిశేషాలతో నిండి వుంది. నాటికైనా ఎంతో నాగరికత, అభిజ్ఞతలు కలిగివుండేది. దాని రాజధానియగు "సీ–ఆన్–ఫూ" కళలకూ, విద్యలకు కేంద్రంగావుండేది. అట్టి వారసత్వంతో ఇండియాకు వచ్చిన హు యాన్ సాంగ్ భారతదేశ పరిస్థితులగురించీ, విశేషాలగురించీ చేసిన వర్ణనలూ, వ్యాఖ్యానాలూ అమూల్యమైనవి. వాటిలో కొన్ని మనం తెలుసుకుందాము: విద్యా విధానం అక్షరాభ్యాసంనుంచి, విశ్వవిద్యాలయాధ్యయనం వరకు అంచె లంచెలుగా ఉండేది. విశ్వవిద్యాలయాలలో (1) వ్యాకరణము (2)కళలు, వృత్తులశాస్త్రములు (3) వైద్యము (4) న్యాయశాస్త్రం (5) తత్వ శాస్త్రము అనే పాఠ్యభాగా లుండేవి. భారతప్రజలకు విద్యార్జనపట్లగల ఆసక్తికి ఆయన మురిసిపోయాడు. ఒకరకమైనప్రాథమికవిద్య చాలా వ్యాప్తిలోఉంది. బౌద్ధసన్యాసులూ, పూజారులూ గురువులుగావుండే వారు. "సామాన్యప్రజలపట్ల గౌరవభావంతోనే యిది చెబుతున్నాను. వారు సాధారణంగా మేధాసంపన్నులు కారు. అయినప్పటికీ, నీతిని తప్పక, గౌరవంగా బ్రతికేవారు. ధనంవిషయాల్లో సంపాదనాదృష్టి వుండేదికాదు. న్యాయనిర్ణయవిషయంలో సానుభూతిఉండేది...... వారి ప్రవర్తనలో మోసం, ద్రోహం ఉండవు. శపథాలు, వాగ్దానాలూ విశ్వసనీయంగా పాటించేవ్యక్తులు. వారి పాలనానియమాలలో గణనీయ మైన సత్యసంధత వుంది. వారిప్రవర్తన మృదుమధురంగా ఉంటుంది. దుష్టవర్తనులూ, తిరుగుబాటుదార్లూ చాలా తక్కువ. వారివల్ల బాధ చాలా అరుదు...ప్రభుత్వపాలనము కరుణాహృదయపు పునాదులపై నిర్మింపబడినందున – అధికారవర్గంచాలా తక్కువ...ప్రజలచే బలవం తంగా పనిచేయించేపద్ధతి లేదు ....ప్రజలమీద పన్నులు తేలిక..... వ్యాపారంచేసేవర్తకులు తమవస్తువులను యథేచ్ఛగా తీసుకురావడం, తీసుకుపోవడం జరుగుతున్నది."అని హు యాన్ సాంగ్ వర్ణించాడు.

హు యాన్ సాంగ్ తాను వచ్చినత్రోవనే(మధ్యఆసియాగుండా) తిరిగివెళ్ళాడు. వెంట అనేక వ్రాతగ్రంథాలుకూడా తీసుకెళ్ళాడు.

ఆయన రచనలనుబట్టి - ఖొరాసాన్, ఇరాక్, మొసుల్, సిరియా సరి హద్దులవరకూ బౌద్ధమత మెంతవిస్తృతంగా వ్యాపించిందో మనం తెలుసు కోవచ్చు. అయినా, అది బౌద్ధమతం క్షీణిస్తున్న కాలమనీ, అరేబియాలో తలెత్తుతున్న ఇస్లాము ఆతనివాత త్వరలోనే ఆ ప్రాంతాలన్నిటా వ్యాపించిందనీ మనం గుర్తుంచుకోవాలి. ఇరాను ప్రజలనుగురించి యీ యన కుతూహలంకలిగించే ఒకసంగతి చెప్పాడు: "వారు విద్య, పాండిత్యాలను లెఖ్ఖచేయరు. కాని, పూర్తిగా కళారూపనిర్మాణంలోనే నిమగ్నులైవుంటారు. వారుచేసేవాటికన్నింటికీ యిరుగుపొరుగు దేశాల వారు ఎంతో విలువనిస్తారు."

ఇరాన్ ఆకాలంలో (ఏకాలంలోనైనా అది అంతే) జీవితసౌందర్యాన్ని, దీనిని పెంపొందించటంలో నిమగ్నమైవుంది. దానిప్రభావం ఆసియాలో ఎక్కువగా ప్రసరించింది. గోబీఎడారిఅంచునవున్న చిన్న విచిత్ర రాజ్యం టుర్ఫాన్‌నుగురించి హుయాన్‌సాంగ్ చాలా వ్రాశాడు. ఇటీవల అక్కడ పురావస్తుశాస్త్రజ్ఞులు జరిపిన పరిశోధనలనుంచి మన మింకెంతో నేర్చుకున్నాం. అక్కడికి అనేకనాగరికతలు వ్యాపించి, మిశ్రమమై, ఐక్యమై ఒక నూతన సౌభాగ్యవంతమగు సంస్కృతిని సృష్టించాయి. ఆ సంస్కృతి ఇండియా, చైనా, పర్షియా, గ్రీసు దేశాలనుంచి ఉత్తేజాలను పొందింది. ఇండియా, ఇరానుల భాషలనుంచిపుట్టిన, అచ్చటి ఇండో-యూరోపియన్‌భాష కొన్ని కెల్టిక్ భాషలపోలికలను కూడా కలిగివుంటుంది. మతం ఇండియానుంచీ, జీవితవిధానం చైనానుంచీ, కళావస్తువులు ఇరాన్‌నుంచీ గ్రహించింది. ఎంతో అందంగా చేయబడిన బుద్ధవిగ్రహం, దేవుల, దేవతల విగ్రహాలూ, కుడ్యచిత్రాలూ తరచుగా భారతీయదుస్తులనూ, గ్రీకుశిరోభూషణాలనూ కలిగివుంటాయి. మాన్‌షూర్ గ్రాసెట్ "ఈ దేవతలశిల్పాలలో హిందూచైతన్యము, గ్రీకుదృఢత్వమూ, చైనాఆకర్షణలూ చక్కగా మిళితమైవుంటా"యని వర్ణించాడు.

హుయాన్‌సాంగ్ తిరిగి తనమాతృదేశానికి వెళ్ళగానే చక్రవర్తి, ప్రజలూ ఘనస్వాగతమిచ్చారు. ఆయనస్థిరపడినతర్వాత తనగ్రంథాన్ని (యాత్రావర్ణన), తాను ఇండియానుంచి తెచ్చిన అనేకగ్రంథాల అనువాదాలూ వ్రాయసాగాడు. అనేకసంవత్సరాలక్రితం అతడు ఇండియాకు

బయలుదేరేటప్పుడు టాంగ్‌చక్రవర్తి ఒక గమ్మత్తుచేశాడట. పానీయంలో పిడికెడుదుమ్ము కలిపి, హుయాన్‌సాంగ్‌కు యిస్తూ "నీ వీ పానీయాన్ని త్రాగడం మేలు; పదివేల పౌనుల విదేశీబంగారంకంటె పిడికెడు మాతృదేశపుమన్ను గొప్పదని మనపెద్దలు చెప్పారుగదా!" అన్నాడట.

హుయాన్‌సాంగ్ ఇండియాకురావడమూ, రెండు దేశాలలోనూ అతనికి అఖండగౌరవాలు జరగడమూ, ఆకారణంగా యీ రెండు దేశాలమధ్య రాజకీయసంబంధాలేర్పడడం జరిగింది. కనోజ్ చక్రవర్తి హర్షవర్ధనుడు చైనాకూ, టాంగ్ చక్రవర్తి ఇండియాకూ రాయబారులను పంపారు. హుయాన్‌సాంగ్ మిత్రులతో వుత్తరప్రత్యుత్తరాలు జరపడం, సంస్కృతగ్రంథాలను తెప్పించుకోవడం ద్వారా భారతదేశంతో తన సంబంధాలు కొనసాగిస్తూనే వున్నాడు. సంస్కృతంలో వ్రాయబడిన రెండుముఖ్యలేఖలను చైనాలో యిప్పటికీ భద్రంగా ఉంచారు. అందులో ఒకటి క్రీ. శ. 654 లో భారతబౌద్ధపండితుడగు స్థవిరప్రజ్ఞదేవుడు హుయాన్‌సాంగ్‌కు వ్రాసినది. నమస్కారాలు, మిత్రులూ, వారి రచనలనుగురించీ వ్రాసినతరువాత, లేఖ నిలా సాగించాడు: "మేము మరువలేదని తెలిపేందుకు రెండుశ్వేతవస్త్రాలు పంపుతున్నాము. ప్రయాణం దూరాభారంగనుక, చిన్నకానుకనే పంపుతున్నందుకు అన్యథా భావించకండి. మీరు దీన్ని స్వీకరించుతారని ఆశిస్తున్నాము. సూత్రములు, శాస్త్రములవిషయంలో మీకుకావలసినవేవో పట్టీవ్రాసి పంపండి. మేము వాటికెనకళ్ళువ్రాసి, పంపుతాము." దీనికి హుయాన్‌సాంగ్ జవాబు యిలావుంది: "ఇటీవలనే భారతదేశాన్నుంచి వచ్చిన ఒకరాయబారిద్వారా మహోపాధ్యాయుడగు శైలభద్రుడు మన కింక లేడని విన్నాను. ఈ వార్త నన్ను అపారమైనదుఃఖంలోముంచివేసింది. ...నేను (హుయాన్‌సాంగ్) నాతో తెచ్చిన సూత్రాలు, శాస్త్రాలలో 'యోగాచార్యభూమి-శాస్త్రము'ను, ఇతరములను, ఇప్పటికి మొత్తం ముప్పదిసంపుటాలను అనువదించాను. నేను సింధునదిని దాటుతున్నపుడు పవిత్రగ్రంథాల పెద్ద కట్టనొకదానిని కోల్పోయానని విన్నవించుకుంటున్నాను. నేనిప్పుడు గ్రంథములపట్టిక నొకదానిని యీలేఖకు జతపరచి పంపుకుంటున్నాను. మీకు అవకాశంవుంటే వాటిని నాకు పంప

గోరుతున్నాను. నేను కొన్ని చిన్నచిన్నవస్తువులను కానుకలుగా పంపుతున్నాను. దయచేసి స్వీకరించండి."

నలందావిశ్వవిద్యాలయాన్ని గురించి హుయాన్ సాంగ్ మన కెంతో తెలియజేశాడు. దాన్నిగురించి యితరుల రచనలుకూడా వున్నాయి. కొన్నిసంవత్సరాలక్రితం నేనక్కడికి వెళ్ళినప్పుడు భూగర్భం నుంచి త్రవ్వితీయబడిన నలందాశిథిలాలను చూచాను. ఆ శిథిలాల వైశాల్యాన్నీ, బహువిశాలంగానిర్మింపబడిన విధానాన్నీ చూచి, ఆశ్చర్యచకితుణ్ణయాను. అందులోకొంతభాగంమాత్రమేబయటికితీయబడింది. మిగతాప్రదేశాలమీద ప్రజల నివాసగృహాలు ఉండిపోయాయి. కాని, వెలికితీయబడినభాగంలోనే పెద్దపెద్దప్రాంగణాలూ, చుట్టూ రాజమందిరాలవంటి రాతికట్టడపు మహాసౌధాలూ వున్నాయి.

చైనాలో హుయాన్ సాంగ్ మరణించినవెంటనే, మరొక ప్రసిద్ధయాత్రికుడగు "యీ సింగ్" ఇండియాకు బయలుదేరాడు. క్రీ. శ. 671లో బయలుదేరి, హుగ్లీనదీముఖద్వారమందలి తామ్రలిప్తిని చేరేందుకు రెండుసంవత్సరాలు పట్టింది. ఆయన సముద్రమార్గాన వస్తూ, సంస్కృతాధ్యయనంకోసం శ్రీభోగం (సుమత్రాలోని నేటి పాలెంబాంగ్)లో అనేక నెలలు వున్నాడు. ఇతనిసముద్రయానానికి ఒక ప్రత్యేకత వుంది. బహుశా మధ్యఆసియాలో రాజకీయమైన మార్పులనేకం జరుగుతున్నందువల్ల, పరిస్థితులు కల్లోలంగావుండి, భూమార్గయానం వీలుపడి యుండకపోవచ్చును. యాత్రికులకు ఆశ్రయ, ఆతిథ్యాలిచ్చే బౌద్ధవిహారాలు మూసివేయబడివుండవచ్చును. ఇండోనీషియాలో భారతీయ వలసరాజ్యా లెక్కువైనందునా, ఇండియాకు ఆ దేశాలకు నౌకా వ్యాపారంవల్ల సంబంధాలు పెరిగినందువల్లనూ సముద్రమార్గం సుకరమైయుండవచ్చును. 'యీసింగ్' తదితరుల రచనలవల్ల, ఆకాలంలో పర్షియా (ఇరాన్), ఇండియా, మలయా, సుమత్రా, చైనాలమధ్య నౌకాయానం క్రమబద్ధంగా జరుగుతున్నట్లు తెలుస్తున్నది. 'యీసింగ్' ఒక పారసీకనౌకలో క్యాన్‌టుంగ్‌లో బయలుదేరి, ముందు సుమత్రా చేరుకున్నాడు.

'యీసింగ్' కూడా చాలాకాలం నలందాలోనే అధ్యయనం చేశాడు. తానువెళ్ళేటప్పుడు వందలాది సంస్కృతగ్రంథాలను తీసుకు

వెళ్ళాడు. ఆయనకు, బౌద్ధవ్రతాలు, ఆచారకర్మకాండలయందు అధికాసక్తి వుండేది. వాటినిగురించి విపులంగా వర్ణించాడు. మనవారి ఆచారాలు, ఆహారం, దుస్తులగురించికూడా చాలాచెప్పాడు. ఉత్తరహిందూస్థానంలో గోధుమ, దక్షిణ, తూర్పుభాగాలలో బియ్యము – ఇప్పటివలెనే – ముఖ్యాహారంగా వుండేవి. మాంసంతినేవారు కాని, చాలా అరుదు. (బహుశా యీయన ఇతరులనుగురించికంటె బౌద్ధసన్యాసుల గురించి ఎక్కువగా వ్రాశాడేమో!) ప్రతిప్రాంతంలోను నేయి, నూనె, పాలు, మీగడ, రొట్టెలు, పండ్లు, సమృద్ధిగా ఉండేవి. ఆచారపరమైన కర్మకాండలలో భారతీయు లెట్లు పవిత్రతను పాటించేవారో యీయన వర్ణించాడు "పంచరాష్ట్ర (ఇండియా అయిదుభాగాలుగా వ్యవహరించబడేది. అవి – తూర్పు, పడమర, ఉత్తర, దక్షిణ, మధ్యభాగాలు) భారతదేశానికీ, యితరదేశాలకూగల మొట్టమొదటి ప్రధాన విభేదం పవిత్రత, అపవిత్రతలనుగురించి భారతీయులుపాటించే విచిత్రభేదభావమే...భోజనానంతరం మిగిలిపోయినదాన్ని భద్రంచేయడం చైనాలో అలవాటేగాని, భారతీయనియమాలకు విరుద్ధము."

'యీసింగ్' తరచుగా ఇండియాను పశ్చిమం (సీ-ఫాంగ్) అని ఉదహరిస్తాడు. కాని, అది 'ఆర్యదేశం' గా పిలువబడుతున్నదని చెప్పాడు. 'ఆర్య' అనగా 'ఉదాత్తమైన' అనీ, 'దేశ' మనగా ప్రాంతమనీ, అందువల్ల యీ పశ్చిమం "ఉదాత్తదేశము" (పవిత్రదేశము) అనీ వివరించాడు. ఈదేశంలో వరుసగా అనేకమంది ఉదాత్తపురుషులుద్భవించినందువల్ల ఆర్యదేశమనేపేరు వచ్చియుంటుందనీ, ఇతరదేశాలప్రజలందరూకూడా ఆపేరుతోనే దాన్ని శ్లాఘిస్తున్నారనీ అంటాడు. అది అనేకవందలదేశాలకు కేంద్రస్థానంగా వుంది కనుక, అందులోనే అనేకదేశాలవంటి విశాలప్రాంతాలున్నవిగనుక, దాన్ని "మధ్యదేశ" మని కూడా పిలుస్తారు. దేశంలోని ప్రజలందరికీ యీపేర్లు తెలుసు. ఈ పవిత్రదేశాన్ని ఉత్తరజాతులు (హూణులు, మంగోలులు, తురుష్కులనువారు)మాత్రమే 'హిందూదేశం' అంటారు. కాని, ఇది ప్రజలకు తెలిసినపేరు కాదు. ఒక గ్రామ్య అపభ్రంశపుపేరు మాత్రమే; అంతగా అర్థంకూడా లేదు. ఇండియాకు పూర్తిగా తగినపేరు 'పవిత్రదేశమే'.

'హిందూ' శబ్దాన్నిగురించి 'యీసింగ్' చెప్పిన విషయాలు గమనింపదగ్గవి "ఇందు అనగా చంద్రుడని కొందరంటారు. చీనావారు పెట్టిన 'ఇండియా' అనే పేరు, ఆ 'ఇందు' శబ్దంనుంచే పుట్టింది. దాని అర్థ యిదేకావచ్చును. కాని, ప్రజలకు తెలిసినపేరుమాత్రం కాదు. ఇండియాప్రజలు మనదేశాన్ని 'చీనా' అంటారు. అదొకపేరేగాని, ప్రత్యేకార్థంలేనిది." ఆయన కొరియా మొదలగుదేశాలకుకూడా సంస్కృతంలో పేర్లుపెట్టాడు.

'యీసింగ్' ఇండియాపట్ల, దాని అనేకగుణాలపట్లా ఎంతో గౌరవం, పవిత్రభావాలున్నవాడైనప్పటికీ, తాను తనమాతృదేశమైన చైనాకే ప్రథమస్థానమిస్తానని స్పష్టంగా ప్రకటించాడు. ఇండియా 'ఉదాత్తదేశం' (పవిత్రభూమి) కావచ్చును; కాని, చైనా దేవభూమి! "పంచరాష్ట్రములభారత దేశప్రజలు తమ పవిత్రతకూ, విశిష్టతకూ గర్వ పడుతారు. కాని, ఉన్నత నాగరికత, సారస్వతప్రతిభ, సమర్థత, మిత ప్రవర్తన, స్వాగత - వీడ్కోలు సందర్భములలోజరుపు కలాపములు, భోజనమందు రుచి, దయ, సంపద, నీతిప్రవర్తనలు చైనాలోమాత్రమే వున్నాయి మరేదేశమూ దాన్నిమించలేదు. శరీరగాయాలను, వాత లను మాన్పుటలోను, నాడినిపరీక్షించుటలోను చైనాను ఇండియాలోని ఏభాగమూ, ఎన్నడూ అధిగమించియుండలేదు. జీవితకాలాన్ని పెంచే మందు చైనాలోమాత్రమే ఉంది. . . ప్రజలప్రవర్తననుబట్టీ, వస్తువులవిశి ష్టతనుబట్టీ చైనా 'దేవభూమి' అనబడుచున్నది. భారతదేశంలోని రాష్ట్రపంచకంలో ఏఒక్కరైనా చైనానుశ్లాఘించకుండా వుండగలరా?"

చైనాదేశ చక్రవర్తిని పురాతన సంస్కృతంలో 'దేవపుత్ర' అని సంబోధించేవారు. దాని సరియైన అనువాదం దేవలోకపుకుమారు డనియేగదా!

'యీసింగ్' స్వయంగా సంస్కృతపండితుడు. ఆభాషను పొగు డుతూ - "అది ఉత్తర, దక్షిణదూరదేశాల్లోకూడా గౌరవింపబడు తున్నది. . . . . . అటువంటప్పుడు; యీ దేవభూమి (చైనా) ప్రజలూ, పవిత్రభూమి (ఇండియా) ప్రజలూ యీ భాషయొక్క నియమాలను యింకెంత బాగా బోధించగలరు!" అంటాడు, సగర్వంగా. సంస్కృత పాండిత్యం చైనాలోకూడా బాగా వ్యాపించివుండాలి. కొందరు చైనా

పండితులు తమభాషలోనికి కొన్నిసంస్కృతపదాలను యిముడ్చప్రయత్నించడం గమనార్హం. టాంగ్‌వంశీయులపాలనకాలంలో 'షాన్‌వెన్' అనే చైనాపండితుడు సంస్కృతవర్ణమాలపద్ధతిలో, చైనాభాషఅక్షరమాలనేర్పరుప ప్రయత్నించాడు.

ఇండియాలో బౌద్ధమతం క్షీణించడంతో – ఈ రెండు దేశాల మధ్య పండితులరాకపోకలు చాలావరకు ఆగిపోయాయి. కొందరు చైనా యాత్రికులు మాత్రం ఇండియాలోని బౌద్ధక్షేత్రాలను చూచేందుకుగాను వస్తూనేవున్నారు. 11వ శతాబ్దంతరువాత రాజకీయవిప్లవాలు జరిగినకాలములలో బౌద్ధమతబోధకులు కట్టలుకట్టలుగా వ్రాతగ్రంథాలను తీసుకుని, గుంపులుగుంపులుగా నేపాలుకో, హిమాలయాలను దాటి టిబెట్టుకో వెళ్ళిపోయేవారు. అంతకుముందూ, ఆకాలంలోనూ, ఆవిధంగా భారతీయసారస్వతంలో చాలభాగం చైనా టిబెట్టులకు తరలిపోయింది. ఇటీవలిసంవత్సరాలలో ఆ దేశాలలో, అవి మళ్ళీ భారతీయభాషల్లోగాని, అనువాదాలుగాగాని కనిపించాయి. భారతీయ పురాతనగ్రంథాలనేకం చైనా, టిబెట్‌భాషలలో నిక్షేపించబడ్డాయి. ఇవి బౌద్ధమతానికిమాత్రమేగాక, బ్రాహ్మణమతము, ఖగోళ, గణిత, వైద్యశాస్త్రములు మొదలగువాటికికూడ సంబంధించియున్నవి చైనాలోని 'సూంగ్–పావో' గ్రంథాలయంలో అట్టిగ్రంథాలు ఎనిమిదివేలున్నవట. టిబెట్టునిండా అట్టివి వున్నాయి. ఇండియా, చైనా, టిబెట్ పండితులమధ్య గొప్పసహకారభావం వుండేది. ఇట్టి సహకారకృషికి మహత్తరచిహ్నంగా బౌద్ధమతసాంకేతికపదకోశమొకటి 'సంస్కృత-టిబెటన్-చైనీస్' భాషలలోవున్నది. ఇది 9, 10 శతాబ్దాలకాలంనాటిది. దీన్ని "మహావ్యుత్పత్తి" అంటారు.

చైనాలో మొట్టమొదటగా 8వ శతాబ్దప్రాంతంలో అచ్చువేయబడినట్లు పరిశోధింపబడినగ్రంథాలు కొన్ని సంస్కృతభాషవే. ఇవి కొయ్యఅచ్చులతో ముద్రించబడినవి. 10వ శతాబ్దంలో చైనాలో "ఇంపీరియల్ ప్రింటింగ్‌కమిషన్" నెలకొల్పబడింది. దానికృషివల్ల, సూంగ్‌శకంవరకు చైనాలో ముద్రణకళ అతివేగంగా అభివృద్ధిచెందింది. భారత, చైనాపండితులమధ్య గ్రంథాలమార్పిడి, రాకపోకలు అనేక శతాబ్దాలుగా విరివిగా జరుగుతున్నప్పటికీ, ఆకాలంలో ఇండియాలో

అచ్చుగ్రంథాలున్న సూచనలేవీ కనుపించకపోవడం ఆశ్చర్యకరమేకాక, వివరించవీలులేనిదిగావుంది. ఆ తొలిరోజుల్లోనే పెద్ద అచ్చులతో ముద్రించే ఏర్పాటు చైనానుంచి టిబెట్టుకు వ్యాపించింది. ఇప్పటికీ అక్కడ అలాగే అచ్చుపనులు జరుగుతున్నాయనుకుంటాను. చైనా ముద్రణవిధానం మంగోలు లేక యూవాన్‌వంశజులపాలనకాలంలో (1260 - 1368) యూరపులో ప్రవేశించింది. మొదట జర్మనీలో కాలూని, 15 వ శతాబ్దంలో అన్ని దేశాలకూ వ్యాపించింది.

మహమ్మదీయ, మొగలుయుగాల్లోకూడా ఇండియా, చైనాల మధ్య రాయబారసంబంధా లుండేవి. ఢిల్లీసుల్తాను మహమద్ బిన్ తుగ్లక్ (1326–51) ప్రఖ్యాత అరబ్బీయాత్రికుడగు ఇబిన్‌బటూటాను చైనాచక్రవర్తివద్ద రాయబారిగా వుంచాడు. ఆకాలంలో బెంగాలు ఢిల్లీ సార్వభౌమత్వాన్ని వదలించుకుని, స్వతంత్రసుల్తానురాజ్యంగా యేర్పడింది. 14 వ శతాబ్దిమధ్యకాలంలో చైనాచక్రవర్తి 'హూపెన్' 'ఫిన్‌పెన్' అనే యిద్దరు రాయబారుల్ని బెంగాలుసుల్తానువద్దకు పంపించాడు. తరువాత ఘియాసుద్దీన్‌పాలనకాలంలో బెంగాలురాయబారులు చైనాకు పంపబడ్డారు. అప్పుడు చైనాలో 'మింగ్' చక్రవర్తులపాలన వుండేది. 1414 లో సైఫుద్దీన్ పంపిన చివరిరాయబారవర్గం అనేకబహుమతులను ఒకజిరాఫీతోసహా చైనాకుతీసుకువెళ్ళింది. ఆ జిరాఫీ ఇండియాలో ఎక్కడిదో అర్థంకాదు. బహుశా ఆఫ్రికారాజెవరో బెంగాలు సుల్తానుకు కానుకగా పంపితే, దాన్ని ఆయన చైనాకు పంపియుండవచ్చును. అది అపురూపజంతువు గనుక, చైనాచక్రవర్తికెంతో ఆహ్లాయతను చేకూర్చివుంటుంది. కన్‌ఫ్యూషియస్ మతానుచరులు జిరాఫీని శుభచిహ్నంగా ఎంచేవారుగనుక, అది గొప్పబహుమతిగా ఎంచబడింది. ఆ జంతువు జిరాఫీయేననేందుకు సందేహంలేదు. దాని పూర్తివర్ణనయే గాక, ఒకసిల్కుగుడ్డమీద దానిచిత్రాన్నికూడా లిఖించినఆధారాలు ఉన్నాయి. ఈ బొమ్మనుగీసిన ఆస్థానచిత్రకారుడు దాన్నిపొగుడుతూ, అధికంగావర్ణించడమేగాక, దానివల్ల కలిగే అదృష్టాన్నికూడా వివరించాడు. మంత్రులూ, ప్రజలూ దాన్నిచూచేందుకు గుంపులుగా చేరారు. వారి "ఆనందానికి అంతులేదు."

బౌద్ధయుగంలో యీ రెండుదేశాలమధ్య పరిఢవిల్లిన వ్యాపారం ఇండోఆఫ్ఘన్, మొగలుయుగాల్లోకూడా కొనసాగింది. వస్తుమార్పిడి నిరంతరంగా జరిగింది. ఈ వ్యాపారం భూమార్గాన, హిమాలయ మలగుండా, మధ్యఆసియాలోని పూర్వయాత్రామార్గాన జరిగేది. ఆగ్నేయాసియాదీవులగుండా దక్షిణభారతరేవులకు చైనాతో నౌకా వ్యాపారం చాలా జరిగేది.

వేయిసంవత్సరాలకుపైగా యీ రెండుదేశాలమధ్య ఏర్పడిన సంబంధబాంధవ్యాలూ, రాకపోకలూ పరస్పరం ఆలోచనావిధానాలనూ, మతాలనూ గురించియేగాక, కళలూ, జీవితశాస్త్రాలనుగురించి కూడా తెలుసుకునేందుకు ఎంతగానో ఉపయోగించాయి. ఈరెంటిలో ఇండియాప్రభావం చైనాపైప్రసరించినదే అధికం. ఇది మనం సంతోషించదగ్గవిశేషమే కాదు, విచారించవలసింది కూడాను. చైనావారి దృఢమైన ఇహలౌకికజ్ఞానాన్ని ఇండియా నేర్చుకుని, దానిసహాయంతో తన అతిశయపుటూహలను అదుపులోపెట్టుకుని, లాభించే అవకాశాన్ని అరికట్టుకుంది. చైనా ఇండియానుంచిగ్రహించినది ఎక్కువే కావచ్చు. కాని, అది ఎప్పుడూ దృఢమైనదీ, ఆత్మవిశ్వాసంగలదీ అయివుంది. స్వీయమార్గంలోనే ఆ స్వీకరించినదాన్ని తనజీవితభాగంలో అతికేచోటనే యిముడ్చుకుంది. బౌద్ధమూ, దాని క్లిష్టతత్వశాస్త్రం కూడా చైనాలో-కన్ఫ్యూషియస్, లావోసేలసిద్ధాంతాలచే రాగరంజితమైవుంటాయి కొంతవరకు నిరాశాదృక్పథాన్ని కలిగియుండే బౌద్ధమతతత్వశాస్త్రంకూడా – చైనీయులజీవితంమీదిమమత, సంతోషాలను అణచలేకపోయింది. "ప్రభుత్వం నిన్నుపట్టుకుంటే, చచ్చేవరకు దెబ్బలుకొడుతుంది. బౌద్ధులు నిన్నుపట్టుకుంటే, చచ్చేవరకూ నీచేత ఉపవాసాలు చేయిస్తారు" అని ఒక పురాతన చైనాసామెత వుంది.

16 వ శతాబ్దపు నవలలలో సుప్రసిద్ధమైన "కోతి"ని "ఊ చెన్ ఎన్" రచించాడు. (ఆర్థర్ వేలీ ఆంగ్లానువాదంచేశాడు.) ఈ నవలలో హుయాన్‌సాంగ్ ఇండియా వెళ్ళేటప్పుడు, దారిలోఎదుర్కొన్న భూత, ఇంద్రజాలప్రమాదాలను వర్ణించాడు. ఇండియాకు అంకితమిచ్చే వాక్యాలతో యీ గ్రంథం ముగుస్తుంది. "నే నీ గ్రంథాన్ని బుద్ధుని పవిత్ర భూమికి అంకితంచేస్తున్నాను. ఇది అభిమానీ, విజ్ఞుడూ చూపిన దయను

తగినవిలువను తిరిగియిచ్చునుగాక! ఇది నిర్భాగ్యుల, దురదృష్టవంతుల బాధలను పోకార్చుగాక!"

అనేకశతాబ్దాలపాటు ఎడమైపోయినతర్వాత యీ రెండు దేశాలూ, విచిత్రవిధివశాత్తు, ఈస్టిండియా కంపెనీ ప్రభావానికిలోను చేయబడ్డాయి. ఇండియా ఇందువల్ల చాలాకాలం బాధపడింది. చైనాలో యీకంపెనీ కొద్దికాలమేవుండగలిగింది. కాని, నల్లమందునూ, యుద్ధాన్నిమాత్రం శాశ్వతవారసత్వంగా వదలిపోయింది.

ఇప్పుడు అదృష్టచక్రం తిరిగిపోయింది. మరల చైనా, భారత దేశాలు ఒకదానినొకటి వీక్షించుకుంటున్నాయి. వెనుకటి స్మృతులు యిరుతెగలహృదయాలనూ నింపివేస్తున్నాయి. మరల కొత్తరకపు యాత్రికులు-ఇరువురినీ వేరుచేస్తున్న పర్వతాలనుదాటియో, ఆకాశయానంచేసియో శుభాకాంక్షలు, సందేశాలతో రాకపోకలుసాగిస్తారు. నూతనస్నేహబంధాలేర్పడి, చిరకాలం వర్ధిల్లుతాయి.

## ౧౫ ఆగ్నేయాసియాలో భారతీయవలసలు, సంస్కృతి

భారతదేశాన్ని తెలుసుకోవడానికీ, అర్థంచేసుకోవడానికీ, కాల, స్థలాల్లో చాలాదూరం ప్రయాణంచెయ్యాలి. కొంతసేపు విషాదము, సంకుచితత్వము, భయాలతోకూడిన నేటిభారతదేశపరిస్థితిని మరచిపోవాలి. ఆమె లోగడ ఎలావుందో, ఏమేమిచేసిందో సూక్ష్మంగానైనా తెలుసుకోవాలి. "నా దేశాన్ని తెలుసుకోవాలంటే, గతంలో ఆమె తనఆత్మనుగుర్తించి, శారీరకసరిహద్దులనధిగమించి ఉన్నతపథాన్నందుకుని, తనవ్యక్తిత్వాన్ని ఒకవిధమైన కాంతిపుంజాలసౌందర్యశోభతో ప్రదర్శించి, తూర్పుదిశను ప్రభావంతంచేసినకాలానికి పయనించాలి. దానినిచూచి, విదేశీయులు ఆశ్చర్యచకితులై, జీవితాన్ని కొత్తగా పొందినట్లు మేల్కొని, ఆమె తమ దేవతనిగుర్తించేటట్లుచేసింది. ఆమెను తెలుసుకోవాలంటే, ఆకాలంలోనికి పయనించాలిగాని, ఆమె సంకుచితపరిధులఅంధకారంలోనికి, స్వాతిశయపుపిసినారిగర్వంలోనికి, మానసికలేమిలోనికి కుంచించుకుపోయినవర్తమానంలోకి కాదు. గతం తనజ్యోతిని కోల్పోయింది. ఆ గతాన్ని అర్థంలేకుండా పదేపదే వల్లెవేస్తూ, మూగదానివలె తనచుట్టూతాను తిరిగేటట్లు చేసింది మానసికదారిద్ర్యం.

ఈనాడామె భావియాత్రికులకు యివ్వగలసందేశమేమీ లేదు"
అని రవీంద్రనాధటాగూరు వ్రాశాడు.

గతకాలంలోనికి పయనించడమేగాక, శారీరకంగా కాక... యినా, మానసికంగానైనా ఆసియాలోనివివిధదేశాలకు పయనించా... ఇండియా తనదృక్పథానికి, శక్తికి, సౌందర్యప్రేమకూ అజరామరమైన ప్రమాణాలను ఆ దేశాలలో అనేకవిధాల వ్యాపింపజేసింది. గతంలో మనదేశం సాధించిన యీ విజయాలను మనలో ఎంతతక్కువమందిమి ఎరుగుదుం! ఇండియా తత్వశాస్త్రంలోనూ, భావనలోనూ ఎంతగొప్పదో క్రియాచర్యలలోకూడా అంతగొప్పదేనని ఎంతతక్కువమందిమి గుర్తించాము! భారతదేశపుస్త్రీపురుషులు తమమాతృదేశాని కెంతోదూరాన సృష్టించినచరిత్ర ఇంకనూ వ్రాయబడవలసివుంది. చాలామంది పాశ్చాత్యులు పురాతనచరిత్రఅంతా మధ్యధరాసముద్రప్రాంతాలకే చెందినదనీ, మధ్య, ఆధునికయుగాలచరిత్రఅంతా జగడాలమారియగు యూరపు అనే చిన్నభూఖండంస్వాయత్తంచేసుకున్నదనీ అనుకుంటారు. ఇప్పటికీ ఆ ఖండవాసులందరూ యూరపుమాత్రమే గణించదగ్గదనీ, మిగతా భూభాగమంతా ఎక్కడోఒకచోట పడవేయదగ్గదనీ భావిస్తూ, తమ ప్రణాళికలను తయారుచేస్తుంటారు.

ఈ అభిప్రాయాన్ని విమర్శిస్తూ ఛార్లెస్ ఇలియట్ ఇలావ్రాశాడు "ప్రపంచంలో ఇండియాకుగల స్థానానికి యూరోపియన్‌చరిత్రలు ఏమాత్రం న్యాయంకలిగించలేదు. ఆచరిత్రలు ఇండియాపైదండెత్తినవారిసాహసాలనే వర్ణిస్తాయి. ఆవిధంగా — భారతీయులు బలహీనులు, కలలుగనే మంద, ఇతరమానవులనుంచి సముద్రాలు, మహాపర్వతాల సరిహద్దులచే వేరుచేయబడిన అప్రయోజకులు అనేభావాలను పాఠకులకు కలిగిస్తాయి. అట్టి చిత్రీకరణ హిందువుల మానసిక విజయాలను లెక్కకురానివ్వదు. వారిరాజకీయవిజయాలుకూడా హీనమైనవేమీ కాదు; వా రాక్రమించినదేశాలు వైశాల్యంలో పెద్దవిగాకపోయినా, దూరంలో లెక్కించదగ్గవి. కాని అట్టి సైనిక, వాణిజ్యవిజయాలు వారిభావనారంగవ్యాప్తితో పోల్చితే అత్యల్పమైనవవుతాయి."

ఇలియట్‌కుపైమాటలు వ్రాసినప్పుడు — ఆగ్నేయాసియాలో ఇటీవల కనుగొనబడిన విశేషాలనుగురించి తెలిసియుండదు. అవి

ఇండియా, ఆసియాల గతచరిత్రలనుగురించిన భావాలను పూర్తిగా మార్చివేశాయి. వీటినిగురించినవివరాలు ఇలియట్‌గారి వాదనను ఇంకెంతో బలపరచేవి. విదేశాలలో భారతీయులు సాధించినవిజయాలు భావవ్యాపనమే కాదనీ, ఇతరవిజయాలుకూడా అంతకంటె గణనీయమైనవిగా వున్నాయనీ వీటివల్ల తెలుస్తున్నది. ఆగ్నేయాసియాచరిత్రను గురించి, 15 యేండ్లక్రితం, మొట్టమొదటిసారిగా సవివరంగా చదివినప్పుడు నే నెంత ఆశ్చర్యపోయానో, ఎంత ఆవేశవివశుణ్ణయ్యానో నాకిప్పటికీ జ్ఞాపకముంది. నాముందు నూతనదృశ్యాలు విశాలంగాపరచుకున్నాయి. చరిత్రనుగురించిన నూతనదృక్పథాలు, భారతదేశపుగతాన్ని గురించిన కొత్తభావనలు నాకళ్ళముందు ఉవ్వెత్తుగాలేచాయి. అంతవరకు నాకుగల దురభిప్రాయాలను, దృక్పథాన్ని, యీ కొత్తవిశేషాల పరంగా ఏర్పడిన వాస్తవంవైపు మరల్చుకుని, సవరించుకోవలసివచ్చింది. చాంపా, కంబోడియా, ఆంకోర్, శ్రీవిజయ, మజాపహిత్‌లు శూన్యంలోనుంచి హఠాత్తుగా పైకిలేచాయి; సజీవరూపాలు ధరించాయి, గతం వచ్చి వర్తమానాన్ని తాకేటట్లుచేసేసహజజ్ఞానంతో అవన్నీ కదులాడసాగినవి.

యుద్ధము, దండయాత్రలలోనూ, ఇతరవిజయాలవల్లను వీరోత్తముడనిపించుకున్న శైలేంద్రునిగురించి డా. హెచ్. జి. క్వారిచ్‌వేల్స్ యిలా వ్రాశాడు: "ఈ మహావిజయుడు యుద్ధవిద్యలలో పాశ్చాత్య మహావీరులతో పోల్చదగినవాడు. అతనిఖ్యాతి పర్షియానుంచి చైనా వరకు వ్యాపించింది. ఒకటి, రెండు దశాబ్దాలలోనే విశాలసముద్రాంతర సామ్రాజ్యాన్ని నెలకొల్పాడు. అది అయిదుశతాబ్దాలవరకు చెక్కుచెదరకుండావుండి, జావా, కంబోడియాలలో భారతీయకళలు, సంస్కృతి వికసించుట కవకాశమిచ్చినది. కాని, మనవిజ్ఞానసర్వస్వములలోను, చరిత్రలలోను సువిశాలంగా వ్యాపించిన యీ సామ్రాజ్యాన్నిగురించి, దాన్ని స్థాపించినఘనునిగూర్చి, ఒక్కమాటయినా కనుపించదు. అటువంటి మహత్తరసామ్రాజ్యమొకటి ఉండేదన్నది యథార్థం. ఏ కొద్దిమంది ప్రాగ్దేశపండితులకోతప్ప, సాధారణంగా ఎవరికీ తెలియదు. ఇంతవరకు ప్రపంచంగుర్తించని పురాతనభారతీయులవ్యక్తిత్వం, ప్రతిభలపై కొత్త వెలుగును ప్రసరించేందుకు ఈ వలసస్థాపకుల యుద్ధ సాహసచర్యలు

ప్రముఖంగా పనికివస్తాయి. అంతకంటె ముఖ్యమైన విషయం – వారు తమవలసల్లోను, నూతనంగా నివాసాలేర్పరచిన ప్రదేశాల్లోను వేయేండ్లకుపైగా నిలువగలిగిన ఉత్తమనాగరికతను నిర్మించగలుగుటయే.

అగ్నేయాసియాలోని యీ విశాలభాగాన్ని 'మహాభాంలఖండ' మనేవారు. గత పాతికేండ్లనుండిమాత్రం యీ ప్రాంతచరిత్రను గూర్చి విశేషపరిశోధనలు జరుగుతున్నవి. ఇప్పటికీ ఆ చరిత్రలో నింపబడని ఖాళీలు అనేకం వున్నాయి. అనేక పరస్పరవైరుధ్యాలున్నాయి. చరిత్రకారు లనేక విరుద్ధప్రతిపాదనలు చేస్తూనేఉన్నారు. కాని, సాధారణసూత్రాలుమాత్రం స్పష్టంగాఉండి, వివరాలు సమృద్ధిగా ప్రోగవుతున్నవి. భారతీయగ్రంథాల్లో అరబ్బీయాత్రికుల కవిలెకట్లల్లో, అంతకంటె ముఖ్యంగా చైనాచారిత్రకగ్రంథాల్లో యీ ఆగ్నేయాసియాచరిత్రకుసంబంధించిన అనేకవివరాలు వుండగా ఇంక కొదువేమిటి? అంతేగాక, శిలాశాసనాలూ, తామ్రశాసనాలూ మొదలైనవీ, జావా, బలిద్వీపములలో భారతీయగ్రంథాలఆధారంగా వ్రాయబడిన విశిష్టసారస్వతమూ, భారతీయపురాణాలూ, గాథలక్లుప్తీకరణలూ అనేకం వున్నాయి. గ్రీకు, లేటినుగ్రంథాలుకూడా కొన్నివిశేషాల నందిస్తున్నాయి. ఈ అన్నింటికిమించి ఆంకోర్, బరోబదూర్ మొదలగుచోట్ల పురాతనశిథిలాలసంపదలు కూడా ఉన్నాయి.

క్రీ. శ. మొదటిశతాబ్దంనుండి ఇండియావలసస్థాపకులు గుంపులు గుంపులుగా తూర్పుకూ, ఆగ్నేయానికీ ప్రయాణంచేసి, సింహళం,బర్మా, మలయా, జావా, సుమత్రా, బోర్నియో, సయాం, కంబోడియా, ఇండోచైనాలకు చేరుకున్నారు. కొందరు ఫార్మోజా, ఫిలిప్పీనుదీవులు, సెలిబెస్‌లలోకూడా వలసలేర్పరచుకున్నారు. ఇంకా దూరానవున్న మెడగాస్కర్‌వరకూ నేటికీ వాడుకలోనున్నభాష సంస్కృతపదమిశ్రమమైన ఇండోనీషియన్‌భాషయే. భారతీయులు ఈవిధంగా వ్యాపించేందుకు అనేకవందలయేండ్లు పట్టివుంటుంది. ఈ ప్రదేశాలన్నిటికి ఇండియా నుంచి సరాసరి చేరలేదనీ, మధ్యగల వలసలద్వారా చేరివుంటారనీ భావించాలి. ఈ వలసలస్థాపన క్రీస్తుశకారంభంనుంచి 900 సం॥ల వరకూ నాలుగు అంచెలుగా జరిగినట్లు తెలుస్తున్నది. ఈకాలంలో భారతదేశాన్నుంచి ఒక జనప్రవాహంవంటిది. తూర్పుకు పయనించివుంటుంది.

వీటిలో ప్రత్యేకత ఏమిటంటే, ప్రభుత్వమే ఈ వలసలకోసం జనాన్ని వెళ్ళమని ప్రోత్సహించింది. ఒకకాలంలో ఎడమెడంగావున్న ప్రదేశాల్లో యీ వలసలు స్థాపించబడడం, అవి సామాన్యంగా రాజకీయ, వ్యాపారకీలకప్రదేశాల్లో వుండడం గమనార్హం. ఈ వలసలకు పెట్టబడినపేర్లుకూడా భారతదేశంలో వాడుకలోవున్నవే. నేటి కంబోడియాను "కాంభోజ" మనేవారు. పురాతనభారతదేశపు గాంధార (కాబూలు) లోయలో యిదే పేరుగలపట్టణం ఉండేది. ఆకాలంలో గాంధారము (ఆఫ్ఘనిస్థానము) ఆర్యదేశం (ఇండియా) లో ముఖ్యభాగంగా వుంది గనుక, ఇది ఈ వలసలుస్థాపించబడినకాలాన్ని చూచాయగా సూచిస్తోంది.

ప్రమాదభరితమైన సముద్రాలమీదుగా అట్టి సాహసయాత్రలు చేసేందుకు కారణమేమిటి? వాటివెనుకగల ఉత్తేజమెట్టిది? గతఅనేకశతాబ్దాలుగా వ్యక్తులుగాని, చిన్నచిన్నగుంపులుగాని వర్తకాదులకై ఆయా దూరప్రాంతాలకు వెళుతూవుండడం జరగకపోతే, ఈవిధంగా సంఘటితమైన, ఆలోచనాపూర్వకమైన ఆ వలసయాత్రలు సాగేవేకావు. పురాతనసంస్కృతగ్రంథాలలో యీ తూర్పు దేశాలనుగురించిన సూచనలు చూచాయగామాత్రమే ఉన్నాయి. వాటిలో చెప్పబడినపేర్లను గుర్తించడమే కష్టం. కొన్నిటినిమాత్రం కొంచెం సులభంగా తెలుసుకోవచ్చును. 'యవద్వీప' మే నేటి జావా. ఇండియాలోనేటికీ 'జవ'లంటే 'యవలు' బార్లీ, లేక ఒకరకం జొన్న అనిఅర్థం. పురాతనగ్రంథాల్లో పేర్కొనబడినపేర్లుకూడా సాధారణంగా ఖనిజములు, లోహములు, పారిశ్రామికఉత్పత్తులు, వ్యావసాయికఉత్పత్తులు మొదలగువానికి సంబంధించివుంటాయి. ఈపేర్లు మనవ్యాపారాన్నిగురించి ఆలోచింపచేస్తాయి. డా. ఆర్. సి. మజుందార్ ఇలావ్యాఖ్యానించాడు : "సారస్వతం ప్రజాభిప్రాయాన్నిచక్కగా ప్రతిబింబిస్తుందని అనుకున్నట్లయితే, క్రీస్తుకు కొంచెముందూ, ఆతరువాతా కొన్నిశతాబ్దాలపాటు ఇండియాలోని ముఖ్యవ్యాపకం వర్తక, వాణిజ్యాలేనని తేటతెల్లమవుతున్నది." ఈ విషయాలనుబట్టి భారతదేశపుఆర్థికసౌభాగ్యం విస్తృతమవుతూ, నూతన వాణిజ్యరంగాన్వేషణ జరుగుతూవున్నట్లు తేలుతుంది.

క్రీ. పూ. 2, 3 శతాబ్దాలలో ఈ వ్యాపారరంగం క్రమక్రమంగా అభివృద్ధిచెందింది. సాహసయాత్రికులైనవ్యాపారస్తులు వెళ్ళినతర్వాత, మతబోధకులు, పండితులుకూడా వెళ్ళేవారు. మరి ఇదే అశోకునికాలకమూ! సంస్కృతంలోని పురాతనకథలలో ప్రమాదకరమైనసముద్రయానాలూ, నౌకాభంగాలూ తరచుగా వర్ణించబడ్డాయి. గ్రీకు, అరబ్బీగ్రంథాలు – కనీసం ఒకటవశతాబ్దినుంచైనా ఇండియాకూ దూరప్రాచ్యదేశాలకూమధ్య నౌకావ్యాపారసంబంధాలు విరివిగా వుండేవని తెలుపుతున్నాయి. చైనానుండి ఇండియా, పర్షియా, అరేబియా, మధ్యధరాదేశాలకు వెళ్ళే నౌకావ్యాపారమార్గంలోనే మలయా ద్వీపకల్పమూ, ఇండోనీషియాద్వీపాలూ వున్నాయి. ఈ రెండు దేశాలకూ భౌగోళికప్రాముఖ్యతే గాక, వాటిలో విలువైన ఖనిజాలూ, లోహాలూ, మసాలాదినుసులూ, కలప విరివిగా వుండేవి. మలయా నేటివలె నాడుకూడా తగరపుగనులకు ప్రసిద్ధిచెందింది. బహుశా ఆదిలో నౌకాయానం భారతదేశపుతూర్పుకోస్తావెంట – కళింగ (ఒరిస్సా), బంగాళ, బర్మా, మలయాద్వీపకల్పాలవరకూ జరిగివుంటుంది. తరువాత తూర్పు, దక్షిణభారతరేవులనుండి సరాసరి నౌకామార్గాలు అనుసరించబడివుండాలి. ఈ సముద్రమార్గాలవెంటే చైనాయాత్రికులనేకులు భారతదేశానికి వచ్చారు. 5 వ శతాబ్దంలో జావానుదాటివచ్చిన ఫాహియాన్ అక్కడ అనేకమంది అన్యమతాల వారున్నారని వ్రాశాడు. అంటే, బౌద్ధులుకాక, బ్రాహ్మణమతస్తులు ఉన్నారనిభావన.

పురాతనభారతదేశంలో నౌకానిర్మాణం ఎంతో అభివృద్ధిగాంచిన ముఖ్యవ్యాపారంగావుండేదనేది స్పష్టం. ఆకాలంలో నిర్మింపబడిన కొన్నినౌకలవివరాలూ, వర్ణనలూ మనకు మిగిలివున్నాయి. అనేక భారతీయరేవులనుకూడా పేర్కొన్నారు. రెండుమూడుశతాబ్దాల నాటి ఆంధ్రనాణెములు రెండుతెరచాపలనౌకాచిహ్నాన్ని కలిగివున్నాయి. అజంతాకుడ్యచిత్రాల్లో సింహళాన్నిజయించడం, ఏనుగులను తీసుకుపోయేఓడలూ చిత్రించబడ్డాయి. భారతీయవలసలనుంచి పెంపొందిన రాజ్యాలూ, సామ్రాజ్యాలూ ముఖ్యంగా నౌకాబలాన్ని కలిగియుండి, విదేశీవర్తకంపట్ల శ్రద్ధకలిగియుండి, అందునిమిత్తం సముద్ర

మార్గాలనుస్వాధీనంలోవుంచుకునేది. అట్టివారు సముద్రాలమీద పరస్పరంకలహించుకోవడంకూడా సంభవించేది. ఒకరు దక్షిణదేశంలోని చోళసామ్రాజ్యంమీద సవాలుచేయడంకూడా జరిగింది. అయితే చోళులుకూడా నౌకాబలసంపన్నులగుటచే, వారు ఒక నౌకాదళాన్ని పంపి కొద్దికాలం శైలేంద్రసామ్రాజ్యసైన్యాలను అణచివేశారు.

క్రీ. శ. 1088 నాటి ఒక తమిళశాసనంలో "15 వందలమంది సంఘము" అని పేర్కొనబడినవిశేషం గమనింపదగ్గది అందులో వర్ణింపబడినప్రకారం, అది ఒక వర్తకులసమితి అయివుండాలి. "ధైర్యవంతులు, కృతయుగంనుంచీకూడా అనేకదేశాలుసంచరించడానికే పుట్టినవారు; ఆరుఖండాలనూ సముద్ర, భూమార్గాలలోచేరి, అంతర్భాగాలకుచొచ్చుకుపోయేవారు. గుర్రాలు, ఏనుగులు, విలువైనరాళ్ళు, సుగంధద్రవ్యాలు, మందులు మొదలైనవి చిల్లరగాను టోకుగాను అమ్మేవారు."

భారతీయుల తొలివలసలస్థాపనవెనుకగల చరిత్ర యిది. వ్యాపారం, సాహసం, అవకాశాలుపెంచుకోవాలనే ఉత్సాహం వారిని తూర్పుదేశాలకుపంపాయి. ఈ దేశాలనుగురించి మొత్తంగా సంస్కృతగ్రంథాలలో "స్వర్ణభూమి" లేక "స్వర్ణద్వీపం" అని వర్ణించారు. ఆ పేరులోనే మెరలాంటి ఆకర్షణవుంది. మొదటివలసలు స్థిరపడేసరికి, మళ్ళీ కొందరు వెళ్ళి, కొత్తవలసలు స్థాపించేవారు. ఈరీతిని శాంతియుతంగా యితరదేశాలలోనికి చొచ్చుకుపోవడం సాగుతూవచ్చింది. భారతీయులు అక్కడిజాతులతో సంపర్కాలుపెరిగి, పరస్పరకలయికలతో మిశ్రమనాగరికత యేర్పడింది. బహుశా ఆతరువాతనే ఇండియానుంచి రాజకీయశక్తులు విదేశాలకువెళ్ళడం జరిగివుంటుంది. కొందరుక్షత్రియ రాకుమారులు, ఉన్నతవంశాలకు చెందిన సేనానాయకులు తమ శక్తిసామర్థ్యాలను సాహసరూపంలో ప్రదర్శించాలనేకుతూహలంతో విదేశాలఆక్రమణకు బయలుదేరివుంటారు. అట్టివారిపేరుల సారూప్యతనుబట్టి భారతదేశంలో బాగా వ్యాపించిన మాల్వాక్షత్రియవంశజులని సూచింపబడుతున్నది. ఇండోనీషియా అంతటా ప్రముఖపాత్రను నిర్వహించిన 'మలే'జాతి యీ మాల్వాజనితమే నంటారు. మధ్యభారతంలోని ఒకభాగాన్ని యిప్పటికీ 'మాల్వా' అంటారు. తొలి వలస

దారులు కళింగ (ఒరిస్సా) రాష్ట్రంనుండి వెళ్ళారట. కాని, భారీయెత్తున సుసంఘటితంగా వెళ్ళినది దక్షిణంలోని పల్లవసామ్రాజ్యంనుండియే. ఆగ్నేయాసియాలో అత్యంతఖ్యాతివంతమైన శైలేంద్రవంశము మన కళింగమునుండి వెళ్ళినవారిదే అయి వుంటుంది. ఆకాలంలో ఒరిస్సా బౌద్ధమతప్రాబల్యం కలిగివున్నా, రాజవంశం మాత్రం బ్రాహ్మణ మతస్థులే.

ఈ భారతీయవలసలన్నీకూడా రెండు గొప్పదేశాలకూ-ఇండియా చైనా-రెండు గొప్పనాగరికతలకూమధ్యనే వున్నాయి. ఆసియాఖండపు ప్రధాన భూభాగంలోని కొన్నివలసలు చైనాసరిహద్దుల నానుకొనియే ఉన్నాయి. ఇతరములు ఈరెండు దేశాలమధ్యగల వ్యాపారమార్గంలోనే ఉన్నాయి.ఆవిధంగా ఆ వలస దేశాలలో, యీ రెండుదేశాలనాగరికతా ప్రభావము ప్రసరించింది. ఈ రెండుసంస్కృతులు ఎన్నడూ సంఘర్షించని ప్రకృతిగలవైనందున, అనేకవిధాల, వివిధగుణాలమిశ్రమసంస్కృతులు ఆవిర్భవించాయి. ముఖ్యభూభాగంలోని బర్మా, సయాం, ఇండోచైనా లపై చైనాసంస్కృతి ఎక్కువప్రసరించగా, దీవులు, మలయాద్వీప కల్పములపై ఇండియానాగరికత అధికంగా ప్రసరించింది. సాధారణంగా ఆ దేశాలు ప్రభుత్వపద్ధతి, జీవితతత్వవిధానం చైనానుంచీ, మతము, కళలు, ఇండియానుంచీ స్వీకరించాయి. ముఖ్యభూభాగంలోని దేశాలు వ్యాపారాదులకు ఎక్కువగా చైనామీద ఆధారపడేవి. ఆ దేశాల మధ్య తరచుగా రాయబారులమార్పిడికూడా ఉండేది. కాని, కంబోడియాలోనూ, ఆంకోర్‌లోని మహత్తరశిథిలాల్లోను బయల్పడిన కళాప్రభావమంతా ఇండియాదేకాని, భారతీయకళ మృదువైనది అనుకరింప దగ్గదీ అయినందువల్ల అది ప్రతిదేశంలోను తాజాగా వికసించి, నూతనవిధానాల నవలంబించింది. అయితే, భారతదేశంలో తా నలవరచుకొన్న గాఢముద్రాస్వభావాన్ని మాత్రం కోల్పోలేదు. భారతీయుచిత్రకళ ఆశ్చర్యకరమైన జీవశక్తినీ, మృదుస్వభావాన్నీ కలిగి వుంటుందనీ, భారతీయ, గ్రీకుకళలు రెండింటికీకూడా తమకు సంబంధ మేర్పడిన దేశము, జాతి, మతముల అవసరాలకు తగిన అనురూపాన్ని అలవరచుకోగలశక్తి వున్నదనీ వివరించాడు సర్‌జాన్‌మార్షల్.

భారతదేశపు మత, తత్వదృక్పథాలలోగల ఆదర్శప్రభావాల నుంచి, తనకుపునాదికాగలగుణాలను భారతీయచిత్రకళ స్వీకరించింది. ఈ తూర్పు దేశాలన్నింటికీ మతం వెళ్ళినట్లే, ఈ కళలోని ప్రాథమికదృక్పథం కూడా వ్యాపించింది. బహుశా మొదటివలసలలో బ్రాహ్మణీయము అవలంబింపబడగా, బౌద్ధమతం తరువాత వ్యాపించివుంటుంది. ఈ రెండు మతాలూ కొంతకాలం అన్నదమ్ములవలె మెలిగాయి. యీరెంటి పూజాపద్ధతులును మిశ్రమరూపంలో అభివృద్ధిచెందాయి. ఈదేశాల్లోని బౌద్ధం ఎక్కువగా మహాయానమే గనుక తేలికగా అవలంబించబడింది. స్థానిక అలవాట్లు, సాంప్రదాయాలు బలీయంగావుండడంవల్ల యీ రెండుమతాలూకూడా తమ మూలపవిత్రతనువదలి, కొంత మార్పు చెందాయి. తరువాతికాలంలో యీ బ్రాహ్మణ, బౌద్ధమతాలనవలంబించిన భిన్నరాజ్యాలమధ్య యుద్ధాలు జరిగాయి. కాని, ఆ యుద్ధాలు ముఖ్యంగా రాజకీయార్థికదృష్టితోనూ. సముద్రమార్గాలు, వ్యాపారములపై అధికారదృష్టితోనూ జరిగేవి.

ఒకటి, రెండుశతాబ్దాలనుంచి 15 వ శతాబ్దంవరకూ యిట్టివలసలున్నాయి. కాని, భారతీయవలసలచరిత్ర 13 వందల సంవత్సరాలకు పైగా వుంటుంది. తొలిశతాబ్దాలచరిత్ర మరీ అస్పష్టంగావుండి, ఏవో స్వల్పమైన భారతీయ వలసలున్నసూచనలు మాత్రమే కనుపిస్తాయి. క్రమంగా చిన్న చిన్నవలసలు ఏకమై, పెద్దరాజ్యాలూ, నగరాలూ ఏర్పడడం 5 వ శతాబ్దంలో జరిగింది. 8 వ శతాబ్దినాటికి సముద్రాధిపత్యం ఎక్కువగాగల సామ్రాజ్యాలు ప్రభవించాయి. అధికారం కేంద్రీకృతంకావడమేగాక, అనేకచిన్నరాజ్యాలపై సార్వభౌమత్వంకూడా వుండేది. ఒక్కొకసారి యీ సామంతరాజ్యాలు స్వతంత్రమై, కేంద్రాధికారాన్నికూడా.ఎదుర్కోవడం, సంఘర్షణలురేగడం కద్దు. అందువల్ల యీకాలపుచరిత్ర అస్తవ్యస్తంగావుండి, మనకు స్పష్టంగా బోధపడదు.

ఇలా ఏర్పడిన భారతీయవలసల్లో శైలేంద్రసామ్రాజ్యం గొప్పది. దీనినే 'శ్రీవిజయుని' సామ్రాజ్యం అంటారు. 8 వ శతాబ్దినాటి కిది "మలేషియా" నంతటినీ పాలిస్తూ, భూ, సముద్రాధికారాల్లో ఎనలేనిదిగా ఖ్యాతిగాంచింది. ఇటీవలివరకు, ఇది సుమత్రాలో పుట్టి, దానినే రాజధానిగా చేసుకున్నదని విశ్వసించబడింది. కాని, తరువాత

జరిగిన పరిశోధనలవల్ల అది మలయాద్వీపకల్పంలో పుట్టి, పెరిగిందని తేలింది. అతిప్రాభవంగావున్నకాలంలో యీ సామ్రాజ్యంలో మలయా, సింహళం, సుమత్రా, జావాలో ఒకభాగం, బోర్నియో, సెలబీస్ ఫిలిప్పైనులు, ఫార్మోజాలో కొంతభాగం ఉండేవి. బహుశా కంబడియా, చాంపా (అన్నాం)లపై సార్వభౌమత్వంకూడా వుండేది. అది బౌద్ధులసామ్రాజ్యం.

కాని శైలేంద్రవంశం యీ సామ్రాజ్యాన్ని స్థాపించకముందే మలయా, కంబోడియా, జావాలలో బలీయమైన రాజ్యా లుండేవి. మలయాద్వీపకల్పపుఉత్తరభాగంలో సయాంసరిహద్దులసమీపానగల విశాలమైనశిథిలాలనుబట్టి గతంలో బలీయమైనప్రభుత్వాలూ, గొప్పసంపదలూ, భోగాలూ అక్కడ నెలకొన్నట్లు తెలుస్తున్నదని ఆర్. జె. విల్కిన్‌సన్ చెప్పాడు. చాంపా (అన్నాం) రాజ్యంలో 3వ శతాబ్దంలో 'పాండురంగం' అనే నగరం వెలసింది. 5 వ శతాబ్దంలో కాంభోజనగరం ప్రఖ్యాతికెక్కింది. 9 వ శతాబ్దాలో జయవర్మ అనేగొప్పరాజు చిన్నచిన్నరాజ్యాలను ఏకంచేసి, ఆంకోర్ రాజధానిగా, కంబోడియా సామ్రాజ్యాన్ని స్థాపించాడు. అంతకుముందు కంబోడియా అప్పుడప్పుడు శైలేంద్రసామ్రాజ్యానికి సామంతరాజ్యంగావుంటూ, చివరికి 9 వ శతాబ్దంలో స్వాతంత్ర్యాన్ని సాధించుకునివుంటుంది. ఈ కంబోడియారాజ్యం, జయవర్మ, యశోవర్మ, ఇంద్రవర్మ, సూర్యవర్మలవంటి గొప్పపాలకులు నిర్మాణవేత్తల ఆధిపత్యాన 4 వందల సంవత్సరాలు నిలచింది. రాజధాని ఆసియాలోకెల్ల ప్రసిద్ధమై "అందాలకాణాచి ఆంకోర్" అని పిలువబడింది. పదిలక్షలమంది నివసించిన యీ నగరం సీజర్‌చక్రవర్తినాటి రోంనగరాన్ని మించిపోయింది. ఈ నగరసమీపాన "ఆంకోర్‌వాట్" అనే దేవాలయం ఉండేది. 1297 లో దాన్ని దర్శించిన ఒక చైనా యాత్రికుడు అచటిసంపదలనూ, శోభనూ వర్ణించాడు. ఈ రాజ్యం 13 వ శతాబ్ది చివరివరకూ వుండి, హఠాత్తుగా కూలిపోయింది. అందువల్ల ఆంకోర్‌నగరంలో అనేకభవనాలు పూర్తికాకుండానే వదలబడ్డాయి. బైటినుంచి దండయాత్రలూ, దేశంలో అంతఃకలహాలూ చెలరేగాయి. అంతకంటే ప్రమాదం మెకోంగ్‌నదివల్ల జరిగింది. వరదవచ్చి ఆంకోర్

నగరమూ, పరిసరాలూ బురదనేలలైపోయాయి. ప్రజలు నగరంవదలి పారిపోయారు.

జావాకూడా శైలేంద్రసామ్రాజ్యాన్నుంచి 9వ శతాబ్దిలో విడిపోయింది. అయినా, 11వ శతాబ్దంలో దక్షిణభారత చోళరాజులతో యుద్ధంతటస్థించేవరకు ఆ సామ్రాజ్యం ఇండోనీషియాలో గొప్పశక్తిగానే నిలచింది. చోళులు అర్థశతాబ్దంపాటు ఇండోనీషియాలో అనేకభాగాలను పరిపాలించారు. చోళులు తిరోగమించినతరువాత, మరల శైలేంద్రులు బలిష్ఠులై, తేరుకొని, 300 ఏండ్లకాలం ఇండోనీషియానంతటినీ పాలించారు. అయితే, ప్రాచ్యదేశాలలో గణనీయరాజ్యంగా తలెత్త లేదు. వారి బలహీనతవల్ల ఇరుగుపొరుగుల జావా తాయిలండ్‌లు బలపడ్డాయి. 14వ శతాబ్ది చివరిఅర్థభాగంలో జావా, శ్రీవిజయుని శైలేంద్రసామ్రాజ్యాన్ని పూర్తిగా స్వాధీనంచేసుకుంది.

ఇప్పుడెంతో ప్రఖ్యాతికివచ్చిన జావారాజ్యానికి గతచరిత్ర చాలా వుంది. అది బ్రాహ్మణమతదేశం. బౌద్ధం విరివిగా వ్యాపించిన కాలంలోకూడా జావా బ్రాహ్మణమతాన్ని వదలలేదు. శైలేంద్ర సామ్రాజ్యం తనభూభాగంలోసగం ఆక్రమించుకున్నతరువాతకూడా, జావా, దానికి లొంగకుండా తన స్వాతంత్ర్యాన్ని కాపాడుకున్నది. దానిప్రజ లెక్కువగా సముద్రయానమన్నా, విదేశవాణిజ్యమన్నా, పెద్దపెద్ద రాతికట్టడాలనిర్మాణమన్నా వ్యసనంతోకూడిన ఆసక్తిగలవారు. దాని అసలుపేరు "సింఘాసరిరాజ్యం". 1292 లో "మాజాపహిత్" అనే నగరం నిర్మింపబడినప్పటినుంచి, "మాజాపహిత్" సామ్రాజ్యం అనబడుతూ, శ్రీవిజయు నోడించి శైలేంద్రసామ్రాజ్యమంతటినీ ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించి, ఆసియాలోకెల్ల గొప్పదిగా పేరొందినది. చైనాచక్రవర్తియగు కుబ్లాయ్‌ఖాన్ పంపిన రాయబారులను మాజాపహిత్ అవమానించినందున, చైనానుంచి దండయాత్రశిక్ష అమలుజరుపబడింది. బహుశా చైనావారినుంచియే జావా తుపాకిమందు వాడకాన్ని నేర్చివుంటుంది. శైలేంద్రులను ఓడించడంలో వారు తుపాకిమందు నుపయోగించారు.

మాజాపహిత్ ఎక్కువగా కేంద్రీకృతఅధికారాలుగల విశాల సామ్రాజ్యం. అది పన్నులువేసేపద్ధతి ఎంతో క్రమబద్ధంగా ఉండేదనీ,

ప్రత్యేకంగా వ్యాపార, వలససుంకాలు ఉండేవనీ తెలుస్తున్నది. ప్రభుత్వ యంత్రంలో వాణిజ్య, వలస, ఆరోగ్య, యుద్ధ, దేశీయశాఖలూ, మరి కొన్ని శాఖలూ ఉండేవి. అనేకమంది న్యాయమూర్తులుగల సుప్రీంకోర్టు ఉండేది. ఈ సామ్రాజ్యతత్వప్రభుత్వం ఎంత క్రమబద్ధంగా వ్యవస్థాపితంగా యిందో వింటే ఆశ్చర్యం కలుగుతుంది. ఆ సామ్రాజ్యముఖ్యవ్యాపకం ఇండియా, చైనాలతో వ్యాపారం. దానిపాలకులలో "సుహిత"అను రాణికూడా ప్రసిద్ధిపొందింది.

మాజాపహిత్ శైలేంద్రులమధ్య జరిగినయుద్ధం అతిక్రూరమైనది. మొదటివారు పూర్తిగా విజయులైనప్పటికీ, యీకారణంవల్ల యితర యుద్ధాలకు బీజాలు చల్లబడ్డాయి. శైలేంద్రసామ్రాజ్యశిథిలాలూ, అరబ్బీ, ముస్లింశక్తుల కలయికలూ కలసి – సుమత్రా, మలాకాలలో మలయారాజ్యం ఏర్పడడానికి కారణమయ్యాయి. అంతవరకు దక్షిణ భారతరాజ్యాలచేగాని, భారతీయవలసలచేగానిపాలింపబడుతున్నదక్షిణ సముద్రాలు యిప్పుడు అరబ్బీలచేతుల్లోకి పోయాయి. మలాకా వ్యాపార కేంద్రంగా, సముద్రశక్తులరాజధానిగా ప్రాముఖ్యతకువచ్చింది. మలయా ద్వీపకల్పంలోనూ, ఇతరద్వీపాల్లోను ఇస్లాంమతం వ్యాపించింది. ఈకొత్త శక్తియే 15 వ శతాబ్దిచివరలో మాజాపహిత్ సామ్రాజ్యాన్ని నేలమట్టం చేసింది. కాని, కొద్దికాలానికే (1511లో) ఆల్బకర్క్ ఆధ్వర్యాన పోర్చుగీసుదండయాత్రికులు వచ్చి, మలాకాను వశపరుచుకున్నారు. యూరపు కొత్తగా పెంపొందించుకున్న నౌకాబలంతో దూరప్రాచ్యానికి చేరుకుంది.

## ౧౭ విదేశాలలో భారతీయకళాప్రభావం

ఈ పురాతనసామ్రాజ్యాల, రాజవంశాల చరిత్రలు పురాతత్వ శాస్త్రజ్ఞులకు కుతూహలకరంగా వుంటాయి. నాగరికత, కళల చరిత్రలు మరింత ఆసక్తిజనకమైనవి. ఆదేశాలలో అధికప్రభావాన్ని ప్రసరించినదీ తన సంచలనాత్మకశక్తినీ, విశిష్టతనూ పలువిధాలుగా ప్రదర్శించినదీ ఇండియాయేగనుక, ఇండియాదృష్టిలో యివి మరింత ప్రధానంగా వుంటాయి. ఇండియా తనశక్తితో ఉవ్విళ్ళూరుతూ, విదేశాలకువెళ్ళడమే గాక, తనఆలోచనలతోపాటు ఆదర్శాలనూ, కళలనూ, వ్యాపారాన్నీ,

భిన్నతనూ, సారస్వతాన్నీ, ప్రభుత్వవిధానాలనుకూడా ఆయా దేశాలకు తీసుకువెళ్ళింది. భారతదేశం సబంధంగాగాని, ప్రేతకురాలుగా దూరంగా నిలచేదిగాని, సముద్రాలు, పర్వతాలచే ప్రపంచానికిదూరంచేయబడిన ఏకాకిగాని కాదు. "ఆమెబిడ్డలు యీపర్వతశిఖరాలను దాటి, భయంకరసముద్రాల నధిగమించి, మహాభారతసామ్రాజ్యాన్ని నిర్మించారు. రాజకీయంగా యీసామ్రాజ్యానికి గ్రీసుకున్నంత సువ్యవస్థ లేకపోయినా నైతికంగా ఎంతో ప్రశాంతి వుంది" అని ఎం. రెనే గ్రాసెట్ అన్నాడు. వాస్తవానికి యీ మలేషియన్‌రాజ్యాల రాజకీయవ్యవస్థ (పాలనాయంత్రం)ఎంతో ఉన్నతమైనదే కాని, ఆ విధానం భారతరాజకీయయంత్రభాగం కాదు. కాని, గ్రాసెట్ భారతీయసంస్కృతి వ్యాపించిన విశాలప్రాంతాలనుగురించే వ్రాశాడు. "పీఠభూమియగు తూర్పు ఇరానులో, సెరిండియా ఒయాసిస్సులో, ఎడారిపర్రభూములుగల టిబెట్టు, మంగోలియా, మంచూరియాలలో, పురాతననాగరిక దేశాలైన చైనా, జపానులలో, బర్బరులగు 'మానులు', 'ఖమీర్'లు, ఇతర తండాలూగల ఇండో-చైనాలో, మలయో - పోలినీషియన్ దేశాలలో, ఇండొనీషియా, మలయాలలో ఇండియా చెరగిపోని తనసాంస్కృతిక ముద్రలను వేసింది. ఈముద్రలు మతంమీాదమాత్రమే కాదు; కళలు, భాషలు, సారస్వతం - ఒక్కమాటలో - ఆత్మౌన్నత్యానికిసంబంధించిన అన్నిటిమీాదా వున్నాయి."

భారతనాగరికత ప్రత్యేకంగా ఆగ్నేయాసియా దేశాలలో వేళ్ళు పాదుకుంది. ఈవిషయం అక్కడ ప్రతిఅణువులోను ద్యోతకమవుతుంది. చాంపా,మాజాపహిత్,ఆంగ్‌కోర్,శ్రీవిజయ,తదితరప్రదేశాలలోసంస్కృత విద్యాపీఠాలు, విజ్ఞానకేంద్రాలు వుండేవి. వివిధరాజ్యాల,సామ్రాజ్యాల పాలకులపేర్లుకూడా భారతీయంగా, సంస్కృతభాషవిగా వుండేవి. అంటే వారంతా పూర్తిగా భారతీయులేనని కాదు. కనీసం భారతీయతనలవరచుకున్నవారైనా అయివుంటారు. రాజలాంఛనకలాపాలన్నీ భారతీయ సాంప్రదాయాలను పోలియుండి, సంస్కృతంలో జరుపబడేవి. ప్రభుత్వాధికారులహోదాలూ, బిరుదులూ సంస్కృతపదాలైవుండేవి. ఈనాటికీ థాయిలండ్‌లోనూ, మలయాలోని ముస్లింరాజ్యాల్లోనూ యిట్టి పేరులే వాడబడుతున్నాయి. ఈదేశాలకు సంబంధించిన పురాతనసార

స్వతంలో (ఇండొనీషియాలో లభించింది) అంతటా భారతీయపురాణాలు, గాథలకు చెందిన కథాంశాలే వున్నాయి. జావా, బాలిద్వీపాలలో ప్రసిద్ధికెక్కి, నేటికీ ఆ దేశాలకు వన్నె తెస్తున్న నృత్యాలు భారతీయనృత్యకళనుండి జనించినవే.* అతిచిన్నద్వీపమైన 'బాలి' పురాణ భారతీయసంస్కృతీస్వభావాన్ని ఆధునికకాలంలోకూడా కొనసాగిస్తూనే వుంది. ఇప్పటికీ అక్కడ హిందూమతం దృఢంగానే వుంది. అసలు వ్రాతకళను ఫిలిప్పీనులకు ఇండియాయే నేర్పింది.

కంబోడియాలోని అక్షరమాల దక్షిణఇండియాభాషలనుండి ఉద్భవించినదే. అనేక సంస్కృతపదాలను అనుగుణ్యంగా మార్చుకుని తమభాషలో కలుపుకున్నారు. అక్కడి సివిలు, క్రిమినలుచట్టాలు భారతీయన్యాయశాస్త్రనిర్మాతయగు "మనువు" శాసనాలను అనుసరించినవే. బౌద్ధప్రభావంవల్ల అవి కొద్దిగా మార్పుచేయబడి, క్రోడీకరించబడి నేటి కంబోడియాశాసనములుగా స్వీకరించబడ్డాయి.

కాని, యీ అన్నిటిలోకంటె, ఆ వలసదేశాలలోగల చిత్రకళ, శిల్పకళల్లోనే భారతీయకళాప్రభావం స్పష్టంగా ముద్రితమయింది. మూలంలోని ఉత్తేజము కొంత మార్చబడి, అనుగుణంగాచేసుకోబడి, ఆ దేశవిశిష్టతతో సమ్మేళనంచేయబడింది. ఈ కలయికనుండియే ఆంకోర్, బోరోబుదూర్‌లలో స్మారకచిహ్నాలూ, దేవాలయాలూ మహోన్నత సౌందర్యరాసులుగా వెలిశాయి. జావాలోని బోరోబుదూర్‌లో బుద్ధునిజీవితమంతా రాళ్ళలో చెక్కబడింది. ఇతరచోట్ల విష్ణు, రామ, కృష్ణగాథలను కుడ్యశిల్పాలుగా మలిచారు. ఆంకోర్‌ను గురించి ఆస్బర్ట్ సిట్వెల్ ఇలా వ్రాశాడు: "ఒక విషయాన్ని వెంటనే చెప్పాలి. ఆంకోర్ ప్రస్తుత స్థితిలోనే - ప్రపంచవిచిత్రాలన్నింటిలోనూ ముఖ్యమైనది. మానవవిశిష్టవిజ్ఞానం రాళ్ళతో ఉపలక్షించి చేరగల మహోన్నతశిఖరం యిది. చైనాలో చూడదగిన ఏవిశేషానికన్నాకూడా ఆంకోర్ నిస్సంశయంగా ఆకర్షణీయము, సుందరతమమునైన మహాద్భుతం......ఆరుశతాబ్దాలకాలం రెక్కలువిప్పి, ప్రతిభావంతంగా విహరించి, పూర్తిగా వినాశనమైపోయిన నాగరికతాభౌతికచిహ్నం యిది. ఆ నాగరికతపేరైనా నేటిమానవుడుచ్చరించకపోవచ్చును."

"ఆంకోర్‌వాట్" మహాదేవాలయంచుట్టూ గల. విశాల ప్రాంతం నేడు శిథిలాలుగా వుంది. అందులో కృత్రిమసరస్సులు, కొలనులు, కాలువలు, వంతెనలు వున్నాయి. ఒక పెద్దద్వారంమీద కొట్టవచ్చినట్లుండే పెద్దప్రతిమ వుంది. అది అందంగా, చిరునవ్వొలొలుకుతూ—అయినా, అర్థంకాని ఏదో భావనతో – వుండే కంబోడియన్ పురుష ముఖం. దాన్నిచూస్తూంటే ఒకమానవుడు దేవునికుండేంతశక్తి, సౌందర్యాలను వశంచేసుకుని, యిలా వున్నాడేమోననిపిస్తుంది. ఆ ముఖంలోని చిరునవ్వు విచిత్రాకర్షణతో చూచేవారిని కలవరపెడుతుంది. దీన్ని "ఆంకోర్‌నవ్వు"అంటారు. ఆ నవ్వు మరలమరలనవ్వినట్లుంటుంది. ఈ ద్వారంగుండా దేవాలయానికి వెళ్ళాలి. "ఆపక్కనేఉన్న 'చేయాన్' దేవాలయం ప్రపంచంలోకల్లా విశిష్టమైన ఊహాతీతమైన నిర్మాణమని చెప్పవచ్చు. ఇది ఆంకోర్‌వాట్‌కంటె లోకాతీతమైనదిగనుక, అంతకంటే అలౌకికంగావుంటుంది. అది మరోగ్రహంనుంచి తీసుకువచ్చి యీ భూమిమీద నిలబెట్టబడిందా అనిపిస్తుంది. మహాకావ్యపంక్తులమధ్య నివసిస్తూ, మనకందకుండా తప్పించుకునే భావనవంటి అపురూపం అది."

ఆంకోర్‌నిర్మాణంలోగల ఉత్తేజం ఇండియాదే. కాని ఖమీర్ విశిష్టమేధస్సే దాన్ని నిర్మించింది. లేదా ఈ రెండువిశిష్టతలూ మిళితమై యీ విచిత్రాన్ని సృష్టించిఉంటాయి. దీన్ని నిర్మించాడనబడే కంబోడియారాజుపేరు 7వ జయవర్మ. ఇది భారతీయనామ మనడానికి ఒక ఉదాహరణ. డాక్టర్ క్వారిచ్ వేల్స్ యిలాఅన్నాడు: "మార్గదర్శకంగావున్న భారతీయహస్తాన్నితొలగించినా దానిఉత్తేజాన్ని మరువలేదు. కాని ఖమీర్‌విశిష్టతయే దీనిని మలచేందుకు వదలబడింది. ఆ ఉత్తేజంనుంచి ఈ విశిష్టత ఆశ్చర్యకరమైన సంచలనాత్మక విశాలభావుకత్వంతో ఆంకోర్‌వాట్‌ను మలచింది. పూర్తిగా భారతీయవాతావరణంలో వికసించిన దేనితోనూ. దీన్ని పోల్చరాదు. ఇది అందుకు భిన్నమైన మరో అపురూపం...అసలు, ఖమీర్‌సంస్కృతియే భారతీయఉత్తేజంతో నిర్మింపబడిందనేది యథార్థమే. అదే లేకపోతే మధ్యఅమెరికామధ్యభాగాలలో వారు నిర్మించగలిగిన మొరటురంగుల తళతళలు తప్ప యీ ఖమీరు లిట్టి కళాస్వరూపాన్ని నిర్మించగలిగేవారా?

కాదు. కాని మహాభరతఖండంలోని యితరప్రదేశాల్లోకంటె యిక్కడే భారతీయఉత్తేజం సారవంతమైనక్షేత్రాలలో బీజాన్ని నాటినట్లయింది.''

ఇవన్నీ ఆలోచించినవారు ఇండియామేధ, గడ్డ పని యెక్కువై, ఆహారపుష్టితక్కువై, కొత్తప్రవాహాలూ, భావాలూ ప్రవహించనందున, స్వతస్సిద్ధంగావున్న ఉత్తేజాన్ని క్రమక్రమంగా కోల్పోయాయేమోనని అనుకోవచ్చు. ఇండియా తనహృదయాన్ని ఎప్పుడూ తెరచిఉంచి, తనసంపదలను యితరులకుధారాళంగాయిచ్చింది; తనకులేని వాటిని వారినుండి స్వీకరించింది; తానెప్పుడూ నిత్యనూతనంగా, బలంగా, సంచలనాత్మకంగానే ఉంది. కాని విదేశీప్రభావాలవల్ల మైలపడకుండా తనపవిత్రతను కాపాడుకోవాలనేతాపత్రయంతో తనను తా నెంతగా కుంచించుకుపోసాగిందో, అది అంతఎక్కువగానే తనఉత్తేజాన్ని కోల్పోయింది. ఆమెజీవితం మరణించినచరిత్రచుట్టూ తిరిగే అర్థంలేని నిర్జీవపు గానుగెద్దువతుగా మారిపోయింది. సృజనాత్మకసౌందర్యాన్ని సృష్టించే కళను మరచిపోవడంతో, ఆమెబిడ్డలు అట్టిదాన్ని గుర్తించేశక్తినికూడా కోల్పోయారు. జావా, ఆంకోర్, మహాభరతఖండంలోని తదితర ప్రాంతాలలో త్రవ్వకాలకూ అన్వేషణలకూ కారకులైన యూరోపియన్ (ముఖ్యంగా ఫ్రెంచి, డచ్చివారు) పండితులనూ, పురాతత్వశాస్త్రజ్ఞులనూ మనం శ్లాఘించాలి. ఆ ప్రాంతాలలో ఇప్పటికీ ఇంకా అనేక గొప్పనగరాలూ, మహానిర్మాణాలూ భూగర్భంలో దాగియుండి, కనుగొనబడవలసియుండవచ్చు. ఈలోగా మలయాలో ప్రఖ్యాత పురాతనశిథిలాలుగల ప్రముఖప్రదేశాలు ఖనిజాలకోసం గనులనుత్రవ్వడంవల్ల, రోడ్లువేయడంవల్ల నాశనంచేయబడుతున్నాయి. ఈ యుద్ధంకూడా వాటిని మరింత ధ్వంసంచేయవచ్చు.

ఒకతాయివిద్యార్థి టాగూరుగారిశాంతినికేతనంలో విద్యార్జనకై వచ్చి, తిరిగి తాయిలండ్ (సయాం) వెడుతూ, కొన్నిసంవత్సరాలక్రితం నా కొక లేఖవ్రాశాడు. ''నే నీ గొప్పపురాతనదేశమైన ఆర్యావర్తానికి రాగలిగినందుల కెంతో అదృష్టవంతుడనని,ఎప్పుడూ భావి ను.ఇండియా మా అవ్వ. ఆమెచేతుల్లో నా మాతృదేశం ప్రేమతో పెంచబడింది. ఆమెయే మాతల్లికి ప్రకృతిసౌందర్యాన్ని, మతగాంభీర్యాన్నీ గుర్తించడమూ, ప్రేమించడమూ నేర్పింది. అట్టిఅవ్వపాదాలకు నా వినయపూ

ర్వకకృతజ్ఞతల నందజేసుకోగలిగినందుకు నేను ప్రత్యేకంగా మహాఅదృష్ట వంతుడనని భావిస్తాను" అనివ్రాశాడు. ఇది ఒకవిశిష్టమైనలేఖ కాక పోవచ్చు. కాని ఆగ్నేయాసియా దేశాలకు ఇప్పటికీ భారతదేశంపట్ల - ఒక్కొక్కప్పుడు అస్పష్టంగానే అయినా - గల గౌరవభావాన్ని సూచిస్తుంది.

ప్రతిదేశంలోనూ సంకుచితమైన తీవ్ర జాతీయవాదం పెంపొందింది. తమనుతాము గొప్పఅనుకుంటూ, ఇతరులందరనీ అవమానిస్తూ, యూరోపియనులదురాక్రమణలపట్ల భయ, ద్వేషాలున్నా, యూరపు అమెరికాలతోపోటీపడగోరడం మొదలైనవి యెక్కువయ్యాయి. ఇండియా బానిసగావున్నందువల్ల నీచంగాచూడడంకూడా కద్దు. కాని, దానివెనుక ఇండియాపట్ల గౌరవ, మైత్రీభావాలుకూడా వున్నాయి. ఎందువల్లనంటే పురాతనస్మృతులు మాసిపోవుగదా! తమదేశాలకు ఒకప్పుడు ఇండియా తల్లివంటిదిగా వుండేదనీ, తనసంపద్భాగ్యాల్లోంచి కొంతయిచ్చి తమదేశాలను సాకినదనీ ప్రజలు మరువలేరు. గ్రీసుదేశపు హెలెనిజం మధ్యధరాప్రాంత దేశాలకూ, పశ్చిమాసియాకూ వ్యాపించి నట్లే, భారతీయసంస్కృతీప్రభావం అనేకదేశాలకు వ్యాపించి, వాటిపైన తన బలమైన చిహ్నాలను ముద్రించింది.

సెల్విన్ లెవీ మాటల్లో: "పర్షియానుంచి చైనాసముద్రంవరకు, మంచుగడ్డలసైబీరియానుండి జావా, బోర్నియోద్వీపాలవరకూ, ఓసియానియానుండి సోకోత్రావరకూ ఇండియా తనవిశ్వాసాలనూ, కథలనూ, నాగరికతనూ విస్తరింపజేసింది. అనేకశతాబ్దాలక్రమంలో, ఇండియా తనముద్రలను ప్రపంచమానవకోటిలో నాలుగవవంతుపై అచ్చొత్తింది. చిరకాలంగా ఇండియాకుగలగౌరవస్థానాన్ని అజ్ఞానంచే ఎవ్వరూ దానికివ్వలేదు. కాని ఇప్పుడామె ప్రపంచచరిత్రలో ఉన్నతస్థానాన్ని అధిష్టించేహక్కు కలిగివున్నదని అందరికీ తెలిసింది. మానవతోత్తేజాన్నిసంగ్రహపరచి, సూచనగా రచించినచరిత్రలో గొప్పగొప్ప జాతులకుగల మహోన్నతస్థానాల్లో ఇండియా అర్హస్థానాన్ని అలంకరించగలదు.

## ౧౮. ప్రాచీనభారతకళ

భారతీయసంస్కృతి, కళలు యితరదేశాలకు అద్భుతంగా వ్యాపించడంవల్ల, ఇండియాకు వెలుపలి దేశాలలో యీకళలు అత్యుత్తమ భావాలను వెలిబుచ్చడం జరిగింది. దురదృష్టవశాత్తూ మనదేశంలోగల (ముఖ్యంగా ఉత్తరప్రాంతంలో) పురాతనశిల్పాలు, కట్టడాలు యుగాలు గడవడంవల్ల అనేకంపాడైపోయాయి. "ఇండియాలోమాత్రమేగల భారతీయకళను తెలుసుకోవడం, ఆ కళను సగంవరకే తెలుసుకున్నట్లవుతుంది. దాన్ని పూర్తిగా అవగాహనచేసుకోవాలంటే, మనం బౌద్ధం అడుగు జాడలననుసరిస్తూ, మధ్యఆసియా, చైనా, జపానులకు వెళ్ళాలి. అది బర్మా, టిబెట్, సయాములలో వ్యాపిస్తూ, నూతనరూపాలుధరించడాన్ని, కొత్తఅందాలుగావిడివడటాన్నిమనం పరికించాలి. కంబోడియా, జావాలలో అది సృష్టించిన సాటిలేని సౌందర్యసంపదను, మనం నివ్వెరపడి చూడాలి. వీటిలో ప్రతిఒక్క దేశంలోనూ భారతీయకళ ఒక్కొక్క ప్రత్యేకమైన జాతీయవిశిష్టతను, ఒక్కొక్క విభిన్నస్థానికవాతావరణాన్నిఎదుర్కొంటుందనీ, వాటి దిద్దుబాటులలో తానొక నూతనరూపం ధరిస్తుం"దనీ సర్ జాన్ మార్షల్ అన్నాడు.

భారతీయమతతత్వాలతో అతిసన్నిహితంగా పెనవేసుకొనివుండడంవల్ల, భారతీయ మేధస్సునుపాలించినఆదర్శాలను తెలుసుకుంటేగాని భారతీయకళను పూర్తిగా గుర్తించడం కష్టం. సంగీతరంగంలో ప్రాక్పశ్చిమభావనలమధ్యవలెనే, కళారంగంలోనూ గొప్ప అగాధం వుంది. బహుశా మధ్యయుగాలలోయూరపులోనిగొప్పకళాకారులూ, వాస్తుశిల్పులూ భారతీయకళ, శిల్పాల నెక్కువ ఆత్మీయంగా గుర్తించగలిగేవారనుకుంటాను. ఆధునికయూరోపియన్కళాకారులూ, శిల్పులూ పునరుజ్జీవనయుగము, ఆతరువాతికాలాలనుంచే తమఉత్తేజాన్నిపొందుతున్నారుగనుక, భారతీయకళాశిల్పాల నంతగామెచ్చుకోలేకపోవచ్చును. భారతీయకళలలో ఎల్లప్పుడూ ఒకరకమైనమతప్రేరేపణ, ఆవలికాలంలోకి ఆవలిప్రపంచంలోకి చూడడం వున్నాయి. బహుశా ఇదేదృక్పథం యూరపులో గొప్ప క్రైస్తవాలయాలనునిర్మించిన శిల్పులకు వుండివుంటుంది. సౌందర్యాన్ని సంచలనాత్మకమైనదిగా భావించాలి గాని,

బాహ్యరూపప్రదర్శితంగా యెంచవలసినదికాదు. ఒక విషయంలోగాని, రూపంలోగాని సుందరరూపాన్ని పొందినప్పటికీ, అది ఆత్మప్రధాన మైనదే. గ్రీకులు అందంకోసమే అందాన్ని ప్రేమించేవారు. కాని అందులో ఆనందాన్నేగాక సత్యాన్నికూడా గ్రహించేవారు పురాతన భారతీయులు సౌందర్యాన్నికూడాప్రేమించేవారు. కాని, తమసృష్టిలో గంభీరభావాన్ని, తాముచూచిన ఒకానొక అంతర్గతసత్యాన్ని సాక్షాత్కరింపజేయటానికే సదా ప్రయత్నించేవారు. భారతీయులు సృష్టించిన మహోన్నతఉదాహరణలలో కర్తలు వుద్దేశించిన భావ మెటువంటిదో అర్థంకాకపోయినప్పటికీ, ఆ సృష్టిలోని మూలాదర్శాలు యేవో తెలియకపోయినప్పటికీ, చూచినవారు ప్రశంసించకుండావుండలేనిశక్తి వుంటుంది. తక్కువస్థాయిగల కళాసృష్టులను చూచినవారు వాటినర్థంచేసుకోలేకపోయినా, కళాకారునిహృదయాన్ని గ్రహించలేకపోయినా, వాటిని హర్షించలేనిఅడ్డుగోడ యేర్పడుతుంది. అలాంటప్పుడు ఒక అస్పష్టమైన అసౌఖ్యకరమైనభావం యేర్పడుతుంది. కొంత కోపంకూడా కలుగవచ్చు. మనం గ్రహించలేని ఏదోభావన కలుగుతుంది. అందువల్ల మనం ఆ కళాకారుడు తనకృషిలో విఫలుడయ్యాడనీ, అతనిబాధ్యతలు అతనికి తెలియవనీ అనుకుంటాం. ఒక్కొక్కసారి అసహ్యాభావంకూడా కలుగవచ్చు.

నాకు ప్రాక్పశ్చిమాల్లో దేన్నిగురించీ తెలియదు. అందువల్ల నాకు దాన్నిగురించి చెప్పే అర్హత లేదు. నేను దాన్నిచూచినపుడు సంస్కారంలేని సామాన్యవ్యక్తివలెనే చలిస్తాను. ఒకచిత్రమో, శిల్పమో, కట్టడమో నన్ను ముగ్ధుణ్ణిచేస్తుంది, లేక నన్ను కదిలించి, ఒకవిచిత్రోత్తేజాన్ని పొందజేస్తుంది, లేక నాకు అల్పసంతోషం కలిగిస్తుంది. లేక అది నాలో ఏభావమూకలిగించలేదు; నేను దాన్ని సరిగా గమనించనట్లే దాటిపోతాను; లేదా అది నన్ను విముఖుణ్ణిచేస్తుంది. నేను యీ ప్రతిసంచలనాలను వివరించనూలేను, కళాసృష్టుల మంచిచెడులనుగురించి విజ్ఞుడనైనట్లు మాట్లాడనూలేను. అనూరాధపురం (సింహళం)లోని బుద్ధవిగ్రహం నన్నెంతో కదలించివేసింది. దాని ప్రతిచిత్రం చాలా సంవత్సరాలుగా నా నేస్తంగా ఉంటోంది. మరోవైపున దక్షిణభారతంలోని

కొన్ని ప్రఖ్యాతదేవాలయాలు అనేక చెక్కడాలూ, వివరాలూ కలిగి వున్నప్పటికీ నన్ను చీకాకుపరుస్తాయి, అసహ్యాభావం కలుగజేస్తాయి.

యూరోపియనులు గ్రీకుకళాసాంప్రదాయాలలో తరిఫీదుపొందిన వారగుటచే, భారతీయకళను అదేదృక్పథంలో గమనించారు. తా మెరిగిన గ్రీకు - బౌద్ధకళను గాంధారము, సరిహద్దుల్లోనికళను, మనకళలతో పోల్చుకోగలిగారు. మిగతా ఇతరకళారూపాలను హీనస్థాయివన్నారు. క్రమంగా నూతనదృక్పథం అలవరచుకున్నారు. గ్రీకు - బౌద్ధకళనుండి భారతీయకళ జన్మించలేదనీ, అది భారతీయకళయొక్క ఒక తెలిమబ్బు ఛాయవంటిదిమాత్రమేననీ, భారతీయకళ ఒకప్రత్యేకమైనదీ, సజీవమైనదీననీ యిపుడు గుర్తిస్తున్నారు. ఈ నూతనదృక్పథం ఇంగ్లండులోకంటె, యూరపుఖండంలోనే అధికంగావున్నదని మనం గుర్తించాలి. విచిత్రమేమంటే భారతీయకళ (సంస్కృతసారస్వతంకూడా) ఇంగ్లండులోకంటె, యూరపులోనే యెక్కువగా గుర్తింపబడింది. ఇది ఇండియా, ఇంగ్లండుల మధ్య యేర్పడిన దురదృష్టకర రాజకీయకారణంవల్ల నేనేమోనని నేననేక సార్లు ఆశ్చర్యపడ్డాను. ఇంకా ఇతర ప్రాథమికవిభేదాలుకూడా కారణమై వుంటాయి. ఆంగ్లేయులలోకూడా అనేకమందికళాకారులూ, పండితులూ, అభిమానులూ మనకళాహృదయాలను, దృక్పథాలను సమీపించి, మన పురాతన కళానిక్షేపాలను వెతికితీయడానికితోడ్పడి, ప్రపంచానికి తెలియజేసినవారు లేకపోలేదు. అనేకమంది ఆంగ్లేయులుచూపిన హృదయపూర్వకమైత్రి, సేవాదృష్టులకు ఇండియా యెంతో కృతజ్ఞతకలిగివుంది. అయినప్పటికీ భారతీయులకు, ఆంగ్లేయులకుమధ్య దాటలేనిఅగాధం ఒకటి ఉన్నదనే యథార్థం మాత్రం మరువలేము.

ఇటీవలజరిగిన అనేకవిషయాలు మనహృదయాలను తీవ్రంగా గాయపరచాయి, గనుక, భారతీయులకు (కనీసం నాకు) యీభేదాన్ని అర్థంచేసుకోవడం తేలికే. అవతలివారిలోకూడా అనేకకారణాలవల్ల యిటువంటి అభిప్రాయాలేర్పడివుండవచ్చు. వారిదృష్టిలో తమతప్పేమీ లేకపోయినప్పటికీ ప్రపంచందృష్టిలో తామే తప్పుచేసినట్లుగా కనిపించేటట్లు ఇండియా ప్రవర్తించిందనే కోపంకూడా వుండవచ్చు. కాని యీ భావం రాజకీయాలకంటె గాఢమైంది. అది తెలియకుండానే బైటపడుతూ, ముఖ్యంగా ఆంగ్లవిజ్ఞానుల నెంతో యిబ్బందిపెడు

తున్న దనిపిస్తుంది. వారిదృష్టిలో భారతీయుడు అవగుణాలకాట పట్టు. అతనిపనులన్నింటిపైన అదే ముద్ర వుంటుంది. ఒక ప్రఖ్యాత ఆంగ్ల రచయిత (అతడు ఆంగ్లవిజ్ఞానానికీ, ఆలోచనాశక్తికీ ప్రతినిధికాక పోయినా) భారతీయులకుచెందిన ప్రతివిశేషాన్నీ ద్వేషం, జుగుప్సా భావాలతో చిత్రిస్తూ, ఒక గ్రంథం వ్రాశాడు. అంతకంటె గొప్ప వాడూ, ఆంగ్ల రచయితల ప్రతినిధియనదగ్గవాడూ ఆస్బర్ట్ సిట్వెల్ తన 'ఎస్కేప్ విత్ మి' (1941) అనే గ్రంథంలో యిలా వ్రాశాడు: "ఇండియాలో అనేక వేర్వేరు విచిత్రాలున్నప్పటికీ, భారతీయమనేభావన జుగుప్సాభావాన్నే కలిగిస్తోంది. హిందూకళాఖండాలలో వుండే జిడ్డుగుణం తరచుగా ఆ కళపట్ల జుగుప్సాభావాన్నే కలిగిస్తుంది."

ఇండియాపట్ల, ముఖ్యంగా భారతీయకళపట్ల సిట్వెల్ యిట్టి అభిప్రాయాలను కలిగివుండడంలో అన్యాయం లేదు. ఆయన అలా భావించివుంటాడనే నా విశ్వాసం. నేనుకూడా ఇండియాలోని అనేక విషయాల్లో అట్టిభావాన్నే పొందాను; కాని, మొత్తంఇండియాపట్లనే అలాంటిభావాన్ని ఏర్పరచుకోలేను. సహజంగా నేను భారతీయుణ్ణి గనుక, నే నెంత అయోగ్యుడనైనప్పటికీ నన్ను నేను అసహ్యించుకోలేనుగదా! కాని ఇక్కడ చర్చ కళమీద వ్యాఖ్యానాలు, అభిప్రాయాలనుగూర్చి కాదు. ఇది ఒకజాతిఅంతటిపట్ల హృదయపూర్వకంగా తెలిసీ, తెలియకుండానే విముఖత్వాన్నీ, మైత్రీవిహీనభావాన్ని కలిగి వుండడం. మనం ఎవరినైతే గాయపరచామో వారిని అయిష్టంగా చూడడం, ద్వేషించడం సహజమా?

భారతీయకళనుగుర్తించి, దానికి నూతన దృక్పథాన్ని వర్తింపజేసిన ఆంగ్లప్రముఖులలో లారెన్స్ బినియన్, ఇ. బి. హావెల్ ముఖ్యులు. హావెల్ భారతీయకళాదర్శాలు, వాటివెనుకగల ఆత్మపట్ల ప్రత్యేకగౌరవోత్సాహాన్ని ప్రదర్శించాడు. "ఒక గొప్ప జాతీయకళ ఆ జాతి ఆలోచనలనూ, వ్యక్తిత్వాన్నీ సన్నిహితవివరాలతో వెల్లడిస్తుంది. కాని, ఆ గుణాలవెనుకగల ఆదర్శాలనుకూడా వెల్లడించినప్పుడే మన మా కళను అభినందించాలి." అని హావెల్ ఉద్ఘాటించాడు. ఒకవిదేశీపాలకజాతి ఆ ఆదర్శాలను అపార్థంచేసుకుని, ఏవగించుకున్నట్లయితే, వైజ్ఞానికవిరోధానికి బీజాలునాటినట్లవుతుంది. "భార

తీయకళ ఏ కొద్దిమందివిద్యావేత్తల సంకుచితపరిధికో ఉద్దేశించబడలేదు. దానిముఖ్యోద్దేశం మత, తత్వవిశేషాలు సామాన్యప్రజానీకానికంతటికి అర్థమయ్యేటట్లుచేయడమే. అది ఈ ప్రయోజనాన్ని సాధించిందని గట్టిరుజువులే వున్నాయి. భారతీయరైతులు, పాశ్చాత్యరైతులకంటె విద్యావిహీనులైనప్పటికీ, వారు ప్రపంచంలో తమవర్గంవారు మరెవరూ పొందలేని సంస్కృతీస్థాయిని పొంది, కళలను గుర్తించి, ఆనందించగల రని భారతీయజీవితాన్ని సన్నిహితంగాచూచినవారు తెలుసుకోగలరు." అని కూడా ఆయన చెప్పాడు.

సంస్కృతకవిత, భారతీయసంగీతాలలోవలెనే కళావిషయంలో కూడా కళాకారుడు ప్రకృతివాతావరణభావాలతో మమైక్యతచెంది, మానవుడు ప్రకృతిప్రపంచంలోకలసి పొందే ప్రశాంతిని వెలిబుచ్చాలని ఎంచబడింది. ఆసియాకళలన్నింటికీ మూలభావన యిదే. ఇందువల్లనే ఆసియాకళలన్నిటిలోను వాటిమధ్య జాతీయవిభేదాలూ, వైవిధ్యమూ వున్నప్పటికీ ఒకవిధమైన ఐక్యత కనిపిస్తుంది. ఇండియాలో అజంతా కుడ్యచిత్రాలుతప్ప ప్రాచీనకళగా చెప్పకోదగ్గది అంతగా లేదు. బహుశా చాలాభాగం నశించిపోయివుంటుంది. చైనా, జపానులు పురాతనచిత్ర కళలో అత్యున్నతంగా నిలచినట్లే ఇండియా తన శిల్ప, వాస్తుకళలలో మహోన్నతిని ప్రదర్శిస్తున్నది.

యూరోపియన్‌సంగీతానికి పూర్తిగా భిన్నమైన భారతీయ సంగీతం స్వీయమార్గంలో మహోన్నతంగా పురోగమించి, ఆసియాదేశాల (చైనా, దూరప్రాచ్యాలుతప్ప) సంగీతాన్ని ప్రభావితంచేసింది. ఆవిధంగా సంగీతం పర్షియా ఆఫ్ఘనిస్తాన్, అరేబియా, టర్కిస్తాన్, అరబ్బీ నాగరికతపెంపొందినఆఫ్రికా మొదలగుప్రాంతాలకు ఇండియాతో సన్నిహితసంబంధాలు ఏర్పరచినమరొకబంధం అయింది. బహుశా యీ దేశాలన్నింట భారతశాస్త్రీయసంగీతం మన్ననలందుకుంటుంది.

ఇండియా, ఆసియాదేశాలలో కళాభ్యుదయంలోని ఒకానొక ప్రఖ్యాతప్రభావం ఏమిటంటే, దేవతావిగ్రహాలపట్ల మతవిషయికమైన వ్యతిరేకభావం. వేదాలు విగ్రహారాధనను నిషేధించాయి. బౌద్ధమతంలోకూడా చాలాకాలంతరువాత గాని బుద్ధవిగ్రహాలూ, చిత్రాలూ నిర్మింపబడలేదు. మధుర వస్తుప్రదర్శనశాలలో ఒక బోధిసత్వశిలా

విగ్రహం వుంది. అది బలీయంగా, శక్తివంతమైనమూర్తిగా వుంది. ఇది క్రీస్తుశకారంభప్రాంతపు కుషానులయుగంనాటి శిల్పం.

బహుశా చైనాప్రభావంవల్ల కాబోలు, తొలిభారతీయకళల్లో వాస్తవికత ఎక్కువగా ఉండేది. భారతీయచిత్రకళాచరిత్రలో అనేక స్థాయిలలో చైనాకళాప్రభావం ద్యోతకమవుతుంది. ముఖ్యంగా మనకీ వాస్తవికదృక్పథం చైనాకళనుంచి రాగా, మన ఆదర్శవాదం చైనా, జపాను మొదలగుదేశాలకు వ్యాపించి వారిమహత్తరయుగాలపై తన ప్రభావాన్ని ప్రసరింపజేసింది.

స్వర్ణయుగమనబడే (4–6 శతాబ్దాలమధ్య) గుప్తులకాలంలో అజంతాగుహలు తొలచబడి, కుడ్యచిత్రాలు చిత్రించబడ్డాయి. బాఘ్, బాదామిగుహలు కూడా యీ కాలానివే. అజంతాగుహలు కొన్ని శతాబ్దాలపాటు కనుమరుగునపడి, పునర్దర్శనమిస్తున్నప్పటినుంచీ భారతీయచిత్రకారులలో ఎంతో మార్పువచ్చింది. అజంతాచిత్రకళ సౌందర్యవంతమైనదే కాని, అది చిత్రకారులు వాస్తవజీవితాన్ని విస్మరించి, తనశైలినే అనుసరించేటట్లుచేయడంవల్ల వారికళాశైలి తరచుగా ఎంతో వికృతంగా తయారయింది.

అజంతా మనల్ని సుదూరస్వప్నంవంటి – అయినా, అతివాస్తవికమైనటువంటి–ప్రపంచానికి తీసుకుపోతుంది. ఆ కుడ్యచిత్రాలు బౌద్ధభిక్షువులచే చిత్రింపబడ్డాయి. వారిగురువు బహుకాలంక్రితమే "స్త్రీలకు దూరంగా వుండు, వారివైపు చూడనైనాచూడకు, వారు ప్రమాదకరులు" అని బోధించాడు. అయినా, అజంతాగుహాలనిండా అసంఖ్యాకంగా స్త్రీలే – రాణులు, గాయనీమణులు, నర్తకీజనం కూర్చుని, నిలబడి అలంకరించుకుంటూ, ఊరేగుతూండే సుందరాంగులు–కనుపిస్తారు. అజంతాస్త్రీలు ప్రపంచప్రసిద్ధికెక్కారు. ఆ బౌద్ధకళాకారులు (ఎక్కువగా బౌద్ధసన్యాసులే) ప్రపంచాన్ని కదలించే జీవితనాటకాన్ని ఎంత బాగా గ్రహించారు! వారు బోధిసత్వుని ప్రశాంత, పారలౌకికశివితో చిత్రించినంతప్రేమ, శ్రద్ధలతోనే యీ స్త్రీలనుకూడా ఎంత చక్కగా చిత్రించారు!!

ఏడు ఎనిమిదవశతాబ్దాల్లో ఎల్లోరాగుహాలయాలు శిలల్లో మలచబడ్డాయి. బ్రహ్మాండమైన కైలాసదేవాలయం యీ గుహాలకు

కేంద్రంగా వుంది. ఈ విశాలకళాప్రపంచాన్ని ఆ శిల్పు లెలా ఊహించ గలిగారో, ఊహించినదానికి దేహము, ఆకారము, రూపమూ ఎలా యివ్వగలిగారో మనం వూహించలేము. శక్తి, సజీవత్వం మూర్తీభ వించిన త్రిమూర్తివిగ్రహం గల ఎలిఫెంటాగుహలు ఆ కాలంలోనివే. దక్షిణభారతంలోని 'మామల్లాపుర'శిల్పాలు (మహాబలిపురం) కూడా ఆ యుగానికి చెందినవే.

ఎలిఫెంటాగుహాలలో నటరాజ (నర్తించేశివుడు) విగ్రహం పగిలిపోయివుంది. "శిథిలస్థితిలోవున్నా, అదిగంభీరమైన ఊహాజనితమనీ, లోకాతీతమైన మహాశక్తిసమన్వితమనీ అనిపిస్తుంది. ఆ నాట్యభంగిమలో గల లయ, తాళాలప్రకారం ఆ శిల అంగవిన్యాసంచేస్తూ సంచలిసు న్నట్లుంటుంది. అయినప్పటికీ ఆ పవిత్రముఖం-బుద్ధునిముఖంలో వెలిగే కాంతివలె-ఒకే ఒక పవిత్ర, ప్రశాంత, నిర్లిప్తభావాన్ని వెదజల్లుతూ వుంటుంది" అని హేవెల్ వర్ణించాడు.

బ్రిటిష్‌మ్యూజియంలోని మరొక నటరాజవిగ్రహాన్ని గురించి ఈప్‌స్టీన్ యిలా వ్రాశాడు: "శివుడు నాట్యంచేస్తూ ప్రపంచాన్ని సృష్టిస్తూ, నాశనంచేస్తూవుంటాడు. ఆయన ఆచిఆచివేసేఅడుగులు (చిందులు) యుగయుగాలకాలాన్ని స్ఫురింపజేస్తాయి. ఆయన కదలికలు నిరంతరసృష్టిక్రియలోని ఎడతెగని ఇంద్రజాలికశక్తిని ద్యోతకం చేస్తాయి. బ్రిటిష్‌మ్యూజియంలోగల ఒక సామూహికచిత్రంలోని భావం-ప్రేమికుల ప్రేమపూరితమరణాన్ని చిత్రించే భావనలలో ఎవరూ ఎన్నడూ ఊహించలేనంత విచిత్రంగా వుంది. అది మరేయితరకళకూడా వర్ణించలేనంతస్పష్టంగా - మానవకాంక్షాతీవ్రతలోగల ప్రమాదంతప్పని గుణాన్ని చిత్రించింది. యూరోపియనుల రూపకాలంకారాలు వీటితో పోల్చినపుడు అర్థంలేని దుర్వ్యయం అనిపిస్తుంది. ఈ భారతీయ శిల్ప, చిత్రకళాఖండాలలో మనవాటిలోవలె అన్యాపదేశక అలంకరింపు లుండక అతిముఖ్యమైన, పారదర్శకమైన విశేషంమీదనే కేంద్రీకరణజరుగు తుంది."

బోరోబుదూర్(జావా)లోలభించిన ఒక బోధిసత్వునిశిరస్సును కోపెన్‌హేగెన్‌లోని గ్లిప్టొటెక్ మ్యూజియంకు తరలించుకుపోయారు. అది సాధారణవృక్షఫలంలో అత్యంత సుందరతమశిల్పం. అయినప్పటికీ

"దానిలో మరేదో గాఢమైనగంభీరలక్షణం ఉంది. బోధిసత్వునిపవిత్ర, స్వచ్ఛందహృదయాన్ని అద్దంలోప్రతిబింబించినట్లుగా ఆ ముఖం ప్రతి ఫలిస్తున్నది. ఆ ముఖం సముద్రపులోతుల్లోఉండే నిశ్చలతను, మేఘ రహితనీలిమాకాశంలో ఉండే ప్రశాంతిని, మానవునివ్యూహాలకు అతీత మైన సౌందర్యలహరినీ సమ్మేళనంచేసుకుంది"అంటాడు హేవెల్.

హేవెల్ మరికొన్ని విశేషాలుకూడా వర్ణించాడు, "జావాలోని భారతీయకళకు ఒక స్వీయప్రత్యేకత ఉంది. అది తాను వచ్చినదేశం లోనిరూపానికి భిన్నమైన ప్రత్యేకత. ఈ రెండువిధానాలలోనూ ఒకే రకమైన ప్రశాంతి ప్రవహిస్తూవుంటుంది. కాని ఎలిఫెంటా, మహాబలి పురాల్లో హిందూశిల్పంలో కన్పించే పవిత్ర, గాంభీర్యతలు జావా దేవా లయాదర్శాలలో కనుపించవు. జావాభారతీయకళలో మానవత్వం, ఆనందా లెక్కువ. తమ తాతముత్తాతలు తమభారతదేశంలో ఎదు ర్కొన్న తుపానులు, సంఘర్షణలజీవితానంతరం తా మీా జావా ద్వీపంలో వలసయేర్పరచుకొని, స్థిరపడి, అనుభవిస్తున్న ప్రశాంత, సురక్షిత జీవితభావాలు యీా కళల్లో ద్యోతకమయ్యాయి.

## ౧౯ ఇండియా విదేశవాణిజ్యం

క్రీస్తుశకం మొదటివేయేండ్లకాలంలో భారతదేశవాణిజ్యం విరి విగా వ్యాపించడమేగాక, భారతీయవర్తకులు అనేక విదేశీమార్కెట్లపై ఆధిపత్యంవహించారు. ఇండియా తూర్పుసముద్రాల్లో ఎనలేనిప్రబలశక్తి కావడమేగాక, మధ్యధరాసముద్రంలోకూడా నౌకలను ఆడించింది. మిరి యాలు మొదలైన సుగంధద్రవ్యాలు ఇండియానుండిగాని, ఇండియాగుండాగాని పశ్చిమదేశాలకు వెళ్ళేవి. వీటిని తీసుకుపోయే నౌకలు తరచుగా ఇండియావీ, చైనావీ అయివుండేవి. "అలారిక్ ది గోత్" అనేవాడు రోమునుంచి 3 వేలపౌనులమిరియాలు దోచుకుపో యాడని ఒకకథ వుంది. రోమునగరపుబంగారమంతా ఇండియాకూ, యితరతూర్పుదేశాలకూ విలాసవస్తువులకోసం ప్రవహించిపోతున్నదని రోమన్‌రచయితలు ఎంతగానో వాపోయారు.

ఆకాలంలో ఏదేశంలోలభించే, తయారయేవస్తువులను ఆదేశం యితరదేశాలవస్తువులతో మార్పిడిచేసుకోవడం అలవాటు. ఇండియా

సారవంతమైనభూమియేకాక, ఇతరదేశాలకులేని అనేకవస్తుసంపదలను కూడ కలిగియున్నందున, తనకు సముద్రాధిపత్యంకూడా వుండడంచే తను వాణిజ్యం విరివిగా సాగించింది. కొన్నివస్తువులను యితర తూర్పు దేశాలనుంచి తీసుకువచ్చి, పాశ్చాత్యదేశాలకు పంపుతూ, మధ్యవర్తి వ్యాపారిగాకూడా లాభాలు గడించేది. అంతకుమించిన అవకాశాలు కూడా వుండేవి. ఇతరదేశాలకంటె చాలాముందే, అతిప్రాచీనకాలం లోనే ఇండియా వస్త్రోత్పత్తి చేస్తున్నది. దేశంలో యీ పరిశ్రమ వృద్ధి చెందింది. మనవస్త్రాలు విదేశాలలో విరివిగా అమ్ముడయ్యేవి. చైనా సిల్కువంటి మేలురకం కాకపోయినా, ఒకరకమైన పట్టుబట్టలుకూడా తయారుచేసి అమ్మేది. చైనాసిల్కు మనదేశానికి క్రీ. పూ. 4 వ శతాబ్దిలో వచ్చేది. ఇండియా రంగులువేయడంలో ఎంతో అభివృద్ధిని సాధించి, వెలిసిపోనిరంగులను తయారుచేసింది. ఇట్టిరంగులలో నీలిమందు (ఇండిగో - గ్రీకు దేశస్తులు ఇండియాపరంగా పెట్టినపేరు) ఒకటి. బహుశా యిట్టివి అనేకం తయారుచేయగలిగినందువల్లనే విదేశవ్యాపారులకు ఎక్కువ ప్రోత్సాహం లభించివుంటుంది.

క్రీస్తుశకం తొలిశతాబ్దాలలో ఇతరదేశాలలోకంటె ఇండియాలో రసాయనశాస్త్రం బాగా పురోగమించివుంటుంది. నా కా శాస్త్రాన్ని గురించి ఎక్కువగా తెలియదు గాని, భారతరసాయనశాస్త్రజ్ఞులలో మణిపూసవంటి సర్ పి. సి. రే "భారతరసాయనశాస్త్రచరిత్ర" ను వ్రాశాడు. ఆయనచేతిక్రింద అనేకతరాల భారతశాస్త్రజ్ఞులు తయారయ్యారు. ఆరోజుల్లో రసవాదమూ, లోహశాస్త్రమూ కలసి, రసాయనశాస్త్రంగా భావింపబడేవి. ప్రఖ్యాత భారతీయ రసాయన, లోహశాస్త్రజ్ఞునిపేరు నాగార్జునుడు. ఈపేరుసామ్యంవల్ల అతడే మొదటి శతాబ్దిలోని బౌద్ధాచార్యుడని వాదించసాగారు. కాని అది అనుమానాస్పదం.

ఉక్కుకు పదును పెట్టడం ముందుగా భారతదేశంలోనే ప్రారంభమైంది. ఇండియాలోతయారైన ఉక్కు, ఇనుపవస్తువులు - ముఖ్యంగా యుద్ధసాధనాలు-విదేశాలలోకూడ ప్రసిద్ధిచెందినవి. ఇంకా అనేక లోహాలు, లోహమిశ్రమమైనమందులూ తయారయ్యేవి. వడకట్టడం, భస్మాలుచేయడం బాగాపురోగమించాయి. వైద్యశాస్త్రంవృద్ధిచెందింది.

ఇది ఎక్కువగా పురాతనగ్రంథాలమీద ఆధారపడినప్పటికీ, ప్రయోగ పరిశోధనలుకూడ మధ్యయుగాలవరకు విరివిగాజరుగుతూండేవి. మానవ, జంతుశరీరశాస్త్రాలు అధ్యయనంచేయబడేవి. హార్వే కనిపెట్టకముందే రక్తప్రసారవిశేషాలు ఇండియాలో తెలుసు.

శాస్త్రాలలోకెల్ల పురాతనమైన ఖగోళశాస్త్రం విశ్వవిద్యాలయాల్లో ప్రతిశాఖలోను విద్యార్థికి తప్పనిసరి పాఠ్యభాగంగా వుండేది. దీనితో జ్యోతిశ్శాస్త్రమూ కలిసివుండేది. చాలా క్రమబద్ధమైన పంచాంగం నిర్ణయింపబడి, ఇప్పటికీ అమలులోవుంది. ఇతరదేశాలలోవలెనే ఇండియాలోకూడా మతబోధకులే (బ్రాహ్మణులు) పంచాంగాలు వ్రాయడం, ఋతువులను, పండుగలను, గ్రహణాలను నిర్ణయించడం. తమ యీ విజ్ఞానాన్ని ఆసరాచేసుకుని తమకు మూఢనమ్మకాలని తెలిసినప్పటికీ-ప్రజలలో కొన్ని అంధవిశ్వాసాలనూ, పూజాక్రతువులనూ ప్రచారంచేసి, తమగొప్పతనాన్ని అధికంచేసుకున్నారు. సముద్రయానంచేసేవారికి ఖగోళశాస్త్రంలోని ప్రత్యక్షభాగం తెలిసివుంటే చాలాఉపయోగం. ఈవిషయంలో తమ కెంతో విజ్ఞానంవున్నందుకు ప్రాచీనభారతీయులు ఎంతో గర్వించేవారు. అలెగ్జాండ్రియా కేంద్రంలో వృద్ధిగాంచిన అరబ్బీ ఖగోళశాస్త్రంకూడా భారతీయు లెరుగుదురు.

ఆకాలంలో సాంకేతికసాధనాలు ఎంతవరకు అభివృద్ధిపొందాయో చెప్పలేము. నౌకానిర్మాణపరిశ్రమ ఉచ్చస్థితిలోఉన్నందున, యుద్ధసంబంధమైన అనేకయంత్రాలు ఉదహరింపబడినందున, ఇతరయాంత్రికసాధనాలుకూడా ఉండియుండవచ్చు. ఇట్టి ఆలోచనలు కొందరు అత్యుత్సాహులు, అమాయకులైనభారతీయులు అనేకరకాల క్లిష్టవర్ణనలుగలయంత్రాలను తమపూర్వులేనిర్మించారని వాదించేటట్లుచేశాయి. ఏమైనప్పటికీ, యీ సాంకేతిక యంత్ర, రసాయన, ఖగోళ, లోహశాస్త్రరంగాలలో ఇండియా ఇతరదేశాలకంటె వెనుకబడిమాత్రం లేదు. ఈ సర్వావకాశాలూ, శక్తులూ వుండడంవల్లనే ఇండియా అనేకశతాబ్దాలపాటు విరివిగా విదేశీవ్యాపారం చేయగలిగింది.

గ్రీకు మొదలగు తొలినాగరికతలలో బానిసవిధానం వుండి, పనులన్నీ బానిసలే చేయవలసివుండేది. అదే ఆ నాగరికతలు పురోగమించకుండా అడ్డంకిగా నిలచింది. ఇండియాకు అట్టిఅడ్డంకులు లేవు. క్రమంగా

పెంపొందుతున్న కులాలపద్ధతి అనేక చెడుగులుకలదైనప్పటికీ, వృత్తి ప్రధానభావం కలది గనుక, అతి హీనతరగతివారు కూడా తమ బాధ్యతలను ఉత్సాహంతో నిర్వర్తించేవారు. ఈపద్ధతి చేతివృత్తులు, ఇతరవృత్తులలో ప్రత్యేకనైపుణ్యం పెంపొందేందుకు ప్రోత్సహించింది.

## ౨౦ ప్రాచీన భారతదేశంలో గణితశాస్త్రము

భారతీయులు ఉన్నత విజ్ఞానవంతులూ, రూపంలేనివాటిని గురించికూడా ఎక్కువగా ఆలోచించేవారూ గనుక, గణితశాస్త్రంలో కూడా గొప్పవారైవుంటారని భావించవచ్చు. యూరపు అంక, బీజగణితాలను అరబ్బులనుంచి నేర్చుకుంది. అందువల్లనే ప్రపంచమంతటా వాడుకలోవున్న అంకెలను అరబ్బీఅంకెలంటారు. కాని ఆ అరబ్బీలే ఇండియానుంచి అంకెలు నేర్చుకున్నారు. భారతీయులు ఆకాలంలో గణితశాస్త్రంలో ఆశ్చర్యకరంగా పురోగమించినవిశేషాలు యిప్పుడు తెలియవస్తున్నాయి. నేటి అంక, బీజగణితాల మూలపుట్టుక ఇండియాలోనేనని ప్రపంచం గుర్తించింది. లెక్కించేందుకు ఒకరకమైన కర్రచట్రాన్ని గాని, రోమన్ అంకెలను గాని వుపయోగించడంవల్ల చాలాకాలం పురోగమనం లేకపోయింది. 1 నుంచి '0' వరకుగల పది అంకెలనూ భారతదేశం సృష్టించినతర్వాత, మానవమేధ వికసించి, అంకెలప్రవర్తనా విచిత్రాల (యథార్థాలే) పైకాంతులు పొంగి ప్రవహించినట్లయింది. ఇతరదేశాలలో వాడుకలోవున్న గుర్తులకంటె, యీ అంకెలగుర్తులు అనన్యసాధ్యంగా వున్నాయి. నేడు అవి అతిసామాన్యంగా కనుపిస్తాయి; మన మంతగా గమనించం కాని, ఆ అంకెలే అనేక విప్లవాత్మకపురోగమనాలకు దారితీశాయి. అవి ఇండియానుంచి బాగ్దాదుగుండా పాశ్చాత్యదేశాలకు చేరేందుకు అనేకశతాబ్దాలు పట్టింది.

150 ఏండ్లక్రితం నెపోలియన్ కాలంలో "లా ప్లేస్"అనే ఆయన యిలా వ్రాశాడు: "సంఖ్యలన్నింటినీ పదిగుర్తులలోనే వ్రాయగల మహత్తరవిధానాన్ని మనకు ప్రసాదించింది భారతదేశమే. ప్రతి గుర్తుకూ ఒక మారని విలువ వుండడమేగాక, అది వుండేస్థానాన్నిబట్టి మారే విలువకూడా వుంటుంది. మన కిప్పుడీ విషయం బాగా పరిచయమైపోయింది గనుక, దాని పూర్తివిలువను గ్రహించలేంగాని, అది

మహత్తరమైన, ప్రముఖవిశేషం. దాని సరళస్వభావం, సులభపద్ధతులు అనేక కోట్ల లెక్కలను సులభతమంచేయడంవల్ల ప్రయోజనకరమైన నూత్నవిషయాల సృష్టికి అంకగణితమే మూలావసరం అనే గౌరవం యేర్పడింది. ప్రపంచవైచిత్రి ప్రసవించిన విశిష్ట వ్యక్తులగు ఆర్కిమెడిస్, అపోలోనియస్‌ల మేధాశక్తికి కూడా యీ అంకెలు చిక్కలేదంటే, వాటి ఘనతరసాధనాసౌభాగ్యం మనం అర్థం చేసుకోవచ్చు!”

ఇండియాలో అంక, బీజ, క్షేత్రగణితాలు పుట్టింది మరీ ప్రాచీనయుగాల్లో. బహుశా వేదమతపూజాస్థలాలనిర్మాణానికి ఒకరకమైన క్షేత్ర, బీజగణితాలు ఉపయోగించిఉంటారు. ఒక చతురస్రాన్నీ, మరోభుజాన్నీ యిస్తే, దీర్ఘచతురస్రాన్ని నిర్మించవచ్చును. ($a x = 0$) అనేక్షేత్రగణితసూత్రం ఒక బహు ప్రాచీనసంస్కృతగ్రంథంలో వుంది. నేటికీ హిందూపూజాదులలో క్షేత్రగణితచిత్రాలు (ముగ్గులవంటివి) ఉపయోగిస్తున్నారు. కాని యీగణితంలో ఇండియాకంటె గ్రీసు, అలెగ్జాండ్రియాలు పురోగమించాయి. అంక, బీజగణితాల్లోమాత్రం ఇండియాదే పైచేయి. దశాంశపద్ధతి, సున్నలగుర్తులను ఎవరుకనిపెట్టారో తెలియదు. ఇంతవరకూ తేలినదాన్నిబట్టి, క్రీ. పూ. 200 ప్రాంతంలో మొదటిసారిగా శ్రుతిగ్రంథంలో సున్నగుర్తువాడబడినట్లు కనుగొనబడింది. దశాంశపద్ధతి క్రీస్తుశకారంభకాలంలో సృష్టింపబడివుంటుంది. సున్నగుర్తు (శూన్యమంటారు) మొదట్లో ఒక చుక్కవలె వుండేది. క్రమంగా గుండ్రని గీతగా మార్పుచెందింది. దాన్నికూడా ఇతరఅంకెలమాదిరిగా ఒకఅంకెగా భావిస్తున్నారు. దీని గొప్పతనాన్ని ప్రొఫెసర్ హాల్‌స్టెడ్ యిట్లా వర్ణించాడు. “సున్నగుర్తును సృష్టించడంలోగల ప్రాముఖ్యతను గురించి ఎంతచెప్పినా అతిశయోక్తికాదు. ఏమీలేని గాలివంటిదానికి ఒక స్థానిక ఉనికి, పేరు, ఆకృతి, చిహ్నం యివ్వడం, ప్రయోజకరమైన శక్తిని ఇవ్వడం, హిందూజాతివిశిష్టతకే చెల్లును. ఇది “నిర్వాణాన్ని” విద్యుదుత్పత్తి యంత్రాలుగా పోతపోయడంవంటిది. గణితశాస్త్రంలోని ఏఒక్క సృష్టికూడా, సున్నమాదిరిగా మేధాశక్తి – జ్యోతులకు ఆయువుపట్టు కాలేదు.

మరొక ఆధునికగణితశాస్త్రజ్ఞుడు కూడా యీ చారిత్రకసందర్భాన్ని తలపోసి విశేషంగా వర్ణించాడు. డాన్‌జిగ్ తన 'సంఖ్య' అను గ్రంథంలో, "ఈ 5000 దీర్ఘసంవత్సరాలలోనూ అనేకనాగరికతలు ప్రాభవంపొంది, నశించిపోయాయి. ప్రతిదీ సారస్వతం, కళలు, తత్వశాస్త్రం, మతాలను తనవెనుక వారసత్వంగా వదలిపోయింది. కాని మానవుడన్నింటికంటె ముందు నేర్చుకున్న 'లెక్కింపుకళ'లో ఆ నాగరికతలన్నీ సాధించగలిగిన నికరఫలిత మేమిటి? అనువుగావంగని అంకెలు, అవికూడా పురోగమనాన్ని అడ్డగించేటంత మొరటువి, చిన్నిచిన్ని లెక్కలకుగూడా గొప్పగొప్ప గణితశాస్త్రజ్ఞులు కావలసివచ్చే గుణకపద్ధతులు – ఇవేగా?!...మానవుడు ఈవిధానాలను వేలాదిసంవత్సరాలు ఉపయోగించుకున్నా, వాటి కొక్క అభివృద్ధినైనా చేర్చలేకపోయాడు, ఆ విధానానికి ఒక్క ప్రముఖభావావేశాన్నయినా జతచేయలేకపోయాడు...చీకటియుగాలలో మానవుడుపొందిన ఆలోచనాభివృద్ధినడకతో పోల్చినా, లెక్కలచరిత్రయొక్కగమనం మరింత నెమ్మదిగా, దాదాపు ప్రవాహంలేనినిలవనీరుగా కనిపిస్తుంది. ఈదృష్టితో యీ శకారంభప్రాంతంలో స్థానబలిమిసూత్రాన్ని కనిపెట్టిన అజ్ఞాత హిందువుని సాధనను పరిశీలిస్తే – అదొక ప్రముఖమైన ప్రపంచసంఘటనగా గుర్తించవలసివుంది" అని వ్రాశాడు.

ఆయన గ్రీసుదేశపుమహాగణితశాస్త్రవేత్తలుకూడా యిలాంటివి కనిపెట్టలేకపోవడానికి ఆశ్చర్యపడుతూ యిలా అన్నాడు, "గ్రీకులు శాస్త్రజ్ఞానాన్ని ప్రయోజనకరంగావుపయోగించుకోవడాన్ని ఏహ్యంగా చూచి, తమబిడ్డలవిద్యనుకూడా బానిసలచేతుల్లోపెట్టారా? అలాగైతే మనకు క్షేత్రగణితాన్ని ప్రసాదించి, గణితశాస్త్రాన్ని ఎంతోముందుకు తీసుకుపోయిన యీజాతి బీజగణితంలో ప్రాథమికవిషయాలైనా ఎరుగదంటేనూ, ఆధునికగణితశాస్త్రానికి మూలస్తంభమైన బీజగణితం ఇండియాలోపుట్టినదేననీ, అదీ అంకెల స్థానవిధానం రూపొందినకాలంలోనేననీ తెలిస్తే మనకు అబ్బురంగా వుండదూ!"

ఈప్రశ్నలకు ప్రొఫెసర్ హాగ్బెన్‌వాక్యాలు చక్కనిసమాధానం "ఈ పనిని హిందువులే ఎందుకుచేయగలిగారో, పురాతనప్రసిద్ధులైన ఇతర దేశాలవా రెందుకుచేయలేకపోయారో, దాన్ని ఒకకార్యవాదియే

ఎందుకుచేశాడో అనే ప్రశ్న కొరకరానికొయ్యలాగా ఉంటుంది. ఎందువల్లనంటే, మనం వరప్రసాదులైన కొందరువ్యక్తుల అద్భుతజ్ఞానం వల్లనే విజ్ఞానపురోగమనం సాధింపబడుతుందని విశ్వసిస్తాం. వాస్తవానికి అత్యున్నతప్రతిభాసంపన్నుడైనవ్యక్తికూడా మొత్తం సమాజచక్రపు సాంప్రదాయవిజ్ఞానంవల్లనే ఆవిధంగాసృష్టింపబడివుంటాడు. ఇండియాలో క్రీ. శ. 100 లో జరిగినట్లే అంతకుముందుకూడా అనేకసార్లు జరిగింది. ఇప్పుడటువంటిసంఘటనే రష్యాలోనూ జరుగుతూవుండవచ్చు. ...ఈసత్యాన్ని అంగీకరిస్తే, ప్రతినాగరికత తనబిడ్డల్లో కొందరు వరప్రసాదుల్ని మాత్రమే విజ్ఞానవంతుల్ని చేసి, సామాన్యులందరిని ఉపేక్షిస్తే అది తనవినాశహేతువుల్ని తనలోనేకలిగిఉంటుందన్న తథ్యాన్ని గుర్తించినట్లవుతుంది."

అందువల్ల మనం ఈ చారిత్రాత్మక అద్భుతనిర్మాణాలను చూచి, అవి ఒక గొప్పమేధాసంపన్నుడు హఠాత్తుగా ఉత్తేజితుడై సృష్టించినవని భావించక, అవి ఆనాటిసంఘంయొక్క ఉమ్మడిసృష్టేననీ, ఆకాలపు ఎడతెగనికోర్కెల అవసరాన్నితీర్చేటందుకే అప్పుడు సృష్టింపబడ్డాయనీ గ్రహించాలి. సాంఘికావసరాన్ని గ్రహించి, తృప్తిపరిచేందుకు ప్రతిభావంతుడైన మహామేధావి అవసరమే. కాని యీ కాంక్షయే లేకపోతే, దాన్నితీర్చే అవసరమే వుండదు గనుక, కన్పెట్టడానికి ప్రేరేపణ వుండకపోవచ్చు. ఒకవేళ అది కన్పెట్టబడినప్పటికీ, దాన్ని ప్రజలుగుర్తించేవారేకాదు, విన్నామరచిపోయేవారు; లేదా, దానిఅవసరంకలిగేంతవరకు దానివంక చూచేవారుకాదు. గణితశాస్త్రసంబంధమైనతొలిసంస్కృతగ్రంథాలనుబట్టి, ఆనాటిప్రజలకు ఆయా అవసరాలు కలిగి, వత్తిడిచేశాయని తెలుస్తున్నది. క్లిష్టమైనలెక్కలుకట్టవలసినఅవసరం ఆనాటి వ్యాపార, సాంఘికవ్యవహారాల్లో యేర్పడినట్లు ఆ గ్రంథాల్లోనిసమస్యలే రుజువుచేస్తున్నాయి. పన్నులు, అప్పులు, వడ్డీ, భాగస్తులు, వస్తుమార్పిడి, బంగారపుమెరుగుతరుగులనులెక్కించడం మొదలైనసమస్యలు యివ్వబడ్డాయి. సంఘం బహుముఖంగా, చిక్కురొక్కురుగా పెరిగింది. ప్రభుత్వోద్యోగులు, వాణిజ్యాల్లో పనిచేసేవారెక్కువయ్యారు. లెక్కించడానికి సులభోపాయాలు లేకపోతే పనులు స్తంభించిపోయేపరిస్థితి ఏర్పడింది.

ఇండియాలో వున్న, దశాంశపద్ధతులు వాడుకలోకివచ్చి, అంక, బీజగణితాలు వేగంగా పెంపొందేందుకు మానసికకవాటాలు తెరచుకున్నాయి. వాటిగుణింపు, భాగింపు, క. సా. గు., గ. సా. ప్ర. వర్గాలు, వాటిమూలాలు, దానికిగుర్తు (వర్గమూలము = √) ఘనాలు, వాటి మూలాలు, తీసివేతగుర్తు, గుర్తులపట్టికలు, π అనగా 3.1416 అనుగుర్తింపు, బీజగణితంలో తెలియనివాటికిగుర్తులుగా అక్షరాల్ని వుపయోగించడం, సున్నవిలువలు లెక్కించడం మొదలైనవి ఏర్పరుపబడ్డాయి. సున్ననుయీవిధంగావివరించారు: అ−అ=0; అ+0=అ; అ−0=అ; అ×0=0; అ÷0=అనంతం. వ్యతిరేకవస్తువులను గుర్తించే చిహ్నాలు కూడా (√4=±2) వచ్చాయి.

క్రీ. శ. 5 నుండి 12 వ శతాబ్దంవరకు మన దేశంలోని ప్రఖ్యాత గణితశాస్త్రజ్ఞులు రచించిన గ్రంథాల్లో యిట్టి గణితశాస్త్రవిశేషములన్నీవున్నాయి. అంతకుముందరిగ్రంథాల్లో (బౌద్ధాయన: క్రీ. పూ. 8 వ శతాబ్ది, ఆపస్తంబ, కాత్యాయన: (ఇద్దరూ క్రీ. పూ. 5 వ శతాబ్ది) త్రిభుజాలు, చతురస్రాలు, దీర్ఘచతురస్రాలు మొదలగు క్షేత్రగణిత విశేషాలు ఉన్నాయి. కాని బీజగణితంలో లభించినంతలో తొలిగ్రంథం 476 లో జన్మించిన ఆర్యభట్టు అను ప్రఖ్యాతజ్యోతిశ్శాస్త్రవేత్త రచించినది. అతడే 'బీజగణితబ్రహ్మ' అంటారు. కాని, ఆతనికి ముందున్న రచయితలగ్రంథాలను ఎంతో వుపయోగించుకొనివుంటాడు. తరువాతి భారతీయగణితశాస్త్రవేత్తల్లో భాస్కరుడు ముఖ్యుడు. (క్రీ. శ. 522). ఆతరువాతివాడగుబ్రహ్మగుప్తుడు (క్రీ. శ. 628) ప్రఖ్యాతజ్యోతిశ్శాస్త్రవేత్తకూడా. ఇతడు సున్నకువర్తించే సూత్రాలూ, మరికొన్ని క్రొత్త సిద్ధాంతాలూరచించాడు. తరువాతఅనేకమంది అంక, బీజగణితాల్ని అభివృద్ధిచేశారు. ఇలాంటివారిలో చివరివాడు 2 వ భాస్కరుడు (క్రీ. శ. 1114 జననం). అతడు అంక, బీజ, జ్యోతిర్గణితాలపై మూడుగ్రంథాలు వ్రాశాడు. అతని అంకగణితగ్రంథంపేరు "లీలావతి". ఇందులో లీలావతి అనే ఒకయువతికి యీ అంకగణితసూత్రాలు, సమస్యలూ బోధించినట్లు వుంది. తగినఆధారాలులేవుగాని, లీలావతి అతనికుమార్తెయనినమ్మబడుతూంది. ఈ 'లీలావతి' గణితములోనిభాష స్పష్టంగా, సరళంగా, బాలబాలికలు అర్థంచేసుకోగలవిధంగావుంది. ఇప్పటికీ సంస్కృతపాఠ

శాలల్లో యీగ్రంథాన్ని (కొంతవరకు శైలికొరకు)వాడుతూనేవున్నారు.

అనేక గణితశాస్త్రగ్రంథాలు రచింపబడుతూనే వున్నాయి. (1150 లో నారాయణ 1545లో గణేశ). కాని, యివి పాతరచనలలో వున్నదానిని 12 వ శతాబ్దితర్వాత ఆధునికయుగంవరకు ఇండియాలో గణితశాస్త్రపరంగా మరలమరల చెప్పేవి మాత్రమే. చెప్పుకోదగ్గ స్వతంత్రగ్రంథమేదీ వెలువడలేదు.

ఖలీఫ్ అల్ - మన్సూర్ (753-774) కాలంలో అనేకమంది భారతీయపండితులు బాగ్దాద్ వెళ్తూ గణితజ్యోతిశ్శాస్త్రగ్రంథాలనుకూడా వెంటతీసుకెళ్ళారు. బహుశా అంతకుముందే మనఅంకెలు అక్కడికి చేరివుంటాయి. కాని మనఅంకెలను అక్కడివారికి శాస్త్రీయంగా నేర్పడం యిదే మొదలు. ఆర్యభట్టు, తదితరుల గణితశాస్త్రగ్రంథాలను అరబ్బీభాషలోనికి అనువదించారు. అవి అరబ్ దేశాలలో అంక, బీజ గణితాలనూ, జ్యోతిశ్శాస్త్రాన్ని ఎంతో పెంపొందించాయి. అప్పట్లో బాగ్దాదు గొప్ప విజ్ఞానకేంద్రం. గ్రీకు, యూదుశాస్త్రజ్ఞులు తమ తత్వశాస్త్రాలు, గణిత, వైజ్ఞానికశాస్త్రాలు తీసుకొని ఆ నగరానికి వచ్చి సమావేశమవుతూండేవారు. మధ్యఆసియానుంచి. స్పెయినువరకుగల ముస్లిందేశాలన్నిట్లోనూ బాగ్దాదునాగరికతాప్రభావం వ్యాపించింది. భారతీయగణితశాస్త్రజ్ఞానం అరబ్బీఅనువాదగ్రంథాలద్వారా ఆ దేశాలన్నింట వ్యాపించింది. అరబ్బులు మనఅంకెలను "హింద్ అంకెలు" అనేవారు. వారిభాషలో "హిందసా"(ఇండియావి)అనే ఇప్పటికీ వాడు తున్నారు.

ఈ నూతనగణితశాస్త్రం అక్కడినుంచి బహుశా మూర్ల స్పెయిన్ విశ్వవిద్యాలయాలద్వారా యూరపుకు ప్రాకింది. ఇదే యూరోపియనులగణితానికి పునాది అయింది. కాని నాటి యూరోపి యనుల్లో-యివి సులభసాధ్యమైనవి కావనే అపోహతో-వ్యతిరేకత ఏర్పడి, అనేకశతాబ్దాలతరువాత గాని, అవి సర్వసామాన్యంగా వాడ బడలేదు. యూరపులో యీ అంకెలు వాడబడినట్లు లభించిన మొదటి రుజువు 1134నాటి సిసిలీనాణెం. బ్రిటనులో 1490లో ప్రథమంగా వాడు కలోకొచ్చాయి. రాయబారిద్వారా భారతీయగ్రంథాలు బాగ్దాదుకు చేరకమునుపే భారతీయగణితశాస్త్రము, ముఖ్యంగా అంకెల స్థాన

విలువ విధానము పశ్చిమాసియా దేశాలలోనికి చొచ్చుకొనిపోయినట్లు స్పష్టమవుతోంది. సిరియనులను హీనంగాచూచిన గ్రీకుపండితులఅహం భావానికి నొచ్చుకొని ఒక సిరియన్‌మతబోధకపండితుడు ఫిర్యాదు చేస్తూ వ్రాసినవ్యాసము సముచితంగావుంది. అతనిపేరు "సెవెరస్ సెబోఖ్". యూఫ్రేటీస్‌నలోగల ఒకమఠంలోవుండేవాడు. క్రీ.శ. 662లో ఈవ్యాసంవ్రాస్తూ సిరియనులు ఏవిధంగానూ గ్రీకులకుతీసిపోరని నిరూపించప్రయత్నించాడు. ఉదాహరణగా భారతీయులను సూచించాడు. "నేను హిందువులశాస్త్రాన్ని చర్చించబోవడంలేదు. వారు సిరియనుల వంటివారు కారు. వారిజ్యోతిశ్శాస్త్రము గ్రీకులు, బాబిలోనియనుల శాస్త్రాలకంటే ఎంతోగొప్పది. వారు అందులో కనిపెట్టినవి అతిసూక్ష్మమైనవి. వారిలెక్కింపుపద్ధతి వర్ణింపనలవిగానిది. అది తొమ్మిదిఅంకెలతో గుణించేవిధానమనిమాత్రమే నేను చెప్పదలచాను. తాము గ్రీకుభాష మాట్లాడుతున్నందున, సకలశాస్త్రపారంగతులమైనామనుకునేవాగు యీ భారతీయగణితశాస్త్రాన్నిచూడాలి. అలాచూస్తే తెలిసినవారు మరికొందరుకూడా ఉన్నారనేసత్యాన్ని గుర్తించగలరు."

భారతీయగణితశాస్త్రమనగానే, ఇటీవలి ప్రఖ్యాత గణిత శాస్త్రవేత్త శ్రీనివాస రామానుజం గుర్తుకువస్తాడు దక్షిణభారతంలో, నిరుపేదబ్రాహ్మణకుటుంబంలోపుట్టి, సరియైన విద్యాసముపార్జనకు అవకాశాల్లేక, మద్రాసుపోర్టుట్రస్టు (రేవుపాలకసంఘం)లో గుమాస్తాగా చేరాడు. కాని, సహజప్రతిభను తనలో అణచుకోలేక తపనపడ సాగాడు. తీరికసమయాల్లో అంకెలతోనూ, గణితసమాసాలతోనూ ఆటలాడసాగాడు. అదృష్టవశాత్తు ఒక గణితశాస్త్రజ్ఞుడు అతని గణిత క్రీడలచే ఆకర్షింపబడి, కొన్నిభాగాలను కేంబ్రిడ్జి (ఇంగ్లండు)కి పంపించాడు. అక్కడి విద్యావేత్తలు వాటినిపరిశీలించి, సమ్మోహితులై, రామానుజానికి ఉచితవిద్యాసదుపాయాలు యేర్పాటుచేశారు. అతడు గుమాస్తాపని వదలి, కేంబ్రిడ్జివెళ్ళి విద్యను అభ్యసించాడు. అనతి కాలంలోనే ఆశ్చర్యకరమైన స్వతంత్రప్రతిభతో విలువైన గణితవిధానాలను సృష్టించాడు. "ది రాయల్‌సొసైటీ ఆఫ్ ఇంగ్లండు" తన చరిత్రలోలేని కొత్తపద్ధతి నవలంబించి రామానుజాన్ని సభ్యుడుగా చేస్చుకుంది. కాని తరువాత రెండేళ్ళకే, ఆయన తన 33 యేట,

(బహుశా క్షయవల్ల) చనిపోయాడు. ప్రొఫెసర్ జూలియన్ హక్స్లే ఒకచోట శ్రీనివాస రామానుజాన్ని యీ శతాబ్దపు మహోన్నతగణితశాస్త్రజ్ఞుడని వర్ణించినట్లు నాకు జ్ఞాపకం.

రామానుజం జీవితమూ, మరణమూ భారతదేశంలోని పరిస్థితులకు తగిన ఉదాహరణలు. మన కోట్లాదిప్రజల్లో విద్యావంతులు ఎంత తక్కువ! దాదాపు పస్తులతో బ్రదికే వారెందరు! ఆ చదువుకున్న కొద్దిమందిలోకూడా ఏ అవకాశాలూలేక, చివరికి గుమాస్తాలుగా చేరి, ఆ జీతం ఇంగ్లండులో నిరుద్యోగులకిచ్చే భత్యమంతైనా లేక, జీవన్మృతులుగా వున్నవారెందరు! జీవితం తనద్వారాలను తెరచి యీ అందరికీ ఆహారం, ఆరోగ్యపరిస్థితులు, విద్యావకాశాలు, అభివృద్ధి సౌకర్యాలు మొదలైనవి కల్పించినట్లయితే - ఈ కోట్లాదిజనంలో ఎందరో సమర్థులగు విజ్ఞానశాస్త్రవేత్తలు, విద్యావేత్తలు, సాంకేతిక నిపుణులు, పారిశ్రామికనిర్వాహకులు, రచయితలు, కవులు, పండితులుగా పరిణతిచెంది, ఒక నూతనభారతదేశాన్ని, ఒకనవీనప్రపంచాన్నే సృష్టించగలరు!

## ౨౧ వృద్ధి - క్షయములు

క్రీస్తుశకం మొదటివేయిసంవత్సరాల్లో ఇండియాలో అనేక ఆటుపోట్లు సంభవించాయి. విదేశీదండయాత్రలు, అంతఃకలహాలు సంభవించాయి. అయినప్పటికీ అది ఉత్సాహవంతమైన జాతీయజీవితం; అమితశక్తితో పెల్లుబుకుతూ, దశదిశల వ్యాపిస్తున్నకాలం. ఆనాటి సంస్కృతి మొగ్గదొడిగి తత్వశాస్త్రం, సారస్వతం, నాటకం, కళ, విజ్ఞానశాస్త్రం, గణితశాస్త్రాలరూపాల్లో బహుసుందరంగా కనిపించిన నాగరికతగా పరిఢవిల్లింది. భారతీయార్థికస్థితి పెంపొందింది. దాని అవకాశపరిధి విస్తృతమైంది. నూతనదేశాలు దానిఆవరణలోనికి చేరాయి. ఇరాన్, చైనా, హెలెనిక్ ప్రపంచం, మధ్యఆసియాలతో సంబంధాలు పెరిగాయి. అన్నింటికంటే తూర్పుసముద్రాలవైపు బలమైనప్రేరేపణ కలిగి, భారతీయవలసరాజ్యాలు ఏర్పడడానికి, భారతీయసంస్కృతి సరిహద్దులను దాటి దూరదూరాలకువ్యాపించడానికి దారితీసింది. నాలుగవశతాబ్ది తొలిదశనుండి ఆరవశతాబ్దంవరకు గుప్తసామ్రాజ్యం వర్ధిల్లి, యీ విశాల

వ్యాప్త సాంస్కృతిక, కళాసంచనాలకు సంరక్షకచిహ్నమయింది. స్వర్ణ యుగమనబడే ఆనాడు ప్రసిద్ధసంస్కృతగ్రంథాలు ఒకప్రశాంతిని, ప్రజల ఆత్మవిశ్వాసాన్ని, అట్టిమహోన్నతనాగరికతాకాలంలో యిచట నివసించగలిగినందుకు ప్రజలుపొందేసగర్వాన్ని బయల్పెట్టినాయి. వీటితో పాటు, తమ మహత్తర విజ్ఞాన, కళాశక్తులను సాధ్యమైనంత ఎక్కువగా ఉపయోగించుకోవాలనే ప్రేరేపణకూడా వాటిలో వుంది.

అట్టి స్వర్ణయుగం అంత్యదశకురాకపూర్వమే బలహీన లక్షణాలు, క్రమంగా క్షీణించిపోయేసూచనలు కనుపించసాగాయి. వాయవ్యదిశనుంచి శ్వేతహూణులు పలుసార్లు దండెత్తిరావడం, తిరుగగొట్టబడడం జరిగాయి. కాని వారు మరింతపట్టుదలతో పదేపదే వస్తూ, క్రమంగా ఉత్తరభారతాన్ని కబళించివేశారు. ఏభయ్యేండ్లకాలం వారే ఉత్తరభారతపాలకులుగా నిలువగలిగారు. కాని గుప్తుల్లో చివరి మహావీరుడు – మధ్యభారతపాలకుడైన యశోవర్మతో చేతులుకలిపి, అతికష్టంమీద శ్వేతహూణుల్ని తరిమివేయగలిగేడు. దీర్ఘకాలంజరిగిన ఈ సంఘర్షణ ఇండియాను రాజకీయంగా, సైనికంగాకూడా బలహీనపరచింది. బహుశా యీ హూణుల్లో అనేకమంది ఉత్తరభారతమంతటా స్థిరపడిపోయినందువల్ల క్రమంగా ప్రజల్లో ఒకవిధమైన భావపరివర్తనజరిగి వుంటుంది. అంతవరకు వచ్చిన విదేశీతెగలవలెనే, యీ హూణుల్ని కూడా భారతజాతి తనలోయిముడ్చుకొన్నది. కాని వీరిప్రభావంవల్ల ప్రాచీనభారతీయార్యజాతి లక్షణాలు, ఆదర్శాలు బలహీనమయ్యాయి. భారతీయప్రభుత్వయంత్రంలోగాని, యుద్ధాల్లోగాని అంతకుముందెన్నడూ కనివినియెరుగనివిధంగా యీ హూణులు క్రూరకృత్యాలు, భయంకరచిత్రవధలూ జరిపినట్లు అనేకగ్రంథాలనిండా వ్రాయబడి వున్నాయి.

ఏడవశతాబ్దంలో హర్షునిఆధ్వర్యాన రాజకీయ, సాంస్కృతిక పునరుద్ధరణ, పునరుజ్జీవనములు జరిగాయి. గుప్తరాజులరాజధానియైన ఉజ్జయిని తిరిగి ప్రాభవంపుంజుకొని, కళలు, సంస్కృతులకు కేంద్రమై, శక్తివంతమై రాచరికానికి రాజధానిఅయింది. కాని తరువాతిశతాబ్దాల్లో యిదికూడా బలహీనపడి, అదృశ్యమైపోయింది. 9వశతాబ్దంలో మిహిరభోజుడు (గుజరాతు) ఉత్తర, మధ్యభారతాలను ఏకంజేసి, బల

మైనరాజ్యంగా, కనోజిరాజధానిగా ఏలాడు. మళ్లీ సారస్వతం పునరుజ్జీవనంపొందింది. నాటి ప్రధానవ్యక్తి రాజశేఖరుడు. మరొకసారి 11వ శతాబ్దిఆరంభంలో శక్తివంతుడు, ఆకర్షణీయుడైన మరొకభోజుడు ఉజ్జయినిని రాజధానిగాచేసుకున్నాడు. ఈ భోజుడు బహుముఖప్రజ్ఞావంతుడు. వ్యాకరణవేత్త, లిపిసంస్కర్త, వైద్య, జ్యోతిశ్శాస్త్రాలయందభిమాని. ఆయన గొప్పకట్టడాలనిర్మాత, కళా, సారస్వత పోషకుడు, స్వయంగా రచయిత, కవి. ఆయన అనేకగ్రంథాలు రచించాడంటారు. ఆయనపేరు–జానపదగాథలలోకూడ–గొప్పతనానికి, విజ్ఞానానికి, దయార్ద్రితకు చిహ్నంగా వెలుగొందుతూంది.

ఈ వెలుగురేఖ లెన్నివున్నా, భారతదేశాన్ని ఒక ఆంతరిక బలహీనత పీడిస్తూనేవుంది. అది భారతరాజకీయస్థాయినేకాక, సృజనాత్మకకార్యకలాపాలనుకూడ కుంటుపరచింది. దీని కొక తేదీనిర్ణయం లేదు. ఈ పరిణామం నెమ్మదిగా ప్రాకుతూ జరిగింది దక్షిణంలోకంటె ఉత్తరదేశంలో ముందుగా తనప్రభావాన్ని చూపించింది. అప్పటినుంచీ రాజకీయంగా, సాంస్కృతికంగా దక్షిణభారతమే ప్రాముఖ్యత వహించింది. ఎడతెగని అలలుగావచ్చిన దండయాత్రలను ఎదుర్కోవలసినఅవసరం లేకపోవటంవల్ల అనేకరచయితలు, కళాకారులు, వాస్తుశాస్త్రజ్ఞులు ఉత్తరాన కల్లోలజీవితపరిస్థితులను తప్పించుకొనేందుకు, దక్షిణానికి వెళ్ళిపోవటంవల్ల యీ ప్రాముఖ్యత హెచ్చివుండవచ్చు. దక్షిణాదినిగల బలవత్తరరాజ్యాలు వీరిని ఆకర్షించి, ఉత్తరానలేని సౌకర్యావకాశాలు కల్పించి, ఆస్థానగౌరవాలిచ్చి, సృజనాత్మకకృషికి ఉపయోగించిఉండవచ్చు.

గతంలోవలె ఉత్తరదేశం దక్షిణదేశంకంటె పైచేయిగా ఉండకపోయినా, చిన్నచిన్నరాజ్యాలుగా చీలిపోయినా, సాంస్కృతిక, తత్వశాస్త్రకలాపాలకు అనేకకేంద్రాలు కలిగివుండి, జీవితం సుసంపన్నంగానే ఉంది. ఎప్పటివలెనే వారణాసి మత, తత్వభావనలకు ముఖ్యకేంద్రంగా వుంది. ఒక కొత్త సిద్ధాంతాన్నిగాని, పాతసిద్ధాంతానికి కొత్తవ్యాఖ్యానంగాని కనుగొన్నవ్యక్తి తనవాదనను సాధికారంగా నిరూపించుకోవాలంటే వారణాసికి పోవలసిఉండేది. కాశ్మీరు చాలాకాలంపాటు బౌద్ధ, బ్రాహ్మణవిద్యావేత్తల సంస్కృతభాషాకేంద్రంగా ఉంది. గొప్ప విశ్వ

విద్యాలయాలు వర్ధిల్లాయి. వాటిలో నలందా చదువుకు భారతదేశం అంతటా ప్రసిద్ధిచెందింది. నలందాకువెళ్ళిన ప్రతివ్యక్తీ సంస్కృతీపరుడనే గౌరవంపొందేవాడు. ఆ విశ్వవిద్యాలయంలో ప్రవేశంలభించడం చాల కష్టం. ఒక ఉన్నతస్థాయి విద్యావంతుడైనవాడే అందులోచేరడానికి అర్హుడు. పట్టభద్రులైనవారిని తయారుచేయడానికి ప్రత్యేకతవహించిన విద్యాలయం అది. చైనా, జపాను, టిబెట్టులనుంచేగాక కొరియా, మంగోలియా, బొఖారాలనుంచికూడా విద్యార్థులు అక్కడికి ఆకర్షింపబడేవారు. బ్రాహ్మణ, బౌద్ధమత తత్వశాస్త్రాలేకాక, మతసంబంధంలేని శాస్త్రాలు, ప్రత్యేకప్రయోజనకరములైన వృత్తిశాస్త్రాలుకూడా బోధింపబడేవి. అందులో కళాశాఖలు, వ్యవసాయ, వాస్తుశాఖలు, వైద్య విద్యాలయం, పాడికేంద్రాలు, పశువులశాలలు వుండేవి. విశ్వవిద్యాలయజీవితంలో వాదనలు, చర్చలు సజీవంగాఉండేవట. విదేశాల్లో భారతీయసంస్కృతిని వ్యాపింపజేసినవారిలోముఖ్యులు నలందా విద్యావేత్తలే.

ఇంకా నేటి భాగల్పూరుకుసమీపాన (బీహారు) విక్రమశిల, కథియవాడులో వల్లభి విశ్వవిద్యాలయాలు ఉండేవి. గుప్తులకాలంలో ఉజ్జయినీవిశ్వవిద్యాలయం ప్రఖ్యాతిగాంచింది. దక్షిణాన అమరావతి (గుంటూరుజిల్లా) విశ్వవిద్యాలయం ఉండేది.

అయినప్పటికీ 'వేయిసంవత్సరాలదశ' చివరికిచేరేసరికి, యిదంతా యీ నాగరికతయొక్క సాయంసమయమే అనిపిస్తుంది. ప్రభాతకాంతి ఎప్పుడో అంతరించిపోయింది. మిట్టమధ్యాహ్నంకూడా గడచిపోయింది. దక్షిణాన యింకా పుష్టి, శక్తీ వున్నాయి. ఈవిధంగా మరికొన్నిశతాబ్దాలవరకు వుంది. భారతీయవలసరాజ్యాల్లోమాత్రం మరోవెయ్యేండ్లవరకూ యౌవనం మిసమిసలాడుతూఉంది. కాని హృదయం కదుడుగట్టి స్పందము క్షీణించి, యీజాడ్యం క్రమంగా అన్ని అవయవాలకూ వ్యాపించింది. శంకరాచార్యునితర్వాత 8వశతాబ్దంలో మరో గొప్పతత్వశాస్త్ర బోధకుడు పుట్టలేదు. అనేకమంది వ్యాఖ్యాతలూ, తార్కికులూ మాత్రమే జన్మించారు. శంకరుడుకూడా దక్షిణాదివాడే. జిజ్ఞాస, మానసికసాహసయాత్రోద్దేశాలస్థానంలో సాధారణదృఢవాదనలూ, శుష్క-

తర్వాలూ యేర్పడ్డాయి. బ్రాహ్మణ,బౌద్ధమతాలు క్షీణించి, హీనపూజాదికాలు - ముఖ్యంగా కొన్నిరకాల తాంత్రికక్రతువులు, యోగదర్శన నికృతాలు - వ్యాపించాయి.

సారస్వతంలో 8వశతాబ్దిలోని భవభూతియే చివరి శ్రేష్ఠుడు. అనేకగ్రంథాలు వ్రాయబడుతూనేవున్నాయి గాని, శైలి క్రమంగా క్లిష్టమై, ఆలోచనలో గాని, భావచిత్రణలోగాని కొత్తదనం లేదు. గణితశాస్త్రంలో ఆఖరిగొప్పపేరు రెండవభాస్కరునిదే (12వశతాబ్ది). కళావిషయంలో మరికొంతకాలం మనప్రాభవం నిలచిపోయిందని ఇ. బి. హావెల్ అంటాడు. మన చిత్రకళలో, భావవ్యక్తీకరణలో ఏడెనిమిదిశతాబ్దాలవరకు నైపుణ్యంలేదనీ, తర్వాతనే ఇండియాలో గొప్ప శిల్ప, కళాఖండాలు వెలిశాయనీ ఆయనవాదించాడు. ఆయన చెప్పినట్లు, 8 నుంచి 14వశతాబ్దంవరకు మనకళలు బాగా పెంపొందినాయి. అదేకాలంలో యూరపులో గోథిక్ కళ ఉచ్ఛస్థితిలో వుంది. పురాతనభారతీయకళల సృజనాత్మకశక్తి 16వ శతాబ్దంనుంచే క్షీణించసాగిం దన్నాడు. ఆయన నిర్ణయాలు సరియైననో కావో నాకు తెలియదు గాని, ఉత్తరభారతం కంటె దక్షిణభారతమే కళారంగంలోకూడా చాలాకాలం ప్రాచీన సాంప్రదాయాన్ని ముందుకు తీసుకుపోయినదని మాత్రం నా విశ్వాసం.

విదేశాలకు భారీయెత్తున వెళ్ళి, వలసలేర్పరచడం కూడా చివరిసారిగా 9వ శతాబ్దంలో దక్షిణదేశంనుంచే జరిగింది. చోళులు 11వ శతాబ్దంవరకు సముద్రాధిపత్యంవహించి, శ్రీవిజయునిపై దండెత్తి ఓడించారు.

ఆవిధంగా భారతదేశం వడిలి ఎండిపోతూ, తనసృజనాత్మక విశిష్టతనూ, సజీవత్వాన్నీ కోల్పోవడాన్ని మనం గమనించవచ్చు. ఈ పరిణామం నెమ్మదిగా, దీర్ఘకాలంలో జరిగింది. ఉత్తరదిశను ప్రారంభమై, తుదకు దక్షిణానికి చేరుకుంది. ఈ రాజకీయపతనానికీ, సాంస్కృతిక స్తబ్ధత్వానికీ హేతువులేమిటి? వ్యక్తులనుపడగొట్టేటట్లుగానే, నాగరితల్నికూడా పడగొట్టేవృద్ధాప్యమే దీనికిముఖ్యకారణమా? ఇదికూడా సముద్రపు ఆటుపోటులవంటిదా? లేక బైటికారణాలు, దండయాత్రలే దీనికి కారణభూతములా? ఇండియా రాజకీయస్వాతంత్ర్యాన్ని కోల్పోవడం

వల్లనే భారతీయతత్వశాస్త్రం తనశక్తినికూడా కోల్పోయిందని రాధాకృష్ణన్ వ్రాశారు.

ఇదీ యథార్థమే. రాజకీయస్వాతంత్ర్యంలేకపోవడం సాంస్కృతిక క్షయానికి దారితీస్తుంది. అయితే, ఏదోఒకక్షయము అంతకుముందు సంభవించివుండకపోతే, రాజకీయస్వాతంత్ర్యంమాత్రం ఎలా పోగలుగుతుంది? చిన్నదేశమైతే ఒకబలీయమైనశక్తిచేత ఓడింపబడవచ్చు. కాని విశాలమై, ఎంతగానోవర్ధిల్లి, మహోన్నతమైన నాగరికతనుసృష్టించుకున్న ఇండియావంటి దేశం అంతర్గతంగా క్షీణించివుండకపోతే, విదేశీదండయాత్రలకే లొంగిపోవలసినకారణం లేదు. లేకపోతే ఆ దండయాత్రచేసినవారికి యుద్ధతంత్రనైపుణ్యశక్తులు అధికంగా వుండివుండాలి. అలాంటిది లేదు గనుక, వెయ్యేండ్లదశచివరిభాగంలో ఇండియా అంతర్గతంగా క్షీణించిపోయిందని నిశ్చయంగా చెప్పవచ్చు.

ప్రతినాగరికతలోనూ క్షీణ, విచ్ఛిన్నదశలు తరచుగా సంభవిస్తూనేవుంటాయి. ఇండియాచరిత్రలోకూడా అట్టిదశ లెన్నో వున్నాయి. కాని ఇండియా అట్టివాటికి తాత్కాలికంగా తలవాల్చి, మరల పైకిలేచి, పునరుజ్జీవనంపొందేది. కొన్నిసార్లు తనగుహాకవచంలోకి ముడుచుకొని, సముత్సాహాన్ని, ఉజ్జీవాన్ని సంతరించుకొని, బైటికివచ్చి విజృంభించేది. ఎల్లప్పుడూ ఒకానొకసంచలనాత్మకమైన చావ నిలచివుండి, తన్నుతాను మరల స్వీయగుణప్రభావితంచేసుకుని, పాతవానికంటె భిన్నమైనా, అదే మాదిరి ఆంతరంగికసంబంధాల నేర్పరచుకుని వికసించేది. ఇండియా ననేకసార్లుకాపాడిన అలాంటి మానసికమృదుత్వము, అలా సరిపెట్టుకొనగలశక్తి, ఇప్పుడు పూర్తిగా తొలగిపోయాయా? దానిస్థిరమైనవిశ్వాసాలూ, దాని సంఘవ్యవస్థలో పెంపొందుతున్న కాఠిన్యమూ, దాని మెదడునుకూడా పాషాణసమం చేశాయా? జీవితం పెరగడం, పరిణామం చెందడం ఆగిపోతే, భావనాపరిణామంకూడా ఆగిపోతుంది. ఇండియా ఎప్పుడూకూడా, ఆచరణలో మితవాదదృష్టీ, ఆలోచనల్లో సూరేకార మంతచుకుకూ కలిగిన విచిత్ర సమ్మేళనంగా వుండేది. ఆ ఆలోచన టపాకాయవలెప్రేలి, గతంపట్లగౌరవంవున్నప్పటికి, తనసహజగుణాన్ననుసరించి తప్పకుండా ఆచరణను భగ్నంచేసివుంటుంది. ఆలోచన తన సునిశితత్వాన్ని, సృజనాశక్తిని కోల్పోయి, చివికిపోయిన అర్థరహిత

ఆచారాన్ని బానిసవలె సేవిస్తూ, పాతసమాసాలను గొణుగుతూ, ప్రతి కొత్తదానికి భయపడుతూవుంటే, అపుడు జీవితం స్తంభించిపోయి, తానే నిర్మించుకున్నఖైదులో కట్టివేయబడి, నిర్బంధింపబడుతుంది.

నాగరికతలు పతనమైపోయినఉదాహరణలు మన కెన్నో వున్నాయి. వాటిలో గమనింపదగ్గది రోముపతనంతో అంతమైన యూరోపియన్ప్రాచీననాగరికత. ఉత్తరాన్నుంచివచ్చిన దండయాత్రల వల్ల రోము పతనంకావడానికి చాలాకాలంక్రితమే దానిఅంతర్బలహీనతల వల్లే అది కూలిపోయేప్రమాదానికి దగ్గర్లోవుంది. ఒకప్పుడు విస్తృత మవుతున్న దాని ఆర్థికస్థితి కుంచించుకుపోయి, అనేకరకాల చిక్కులను తెచ్చిపెట్టింది. పట్టణపరిశ్రమలు క్షీణించాయి. అభివృద్ధిచెందుతున్న నగరాలు అతివేగంగా సన్నగిలి, దారిద్ర్యనిలయాలయ్యాయి. ఆఖరుకు భూసారంకూడా వట్టిపోయింది. పెరుగుతున్న క్లిష్టసమస్యలను పరిష్క రించేందుకు చక్రవర్తులు అనేక అవసరమైన ప్రయత్నాలుచేశారు. వ్యాపారులు, చేతిపనులవారు, కూలీలు ఏమేమిచేయాలో ప్రభుత్వమే శాసించింది. అనేకరకాలఉద్యోగాలకు ఇతరవర్గాలకార్మికులు అనర్హు లుగా ప్రకటించబడింది. ఆవిధంగా కొన్నివృత్తులనే కులాలుగామార్చి వేసినట్లయింది. రైతులంతా బానిసలైపోయారు. క్షీణదశనరికట్టేందుకు జరుపబడిన పైపై ప్రయత్నాలన్నీకూడా విఫలంకావడమేగాక, పరిస్థి తులు మరింత చెడి, రోమన్సామ్రాజ్యం పతనమైపోయింది.

భారతీయనాగరికతాపతనం ఆవిధంగా జరుగలేదు. ఇంతజరిగినా దానిలో నిలబడగల ఆశ్చర్యకరమైనశక్తి ఉంది. కాని నానాటికి క్షీణించి పోవటం స్పష్టంగా కనిపిస్తూనేఉంది. క్రీ. శ. మొదటివెయ్యిసంవత్సరాల అనంతరం ఇండియాలోని సాంఘికపరిస్థితు లెటువంటివో వివరించి చెప్పడం కష్టం. అంతవరకు విస్తరించుతూన్న భారత దేశఆర్థికస్థితి ముడు చుకుపోసాగిందనిమాత్రం నమ్మకంగా చెప్పవచ్చు. భారతీయసాంఘిక వ్యవస్థలో దృఢమవుతున్న కులపద్ధతి, మడిగట్టుకున్నట్లునటించే సంకుచిత మనస్తత్వం ఇప్పటిపతనానికి అనివార్యమైన పర్యవసానము కావచ్చు. ఆగ్నేయాసియా మొదలైన విదేశాల్లో వలసలేర్పరచుకున్నవారు యింత కఠినమనస్కులుకారు. వారి ఆచారవ్యవహారాలూ అంత కఠిన మైనవి కానందువల్లనే ఆతరువాత 14,15 శతాబ్దాలవరకు మూడు

పూవులు ఆరుకాయలుగా అభివృద్ధిచెందారు. భారతదేశీయుల్లో మాత్రం మడిగట్టుకున్న మనస్తత్వం సృజనాత్మకశక్తిని మ్రింగివేసి, సంకుచితవర్గాలనూ, అంటరానితనాన్ని పెంచింది. జీవితం విభజించబడిన చట్రంలాగా తయారయింది. ఈ చట్రంలోని ఒక్కొక్క గదిల ఒక్కొక్కనివృత్తి స్థిరపరుపబడి, ఒకరికొకరికి సంబంధంలేకుండాపోయింది. దేశాన్ని కాపాడడానికి యుద్ధంచేయడం క్షత్రియుల బాధ్యత. ఇతరులకు అందులో ఆసక్తిలేదు, ఉన్నా వారి నా పని చేయనిచ్చేవారూకాదు. బ్రాహ్మణులు, క్షత్రియులు వర్తక - వ్యాపారాలను హీనంగా చూచే వారు. క్రిందికులాలవారికి విద్య, అభ్యుదయావకాశాలు నిరాకరించ బడ్డాయి. అగ్రకులాలవారికి తాము విధేయులైఉండాలని వారికి నేర్పారు. పట్టణపరిశ్రమలు పెంపొంది, ఆర్థికస్థితి బాగున్నప్పటికీ, రాజ్యాంగ యంత్రనిర్మాణం చాలవరకు జమీందారీవిధానంవలె ఉండేది. బహుశ యుద్ధకౌశల్యంలోకూడా ఇండియా వెనుకబడిపోయిఉంటుంది. ఈ పరి స్థితుల్లో సాంఘికవ్యవస్థ పూర్తిగామార్చబడి క్రొత్తశక్తులూ, నవోత్సాహామూ ప్రవహిస్తేనేతప్ప ఈ సమాజానికి పురోగమనం సాధ్యంకాదు. కులపద్ధతి అట్టిమార్పుకు పెద్ద అడ్డంకి. ఆ పద్ధతి భారతీయసమాజానికి అనేకసుగుణాలను, స్థిరత్వాన్నీ చేకూర్చినప్పటికీ, దానిలోనే పతనకారక ములైన విషబీజాలుకూడా వున్నాయి.

భారతీయసామాజికవ్యవస్థ (దీన్నిమరొకచోట వివరంగా చర్చి స్తాను) భారతీయనాగరికతకు ఆశ్చర్యకరమైన నిలకడను చేకూర్చింది. అది వర్గాలకు బలాన్నీ, కలుపుగోలుతనాన్నీ ప్రసాదించింది. కాని ఇదే పురోగమనానికీ, మొత్తంసమాజపువిక్యతకూ పెద్ద అడ్డుగోడగా మారింది. అది చేతివృత్తులనూ, నైపుణ్యాన్నీ, వ్యాపారాన్నీ, వాణి జ్యాన్నీ పెంపొందించింది. కాని ఏకులానికి ఆ కులంలో వేర్వేరుగా మాత్రమే. ఆవిధంగా కొన్నిరకాలకార్యకలాపాలు వారసత్వంగా మాత్రమే లభించేవి. నూతనకార్యవిధానాలను తప్పించుకోవాలనీ, తన పాతగాడిలోనే నడవాలనే వైఖరి యేర్పడింది. స్వయంకృషి, నూత్న కల్పనాదృష్టి అరికట్టబడ్డాయి. ఈ కులపద్ధతి తన పరిమితపరిధిలో వ్యక్తికి పూర్తిస్వేచ్ఛను కలుగజేసింది. కాని అంతకంటె విశాలమైన స్వాతంత్ర్యావకాశాన్ని కూలద్రోసింది. అసంఖ్యాకులైనప్రజల్ని శాశ్వ

తంగా క్రిందపడివుండేట్లు చేసింది. పెంపొందేఅవకాశాలను లేకుండా చేసింది. ఆ విధానము పెంపుదలకు, వ్యాప్తికి దారులుచేసినంతవరకు అభ్యుదయకరమైనదే. అది తనకై తెరచివున్న పెంపుదలపరిధులను చేరిన తర్వాత, స్తబ్ధుగా నిలచిపోయింది. తరువాత అది తప్పనిసరిగా క్రమంగా తిరోగమించింది.

ఈకారణాలవల్లనే విజ్ఞాన, తత్వ, రాజకీయ, సాంకేతిక, యుక్తి కౌశల, లౌకికజ్ఞాన, ప్రపంచసంబంధబాంధవ్యాల రంగాలన్నింటిలోనూ క్షీణదశ ఏర్పడింది. వాటిస్థానే స్థానిక[illegible]వాలు, జమీందారీ దృక్పథాలు, కులకత్త్యలు ఆర్థికమాంద్యము [illegible] యినప్పటికీ [illegible]రత దేశమంతా ఒకటే అనే ముఖ్యభావసూత్రం[illegible] [illegible]ద్భుతమైనపటుత్వమే[illegible] ఈ భారతీయ సాంఘికవ్యవస్థలో [illegible]లచత్వము ఇంకా ఉండనేవున్నాయని తరువాతి [illegible]గాలు రుజువుచేశాయి. మల[illegible] ఈ లక్షణాలవల్లనే యిది యింకా బ్రతికి వుండగలిగింది. క్రొత్తసంబంధబాంధవ్యాలవల్ల, ఆలోచనాతరంగాలవల్ల లాభంపొంది, క్రొన్నివిధాలుగా పురోగమించింది. కాని ఆ పురోగమనం అనేక చారిత్రకావశేషాలకు బంధింపబడి, వాటిచే నిరంతరం అడ్డగించబడుతూనేవుంది.

# నూతనసమస్యలు

## అరబ్బులు - మంగోలులు

అరేబియాలో ఇస్లాంమతం రూపొందుతున్నప్పుడు, ఉత్తరభార తదేశంలో హర్షచక్రవర్తి మహాసామ్రాజ్యాన్ని పరిపాలిస్తున్నాడు. చీనా యాత్రికపండితుడు హ్యూన్‌సాంగ్ నలందావిశ్వవిద్యాలయంలో జ్ఞానసముపార్జనచేసే ... షయికంగాను, రాజకీయం గాను ఒకశక్తిగా వచ్చి, భా ... సె, భారతదేశపరిస్థి ... ఇస్లాం ... నసమస్యలను కలిగించవల సివుంది. ... ఇస్లాము భార ... వమార్పునుకలిగించ డానికి చాలకాలం తీసుకుంది. రాజకీయంగా ... డిగ ... సెకి ... రావ డానికి ఆరువందలసంవత్సరాలు పట్టింది. దానికినాయకులై వచ్చేటప్పటికి దానిస్వభావం చాలవరకు మారింది. ఉత్కృష్టమైనసంస్కృతితోను, ఆవేశపూరిత మైన ఉత్సాహంతోనూ, శక్తితోనూ స్పెయినుమొదలు మంగోలియా సరిహద్దులవరకు వ్యాపించి దేశాలనుజయించినఅరబ్బులు, భారతభూభా గంమీదికి రాలేదు. వారు భారతవాయవ్యసరిహద్దువరకు వచ్చి, అక్కడే నిలచిపోయారు. అరబ్బీనాగరికత క్రమంగా క్షీణించింది. మధ్య పశ్చిమాసియాలలోని తురుష్కతెగలు పైకివచ్చాయి. భారతసరిహ ద్దులోని యీ తురుష్కులు, ఆఫ్ఘనులే ఇస్లామును ఒక రాజకీయ శక్తిగా భారతదేశంలోనికి తీసుకువచ్చారు.

పైవిషయాలను తెలుసుకోడానికి కొన్నితేదీలు మనకు సహా యపడతాయి. క్రీ. శ. 622వ సంవత్సరంలో మహమ్మదు ప్రవక్త మక్కానుండి మదీనాకు వెళ్ళడంతో ఇస్లాం ప్రారంభమయిందనుకో వచ్చు. దీనినే 'హిజ్రత్' అంటారు. పదిసంవత్సరాలతరువాత మహ మ్మద్ చనిపోయాడు. అరబ్బుదేశంలో పరిస్థితిని సుస్థిరంచేయడానికి కొం తకాలంపట్టింది. తరువాత మహమ్మదీయమతధ్వజంతో అరబ్బులు తూర్పున మధ్యఆసియావరకూ, పడమట ఉత్తరఆఫ్రికాగుండా స్పెయిన్

ఫ్రాన్సుదేశాలవరకూ వ్యాపించారు. ఏడవశతాబ్దంలోను, ఎనిమిదవ శతాబ్దప్రారంభంలోను వారు ఇరాక్, ఇరాన్, మధ్యఆసియాలలోనికి వ్యాపించారు. క్రీ. శ. 712 వ సంవత్సరంలో భారతవాయవ్యభాగంలఏ సింధురాష్ట్రాన్ని ఆక్రమించుకొని, అక్కడ ఆగిపోయారు. సింధురాష్ట్రాన్ని, అంతకంటె సారవంతమైన మిగత భారతదేశాన్ని ఒక ఎడారి విడదీస్తోంది. పశ్చిమంలో అరబ్బులు ఆఫ్రికాను, యూరపును విడదీస్తున్న సింధుశాఖను దాటి, క్రీ. శ. 711 వ సంవత్సరంలో స్పెయినులో ప్రవేశించారు. స్పెయినుదేశాన్ని అంతటినీ ఆక్రమించుకొని, పిరనీస్ పర్వతాలను దాటి, ఫ్రాన్సుదేశంలో కాలుపెట్టారు. క్రీ. శ. 732లో ఫ్రాన్సుదేశంలో టూర్సువద్ద చార్లెస్ మార్టెల్ అరబ్బులను ఓడించి నిలిపివేశాడు.

అరేబియాఎడారులు నివాసంగాకలిగి, నాటివరకు చరిత్రలో ముఖ్యపాత్ర నిర్వహించకుండానే, యింతటి విజయపరంపరను సాధించిన అరబ్బులచరిత్ర చాల విశిష్టమైనది. తమఅపారమైనశక్తిని, వారు తమ ప్రవక్తయొక్క శక్తియుత విప్లవాత్మక జీవితాన్నుంచి, ఆయన బోధించిన మానవ సౌభ్రాతృత్వంనుంచి పొందిఉంటారు. అంతేకాని, అరబ్బీ నాగరికత అంధకారంలోంచి హఠాత్తుగా పైకివచ్చిందనో, లేక ఇస్లామతం వచ్చినతరువాతే రూపొందిందనో అనుకోవడం పొరపాటు. ఇస్లాంకుపూర్వమున్న అరబ్బీనాగరికతను చిన్నబుచ్చి, ఆ కాలాన్ని 'జాహిలియత్' అని పిలచి, దానిని అజ్ఞాన, మూఢనమ్మకాలయుగంగా చిత్రించే వైఖరిని మహమ్మదీయపండితులు లవలంబించారు. అరబ్బీనాగరికత అతిప్రాచీనమైనదై, సెమిటిక్ జాతి, ఫొనీషియన్లు, క్రీటనులు, చాల్టియనులు, యూదుల అభివృద్ధితో చాల దగ్గరసంబంధం కలిగిఉండేది. యూదులుమాత్రం చాల్టియనులవంటివారినుండి వేరుపడి వుండేవారు. యూదులకు, మిగిలిన సెమిటిక్ జాతులకు తగాదాలుండేవి. అయినప్పటికీ, సెమిటిక్ ప్రాంతమంతటిలోను సంబంధాలు, యిచ్చిపుచ్చుకోడాలు వుండేవి. కొంతవరకు సమానచరిత్రగూడ ఉండేది. ఇస్లాముకు పూర్వం అరబ్బునాగరికత ముఖ్యంగా యెమెన్‌లో అభివృద్ధిచెందింది. మహమ్మదుప్రవక్తకాలంలో అరబ్బీభాష కొన్ని పర్షియన్‌మాటలు, కొన్ని భారతీయభాషాపదములతో మిశ్రమమై చాలా అభివృద్ధి

చెందింది. వ్యాపారంకోసం ఫొనీషియన్లవలెనే అరబ్బులుకూడ సము ద్రాలుదాటి దూరదేశాలు వెళ్లేవారు. ఇస్లాముకుపూర్వం దక్షిణ చైనాలో, కాంటన్‌వద్ద ఒక అరబ్బీవలస వుండేది.

మహమ్మదు ప్రవక్త తన ప్రజల్లో చైతన్యం కలిగించి, వారికి ఉత్సాహ, విశ్వాసాలను పూరించాడనేది నిజం. ఒక నూతనఆదర్శా నికి తాము మార్గదర్శకులమని తలచి, అప్పుడప్పుడు మొత్తంజాతిని, చరిత్రను మార్చగలిగిన ఉత్సాహము, ఆత్మవిశ్వాసములను వారు పెంపొందించుకున్నారు. వారి విజయానికి అప్పుడు మధ్య, పశ్చిమఆశి యాల్లోని, ఉత్తరాఫ్రికాలోని రాజ్యాల క్షీణస్థితికూడ, నిస్సందే హంగా ఒకకారణం. అధికారంకోసం రక్తపాతంవరకు పోతూ, ఎప్పుడూ తగాదాపడుతున్న క్రైస్తవతెగలపోరాటంతో ఉత్తరాఫ్రికా సతమత మయింది. ఆకాలంలో అవలంబింపబడుతున్న క్రైస్తవమతము సంకుచి తంగాను, సహనంలేనిదిగానూ ఉండేది. అరబ్బీముస్లిముల సహనము, వారి మానవసౌభ్రాతృత్వపు బోధలకు నాటి క్రైస్తవమతానికి ఉన్న తేడా కొట్టవచ్చినట్టుండేది. క్రైస్తవులలోనిసంఘర్షణ కలిగించిన విసుగు చాలమందిని మహమ్మదీయులుగా మార్చింది.

అరబ్బులు తమతో దూరదేశాలకు తీసుకొనిపోయిన సంస్కృతి ఎప్పుడూ మారుతూ, అభివృద్ధిచెందుతూనేఉంది. అరబ్బీసంస్కృతిమీద ఇస్లాంమతంయొక్క నూతనభావాలప్రభావం ఎక్కువగా ఉన్నప్పటికి, దానిని ఇస్లాంనాగరికత అని పిలవడం చిక్కుగాఉంటుంది. బహుశా తప్పేమో కూడాను. డెమాస్కస్‌వద్ద (తమరాజధానిలో) వారు తమ నిరాడంబరజీవితవిధానాన్ని వదిలేసి, కృత్రిమసంస్కృతిని అవలంబిం చారు. ఆ కాలాన్ని అరబ్బీ-సిరియన్‌నాగరికతాకాలం అని పిలువ వచ్చును. తూర్పుగ్రీసుప్రభావము వాళ్ళమీద కొంత ఉన్నా, వారు బాగ్దాద్‌కువెళ్ళినతరువాత, పురాతన ఇరానీఆచారాలు వాళ్ళ నెక్కు వగా మార్చాయి. తరువాత వారి అధీనమందున్న విశాలరాష్ట్రాల్లో బలీయమైన అరబ్బీ-పర్షియన్‌నాగరికతను పెంపొందించారు.

విస్తారంగాను, తేలికగానే సాధింపబడినట్లుకనబడేయీఅరబ్బుల దండయాత్ర — నాడుగాని, తరువాతగాని, భారతదేశంలో సింధు రాష్ట్రాన్నిదాటి లోనికిపోలేదు. యీ దండయాత్రలతాకిడికి తట్టుకొని

నిల ద్రొక్కుకోగలశక్తి యింకా భారతదేశానికి ఉండబట్టేనా? ఉండి ఉంటుంది. లేకపోతే, తరువాత కొన్నిశతాబ్దాలకుగాని నిజమైనదండ యాత్ర జరిగిఉండకపోవడానికి కారణం చెప్పడం కష్టం. అరబ్బులకు స్వదేశంలోనేగలతగాదాలు కొంతవరకు కారణం కావచ్చు. బాగ్దాద్ లోనికేంద్రప్రభుత్వంనుండి విడివడి, సింధురాష్ట్రం స్వతంత్రముస్లిం రాజ్యంగా మారింది దండయాత్ర లేకపోయినా, భారతదేశానికి అరబ్బు ప్రపంచానికి గల సంబంధాలు పెరిగాయి. యాత్రికులు వచ్చిపోతుండే వారు. రాయబారులు మార్చుకోబడ్డారు. భారతగ్రంథాలు-ముఖ్యంగా గణితము, జ్యోతిశ్శాస్త్రగ్రంథాలు బాగ్దాద్‌కు కొనిపోబడి, అరబ్బీ భాషలోనికి అనువదింపబడ్డాయి. చాలమంది భారత భౌతికశాస్త్రజ్ఞులు బాగ్దాద్‌నగరానికి వెళ్ళారు. యీ రకమైనవ్యాపార, సాంస్కృతికసంబం ధాలు ఉత్తరభారతదేశంతోమాత్రమే ఆగిపోలేదు. దక్షిణభారతదేశా నికి కూడ యీ సంబంధా లుండేవి. ముఖ్యంగా, పశ్చిమతీరానగల రాష్ట్రకూటులకు వాణిజ్యసంబంధాలుండేవి.

యీ అధికసంబంధంవలన భారతీయులకు క్రొత్తమతం ఇస్లాం వెలిసింది. యీ నూతనమతాన్ని ప్రచారంచేసేందుకు మతప్రచార కులు వచ్చారు. వారికి సుస్వాగతమీయబడింది. మసీదులు నిర్మింప బడ్డాయి. ప్రభుత్వంగాని, ప్రజలుగాని ఎట్టి అభ్యంతరంచెప్పలేదు. మతకలహాలూ లేవు. అన్నిమతాలపట్ల, అన్నివిశ్వాసాల యెడల సహనంచూపడం భారతదేశంలో ఆదినుండీ ఆచారమే. యీవిధంగా, రాజకీయశక్తిగా రావడానికి పలుశతాబ్దాలక్రితం, మతంగా ఇస్లాం భారత దేశానికి వచ్చింది.

ఒమ్మేయా ఖలీఫాల (ఒమ్మేయాద్‌కలీఫులు) అధీనమందున్న అరబ్బుసామ్రాజ్యానికి రాజధాని డెమాస్కస్‌నగరము. అక్కడ ఒక మహాపట్టణం పెరిగింది. కాని, త్వరలోనే సుమారు క్రీ. శ. 750 ప్రాంతంలో అబ్బాసియా ఖలీఫులు రాజధానిని బాగ్దాద్‌నగరానికి తీసుకుపోయారు. అంతఃకలహాలు పెరిగిపోయి, కేంద్రాధికారంనుండి స్పెయిను విడిపోయింది. కాని, చాలాకాలంవరకు స్వతంత్రఅరబ్బీ రాజ్యంగానే ఉండేది. క్రమంగా అరబ్బీసామ్రాజ్యంకూడ బలహీనమై పోయి, పలురాజ్యాలుగా చీలిపోయింది. మధ్యఆసియానుండి సెల్జుక్

తురుష్కులు వచ్చి, రాజకీయంగా బాగ్దాద్‌నగరంలో బలపడ్డారు. ఖలీఫా వారియిష్టానుసారమే పనిచేసేవాడు. గొప్పవీరుడు, నాయకుడు అయిన సుల్తాను ఘజినీ మహమ్మదు ఆఫ్ఘనిస్థానంలో అధికారంలోకి వచ్చాడు. అతడు ఖలీఫాను లెక్కచెయ్యకపోవడమేకాక పలుసార్లు నిందించాడు కూడాను. కాని, ముస్లిం ప్రపంచానికి బాగ్దాదే సాంస్కృతిక కేంద్రంగా ఉండేది. దూరానఉన్న స్పెయిన్‌కూడ ఉత్సాహంకోసం బాగ్దాద్‌నగరంవైపే చూచేది. విజ్ఞానంలో, శాస్త్రంలో, కళల్లో, జీవిత సౌకర్యాలుకలిగియుండడంలో నాడు ఐరోపా వెనుకబడిఉండేది. అప్పుడు యూరపులోనున్న అంధకారంలో విజ్ఞానజ్యోతిని వెలిగించి, జిజ్ఞాసను రేకెత్తించింది అరబ్బీస్పెయిను, ముఖ్యంగా కార్డోబావిశ్వవిద్యాలయం. ఆ కాంతి కొంతవరకు యూరపులోనిచీకటిని చీల్చింది.

క్రీ. శ. 1095వ సం॥లో ప్రారంభమైన మతయుద్ధాలు ఒకటిన్నరశతాబ్దాలవరకు జరిగాయి. ఈ మతయుద్ధాలు రెండుమతాలసంఘర్షణ లేక శిలువకు,అర్ధచంద్రాకృతికి జరిగిన పోరాటంమాత్రమేకాదు. "జాగృతమైన యూరపుశక్తులు తూర్పుకు సాగడంలో మత, సైనికవిషయికంగా 'మతయుద్ధాలు' అనే రూపాన్నిపొందాయి. మతయుద్ధాల నుండి యూరపు సాధించిన విజయం – పవిత్ర క్రీస్తుకళేబరసమాధిని శాశ్వతంగా విడుదలచెయ్యడంగాని, క్రైస్తవప్రాంతాలను సమైక్యపరచడంగాని కాదు. మతయుద్ధాలు యీ లక్ష్యాలను సాధించలేదని వాటి చరిత్రే చెప్తుతోంది. మతసన్యాసి అయిన పీటరు గర్హించే అన్నివిషయాలను, లలితకళలనూ, సున్నితమైనవృత్తులనూ, భోగాన్ని, శాస్త్రజ్ఞానాన్ని, జిజ్ఞాసను యూరపు మతయుద్ధాలవల్ల తెచ్చుకుంది" అని ప్రఖ్యాత చరిత్రకారుడు ట్రెవిల్యాన్ వ్రాశాడు.

చివరిమతయుద్ధము అవమానకరంగా అంతమయ్యేముందు ఆసియాఖండంమధ్యలో ప్రళయంలాంటిసంఘటన జరిగింది. చెంఘిజ్‌ఖాన్ పశ్చిమానికి తన విధ్వంసకదండయాత్ర ప్రారంభించాడు. క్రీ. శ. 1155వ సంవత్సరంలో మంగోలియాలో జన్మించి, మధ్యఆశియాను స్మశానభూమిగాచేసే యీ దండయాత్రను క్రీ. శ. 1219వ సంవత్సరంలో అతడు ప్రారంభించాడు. ఆయన అప్పుడు యువకుడేమీ కాదు. పదేసిలక్షలమంది జనాభాగల నగరాలు – బొఖారా, సమర్కండ్,

హీరట్, బాల్ఖ్‌లను తగులబెట్టి బుగ్గిచేశాడు. రష్యాలో కీవ్ వరకు వెళ్ళి, వెనుదిరిగాడు. అతనిమార్గంలో లేనందువల్ల బాగ్దాద్ నగరం తప్పించుకుంది. క్రీ. శ. 1227 లో తన డెబ్బదిరెండవఏట అతడు మరణించాడు. అతనివారసులు యూరపులోనికి యింకా చొచ్చుకుపోయారు. 500 సంవత్సరాలుగా అన్నిరకాలకళాఖండాలకు కేంద్రంగా ఉండి, విజ్ఞానకేంద్రమని ప్రసిద్ధిగాంచిన బాగ్దాద్ నగరాన్ని, హులాగు క్రీ. శ. 1258వ సంవత్సరంలో నాశనంచేశాడు. మంగోలులఅధికారంలో గూడ ఆసియాలోని అరబ్బీ పర్షియన్ నాగరికత సజీవంగానేఉన్నా, బాగ్దాద్ నగరపతనం గొడ్డలిపెట్టువలె తగిలింది. ఉత్తరఆఫ్రికాలోను, ముఖ్యంగా స్పెయినులోను, ఆ నాగరికత కొనసాగింది. పండితులు గుంపులుగుంపులుగా తమగ్రంథాలతో బాగ్దాద్ నగరాన్నుండి కైరో, స్పెయినులకు పారిపోయారు. అచ్చట కళ, విజ్ఞానము మరల అభివృద్ధి పొందినాయి. అరబ్బీఆధిపత్యంనుండి స్పెయినుమాత్రం జారిపోవనారంభించింది క్రీ. శ. 1236 లో కోర్డోబా పడిపోయింది. అరబ్ సంస్కృతీరంగంగా గ్రనాడారాజ్యం రెండున్నరశతాబ్దాలు నిలచిఉంది క్రీ. శ. 1492 లో గ్రనాడాను ఫెర్డినాండ్, ఇసబెల్లాలు జయించడంతో స్పెయినులో అరబ్బీఅధికారం అంతమయింది. అప్పటినుండి, తురుష్కులఆధిపత్యంలోనికివచ్చినా, కైరోనగరం అరబ్బీసంస్కృతికి కేంద్రమయింది. క్రీ. శ. 1453 వ సంవత్సరంలో ఆటోమన్ తురుష్కులు కాన్‌స్టాంటినోపుల్ నగరాన్ని వశపరచుకొని, యూరపులో విజ్ఞానజాగృతిని కలిగించిన శక్తులను విడుదలచేసుకున్నారు.

ఆసియాలోను, యూరపులోను మంగోలులవిజయాలు యుద్ధకళలో నూతనపంథాను చూపించాయి. "పరిమాణంలోను, లక్షణంలోను, ఆశ్చర్యంకల్గించడంలోను, కదలికలోను, యుద్ధవ్యూహంపన్నడంలోనూ, చాతుర్యంగా ఎదుటివారినిసమీపించడంలోనూ మంగోలులదండయాత్రలు చరిత్రలో మిగతదండయాత్రలన్నిటిని తలదన్నతాయి" అని లిడెల్ హార్ట్ వక్కాణించాడు. చెంఘిజ్ ఖాన్ ప్రపంచంలో అందరికంటె గొప్పవాడు కాకపోయినా, గొప్పసేనానుల్లో ఒకడు. ఆసియా, యూరపులశౌర్యం, చెంఘిజ్ ఖాన్ ముందు, అతనివంశీయులముందు ఎంతమాత్రం ఆగలేదు. మధ్య, పశ్చిమాసియాలు వీరికిగుర్తి

కాకపోవడం వాటిఅదృష్టమే. మంగోలులనుండి యూరోపియనులు యుద్ధకళ, వ్యూహాలనుగురించి కొత్తవిషయాలు నేర్చుకొన్నారు. మంగోలులద్వారా చైనానుండి తుపాకిమందుకూడ యూరపుకువచ్చింది

మంగోలులు భారతదేశానికి రాలేదు. సింధునదివద్ద ఆగిపోయి, వారిదండయాత్రలు వేరేచోట్ల సాగించారు. వారిమహాసామ్రాజ్యాలు పడిపోగానే, ఆసియాలో చాలా చిన్నరాజ్యాలు లేచాయి. క్రీ. శ. 1369లో తనతల్లిద్వారా చెంఘిజ్ ఖాన్‌సంబంధం కలుపుకున్న తైమూరు చెంఘిజ్ ఖాన్‌వలె తిరిగి సాహసకృత్యాలు సాగించాలనిప్రయత్నించాడు కొద్దికాలంమాత్రమేఅయినా, అతనిరాజధాని సమర్ఖండ్ సామ్రాజ్యానికి కేంద్రమయింది. తైమూరు మరణానంతరం అతనివంశీయులు సైనికసాహసచర్యలకంటె కళయందు, ఒడుదుడుకుల్లేని జీవితంపట్ల ఆసక్తులై ఉన్నారు. తైమూరుపేర మధ్యఆసియాలో విజ్ఞానపునరుద్ధరణ జరిగింది. ఈ వాతావరణంలో తైమూరువంశీయుడైన బాబరు పుట్టి పెరిగాడు. మొగలువంశాన్ని భారతదేశంలో స్థాపించినవాడు బాబరు. ఇతడు మొగలులలో మొదటివాడు. క్రీ. శ. 1526 లో బాబరు ఢిల్లీని వశపరచుకున్నాడు.

చెంఘిజ్ ఖాన్ మహమ్మదీయుడు కాడు. అతనిపేరునుబట్టి చాలమంది అతడు మహమ్మదీయుడనుకుంటారు. ఆకాశానికిసంబంధించిన "షమాయిజం" అనే మతాన్ని నమ్మేవాడట. ఈ మతమేమిటో నాకు తెలియదు కాని, యీ పదం అరబ్బీభాషలో బౌద్ధులను సూచించే 'సమాని' అనేపదాన్నిగురించి స్ఫురింపజేస్తుంది. 'సమాని' అనేపదం 'శ్రావన' అనే సంస్కృతపదంలోనుంచి వచ్చింది. ఆసియాలో చాలా భాగాల్లోనూ మంగోలియాలోను రకరకాలయిన బౌద్ధమతం వ్యాప్తిలో వుండేది. చెంఘిజ్ ఖాన్ బహుశా ఈ బౌద్ధమతప్రభావంలో పెరిగివుండవచ్చు. ప్రపంచచరిత్రలో అందరికంటె గొప్పవాడైన సేనాని ఒకరకం బౌద్ధుడయివుండడం విచిత్రం.

ఈనాటికీ మధ్యఆసియాలో నలుగురు మహాసేనానులపేరులు తలచుకుంటారు – సికందర్ (అలెగ్జాండరు), సుల్తానుమహమ్మదు, చెంఘిజ్ ఖాన్, తైమూరు. ఈ నాలుగుపేర్లకు సేనానికాకపోయినా, మరొకరంగంలో జయాన్నిసాధించిన ఒకరిపేరు చేర్చాలి – అది లెనిన్.

## ౨ అరబ్బుల సంస్కృతీవికాసము - భారతదేశంతో సంబంధాలు

ఆసియా, ఆఫ్రికాల్లో విశాలప్రాంతాలను, యూరపులో కొద్ది భాగాన్ని అతిత్వరలో జయించిన అరబ్బులు మిగిలినరంగాల్లో జయం సాధిద్దామని తమదృష్టిని ఇతరరంగాలవైపు మరల్చారు. సామ్రాజ్యం బలిష్టంచేయబడుతోంది. అనేక ఇతరదేశాలు వారిఆధిపత్యంక్రిందికి వచ్చాయి. యీ ప్రపంచాన్నిగురించి, దానిరీతులను గురించి తెలుసుకోవాలనేకోరిక వారికి కలిగింది. ఎనిమిది, తొమ్మిదిశతాబ్దాల అరబ్బులజిజ్ఞాస, హేతువాదంలో వారుచేసిన ప్రయత్నాలు, శాస్త్రాల్లో వారిపరిశోధనలు ఆశ్చర్యకరమైనవి. ఏ మతమైనా మొదట్లో గట్టి నమ్మకాలు, అభిప్రాయాలమీద నిలబడిఉంటుంది. విశ్వాసం ప్రబలంగా ఉంటుంది. అట్టిరోజుల్లో మార్పులను అంగీకరించరు, ప్రోత్సహించరు. అరబ్బులను ఆ విశ్వాసమే చాలాదూరం తీసుకుపోయింది. వారివిజయం వారిమతంమీది విశ్వాసాన్ని బలిష్ఠంచేసింది. కాని వారిమూఢనమ్మకాలను, మతాన్ని దాటి, అజ్ఞతావాదంతోగూడ పెనగులాడి, ప్రజాసంబంధమైన ప్రయత్నాలుచేశారు. ప్రపంచయాత్రికుల్లో అరబ్బుయాత్రికులు చాలా గొప్పవారు. వారు యితరదూరదేశాలకుపోయి, ఆ ప్రజలు ఏమిఆలోచిస్తున్నారో, ఏమిచేస్తున్నారో తెలుసుకోడానికీ వారిశాస్త్రాలు, తత్వజ్ఞానము, వారి జీవితవిధానాలేమిటో గ్రహించి, తమపరిస్థితిని అభివృద్ధిచేసుకోడానికీ ప్రయత్నించారు. గ్రంథాలు, పండితులు బాగ్దాద్‌నగరానికి కొనిరాబడ్డారు. ఖలీఫ్-అల్-మన్సూర్, (ఎనిమిదవశతాబ్దం.) ఒక పరిశోధక-అనువాదకేంద్రాన్ని స్థాపించాడు. అక్కడ గ్రీకు, సిరియన్, జెండ్, లాటిన్, సంస్కృతభాషల్లోనిగ్రంథాలు అనువదింపబడ్డాయి. సిరియా, ఆసియామైనరు, లెవాంటులలోని ప్రాచీన మఠాలు పాత వ్రాతప్రతులకొరకు వెతకబడ్డాయి. అలెగ్జాండ్రియాలోని పాతపాఠశాలలను మూసివేసి, వాటిలోనిపండితులను క్రైస్తవ మతగురువులు తరిమివేశారు. యీనిర్వాసులలో చాలమంది పర్షియాకు, యితరచోట్లకు చేరుకున్నారు. ఇప్పుడు బాగ్దాద్‌నగరం వీరందరికీ స్వాగతంచెప్పి, ఆశ్రయమిచ్చింది. వీరు తమతో గ్రీకుగ్రంథాలు, ప్లాటో, అరిస్టాటిల్, టోలెమీ, యూక్లిడ్‌ల తత్వ, వైజ్ఞానిక, గణితశాస్త్రాలను

బాగ్దాద్ నగరానికి తీసుకువచ్చారు. నెస్టోరియన్ పండితులు, భారతీయ శాస్త్రజ్ఞులు, తత్వవేత్తలు, గణితశాస్త్రజ్ఞులు ఉండేవారు. ఈ విధంగా హారున్ - అల్ - రషీద్, అల్-మమున్ (ఎనిమిదవశతాబ్దమధ్యకాలం) అను ఖలీఫాల పాలనాకాలంలో జరిగి, అభివృద్ధిచెందింది. బాగ్దాద్ నగరం నాటి నాగరకప్రపంచానికి విజ్ఞానకేంద్రంగా విలసిల్లింది.

యీకాలంలో అరబ్బులకు భారతదేశంతో అనేకసంబంధాలు ఉండేవి. అరబ్బులు భారతీయగణితము, ఖగోళశాస్త్రము, వైద్యములను గురించి చాలానేర్చుకున్నారు. అయినా యీసంబంధాలన్నింటికీప్రథమ ప్రయత్నం అరబ్బులదే. అరబ్బులు భారతదేశాన్నుంచి చాలా నేర్చుకున్నా, భారతీయులు అరబ్బులనుండి అంతగా నేర్చుకున్నట్టు కన బడదు. భారతీయులు తమ అహంభావంతో సాధ్యమయినంతవరకు తమగూళ్ళలోనే కూర్చుని, విడిగానే ఉండిపోయారు. బాగ్దాద్‌లోని వైజ్ఞానికమైన కదలికను మనవారు ఆస్వాదించకపోవడం విచారకరం. అరబ్ సంస్కృతీపునరుద్ధరణలపరిశీలన భారతదేశం తన నిర్మాణాత్మక శక్తిని కోల్పోతున్నపుడు మేల్కొలిపేది. ఆ వివేకపరిశోధనల్లో - కొన్ని తరాలక్రితపుభారతీయులైతే - దగ్గరసంబంధం కలుపుకోగలిగేవారు.

హారున్-అల్-రషీద్‌కు వజీర్లనిచ్చిన బార్మక్ కుటుంబం (బార్మ సైడ్లు) భారతవిజ్ఞానాన్ని, శాస్త్రాన్ని ప్రోత్సహించింది. యీ కుటుంబం బౌద్ధమతంనుండి మహమ్మదీయమతానికి మార్చబడి ఉంటుంది. మానక్ అనే భారతీయవైద్యుడు హారున్-అల్-రషీద్‌కు జబ్బుచేసినపుడు పిలి పించబడ్డాడు. మానక్ బాగ్దాద్‌లో ఉండిపోయి, అచ్చట కట్టబడిన పెద్ద వైద్యశాలకు అధికారిగా నియమింపబడ్డాడు. మానక్ కాకుండా మరిఆరుగురు భారతీయవైద్యులు బాగ్దాద్‌లో ఉన్నట్లు అరబ్బీ చరిత్ర కారులు పేర్కొన్నారు. ఖగోళశాస్త్రంలో అరబ్బులు భారతీయులను, అలెగ్జాండ్రియనులనుగూడ మించిపోయారు. తొమ్మిదవశతాబ్దపు ఖగోళ, గణితశాస్త్రజ్ఞుడైన అల్ ఖ్వారిస్మీ, పన్నెండవ శతాబ్దపు కవి, ఖగోళశాస్త్రజ్ఞుడైన ఉమర్ ఖయ్యాం-వీరిద్దరూ సుప్రసిద్ధులు. వైద్యంలో అరబ్బీ వైద్యులు, శస్త్రవైద్యులుకూడ యూరపు, ఆసియాలలో చాలా పేరుపొందారు. బొకారానగరానికిచెందిన ఇబిసిన్నా (అవిసెన్నా) అనే వైద్యుడు చాలా ప్రసిద్ధుడు. ఈయనను వైద్యసార్వభౌముడనేవారు,

ఆయన క్రీ. శ. 1037లో మరణించాడు. ఆబు నాసర్ ఫరాబి అరబ్ తత్వ శాస్త్రజ్ఞుల్లో, మహామేధావుల్లో ఒకడు.

తత్వశాస్త్రంలో భారత దేశప్రభావం ఎక్కువగాఉన్నట్లు కనబడదు. తత్వ, భౌతికశాస్త్రాలవిషయంలో అరబ్బులు, గ్రీకుల, ప్రాచీన అలెగ్జాండ్రియనుల సహాయం పొందారు. ప్లేటో, యింకా ముఖ్యంగా అరిస్టోటిల్ అరబ్బులఆలోచనలమీాద అధికప్రభావం కలిగిఉండేవారు. నాటినుండి అసలులోగాకపోయినా, అరబ్బీవ్యాఖ్యానాల్లో అయినా వారిశాస్త్రాలు ఇస్లాంపాఠశాలల్లో ముఖ్యపాఠ్యవిషయాలుగా ఉంటున్నాయి. అలెగ్జాండ్రియానుండి ఆధునిక ప్లాటోనిజం కూడ అరబ్బుల మీాద కొంతప్రభావం కలిగిఉంది. గ్రీసునుండి భౌతికవాదం అరేబియా చేరి, హేతువాదము, భౌతికవాదము తలెత్తడానికి కారణమయింది. మతసిద్ధాంతాలకు హేతుయుక్తంగా అర్థంచెప్పాలని తార్కికులు ప్రయత్నించారు. భౌతికవాదులు మతాన్ని మొత్తంగానే తిరస్కరించారు. యీా విభిన్నసిద్ధాంతాలవారికి బాగ్దాద్‌లోయివ్వబడిన వాక్స్వాతంత్ర్యము గమనార్హం. విశ్వాసానికి, యుక్తికి కలిగిన యీా వివాదము బాగ్దాద్ నుండి అరేబియాఅంతా నిండి, స్పెయినువరకు వ్యాపించింది. భగవంతునిస్వభావాన్ని చర్చించి, సామాన్యంగా ఆయనకు ఆపాదించే లక్షణాలేమీా ఉండవని నిర్ణయించబడింది. ఈ లక్షణాలు మానవునివి. దేవునికి దయ, ధర్మం ఉంటాయనడం, ఆయనకు గడ్డం ఉంటుందన్నంత అసందర్భమని తేల్చారు.

హేతువాదం క్రమంగా సంశయవాదానికి, అజ్ఞతావాదానికి దారి తీసింది. బాగ్దాద్ క్షీణించి, తురుష్కులఅధికారం ప్రబలడంతో యీా హేతువాదవిచారణ కొంత తగ్గింది. కాని, అరబ్బీస్పెయినులో హేతువాదం యింకా కొంతకాలం సాగింది. స్పెయినులో అరబ్బీవేదాంతి ఒకాయన మతంలేదనేంతదూరం వెళ్ళాడు. ఈయనపేరు ఇబిన్ రషద్ (అవరోస్). పన్నెండవశతాబ్దపువాడు. నాటి మతాలు చిన్నపిల్లలకు, లేక మూఢులకు ఉద్దేశించినవనీ, ఆచరణయోగ్యంకావనీ ఆయన అన్నాడని ప్రతీతి. ఆయన నిజంగా అలా అన్నాడో లేదో అనుమానాస్పదం. కాని, ఆ విశేషం ఆయన ఏరకంమనిషో తెలియజేస్తుంది. తన అభిప్రాయాలకు ఆయన బాధపడ్డాడు. చాలావిధాల ఆయన నిశ్చి

షుడు. స్త్రీలకు ప్రజాహితకార్యాల్లో పాల్గొనేందుకు అవకాశమివ్వాలనీ, అలా అవకాశమిస్తే వారు తప్పక రాణిస్తారనీ అతడు గట్టిగా వ్రాశాడు. జీర్ణించినవ్యాధులుగలవారు సంఘానికి భారంగనుక, వారి అంతమొందించాలనికూడా అతడు సూచించాడు. మిగతా యూరపులోని విజ్ఞానకేంద్రాలకంటె స్పెయిను చాల పురోగమించి ఉంది. కార్డోబానుండివచ్చిన అరబ్బీ, యూదుపండితులను పారిస్‌లోను, యితరచోట్లా చాల గౌరవించేవారు. యీ అరబ్బులకు యితర యూరోపియనులనుగురించి సదభిప్రాయ మున్నట్టు తోచదు. పిరనీస్ పర్వతాలకు ఉత్తరాన నివసించే యూరోపియనులనుగురించి స్సైద్ ఆఫ్ తోలెడో అనేఆయన ఇలా అన్నాడు: "వీళ్ళు చాల ఉదాసీన స్వభావంగలవారు. ఎప్పటికీ యుక్తవయస్కులుకారు.వీరు చాల ఎత్తుగా, తెల్లగా ఉంటారు. కాని, వీరికి బుద్ధిబలం, తెలివితేటలు చాలా తక్కువ.

మధ్య, పశ్చిమఆసియాలలో అరబ్ సంస్కృతీవికాసము రెండు నాగరికతలనుండి ఉత్సాహంపొందింది. ఒకటి అరబ్, రెండవది ఇరానియన్. యివిరెండూ బాగా అల్లుకుపోయి, గొప్ప ఆలోచనాశక్తినీ, పైతరగతులవారికి ఉన్నతజీవితప్రమాణాలనూ కలిగించాయి. అరబ్బులనుండి వివేచనాశక్తి, బలం వచ్చాయి. ఇరానియనులనుండి కళ, ఐశ్వర్యము, జీవితసుఖాలూ అందజేయబడ్డాయి. తురుష్కుల అధికారం క్రింద బాగ్దాద్ నగరం క్షీణించగానే, హేతువాదదృష్టీ, వివేచనాకూడా తగ్గిపోయాయి. మంగోలులు, చెంఘిజ్ ఖాన్ దీనినంతటినీ అంతమొందించారు. ఒకవందసంవత్సరాలతర్వాత మధ్యఆసియా తిరిగి మేల్కొని సమర్ఖండ్, హీరట్‌లు చిత్ర, శిల్పకళాకేంద్రాలయి, అరబ్బీ పర్షియన్‌ప్రాచీన నాగరకతను తిరిగి కొంతవరకు పునరుద్ధరించాయి. కాని అరబ్బులహేతువాదంగాని, శాస్త్రజిజ్ఞాసగాని పునరుద్ధరించబడలేదు. ఇస్లాంమతంకట్టుబాట్లు బిగువైపోయి, దండయాత్రలకేతప్ప, విజ్ఞానవిషయికమైన జయాలు సాధించేందుకు పనికిరాలేదు. దానిప్రతినిధులు ఆసియాలో అరబ్బులుకారు. తురుష్కులు, మంగోలులు (భారతదేశంలో వీరిని మొగలులంటారు), కొంతవరకు ఆఫ్ఘనులూను. పశ్చిమ ఆసియాలోని మంగోలులు ముసల్మానులయ్యారు. దూరప్రాచ్యంలోను, మధ్యధరారాష్ట్రాలలోను వారు బౌద్ధులయ్యారు.

## 3 మహమ్మదు ఘజినీ - ఆఫ్ఘనులు

ఎనిమిదవశతాబ్దంప్రారంభంలో క్రీ. శ. 712 లో అరబ్బులు సింధురాష్ట్రానికిచేరి, దానిని ఆక్రమించుకున్నారు. వారు అక్కడ ఆగి పోయారు. అర్థశతాబ్దంలో సింధురాష్ట్రంకూడ అరబ్ సామ్రాజ్యం నుంచి స్వతంత్రమైపోయింది. అయినా కొంతకాలం స్వతంత్రముస్లిం రాజ్యంగా వుండేది. దాదాపు 300 సంవత్సరాలవరకు భారతదేశం మీద మరోదండయాత్రగాని, ఆక్రమణగాని లేదు. క్రి. శ. 1000 వ సం॥ ప్రాంతంలో మధ్యఆసియాలో అధికారంసంపాదించిన తురుష్కుడైన సుల్తాను మహమ్మదు ఘజినీ భారతదేశంమీద తనదాడులు ప్రారంభించాడు. ఇలాంటిదాడులు చాలా జరిగాయి. ఇవి భీభత్సంగాను, నిర్దాక్షిణ్యంగాను వుండేవి. ప్రతిసారి మహమ్మదు తనతో అపారమైన ధనరాసులు తీసుకుపోయాడు. ఆల్ బెరూనీ ఖీవా అనే సమకాలిక పండితుడు యీ దాడులను యిలా వర్ణించాడు - "ప్రజలు చెప్పుకునే కథల్లాగా హిందువులు అన్నిదిక్కులకు దుమ్ముకణాలవలె చెదరగొట్టబడ్డారు. మిగిలినవారు ముసల్మానులనందరినీ విపరీతంగా ద్వేషిస్తారు." యీ వర్ణన మహమ్మదుదండయాత్ర కలిగించిన అపారనష్టాన్ని తెలియజేస్తుంది. అయినా మహమ్మదు తన దారిలోఉన్న ఉత్తరభారత దేశంలో కొంతభాగాన్నిమాత్రమే తాకాడని గుర్తుంచుకోవడం మంచిది. తూర్పు, మధ్య, దక్షిణభారతదేశాలు పూర్తిగా అతనిబారి నుండి తప్పించుకున్నాయి.

దక్షిణభారతదేశం అప్పుడూ, తరువాతకూడా చోళరాజులచేత పరిపాలింపబడుతూఉండేది. వీరు సముద్రమార్గాలకు అధిపతులు. జావాలోని శ్రీవిజయ, సుమత్రాలవరకు జయించినవారు. తూర్పుసముద్రాలలోని భారతీయవలసలు బలంగానూ, అభివృద్ధిపొందుతున్నవిగానూ ఉండేవి. సముద్రాధిపత్యమును వీరూ, దక్షిణభారతీయులూ పంచుకున్నారు. అయినా, ఉత్తరభారతదేశాన్ని భూమార్గయాత్రనుండి యిది రక్షించలేదు.

మహమ్మదు పంజాబును, సింధును తనరాజ్యానికి కలుపుకున్నాడు. ప్రతి దండయాత్రతరువాత ఘజినీకి తిరిగిపోతూవుండేవాడు.

ఇతడు కాశ్మీరదేశాన్ని జయించలేకపోయాడు. ఈ పర్వతప్రాంతదేశం యితన్ని ఆపి వెనక్కుమళ్ళగొట్టగలిగింది. కథియవాడులోని సోమనాథ్ నుండి తిరిగిపోతూ, యితడు రాజస్థానపుఎడారుల్లో ఘోరపరాజయాన్ని పొందాడు. ఇది అతని చివరి దండయాత్ర. దీనితరువాత అతడు మళ్ళీ రాలేదు.

మహమ్మదు మతంలో విశ్వాసంగలవాడుగాకంటె, సైనికుడుగా అధికుడు. చాలామంది సైనికులవలె మతాన్ని స్వప్రయోజనంకోసం ఉపయోగించుకున్నాడు. అతనిదృష్టిలో భారతదేశం – ఐశ్వర్యాన్ని, సామగ్రిని తీసుకుపోవడానికి వీలైన ప్రదేశం మాత్రమే. భారతదేశంలో ఒకసైన్యాన్ని సమకూర్చి, తనసేనానుల్లో తిలక్ అనేవానిక్రింద ఉంచాడు. యితడు హిందువు. మధ్యఆసియాలో తన మతంవారిమీదనే యీ సైన్యాన్ని ఉపయోగించాడు. తనపట్టణమైన ఘజనీని యితర మధ్య ఆసియా మహానగరాలతో పోటీగాచేయాలని ఘజనీ సంకల్పం. భారత దేశంనుండి చాలామంది చిత్రకారులను శిల్పులను తీసుకుపోయాడు. కట్టడాలంటే యితనికి చాలా అభిమానం. ఢిల్లీదగ్గరనున్న మథురా నగరం యితడిని చాలా ఆశ్చర్యచకితుణ్ణిచేసింది. "విశ్వాసంగల వారి నమ్మకంలాగ, అచంచలమైన వెయ్యి మహాభవనాలు యిచ్చట ఉన్నాయి. కొన్నిలక్షలదీనారాలు వెచ్చించితేనేగాని, యీనగరం ఈ స్థితికి వచ్చిందనుకోను. రెండువందల సంవత్సరాల్లోనే యిలాంటినగరం నిర్మించడం సాధ్యంగాదు" అని ఆతడు వ్రాశాడు.

తన దండయాత్రలమధ్యలో సాంస్కృతికకలాపాలను ప్రోత్స హించి, తనదగ్గరకు చాలామంది గొప్పవారిని చేర్చాడు మహమ్మదు. అట్టివారిలో 'షానామా' వ్రాసిన ప్రసిద్ధ పారసీకకవి ఫిర్దౌసీ ఒకడు. ఇతనికి మహమ్మదుకు తరువాత తగాదావచ్చింది. పండితుడు, యాత్రి కుడు అయిన అల్బెరూనీ ఇతనిసమకాలికుడు. ఇతని గ్రంథాల్లో నాటి మధ్యఆసియా జీవితవిధానాన్నిగురించి మనకు కొంత బోధపడుతుంది. పర్షియనుజాతికి చెందినవాడై ఖీవావద్ద జన్మించిన యితడు భారత దేశానికి వచ్చి, చాలాదూరం పర్యటించాడు. దక్షిణభారతదేశంలో చోళరాజ్యంలోని గొప్ప నీటిపారుదలసౌకర్యాలను గురించి అతడు వ్రాశాడు. అతడు స్వయంగా దక్షిణభారతదేశానికి వెళ్ళి, చూచాడో

లేదో అనుమానమే. కాశ్మీరంలో అతడు సంస్కృతంనేర్చుకుని మతము, వేదాంతం, శాస్త్రం, కళలనుగురించి బాగా తెలుసుకున్నాడు. గ్రీకు వేదాంతాన్ని తెలుసుకునేందుకు యింతకుముందు గ్రీకుభాష నేర్చు కున్నాడు. ఇతని గ్రంథాలు విశేషమైన సమాచారం ఇవ్వడమే కాకుండా, దోపిడీలు, హత్యలకు వెనుక పాండిత్యం ఎలా సాగుతూనే ఉండేదో, ఒక దేశపుప్రజలు మరొక దేశపుప్రజలను – వారిసంబంధాలు చెడిపోయినా – ఎలా అర్థంచేసుకునేందుకు ప్రయత్నించారో తెలుపు తాయి. వారి నిర్ణయాలలో క్రోధము, కోపము ఉండేవన్నమాట నిజం. ప్రతివారు తమజాతే గొప్పదని అనుకునేవారు. భారతీయులు గర్విష్టులు, వట్టి అహంకారులు, ఆత్మప్రాధాన్యముగలవారు, జడులు అనీ, వారికి తమ దేశంవంటి మరొక దేశం, తమజాతివంటి మరొకజాతి, తమరాజులవంటిరాజులు, తమశాస్త్రంవంటిశాస్త్రం లేవనేఅభిప్రాయం గలదనీ అల్బెరూనీ వ్రాశాడు. బహుశ ప్రజలస్వభావాన్ని అల్బెరూనీ సరిగానే వర్ణించాడేమో.

భారత దేశంలోనికి రాకపోయినా, రాజకీయంగా భారత దేశంలో అంతగా మార్పేమీరాకపోయినా, మహమ్మదుదండయాత్రలు భారత దేశచరిత్రలో ముఖ్యమైనసంఘటనలే. అవి ఉత్తరభారత దేశంయొక్క బలహీనతను చూపుతాయి. అల్బెరూనీవ్రాసినవిషయాలు ఉత్తర, పశ్చిమప్రాంతాల్లో రాజకీయపరిస్థితి ఎంతగా క్షీణించిందో తెలుపు తాయి. యితరులతో సంబంధంలేకుండా ఉన్న భారతస్వభావంలోకి, ఆర్థికపరిస్థితిలోకి ఈ వాయవ్యదండయాత్రలు చాలక్రొత్తవిషయాలను తీసుకువచ్చాయి. ఇస్లాంమతం క్రూరమై ఈ దండయాత్రలతోపాటే మొదటిసారి భారత దేశానికివచ్చింది. ఇంతవరకు, మూడువందలసంవత్స రాలుగా ఇస్లాం మతంగా వచ్చి, ఏ యిబ్బందీ, తగాదా లేకుండా, తతిమ్మా అనేకమతాలతోపాటు భారత దేశంలో ఉంది. ఈమార్పు ప్రజలలో బలీయమైన మానసికపరివర్తన తీసికొనివచ్చి, పగకు తావి చ్చింది. ఒక కొత్తమతం దేశంలోకి వస్తే, ఏవిధమైనఅభ్యంతరంలేదు. కాని, అది తమజీవితవిధానంతో బలవంతంగా కలుగజేసుకుంటేమాత్రం గట్టి అభ్యంతరమే.

హిందూమతం, దానియొక్క వివిధరూపాల్లో అన్నిటికంటె బల వత్తరమైనదైనా, హిందూదేశంలో అనేకమతాలుండేవనే విషయం గుర్తుంచుకోవడం అవసరం. క్రమంగా బలహీనమై, హిందూమతంలో కలసిపోయిన బౌద్ధ, జైనమతాలే కాకుండా, క్రైస్తవమతం, యూదు మతం కూడా ఇక్కడ ఉన్నాయి. బహుశ ఈ రెండుమతాలు క్రీ. శ. మొదటిశతాబ్దంలోనే వచ్చిఉంటాయి. ఈ రెండింటికీ దేశంలో చోటు దొరికింది. దక్షిణభారతదేశంలో చాలామంది సిరియన్‌క్రైస్తవులు, నెస్టోరియనులు ఉన్నారు. మిగిలినవారిలాగే వారుకూడ యీ దేశంలో ఒకభాగమే. యూదులూ అంతే. ఇరానుదేశంనుంచి ఏడవశతాబ్దంలో ఇక్కడికి వచ్చినకొద్దిమంది జొరాష్ట్రియనులుకూడ యీ దేశంలోభాగమే వాయవ్యంలోను, పడమటఉన్న చాలమంది ముసల్మానులుకూడఅంతే.

మహమ్మదు విజేతగా వచ్చాడు. అతడిరాజ్యానికి పంజాబు సరిహద్దురాష్ట్రమయింది. పరిపాలకుడుగా, అతడు ప్రజలమన్ననపొం దేందుకు, తనపద్ధతిని కొంతమెరుగుపరచుకునేందుకు ప్రయత్నించాడు. హిందూవులమతంతో కలుగజేసుకోవడం తగ్గిపోయింది. పరిపాలనలోను, సైన్యంలోను కూడ వారికి పెద్దఉద్యోగాలు యిచ్చాడు. మహమ్మదు కాలంలో యీ పద్ధతి ప్రారంభమయింది. తరువాత అది పెరిగింది.

క్రీ. శ. 1030 లో మహమ్మదు మరణించాడు. మరొకదండ యాత్ర లేకుండానూ, తురుష్కులఅధికారం పంజాబునుదాటి భారత దేశంలో విస్తరించకుండానూ మరొక నూటఅరవైసంవత్సరాలు గడచి పోయాయి. అప్పుడు షాహబ్-ఉద్-దీన్ ఘోరీ అనే అతడు ఘజినీ నగరాన్ని వశపరచుకొని, ఘజినీసామ్రాజ్యాన్ని అంతమొందించాడు. అప్పుడు అతడు ముందు లాహోరు, తరువాత ఢిల్లీపైన దాడిచేశాడు. కాని, ఢిల్లీరాజు పృథ్వీరాజ్ చౌహాన్ అతన్ని చిత్తుగా ఓడించాడు. ఘోరీ ఆఫ్ఘనిస్థానుకు వెళ్ళిపోయి, మరుసటిసంవత్సరం మరొకసైన్యంతో వచ్చాడు. యీసారి అతడు గెలిచాడు. క్రీ. శ. 1192 లో ఢిల్లీసింహా సనమెక్కాడు.

వీరపృథ్వీరాజునుగురించి ప్రజలు యిప్పటికీ కథలుచెప్పుకుం టారు, పాటలుపాడుకుంటారు. లక్ష్యంలేని ప్రేమికులు ఎప్పుడూ ప్రజా దరణకు పాత్రులౌతారు. కనౌజ్‌రాజైన జయచంద్రుని రాజభవనా

న్నుండి, తన్ను ప్రేమించిన అతని కుమార్తెను, అచ్చటచేరిన చాల మంది రాజులను కాదని, పృథ్వీరాజు ఎత్తుకొనిపోయాడు. దీని ఫలితంగా త్రుపెరిగి యిరుపక్షాలవీరుల ప్రాణనష్టం కలిగింది. మధ్యభారత దేశము, ఢిల్లీ లశౌర్యం అంతర్గతతగాదాలలోను, రెండుపక్షాలర క్తపా తంలోను చిక్కుకుపోయింది. ఒక స్త్రీ ప్రేమకోసం పృథ్వీరాజు తన ప్రాణాన్ని, రాజ్యాన్ని పోగొట్టుకున్నాడు. సామ్రాజ్యరాజధాని ఢిల్లీ ఒక పరదేశీయునివశమైపోయింది. కాని, పృథ్వీరాజుప్రేమకథను యీనాటికీ ప్రజలు పాడుకుంటూంటారు. జయచంద్రుడు దేశద్రోహిగా పరిగణింపబడ్డాడు.

ఢిల్లీపతనం మిగత భారతదేశమంతటిపతనంగా ఎంచకూడదు. దక్షిణాన చోళులు యింకా బలంగానే ఉన్నారు. మరికొన్ని స్వతంత్ర రాజ్యాలుకూడా ఉన్నాయి. [illegible]నులఅధికారం దక్షిణాపథంలో ఎక్కువభాగంలో విస్తరించడా[illegible] [illegible]రొక నూటయాభై సంవత్సరాలు పట్టింది. కాని, ఢిల్లీ ప్రధానమై [illegible] నూతనపద్ధతికి చిహ్నమూను.

## ४ భార[illegible] ఆక్షనులు

### దక్షిణభారతదేశం - విజ[illegible] [illegible]ర్గం - బాగరు - సముద్రశక్తి

బ్రిటిష్‌చరిత్రకారుల [illegible] [illegible]చరిత్రకారులు భారతదేశచరిత్రను [illegible] బ్రిటిష్ అనే మూడుభాగాలుగా విభ[illegible] [illegible] గాదు, సరైనదీగాదు. ఇది మ[illegible] [illegible]ి.

వంశాలు భారతవంశా లయ్యాయి. వివాహాలవల్ల జాతులమధ్య కలయిక ఎక్కువయింది. కొద్దిమందివిషయంలోతప్ప, మిగతవారు ప్రజలజీవితవిధానంతో కలుగజేసుకోకుండా ఉండడానికే ప్రయత్నించారు. భారతదేశాన్ని వారు స్వదేశంగా భావించారు. వారికి యింకే యితరసంబంధాలూ లేవు. భారతదేశం స్వతంత్రంగానే ఉండేది.

బ్రిటిష్‌వారిరాక చాల పెద్దమార్పును కలిగించింది. పాత విధానం చాలామార్గాల్లో పెకలించివేయబడింది. ఇంగ్లండులో రాజకీయ విప్లవం మతసంస్కరణ, సాంస్కృతికపునరుద్ధరణలకాలంనుండి క్రమంగా బలపడుతూ, పారిశ్రామికవిప్లవంనాటికి యూరపులో ఒకరూపం దాల్చిన ఒకనూతనప్రేరేపణను-పశ్చిమాన్నుంచి, బ్రిటిష్‌వారు తమతో తీసుకువచ్చారు. ఫ్రెంచి, అమెరికనువిప్లవాలు దీనిని యింకాముందుకు తీసుకుపోయాయి. బ్రిటిష్‌వారు భారతదేశంలో విదేశీయులుగా, పరాయివారుగా అనర్హులుగానే ... పోయారు. మరొకవిధంగా ఉండడానికి వారేమీ ప్రయత్నంచేయ... భారతదేశచరిత్రలో మొదటిసారిగా రాజకీయపరిపాలన బ... ండి జరగడం, ఆర్థికవ్యవహారాలను బయటినుండి చూడడం ... ది. వారు భారతదేశాన్ని ఆధునికవలసల్లో ... రతదేశం తనదీర్ఘచరిత్రలో మొదటిసారిగా ...

మహా ... విదేశీ తురుష్కదండ

యాత్రే ... గతదేశాన్నుంచి విడిగా

ఉ ... జరిగిన ఆఫనుదండ

చాలాకాలంక్రితం పదునాల్గవశతాబ్దంప్రారంభంలో రెండు గొప్ప రాజ్యాలులేచాయి. అవి గుల్బర్గా లేక బహమనీరాజ్యము, విజయ నగర హిందూసామ్రాజ్యము. ఆ గుల్బర్గా యిప్పుడు ఐదురాజ్యాలుగా విడిపోయింది. వాటిలో అహమ్మదునగరం ఒకటి. క్రీ. శ. 1490 లో అహమ్మదునగరస్థాపకుడైన అహమత్ నిజామ్‌షా బహమనీ రాజ్యానికి మంత్రిగాఉన్న నిజామ్-ఉల్-ముల్క్-భైరీ కుమారుడు. యీ నిజామ్-ఉల్-ముల్క్- భైరూ అనే ఒక బ్రాహ్మణగణకుని కొడుకు. (యీ పేరునుండే భైరీ). అహమదునగరవంశము భారతదేశంలోనిదే. అహమద్‌నగర వీరవనిత చాంద్‌బీబీ మిశ్రమరక్తం కలది. దక్షిణంలోని ముస్లింరాష్ట్రాలన్నీకూడా యీ దేశానికి చెందినవే.

ఢిల్లీపై తైమూరుదండయాత్ర తరువాత ఉత్తరభారతదేశం బలహీనంగానూ, విడివిడిగానూ ఉండిపోయింది. దక్షిణభారతదేశం కొంత నయం. అచ్చట అన్నిటికంటె బలమైనరాజ్యం విజయనగరసామ్రాజ్యం. ఉత్తరాన్నుంచి వచ్చే చాలమంది హిందూనిర్వాసులను యీ రాజ్యము, రాజధానీ ఆకర్షించేవి. సమకాలీన గ్రంథాలనుబట్టి యీ పట్టణం చాల ఐశ్వర్యవంతంగానూ, అందంగానూ ఉన్నట్టు కనబడుతుంది. మధ్యఆసియానుండి వచ్చిన అబ్దుల్ రజాక్, "యీ నగరాన్ని పోలిననగరం భూమిమీద వుండగా కళ్ళు చూడలేదు; ఉందని చెవులు వినలేదు" అని వ్రాశాడు. బజార్లకోసం స్తంభాలతో కట్టిన మెట్లుండేవి. వీటన్నిటికంటెఎత్తున రాతితో మలచిన కాలువలలోపల రాజభవనం ఉండేది. యీ నగరంచుట్టూ తోటలుండేవి. అందుకనే, క్రీ. శ. 1420 లో వచ్చిన ఇటాలియన్‌యాత్రీకుడు నికొలో కాంటి యీ నగరం చుట్టుకొలత 60 మైళ్ళని వ్రాశాడు. తరువాత 1522లో పోర్చుగీసు యాత్రీకుడు పయోస్, ఇటలీలోని మహానగరాలను చూచిన తరువాత వచ్చాడు. "విజయనగరం రోమునగరమంత పెద్దది; చూడడానికి చాల అందంగా ఉంటుంది. అందలి తటాకాలు, కాలువలు, తోటలతో ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది" అని వ్రాశాడు. ప్రపంచనగరాలన్నిటికంటె అది సమృద్ధమైనది. ప్రతిదీ చాల ఎక్కువగా దొరుకుతుంది. రాజభవనం లోపలిభాగాల్లో దంతంమీద గులాబీలు, పద్మాలు చాల అందంగా చెక్కబడిఉంది. "దీనికి సాటిఅయినది మరొకటి లేద

సేంతటి అందంగానూ, విలువైనదిగానూ ఉంది. ఈరాజ్యాధిపతి కృష్ణ దేవరాయలంటే ప్రజలకు చాలా భయం, భక్తీని. ఆయన సరియైన రాజు. ఎప్పుడూ సంతోషంగానూ, ఉల్లాసంగానూ ఉంటాడు. విదేశీయులను గౌరవించి, వారిస్థితి ఎటువంటిదైనా, వారిని అన్నివిషయాలూ అడిగి తెలుసుకుంటాడు.'' అని వ్రాశాడు పాయెస్.

దక్షిణాన విజయనగరం అభివృద్ధిలోఉంటే, ఢిల్లీలోని చిన్న రాజ్యం మరొక క్రొత్తశత్రువును ఎదుర్కోవలసివచ్చింది. ఇంకొకరు ఉత్తరాన్నుంచి దండెత్తి వచ్చి భారతదేశపుగతి చాలాసార్లు నిర్ణయంకావలసివచ్చినచోటు పానిపట్టువద్ద క్రీ.శ 1526లో ఢిల్లీసామ్రాజ్యాన్ని జయించి, సింహాసనమెక్కాడు. ఇతడే బాబరు. తైమూరు వంశానికిచెందిన మధ్యఆసియాతురుష్కమంగోలుడు. ఇతడితో భారతదేశంలో మొగలుసామ్రాజ్యం ఆరంభమయింది.

బాబరువిజయానికి ఢిల్లీసుల్తానుల బలహీనత మాత్రమే కాక, బాబరువద్దనున్న కొత్తరకంఫిరంగులు కూడా కారణంగావచ్చు. యీ ఫిరంగులు అప్పటికి భారతదేశంలో లేవు. ఇప్పటినుండి యుద్ధవిద్యలో భారతదేశం వెనుకబడిపోయింది. యీశాస్త్రంలో యూరపు అభివృద్ధి పొందుతూవుంటే, ఆసియాఅంతా ఉన్నచోటనే ఆగిపోయిందని చెప్పడం ఎక్కువ సబబు. మొగలుసామ్రాజ్యం రెండువందలసంవత్సరాలుగా బలంగా ఉన్నప్పటికీ, యూరపురాజ్యాలసైన్యాలతో 17 వ శతాబ్దంనుండి యుద్ధంలో పోటీచేయలేకపోతూఉండేది. కాని, సముద్రమార్గాలమీద ఆధిపత్యంఉంటేనేతప్ప, ఏ యూరపుసైన్యాలూ భారతదేశానికి రాలేవు. యీ శతాబ్దాల్లో కలుగుతున్న ప్రధానమైన మార్పు యూరపుసముద్రశక్తి పెరుగుదల. 13 వ శతాబ్దంలో చోళసామ్రాజ్యం పడిపోగానే, భారతసముద్రశక్తి త్వరగా క్షీణించిపోయింది. సముద్రంతో దగ్గరసంబంధంఉన్న చిన్న పాండ్యరాజ్యం తగినంత బలంగా లేదు. హిందూమహాసముద్రంలోని భారతవలసలు 15 వ శతాబ్దంవరకు బలంగానే ఉన్నాయి. అప్పుడు వీటిని అరబ్బులు ఓడించారు. అరబ్బులను పోర్చుగీసువారు ఓడించారు.

## * సంయోగము - మిశ్రమసంస్కృతి పెరుగుదల పర్దా-కబీరు-గురునానక్-అమీర్ ఖుస్రో

బ్రిటిష్‌వారు భారతదేశానికిరావడాన్ని క్రైస్తవదండయాత్ర అని, లేక బ్రిటిష్‌యుగాన్నీ క్రైస్తవయుగమనీ పిలవడం పొరపాటు. అదేవిధంగా, మహమ్మదీయదండయాత్రనుగురించిగాని, మహమ్మదీయ యుగాన్నిగురించిగాని మాట్లాడడం పొరబాటు. ఇస్లాం భారతదేశం మీద దండయాత్రచేయలేదు. అది అంతకుకొన్నిశతాబ్దాలక్రితమే భారతదేశానికి వచ్చింది. ఒక తురుష్కదండయాత్ర (మహమ్మదుదండ యాత్ర), ఒకఆఫ్ఘనుదండయాత్ర, తరువాత ఒక తురుష్క-మంగోలు, లేక మొగలుదండయాత్ర ఉన్నాయి. వీటిలో చివరిరెండూ చాల ముఖ్యం. ఆఫ్ఘనులను సరిహద్దుభారతీయులుగా భావించవచ్చు; వారు పరిపాలించినకాలాన్ని భారత-ఆఫ్ఘనుకాలమని పిలవాలి. మొగలులు భారతదేశానికి పరాయివాళ్ళు. అయినా వారు భారతదేశంతో చాలా త్వరగా కలిసిపోయి, భారత-మొగలుయుగాన్ని ప్రారంభించారు.

కావాలనో, పరిస్థితులవల్లనో లేక రెండింటివల్లనో ఆఫ్ఘనులు, వారితోవచ్చినవారు భారతదేశంలో కలిసిపోయారు. వారివంశాలు పూర్తిగా భారతీయవంశా లయ్యాయి. వారికి భారతదేశమే స్వదేశం. మిగతదేశాలు విదేశాలు. రాజకీయంగా తగాదా ఉన్నా, వారు అలాగే అనుకున్నారు. చాలమంది రాజపుత్రులుకూడ వారిని తమ ప్రభువులుగా అంగీకరించారు. కాని, కొంతమంది తలబగ్గనిరాజపుత్రులు కూడా ఉన్నారు. అందుచేత, భయంకరమైన తగాదాలు వచ్చాయి. ఢిల్లీసుల్తానుల్లోఒకడైన ఫిరోజ్‌షాతల్లీ, ఘియాజుద్దీన్‌తుగ్లక్‌తల్లీ హిందువులు. ఆఫ్ఘను, తురుష్క, హిందూకులీనులమధ్య వివాహాలు తక్కువే కాని, జరిగాయి. దక్షిణంలో గుల్బర్గాముస్లింరాజు విజయనగర హిందూరాకుమారిని చాలా ఆర్భాటంగా వివాహంచేసుకున్నాడు.

మధ్య, పశ్చిమఆసియాలలోని ముస్లింరాజ్యాల్లో భారతీయులకు మంచి పేరుండేది. ఆఫ్ఘనుదండయాత్రకుపూర్వం పదకొండవశతాబ్దంలో ఇద్రిసీ అనే మహమ్మదీయభూగోళశాస్త్రజ్ఞుడు భారతీయులనుగురించి

ఇలా వ్రాశాడు, "భారతీయులు స్వతహాగా న్యాయపరులు. వారు తమ పనుల్లో న్యాయం తప్పరు. వారి వ్యవహారంలో మంచితనం, న్యాయం, విశ్వాసం అందరికీ తెలిసినవే. యీ లక్షణాలు వారియందు ఎక్కువగా ఉండుటచేతనే వారి దేశానికి అన్నిప్రక్కలనుండీ ప్రజలు గుంపులుగా చేరుతారు."

సమర్థమైన పరిపాలనావిధానం పెరిగింది. రవాణాసౌకర్యాలు - ముఖ్యంగా సైనిక అవసరాలకోసం-బాగా పెరిగాయి. స్థానికాచారాలలో కలుగజేసుకొనకపోయినా, ప్రభుత్వం ఎక్కువగా కేంద్రీకృతమయింది. షేర్‌షా (మొగలుయుగం మొదట్లో కలుగజేసుకున్నాడు) ఆఫ్ఘను పరిపాలకులందరిలోనూ చాలా సమర్థుడు. ఆ తరువాత అక్బరు అభివృద్ధిచేసిన ఆర్థికవిధానానికి యితడే పునాదివేశాడు. అక్బరు ఆర్థికమంత్రి అయిన రాజా తోడర్‌మల్ మొదట షేర్‌షాదగ్గరే పనిచేశాడు. హిందువుల శక్తి - సామర్థ్యాలు ఆఫ్ఘనులచేత బాగా వాడుకోబడ్డాయి.

హిందూమతంమీద ఆఫ్ఘనుదండయాత్ర రెండుఫలితాలను కనబరచింది. ఇవి రెండూ ఒకదానికొకటి వ్యతిరేకం. ఆఫ్ఘనులు పరిపాలిస్తున్న ప్రాంతంనుండి వెంటనే దక్షిణానికివెళ్ళిపోవడం హిందువుల మొదటిచర్య. మిగిలినవారు అక్కడేఉండి, ఇతరులతో సంబంధంలేకుండా కుంచించుకుపోయి, వర్ణవ్యవస్థను ఎక్కువగా బలీయంచేయడంద్వారా తమపద్ధతులను విదేశీయులనుండి రక్షించుకోడానికి ప్రయత్నించారు. మరొకప్రక్కన ఆలోచనలోను, జీవితంలోను యీ విదేశీయులపద్ధతుల వైపుకు అనాలోచితంగానే వెళ్ళారు. ఒక సంస్కృతీసంయోగం తయారయింది. శిల్పంలో క్రొత్తపద్ధతులు బయల్దేరాయి. భోజనం, వేషం మారాయి. జీవితవిధానం అనేకవిధాల మార్పుచెందింది. ముఖ్యంగా సంగీతంలో యీ సంయోగం ఎక్కువగా కనబడుతుంది. ప్రాచీనభారతీయపద్ధతినే సంగీతశాస్త్రం పెరిగినా, చాల క్రొత్తమార్గాలలో అభివృద్ధిచెందింది. పర్షియను భాష రాజభాష అయి, అనేక పర్షియను పదాలు మామూలు వాడకంలోకి వచ్చేశాయి. అప్పుడే మామూలు భాషలుగూడా అభివృద్ధిచెందాయి.

దురదృష్టకరమైన ఫలితాల్లో పర్దా లేక స్త్రీలను లోపలేవుంచే అలవాటు ఒకటి. ఇది ఎందుకని వచ్చిందో తెలియదు. కాని, యీ

కొత్తపాతల కలయికతో కలిగినఫలితాల్లో ఒకటి. కులీనుల్లో మగవారు, ఆడువారు, వేరుగాఉండడం గ్రీసు, మరికొన్ని యితర దేశాలలో వలెనే భారత దేశంలో కూడా ఉండేది. ప్రాచీనభారత దేశంలో కూడా యీ వేరుగావుండడం కొంత ఉండేది. కొంతవరకుపశ్చిమఆసియాఅంతటా యీ అలవాటు ఉండేది. కాని, ఎక్కడా స్త్రీలను గట్టిగా వేరుచేయడం జరగలేదు. స్త్రీల అంతఃపురాలవద్ద కాపలాకాసేందుకు బైజాన్టైన్‌లో నపుంసకులను నియమించేవారు. యీ అలవాటు అక్కడ ప్రారంభ మయిఉంటుంది. బైజాన్టైన్ప్రభావం రష్యాకు చేరింది.. పీటర్ ది గ్రేట్ వచ్చేవరకూ అక్కడ యీ అలవాటు బలంగానే ఉంది. తార్తారులకు దీంతో ఏమీ సంబంధంలేదు. వారు తమ స్త్రీలను వేరేఉంచలేదు. అరబ్బీ- పర్షియన్ నాగరికత అనేకవిధాల బైజాన్టైన్‌నాగరికతవల్ల మార్పుచెందింది. బహుశః కులీనస్త్రీలను వేరుగాఉంచడంకూడ అక్కడి నుండే వచ్చిఉంటుంది. అయినప్పటికీ, అరేబియాలోను, పశ్చిమఆసియాలోను స్త్రీలను గట్టిగా వేరేవుంచలేదు. ఢిల్లీ వశమైనతరువాత ఢిల్లీకివచ్చిన చాలామంది ఆఫ్ఘనులలోకూడ యీ అలవాటు లేదు. తురుష్క, ఆఫ్ఘనురాకుమార్తెలు గుర్రపుస్వారీచేసేవారు; వేటాడేవారు; ఇతరులఇళ్ళకు వెళుతూండేవారు. మక్కాకు హజ్‌యాత్రకు వెళ్ళేప్పుడు స్త్రీలు ముఖంమీద ముసుగువేసుకోరాదనేది పాత ముసల్మాను ఆచారము. దీనిని యిప్పటికీ, పాటిస్తారు. పర్దా భారత దేశంలో మొగలులకాలంలో ఆరంభమయినట్లు తోస్తుంది. దానిని గౌరవానికి చిహ్నంగా హిందువులు, మహమ్మదీయులుకూడ భావించేవారు. ముస్లిముల ప్రభావం ఎక్కువగాఉన్న మధ్యతూర్పుప్రాంతాలలో ఢిల్లీ, సంయుక్తపరగణాలు, రాజపుత్రస్థానము, బీహారు, బెంగాలులలో పైతరగతులలో స్త్రీలనువేరేఉంచడమనే ఆచారం పెరిగింది. అయినప్పటికీ, ముస్లిములు చాలా ఎక్కువగాఉన్న పంజాబు, వాయవ్య రాష్ట్రాలలో యీఅలవాటు అంతగా లేకపోవడం ఆశ్చర్యకరము. ముస్లిములలోనే తప్ప, దక్షిణాన స్త్రీలనువేరేవుంచేఅలవాటు తక్కువ.

గత కొన్నిశతాబ్దాలలో భారత దేశక్షీణతకు కారణాల్లో పర్దాకూడా ఒకముఖ్యమైన కారణమనడానికి నేను సందేహించను. పురోగ

మించిన సాంఘికజీవనం భారతదేశంలో రావాలంటే, యీ అనాగరక మైనఅలవాటు అంతమవ్వాలనడానికి నాకు ఎలాంటిసందేహమూ లేదు. యీఅలవాటు స్త్రీలకు చెరుపుచేస్తుందనడం నిస్సందేహమే. అంతే కాదు, పురుషునికి, చాలాకాలం పర్దాలోఉండేస్త్రీలతో గడపవలసిన చిన్నపిల్లలకు, సామాన్యంగా సాంఘికజీవనానికి యిది ఎంతో చెరుపు చేస్తుంది. హిందువులలో త్వరగాను, ముస్లిములలో కొంచెంనెమ్మది గానూ యీ అలవాటు అదృష్టవశాత్తూ పోతోంది. ఏదోఒకరకమైన ప్రజాహితకార్యాల్లోకి వేలాది మధ్యతరగతిస్త్రీలను తీసుకువచ్చిన కాంగ్రెసుసంస్థయొక్క రాజకీయ, సాంఘిక కలాపాలు యీ ఆచార నిర్మూలనకు ముఖ్యమైనప్రయత్నాల్లో ఒకటి. గాంధీజీ పర్దాఆచారా నికి బద్ధవ్యతిరేకి. స్త్రీలను పురోగమనంలేకుండా, వెనుకబడేటట్లు చేసిన దీనిని అనాగరకము, దారుణమైనఅలవాటని గాంధీజీ తెగనాడారు. "ఈ అలవాటుకు అంటిపెట్టుకోవడంవల్ల పురుషులు స్త్రీలకుచేస్తున మహా అపకారాన్నిగురించి నేను ఆలోచించాను. మొదట ఈ ఆచారాన్ని అవలంబించినపుడు ఏ ప్రయోజనాన్ని నిర్వర్తించినా, యిప్పుడుమాత్రం దేశానికి చెప్పరానంత నష్టంకలుగజేస్తోంది." స్వీయాభివృద్ధికి పురుషు లకు ఎంత అవకాశం, స్వాతంత్ర్యం ఉందో అంతా స్త్రీలకుకూడా ఉం డాలని గాంధీజీ చెప్పారు. "స్త్రీపురుషుల సంబంధాలు వివేకంతో నడ పబడాలి. వారియిద్దరిమధ్య అడ్డుగోడలు ఉండగూడదు. వారినడవడిక స్వాభావికంగానూ, స్వేచ్ఛగానూ ఉండాలి." స్త్రీలస్వాతంత్ర్యం, సమానత్వంమీద గాంధీజీ గట్టిగామాట్లాడారు, వ్రాశారు. వారి బాని సత్వాన్ని ఆయన ఖండించారు.

నేను ప్రస్తుతవిషయాన్ని విడచి, ఆధునికకాలంలోకి గంతేశాను. ఆఫ్ఘనులు ఢిల్లీలోస్థిరపడి, ఏర్పరచిన పాతకొత్త సంస్కృతుల కలయి కనుగురించి తిరిగి చెప్పాలి. ఈమార్పుల్లో చాలాభాగం పై తరగతుల లోను, కులీనులలోను మాత్రమే వచ్చాయి. సామాన్యప్రజలను ముఖ్యంగా పల్లెప్రాంతాలవారిని ఏమీ మార్చలేదు. యీ మార్పులు రాజనగరులలో వచ్చి, నగరాల్లోను, బస్తీప్రాంతాల్లోనే పెరిగాయి. ఉత్తరభారతదేశంలో చాలశతాబ్దాలుగా వృద్ధిచెందవలసిన సంస్కృతీ సమ్మేళనం యిలా ప్రారంభమయింది. ప్రాచీన ఆర్యనాగరికతకు కేంద్ర

మయినట్లే, ఉత్తరపరగణాలు, ఢిల్లీ యీ సంస్కృతికి కేంద్రమైనాయి. ఈ ఆర్యనాగరికత చాలాభాగం దక్షిణానికి కొట్టుకుపోయింది హిందూ సనాతనధర్మానికి దక్షిణం ఆశ్రయమయింది.

ఢిల్లీసుల్తానురాజ్యం తైమూరు దండయాత్రతరువాత బలహీనమై పోయినప్పుడు, సంయుక్తపరగణాలలో జాన్పూరు అనే చిన్న ముస్లిం రాజ్యం పైకొచ్చింది. పదిహేనవశతాబ్దంఅంతా యీ చిన్నరాజ్యం సంస్కృతికి, కళకు మతసహనానికి కేంద్రంగా ఉండేది. అప్పుడు పెరుగుతున్న సామాన్యభాషయగు హిందీ ప్రోత్సహింపబడింది. హిందూ ముస్లింమతాలను కలిపి,ఒకమతంచేయాలనే ప్రయత్నంకూడా జరిగింది. యీసమయంలోనే కాశ్మీరులో జియానులబ్దీన్ అనే ముస్లింరాజు, తన సహనానికీ, సంస్కృతభాష, ప్రాచీనసంస్కృతుల కిచ్చిన ప్రోత్సాహానికి ప్రసిద్ధికెక్కాడు.

భారతదేశమంతటా కల్లోలంగా వుంది. క్రొత్తఅభిప్రాయాలు ప్రజలను ఆలోచింపజేస్తున్నాయి. పూర్వంలాగానే భారతదేశం తాను కొంత మారుతూ, ఈ క్రొత్తవిషయాలను అర్థంచేసికొని, తనలో జీర్ణించుకునేందుకు, తనకు తెలియకుండానే ప్రయత్నంచేస్తోంది. ఈ ఉద్రేకంలోనుంచి కొత్త మతగురువులు బయల్దేరారు. వారు ఈ కలయికను బోధించి ప్రోత్సహించేవారు. వర్ణవ్యవస్థను పనికిరానిదాన్నిగా వదిలేయడమో, లేక ఖండించడమో చేసేవారు. దక్షిణంలో హిందూ రామానంద్ ఉండేవాడు. కాశీ నివాసి, ప్రసిద్ధుడు అయిన కబీరు ఇతని శిష్యుడే. కబీరు ముస్లిం; బట్టలునేసేవాడు. కబీరుపాటలు ప్రజలకు చాలా అభిమానపాత్రమయ్యాయి. ఇప్పటికీ అంతే. ఉత్తరాన శిఖ్ఖుమతస్థాపకుడైన నానక్ ఉండేవాడు. వీరితరువాత వీరిపేరప్రబలిన తెగలలోనేగాక, బైటకూడా వీరిప్రభావం చాలా ఉండేది. హిందూ మతానికి యీ కొత్తఅభిప్రాయాలతాకిడి పూర్తిగా తగిలింది. మహమ్మదీయమతంకూడా మిగిలినచోట్ల ఉన్నదానికంటె కొంత మార్పుచెందింది. ఇస్లాంయొక్క ఏకేశ్వరోపాసన హిందూమతంమీద కొంత ప్రభావంచూపింది. భారతముస్లిములమీద హిందూఅద్వైతవిధానము కొంత ఫలితాన్ని కలుగచేసింది. భారతీయముస్లిములు చాలామంది మతం మార్చుకున్నవారే. పాతపద్ధతులు, అలవాట్లలోనే పెరిగినవారు —

చాలాకొద్దిమందిమాత్రమే బయటనుండివచ్చినవారు. బహుశ కొత్త ప్లాటోనిజంలోనుంచి ప్రారంభించిన ముస్లింసూఫీజం పెరిగింది. పర్షియనుభాష రాజభాషగా వుంటున్నా, సామాన్యభాషనే విదేశీయులు ఎక్కువగా వాడడం, వారు యీదేశంలో ఎక్కువగా కలిసిపోతున్నారనడానికి ప్రబలమైన చిహ్నం. మొదటవచ్చిన ముస్లిములలో కొందరు హిందీలో గొప్పగ్రంథాలను వ్రాశారు. సంయుక్తపరగణాలలో రెండు మూడుశతాబ్దాలుగా ఉంటున్న తురుష్క కుటుంబంలోనివాడు – అమీర్ ఖుస్రో అనే గ్రంథకర్త అట్టివారిలో సుప్రసిద్ధుడు. ఇతడు పదునాల్గవశతాబ్దంలో కొంతమంది ఆఫ్ఘను సుల్తానులు ఢిల్లీనిపరిపాలిస్తున్నకాలంలోనివాడు. ఇతడు పర్షియన్‌భాషలో చాలా గొప్పకవి. సంస్కృతంకూడా తెలిసినవాడు. గొప్ప సంగీత విద్వాంసుడు. భారతీయ సంగీతంలో కొన్ని కొత్తబాణీలుకూడా తయారుచేశాడు. తీగలుగల భారతీయవాయిద్యము 'సితార్'ను ఇతడే తయారుచేశాడంటారు. ముఖ్యంగా భారతదేశాన్ని పొగడుతూ, ఏవిషయాల్లో గొప్పదో చెపుతూ, ఇతడు గ్రంథాలువ్రాశాడు. చాలావిషయాలమీద రచించినవాడు. వాటిలో మతం, వేదాంతం, తర్కం, భాష,సంస్కృతవ్యాకరణం సంగీతం, గణితం, శాస్త్రం, మామిడిపండూ ఉన్నాయి.

జనసామాన్యం మాట్లాడుకునే హిందీలో వ్రాసిన పాటలవలన ఇతనిపేరు ప్రసిద్ధమయింది. కొద్దిమందిమాత్రమే అర్థంచేసుకోగలభాషను అతడు ఎంచుకోలేదు. భాషకోసమే గాకుండా, అలవాట్లు, జీవితవిధానం తెలుసుకోడానికి అతడు గ్రామీణులవద్దకు వెళ్ళాడు. ప్రాచీన భారతసాహిత్యపద్ధతి ప్రకారం ఇతడు అన్ని ఋతువులనుగురించీ,ఒక్కొక ఋతువునుగురించీ పాడాడు. దానికి అవుసరమైన రీతిని, భావను కుదిర్చాడు. అన్ని జీవితవైవిధ్యాలనుగురించీ – ఇంటికివచ్చే పెండ్లికూతురు, ఎడబాటు, బీటలువారిన భూమిమీద వానకురిస్తే తిరిగి మొలిచేమొక్కలు – వీటన్నిటినిగురించీ అతడు వ్రాశాడు. యీ పాటలను చాలమంది పాడతారు. గ్రామసీమల్లో యిప్పుడుగూడా వినవచ్చు. తొలకరిరోజుల్లో మామిడిచెట్టుకో, రావిచెట్టుకో ఉయ్యాలవేసి గ్రామంలోని యువతీ యువకులంతా చేరినప్పుడు యీ పాటలు వినబడతాయి.

పిల్లలకు, పెద్దవాళ్ళకు ఆనందంకలిగించే పొడుపుకథలను అమీర్ ఖుస్రో వ్రాశాడు. అతడు బ్రతికిఉండగానే అతనికథలు, పాటలు అతణ్ణి ప్రసిద్ధునిచేశాయి అతనికీర్తి పెరుగుతూనేఉంది. మాటలైనా మార్చకుండా ఆరువందలసంవత్సరాలతరువాత పాడబడేపాటలు మరెక్కడైనా ఉన్నాయేమో నాకు తెలియదు.

## ౬. భారతసాంఘికవ్యవస్థ - సముదాయంయొక్క ప్రాముఖ్యత

భారత దేశాన్నిగురించి ఏమాత్రం తెలిసినవాడైనా వర్ణవ్యవస్థను గురించి వినిఉంటాడు. బయటివారందరూ, దేశంలో చాలామందీ దీనిని మొత్తంగా విమర్శించి, ఖండిస్తారు. అదిఅనేకవిధాల పెరిగి, మారి వున్న ప్రస్తుతస్థితిలో వర్ణవ్యవస్థను చాలమంది ఒప్పుకొనకపోయినా, మొదట్లో అది ఏ సిద్ధాంతంమీద ఆధారపడిఉందో ఆ సిద్ధాంతాన్ని చాలామంది ఒప్పుకుంటారు. ఎక్కువమంది హిందువులు తమ నిత్యజీవనంలో దానిని పాటిస్తారుకూడాను. విభిన్న అర్థాల్లో ఆ పదాన్ని వాడుతుంటారు గనుక, వర్ణం అనేమాట వాడడంలో కొంత గజిబిజిగా ఉంటుంది. మామూలు యూరోపియనుగాని, ఆలోచనలో అతడికిదగ్గరగావుండే భారతీయుడుగాని వర్ణవ్యవస్థ అంటే సంఘాన్ని తరగతులవారీగా విభజిస్తే, అది ఘనీభవించిపోయిందనో, లేక హెచ్చుతగ్గులలో తరగతులను సృష్టించడమనో, పైతరగతులను పైన, క్రింది తరగతులను క్రింద ఉంచడానికిచేసిన తెలివిగలపన్నాగం అనో అనుకుంటారు. ఇందులో నిజం ఉంది. ఆదిలో జయించిన ఆర్యులను వేరుగా పైనా, జయింపబడినవారిని క్రిందా ఉంచేందుకు యీ పద్ధతి ఊహించబడివుండవచ్చు. మొదట్లో దీనిలో మార్పుకు అవకాశం ఎక్కువగా వున్నా, క్రమంగా ఆచరణలో ఇదిచేసినపని అంతే. కాని, ఇది నిజంలో భాగంమాత్రమే కాని, యీపద్ధతి యింతగట్టిగా, బలంగా మననాటి వరకూ ఎందుచేత ఉండగలిగిందో చెప్పలేము. బలమైన బౌద్ధమతం తాకిడివున్నా, ఆఫ్ఘను, మొగలులపరిపాలననుమాత్రమేగాక, హిందూసంఘ సంస్కర్తలు దీనిని వ్యతిరేకించి, దీని నిర్మూలనకు గట్టిప్రయత్నంచేసినా యిది బ్రతికే ఉంది. ఈ వర్ణవ్యవస్థకు నేడే నిజంగా ప్రమాదం వచ్చింది. దాని పునాదిమీదనే దెబ్బతీయబడింది. హిందూమతంలో పుట్టిన సంస్క

రణాభిలాషే. దీనికి ముఖ్యకారణం కాదు. అలాంటి అభిలాషకూడా ఉంది. పాశ్చాత్యుల అభిప్రాయాలప్రభావం కొంతఉన్నప్పటికీ, ఆ అభిప్రాయాలూ కారణంగాదు. మనకళ్ళముందు జరుగుతున్న యీ పరిణామానికి కారణం, హిందూసాంఘికవ్యవస్థను కదిలించి, తలక్రిందులుచేసేటంతటి బలీయమైన ఆర్థికమార్పులే! పరిస్థితులు మారాయి. అభిప్రాయాలుకూడ, వర్ణవ్యవస్థ బ్రతకడానికి సాధ్యంకానంతగా మారిపోయాయి. వర్ణవ్యవస్థస్థానే ఏమి వస్తుందో నేను చెప్పలేను. కారణమేమంటే, వర్ణవ్యవస్థకంటె ఎక్కువైనదే ప్రమాదంలోఉంది. సాంఘికనిర్మాణంలో రెండు విభిన్న అభిప్రాయాల ఘర్షణ జరుగుతోంది. మొదటిది సముదాయం సాంఘికనిర్మాణంలో మొదటిదిగా తీసుకోబడడం. రెండవది, వ్యక్తికి ప్రాధాన్యమిచ్చి, సముదాయంకంటె వ్యక్తి ఎక్కువముఖ్యమని భావించే పాశ్చాత్యసాంఘికనిర్మాణపద్ధతి.

విభిన్నరూపాలు పొందినా, యీ ఘర్షణ భారతదేశానిది మాత్రమే కాదు; యూరపుదీ, ప్రపంచానిదీ కూడాను. పందొమ్మిదవ శతాబ్దపు యూరపునాగరికత ప్రజాస్వామికసామ్యవాదపద్ధతులలో పెరిగి సాంఘిక, ఆర్థికవిధానాలకు వర్తించడంలో వ్యక్తిత్వసిద్ధాంతానికి ఉన్నతస్థాయి వచ్చింది, సాంఘిక, ఆర్థికవ్యవస్థలు 19 వ శతాబ్దపు అభిప్రాయాలతో యీశతాబ్దంలోనికి వచ్చి, యిప్పుడు ఫలిస్తున్నాయి. కాని, క్లిష్టపరిస్థితులలోను, యుద్ధాల్లోనూ యీకాలానికి పనికిరాక బీటలువారిపోతున్నాయి. సముదాయం, సమాజంయొక్క ప్రాముఖ్యత యిప్పుడు మళ్ళీ చెప్పబడుతోంది. వ్యక్తి, సమిష్టుల హక్కులను సర్దుబాటుచెయ్యడం ఇప్పటిసమస్య. ఈ సమస్యాపరిష్కారం వివిధదేశాల్లో వివిధరూపాలుపొందవచ్చు. అయినా, అన్నింటికీ ఒక పరిష్కారమార్గాన్ని ఆలోచించేపద్ధతి ఎక్కువవుతుంది.

వర్ణవ్యవస్థ దానంతటఅది నిలబడదు. అంతకంటె పెద్ద సాంఘికనిర్మాణవిధానంలో అది ఒకభాగం. దానిలోని కొన్ని చెడుగులను తీసివేసి, కొంత కాఠిన్యాన్ని తగ్గించి, ఆ వ్యవస్థను చెక్కుచెదరకుండా ఉంచడం సాధ్యమే. ప్రస్తుతం పనిచేస్తున్న సాంఘిక, ఆర్థికశక్తులు వర్ణవ్యవస్థమూలాన్నే ఛేదిస్తున్నాయిగనుక, యిది సాధ్యమయ్యేపని కాదు. యీ వ్యవస్థను నిలబెట్టిఉంచిన మిగత ఆధారాలనుకూడా యీశక్తులు

కుంగదీస్తున్నాయి. వర్ణవ్యవస్థకు ఆధారాలైన మూలస్తంభాలు అప్పుడే చాలా కూలిపోయాయి, కూలిపోతున్నాయి. వర్ణవ్యవస్థ ఒక్కటే ఉండిపోయింది. మనకు కులంఅంటే ఇష్టమా లేదా అనే ప్రశ్న లేదిప్పుడు. మనకు యిష్టంఉన్నా లేకపోయినా మార్పులుజరిగి పోతున్నాయి. కాని, ఈమార్పులను కొన్నిమార్గాల్లోకి తిప్పి, ఇంత గట్టిదీ, బలమైనదీ అయిన సాంఘికవ్యవస్థను నిర్మించిన భారతీయుల సామర్థ్యశక్తిని మనం పూర్తిగా వినియోగించుకోవచ్చును.

సర్ జార్జి బర్డ్వుడ్ ఎక్కడో యిలా అన్నాడు: "హిందువులు వర్ణవ్యవస్థను ఉంచుకున్నంతవరకూ భారతదేశం భారతదేశంగానే ఉంటుంది. దాన్ని కూలద్రోసిననాటినుండి యింక భారతదేశమే ఉండదు. ఆ గొప్ప ద్వీపకల్పం ఆంగ్లో - సాక్సనుసామ్రాజ్యంయొక్క తూర్పుముక్కమాత్రమే అవుతుంది." కులం ఉన్నా, లేకపోయినా, బ్రిటిష్‌సామ్రాజ్యంలో మన మా పరిస్థితికి చాలాకాలంక్రితమే వచ్చేశాము. మన భావిపరిస్థితి ఎలావున్నా, ఆ సామ్రాజ్యపు ఎల్లలతో మాత్రమే అది సరిపోదు. సర్ జార్జి బర్డ్వుడ్ యీదృష్టితో ఆ సమస్యను చూడకపోయినా, అతడుచెప్పినదానిలో కొంత నిజం ఉంది. ఒక పెద్ద ప్రాచీనసాంఘికవ్యవస్థను కదిలించేటప్పుడు, దానిస్థానే, ప్రజలమన స్తత్వాలకు సరిపడినది మరేదైనా నిర్మాణం ఉంటేతప్ప, సాంఘిక జీవనం పూర్తిగా కూలిపోయి, గట్టితనంపోయి, ప్రజలకు బాధ, వ్యక్తిగతనడవడికలో వెర్రితనంకలగడం కద్దు. సంధికాలంలో విచ్ఛిన్నంకాక తప్పదు. ఇప్పుడు ప్రపంచంలో యీ విచ్ఛిన్నస్థితి ఎక్కువగానేఉంది. బహుశా యీ విచ్ఛిన్నంవల్ల కలిగేబాధ, నొప్పి ద్వారానే ప్రజలు జీవితంలో పాఠాలు నేర్చుకొని మారుతున్నపరిస్థితులకు అనుగుణ్యంగా మారుతారు.

అయినప్పటికీ,మనం ఉన్నదానినితీసివేస్తే,దానిస్థానే ఉంచాలనుకున్నదానినిగురించి లీలామాత్రంగానైనా మన కొక అభిప్రాయం ఉండడం అవసరం. మనం శూన్యాన్ని సృష్టించకూడదు. అలా సృష్టిస్తే, మనకుయిష్టంలేనివిధంగా ఆ శూన్యం దానంతటదే నిండవచ్చును. మనం చేసే నిర్మాణాత్మకమయినప్రణాళికలలో, మనం ఏప్రజలతో వ్యవహరిస్తున్నామో, వారిఆలోచన, అలవాట్లు ఏమిటో, మనం పనిచేయవల

సిన వాతావరణమేమో వీటన్నిటినిగురించి ఆలోచించడం అవసరం. వీటినిగురించిఆలోచించకుండా, గాలిలోమేడలుకట్టడమో, ఇతరులుచేసిన దానిని అనుకరించడమో తెలివితక్కువ. అందుచేత మనప్రజలమీద ఇంత బలంగా చెల్లుబాటయిన సాంఘికవ్యవస్థనుగురించి తెలుసుకుని, అర్థంచేసుకోవడం అవసరం.

ఈ వ్యవస్థ మూడువిషయాలమీద ఆధారపడిఉంది. అవి గ్రామస్వపరిపాలనము, వర్ణవ్యవస్థ, సమష్టికుటుంబము. వీటన్నిటిలోను సముదాయంమొదటిలెక్కలోకి వస్తుంది వ్యక్తికి రెండవస్థానంమాత్రమే. వీటినిగురించి ప్రత్యేకంగా చెప్పుకోవాల్సింది ఏమీంలేదు. వీటిల్లో దేని కైనా – ముఖ్యంగా మధ్యయుగాల్లో సమానమైనవి దొరుకుతాయి. ప్రాచీన భారతప్రజాస్వామ్యంవంటివి ఎక్కడైనా వుంటాయి. ఒకరకమైన ఆదిమకమ్యూనిజంకూడా ఉండేది. రష్యాలోని పాత'మిర్' అనబడేదానిని భారతగ్రామసంఘానికి పోల్చవచ్చును. కులం ముఖ్యంగా వృత్తిమీద ఆధారపడిఉండేది. యూరపులోనివర్తకసంఘాలతో దీనిని పోల్చవచ్చును. చైనాకుటుంబపద్ధతి చాలవరకు భారతీయసమిష్టికుటుం బాన్ని పోలిఉంటుంది. ఈ పోలికను యింకా ఎక్కువదూరం తీసుకు పోయేందుకు నాకు వీటినిగురించి ఎక్కువగా తెలియదు. నా ప్రస్తుత పనికి అనవసరం. మొత్తంమీద హిందూసాంఘికవ్యవస్థ చాలం విశిష్ట మైనది. పెరిగినకొద్దీ యీ విశిష్టత యింకా ఎక్కువయింది.

## ౭ గ్రామస్వపరిపాలనము – శుక్రనీతిసారము

తురుష్కుల, ఆఫ్ఘనులదండయాత్రలకుపూర్వం భారతదేశంలో రాజ్యపరిపాలనాపద్ధతి ఎలావుండేదో తేలిపే 10వ శతాబ్దంనాటి ప్రాచీన గ్రంథమొకటి ఉంది. ఇది శుక్రాచార్యుడురచించిన నీతిసారం. ఈరాజ్య పరిపాలనావిధానశాస్త్రం కేంద్రప్రభుత్వం, పట్టణం, గ్రామం – వీటి అన్నిటినిర్మాణాన్నిగురించి, రాజ్యసభనుగురించి, ప్రభుత్వంయొక్క వివిధశాఖలనుగురించి వివరిస్తుంది. ఎన్నుకోబడినగ్రామపంచాయతీలకు కార్యనిర్వహణలోను, న్యాయపరిపాలనలోను విశేషమైన అధికా రాలు ఉండేవి. రాజోద్యోగులు పంచాయతీలను చాల గౌరవంగా చూసేవారు. భూమిని యీ పంచాయతీలే పంచియిచ్చేవి. పంటమీద

పన్నులు వసూలుచేసి, గ్రామంతరఫున ప్రభుత్వభాగం ప్రభుత్వానికి యిచ్చేవారు. కొన్నిగ్రామపంచాయతీలమీాద ఒక పెద్ద పంచాయతీ ఉండేది. అది అజమాయిషీ చేసేది, అవసరమైతే కలుగజేసుకునేది.

కొన్ని ప్రాచీనశాసనాలు గ్రామపంచాయతీలకు సభ్యులు ఎలాగఎన్నుకోబడేవారో, వారికుండవలసిన అర్హత లేమిటో, అనర్హత లేమిటో తెలుపుతాయి. సంవత్సరానికి ఒకసారి ఎన్నుకోబడిన ఉపసంఘాలుండేవి. వీటిలో స్త్రీలుగూడ సభ్యులుగా ఉండవచ్చు. అగౌరవంగా ప్రవర్తిస్తే, సభ్యుని తొలగించవచ్చును. ప్రజలసొమ్ముకు లెక్కచెప్పకపోతే, సభ్యుణ్ణి అనర్హుడుగా నిర్ణయించవచ్చును. బంధుపక్షపాతం లేకుండేందుకు ఒక నియమంపెట్టారు. ఏ సభ్యుడిదగ్గరబంధువూ ఉద్యోగిగా నియమింపబడకూడదు.

ఈ గ్రామసంఘాలు తమస్వాతంత్ర్యాన్ని చాలా జాగ్రత్తగా కాపాడుకునేవి. రాజానుమతి ఉంటేతప్ప ఏసైనికుడూ గ్రామంలో ప్రవేశించడానికి వీలులేదు. ఏ ఉద్యోగినిగురించిఅయినా ఫిర్యాదువస్తే రాజు "ప్రజలపక్షం అవలంబించాలేకాని, తనఉద్యోగిపక్షం కా"దని నీతిసారం చెపుతోంది. చాలమంది ఒకఉద్యోగిమీాద ఫిర్యాదుచేస్తే, అతడిని ఉద్యోగంలోనుంచి తీసివెయ్యాలి. అధికారం ఎవరికీ కైపుఎక్కించరాదు. ప్రజలలో ఎక్కువమందిఅభిప్రాయాన్ననుసరించి రాజు వ్యవహరించాలి. "అనేకపోగులు కలిసినతాడుతో సింహాన్ని ఎలా పట్టవచ్చో, అలాగే ప్రజాభిప్రాయం రాజుకంటే ఎక్కువ బలంగలది. ఉద్యోగాలిచ్చేటప్పుడు శక్తి, సామర్థ్యం, శీలం మాత్రమే లెక్కలోకితీసుకోవాలిగాని, కులము, కుటుంబం కాదు". బ్రాహ్మణునకుండవలసినలక్షణం రంగువల్ల, తాతతండ్రులవంశంవల్ల కలిగించడం అసాధ్యం."

పెద్దనగరాల్లో పనివాళ్ళు, వర్తకులు, పనివారిసంఘాలు, వర్తకసమాఖ్యలు, డబ్బువ్యవహారాలుచూచేసంఘాలు ఉండేవి. ప్రతిసంఘం స్వంతవ్యవహారాలను తానే చూచుకునేది.

ఈ సమాచారమంతా చాలా తక్కువ. అయినా, నీతిసారంవల్ల, మరికొన్ని మార్గాలద్వారా కూడా, విస్తృతమైనస్వయంపరిపాలనావిధానం పట్టణాల్లోను, పల్లెల్లోనూకూడా వుండేదనీ, తన భాగంపన్ను సక్రమంగా చెల్లించినంతవరకు కేంద్రప్రభుత్వం వీరిస్వాతం

త్ర్యంలో కలుగజేసుకోలేదనీ మనకు కనబడుతుంది. ఆచారం బలంగా వుండేది. రాజకీయ, సైనికశక్తులు సాధారణంగా ఆచారంలో కలుగజేసుకునేవికావు. మొదట్లో వ్యవసాయపద్ధతి సహకారము లేక గ్రామసఉమ్మడిమీద ఆధారపడిఉండేది. వ్యక్తులు, కుటుంబాలకుకూడా కొన్ని హక్కులు, కొన్నివిధులు ఉండేవి. వీటిని ఆచారం నిర్ణయించి, కాపాడేది.

భారతదేశంలో మతైక రాచరికం ఎప్పుడూ లేదు. భారతరాజకీయసిద్ధాంతంలో రాజు క్రూరుడూ, న్యాయరహితుడూ అయినట్లయితే, విప్లవంలేవదీసేహక్కు ప్రజలకున్నదని అంగీకరించబడింది. చైనాపండితుడు మెన్సియస్ రెండువేలసంవత్సరాలక్రితం వ్రాసినది భారతదేశానికివర్తిస్తుంది. "ప్రజలను రాజు గడ్డిపరకలలాగో, మట్టిలాగో చూస్తే, ఆ రాజును దోపిడిదొంగగానూ, శత్రువుగానూ ప్రజలు చూడాలి." రాచరికం అంటే, యూరపియనుఫ్యూడలిజానికి భిన్నంగా ఉండేది. ఫ్యూడలిజంలో రాజుకు తనరాజ్యంలోగల ప్రజలందరిమీద, వస్తువులమీద సంపూర్ణాధికారం ఉంటుంది. రాజు తనను ఆశ్రయించినసామంతులకు తనఅధికారాన్ని వప్పగించేవాడు. అధికార ఆచార్యాధిపత్యం యిలా ఏర్పరచబడింది: భూమి, ప్రజలుకూడ తమ ప్రభువుకు, అతనిద్వారా రాజుకు చెందిఉండేవారు. రోమనుల'అధికార' మనే సిద్ధాంతంయొక్క పెరుగుదల యిది. భారతదేశంలో యీ రకమైనదేమీ లేదు. రాజుకు భూమిమీద కొంత పన్ను వసూలుచేసుకునేందుకు అధికారముండేది. దీనినిమాత్రమే అతడు యితరులకు వప్పజెప్పగలడు. భారతదేశంలో వ్యవసాయదారుడు ఏ ప్రభువుకూ బానిస కాడు. భూమి కావలసినంత ఉంది. అందుచేత వ్యవసాయదారుణ్ణి తొలగించడంవల్ల లాభంలేదు. పాశ్చాత్యులకు తెలిసిన భూస్వామ్యపద్ధతి భారతదేశంలో లేదు. రైతు తనక్రిందఉన్న కొద్దిభూమికి పూర్తిస్వంతదారు కాడు. ప్రమాదకరమైనఫలితాలనిచ్చేట్లు యీరెండువిషయాలనూ బ్రిటిష్‌వారు భారతదేశంలో ప్రవేశపెట్టారు. విదేశదండయాత్రలు యుద్ధాన్నీ, వినాశనాన్నీ, తిరుగుబాటులు-వాటిని అణచడాన్నీ, సైనికశక్తిమీదనేఆధారపడే అధికారవర్గాన్నీ తెచ్చిపెట్టాయి. ఈ అధికారవర్గం తరచుగా చట్టబద్ధనిర్ణయాలను పాటించేవారుకారు. అవి దేశా

చారాల్లోని భాగాలే. విదేశదండయాత్రలు విధ్వంసాన్ని, తిరుగుబాట్లూ వాటినివిచక్షణారహితంగా అణచివేయడాన్నీ, కేవలం సైనికశక్తిమీ దనేఆధారపడే ఒకనూతనపాలకవర్గాన్నీ తెచ్చిపెట్టాయి. ఈపాలకవర్గం దేశమంతటా ఎల్లప్పుడూ ఆచారపద్ధతిగావుండే అనేకచట్టనిబంధనలను తఱచు అలక్ష్యంచేస్తూవుండేది. పర్యవసానంగా ప్రధానమైన మార్పులు జరిగాయి. స్వయంపాలితగ్రామసమితుల అధికారంసన్నగిలింది. తర్వాత భూమిశిస్తువిధానంలో అనేకమార్పులు ప్రవేశపెట్టబడ్డాయి. అయినప్ప టికీ ఆఫ్ఘను, మొగలుపాలకులు ప్రాచీనఅలవాట్లుఆచారాలలో జోక్యం కలిగించుకోకుండా జాగ్రత్తపడ్డారు. ప్రధానమైన మార్పులేవీప్రవేశపెట్ట లేదు. భారతీయజీవిత ఆర్థిక, సాంఘికనిర్మాణం లోగడమాదిరిగానే కొన సాగుతూవుంది. ఘియాజుద్దీన్ ఆచారపద్ధతులనుకాపాడాలనీ, ప్రమేయం లేకుండా ప్రభుత్వవ్యవహారంసాగించాలనీ, తనవుద్యోగులకు ఖచ్చితమైన సూచనలిచ్చాడు. మతం వ్యక్తిగతమైనదన్నాడు. కాని కాలం మారు తున్నకొద్దీ, ప్రభుత్వం కేంద్రీకృతమౌతున్నకొద్దీ, నెమ్మదిగానైనా దేశాచారపద్ధతికి గౌరవం తగ్గసాగింది. అయినప్పటికీ గ్రామస్వయంపాల నము కొనసాగుతూనేవుంది. అది బ్రిటిష్‌పాలనలోమాత్రమే పతనమవ నారంభించింది.

### ౮ సిద్ధాంతంలోను, ఆచరణలోను – వర్ణముసమిష్టికుటుంబము

"భారతదేశంలో మత మొక అచంచలసిద్ధాంతం కాదు. జీవి తంలోవివిధస్థితులను, ఆత్మసంస్కారాన్నిబట్టి, మానవనైజానికి సందర్భో చితంగా వర్తించే వాదము" అన్నాడు హావెల్. నాగరికతలోను, తెలివి తేటలలోను, ఆత్మసంస్కారంలోను ఊహించదగినంత ఎడంగాఉన్న రెండుజాతులఅవసరాన్ని – భారతీయఆర్యసంస్కృతి రూపొందుతున్న కాలంలో మతం తీర్చవలసివచ్చింది. అనాదిగా అడవుల్లో కాపురముండే వారు, ప్రకృతీఆరాధకులు, అన్నిరకాల మూఢనమ్మకాలుగలవారి దగ్గరనుంచి ఆత్మజ్ఞానంలో సమున్నతశిఖరాలనందుకున్నవారివఱకు అన్ని స్థాయిలవారు ఉండేవారు. ఈమధ్యలో అన్నిరకాలనమ్మకాలు, ఆచారాలుకలవారున్నారు. ఉత్తమమైనఆలోచనచేయగలవారు కొంద రుంటే, అది చాలమందికిఅందుబాటులోలేదు. సాంఘికజీవనం పెంపుద

లతోపాటు కొన్నిరకాల ఏకాభిప్రాయాలు పెరిగాయి. అయినా స్వాభావికంగాను, సాంస్కృతికంగాను కొన్ని భేదాలు మిగిలిపోయాయి. ఏ నమ్మకాన్నిగాని, ఏ హక్కునుగాని తొక్కేయ్యకూడదనేది ఆర్యసాంప్రదాయం. తమ చిత్తసంస్కారాన్ని బట్టి ప్రతివారూ తమఆదర్శాలను పెంపొందించుకోవడానికి అవకాశమీయబడింది. ఏకీభావంకుదుర్చుకోవడానికి ప్రయత్నంజరిగింది. అంతేగాని కాదనడం, నాశనంచెయ్యడం మాత్రం జరుగలేదు.

సాంఘికనిర్మాణంలో యిలాంటిది, యింతకంటె కష్టమైనది ఒక సమస్య ఎదురయింది. ఇన్నిరకాలవర్గాలను ఎలా కలిపి, ఒకేసంఘంగా తయారుచెయ్యడమనేదే ఆ సమస్య. ప్రతివర్గము మిగిలినవారితో సహకరించాలి. అయినా తమవ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుంటూ పురోగమించే స్వేచ్ఛ వుండాలి. పోలిక దూరమయినా, నేటిఅల్పసంఖ్యాకుల సమస్యలాంటిదే ఇది. యీసమస్యాపరిష్కారం దగ్గరలో కనబడ్డంలేదు. అమెరికాసంయుక్తరాష్ట్రాలవారు ప్రతిపౌరుణ్ణి పూర్తిగా అమెరికన్‌గాచేసి, యీసమస్యను పరిష్కరించాలని చూస్తున్నారు. ప్రతివారూ ఒకే రకంగాఉండేట్టుచేయడం వారిప్రయత్నం. ఇంకా ఎక్కువ చరిత్ర ఉన్న మిగతదేశాలు యింత అనువైనస్థితిలో లేవు. కెనడాలోకూడ జాతి, మతం, భాష, పక్షపాతం గల బలమైనఫ్రెంచివర్గముంది. యూరపులో యీ అడ్డుగోడలకుపునాదులు యింకా బలమైనవి, ఎత్తైనవీని. ఇది యూరపియనులందరికీ వర్తిస్తుంది. యూరపునుండివచ్చిన, సామాన్యస్థితిగతులూ, సామాన్యసంస్కృతీ గలవారికిగూడా వర్తిస్తుంది. యూరపియనులుకానివారు వస్తే వారి నిర్మాణంలో యిముడరు. అమెరికాలోని నీగ్రోలు పూర్తిగా అమెరికనులే. అయినా వారిజాతి వేరు. మిగిలినవారికి మామూలుగా కలిగే అవకాశాలు వారికి చాలా కాదనబడ్డాయి. ఇంతకంటె అధ్వాన్నమైన ఉదాహరణలు చాలా యివ్వవచ్చు. వివిధజాతులుగలరాజ్యాన్ని సృష్టించడంద్వారా, సోవియట్ రష్యామాత్రం యీ సమస్యను పరిష్కరించిందనుకుంటున్నారు.

మన నేటిపురోభివృద్ధి, విజ్ఞానస్థాయిలలోనే మనకీ సమస్య ఇంత కష్టంగాఉంటే, ప్రాచీనకాలంలో ఆర్యులు వివిధజాతులు, మతాలు గల ప్రజలను ఒకటిగాచేసి సంఘనిర్మాణంచేయడానికి చాలా కష్టపడి

ఉండాలి. జయించబడినవారిని సామంతులుగా చేయడమో, లేక నాశనంచేయడమో, యీ సమస్యకు అప్పుడూ, తరవాతకూడా, సామాన్యపరిష్కారమార్గం. యీపద్ధతి భారతదేశంలో అనుసరించబడ లేదు. అయినా పైనున్నవాడు పైనే ఉండేందుకుమాత్రం ప్రతి ప్రయత్నమూ చేశారు. ఈహెచ్చుతగ్గులు నిలబెట్టినతరువాత, కొన్నిసామాన్య సిద్ధాంతాలకులోబడి, ప్రతివర్గానికీ వారి ఆచారాలనుబట్టి అభివృద్ధిచెందేందుకు అవకాశమిస్తూ, బహుళవర్గాలున్న ఒకరాజ్యాన్ని నిర్మించారు. మరొకవర్గంతో ఘర్షణకురాకూడదనేదొక్కటే గట్టి అడ్డంకి. ఇది చాలా సరళమైన, అభివృద్ధికరమైనపద్ధతి. తగినంతమంది ఉంటే బయటనుండి వచ్చినవారుగాని, పాతవర్గాలనుండి బయటకు వచ్చినవారుగాని వేరే వర్గాన్ని ఏర్పాటుచేసుకోవచ్చు. వర్గంలో సమానత్వం, ప్రజాస్వామ్యం ఉండేవి. ఎన్నుకోబడిన నాయకులు వీరికి దారిచూపేవారు. ముఖ్యమైన సమస్య వచ్చినప్పుడు వర్గాన్నంతటినీ ఆలోచించేవారు.

ఈ వర్గాలు అన్నీ వృత్తినిబట్టి వచ్చినవే. ప్రతివర్గానికీ ఏదైనా ప్రత్యేకవృత్తిగాని, పనిగాని ఉండేది. యీవిధంగా అవి వృత్తిసంఘాలుగాని, వర్తకసమాఖ్యలుగాని అయ్యాయి. ప్రతివర్గంలోను సంఘీభావం ఉండేది. దీనివలన వర్గం బలంగావుండడంమాత్రమేగాకుండా, ఒకసభ్యునికి ఆర్థికంగాగాని, మరేవిధంగాగాని యిబ్బందికలిగితే, మిగిలినవారు ఆశ్రయమిచ్చి, సహాయంచేసేవారు. ఒకవర్గపుపనికి, మిగిలినవర్గాల పనులకు సంబంధం ఉండేది. ప్రతివర్గం, సరిగాగనుక పనిచేస్తే, సంఘం అంతా సజావుగా సాగిపోతుందని దీనిభావం. ఇంతేగాక సంస్కృతి, ఆచారాలూ, వీరులూ దైవాలూ అందరికీ ఒకటేననీ, దేశంనాలుగు చెరగులకూ అందరూ యాత్రలకుపోతూవుండేభూమి ఒక్కటేననీ కొంతవరకు ఫలించిన ఒకేజాతీయదృఢబంధనాన్ని సృష్టించడానికి వారు ప్రయత్నించారు. యీనాటి జాతీయతకూ దీనికీ చాలా తేడా ఉంది. రాజకీయంగా యిది బలహీనమైనదే; కాని, సాంఘికంగానూ సాంస్కృతికంగానూ యిది చాలా బలంగా ఉండేది. రాజకీయబలహీనత విదేశీదండయాత్రలకు తావిచ్చింది. సాంఘికబలం కోలుకోవడానికి, యితరవిషయాలను జీర్ణించుకోవడానికి తేలికగా వీలయింది. దీనికి సరికి

వేయలేనన్ని తల లున్నాయి. వారు అపజయాన్నీ, ప్రమాదాన్నీ తట్టుకోగలిగారు.

వర్ణమంటే వృత్తులమీదఆధారపడిన వర్గవిధానం. ప్రతివర్గము పూర్తి స్వాతంత్ర్యంతోను, ఏవిధమయినజడసిద్ధాంతం లేకుండానూ అందరూ కలిసిఉండే ఒకపద్ధతి. ఈ విశాలమయినవిధానంలో బ్రహ్మచర్యం, ఏకపత్నీత్వం, బహుభార్యాత్వం మిగత అనేకఅభిప్రాయాలు, నమ్మకాలు ఉన్నట్లే ఉండేవి. అల్పసంఖ్యాకులు అధికసంఖ్యాకులకు లోబడనవసరంలేదు. తగినంతసంఖ్యాబలంవుంటే వారే ఒకవర్గాన్ని ఏర్పరచుకోవచ్చు. అయితే ఆ వర్ణానికి సాంఘికప్రయోజనం వుందా లేదా అన్నదే కొలబద్ద. జీవితం అన్నిప్రమాణాలలోను ఉండేది. రెండు వర్ణాలమధ్య జాతి, మతం, రంగు, సంస్కారం, తెలివితేటలకు సంబంధించినంతవరకు ఎంతైనా తేడా ఉండవచ్చు.

వ్యక్తి వర్గంలో ఒక్కసభ్యుడు మాత్రమే. వర్గంయొక్కపనిలో కలుగజేసికోనంతవఱకు అతడు ఏమైనా చెయ్యవచ్చు. వర్గంయొక్కపనిని తలక్రిందులుచేసేందుకు అతడికి అధికారం లేదు. కాని, అతడికి తగినంతబలం ఉండి, అనుయాయులు ఉంటే, అతడు వేరేవర్ణాన్ని ఏర్పాటుచేయవచ్చును. ఏవర్గంలోను అతడు యిముడలేకపోతే, సాంఘికవ్యవస్థకుసంబంధించినంతవరకు అతడు పనికిరానివాడిక్రిందే లెక్క. అప్పుడు అతడు కులాన్ని, వర్గాన్ని, ప్రపంచాన్ని అన్నిటినీ వదిలేసి, సన్యాసిఅయిపోవచ్చు. తన కిష్టంవచ్చింది చేయవచ్చు.

భారతీయసాంఘికవిధానం వ్యక్తిని వర్గము, సమాజంయొక్క హక్కులకు లోబరచినా, మతభావన, ఆధ్యాత్మికాన్వేషణ మాత్రం వ్యక్తిప్రాముఖ్యాన్ని నొక్కిచెప్పాయని గుర్తుంచుకోవాలి. ముక్తిని పొందడానికి, అంతిమసత్యాన్ని తెలుసుకోడానికి, ఏవర్గానికిచెందినవాడైనా, ప్రతివ్యక్తి ప్రయత్నించవచ్చు. ఈ ముక్తిని, జ్ఞానాన్నిపొందడమనేది వర్గంచేయగలపని కాదు. వ్యక్తిమాత్రమే చేయగలడు. మోక్షాన్ని పొందడానికి ఒకేఒకమార్గంవుందనే నమ్మకం లేదు. అన్నిదారులూ మోక్షానికే దారితీస్తాయనేనమ్మకం ఉండేది.

సాంఘికనిర్మాణంలో వర్గం అతిముఖ్యమైనదై, కులవిధానానికి దారితీసినా, భారతదేశంలో ఎప్పుడూకూడా వ్యక్తిత్వసిద్ధాంతం వుంది

యీ రెండువిధానాలమధ్య సంఘర్షణ చాలాసార్లు కనబడుతూ ఉంటుంది. వ్యక్తిముఖ్యుడుకావడానికి ప్రాధాన్యతనిచ్చే మతమే కొంత కారణం. వ్యక్తి మోక్షాన్నిసాధించేందుకు మతంచూపిన మార్గానికి కులం అడ్డుగాఉంటుందని కులతత్వాన్ని విమర్శించే సంఘసంస్కర్తలు చెపుతారు. ఈ సంఘసంస్కర్తలే సామాన్యంగా మతసంస్కర్తలు. బౌద్ధమతం వర్ణాన్ని, కులాన్ని కాదని, ఒకరకమైన వ్యక్తిత్వసిద్ధాంతంవైపు, సార్వజనీనతవైపుకు పోయింది.కాని, ఈవ్యక్తిత్వం, మామూలు సాంఘికజీవనంనుండి మరలిపోయేలాంటి దయింది. అందుచేత, కులతత్వానికి సరియైన ప్రత్యామ్నాయాన్ని చూపలేకపోవడంతో, కులతత్వం అప్పుడూ, తరువాత సాగిపోతూనేఉంది.

ముఖ్యమైన కులా లేమిటి? అస్పృశ్యులు అనుకునేవారిని మనం ప్రస్తుతానికి వదిలేస్తే, మతగురువులు, ఉపాధ్యాయులు, ఆలోచనాపరులు అయిన బ్రాహ్మణులు, పరిపాలకులు సైనికులు అయిన క్షత్రియులు, వర్తకులు, డబ్బువ్యవహారం చూచేవారయిన వైశ్యులు, వ్యవసాయం, మిగిలిన శరీరకష్టంచేసేశూద్రులు. సంఘీభావంకలిగి, మడికట్టుకునేకులం బ్రాహ్మణులదొక్కటే అయిఉంటుంది. బయట నుండివచ్చేవారివల్ల, దేశంలో అధికారంలోకివచ్చేవారుచేరడం వల్ల, క్షత్రియులసంఖ్య ఎల్లప్పుడూ పెరుగుతూనేఉంది. వైశ్యులు ముఖ్యంగా వర్తకులు, షరాబులేగాక, మిగిలిన అనేకవృత్తుల్లోకూడా ఉంటూ ఉండేవారు. వ్యవసాయం, యింటిలోపని - శూద్రుల కివి ముఖ్యమైనపనులు. చేయవలసిన పనులు పెరుగుతున్నకొలదీ కొత్తకులాల సంఖ్య పెరుగుతోంది. లోగడఉన్నకులాలవారు పైకిపోవాలనిప్రయత్నిస్తున్నారు. యీపద్ధతులు మనరోజుల్లోకూడా అమలుజరుగుతూనే ఉన్నాయి. పైకులాలవారికే చిహ్నంగా ఎంచబడే జంధ్యాన్ని క్రింది కులంవారెవ్వరో హఠాత్తుగా వేసుకోవడం మొదలెడతారు. ప్రతికులం తనపని తాను చేసుకుంటూ, తనపరిధిలో తాను ఉంటున్నది. గనుక, యిది అంత ముఖ్యమైనవిషయం కాదు. ఇది గౌరవానికి సంబంధించిన విషయం మాత్రమే. క్రింది వర్గాలలో ఎవరైనా తమకుగలశక్తి, సామర్థ్యాలవలన పైఅధికారాల్లోకి వెళ్ళగలిగేవారు, కాని, యిది చాలా తక్కువ.

సాంఘికనిర్మాణంలో పోటీలేనిదిగాను, సంపాదనే ముఖ్యాంశం కానిదిగాను ఉండడంచేత, కులవిభజన చేయవలసినంత మార్పును కలుగజేయలేదు. చదువుకున్నవాడుగా, విజ్ఞానిగా యితరులచేత గౌర వింపబడుతూ, తన అగ్రవర్ణానికి గర్వించే బ్రాహ్మణునికి ఆస్తి ఏమీ ఉండేదికాదు. సమాజాన్ని మొత్తంగా తీసుకుంటే, ధనికుడైన వర్తకు నికి పెద్ద గౌరవమేమీ లేదు.

జనాభాలో ఎక్కువభాగం వ్యవసాయదారులు. భూస్వామ్య పద్ధతిగాని, రైతు భూమికి స్వంతదారుగాఉండేపద్ధతిగాని లేదు. న్యాయ శాస్త్రరీత్యా భూమి ఎవరిదో చెప్పడం కష్టం. ప్రస్తుతపు స్వత్వ సిద్ధాంతంలాంటిదేమీ లేదు. వ్యవసాయదారుడు తన భూమి దున్నుకు నేందుకు హక్కుండేది. భూమిలో పండినదానిని పంచడమనేదే సమస్య. పంటలో ఎక్కువభాగం వ్యవసాయదారుడికే పోయేది. రాజు ఒకభాగం (ఆరవవంతు) తీసుకునేవాడు. గ్రామానికి సేవచేసే ప్రతివర్గమూ ఒక భాగాన్ని పొందేది – బ్రాహ్మణపూజారి, ఉపాధ్యాయుడు, వర్తకుడు, కమ్మరి, వడ్రంగి, చర్మకారుడు, కుమ్మరి, .ఇళ్ళుకట్టేవాడు, మంగలి, పాకీవాడు, వీరందరికీ – రాజుదగ్గరనుంచి, పాకీవాడిదాకా ప్రతివర్గానికీ ఆదాయంలో భాగం వచ్చేదన్నమాట.

వెనుకబడినతరగతులవారు, అస్పృశ్యులు ఎవరు? కులాలప్రమా ణంలో క్రిందివర్గాలవారిని తెలియపరిచేందుకు ఇటీవల వాడుతున్నమాట వెనుకబడినవారు. మిగిలినవారినుండి వీరిని విడదీసేందుకు ప్రత్యేక మార్గమేమీ లేదు అస్పృశ్యులు అంటే ఎవరో చెప్పవచ్చు. పాకీపని మొదలయిన, శుభ్రంగాని పనులుచేసేవారినిమాత్రమే ఉత్తరభారత దేశంలో అస్పృశ్యులుగా భావిస్తారు. తాను వచ్చినకాలంలో, మానవ అశుద్ధాన్నితీసివేసేవారిని మాత్రమే అస్పృశ్యులుగా భావించేవారని ఫాహియాన్ వ్రాశాడు. దక్షిణభారతదేశంలో అస్పృశ్యులసంఖ్య చాల ఎక్కువ. వీరు ఎలాప్రారంభమయ్యారో, ఇంతఎక్కువసంఖ్యగా ఎలా పెరిగారో చెప్పడం కష్టం. అపరిశుభ్రమైన పనులుచేసేవారిని ముందు అస్పృశ్యులుగా భావించిఉంటారు. తరువాత భూమిలేని వ్యవ సాయకూలీలు కూడా యిందులో జమచేయబడివుంటారు.

ఆచారప్రాయమైన పరిశుభ్రత హిందువుల్లో మరీ విపరీతమైన అలవాటు. దీనివల్ల ఒక మంచిఫలితం, చాలా చెడ్డఫలితాలూ కలిగాయి. శారీరకంగా పరిశుభ్రంగాఉండటం మంచిదే. వెనుకబడినవారితో సహా, ప్రతిరోజూ స్నానంచేయడం ప్రతిహిందువుయొక్క నిత్యకర్మల్లో ఒకటి. ఇంగ్లండుకు, ఇతర దేశాలకు యీ అలవాటు భారతదేశంనుంచే వెళ్ళింది. శుభ్రంగా మెరిసే తనగృహోపకరణాలగూర్చి, అందరికంటె బీదవాడయిన రైతుతోసహా, ప్రతిహిందువు గర్వపడతాడు. ఈ శుభ్రత శాస్త్రీయమైనది కాదు. రోజుకురెండుసార్లు స్నానంచేసేవాడుకూడా, కలుషితమై, క్రిములున్న నీటిని నిస్సందేహంగా తాగేస్తాడు. ఇది యిప్పటికీ సాముదాయికమైనది కాదు. తన పాక శుభ్రంగా ఉంచుకునేవ్యక్తి తనయింట్లోని చెత్తఅంతా ప్రక్కవానియింటిముందు పోసేస్తాడు. గ్రామం సాధారణంగా చాలా అపరిశుభ్రంగానూ, పెంటకుప్పలతోనూ ఉంటుంది. పరిశుభ్రత పరిశుభ్రతకోసంకాక, మతంప్రాబల్యంవల్లనే అవలంబింపబడుతోంది. మతంయొక్క ప్రాబల్యంపోతే, పరిశుభ్రతకూడా బాగా తగ్గిపోతుంది.

ఆచారశుభ్రమనేదాని దుష్ఫలితాలు-కులాల్లో విడివిడిగా వుండడం, 'నన్నంటుకోకు' అనే అలవాటు ప్రబలడం, ఇతరకులాలవారితో భోజనంచేయకపోవడం, మంచినీరుకూడా తాగకపోవడం-ప్రపంచంలో మరెక్కడాలేనంతవిపరీతంగా పెరిగాయి. అపరిశుభ్రమైనవైనా, చెయ్యక తప్పని, కొన్నిపనులుచేస్తుండడంవల్ల, కొన్నితరగతులవారిని అస్పృశ్యులుగాఎంచడం జరిగింది. సామాన్యంగా తోటికులంవారితోనే భోజనం చేసే అలవాటు అన్నికులాలకూ వ్యాపించింది. అన్నికులాల్లోనూ వచ్చింది. సాంఘికగౌరవానికి ఇది ఒక చిహ్నమయింది. పైతరగతుల వారిలోకంటె క్రిందితరగతులవారు యీ అలవాటుకు బాగా అతుక్కుపోయారు. ఈ అలవాటు పైతరగతులలో తగ్గిపోతోంది. కాని, వెనుకబడినతరగతులతోసహా, క్రిందితరగతులవారిలో ఇంకా బలంగా కొనసాగుతూనేవుంది.

వర్ణాంతరభోజనం నిషిద్ధమైతే, వర్ణాంతరవివాహం అంతకంటే నిషిద్ధం కదా. వర్ణాంతరవివాహాలు జరుగకపోలేదు. కాని, ప్రతికులము యితరులతో సంబంధాలులేకుండా ఎలాఉండిపోయిందో ఆశ్చర్యకరం.

తరతరాలుగా జాతిలక్షణాలు అలాగే ఉంటాయంటే నమ్మరానివిషయం. అయినాహిందూసంఘంలో ప్రత్యేకంగా పైతరగతులవారిలో విశిష్టమైన లక్షణాలు తరతరాలుగా వుండగలుగుతున్నాయి.

క్రిందితరగతులలో కొంతమంది వర్ణవ్యవస్థకు వెలుపలివారుగా చెప్పబడుతారు. నిజంచెప్పాలంటే, ఏ తరగతివారూ - అస్పృశ్యులైనా సరే - కులాలన్నిటికీ బయటున్నవారు కారు. వెనుకబడినవారికి, అస్పృశ్యులకు వారికులాలు వారికున్నాయి. వారిలో తగాదాలువస్తే తీర్చేందుకు వారి కులపంచాయతీలు వారి కున్నాయి. సామాన్యగ్రామ జీవనంలోనుంచి వీరిలో చాలమందిని క్రూరంగా వెలివేసినందువల్ల వీరు ఎంతో బాధపడ్డారు.

ప్రాచీన భారతీయసాంఘికవిధానంలో స్వపరిపాలనగల గ్రామ సమాజము, వర్ణవ్యవస్థ రెండు విశిష్టలక్షణాలు. సమిష్టికుటుంబము మూడవది. మొత్తంఆస్తి కుటుంబానిది. కుటుంబసభ్యులందరికీ దాని ఆస్తిలో భాగస్వామ్యము, వారసత్వపుహక్కు ఉంటాయి. తండ్రిగాని, మరెవ్వరైనా పెద్దగాని కుటుంబానికి యజమానిగా ఉండేవాడు. కాని, ఇతడికి రోమన్‌గృహాధికారికి ఉన్న అధికారాలు లేవు. కుటుంబఆస్తిని- అందుకు సంబంధించినవారు ఒప్పుకుంటే - కొన్ని పరిస్థితులలో పంచుకో డానికి వీలుండేది. పనిచేసినా, చేయకపోయినా కుటుంబంలోనివారంద రినీ సమిష్టికుటుంబం పోషించాలి. కొద్దిమందికి అధికంగా ఏమీా రాక పోయినా, అందరికీ అవసరాలకు లోటుండేదికాదు. శారీరకంగాగాని, మానసికంగాగాని దెబ్బతిన్నవారితోసహా అందరికీ ఇది ఒకరకమైన భీమా. అందరికీ భద్రత ఉన్నా, వారుచేయవలసినపని, వారికిముట్టే ప్రతి ఫలం రెండూకూడా తగ్గాయి. వ్యక్తిగతలాభము, ఆశే గాకుండా కుటుంబక్షేమం ఆలోచించారు. పెద్దకుటుంబంలో పుట్టిపెరగడంవల్ల పిల్లలకు సంఘమంటే భయంపోయి, కలుపుగోలుతనంగా ఉండడం అల వాటయింది.

వ్యక్తిత్వానికి ప్రాధాన్యాన్నిచ్చే పశ్చిమసాంఘికవ్యవస్థలో జరిగేదానికి ఇదంతా చాలవ్యతిరేకం. ముఖ్యంగా అమెరికాలో వ్యక్తి పురోగమనం ఆశయంగా, వ్యక్తిలాభమే సంఘోద్దేశ్యం గనుక, లాభ మంతా ముందుకుపోగలవారికి చెందుతుంది. పిరికివారు, బలహీనులు,

రెండవతరగతివారు వెనక్కుపోతారు. సమిష్టికుటుంబవిధానం భారత దేశంలో అతివేగంగా భగ్నమైపోతోంది. ఎవరినిగురించి వారు ఆలోచించడం ప్రారంభమై, ఆర్థికజీవితవిధానంలో మార్పులురావడం మాత్రమే గాక సంఘంలో వ్యక్తిప్రవర్తనలోకూడా మార్పులు వస్తున్నాయి.

ఈవిధంగా భారతసాంఘికవ్యవస్థకు మూలస్తంభాలు మూడూ వర్గంమీదఆధారపడినవేగాని, వ్యక్తిమీద కాదు. సాంఘికభద్రత, నిలకడ, వర్గం అంటే సమాజం సాగిపోతూవుండడం ఆదర్శంగా ఉండేది. పురోభివృద్ధి ఆదర్శం కాదు. అందుచేత, అభివృద్ధి లేకుండాపోయింది. గ్రామసమాజంలోనూ, కులంలోనూ, పెద్ద సమిష్టికుటుంబంలోనూ, అందరూకలసిజీవించేవారు. సమానత్వం, ప్రజాస్వామ్యపద్ధతులు ఉండేవి. ఇప్పటికీకూడా కులపెద్దలసంఘాలు ప్రజాస్వామ్యపద్ధతులమీదే నడుస్తాయి. చదువుకోనకపోయినా ఎన్నుకోబడినగ్రామసంఘాల్లో రాజకీయంగానూ, ఇతరవిధాలా పనిచేయడానికి ఒక గ్రామస్తుని ఆతురత చూస్తే నాకు ఆశ్చర్యంకలిగింది. అతని కా పని అలవాటయింది. తన జీవితాన్ని గురించి ఏప్రశ్నవచ్చినా చాలా జాగ్రత్తగా వ్యవహరించేవాడు; తొందరగా తలబగ్గేవాడు కాదు. దురదృష్టవశాత్తు చిన్న వర్గాల్లో అంతఃకలహాలు బయల్దేరి, వారిలో వారే చీలిపోయే గుణం ఒకటి వుంది.

సాంఘికజీవనంలోనూ, స్వపరిపాలనలోనూ, వృత్తిసంఘాలలోనూ, మతసభలలోను ప్రజాస్వామ్యపద్ధతులు అందరికీ బాగా తెలియడమేగాక,వాటినిఅనుసరించేవారు. కులవ్యవస్థలో ఎన్ని చెడుగుణాలున్నా అది ప్రతివర్గంలోనూ ప్రజాస్వామ్యపద్ధతులను నిలబెట్టింది. పెద్ద వ్యవహారపద్ధతి, ఎన్నిక, చర్చలు, కార్యక్రమాలకు విపుల నియమ నిబంధనలు ఉండేవి. మార్క్విస్ ఆఫ్ జెట్లండ్ బౌద్ధసభలనుగురించి యిలా వ్రాశాడు: "భారతదేశంలో రెండు వేలు, అంతకంటె ఎక్కువ సంవత్సరాలక్రితం జరిగిన బౌద్ధసభల్లో మన పార్లమెంటరీ పద్ధతులకుమూలం ఉన్నదంటే చాలామందికి ఆశ్చర్యంకలుగవచ్చును. కామన్సుసభలో స్పీకరువంటివారిని సభాగౌరవాన్ని కాపాడడానికి ఒక ప్రత్యేక ఉద్యోగిగా నియమించేవారు. కావలసినంతమంది సభ్యులు హాజరయ్యేటట్లు

చూడడమే పనిగా వేరొక అధికారి ఉండేవాడు. మన పార్లమెంటరీ విధానంలో చీఫ్‌విప్‌కు పూర్వీకునివంటివాడు. ఏదైనా విషయం చెప్పదల్చుకున్న సభ్యుడు దాన్ని తీర్మానరూపంలో ప్రతిపాదించేవాడు. దాని మీద చర్చజరగవచ్చు. కొన్నివిషయాల్లో ఇది ఒక్కసారే జరిగేది. మరికొన్నివిషయాల్లో మనపార్లమెంటరీ వ్యవహారాల్లోవలెనే మూడుసార్లు తీర్మానాన్ని ప్రతిపాదించవలసిఉండేది. చర్చల్లో అభిప్రాయభేదం వస్తే, అధికసంఖ్యాకుల నిర్ణయంప్రకారం జరిగేది. నిర్ణయం రహస్యఓటింగుపద్ధతిని తీసుకునేవారు.

ఈవిధంగా ప్రాచీనభారతదేశసాంఘికవ్యవస్థలో కొన్ని సుగుణాలున్నాయి. అవి లేకపోతే, అంతకాలం బ్రతికిఉండేదికాదు. మానవుడు సంపాదనకంటె, ఆత్మోన్నతి, మంచితనం, సత్యం, సౌందర్యం పెంపొందించుకొనప్రయత్నించాలనే ఆదర్శం యీజీవితవిధానంవెనుక కనబడుతుంది. ఇదే భారతీయసంస్కృతీసారం. అధికారం, హోదా, ఐశ్వర్యం ఇవన్నీ ఒక్కచోటే చేరిపోకుండాచూడడానికి ప్రయత్నం జరిగింది. వ్యక్తికి, వర్గానికి గల విధులే గట్టిగాచెప్పబడ్డాయి. కాని, వారిహక్కులు కాదు. స్మృతులలో ధర్మాలు, పనులు, విధులు వీటి జాబితా కనబడుతుంది. కాని, హక్కులజాబితా ఎక్కడా కనబడదు. వర్గంలో, ముఖ్యంగా గ్రామంలో, స్వయంసమృద్ధికి కృషిచేశారు. వేరొకవిధంగా కులంలోకూడా స్వయంసమృద్ధికి కృషిచేశారు. ఈవిధానానికి పరిధి నిర్ణయించబడింది. ఆ పరిధిలో కొంతమార్పుకూ, మళుపుకూ, స్వాతంత్ర్యానికీ అవకాశం ఉంది. అయినా, కాలంగడచినకొద్దీ సంకుచితంగానూ, కఠినంగానూ తయారవకతప్పలేదు. అభివృద్ధిచెందడానికి, కొత్తసామర్థ్యాలనుగ్రహించడానికి క్రమంగా తనకుగలశక్తిని కోల్పోయింది. బలీయమైనశాశ్వతహక్కులు పెరిగి, పెద్దమార్పులు జరగకుండాను, విద్యాగంధము తతిమ్మాతరగతులవారికి చెందకుండాను చేశాయి. మూఢనమ్మకాలని తెలిసిన అగ్రవర్ణాలవారుకూడ వాటిని అలాగే ఉండనిచ్చి, మరికొన్నిటిని చేర్చారు. జాతిఆర్థికపరిస్థితిమాత్రమే గాక జాతిఆలోచనే నిశ్చలము, సాంప్రదాయికమైనది, పెంపులేనిది, కఠినమైనది, అభివృద్ధిలేనిది అయిపోయింది.

కులవ్యవస్థ భావనలోను, ఆచరణలోను రాచరికలక్షణాలను కలిగివుంది. అది ప్రజాస్వామ్యవిధానానికి వ్యతిరేకమని స్పష్టమవుతోంది. ప్రజలు వారసత్వం,వంశాచారాలననుసరిస్తూ,వున్నవ్యవస్థను విమర్శించ కుండావుంటే "గొప్పవారు క్రిందివారికిసాయపడడం ధర్మం"గా యెంచ బడేది.భారత దేశవిజయాలు మొత్తంమీదపైతరగతులవారుసాధించినవే. క్రిందనున్నవారికి అట్టిఅవకాశాలు చాలాతక్కువగా వుండేవి. ఈ పైతర గతుల్లో కొద్దిమందిమాత్రమేగాదు, చాలామందివుండేవారు. అధికారం, పలుకుబడి పంపకంజరిగేది వారిమధ్యనే అందుచేతనే వారు చాలాకాలం విజయవంతంగా ముందుకుసాగారు. విద్యావిషయికంగానూ, సాంస్కృతి కంగానూ, ఆర్థికంగానూ చాలామందిప్రజలను నిర్భాగ్యుల్ని జేసి, వా రాస్థితిలోనుంచి బైటపడేఅవకాశం లేకుండాచేశారు. ఇదే భారత సాంఘికవ్యవస్థలో, కులతత్వంలోగల బలహీనత, ఈ దౌర్బ ల్యమే పైతరగతులవారితోసహా అందరూ పతనంకావడానికి కారణ మయింది. భారతీయఆర్థికపరిస్థితి, జీవితం ఘనీభవించిపోవడానికి యిదే కారణం. ఈ సాంఘికనిర్మాణానికీ, నాటిప్రపంచంలో ఇతరచోట్ల గలసాంఘికనిర్మాణాలకీ తేడాలు చాలాతక్కువ. కాని గత కొన్నితరాల కాలంలోనూ ఇతరచోట్లకలిగినమార్పులవల్ల ఈ తేడాలు ఎక్కువగా కనబడుతున్నాయి. ప్రస్తుతసాంఘికస్థితిలో కులతత్వమూ, దానిసైదో డులుగావుండేలక్షణాలూ అసహజంగా, అభివృద్ధినిరోధకంగా, అడ్డంకు లుగా తయారయ్యాయి. కులవ్యవస్థలో సమానత్వం, సమానఅవకా శాలూ ఉండవు. రాజకీయప్రజాస్వామ్యం ఉండదు. ఆర్థికప్రజాస్వామ్యం గురించి మాట్లాడనక్కరేలేదు. ఈ రెండుభావనలమధ్యా (కులవ్యవస్థ, అదిలేనిసమాజం) సంఘర్షణతప్పనిలక్షణాలు సహజంగా ఉన్నాయి. వాటిలో ఏదో ఒకటే బ్రతకగలుగుతుంది.

## ౯ బాబరు, అక్బరు - భారతీయులైనక్రమము

వెనక్కు వెళ్ళాలి. ఆఫ్ఘనులు భారతదేశంలో ఉండిపోయి, భారతీయులయిపోయారు. వారిపరిపాలకులు ముందు ప్రజలవ్యతిరేక తను తగ్గించి, తరువాత వారిని తమవైపుకుతిప్పుకోవలసినసమస్య ఏర్ప డింది. అందుచేత వారు తమకఠినపద్ధతులు తగ్గించుకొని, ఎక్కువసహ

నంతో సహకారం కోరుతూ, గెల్చివచ్చినవారిమాదిరిగా కాకుండా, యిక్కడే పుట్టి, పెరిగినవారికిమల్లే ప్రవర్తించడమనేది ప్రయత్నపూర్వకమయినసిద్ధాంతంగా అవలంబించారు. భారతీయవాతావరణం వీరిని తనలోకిచేర్చుకోవడం మొదలుపెట్టగానే, సిద్ధాంతంగా ప్రారంభమైన యీ పద్ధతి తప్పనిసరిఅయింది. పైప్రమాణంలో యీ ప్రయత్నం జరుగుతూఉండగా, ఆలోచన, జీవనమార్గాలకలయికకోసం ప్రజలలో స్వాభావికమైనశక్తులు బయల్దేరాయి. మిశ్రమసంస్కృతికి పునాదులు వేయబడ్డాయి. వీటిమీద నూతనవిధానాన్ని అక్బరు నిర్మించాడు.

మొగలువంశంలో అక్బరు మూడవవాడు. అయినా మొగలు స్సామ్రాజ్యాన్ని సుస్థిరంచేసినవా డతడే. అక్బరుతాత బాబరు క్రీ. శ. 1526 వ సం॥లో ఢిల్లీసింహాసనాన్ని జయించాడు. అత డీ దేశానికి పరాయివాడు. అతనికీ అలాగే అనిపించేది. ఉత్తరాన తైమూరు ప్రారంభించిన పునరుజ్జీవనం విలసిల్లుతోంది. అతనిమాతృభూమిపై ఇరాన్ దేశపు కళ, సంస్కృతిప్రభావాలు చాలా బలంగాఉన్నాయి. అచ్చటి నుండి వచ్చాడు బాబరు. స్నేహితాలు, సంభాషణల్లోనిఆనందం, బాగ్దాద్‌నుండి ఇరాన్‌కువచ్చిన జీవితసౌకర్యాలూ అతనికి లోపించాయి. ఉత్తరప్రదేశాల్లోనిమంచుకోసం, ఫెర్గనాలోనిమాంసము, మంచి ఫల పుష్పాలకోసం అతడు మొగంవాచిపోయాడు. అతనికి ఎంత ఆశాభంగ మయినా, హిందుస్థానము చాలా గొప్పదేశమని అన్నాడు. భారత దేశానికివచ్చిన నాలుగుసంవత్సరాలకే బాబరు చనిపోయాడు. యీ నాలుగుసంవత్సరాలూ యుద్ధంచేయడంలోనూ, ఆగ్రావద్ద గొప్పరాజధానీనగరాన్ని నిర్మించడంలోనూ అతడికి సరిపోయింది. ఈ రాజధాని నిర్మాణంకోసం కాన్‌స్టాంట్‌నోపిల్‌నుండి ప్రసిద్ధుడైన ఒక శిల్పిని బాబరు రప్పించాడు. కాన్‌స్టాంట్‌నోపిల్‌లో, సులేమాన్ పరిపాలనలో గొప్పభవనాలు తయారవుతున్న కాల మది. బాబరు భారత దేశంలో చూచినది కొద్ది. చుట్టూ శత్రువులుండడంచేత ఎంతో చూడలేకపోయాడు; అతడు వ్రాసినదానినిబట్టి ఉత్తరభారతదేశం ఎంత సాంస్కృతికదారిద్ర్యంలో ఉందో తెలుస్తుంది. ఇందుకు కొంతవరకు తైమూరుదండయాత్ర కారణం. విద్యావంతులు, కళాకారులు పేరుబడ్డ పనివాళ్ళు – వీరందరూ దక్షిణాదికి వెళ్ళిపోవడంకూడా కొంత

వటుకు కారణం. భారతప్రజలలో సృజనాశక్తి వట్టిపోవడంకూడా ఒక కారణం. నిపుణులైనపనివారు లేకపోలేదనీ, కాని, యంత్రసృష్టిలో నైపుణ్యం లేదనీ బాబరు అన్నాడు. జీవితంలో సుఖము, ఐశ్వర్యము అనుభవించడంలో కూడా ఇరాన్‌కంటె భారతదేశం చాలా వెనుక బడివుంది. యీ విషయంలో భారతీయులకు ఆసక్తిలేనందువల్లనో, లేక తరువాతి స్థితిగతులవల్లనో నాకు తెలియదు. నాటి ఇరానీలకుమల్లే భారతీయులను ఐశ్వర్యము, భోగాలు ఆకర్షించలేదేమో! వారి కవి కావలసిఉంటే, ఈ రెండు దేశాలమధ్య సంబంధాలున్నందున ఇరానునుండి చాలా తేలికగా తెప్పించుకొనిఉండవచ్చు. ఇది తరువాత వచ్చిన పరిస్థితి అయివుంటుంది. భారతదేశపు క్షీణదశ, గడ్డగట్టిపోయిన సంస్కృతి కూడా మరొకకారణం అయిఉంటుంది. ప్రాచీనవాఙ్మయము, చిత్తరువులనుబట్టి అప్పుడు జీవితంలో సొగసులు ఉండేవనీ, నాటికాలానికి ఎక్కువైన జీవనప్రమాణమే ఉన్నదనీ మనం తెలుసుకోవచ్చును. బాబరు భారతదేశానికి వచ్చినప్పుడుకూడా, దక్షిణానఉన్న విజయనగరంలో గొప్ప కళ, సంస్కృతి, ఐశ్వర్యం, భోగాలు ఉండేవని చాల మంది యూరోపియను యాత్రికులు వ్రాశారు.

ఉత్తరభారతదేశంలో సంస్కృతి క్షీణించిపోయినట్లు స్పష్టంగా కనిపిస్తుంది. గట్టినమ్మకాలు, కరుడుగట్టినసాంఘికవిధానం సాంఘికప్రయత్నాలను, అభివృద్ధిని అరికట్టినాయి. ఇస్లాము, చాలామంది ఇతర దేశీయులు, భిన్నభిన్న అభిప్రాయాలు, ఆచారాలతో బయటనుండి రావడం ఆ నమ్మకాలను, విధానాన్ని కొంత మార్చింది. విదేశదండయాత్రలో ఎన్ని చెడుగులున్నా, ఒక సుగుణంమాత్రం ఉంది. అది ప్రజల మానసికపరిధిని విస్తృతంచేసి, వారు తమ గూటిలోనుంచి బయటికి చూచేటట్టుచేస్తుంది. వారు తా మూహించినదానికంటె ప్రపంచం పెద్దదనీ, తమకు తెలిసినదానికంటె ఇంకా చాలాఉన్నదనీ వారికి తెలిసివస్తుంది. అలాగే, ఆఫ్ఘనుదండయాత్ర తాకిడితో భారతదేశంలో చాలా మార్పులువచ్చాయి. ఆఫ్ఘనులకంటె అధిక సంస్కృతీపరులై, జీవితాన్నిగురించి ఎక్కువతెలిసిన మొగలుల దండయాత్రతో కలిగినమార్పులు ఇంకా ఎక్కువ. వారు ప్రసిద్ధిచెందిన ఇరానీసొగసులను భారతదేశానికి తీసుకువచ్చారు. కృత్రిమమూ, నియమితమూ అయిన రాజసభ

లోని సాంప్రదాయాలుకూడా వారుతెచ్చినవే. ఈ ఆచారాలు కులీనుల జీవితవిధానంలో చాలా మార్పుతెచ్చాయి. కాలికట్ద్వారా బహమనీరాజ్యానికి ఇరానుతో సంబంధాలుండేవి.

భారతదేశంలో చాలా మార్పులు వచ్చాయి. క్రొత్తతాకిడులు కళలో, శిల్పంలో, ఇతరసంస్కృతీకలాపాల్లో నవీనత్వాన్ని కలిగించాయి. కాని, ఇదంతా, రెండు ప్రాచీన సంస్కృతులసమ్మేళనంవల్ల కలిగిన ఫలితం. రెంటికీ బలము, సృజనాశక్తీ నశించిపోయాయి. రెండూ నిర్ణీతపరిధుల్లోఉన్నవే. భారతీయసంస్కృతి చాల పాతది; అలసిపోయివుంది. అరబ్బీ – పర్షియనుసంస్కృతి ఏనాడో ఉచ్చదశను దాటిపోయింది. ఏ జిజ్ఞాస, బుద్ధిబలప్రయత్నాలు అరబ్బులను ప్రసిద్ధలనుచేశాయో అవి కనబడడంలేదు.

బాబరు ఆకర్షణీయమైనవ్యక్తి. విజ్ఞానవికాసానికి ప్రతినిధి యనదగిన రాజకుమారుడు. అతడు ధైర్యశాలి. కళ, సారస్వతం, సుఖజీవనం అంటే ఆసక్తిగలవాడు. అతడిమనుమడు అక్బరు. ఇంకా యెక్కువ ఆకర్షణగలవాడు. ఉత్తమలక్షణాలుగలవాడు. ధైర్యవంతుడు. లక్ష్యంలేనివాడు, సమర్థుడైన సేనానాయకుడు. ఇంకా, నెమ్మదయినవాడు, దయగలవాడు, ఆదర్శవాది. అయినా కార్యశూరుడు. తనఅనుచరులవిశ్వాసాన్నిపొందగలిగిన నాయకుడు. సైనికుడుగా అతడు భారతదేశంలో చాలాభాగాలను జయించాడు. అయినా, ప్రజలహృదయాలను, మనసులను జయించాలనేలక్ష్యంమీద తనదృష్టిని లగ్నంచేశాడు. ఎండలో కదులాడేసముద్రంలాగా అతడినేత్రాలు నిర్బంధించేవని సభకువచ్చిన పోర్చుగీసు జెసూట్పండితులు వ్రాశారు. సంయుక్తభారతదేశమనే పాత కల అతడిహయాంలో నిజమయింది. ఈ కలయిక రాజకీయంగానే కాకుండా, ఒకేప్రజగా కరిగించి, పోతపోయబడడం జరిగింది. క్రీ. శ. 1556 నుండి, 50 సంవత్సరాల సుదీర్ఘ పరిపాలనలో అతడు యీ లక్ష్యసాధనకే కృషిచేశాడు. మరెవ్వరికీ లొంగని గర్వితులగు రాజపుత్రులను అతడు తనవైపుకు త్రిప్పుకోగలిగాడు. అత డొక రాజపుత్రరాకుమారిని పెండ్లాడాడు. అతని కుమారుడు జహంగీరు; సగం ముస్లిం, సగం హిందూరాజపుత్రుడు. జహంగీరుకుమారుడు షాజహానుతల్లికూడ రాజపుత్రస్త్రీయే. ఆవిధంగా తురుష్క – మంగోలు

లనబడే యీ మొగలువంశీయులు తురుష్కులు, మంగోలులకంటె ఎక్కువగా భారతీయులయ్యారు. అక్బరు రాజపుత్రులను చాల మెచ్చు కునేవాడు. తన వివాహసంబంధాలవల్ల, పరిపాలనావిధానంవల్ల వారితో మైత్రిసంపాదించి, తనసామ్రాజ్యానికి చాలా బలం చేకూర్చుకున్నాడు. మొగలాయీల రాజపుత్రులసహకారం తరువాతి పరిపాలకులకాలంలో కూడా కొనసాగింది. ఇది ప్రభుత్వాన్ని, పరిపాలనాయంత్రాన్ని, సైన్యా న్నిమాత్రమే గాక, కళ, సంస్కృతి, జీవితాలనుకూడా మార్చింది మొగలుకులీనులు క్రమంగా భారతీయులుకాజొచ్చారు. రాజపుత్రులు మొదలైనవారు పర్షియనునాగరకతాప్రభావానికి లోనయ్యారు.

అక్బరు చాలమందిని తనవైపుకు తిప్పుకుని స్నేహితులుగా ఉం చుకోగలిగాడు. కాని, మేవారురాజైన రాణా ప్రతాపసింహుడు మాత్రం తాను విదేశీవిజేతకు మాటవరసకైనా లోబడడానికి అంగీక రించలేదు. అతడు బ్రతికిఉన్నంతకాలం అడవుల్లో చెట్టుపుట్టలమధ్యనే ఉండి, పోరాడాడు.

అక్బరు తనయందు, తనఆదర్శాలయందు భక్తిప్రపత్తులుగల వారిని చాలామంది సమర్థులైనవారిని తనచుట్టూ చేర్చాడు. వారిలో ప్రసిద్ధసోదరులు ఫైజీ అబుల్‌ఫజల్‌లు, బీర్బల్, రాజా మాన్సింగ్, అబ్దుల్ రహీమ్‌ఖాన్‌ఖనాన్ మొదలైనవా రుండేవారు. నూతనభావాలు, అపూ ర్వకల్పనలు కలవారికి, అన్నిమతాలవారికి ఆయనఆస్థానం సమా వేశస్థలమయింది. అతనిసహనము, విభిన్నవిశ్వాసాలకు అత డిచ్చిన ప్రోత్సాహము కొంతమంది సనాతనముస్లిములకు కోపంకలిగించించే టటువంటివిగా ఉండేవి. అందరికీ సరిపడే కొత్తమతాన్నొకదానిని బయ ల్దేరదీయడానికి ఆయన ప్రయత్నించాడు. హిందూమహమ్మదీయ సంస్కృతీసమ్మేళనము అతనిపరిపాలనాకాలంలోనే, ఉత్తరభారత దేశ ములో బాగా ముందడుగువేసింది. అక్బరు మహమ్మదీయుల కెంత అభి మానపాత్రుడో, హిందువులకూ అంతే. మొగలువంశం భారతీయులది గానే స్థిరపడిపోయింది.

## ౧౦ యాంత్రికపురోభివృద్ధిలోనూ, నిర్మాణాత్మకశక్తిలోనూ, ఆసియాకు, యూరపుకు భేదం

అక్బరుకు జిజ్ఞాస ఎక్కువ. ఇహ పర విషయాలన్నింటిని గురించి తెలుసుకోవాలని నిరంతరం ప్రయత్నించేవాడు. యాంత్రిక నిర్మాణాల్లోనూ, యుద్ధనీతిలోనూ అతనికి ఆసక్తి ఉండేది. ముఖ్యంగా ఏనుగులంటే ఆతని కభిమానం హెచ్చు. అతనిసైన్యంలో అవొక ముఖ్యభాగం. "అతనికి చాలవిషయాల్లో అభిరుచి. అనేకవిషయాలను తెలుసుకోవాలనేకోరిక ఉండేది. సైనిక, రాజకీయవిషయాలుమాత్రమే కాకుండా, యాంత్రికకళలనుగురించికూడా అతనికి బాగా తెలుసు." అని అక్బరుఆస్థానంలో ఉన్న పోర్చుగీసు క్రైస్తవమత ప్రచారకులు తెలియచేశారు. "ఆకలిగొన్నవాడు అన్నమంతా ఒక్కసారే మింగ డానికి ప్రయత్నించినట్లు, అక్బరు తెలుసుకోవాలనేకోరికవలన, అన్ని విషయాలు ఒక్కసారే నేర్చుకోడానికి ప్రయత్నించేవాడు." అనికూడా వ్రాశాడు.

అయినా, అతనిజిజ్ఞాస కొంతదూరంమాత్రమే పోయి, ఎందు వల్లనోకాని ఆగిపోయింది. ఎదురుగా తేలికైనమార్గం కనబడుతున్నా, ఆమార్గంలో అతడు ఎందుకని ముందుకుపోలేదో చిత్రంగానే కనబడు తుంది. మొగలాయిప్రభువుల్లో మొనగాడుగా అతడికున్న గౌరవంతో పాటు, సైనికశక్తిలోను, కాల్బలంవిషయంలోను గొప్పవాడే. కాని నౌకాబలంమాత్రం సున్న. క్రీ. శ. 1498 లో గుడ్‌హోప్‌అగ్రం ద్వారా వాస్కోడిగామా కాలికట్‌చేరాడు. క్రీ. శ. 1511 లో అల్బు కర్క్ మలాకాను స్వాధీనంచేసుకొని, పోర్చుగీసు నౌకాబలాన్ని హిందూమహాసముద్రంలో స్థాపించాడు. భారతదేశ పశ్చిమతీరానఉన్న గోవా పోర్చుగీసువారిదయింది. ఇదంతా జరిగినా, పోర్చుగీసువారు అక్బరుతో తగాదాకు రాలేదు. అయినా, సముద్రమార్గాన మక్కా వెళ్ళే భారతీయయాత్రికులను పోర్చుగీసువారు ధనంకోసం నిలిపివేసే వారు. ఆ యాత్రికుల్లో అప్పుడప్పుడు రాజకుటుంబంవారు, కులీనులు కూడా వుండేవారు. నేలమీద అక్బరు ఎంతబలవంతుడైనా, పోర్చు గీసువారు సముద్రంమీద శక్తిమంతులనేవిషయం స్పష్టం. ఒకే భూఖం

డంలోనిరాజ్యం నౌకాబలానికి ప్రాముఖ్యతనివ్వకపోవడమనేది అర్థమయ్యేవిషయమే. కాని, నిజానికి సముద్రమార్గాలమీద అధికారాన్ని ఛలాయించడంవల్లనే భారతదేశం ప్రాముఖ్యతనుపొందింది. అక్బరుకు జయించడానికి కావలసినంత భూభాగం వుంది కనుక, పోర్చుగీసువారిని గురించి ఆలోచించేందుకు అతడికి విరామం లేకపోయింది. వారతనికి అప్పుడప్పుడు అపకారంచేసినా, వారి నంతగా లెక్కచేయలేదు. ఓడలు నిర్మించాలని అక్బరు ఒకసారి ప్రయత్నించేశాడు. కాని, ఇదేదో - నౌకాబలంనిర్మించడానికికాక, కేవలం కాలక్షేపానికి, సరదాకు చేసినట్లు కనబడుతుంది.

మొగలాయి సైన్యాలు, భారతదేశంలోని ఇతరరాజ్యాల సైన్యాలుకూడా ఫిరంగులకోసం ఆటోమన్‌రాష్ట్రాలనుండి వచ్చిన కొంతమంది నిపుణులమీద ఆధారపడిఉండేవారు. ఫిరంగులఅధికారిని రుమిఖాన్ అనేవారు. 'రుమి' అంటే తూర్పురోము, లేక కాన్‌స్టాంట్‌నోపిల్. ఈ విదేశీనిపుణులు దేశీయులకు శిక్షణనిచ్చేవారు. కాని, అక్బరుగాని, మరెవరుగాని తమమనుష్యులను పైదేశాలకు పంపి, వారిని శిక్షితులను చేయడానికి ఎందుచేతనో ప్రయత్నించలేదు.

ఇంకొక అతిముఖ్యమైనవిషయం. ఒకఅచ్చుబైబిలును, బహుశ మరొకటి, రెండు అచ్చుగ్రంథాలను క్రైస్తవప్రచారకులు అక్బరుకు బహుమానంగా యిచ్చారు. తన పరిపాలనావ్యవహారాలకు, ఇతర మహోద్యమాలకు ఎంతో ఉపయోగపడే ముద్రణనుగురించి కూడా అతడు ఎందుచేతనో ఆలోచించలేదు. ఇక, గడియారాలు. మొగలాయిరాజవంశీయులు గడియారాలంటే చాలా మోజుపడేవారు. వీటిని పోర్చుగీసువారు, తరువాత ఇంగ్లీషువారు యూరపునుండి తెచ్చారు. ధనవంతులు వీటిని చాలా అపురూపంగా భావించేవారు. బీదవారు ఎండ నీడలవలన ప్రొద్దుతెలుకోగలిగేవారు. నీటిగడియారాలద్వారా కూడా టైముతెలుసుకొని తృప్తిపడేవారు. స్ప్రింగుగడియారాలను ఎలాచేస్తారో తెలుసుకుందామని, వాటిని ఇక్కడ చేయిద్దామనీ ఎవ్వరూ ప్రయత్నించలేదు. ఈవిధమైన యంత్రనిర్మాణాభిలాష లేకపోవడం ఆశ్చర్యకరమే. భారతదేశంలో చాలా నిపుణులయిన

పనివాళ్ళుండి కూడా, ఇట్టి కుతూహలం లేకపోవడమే ఆశ్చర్యకమైన విషయం.

ఆ కాలంలో నిర్మాణాత్మకశక్తి లేకపోవడం, కొత్తవాటిని కని పెట్టకపోవడం ఒక్క భారతదేశంలోనే కాదు, పశ్చిమ, మధ్యఆసియా లలో ఈ జబ్బు ఇంకా ఎక్కువగా ఉండేది. నాకు చైనాగురించి తెలియదు. కాని, ఇలాంటి పరిస్థితే అక్కడకూడా ఉందనుకుంటాను. మొదట్లో భారతదేశంలోనూ, చైనాలోనూ అనేకవిధాలైన శాస్త్ర పరిజ్ఞానం బాగా అభివృద్ధిలో ఉండేదని జ్ఞాపకముంచుకోవాలి. నౌకా నిర్మాణము, సముద్రవ్యాపారం యాంత్రికాభివృద్ధికి ప్రోత్సాహంగా ఉండేవి. ఈ రెండుదేశాల్లో కూడా యాంత్రికపురోభివృద్ధి జరుగనిమాట నిజం. ఏ దేశంలోనూ జరగలేదు. 15వ శతాబ్దపు ప్రపంచాన్ని ఈ దృష్టితో పరికిస్తే అంతకుక్రితం వెయ్యి లేక రెండువేలసంవత్సరాలక్రితం ప్రపంచంకంటె ఎక్కువ భిన్నంగా లేదు.

ప్రయోగవిజ్ఞానవిషయాలలో తొలిదశలో ఎక్కువ కృషిచేసి, మధ్యయుగాలవరకు సాంకేతిక, శాస్త్రీయరంగాల్లో యూరపుదేశా లన్నిటికంటె ముందంజవేసిన అరబ్బులు యిప్పుడు ప్రాముఖ్యవిహీనులూ, వెనుకబడినవారూ అయిపోయారు. అసలు 7వ శతాబ్దిలో అరబ్బులే మొదట గడియారాల్లో కొన్నిరకాలు తయారుచేశారని అంటారు. డెమాస్కస్‌లోనూ, హారున్ - అల్ - రషీద్‌కాలపు బాగ్దాద్‌లోనూ ప్రఖ్యాతిచెందిన పెద్దగడియారాలు వుండేవి. కాని, అరబ్బుల పతనంతో, ఆ దేశాల్లో గడియారాలుచేసేశక్తికూడా నశించింది. అప్పుడు యూరపుదేశాలలో యీ కళ పెంపొందుతున్నది.

కాన్‌స్టంటన్‌కంటె చాలాముందుగానే స్పెయినులోని మూరుజాతి అరబ్బులు, కొయ్యఅచ్చులతో ముద్రించేవారు. ప్రభుత్వం తనఉత్తర్వులకు ప్రతులుతీసేందుకు యీపద్ధతిని ఉపయోగించేది. అలా కొయ్య అచ్చులతో ముద్రించడంకంటె, ఆ కళ ఆ దేశంలో ముందడుగువేయ నేలేదు. పైగా ఆ పద్ధతికూడా అంతర్థానమయింది. ఆటోమన్‌తురుష్కులు అనేకశతాబ్దాలపాటు యూరపు, పశ్చిమాసియాలలో అత్యధిక ప్రాభవంగల ముస్లింశక్తిగా పరిపాలించారు. వారి గుమ్మంలోని యూరపుదేశాలలో అచ్చుగ్రంథాలు విరివిగా తయారవుతున్నప్పటికీ, వీరి

దేశాలలో అట్టిప్రయత్నాలే జరగలేదు. అచ్చుపుస్తకాలసంగతి తెలిసినా, ఆ మహత్తరకళను ప్రయోజనకరంగా వుపయోగించుకునే చురుకుతనం బొత్తిగా లేకపోయింది. వారి పవిత్రగ్రంథం ఖొరాన్‌ను అచ్చువేయడం మహాపాపంగా యెంచబడిన మతఛాందసంకూడా యిందుకు కొంత కారణమై వుంటుంది. అచ్చయినకాగితాలు దుర్వినియోగపరచబడవచ్చు, లేక పెంటకుప్పల్లో పారవేయబడవచ్చుగదా! మొదటిసారిగా ఈజిప్టులో అచ్చుయంత్రాన్ని ప్రవేశపెట్టినవాడు నెపోలియన్. ఈ కళ అరబ్బుదేశాలలో అతినెమ్మదిగా ప్రాకింది.

ఆసియా నిద్రాణమై, తానుపడ్డకష్టానికి అలసిపోయినట్టుగా, ఇంతవఱకు అనేకవిధాలుగా వెనుకబడిఉన్న యూరపులో అపారమయినమార్పులు కలుగనున్నాయి. తన నావికులను సముద్రాలను దాటించి, తన మేధావులచేత కొత్తమార్గాల్లో ఆలోచింపచేయగల ఉద్వేగము, ఉత్సాహము యూరపులో కలిగాయి. శాస్త్రపురోభివృద్ధి కొఱకు యూరపులో కలిగిన సాంస్కృతికపునరుజ్జీవనం చాల కొద్ది సహాయం చేసింది. కొంతవఱకు శాస్త్రంఎడల ప్రజలను విముఖులుగా చేసింది. అందరికి తెలిసిన శాస్త్రవిషయాలు కూడా సాంస్కృతికపునరుజ్జీవనం, విశ్వవిద్యాలయాల్లో ప్రవేశపెట్టిన మానవస్వభావానికి సంబంధించిన మార్పులేని చదువులు అందరికీ వ్యాపించకుండా అడ్డుతగిలాయి. మంచి దూరదర్శినీయంత్రాలు ఉన్నా, కోపర్నికస్, గెలీలియో, న్యూటన్‌లు ఏంచెప్పినా, 18 వ శతాబ్ది చివరిభాగంవరకు ఆంగ్లేయవిద్యావంతుల్లో చాలమంది భూమి తనచుట్టూ తాను తిరుగుతున్నదనిగాని, అది సూర్యునిచుట్టూ తిరుగుతున్నదనిగాని నమ్మడానికి నిరాకరించేవారట. గ్రీకు, లేటిను సనాతన గ్రంథాలను జీర్ణించుకొన్నవారుగనుక, ఏనాడో టోలెమీ చెప్పిన "భూమిచుట్టూ యితరగ్రహాలు తిరుగుతున్నా"యనే సూత్రాన్నే విశ్వసించేవారు. 19 వ శతాబ్దిలోని ఆంగ్లేయరాజకీయవేత్తల్లో అగ్రగణ్యుడైన గ్లాడ్‌స్టన్ పండితుడైనప్పటికీ, విజ్ఞానశాస్త్రాన్ని అర్థంచేసుకోవడంగాని, దానిపై ఆసక్తిచూపడంగాని జరుగలేదు. నేటిప్రజలు శాస్త్రీయసాధనాలమీదనే నడుస్తున్న ప్రపంచంలో బ్రతుకుతూ, భారీయెత్తున ఖూనీలూ, ధ్వంసాలూ చేసేందుకు దానినే వుపయోగించుకుంటున్నారు. ఈనాడుకూడా విజ్ఞాన

శాస్త్రాన్ని గురించి, శాస్త్రీయవిధానాన్ని గురించీ తెలియని రాజకీయ వేత్తలూ, ప్రజానాయకులూ (ఇండియాలోనేకాదు) ప్రపంచంలో చాలా ఎక్కువగానే వున్నారనుకుంటాను.

ఏమైనప్పటికీ పునరుజ్జీవనోద్యమం యూరపుమేధను అనేక పురాతనబంధనాలనుంచి విముక్తిచేసింది; అది అంతవరకు పవిత్రంగా చూచుకుంటున్న అనేక పూజాప్రతిమలను ధ్వంసంచేసింది. ఈ పునరుజ్జీవనోద్యమంవల్ల - లేక అదిజరిగినప్పటికీ - లక్ష్యప్రమాణాన్ని పెట్టుకుని అన్వేషించే ఆసక్తి మాత్రం పెల్లుబికింది. ఈ ఆసక్తి పురాతనంగా వున్న అధికారాన్నేగాక, కనుపించని, అస్పష్టమోచనలనుకూడా సవాలుచేసింది. "మానవశక్తికీ, మానవవిజ్ఞానానికీగల మార్గాలు దగ్గర దగ్గరగా వుంటాయి; దాదాపు రెండూ ఒకేదారి అనుకోవచ్చు. అయినా, కనుపించని విశేషాలను గురించి ఆలోచించడమనే హానికరమైన పురాతనాచారం వుంది. కనుక, శాస్త్రాన్ని ఆచరణతో సంబంధంగల పునాదులపై నిర్మించి ఆచరణభాగాన్నే ఆలోచనను నిర్ణయించే అధికార ముద్రికగాచేయడం శ్రేష్ఠం"అని ఫ్రాన్సిస్ బేకన్ వ్రాశాడు. తరువాత **17 వ శతాబ్దంలో** సర్ థామస్ బ్రౌన్ **ఇలా** వ్రాశాడు: "అధికారానికి కచ్చితంగా కట్టుబడి, అనుసరించడమే విజ్ఞానానికి పరమశత్రువు. అదే ప్రపంచంలోకల్లా గొప్ప హత్యను చేసే ఖూనీకోరు. పూర్వకాలం ఆదేశించినదానిమీదనే మనవమ్మకాలను ఏర్పరచుకోవటం అంతకంటే మృత్యుసమానం. ఎందువల్లనంటే, (ఏరకం సమర్థతగలవారైనా దీన్ని పరిశీలించవచ్చు) యీ తరాలవారిలో అనేకమంది ప్రాచీనకాలాన్ని ఛాందసంగా నమ్ముతారు. అందువల్ల ప్రస్తుతహేతువులకంటే పాతప్రమాణాలు ఎక్కువబలమైనవవుతాయి. ఈ తరంవారినీ, వారిపనులనూ సమకాలికులూ, వెంటనేవచ్చేతరంవారూ చాలా నిశితంగా, అసూయాదృష్టితో పరిశీలిస్తారు. గతంలోని, మనకు తెలియనిరోజుల్లోని వ్యక్తులనూ, వారిపనులనూ పరిశీలించేటప్పుడు యిటువంటి ఆకట్టేమీ వుండదు. వారు మరీ దూరపుకాలంవారైతే, వారికిచెందిన ప్రతివిషయమూ పూర్తి సత్యమే అనుకుంటాం. దీన్నిబట్టి మనల్ని మనమే ఎక్కువగా మోసగించుకుంటున్నాం. సత్యపథానికి చాలాదూరంగా నడుస్తున్నామని నేను అనుకుంటున్నాను."

అక్బరు 16వ శతాబ్దివాడు. అప్పుడు యూరపులో డైనమిక్స్ శాస్త్రంపుట్టి మానవజీవితంలో విప్లవాత్మకమైనపురోగమనం ఆరంభమైంది. దానితో మొదట నెమ్మదిగాను, తరువాత అతివేగంగానూ యూరపు 19వ శతాబ్దినాటికి అన్నిఖండాలకంటే ఎంతో పురోగమించి, కొత్తప్రపంచాన్ని సృష్టించేటంత ముందుకుపోయింది. ఈవిధంగా యూరపుప్రకృతిశక్తులను పూర్తిగా ఉపయోగించుకుంటే, ఆసియా పురాతన సనాతనవిధానాలనే అవలంబిస్తూ, మానవుని శ్రమ, రక్తముల మీదనే ఆధారపడుతూ, స్తబ్ధుగా, నిర్జీవంగా వుండిపోయింది.

ఇలా ఎందువల్ల జరిగింది? ఒక్కమాటలో చెప్పాలంటే, ఆసియా మరీ విశాలమైనదీ, అనేక తరహాలదేశాలుగలదీను. ప్రతిదేశాన్ని ముఖ్యంగా చైనా, ఇండియావంటి విశాలదేశాలను – వేర్వేరుగా పరిశీలించాలి. చైనా ఆనాడుగాని, తరువాతగాని యూరపుకంటె ఉత్తమ సంస్కారం కలిగివుంది. చైనావారు ఉత్తమనాగరికజీవితాన్నే గడిపారు. ఇండియాకూడా పైకి చూడటానికి మంచి రాజసభలు, పెంపొందుతున్న వ్యాపార – వాణిజ్యాలు, పరిశ్రమలు, చేతిపనులతో కళకళలాడుతూవుంది. ఆనాడు ఏభారతీయుడైనా యూరపుదేశాలకువెళ్ళి చూచినట్లయితే వారు అనేకవిధాల వెనుకబడివున్నారని భావించేవాడే. అయినా, నాడు యూరపులో వ్యక్తమాతున్న బహుముఖసంచలనం ఇండియాలో లేదు.

ఏ నాగరికత అయినా బైటనుంచితగిలే దెబ్బలవల్లకంటె, అంతర్గతవిఫలతవల్లనే ఎక్కువగా క్షీణించిపోతుంది. అదితనపనితీరిపోయిందనుకొని, మార్పేప్రపంచానికి మరేమీచేయలేకపోయినందువల్లగాని, దానికి ప్రాతినిధ్యంవహించేప్రజలు గుణంలో జారిపోయి, తమబాధ్యతలను సక్రమంగానిర్వహించలేనిఅశక్తులుగా మారినందువల్లగాని ఆ నాగరికత విఫలం కావచ్చును. సంఘసంస్కారం ఒక హద్దుదాటి, పురోగమనానికి అడ్డంకిఅయ్యేతరహాగలది కావచ్చును. ఆ అడ్డంకిని తొలగించితేగాని, తరువాతిపురోగమనం సాధ్యంకాకపోవచ్చును, లేక సంస్కృతిలోనే గుణసంబంధమైనమార్పు కలిగి స్తేగాని పురోగమనం సాధ్యంకాకపోవచ్చును. తురుష్క, ఆఫ్ఘనుదండయాత్రలకుపూర్వమే భారతీయ నాగరికతలో క్షీణస్థితి కనపడుతున్నది. అయితే యీ దండయాత్రికుల

ఒరపిడి, వారి నూతనభావాలూ భారతదేశంమీద పనిచేసి, ఒకకొత్త సాంఘికస్థితిని సృష్టించుట ద్వారా వివేకంయొక్క బంధనాలను త్రెంచి, నూతనశక్తిని విడుదలచేయగలిగాయా ?

కొంతవరకు అలాగేజరిగింది. చిత్రలేఖనం, శిల్ప,వాస్తుశాస్త్రాలు, సంగీతము, జీవితవిధానాలూ కొంత మారాయి. ఆ మార్పులైనా స్వల్పమైనవే. సాంఘికజీవితం దాదాపు యథారీతిగానే వుండిపోయింది. వాస్తవానికి కొన్నివిధాల అది మరింత గట్టిపడింది కూడాను. ఆఫ్ఘనులు వెనుకబడిన, మధ్యయుగపు మన స్తత్వంగల వ్యక్తులయినందువల్ల వారివల్ల భారతీయజీవితంలో మార్పేమీ రాలేదు. యూరోపియనుల దృష్టిలో భారతదేశం భూస్వామ్యమన స్తత్వం గలది కాదు. దేశరక్షణకు వెన్నెముకగావున్న రాజపుత్రవంశాలు మాత్రమే భూస్వామ్యవిధానాన్ని అవలంబించేవి. మొగలులుకూడా మధ్యయుగాలనాటి భూస్వామ్య పద్ధతికి దగ్గరివారే. కాని కేంద్రంలో చక్రవర్తిత్వం బలంగా వుండేది. ఈ సార్వభౌమత్వం రాజపుత్రులభూస్వామ్యమన స్తత్వాన్నిజయించివేసింది.

అక్బరుజిజ్ఞాస, పరిశోధనాదృష్టి సాంఘికజీవితంవైపు మళ్ళి, ప్రపంచంలో యితరభాగాల్లో ఏంజరుగుతూందో తెలుసుకున్నట్లయితే, అతడు సాంఘికపరివర్తనకు మంచిపునాదులు వేయగలిగేవాడే. కాని, అతడు తనసామ్రాజ్యాన్ని సుసంఘటితంచేసుకోవడంలోనే వూపిరాడకుండా వున్నాడు. అన్నిమతాలవారినీ తనలో కలుపుకోవాలనే పట్టుదలగల ఇస్లాము జాతీయమతము,ఆచారాలతోను, ప్రజలతోను మైత్రీభావంతో మెలగేటట్లుచేసి; తద్వారా జాతీయైక్యతను నిర్మించేదెలాగా అన్నదే అతన్నెదుర్కొన్న పెద్దసమస్య. అతడు మతాన్ని హేతువాదదృక్పథంతో వ్యాఖ్యానించడానికి ప్రయత్నించాడు. ఆ సమయానికి భారతరంగంలో గణనీయమైనమార్పు తెచ్చాడు. కాని అడ్డదారిపద్ధతి అనేకఇతరచోట్లవలెనె యిక్కడా ఫలించలేదు.

కాబట్టి సాంఘికంగా అక్బరుకూడా ప్రాథమికమైన మార్పు లేమీ చేయలేకపోయాడు. అతడు ప్రవేశపెట్టిన మార్పు, మానసిక తెగువకూడా అతనితరువాత చల్లబడిపోయాయి. భారతదేశం మార్పు లేని స్తబ్ధజీవితాన్నే మళ్ళీ సాగించింది.

## ౧౧ సామాన్య సంస్కృతి వికాసము

అక్బరు తరువాత వచ్చినవారు అంతటివారుగాకపోయినా, అక్బరు బాగా కట్టడంచేత, అతని నిర్మాణం మరో నూరుసంవత్సరాలవరకు నిలబడింది. ప్రతి మొగలురాజు అనంతరం సింహాసనంకోసం రాజకుమారుల్లో తగాదాలువచ్చి, కేంద్రంలో ప్రభుత్వం నీరసించిపోయింది. అయినా దర్బారు గొప్పగానే ఉండేది. మొగలులకీర్తి ఆసియా, యూరపుల్లో అంతటా వ్యాపించింది. ప్రాచీనభారతశిల్పాన్ని, నూతనంగావచ్చిన రేఖలో అందాన్ని గొప్పదనాన్ని కలుపుతూ, అందమైన భవనాలు ఆగ్రాలోనూ, ఢిల్లీలోనూ నిర్మింపబడ్డాయి. చాలాకష్టపడి నగిషీలు చెక్కబడిన – ఉత్తర, దక్షిణభారతంలోని చాల భవనాలు, దేవాలయాలకూ ఈ నూతన భారత-మొగలాయిశిల్పానికి చాల భేదం గోచరించేది. ఉత్తేజితులైనశిల్పులు అమృతహస్తాలతో ఆగ్రావద్ద తాజ్ మహల్ నిర్మించారు.

గొప్పమొగలుల్లో చివరివాడైన ఔరంజేబు కాలచక్రాన్ని వెనక్కుత్రిప్పడానికి ప్రయత్నించి, ఆపేసి, పగులగొట్టేశాడు. భారత జాతీయతానుగుణ్యంగా పనిచేసి, ఏకజాతీయతాతత్వంకలిగి, విభిన్న వర్గాలను ఏకంచేయడానికి ప్రయత్నించినంతకాలం మొగలుపాలకులు బలంగానే ఉన్నారు. ఔరంగజేబు ఈ ఉద్యమానికి అడ్డుతగిలి, భారతీయపరిపాలకుడుగాకంటె మహమ్మదీయుడుగా ప్రవర్తించడానికి ప్రయత్నించుటతో మొగలుసామ్రాజ్యం విచ్ఛిన్నమైపోవడం మొదలుపెట్టింది. అక్బరు, అతనివంశీయులు చేసినకృషి కూలిపోయి, అక్బరువిధానాలచే అదుపులోవుంచబడిన శక్తులు చెలరేగడంమొదలుపెట్టి, సామ్రాజ్యం మీద దెబ్బతీశాయి. కొత్తఉద్యమాలు ప్రారంభమైనాయి. పైకి వస్తున్న జాతీయతకు ప్రాతినిధ్యంవహించి, సంకుచితదృక్పథంగలవైనా, శాశ్వతంగా దేనినైనా నిర్మించడానికి కావలసినబలం లేకపోయినా, మొగలుసామ్రాజ్యాన్ని నాశనంచేయగలిగాయి.

వాయవ్యంనుండివచ్చిన దండయాత్రలప్రభావము, ఇస్లాంరాపిడి భారతదేశంమీద ఎక్కువగానే పనిచేశాయి. హిందూసంఘంలోని లోపాలను యీ దండయాత్రలు వేలెత్తిచూపాయి. ఘనీభవించిపో

యిన కులతత్వం, అంటరానితనం, అర్థంలేనిఛాందసత్వం ఆ లోపాల్లో కొన్ని. ఇస్లాంబోధించిన సౌభ్రాతృత్వం, ఆ మతస్థులసమానత్వం చాలా బలమైన ప్రభావంకలిగిఉన్నాయి. ముఖ్యంగా హిందూసమాఖ్యలో స్థానంలేనివారిని, అందు మచ్చుకైనా సమానత్వానికి నోచుకోనివారిని ఈసిద్ధాంతం చాలా ఆకర్షించింది. మతసంయోగం కోసే చాలా ఉద్యమాలకు యీఆదర్శాలతాకిడే కారణం. అనేకులు మతాంతరులయ్యారు. యివి చాలాభాగం క్రిందితరగతులనుండే. బెంగాలులో పైతరగతులకు చెందినవారు కొంతమంది మతంమార్చుకున్నారు. కొంతమందికి నిజంగా నూతనమతంమీద విశ్వాసం కలిగింది. చాలమంది ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలకోసం మతంమార్చుకున్నారు. అధికారంలోఉన్నవారి మతం అవలంబించడంవల్ల చాలా లాభాలున్నాయనేది స్పష్టం.

ఇలా పెద్దపెట్టున మతాంతరీకరణం జరుగుతున్నా, హిందూ మతం ఎప్పటివలెనే ధైర్యంతో, విశ్వాసంతో, తృప్తితో దేశంలో ముఖ్యమతంగానే నిలబడగలిగింది. అగ్రకులాలవారికి ఆలోచన, భావనారంగాలలో తమదే పైచేయి అనే విశ్వాసం అలాగే వుంది. వేదాంత, తత్వశాస్త్రసమస్యల పరిశీలనకు ఇస్లాంమార్గం చాలా మొరటు మార్గమని వారు భావించారు. ఇస్లాంమతంలోని ఏకేశ్వరవాదన తమ మతశాఖల్లోనూ వుందనీ, అదీ, అద్వైతమూ కలిసే తమ వేదాంతతత్వశాస్త్రం యేర్పడిందనీ వారితలంపు. ప్రతివ్యక్తీ యీరెంటిలో ఏదోఒక దాన్ని స్వీకరించవచ్చు. లేదా జనసమ్మతమైన ఏ పూజావిధానాన్నైనా అనుసరించవచ్చు. ఎవరైనా వైష్ణవుడై, ఆత్మస్వరూపుడైన దేవుని నమ్మి తనవిశ్వాసాన్ని ధారపోయవచ్చు. లేక మరీ తత్వజ్ఞానిఅయితే పారలౌకికచింతనాలోకంలో విహరించవచ్చు. హిందూసాంఘికనిర్మాణానికి మూలాధారము సముదాయమే అయినా, వారి మతవిషయంలోమాత్రం వ్యక్తిత్వానికి ప్రాధాన్యత ఉండేది. అందరూ తమ మతంలో చేరి, ముక్తిపొందాలనే వాదనను వారు విశ్వసించరు; మతాంతరులయ్యే వారినిగురించి పట్టించుకునేవారుకాదు. తమ సాంఘికవ్యవస్థలోను, జీవితపథాల్లోను ఇతరులజోక్యాన్ని వాళ్ళు సహించేవారుకాదు. ఇతరవర్గమేదైనా తమకనువైనమార్గాన్ని అనుసరించాలనుకుంటే పూర్తిస్వాతంత్ర్యం ఉండేది. ఇస్లాంలో ఎక్కువగా గుంపులు, గుంపులుగా చేరేవారంటే

సముదాయాల్లో సంఘీభావం బలంగావుండటమే కారణం. అగ్రవర్ణాలలో వ్యక్తులు మతాన్ని మార్చుకొనిఉండవచ్చు. కాని క్రిందివర్ణాల విషయంలో - ఒక్కొక్కకులంవున్న పేట అంతాగాని, గ్రామం అంతాగాని ఒకేసారిగా మతాంతరులయ్యేవారు. అందువల్ల పూజాదికాల్లో కొన్నిమార్పులు సంభవించాయేగాని, వారి దైనందినజీవితం, వృత్తులు ఏమాత్రం మారలేదు. కాబట్టి కొన్నిప్రత్యేకవృత్తులూ, చేతిపనులూ ముస్లిములచేతుల్లోనే వుండిపోవడం చూస్తున్నాము. అదేవిధంగా ఒక్కొక్కపరగణాలో చేనేతవృత్తి పూర్తిగా ముస్లింలదే. కుట్టుపనివారు, కసాయివారు, తోళ్ళపనివారు, పాదరక్షలవ్యాపారులు చాలవరకు ముస్లిములే. ఆ తరువాత సంఘవ్యవస్థలో కూటమిపద్ధతి విచ్ఛినమకావడంతో వ్యక్తులు వేర్వేరువృత్తులను స్వీకరించటం జరిగింది. సముదాయం అంతా ఒకేవృత్తిచేపట్టేవిధానం మారింది. కుటీరపరిశ్రమలు, చేతిపనులు బ్రిటిష్‌పాలనారంభకాలంలోనే విచ్ఛిన్నమైనందువల్ల, ఆ తరువాత నూతనవలసఆర్థికవిధానంవల్ల చేతిపనివారు - ముఖ్యంగా చేనేతపారిశ్రామికులు, జీవనాధారాన్ని కోల్పోయారు. ఈ ఘోరప్రమాదంనుంచి బైటపడగలిగినవారు భూమివైపుమళ్ళి, బంధువులనుంచి కుంటో, సెంటో, పంచుకోవడమో, భూమిలేని వ్యవసాయకూలీలు కావడమో జరిగింది.

ఆ కాలంలో వ్యక్తులుగాని, ముఠాలు (కూటములు)గాని ఇస్లాం మతాన్ని స్వీకరిస్తూంటే-అట్టివి బలవంతంగా జరుగుతూంటేతప్ప హిందువులవల్ల ప్రత్యేకమైన వ్యతిరేకచర్యలు జరిగేవికావు. బంధువులూ, మిత్రులూ మతంమార్చుకున్నవారిని నిరసించవచ్చుగాని, హిందూ సంఘుమాత్రం, తనకేమీపట్టనట్లుండేది. ఈ ఉపేక్షాదృక్పథానికి, నేటి మతాంతర (ఇస్లాంలోకిగాని, క్రైస్తవానికిగాని) సంఘటనలకు హిందూసంఘం ప్రదర్శించే ఆందోళన, నిరసనలకు ఎంత తేడావుంటుంది! దీనికి ముఖ్యకారణం రాజకీయవిశేషాలే; మతసంబంధంగా నియోజక వర్గాల విభజనయే!! తమమతంలో చేరిన ప్రతిఒక్కడూ తమబలాన్ని పెంచుతాడు; ఓటుపెరుగుతుంది. క్రమంగాప్రాతినిధ్యమూ పెరుగుతుంది. ఇట్టిలాభంకోసం జనాభాలెక్కలను తారుమారుగా సృష్టించడంకూడా కొన్నిచోట్ల జరుగుతోంది. ఇట్టి రాజకీయకారణాలేగాకుండా నేటి హిందూమతంలో 'అంతామనమతంలోనే చేరి ముక్తిపొందాలి' అనే

దృక్పథంపెరిగి, అన్యమతస్థులను హిందూమతంలో చేర్చడం పవిత్ర కార్యక్రమంగా చేసుకున్నవారు ఉండడంకూడా నేటి మతభేదసంఘటనలకు ఎక్కువ ప్రచారంజరగడానికి ముఖ్యకారణం. ఈ గుణం ఇస్లాం మతంవల్ల మనకు సంక్రమించిన ప్రత్యేకగుణమే. దీనివల్ల మతకలహాలకు కారణాలు కూడా ఏర్పడుతున్నాయి. సనాతనహిందువులు యిట్టి విభేదాలను ఆమోదించరు.

కాశ్మీరులో హిందువులు ఇస్లాంమతాన్ని స్వీకరించడం వరుసగా చాలాకాలం సాగేసరికి, అక్కడ నూటికి 95 మంది ముస్లింలే అయి పోయారు. కాని వారు తమహిందూసాంప్రదాయాచారాలలో కొన్నింటిని ఇంకాపాటిస్తూనేవుంటారు. 19వశతాబ్దమధ్యకాలంలో, ఆరాష్ట్రాన్ని పాలిస్తున్నహిందూరాజు ముస్లింప్రజల్లోఅనేకమంది గుంపు, గుంపుగా మళ్ళీ హిందూమతంలో చేరటానికి సిద్ధంగాఉన్నారని గ్రహించాడు. దీన్ని హిందూమతధర్మం హర్షిస్తుందో లేదో తెలుసుకురమ్మని కొందరు పండితుల్ని కాశీకి పంపించాడు. కాశీపండితులు మతమార్పిడులను చూడటానికైనా సహించం అనగా, ఆ ప్రయత్నం ఆగిపోయింది.

ఇండియాకు విదేశాలనుంచివచ్చిన ముస్లింలు సాంకేతిక, రాజకీయ, ఆర్థికనిర్మాణాలలో కొత్తవిధానాలేమీ తీసుకురాలేదు. ఇస్లాం మతవిశ్వాసంప్రకారం సర్వమానవసౌభ్రాతృత్వం ఆదర్శమైనా, ముస్లింలు ఎక్కువగా వర్గదృష్టి, మధ్యయుగాల దృక్పథం కలవారు. సాంకేతిక విషయాల్లోను, ఉత్పత్తివిధానాల్లోను, పరిశ్రమల వ్యవస్థీకరణలోను నాటికి ఇండియాలోగల తెలివిడికూడా ముస్లింలకు లేదు. అందువల్ల, భారత సాంఘిక, ఆర్థికవ్యవస్థలమీద వారిప్రభావం అంతగా లేకపోయింది. జీవితం మునుపటివలెనే సాగిపోతున్నది. ప్రజలందరూ —హిందువులు, ముస్లిములు, తదితరులు పూర్వపు భారతీయజీవితంలోనే యిమిడిపోయారు.

స్త్రీలపరిస్థితి మరీ దిగజారింది. 19వశతాబ్దపు ఆంగ్లన్యాయశాస్త్రంకంటె మెరుగైనప్పటికి, పురాతనభారతీయచట్టాలుకూడా స్త్రీలకు వారసత్వం, కుటుంబంలో గౌరవస్థానాలవిషయంలో చాలా చిన్నచూపు చూచాయి. ఆ చట్టాలు హిందూసమిష్టికుటుంబాన్ని ప్రాతిపదికగాఎంచినందువల్ల, ఆస్థి ఇతరకుటుంబాలకుపోకుండా చూచేంద్ర

దుకు ప్రయత్నించాయి. వివాహంతో స్త్రీ తనకుటుంబాన్ని మార్చు కునేది. ఆమె అరికంగా తండ్రి, భర్త, కొడుకులమీద ఆధారపడవలసి వుండేది. అయితే, స్త్రీలు ఆస్తి కలిగిఉండవచ్చు, కలిగిఉన్నారుకూడాను. స్త్రీ అనేకవిధాల గౌరవింపబడి, పూజింపబడేది. సాంఘిక, వైజ్ఞానిక కార్యకలాపాల్లో పాల్గొంటూ, స్వేచ్ఛ కలిగిఉండేది. భారతదేశ చరిత్రనిండా ప్రసిద్ధులైన స్త్రీతత్వవేత్తలు, విజ్ఞానులు, పాలకులు, వీరనారీమణులపేర్లు చాలా ఉన్నాయి. ఈ స్వేచ్ఛ క్రమంగా తగ్గిపో సాగింది. ఇస్లాంన్యాయశాస్త్రం స్త్రీలకు వారసత్వహక్కువిషయంలో ఉదారంగాఉన్నా, అది హిందూస్త్రీల కెట్టిప్రయోజనాన్నికల్గించలేదు. క్రమంగా ముస్లింస్త్రీలను ఇండ్లలోబంధించివేసినట్లే, హిందూస్త్రీలకు కూడా పరదాఆచారం ఎంతో అన్యాయంచేసింది. ఈ ఆచారము ఉత్తరభారతము, బెంగాలులోని అగ్రవర్ణాలలో పూర్తిగా వ్యాపించింది. పశ్చిమ, దక్షిణప్రాంతాల్లో మాత్రం అంతగా వ్యాపించలేదు. ఉత్త రాదిని అయినా సామాన్యవర్గాలప్రజల్లో యిట్టిమార్పు రాలేదు. ఈ ఆచారంవల్ల స్త్రీలకు విద్యావకాశాలు నశించడమేగాక, వారికి యింట్లోతప్ప, మరెక్కడా తిరిగేస్వేచ్ఛ లేకపోయింది. వారు సంకుచితం చేయబడిన గృహజీవితంలో తప్ప, మరేవిధంగాను తమవిశిష్టతను విశదపరుచుకునేఅవకాశం లేకపోయింది. పైగా వారి పాతివ్రత్యంలోనే మహాపవిత్రత ఉన్నదనీ, పాతివ్రత్యభంగంకంటె మహాపాపం లేదనీ బోధించారు. ఇది పురుషనిర్మితసిద్ధాంతం. కాని అతడు దాన్ని తనకు మాత్రం వర్తింపచేసుకోలేదు. జహంగీరుకాలంలో ప్రసిద్ధ హిందీ రామాయణకావ్యాన్ని రచించిన తులసీదాసు నాటి స్త్రీలనుగురించి చేసినవర్ణన చాలవరకు పక్షపాతంగాను, అన్యాయంగాను వుంది.

ఇండియాలోని ముస్లింలలో ఎక్కువమంది హిందువులే మతాం తరులైనందువల్లా, బహుకాలంగా హిందువులతో సన్నిహితంగా బ్రతుకుతున్నందువల్లా ఈ రెండుమతాలవారూ ఒకేరకమైన ఆచా రాలూ, జీవితవిధానాలూ, కళాభిరుచులూ అలవరచుకున్నారు. ముఖ్యంగా ఉత్తరాదిని సంగీత, చిత్రలేఖన, వాస్తుకళలూ, ఆహార, విహార, అలంకారాలూ చాలవరకు ఒకేవిధంగా ఉంటాయి. వారు ఒకేజాతివలె శాంతియుతంగా బ్రతుకుతూ, ఒకరిపండుగల్లో ఒకరు

పాల్గొంటూ, ఒకేభాష మాట్లాడుతూ, దాదాపు ఒక్కలాగే జీవిస్తూ, ఒకేరకమైన ఆర్థికసమస్యల నెదుర్కొన్నారు. రాజవంశీకులూ, ధనవంతులూ, పైఅధికారులూ ఆస్థానసాంప్రదాయాల ననుకరించేవారు. (వీరు భూస్వాములు, జమీందారులు కారు.) కవుళ్ళువసూలుచేసేవారు కాదు. ఒకప్రత్యేకప్రాంతంలో పన్నులు వసూలుచేసి, కొంత తాము ఉంచుకునే అధికారాన్నిమాత్రమే కలిగిఉన్నారు. ఇట్టి మంజూరులు వారిజీవితపర్యంతం మాత్రమే పరిమితం. అట్టివారు ఎంతో క్లిష్టము, హానికరమైన జీవితవిధానాలను అలవర్చుకున్నారు. వారందరూ ఒకే రకమైన దుస్తులు ధరిస్తూ, ఒకేరకంఆహారం భుజిస్తూండేవారు. వారి సైనికవిన్యాసాలు, వేట, వీరోచితచర్యలు, ఆటలు మొదలైనవి ఒకే రకంగా ఉండేవి. గజయుద్ధాలూ, పోలోఆట ప్రసిద్ధమైనవి.

కులవిధానం పరస్పరస్వీకారాలకు అడ్డంకిగా వున్నా సాంఘికజీవితంలో సామీప్యతా, సారూప్యతా యేర్పడ్డాయి అరుదుగా తప్ప, మతాంతరవివాహాలు లేవు. జరిగినప్పుడైనా హిందూస్త్రీ ముస్లింమతం స్వీకరించడంతప్ప మరొకటి జరిగేదికాదు. మతాంతరవిందులు లేవు, కాని, గట్టి ఆటంకం వుండేదికాదు. స్త్రీలను ఇండ్లలోనే నిర్బంధించడం వల్ల సాంఘికజీవితోన్నతికి ఎక్కువ అవకాశంవుండేదికాదు. ముస్లిముల్లో పరదాఆచారం మరీ దృఢంగా వున్నందువల్ల, వారికుటుంబాలమధ్య కూడా సంఘీభావం యేర్పడ్డానికి అడ్డంకిఅయింది. హిందూ, ముస్లిం పురుషులు తరచుగా కలుసుకుంటున్నప్పటికి, ఉభయమతాల స్త్రీలకు అట్టిఅవకాశాలు లేవు. అగ్రవర్గాలస్త్రీలలో ఈ కట్టుబాట్లు మరీ ఎక్కువైనందున ఒకరినిగురించి మరొకరు తెలుసుకునేఅవకాశం లేకపోయింది.

సామాన్యగ్రామీణుల్లో అనగా, దేశంలోనిఅధికప్రజానీకంలో జీవితం సమిష్టిగాను, సన్నిహితంగాను వుండేది. గ్రామపరిధిలో హిందూ, ముస్లిములు చాల సఖ్యతగా వుండేవారు. హిందువులు ముస్లిములను వేరొకకులంగా చూచినప్పటికీ ఆ కులబేధం సన్నిహితసంబంధాలకు అడ్డుకాలేదు. ముస్లిములలో చాలమంది మతాంతరులైనవారే కనుక, తమ పురాతనసాంప్రదాయాలనుమరువలేదు. హిందూపురాణకథలు, శాస్త్రాలు ఆచారాలు, బాగా తెలుసు. హిందువులుచేసేపనులే చేస్తూ, వారి వలెనే దుస్తులుధరిస్తూ, అదేరకంజీవితాన్ని గడిపేవారు. ఒకరిపండుగల్లో

ఒకరుపాల్గొనడమేగాక, కొన్ని ఉత్సవాలు యిరుతెగలూ సమానంగానే జరుపుకునేవారు. ఇద్దరివి ఒకేరకం జానపదగేయాలు. వీరిలో చాలవరకు రైతులో, కూలీలో, చేతిపనులవారో అయివుండేవారు. కులీనులైన ధనికవర్గానికీ సామాన్యకర్షకవర్గానికీ మధ్య పెద్దదైన మూడవవర్గం వ్యాపారస్థులది. వారిలో అధికసంఖ్యాకులు హిందువులు. వారికి రాజకీయాధికారాలు లేకపోయినా, ఆర్థికనిర్మాణం, వారిచేతుల్లోనే వుండేది. ఇతరవర్గాలకంటె ఈ వర్గానికి ముస్లింలతో సంబంధాలు చాల తక్కువ. విదేశాలనుంచివచ్చిన ముస్లింలు మధ్యయుగపుభూస్వామ్యమనస్తత్వం కలవారైనందువల్ల వ్యాపారవృత్తిని హీనంగా యెంచేవారు. వడ్డీ పుచ్చుకోరాదనే ఇస్లాంనీతికూడా వ్యాపారానికి అడ్డుతగిలింది. వారు రాజవంశీకులమనీ, పాలకవర్గంవారమనీ అనుకునేవారు. రాజాస్థాన ఉద్యోగాలూ, జాగీరులూ, వసూలువసూలుహక్కులూ అనుభవించేవారు. లేకపోతే, ప్రభుత్వోద్యోగులుగానూ, సైనికోద్యోగులుగానూ ఉండేవారు. అనేకమంది పండితులై రాజాస్థానంలోనో, మతతత్వసంఘ నిర్వాహకులుగానో ఉండేవారు.

నాటిరాజభాష పారసీకమగుటచే అనేకమంది హిందూరచయితలు పారసీకగ్రంథాలు రచించారు. అందులోకొన్ని ఆనాటి ఉత్తమగ్రంథాలు. ముస్లింరచయితలు సంస్కృతగ్రంథాలను పారసీకంలోకి అనువదించారు. హిందీలో గ్రంథాలు రచించారు. అట్టివారిలో మాలిక్ మహమద్ జైసీ "పద్మావత్" అనే ప్రసిద్ధహిందీగ్రంథాన్ని రచించాడు. అక్బర్ సంరక్షకునికుమారుడూ, అతనిఆస్థానఉద్యోగీ అయిన అబ్దుల్ రహీంఖాన్ ఖానా మరొక ప్రసిద్ధ హిందీకవి. ఆయన అరబ్బీ, పారసీక, సంస్కృతభాషల్లో పండితుడు. అతడు కొంతకాలం సర్వసైన్యాధ్యక్షుడుగా వున్నా - అక్బరుకు లొంగక, నిరంతరం పోరాడుతూ వున్న మేవాడురాజు రాణా ప్రతాపసింహుని పొగడుతూ పద్యాలు వ్రాశాడు. యుద్ధరంగంలో శత్రువుగా పోరాడుతున్న ఆ రాజపుత్ర వీరుని శౌర్యాన్ని, సాహసాన్ని, దేశభక్తిని, గౌరవోద్దేశాలను ఖాన్ ఖానా మిక్కిలి మెచ్చుకున్నాడు.

ఇట్టి ధార్మిక, వీరోచిత, మైత్రీదృక్పథాన్నే అక్బరు తనరాజనీతికి మూలంగా చేసుకున్నాడు. అతనిమంత్రులు, సలహాదారులూ ఆయన్ని

అనుసరించారు. తనవలెనె ధైర్యము, నిశ్చింత, గౌరవభావము, మాట తప్పనితనము గల రాజపుత్రులను అక్బరు మెచ్చుకొని, గౌరవించి, ఆదరించేవాడు. వారిని తనవైపు త్రిప్పుకోగలిగాడు, కాని రాజపుత్రు లెంతమెచ్చుకోదగ్గవారైనప్పటికి, వారు మధ్యయుగాలనాటి సమాజాన్ని పోలిన సంఘానికి ప్రాతినిధ్యంవహించేవారైనందున, క్షాత్రగర్వలక్షణాలుగల కొత్తశక్తులు తలెత్తుతున్న ఆకాలంలో వెనుకటిలక్షణాలే వారిలో ప్రతిబింబించేవి. అక్బరుకూడ అట్టిసాంఘికతత్వానికి బందీయైన వారసుడేగనుక తలెత్తుతున్న నూతనశక్తుల్ని గమనించలేకపోయాడు.

అక్బరువిజయం ఆశ్చర్యకరం. అతడు ఉత్తర, మధ్యభారత దేశంలోని విభిన్నశక్తులమధ్య ఏకీభావాన్ని నెలకొల్పగలిగాడు. అతని కార్యక్రమానికి అనేక అడ్డంకులున్నాయి. పాలకవర్గం విదేశీశక్తి అనేది మొదటిది. కులమతవిభేదాలు రెండవది. మతాల్లో ఒకటి స్పర్ధ, పాషండ భావాలుగలది. అందరూ తమమతంలో చేరి ముక్తికాంతను వరించాలనే ఉద్యమస్వభావంగలది మరొకటి. ఈ అడ్డంకులు అదృశ్యంకాలేదు. కాని, అవి వున్నప్పటికి ఏకీభావం పెంపొందింది. అది అక్బరు వ్యక్తిత్వానికిచెందినది కాదు. అది అతడు నిర్మించిన నిర్మాణానికి సన్నిహితమైనది. అతనికొడుకూ, మనుమడూ (జహంగీర్, షాజహాన్‌లు) ఆ వ్యవస్థను అంగీకరించి, దానిచట్రంలోనే మెలిగారు. వారేమీ ప్రత్యేకసామర్థ్యాలుగల వ్యక్తులు కారు. అయితే అక్బరు వేసిన గట్టిపునాదుల మీదనే నడవడంవల్ల వారిపాలనలు విజయవంతమయ్యాయి. తరువాత వచ్చిన ఔరంగజేబు ఎంతో సమర్థుడు. కాని మరొకలాంటి మనస్తత్వంగలవాడై, లోగడ వాడబడినమార్గాలను వదలి, కొత్తమార్గాలు త్రొక్కి, అక్బరునిర్మించినదాన్ని చాలవరకు పడగొట్టివేశాడు. కాని అతనిదుశ్చర్యలూ, అతనితరువాతివారి అసమర్థతలూ ఎంతటివైనా కూడా, అక్బరునిర్మించినభావంపట్ల గౌరవం, భక్తి కొనసాగుతూనే వచ్చాయి. అట్టిభావం ఉత్తర, మధ్యభారతాల్లోనే వుందిగాని, దక్షిణానికీ, పశ్చిమానికీ వ్యాపించలేదు. అందువల్ల తరువాతిసవాలు పశ్చిమాన్నుంచే రాగలిగింది.

## ౧౨ ఔరంగజేబు కాలచక్రాన్ని వెనక్కుత్రిప్పాడు.
## హిందూజాతీయత పెరుగుదల. శివాజీ

షాజహాన్ ఫ్రాన్సునుపరిపాలిస్తున్న "మహనీయచక్రవర్తి" 14వ లూయీకి సమకాలికుడు. మధ్యయూరపులో 30యేండ్లయుద్ధం సాగుతోంది. అక్కడ వర్సెయిల్స్ నిర్మింపబడుతూండగా, ఇక్కడ ఆగ్రాలో తాజమహలు, ముత్యపుమసీదు పైకిలేచాయి. ఢిల్లీలో జుమ్మామసీదూ, చక్రవర్తిదేవిడీలో దివాన్-ఇ-ఆమ్, దివాన్-ఇ-ఖాస్లూ రూపొందాయి. దేవతాసౌందర్యంగల యీ మహత్తరభవనాలు మొగలాయి ప్రతిభకు చిహ్నాలు. మయూరసింహాసనంగల ఢిల్లీఆస్థానం వర్సెయిల్స్ కంటె శోభాయమానంగాను, భోగనిలయంగాను ఉండేది. వర్సెయిల్స్ వలెనే యిదికూడా సర్వమూ దోచుకోబడిన నిరుపేదప్రజానీకంమీదనే నిలబడింది. గుజరాతులోను, దక్కనులోను భయంకరక్షామం తాండవించింది. ఈలోపున ఇంగ్లండునౌకాబలం వృద్ధిచెంది, దశదిశలా వ్యాపిస్తున్నది. అక్బరు యూరోపియనులలో పోర్చుగీసువారిని మాత్రమే యెరుగును. అతనికుమారుడైన జహంగీరుకాలంలో బ్రిటిష్నౌకాబలం భారతసముద్రాల్లోని పోర్చుగీసుశక్తులను ఓడించింది. ఇంగ్లండురాజైన 1వ జేమ్సు రాయబారిగా సర్ థామస్ రో 1615లో జహంగీరుఆస్థానంలో ప్రవేశించాడు. అతడు కొన్ని ఫేక్టరీలు నిర్మించుకునేందుకు చక్రవర్తిఅనుమతిని సంపాదించగలిగాడు. సూరతులో ఒకఫేక్టరీ నిర్మింపబడింది. 1639లో మద్రాసు నిర్మాణం ఆరంభమైంది. తరువాత వందసంవత్సరాలవరకు భారతీయులెవ్వరూ బ్రిటిష్వారికి ఎట్టి ప్రాముఖ్యత నివ్వలేదు. బ్రిటిష్వారు సముద్రాధిపత్యాన్ని సంపాదించినా, పోర్చుగీసువారిని తరిమివేసినా, మొగలుచక్రవర్తులకు, మంత్రులకు వాటిప్రాముఖ్యత అర్థంకాలేదు. ఔరంగజేబుపాలనలో మొగలుసామ్రాజ్యశక్తి క్షీణించిపోవడం స్పష్టంగా తెలుస్తున్నప్పుడు, బ్రిటిష్వారు యుద్ధంద్వారా భారతదేశంలో తమఆక్రమణలను విస్తృతంచేసుకోవాలనేయెత్తువేశారు. ఇది 1685లో జరిగింది. ఔరంగజేబు వయ

సుతోపాటు బలహీనతకూడ పెరుగుతున్నా, శతృవులు చుట్టుముట్టి చీకాకుపరుస్తున్నా, బ్రిటిష్‌వారిని ఓడించగలిగాడు. ఇంతకుముందే ఫ్రెంచివారు ఇండియాలో కాలూని నిలబడ్డారు. భారతదేశపు రాజకీయార్థికశక్తులు వేగంగా పతనమవుతూన్న ఆకాలంలో పొంగిపొరలుతున్న యూరపుశక్తులు ఇండియాలోను, తూర్పుదేశాల్లోనూ వ్యాపించసాగాయి.

14వ లూయీ సుదీర్ఘపాలన కొనసాగిస్తూ, ఫ్రాన్సు విప్లవానికి బీజాలునాటుతున్నాడు. ఇంగ్లండులో పైకిలేస్తున్న మధ్యతరగతిప్రజలు తమ రాజు తల నరికివేశారు. క్రాంవెల్ నిర్మించిన స్వతంత్రప్రభుత్వం ఒకవెలుగువెలిగి ఆరిపోయింది. 2వ ఛార్లెస్ రాజుగా రావడం, పోవడం కూడా జరిగిపోయింది. 2వ జేమ్సు దేశాంతరాలకు పారిపోయాడు. చాలవరకు నూతనవ్యాపారవర్గానికి ప్రాతినిధ్యంవహించే శాసనసభ యేర్పడి, రాజు అధికారాలను తగ్గించివేసి, తనఅధికారాధిక్యతను స్థాపించుకుంది.

ఈకాలంలోనే ఔరంగజేబు తనతండ్రి షాజహానును ఖైదులో పెట్టి, అంతఃకలహంలో జయించి, మొగలుసింహాసనాన్ని అధిష్టించాడు. నాటిపరిస్థితులను అక్బరువంటివ్యక్తిమాత్రమే అర్థంచేసుకొని, కొత్తగా తలెత్తుతున్నశక్తుల్ని అదుపులోపెట్టగలిగేవాడు. ఆయనకూడా కొత్తగా యేర్పడుతున్న విధానాలను, ఆర్థికవిధానంలో యేర్పడుతున్న పెద్దమార్పులనూ అర్థంచేసుకోవాలనే జిజ్ఞాస కలిగిఉంటే పూర్తిగా విజయుడయ్యేవాడు, లేక తనసామ్రాజ్యవిచ్ఛిత్తిని మరికొంతకాలం మాత్రమే వాయిదావేయగలిగేవాడు. ఔరంగజేబు వర్తమానస్థితిని అవగాహనచేసుకోలేకపోవడమేగాక, తనకు కొంచెంముందే జరిగిన చరిత్రనుకూడా గుర్తించలేని గుడ్డివాడుగా ప్రవర్తించాడు. అతడు పూర్తిగా వెనుకచూపుమనిషి. ఎంతో సామర్థ్యం, పట్టుదల కలవాడైనా, వాటిని తనపూర్వులకృషిని వినాశనంచేసేందుకే వినియోగించాడు. వ్యక్తిగా అతి ఛాందస పవిత్రజీవితం గడపినవాడు. కళా, సారస్వతాల యందు ఆసక్తి లేదు. తన హిందూప్రజలపై ద్వేషపూరితమైన జిజియా పన్నువేసి, వారిదేవాలయాల్ని ధ్వంసంచేసి, తన ప్రజల్లో ఎక్కువ మందికోపానికి కారణమయ్యాడు. మొగలుసామ్రాజ్యానికి మూల

స్తంభాలవంటి రాజపుత్రులకు కష్టంకలిగించాడు. ఉత్తరాన హిందూ, ఇస్లాంమతాల సమ్మేళన వంటి ప్రశాంతదృక్పథం అలవరచుకున్న శిఖ్కులను బలవంతంగా మతాంతరులను చేయనెంచి, రెచ్చగొట్టి, వారంతా బలమైన సైనికకూటంగా యేర్పడేటట్లు చేశాడు. పశ్చిమతీరానికి సమీపానగల రాష్ట్రికూటులజాతీ, క్షాత్రవంతులూ ఐన మహారాష్ట్రులతో కయ్యంపెట్టుకున్నాడు. అప్పుడే వారిలో ఒక మహానాయకుడు తలెత్తాడు.

విశాల మొగలుసామ్రాజ్యంలోని అన్ని ప్రాంతాల్లోనూ పునరుద్ధరణోత్తేజం పొంగుతోంది. మత, జాతీయతామిశ్రమలక్షణాలు పెంపొందుతున్నాయి. ఆ జాతీయవాదం నేటివలె మతనిమిత్తంలేనిదిగాని, దేశవ్యాప్తిచెందినదిగాని కాదు. అందులో భూస్వామికదృక్పథం, ప్రాంతీయతత్వం, మతదురభిమానం పాదుకొనివున్నాయి. రాజపుత్రులు అందరికంటె ఫ్యూడల్‌దృక్పథం ఎక్కువగా కలవారు; తమతమ వంశాల పట్లమాత్రమే భక్తిగలవారు. శిఖ్కులు అల్పసంఖ్యాకులై, తమను తాము రక్షించుకోవడంలోనే నిమగ్నులైవుండక తప్పనందున వారిదృష్టి పంజాబునుదాటలేదు. కాని ఇండియాలో మతానికి బలీయమైన జాతీయభావముండి, మతసాంప్రదాయాలకు దేశవ్యాప్త సంబంధాలు వున్నాయి. "ఇండో-యూరోపియన్ కుటుంబంలో భారతీయులు మాత్రమే ఒక జాతీయమతాన్ని (బ్రాహ్మణీయము), ఒకప్రపంచ మతాన్ని (బౌద్ధం) సృష్టించగలిగినజాతి. మిగత జాతులన్నీకూడా యీ రంగంలో స్వయంసృజనాశక్తి లేకపోగా, విదేశీవిశ్వాసాలను తమ మతంగా తెచ్చుకున్నట్టివే" నని ప్రొఫెసర్ మేక్డోనెల్ వ్రాశాడు. ఇట్టి మత, జాతీయతా సమ్మేళనము నుంచి శక్త్యుత్సాహాలను పొంది బలపడింది. కాని చివరికి దానిలోతేలిన అసమర్థత, బలహీనతలుకూడా ఆ మిశ్రమంవల్ల పొందినవే. ఆ మతానికి వెలుపలగల విభిన్నశక్తులను యావద్భారతరంగంలో సమీకరించలేని ఏకాకితనం, పక్షపాతదృక్పథం ఈ మిశ్రమజాతీయతలో ఉండనేఉన్నాయి. హిందూ జాతీయవాదం భారతభూమిలో సహజంగా పుట్టి పెరిగినదే. కాని మత, విశ్వాసాలకు అతీతమైన విశాల జాతీయదృక్పథానికి యిది అటంకమే!!

ఒకవిషయంమాత్రం యథార్థం. అది కల్లోలకాలం. మొగలు సామ్రాజ్యం జాతీయ, విజాతీయ సాహసికులచే ఛిన్నాభిన్నంచేయబడు తోంది. ఎవరికివారే తమఆధిపత్యాన స్వతంత్రరాష్ట్రాల్ని ఏర్పర్చుకో వాలని ప్రయత్నిస్తున్నారు. అందువల్ల ఇప్పటిఅర్థంలో జాతీయవాదాన్ని ఏకోణంలోచూచినా ఆనాడు కనుపించదు. ప్రతిసాహసికుడు, లేక సాహసికులకూటమి తన అధికారాన్ని సుసంఘటితంచేసుకోవాలని ప్రయత్నించారు. మనకు లభించిన చరిత్రనుబట్టి యిందులో ప్రతి ఒక్కడూ తన, లేక తనకూటమి లక్ష్యాలకే ప్రాముఖ్యతనిచ్చాడు గాని, యీ సంఘటనలవెనుక అంతర్గతంగాజరుగుతున్నదాన్ని గ్రహిం చడానికి ప్రయత్నించలేదు. అనేకమందిసాహసికుల సాహసప్రదర్శనాభి లాష, సంతృప్తులకోసమే యీ సాహసప్రయత్నాలు జరుగలేదనీ, అంతకంటే ఉన్నతలక్ష్యంకూడా ఉండవచ్చుననీ తోస్తుంది. ప్రత్యేకంగా మహారాష్ట్రుల్లో యీ ఉన్నతభావన ఉండి, వారిబలం పెరగడంతో పాటు, యీఉన్నతభావనకూడా పెరిగింది. 1784లో వారెన్ హేస్టింగ్సు ఇలా వ్రాశాడు: "హిందూస్తానము, దక్కనులలో అన్ని తెగలవారి కంటె మహారాష్ట్రులకు మాత్రమే జాతీయసిద్ధాంతంతో ఎక్కువ సంబంధంవుంది. ఈభావం జాతిలోని ప్రతివ్యక్తిమీద గాఢముద్రవేసింది. దేశస్థితికి ప్రమాదంసంభవిస్తే, సార్వజనికప్రయోజనంకోసం అన్ని తెగల నాయకుల్నీ యీ జాతీయభావం ఏకంచేయవచ్చు." బహుశా వారి జాతీయభావం మహారాష్ట్రప్రాంతంవరకే పరిమితమై ఉండవచ్చును. ఏమైనప్పటికీ మహారాష్ట్రులు సైనిక, రాజకీయవిధానాల్లోను, అలవాట్ల లోను సౌభ్రాతృత్వభావం ఎక్కువగా కలవారు. వారిలో ఒకవిధమైన ప్రజాస్వామికలక్షణంకూడా ఉంది. ఈ లక్షణాలన్నీ వారికి ఎనలేని బలాన్ని చేకూర్చాయి. శివాజీ ఔరంగజేబుతోయుద్ధంచేసినప్పటికి, అనేకమంది ముస్లిములకు ఉద్యోగాలిచ్చాడు.

మొగలుసామ్రాజ్యపతనానికి మరొకముఖ్యకారణం ఆర్థికస్థితి భగ్నంకావడమే. రైతులు అనేకసార్లు భారీయెత్తున తిరుగుబాటుచేశారు. రాజధానికిదగ్గరలోవున్న 'జాట్' రైతులు ఢిల్లీప్రభుత్వానికి వ్యతిరేకంగా 1669నుంచీ అనేకసార్లు తిరుగుబాటుచేశారు. మరొకసారి "సత్నా మీయు"లనే పేదప్రజలు విప్లవం జరిపారు. వీరినిగూర్చి "స్వర్ణకారులు,

వడ్రంగులు, పాకీపనివారు, చర్మకారులు మొదలగు హీనజాతుల నిర్భాగ్యులందరూ ముఠాగా, రక్తదాహంతో తిరుగబడ్డా"రని ఒక మొగలాయిరాజపుత్రుడు వర్ణించాడు. అంతవరకు రాజకుమారులూ, రాజోద్యోగులు, అగ్రవర్గాలు మాత్రమే తిరుగుబాట్లుజరుపగా, ఇప్పుడు కొత్తరకం విప్లవాలు ఆరంభమయ్యాయి.

ఈ విరోధాలూ, తిరుగుబాట్లతో సామ్రాజ్యం సతమతమవుతూండగా పశ్చిమభారతంలో మహారాష్ట్రల నూతనశక్తి పెంపొందుతూ, సంఘటితమవుతోంది. 1627లో పుట్టిన శివాజీ దృఢకాయులైన ఆ పర్వతవాసులకు తగిన సమర్థతగల గెరిల్లానాయకుడయ్యాడు. అతని అశ్వికసైన్యం దేశమంతటా విజయయాత్రలుచేస్తూ, ఇంగ్లీషువారు ఫేక్టరీనిర్మించుకున్న సూరతును కొల్లగొట్టి, మొగలుసామంతరాజ్యాల్లో ఎంతోదూరానగలవాటిపైనకూడా "చౌతు"పన్ను విధించి వసూలు చేసింది. శివాజీ పునర్విజృంభిస్తున్న హిందూజాతీయవాదానికి ప్రతిబింబం. పురాతన, సనాతనగ్రంథాలచే ఉత్తేజితుడై, ఉత్తమనాయకుని లక్షణాలుకలిగిన అతి ధైర్యశాలి. మహారాష్ట్రలను సైనికకూటమిగా ఏకంచేసి, మొగలుసామ్రాజ్యాన్ని బ్రద్దలుచేసే బలవత్తరశక్తిగా రూపొందించాడు. ఆయన 1680లో మరణించినా, మహారాష్ట్రశక్తి ఇండియాఅంతటా వ్రాకేవరకు బలవత్తరంగానే ఉంది.

## ౧౩ ఆధిపత్యానికై మహారాష్ట్ర, బ్రిటిష్‌శక్తుల పెనగులాట - బ్రిటిష్ విజయం

1707లో ఔరంగజేబు మరణించాడు. తర్వాత నూరేండ్లవరకు భారతదేశంపై ఆధిపత్యంకోసం అనేకరకాలపెనగులాటలు జరిగాయి. మొగలుసామ్రాజ్యం శరవేగంతో ఛిన్నాభిన్నమైపోయింది. దాని సామంతులూ, వుపసామంతులూ, ప్రతినిధులూ అర్ధస్వాతంత్ర్యమేగల పాలకులుగా తమతమప్రాంతాలనుయేలసాగారు. ఢిల్లీసింహాసనంపైనున్న మొగలువంశీయుడు బొత్తిగా బలహీనుడూ, ఇతరులచేతుల్లోకీలుబొమ్మ అయినా, ఆ సింహాసనానికిగల గౌరవప్రపత్తులవల్ల ఇప్పు డేర్పడిన స్వతంత్రపాలకులందరూ ఎంతో కొంత కప్పం చెల్లిస్తూ తమప్రభుభక్తిని

వెల్లడించారు. ఈ సామంతపాలకులకు సర్వాధిపత్యానికై ప్రయత్నిస్తున్న శక్తుల్ని బలపరచడమో లేక అడ్డగించడమో తప్ప, నిజమైనశక్తి, ప్రాముఖ్యతలు లేవు. హైదరాబాదు దక్షిణాన కీలకమైనప్రదేశంలో వుండడంవల్ల, దాని నైజాము (పాలకునిబిరుదు) మొదట్లో ప్రాముఖ్యం గలవాడుగా కన్పించాడు. కాని విదేశీశక్తులచే దిష్టిబొమ్మవలె బింకంగా నిలబెట్టబడ్డవాడేనని త్వరలోనే తేలిపోయింది. ఈ దిష్టిబొమ్మ ద్వంద్వ ప్రవర్తనకూ, ఇతరులదురదృష్టాలుకారణంగా తాను బాగుపడేందుకూ, ఏ ప్రమాదాల్లోను చిక్కుకోకుండా తప్పించుకునేందుకూ ఒక విచిత్ర సామర్థ్యాన్ని మాత్రం కలిగివుంది. సర్ జాన్ షోర్ దాన్ని "పూర్తిగా నీతిబాహ్యమైపోయింది; శక్తిహీనం...తత్ఫలితంగా బానిసరాజ్యం కాగలదు" అని వర్ణించాడు. మహారాష్ట్రులు నైజాము తమ సామంతుడై, కప్పంకడుతున్నవాడు మాత్రమే నని భావించేవారు. (కప్పం చెల్లించకుండా, స్వాతంత్ర్యాన్ని ప్రకటించదలచిన నైజాంయొక్క బలహీన, పిరికిసైన్యాన్ని మహారాష్ట్రులు వెంటనే అణచి, శిక్షించారు.) అతడు పెంపొందుతున్న బ్రిటిష్ ఈస్టిండియాకంపెనీ రెక్కలచాటున దాగి, బానిసయై ఒక ప్రత్యేకరాష్ట్రపాలకుడుగా మనగలిగాడు. వాస్తవానికి హైదరాబాదు చెప్పదగినంత కృషిచేయకుండానే వైశాల్యాన్ని పెంచుకోడానికిగలకారణం బ్రిటిష్‌వారు మైసూరుపాలకుడగు టిప్పుసుల్తానును జయించడమే.

1784 లో హైదరాబాదునైజామునుగురించి వారెన్ హేస్టింగ్స్ యిట్లావ్రాశాడు; "అతనిభూభాగం అతిచిన్నది. పన్నురాబడి తక్కువ. సైనికబలం హేయంగా చూడదగ్గది. ఆతడైనా జీవితంలో ఎన్నడూ వ్యక్తిగతధైర్యాన్ని, సాహసోత్సాహాన్ని ప్రదర్శించినపాపానపోలేదు. పైగా తద్వ్యతిరేకంగా, యిరుగుపొరుగువారిమధ్య యుద్ధాలుకల్పించి, వారిబలహీనతలు, కష్టనష్టాలను ఆసరాగాచేసుకుని తాను లాభం పొందడం, ఆ యుద్ధాల్లో ఏపక్షంతోను సంబంధంలేనివాడుగా తప్పించుకోవడం, తాను యుద్ధంలోయిరుక్కునేందుకుబదులు ఎట్టిఅవమానాలనైనా సహించి, అవమానకరత్యాగాలకైనా సిద్ధపడడం, యివే తన జీవితాదర్శాలుగా బ్రతుకుతున్నవాడు."

అసలు 18 వ శతాబ్దిలో భారతదేశ సర్వాధిపత్యంకోసం పెనగులాడుతున్నవారు నలుగురు. భారతీయులుగా మహారాష్ట్రులూ, హైదరాలీ, అతనికుమారుడు టిప్పుసుల్తాను, విదేశీశక్తులుగా బ్రిటిష్ వారు, ఫ్రెంచివారు. ఈ శతాబ్ది తొలిదశలో యీ నలుగురిలోను మహారాష్ట్రులే విజయులుకాగలరనీ, వారే మొగలుచక్రవర్తులఅనంతరం భారతదేశసర్వాధిపతులు కాగలరనీ తోచింది 1737 లోనే వారిసైన్యం ఢిల్లీసింహద్వారాల్లో కనుపించింది. వారిని ఎదిరించగల మొగవాడే కన్పించలేదు.

వెంటనే (1739లో) వాయవ్యంలో మరొక కల్లోలం బయల్దేరింది. పర్షియాపాలకుడు నాదిర్‌షా చిత్రవధలు, దోపిడీలుచేస్తూ ఢిల్లీ వరకు వచ్చాడు. అనేక భాగ్యరాసులతోపాటు ప్రసిద్ధమయూరసింహాసనాన్నికూడా తరలించుకుపోయాడు. ఢిల్లీపాలకులు పిరికిపందలు, అబలలవంటివారూ, యుద్ధాలంటేఎరుగనివారూ కావడంవల్ల, అతనిదండయాత్ర సులభసాధ్యమైంది. అతడు మహారాష్ట్రుల్నిఎదుర్కొనేఅవసరం కలగలేదు. ఒకవిధంగా అతనిదండయాత్ర మహారాష్ట్రులకు ఎంతో సహాయపడింది. వారు తరువాతసంవత్సరాల్లో పంజాబువరకు తేలిగ్గా జయించగలిగారు. మళ్ళీ భారతదేశ సర్వాధిపత్యం మహారాష్ట్రుల చేతుల్లోకి వచ్చేటట్లే కనిపించింది.

నాదిర్‌షా దాడివల్ల రెండుఫలితాలు కలిగాయి. ఢిల్లీమొగలులు తమకు పరగణా, బలమూ వున్నాయన్నట్లు నటించడం పూర్తిగా ఆగిపోయింది. అప్పటినుంచి వారు తమనుపట్టుకోగలశక్తికలవారిచేతుల్లో కీలుబొమ్మలుగా, భూతాలవలె అధికారాన్ని చెలాయించగల నీడలుగా మాత్రమే పరిగణించబడ్డారు. నాదిర్‌షా రాకముందే వారిస్థితికి దిగజారివున్నా, నాదిర్‌షా తనదండయాత్రతో ఆ పరిణామాన్ని పూర్తి చేశాడు. పూర్తి అయినప్పటికీ ప్రాచీనసాంప్రదాయాచారాలు బలవత్తరమైనవి కావడంవల్ల, బ్రిటిష్ ఈస్టిండియాకంపెనీ, తదితరులు ప్లాసీ యుద్ధకాలంవరకు మొగలుచక్రవర్తిత్వానికి ఆమోదచిహ్నాలుగా వాటికి కానుకలు పంపుకుంటూనే వున్నారు. ఆతరువాతకూడా కుంపిణీవారు తాము ఢిల్లీచక్రవర్తుల ప్రతినిధులమే నన్నట్లు వ్యవహరించేవారు.

1835 వరకు వారు అమల్లోకి తెచ్చిన నాణెములమీద మొగలుచక్ర వర్తులపేర్లే వుండేవి.

నాదిర్‌షాదాడివల్ల కలిగిన రెండో ఫలితం ఆఫ్ఘనిస్థానము ఇండియానుంచి విడిపోవడం. అనేకయుగాలుగా అది యిండియాలో భాగంగా వుంది. ఇప్పుడు నాదిర్‌షారాజ్యభాగంగా విడిపోయింది. కొంత కాలానికి షా ఉద్యోగుల్లో కొందరు కలసి అతన్ని హత్యచేశారు. ఆఫ్ఘనిస్థానము స్వతంత్రరాజ్యమయింది.

నాదిర్‌షావల్ల మహారాష్ట్రులేమీ నష్టపడలేదు. వారు పంజాబు వరకు ప్రాకారు. కాని 1761లో ఆఫ్ఘనిస్థాన్‌ను పాలించుచున్న అహ్మద్ షా దురానీ అనే దండయాత్రికునిచే పానిపట్టువద్ద లజ్జాకరంగా ఓడిపోయారు. ఈ ప్రమాదంలో మహారాష్ట్ర సైనికుల్లో మణులనదగ్గవారు మరణించారు. వారు హిందూసామ్రాజ్యస్థాపననుగురించి కలలుగనడమే కొన్నినాళ్ళు ఆగిపోయింది. క్రమంగా వారు కోలుకున్నారు. మహారాష్ట్ర భూభాగం అనేక చిన్నచిన్న స్వతంత్రరాజ్యాలుగా విడిపోయినప్పటికీ, పూనాలో పీష్వా ఆధ్వర్యాన ఒకేకూటమిగా చేతులుకలిపారు. ఇట్టి మహారాష్ట్రరాజ్యాల పాలకుల్లో గ్వాలియర్ సింధియా, ఇందూరు హోల్కార్, బరోడా గయక్వాడ్‌లు ముఖ్యులు. ఈసంయుక్తరాజ్యంలో కేంద్ర, పశ్చిమభారతాల్లోని చాలభాగం వుంది. కాని పానిపట్టు యుద్ధంలో అహ్మద్‌షాచేత ఓడించబడడంవల్ల మహారాష్ట్రులు బలహీన పడడము, బ్రిటిష్ ఈస్టిండియాకంపెనీ ప్రాంతీయపాలకశక్తిగా తలెత్త డమూ జరిగాయి.

బెంగాల్లో క్లయివు విశ్వాసఘాతుకత్వంతో, దొంగపత్రాలు సృష్టించి, పెద్దయుద్ధకాండ లేకుండానే, 1757 లో ప్లాసీయుద్ధంలో విజయుడయ్యాడు. ఈ సంవత్సరాన్నే భారతదేశంపై బ్రిటిష్‌వారి సామ్రాజ్యాధిపత్యానికి నాంది అంటారు. అది ఒక విషపూరితమైన అనుభవం. దాని చేదు యిప్పటికీ భారతీయుల్ని వదలినట్టులేదు. బ్రిటిషు వారు బెంగాలు, బీహారులను పూర్తిగా వశంచేసుకొన్న వెంటనే (1770 లో) భయంకరమైన క్షామపిశాచి ఆ రెండురాష్ట్రాల్లోనూ స్వైరవిహారంచేసింది. సారవంతము, జనసమృద్ధమైన ఆ విశాలభూభాగంలో మూడవవంతుజనం చచ్చిపోయారు.

దక్షిణ దేశంలో ఈ పెనగులాట ఫ్రెంచి, ఆంగ్లేయశక్తులమధ్య (ఆదిలో) జరిగింది. ఇది ప్రపంచమంతటా ఆ యిరుతెగలకూగల పోరాటాల్లో ఒకభాగం. ఆఖరుకు బ్రిటిష్‌వారే జయించడం, ఫ్రెంచి వారికి ఇండియాలో దాదాపు స్థానంలేకుండాపోవడం జరిగాయి.

ఇండియానుంచి ఫ్రెంచిశక్తి దూరంకాగానే, సర్వాధిపత్యానికి ముగ్గురే నిలిచారు. వారు మహారాష్ట్రకూటమి, ఆంగ్లేయులు, దక్షిణాన బలంగావున్న హైదరాలీ. బ్రిటిష్‌వారు ప్లాసీయుద్ధంలో విజయులైనా, బెంగాలు, బీహారులను ఆక్రమించుకున్నా, వారు బలవత్తర శక్తిగా రూపొంది, ఇండియాఅంతటికీ పాలకులుకాగలరని, ఆనాటి భారతీయుల్లో కొద్దిమందికూడా అనుకొనివుండరు. చూచేవారికి పశ్చిమ, మధ్యభారతాలను యేలుతూ, ఢిల్లీవరకూ వ్యాపించి, ధైర్యానికీ, యుద్ధసాహసాలకూ పేరొందిన మహారాష్ట్రులే అధికశక్తివంతులుగా వున్నారనిపించింది. హైదరాలీ, టిప్పుసుల్తాన్‌లు బ్రిటిషువారికి అరికట్టజాలనిశత్రువులై, ఒకసారి ఈస్టిండియాకంపెనీని నామరూపాల్లేకుండా చేయగలంత దెబ్బతీశారు. అయితే వారు దక్షిణానికే పరిమితమై వున్నందువల్ల, ఇండియాకంతటికీ భవిష్యత్తును నిర్ణయించగలవారు కాలేదు. హైదరాలీ భారతచరిత్రలో గణనీయస్థానంగల ప్రఖ్యాత వ్యక్తి. అతనికి ఒకరకమైనజాతీయభావమూ, ముందుచూపూ, నాయక లక్షణాలూ వున్నాయి. అతడు నిరంతరవ్యాధితో బాధపడుతూకూడా, స్వీయక్రమశిక్షణకులోబడి,ఎట్టిసమస్యలనైనా సంయమనదృష్టితో ఎదుర్కోవడంచూస్తే ఆశ్చర్యంగా ఉంటుంది. బ్రిటిష్‌వారిశక్తి, దానివల్ల ముందుముందురాబోయే ప్రమాదము నౌకాబలంమీదే ఆధారపడిఉన్నవని ఇతరులకంటె ముందేగుర్తించి నౌకాబలాన్ని పెంచి, దృఢంచేయాలని సంకల్పించాడు. భారతరాజులందరూ కలసి యీపనికి పూనుకోవాలనేనమ్మకంతో మహారాష్ట్రులకూ, నైజాముకూ, అయోధ్యనవాబగు షుజాఉద్దౌలాకూ రాయబారాలు పంపాడు. వారేజవాబూ చెప్పలేదు. హైదరాలీ మాల్‌దీవ్‌దీవుల్ని జయించి,దాన్ని స్థావరంగాచేసుకొని,నౌకాబలాన్ని నిర్మించసాగాడు. అతడు సైన్యంతోతరలివెళుతూ దారిలో చనిపోయాడు. అతనికుమారుడైన టిప్పుసుల్తాన్ నౌకాబలాన్ని పెంచడం

కొనసాగించాడు. ఆయనకూడా నెపోలియన్‌కూ, కాన్‌స్టాంటినోపుల్‌లోగల సుల్తానుకూ సందేశాలు పంపించాడు.

ఉత్తరాన పంజాబులో రంజిత్‌సింగ్ ఆధ్వర్యాన సిఖ్ఖు రాజ్యం శక్తివంతంగా తలెత్తి, క్రమంగా కాశ్మీరు, వాయవ్యసరిహద్దురాష్ట్రాలను జయించింది. అది ఒక మారుమూలసరిహద్దుకే పరిమితమైన రాజ్యం కావడంవల్ల, సర్వాధిపత్యంకోసం జరుగుతున్న పెనగులాట లక్షణాలను మార్చలేకపోయింది. 18వ శతాబ్ది సమీపిస్తూండగా ఈ పెనగులాట బ్రిటిష్, మహారాష్ట్రశక్తులమధ్యేననీ, తతిమ్మాప్రాంతాలన్నీ యీ రెండింటిలో ఏదోఒకదానికి సామంతరాజ్యంగాగాని, మైత్రితో కట్టుబడిగాని వున్నాయనీ స్పష్టమైపోయింది.

1799లో బ్రిటిష్‌వారు టిప్పుసుల్తానును (మైసూరురాష్ట్రం) చిత్తుగా ఓడించారు. ఇక చివరిపోరాటమే మిగిలింది. దీన్నిగురించి ఇండియాలో అధికారం నిర్వహించిన బ్రిటిష్‌ప్రముఖుల్లోకల్లా అత్యంతసమర్థుడైన ఛార్లెస్ మెట్కాఫ్ 1806లో యిట్లావ్రాశాడు: "ఇండియాలో బ్రిటిష్, మహారాష్ట్రశక్తులుతప్ప చెప్పుకోదగ్గశక్తులు లేవు. ఇతర రాజ్యాల్లో ప్రతిదీ ఇందులో ఏదోఒకశక్తిప్రభావానికి దాసోహమంటూ వుంటుంది. మనం వెనక్కుతగ్గిన ప్రతిఅంగుళాన్ని మహారాష్ట్రులే ఆక్రమించుకుంటారు." కాని మహారాష్ట్రనాయకులమధ్య కలహాలు చెలరేగాయి. బ్రిటిష్‌వారు యిదే అదననీ, ఒక్కొక్కనాయకుని చీలదీసి, ఓడించగలిగారు. మహారాష్ట్రులుకూడ చివరివరకు గణనీయంగాపోరాడి 1804లో ఆగ్రావద్ద బ్రిటిష్‌వారిని చావుదెబ్బకొట్టారు. కాని 1818 నాటికి పూర్తిగాఓడించబడి మధ్యభారతంలోని నాయకులు బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ సార్వభౌమత్వాన్ని అంగీకరించారు. అప్పుడుబ్రిటిష్‌వారు భారత దేశంలో అత్యధికభాగానికి ఎదురులేని అధిపతులయ్యారు. దేశాన్ని సామంతరాజులద్వారాగాని, కీలుబొమ్మలద్వారాగాని, ప్రత్యక్షంగాగాని పరిపాలించసాగారు. పంజాబు, మరికొన్ని మారుమూల రాష్ట్రాలూ వారిక్రిందికిరాలేదు. కాని ఇండియాలో బ్రిటిష్‌సామ్రాజ్యం నెలకొన్నదనే వాస్తవం అందరికీ తెలిసిపోయింది. తరువాత సిఖ్ఖులతో, గూర్ఖాలతో, బర్మీయులతో జరిగినయుద్ధాలు దేశపటాన్ని పూర్తిగా బ్రిటిష్‌సామ్రాజ్యానికి అంకితంచేశాయి.

## ౧౪ నిర్మాణపద్ధతుల్లో బ్రిటిష్‌వారి ఆధిక్యత, భారతీయులు వెనుకబడడం

ఈకాలంలోజరిగినదాన్ని పునఃపరిశీలిస్తే కొన్ని అనుకూల పరిస్థితులూ, మరికొన్ని అనుకోకుండాసంభవించినఅదృష్టకరవిశేషాలూ మాత్రమే బ్రిటిష్‌వారు ఇండియానంతటినీ పాలించేంతగా బలపడడానికి కారణమయ్యాయని విశదమౌతుంది. వారు అత్యల్పమైన ప్రయత్నంతో, కనులుమిరుమిట్లుగొలిపే ఫలితాలు పొందుతూ గొప్పసామ్రాజ్యాన్నీ, అంతులేనిసంపదల్నీ జయించి, తద్వారా ప్రపంచంలో సాటిలేని సామ్రాజ్యనేత లయ్యారు. జరిగినసంఘటనల్లో ఏఒక్కటి కొంచెం అటోయిటో జరిగివున్నా, వారిఆశలు అణగారిపోయి, కాంక్షలు అంతమయివుండేవనిపిస్తుంది. వారు అనేకసార్లు హైదరాలీ, టిప్పూలచేత, మహారాష్ట్రులచే, సిఖ్ఖులచే, గూర్ఖాలచేత ఓడింపబడ్డవారే. వారి అదృష్టంలో ఏకొంచెం లోపించినా, వారు ఇండియాలో కాలుమోపే స్థానమైనా లేకుండాపోయేవారు. మహాచేతనైతే ఏ కోస్తాప్రాంతాన్ని మాత్రమో చేతుల్లోవుంచుకోగలిగేవారు.

కాని ఆనాటిపరిస్థితులను సునిశితంగాపరిశీలిస్తే ఇట్టిది సంభవించక తప్పని బలవత్తరసూచనలుకూడా కన్పిస్తాయి. అదృష్టం తన్నుకొచ్చిన మాట యథార్థమే. కాని, ఆ అదృష్టాన్ని అందిపుచ్చుకునే తెలివితేట లైనా వుండాలిగదా. మొగలుసామ్రాజ్యవిచ్ఛిత్తి తరువాత ఇండియా అల్లకల్లోల, అనిశ్చితపరిస్థితుల్లో చిక్కుకునివుంది. భారతదేశం అనేక శతాబ్దాలుగా, ఎన్నడూ ఇప్పుడున్నంతబలహీనంగాను అసహాయ స్థితిలోను లేదు. వ్యవస్థాపితమైనశక్తి విచ్ఛిన్నంకావడంతో, రంగాన్ని సాహసికులూ, పాలనాధికారం తమదనే దురాశాపరులూ ఆక్రమిం చారు. అలా సాహసికులుగా బయలుదేరినవారందరిలో విజయసాధ నకు అవసరమైన అనేకలక్షణాలుకలిగివున్నవారు బ్రిటిష్‌వారొక్కరే. వారికిగలలోపం ఒక్కటే. అది వారు ఎంతో దూరదేశాన్నుంచి వచ్చిన విదేశీయులుకావడమే. అయినప్పటికీ ఆ లోపమే వారికి అదృష్టావకాశంకూడా అయింది. వారి నెవ్వరూ అంతగా కనిపెట్టిచూడ లేదు. వారు ఇండియాకు సర్వాధిపతులుకాగలరనికూడా భావించలేదు.

ఇట్టిభ్రమ ప్లాసీయుద్ధానంతరం చాలాకాలంవరకు నిలచివుండడం విపరీతమే. వారు సాధారణవ్యవహారాల్లో ఢిల్లీచక్రవర్తిప్రతినిధులుగా నటించడంకూడా ఈభ్రమకు దోహదమిచ్చింది. వారు బెంగాలునుంచి దోచుకుపోయినసంపదలూ, వారు అవలంబించే విలక్షణవ్యాపారవిధానాలూ చూచినవారు, వారు ధనార్జనకోసంవచ్చినవారే గాని, రాజ్యకాంక్షతో రాలేదని విశ్వసించారు. తైమూరు, నాదిర్‌షాలవలె దోపిడిగాండ్రుగా వచ్చిపోయే తాత్కాలికప్రమాదకారకులేగాని, శాశ్వతంగావుండేవారని అనిపించలేదు.

మొదట ఈస్టిండియాకంపెనీ వ్యాపారకలాపాలకోసమే స్థాపించబడింది. ఆ వాణిజ్యరక్షణకోసమే సైన్యం యేర్పరచుకోబడింది. స్థానిక తగాదాల్లో ఒకరిపైకి మరొకరిని ఉసికొల్పుతూ, ఒకరితోకలసి రెండో వారిని అణచివేస్తూ, ఇతరులదృష్టిలోపడకుండానే, క్రమంగా తన ఆధ్వర్యంలోని భూభాగాలను విస్తృతంచేసుకున్నది. కంపెనీసైన్యం మంచిశిక్షణపొందినదైనందున, అదిచేరినపక్షానికి లాభించడం, వారినుండి ప్రతిఫలంగా కంపెనీ పెద్దమొత్తాలు రాబట్టుకోవడం జరిగింది. ఆవిధంగా కంపెనీశక్తి పెరిగి, సైన్యాలు పెంపొందాయి. ప్రజలు ఈ సైనికుల్ని కిరాయిమనుష్యులుగా భావించేవారు. బ్రిటిష్‌వారు ఎవరిబాగుకోసమో కాక తమమేలుకోసమే అన్నిఆటలాడుతూ, ఇండియాపై రాజకీయాధికారానికి వ్యూహాలుపన్నారని గ్రహించేసరికే వారు దేశంలో బలంగా పాదుకుపోయారు.

అప్పటికి విదేశీవ్యతిరేకత లేకపోలేదు. తరువాత ఆ ద్వేషం మరింత పెరిగింది. కాని యీ వ్యతిరేకత దేశవ్యాపిత జాతీయవాదంగా వ్యాపించలేదు. అప్పట్లో ఫ్యూడల్‌మనస్తత్వము, ప్రభుభక్తి స్థానిక నాయకులవరకే పరిమితంగా వుండిపోయింది. చైనాలో యుద్ధప్రభువుల కాలంలోవలె ప్రజల్లో పేదరికం ప్రాకిపోయింది. ప్రజలు సక్రమంగా జీతంయివ్వగల లేక దోపిడికి అవకాశమిచ్చే సైనికనాయకునిపక్షం వహించకతప్పలేదు. ఈస్టిండియాకంపెనీసైన్యాల్లో భారతీయసిపాయిలే ఎక్కువ. మహారాష్ట్రుల్లోమాత్రం స్థానికనాయకులయందలి భక్తికంటె జాతీయభావం హెచ్చుగా ఉండేది. అదైనా సంకుచితము, పరిమితమూను. వారు శూద్రులగు రాజపుత్రులను హీనంగా చూచుటవల్ల

వారిని నొప్పించారు. వారిని మిత్రులనుచేసుకునేబదులు శత్రువులుగానూ, అసంతృప్తిచెందిన పాలెగాండ్రవలెను చూడవలసివచ్చింది. పీష్వానాయకత్వంలో అంతంతమాత్రపుమైత్రి వున్నా మహారాష్ట్రనాయకుల్లో విద్వేషాలు, తరచుగా అంతఃకలహాలూ ఎక్కువయ్యాయి; క్లిష్టపరిస్థితుల్లో పరస్పరం సహాయపడలేకపోయి, విడివిడిగా ఓడించబడ్డారు.

అయినా మహారాష్ట్రము ఎందరో సమర్థులను, రాజనీతిజ్ఞులను, యుద్ధవీరులను కలిగివుంది. అట్టివారిలో నానా ఫర్నవీసు, మొదటి బాజీరావు పీష్వా, మహాదాజీ సింధియా (గ్వాలియర్), యశ్వంతరావు హోల్కార్, ప్రసిద్ధ వీరనారి రాణి అహల్యాబాయి (ఇందూరు) ముఖ్యులు. మహారాష్ట్రసైనికుల్లో ప్రతిఒక్కరూ క్రమశిక్షణగలవారే. మృత్యువుయెదురైనాసరే తనుబాధ్యతనుంచి వెనుకంజవేసేవారుకాదు. కాని యీ ధైర్యస్థైర్యాలవెనుక (శాంతికాలంలోను, యుద్ధకాలంలోనూ) ఆశ్చర్యంగొలిపేసాహసోత్సాహాలు ఉన్నాయి. వారి ప్రపంచజ్ఞానశూన్యత లజ్జాకరమే. ఇండియాభూగోళవివరాలుకూడా కొద్దిగానే తెలుసు. ఎక్కడెక్కడ ఏమేమిజరుగుతున్నదీ, తమశత్రువు లేమిచేస్తున్నదీ తెలుసుకునేందుకు శ్రమపడేవారుకాదు. ఇట్టి పరిమితజ్ఞానంతో దూరదృష్టిగలరాజనీతిగాని, ప్రయోజనకరమైన వ్యూహప్రణాళికగాని సాధ్యంకాదు. వారు అతివేగంగా తరలి, అంబులవలెతాకడం శత్రువులను నిర్వీరపరచి, భయభ్రాంతుల్ని చేసేది. అనేకసార్లు హఠాత్తుగాపోయి, మీదపడడమే యుద్ధమని భావించేవారు. వారు గెరిల్లావీరులు మాత్రమే. తరువాత తమసైన్యాన్ని మరింత కట్టుదిట్టంగా యేర్పాటు చేసుకున్నారు. అందువల్ల ఆయుధసామగ్రి పెరిగినా, కదలికలో వేగం తగ్గిపోయింది. ఈకొత్తవాటికి వారు సులభంగా అలవడలేకపోయారు. తమనుతాము తెలివిగలవారమని అనుకునేవారు. అది నిజమేకావచ్చు. కాని వారిమేధస్సు పురాతనచట్రాలలోనే బంధింపబడినందువల్ల, శాంతి సమయంలోగాని, యుద్ధంలోగాని వారిని అధిగమించడం కష్టం కాదు.

విదేశీసైన్యాల ఉత్తమక్రమశిక్షణ, సాంకేతికనైపుణ్యాలను భారతీయపాలకులు ప్రారంభంలోనే గమనించకపోలేదు. వారు తమసైన్యాల తరిఫీతుకు ఫ్రెంచి, ఆంగ్లఅధికారుల్ని నియమించుకున్నారు. ఆ ఉభయ

విదేశీయుల వైరభావం భారతీయసైన్యాలను నిర్మించేందుకు ఎంతో వుపయోగపడింది. హైదరాలీ, టిప్పులు ఆంగ్లేయులనెదుర్కొనేందుకు సముద్రబలాన్ని చేకూర్చుకోవలసిన ఆవశ్యకతను చాలా ఆలస్యంగా గుర్తించి, నౌకాబలనిర్మాణానికి విఫలయత్నాలు చేశారు. మహారాష్ట్రులుకూడా యిట్టి అల్పప్రయత్నం చేశారు. అప్పటికే భారతదేశం నౌకానిర్మాణంలో ముందంజవేసింది. కాని నిరంతరవ్యతిరేకతవుండగా స్వల్పకాలంలో నౌకాబలాన్ని నిర్మించుకోవడం సాధ్యమయ్యేపనికాదు. ఫ్రెంచివారిఓటమితో భారతీయసైన్యాలకు శిక్షణయిస్తున్న ఫ్రెంచివారు కూడా వెళ్ళిపోవలసివచ్చింది. ఇక మిగిలిన బ్రిటిష్‌వుద్యోగులు క్లిష్ట సమయాల్లో యజమానులను వదలిపెట్టడమో, స్వామిద్రోహంచేసి ఎదిరిపక్షం (బ్రిటిష్‌వారు)తో సైన్యము, డబ్బుతోసహా చేరిపోవడమో జరిగేది. ఈవిధంగా విదేశీశిక్షకులమీద ఆధారపడడంవల్ల భారతీయ సైనికనిర్మాణం వెనుకబడివున్నదనీ, ఆ శిక్షకులు నమ్మదగినవారుకాకపోవడంవల్ల దేశానికి ఎడతెగనిప్రమాదాలుకూడ వాటిల్లినట్లు కన్పిస్తుంది. భారతీయపాలకులఉద్యోగుల్లోను, సైన్యాల్లోకూడా బ్రిటిష్‌వారి బలమైనపంచమాంగదళం ఎప్పుడూ వుండేది.

మహారాష్ట్రులు ఒకే భూభాగానికిచెంది, సామూహికదేశభక్తి కలిగివున్నా పౌర, సైనికవ్యవస్థలనిర్మాణంలో వెనుకబడిఉన్నారు. మిగత దేశీయపాలకులు మరింత వెనుకబడిఉంటారు. రాజపుత్రులు ఎంతధైర్యవంతులయినా, పురాతన భూస్వామ్యపద్ధతిని విడువక, అసమర్థపువ్యవస్థలతో, అంతఃకలహాలతో లుకలుకలాడుతున్నారు. వారిలో చాలమంది ప్రభుభక్తిపరాయణులగుటవల్ల, కొంతవరకు అక్బరు రాజనీతిఫలితంగాను నశించిపోతున్న ఢిల్లీచక్రవర్తులపక్షమే వహించారు; మరీ దుర్బలమైన ఢిల్లీసింహాసనం దీనివల్ల మేలు పొందలేకపోయింది. రాజపుత్రులు బలహీనులై, యితరులచేతుల్లో కీలుబొమ్మలైపోయారు. తుదకు మహారాష్ట్రిడగు సింధియాపక్షంలో పడిపోయారు. వారిలో ముఖ్యులుకొందరు స్వరక్షణార్థం మొగ్గుఉన్న వైపుచూస్తుండేవారు. ఉత్తర, మధ్యభారతాల్లోగల వివిధముస్లింపాలకులుకూడ రాజపుత్రులవలె భూస్వామికమనస్తత్వంగలవారే. వారు,

ప్రజలతత్తరపాటును, దుఃఖాలను అధికంచేయడంతప్ప చేసినదేమీ లేదు. కొందరు మహారాష్ట్రులఆధిపత్యాన్ని అంగీకరించారు.

గూర్ఖాలు (నేపాలు) మంచిక్రమశిక్షణగల సైనికులు. ఈస్టిండియాకంపెనీతయారుచేసిన ఏసైనికులకు తీసిపోరు. వారిది ప్రాచీన భూస్వామ్యవ్యవస్థఅయినా, మాతృభూమిపట్ల వారిప్రేమ అపారము. ఈ భావమే వారిని తమ మాతృదేశరక్షణకు ఉగ్ర యోధులుగా తయారు చేసింది. వారు బ్రిటిష్‌వారిని గడగడలాడించారు. కాని ఇండియాలోని ప్రధానపోరాటంలో వారిధైర్యసాహసాలేమీ మార్పు తేలేదు.

మహారాష్ట్రులు తాము వ్యాపించిన మధ్య, ఉత్తరభారతభూ భాగాలనన్నింటినీ సంఘటితపరచుకోలేదు. వారు వచ్చి, వెళ్ళేవారు. కాని ఎక్కడా ప్రవేళ్ళూనుకోలేదు. ఆనాటిపరిస్థితుల్లో ఎవరూ ఒకచోట నిలద్రొక్కుకోలేకపోయారు. నిరంతరం యుద్ధఫలితాలు తారుమారవుతూండడమే అందుకుకారణం. నిజానికి బ్రిటిష్‌వారిక్రిందఉన్న అనేకప్రాంతాల్లోను, వారిఆధిపత్యాన్ని అంగీకరించినప్రాంతాల్లోకూడ పరిస్థితి మరింత అధ్వాన్నంగా ఉంది. అక్కడ బ్రిటిష్‌వారుగాని, వారిఅధికారం గాని స్థిరపడలేదు.

మహారాష్ట్రులూ, ఇండియాలోనితదితరశక్తులూ తమపద్ధతుల్లో కొత్తఉబలాటమూ, సాహసోత్సాహములు గలవారు మాత్రమే కాగా భారత దేశంలోనిబ్రిటిష్‌వారు అదే వృత్తిగా గలవారు. బ్రిటిష్‌నాయకులనేకమంది సాహసికులే, కాని వారందరూ వేర్వేరురంగాల్లో ఏలక్ష్యసిద్ధికి పనిచేస్తున్నారో ఆ పనిలోమాత్రం వారిదుందుడుకుతనం ఉండేది కాదు. "ఈస్టిండియాకంపెనీవ్యవహారనిర్వాహణకు భారతీయసంస్థానాల్లో పనిచేస్తున్నఉద్యోగుల్లో ఇంతవరకు బ్రిటిష్‌సామ్రాజ్యానికి ఏనాడూ లేనటువంటి సమర్థులు అనేకమంది వున్నారు"అని ఎడ్వర్డ్ థాంసన్ వ్రాశాడు. స్వదేశీరాజులవద్ద రెసిడెంటులుగా వుండేవారి ముఖ్యబాధ్యత మంత్రులనూ, ముఖ్యోద్యోగులనూ లంచాలిచ్చి, చెరచడమే. వారి వేగుపద్ధతి సార్థవమైనదని ఒక చరిత్రకారుడు వ్రాశాడు. బ్రిటిష్‌వారు తామేంచేస్తున్నారో, ఏంచేయబోతున్నారో ఏమాత్రం తెలియనీయకుండానే, తమ వేగులద్వారా ఎదుటివారి ఆస్థాన, సైనికవివరాలు పూర్తిగా తెలుసుకునేవారు. బ్రిటిష్‌వారి పంచమాంగదళం నిరంతరం

పనిచేస్తూవుండేది. క్లిష్టపరిస్థితుల్లోనూ, యుద్ధముమ్మరంలోనూ వారు స్వామిద్రోహులై, బ్రిటిష్‌వారికి మేలుచేకూర్చటంలో అంతా తారు మారయ్యేది. బ్రిటిష్‌వారు ప్రత్యక్షపోరాటాలకు ముందే అనేక యుద్ధాల్లో గెలిచారు. ప్లాసీయుద్ధంనుంచి, సిఖ్ఖులయుద్ధాలవరకు యిదేతంతు జరిగింది. స్వామిద్రోహానికి ఒక ఉదాహరణ: సింధియా (గ్వాలియర్) ప్రధానాధికారుల్లో ఒకముఖ్యుడు, రహస్యంగా బ్రిటిష్ వారితో ఒప్పందంచేసుకొని, యుద్ధసమయంలో సైన్యంతోసహా బ్రిటిష్ వారితో చేరిపోయాడు. ఇందుగ్గాను బ్రిటిష్‌వారు, ఈ స్వామిద్రోహికి ఆ సింధియారాజ్యంలోనే కొంతభాగాన్ని ఒక సంస్థానంగా మార్చి, దానికి పాలకుడుగా నియమించారు. ఆ సంస్థానం యిప్పటికీ వుంది. కాని దాని ఆనాటిపాలకునిపేరుమాత్రం స్వామిద్రోహానికి మారుపేరుగా –నేటిక్విస్లింగులవలె – వాడబడుతోంది.

ఆవిధంగా బ్రిటిష్‌వారు గొప్ప రాజకీయ, సైనికనిర్మాణం కలిగి సమర్థులైన నాయకులతో సంఘటితమైవున్నారు. వారికి ఎదుటివారికంటె బాగా తెలుసు. ఇండియాలోని స్థానికశక్తులస్పర్థలను, అనైక్యతను బ్రిటిష్ వారు పూర్తిగా వుపయోగించుకున్నారు. వారి మూలశక్తులకు, సముద్రాధిపత్యం ఎంతో తోడయింది. తాత్కాలికంగా ఓడిపోయినా మరల పుంజుకొని, తిరిగి యుద్ధానికి పూనుకునేవారు. ప్లాసీయుద్ధానంతరం బెంగాలువశంకావడంతో విపరీతమైన సంపద, నిక్షేపాలూ లభించాయి. ఆ ఆసరాతోనే మహారాష్ట్రులు, తదితరులతో, యుద్ధాలు కొనసాగించగలిగారు. ప్రతికొత్తవిజయంతోను వారి సంపదలు, పెంపొందినాయి. భారతీయశక్తులకు ఒక్కఓటమితోనే ధ్వంసమూ, కోలుకోలేనిపతనమూ సంభవించేవి.

ఈ యుద్ధాలు, విజయయాత్రలు, దోపిళ్ళకాలంలో మధ్యభారతం, రాజపుత్రస్థానం, పశ్చిమ – దక్షిణాల్లోకొన్నిభాగాలూ, పీనుగుపెంటలై అష్టకష్టాలతో, దుర్భరదారిద్ర్యంతో మరుభూములైపోయాయి సైన్యాలు జయిస్తూ పోతూంటే, వారివెనుక పట్టపగటిదొంగలు వచ్చిపడేవాళ్ళు. ఎవరూ దీనప్రజానీకాన్నిగురించి ఆలోచించేవారుకాదు. పైగా వారిధనము, సామగ్రి, దోచుకుపోయేవారు. 30 సంవత్సరాలయుద్ధకాలంలోమధ్యయూరపులో జరిగినట్లే నాటి ఇండియాలోని పైప్రాం

త్తాల్లోను జరిగింది. పరిస్థితులు దేశమంతటా శోచనీయంగా వున్నాయి కాని బ్రిటిష్‌వారిక్రిందికివచ్చిన ఈ ప్రాంతాలు మరింత హేయంగా ఉన్నాయి......"...మద్రాసు రాష్ట్రంగాని, అధీన సంస్థానాలైన అయోధ్య, నైజాముప్రాంతాలుగాని ఊహించలేనంత నరకకూపాలుగా తయారయ్యాయంటే విపరీతమేమీకాదు. వీటితోపోల్చితే నానాఫర్న వీసు (మహారాష్ట్రనాయకుడు) పాలిస్తున్నభూభాగం ఎడారిలో సారవంతమైనభూమివంటిదనీ, అక్కడ ప్రజాభద్రత సురక్షితంగా ఉందనీ చెప్పాలి" అని సర్ ఎడ్వర్డ్ థాంప్సన్ వర్ణించాడు.

ఇంతకుముందు, మొగలుసామ్రాజ్యం విచ్ఛిన్నమైపోయినా, దేశంలోని అనేకప్రాంతాలు ఏమాత్రం అశాంతీ లేక శాంతిననుభవిస్తున్నాయి. బెంగాలులో మొగలుప్రతినిధి అల్లావర్ది కాలంలో అనేకసంవత్సరాలపాటు ప్రశాంతినెలకొనివున్నందున, చక్కనిపాలన కొనసాగుతూ, వర్తక-వాణిజ్యాలు పెంపొంది రాష్ట్రసంపదలకు మరింతసంపద కలిసింది. అల్లావర్ది మరణానంతరం అనతికాలానికే (1757 లో) ప్లాసీ యుద్ధం జరిగింది. ఈస్టిండియాకంపెనీ సర్వస్వతంత్రమై, తనయిచ్చవచ్చినట్లుచేయగలిగివుండికూడా ఢిల్లీ చక్రవర్తిప్రతినిధులుగా తమ్మెతాము ఏర్పరచుకున్నారు. కంపెనీపేరుతోను దానిప్రతినిధులు, గుమాస్తాలపేర బెంగాలు నిలువునా దోచుకోబడింది. తర్వాత ప్లాసీయుద్ధానంతరం కొద్దియేండ్లకే రాణీఅహల్యాబాయి మధ్యభారతంలోని ఇందూరును 30 ఏండ్లపాటు (1765-1795) పరిపాలించింది. ఆమెకాలంలోని శాంతిభద్రతలు, సుపరిపాలన, ప్రజలసౌభాగ్యమూ నేటికీ కథల్లాగా చెప్పకోబడుతున్నాయి. ఆమె సమర్థతగలపరిపాలకురాలు; బ్రతికివుండగా అత్యంతగౌరవంతో చూడబడడమేగాక, మరణానంతరం దేవతవలె కొలువబడింది. బెంగాలు, బీహారులు బ్రిటిష్‌వారి క్రొత్తపాలనలో ఎప్పుడూ దోపిళ్ళకూ, రాజకీయార్థికకల్లోలాలకూ గురియై, క్షీణించి, కరువుకాటకాలపాలైవుండగా - మధ్యభారతం, మరికొన్నిప్రాంతాలు సుఖసౌభాగ్యాలతో విరాజిల్లుతున్నాయి.

బ్రిటిషువారికి శక్తి, సంపదలు వున్నాయి. కాని సత్పాలనకుగాని, మరి ఎటువంటి 'పాలన'కుగాని బాధ్యత తమదేనని వారు అనుకోలేదు. ఈస్టిండియాకంపెనీవర్తకులకు, తమలాభాలపట్ల, సంపదలపట్లనే

శ్రద్ధేగాని, తమపాలనక్రిందికివచ్చినవారి మేలుగాని లేక కనీసం భద్రతకు గాని శ్రద్ధలేదు. ప్రత్యేకంగా వారిఅధీనసంస్థానాల్లో అధికారానికీ, బాధ్యతకూ సంబంధంలేకుండా విడాకులిచ్చుకున్నట్లయింది.

బ్రిటిషువారు మహారాష్ట్రులవిషయంలో తెరపినిబడి విజయాలతోసుస్థిరులై, తమదృష్టిని షౌరపాలనవైపు మరల్చుటతో, కొంతవరకు క్రమపద్ధతి యేర్పడింది. ఏమైనప్పటికి, సామంతరాజ్యాల్లో మార్పులు అతి నెమ్మదిగా జరుగుతున్నాయి. రక్షకరాజ్యాలనబడే యీ సంస్థానాల్లో అధికారానికీ, బాధ్యతకూ శాశ్వతంగా విడాకులివ్వడం జరిగింది.

"బ్రిటిష్‌వారు ఇండియాను కల్లోలము, అరాజకాలనుంచి రక్షించా"రని మనంమరచిపోతామేమోనన్నట్లు, పదేపదే జ్ఞాపకంచేస్తుంటారు మహారాష్ట్రులు "భయంకరకాలం" అని పిలచిన యీతరంతరువాత, బ్రిటిష్‌వారు క్రమపాలననేర్పరచినంతవరకు అది నిజమే. కాని ఆ కల్లోలాన్నీ, అరాచకాన్నిసృష్టించినబాధ్యులు కొంతవరకు ఈస్టిండియాకంపెనీవారూ,వారిభారతదేశప్రతినిధులే. సర్వాధిపత్యానికై జరిగిన పెనగులాట సమసిపోయినతర్వాత ఏ భారతీయశక్తి విజయంపొందినప్పటికీ ఆ కల్లోలాన్నీ, అరాచకాన్నీఅణచివేసి క్రమపాలన, శాంతి, భద్రతలను నెలకొల్పివుండేదనికూడా భావించవచ్చు. బ్రిటిష్‌వారు ఆదుర్దాతో యిట్లా ఉద్ధరించవలసినఆవశ్యకత లేదు. అట్టి పరిణామాలు చరిత్రలో, ఇతరదేశాలలోవలెనే భారతదేశంలో గత అయిదువేల ఏండ్లచరిత్రలో జరిగినట్లు తెలిసినదే.

## ౧౫ రంజిత్‌సింగ్, జైసింగ్

భారతీయులు వెనుకబడిఉండడంవల్ల, బ్రిటిష్‌వారు అభివృద్ధి చెందిన సాంఘికవ్యవస్థకుచెందినవారవడంచేత, భారతదేశం విదేశీదండయాత్రకు తలఒగ్గవలసివచ్చిందనేది సుస్పష్టం. రెండుపక్షాలనాయకులకు వున్న వ్యత్యాసం బాగా కనబడేది. సమర్థులేఅయినా భారతనాయకులు సంకుచితపరిధిలోనే ఆలోచించి, పనిచేయడంవల్ల బయట ఏం జరుగుతోందో తెలుసుకోలేకపోయారు. అందుచేత మారేపరిస్థితులకు అనుగుణంగా మారలేకపోయారు. ఏకొద్దిమందికో చైతన్యంకలిగినా ఈ

బంధాలను తెంచుకుని, తాము, మిగిలినప్రజలు గూడా బయటపడలేక పోయారు. తమ దేశంలోనూ, ఫ్రాన్సు, అమెరికాలలోనూ జరిగిన విషయాలను చూచి, మేల్కొని కొత్తపద్ధతుల్లో ఆలోచించితీరవలసిన పరిస్థితి బ్రిటిష్‌వారికి ఏర్పడింది. వారు ఎక్కువప్రపంచజ్ఞానంకలవారు. వారు తమ దేశంలోను, ఫ్రాన్సు, అమెరికాల్లోను జరిగిన ఘటనలనుగూర్చి ఆలోచింపవలసినవారైనారు. రెండు గొప్పవిప్లవాలు సంభవించాయి. ఫ్రెంచివిప్లవసైనికులయొక్క నెపోలియనుయొక్క యుద్ధాలు, యుద్ధవిద్యను పూర్తిగా మార్చివేశాయి. స్వదేశంలో ఏమీ తెలియనివారుగా పరిగణింపబడి భారతదేశానికివచ్చిన ప్రతి ఆంగ్లేయుడు తనప్రయాణంలో ప్రపంచంలో వివిధదేశాలనుచూచి వచ్చేవాడు. మహత్తరపరిణామాల ప్రాముఖ్యతను కొద్దిమందే గుర్తించినా, పారిశ్రామికవిప్లవానికి ముందే ఇంగ్లండులో గొప్పపరిశోధనలు జరుగుతున్నాయి. కాని మారేస్వభావం బలీయమై ప్రజలను మారుస్తోంది. సుదూరమైన విదేశాలకు బ్రిటిష్‌వారిని పంపి విస్తరింపజేసేశక్తి వీటన్నిటివెనకాల పనిచేస్తున్నది.

భారతదేశచరిత్రలు వ్రాసినవారు ఎంతసేపూ యుద్ధాలను గురించీ, తగాదాలనుగురించే తేదీలతోసహా వ్రాశారు. అప్పటిరాజకీయ సైనికనాయకులే వారివ్రాతలలో కనబడుతారు. అందుచేత భారతదేశ ఆలోచనలు ఎలావున్నాయో, సాంఘిక, ఆర్థికవిధానాలు ఎలా పనిచేస్తున్నాయో వారుచెప్పింది చాలతక్కువ. ఈ నీచచరిత్రల్లో తప్పిజారిపడిన ఛాయామాత్రసూచనలుమాత్రమే అక్కడక్కడ కనబడుతాయి. ఈ భయంకరకాలములో ప్రజలు అణగదొక్కబడి, అలసిపోయి, దుర్విధికి లొంగిపోయినట్లు కనబడుతుంది. జిజ్ఞాసనశించి, అర్థంచేసికోలేనిపరిస్థితిలో ఉన్నట్లు కనబడుతారు. అయినా, విషయాలను తెలుసుకుందామనేఆసక్తితోచూస్తూ, నూతనశక్తులను అర్థంచేసుకుందామనే కుతూహలంగలవారు చాలమందివ్యక్తులు వుండేఉంటారు. కాని సంఘటనలప్రవాహంచే ముంచెత్తబడి, వారేమీ చేయలేకపోయిఉంటారు.

అటువంటివారిలో 'జాట్' శిక్కుఅయిన మహారాజా రంజిత్ సింగ్ ఒకడు. ఇతడు పంజాబులో ఒక రాజ్యాన్ని స్థాపించాడు. తరువాత ఇది కాశ్మీరానికి, వాయవ్యసరిహద్దురాష్ట్రంవరకు వ్యాపించింది. ఇతనిలో కొన్నిదుర్గుణాలు, లోపాలు లేకపోలేదు. అయినా అతడు

చాల విశిష్టమైనవ్యక్తి. "ఇతడు అత్యంత ధైర్యశాలి. నేనుచూచిన జిజ్ఞాసగల ఒకేఒక భారతీయుడు. ఇతనికుతూహలము మొత్తంజాతిఉదాసీనతకు సరిపోతుంది" అని ఫ్రెంచి జాక్విమాన్ వ్రాశాడు – "అతడితో సంభాషణ భయంకర దుస్వప్నంలాంటిది." భారతీయులు కలుపుగోలు తనంలేనిమనుష్యులని గుర్తుంచుకోవాలి. వారిలోచదువుకున్నవారు మరీని. వీరిలో చాలకొద్దిమందిమాత్రమే విదేశీసైనికనాయకులతో పొత్తుకలుపుకున్నారు. వారిపనులంటే వీరికి భయంగా ఉండేది. విదేశీయులకు సాధ్యమైనంతదూరంగా ఉండడంవల్ల, తమమర్యాద నిలబెట్టుకోవాలని ఈ చదువుకున్నవారు ప్రయత్నించారు. విదేశీయులు తప్పనిసరిపరిస్థితుల్లోమాత్రమే లాంఛనప్రాయంగా వారిని కలుసుకునేవారు. ఆంగ్లేయులు, ఇతరవిదేశీయులు తమవద్ద ఉద్యోగాలకు ఒప్పుకున్నరకంమనుష్యులనే కలుసుకునేవారు. స్వదేశసంస్థానాల్లో లంచగొండులై, కుట్రలుపన్నుతూఉన్న మంత్రులను చూంచేవారు.

రంజిత్‌సింగు జిజ్ఞాసకలిగిఉండడమేకాకుండా, భారతదేశం, ప్రపంచంకూడా అమానుషంగా ఉన్నప్పుడు, దయాహృదయుడై మానవత్వాన్ని ప్రదర్శించాడు.

ఒక సామ్రాజ్యాన్ని స్థాపించి, బలమైనసైన్యాన్ని నిర్మించినా, అతడికి రక్తపాతమంటే ఇష్టముండేదికాదు. "ఇంత తక్కువ దురాలోచనగలఎవరిచేత ఇంతసామ్రాజ్యం నిర్మించబడలేదు"అనిప్రిన్సెప్ అనేఆయన వ్రాశాడు. ఇంగ్లండులో చిన్నదొంగతనానికి మరణశిక్ష విధించబడుతున్నకాలంలో ఎంతటి దారుణమైననేరానికి కూడా మరణదండన లేకుండాచేశా డాయన. ప్రత్యక్షయుద్ధంలో తప్ప ఎప్పుడూ అతడు ప్రాణహానిచేయలేదు. ఆయనను హత్యచేయడానికి ప్రయత్నాలు జరిగాయి. క్రౌర్యము, అక్రమము చాలమంది మహానాగరికులమనుకునేవారిపరిపాలనలోకంటె ఇతనిపరిపాలనలో తక్కువగా ఉంటాయి" అని ఆయనదర్శనంచేసుకున్న ఆస్బొరనే వ్రాశాడు.

మరొకతరహావాడైనఇంకొక భారతీయపరిపాలకుడు సవై జైసింగు అనే రాజపుత్రుడు. రంజింత్‌సింగుకంటె కొంచెం ముందుకాలంవాడు. ఇతడు 1743 లో మరణించాడు. ఔరంగజేబుమరణానంతరం వచ్చిన ఒడుదుడుకుకాలంలోనివాడు.అతివేగంగా వచ్చేసినమార్పులనుతట్టుకునే,

తెలివితేటలు సమయస్ఫూర్తి అతనికుండేవి. ఢిల్లీపాదుషాయొక్క సార్వభౌమత్వాన్ని అతడు అంగీకరించాడు. మహారాష్ట్రులను ఎదుర్కోవడం కష్టమని తోచినప్పుడు ఢిల్లీపాదుషాతరఫున వారితో అతడు సంధిచేసుకున్నాడు. అతడి సైనికరాజకీయజీవితంలో నా కంత ఆసక్తిలేదు. అతడు ధైర్యంగలసైనికుడు, రాజనీతిజ్ఞుడు మాత్రమే కాదు. అతడు గణిత, భూగోళశాస్త్రాల్లో పండితుడు; నగరనిర్మాణంలో సిద్ధహస్తుడు. చరిత్రను అధ్యయనంచేయడమంటే కుతూహలంగలవాడు.

జైపూరు, ఢిల్లీ, ఉజ్జయిని, కాశీ, మధురానగరాల్లో పెద్దనక్షత్ర పరిశోధనశాలలను నిర్మించాడు. ఖగోళశాస్త్రంలో పోర్చుగీసువారు సాధించిన అభివృద్ధినిగురించి విని, పోర్చుగీసురాజు ఇమాన్యూల్ ఆస్థానానికి తనపండితులను పంపాడు. ఇమాన్యూల్ క్సేవియర్ డి సిల్వాను డి లా హైర్ లెక్కలపట్టికలతో జైసింగ్ ఆస్థానానికి పంపాడు. తనపట్టికలతో వీటిని పోల్చిచూచి, అవి సరిగా లేవనీ, వాటిలో చాల తప్పులున్నాయనీ జైసింగ్ గ్రహించాడు. పోర్చుగీసువారు ఉపయోగించిన పరికరాలయొక్క తక్కువవ్యాసాలవల్ల ఈ తప్పులు వచ్చిఉంటాయని జైసింగ్ అనుకున్నాడు.

భారతీయగణితశాస్త్రంలో జైసింగ్ పరిపూర్ణపాండిత్యంకలిగినవాడు. ప్రాచీన గ్రీకుగణితగ్రంథాలు మాత్రమే కాకుండా, యూరపులో కొత్తగా వచ్చినమార్పులను గురించి కూడా తెలుసుకున్నాడు. యూక్లిడ్‌వంటివారిగ్రీకుగ్రంథాలుమాత్రమే కాక, సరళరేఖా, గోళాకార, త్రికోణశాస్త్రాలు, సంవర్గమానాల నిర్మాణము, ఉపయోగము మున్నగుయూరపియన్‌గ్రంథాల సంస్కృతానువాదాలుకూడా ఆయన వద్ద ఉన్నవి. అరబ్బీ ఖగోళశాస్త్రానువాదాలు సంపాదించేడు. ఇతడు జైపూరునగరనిర్మాత. నగరనిర్మాణంలోగల తనఆసక్తిచేత, చాలా ఐరోపానగరాలపటాలు తెప్పించి చూచి, తననగరానికి తానే పటాన్ని తయారుచేశాడు. చాలా ఐరోపానగరాలపటాలు జైపూరు వస్తుప్రదర్శనశాలలో భద్రపరచబడినవి. జైపూరునగరాన్ని చాల జాగ్రత్తగానూ, అందంగాను తయారుచేయడంవల్ల ఇప్పటికీ నగరనిర్మాణంలో దానిని ఆదర్శంగా ఎంచుతారు.

నిరంతరయుద్ధాలు, ఆస్థానకుట్రలలో తానుకూడా అప్పుడప్పుడు ఇరుక్కుపోయినా, చాలతక్కువకాలంలోనే జైసింగ్ ఇదంతా సాధిం చాడు. జైసింగ్‌మరణానికి నాలుగుసంవత్సరాలక్రితం నాదిర్‌షాదండ యాత్ర జరిగింది. జైసింగ్ ఎప్పుడైనా, ఎక్కడైనా గొప్పవాడయి ఉండేవాడు. భూస్వామ్యపద్ధతి ఉన్న రాజపుత్రస్థానంలో, యుద్ధాలు తగాదాలతో ఒడుదుడుకుగాఉన్న కాలంలో జైసింగ్ శాస్త్రకారుడుగా గొప్పవాడయ్యాడనేది గమనార్హమయిన విషయం. శాస్త్రంలో అభిలాష ఇంకా భారతదేశంలో చచ్చిపోలేదనీ, అవకాశం కలిగిఉంటే అది తప్పకుండా పైకివచ్చి, మంచిఫలితాలను ఇచ్చిఉండేదనీ తెలుపు తుంది. జైసింగ్ తనకాలానికి సరిపడనివనివాడనో, ఒంటరిగాడనో అను కోవడం పొరపాటు. అతడు వ్యతిరిక్తమైన అర్థంగానివాతావరణంలో పనిచేయలేదు. అతనికాలానికి అతడు పూర్తిగా తగినవాడే. తనతో పనిచేసేందుకు అతడు కొంతమంది శాస్త్రకారులను తనవద్దచేర్చాడు. వీరిలో కొందరిని పోర్చుగల్‌కు పంపాడు. నాటి సాంఘికకట్టుబాట్లు అతడిని ఈపనిచేయడంనుండి అడ్డగించలేకపోయాయి. సిద్ధాంతంలోనూ, యాంత్రికంగానూ శాస్త్రపరిశోధనకు తగిన అవకాశం ఉన్నదనే మనం అనుకోవాలి. ఆపనిచేయడానికి అవకాశం చాలకాలంవరకు రాలేదు. కష్టాలు, క్లిష్టపరిస్థితులు గడిచాకకూడా అధికారంలో ఉన్నవారు శాస్త్రాభివృద్ధికి ప్రోత్సాహమీయలేదు.

## ౧౬ భారతదేశ ఆర్థికపరిస్థితి - రెండు ఇంగ్లండులు

విశేషప్రభావంగల ఇన్ని రాజకీయమార్పులు జరుగుతున్నకాలంలో భారతదేశఆర్థికపరిస్థితి ఎటువంటిది ? "పద్దెనిమిదవశతాబ్దంవరకు భారత ఉత్పత్తిపద్ధతులు, పారిశ్రామిక - వాణిజ్యనిర్మాణవిధానము ప్రపం చంలో మరేదేశపద్ధతులతోనైనా పోలికకు నిలబడగలవు" అని ఆన్‌స్టే వ్రాశాడు. భారతదేశము యూరపుకు, మిగిలినదేశాలకు వస్తువులను ఎగుమతిచేసే గొప్ప పారిశ్రామిక ఉత్పత్తికేంద్రంగా వుండేది. దేశమంతటి లోను వాణిజ్యవ్యవహారాలను జాగ్రత్తగాచూచే సంస్థలు వుండేవి. భారతషాహుకారు లిచ్చిన హుండీలు, బిల్లులు భారతదేశమంతటిలోనే గాక ఇరాన్, కాబూలు, హీరట్, తాష్కెంట్, మిగత మధ్యఆసియా

ప్రాంతాల్లోనూ చెల్లేవి. వాణిజ్యమూలధనం పెరిగి, ప్రతినిధులు, దళారులు ఇంకా చాలమంది ఉండేవారు. నౌకానిర్మాణం అభివృద్ధి చెందుతోంది. నెపోలియన్ యుద్ధాల్లో ఒక ఇంగ్లీషు నావికాధిపతి ఉపయోగించిన ఓడ భారతదేశంలో భారతీయకంపెనీచే తయారుచేయబడింది. పారిశ్రామికవిప్లవానికిముందు భారతదేశం పారిశ్రామికంగానూ, ఆర్థికంగానూ, వాణిజ్యంలోను తదితర దేశాల్లాగానే అభివృద్ధి చెందింది. సుస్థిరమైనపరిపాలన ఉండి, రహదారులు ప్రయాణీకులకు, వాణిజ్యానికి క్షేమంగాఉంటేనేతప్ప ఇంత అభివృద్ధి కలిగిఉండేదికాదు.

భారతదేశంలో తయారవుతున్న వస్తువులయొక్క నాణ్యము, యూరపులో వాటిఅమ్మకాన్ని చూచి, విదేశీయులు భారతదేశానికి మొదట వచ్చారు. ఈస్టిండియాకంపెనీవారికి మొదట భారతీయ సరుకులను యూరపులో అమ్మడమే పనిగా ఉండేది. దీనివలన ఆ కంపెనీ వారికి విపరీతమైన లాభాలు కలిగాయి. ఉత్పత్తిలో తమకంటె మంచి పద్ధతులను అవలంబిస్తున్న ఇంగ్లీషువారితో పోటీచేయగలిగినంతటి ఉత్తమమైనపద్ధతిలో భారతీయఉత్పత్తివిధానం నిర్మించబడింది. అంత నైపుణ్యంలో భారతీయపనివారు నిర్మాణంచేసేవారు. ఇంగ్లండులో పెద్దపెట్టున యంత్రాలనునిర్మించేనాటికిగూడా భారతీయవస్తువులు వెడుతూనేవుండేవి. విపరీతమైన వాణిజ్యసుంకాలు విధించడంవల్ల, కొన్ని వస్తువులను నిషేధించడంవల్ల ఈ ఎగుమతిని కొంతవఱకు ఆపుచేయగలిగేవారు.

"మూర్షిదాబాద్‌నగరం లండనునగరమంతటిజనసంఖ్య, వైశాల్యం, ఐశ్వర్యం కలిగిఉంది. కాని, ఒక తేడామాత్రం వుంది. మూర్షిదాబాదునగరంలో లండనులోకంటె చాల ఎక్కువ ఆస్తిపరులున్నారు" అని ప్లాసీయుద్ధంజరిగిన 1757లో క్లైవు మూర్షిదాబాదునుగురించి వ్రాశాడు. తూర్పుబెంగాలులోని ఢక్కానగరం చీనాంబరాలకు చాల ప్రసిద్ధిచెందిఉండేది. ఈ ముఖ్యమైన రెండునగరాలు హిందూదేశపు కైవారానికి దగ్గరలోనే ఉండేవి. దేశమంతటా ఇంకా పెద్దపెద్ద పారిశ్రామికనగరాలు, ఉత్పత్తికేంద్రాలూ ఉండేవి. ఒకచోటునుండి మరొకచోటికి వార్తలుఅందేందుకు, ధరలసమాచారం వేగంగా తెలిసేటందుకు తేలికైనపద్ధతులుండేవి. వీటిని వ్యాపారస్థులు పూర్తిగా వాడుకునే

వారు. భారతవర్తకులు అప్పుడు జరుగుతున్న యుద్ధవార్తలతోసహా అన్నిరకాల సమాచారములు ఈస్టిండియాకంపెనీవారికంటె కూడా ముందే అందుకునేవారు. పారిశ్రామికవిప్లవానికిముందు భారతదేశ ఆర్థికపరిస్థితి ఎంత బాగా ఉండగలదో అంతఉచ్ఛస్థితిలోను ఉండేది. అది ఇంకా అభివృద్ధిపొందగలశక్తి కలిగిఉందో లేక పెరుగుదలలేని సాంఘికస్థితికి కట్టుబడిపోయిఉందో చెప్పడం కష్టం. సాధారణపరిస్థితులలో అయితే అది మారుతున్న నూతన పారిశ్రామికపరిస్థితులకు అనుగుణంగా మారిఉండేదని చెప్పవచ్చు. మారడానికి పూర్తిగా సిద్ధమైఉన్నా, ఆమార్పురావడానికి లోపలనుండి ప్రబలమైన విప్లవమొకటి అవసరమైఉంది. ఆ మార్పుతేవడానికి మరోశక్తి ఏదైనా ఉండాల్సిందేమో! పారిశ్రామికవిప్లవానికిముందు ఎంత అభివృద్ధిచెందిన ఆర్థిక వ్యవస్థ ఉన్నా, యాంత్రికపరిశ్రమలు పెంపొందిన దేశాలసరుకులతో ఎక్కువకాలం ఏ దేశము పోటీచేయలేదన్నసంగతి స్పష్టం. ఐతే, ఏ దేశమైనా యంత్రసాధనాలను పెంపొందించుకోవాలి. లేకుంటే, రాజకీయ దాస్యానికిదారితీసే ఆర్థికవిధానాలకు తలొగ్గాలి. కాని, విదేశీరాజకీయాధికారం ముందురావడం జరిగింది. అది దేశంలోఉన్న ఆర్థికవ్యవస్థను నాశనంచేసివేసింది. ఈ నాశనమైపోయిన ఆర్థికవ్యవస్థస్థానే పనిచేయడానికి మరోవ్యవస్థను ఏర్పాటుచేయడంగాని, నిర్మాణాత్మకమైన కృషి చేయడంగాని జరగలేదు. ఈస్టిండియాకంపెనీవారు బ్రిటిష్‌రాజకీయ, ఆర్థికశక్తులకు రెండింటికీ ప్రాతినిధ్యంవహించారు. అది సర్వాధికారాలు కలిగిఉండేవి. అందలి సభ్యులందరూ వర్తకులే గనుక, డబ్బుచేసికోవడం అన్నిటికంటె ముఖ్యమైన పనిగాపెట్టుకున్నారు. విపరీతమైన మొత్తాల్లో అమితత్వరితగతిని డబ్బుచేసుకుంటున్నకాలంలో, 1776వ సం॥ లో ఆడమ్‌స్మిత్ 'వెల్త్ ఆఫ్ నేషన్స్' అనే గ్రంథంలో యిలా వ్రాశాడు. "ఏ దేశానికైనా వర్తకులచేతుల్లోవుండేప్రభుత్వం అన్నిటికంటె అరిష్టదాయకం"

భారతదేశంలో పారిశ్రామిక, వాణిజ్యశాఖలకు చెందినవారు ధనవంతులైనా, దేశమంతటా వ్యాపించివున్నా ఆర్థికవిధానాన్ని స్వాధీనంలో వుంచుకున్నా వారికి ఏవిధమైన రాజకీయశక్తీ లేదు. ప్రభుత్వం నిరంకుశమైవుండేది. చాలవరకు ఫ్యూడల్‌విధానమే అమలులో ఉండేది.

భారతచరిత్రలో కొన్ని పూర్వఘట్టాలలోకంటె ఇప్పుడు ఫ్యూడల్ విధానం బలంగా ఉండేది. అందుచేత తగినంతబలంకలిగి, అధికారం సంపాదిద్దామనే ఆశగల మధ్యతరగతివారు యూరపులో కొన్ని దేశాలలో ఉన్నట్టు, ఇక్కడ లేకపోయారు. ప్రజలు ఉదాసీనులుగాను, బానిసస్వభావంగలవారుగానూ అయిపోయారు. విప్లవాత్మకమైన మార్పు ఏదైనా కలగాలంటే ఈ శూన్యభావాలను భర్తీచేయవలసి ఉంది. కరుడుగట్టిపోయిన, మార్పుచెందుతున్న ప్రపంచంతోపాటు మారేందుకు ఇష్టపడక, స్తబ్ధంగా వుండిపోయిన భారతసాంఘికవ్యవస్థ మూలంగా ఈ లోపం కలిగిఉంటుంది. మార్పును వ్యతిరేకించే ఏ నాగరికతఅయినా కృంగిపోక తప్పదు. అప్పుడు ఉన్నపరిస్థితులలో ఆ సంఘం నిర్మాణాత్మకమైనపాత్ర నిర్వహించడమనేది లేదు. మార్పు అనివార్యం.

రాజకీయంగా బ్రిటిష్‌వారు అప్పట్లో చాలా పురోగమించి ఉన్నారు. వారిదేశంలో రాజకీయవిప్లవం జరిగింది. ప్రజాప్రతినిధులు పరిపాలించేవిధానం రాచరికాన్ని త్రోసిరాజంది. ఆ దేశంలో మధ్యతరగతివారు తమనూతనశక్తిని గుర్తించినవారై, ఇంకా విస్తృతంకావాలనే తహతహతో ఉన్నారు. పురోగమించుతున్న సంఘానికి నిదర్శనాలైన ఉత్సాహము, శక్తి నాటి ఇంగ్లండులో చాల స్పష్టంగా కనబడుతున్నాయి. ఈ శక్తి చాలావిధాలుగా ముఖ్యంగా ఇంగ్లీషువారు కనుగొన్న నూతనవిషయాలలో స్పష్టంగా కనబడుతుంది. ఈ నూతనవిషయాలే పారిశ్రామికవిప్లవాన్ని ఎలుగెత్తిచాటాయి.

అప్పుడు బ్రిటిష్‌పరిపాలకులు ఎలాగున్నారు? "ఒక అనాగరక శిష్టాస్మృతికి అలవాటుపడి, అల్పము, అసమానమైన విశ్వవిద్యాలయాల పద్ధతితో, ప్రభుత్వమంటే ఉద్యోగాలు, గౌరవాలు అనే దురభిప్రాయంతో, కాయకష్టంచేసే స్త్రీపురుషులంటే నీచభావంతో, సామాన్యప్రజానీకానికి విద్య నందనీయకుండా, భిన్నాభిప్రాయాలుగలవారిమీద, కేథలికులమీదకూడా మతాన్ని రుద్దుతూ, జమీందారు, మతాచార్యుడు అధికారులుగాగల పట్టణాలూ, పల్లెలతో, సైనికనౌకాబలాల్లో దుస్సహమైనక్రౌర్యంతో, భూస్వాములఅధికారాన్ని బలపరిచే జ్యేష్ఠానుక్రమవారసత్వవిధానంతో, ఉద్యోగాలు, హోదాలు, పింఛనులకోసం

రాజుకు కాకాపట్టే ఉద్యోగులతో, గర్వము, దోపిడీలతో నడిచే యీ విధానాన్ని ప్రజలనెత్తిమీదకుద్దే రాజ్యాంగవిధానము, మతకట్టు బాట్లతోనూ ఉన్న బ్రిటిష్‌పరిపాలనావిధానాన్ని అమెరికనువిప్లవ విజయము ఒక్కసారిగా అమెరికారాష్ట్రాలనుండి త్రోసివేసింది" అని చార్లెస్, మేరీ బియర్డ్ అనే చరిత్రకారులు వ్రాశారు "ఈ విపరీతమైన భారంనుండి అమెరికనువిప్లవకారులు బ్రిటిష్‌చక్రవర్తిపాలనలోనివలస ప్రజలకు విముక్తికలిగించారు. ఈ విమోచనంతరువాత ఒకటిరెండు దశాబ్దాల్లో విధానాల్లోను, చట్టాల్లోను సంస్కరణలుచేశారు. ఈ సంస్కరణలకే ఇంగ్లండులో నూరుసంవత్సరాలు ఎడతెగనిఆందోళన చేయాల్సివచ్చింది. ఈ ఆందోళనకు నాయకత్వంవహించినవారు ఆంగ్ల చరిత్రలో చిరంజీవులుగా ఉండిపోయారు". స్వాతంత్ర్యచరిత్రలో మైలురాయిగా చెప్పుకోదగ్గ అమెరికనుస్వాతంత్ర్యప్రకటన 1776లో జరిగింది. తరువాత ఆరుసంవత్సరాలకు ఇంగ్లండునుండి అమెరికను వలసలు విడివడిపోయాయి. అప్పటినుండే వారి నిజమైన ఆర్థిక, సాంఘిక వైజ్ఞానికవిప్లవం ఆరంభమయింది. ఇంగ్లండుపద్ధతిని నిర్మించబడిన భూస్వామ్యవిధానము పూర్తిగా మార్చివేయబడింది. చాలా హక్కులను రద్దుచేశారు. పెద్దకమతాలను స్వాధీనంచేసుకుని, విడగొట్టి, చిన్న రైతులకు భూమిని పంచిపెట్టారు. చైతన్యవంతమైన ఆర్థిక, సాంఘిక సంచలనం ప్రారంభమైంది. భూస్వామ్యవిధానపు అవశేషాలనుండి, విదేశీఅధికారంనుండి విమోచనంపొందిన అమెరికా పెద్దపెద్దఅంగలతో ముందుకు సాగింది.

పాతవిధానానికి చిహ్నంగాఉన్న బాస్టిల్‌కారాగారాన్ని ధ్వంసించి విప్లవం కూలద్రోసి, మానవునిహక్కులను ప్రపంచానికి చాటింది.

మరి ఇంగ్లాండులో ఏం జరుగుతోంది? ఈ విప్లవాత్మకమైన మార్పులను చూచి, భయపడి, అప్పటికే భయంకరంగాను, క్రూరంగాను ఉన్న తమ శిక్షాస్మృతిని మరింత భయంకరంగాచేసి, వారు ప్రతీఘాతదృష్టితో వుండనారంభించారు. 1760లో మూడవజార్జి సింహాసనమధిష్టించేప్పటికి ఇంగ్లండులో స్త్రీలకు, పురుషులకు, పిల్లలకు మరణ దండనవిధించదగునేరాలు 160 ఉండేవి. 1820 లో ఆయన సుదీర్ఘమైన పరిపాలనఅంతమయేనాటికి మరణదండనవిధించదగుమరొకనూరునేరాలు

ఆ భయానకమైన పట్టీలో చేర్చబడ్డాయి. సామాన్యబ్రిటిష్ సైనికుణ్ణి పశువుకంటె హీనంగా, చాలా దారుణంగా చూచేవారు. మరణ దండన అతిసామాన్యం. కొన్నివందల కొరడాదెబ్బలతో శిక్షించడం మరీ సర్వసామాన్యంగా ఉండేది. ఈ శిక్ష విధించడంలో అప్పుడప్పుడు చచ్చేవరకు బాదడం, లేకపోతే బ్రతికినన్నాళ్ళు ఆ దెబ్బలతో కుళ్ళి వికృతమైపోయిన దేహాన్ని ఆ శిక్షాప్రతిబింబంగా ప్రదర్శించేటట్లు చేయడం జరుగుతూండేది.

మానవత్వం, మానవుడంటెగౌరవం ఉండాల్సిన ఇలాంటి విష యాల్లో భారత దేశం తతిమ్మా అనేక దేశాలకంటె చాలానాగరికంగా ఉండేది. విద్య సాంప్రదాయసిద్ధమై ఉన్నప్పటికి అక్షరాస్యులసంఖ్య ఇంగ్లండులోకంటె, యితరయూరపియను దేశాలలోకంటె, భారత దే శంలో అప్పుడు ఎక్కువే ఉండేది. జీవితసౌకర్యాలుకూడా ఎక్కువ గానే ఉండేవేమో. సామాన్యమానవులజీవితప్రమాణం యూరపియను దేశాలలోకంటే భారత దేశంలోనే చాలా బాగుండేది. కాని, ఒక ముఖ్యమైనభేదం మాత్రం ఉంది. గొప్ప మార్పులుతీసుకురాగల నూతన శక్తులు పశ్చిమయూరపియను దేశాల సాంఘికవ్యవస్థలో పనిచేస్తు న్నాయి. భారత దేశపరిస్థితులలో కదలిక చాలా తక్కువగా ఉంది.

ఇంగ్లండు భారత దేశానికివచ్చింది. 1600 సం॥లో ఎలిజబెత్తురాణి ఈస్టిండియాకంపెనీవారికి సనదు ఇచ్చినపుడు షేక్స్పియర్ బ్రతికి ఉన్నాడు. రచన సాగిస్తున్నాడు. 1611 లో ఇంగ్లీషులో బైబిలు సాధికారప్రతి విడుదల చేయబడింది. 1608లో మిల్టన్ మహాకవి జన్మిం చాడు. తరువాత హాబ్స్, క్రాంవెల్ వచ్చారు. రాజకీయవిప్లవం వచ్చింది. శాస్త్రపురోభివృద్ధికి అపారమైన కృషిచేసిన 'రాయల్ సొసైటీ ఆఫ్ ఇంగ్లాండ్' 1660లో స్థాపించబడింది. తరువాత నూరుసంవత్సరా లకు 1760 లో ఫ్లైయింగ్‌షటిల్ (మగ్గంలోనినాడా) కనుగొనబడింది. మరికొద్దికాలంలోనే స్పిన్నింగ్‌జెన్నీ, ఆవిరియంత్రం, మరమగ్గము అన్నీ ఒకదానితరువాత ఒకటి కనుగొనబడ్డాయి.

ఈ రెండు ఇంగ్లండులలో ఏది భారత దేశానికి వచ్చింది? షేక్స్పి యర్, మిల్టనులు,ఉదాత్తమైనభాష, రచన,ధైర్యం, రాజకీయవిప్లవం, స్వాతంత్ర్యపోరాటం, శాస్త్రం, యాంత్రికపురోభివృద్ధిగల ఇంగ్లండా,

లేక అమానుషమైన శిక్షాస్మృతి, క్రూరస్వభావము, భూస్వామ్యవిధానాన్ని తలదన్నే స్వభావంగల ఇంగ్లండా? ఎందుచేతనంటే, ప్రతిదేశంలో వలెనే జాతిజీవనంలోనూ, నాగరికతలోనూ వైవిధ్యం ఉన్నట్లే, రెండు ఇంగ్లండు లుండేవి. "ఉన్నతమైన, సామాన్యమైన నాగరికతలలో ఇంగ్లండులో ఉన్న భేదం చాలా ఎక్కువైనది. ఇంకే దేశంలోనైనా ఇలాంటిది ఉందని నేననుకోను. ఈ భేదం చాలనెమ్మదిగా తగ్గుతోంది. తగ్గుతున్నట్లు కనబడనంత నెమ్మదిగా తగ్గుతోంది" అని ఎడ్వర్డ్ థాంప్సన్ వ్రాశాడు.

ఈ రెండు ఇంగ్లండులు ఒకదానిమీద మరొకటి ప్రభావం కలిగి ఉంటాయి. రెండూ ప్రక్కప్రక్కనే ఉంటూ ఉంటాయి. ఒకదానిని పూర్తిగామరచిపోయి, రెండవదే భారతదేశానికి రాలేదు. కాని ప్రతి ప్రయత్నంలోనూ ఒకశక్తి విజృంభించి, రెండవదానిప్రభావాన్ని తగ్గించుతుంది. ఈసందర్భంలో దోషభూయిష్టమైన ఇంగ్లాండుశక్తి అధికమై, భారతదేశంలోకూడా దోషాలను ఇనుమడింపజేయడం తప్పలేదు.

అమెరికా స్వతంత్రమైనకాలంలో భారతదేశం తన స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకుంది. గత నూటయాభై సంవత్సరాల్లోనూ అమెరికా సాధించిన అభివృద్ధిని, భారతదేశం సాధించలేకపోయినదానిని పోల్చి ప్రతిభారతీయుడు ఆశతోనూ, బాధతోనూ గమనించకమానడు. అమెరికనులకు చాలా సుగుణాలున్నమాట వాస్తవమే. మనలో చాలా లోపాలువున్నమాటా నిజమే. అమెరికావారికి అదివరకు దున్నబడని భూములు లభించి, వారు తమచరిత్రలో నూతనాధ్యాయాన్ని ప్రారంభించుతూంటే, తరతరాలుగావస్తున్న ఆచారాలు నమ్మకాలలో మనమున్నాము. కాని, బ్రిటిష్‌వారు - వారు మనకు చెప్తున్నట్లు, మనకు స్వపరిపాలన నేర్పాలనేబరువు తమనెత్తిమీదవేసుకొని ఉండకపోయినట్లయితే, భారతదేశం ఎక్కువ స్వేచ్ఛా - స్వాతంత్ర్యాలతో వర్ధిల్లడమేగాక, శాస్త్రము, కళల్లో అభివృద్ధితోనూ, జీవితానికి శోభనిచ్చే అన్నిహంగులతోను సుఖంగా ఉండేదేమోనని అనుకోడానికి అవకాశం లేకపోలేదు.

# చివరిదశ (1)

## బ్రిటిష్ పరిపాలన సంఘటితమగుట, జాతీయోద్యమారంభము

### సామ్రాజ్య ఆదర్శాలు, కొత్తకులము

"మన చేతలన్నింటికంటె, బహుశ మనం భారతదేశచరిత్ర వ్రాసినపద్ధతే ఎక్కువగా నిరసింపబడుతోంది."-ఇవి భారతదేశంతోను, దానిచరిత్రతోను బాగా పరిచయమున్న ఒక ఆంగ్లేయుడు వ్రాసిన మాటలు. బ్రిటిష్‌పరిపాలనాచరిత్రలో భారతీయు లెక్కువగా దేన్ని నిరసించారనేది చెప్పడం చాలా కష్టం. అట్టివాటిజాబితా చాలా పొడుగుంటుంది. కాని, భారతదేశచరిత్రను-ముఖ్యంగా బ్రిటిష్‌పాలనా యుగమనేదాన్ని-బ్రిటిషువారు వ్రాసిన పద్ధతి తీవ్రనిరసనకు గురియగు తూండడం యథార్థం.

చరిత్ర - దాదాపు అన్నిసందర్భాల్లోను - విజేతలు, జైత్ర యాత్రికులచేతనే రచింపబడి, వారిదృక్పథాన్నే ప్రతిబింబిస్తుంది. కనీసం, విజేతలు చెప్పిన వ్యాఖ్యానానికే ప్రాముఖ్యమీయబడి, చెలామణి అవుతుంది. ఆర్యులనుగూర్చి మనకున్న కవిలెకట్టలన్నీ - వారిప్రాచీన గ్రంథాలు, సాంప్రదాయాలు - వారి నెంతగానో స్తుతించుతూ, స్వదేశీయులపట్ల దురన్యాయంచేశాయని విశ్వసించవచ్చు.ఏవ్యక్తీ తనజాతీయ దృక్పథాన్ని, సంస్కృతిని అధిగమించలేదు. ఇంక జాతులమధ్య, దేశాలమధ్య సంఘర్షణఏర్పడినప్పుడు ఎవరైనా నిష్పాక్షికంగా ఉండాలని ఏమాత్రం ప్రయత్నించినా, అది స్వజనానికి ద్రోహంచేసినట్లే భావించబడుతుంది. సంఘర్షణముదిరితే యుద్ధమవుతుంది. యుద్ధంవల్ల మానవమేధ మొద్దుబారి తనజాతిదృక్పథాన్నితప్ప మరేఆలోచనను చొరనివ్వదు.శత్రుజాతికి సంబంధించినవైతే,ఉదాత్త, నిష్పాక్షికభావాలు నిర్దాక్షిణ్యంగా త్రోసిపుచ్చబడుతాయి. ఆసమయంలో గెలుపుదృష్ట్యా తాముచేసేదంతా సమర్థించుకోవడం, శత్రుపక్షచర్యలను ఖండించడం

జరుగుతుంది. సత్యము ఎక్కడో లోతైన బావిలో అట్టడుగున ఉంటుంది; అసత్యం అతినగ్నంగా, సిగ్గువిడిచి స్వైరవిహారంచేస్తుంది.

యుద్ధం ప్రత్యక్షరూపంలో జరుగనప్పుడుకూడా ప్రత్యర్థి దేశాల మధ్య, ప్రయోజనాలమధ్య తీవ్రసంఘర్షణలు, యుద్ధము జరుగుతూనే వుంటాయి. విదేశీశక్తి పరిపాలిస్తున్న దేశంలో ఇట్టి సంఘర్షణాస్వభావం ఎప్పుడూ విడువకుండా వుంటుంది; ప్రజల ఆలోచనలపైన చెయిదముల పైన ప్రభావం కలిగివుండి తప్పుదారులుపట్టిస్తుంది. యుద్ధమన స్తత్వం ఎన్నటికీ పూర్తిగా మాసిపోదు. పూర్వం యుద్ధము, దాని ఫలితాలు, క్రూరత్వము జయించడం, ఒకజాతిని బానిసలుగాచేయడం ప్రకృతి సహజమైన విశేషాలుగా భావించబడేవి. కాబట్టి వాటిని మభ్యపరచేం దుకుగాని, మరోదృక్పథంలో సమర్థించేందుకుగాని, అవసరం లేకపో యింది. తమ ప్రమాణాలు పెరగడంతో సమర్థించుకోవలసిన అవసరం తలెత్తింది. ఇది – కొన్నిసార్లు బుద్ధిపూర్వకంగానూ, అనేకపర్యాయ ములు తనకు తెలియకుండానూ – వాస్తవాన్ని వక్రీకరించడానికి దారి తీస్తుంది. ఈవిధంగా కృత్రిమనటన పవిత్రతకు ఘనతనిస్తుంది. అసత్యము జుగుప్సాకరమైనభక్తి, దుష్కృత్యాలతో చేతులుకలుపుతుంది.

ఏదేశంలోనైనా ముఖ్యంగా గజిబిజిచరిత్ర, మిశ్రమసంస్కృతీ గల యిండియావంటి విశాలదేశంలో ఒక ప్రత్యేక ఆదర్శనిర్వచనాన్ని సమర్థించేందుకు కావలసిన విశేషాలను ధోరణులను కనుక్కోవడం చాలా తేలిక. ఇలా కనుక్కోబడ్డవాటి సమర్థన మరో నూతనవాదానికి పునాది అవుతుంది. అమెరికా ఒక స్థాయి, సమైక్యత కలిగివున్నా, అనేక పరస్పరవైరుధ్యాలకు పుట్టినిల్లంటారు. అటువంట ప్పుడు భారతదేశంలో మరెన్నిరెట్ల వైరుధ్యాలూ, వికృతాలూ నిండి వుండాలి! అక్కడ ఇతరచోట్లలోవలెనే మనం వెతకినదే కనుక్కుంటాం. ఈవిధంగా ముందే ఏర్పరచుకున్న భావాలతో మనం ఒక నమ్మికను, అభిప్రాయాన్ని నిర్మించుకోవచ్చు. అయినా, ఆ నిర్మాణం కృత్రిమ పునాదులనే కలిగివుంటుంది. వాస్తవానికి వక్రరూపాన్ని చూపుతుంది.

ఇటీవలి భారతదేశచరిత్ర అనగా బ్రిటిష్‌యుగచరిత్ర నేటి నిత్య సంఘటనలతో గాఢంగా పెనవేసుకొని వుండడంవల్ల నాటి చరిత్రను మనం వ్యాఖ్యానించడంపై నేటి మనఆవేశాలు, దురభిప్రాయాలు,

బలమైన ప్రభావం కలిగివుంటాయి. ఆంగ్లేయులు, భారతీయులు ఇరువురూ కూడా పొరపాటుపడవచ్చు. ఈ పొరపాట్లు విరుద్ధమార్గాల్లో ఉండడం సంభవమే. ఏ ఆధారాలపై చరిత్ర రూపొంది, రచింపబడిందో ఆ కవిలెకట్టలు, పత్రాలలో అధికభాగం బ్రిటిషువారి నుంచి లభించినవే గనుక అవి తప్పనిసరిగా బ్రిటిషువారిదృక్పథాన్నే చిత్రిస్తాయి. ఓటమికి, విచ్ఛిత్తికావడానికి కారణమైన పరిస్థితులే, భారతీయులు ఈ చరిత్రాంశాలను తమదృక్పథంలో రచించడానికి వీల్లేకుండాచేశాయి. ఉన్న పత్రాల్లో చాలవరకు 1857 విప్లవంలో నాశనమైపోయాయి. మిగిలివున్నపత్రాలు – ఎలాంటి ఇబ్బందులపాలవవలసివస్తుందోనన్నభయం కొద్దీ – ప్రచురింపబడక, కుటుంబపత్రాలలో దాచివేయబడ్డాయి. అలాంటివి తెలియకుండా చెల్లాచెదరుగా వుండిపోయాయి. వాటిలో చాలా మన దేశంలో కొల్లలుగావుండే చిమ్మటలు, చెద మొదలైన పురుగులవల్ల అంతరించిపోయాయి.

ఆ తరువాత చాలాకాలానికి ఆపత్రాల్లోకొన్ని చరిత్రకారులకు లభించినప్పుడు అనేక చారిత్రకసంఘటనలపై కొత్తవెలుగు ప్రసరించింది. బ్రిటిష్‌వారు రచించిన భారతదేశచరిత్రకూడా మార్చవలసి వచ్చింది. అనేక సందర్భాల్లో బ్రిటిష్‌వారిదృక్పథానికి భిన్నంగావుండే భారతీయదృక్పథం రూపొందింది. ఈ దృక్పథంవెనుక ఎన్నో సాంప్రదాయాలు, జ్ఞాపకాలు వున్నాయి. అవి మరీ పురాతనకాలానివి కావు. మన తాతలూ, ముత్తాతలూ స్వయంగా చూచిన, వారు స్వయంగా ఆ సంఘటనలకు గురియైనకాలానివే. చారిత్రకంగా ఈ సాంప్రదాయాలకు గల విలువ అల్పమే కావచ్చు. కాని, ఇది నేటి భారతీయమనస్తత్వానికివెనుకగల చరిత్రను మనం అవగాహనచేసుకునేందుకు ఉపయోగపడే ముఖ్యాంశము. బ్రిటిష్‌వారికి ఇండియాలో దుర్మార్గుడుగా కన్పించినవ్యక్తి తరచుగా భారతీయులకు వీరుడు. బ్రిటిషువారు కానుకలు, బిరుదులతో సన్మానించినవారు భారతీయులలో అధిక సంఖ్యాకుల దృష్టిలో దేశద్రోహులు, విదేశీతొత్తులూను. ఆ కళంకం వారి వంశీకులను ఇంకా అంటిపెట్టుకొని వదలకుండాఉంది.

అమెరికన్ విప్లవచరిత్రను ఇంగ్లీషువారు, అమెరికనులు రకరకాలుగా వ్రాశారు. పాత కావేషాలు సమసిపోయి, ఉభయ దేశాలమధ్య

మైత్రి ఏర్పడ్డా, నేటికీ వారు ఒకరి వ్రాతలను మరొకరు నిరసించుకోవడం జరుగుతూనేవుంది. వర్తమానంలో కూడా విశేష ఖ్యాతిగల ఆంగ్ల రాజకీయవేత్త లనేకమందిదృష్టిలో లెనిన్ ఒక రాక్షసుడు, బందిపోటు దొంగ. అయినా కోట్లాది ప్రజలు ఆయన తమఉద్ధారకుడనీ, యుగ పురుషోత్తముడనీ భావించారు. భారతదేశపు గతాన్ని అన్నివిధాల నిందిస్తూ, వారు పవిత్రులుగాస్మరించేవారిని నీచంగా చిత్రిస్తూ, బ్రిటిష్ పాలనలో జరిగిన 'ఘన' కార్యాలను పొగడుతూ గౌరవించుతూ వుండే 'చరిత్ర' లనబడే పుస్తకాలను భారతీయులు తమ పాఠశాలల్లో, కాలేజీలలో చదవాలని నిర్బంధించడాన్ని భారతీయు లెంత అవమాన కరంగా భావించారో పై పోలికలు కొంతవరకు సూచిస్తాయి.

గోపాలకృష్ణ గోఖలే తన మృదువ్యంగ్యధోరణిలో "ఇదమిత్థ మని చెప్పలేని ఏదో వివేకశక్తి భారతదేశానికి బ్రిటిషువారి బాంధ వ్యాన్ని విధించింది." అని ఒకపర్యాయం వ్రాశాడు. ఈ ఇదమిత్థమని చెప్పలేని వివేకంవల్లకాని, చారిత్రకగతిలోని ఒకానొక క్రమంవల్లకాని లేక అదృష్టవశాత్తుకాని భారతదేశానికి బ్రిటిషువారిరాక రెండు విభిన్నజాతులను సన్నిహితంచేసింది. అలా సన్నిహితుల్ని చేయవలసిందే కాని, యథార్థంగా ఒకరినొకరు అర్థంచేసుకున్నది చాలా అరుదు. వారి సంబంధాలు పరోక్షంగానే ఉండేవి. ఆంగ్లసారస్వత, రాజకీయదృక్పథాల ప్రభావం ఇంగ్లీషునేర్చుకున్నకొద్దిమందిపైనమాత్రమే ప్రసరించింది. ఈ రాజకీయదృక్పథం ఆ సందర్భంలో మహత్తరశక్తిగలదే అయినా నాటి భారతదేశంలో దానికి వాస్తవికవిలువలేదు. ఇండియాకువచ్చిన బ్రిటిషు వారు సాంఘిక, రాజకీయ విప్లవవాదులు కారు. వారు ఇంగ్లండులో పచ్చి అభివృద్ధినిరోధకవర్గానికి చెందిన అతి మితవాదులు. ఇంగ్లండు అనేకవిధాల యూరపు మితవాదదేశాలన్నింటిలోను అతి మితవాద దేశం.

భారతదేశంపై పాశ్చాత్యసంస్కృతిప్రభావతాకిడి అంటే, మధ్య యుగంనాటి సాంప్రదాయికభావాలచే పెనగొనివున్న స్తబ్ధసమాజంపై పురోగమనశీలంగల సమాజంయొక్క, నవచైతన్యంయొక్క తాకిడియే నన్నమాట. స్తబ్ధభారతసమాజం సంకీర్ణమై, స్వీయమార్గంలో ఉన్నతి చెందినా, తనలోనిఅంతర్గతకారణాలను పురస్కరించుకొనివున్న (నిసర్గ)

పరిమితులవల్ల పురోగమించజాలకపోయింది. కాని, ఈ చారిత్రక క్రమాలకు ప్రతినిధులైనవారు భారతదేశంలో తాము నిర్వర్తించవలసినపనిని గుర్తించలేకపోవడమే గాక, ఒక వర్గంగా ఆ క్రమానికే ప్రాతినిధ్యం వహించలేకపోవడం విచిత్రమే. ఇంగ్లండులోని ఆ వర్గం ఈ చారిత్రక పరిణామక్రమంతో పోరాడింది. కాని, ప్రత్యర్థివర్గశక్తి మరీ బలమైనది కావడంచేత దాన్ని అరికట్టలేకపోయింది. భారతదేశంలో ఎదురు లేనందున అదేమార్పుకు, ప్రగతికి అడ్డంకులు కల్పించగలిగి, దానికి ప్రాతినిధ్యంవహించారు. ఇండియాలో సాంఘికాభివృద్ధినిరోధకమైన వర్గాల స్థానాన్ని బలపరచి, ప్రోత్సహించి సంఘటితపరచారు. సాంఘిక, రాజకీయమార్పులకోసం కృషిచేసేవారిని వ్యతిరేకించారు. అయినా, మార్పురాగలిగిందంటే అది తలవనితలంపుగా వారిచర్యలవల్ల కలిగిన ఫలితమే. ఆవిరియంత్రము, రైల్వేలు ప్రవేశపెట్టడం మధ్యయుగంనాటి నిర్మాణాన్ని మార్చడానికి ఒక పెద్దఅంగ అయింది. అయితే, ఈ పని తమపాలనాయంత్రాన్ని సుసంఘటితంచేసుకోవడానికీ, దేశంలోపలి భాగాల్లోకూడ దోచుకునేందుకు సౌకర్యంకోసం మాత్రమే చేయ బడింది. భారతదేశంలో బ్రిటిష్ అధికారులు ఉద్దేశపూర్వకంగా అమలు పరచిన విధానాలకూ తలవనితలంపుగా కలిగిన ఫలితాలకూ మధ్యగల వైరుధ్యం తికమకలు కల్పించి, వారి రాజనీతినిజస్వరూపాన్ని మరుగు పరుస్తోంది. పాశ్చాత్యదేశాలతాకిడివల్లనే భారతదేశంలో ఎంతో మార్పువచ్చింది. అయితే, అది బ్రిటిష్‌వారి అడ్డంకుల్నికూడా అధిగమించి మరీ వచ్చింది. ఆ మార్పుయొక్క వేగాన్ని నిరోధించడంలో బ్రిటిష్‌వారు ఎంతో విజయులైనందువల్ల నేటికీ ఆ పరిణామం పూర్తి కావడానికి దూరంగానే ఉండిపోయింది.

భారతదేశాన్ని పరిపాలించడానికి ఇంగ్లండునుండి వచ్చిన జమీందారీ భూస్వాములు, వారిజోటీవారు భూస్వామ్యదృక్పథంగల వారు. వారిదృష్టిలో ఇండియా ఈస్టిండియాకంపెనీకిచెందిన ఒక పెద్ద ఎస్టేటు; తన ఎస్టేటుకు, తన కవులుదార్లకు భూస్వామే సహజంగా ఉత్తమప్రతినిధి. ఈ ఇండియా అనే ఎస్టేటును ఈస్టిండియాకంపెనీ బ్రిటిష్‌సార్వభౌములకు అప్పజెప్పినా, వారిదృష్టి అలాగే వుంది. ఇలా అప్పగించినందుకు కంపెనీకి ఇండియాఖర్చుతోనే విస్తారంగా నష్టపరి

హారం ముట్టజెప్పబడింది. (ఇండియాప్రభుత్వఋణం యిలా ఆరంభమైంది. ఇది ఇండియాను కొనేందుకు ఇండియాయే చెల్లించింది) ఆవిధంగా ఇండియాలోని బ్రిటిష్‌ప్రభుత్వంవారు జమీందారులు (లేదా వారి ఏజెంట్లు) అయ్యారు. డ్యూక్ ఆఫ్ డెవాన్‌షైర్ తన ప్రభువుల (తోటివారు)చే 'డెవాన్‌షైర్'అని వ్యవహరింపబడుతున్నట్లే, ఆచరణకు అవసరమైన అన్ని సందర్భాల్లోను బ్రిటిష్‌ప్రభుత్వంవారు తమను 'ఇండియా'గానే పరిగణించుకున్నారు. కోట్లాది భారతీయులు ఒకరకమైన కౌలుదార్లే. వారు పన్నులు, కప్పములు చెల్లిస్తూ, జమీందారీ సమాజంలో తమకుగలస్థానాన్ని గుర్తించి మెలగాలి. దీనికి ఎటువంటి సవాలువచ్చినా, అది బ్రిటిష్‌వారిదృష్టిలో ప్రపంచనైతికప్రమాణాన్ని, దైవదత్తాధికారాన్ని త్రోసిరాజనడంవంటిదే.

భారతదేశంలో తమ పరిపాలననుగూర్చి బ్రిటిష్‌వారికిగల ఇట్టి స్థిరమైన అభిప్రాయాలమూలంలో ఎలాంటి మార్పురాలేదు. ఇప్పుడు మరోరూపంలోమాత్రమే చెపుతున్నారు. కొట్టవచ్చినట్టుకన్పించే పాతపద్ధతి మారి, యుక్తియుక్తంగా చెప్పేపద్ధతులు వచ్చాయి. భూమందు తన కౌలుదార్లపట్ల దయగలిగిఉండాలనీ, వారి పరిస్థితులను చక్కదిద్దేందుకు ప్రయత్నించాలనీ అంగీకరించబడింది. ఎక్కువ భక్తి, విశ్వాసాలుకలిగివుండే కౌలుదార్లను జమీనిర్వహణకు పైఉద్యోగాలకు తీసుకోవాలనీ, పాలనాయంత్రంలో తాబేదారులుగా పనిచేయించాలనీ కూడ సమ్మతించబడింది. కాని ఈ జమీందారీవిధానానికి ఏవిధమైన సవాలు సహించబడదు. ఈ ఎస్టేటు - చేతులుమారినా వెనుకటిలాగే కొనసాగుతూ వుండాలి. కొన్నిసంఘటనలవొత్తిడిచే కొన్నిమార్పులు చేయకతప్పనిపరిస్థితి ఏర్పడితే నమ్మకమైన అధికారులు - పాత, కొత్త స్నేహితులు ఎస్టేటుఉద్యోగాలు చేస్తూనేవుండాలి. వారి అనుయాయులు, వారిపై ఆధారపడియున్నవారు యథాప్రకారం సౌకర్యాలు అనుభవించేఏర్పాట్లు వుండాలనీ, వయోవృద్ధులైన ఫించనుదారులందరు తమభరణాలు పొందుతూనే వుండాలనీ, పాతజమీందారు ఈ ఎస్టేటుకు ధర్మకర్తయై, సంరక్షకుడుగా సలహాదారుగా వుండాలనీ ఏర్పాట్లుచేయుటద్వారా అత్యవసరమైనమార్పులు తెచ్చేందుకు చేయబడిన ప్రయత్నాలన్నీ భగ్నంచేయబడ్డాయి.

ఇలా తమ స్వప్రయోజనాలతో ఇండియాను ముడిపెట్టే తెలివి బ్రిటిష్‌వారిమయంగావున్న ఉన్నతాధికారవర్గాల్లో ఎక్కువగావుంది. ఈ అధికారవర్గాలు తరువాతి సంవత్సరాల్లో 'ఇండియన్ సివిల్ సర్వీస్' (ఐ. సి. ఎస్.) అనబడే సుసంఘటితమైన పరిమితసంస్థగా రూపొందాయి. దీన్నే ఒక ఆంగ్లరచయిత "ప్రపంచంలోకల్లా పట్టువిడువని ట్రేడ్ యూనియన్" అన్నాడు. వారే ఇండియాను నడిపారు. వారే ఇండియా. వారి స్వప్రయోజనాలకు హానికలిగించే దేదైనాసరే, అది ఇండియాకుకూడా తప్పకుండా హానికల్గించేదయివుండాలి. ఇండియన్ సివిల్ సర్వీస్ ద్వారాను, తమముందుంచబడిన వర్తమానసంఘటనలకు చెందినచరిత్రనుబట్టీ వివిధవర్గాల బ్రిటిష్‌ప్రజలలో ఈ అభిప్రాయాలే వ్యాప్తిచెందాయి. పాలకవర్గం ఈఅభిప్రాయాన్ని వ్యాప్తిచెందించడంలో పూర్తిగా కృషిచేయడం సహజమే. తమ దేశంలో తాము ఎంత తక్కువ స్థాయిలోవున్నా బ్రిటిష్ కార్మికుడు, రైతు ఈ ప్రచారప్రభావానికి లోనై, కొంతవరకు నమ్మి ఈ ఆస్తికీ, సామ్రాజ్యానికీ గర్వపడ్డారు. ఆ కార్మికుడే, రైతే భారతదేశానికి రావడం తటస్థిస్తే, వారూ తప్పకుండా ఇక్కడి పాలకవర్గానికి చెందిపోయేవారు. అట్టివారికి భారతదేశచరిత్ర, సంస్కృతీ బొత్తిగా తెలియవు. తాను స్వయంగా పోల్చిచూచుకోడానికి, ప్రయోగించడానికి తగినప్రమాణాలేమీ లేనందువల్ల ఇండియాలోని బ్రిటిష్‌వారిలో అనుశ్రుతంగా పాదుకొనియున్న అభిప్రాయాలనే విశ్వసించేవారు. మహాజరిగితే వారిలో ఒకరకమైన ధర్మకర్తృత్వానుభూతి మాత్రమే అస్పష్టంగా కలిగేది. అదైనా అధికారవర్గపరిధిలోనే వుండిపోయేది.

ఈ తత్వం అన్నివర్గాల బ్రిటిష్‌ప్రజల్లోను ఒక శతాబ్దంపాటు వ్యాప్తిలోవుంది. అది ఒక జాతీయవారసత్వంలాగా దృఢంగా పాదుకొని, మార్పుకు వీల్లేని దృక్పథమైపోయింది. భారతదేశంపట్లగల పై దృక్పథంవల్ల పరోక్షంగా వారి జాతీయజీవితదృక్పథంకూడా మారింది. ఇప్పటి బ్రిటిష్ లేబర్‌పార్టీనాయకవర్గానికి నిర్ణీతప్రమాణాలు, ఆశయాలు, తగినంత బాహ్యప్రపంచజ్ఞానము లేవు. ఈ విచిత్రవర్గం బ్రిటిష్‌వారు ఇండియాను పాలిస్తున్నవిధానాన్ని సాధారణంగా సమర్థించుతూ వచ్చింది. ఒకొ్కకసారి తమ దేశీయవిధానానికి వలసవిధానానికి, మాట

లకు చేతలకూ వైరుధ్యం కన్పించినపుడు వారు కలవరపడుతారు. కాని తాము అన్నిటికంటె ముఖ్యంగా లౌకికజ్ఞానంగల కార్యవాదులమనే విశ్వాసంతో తమ మనోభావాలను అణచివేసుకుంటారు. కార్యవాదులు ఒకనిర్ణయానికివచ్చేందుకు వాడుకలోవున్న ఆచారాలను వాస్తవపరిస్థితుల్నీ ఆధారంచేసుకోవాలి. అంతేగాని, పరిశోధించని ఏదో ఒక సిద్ధాంతంకోసం తా మెరుగని అంధకూపంలోకి దూకగూడదు.

ఇంగ్లండునుండి ఎకాయెకిని భారతదేశానికి వచ్చే వైస్రాయిలు ఇండియన్ సివిల్ సర్వీస్ నిర్మాణానికి అతికిపోతూ దానిమీదే ఆధారపడివుండాలి. వారు ఇంగ్లండులో ధనికపాలకవర్గానికి చెందినవారు. కనుక ఐ. సి. యస్. ల దృక్పథాన్ని స్వీకరించడం అంత కష్టంకాదు. ఇంకెక్కడా సాటిలేని అసమాన సంపూర్ణాధికారం యీ వైస్రాయిలకు ఉంది. అందువల్ల వారివారి విధానాల్లోను చెప్పేపద్ధతుల్లోను చమత్కారమైన మార్పులు జరుగుతాయి. అధికారం మనిషిని చెరుపుతుంది. అడ్డులేని అధికారం పూర్తిగా చెరుపుతుంది. ఈ విశాలప్రపంచంలో ఏవ్యక్తికీ నేటి ఇండియాలో బ్రిటిష్వైస్రాయికి వలె అంత ఎక్కువమంది ప్రజలమీద అంతఎక్కువ అధికారం లేదు. ఇంగ్లండు ప్రధానమంత్రిగాని అమెరికా అధ్యక్షుడుగాని మాట్లాడజాలనివిధంగా ఇండియావైస్రాయి సాధికారంగా మాట్లాడుతాడు. ఈ వైస్రాయితో పోల్చదగినవాడు ఒక్క హిట్లరు మాత్రమే. వైస్రాయిమాత్రమేకాదు ఆయనసలహాసంఘంలో ఆంగ్లసభ్యులు, గవర్నర్లు, ఆఖరుకు వారిక్రింది శాఖల కార్యదర్శులు, మేజస్ట్రేట్లుకూడ యింతే. అధికారము, కీర్తి తమవే గనుక తాము చెప్పేవీ చేసేవీ సరైనవనే విశ్వాసంతో – అధమస్థాయిలోనివా ళ్ళేమనుకున్నా తాము చెప్పేవీ చేసేవీ అంగీకరించితీరాలనే దృఢాభిప్రాయంతో వారు మరెవ్వరూ అందుకోలేని ఉన్నతస్థానాన్నుంచి హుందాగా మాట్లాడుతారు.

వైస్రాయిసలహాసంఘంలో కొందరు సభ్యులు సరాసరి ఇంగ్లండునుంచే నియమింపబడుతారు. వారు ఇండియన్ సివిల్ సర్వీసుకు చెందినవారు కారు. సాధారణంగా సివిల్ సర్వీసువారికి వీరికి మాటల్లో, విధానాల్లో ప్రత్యేకమైన భేదం వుంటుంది. వారు ఆ అధికారయంత్రంలో సులభంగానే పనిచేయగలరు. కాని ఐ. సి. ఎస్.లవలె

నిశ్చితాధికారానికి తగిన హుందాను, తృప్తిని పూర్తిగా అలవచ్చుకోలేరు. ఆ సంఘంలోని భారతీయసభ్యులు (ఇటీవలనే చేర్చుకోబడినవారు) ఎంత సంఖ్యాబలము, సూక్ష్మబుద్ధిగలవారైనా, వారినిమించినవారైనా, అసలా ఐ. సి. ఎస్.ల వలె ప్రవర్తించలేరు. సివిల్ సర్వీసుకు చెందిన భారతీయులు - అధికారాధిపత్యంలో వారిస్థాన మేదైనప్పటికి - ఈ వర్గానికి చెందరు. వారిలో కొందరు తమ బ్రిటిష్ సహచరులను అనుకరించబోయి, అంతగా చేతగాక డాంబికులుగా, పరిహాసాస్పదులుగా తయారవుతారు.

ఇండియన్ సివిల్ సర్వీసులోని కొత్తతరం బ్రిటిషువారు ఆలోచనలోను, వ్యక్తిత్వంలోను కొంత మెరుగని నా విశ్వాసం. వారు పాతచట్రంలో అంత తేలికగా యిముడరు. అయితే, విధానాలేర్పరచడం, అధికారం ఛలాయించడం పెద్దవారిచేతుల్లోనే వుండడంవల్ల ఈ కొత్తవారివల్ల ఒరిగేదేమీ వుండదు. కొత్తవారు అమల్లోవున్న విధానాన్ని అంగీకరించాలి. లేదా రాజీనామాలిచ్చి, మాతృదేశానికి ప్రయాణంకట్టాలి. ఈలాగున కొన్నిసార్లు జరిగింది కూడాను.

నా చిన్నతనంలో భారతదేశంలో బ్రిటిష్‌వారిచే నడుపబడుతున్న వార్తాపత్రికలు ఎలా ఉండేవో నాకు గుర్తుంది. అవి అధికార వార్తలు, ఉపన్యాసాలు, బదిలీలు, ప్రమోషన్లు మొదలైన ఉద్యోగవార్తలతోను, ఇంగ్లీషువారి కార్యకలాపాలతోను, పోలో, గుర్రపుపందేలు, నృత్యాలు, నాటకప్రదర్శనలు వగైరా వార్తలతోనే నిండిఉండేవి. భారతీయులనుగురించి, వారి సాంఘిక, రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానికజీవితాలనుగురించి ఒక్కముక్కైనా ఉండేదికాదు. ఆ పత్రికలు చదువుతూంటే అసలు భారతీయులనేవా రున్నారని అనుకోవడానికే ఆస్కారం ఉండేదికాదు

బొంబాయిలో జట్టుకు పదకొండుమందిచొప్పున ఉండే నాలుగు పక్షాలమధ్య చతుర్భుజ క్రికెట్‌పోటీలు జరిగేవి. ఆ నాలుగు జట్లులూ వరుసగా హిందువులు, మహమ్మదీయులు, పార్శీలు, యూరోపియన్లతో ఏర్పడేవి. యూరోపియనులజట్టును, 'బొంబే ప్రెసిడెన్సీ' అనేవారు. మిగతావాటిని హిందువులు, ముస్లిములు, పార్శీలు అనిమాత్రమే పేర్కొనేవారు. ఆవిధంగా బొంబాయి యూరోపియనులచే ప్రాతి

నిర్వహింపబడేది. ఏదో ఆటకోసం గుర్తింపబడిన విదేశీజట్టులని మిగతవారిని అనుకునేందుకు అవకాశం ఉండేది. ఈ జట్టులనుగురించి ఎంతోవివాదం ఉన్నా, పదకొండుమందిజట్లు మతప్రాతిపదికపై ఏర్పడ రాదనే ఆందోళన తీవ్రంగా వున్నా నేటికీ ఈ పోటీలు జరుగుతూనే ఉన్నాయి.

భారతదేశంలోని ఆంగ్లేయులక్లబ్బులకు సాధారణంగా ది బెంగాల్ క్లబ్, ది అలహాబాద్ క్లబ్, మొదలగు ప్రాంతీయపేర్లున్నాయి. ఆ క్లబ్బులు ఆంగ్లేయులకు లేక యూరోపియన్లకు మాత్రమే పరిమితమై ఉండేవి. ఒకప్రాంతంపేరు కలిగిఉండడానికిగాని, కొంద రొక కూటమిగా ఏర్పడి ఒకక్లబ్బునేర్పరచుకోవటానికి గాని,ఇతరులు అందులో చేరడానికి సమ్మతించకపోవటానికిగాని అభ్యంతరం వుండనక్కరలేదు. కాని, ఇది ఇండియా అంటే తామేననే బ్రిటిషువారి పాతఅలవాటునుంచి, తామే బెంగాలు, అలహాబాదులకు నిజమైన ప్రతినిధులమన్నట్లు ఆ పేర్లు పెట్టుకోవడం నేర్చుకున్నారు. వారిదృష్టిలో ఇతరులందరూ దేహానికి కణితిలాంటివారు. తమస్థానం తెలుసుకొని తదనుగుణ్యంగా ప్రవర్తిస్తే ఉపయోగపడేరకము, లేకపోతే పనికిమాలినవాళ్ళూను. సంస్కృతీ సామ్యం కలవాళ్ళు తీరికసమయాల్లో ఒక్కచోట కలుసుకుని ఆడుకు నేందుకు, యితర అడ్డంకులు లేకుండా సాంఘికసంబంధాలు ఏర్పరచు కునేందుకు అవసరమైన యీ క్లబ్బులలో యూరోపియనులుకానివారికి స్థానం లేకపోవడం సమర్థనీయంకాదు. అది జాత్యహంకారానికి సంబంధించినది మాత్రమే.

ఆంగ్లేయులకు లేదా యూరోపియనులకు మాత్రమే ప్రత్యేకంగా క్లబ్బులుండడానికి నామట్టుకు నాకేమీ అభ్యంతరం లేదు. అలాంటి వాటిల్లో చేరాలని కుతూహలపడే భారతీయులు అంతగా ఉండరు. కాని యీ సాంఘికబహిష్కారం జాత్యహంకారంమీద ఆధారపడినది గాక తా నేదో మహోన్నతస్థానంలో ఉన్నట్లు తన్నెవరూ సమీపించ రాదన్నట్లు ప్రవర్తించే పాలకవర్గానికే పరిమితమైతే అది వేరేవిషయం. బొంబాయిలో ఒక ప్రసిద్ధమైన కబ్బులోకి - కనీసం దాని విజిటర్స్ గదిలోకి అయినా ఏ భారతీయుణ్ణీ - అతడు మహారాజైనా, పారి

శ్రామికవేత్త అయినా - (నౌకరుగా తప్ప) - రానిచ్చేవారు కాదు. నాకు తెలిసినంతలో యిప్పటికీ రానివ్వడంలేదు.

భారతదేశంలో జాతిభేదం ఆంగ్లేయులకు భారతీయులకు మధ్య గాక, యూరోపియన్లకు ఆసియావాసులకు మధ్యేననవచ్చు. ఇండియాలో ప్రతియూరోపియను - అతడు జర్మనీ, పోలెండ్, రుమేనియా దేశీయుల్లో ఎవరైనాకానీ - పాలకవర్గంలోనే జమ. రైలుపెట్టెలు, స్టేషన్లలలో విశ్రాంతిగదులు, పార్కులలో బల్లలు మొదలైనవాటి మీద 'యూరోపియనులకు మాత్రమే' అని గుర్తు వేస్తారు. ఇట్టివి దక్షిణాఫ్రికాలోను ఇతరదేశాల్లోను ఉండడం ఘోరమే. కాని ఒక జాతి స్వదేశంలోనే ఇటువంటివాటికి తలొగ్గివుండక తప్పకపోవడం దాని బానిసస్థితిని గుర్తుకుతెచ్చే సహింపరాని దుర్భరావమానమే.

ఈ జాత్యహంకార, సామ్రాజ్యవాదగర్వాల బహిరంగ వికృత లక్షణాలు క్రమంగా మారుతున్నాయనేది నిజమే. కాని యీ క్రమం మరీ మందకొడిగా వుంది. దానిని నిరూపించే సంఘటనలు తరచుగా జరుగుతూనే వున్నాయి. రాజకీయవత్తిడీ, సమరోత్సాహంగల జాతీయోద్యమపెంపూ తప్పనిసరిగా మార్పువచ్చేట్టు, పూర్వపు జాత్యహంకారాన్ని, దురాగతాన్నీ, తగ్గించేందుకు తీవ్రప్రయత్నాలు చేసేటట్టు చేస్తాయి. అయినప్పటికీ అదేరాజకీయోద్యమము సంఘర్షణాస్థాయికి చేరి, దాన్ని అణచడానికి ప్రయత్నించినపుడు మళ్ళీ పూర్వపు జాత్యహంకారము, సామ్రాజ్యవాదగర్వము మరింత తీవ్రరూపంలో ప్రత్యక్షమవుతాయి.

ఆంగ్లేయులు సూక్ష్మగ్రాహులు. అయినా వారు విదేశాలకు వెళ్ళినపుడు అక్కడివారిని తెలుసుకోకపోవడం విచిత్రమే. పాలకులకు పాలితులకు మధ్యగల సంబంధం పరస్పరం అవగాహనచేసుకునేందుకు ప్రత్యేక ప్రతిబంధకంగా తయారయ్యే భారతదేశంలో యీ వైచిత్రి మరింత స్పష్టంగా కనిపిస్తుంది. ఎవరైనాసరే యీ భేదము ప్రయత్నపూర్వకమైనది అనుకోవచ్చు. అందువల్ల ఎవరికివారు తాము ఎదుటివారిలో చూడదల్చుకున్నదిమాత్రమే చూస్తూ తదితర విశేషాలపట్ల గ్రుడ్డివారివలె ప్రవర్తిస్తారు. అయితే, ఒకరు గమనించనంత మాత్రాన యథార్థాలు అదృశ్యమైపోవు. ఆ యథార్థవిశేషాలు వారిదృష్టుల

నాకట్టినప్పుడు అదేదో హఠాత్ పరిణామమన్నట్లు దానిపట్ల ఏహ్య, నిరసనభావాలు కలుగుతాయి. అదేదో గారడీ అనిపిస్తుంది.

అసలే కులప్రధానమైన యీ దేశంలో బ్రిటిష్‌వారు - ముఖ్యంగా యిండియన్ సివిల్ సర్వీసువారు మరోకులాన్ని సృష్టించారు. అది పాషాణప్రకృతి, ప్రత్యేక కట్టుబాటులుగల కులం. ఆ సర్వీసులోని భారతీయులు అవే చిహ్నాలను ధరిస్తూ, దాని నియమాలనే అనుసరిస్తున్నా ఆ కులానికి చెందరు. ఆ కులం తన మహత్తర ప్రాముఖ్యతలో, మత విశ్వాసాన్ని పెంపొందించుకుంది. ఆ విశ్వాసంచుట్టూ యథోచిత మైన పురాణగాథలు పెంపొంది, దాని ఆధిక్యతను నిలబెట్టేందుకు సాయపడుతున్నాయి. విశ్వాసము, స్వార్థప్రయోజనాలకలయిక ఎంతో శక్తివంతమైనది. దానికి ఏ ప్రతిద్వంద్వి ఏర్పడినా గాఢమైన పాశవికావేశాలను, భయంకరక్రోధాన్ని రేకెత్తిస్తుంది.

## ౨ బెంగాలుదోపిడి ఇంగ్లండులో పారిశ్రామికవిప్లవానికి సహాయపడింది

పదిహేడవ శతాబ్దారంభంలో, ఈస్టిండియాకంపెనీ సూరతులో ఒక కర్మాగారాన్ని స్థాపించుకునేందుకు మొగలుచక్రవర్తినుండి అనుమతిపొందింది. వారు కొన్నేండ్లతర్వాత కొంతభూమి కొని మద్రాసును నిర్మించారు. 1662లో పోర్చుగీసువారు బొంబాయిని ఆంగ్లచక్రవర్తియైన రెండవ ఛార్లెస్‌కు కట్నంగా యిచ్చారు. అతడు దాన్ని యీస్టిండియాకంపెనీఅధీనంచేశాడు. 1690 లో కలకత్తానగరం నిర్మింపబడింది. ఆవిధంగా 17వ శతాబ్దాంతంనాటికి బ్రిటిష్‌వారు భారతదేశంలో అనేక స్థావరాలను సంపాదించుకోనుటే గాక భారతసముద్ర తీరాల్లో అనేక రేవులుకూడ నిర్మించుకున్నారు. వారు నెమ్మదిగా దేశాంతర్భాగాలకు కూడ వ్యాపించారు. 1757లో జరిగిన ప్లాసీయుద్ధం మొట్టమొదటిసారిగా ఒక విశాలభూభాగాన్ని వారిఅధికారంలోకి తెచ్చింది. కొద్దిసంవత్సరాల్లోనే బెంగాలు, బీహారు, ఒరిస్సా, తూర్పు కోస్తాలు వారిఅధీనంలోకొచ్చాయి. సుమారు 40 సంవత్సరాల తర్వాత, 19వ శతాబ్ది ప్రారంభంలో ఒక పెద్ద సంఘటన జరిగింది. దానితో వారు ఢిల్లీ ముఖద్వారాలను సమీపించారు. 1818 లో

మహారాష్ట్రులు చివరిసారిగా ఓడిపోయినప్పుడు మూడవ అంచె, 1849 లో శిఖ్ఖుయుద్ధాల అనంతరం నాల్గవఅంచె అధిగమించబడి వారిరాజ్యాధికారానికి సమగ్రస్వరూపం ఏర్పడింది.

ఆవిధంగా బ్రిటిష్‌వారు మద్రాసునగరంలో 3 శతాబ్దాలకు కొంచెం మెక్కువగా వున్నారు. బెంగాలు, బీహారు మొదలగువాటిలో 187 ఏండ్లపాటు పరిపాలించారు. 145 ఏండ్లక్రితం దక్షిణాపథంలో తమ సామ్రాజ్యాన్ని విస్తరింపజేసుకున్నారు. సంయుక్తరాష్ట్రాలు, (ఇప్పటి పేరు), మధ్య పశ్చిమభారతాల్లో వారు ప్రవేశించింది 125 ఏండ్లక్రితం. పంజాబులో ప్రవేశించి 95 ఏండ్లయింది. (ఇదివ్రాసినది 1944జూన్‌లో.) వైశాల్యంలో చాల చిన్నది గనుక మద్రాసునగరంసంగతి వదలి వేస్తే, వారు బెంగాలును పంజాబును ఆక్రమించుకోడానికి మధ్య దాదాపు నూరేండ్లఅంతరమున్నది. ఈకాలంలో బ్రిటిష్‌వారి దృక్పథమూ, పరిపాలనావిధానాలూ పదేపదే మారుతూవచ్చాయి. ఇంగ్లండులో జరిగిన కొత్తపరిణామాలవల్ల ఇండియాలో బ్రిటిష్ పరిపాలన సుసంఘటితంకావడం కోసం యీ మార్పులు చేయబడ్డాయి. కొత్తగా కలుపుకున్న ప్రాంతాలను పరిపాలించేవిధానము - యీ మార్పులనుబట్టి, బ్రిటిష్‌వారిచే ఓడింపబడ్డ పాలకవర్గాల వ్యక్తిత్వాలనుబట్టి - రకరకాలుగా ఏర్పడింది. బెంగాలులో చాల సులభంగా విజయం లభించింది. అక్కడ ముస్లింభూస్వాములు పాలకవర్గాలుగా పరిగణించబడ్డారు. అందువల్ల వారిబలాన్ని ఛిన్నాభిన్నం చేసేందుకు ఆంగ్లేయులు ఒక పంథాననుసరించారు. కాని పంజాబులో పరిస్థితి ఇందుకు భిన్నంగా వుంది. అది శిక్కులనుండిలాక్కోబడింది గనుక బ్రిటిష్‌వారికి అచ్చటి ముస్లింలకు మధ్య ప్రాథమికమైన వైరభావంలేదు. దేశంమొత్తంమీద బ్రిటిష్‌వారికి ముఖ్యవైరులు మహారాష్ట్రులే.

భారతదేశంలో బ్రిటిష్‌వారిపాలనలో ఎక్కువకాలం వున్న ప్రాంతాలు తలిమ్మా అన్నిప్రాంతాలకంటె ఎక్కువ బీదవిగాఉండడం గమనార్హమైన సంగతి. ఆంగ్లేయులపరిపాలనాకాలానికి క్రమంగా పెరుగుతున్న పేదరికానికి గల సాన్నిహిత్యాన్ని చిత్రీకరిస్తూ ఒకపటాన్ని గీయవచ్చు. ఇట్టి పరిశీలనలో కొన్ని మహానగరాలూ, పారిశ్రామిక

కేంద్రాలూ వున్నంతమాత్రాన అంతగా భేదం వుండదు. మనం ముఖ్యంగా గురించవలసింది మొత్తం ప్రజలస్థితిగతు లెలావున్నవా అనేదే. భారతదేశంలోకల్లా బెంగాలు, బీహారు, ఒరిస్సా, మద్రాసు రాష్ట్రంలో కొన్నిభాగాలూ నిరుపేదప్రాంతాలు. పంజాబులో ప్రజల చైతన్యస్థాయి, జీవనప్రమాణాలు అన్నిచోట్లకంటె హెచ్చుగా వున్నాయి. బ్రిటిష్‌వారు రాకపూర్వం బెంగాలు భాగ్యవంతమై కళకళ లాడుతూ వుండేది. ఇలాంటి పోలికలకూ, భేదాలకూ అనేక కారణా లుండవచ్చు. కాని ఒక యాథార్థాన్ని మాత్రం మరువలేము. ఎంతో భాగ్యవంతమై సస్యశ్యామలంగావున్న బెంగాలు 187 ఏండ్ల బ్రిటిష్ పరిపాలనానంతరం (ఈ పాలకులు వున్నపరిస్థితుల్ని బాగుచేసేందుకూ, స్వపరిపాలనావిదానం నేర్పేందుకూ అహరహం కృషిచేస్తున్నామని చెబుతున్నారు) యీనాడు నిరుపేదదై, పస్తులతో, చావులతో కుమిలే దౌర్భాగ్యస్థితిలో వుంది.

బ్రిటిష్‌పాలనానుభవాన్ని మొట్టమొదట చవిచూచింది బెంగాలు. ఆ పరిపాలన నిలువుదోపిడితో ప్రారంభమైంది. అప్పుడారంభ మైన రివెన్యూపద్ధతి బ్రతికివున్న రైతులనుండేగాక మృతిచెందినవారి నుండికూడ వారికిగల చివరిపైసావరకు గుంజుకునేది. ఎడ్వర్డ్ థాంప్సన్, జి. టి. గారెట్ అనే బ్రిటిష్ చరిత్రకారులు చెప్పినదాన్నిబట్టి "కార్టే, పిజారోలకాలంలో స్పెయిన్‌దేశీయుల నావేశించినట్లు ఆంగ్లేయుల బుర్రల్లో ధనాశాపిశాచి వెర్రితలలువేసింది. ఈ అత్యాశకు మరో ఉదా హరణ లేదు. ముఖ్యంగా బెంగాలు ఆఖరురక్తపుచుక్క పీల్చుకోబడేంత వరకు శాంతినెరుగదు." "ఆతరువాత ఏండ్లతరబడి ఇండియాలో సాగిం చబడిన బ్రిటిష్‌వారి ధనార్జనావిధానవికృతరూపాలకు, అవినీతిచర్య లకూ ముఖ్యబాధ్యుడు క్లైవు." సామ్రాజ్యనిర్మాత అయిన యీ క్లైవు విగ్రహం యిప్పుడు లండనులోని భారతకార్యాలయం ఎదుట నిలబెట్ట బడివుంది. అదివచ్చిదోపిడి. బెంగాలు అతిభయంకరక్షామాలతో ధ్వంస మైపోయేవరకు ఆ కల్పవృక్షం పదేపదే దులుపుకోబడింది. తరువాతి కాలంలో యీ విధానాన్నే 'వాణిజ్యం' అన్నారు. కాని వాస్తవానికి మార్పేమీలేదు. 'వాణిజ్యం' అని అనబడ్డది ప్రభుత్వమే. ఆ వాణిజ్యం వట్టిదోపిడీమాత్రమే. ప్రపంచచరిత్రలో యిటువంటి ఉదాహరణలు చాల

తక్కువ.ఇది వేర్వేరు పేరులతో, వివిధరూపాల్లో ఏకొద్దిసంవత్సరాలో గాక తరాలతరబడి అమలులోవున్నదనేసంగతి గుర్తుంచుకోవాలి. వచ్చిదోపిడీ విధానం క్రమంగా చట్టబద్ధమైనబందిపోటుతనంగా మారింది. స్పష్టంగా కన్పించకపోయినా నిజానికిది మరీ దారుణమైనది. బ్రిటిష్ పరిపాలనాఆరంభదశల్లో అవినీతి, లంచగొండితనం, ఆశ్రితపక్షపాతం, దమననీతి, ధనాశ, మనం వూహించలేనంత విపరీతంగా ఉండేవి. ఆంగ్లభాషలో కలిసిపోయిన 'లూట్' అనే హిందూస్థానీ పదం గమనార్హము. ఇలా జరిగింది ఒక్క బెంగాలులోనే కాదని "అవినీతిపరంపరలకు ప్రపంచంలో సాటిలేని ప్రమాణాన్ని స్థాపించిన బ్రిటిష్‌పాలనా ప్రథమదశలను ఎవ్వరూ మరువలే"రని ఎడ్వర్డ్ థాంప్సన్ వ్రాశాడు.

దీనంతటికీ ఫలితం దానిఆరంభదశలోనే ఏర్పడిన 1770 నాటి క్షామం. ఇది బెంగాలు, బీహారుల్లో మూడోవంతుజనాభాను తుడిచివేసింది. కాని ఇదంతా అభ్యుదయంకోసమే! ఇంగ్లండులో పారిశ్రామిక విప్లవాన్ని సృష్టించేందుకు వాస్తవానికి తానే ఎక్కువగా సహాయపడ్డానని బెంగాలు గర్వించవచ్చు! బ్రూక్ ఆడమ్స్ అనే అమెరికన్‌రచయిత ఇదెలా సంభవించిందో వర్ణించాడు. "ఇండియానుంచి వస్తున్న ధన ప్రవాహం బ్రిటిష్‌వారి జాతీయపెట్టుబడులను వృద్ధిచేసి, ఆ దేశీయ శక్తుల్ని పెంచడమేగాక దాని ప్రయోజనాల పరిమితినీ, వేగాన్నీ పెంచింది. ప్లాసీయుద్ధం ముగిసినవెంటనే బెంగాల్లో దోచుకోబడినధనం లండనుకు రాసాగింది. దానిఫలితంకూడా వెంటనే కనిపించింది. 1770 లోనే పారిశ్రామికవిప్లవం ఆరంభమైందని అభిజ్ఞులందరూ అంగీకరిస్తున్నారు... ప్లాసీయుద్ధం 1757లో జరిగింది. ఆ తర్వాతవచ్చిన మార్పు యొక్క వేగానికి, మరెక్కడా పోలికే దొరకదు. 1760లో ఫ్లయింగ్ షటిల్ (మగ్గంలోనాడా) వచ్చింది ఇనుమునుకరిగించేందుకు కట్టెలకు బదులు బొగ్గునుఉపయోగించడం ఆరంభమైంది. 1764లో హార్‌గ్రీవ్స 'స్పిన్నింగ్‌జెన్నీ' (నూలువడకుయంత్రం) ని కనిపెట్టాడు. 1776 లో క్రాంప్టన్ మరోసాధనాన్ని తయారుచేయగా, 1785లో కార్ట్‌రైట్ మరమగ్గాన్ని సృష్టించాడు. 1768లో జేమ్స్‌వాట్ ఆవిరియంత్రాన్ని అమర్చాడు...ఆకాలంలో వేగాన్నిపుంజుకుంటున్న మార్పులకు యీ పైవన్నీ బాహ్యలక్షణాలుగా వున్నవేగాని అవే ఆ వేగాన్ని సృష్టించి

ఉండలేదు. అసలు ప్రకృతిసిద్ధంగా, నవీనసాధనాలు పరోక్షప్రాధాన్యత గలవి మాత్రమే. అవి పనిచేసేందుకు కావలసినశక్తులు కూడేంతవరకు మిన్నకుండవలసిందే. ఆ శక్తులకలయిక ధనరూపాన్ని దాల్చాలి. ఆ ధనం స్తబ్ధంగా నిలవఉండేదిగాక, ఎప్పుడూ చేతులుమారేదై ఉండాలి. భారత ధనప్రవాహంగాని, ఆతర్వాతి అప్పులఅవకాశాలుగాని ఏర్పడకపూర్వం యీనవీనసాధనాలను కదిలించేందుకు తగినశక్తులు ఏవీ లేవు...బ్రిటను దాదాపు 50సంవత్సరాలకాలం ప్రపంచంలో ఏ పోటీదారూలేకుండా నిలవగలిగిందంటే ఇండియానుంచిదోచుకున్నధనానికితుల్లే అత్యధిక లాభాలనుసంపాదించినఘనత సృష్ట్యాదినుంచీ యిప్పటివరకూ మరి దేనికీ లేకపోవడమే.

## 3 భారతీయపరిశ్రమలవిధ్వంసము, వ్యవసాయనాశనము

ఆసియాలో లభించే సుగంధద్రవ్యాలు, ఇంకా అటువంటివాటికి యూరపులో ఎక్కువ గిరాకి ఉండేది. అట్టివస్తువులను, ఇండియాలో తయారైనగుడ్డలు మొదలైనవాటిని తరలించుకుపోయేఉద్దేశంతోనే ఈస్టిండియాకంపెనీ స్థాపించబడింది. ఆదిలో దాని ముఖ్యవ్యాపారం యిదే. పరిశ్రమల్లో నూతన సాంకేతికాభివృద్ధితో, ఇంగ్లండులో 'పారిశ్రామికపెట్టుబడిదారు'లనే ఒక కొత్తవర్గం బయలు దేరి, యీవిధానంలో మార్పురావాలని వత్తిడిచేసింది. ఇండియా ఉత్పత్తులు బ్రిటన్‌లో అమ్మరాదు. బ్రిటిష్‌ఉత్పత్తులకు ఇండియా వ్యాపారరంగం కావాలి. ఈకొత్తవర్గంపలుకుబడిచే బ్రిటిషుపార్లమెంటు ఇండియానుగురించీ, ఈస్టిండియాకంపెనీనడతనుగురించీ శ్రద్ధతీసుకో సాగింది. తొలిచర్యగా ఇండియావస్తువులు ఇంగ్లండుకు రారాదనిచట్ట బద్ధంగా నిషేధించింది. ఇండియావస్తువుల ఎగుమతివ్యాపారమంతా ఈస్టిండియాకంపెనీ గుత్తగొనివుండడంవల్ల ఈ నిషేధం యితరదేశాల వాణిజ్యరంగాల్లోకూడా మార్పుతెచ్చింది. ఈ చట్టంచేయగానే భారతీ యవుత్పత్తిదారులకృషిని పరిమితంచేయడానికీ, అణచివేయడానికీ గట్టిచర్యలు తీసుకోబడ్డాయి. అనేకవిధాలుగా దేశీయపన్నులద్వారా ఇక్కడివస్తువులు ఈ దేశంలోనే స్వేచ్ఛగా సరఫరాఅవడానికూడా వీల్లేకుండా చేశారు. ఈలోగా బ్రిటిష్‌వస్తువులు యథేచ్ఛగా యీ

దేశంలోకి వచ్చాయి. భారతీయవస్త్రపరిశ్రమ కూలిపోయి నేతపని వారు, చేతిపనులవారు అసంఖ్యాకంగా నిరుద్యోగులైపోయారు. ఈ పరిణామం బెంగాలు, బీహారులలో అతివేగంగా జరగ్గా, ఇతరప్రాంతాలకు బ్రిటిషుపాలన ఇనుపదారులతోపాటు క్రమంగా వ్యాపించింది. ఇది క్రమంగా నౌకానిర్మాణం, లోహవస్తూత్పత్తి, గాజు, కాగితం మొదలైన అనేక పూర్వ పరిశ్రమలనుకూడా నేలమట్టంచేస్తూ 19వ శతాబ్దం అంతా కొనసాగింది.

వస్తూత్పత్తిలో పాతపద్ధతులు నూతనపరిజ్ఞానంతో ఘర్షణపడడం వల్ల ఈపరిణామం కొంతవరకు అనివార్యమే. ఆ పరిణామం రాజకీయార్థిక వత్తిడులతో త్వరితంచేయబడిందేగాని, నూతనవిధానాలను ఇండియాలోకూడా ప్రవేశపెట్టేప్రయత్నం జరగలేదు. అసలు అలాంటిది జరక్కుండాఉండేందుకే అన్నిరకాల ఆటంకాలూ కల్పించబడ్డాయి. ఆవిధంగా నూతనపరిశ్రమాభివృద్ధి నరికట్టి, భారతదేశఆర్థికస్థితిని దిగ్బంధంచేశారు. భారతదేశంలో బ్రిటిష్‌వస్తువులుమాత్రమే లభ్యమయ్యేపరిస్థితినికల్పించినందువల్ల దేశంలో నిరుద్యోగం, పేదరికం శరవేగంగా వృద్ధిపొందాయి. ఆధునిక వలసఆర్థికవిధానం ఒక మహత్తరరూపంలో మలచబడింది. పారిశ్రామికదేశమైన ఇంగ్లండుకు, ఇండియా వ్యావసాయికవలసదేశంగా మారి, ముడిపదార్థాలను సరఫరాచేస్తూ, బ్రిటిషుపారిశ్రామికఉత్పత్తులకు గొప్ప వ్యాపారరంగమయింది.

చేతిపనివారలవర్గం అంతరించడంతో ఇంతవరకు కని, విని యెరుగనంతగా నిరుద్యోగం ప్రబలింది. ఇంతవరకు ఆయాపరిశ్రమల్లో, చేతిపనుల్లో నిమగ్నులైవున్న లక్షలాదిజనం యిప్పుడేంచెయ్యాలి? వారెక్కడికి పోవాలి? వారు తమ పాతవృత్తుల నవలంబించే అవకాశమూ లేదు, మరో కొత్తవృత్తికి మార్గమూలేదు. నశించరాని యీదారుణ పరిస్థితినుంచి తప్పించుకోడానికి మృత్యుమార్గం ఒక్కటే ఎప్పుడూ తెరచివుంటుంది. బహుశా వారు చావగలరనుకోండి! లక్షలాదిగా చనిపోయారుకూడాను. ఇండియా గవర్నర్‌జనరల్ లార్డ్ బెన్‌టింక్ "వాణిజ్యచరిత్రలో యిలాంటివుదాహరణ మరేదీ వుండదు. భారతదేశమైదానాలను నూలువడికేవారి ఎముకలు చలువచేస్తున్నాయి." అని 1834లో వ్రాశాడు. అయినా ఇంకా వారిలో అనేకమంది లేకపో

లేదు. బ్రిటిష్‌విధానం దేశం మారుమూలలకుకూడా వ్యాపించడంతో నిరుద్యోగానికి ఆహుతిఅవుతూనేవున్నారు. ఈ లక్షలాదిశ్రామికులకు, నిపుణులకు వుద్యోగమూ లేదు, పనీలేదు; వారి పూర్వనైపుణ్యమంతా నిరుపయోగమే. ఇంకా భూమి అనేది మాయంకాలేదు గనుక, వారంతా భూమికేసి మళ్ళేరు. కాని అప్పటికే భూమి పూర్తిగా ఆక్రమించుకో బడివున్నది కాబట్టి, కొత్తవారికి లాభసాటిగాఉండే అవకాశం అంతగా లేదు. అందువల్ల వారు భూమికిభారంగా తయారయ్యారు. భూభారంతో పాటు దేశదారిద్ర్యంకూడా పెరిగి, జీవనవ్యయప్రమాణం నమ్మలేనంత హీనస్థితికి దిగజారిపోయింది. చేతిపనులవారు శ్రామికులు తప్పనిసరియై కొనసాగించిన "భూమివైపుమళ్ళం"డనే వుద్యమంవల్ల - పారిశ్రామికు లకు వ్యావసాయికజనానికీమధ్య సంఖ్యాబలంలో విపరీత హెచ్చు తగ్గులు ఏర్పడ్డాయి. ఇతరవృత్తులూ, ధనార్జనావకాశాలూ లేకపోవడం వల్ల వ్యవసాయమే ప్రజల ముఖ్యవ్యాపకమయింది.

ఇండియా క్రమంగా గ్రామీణదేశంగా మారిపోయింది. గత శతాబ్దంలో, అభివృద్ధిచెందిన ప్రతిదేశంలోనూ ప్రజలు వ్యవసాయా న్నుంచి పరిశ్రమల్లోకి, గ్రామాలనుంచి పట్నాలకుతరలడం కనిపిస్తుంది. కాని బ్రిటిషుపాలనావిధానఫలితంగా ఇండియాలో యిదితల్లక్రిందులైంది. ఇందుకు సంబంధించినఅంకెలు ఎంతోస్పష్టంగా ఉన్నాయి. 19వ శతాబ్దా మధ్యలో వ్యవసాయంమీద ఆధారపడినవారు నూటికి 55 మంది మాత్ర మే కాగా, ఇటీవల వీరు నూటికి 74 మందివరకు ఉంటారని అంచనా వేయబడింది. (ఇది యుద్ధానికి పూర్వపులెఖ్ఖ). యుద్ధకాలంలో పరి శ్రమల్లో ఉద్యోగాలు చాలా పెరిగినప్పటికీ 1941 జనాభా లెక్కల ప్రకారం జనాభా పెరుగుటవల్ల, వ్యవసాయంమీద ఆధారపడివున్నవారి సంఖ్య మరీ పెరిగింది. యథాలాపంగా వచ్చి చూచేవారికి కొన్నినగ రాలు పెరగడంవల్ల (ఇది ముఖ్యంగా చిన్నపట్టణాల విచ్ఛిత్తిమీదనే సంభవిస్తుంది) ఇండియా పరిస్థితులనుగురించి తప్పుడు అభిప్రాయాలు ఏర్పడవచ్చు.

ఆ యీ కారణాలవల్ల భారతీయప్రజల దుర్భరదారిద్ర్యానికి ఇదే వాస్తవమైన మూలకారణం. ఇది మరీ, యిటీవలనే ఆరంభమైంది. జబ్బులు, నిరక్షరాస్యత మొదలైనవి, నిరంతరపస్తులు, చాలీచాలని

తిండి కారణంగా ఏర్పడటంకూడా ఒకహేతువు. జనాభా మరీవిపరీతంగా పెరగడందురదృష్టకరం. అవసరమైనచోట జనాభాపెరుగుదల నరికట్టేం దుకుతగుప్రయత్నాలు చెయ్యవలసిందే. కాని, పారిశ్రామికంగా వృద్ధి పొందిన దేశాలజనసంఖ్యతో పోల్చుకుంటే యిక్కడిజనసాంద్రత మెరుగే అవుతుంది. ఇది వ్యవసాయమే ప్రధానంగాగల దేశానికి మించిన జనాభా కావచ్చు. సరియైన ఆర్థికవిధానం అమలుజరిపి, యీ జనాభా అంతటిని ప్రయోజనకరంగా వుపయోగించి దేశసౌభాగ్యాన్ని పెంపొం దించవచ్చు. వాస్తవానికి బెంగాలు, గంగామైదానంవంటి కొన్ని ప్రాం తాల్లోమాత్రమే జనసాంద్రత ఎక్కువగా వుంది; అనేక విశాలప్రదే శాల్లో జనాభా ఇప్పటికీ మరీ పల్చగా వుంది. ఇండియాకంటె గ్రేట్ బ్రిటన్‌లో రెట్టింపు జనసాంద్రత వుందని గుర్తుంచుకోవడం మంచిది.

పరిశ్రమల్లో ఏర్పడినసంక్షోభం వ్యవసాయరంగానికూడా త్వరి తంగా వ్యాపించి శాశ్వతవ్యవసాయసంక్షోభాన్ని యేర్పరిచింది. ఒక్కొ క్కరిభూవసతి తగ్గితగ్గి, ముక్కలుచెక్కలైపోయింది. వ్యవసాయదార్లకు ఋణభారంపెరిగి, భూములు తరచుగా అప్పులిచ్చేవారిపరంకాసాగాయి. భూమిలేని వ్యవసాయకూలీలసంఖ్య లక్షలాదిగా పెరిగింది. ఇండియా 'పారిశ్రామికపెట్టుబడిదారుల' పాలనలో వున్నా, దాని ఆర్థికస్థితి మాత్రం పారిశ్రామికయుగానికి వెనుకటిస్థితిలోనే వుండిపోయింది. పోనీ ఆకాలపు ఆర్థికస్థితికిచెందిన ధనార్జనావకాశాలైనా మిగల్లేదు. ఆధునిక పారిశ్రామికపెట్టుబడిదారీతత్వానికి భారతదేశం ఒక బానిసైపోయింది. ఆ విధానపు దుష్ఫలితాలన్నీ అనుభవిస్తూ, దానికిచెందిన సత్ఫలితాల్ని బొత్తిగా పొందలేకపోయింది.

పరిశ్రమలులేని ఆర్థికవిధానాన్నుంచి పారిశ్రామికపెట్టుబడిదారీ ఆర్థికవిధానానికి మారడంలో ప్రజలు సాముహికంగా అనేక మానసిక వ్యథల్నీ, దుర్భరకష్టాల్నీ అనుభవించాల్సివుంటుంది. ఇలాంటి మార్పులు ఆరంభమైనకాలంలో,ఈ సంధికాలపు దుష్ఫలితాలను తగ్గిం చడానికి క్రమబద్ధమైన ప్రణాళిక లేక, ఎవరిగతికివారిని వదలి వేయడంవల్ల ఈ కష్టనష్టాలు మరింత తీవ్రంగా వుంటాయి. అట్టి సంధిసమయంలో ఇంగ్లండ్‌లో యిలాంటి కష్టనష్టాలే సంభవించాయి. కాని ఆ పరిస్థితిని మొత్తంగా పరిశీలిస్తే ఈమార్పు అతిత్వరితంగా జరిగినందువల్ల, తత్కా

రణంగా నిరుద్యోగులైనవారికి త్వరలోనే కొత్తపరిశ్రమల్లో వృత్తులు లభించడంవల్ల, యీ కష్టాలు అంతగా లెక్కించదగ్గవి కావు. అంత మాత్రాన ప్రజలు బాధపడడంలేదని కాదు. ఆ విలువ లేదని కాదు. కాని ఆ బాధలు ఇతరులు - ముఖ్యంగా భారతీయులు నిరుద్యోగులై, పస్తులుండి, చావుకులోనై - అనుభవించారు. పశ్చిమయూరపులో జరిగిన యీమార్పులకు కావలసినబలిదానాల్లో ఎక్కువభాగం యూరోపియన్‌శక్తులవలసలుగావున్న ఇండియా, చైనా తదితరవలసదేశాలే బలి అయ్యాయని చెప్పుకోవచ్చు.

ఈ అన్నిసందర్భాల్లోనూకూడా ఇండియాలో పారిశ్రామికాభివృద్ధికి తగినఅవకాశాలన్నీ పుష్కలంగావుండ నేడున్నాయనేది స్పష్టంగా తెలుస్తోంది. నిర్వహణ, సాంకేతికసామర్థ్యం, నిపుణులైనకార్మికులు, ఎంత దోచుకోబడినప్పటికీ కొంతపెట్టుబడి మొదలైనవన్నీ ఉన్నాయి. 1840లో బ్రిటిషుపార్లమెంటు నియమించిన ఒక విచారణసంఘంఎదుట, ప్రఖ్యాతచరిత్రకారుడైన మాంట్‌గోమరీ మార్టిన్ సాక్ష్యమిస్తూ— "ఇండియా వ్యావసాయికంగా ఎంతగొప్పదో, వస్తూత్పత్తుల్లోకూడా అంతగొప్పది. దాన్ని వట్టి వ్యావసాయిక దేశంగా దిగజార్చప్రయత్నించే వారు దాన్ని నాగరికతాపథంనుంచి దిగజార్చ ప్రయత్నించినట్లే అవుతుంది"అని హెచ్చరించాడు. బ్రిటిష్‌వారు ఇండియాలో ఎడతెగని పట్టుదలతోచేసినప్రయత్నాలు సరిగ్గా యివే. ఒకటిన్నరశతాబ్దా వారు నిరంకుశంగా పరిపాలించిన తర్వాత, నేడు ఇండియావున్నపరిస్థితే వారివిజయానికి కొలబద్ద. ఇండియాలో ఆధునికపరిశ్రమల్ని పెంపొంచించాలనేవత్తిడి తలెత్తినప్పటినుంచి (బహుశా యిది వందసంవత్సరాలనుంచీ ననుకుంటాను)ఇండియా ముఖ్యంగా వ్యావసాయిక దేశమనీ, ఆ వృత్తికే అంకితమైఉండడం దానికి మేలనీ మనకు చెబుతున్నారు. పారిశ్రామికాభివృద్ధి వున్న స్థాయిని తారుమారుచేస్తే భారతదేశపు ముఖ్యవ్యాపకమైన వ్యవసాయానికే హానికరం కావచ్చు. ఈ దృక్పథం గల బ్రిటిష్‌పారిశ్రామికులూ, ఆర్థికవేత్తలూ భారతరైతుపట్ల చూపిన శ్రద్ధాసక్తులను మనం మెచ్చుకోవచ్చు! ఈశ్రద్ధాసక్తుల్నీ, బ్రిటిష్‌ప్రభుత్వం భారతరైతుమీదకప్పిన సున్నితతరతూకవచాన్నీ దృష్టిలోఉంచుకుంటే ఏదో విపరీతమైన దురదృష్టమో, లోకాతీతభూతమో బ్రిటిష్

వారివృద్దేశాలను భగ్నంచేశాయనీ, భారతీయరైతును ప్రపంచంలో కల్లా నికృష్టమైన, నిరుపేదగా మార్చివేశాయనీ ఎవరైనా అనుకో గలరు!

భారతదేశంలో పారిశ్రామికాభివృద్ధిని వ్యతిరేకించడం ఇప్పుడు ఎవరికైనా కష్టమే. ఐనా ఏ మహత్తరవిస్తృతప్రణాళికనో తయారుచేసి నప్పుడల్లా ఎప్పుడూ తమసలహాలనువర్షించే బ్రిటిష్‌మిత్రులు వ్యవసా యాన్ని నిరాదరణచేయరాదనీ, దానికే ప్రథమస్థానమివ్వాలనీ మనల్ని హెచ్చరిస్తూ వుంటారు. అసలు ఏమాత్రం జ్ఞానంకలభారతీయుడైనా వ్యవసాయాన్ని నిరాదరించడంగాని, రైతును విస్మరించడంగాని సంభ వమా? భారతదేశమంటే రైతు; రైతేభారతదేశం. అతనిపురోగమనమే భారతదేశపురోగమనం. మన వ్యవసాయరంగంలోని తీవ్రసంక్షోభం దానికి మూలకారణమైన పారిశ్రామికసంక్షోభంతో పెనవేసుకొని వుంది. ఈ రెండూ విడదీసిచూడడానికి వీల్లేనివి. ఈ రెంటిమధ్యగల వ్యత్యాసాన్ని తగ్గించడం చాలా అవసరం.

అవకాశందొరికినప్పుడల్లా భారతదేశం సాధించగలిగిన విజ యాలు దానికి ఆధునికపరిశ్రమలను నడుపుకోగల సామర్థ్యం వున్నదని రుజువుచేస్తాయి. నిజానికి ఇండియాలోని బ్రిటిష్‌ప్రభుత్వమూ, ఇంగ్లండు లోని పెట్టుబడిదారీస్వార్థశక్తులూ ఎంత విశ్వప్రయత్నంచేసి వ్యతిరేకిం చినా, ఇండియా యీ విజయాలను సాధించింది. 1914-18సం॥ల మధ్య జరిగిన యుద్ధకాలంలో, బ్రిటిష్‌వస్తువులు యిండియాకు రావడానికి వీల్లేకపోయినరోజుల్లోనే, ఇండియాకు మొట్టమొదటి అవకాశం లభిం చింది. బ్రిటిష్‌వారివిధానాలవల్ల లాభాలు పరిమితమైనప్పటికి ఆమేరకు ఆ అవకాశాన్నివుపయోగించుకుని భారతదేశం లాభంపొందింది. అప్ప ట్నుంచి భారతీయపరిశ్రమలను పెంపొందించాలనీ, అడ్డంకులుగావున్న ప్రత్యేకసౌకర్యాలను, నిర్బంధాలను తొలగించాలనీ ప్రభుత్వంమీద ఎడతెగనివత్తిడి జరుగుతూనేవుంది. ప్రభుత్వం 'అదే మాఆశయం' అని పైకి ప్రకటిస్తూనే వాస్తవమైన అభివృద్ధిని – ముఖ్యంగా కీలకపరిశ్రమా భివృద్ధిని ఎంతో అరికట్టింది. ఆఖరుకు 1935 వ సం॥పు రాజ్యాంగ చట్టంలో కూడా "బ్రిటిష్‌పారిశ్రామికపెట్టుబడిదారులకు ఇండియాలో

గల ప్రయోజనాల్లో జోక్యంకలిగించుకునేందుకు భారతీయశాసనసభ లకు ఏమాత్రం హక్కు లేదని ప్రత్యేకంగా పేర్కొనబడింది.

యుద్ధానికిపూర్వం భారతీయులు కీలక, భారీపరిశ్రమల్ని స్థాపిం చేందుకు ఎన్నోసార్లు తీవ్రంగా ప్రయత్నించినట్లు అధికారుల కృత్రిమ నీతివల్ల అవన్నీ భగ్నమైనట్లు అనేక రుజువులున్నాయి. యుద్ధావసర వస్తూత్పత్తి ఎంతో తక్కువగావున్న ప్రస్తుత ప్రపంచయుద్ధకాలంలో కూడా అధికారులు భారతీయులకు కల్పించిన అవరోధాలు మరీ ఆశ్చర్య కరంగా ఉన్నాయి. అట్టి అత్యంతావశ్యకపరిస్థితులుకూడా భారతీయ పరిశ్రమలపై బ్రిటిష్‌వారికిగల అయిష్టతను తొలగించలేకపోయాయి. అయినా, మనపరిశ్రమలు పెంపొందాయంటే, అది ప్రపంచసంఘటనల ప్రోద్బలంవల్లనే. ఇతరదేశాల్లో జరిగిన పెంపుదలతోగాని, జరుగవల సిన ప్రమాణంతోగాని పోల్చుకుంటే ఈ పెంపుదల బహుస్వల్పం

భారతీయపరిశ్రమాభివృద్ధికి తొలిదశల్లోచూపబడిన ప్రత్యక్ష వ్యతిరేకత క్రమంగా పరోక్షపద్ధతుల్లోకి మారింది. ఈ పద్ధతులవల్ల ప్రత్యక్షంగా కప్పాలుచెల్లించేపద్ధతి పోయి, ఎగుమతి దిగుమతిసుంకాలు, ఎక్స్చెయిజుపన్ను, ఆర్థికవిధానం, కరెన్సీచలామణి మొదలైనవాటిద్వారా ఇండియాఖర్చులతో, బ్రిటన్ లాభాలుపొందడం జరిగింది.

దీర్ఘకాలం పరాధీనులైవున్న ప్రజలకు స్వాతంత్ర్యం నిరాకరిం చడంవల్ల ఎన్నోదుష్పరిణామాలు దాపురిస్తాయి. ఇట్టివాటిలో ముఖ్య మైనది ఆత్మకుసంబంధించినది. ఇట్టి దుష్ఫలితాలన్నింటిలో ముఖ్య మైనది నైతికం; ప్రజలసృజనాత్మకచైతన్యాన్ని కొల్లగొట్టి, అవినీతి పరుల్నిచేయడం. ఇదెంతస్పష్టంగా కనిపించినా దీన్ని అంచనావేయడం అసాధ్యం. ఇంతకంటె ఒకజాతియొక్క ఆర్థికదుస్థితిని కొలవటంద్వారా తెలుసుకోవడం సులభం. మనం బ్రిటిషువా రనుసరించిన ఆర్థికవిధానా లను ఒకసారి వెనక్కుతిరిగి పరిశీలిస్తే, భారతీయుల నేటి పేదరికం ఆ విధానాలఫలితమే అనేది స్పష్టమౌతుంది. ఈ పేదరికంవెనుక ఏదో అద్భుతం లేదు. నేటి యీపరిస్థితులకు దారితీసినపరిణామాలను, కార ణాలను మనం స్పష్టంగా చూడవచ్చు.

## ౪ ఇండియా మొదటిసారిగా మరొకదేశానికి రాజకీయ, ఆర్థిక అనుబంధమగుట

ఇండియాలో బ్రిటిష్‌పరిపాలన యేర్పడడం భారతదేశానికి పూర్తిగా ఒక నూతనానుభవం. దీన్ని మరేదండయాత్రతోగాని, రాజకీయార్థికమార్పులతోగాని పోల్చడానికి వీల్లేదు. "ఇండియా లోగడ అనేకమందిచే జయించబడింది. కాని జయించినవారు ఈదేశంలోనే వుంటూ, దానిజీవితంలో భాగస్వాములయ్యారు. (ఇంగ్లండులో నార్మనులు, చైనాలో మంచూలవలె). అదెప్పుడూ తనస్వాతంత్ర్యాన్ని కోల్పోలేదు; ఎవరికీ బానిసకాలేదు. అనగా అదెప్పుడూతనసరిహద్దులకు బైటగల మరో కేంద్రంపై ఆధారపడిన రాజకీయార్థికవిధానాల్లోకి ఈడ్వబడలేదు. జన్మతః వ్యక్తిత్వంలో, సర్వదా విదేశీయంగా, విదేశాల్లోనే వుండిపోయిన ఏపాలకవర్గానికీ అదెన్నడూ లోబడలేదు." అని షెల్వాంకర్ వ్రాశాడు.

అంతకుముందువచ్చిన ప్రతి పాలకవర్గమూ - అది విదేశాలనుంచి వచ్చిందైనా, స్వదేశీయమైనా - భారతదేశ నైసర్గిక ఏకత్వాన్ని, సాంఘిక, ఆర్థికజీవితాన్ని ఆమోదించి, అందులో యిమిడిపోయేందుకు ప్రయత్నించింది. అట్టివర్గం భారతీయమై, యీదేశంలోనే పాదుకు పోయింది. ఈ కొత్తపాలకులు (ఆంగ్లేయులు) ఇందుకు పూర్తిగా భిన్నమైనవారు. వారిపునాది మరెక్కడో వుంది. వారికీ సాధారణభారతీయునికీమధ్య ఆచారం, దృక్పథం, రాబడి, జీవితవిధానాల్లో ఎంతో తేడా వుంది; వంతెనవేయలేనంత అగాధం వుంది. ఆదిలో ఇండియాకు వచ్చిన బ్రిటిషువారు, ఇంగ్లండుకు మరీదూరమైపోవడంవల్ల భారతీయ జీవితవిధానాల్లో కొన్నింటిని అలవాటుచేసుకున్నారు. అయినా, అదీ అంతంతమాత్రమే. అదైనా ఇంగ్లండుకు ఇండియాలకు మధ్య రాకపోకల సౌకర్యాలు పెరిగినకొద్దీ, వుద్దేశపూర్వకంగా విడనాడబడింది. బ్రిటిష్ పాలకవర్గాలు ఇండియాలో తమప్రతిష్ట నిలబెట్టుకోవాలంటే భారతీయులకు భిన్నంగా, ఎడంగా, ప్రత్యేకంగా, తామొక దేవలోకంవారమన్నట్టుగా వుండాలని భావించారు. ఆవిధంగా రెండుప్రపంచాలు ఏర్పడ్డాయి:

ఒకటి బ్రిటిషు అధికారులు, రెండోది కోట్లాది భారతీయప్రజానీకం ఒకరినొకరు ద్వేషించుకోవడంలో తప్ప, ఆ ఇద్దరిమధ్య ఏపోలికా లేదు. అంతకుముందు జాతులు ఒకదానిలో ఒకటి కలిసిపోయేవి; కనీసం పరస్పరాశ్రయగుణాలున్న జాతిలో యిమిడిపోయేవి. ఇప్పుడు జాత్యభిమానం ఒకవిధానంగా ఆమోదించబడింది. పైచేయిగా వున్న జాతి రాజకీయార్థిక శక్తుల్ని రెంటినీ నిరాటంకంగా అనుభవిస్తున్నందువల్ల ఈ భేదభావం మరింత గాఢమైంది.

ఏదిఏమైనప్పటికీ కొత్తపెట్టుబడిదారీవిధానం ప్రపంచమంతటా నిర్మిస్తున్న వ్యాపారరంగం భారతీయార్థికపరిస్థితిని కదలించివేసేదే. స్వయంపోషకమైన గ్రామీణజీవనవిధానం, సాంప్రదాయికంగావస్తున్నా 'శ్రమలపంపిణీ'లతో, తనపురాతనరూపంలో కొనసాగగలిగేది కాదు. కాని ఇప్పుడుజరిగినమార్పు సహజమైనది కాదు. అందువల్ల అది భారతీయసమాజంయొక్క, ఆర్థికనిర్మాణం పునాదులనే కదలించివేసింది. సాంఘికామోదమూ, కట్టుబాట్లూ దన్నుగా కలిగివుండి, ప్రజలసంస్కృతీ వారసత్వంలో ఒకభాగంగా వున్న విధానం హఠాత్తుగా నిర్బంధంగా మార్చబడింది. సంఘానికి వెలుపలినుంచి అమలుజరుపబడే మరొక విధానం నెత్తిమీదరుద్దబడింది. ఇండియా ప్రపంచవ్యాపారరంగంలో అడుగుపెట్టకపోగా, బ్రిటిషువారివలసగా, వ్యావసాయిక అనుబంధంగా తయారైంది.

ఇంతవరకు భారతీయార్థికస్థితికి పునాదిగావున్న గ్రామసంఘం ఛిన్నాభిన్నంచేయబడింది. దాని ఆర్థిక, పరిపాలనావిధానాలు అంతరించాయి. బ్రిటిష్ అధికారుల్లోకల్లా సమర్థుడైన సర్ ఛార్లెస్ మెట్కాఫ్ 1830లో యీగ్రామసంఘాలను యిట్లా వర్ణించాడు. గ్రామ సంఘాలు చిన్నతరహా సర్వసత్తాకరాజ్యాలు. వాటికి కావలసినవన్నీ అక్కడే లభించేవి. దేనికీ ఇతరప్రాంతాలపై ఆధారపడవలసిన అవుసరం లేని స్వాతంత్ర్యం ఉండేది. మరేమీమనలేనిచోటకూడా, ఇవిబ్రదుకుతాయి. ఈ గ్రామసంఘాలసంఘీభావంతో, ఐక్యతాభావంతో ప్రతిగ్రామము ఒక స్వతంత్రరాజ్యంగా మనగల్గడము భారతీయుల సుఖసంతోషాలకు ఎంతో అనువుగావుండి, అమితస్వేచ్ఛను అనుభవించడానికి కారణమైంది". ఈ గొప్పవాక్యాలను అనేకమంది తరచుగా పేర్కొంటూంటారు.

గ్రామీణపరిశ్రమల విచ్ఛిత్తి యీ గ్రామసంఘాలపై గట్టిగా దెబ్బతీసింది. పరిశ్రమ, వ్యవసాయాలమధ్యగల సంబంధం తారుమారైంది. సాంప్రదాయికమైన 'శ్రమలపంపిణీ' విధానం నాశనమైపోయింది. చెల్లా చెదురుగావున్న అసంఖ్యాకులను ఏరకమైనవృత్తిలోను ఇముడ్చలేక పోయారు. జమీందారీపద్ధతినిప్రవేశపెట్టడం మరింత సూటియైన దెబ్బగా తగిలింది. భారతీయులకు భూస్వామ్యంపైగల అభిప్రాయాలే మారవలసి వచ్చింది. భూమి సంఘపరంగావుండాలనీ, భూమినిగాక దాని వుత్పత్తినే సంఘంలోనివారందరూ అనుభవించాలనీ వారివిశ్వాసం. బ్రిటిషు గవర్నర్లు ఈ అభిప్రాయాన్ని హర్షించలేకనో, అంతకంటెముఖ్యంగా స్వప్రయోజనాలవల్లనో విపరీతచర్యతీసుకున్నారు. వారు ఇంగ్లండులోని జమీందారీవర్గానికి ప్రతినిధులు గనుక, అచటి పద్ధతికి పోలినదానినే ఇండియాలోకూడా ఏర్పరచారు. మొదట్లో స్వల్పకాలపద్ధతులమీద "మణేదారులను" నియమించారు. ఈ మణేదారులు రైతులనుంచి పన్నులు, లేదా భూమిశిస్తు వసూలుచేసి, ప్రభుత్వానికి చెల్లించడానికి బాధ్యులు. కొంతకాలానికి వీరినే జమీందార్లుగా మార్చారు. గ్రామ సంఘానికి భూమిమీద, పంటమీద ఏవిధమైన అధికారమూ లేకుండా చేశారు. తరతరాలుగా సంఘసొత్తుగా యెంచబడిన భూమి ఇప్పుడు కొత్తగా సృష్టించబడిన జమీందార్ల స్వంతఆస్తిగా మారిపోయింది. ఇందువల్ల సమిష్టికుటుంబజీవితం ప్రాతిపదికగాగల గ్రామీణసంఘీభావం పటాపంచలైంది. వృత్తిసేవలను పరస్పరసహకారంతో పంచుకొనేపద్ధతి క్రమంగా అదృశ్యంకాసాగింది.

ఈవిధమైన భూస్వామ్యాన్ని ప్రవేశపెట్టడం ఆర్థికంగా గొప్ప మార్పేగాక, సహకార సాంఘికనిర్మాణంపై భారతీయులకున్న విశ్వాసాన్నే దెబ్బకొట్టింది. భూస్వాములనబడే కొత్తవర్గం ఏర్పడింది. ఇది బ్రిటిషుప్రభుత్వంచేత సృష్టింపబడ్డవర్గం గనుక, ఎక్కువగా వారిపోలికల్నే పుణికిపుచ్చుకుంది. పురాతనవిధానం బ్రద్దలుకావడంతో, నూతన సమస్యలు తలెత్తాయి. హిందూ – ముస్లింసమస్యకు బీజాలను యిందులో చూడవచ్చు. భూస్వామికవిధానం ఆదిలో బెంగాలు, బీహారులలో ప్రవేశపెట్టబడింది. "పర్మనెంట్ సెటిల్‌మెంటు" అనే విధానంక్రింద పెద్దపెద్ద జమీందార్లు ఏర్పరచబడ్డారు. ఈ విధానంలో భూమిశిస్తు

శాశ్వతంగా నిర్ణయింపబడినందున, దాన్ని పెంచే వీలు లేనందున ఇది ప్రభుత్వానికి లాభదాయకంకాదని ఆతరువాత గ్రహించారు. అందువల్ల ఇతరప్రాంతాల్లో కొద్దికాలానికే పరిమితమైన, కొత్తసెటిల్మెంటు విధానాలు అమలుజరిపారు. అప్పుడప్పుడు భూమిశిస్తు పెంచబడింది. కొన్నిరాష్ట్రాల్లో రైతే భూమందుగావుండేపద్ధతి కూడా నెలకొల్పబడింది. భూమిశిస్తుల్ని నిర్బంధంగా, నిర్దాక్షిణ్యంగా వసూలుచేస్తూండడంవల్ల - ముఖ్యంగా బెంగాలులో - లోగడ భూమివున్నవారు నాశనం కావడం, వారిస్థానాలను ధనికులూ, వ్యాపారులూ ఆక్రమించడం సంభవించింది. అందువల్ల హిందువులకంటే ముస్లింరైతు లెక్కువగాఉన్న బెంగాలు హిందూభూస్వాములు ఎక్కువగాగల రాష్ట్రమైపోయింది.

అసంఖ్యాకులైన రైతులతోకంటె, కొద్దిమందివ్యక్తులతో వ్యవహరించడం సులభమనే ప్రధానోద్దేశంతోనే బ్రిటిషువారు పెద్దపెద్ద భూస్వాముల్ని సృష్టించారు. పన్నులరూపంలో సాధ్యమైనంత ఎక్కువ ధనాన్ని సాధ్యమైనంత తొందరగా వసూలుచేయడం వారిలక్ష్యం. భూస్వామిఅయినా, ఒప్పందం ప్రకారం గడువులోపల కప్పంకట్టలేకపోతే వెంటనే అతన్నితొలగించి, మరొకర్ని ఆ స్థానంలో ఉంచేవారు. బ్రిటిషు వారిప్రయోజనాలే తమ ప్రయోజనాలుగా భావించే మరొకవర్గాన్ని సృష్టించడం అవసరమని కూడా భావించబడింది. ఇక్కడున్న బ్రిటిషు అధికారులకు విప్లవం చెలరేగుతుందనేభయం పట్టుకుని, వారీ సంగతిని తమనివేదికల్లో పదేపదే ఉదహరించారు. లార్డ్ విలియం బెంటింక్ అనే గవర్నర్ జనరల్ 1829లో యిలా వ్రాశాడు, "ప్రజల బహుముఖాందోళనలనుంచి, విప్లవంనుంచి భద్రత అవసరమనుకుంటే పర్మనెంట్ సెటిల్మెంటువిధానం అనేక ఇతరకోణాల్లో విఫలమైనా, యీ ఒక్కప్రయోజనాన్నైనా సాధించగలిగిందని నేనుచెప్పగలను. ఈ విధానం ప్రజానీకం అంతటిమీాద పరిపూర్ణాధికారంగల బ్రిటిష్‌సార్వభౌమత్వం కొనసాగితేనే, తమకు మేలని భావించుతూన్న ఒక పెద్ద భూస్వామ్య (జమీాందారీ) వర్గాన్ని సృష్టించింది."

బ్రిటిష్‌పాలన కొత్తవర్గాలనూ, స్వప్రయోజనాపరుల్ని సృష్టించి, తానుంటేనే వారిప్రయోజనాలూ, సౌకర్యాలూ కొనసాగగలవనే భావాన్ని కలిగించి, తన్నుతాను బలపర్చుకుంటూ వచ్చింది.

భూఖామందులు, జమీందార్లు, రాజులు, పట్వారీ (గ్రామాధికారి) నుంచి వైస్రాయివరకు అసంఖ్యాకంగా వుండే తాబేదార్లు మొదలైన వారందరూ ఈ కొత్తవర్గానికి చెందినవారే. ప్రభుత్వానికి ముఖ్యావసరమైనశాఖలు రివెన్యూ, పోలీసుశాఖలే. ప్రతిజిల్లాలోనూ ఆ రెండు శాఖలపైన అధికారం చలాయించే ప్రభుత్వప్రతినిధి జిల్లాకలెక్టరు, లేక జిల్లామేజస్ట్రేటు. అతను పర్యవేక్షణ, నిర్వహణ, న్యాయ, రివెన్యూ పోలీసుశాఖల అధికారాలన్నీ కలిగిఉండి, తన జిల్లాలో నిరంకుశంగా వ్యవహరించుతాడు. ఆ జిల్లాలోను, ప్రక్కలను, సంస్థానాలేవైనావుంటే, అతడే వాటికికూడా బ్రిటిషుప్రభుత్వప్రతినిధిగా ఉంటాడు.

తర్వాత చెప్పవలసింది భారతసైన్యం. ఇందులో భారతీయులూ, ఆంగ్లేయులూ వున్నా ఉద్యోగివర్గంమాత్రం అంతా ఆంగ్లేయులే. ఇది పదేపదే పునర్నిర్మింపబడుతూ – ముఖ్యంగా 1857 తిరుగుబాటు తరువాత – చివరికి బ్రిటిష్‌సైనికవ్యవస్థకు అనుబంధింపబడింది. భారతీయ సైనికుల్లో వివిధతరహాలవారిని అదుపులోఉంచడానికి, కీలకస్థానాలన్నీ బ్రిటిషుసైనికులవశంలో వుంచుకోవడానికీ ఈ యేర్పాటు జరిగింది. "తిరుగుబాటుల నణచగల బ్రిటిష్‌సైనికుల గొప్ప ఎత్తుగడ తర్వాత దేశీయులను దేశీయులే ఎదుర్కొనే ఎత్తుగడ వస్తుంది"అని 1858 లో జరిగిన పునర్నిర్మాణని వేదిక వెల్లడిస్తోంది. "అంతరంగిక భద్రతాసైన్యం" అని పిలువబడే యీ సైనికుల ముఖ్యబాధ్యత ఆక్రమణసైనికులకుండే బాధ్యతలాంటిదే. ఇందులో ఎక్కువమంది బ్రిటిష్‌వారే. ఇండియా ఖర్చుతో బ్రిటిష్‌సైన్యం తరిఫీతుపొందేందుకు సరిహద్దురాష్ట్రం ఎంతో వుపయోగపడింది. యుద్ధసైన్యం (ఎక్కువమంది భారతీయులు) విదేశాల్లో సేవచేసేందుకు ఉద్దేశింపబడింది. ఇది బ్రిటిష్‌సామ్రాజ్యానికిగాను అనేకయుద్ధాల్లో పాల్గొన్నది. అయితే, ఖర్చులుమాత్రం పూర్తిగా ఇండియావే. ప్రజలనుంచి భారతీయసైనికుల్ని వేరుచేయడానికి ప్రయత్నించబడింది.

ఆవిధంగా తనను ఇతరులు జయించేందుకూ, ఈస్టిండియా కంపెనీచేత బ్రిటిష్‌సామ్రాజ్యానికి వప్పగించబడినందుకూ (లేదా అమ్మబడినందుకు), బ్రిటిష్‌సామ్రాజ్యం బర్మా మొదలైనప్రాంతాలను విస్తరించేందుకూ, ఆఫ్రికా, పర్షియా మొదలైనచోట్ల దండయాత్రలు

చేసేందుకూ, భారతదేశం భారతీయులనుంచి రక్షించుకునేందుకూ భారతదేశమే అన్నిఖర్చులూ భరించవలసివచ్చింది. ప్రతిఫలమేమీ లేకుండానే సామ్రాజ్యప్రయోజనాలకు రంగస్థలంగా వుపయోగపడడమేగాక, ఇంగ్లండులోవుండే బ్రిటిష్ సైన్యంలో కొంతభాగం తర్ఫీతుకు అయ్యేఖర్చులుకూడా (కేపిటేషన్ చార్జెస్) ఇండియా భరించవలసివచ్చింది. బ్రిటన్ చేసిన అనేకఖర్చులకు భారతదేశం ధనం చెల్లించవలసివచ్చింది. చైనా, పర్షియాల్లో బ్రిటన్ రాయబార, సలహాకార్యాలయాలకూ, ఇంగ్లండునుంచి ఇండియాకు వేయబడ్డ తంతి మార్గాలకూ, మధ్యధరాసముద్రంలోవుండే బ్రిటిషు యుద్ధనౌకల్లో కొంతభాగానికీ, లండన్‌లో టర్కీసుల్తానుకు బ్రిటిషువారిచ్చిన స్వాగత, సత్కారాలకూ అయిన ఖర్చులు ఇండియాయే చెల్లించింది.

ఇండియాలో రైలుమార్గాలనిర్మాణానికి (నిస్సంశయంగా కొంత దగినవీ, అవసరమైనవే) ఎంతో దూబరాఖర్చు జరిగింది. ఇండియా ప్రభుత్వం పెట్టుబడులమీద నూటికి అయిదువంతులచొప్పున వడ్డీగిట్టుబాటయ్యేటట్టు చూస్తామని హామీయిచ్చినా, అందుకవసరమైన అంచనాలువేయడం ఖర్చులను అదుపులోపెట్టడం జరుగలేదు. కొనుగోళ్ళన్నీ ఇంగ్లండులోనే. పాలకసిబ్బందికూడా అమితదుర్వ్యయంతో, వ్యర్థమైనఖర్చులతో పోషింపబడుతోంది. హెచ్చుజీతాలువచ్చే ఉద్యోగాలన్నీ యూరోపియనులకే ప్రత్యేకించబడ్డాయి. అధికారయంత్రాంగాన్ని భారతీయంచేసేవిధానం అతినెమ్మదిగా జరిగింది. ఈ 20 వ శతాబ్దంలోగాని దానిచిహ్నాలు కన్పించలేదు. ఈ విధానంకూడా అధికారాన్ని భారతీయులపరం చేయకపోగా బ్రిటిషుపరిపాలననే మరింత బలపరిచింది. వాస్తవంలో కీలకస్థానాలన్నీ బ్రిటిషువారిచేతుల్లోనే ఉండిపోయి, భారతీయులు వారి ఏజెంట్లుగా మాత్రమే వ్యవహరించగలిగారు.

ఈ విధానాలతోపాటు బ్రిటిషువారవలంబించిన మరొకవిధానం కూడా పేర్కొనాలి. భారతీయులమధ్య చీలికలుకల్పించి, ఒకరిని అణచేందుకు మరొకర్ని ప్రోత్సహించడమే యీవిధానం. వారిపరిపాలనా ప్రారంభదశలో యీవిధానం బహిరంగంగానే అంగీకరించబడింది. ఇది సామ్రాజ్యశక్తులకు సహజమే. జాతీయోద్యమాలు పెంపొందడంతో

తా మీ విధానాన్ని అనుసరించడంలేదని ప్రకటించినా మరింత ప్రమాద కరమైన చమత్కారరూపంలో మరింత తీవ్రంగా అనుసరింపబడింది.

మనముఖ్యసమస్యల్లో దాదాపు అన్నీ, మహారాజులు, అల్ప సంఖ్యాకులసమస్య, దేశవిదేశీపెట్టుబడిదారులస్వార్థాలు, పరిశ్రమల అభావం, వ్యవసాయనిరాదరణ, సాంఘికసేవల్లో మరీ వెనుకబడివుండడం కంటె ప్రజలదుర్భరదారిద్ర్యం మొదలైనవన్నీ బ్రిటిషువారివిధానాలఫలితంగా వారిపాలనలో తలెత్తి పెంపొందినవే. విద్యయెడల వారికిగల దృక్పథం ఇందుకు చక్కని వుదాహరణ. "మెట్కాఫ్‌జీవితం" లో కేయీ యిలావ్రాశాడు: "విజ్ఞానం స్వేచ్ఛగా వ్యాపించడమంటే బ్రిటిషువారికి గలభయం ఒక అంటురోగంలా పరిణమించింది. ఇది ప్రభుత్వోద్యోగుల్లో అనేకరకాల వేధించే పగటికలలు కలవరింతలు కలిగించేది. ఆ కలల్లో అచ్చుయంత్రము, బైబులూ కన్పించి వారివొళ్ళు గగుర్పొడిచి భయంచే రోమాలు నిక్కబొడుచుకునేవి. భారతదేశవాసులను అగాథ అంధకారంలో, పశుతుల్యావస్థలో ఉంచడమే నాటి మనపంథా. మనప్రజల్లోగాని లేక సంస్థానప్రజల్లోగాని జ్ఞానకాంతిని ప్రసరింపజేసే ప్రతిప్రయత్నాన్ని మనం తీవ్రంగా ఆగ్రహించి ప్రతిఘటించేవాళ్ళం."

సామ్రాజ్యవాదం యీవిధంగానే వ్యవహరించాలి. లేకపోతే అది సామ్రాజ్యవాదమే కాకుండాపోతుంది. "ఆర్థికసామ్రాజ్యతత్వం" అనే నూతనవిధానం పూర్వయుగాల్లోలేని కొత్తరకం ఆర్థికదోపిళ్ళను ప్రవేశపెట్టింది. 19వశతాబ్దంలో బ్రిటిషువారు ఇండియానుపాలించిన విధానం భారతీయులు విచారపడేట్టూ, ఆగ్రహించేటట్టూ చేసితీరుతుంది. అయినా ఆ చరిత్ర అనేకరంగాల్లో బ్రిటిషువారి ప్రత్యేకవిశిష్టతను చిత్రిస్తుంది. మన అనైక్యత, బలహీనత కారణంగా వారు లాభాలు పొందగల సామర్థ్యంకూడ విశిష్టతే. బలహీనులై, కాలానికి ఎంతో వెనుకబడివున్నప్రజలు కష్టాలకు గురికాకతప్పదు. అందుకు తమనుతామే నిందించుకోవలసిఉంటుంది. అట్టిసందర్భాల్లో బ్రిటిష్‌సామ్రాజ్యతత్వం దాని దుష్ఫలితాలతోసహా రావడం సహజపరిణామమేనన్నట్లయితే దానిని ప్రతిఘటించేశక్తి పెరగడం, ఆ రెండుశక్తులమధ్య అంతిమసంఘర్షణ కూడా తప్పనిసరే.

## ౫ భారతసంస్థానాలపెరుగుదల

ప్రస్తుతం భారతదేశంలో మనప్రధానసమస్యల్లో సంస్థానాలు, రాజులసమస్య ఒకటి. ఈ సంస్థానాలు తమకుతామే సాటి. ప్రపంచంలో మరెక్కడా యిటువంటివి లేవు. అవి వైశాల్యంలోనూ రాజకీయ, సాంఘికపరిస్థితుల్లోనూ చాలా భిన్నమైనవి. వీటిసంఖ్య 601. అందులో దాదాపు పదిహేనింటిని పెద్దసంస్థానాలుగా పరిగణించవచ్చు. హైదరాబాదు, కాశ్మీరు, మైసూరు, తిరువాన్కూరు, బరోడా, గ్వాలియరు, ఇందూరు, కొచ్చిన్, జయపూరు, జోధపూరు, బికనీరు, భూపాల్, పాటియాలా సంస్థానాలు చాలా పెద్దవి. మిగిలినవికొన్ని మధ్యతరగతికి చెందినవి, అనేకవందలు చిన్నసంస్థానాలు. అందులోకొన్ని దేశపటాల్లో సూదిమొనంతకూడా ఉండవు. ఇలాంటి చిన్నవాటిలో ఎక్కువగా కథియవాడ్, పశ్చిమభారతం, పంజాబుల్లో వున్నాయి.

ఈ సంస్థానాల్లో కొన్ని ఫ్రాన్సుదేశమంత పెద్దవిగా, మరికొన్ని ఒక చిన్నరైతుకుఉండేపొలమంత చిన్నవిగా ఉంటాయి. ఈసంస్థానాలు వైశాల్యంలోనేగాక ఇంకా అనేకవిధాలుగా భేదిస్తాయి. మైసూరు పారిశ్రామికంగా ఎంతో పురోగమించింది. మైసూరు, తిరువాన్కూరు, కొచ్చినులలో బ్రిటిష్ఇండియాలోకంటె విద్యాగంధం ఎక్కువ. అనేక సంస్థానాలు ఎంతో వెనుకబడి, పూర్తిగా ఫ్యూడల్ విధానమే నెల కొనివున్నై. అవన్నీకూడా రాజాధిపత్యంక్రింద మనేవే. కొన్నింటికి ఎన్నుకోబడేసలహాసంఘా లున్నప్పటికీ, వాటిఅధికారాలు ఎంతో పరిమితంచేయబడ్డాయి. అన్నిటికంటెపెద్దదైన హైదరాబాదులో పౌర స్వత్వహక్కుల్ని పూర్తిగా నిరాకరించే ఒక విలక్షణమైన జమీందారీ పాలన కొనసాగుతోంది. రాజపుత్రస్థానము, పంజాబులందలి అనేక సంస్థానాలుకూడా యింతే. సంస్థానాల్లో ప్రజలకు ఎలాంటి పౌరస్వత్వ హక్కులు లేకపోవడం సర్వసాధారణమే.

ఈ సంస్థానాలు ఒకదానిసరసను మరొకటిగా ఒకేప్రాంతంలో వుండవు. సంస్థానేతరప్రాంతాలతో చుట్టబడిన ద్వీపాలవలె ఇండియా అంతటా చెల్లాచెదురుగా ఉన్నాయి. వాటిలో అనేకసంస్థానాలకు బహుపరిమితంగానైనా స్వతంత్రఆర్థికవిధానాలను అనులుపరచేశక్తి

లేదు. ఉన్నపరిస్థితుల్లో (బహుపెద్దవికూడా) పరిసరప్రదేశాల పూర్తి సహకారంలేనిదే అట్టివాటిని అమలుపరచేందుకు ఆసించలేవు. ఒక సంస్థానానికి,మరొక సంస్థానేతరప్రదేశానికిమధ్య ఏదైనా ఆర్థికసంఘర్షణ తలెత్తితే ఎగుమతిదిగుమతిసంబంధమైన ప్రతిబంధకాలతోను ఇతర ఆర్థిక దిగ్బంధాలతోను సంస్థానాలను తేలికగా పాదాక్రాంతంచేసుకోవచ్చు. బహు విశాలమైన సంస్థానాల్నికూడా, ఆర్థిక రాజకీయవిషయాల్లో వేర్వేరుగా, దేనికది ప్రత్యేకరూపంగలదన్నట్లుగా వ్యవహరించేందుకు ఎలాంటిఅవకాశము లేదు. అలా విడగొట్టినట్లైతే ఆ సంస్థానాలు బ్రతక లేవు; పరిసర భారతభూభాగంకూడా ఎంతో నష్టపడవలసివస్తుంది. అప్పు డవి భారత దేశమంతటా పరచుకున్న శత్రుద్వీపాలవలె తయారుకా వచ్చు. అవి మరొక విదేశీసహాయాన్నికూడా పొందినట్లైతే మొత్తం స్వతంత్రభారతదేశానికే నిరంతర తీవ్రప్రమాదకరంగా పరిణమించ గలవు. రాజకీయంగానూ, ఆర్థికంగానూకూడా అవీ, మిగతభారతదే శమూ ఒకేఒక బలవత్తరమైన ప్రభుత్వంక్రిందవుండి, దానిచే రక్షింప బడుతున్నాయి. లేకపోతే ఆ సంస్థానాలు ఇంతవరకూ బ్రతికిఉండగలి గేవికావు. మరొకటికూడా మనం గుర్తుంచుకోవాలి. సంస్థానానికీ యితరప్రాంతానికీమధ్య సంఘర్షణలేర్పడే అవకాశాలుండడమేగాక, ఆ సంస్థానప్రజలే స్వతంత్రవ్యవస్థలనుకోరుతూ, నిరంకుశసంస్థానాధీశుని మీద ఎడతెగని వత్తిడిచేస్తున్నారు. ఇలాంటి స్వాతంత్ర్యోద్యమాలు బ్రిటిష్‌వారిసహాయంతో అణచివేయబడుతున్నాయి.

19వ శతాబ్దంలోకూడా ఈ సంస్థానాల స్వరూప స్వభావాలు వెర్రితలలసదృశంగా వున్నాయి. ఆధునికపరిస్థితుల్లో ఇండియాను అనేక ప్రత్యేక స్వతంత్రఖండాలుగా విభజించగలమని తలచడం అసంభవం. ఒక్కొక్కఖండానికిమధ్య ఎడతెగని సంఘర్షణ యేర్పడడమేగాక - ప్రణాళికాబద్ధమైన ఆర్థిక, సాంస్కృతిక పురోగమనంకూడా అసాధ్య మవుతుంది. 19 వ శతాబ్దారంభంలో, ఈ సంస్థానాలేర్పడి ఈస్టిండియా కంపెనీతో సంధులుచేసుకున్నకాలంలో యూరపు అనేక చిన్న చిన్న స్వతంత్రరాజ్యాలుగా విభజింపబడివున్నదనేసంగతి మనం గుర్తుంచు కోవాలి. అప్పటినుంచీ అనేకయుద్ధాలూ, విప్లవాలూ యూరపుస్వరూ

పాన్ని ఎంతోమార్చాయి; ఇప్పటికీమార్చివేస్తున్నాయి. కాని ఇండియా స్వరూపం బయటివారివత్తిడిచే నిర్ణయించబడి దృఢంచేయబడి, దాన్ని మార్చుకునే అవకాశం లేకుండాచేయబడింది. 140 సం॥ లక్రితం — బహుశా ఏయుద్ధరంగంలోనో, లేక ఆవెంటనేనో — ఇద్దరు శత్రుసైన్యాధిపతులమధ్యజరిగిన సంధినిచూపించి ఆ తాత్కాలికనిర్ణయం శాశ్వతంగా వుండిపోవాలనడం హాస్యాస్పదం. నిజానికి ఆ సంధికి ఆ సంస్థానప్రజల ఆమోదమనే ప్రసక్తే లేదు. పైగా రెండవపక్షం ఆనాడు ఒక వ్యాపార సంస్థగామాత్రంవుండి స్వప్రయోజనాలను లాభాలనుమాత్రమే చూచుకున్నది. ఈస్టిండియాకంపెనీ అనే వ్యాపారసంస్థ బ్రిటిష్‌కిరీటానికిగాని, పార్లమెంటుకుగాని ప్రతినిధిగా వ్యవహరించలేదు. తమకు బలము, అధికారము, సంక్రమింపచేసినదనుకున్న ఢిల్లీచక్రవర్తికి (అతడు శక్తివిహీనుడే కావచ్చు) ప్రతినిధిగా మాత్రమే యీ కంపెనీ వ్యవహరించినదనాలి. ఈ సంధులు, ఒడంబడికలతో బ్రిటిష్‌సింహాసనానికీ, పార్లమెంటుకూ ఏ విధమైనసంబంధం లేదు. ఈస్టిండియాకంపెనీకిసంబంధించిన అనుమతి పత్రాన్ని, అప్పుడప్పుడు తాము చర్చించవలసివచ్చినప్పుడుమాత్రమే పార్లమెంటు భారతదేశస్థితిగతులనుగురించి పట్టించుకుంది. ఈస్టిండియా కంపెనీకి మొగల్‌చక్రవర్తిదయచేసిన 'దివానీ'పత్రం ఆధారంగానే అది యిండియాలో వుండగలుగుతోందనేయథార్థాన్ని బట్టి బ్రిటిష్‌సింహాసనానికీ, పార్లమెంటుకూ యీ స్వతంత్రకంపెనీలో ప్రత్యక్షంగా జోక్యం కల్పించుకునేహక్కు లేదు. పార్లమెంటు పరోక్షంగా చేయగలిగినదేమిటంటే ఈ కంపెనీకి తామిచ్చిన అనుమతిపత్రాన్ని రద్దుచెయ్యొచ్చు, లేదా పునరుద్ధరించేటప్పుడు కొత్తషరతులు విధించవచ్చు. ఆంగ్లచక్రవర్తిగాని, పార్లమెంటుగాని ఢిల్లీచక్రవర్తికి ప్రతినిధులుగా అంటే తాబేదారులుగా వ్యవహరించాలనే వూహను (సూత్రప్రాయంగానైనాసరే) ఇంగ్లండు వ్యతిరేకించింది. అందువల్లనే వారు ఈస్టిండియాకంపెనీకార్యకలాపాలకు సాధ్యమైనంతదూరంగా వుంటూవచ్చారు. ఇండియాలో బ్రిటిష్‌యుద్ధాలకైన ఖర్చంతా ఈస్టిండియాకంపెనీ ఇండియాలో సంపాదించి, అందించినటువంటిదే.

ఆతరువాత ఈస్టిండియాకంపెనీ ఆధ్వర్యంలోని భూభాగం పెరిగి, దానిపాలన సుసంఘటితమౌతున్నకొద్దీ బ్రిటిష్‌పార్లమెంటు భారతీయ

వ్యవహారాలపై ఎక్కువగా శ్రద్ధచూపసాగింది. భారతసైనికతిరుగుబాటు, విప్లవాలతాకిడి అనంతరం, 1858లో ఈష్టిండియాకంపెనీ ఇండియా రాజ్యాన్ని బ్రిటిష్‌సింహాసనానికి (ఇండియా చెల్లించిన వెల పుచ్చుకుని) వప్పగించింది. ఆ అప్పగింత భారతభాగానికి సంస్థానాలకు వేర్వేరుగా జరుగలేదు. ఇండియాఅంతా ఒకేఖండంగా ప్రస్తావించబడింది. బ్రిటిష్‌పార్లమెంటు సంస్థానాలమీద కూడా అజ్మాయిషీఅధికారాలుగల భారతప్రభుత్వంద్వారా ఇండియాను పరిపాలించింది. సంస్థానాలకు బ్రిటిష్‌సింహాసనంతోగాని, పార్లమెంటుతోగాని ప్రత్యేకసంబంధాలేమీ లేవు. అవి ప్రత్యక్షంగాను, పరోక్షంగాను కూడ భారతప్రభుత్వంలోని అంతర్భాగాలు మాత్రమే. తరువాతి సంవత్సరాల్లో ఈ ప్రభుత్వం మారుతూండే తనవిధానాల కనువుగావున్నప్పుడల్లా పాతసంధులను త్రోసిపుచ్చుతూ, సంస్థానాలమీద సంపూర్ణాధికారాలు ఛలాయించేది.

అందువల్ల సంస్థానాలకుసంబంధించినంతవరకు ఎన్నడూ బ్రిటిషుసింహాసనం ప్రసక్తే లేదు. ఇటీవల కొన్నిసంవత్సరాలుగా మాత్రం సంస్థానాలకు ఒకవిధమైన స్వాతంత్ర్యంవుండాలనే కోరిక వెలిబుచ్చబడుతోంది. భారతప్రభుత్వంతోనేగాక, బ్రిటిషుసింహాసనంతోకూడ తమకు ప్రత్యేకసంబంధాలున్నాయన్నారు. ఇంతకుముందు పేర్కొన్నసంధులు నలభైసంస్థానాలతోమాత్రమే జరిగాయనీ, మిగిలినసంస్థానాలకు 'ఒడంబడిక, సనదులు' మాత్రమే వున్నాయనీ మనం జ్ఞాపకంవుంచుకోవాలి. భారతసంస్థానాలజనాభాలో నాలుగింట మూడువంతులమంది ఈ నలభై సంస్థానాల్లోనే వున్నారు. ఇట్టివారిలో మూడోవంతుమంది ఆరుసంస్థానాల్లోనే వున్నారు.

1935 వ సం॥పు చట్టంలో మొట్టమొదటిసారిగా సంస్థానాలకూ, తతిమ్మాభారతదేశానికీ బ్రిటిష్‌పార్లమెంటుతోవుండగలసంబంధాల్లో కొంత వ్యత్యాసం చూపబడింది. భారతప్రభుత్వంఅజ్మాయిషీ అధికారాలనుండి సంస్థానాలు మినహాయించబడ్డాయి. అవి నేరుగా రాజప్రతినిధియైన వైస్రాయిఆధిపత్యంక్రిందికి మార్చబడ్డాయి. ఆ వైస్రాయే భారతప్రభుత్వఅధినేతగాకూడాఉంటాడు. సంస్థానవ్యవహారాల్ని చూచే

భారతప్రభుత్వరాజకీయశాఖ ఆయనసలహాసంఘంక్రిందినుంచి, తప్పించబడి, వైస్రాయిఆధ్వర్యానికి మార్చబడింది.

అసలీ సంస్థానాలు ఎలా ఏర్పడ్డాయి? కొన్ని కేవలం కొత్తవి. అవి బ్రిటిషువారిచేసృష్టించబడ్డాయి. మిగిలినవి మొగలుచక్రవర్తుల సామంతరాజ్యాలవంటివి. వాటిపాలకులను బ్రిటిషువారికి కప్పంవసూలు చేసిపెట్టే ప్రతినిధులుగా వుండనిచ్చారు. మరికొందరు, ముఖ్యంగా మహారాష్ట్రనాయకులు, బ్రిటిషుసైన్యాలచేత ఓడించబడి, కప్పంగట్టే సామంతులుగా యేర్పడ్డారు. దాదాపు ఈ సంస్థానాలపుట్టుకలన్నీ బ్రిటిషుపాలనాకాలానికి చెందినవే. అంతకుముందు వాటి కెలాంటిచరిత్ర లేదు. కొన్ని కొంతకాలం స్వతంత్రంగా వ్యవహరించినప్పటికీ, ఆ స్వాతంత్ర్యం బహుకొద్దికాలమే వుండి, యుద్ధాల్లోగాని, యుద్ధభయంతోగాని అంతరించిపోయింది. చాలాకొద్దిసంస్థానాలుమాత్రం – ఎక్కువగా రాజపుత్రస్థానంలోనివి – మొగలుయుగానికిపూర్వమే ఏర్పడ్డాయి. తిరువాన్కూరుకు వెయ్యిసంవత్సరాలకుమించిన ప్రాచీనచరిత్ర వుంది. రాజపుత్రవంశాల్లో కొన్ని చరిత్రయుగానికిపూర్వంనుంచీ తమకు వంశచరిత్రలున్నాయని చెబుతున్నాయి. సూర్యవంశానికి చెందిన ఉదయపూరుమహారాణాకు జపాన్‌లోని 'మెకాడో'తో పోల్చదగినంతటి వంశవృక్షం వుంది. కాని ఈ రాజపుత్రనాయకులు మొగలుసామంతులై, మహారాష్ట్రులకులోబడి, చివరికి బ్రిటిషువారికి దాసోహమన్నారు. ఎడ్వర్డ్ థాంప్సన్ "అరాచకంలో మునిగివున్న సామంతులను ఈస్టిండియాకంపెనీప్రతినిధులు ఉద్ధరించి, యథాస్థానాల్లో నిలిపారు. ఆవిధంగా రక్షింపబడి, పునరుద్ధరించబడినసమయంలో యీ 'రాజులు' వున్న అసహాయస్థితిలో ప్రపంచచరిత్రలో మరేరాజులు లేరు. బ్రిటిషుప్రభుత్వం జోక్యంకల్పించుకోకపోతే రాజపుత్రసంస్థానాలన్నీ అదృశ్యమైపోయేవి. మహారాష్ట్రరాజ్యాలు ఛిన్నాభిన్నమైపోయేవి. అయోధ్య, నైజాము వంటిరాజ్యాలు వాటిరక్షకశక్తిపోస్తున్న వూపిరితో నామమాత్రావశిష్టంగా వున్నాయి. లేకపోతే, వాటిఉనికే హుళక్కి."

ఇప్పుడు అన్నిటికంటె పెద్దదిగావున్న హైద్రాబాదుసంస్థానం అతి చిన్నదిగా ఆరంభమైంది. బ్రిటిషువారు టిప్పుసుల్తాన్నుఓడించినప్పుడొకసారి, మహారాష్ట్రయుద్ధాల అనంతరం మరొకసారి ఆ సంస్థాన

హద్దులు పెంచబడ్డాయి. ఈ చేర్పులు బ్రిటిషువారియిష్టానుసారం, నైజాం తమకు తాబేదారుగా ఉండవలెననే కచ్చితమైన ఒడంబడికమీదనే జరిగాయి. వాస్తవానికి టిప్పుసుల్తాను ఓడిపోయినపుడు అతనిభూభాగంలో కొంత, మహారాష్ట్రనాయకుడైన పీష్వాకు యిస్తామని బ్రిటిషువారు చెప్పగా ఆయన పైషరతులను నిరాకరించాడు.

తరువాత పెద్దసంస్థానమైన కాశ్మీర్‌ను సిక్కుయుద్ధాలఅనంతరం ఈస్టిండియాకంపెనీ నేటికాశ్మీర్‌పాలకునిముత్తాతకు అమ్మింది. ఆ తరువాత అచటిపాలన సమర్థనీయంగాలేదనేనెపంతో బ్రిటిషువారిపాలన క్రిందికి తీసుకోబడింది. మళ్ళీ కొంతకాలానికి పాలకుని అధికారాలను పునరుద్ధరించారు. నేటి మైసూరుసంస్థానం టిప్పుతోయుద్ధాలు జరిపిన అనంతరం బ్రిటిషువారిచే సృష్టించబడింది. అదికూడా చాలాకాలం బ్రిటిషువారిపాలనలో వుంది.

ఇండియాలో వాస్తవమైన స్వాతంత్ర్యాన్ని కలిగిఉన్నరాజ్యం నేపాల్ ఒక్కటే. ఈశాన్యసరిహద్దులలోఉన్న నేపాలు – ఇతరప్రాంతాలనుంచి విడిగా ఉండిపోయినప్పటికీ – ఆఫ్ఘనిస్థానమంతటి కీలకమైన రాజ్యం. మిగిలిన సంస్థానాలన్నీ "సైనికసహాయచట్ట" విధానంక్రిందికి వచ్చాయి. ఈవిధానంవల్లఆయాసంస్థానాల్లోవుండే రెసిడెంటు, లేక ప్రతినిధి ద్వారా నిజమైనఅధికారం బ్రిటిష్‌ప్రభుత్వంచేతుల్లోనే ఉండేది. తరచుగా సంస్థానాధీశునిమంత్రులుగాకూడా బ్రిటిషువారే తలకు చుట్టబడేవారు. కాని, సుపరిపాలనకూ, సంస్కరణలకూ బాధ్యుడు సంస్థానాధీశుడే. అతడు ప్రపంచంలో అందరికంటె ఎక్కువ సదుద్దేశాలు కలవాడైనప్పటికి (అసలలాంటి ఉద్దేశ్యము, సమర్థత మృగ్యమే.) ఈ పరిస్థితుల్లో అతడు చేయగలిగింది ఏమీ ఉండదు. ఈ సంస్థానాల విధానాన్నిగురించి 1846 లో హెన్రీ లారెన్స్ ఇలావ్రాశాడు: దుష్పరిపాలనమేకొనసాగితీరవలసినదేదైనా ఉంటే సంస్థానాధీశుడు, మంత్రీ కూడా బ్రిటిష్‌రెసిడెంటుచే నడపబడుతూ, విదేశీపాలకులపై ఆధారపడిఉండవలసిన విధానమే, అది. వీరంతా సమర్థులూ, సద్ధర్ములూ, నిదానస్తులూ అయినా, ప్రభుత్వరథచక్రాలు సజావుగాసాగే అవకాశం లేదు. న్యాయపరిపాలనచేయగల గుణగణాలన్నీవున్న ఒకరిని – యూరోపియనులనుంచిగాని, భారతీయులనుంచిగాని – ఎన్నుకోవడమే

కష్టమైనప్పుడు, ఏకముఖంగా కలిసిపనిచేయగల ముగ్గురు ఎక్కడ లభిస్తారు? ఆ ముగ్గురిలో ప్రతిఒక్కరూ లెక్కలేనంత చెరుపు చేయగలరు గాని, అందేఒక్కరూ కూడా, మరొకరు అడ్డగిస్తే పీసపుటెత్తుమేలైనా చేయలేరు"

అంతకుపూర్వమే, 1817 లో సర్ థామస్ మన్రో నాటి గవర్నర్ జనరల్‌కు యిట్లావ్రాశాడు – "ఉపసైన్యాన్ని నియమించుకునేందుకు అనేక బలమైన అభ్యంతరాలున్నాయి. అలాంటిది ఏ దేశంలో ఉన్నప్పటికీ, ఆ దేశాన్ని బలహీనంగా, భారంగామార్చేగుణం అందులో వుంది. అది సమాజంలో పైతరగతులవారి గౌరవాభిమానాలను నాశనంచేస్తుంది. ప్రజానీకాన్ని దిగజార్చి నిరుపేదలను చేస్తుంది. ఇండియాలో దుష్పరిపాలనను బాగుపరిచేందుకు రెండేమందులున్నాయి. రాజమందిరంలో ప్రశాంతవిప్లవమైనా జరగాలి, లేదా, దౌర్జన్యపూరితమైన ప్రజలతిరుగుబాటుగాని, విదేశీదండయాత్రగాని జరగాలి. కాని, సంస్థానాధీశుణ్ణి దేశవిదేశశత్రువులనుంచి రక్షించేందుకు, సర్వదా అక్కడవుండే యీసైన్యంవల్ల – ఆ చిట్కా ప్రయోగించే అవకాశమే లేదు. ఈవిధానం – పాలకుడు తన భద్రతకై విదేశీయులపైనే ఆధారపడడం నేర్పుతుంది గనుక – అతణ్ణి అశక్తుణ్ణిచేస్తుంది; తనప్రజలు తనను ద్వేషించినా తన క్షేమమాదమూ లేదని నేర్పుతుంది గనుక అతడు క్రూరుడుగా, లాలసుడుగా తయారౌతాడు. ఈ సైనికసహాయ విధానం అమలుపరచపడిన ప్రతిచోట – దాని పాలకుడు విశిష్టసామర్థ్యాలుగలవాడైతేతప్ప – దానిఫలితాలు కూలిపోయేగ్రామాలరూపంలోనూ, నశించే జనసంఖ్యరూపంలోనూ స్పష్టంగా కనిపిస్తాయి...... బ్రిటిష్‌వారితో చేసుకున్నసంధికి పూర్తిగాకట్టుబడివుండేందుకే పాలకుడు సుముఖుడైవున్నప్పటికి, అతనిముఖ్యోద్యోగుల్లో దానిని భంగపరచమనే వారు కొందరైనా ఉంటారు. పరాయివారిఅధికారాన్ని త్రోసిపుచ్చాలనే ఉదాత్తస్వతంత్రభావాలు దేశంలోవున్నంతకాలం-అలాంటి సలహాదారులు కన్పిస్తూనేఉంటారు. ఈ ఉదాత్తభావం పూర్తిగా నశించిపోయేటంతగా భారతీయులు దిగజారిపోలేదనే నా వుద్దేశం. అందువల్ల సైనికసహాయవిధానం ఏ ప్రభుత్వాన్ని రక్షించడానికి కంకణం ధరిం

చిందో, ఆ ప్రభుత్వాన్ని సమూలంగా విచ్ఛిన్నంచేసేటంతవరకూ స్వైరవిహారం చేయవలసిందే ననడానికి నా కెట్టి సందేహము లేదు."

ఇటువంటి వ్యతిరేకతలెన్నితలెత్తినా సంస్థానాల్లో సైనికసహాయ పద్ధతి పూర్తిగా ఏర్పరచబడింది. దానితోపాటు సహజసిద్ధమైన లంచ గొండితనం, ప్రజాపీడన కూడా వచ్చాయి. అసలీ సంస్థానప్రభుత్వాలే చెడ్డవి. ఐనా, కాకపోయినా, అవి దాదాపు శక్తివిహీనమైపోయాయి. వీటి రెసిడెంటులలో కొద్దిమంది మెట్కాఫ్‌వంటి నీతిమంతులు, న్యాయ శీలురూను. కాని అనేకమందికి ఈ రెండులక్షణాల్లో యేదీ లేదు. అట్టి వారు వేశ్యవలె ఏబాధ్యతా లేని సర్వాధికారం కలిగిఉండేవారు. కొంద రాంగ్లేయసాహసికులు (తమజాతి ఆధిక్యత, అధికారులమద్దతు ఉన్న దనే ధీమాతో) భారతప్రభుత్వధనాన్ని విచ్చలవిడిగా దుర్వినియోగం చేశారు. 19వశతాబ్ది ప్రథమార్థంలో, యీసంస్థానాల్లో (ముఖ్యంగా అయోధ్య, హైదరాబాద్‌లలో) జరిగిన విశేషాలు మనం ఊ... లేనంత విపరీతంగా ఉన్నాయి. 1857లో జరిగిన సిపాయిలతిరుగుబాట కొంచెంముందుగా, అయోధ్య బ్రిటిష్ భూభాగంలో కలుపుకోబడిం

బ్రిటిష్‌వారిపంథా అప్పుడు సంస్థానాలను కలుపుకోడానికి అన కూలంగాఉంది. సంస్థానం పొరపాటుచేసిందనే ఏకుంటిసాకునైనాసరే బ్రిటి షువారు తమకనుకూలంగా ఉపయోగించుకునేవారు. కాని 1857లో జరిగిన సైనికతిరుగుబాటు, మహావిప్లవం – ఈ సైనికసహాయవిధానం విలువను బ్రిటిష్‌ప్రభుత్వానికి తెలిసేట్టుచేశాయి. ఏ స్వల్పత్యాగాలనో మినహాయిస్తే సంస్థానాధీశులు యీ విప్లవాలకు దూరంగానే వుండి పోయారు. పైగా కొన్నిసందర్భాల్లో విప్లవాలను అణచేందుకు బ్రిటిషు వారికే సాయపడ్డారు. ఇది బ్రిటిష్‌వారికి సంస్థానాలపట్లగలభావాన్ని మార్చింది. వారా పద్ధతిని అలాగే కొనసాగించాలనీ, మరింతబలపర చాలనీ నిశ్చయించారు.

బ్రిటిషువారు సర్వాధికారాలుగల సార్వభౌములనే సిద్ధాంతం ప్రకటించబడింది. సంస్థానాలపై భారతప్రభుత్వ రాజకీయశాఖ అజ్మా యిషీ కచ్చితంగా కొనసాగుతూనేఉంది. సంస్థానాధీశులు తొలగించ బడడము, లేక వారిఅధికారాలు తగ్గించబడడము, బ్రిటిష్‌అధికారులను మంత్రులుగా అంటగట్టడము సంభవించాయి. అలాంటిమంత్రులు

ఇప్పుడు సంస్థానాల్లో చాలామంది ఉన్నారు. వారు తమ నామ మాత్రపు సంస్థానాధీశునికంటె, బ్రిటిష్‌ప్రభుత్వానికే ఎక్కువ జవాబు దారీగలవారమని భావిస్తారు.

సంస్థానాధీశుల్లో మంచివారూ, చెడ్డవారూ ఉన్నారు. ఆ మంచి వారికి అడుగడుగునా ప్రతిబంధకాలే. ఒకవర్గంగా చూస్తే వారంతో వెనుకచూపుతో, జమీందారీమనస్తత్వంతో, అధికారగర్వంతో మెలగే వారు. బ్రిటిషువారితో వ్యవహరించేటప్పుడుమాత్రం బానిసలనిపించే వారు. యీ సంస్థానాలను "ఇండియాలో బ్రిటిషువారి పంచమాంగ దళం" అని సరిగ్గానే వర్ణించాడు పెల్వాంకర్.

## ౬ భారతదేశంలో బ్రిటిష్‌పాలనావైరుధ్యాలు- రామ్‌మోహన్‌రాయ్- అచ్చుయంత్రము- సర్ విలియం జోన్స్ - బెంగాల్లో ఆంగ్లవిద్య

ఇండియాను బ్రిటిష్‌వారు పరిపాలించిన చరిత్ర చూస్తే, ప్రతి ...పులోనూ గణనీయమైన వైరుధ్యం కన్పిస్తుంది. భారతదేశంలో లశక్తిగాతయారైన బ్రిటిష్‌వారు భారీయంత్రపారిశ్రామికనాగరి ...మ తెచ్చినవారుగా ప్రపంచశక్తుల్లోనే అగ్రగాములయ్యారు. ప్రపం ...న్నే మార్చబోతున్న ఒక నూతన చారిత్రకశక్తికి వారు ప్రాతి ...ధ్యం వహించారు. ఆవిధంగా తమకు తెలియకుండానే వారు మార్పుకు, ...ప్లవానికీ దోవచూపినవారూ, ప్రతినిధులూ అయ్యారు. ఐనప్పటికీ తమ ...ితిని సుసంఘటితంచేసుకునేందుకూ, ప్రజలనూ, దేశాన్నీ తమప్రయో ...జనాలకోసం దోచుకునేందుకూ పనికివచ్చేసందర్భాల్లోతప్ప మరెప్పుడూ ...యీమార్పులు జరక్కుండావుండేందుకే తీవ్రప్రతిబంధకాలు కల్పిం ...చారు. వారిదృక్పథము, లక్ష్యాలు పూర్తిగా అభివృద్ధినిరోధకాలు. ...దీనికి కొంతవరకుకారణం ఇక్కడికివచ్చినవారివర్గచరిత్ర; అంతకంటే ...ముఖ్యకారణం: అభ్యుదయపథానజరిగేమార్పులు భారతీయులను బల ...పర్చి, ఈదేశంపై బ్రిటిష్‌వారికిగల ఆధిపత్యాన్ని బలహీనపరచవచ్చు ...ననేవుద్దేశంతో వారీ మార్పుల్ని తీవ్రంగా నిరోధించాలని ప్రయ ...త్నించడమే. ఈవిధంగా ప్రజలంటే భయపడేప్రకృతి వారి ప్రతి ...ఆలోచనలోనూ, ప్రతివిధానంలోనూ కనిపిస్తుంది. ఎందువల్లనంటే ...వారు ప్రజలతో కలసిపోవాలనీ కోరుకోరు, కలసిపోనూలేరు. అందు

వల్లనే తమకెంగునాపోలికలేని శత్రువర్గమానవులమధ్య గిరిగీచుకుని కూర్చున్న విదేశీపాలకవర్గంగా మాత్రమే వారు వుండిపోవలసివచ్చింది. మార్పులు - అందులోకొన్ని అభ్యుదయపథంలో వచ్చాయి. అయితే అవి బ్రిటిషువారు ఎంత నిరోధించినాకూడా వచ్చినట్టివి. పైగా అవి బ్రిటిష్‌వారిద్వారా ఆధునికపాశ్చాత్యప్రభావంతో వచ్చినవే.

విద్యావేత్తలు, ప్రాచ్యభాషాభిమానులు, పత్రికారచయితలు, మతబోధకులు మొదలైన ఆంగ్లేయులు ఇండియాకు పాశ్చాత్యనాగరికతను తీసుకురావడంలో ప్రధానపాత్ర నిర్వహించారు. అలాచేసిన ప్రయత్నాల్లో వారు అనేకసార్లు, తమప్రభుత్వంతోనే ఘర్షణపడవలసి వచ్చింది. ప్రభుత్వం ఆధునికవిద్యావిధానవ్యాపకఫలితాలకు భయపడి దానికి ఎన్నో అడ్డంకులు కల్పించింది. ఐనా, ఉత్సాహవంతులైన భారతీయవిద్యార్థులను ఆకర్షించిన సమర్థత, చిత్తశుద్ధిగల ఆంగ్లేయుల ప్రాథమికకృషి, పట్టుదలవల్లనే ఇండియాలో ఆంగ్లేయులభావన, సారస్వతం, రాజకీయసాంప్రదాయాలూ ప్రవేశపెట్టబడ్డాయి. (నేను 'ఆంగ్లేయులు' అనడంలో సహజంగా, గ్రేట్‌బ్రిటన్, ఐర్లండులకుచెందిన వ్యక్తుల్ని కలిపి వ్యవహరిస్తున్నాను. ఇది సరైనమాటకాదనీ, పొరపాటనీ నాకు తెలుసు. "బ్రిటనీయు"డనేపదం నాకు నచ్చదు. పైగా ఆ పదంలో ఐర్లండువ్యక్తి వుండడు. అందువల్ల ఐర్లండు, స్కాట్లండు, వేల్సు ప్రజలను క్షమించమనికోరుకుంటాను. ఇండియాలో యీ అన్నిదేశాల వారూ ఒకేరకంగా ప్రవర్తించారు. ఇండియాచేత అందరూ ఒకేరకమన్నట్లుగా చూడబడ్డారు.) బ్రిటిష్‌ప్రభుత్వంకూడా - విద్యావ్యాప్తికి వ్యతిరేకించినప్పటికీ, పరిస్థితులవత్తిడివల్ల పెరుగుతున్న తనపాలనాయంత్రానికి అవసరమైన గుమాస్తాలను సృష్టించుకుని, తరిఫీదిచ్చే ఏర్పాట్లు చేయకతప్పలేదు. బ్రిటన్‌నుంచి చాలామందిని యిక్కడికి తీసుకొచ్చి, సన్నకారుఉద్యోగాల్లోవుంచి పోషించేశక్తి ఆ ప్రభుత్వానికి లేదు. ఆవిధంగా నెమ్మదిగా విద్యావ్యాప్తిజరుగసాగింది ఆ విద్య పరిమితము, అసహజము ఐనప్పటికీ నూతనభావాలు, సంచలనాత్మకమైన ఆలోచనలు ప్రవేశించడానికి మానసికకవాటాలు తెరచింది.

అచ్చుయంత్రంగాని, మరేయంత్రంగాని భారతీయమేధకు ప్రమాదకరమనీ, పేలగొట్టేమందులాంటివనీ ఎంచబడింది. అవి రాజ

ద్రోహాన్ని, పారిశ్రామికాభివృద్ధినీ ప్రేరేపించవచ్చుగనుక, వాటినెవరూ ప్రోత్సహించరాదని ఎంచారు. ఒకప్పుడు హైదరాబాదునవాబు యూరపుయంత్రాలను చూడాలనేకోరిక వెలిబుచ్చగా, బ్రిటిష్‌రెసిడెంటు ఒకగాలిపంపు, ఒక అచ్చుయంత్రాన్ని తెప్పించిచూపాడని ఒక కథ వుంది. నైజాం తాత్కాలికకుతూహలం చల్లబడగానే, వాటినికూడా యితరబహుమతులు, వింతవస్తువులతోపాటు భద్రంగా దాచివేశారట. అప్పుడు కలకత్తాలోవున్న భారతప్రభుత్వం ఈ సంగతి విని ఒకభారతీయ సంస్థానంలో అచ్చుయంత్రాన్ని ప్రవేశపెట్టినందుకు ఆ రెసిడెంటును తీవ్రంగా మందలించిందట. ప్రభుత్వంకోరితే, తా నా అచ్చుయంత్రాన్ని రహస్యంగా నాశనంచేయించివేస్తానని ఆ రెసిడెంటు మనవిచేసుకున్నాడట.

వ్యక్తులు అచ్చుయంత్రాలుపెట్టుకోవడాన్ని ప్రోత్సహించక పోయినా అచ్చుపనిలేకుండా ప్రభుత్వం తనపనులను నిర్వర్తించుకోలేక పోయి:నందువల్ల కలకత్తా, మద్రాసుమొదలైనచోట్ల ప్రభుత్వముద్రాశాలలు ఏర్పాటుచేయబడినవి. మొట్టమొదటిప్రైవేటు అచ్చుయంత్రాన్ని బాప్టిస్టుమతబోధకులు, సిరంపూరులో నెలకొల్పారు. మొట్టమొదటివార్తాపత్రిక 1780లో కలకత్తాలో ఒక ఆంగ్లేయునిచే ప్రారంభించబడింది.

ఇవీ, ఇలాంటి యితరమార్పులూ క్రమక్రమంగా రాసాగాయి. వీటిప్రభావం భారతీయులమనస్సులపై ప్రసరించి, ఆధునికచైతన్యాన్ని రేకెత్తించాయి. ఇండియా తన తత్వజ్ఞానమే పాశ్చాత్యనాగరికతకంటె గొప్పదనేభావంతో, దానికే అంటిపట్టుకొనివుండడంవల్ల యూరోపియన్ ఆలోచనాప్రభావం నూటిగా ఏకొద్దిమందినిమాత్రమో కదిలించింది. పాశ్చాత్యులప్రభావం, నిజంగా ప్రసరించినది భారతీయుల దైనందినజీవితాలమీదనే. వాస్తవానికి ప్రాగ్దేశాలకంటె పశ్చిమదేశాలు ఉచ్చస్థితిలోవున్నాయి. రైలుబండి, అచ్చుయంత్రం, ఇతరయంత్రాలు, యుద్ధతంత్రాలు మొదలైన సాంకేతిక నవీననైపుణ్యాలను మనం గుర్తించకుండా వుండలేం. ఇవన్నీ తెలియకుండానే వచ్చి పరోక్షంగా పాతఅభిప్రాయాలతోతలపడి, భారతీయహృదయాల్లో సంఘర్షణ రేకెత్తించాయి. ఇలా వచ్చిన స్పష్టమైన మార్పుల్లో అత్యంతప్రధానమైన వ్యవసాయ, విధానం విచ్ఛిన్నమై, వాటిస్థానంలో 'వ్యక్తిగతఆస్తి', 'భూస్వామ్య'

విధానాలకు చెందినభావాలు రూపొందడమే. డబ్బేప్రధానంగాగల ఆర్థిక విధానంవచ్చి "భూమి వ్యాపారవస్తువైపోయింది. ఒకప్పుడు ఆచారంచే గట్టిగాపట్టుకోబడిందే, ధనంచేత కరిగించబడింది".

బ్రిటిష్‌పాలన ఇతర విశాలప్రాంతాలకంటె అర్థశతాబ్దం ముందే బెంగాలుకు వ్యాపించివుందిగనుక, వ్యావసాయిక, సాంకేతిక, వైజ్ఞానిక మార్పులన్నిటినీ బెంగాలుప్రాంతమే ముందుగా చవిచూచి, అనుభవించడం జరిగింది. అందువల్ల 18వ శతాబ్దపు ఉత్తరార్థంలోనూ, 19వ శతాబ్దపుపూర్వార్థంలోను బ్రిటిష్‌ఇండియాజీవితంలో బెంగాలు ప్రముఖపాత్రవహించింది. బెంగాలు బ్రిటిష్‌పాలనాయంత్రానికి కేంద్రమూ, గుండెవంటిదీ మాత్రమేగాక ఆంగ్లవిద్యనభ్యసించిన మొట్టమొదటి జట్టులను సృష్టించినదికూడా అదే. ఆ విద్యాధికులు బ్రిటిష్ అధికారఛాయల్లో యితరప్రాంతాలకువ్యాపించారు. 19వశతాబ్దంలో బెంగాల్లో అనేకమంది విశిష్టవ్యక్తు లుద్భవించారు. వారే ఇండియాకంతటికీ రాజకీయ, సాంస్కృతికవిషయాల్లో నాయకత్వంవహించారు. వారిప్రయత్నాలవల్లనే నవీనజాతీయోద్యమం రూపొందింది బెంగాలు ఎక్కువకాలం బ్రిటిషుపాలనక్రిందవుండడమేగాక, ఆపాలనయొక్క తొలిదశల్లోని కష్టనష్టాలన్నీ చవిచూచింది. అప్పుడా పాలన కఠినంగాను అతిశయంగాను, బింకంలేనిదిగాను వుండేది. ఉత్తర,కేంద్రభారతాలు తలొగ్గకముందే బెంగాలు ఈ పాలనకులోబడి, తదనుగుణంగా తయారైంది. 1857 విప్లవప్రథమజ్వాల కలకత్తాసమీపంలోని "డండం"లోనే కన్పించినా, ఆ విప్లవప్రభావం బెంగాలుపైన పనిచేయలేదు.

బ్రిటిష్‌పాలనకుపూర్వం బెంగాలు మొగలుసామ్రాజ్యంలో సరిహద్దురాష్ట్రంగా వుండేది. ప్రధానరాష్ట్రమైన, కేంద్రానికెంతో దూరాన వుండేది. అక్కడ హిందువుల్లో మధ్యయుగంతొలిదశల్లో దేవతలను నీచపద్ధతుల్లో ఆరాధించడము, తాంత్రిక వేదాంతము, ఆచారాలూ ముమ్మరంగా ఉండేవి. తర్వాత అనేక హిందూసంస్కరణలు వచ్చి ఈ సాంఘికాచారాలను, చట్టాలను, ఇతరచోట్ల అమలులో వున్న వారసత్వవిధానాలను మార్చివేశాయి. మహావిద్యావేత్తయైన చైతన్యుడు భగవద్భక్తి, ఆవేశాలతో ఒకరకమైన వైష్ణవమతాన్ని స్థాపించి, బెంగాలుప్రజలను కదిలించాడు. వంగీయులు మహోన్నత

విచిత్ర మిశ్రమవిజ్ఞానస్థాయినీ, బలీయమైన ఆవేశతత్వాన్నీ పెంపొందించుకున్నారు. మానవాళినిప్రేమించి, సేవించే యీ విశిష్టలక్షణానికి 19వ శతాబ్ది ఉత్తరార్థంలో, బెంగాల్లోనే మరొక గణనీయమైన వ్యక్తి మహర్షిరామకృష్ణపరమహంస ప్రతిబింబమయ్యాడు. ఆయనపేర ఒకసేవాసంఘం స్థాపింపబడి జీవరక్షణ, సాంఘికసేవల్లో సాటిలేనిచరిత్రను సృష్టించుకుంది. ఈ "రామకృష్ణమిషన్" సభ్యులు పురాతన ఫ్రాన్సిస్కనులవలె క్షమ, ప్రేమలతోనిండిన సేవాదృష్టి, క్వేకరులవలె ప్రశాంతి, నిరాడంబరత్వం, సామర్థ్యాలు కలిగివుండి తాము స్థాపించిన చికిత్సాలయాలనూ, విద్యాసంస్థలనూ నిర్వహిస్తారు. ఇండియాలోను, బయటకూడ ఏమూల ఏ ఘోరప్రమాదం సంభవించినా వీరు వెంటనే సేవా — సహాయాలకు పూనుకుంటారు.

రామకృష్ణుడు ప్రాచీనభారతసాంప్రదాయానికి ప్రతిబింబం. ఆయనకు ముందు 18వ శతాబ్దిలో బెంగాల్లో మరొక మహోన్నతవ్యక్తి రాజా రామ్‌మోహన్‌రాయ్ జన్మించాడు. ఆయన పురాతన, అధునాతననాగరికతలు రెండూ మూర్తీభవించినవాడు. భారతీయ మనస్తత్వాన్నీ, వేదాంతసారాన్నీ పూర్తిగా ఆకళింపుచేసుకున్నాడు. సంస్కృత, పారశీక, అరబ్బీభాషల్లో పండితుడు. నాటి ఇండియాలోని నాగరికవర్గాల్లో ఎక్కువగా ఉన్న హిందూ, ముస్లిం మిశ్రమసాంప్రదాయాలు ఆయనలో వున్నాయి. బ్రిటిష్‌వారు ఇండియాకురావడము, అనేకవిధాలుగా వారిఆధిక్యత రుజూకావడము గమనించి, జిజ్ఞాసాపరుడైన యీ సాహసి వారినాగరికతామూలాలు ఎక్కడున్నాయో తెలిసికోదలచాడు. ఆంగ్లభాష నభ్యసించాడు. అంతటితోతృప్తిపడక పాశ్చాత్య సంస్కృతి, మతముల మూలకందాలను కనిపెట్టటానికి గ్రీకు, లేటిన్, హీబ్రూ భాషలుకూడా నేర్చుకున్నాడు. అప్పుడు భారతదేశంలో సాంకేతికమార్పులు తరువాతవలె అంత స్పష్టంగా కన్పించకపోయినా, ఆయన విజ్ఞానశాస్త్రము, పాశ్చాత్యనాగరికతకుచెందిన సాంకేతికపరిజ్ఞానములచే ఆకర్షింపబడ్డాడు. వేదాంత పండితహృదయుడైన రామ్‌మోహన్‌రాయ్ తప్పనిసరిగా పురాతన సాహిత్యంవైపు మళ్ళాడు. ప్రాచ్యభాషావేత్త మోనియర్ విలియమ్స్ ఆయన్నుగురించి యిట్లా వ్రాశాడు: ప్రపంచం ప్రసాదించినవారిలో వివిధమతాల లోతు

పాతుల్ని పరిశీలించడాన్ని ఒకశాస్త్రంగా, చిత్తశుద్ధితో అనుసరించిన మొట్టమొదటి వ్యక్తి ఆయనే''. ఆయన విద్యావిధానాన్ని పూర్వపు పండితబంధనాలనుంచి తొలగించి, ఆధునికంచెయ్యాలని ఎంతో ఆదుర్దా పడ్డాడు. ఆ రోజుల్లోకూడా .విద్యాబోధన శాస్త్రీయపద్ధతుల్లో జరగాలనేవాదాన్ని సమర్థించేవాడు. "గణితశాస్త్రం, ప్రకృతితత్వశాస్త్రం, రసాయనశాస్త్రం, శరీరశాస్త్రం, ఇతరప్రయోజనకర విజ్ఞానశాస్త్రాలూ నేర్పే విద్యావిధానంయొక్క ఆవశ్యకతను నొక్కివక్కాణిస్తూ గవర్నర్ జనరల్‌కు ఒకలేఖ వ్రాశాడు.

ఆయన పండితుడూ, పరిశోధకుడూ మాత్రమే కాదు. అంతకంటె ముఖ్యంగా సంస్కర్త. తనజీవితారంభదశలో ఇస్లాంమతంచే, తరువాత క్రైస్తవమతముచే ప్రభావితుడైనప్పటికి తన స్వీయమతపునాదులను వదల్లేదు. ఆ మతాన్ని సంస్కరించేందుకు, దాని దుర్వినియోగాలనూ, దానికి అంటగట్టబడుతున్న దుష్టాచారాలనూ తొలగించేందుకు కృషి చేశాడు. ముఖ్యంగా ఆయననడపిన ఆందోళనవల్లనే బ్రిటిష్‌ప్రభుత్వం 'సహగమనా'న్ని నిషేధించింది. ఈ సహగమనం ఎన్నడు విస్తృత వ్యాప్తి చెందలేదు. కాని ఉన్నతవర్గాల్లో అపుడప్పుడూ యిది జరుగుతూండేది. బహుశా సేవకులూ, బానిసలూ తమయజమానిచనిపోయినప్పుడు ఆత్మహత్యలుచేసుకోవటం ఆచారంగావుండే సిథోతార్తారుల ద్వారా ఈఆచారము భారత దేశానికి వచ్చిఉంటుంది. ప్రాచీనసంస్కృత సారస్వతంలో సహగమనం ఖండించబడింది. దాన్ని అరికట్టేందుకు అక్బరుచక్రవర్తి ఎంతో ప్రయత్నించాడు. మహారాష్ట్రులుకూడా దీన్ని వ్యతిరేకించారు.

ఇండియాలో వార్తాపత్రికలను మొదట్లో స్థాపించినవారిలో రామ్‌మోహన్‌రాయ్ ఒకడు. 1780తర్వాత ఆంగ్లేయులచే ఇండియాలో అనేకవార్తాపత్రికలు ప్రకటింపబడ్డాయి. ఇవి సాధారణంగా ప్రభుత్వాన్ని విమర్శిస్తూఉండేవి. అందువల్ల సంఘర్షణతలెత్తి, కచ్చితమైన వడపోత పద్ధతి యేర్పరచబడింది. భారతదేశంలో పత్రికాస్వాతంత్ర్యం కావాలని పోరాడినవారిలో ప్రథములు ఆంగ్లేయులే. వారిలో జేమ్స్ సిల్క్ బకింగ్‌హాం అనే ఆయన ఇప్పటికీ స్మరింపబడుతున్నాడు. ఆయన్ని ప్రభుత్వం బలవంతంగా యీదేశాన్నుంచి పంపివేసింది. భారతీయునిచే

స్థాపించబడి, సంపాదకత్వంవహించబడిన మొట్టమొదటి వార్తాపత్రిక (ఆంగ్లంలో) 1818లో ప్రకటించబడింది. అదేసంవత్సరంలో సిరంపూరు లోని బాప్టిస్టు మతబోధకులు వంగభాషలో ఒకమాసపత్రికను ఒక వారపత్రికను వెలువరించారు.. భారతీయభాషలలో ప్రకటింపబడిన మొట్టమొదటిపత్రికలు ఇవే. ఆ తరువాత వెంటనే కలకత్తా, మద్రాసు, బొంబాయినగరాల్లో ఆంగ్ల, భారతీయభాషాపత్రికలు తలెత్తాయి.

ఈలోపుగానే పత్రికాస్వాతంత్ర్యోద్యమం ఆరంభమై, అనేక హెచ్చుతగ్గులతో నేటికీ కొనసాగుతోంది. 1818 వ సంవత్సరంలోనే 3వ రెగ్యులేషన్‌కూడా వచ్చింది. ఈ చట్టం ఎవరినైనాసరే, విచారించకుండానే నిర్బంధించే అవకాశాన్ని మొట్టమొదటిసారిగా కల్పించింది. ఈచట్టం యిప్పటికీ అమల్లోవుంది. 126 యేండ్లక్రితం చేయబడ్డ యీ శాసనంక్రింద యిప్పటికీ అనేకమంది జైళ్ళలో క్రుగ్గుతున్నారు.

రామ్‌మోహన్‌రాయ్‌కి అనేకపత్రికలతో సంబంధాలుండేవి. ఆయన బెంగాలీ – ఆంగ్ల ద్విభాషాపత్రికను ప్రకటించాడు. తర్వాత భారతదేశమంతటికి తనపత్రిక వ్యాపించాలనేవుద్దేశంతో పార్శీభాషలో వారపత్రికనొకదాన్ని ప్రకటించాడు. అప్పట్లో పార్శీ ఇండియాలోని నాగరికవర్గాలభాషగా భావించబడేది. కాని 1823 లో పత్రికలను అదుపులోవుంచేందుకు నూతనచట్టాలు చేయబడడం శోచనీయం. రామ్‌మోహన్‌రాయ్, ఇతరులూ యీవిధానాలను ఎంతగానో వ్యతిరేకించారు. ఆఖరుకు ఇంగ్లాండుచక్రవర్తికి ఒక మహజరునుకూడా పంపేరు.

రామ్‌మోహన్‌రాయ్ పత్రికారచనావ్యాసంగాలన్నీ ఆయన ప్రబోధించిన సంస్కరణలకే సంబంధించివుండేవి. ఆయన సంకలనయుక్తంగా, ప్రజాప్రయోజనకరంగా చెప్పేవిషయాలను ఛాందసవర్గాలు నిరసించేవి. వారు ఆయన ప్రబోధించిన సంస్కరణలన్నింటినీ వ్యతిరేకించేవారు. కాని ఆయనకు గట్టి అనుచరులుండేవారు. ఆతరువాత బెంగాల్లో పునరుజ్జీవనోద్యమానికి ఎంతోకృషిచేసిన టాగూర్‌కుటుంబం వారు రామ్‌మోహన్ అనుచరులలోనివారే. రామ్‌మోహన్‌రాయ్ ఢిల్లీచక్రవర్తితరఫున ఇంగ్లండువెళ్ళి, 1830 తరువాత బ్రిస్టల్‌నగరంలో చనిపోయాడు.

రామ్‌మోహన్‌రాయ్, టాగూరువంశీయులు మొదలైనవారు ఆంగ్లభాషను ప్రైవేటుగా అభ్యసించారు. అప్పుడు ఆంగ్లవిద్యాలయాలుగాని, కళాశాలలుగాని లేవు. ప్రభుత్వం భారతీయులకు ఆంగ్ల విద్యాబోధనను పూర్తిగా వ్యతిరేకించేది. 1781లో ప్రభుత్వం కలకత్తాలో హిందూకళాశాలనూ, కలకత్తాపాఠశాలనూ స్థాపించింది. మొదటిది సంస్కృతాధ్యయనానికీ, రెండవది అరబ్బీభాషాబోధనకూ వుద్దేశింపబడ్డాయి. 1791లో కాశీలోమరొక సంస్కృతకళాశాల స్థాపించబడింది. బహుశా 19వశతాబ్ది 2వ దశాబ్దంలో (1810 తర్వాత) కొన్ని మిషనరీపాఠశాలల్లో విద్యనేర్పసాగారు. 1820తర్వాత కొందరు ప్రభుత్వోద్యోగులకు ఆంగ్లభాషాబోధన అవసరమనే అభిప్రాయం కలిగింది. కాని, దాన్ని ప్రభుత్వం వ్యతిరేకించింది. ఏమైనప్పటికీ పరిశోధనా స్థాయిలో ఢిల్లీలోని అరబ్బీపాఠశాలలోనూ, కలకత్తాలోని కొన్ని విద్యాలయాల్లోనూ ఆంగ్లతరగతులు ప్రారంభించబడ్డాయి. 1835 ఫిబ్రవరిలో విద్యానివేదికపై మెకాలే వ్రాసినదానినిబట్టి చిట్టచివరికి ఆంగ్ల విద్యను బోధించాలనే నిర్ణయం జరిగింది. ఆతర్వాత కలకత్తాలో ప్రెసిడెన్సీకాలేజి ప్రారంభించబడింది. 1857లో కలకత్తా, మద్రాసు, బొంబాయి విశ్వవిద్యాలయాలజీవిత మారంభమైంది.

ఇండియాలోని బ్రిటిష్‌ప్రభుత్వం, భారతీయులకు ఆంగ్లవిద్యగరపడాన్ని వ్యతిరేకించినట్లే బ్రాహ్మణపండితులు సంస్కృతభాషను ఆంగ్లేయులకు నేర్పేందుకూడా వివిధకారణాలవల్ల ఎంతో విముఖత ప్రదర్శించారు. అప్పటికే భాషావేత్త, పండితుడైన సర్ విలియం జోన్స్ సుప్రీంకోర్టుజడ్జిగా ఇండియాకు వచ్చినప్పుడు సంస్కృతంనేర్చుకోవాలనే అభిలాష వెలిబుచ్చాడు. గొప్పబహుమతులిస్తానన్నా ఏబ్రాహ్మణుడు పవిత్రమైన సంస్కృతాన్ని పిలవనిపేరంటంగావచ్చిన ఒకవిదేశీయునికి, నేర్పేందుకు అంగీకరించలేదు. జోన్స్ చిట్టచివరికి అతికష్టంమీద, ఒక బ్రాహ్మణేతరవైద్యుని పట్టుకోగలిగాడు. ఆ వైద్యుడు కొన్ని ఖండితమైన షరతులమీదనే సంస్కృతం నేర్పుతానన్నాడు. జోన్స్ అన్ని ఒప్పందాలకు అంగీకరించాడంటే ఆయనకు భారతదేశపు ప్రాచీనభాష నేర్చుకోవాలనేఆతురత అంత గాఢంగా వుందన్నమాట. సంస్కృతం ముఖ్యంగాపురాతననాటకసాహిత్యం ఆయన్నెంతో సమ్మోహపరచింది.

సంస్కృతసారస్వతంలోని అపురూపసంపదలలో కొన్నిటిని పాశ్చాత్య దేశాలు మొదట జోన్స్ అనువాదాలు, రచనలద్వారానే ఆస్వాదించ గలిగాయి. సర్ విలియం జోన్స్ 1784లో బెంగాల్ ఏషియాటిక్ సొసైటీని స్థాపించాడు. అదే తరువాత రాయల్ ఏషియాటిక్ సొసైటీగా మారింది. తన ప్రాచీనసారస్వతంలోని విశిష్టతలను, కనుగొన్నందుకు జోన్స్, తదితరఆంగ్లభాషావేత్తలకు ఇండియా ఎంతో కృతజ్ఞతకలిగివుంది.

ఈ విశిష్టతలలో చాలాభాగం ప్రతియుగంలోను ఎరుకలో ఉన్నవే. కాని ఈ విజ్ఞానం క్రమంగా బహుకొద్దిమందికిమాత్రమే పరిమితమవుతూ వచ్చింది. పారశీకము నాగరికభాషగా ప్రబలమైనప్పటినుంచి ప్రజా దృష్టి సంస్కృతాన్నుంచి మరలింపబడింది. వ్రాతగ్రంథాల అన్వేష ణలో అంతకుముందు తెలియని అనేక రచనలు బైటపడ్డాయి. అలా బయటపడిన విస్తారమైనసారస్వతంవెనుక ఎంతో చరిత్ర వున్నదని పండి తులవ్యాఖ్యానరీతులు విశదపరచాయి.

అచ్చుయంత్రాలు ఉపయోగంలోకి రావడంతో భారతీయ సామాన్యభాషల అభివృద్ధికి గొప్పప్రోత్సాహం లభించింది. హిందీ, బెంగాలీ, గుజరాతీ, మరాఠీ, ఉరుదు, తమిళ, తెలుగుభాషలు అప్పటికే వాడుకలో వుండడమేగాక, సారస్వతాన్నికూడా పెంపొందించు కున్నాయి. ఆ భాషల్లోని అనేకపుస్తకాలు ప్రజాసామాన్యానికి బాగా తెలుసు. ఈ గ్రంథాలు సాధారణంగా పురాణగాథలై, పద్యాలుగా-లేదా పాటలు, పద్యాలకలయికగా ఉండి-ప్రజలు తేలిగ్గా కంఠస్థం చేయదగి వుండేవి. ఆకాలంలో వచనసారస్వతం లేదనే చెప్పవచ్చు. గంభీరసారస్వతమంతా సంస్కృత, పారశీకభాషల్లోనే ఉండేది. ప్రతి నాగరికుడు వాటిలో ఒకభాష తెలిసిఉండాలని భావించబడేది. ఈ రెండు పురాతనభాషలూ ఎంతో ప్రాబల్యంవహించి, ప్రాంతీయప్రజా భాషలపెంపును అరికట్టాయి. పత్రికలూ, పుస్తకాలూ ముద్రించబడ డంతో యీ పురాతనభాషలఆధిపత్యం తగ్గింది. వెంటనే ప్రాంతీయ భాషల్లో వచనసారస్వతాభివృద్ధి ఆరంభమైంది. ఈ పరిణామానికి క్రైస్తవమతబోధకులు (ముఖ్యంగా సిరంపూరులోని బాప్టిస్టుమిషన్ వారు) ఎంతో దోహదమిచ్చారు. వ్యక్తిగత ముద్రణాలయాన్ని మొట్ట

మొదట స్థాపించింది వారే. బైబిలును వచనంలో ప్రాంతీయభాషల్లోకి అనువదింపజేసి, ప్రకటించి, సఫలులయ్యారు.

ప్రచారంలోఉండి ప్రజల్లోపాదుకుపోయిన భాషలవిషయంలో యేకష్టాలూ ఉండవు. కాని యీ మతబోధకులు అంతకంటె ముందంజ వేసి, కొద్దిమందికే తెలిసిన, అంతగా అభివృద్ధిచెందని భాషలనుకూడా పరిశోధించారు. అట్టిభాషలకు ఒక క్రమమైనరూపం, రీతి ఏర్పరచి, వ్యాకరణాలు, శబ్దకోశాలూ తయారుచేసి పెంపొందించారు. కొండలు, అడవుల్లోఉండే ఆదిమవాసులభాషలతో కూడా కిందామీదాపడి, అతివ్యయప్రయాసలతో ఆభాషలను వ్రాయడానికి అనువుగా తయారు చేశారు. తమ బైబిలుగ్రంథాన్ని అన్నిభాషల్లోనూ ప్రకటించాలనే వారిపట్టుదలవల్ల అనేక భారతీయభాషలు ఎంతో అభివృద్ధిచెందాయి. ఇండియాలో యీ బోధకులచర్యలు ఎల్లప్పుడు పొగడదగ్గవి, హర్షింప దగ్గవిగా లేవు. కాని ఈవిషయంలోనూ, జానపదగాథలసేకరణలోనూ, వీరుచేసినకృషి నిస్సందేహంగా ఇండియాకుచేసిన మహత్తరసేవగా చెప్పుకోవలసిందే.

విద్యావ్యాప్తికి ఈస్టిండియాకంపెనీ వ్యతిరేకతనుప్రదర్శించడానికి కారణం లేకపోలేదు. 1830లోనే కలకత్తా హిందూకాలేజి (సంస్కృతం మాత్రమే బోధించేవారు గాని ఆంగ్లంలేదు)కిచెందిన కొందరువిద్యార్థులు కొన్నిసంస్కరణలు కావాలని వత్తిడిచేశారు. వారు కంపెనీరాజకీయా ధికారాలను పరిమితంచెయ్యాలనీ, నిర్బంధఉచితవిద్యావిధానం ప్రవేశ పెట్టాలనీ ఆందోళనచేశారు. చాలా పురాతనకాలంనుంచీకూడా భారత దేశంలో ఉచితవిద్యావిధానం ఉంది. ఆ విద్య ఆచారసాంప్రదాయికంగా ఉండేదేకాని, ఉత్తమంగానూ, లాభదాయకంగానూ ఉండేదికాదు. అయితే పేదవిద్యార్థులు గురువుకు ఏదో కాస్త సేవచేయడమేగాని, ఏవిధమైన ప్రతిఫలమూ చెల్లించకుండానే విద్యలభించేది. ఈ విషయంలో హిందూ, ముస్లిం ఆచారాలు రెండూ ఒకేవిధంగా ఉండేవి.

బెంగాల్లో నూతనవిద్యావ్యాప్తిని తీవ్రంగా అరికట్టడమేగాక, పురాతనవిధానాన్ని పూర్తిగా తొలగించివేశారు. బ్రిటిష్‌వారు జయిం చకపూర్వం బెంగాలులో అనేక పెద్దపెద్ద "మాఫీ"లు - అనగా పన్ను లేని మాన్యాలు - ఉండేవి. ఇందులోకొన్నివ్యక్తులపరంగానూ, అనేకం

విద్యాలయాల ధర్మాదాయభూములుగాను ఉండేవి. అట్టిమాన్యాల మీదనే అనేక ప్రాథమికపాఠశాలలు, కొన్ని ఉన్నతవిద్యాలయాలు ఆధారపడిఉండేవి. ఉన్నతవిద్య పర్షియన్ భాషలో నేర్పబడేది. ఈస్టిండియాకంపెనీ ఇంగ్లండుభాగస్థులకు లాభాలుపంచేందుకు, త్వరితంగా ధనసంపాదించేందుకు తాపత్రయపడింది. కంపెనీపాలకులవత్తిడి తీవ్రమయింది. అందువల్ల ఈ మాన్యాలను ఊడలాక్కొని, కంపెనీఆస్తులుగా పరిగణించేవిధానం తీవ్రంగా అమలుజరుపబడింది. ఈ మాన్యాలకు దానపత్రాలను చూపించవలసిందిగా వత్తిడిచేశారు. అట్టిసనదులూ పత్రాలూ ఏనాడో చెదలుపట్టి నాశనమైపోయాయి. ఋజువులు లేవనే సాకుతో ఈ మాన్యాలు ఊడబెరుక్కొని, హక్కుదార్లను గెంటివేశారు. విద్యాలయాలకు ధర్మాదాయాలు అదృశ్యమయ్యాయి. ఈ విధానంక్రింద పెద్దపెద్ద భూఖండాలు చేతులుమారడంవల్ల అనేకకుటుంబాలు నాశనమయ్యాయి. ఈ మాన్యాలచే పోషింపబడుతూన్న విద్యాలయాలు మూసివేయబడ్డాయి. వాటికి సంబంధించిన ఉపాధ్యాయులు మొదలైనవారు నిరుద్యోగులయ్యారు.

ఈపరిణామంవల్ల బెంగాల్లోని పురాతన హిందూముస్లింభూస్వామ్య కుటుంబాలు, వారిపై ఆధారపడివున్నవారూ నాశనమైపోయారు. ముస్లింలు హిందువులకంటె ఎక్కువమంది భూస్వాములైనందున, యీ మాన్యాలెక్కువగా అనుభవించేవారుగనుకను వారికే యీదెబ్బ బలంగా తగిలింది. హిందువుల్లో ఎక్కువమంది మధ్యతరగతిప్రజలు వర్తక, వాణిజ్య వృత్తులలో ఉండేవారు. వారు పరిస్థితులకు అనువుగా యిమిడిపోయేగుణం కలిగియుండి, త్వరలోనే ఆంగ్లవిద్య నభ్యసించారు. బ్రిటిష్ ప్రభుత్వానికి చిన్నఉద్యోగాలుచేస్తూ ఎంతగానో ఉపయోగపడుతున్నారు. బెంగాలు ముస్లింలను ఆంగ్లపాలకులు నిరాదరణభావంతో చూచేవారు. ఒకప్పటి పాలకవర్గానికిచెందిన వీరు, మళ్ళీ, ప్రమాదాలు సృష్టిస్తారేమోనని భయపడేవారు. అందువల్ల ముస్లింలు ఆంగ్లవిద్యకు దూరంగానే వుండిపోయారు. అందువల్ల, మొదట్లో బెంగాలీ హిందువులే చిన్నచిన్న ప్రభుత్వోద్యోగాల్లో అధికస్థానాలు ఆక్రమించారు. వారు ఇతర ఉత్తరరాష్ట్రాల ఉద్యోగాలకూ్కడా పంపబడేవారు. పురాతన

కుటుంబాలకు చెందిన కొద్దిమంది ముస్లింలనుకూడా ఆ తర్వాత యీ వుద్యోగాలలోకి తీసుకున్నారు.

ఆంగ్లవిద్యాభ్యాసం భారతీయభావవీథిని విస్తృతంచేసింది. ఆంగ్ల సాహిత్యము, విద్యాలయాలప్రశంసలు, భారతీయజీవితంలోని కొన్ని ఆచారాలు, దృక్పథాలపై తిరుగుబాటు, రాజకీయసంస్కరణలకై మరింత అలజడి ఆరంభమయ్యాయి. కొత్తవృత్తుల నవలంబించినవర్గాలు రాజకీయాందోళనలో నాయకత్వంవహించాయి. ప్రభుత్వంవద్దకు రాయబారవర్గాలను పంపడమే ఆందోళనగా వుండేది. ఈ వృత్తుల్లో, వుద్యోగాల్లోవున్న ఆంగ్లవిద్యాధికులు ఒక ప్రత్యేకవర్గంగా ఏర్పడి నట్లైంది. ఈ వర్గం ఇండియాఅంతటా వ్యాపించింది. వీరు పాశ్చాత్యనాగరికత, ఆలోచనలప్రభావానికిలోనై, సామాన్యప్రజానీకానికి దూరంగా వుండేవారు. 1882 లో కలకత్తాలో "బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్" స్థాపించబడింది. ఒకతరం తర్వాత 1885 లో స్థాపించబడిన భారతజాతీయకాంగ్రెసుసంస్థకు – పైసంఘం మార్గదర్శకమైనదని చెప్పవచ్చు. ఈ మధ్యగల 'ఒకతరం' తేడాకు 1857–58 లలోజరిగినవిప్లవము, దాన్ని అణచడం, తత్ఫలితాలు కారణమని చెప్పవచ్చును. 19వ శతాబ్ది మధ్యభాగంలో బెంగాలుకూ ఉత్తర, కేంద్రభారతాలకూమధ్య చాలా భేదంవుండేది. బెంగాల్లోని విజ్ఞానవంతులు(ముఖ్యంగా హిందువులు)ఆంగ్లేయుల దృక్పథాలచే, సారస్వతంచే ఆకర్షింపబడి రాజ్యాంగసంస్కరణల కోసం ఇంగ్లండువైపు చూస్తూండేవారు. ఆకాలంలో ఇతరప్రాంతీయులు విప్లవభావాలతో పరవళ్ళుత్రొక్కుతూండేవారు.

బ్రిటిష్‌పాలన, పాశ్చాత్యప్రభావాలవల్ల ఆదిలోకలిగిన మార్పులను ఇతరప్రాంతాల్లోకంటె, బెంగాల్లో స్పష్టంగా చూడవచ్చు. వ్యావసాయిక ఆర్థికవిధానం ఛిన్నాభిన్నమైపోయి భూస్వామ్యవర్గాలన్నీ తుడిచివేయబడ్డాయి. వారిస్థానంలో కొత్తరకంభూస్వాములువచ్చారు. వీరికి శారీరకంగాగాని, ఆచారపరంగాగాని భూమాతతో సన్నిహిత సంబంధాలు లేవు. పూర్వపుభూస్వాముల ఉత్తమగుణాలు, లోపాలు వీరికి లేవు. రైతులు క్షామాలకుగురిఅయి, అనేకవిధాల దెబ్బతిని, నిరుపేదలైపోయారు. చేతివృత్తులవారు నామరూపాల్లేకుండాచేయబడ్డారు. ఇలా ఛిన్నాభిన్నమై, పరస్పరసంబంధాల్లేని పునాదులమీద

కొత్తకూటములు, వర్గాలూ లేచాయి. అవి బ్రిటిష్‌పాలనచేసృష్టింపబడి దానితోనే సన్నిహితసంబంధాలు కలిగివుండేవి. వారిలో వ్యాపారస్థులు బ్రిటిష్‌వ్యాపారులకూ, పరిశ్రమలకూ మధ్య దళారులుగావుంటూ, ఆ పరిశ్రమలు వదలివేసినదాన్ని లాభంగా పొందేవారు. చిన్నవుద్యోగాల్లోనూ, ఉన్నతవృత్తుల్లోనూవున్న ఆంగ్లవిద్యాధికులు పాశ్చాత్యనాగరికతచే ఆకర్షింపబడి, బ్రిటిష్‌వారే మనపురోభివృద్ధికి కృషిచెయ్యాలని ఎదురుచూచారు. వీరిలో హిందూసమాజచట్రంలోగల మూఢాచారాలను తొలగించాలనే తిరుగుబాటుతత్వం ప్రకోపించింది. వారు ఆంగ్లేయుల ఉదారవాదము, సంస్థలనుంచి సముత్సాహాన్ని పొందేవారు.

ఈ ప్రభావం బెంగాలు ఉన్నతహిందువులమీద పైపైన ప్రసరించింది. అక్కడి సాధారణహిందూప్రజలపై యీప్రభావం ప్రత్యక్షంగా ప్రసరించలేదు. నాయకులుకూడా యీసామాన్యులసంగతి పట్టించుకునేవారుకాదు. ఏ కొందరువ్యక్తులోతప్ప ముస్లింలు ఈప్రభావానికి లోనుకాలేదు. వారి కొత్తవిద్యావిధానానికి దూరంగా, మడిగట్టుకుకూర్చున్నారు. అసలే ఆర్థికంగా వెనుకబడివున్న ముస్లింలు మరింత పేదలైపోయారు. 19 వ శతాబ్దంలో హిందువుల్లో అనేకమంది ప్రతిభావంతులైన మహాపురుషులు ప్రభవించగా, ఒక్కముస్లింనాయకుడైనా పొడచూపలేదు. సాధారణప్రజలకు సంబంధించినంతవరకు హిందూ, ముస్లిములమధ్య భేదాలులేవు. అలవాట్లు, జీవనవిధానాలు, భాష, పేదరికం బాధలపంపకాల్లో ఆ యిరుతెగలకు విడమర్చలేని సామ్యం వుండేది. అసలు ఇతరప్రాంతాల్లోవున్నంత స్పష్టమైనమతవిభేదాలు బెంగాల్లో కన్పించలేదు. బహుశా ముస్లిములలో నూటికి 98 మంది క్రిందితరగతి హిందువులలోనుంచి మతాంతరులైనవారే. జనసంఖ్యలో హిందువులకంటె, ముస్లింలే కొంచెమెక్కువ. (నేటి బెంగాల్లో నూటికి 53 మంది ముస్లింలు, 46 మంది హిందువులు, ఒక్కరు ఇతరులు)

బ్రిటిష్‌వారిసంబంధంవల్ల ఆదిలో బెంగాలులో తలెత్తిన ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక, రాజకీయ ఉద్యమాలు ఇతరప్రాంతాల్లోకూడా తలెత్తడం గమనించదగ్గది. కొన్నిచోట్ల ఎక్కువగా, మరికొన్నిచోట్ల తక్కువగా కన్పించవచ్చు. ఇతరచోట్ల భూస్వామ్యవిధానవిచ్ఛిత్తి, ఆర్థికమార్పులు పూర్తికాక, నెమ్మదిగా జరిగాయి. వాస్తవానికి పూర్వ

విధానాలు బ్రిటిష్‌వారికి ఎదురుతిరగడము, అవి అణచివేయబడడము, అక్కడక్కడ కొద్దిగా మిగిలివుండడం సంభవించింది. బెంగాల్లోని ముస్లింలకంటె, ఉత్తరభారతంలోనివారు నాగరికతలోనూ, ఆర్థికంగానూ చాలా మెరుగు. అయినా వారుకూడా ఆంగ్లవిద్యకు దూరంగానే వుండిపోయారు. హిందువులు ఈ విద్యను సులభంగా అలవర్చుకుని, పాశ్చాత్యదృక్పథాలప్రభావానికి లోనయ్యారు. దిగువతరగతి ప్రభుత్వోద్యోగాల్లోను వృత్తుల్లోను ముస్లిములకంటె, హిందువులు ఎన్నో రెట్లెక్కువగా వుండేవారు. పంజాబులోమాత్రం ఇంత తేడా కనిపించదు.

1857–58 మహావిప్లవం ప్రజ్వరిల్లింది, అణచివేయబడింది. కాని అది బెంగాలును స్పృశించనేలేదు. 19వ శతాబ్దంలో ఆంగ్లవిద్యావంతులందరూ ఇంగ్లండును గురుభావంతో చూస్తూ దాని సహాయంతో పురోగమించాలనీ దానితోసహకరించాలనీ ఆశించేవారు. సాంస్కృతిక పునరుజ్జీవనం, బెంగాలీభాషాభివృద్ధీ జరిగి, వంగనాయకులే భారతరాజకీయనాయకులయ్యారు.

ఆకాలంలో వంగదేశీయులకు ఇంగ్లాండుపైగల విశ్వాసాన్నీ, పురాతనసాంఘికాచారాలపైగల తిరుగుబాటుస్వభావాన్నీ సూచనప్రాయంగా తెలుసుకునేందుకు రవీంద్రనాథటాగూరు తన 80 వ జన్మదినోత్సవసందర్భంలో – (1941 మేలో) ఆయనమరణానికి కొద్దినెలల ముందు – యిచ్చిన ఈ మహత్తరసందేశాన్ని చదివితే చాలు; "నేను గడచివచ్చిన ఆ సంవత్సరాలనన్నింటినీ వెనుదిరిగి పరిశీలిస్తుంటే, నేను తొలిదశలో పొందిన అభివృద్ధిచరిత్రను సరైనదృక్పథంలో చూస్తుంటే, నా స్వీయదృక్పథంలోను, నా దేశీయులమనస్తత్వంలోనూ వచ్చిన మార్పు, నన్ను నిర్విణ్ణునిచేస్తోంది. ఆ మార్పులో ఘోరవిషాదభరితకారణాలుకూడా అంతర్భూతమై వున్నాయి.

"ప్రపంచమానవులతో మాకుగల ప్రత్యక్షసంబంధం, ఆంగ్లేయుల సమకాలికచరిత్రతో పెనవేసుకొనివుంది. ఆ తొలిరోజుల్లో మేము ఆంగ్లేయులనుగురించి తెలుసుకోగలిగాం. మనభారతతీరాలకు కొత్తగావచ్చిన వీరినిగురించి ముఖ్యంగా వారి మహత్తరసారసత్వం ద్వారానే మేము మా అభిప్రాయాలనేర్పరచుకున్నాం. ఆరోజులలో

వారు మాకు అందజేసినవిద్యలో అమితంగాని, వైవిధ్యంగాని లేదు. శాస్త్రీయజిజ్ఞాసాప్రేరకచిహ్నాలైనా వుండేవికావు. ఆవిధంగా నాటి విద్యావంతులకుగల అవకాశం బహుపరిమితమైనందున వారు ఆంగ్లభాషను, సారస్వతాన్ని అధ్యయనంచేయక తప్పలేదు. బర్కేగారి హుందాయైన ప్రసంగాలు, మెకాలేగారి సుదీర్ఘసమాస వాక్యాలు, షేక్స్పియర్‌నాటకాలపై, బైరన్‌కవితపై వాదోపవాదాలు, అంతకంటె ముఖ్యంగా 19 వ శతాబ్దపు ఆంగ్లరాజకీయాల్లోగల విశాలహృదయము, ఉదారవాదములే రేయింబవళ్ళు మన విద్యార్థులహృదయాలలో మెదులుతూండేవి.

"ఆకాలంలో జాతీయస్వాతంత్ర్యసాధనకై కొన్నిప్రయత్నాలు జరుగుతున్నప్పటికీ మాహృదయాల్లో, ఇంగ్లీషువారి దయార్ద్రప్రకృతిపై గలవిశ్వాసం నశించలేదు. ఈ విశ్వాసం మా నాయకులభావనలో ఎంతగాఢంగా పాదుకుపోయిందంటే విజేత అనుగ్రహగుణంచే ఓడిన వారు స్వతంత్రులయ్యేందుకు కావలసినమార్గాన్ని తానే ఏర్పరుస్తాడని వారు ఆశించేవారు. స్వదేశాల్లో ప్రభుత్వదమననీతికి గురియై పారిపోయిన రాజకీయవేత్త లనేకమందికి ఇంగ్లండు ఆశ్రయమివ్వడంవల్లనే అట్టివిశ్వాసం ఏర్పడింది. తమప్రజలగౌరవంకోసం బాధలననుభవించిన రాజకీయయోధులకు ఇంగ్లండులో నిరవధికమైన స్వాగతసత్కారాలు లభించేవి. ఆంగ్లేయుల్లో యీవిధంగా ప్రస్ఫుటమైన ఉదారమానవత్వం నన్ను సమ్మోహితుణ్ణిచేసింది. అందువల్ల వారికి నా హృదయంలో మహోన్నతగౌరవస్థానమిచ్చాను. వారిజాతీయప్రకృతిలోగల యీ దయాబుద్ధి సామ్రాజ్యవాదసహజమైనగర్వంచేత అప్పటికింకా తుడిచివేయబడలేదు. అప్పుడు నే నొకబాలకుణ్ణిగా ఇంగ్లండులో వున్నాను. జాన్ బ్రైట్‌గారు పార్లమెంటులోను, బయట యిచ్చిన వుపన్యాసాలు వినే సదవకాశం నాకు లభించింది. ఆ వుపన్యాసాలలోవున్న, విశాలహృదయం, తీవ్ర ఉదారవాదం సంకుచితజాతీయసరిహద్దుల్ని అధిగమించి, పొంగి పొర్లింది నికృష్ట, నిరాశావహమైన యీరోజుల్లోకూడా ఆ వుపన్యాసాలు నాహృదయంపై ప్రసరింపజేసినప్రభావం నాలో సంచలిస్తూనే వుంటుంది.

మనపాలకులదయమీద పూర్తిగా ఆధారపడివుండే మనస్తత్వం, మనకు గర్వకారణంకాదనేమాట నిస్సంశయం. ఏమైనప్పటికీ, ఇక్కడ స్పష్టంగా కనిపించేవిశేషమేమిటంటే మానవుని ఔన్నత్యమనేది, విదేశీయులలో కనిపించినప్పటికీ, దాన్ని మేమెంతో హృదయపూర్వకంగా గుర్తించి, గౌరవించామనేదే. మానవత్వానికిగల మహత్తర, మహోదాత్తలక్షణాలేవీ కూడా ఏ ఒక్కజాతికో, దేశానికో గుత్తసొమ్ములు కావు. వాటిప్రయోజనాన్ని పరిమితంచేయలేము. పిసినిగొట్టు నిక్షేపించిన గుప్తధనంవంటిదని అనలేము. అందువల్లనే గతంలో మా ఆలోచనను పెంచిన ఆంగ్లసారస్వతం, నేడు మాహృదయాల్లోగల శూన్యాంతరాలను, తన గంభీరప్రతిధ్వనులతో నింపుతోంది."

మన సాంప్రదాయాలచేత నిర్ణయించబడిన "సత్ప్రవర్తన" అనే భారతీయాదర్శాన్ని ఉదహరిస్తూ టాగూర్ యిలాచెప్పాడు: "పురాతనంగా శిరోధార్యములైన యీ సాంఘికాచారాలు సహజంగానే సంకుచితమైనటువంటివి. ఇవి సరస్వతి, దృషద్వతీనదులమధ్యగల 'బ్రహ్మవర్త'మనే గిరిగీసినట్టున్నభూభాగంలోపుట్టి, అమల్లోఉండేవి. అందువల్లనే క్రమంగా కృత్రిమానుష్ఠానము స్వేచ్ఛాభావనను లోబరచుకుంది బ్రహ్మవర్తంలో నెలకొల్పబడినదని మనువుగ్రహించిన 'సత్ప్రవర్తన' మనే భావన పతనమై, సాంఘికోపద్రవరూపం దాల్చింది.

"నా బాల్యంలో నాగరికులు, విద్యావంతులైన వంగీయులు, ఆంగ్లవిద్యాప్రభావితులై, ఈ సాంఘిక మూఢాచారాలసంకెళ్ళను త్రెంచాలని ఆవేశపడేవారు. 'సత్ప్రవర్తన'లని నిర్ణయించబడిన ఆచారాలస్థానంలో ఆంగ్లంలో 'నాగరికత' అనబడే ఆదర్శాలను మే మంగీకరించాము.

"ఈ దృక్పథంలోని నగ్నహేతువాదమూ, నైతికశక్తీ గమనించే మా కుటుంబం ఈమార్పును ఆహ్వానించింది. మా జీవితాల్లో ప్రతిభాగము యీ ప్రభావానికి లోనైనది. అట్టివాతావరణంలోపుట్టి, మాకుటుంబంలో సహజసిద్ధంగాగల సారస్వతాభిమానంలో తయారైన నేను ఆంగ్లసారస్వతాన్ని నా హృదయపీఠంమీద అధిష్ఠింపజేయడం సహజమే. నా జీవితప్రథమాధ్యాయాలు ఆవిధంగా గడచిపోయాయి ఆ తర్వాత నాగరికతయొక్క మహోన్నతసత్యాలను అంగీకరించినవారే,

తమ జాతీయస్వార్థసమస్య ఎదురైనప్పుడు, అసత్యాలను యెంత తేలిగ్గా తోసిపుచ్చుతున్నారో నేను గుర్తించసాగాను. దాంతో మా మార్గాలు విభిన్నంకావడం, దానితోపాటే బాధాయుతమైన ఆశా భంగమనుభవించడం సంభవించాయి.”

## ౭ 1857 మహావిప్లవం - జాతిభేదం

బెంగాలు దాదాపు వందసంవత్సరాల బ్రిటిష్‌పాలన తర్వాత తననుతాను దాని కనుగుణ్యంగా మార్చుకుంది. రైతులోకం తూమంచే నాశనంచేయబడి, కొత్త ఆర్థికభారాలచే అణగద్రొక్కబడింది. నవీన విజ్ఞానవంతులు పాశ్చాత్యదేశాలవైపే చూస్తూ ఆంగ్లేయుల ఉదార వాదంద్వారానే అభ్యుదయం కలుగుతుందని ఆశిస్తున్నారు. మద్రాసు, బొంబాయిరాష్ట్రాల్లోకూడా పరిస్థితులు ఇలాగేవున్నాయి. కాని ఉత్తర రాష్ట్రాలు ఆవిధంగా తలవంచడంగాని, అనుగుణంగామారడంగాని జరగలేదు. అక్కడ జమీందారులు, వారిఅనుయాయుల్లో విప్లవావేశం పెంపొందుతోంది. సామాన్యప్రజల్లోకూడా అసంతృప్తి, బ్రిటిష్‌వారి పట్ల తీవ్రవ్యతిరేకభావాలు వ్యాపించాయి. ఉన్నతవర్గాలు విదేశీయులు తమను అవమానించడం, యజమానులవలెప్రవర్తించడం సహించలేక పోయాయి. ఈస్టిండియాకంపెనీఉద్యోగులు తమను అర్థంచేసుకోలేక, క్రూరంగా ప్రవర్తించడంవల్ల ప్రజలు ఎన్నోవ్యథలు అనుభవించారు. ప్రజలేమనుకుంటున్నారనేదిగాని, వారు పవిత్రంగా గౌరవించే ఆచారా లనుగాని వుద్యోగులు లెక్కచేయలేదు. లక్షలాదిప్రజలమీద సర్వాధి కారాలూలభించి ఒక హద్దూ, అదుపూ లేనందువల్ల వారితలలుతిరిగి పోయాయి. వారు ప్రవేశపెట్టిన న్యాయపాలనాపద్ధతికూడా ప్రజలను భయభ్రాంతుల్నిచేసింది. ఈ న్యాయవిచారణావిధానంలో అనేక డొంక తిరుగుళ్ళు వుండడమేగాక న్యాయాధిపతులకు ప్రజలభాషగాని, ఆచార సాంప్రదాయాలుగాని తెలియవు.

1817లోనే సర్ థామస్ మన్రో, నాటిగవర్నర్ జనరల్ లార్డ్ హేస్టింగ్స్‌కు బ్రిటిష్‌పాలనలోని సత్ప్రయోజనాలను వివరిస్తూ ఒకలేఖ వ్రాశాడు. “కాని, యీ సత్ప్రయోజనాలను ఎంతో ప్రియమైనధరకు కొనుక్కున్నారు. స్వాతంత్ర్యం, జాతీయప్రకృతి, ప్రజలను గౌరవాన్వి

తులనుచేసేగుణాలన్నీ బలియిచ్చి వీటిని కొన్నారు....అందువల్ల బ్రిటిష్ఆయుధాలు ఇండియాను జయించిన ఫలితం ప్రజలనుద్ధరించ డానికిబదులు, నీచస్థితికి పతనంచేయడమే. బ్రిటిష్ఇండియాలోలాగా దేశీయులు తమప్రభుత్వంలో ఈషణ్మాత్రపుభాగమైనాలేకుండా వెలి వేయబడిన ఉదాహరణ ప్రపంచంలో జయింపబడిన మరేదేశచరిత్ర లోనూ లభించదు."

అప్పుడు పాలనాయంత్రంలో భారతీయులనుకూడా చేర్చాలని మన్రో వాదిస్తున్నాడు. ఒక సంవత్సరంతర్వాత మరోలేఖ వ్రాశాడు. "విదేశస్తులు దండయాత్రల్లో విజయులైనప్పుడు ఆ దేశీయులను రక్త పాతానికిగురిచేస్తారు; క్రూరంగాచూస్తారుకూడాను. కాని మనం భారతీ యులను చూచినంత హేయంగా మరెవరూ చూచిఉండరు. ప్రజలంతా అవిశ్వసనీయులనీ, నిజాయితీలేనివారనీ, వారులేకపోతే మనకు జరుగ దనుకున్న ఉద్యోగాల్లోమాత్రమే నియమింపదగ్గవారనీ మనం నీచ ముద్రలువేసినట్లు మరెవ్వరూ ఏజాతినీ చేసిఉండరు. మనపాలనక్రిందికి వచ్చిన ఒకజాతిని యిట్లా చూడడం నిర్దాక్షిణ్యమేగాక, రాజనీతికి వ్యతిరేకమనిపిస్తుంది."

బ్రిటిష్వలసరాజ్యం రెండు సిక్కుయుద్ధాలఅనంతరం పంజాబు కుకూడా వ్యాపించింది. పంజాబులో సిక్కురాజ్యాన్ని పెంపొందించి పాలిస్తున్నమహారాజా రంజిత్ సింగ్ 1839లో మరణించాడు. 1856లో అయోధ్య కలుపుకోబడింది. అయోధ్యరాజు దుర్బలుడు,నిస్సహాయుడూ కావడం, బ్రిటిష్ రెసిడెంటు సర్వాధికారిగా ఛలాయించడంవల్ల అది బానిసరాజ్యంలాగా, అర్ధశతాబ్దకాలం బ్రిటిష్పాలనలోవున్నట్లే భావిం చాలి. అది అన్నిరకాల నీచస్థితికి పతనమై సైనికసహాయపద్ధతిలోని దుష్ఫలితాలన్నీ చవిచూచింది.

1857 మేనెలలో, మీరట్లో భారతీయసైన్యం తిరుగుబాటు చేసింది. ఈ విప్లవం ఎంతో కట్టుదిట్టంగా, రహస్యంగా యేర్పాటుచేయ బడింది. కాని గడువుకుముందుగానే ఒకచోట ప్రజ్వరిల్లడంవల్ల నాయ కుల వ్యూహాలన్నీ తారుమారయ్యాయి. అది సిపాయిలతిరుగుబాటు కంటె మహత్తరమైంది. అది శీఘ్రగతినివ్యాపించి ప్రజావిప్లవంగాను, భారతస్వాతంత్ర్యసమరంగాను రూపొందింది. అట్టి ప్రజావిప్లవస్వరూ

పంలో ఢిల్లీ, సంయుక్త రాష్ట్రాలు (ఇప్పటిపేరు), మధ్యభారతం, బీహారు లలోమాత్రమే ప్రజ్వలించింది. ఇది విస్తృత విదేశవ్యతిరేకభావాల ద్రోహదంచే ఫ్యూడల్ రాజులు, జమీందారులు, వారి అనుయాయుల చేతనే నడుపబడిన విప్లవం. అప్పటికి ఢిల్లీ సింహాసనంపైనున్న మొగల్ చక్రవర్తి తను కీ విప్లవంలో సాయపడాలని ఆశించారు. కాని అతడు నామమాత్రావశిష్టుడు,దుర్బలుడు, నిస్సహాయుడైన వృద్ధుడు. ఈ విప్లవంలో హిందువులూ, ముస్లిములు కూడా పాల్గొన్నారు.

ఈ విప్లవం బ్రిటిష్ప్రభుత్వాన్ని గజగజలాడించింది. చివరికి భారతీయులమద్దతుతోనే అణచివేయబడింది. పురాతనపాలకవర్గాలు పరాయిపాలనను పరిమికొట్టాలని కొనవూపిరినికూడా వెచ్చించాయి. దీనితో ఆ పాలనలోని బలహీనతలన్నీ బైటపడ్డాయి. ఫ్యూడల్ రాజులకు విశాలప్రాంతీయప్రజల సానుభూతి అండగావున్నా, వారు అసమర్థులుగా, అనైక్యంగా, నిర్మాణయుక్తమైన సామాజికలక్ష్యం లేకుండా ఉండిపోయారు. చరిత్రలో తమకుగలపాత్రను అప్పటికే నటించివేశారు. ఇక భవిష్యత్తులో వారి కెలాంటిస్థానమూ లేదు. వారిలో ఎక్కువమంది యీ విప్లవంపట్ల సానుభూతి కలిగివున్నా, క్షాత్రలక్షణాల్తో ముందువెనుకలు చూడటం ముఖ్యమన్నవిశ్వాసంతో ఎవరుగెలుస్తారో చూద్దామని వేచి చూడసాగారు. అనేకమంది దేశద్రోహులుగా ప్రవర్తించారు. సంస్థానాధీశుల్లో దాదాపు అందరూ ఎడంగా వుండిపోయారు. కృత్యాద్యవస్థమీద తమకు మిగిలిందికూడా కోల్పోవలసివస్తుందేమో ననే భయంతో, బ్రిటిష్వారికి సాయపడ్డవారుకూడా వున్నారు. ఈ విప్లవనాయకులకు సమైక్యపరచే జాతీయభావస్పందన లేనేలేదు. విదేశీయులపట్ల వ్యతిరేకత, తమకుండిన జమీందారీవిశేషాధికారాలను నిలబెట్టుకోవాలనేకాంక్ష మాత్రమే "జాతీయప్రయోజనాని"కి దీటురాలేవుగదా!

బ్రిటిష్వారికి గూర్ఖాలసహాయం లభించింది. అంతకంటె ఆశ్చర్యకరమైనవిశేషమేమంటే, వారి కెప్పుడూ శత్రువులుగానేవుండి, కొద్ది సంవత్సరాలక్రితమే ఓడించబడ్డ శిక్కులుకూడా, బ్రిటిష్వారికి మద్దతుగా నిలిచారు. శిక్కులను ఈవిధంగా తమవైపుత్రిప్పుకోగలగడం నిజంగా బ్రిటిష్వారి ప్రతిభే అనాలి. ఐతే, ఇది ఆనాటి శిక్కుల గొప్పతనమూ,

నీచత్వమూ అనేది మాత్రం పరిశీలించేవారి దృక్పథంమీద ఆధారపడి ఉంటుంది. ఏది ఏమైనప్పటికీ భారతీయులనందరిని ఏకంచేయగల జాతీయ భావంమాత్రం లేకపోయిందనేది స్పష్టం. ఆధునిక జాతీయవాదం అప్పటి కింకా ఉద్భవించలేదు. ఇండియా – తనకు నిజమైనస్వాతంత్ర్యాన్ని ప్రసాదించగలపాఠాన్ని నేర్చుకునేలోగా – అనేక వేదనలు, దుఃఖాలు అనుభవించవలసిఉంది. జమీందారీరాచరికాలవంటి మృతసమస్యలకై పోరాడడంవల్లనే స్వాతంత్ర్యం రాదు.

ఈ విప్లవం గొప్ప గెరిల్లానేతలు కొందరిని ప్రసాదించింది. ఢిల్లీ చక్రవర్తి బహదూర్‌షాకు బంధువైన ఫిరోజ్‌షా అట్టివాడే. అందరి కంటె ప్రజ్ఞావంతుడు తాంతియాతోపే. ఓటమి ఆయనముఖంలో తేరి చూస్తున్నా, బ్రిటిష్‌వారిని అనేక నెలలపర్యంతం నానాతిప్పలుపెట్టాడు. చివరికి నర్మదానదిని దాటి మహారాష్ట్రపరిహద్దుల్లో కాలుపెట్టి, తన ప్రజల స్వాగత, సహాయాలు లభిస్తాయని ఆశించగా, అవి లేకపోగా, ద్రోహంజరిగింది. మరొకపేరు మహోన్నతపథంలోనిలచి, ఇప్పటికీ ప్రజలచేత స్మరింపబడుతోంది. ఝాన్సీరాణి లక్ష్మీబాయి ఇరువదేండ్ల వయసులోనే, బ్రిటిష్‌వారితో పోరాడుతూ వీరస్వర్గమలంకరించింది. ఆమెతో యుద్ధంచేసిన ఆంగ్లసైన్యాధికారే ఆమెను "మహోన్నత విప్లవవీరశిఖామణి" అని వర్ణించాడు.

బ్రిటిష్‌వారు ఈ విప్లవస్మారకచిహ్నాలను కొన్నారు మొదలైనచోట్ల నెలకొల్పారు. ఇందులో చనిపోయినభారతీయులకు మాత్రం ఎలాంటిస్మారకచిహ్నాలూ లేవు. భారతవిప్లవకారులు సమీకృతశిక్షణ లేకపోవడంచేతను, బహుకాలంగా తమశక్తులు అణచబడడంవల్ల బ్రిటిష్‌వారు హద్దుమీరిప్రవర్తిస్తున్నారని విని ఆగ్రహావేశులయినందువల్లను విప్లవకాలంలో కొన్నిసార్లు రాక్షసంగా, మొరటుగా ప్రవర్తించారు. ఈ విప్లవానికిసంబంధించిన మరొకవిశేషం భారతహృదయాల్లోగాఢంగా హత్తుకుపోయింది. ముఖ్యంగా నా స్వరాష్ట్రంలో ప్రతిపట్నంలోను, ప్రతిపల్లెలోను దానిజ్ఞాపకాలు తిరుగాడుతూవుంటాయి. నాజీతత్వము ఆధునికయుద్ధంలో క్రూరత్వంలో కొత్తప్రమాణాన్ని స్థాపించినా, అంతకంటెఘోరంగా రాక్షసంగా మానవులు ప్రవర్తించినట్లు తెలిపే ఈ చిత్రాన్ని ఎవరైనా మరచిపోయేందుకు ప్రయత్నించవచ్చు. కాని, అగ్ని

పూర్తిగా చరిత్రలో మణగిపోయి, వర్తమానాని కెలాంటిసంబంధమూ లేనిదైతేనే మనం అంటీముట్టనట్లు మరచిపోగల్గడం సంభవం. గతాన్ని కలిపే అంకెలు ఉన్నంతకాలం, ఆ సంఘటనలవెనుకగల భావన ప్రస్ఫుటంగా తలెత్తుతూనేవున్నంతకాలం వాటిస్మృతులు సజీవంగా ఉండి, వాటిప్రభావం మనప్రజలమీద పడుతూనేవుంటుంది. ఆ స్మృతి చిత్రాన్ని అణచాలనేప్రయత్నాలు, దాన్నిధ్వంసంచేయలేకపోగా, మరింతగాఢంగా మనోఫలకంమీద ముద్రించుతాయి. దాన్ని సామాన్యంగా చూడడంవల్లనే దానిప్రభావం కొంత తగ్గుతుంది.

ఈతిరుగుబాటు, దానినణచడాన్ని గురించి అభూతకల్పనలు, వక్ర వ్యాఖ్యానాలుగల చరిత్ర బోలెడంత రచింపబడింది. దాన్ని గురించి భారతీయులేమనుకుంటున్నారో అనేది అచ్చుపుటల్లోకి యెక్కదు. సావర్కారు ముప్ఫదేండ్లక్రితం "భారతస్వాతంత్ర్యసమరచరిత్ర" రచించాడు. అది వెంటనే బహిష్కరించబడింది. ఇప్పటికీ ఆ బహిష్కారం కొనసాగుతూనేవుంది. కొందరు నిర్మోహమాటస్థులూ, గౌరవనీయులూనైన ఆంగ్లచరిత్రకారులు దానిపైముసుగును అప్పుడప్పుడూ కొంత తొలగించారు. అప్పుడున్న జాతిద్వేషము, అహంకారము, భారీయెత్తున చట్టబద్ధవిచారణలేకుండా శిక్షించడము మనకు సూచనప్రాయంగా కనిపిస్తాయి. కేయీ, మాలెసన్‌లు రచించిన "సిపాయీల తిరుగుబాటుచరిత్ర" లోనూ, థాంప్సన్, గేరట్‌లు రచించిన "ఇండియాలో బ్రిటిష్‌పరిపాలనారంభము, సాఫల్యము" అనే చరిత్రలోని వర్ణనలు ఎవరికైనా భయంచే వణికిస్తాయి. "బ్రిటిష్‌వారితరఫున పోరాడని ప్రతిభారతీయుడూ స్త్రీహంతకుడు, శిశుహంతకుడు అయ్యాడు... ఢిల్లీ పౌరుల్లో అనేకమంది విజయాన్ని కాంక్షిస్తున్నట్లు అందరికీ తెలుసు. ఆ ఢిల్లీ పౌరులనందర్నీ వరుసబెట్టి నరికివెయ్యాలని బహిరంగంగా ప్రకటించబడింది" అని ఆ చరిత్రల్లో వుంది. తైమూరు, నాదిర్‌షాల కాలాలు మన కింకా గుర్తే. అంతకంటె భారీయెత్తున, అంతకంటె విస్తృతంగా, అంతకంటే ఎక్కువకాలం సాగిన ఈ హింసాకాండముందు వారిఘోరాలు వెలతెలబోతాయి. అధికారయుతంగా ఒకవారం రోజులపాటు దోపిడీలుచేయించారు. కాని అనధికారంగా ఈ లూటీల్లు

నెలరోజులవరకు జరుగుతూనేవున్నాయి. ప్రజలు సామూహికంగా వధించబడ్డారు.

నా నివాసస్థానమైన అలహాబాదునగరంలోను, ఆ జిల్లాలోనూ, ఆ పరిసరాల్లోనూ జనరల్ నీల్ (సైనికాధికారి) "రక్తమయన్యాయ విచారణలు" చేయించాడు. "సైనికులూ, పౌరులూకూడా యిట్టివిచారణలు సాగించారు. అంటే, భారతీయులను ఏవిచారణ లేకుండా, వారి వయసుతోగాని, స్త్రీ - పురుష భేధంతోగాని నిమిత్తంలేకుండా నరికి వేయడమన్నమాట. గవర్నర్ జనరల్ పంపిన నివేదికలలోనూ, పార్లమెంటురికార్డులలోనూ - 'తిరుగుబాటుచేసిన నేరస్థులేగాక వృద్ధులు, స్త్రీలు, శిశువులుకూడా తెగనరుకబడ్డా'రని స్పష్టంగా వ్రాసివుంది. వారిని ఉరితీయలేదు. గ్రామాల్లోనే మంటల్లో త్రోసివేశారు. బహుశా ఆకస్మికంగా తుపాకితో ప్రేల్చడంకూడా కద్దు. "జిల్లామారుమూలలకు ఉరితీసేవాలంటీరుబృందాలు వెళ్ళేవి. సమయానికావలసిన తాత్కాలిక కసాయీలకు కొదువలేదు. ఒకపెద్దమనిషి తానెంతమందినో 'కళాత్మకపద్ధతి'లో తుదముట్టించానని సగర్వంగా చెప్పుకున్నాడు. ఈ రాక్షసన్యాయపద్ధతికి గురియైనప్రజలను - ఊసుపోకకో అన్నట్లు 8 అంకెలాగా కలిపికట్టేవాడట. ఆ జట్టులను మామిడిచెట్లకు వ్రేలాడదీసి, ఏనుగులచేత లాగించేవాడట". కాన్పూరు, లక్నో, తదితరప్రదేశాల్లోకూడా యిలాంటి మారణహోమమే జరిగింది.

జనరల్ నీల్ శిలావిగ్రహం కృతజ్ఞులైన అతని దేశస్థులచేత (నిస్సంశయంగా ఇండియాఖర్చుతోనే) నెలకొల్పబడి బ్రిటిష్‌పరిపాలనకు వాస్తవచిహ్నంగానిలచి, క్రిందనున్నమనవైపు చూస్తూంటుంది. నికోల్సన్ విగ్రహం దూసినఖడ్గంతో పాతఢిల్లీని ఇప్పటికీ ఝుడిపిస్తూంది.

ఈ గతచరిత్రను తడుముకోవడం అసహ్యంగానేవుంటుంది. కాని ఆ సంఘటనలవెనుకగల సచలనశక్తి వాటితోనే అంతంకాలేదు. అది సజీవంగావుండి, ఏ సంఘర్షణో జరిగినప్పుడూ, ఆవేశం హద్దులుమీరినప్పుడూ పైకి పొక్కుతోంది. అమృతసర్, జలియన్‌వాలాబాగ్‌లలో జరిగిన దురంతాలు ప్రపంచానికి తెలుసు. కాని ఆ విప్లవానంతరం జరిగిన అనేకవిశేషాలు, ఇటీవలిసంవత్సరాల్లో మనకాలంలోజరిగి ఉభయవర్గంవారిలో వైరభావంకలిగించిన సంఘటనలు బాగా తెలియవు.

సామ్రాజ్యవాదమూ, ఒకజాతిపై మరోజాతిపెత్తనమూ, జాతిభేదమూ కూడా దుర్మార్గాలే. కాని సామ్రాజ్యవాదము జాతిభేదంతో చేతులు కలిపినప్పుడు భయంకరపరిణామానికి దారితీస్తుంది. చివరికి వాటికి సంబంధించినవారందరూ నైతికంగా పతనమైపోతారు. ఇంగ్లండు తన స్వీయ చరిత్ర, సారస్వతాల్లోనిపాఠాలనే మరచి, ప్రవర్తించేటట్టుచేసిన దాని సామ్రాజ్యవాదము, జాతిభేదములు అది మహోన్నతస్థితినుండి పతనమైపోవడానికి ఎంతవరకు కారణాలో భావిచరిత్రకారులు ఆలోచించవలసి ఉంది.

ఏ మారుమూలనోవున్నహిట్లర్ తలెత్తి, జర్మనీనియంత అయినప్పట్నుంచి మనం జాత్యహంకారాన్నిగురించీ, ఆర్యరక్తం అన్నిటికంటే మిన్న అనే నాజీసిద్ధాంతాన్నిగురించీ ఎంతో విన్నాం. ఆ సిద్ధాంతం ఖండింపబడింది. ఇప్పటికి మిత్రరాజ్యాలనాయకులచే ఖండింపబడుతూనే ఉంది. శరీరశాస్త్రవేత్తలు జాతివిభేదమనేది భ్రమ అనీ, యాజమాన్యం వహించదగ్గజాతిఅంటూ ఒకటి ఉండదనీ చెబుతున్నారు. కాని, బ్రిటిష్ పాలనారంభంనాటినుంచి జాత్యహంకారంయొక్క అన్నిరూపాలను భారతదేశంలో మనం ఎరుగుదుము. ఈ పరిపాలనలోని తత్వాలన్నీ నాజీసిద్ధాంతము, యాజమాన్యజాతి అనే దృక్పథంకలవే. ప్రభుత్వయంత్రాంగమంతా యీ పునాదులమీదనే నిర్మింపబడింది. అసలు సామ్రాజ్యవాదంలోనే 'యాజమాన్యజాతి' సిద్ధాంతం యిమిడిఉంది. దీనిలో కపటమేమీ లేదు. ఇది అధికారంలోఉన్నవారిచేత, నిర్ద్వంద్వమైనభాషలో ప్రకటించబడినదే. మాటలకంటే వాటిననుసరించిన ఆచరణలు మరింత బలంగాఉంటాయి. ఏండ్లతరబడి, తరతరాలుగా భారతజాతి, భారతీయులు అవమానాలకు, హేళనకు, తిరస్కారానికి గురిచేయబడ్డారు. ఆంగ్లజాతి సార్వభౌమజాతియనీ, మనలను బానిసలను చేసుకుని పాలించేందుకు దైవదత్తాధికారం తమకువున్నదనీ వారు చెబుతున్నారు. దీనికి మనం వ్యతిరేకతచూపిస్తే "సార్వభౌమజాతికిగల పెద్దపులిగుణాలు" మనకు రుచిచూపుతున్నారు. ఒక భారతీయుణ్ణిగా ఇదంతావ్రాయడానికి నాకు సిగ్గుగావుంది. దీనిజ్ఞాపకమే బాధకలిగిస్తోంది. అంతకంటే బాధాకరమైన విషయం మనం ఇంతకాలం, ఇంతహీనస్థితికి లొంగిపోయామనే యథార్థం. మనప్రజలు యిట్టిహీనస్థితిని భరించి

ఉండడంకంటె ఏరకంగానైనా ఫలితమేదైనాసరే ప్రతిఘటించడమే నేను ఉత్తమంగా ఎంచుతాను. అయినా ఈవిషయాలన్నీ భారతీయులూ, ఆంగ్లేయులూ కూడా తెలుసుకోవడం మంచిది. ఇంగ్లండు, ఇండియాల మధ్యగల సంబంధబాంధవ్యాలకు వెనుకఉన్న మనస్తత్వం యిదే. మనస్తత్వం గణించదగ్గది; జాతులజ్ఞాపకాలు చిరకాలం వుంటాయి.

ఆంగ్లేయులు ఇండియాలో ఎలా ప్రవర్తించారో, ఏమి భావించే వారో మనంగుర్తించేందుకు ఒకప్రత్యేకవుదాహరణ చాలు. 1883లో ఇల్‌బర్ట్ చట్టంమీద ఆందోళనజరుగుతోంది. అప్పుడు భారతప్రభుత్వ విదేశాంగశాఖకార్యదర్శిగాఉన్న సీటన్ కెర్–"ఈబిల్లు ఇండియాలోని ప్రతిఆంగ్లేయునికి మనఃపూర్వకంగాగలవిశ్వాసాన్ని భగ్నంచేస్తుంది. పైవారినుంచి క్రిందివారివరకు, చిన్నబంగళాలోవుండే తోటయజమాని సేవకుడూ, రాష్ట్రరాజధానివెలుగుల్లోఉండే పత్రికాసంపాదకుడూ, ఒక పెద్దరాష్ట్రాన్నినిర్వహిస్తున్న చీఫ్‌కమీషనర్‌నుంచి, సింహాసనంమీద ఉన్నవైస్రాయివరకు, ప్రతిఆంగ్లేయుడూ ఇతరులనుఓడించి, పరిపాలించేం దుకే భగవంతుడుసృష్టించినజాతికి తాముచెందివున్నామని విశ్వసిస్తు న్నారు"అని ప్రకటించాడు.

## ౮ బ్రిటిష్ పాలనలోని ఎత్తుగడలు
## బలాలనుసరిచేస్తూ, విభజించి పాలించడం

1857–58 విప్లవంలో కొన్నిజాతీయశక్తులున్నాదాన్ని సామంత రాజులతిరుగుబాటే అనాలి. అయినా, రాజులు, జమీందార్లు అందులో పాల్గొనకపోవడం, సహాయంచేయకపోవడంవల్లనే బ్రిటిష్‌వారు దాన్ని అణచివేయగలిగారు. బ్రిటిష్‌ప్రభుత్వంచేత పదవులనుంచి తొలగించ బడ్డవారు, అధికారము, సౌకర్యాలు లాక్కోబడ్డవారూ, లేక అలాంటి గతి తమకూ పట్టవచ్చునేభయంగలవారూ ఆ విప్లవంలో పాల్గొ న్నారు. బ్రిటిష్‌వారు కొంత తటపటాయించినతర్వాత – క్రమంగా రాజులను తొలగించివేసి, సరాసరి బ్రిటిష్‌పాలనయే నెలకొల్పేవిధా నాన్ని అవలంబించడానికి నిశ్చయించారు. ఈ విప్లవంవల్ల సామంత రాజులపట్లనేకాక, తాలుక్‌దారులనే పెద్దభూస్వాములపట్లకూడా ఆ నిశ్చయం మారి, బ్రిటిష్‌వారిద్దృక్పథం సుముఖమైంది. ఈ జమీందార్లు

రులు, భూస్వాములద్వారానే ప్రజల నడుపులోవుంచడం తేలికయని భావించారు. అయోధ్య తాలుక్‌దారులు మొగలుచక్రవర్తులకు పన్నులు వసూలుచేసియిచ్చే మధ్యవర్తులుగా ఉండేవారు. కాని కేంద్ర ప్రభువు బలహీనుడుకావడంతో వీరు జమీందార్లవలె అధికారాలను ఛలాయించసాగారు. దాదాపు వారందరు విప్లవంలో చేరారు. కొందరు మళ్ళీ తప్పించుకుపోవడానికి వీలైనమార్గాలనుకూడా ఏర్పరచుకునే అందులోపాల్గొన్నారు. వారు తిరుగుబాటుదారులైనప్పటికి "ప్రభు భక్తితో సేవించుతా"మని ప్రకటించేటట్టయితే మళ్ళీ పూర్వపుస్థానాలిస్తా మని (కొద్దిమందికితప్ప) బ్రిటిష్‌అధికారులు చెప్పారు. ఆవిధంగా "అయోధ్యనవాబు"లని పిలిపించుకుని గర్వించే ఈ తాలుక్‌దారులు బ్రిటిష్‌పరిపాలనాస్థంభాల్లో ఒకటిగా అయ్యారు.

ఈ విప్లవం ప్రత్యక్షంగా కొన్నిప్రాంతాల్లోనే సంభవించినప్పటికి, దానిఫలితాలుమాత్రం యావద్భారతాన్నీ – ముఖ్యంగా బ్రిటిష్‌ప్రభుత్వాన్ని కదల్చివేశాయి. ప్రభుత్వంతనయంత్రాంగాన్నంతటిని పునర్నిర్మాణంచేయనారంభించింది. ఈస్టిండియాకంపెనీనుంచి భారతదేశాన్ని బ్రిటిష్ కిరీటమూ, పార్లమెంటూ వశపరుచుకున్నాయి. తమతిరుగుబాటుతో యీ విప్లవాన్నిప్రారంభించినసైన్యాన్ని కొత్తగా నిర్మించసాగారు. అప్పటికే వేళ్ళుపాదుకొన్న బ్రిటిష్‌పరిపాలనఎత్తుగడలను ఇప్పుడు స్పష్టీకరించి, ఉద్ఘాటించి, కచ్చితంగా అమలుజరుపసాగారు. బ్రిటిష్‌పరిపాలన కొనసాగడంలోనే తమమనుగడఉన్నదని భావించే స్వార్థప్రయోజక వర్గాన్నిసృష్టించి రక్షించడం, దేశంలోని వివిధశక్తులమధ్య పెద్దతేడా లేకుండాసరిజేస్తూండడం, దేశీయశక్తులమధ్య ద్వేషాలుసృష్టించి అనైక్యతను బలపరుస్తూండడం – ఇవే బ్రిటిష్‌వారి ప్రధానఎత్తుగడలు.

ఈ ఎత్తుగడలప్రకారం సృష్టింపబడి, ప్రోత్సహింపబడుతున్న వారిలో జమీందార్లూ, భూస్వాములూ మొట్టమొదటి స్వార్థప్రయోజనపరులు. కాని బ్రిటిష్‌పాలనతో మరింత దృఢంగా మరోకొత్తవర్గం ఇప్పుడు తలెత్తింది. సన్నకారుపుద్యోగాల్లోవున్న భారతీయులు ఈ కొత్త వర్గానికి చెందుతారు. లోగడ తప్పనిసరైనపరిస్థితుల్లోతప్ప, భారతీయులకు ఉద్యోగాలిచ్చేవారుకాదు. మన్రో భారతీయుల నెక్కువగా నియమించాలని వాదించాడు. అనుభవాలవల్ల తేలినదేమంటే భార

తీయవుద్యోగులు పూర్తిగా బ్రిటిష్‌పాలన, అధికారాలమీదనే ఆధార పడివుంటున్నారు, కనుక వారిని బ్రిటిష్‌వారిప్రతినిధులుగానే భావించి విశ్వసించవచ్చునని ఋజువైంది. తిరుగుబాటుకుపూర్వం, చిన్నవుద్యోగాల్లో ఎక్కువగా బెంగాలీలే ఉండేవారు. బ్రిటిష్‌ప్రభుత్వానికి పౌర, సైనికశాఖల్లో గుమాస్తాలు కావలసినచోటల్లా బెంగాలీలు చేరడంవల్ల వారు ఉత్తరరాష్ట్రాలన్నింట వ్యాపించారు. సంయుక్తరాష్ట్రాలు, ఢిల్లీ, పంజాబుల రాజధానీనగరాల్లో ప్రత్యేకంగా బెంగాలీపేటలుకూడా వెలిశాయి. ఈ బెంగాలీలు బ్రిటిష్‌సైన్యంవెంటవెళ్తూ, నమ్మకమైన ఉద్యోగులని ఋజువుచేసుకున్నారు. విప్లవకారులహృదయాల్లో బెంగాలీలు బ్రిటిష్‌వారితోకలుగా కన్పించడంచేత అసహ్యించుకొని, వారికి అవమానకరమైనపేర్లు తగిలించేవారు.

ఈవిధంగా పాలనాయంత్రాన్ని భారతీయులపరంచేయడం ఆరంభమైంది. అయితే పాలన, నిర్ణయాధికారాలుమాత్రం ఆంగ్లేయుల చేతుల్లోనే కేంద్రీకరించబడ్డాయి. ఆంగ్లవిద్య బహుళవ్యాప్తిచెందుటచే వుద్యోగాలన్నీ బెంగాలీలపరంకావడం పోయి, ఇతరప్రాంతీయులుకూడా న్యాయ, పరిపాలనాశాఖల్లో వుద్యోగులుగా వచ్చారు. ఈ వుద్యోగప్రదానం బ్రిటిష్‌పాలనను మరింత గాఢంగా బలపరిచింది. బ్రిటిష్‌పాలనను రక్షించేందుకు వారు తెచ్చుకున్నసైన్యంకంటె యీ వుద్యోగబృందాలు మహత్తర పౌరసైనికులుగాను, రక్షకసైన్యంగాను ప్రతిచోట తయారయ్యారు. ఈ పౌరసైన్యంలోకూడా కొందరు దేశభక్తి, జాతీయాభిమానము కలిగివున్నారు. కాని వ్యక్తిగతంగా దేశభక్తి కలిగివున్నా సైనికులుగా సైనికనియమనిబంధనలకు కట్టుబడివుండక తప్పదు. అవిధేయత, విడచిపెట్టి పారిపోవుట, తిరుగుబాటులకు కఠిన దండన విధించబడుతుంది. ఈ పౌరసైన్యనిర్మాణం అనేకమందికి ఉద్యోగాలు దొరుకుతాయనే ఆశకల్గించి ఆత్మవంచనకు గురిచేసింది. ఉద్యోగం లభించడంతో ఒకరకమైన గౌరవం, భద్రత ఏర్పడ్డాయి. పైఉద్యోగులకు తగినంతవిధేయుడై ప్రవర్తిస్తే, ఇతరలోపాలున్నా, లెక్కకురావు. ఉద్యోగానంతరం పింఛనుకూడా లభిస్తుంది. ఈ ఉద్యోగులే బ్రిటిష్‌వారికీ, ప్రజలకూ మధ్యవర్తులు. తాము పైఅధికార్ల

లకు దాసోహమనవలసినప్పటికీ, తమక్రిందివారిమీద, ప్రజలమీద అధికారం ఛలాయించవచ్చు, దాసోహమనిపించుకోవచ్చు.

జీవనభృతికి అన్యమార్గాలుగాని, ఇతరవుద్యోగాలుగాని లేనందువల్ల ప్రభుత్వోద్యోగాలవిలువ మరింత పెరిగింది. కొంతమంది న్యాయవాదులుగానూ, వైద్యులుగానూ తయారుకావచ్చు. కాని ఆవిధంగానైనా కార్యసిద్ధి అనుమానాస్పదమే. పరిశ్రమలు దాదాపు శూన్యం. వ్యాపారం వంశపారంపర్యా అట్టి అభిరుచిగలవారిచేతుల్లోనే వుండిపోయింది. వారు పరస్పరసహకారంతో బలపడుతున్నారు. నూతన విద్యావిధానం వ్యాపారం, పరిశ్రమలకుపనికివచ్చేవారినిగాక ప్రభుత్వోద్యోగాలకు సరిపోయేవారినే తయారుచేస్తుంది. విద్యావిధానం బహు సంకుచితంగా వుండడంవల్ల స్వతంత్రవృత్తులు స్వీకరించే సదుపాయాలు అంతగా లేవు. సాంఘికసేవాశాఖలు సున్న. అందువల్ల ప్రభుత్వోద్యోగాలే శరణ్యాం. కళాశాలలుపెరిగి, పట్టభద్రులను విరివిగా తయారుచేస్తున్నకొద్దీ కావలసినన్నివుద్యోగాల్లేక, తీవ్రమైనపోటీలు పెరిగాయి. నిరుద్యోగపట్టభద్రులు గుట్టలుపడిపోయేసరికి ఉద్యోగాల్లోవున్నవాళ్ళకు "వీళ్ళపోటీ మనకే ఎసరుకావచ్చు"ననే భయంపట్టుకుంది. ప్రభుత్వం కావలసినప్పుడల్లా ఆ గుట్టలనుంచి వుద్యోగులను యేరుకోవచ్చు. ఆ విధంగా ఇండియాలో బ్రిటిష్ప్రభుత్వమే విరివిగావుద్యోగాలిచ్చేయజమాని అయింది. అంతేకాదు. రైల్వేశాఖకూడా తానే వుద్యోగుల్ని నియమించేది గనుక, ఏకైకయజమానిగా తయారైంది. ఈవిధంగా నిరంకుశయంత్రం నిర్మింపబడి, పైనుంచి అదుపులోవుంచబడుతూ, కచ్చితంగా నిర్వహింపబడుతోంది. దేశంపై బ్రిటిష్వారిఆధిపత్యాన్ని బలపర్చేందుకూ, అసంతృప్తితోగొణుగుతూండే శక్తుల్ని అణగద్రొక్కేందుకూ ప్రభుత్వోద్యోగాలకోసం ఆతురతతోఎదురుచూచే వివిధతరగతులమధ్య వైరభావాలను సృష్టించి, పరస్పరకలహాలతో బలహీనపరచేందుకూ, ఈ ఉద్యోగప్రదానవిధానం అమలుజరుపబడింది. ఇందువల్ల ప్రజలలో నైతికపతనం, అంతఃకలహాలు ఆరంభమయ్యాయి. ప్రభుత్వం ఒకముఠాను, మరోముఠామీదికి ఉసిగొల్పడం సులభమైంది.

ఇలా దేశీయబలాలను సమానస్థాయిలోను అదుపులోను వుంచేవిధానం భారతసైన్యంలో మరింతకచ్చితంగా అమలుజరుపబడింది,

భారతీయులమధ్య జాతీయసమైక్యతాభావాన్ని అరికట్టడానికి తెగలు, కులాలకుసంబంధించిన కట్టుబాట్లు, నినాదాలను ప్రోత్సహించడానికి అనువుగా వివిధముతాలు చక్కగా సిద్ధంచేయబడ్డాయి. సైన్యాన్ని ప్రజలకు దూరంగావుంచేందుకు సర్వప్రయత్నాలు చేశారు. ఆఖరుకు సామాన్య వార్తాపత్రికలుకూడా సైనికులకు అందకుండాచేశారు. కీలకస్థానాలన్నీ ఆంగ్లేయులచేతుల్లోవుంచి, భారతీయసైనికుడు "కింగ్సకమిషన్డ్ఆఫీసర్" శ్రేణికైనా చేరుకోకుండాచేశారు. చిరకాలానుభవంగల "నాన్‌కమిషన్డ్" లేదా "వైస్రాయ్‌కమిషన్డ్" ఉద్యోగాల్లోని భారతీయాధికారికంటె కొత్తగావచ్చిన ఆంగ్లసైనికుడు ఉన్నతోద్యోగి అయ్యాడు. ఏభారతీయుడైనా లెక్కలశాఖలో చిన్నగుమాస్తాగాతప్ప సైనికకేంద్రాలయంలో ఏ వుద్యోగానికి నియమించబడడు. అదనపుభద్రతకోసం యుద్ధాయుధాలలో ఉత్తమశ్రేణివేవీ భారతసైనికులకివ్వక, బ్రిటిష్ సైనికులకే కేటాయించారు. ఈ బ్రిటిష్‌సైన్యాన్ని ఇండియాలోని ప్రతి కీలకస్థానంలోను, భారతీయసైన్యంతోపాటు సర్వదా "అంతరికభద్రతా సైన్యం"గావుంచి, అరాచకాన్ని అణచడానికి ప్రజలను భయభ్రాంతుల్ని చేయడానికి ఉపయోగించేవారు. బ్రిటిష్‌వారేఎక్కువగావున్న ఈ అంతర్భద్రతాసైన్యం దేశాక్రమణసైన్యంగా వుపయోగించబడేది. భారతీయ సైన్యాలుమాత్రం విదేశాల్లో బ్రిటిష్‌వారికిగాను యుద్ధాలుచేసేందుకు ఉపయోగించబడేవి. ఉత్తరహిందూస్థానంలోగల "సైనికజాతుల"నుంచే భారతీయసైనికులను ఎన్నుకునేవారు.

"బ్రిటిష్‌పాలనలోగల పరస్పరవైరుధ్యం మరొకటి మళ్ళీ కనబడుతుంది. రాజకీయంగా దేశాన్నంతటినీ ఒకేపాలనక్రిందికితెచ్చినందువల్ల దేశంలో అనేకశక్తులుద్భవించి, ప్రజల్లో భారతదేశమంతా ఒకటే అనేభావం ప్రబలి, స్వాతంత్ర్యానికి కృషిచెయ్యాలనేకాంక్ష బలపడింది. బ్రిటిష్‌ప్రభుత్వం తాను యిట్లాసృష్టించిన ఐకమత్యాన్ని విచ్ఛిన్నంచేసేందుకే ప్రయత్నించింది. ఆ విచ్ఛిన్నతను భారతదేశాన్ని విభజించడంద్వారాసాధించాలని అప్పట్లో రాజకీయంగాఆలోచించలేదు. జాతీయశక్తుల్ని బలహీనపరచి, బ్రిటిష్‌అధికారాన్ని సుస్థిరంచేసుకోవాలని ప్రయత్నించారు. సంస్థానాలకు అంతకుముందుకంటె ఎక్కువ ప్రాముఖ్యతనివ్వడం, అభివృద్ధినిరోధకశక్తుల్ని ప్రోత్సహించి, వారి

సహాయాన్ని పొందగోరుట, ఒకకూటమిని మరొకకూటమిపైకి ఉసికొల్పడంద్వారా అనైక్యతకు దోహదమివ్వడం, రాష్ట్ర, మతవిభేదాలతో విద్వేషాలుకల్పించడం, ఏమాత్రైనావస్తే తాము నాశనమైపోతామని భయపడే దేశద్రోహుల్ని తయారుచేయడం మొదలైనవన్నీ భారతీయాశయాల్ని విచ్ఛిత్తిచేసేందుకే అవలంబించారు. ఇదంతా భారతజాతీయదృక్పథంలో హానికరమే కావచ్చుకాని, విదేశీసామ్రాజ్యశక్తులు ఇలాంటివి అనుసరించడం సహజమేనని గ్రహించవచ్చు. వాటికి ఆశ్చర్యపడడం అవివేకమే. ఈ విధానంవల్లనే మనం ఈనాడు హెచ్చరింపబడుతున్న "భారతీయజీవితంలో ప్రముఖశక్తు"లనబడేవి జనించాయి. పరస్పరంభేదించేందుకు, భేదించుకునేందుకు సృష్టించబడిన యీశక్తుల్ని ఇప్పుడు "ఏకాభిప్రాయానికిరమ్మ"ని చెబుతున్నారు.

బ్రిటిష్‌ప్రభుత్వానికి ఇండియాలోని అభివృద్ధినిరోధకశక్తులకు మధ్య సహజంగాఏర్పడ్డ యీ మైత్రివల్లనే బ్రిటిష్‌వారు సాధారణంగా ఖండించే అనేకదుస్సాంప్రదాయాలకు దురాచారాలకు సంరక్షకులుగా సహాయులుగా మారిపోయారు. బ్రిటిష్‌వారు వచ్చేసరికి భారతదేశం ఆచారపీడితమైవుంది. వాటిప్రమాదం మహాభయంకరంగా వుండేది. అయినా, ఆచారాలుమారడం, చుట్టూవుండేవాతావరణానికి తగినట్టు సరిపుచ్చుకోవడం తప్పనిసరి అయింది. హిందూన్యాయశాస్త్రమంతా ఆచారాలమీదనే నిర్మింపబడినది. ఆచారాలు మారుటతో, చట్టాలు కూడ తదనుగుణంగా ఉపయోగించబడ్డాయి. హిందూన్యాయశాస్త్రంలో ఆచారాన్నిబట్టి మార్చరాదనేనిబంధన ఎక్కడా లేదు. ఈ మామూలు న్యాయశాస్త్రాన్నే బ్రిటిష్‌వారు పురాతనగ్రంథాలఆధారంతో కొన్నిన్యాయనిర్ణయాలుచేసి, ఆ నిర్ణయాలఒరవడిని తు. చ. తప్పకుండా అనుసరించాలని సరిదిద్దడానికనువుగా పునః ప్రతిష్ఠించారు. ఈ పద్ధతి సమరూపాన్ని, ఒకేనిశ్చితాన్ని సాధిస్తుందిగనుక -సిద్ధాంతరీత్యా ప్రయోజనకరమే. కాని అదినిర్ణయింపబడినవిధానావల్ల పాతచట్టాన్ని తరువాతవచ్చిన ఆచారాలతో మారకుండా కొనసాగించడమే అయింది. కొన్నివివరాలలోను, అనేకచోట్లకూడ ఆచారాలవల్ల మార్పుచేయబడ్డ పురాతన న్యాయశాస్త్రం పురాతనరూపంలోనేవుంది. కాలానికితగినదికాకుండా ఘనీభవించిపోయి,సర్వసాధారణ

మైన ఆచారాలమార్గంలో వచ్చే ఏ మార్పునైనా అణచివేసింది. ఎవరైనాసరే, ఈన్యాయశాస్త్రానికి మించిపోతున్న ఆచారం ఒకటివున్నదని ఋజువుచేసేందుకు అవకాశమీయబడింది. కాని ఇది న్యాయస్థానాల్లో దుస్సాధ్యమే. ప్రభుత్వశాసనాలద్వారా మాత్రమే దీన్ని మార్చే వీలుంది. కాని బ్రిటిష్‌ప్రభుత్వమే శాసనాలుచేసేఅధికారిగావుంది గనుక తమమనుగడకు దోహదంచేస్తున్న భారతీయులలో అతిమితవాదులైనవారిని నొప్పించడం వారికిష్టంలేక మార్పులేమీ చేయలేదు. తరువాత పాక్షికఎన్నికలద్వారా ఏర్పడిన రాష్ట్రశాసనసభలకు పరిమితంగా మాత్రమే అధికారాలివ్వబడి సాంఘికసంస్కరణలకు సంబంధించిన ఏ శాసనంచేయడాన్నైనా అధికారులు నిరసించడమేగాక, అడ్డగించేవారు.

## నా పారిశ్రామికాభివృద్ధి-ప్రాంతీయవిభేదాలు

1857-58 మహావిప్లవానంతర దుష్ఫలితాలనుంచి ఇండియా క్రమంగా కోలుకున్నది. బ్రిటిష్‌విధానం వ్యతిరేకంగాఉన్నా బలీయమైన శక్తులు భారతదేశాన్ని మార్పుచెందిస్తూనేఉన్నాయి. నవీనసాంఘిక చైతన్యం తలెత్తుతోంది భారతదేశ రాజకీయైక్యత, పశ్చిమదేశాలతో పరిచయము, సాంకేతికపురోగమనము, మొత్తంజాతి బానిసయైనదురదృష్టము-ఇవన్నీకలసి నూతనఆలోచనాతరంగాలను, పరిశ్రమలక్రమాభివృద్ధిని, ఒక నూతన జాతీయస్వాతంత్ర్యోద్యమాన్ని లేవదీశాయి. భారతదేశం పశ్చిమదేశాలవైపు చూస్తూ, తనగతచరిత్రను, నేటి పరిస్థితిని గమనిస్తూ, రెండువిధాల జాగృతమైంది.

అంతవరకు బ్రిటిష్‌పారిశ్రామికవస్తువులదిగుమతులే ఇండియాలో పారిశ్రామికయుగానికి నాందిఅయినా నిజానికి రైలుబండ్లురావడంవల్లనే అదిప్రారంభమైంది. ఇండియాను పారిశ్రామికదేశంకాకుండా అరికట్టేందుకు, దిగుమతులపై (యంత్రాలు) విధింపబడ్డ సుంకాలు 1860లో తొలగించబడ్డాయి. ప్రధానంగాబ్రిటిష్‌వారిపెట్టుబడులతో ఇండియాలో భారీపరిశ్రమలఅభివృద్ధి ప్రారంభమైంది. ప్రథమంగా బెంగాల్లో నారపరిశ్రమ తలెత్తింది దాని కేంద్రాధికారస్థానం స్కాట్లండులోని డండీ నగరం. చాలాకాలం తర్వాత అహమ్మదాబాదు, బొంబాయిలలో

నూలుమిల్లులు భారతీయపెట్టుబడులతో, యాజమాన్యంక్రింద యేర్ప డ్డాయి. తరువాత ఖనిజోత్పత్తి ఆరంభమైంది. బ్రిటిష్‌ప్రభుత్వ ఆటంకాలు సాగుతూనేవున్నాయి. భారతీయవస్త్రాలు భారతదేశంలోనైనాసరే, లాంక్‌షైరుమిల్లువస్త్రాలతో పోటీచేయలేకుండా ఎక్సయిజుసుంకడు విధించబడింది. 20వ శతాబ్దంవరకు, ఇండియాప్రభుత్వానికి వ్యవసాయ, వాణిజ్య, పారిశ్రామికశాఖలు లేవంటే ఆ ప్రభుత్వాని దెటువంటిపోలీసు పాలనావిధానమో తెలియజేస్తుంది. ఒక అమెరికన్ యాత్రికుడు, భారతదేశవ్యవసాయాభివృద్ధి కిచ్చిన విరాళంకారణంగానే కేంద్ర ప్రభుత్వం వ్యవసాయశాఖను ప్రారంభించినదని నా నమ్మకం. (ఇప్పటికీ యీ శాఖ అతిస్వల్పవ్యవహారమే) ఆతర్వాత 1905లో వాణిజ్య పరిశ్రమలశాఖ నెలకొల్పబడింది. అయినా, యీ శాఖలు చాలా అల్పస్థాయిలో పనిచేసేవి. పరిశ్రమలపెరుగుదలను కృత్రిమంగా అరికట్టి, భారతదేశసహజార్థికాభివృద్ధిని గొంతుకోతగాచేశారు.

భారతదేశప్రజాసామాన్యం నిరుపేదలై మరింతపేదలౌతూంటే, కొద్దిమంది పైతరగతివారు యీ నూతనపరిస్థితులవల్ల బాగుపడుతూ, పెట్టుబడులు పెంచుకోసాగారు. ఈ కొద్దిమందే రాజకీయసంస్కరణలు, పెట్టుబడులకుఅవకాశాలు కావాలని వత్తిడిచేశారు. రాజకీయంగా 1885లో భారతజాతీయకాంగ్రెసు ప్రారంభించబడింది. వర్తకము, పరిశ్రమలు నెమ్మదిగా పెంపొందుతున్నాయి. వందలాదిసంవత్సరాలుగా, ఆనువంశికంగా వ్యాపారాలుచేస్తున్నవర్గాలే చాలవరకు వాణిజ్యరంగంలో వున్నాయనేది మనం ప్రత్యేకంగా గమనించదగ్గది. వస్త్రపరిశ్రమకు ఆధునిక కేంద్రమైన అహమ్మదాబాదు – మొగలుయుగంలోనూ అంతకుముందుకాలంలోనూకూడా – ఉత్పత్తులకూ, విదేశవ్యాపారానికి ప్రసిద్ధిపొందింది. అక్కడిపెద్దవర్తకులు తమస్వంతఓడల్లో ఆఫ్రికా, పర్షియా సింధుశాఖ మొదలగు సముద్రప్రాంతాలకు వెళ్ళి వ్యాపారం చేసేవారు. అహమ్మదుబాదుకు సమీపంలోని "బ్రోచ్" రేవు గ్రీకులు, రోమనులకాలంలోనే ప్రఖ్యాతిలో వుంది.

గుజరాతు, కథియవాడ్, కచ్ ప్రాంతాలప్రజలు పూర్వకాలం నుంచీ వర్తకులు, వ్యాపారులు, ఉత్పత్తిదారులు, నావికులుగా వుండే వారు. ఇండియాలో అనేకమార్పులు సంభవించినా వారు ఆయా పరిస్థి

తులకనుగుణ్యంగా మారుతూ, తమవ్యాపారాలను కొనసాగించుతూనే వున్నారు. ఇప్పుడు వాణిజ్య, పారిశ్రామికరంగాల్లో అగ్రశ్రేణిలోవున్న వారు వారే. మతంగాని, మతాంతరీకరణంగాని యీ విషయంలో మార్పేమీ లేదు. 13 వందలయేండ్లక్రితం గుజరాతులో నివాస మేర్పరచుకొన్న 'పార్సీ'లు ఈవిషయంలో 'గుజరాతీ'లక్రిందే లెక్క. (వారిభాషకూడా చాలాకాలంగా గుజరాతీయే) ముస్లిములలో ఖోజా, మేమాన్, బోహ్రా తెగలు వ్యాపార, పరిశ్రమల్లో ప్రధాన మైనవి. వీరంతా హిందూమతంనుంచి మారినవారే. గుజరాతు, కథియవాడ్, కచ్‌లకు చెందినవారే. ఈ గుజరాతీలు ఇండియాలో వాణిజ్య పరిశ్రమల్లో పైచేయి సంపాదించడమేగాక బర్మా, సింహళం, తూర్పు ఆఫ్రికా, దక్షిణాఫ్రికా తదితరవిదేశాలకూ కూడా వ్యాపించారు.

రాజపుత్రస్థానంమార్వాడీలు – దేశీయవ్యాపార, ఆర్థికరంగాలను తమగుప్పెట్లో వుంచుకుంటారు. ఇండియాలో ప్రతి ముఖ్యపట్నంలోనూ వీరు వుంటారు. వారు గొప్పధనికులేగాక, గ్రామాల్లోకూడా వడ్డీవ్యాపారంచేసేవారు. పేరుగలమార్వాడీబ్యాంకి ఒక్కచీటి వ్రాస్తే ఇండియాలో ఎక్కడైనాసరే (కొంతవరకు విదేశాల్లోకూడా) చెల్లేది. మార్వాడీలు యిప్పటికీ భారీపెట్టుబడిదారులుగా అగ్రశ్రేణిలోవుంటున్నారు. పైగా పరిశ్రమలఅధినేతలుకూడా అయ్యారు.

పశ్చిమోత్తరభారతీయులైన సింధీలుకూడా పురాతన వ్యాపార సాంప్రదాయం గలవారే. షికార్‌పూర్, హైదరాబాద్ (సింధు)లు కేంద్రాలుగా, మధ్య, పశ్చిమఆసియా, ఇంకా ఇతరచోట్లకు వ్యాపారార్థం వెళుతూండేవారు. నేడు (ద్వితీయప్రపంచయుద్ధానికిపూర్వం) ప్రపంచంలో ఏ రేవుపట్టణంలో చూచినా ఒకటి, రెండు సింధీలషాపులుంటాయి. కొందరు పంజాబీయులుకూడా సాంప్రదాయికంగా వ్యాపారంచేస్తున్నవారే.

మద్రాసు 'చెట్టి'లుకూడా ప్రాచీనకాలంనుంచీ వ్యాపారంలో ముఖ్యంగా వడ్డీవ్యాపారరంగంలో నాయకులుగా వున్నారు. చెట్టి అనే పదం సంస్కృతంలో "శ్రేష్టి"నుంచి జనించినదే. ఈపదానికి వ్యాపారస్తులసంఘనాయకు'డని అర్థం. 'సేఠ్'అనే పేరుకూడా "శ్రేష్ఠి"నుంచే పుట్టింది మద్రాసు 'చెట్టి'లు దక్షిణభారత ఆర్థికరంగంలో ముఖ్య

పాత్ర నిర్వహించడమేగాక బర్మాలో మారుమూల గ్రామాలకూడా వ్యాపించారు.

ఏరాష్ట్రంలో చూచినా వర్తక, వ్యాపారాలు లెక్కలేనన్ని తరాలనుంచీ అదేవృత్తిలోవున్న "వైశ్య"లచేతుల్లోనే వుంటున్నాయి. వారు చిల్లరవ్యాపారం, టోకువ్యాపారం, వడ్డీవ్యాపారంకూడా చేస్తారు. ప్రతిగ్రామంలోను ఒక కోమటిఅంగడి ఉంటుంది. అందులో గ్రామీణులకవసరమైన వస్తువులన్నీ లభించడమేగాక లాభదాయకమైనషరతుల మీద గ్రామస్తులకు అప్పులుకూడా యిస్తారు. గ్రామీణపరపతివిధానమంతా కోమట్లచేతుల్లోనే ఉండేది; వారు వాయవ్యభారతదేశంలోని ఆదిమవాసులపల్లెలకు, స్వతంత్రరాజ్యాలకుకూడా వెళ్ళి, ప్రధాన వ్యాపారాలు నిర్వహించారు. పేదరికం పెరగడంతో, వ్యవసాయదారుల ఋణాలుకూడా వేగంగా పెరిగాయి. ఈ అప్పులిచ్చేవారు భూములను తాకట్టుపెట్టుకొని, ఋణమిచ్చేవారు. తత్ఫలితంగా తగినంతభూములు పొందేవారు. ఆవిధంగా అప్పిచ్చువాడే, భూస్వామికూడా అయ్యాడు.

అనేకమంది కొత్తవాళ్ళుకూడా యీ వృత్తులుస్వీకరిస్తున్నందువల్ల ఫలానాకులంవారే వర్తకులు, వ్యాపారస్తులు, పెట్టుబడిదార్లని వివరించడం కష్టం. కాని పైనపేర్కొన్నవారు ఆయావృత్తుల్లో యిప్పటికీ ప్రత్యేకంగా కనుపిస్తూనే ఉంటారు. ఈ ప్రత్యేకత కులపద్ధతివల్లనో, ఆచారబలంవల్లనో, వంశానుక్రమంగా సంక్రమించినసమర్థతవల్లనో లేక ఈ మొత్తం కారణాలవల్లనో మనం సక్రమంగా చెప్పలేం. బ్రాహ్మణ, క్షత్రియకులాల్లో వ్యాపారంచెయ్యడం హీనంగా పరిగణించబడేదని మాత్రం నిస్సందేహంగా చెప్పవచ్చు. వ్యాపారంవల్ల ధనంకూడబెట్టవచ్చునే ఆకర్షణ ధనాకాంక్షఉన్నప్పటికీకూడా వారి నందుకు పురికొల్పలేకపోయింది. మధ్యయుగాల్లోవలె భూమిని కలిగివుండడం సంఘంలోని స్థానానికి చిహ్నం. ఆ స్థితో నిమిత్తంలేకుండా విద్యార్జన, పాండిత్యాలు గౌరవింపబడేవి. బ్రిటిష్‌పాలనాకాలంలో ప్రభుత్వోద్యోగంవల్ల గౌరవం, హోదా, భద్రత లభించాయి. ఇండియన్‌సివిల్‌సర్వీసు "స్వర్గజనితోద్యోగ"మని – (వైట్‌హాలుమసకనీడలే స్వర్గమన్నట్లు) పిలువబడేది. ఇండియన్ సివిల్‌సర్వీసులో భారతీయులు చేరేందుకు అనుమతింపబడిన తర్వాత ఆంగ్లవిద్యాధికవర్గాలకు అదే మహా వైకుంఠమయింది.

స్వతంత్రవృత్తులవారికి, ముఖ్యంగా న్యాయవాదులు (వీరిలో కొందరు విశేషంగా ధనమార్జించారు) కూడా గౌరవ, ప్రతిష్ఠలు లభిస్తున్నందువల్ల యువకులు అటువేపు ఆకర్షింపబడ్డారు. ఈ న్యాయవాదులే రాజకీయ, సాంఘికసంస్కరణోద్యమాలకు నాయకత్వంవహించారు.

మొట్టమొదట్లో న్యాయవాదవృత్తిని స్వీకరించింది బెంగాలీలు. వారు విశేషాభివృద్ధిపొందడమేగాక, ఆ వృత్తికి ఎనలేనిఆకర్షణ కల్పించారు. వారే రాజకీయనాయకులుకూడా అయ్యారు. అభిరుచి లేకనో, మరేకారణాలవల్లనో వారు పెంపొందుతున్నపరిశ్రమల్లో యిముడలేదు. అందువల్లనే దేశీయజీవితంలో పరిశ్రమలు ప్రధానపాత్రనునిర్వహిస్తూ, రాజకీయాలపైతమ ప్రభావాన్నిప్రసరింపజేయనారంభించేసరికి రాజకీయ రంగంలో బెంగాలీలకు అదివరకున్నఘనత తగ్గిపోయింది. బెంగాలీలు ప్రభుత్వోద్యోగులుగాను, యితరవిధాలుగాను తమ రాష్ట్రంబయటి ప్రాంతాలకు ధారాప్రవాహంగా వెళ్ళినరోజులు మారి, బెంగాలుకే యితరరాష్ట్రవాసులు విరివిగా రాసాగారు. ఆ వచ్చినవారు ముఖ్యంగా కలకత్తాలోని వ్యాపార, పారిశ్రామికరంగాల్లో చొచ్చుకుపోయారు. లోగడ, ఇప్పుడుకూడా బ్రిటిష్‌వారిపెట్టుబడులకు పరిశ్రమలకు కలకత్తాయే ముఖ్యకేంద్రం. అక్కడివ్యాపారము బ్రిటిష్‌స్కాటిష్‌వారల హస్తగతమైవుండేది. కాని, ఇప్పుడు మార్వాడీలు, గుజరాతీలు వారి తలదన్నుతున్నారు. కలకత్తాలో చిన్నచిన్న వ్యాపారాలుకూడా చాల వరకు అన్యప్రాంతాలవారిచేతుల్లోనే వున్నాయి. కలకత్తాలోని వేలాది టాక్సీడ్రయివర్లు పంజాబునుంచి వచ్చిన శిక్కులే.

భారతీయుల పరిశ్రమలు, వాణిజ్యం, పరపతి, భీమా మొదలైన వ్యాపారాలన్నిటికీ బొంబాయి ప్రధానకేంద్రమైంది. పార్శీలు, గుజరాతీలు, మార్వాడీలు యీవ్యాపారాలకు అధినేతలు. మహారాష్ట్రులు తగుస్థానాన్ని సంపాదించుకోలేకపోయారనేది గమనించవలసిన విశేషం. బొంబాయి వివిధజాతులప్రజలుగల మహానగరం. కాని జనాభాలో ఎక్కువమంది గుజరాతీలు, మహారాష్ట్రులే. మహారాష్ట్రులు వృత్తులలోనూ, పాండిత్యంలోనూ ఉద్దండులు. జాతినిబట్టి, మనవ్యూహాలకు తగినట్టుగానే వారు చక్కనిసైనికులుగా రాణిస్తారు. అనేకమంది బట్టల మిల్లులలో పనిచేస్తున్నారు. వారు పొడవుగా, దృఢంగా వుంటారు.

ప్రాంతీయంగా పేదలు. శివాజీసాంప్రదాయాలకు, తమపూర్వీకుల ప్రత్యేకఘనతలకు గర్విస్తారు. గుజరాతీలు మృదుశరీరులు, నెమ్మదస్తులు, భాగ్యవంతులు, వ్యాపార-వాణిజ్యాల్లో ఘటికులు. మహారాష్ట్రప్రాంతం కొండలతో, మొరటుగా, శూన్యంగావుంటుంది. గుజరాతీప్రాంతం సారవంతమైనభూములతో సస్యశ్యామలంగా ఉంటుంది. ఈ భౌగోళిక కారణాలవల్లనే ఈ రెండుజాతులమధ్య అంత తేడావుందేమో!

ఇండియాఅంతటా ఇప్పటికీఉన్న ఇలాంటితేడాలను పరిశీలించడం కుతూహలంగా ఉంటుంది. అవి పెరగకపోయినా, ఉంటూనేఉన్నాయి. మద్రాసు విజ్ఞానరంగంలో బాగా ముందడుగువేసి గతంలోను, ఇప్పుడూ ప్రముఖవేదాంతులను, గణిశాస్త్రవేత్తలను, శాస్త్రజ్ఞులను సృష్టించింది. బొంబాయి పూర్తిగా వ్యాపారనగరం. అక్కడ వ్యాపారానికి చెందిన సదవకాశాలూ, దురవకాశాలూ కూడావున్నాయి. పరిశ్రమలు, వాణిజ్యాల్లో ఎంతో వెనుకబడివున్న బెంగాలు ప్రముఖశాస్త్రజ్ఞులను ప్రసాదించి, ముఖ్యంగా కళ, సారస్వతరంగాల్లో ప్రత్యేకవిశిష్టత కలిగివుంది. పంజాబులో ప్రముఖవ్యక్తులెవరూ ఉద్భవించలేదు. కాని అక్కడిప్రజలు దృఢమనస్కులు, యంత్రనిపుణులు, చిన్నవ్యాపారాల్లో పరిశ్రమలలో విజయాలుసాధించగలవారు. అనేకరంగాల్లో పురోగమిస్తున్నరాష్ట్రం. సంయుక్తరాష్ట్రాలు (ఢిల్లీతోసహా) మిశ్రమప్రకృతి గలవి. ఒకవిధంగా భారతదేశానికి సూక్ష్మప్రతిబింబంవంటివి. హిందూ సంస్కృతికిపీఠంలేగాక ఆఫ్ఘన్, మొగలుయుగాల్లోవ్యాపించిన పారశీక సంస్కృతికికూడా కేంద్రాలు. అందువల్లనే మిశ్రమ హిందూముస్లిం సంస్కృతులు పాశ్చాత్యనాగరికతతో మేళవించిన సూచనలు అక్కడ ఎక్కువగాకనిపిస్తాయి. ఇతరప్రాంతాల్లోకంటె, ఇక్కడ ప్రాంతీయతత్వం చాలతక్కువ. బహుకాలంగా అక్కడిప్రజలు తామే భారతహృదయమని భావిస్తున్నారు. ఇతరులుకూడాఅలాంటిభావాన్నే ఆపాదిస్తున్నారు. నిజానికి మామూలుమాటల్లో ఆ ప్రాంతాన్ని 'హిందూస్థాన'మని సంబోధించడం కద్దు.

పైనపేర్కొన్న తేడాలు భౌగోళికమైనవేగాని, మతసంబంధమైనవికావని గుర్తించాలి. ఒక బెంగాలీముస్లిం మరొక పంజాబీముస్లిం కంటె బెంగాలీహిందువుకీ సన్నిహితంగా వుంటాడు. మరెవరితో

పోల్చినా యింతే. బెంగాలీహిందువులు, ముస్లిములు ఇండియాలో మరొకచోటగాని, విదేశాల్లోగాని కలుసుకోవడం తటస్థిస్తే వాళ్ళంతా వెంటనే ఒకగుంపుగాచేరి స్వగృహంలోఉన్నట్టే సంచరిస్తారు. పంజాబీలు కూడా-వారుముస్లింలైనా, హిందువులైనా, శిక్కులైనా సరే-యిలాగే ప్రవర్తిస్తారు. బొంబాయిప్రాంతీయముస్లింలు (ఖోజాలు, మేమానులు, బోహ్రాలు) అనేక హిందూఆచారాల ననుసరిస్తారు. ఉత్తరహిందూస్థానంముస్లింలు ఈ ఖోజాలను (వీరు ఆగాఖానుశిష్యులు) బోహ్రాలను సదాచారసంపన్నులుగా యెంచరు.

మొత్తంమీద ముస్లింలు - ముఖ్యంగా బెంగాలు, ఉత్తరభారతాల్లోనివారు - ఆంగ్లవిద్యకేగాక, పరిశ్రమాభివృద్ధికికూడా దూరంగా వుండిపోయారు. దీనికి కొంతవరకుకారణం మధ్యయుగాలనాటి మనస్తత్వం. మరికొంతకారణం ఇస్లామతం (కేథలిక్కుమతమువలె) అత్యాశ, ధనప్రలోభాలను నిషేధించడం కాని విచిత్రమైనవిశేషమేమంటే, అప్పులిచ్చి దుర్యశంగడించినవారిలో సరిహద్దురాష్ట్రాన్నుంచివచ్చిన ఒక పఠానులతెగకూడా వుంది. ఆవిధంగా 19 వ శతాబ్ది ఉత్తరార్థంలో ముస్లిములు ఆంగ్లభాషకు, పాశ్చాత్యసంస్కృతికి, ప్రభుత్వోద్యోగాలకు, పరిశ్రమలకు ఎంతోదూరంగా వుండిపోయారు.

ఇండియాలో పరిశ్రమలపెంపు - తాబేలునడకగా, గొర్రెతోకవతుగానైనా - జరుగుతున్నందువల్ల భారతదేశం అభివృద్ధిగాంచినదనే అభిప్రాయం కలిగించి, లోకందృష్టి నాకర్షించింది. ఐనప్పటికీ భూమిమీద ఆధారపడినవారివత్తిడిలోగాని, ప్రజలపేదరికంలోగాని మార్పేమీ కలిగించలేదు. కోట్లాదినిరుద్యోగులు, అర్ధవుద్యోగులూ వుండగా కొన్నిలక్షలమందికిమాత్రమే పరిశ్రమల్లో పనులుదొరికాయి. ఈమార్పిడి అత్యంతస్వల్పంకావడంవల్ల దేశం గ్రామీణమయం కావడం తగ్గలేదు. నిరుద్యోగం, భూమిపైవత్తిడి విపరీతంగాపెరగడంవల్ల ప్రజలు అవమానకరమైన షరతులకైనా తలొగ్గి, తండాలుతండాలుగా విదేశాలకు వలసపోసాగారు. వారు దక్షిణాఫ్రికా, ఫిజీ, ట్రినిడాడ్, జమైకా, గినీ, మారిషస్, సిలోన్, బర్మా, మలయాలకు వెళ్ళారు. విదేశీపాలన క్రిందకూడా అభివృద్ధికీ, లాభాలకూ అవకాశాలులభించిన కొద్దిమందికీ మరింతనికృష్టస్థితికిదిగజారుతున్న సామాన్యప్రజలకూ మధ్య సానుభూతి

గాని, సంబంధాలుగాని లేవు. ఇట్టి అదృష్టవంతులచేతుల్లో కొంత ధనం కూడి, మరింత అభివృద్ధిచెందేందుకు మరికొన్ని నూతనావకాశాలు కల్పించబడ్డాయి. కాని ప్రధానసమస్యలైన పేదరికం, నిరుద్యోగం పరిష్కరింపబడనేలేదు.

## ౧౦ హిందువులు, ముస్లిములలో సంస్కరణలు - ఇతర ఉద్యమాలు

సాంకేతికమైనమార్పులు, వాటిసంచలనాత్మకఫలితాలవల్ల 19వ శతాబ్దంలో పాశ్చాత్యప్రభావం ఇండియాపైన పడింది. భావసామ్రాజ్యంలోకూడా హఠాత్సంచలనము, మార్పు వున్నాయి. అంతవరకు సంకుచితంగావున్న ఆలోచనాపరిధులు సువిశాలమయ్యాయి. ఆంగ్ల విద్యనభ్యసించిన చిన్నవర్గానికే పరిమితమైన మొదటిసంచలనమేమిటంటే పాశ్చాత్యులకుచెందినప్రతివిశేషాన్నీ గొప్పదనుకోవడం, అంగీకరించడం. హిందూమతాచారాలు, సాంఘికసాంప్రదాయాలచే తిరస్కరింపబడి కొందరుహిందువులు క్రైస్తవమతంవైపు ఆకర్షించబడ్డారు. బెంగాల్లో కొన్ని గణించదగినమతాంతరీకరణలు జరిగాయి. అందువల్ల రాజారామ్ మోహన్‌రాయ్ హిందూమతాన్ని యీవాతావరణానికి అనువుగా మార్చేందుకు కొన్నిప్రయత్నాలుచేశాడు. హేతుబద్ధమైన సంఘ సంస్కరణలఆధారంతో బ్రహ్మసమాజాన్ని స్థాపించాడు. అతని తరువాతివాడగు కేశవచంద్రసేన్, దానికి మరింత క్రైస్తవాదర్శతుల్యమైన దృక్పథాన్నికల్పించాడు. బ్రహ్మసమాజం నాటి వంగదేశంలో తలెత్తుతున్న మధ్యతరగతులవారిని ఆకర్షించింది. కాని అది ఒక మతవిశ్వాసంగా కొద్దిమందికే పరిమితమైంది. ఐనా కొన్నిగొప్పకుటుంబాలూ, ప్రముఖవ్యక్తులూ అందులో చేరారు. కాని యీకుటుంబాలకు మత, సాంఘికసంస్కరణలమీద హృదయపూర్వకమైన శ్రద్ధవున్నా క్రమంగా ప్రాచీనభారతీయ వేదాంతతత్వచింతనవైపే మరలిపోసాగారు.

ఇండియాలోని యితరప్రాంతాల్లోకూడా యిట్టి సంస్కరణ ధోరణులు పనిచేయసాగాయి. ముఖ్యంగా గుర్తించదగ్గ సంస్కరణోద్యమాల్లో ఒకదాన్ని, 19వ శతాబ్దిఉత్తరార్థంలో స్వామి దయానందసరస్వతి (గుజరాతీ) ప్రారంభించాడు. కాని అది పంజాబు హిందువుల్లోనే ఎక్కువగా కాలూనింది. ఇదే ఆర్యసమాజం. 'వేదాల

నై పునరలండి' అనేదే దానినివాదం. వేదకాలానంతరం ఆస్త్యలమతంలో జరిగిన పరిణామాలన్నింటినీ తొలగించాలనే నిజానికీ నినాదం ఉద్దేశింప బడింది. వేదకాలానంతరం తయారైన వేదాంతతత్వం మోనిజానికి, అద్వైతానికి, ప్రజల్లోవ్యాపించిన మరికొన్ని మొరటుపరిణామాలకు కారణమైంది. ఆర్యసమాజం వీటన్నింటినీ తీవ్రంగాఖండించింది. వేదా లనుకూడా ఒక ప్రత్యేకవిధంగా వ్యాఖ్యానించింది. ఇస్లాం, క్రైస్తవ మతాల (ముఖ్యంగా మొదటిదే) ప్రభావాలకు ప్రతిచర్యవంటిదే ఆర్య సమాజం. అది మతానికే సర్వస్వాన్నీ అర్పించే ఆంతరికసంస్కరణ వంటిదీ, అన్యమతాలదాడులనుండి కాపాడే రక్షకవ్యవస్థవంటిదీను. హిందూమతంలో ఇతరులను చేర్చుకొంటూ, మతాలతో సంఘర్షణ పడేందుకు దోవతీసింది. ఇస్లాంకు దగ్గరపోలికలు కలిగివుండే ఈ ఆర్య సమాజం – ఇతరమతాలనుధిక్కరించడం దుర్లక్షణమనేనానుడికి వ్యతి రేకంగా – హిందూమతానికిచెందిన ప్రతిలక్షణమూ సర్వాధిక్యమనే వాదనకు సిద్ధమైంది. అది ముఖ్యంగా పంజాబు, సంయుక్తరాష్ట్రాల్లో గల మధ్యతరగతుల్లోనే వ్యాపించినదనేవిషయం గమనార్హం. ఒక ప్పుడు దానిని రాజకీయవిప్లవోద్యమంగా ప్రభుత్వం భావించింది. కాని అందులో సభ్యులైన ప్రభుత్వోద్యోగులందరూ దాన్ని గౌరవనీయ సంస్థగా రుజువుచేశారు. ఆర్యసమాజం బాలబాలికల్లో విద్యావ్యాప్తికి, స్త్రీలస్థితిగతులను బాగుచేసేందుకు, వెనుకబడినవర్గాలవారి స్థితిని, గౌరవాన్ని పెంపొందించేందుకు గణనీయమైన కృషిచేసింది.

స్వామి దయానందునితరంలోనే, బెంగాల్లో మరొకరకమైన మహాపురుషు డుద్భవించాడు. ఆయనజీవితప్రభావం చాలమంది ఆంగ్ల విద్యాధికులపై ప్రసరించింది. ఆయనే శ్రీ రామకృష్ణపరమహంస. ఆయన నిరాడంబరుడు; విద్యాధికుడుకాడు; మహత్తరమతవిశ్వాసి. సాంఘిక సంస్కరణలు మొదలైనవాటియందు ఆసక్తిలేనివాడు. చైతన్యుడు మున్నగువారివంటి పవిత్ర వ్యక్తి. మతవిశ్వాసంగలవాడైనా విశాల హృదయుడు. ఆత్మజ్ఞానాన్వేషణలో మహమ్మదీయ, క్రైస్తవసాధువుల వద్దకు వెళ్ళి, వారి నియమనిబంధనలను అక్షరాలఅనుసరిస్తూ అనేక యేండ్లు గడిపాడు. ఆయన చివరికి కలకత్తాలోని కాళీఘాట్‌లో స్థిరపడి

పోయాడు. ఆయన వ్యక్తిత్వము, జీవితము అనేకమందిదృష్టిని ఆకర్షించాయి. ఆయన్ని దర్శించడానికివెళ్ళినప్రజలు, ఆయన్ను ఎగతాళి చేద్దామనివెళ్ళినవారుకూడా ఆయనప్రభావానికిలోనయ్యారు. పూర్తిగా పాశ్చాత్యులననుకరించేవారుకూడా తామంతకుముందు తెలుసుకోలేని దేదో వున్నదని విశ్వసించసాగారు. మతవిశ్వాసంలో ముఖ్యవిశేషాలను నొక్కిచెబుతూ హిందూమతానికి, వేదాంతానికిగల వివిధదృక్పథాలను సమన్వయంచేశాడు. అవన్నీ తనలోనే మూర్తీభవించినట్లు కనిపించే వాడు. వాస్తవానికి ఆయన ఇతరమతాలనుకూడా కరతలామలకం చేసుకున్నాడు. తమవిశ్వాసమే గొప్పదనే తత్వాన్ని పూర్తిగా వ్యతిరేకించి అన్నిమార్గాలు సత్యంవైపే దోవతీస్తాయని నొక్కిచెప్పేవాడు. ఆసియా, యూరపులగతచరిత్రల్లో కనిపించే పవిత్రవ్యక్తులవంటివాడాయన. ఆధునికజీవితదృష్టిలో అర్థంచేసుకోవడానికి కష్టమైనవ్యక్తి. అయినా అనేకరంగులచిత్రంవంటి భారతదేశానికి తగినవాడు. దైవాంశ సంభూతుడైన వ్యక్తిగా అనేకమంది భారతీయులచే గుర్తింపబడి, పూజించబడ్డాడు. ఆయన్నుచూచినవారు ఆ మూర్తిచే ప్రభావితులు కాగా, చూడనివారు ఆయనజీవితకథను తెలుసుకుని ప్రభావితుల య్యారు. అట్టివారిలో రోమారోలా ముఖ్యుడు. ఆయన యీ మహానీయునిజీవితాన్ని, ఆయనముఖ్యశిష్యుడైన స్వామి వివేకానందునిజీవిత చరిత్ర రచించాడు.

వివేకానందస్వామి తోటిశిష్యులతోకలసిజాతి,కుల, మతాలకతీతమైన "రామకృష్ణసేవాసమితి"ని స్థాపించాడు. గతంలో వేళ్ళూనుకొని, భారతదేశఔన్నత్యానికి గర్వించే వివేకానందుడు జీవితసమస్యలను పరిశీలించడంలో అత్యంతాధునికుడై, భారతదేశగతానికీ వర్తమానానికీ వారధివంటివాడయ్యాడు. ఆయన బెంగాలీ, ఆంగ్లభాషల్లో అనర్గళోపన్యాసకుడు. బెంగాలీ గద్య, పద్య సారస్వతాల్లో గొప్పరచయిత. ఆయనమూర్తి గంభీరంగా, ఠీవిగా, స్ఫుటంగా, ఆకర్షణీయంగా వుండేది. ఆయనకు తనయందు తనదీక్షయందు పరిపూర్ణ విశ్వాసం వుండేది. పైగా సంచలనాత్మకము, నిప్పులుకక్కుతున్నట్లు ప్రజ్వలనాత్మకమైనశక్తితో, ఇండియాను ముందుకు, మున్ముందుకు నడపాలనే ఆవేశంతో నిండివుండేవాడు. నైతికపతనమై, కృంగిపోయిన హిందూ

హృదయానికి ఆయన బలవర్ధకమైనఔషధం అయ్యాడు. దానికి ఆత్మ విశ్వాసాన్ని, గతంలోకిపాదుకొనేవేళ్ళనూ ప్రసాదించాడు 1893 లో చికాగోలోజరిగిన సర్వమతమహాసభలో పాల్గొని, ఒకసంవత్సరకాలం అమెరికాలో గడిపాడు. యూరపులోపర్యటిస్తూ ఎథెన్సు, కాన్‌స్టాంటి నోపుల్‌వరకు పర్యటించాడు. ఈజిప్టు, చైనా, జపాన్‌లు సందర్శించాడు. ఆయన వెళ్ళినచోటల్లా తనవ్యక్తిత్వంచే, తనప్రబోధాలచే, చెప్పేపద్ధతిచే ఒకవిధమైన జ్ఞానసంచలనం కలిగించేవాడు. ఈహిందూసన్యాసిని ఒక్కసారిచూస్తే ఇక ఆయన్నుగాని, ఆయనచెప్పినదాన్నిగాని మరచిపోవడం అసంభవం. అమెరికాలో ఆయన్ను "తుఫానువంటిహిందువు" డన్నారు. పాశ్చాత్యదేశాల్లో పర్యటించడంవల్ల తానుకూడా ప్రభావితుడయ్యాడు. బ్రిటిష్‌ప్రజలపట్టుదలను, అమెరికాప్రజల్లో గల సజీవత్వాన్ని, సమతాభావాన్ని ఆయన మెచ్చుకున్నాడు. భారతదేశంలోని ఒకమిత్రునికి "ఏఅభిప్రాయాన్నైనా ముందుకుతీసుకుపోయేందుకు ప్రపంచంలోకల్లా అమెరికాయే అనువైనదేశం" అని వ్రాశాడు. కాని పాశ్చాత్యదేశాల్లోగల మతవిధానాలు ఆయనకు నచ్చలేదు. భారతీయ ఆధ్యాత్మికతత్వంమీదినమ్మకం మరింత దృఢమైంది. భారతదేశం ఎంతహీనస్థితిలోవున్నా, ఆయనదృష్టిలో అదే వెలుగుకుప్రతిబింబమయింది.

ఆయన వేదాంతంలోని అద్వైతతత్వాన్ని బోధించాడు. ఆలోచించే భావిమానవాళికి ఇదొక్కటే శరణ్యంకాగలమతమని ఆయన విశ్వసించాడు. వేదాంతము ఆధ్యాత్మికమేగాక హేతుబద్ధమైనది, బాహ్యప్రకృతిలోజరిగే శాస్త్రీయపరిశోధనలతో శృతికలిపేదికూడాను. "ఈప్రపంచం మానవాతీతశక్తిసంపన్నుడైన దేవునిచేత సృష్టించబడలేదు, లేక మహాకసర్వజ్ఞుని సృష్టి కాదు అది తననుతానేసృష్టించుకుని, తనకుతానే లయమై, స్వయంప్రకాశమై, అనంతమైన ఒకేఒకఉనికియైవుండేబ్రహ్మ." మానవుడూ అతనిలో ఆజన్మసిద్ధంగావుండేదైవాంశాలూ శాశ్వతం. మానవునిలో దేవునిచూడడమే దైవసాక్షాత్కారం. సర్వజీవుల్లోనూ మానవుడే ఉత్తముడు. ఇదే వేదాంతసారం. కాని ఇలా "స్థాణువుగావుండే వేదాంతం దైనందినజీవితంలో సంచలించేదిగా, కవితగా మారాలి. క్లిష్టమై నిరాశాజనకమౌతున్న పురాణాలనుంచి

స్పష్టమైన నైతికసూత్రాలు రూపొందాలి. ఆశ్చర్యజనకమైన యోగత్వా న్నుంచి శాస్త్రీయ, ఆచరణీయ మనస్తత్వం ప్రభవించాలి.” ఇండియా తననుతాను సంకుచితంచేసుకుని, ఇతరజాతులసంపర్కంలేకుండా ఒక పరిధిలోకి ముడుచుకున్నందువల్లనే పతనమైపోయింది. అది భద్రం చేయబడిన మృతదేహంవలె, కరుడుగట్టిన నాగరికతాస్థితికి దిగజారి పోయింది. కులము వ్యక్తిత్వాన్నీ, స్వేచ్ఛనూ పెంపొందించేందుకు ఏర్పర్చబడి,తొలిరూపాల్లో ఆవశ్యకము, ప్రయోజనకరంగావున్నాయి. క్రమంగా ఉద్దేశింపబడిన ప్రయోజనాలకు వ్యతిరేకంగా రూపొంది, రాక్షసతుల్యమైనదశకు పతనమై, సంఘాన్ని అణగద్రొక్కింది. కులము ఒకరకమైన సాంఘికవ్యవస్థగా, మతానికిసంబంధంలేకుండా వుంచబడింది. అసలలా వుంచవలసిందే. మారేకాలంతోపాటు సాంఘికవ్యవస్థలుకూడా మారుతూండాలి. మతకలాపాలనుగురించి అర్థరహితంగా, కుతర్కాలతో జరిగేచర్చలను, వాదోపవాదాలను, ముఖ్యంగా అగ్రకులాలవారు ‘నన్నంటబోకు’......అనే తత్వాన్ని వివేకానందుడు తీవ్రావేశంతో ఖండించేవాడు. “మనమతం వంటగదిలోవుంది. మన దేవుడు వంటపాత్ర. ‘నన్నుతాకకు, నేను పవిత్రుణ్ణి’ అనడమే మనమతం.”

వివేకానందుడు రాజకీయాలకు దూరంగావుంటూ సమకాలీన రాజకీయవాదులను నిరసించేవాడు. కాని స్వేచ్ఛ, సమానత్వం, ప్రజల పురోగమనాల ఆవశ్యతను పదేపదే నొక్కిచెప్పేవాడు. “భావ స్వాతంత్ర్యం, వ్యక్తిస్వాతంత్ర్యంగల జీవితంమాత్రమే పెంపుకూ, సౌష్ఠవానికీ నిదర్శనం. అట్టిదిలేనిచోట వ్యక్తి, జాతి, దేశం నశించవలసిందే!” ...“భారతదేశానికిగల ఒకేఒక తరణోపాయం ప్రజాసామాన్యం. అగ్రవర్గాలవారు శారీరకంగానూ, మానసికంగానూ మృతులే.” ఆయన పాశ్చాత్యపురోభివృద్ధిని భారతదేశభావౌన్నత్యంతో మేళవింప దలచాడు. “భారతదేశమతంతో, యూరపుసమాజాన్ని సృష్టించు” ...“స్వాభ్రాతృత్వం, స్వాతంత్ర్యం, కృషి, శక్తుల్లో పాశ్చాత్యులకంటె పాశ్చాత్యుడవుకమ్ము. అదేసమయంలో మతసంస్కృతి, మతభావనల్లో పూర్తిగా హిందువుడవు కమ్ము” క్రమక్రమంగా వివేకానందునిదృక్పథం అంతర్జాతీయంగా పరిణమించింది. “20 ఏండ్లకుపూర్వం స్వదేశానికేపరిమితమైన రాజకీయ, సాంఘికసమస్యల్నికూడా నేడు దేశీయదృష్టితో

మాత్రమే పరిష్కరించలేం. ఈసమస్యలు విశాలమౌతూ, పర్వతాకారాలు ధరిస్తున్నాయి. అంతర్జాతీయ ప్రాతిపదికపై విశాలదృష్టితో చూస్తేనేగాని వాటిని పరిష్కరించలేం. అంతర్జాతీయసంస్థలు, అంతర్జాతీయసహకారదోహదాలు, అంతర్జాతీయన్యాయసూత్రాలు ఇవే నేటి అత్యవసరాలు. అదే సమైక్యతను నిరూపిస్తుంది. విజ్ఞానశాస్త్రంలో పదార్థాన్ని పరిశీలించడంలో అందరూ రోజురోజుకూ ఒకేవిశాలదృక్పథాన్ని పెంపొందించుకుంటున్నారు." అంతేకాదు: "ప్రపంచమంతా ఒకేఒకవెలుగును అనుసరించకపోతే, ఏపురోభివృద్ధీ జరగదు. ఏఒక్క సమస్యనైనా జాతీయ, దేశీయ, సంకుచితప్రాతిపదికలపై ఎన్నటికీ పరిష్కరించలేమనేది, రోజురోజుకూ మరింత స్పష్టమవుతోంది. ప్రతిభావమూ పెంపొందుతూ, ఈప్రపంచాన్నంతటినీ ఆవరించేటంత విశాలం కావాలి. ప్రతిలక్ష్యమూ విశాలమౌతూ, మానవలోకాన్నంతటినీ - కాదు కాదు, తనపరిధిలోగల జీవితాన్నంతటినీ - లోబరచుకునేంతగా పెరగాలి." వివేకానందుని అభిప్రాయంప్రకారం వేదాంతతత్వంలో యీలక్షణాలన్నీ వున్నాయి. దాన్ని ఆయన భారతదేశంలో ఈచివరి నుంచి ఆచివరిదాక ప్రచారంచేశాడు. "ఏవ్యక్తిగాని, జాతిగాని యితరులసంపర్కంలేకుండా, ఎడంగావుండడంవల్ల మనలేదని నేను పూర్తిగా విశ్వసిస్తున్నాను. గొప్పతనం, మహత్తరవిధానం, పవిత్రత అనే భ్రమలతో, ఎడంగావుండాలని ప్రయత్నించినవారు తామే వినాశానికి ఆహుతైపోయారు. ప్రపంచజాతులన్నింటికీ ఎడంగా మడిగట్టుకున్నట్లు వుండడంవల్లనే మనం యిలా పతనమయ్యాము. దీన్ని సరిదిద్దుకోవాలంటే ఇతరప్రపంచపోకడను మళ్ళీ అనుసరించాలి. చలనమే జీవితానికి చిహ్నం."

ఒకప్పు డాయన యిలావ్రాశాడు: "నేను సోషలిస్టును. అది పరిపూర్ణస్వభావంకలదనికాదు. కాని పస్తుకంటే పిడికెడన్నం మేలు. ఇతరవిధానాలు అమలుజరుపబడి, ఏదోకొరతవుందని నిరూపించబడ్డాయి. అధికప్రయోజనం లేకపోయినా, అందులోని నవీనతను అనుభవించేందుకైనా ఈ సోషలిజాన్ని ప్రయోగించనీయండి."

వివేకానందుడు అనేకవిషయాలపై ప్రసంగించేవాడు. కాని ప్రతి ఉపన్యాసంలోనూ, రచనలోనూ ముఖ్యంగాకన్పించేప్రబోధం

నిర్భయం (భయపడకు, దృఢంగా వుండు). ఆయనదృష్టిలో మానవుడు హేయదుశ్శీలుడు కాదు, దైవాంశసంభూతుడు. అలాంటివ్యక్తి దేనికైనా ఎందుకు భయపడాలి? "ప్రపంచంలో 'పాప'మనేదేదైనా వుంటే, అది 'బలహీనతే'. బలహీనతను విడనాడు, బలహీనతే పాపం; బలహీనతే మృత్యువు" ఇదే ఉపనిషత్సారం. భయం చెడుగును, ఏడ్పును, శోకాన్నీ పోషిస్తుంది. ఇప్పటికే యీ గుణం, ఈ మెతకదనం చాలినంతవుంది. "ఇప్పుడు మనదేశానిక్కావలసింది ఇనుపకండరాలు, ఉక్కునరాలు, ఏదీ ఎదురించలేని మహత్తరదీక్షలు. ఇవి ప్రపంచరహస్యాల్లోకి విచిత్రమహిమల్లోకి చొచ్చుకుపోగలగాలి. తమ లక్ష్యాన్ని ఏవిధంగానైనాసరే సాధించాలి, అవసరమైతే సముద్రం అట్టడుగుకూడా పోవాలి, మృత్యువుతో ముఖాముఖి కలబడాలి."...

ఆయన మహిమలను, మంత్రతంత్రాలను ఖండించాడు. "ఇవి గొంగళిపురుగుల్లాంటివి. వాటిలో మహత్తరసత్యాలు వుండవచ్చు కాని, అవే మనల్ని దాదాపు నాశనంచేశాయి...అసలు 'సత్య' మనేది యిదీ: నిన్ను శారీరకంగా, మానసికంగా, భావుకంగా బలహీనపరచేది 'సత్యం' కాదు. దాన్ని విషంవలె త్యజించు, అందులో జీవం లేదు. 'సత్యం' బలవర్ధకం. 'సత్యం' స్వచ్ఛమైంది, సర్వజ్ఞమైంది...ఈ మంత్రతంత్రాలు కొద్ది సత్యాంశలున్నా సాధారణంగా బలహీనపరుస్తాయి... ఈ తాంత్రికవిశేషాలనుంచీ, ఈ బలహీనకరవిశేషాలనుంచీ విడిపో. తిరిగి నీ ఉపనిషత్తులవైపు సాగు. అవి స్వయంప్రకాశాలు, బలవర్ధకాలు, తేజోమయవేదాంతాలు. ఈ వేదాంతతత్వాన్ని స్వీకరించు: నీ ఉనికి ఎంత వాస్తవమైనదో మహత్తరసత్యాలుకూడా ప్రపంచంలో అన్నిటికంటె అంతవాస్తవమైనవి...మూఢనమ్మకాలపట్ల జాగ్రతగా ఉండు. మూఢనమ్మకాలతో వెర్రివాళ్ళుకావడం కంటె మీలో ప్రతి ఒక్కరూ నాస్తికుడు కావడమే నాకిష్టం. నాస్తికుడు కనీసం సజీవుడుగానైనా వుంటాడు. అతన్ని ఏదో ఒకవిధంగా ప్రయోజకుణ్ణిచేసుకోవచ్చు. కాని మూఢనమ్మకం ప్రవేశించిందంటే మెదడు మెత్తబడిపోతుంది, మేధ అంతర్ధానమైపోతుంది. పతనం జీవితాన్ని బంధించివేస్తుంది.... మంత్రతంత్రాలూ, మూఢనమ్మకాలూ బలహీనతకు నిదర్శనాలు."

వివేకానందస్వామి భారతదేశ దక్షిణకొసనుగల కన్యాకుమారి నుంచి, ఉత్తరసరిహద్దులైన హిమాలయాలవరకు ఈ విధంగా గర్జిస్తూ సంచరించడానికే తనశక్తులన్నీ వెచ్చించి 39 వ యేటనే, 1902 లో పరమపదించాడు.

రవీంద్రనాథ టాగూరు వివేకానందుని సమకాలికుడైనా ఆ తరువాతితరంతో ఎక్కువ సంబంధంగలవాడు. 19వ శతాబ్దంలో టాగూరు వంశీయులు బెంగాల్లో జరిగిన అనేక సంఘసంస్కరణోద్యమాల్లో ముఖ్య పాత్రలు నిర్వహించారు. ఆ వంశంలో ఋషితుల్యులూ, గొప్పరచయితలూ, ప్రసిద్ధచిత్రకారులూ వున్నారు. కాని రవీంద్రుడు వారందర్నీ మించాడు. క్రమంగా భారతదేశంమొత్తంమీద సాటిలేని ఉన్నత స్థానాన్ని సాధించుకున్నాడాయన. సృజనాత్మకకృషితో ఆయన గడపిన దీర్ఘజీవితం రెండుతరాలకు వ్యాపించి, ఆయన మనతరంవాడే ననిపిస్తుంది. ఆయన రాజకీయవాదికాడు. కాని మహాజ్ఞానియై భారతీయుల స్వాతంత్ర్యసముపార్జన కెంతో శ్రద్ధవహించి, తనసంగీత,కవితా కల్పనాసౌధంలో శాశ్వతంగా వెలుగొందుతున్నాడు. ఏదైనా ఒక పరిణామాన్ని తానిక సహించలేనని భావించినపుడు - తనకల్పనా సౌధంలోంచి బైటికివచ్చేవాడు. ప్రవక్తోచితమైనభాషలో - బ్రిటిష్ ప్రభుత్వాన్నీ, తనప్రజల్నీ హెచ్చరించాడు. 20 వ శతాబ్ది ప్రథమదశాబ్దిలో బెంగాలునుద్రూతలూపిన స్వదేశీఉద్యమంలో, ఆయన ప్రముఖ పాత్రవహించాడు. అమృతసర్ లో జరిగిన దారుణచిత్రవధలకు నిరసనగా తనకు బ్రిటిష్‌ప్రభుత్వమిచ్చిన గొప్పబిరుదాన్ని త్యజించాడు. విద్యారంగంలో ఆయన నిరాడంబరంగాప్రారంభించి చేసిన నిర్మాణాత్మకమైనకృషి-నేటి శాంతినికేతనంగా రూపొంది, భారతీయసంస్కృతీవిభవానికి ఒక కేంద్రంగా ఉంది. భారతహృదయంమీద, ముఖ్యంగాఆయన వెనువెంటవచ్చేతరాలమీదప్రసరిస్తున్న ఆయనప్రభావంచాలాగొప్పది. ఆయన స్వయంగారచనలుసాగించిన బెంగాలీభాషయే గాదు, ఆధునిక భారతీయభాషలన్నీకూడా కొంతవరకు ఆయనరచనలప్రభావంచేత మలచబడినాయి. ఏ ఇతర భారతీయునికంటె ఎక్కువగా - ప్రాచ్య, పాశ్చాత్యభావైక్యతకు దోహదమిచ్చి భారతజాతీయతాపునాదులను విస్తృతంచేసిన పురుషుడాయన. అంతర్జాతీయ సహకారంమీద

విశ్వాసముంచి, అందుకు కృషిచేస్తూ, భారతదేశసందేశాన్ని యితరులకు, ఆ దేశాల సందేశాలను తన ప్రజలకు అందించి, సాటిలేని భారతదేశపు అంతర్జాతీయవాదిఅయ్యాడు. అంతటి అంతర్జాతీయవాదియైనా—ఆయన పాదాలెప్పుడూ భారతభూమిమీదనే దృఢంగా నిలబడివుండేవి. ఆయన మనస్సెప్పుడూ ఉపనిషద్విజ్ఞానంతో నిండిఉండేది. సామాన్య అభివృద్ధి పరిణామానికివ్యతిరేకమైనపద్ధతిలో – వృద్ధుడైనకొద్దీ, ఆయనదృక్పథమూ, భావనలూ మరింత తీవ్రతరంకాసాగినవి. తానెంత వ్యక్తిగతవాదియైనా రష్యన్‌విప్లవంసాధించిన విజయాన్ని— ముఖ్యంగా విద్య, సంస్కృతి, ఆరోగ్యాభివృద్ధులను, సర్వసమానతను – ఎంతో మెచ్చుకున్నాడు. జాతీయవాదం సంకుచితతత్వంగలది. అట్టిజాతీయవాదం పాలించుతున్న సామ్రాజ్యవాదంతో ఘర్షణపడినప్పుడు – అనేక వైఫల్యాలను, చిక్కులను సృష్టిస్తుంది. టాగూరు మరొకస్థాయిలో గాంధీవలె, ప్రజలు యిరుకుమార్గాల్లో ఆలోచించడంనుంచి బైటపడి, మానవత్వాన్ని కదిలించే విశాలసమస్యల్ని గురించి ఆలోచించేటట్లు చేశాడు. ఇది ఆయన భారతదేశానికి చేసిన మహత్తరసేవ. టాగూరు భారతీయుల్లో మహత్తర దయామయుడు.

20వ శతాబ్ది ప్రథమార్థంలో టాగూరు, గాంధీ భారతదేశంలో ఇద్దరుప్రముఖవ్యక్తులు. ఆ యిరువుర్నీ పోల్చుకుంటూ పరిశీలించడం ఎంతో ప్రయోజనకరం. టాగూరు రాజసంగల కళాకారుడు. శ్రామికుల పట్ల సానుభూతితో, ప్రజాస్వామ్యవాది అయ్యాడు. భారతసంస్కృతీ సాంప్రదాయానికి ప్రాతినిధ్యంవహించాడు. జీవితాన్ని సంపూర్ణంగా ఆమోదించి, దాన్ని ఆట, పాటలతో పరిపూర్ణంగా అనుభవించటమే సాంప్రదాయంగాగలవాడు. గాంధీ ఎక్కువగా ప్రజలమనిషి. దాదాపు పూర్తిగా భారతీయరైతుకు ప్రతిబింబం. పురాతన భారతసాంప్రదాయాల్లో మరొకదానికి – త్యాగ, సన్యాసాలకు ప్రాతినిధ్యంవహించాడు. టాగూరు ముఖ్యంగా ఆలోచనాపరుడైతే, గాంధీ కేంద్రీకృత, నిరంతర కార్యశీలుడు. ఇద్దరూ వేర్వేరుమార్గాల్లో ప్రాపంచికదృక్పథంగలవారే, అయినా ఇద్దరూ పూర్తిగా భారతీయులుగానే వుండేవారు. వారు భారతదేశపు వేర్వేరుదృక్పథాలకు ప్రతినిధులుగా కనిపించేవారు.

అయితే ఆ దృక్పథాలు శ్రుతికలిగి ఒకదానినొకటి మెచ్చుకొనేవిగా ఉండేవి.

టాగూరు, గాంధీ మనల్ని ప్రస్తుతయుగానికి దగ్గరచేశారు. కాని మనం అంతకుపూర్వయుగాన్ని గురించి, వివేకానందాదులు భారత దేశపుగతంలోని గొప్పతనాన్ని గురించి నొక్కిచెబుతూ, ఆ వారసత్వా నికిగర్విస్తూ, నాటిప్రజలపై - (ముఖ్యంగా హిందువులపై) - ప్రసరింప జేసిన ప్రభావాలఫలితాలనుగురించి చర్చించుకుంటున్నాము. ఆ వివేకా నందుడే, గతాన్ని గురించే చెప్పుకుంటూ కూర్చోవద్దనీ, భవిష్యత్తును గమనించమనీ- తనప్రజలను జాగ్రత్తగా హెచ్చరించాడు. "ఓ ప్రభూ! నిత్యము గతాన్ని గురించి తెగచెప్పుకోవడాన్నుంచి మాభూమి ఎప్పుడు విముక్తిచెందుతుంది?" అని ఆయన వ్రాశాడు. కాని ఆయనా, తది తరులే స్వయంగా ఆ గతాన్ని పైకి లాగారు. అదెంతో ఆకర్షణీయంగా ఉంది. దానినుంచి దూరంకాలేము.

ఈవిధంగా గతంలోకిచూస్తూ ఆత్మతృప్తీ, గర్వంపొందడం ప్రాచీనసారస్వతము, చరిత్ర చదవడంవల్లా, తూర్పుసముద్రాల్లో భారతదేశవలసరాజ్యాలుండేవని తెలుసుకోవడంవల్లా, మరింతపెరిగింది. హిందూమధ్యతరగతులవారికి తమ ఆధ్యాత్మిక, జాతీయవారసత్వాలపై దృఢవిశ్వాసం యేర్పడేందుకు శ్రీమతి ఆనిబీసెంటుప్రభావంకూడా కారణమయింది. దీనికంతటికి ఆధ్యాత్మిక, మతవాసన ఉంది. అయితే దానివెనుక బలమైన రాజకీయప్రభావంకూడా ఉంది. జాగరితమౌ తున్న మధ్యతరగతులనా రెక్కువగా రాజకీయాలవైపు మొగ్గుతు న్నారుగాని, వారిదృష్టి మతాన్వేషణవైపు లేదు. కాని తమవిలువమీద తమకు విశ్వాసంకలిగించేందుకు, విదేశీయుల విజయమూ, పరిపాలనా కలిగించిన నిరాశ, అవహేళనాభావాలను తొలగించేందుకు, తాము చేయూతగాతీసుకునేందుకు ఏదో ఒక సాంస్కృతికమూలాధారం అవ సరమైంది. జాతీయవాదం ప్రబలుతున్న ప్రతిదేశంలోనూ - యీ విధంగా గతంలోకిదృష్టినిసారించి, మతేతరమైన ఒకఆధారాన్ని అన్వే షించడం సహజసిద్ధమే. ఇరాను తనమతవిశ్వాసాన్ని సడలించకుండానే ఇస్లాంమతం రాకపూర్వం తనకుగల గొప్పతనాలను వెలికిదీసి, అప్పటి తన జాతీయవాదాన్ని బలపరచుకునేందుకు చక్కగా ఉపయోగించు

కున్నది. సాంస్కృతికవైవిధ్యము, గొప్పదనముగల భారతదేశపూర్వ వైభవం హిందూ, ముస్లిం, క్రైస్తవాది భారతీయులందరికీ ఉమ్మడివారసత్వం. ఈ అందరిపూర్వీకులూ దాన్ని నిర్మించేందుకు పాటుబడినవారే. తర్వాతివారు మతాంతరులైనంత మాత్రాన- ఈ వారసత్వం లేకుండా పోదు. గ్రీకులు క్రైస్తవమతం స్వీకరించినప్పటికీ తమపూర్వీకులు సాధించిన మహత్తరవిజయాలనుండీ, ఇటాలియనులు తమపూర్వులు గ్రీకుసామ్రాజ్యబంధనాలుత్రెంచి, రోమన్‌రిపబ్లిక్‌ను నెలకొల్పుకున్న ప్రతిభనుంచీ, ఉత్తేజము గర్వము పొందడం మానలేదు. భారతీయులంతా ఇస్లాం, లేక క్రైస్తవమతాన్ని స్వీకరించినప్పటికి, తమవారసత్వాన్ని తలచి వుత్తేజితులుకాకుండా ఉండలేరు. అనేకమానసికవ్యథలతోనూ, జీవితసమస్యలతోనూ సతమతమౌతూ బహుకాలం నాగరికంగా గడుపబడిన పూర్వజీవితచరిత్రలు - వారసులకు ఆత్మవిశ్వాసం, ఆత్మగౌరవభావాలు కలిగించి ఉత్తేజపరుస్తాయి.

మనం ఒక స్వతంత్రజాతిగా వున్నట్లైతే, వర్తమానంలో యీ దేశంలో అందరమూ కలసి, భవిష్యత్తుకోసం కృషిచేస్తూ - మన గతాన్నిసమానమైన గర్వభావంతోచూచుకునేవాళ్ళమనేందుకు సందేహంలేదు. మొగలుయుగంలో--చక్రవర్తులూ, వారిఅనుయాయులు యీ దేశానికి కొత్తగావచ్చినవారైనా; దీనిగతంతో తమనుపోల్చుకుంటూ, ఆగొప్పతనాలను ఇతరులతోకలసి అనుభవించేందుకు ప్రయత్నించారు. కాని మానవునివిధానాలు బలహీనతచే మరోవిధంగా జరగడంవల్లను. ఇతరమార్పుల వల్లను చరిత్రరీతులు, హఠాత్సంభవాలు సహజపురోగమనాన్ని అరికట్టాయి. పాశ్చాత్యదేశాలప్రభావంవల్ల సాంకేతిక, ఆర్థికమార్పులవల్ల యేర్పడిన మధ్యతరగతులవారు- వారు హిందువులైనా, ముస్లింలైనా- ఒకేపూర్వరంగం కలిగివుంటారని ఎవరైనాఅనుకోవచ్చు. కొంతవరకు అలాగే జరిగినా భూస్వామ్య, యాజమాన్యతరగతుల్లోను ప్రజల్లోను అప్పుడూ ఇప్పుడూకూడా లేనటువంటి కొన్ని భేదాలు తలెత్తాయి. సాధారణ హిందూ, ముస్లిం ప్రజలమధ్య ఒకే పోలికలుండేవి. భాగ్యవంతులందరిపద్ధతులు, అంతస్తులు ఒకేరకం. వారు అప్పట్లో ఒకేరకమైన ఆచారాలుగల మధ్యతరగతులవారు మాత్రం -

ఆదిలో మన స్తత్వాల్లోనూ, తదుపరి ఇతరవిధానాల్లోనూ పరస్పరం దూరంకాసాగారు.

ఆదిలో ముస్లిముల్లో మధ్యతరగతులే లేవు. ముస్లిములు ఆంగ్ల విద్యకు, వాణిజ్య, పరిశ్రమలకు దూరంగావుండడంవల్ల, ఫ్యూడల్‌విధానాలకు అంటిపట్టుకొనివుండడంవల్ల హిందువులే ముందంజవేసి లాభం పొందడం, ఇప్పటికీ వాటిని తమచేతుల్లోఉంచుకోవడం జరిగింది. బ్రిటిష్ వారిని వారినీతి ముస్లిములకు వ్యతిరేకంగాను, హిందువులకు అనుకూలం గాను వుండేటట్లుచేసింది. పంజాబుముస్లిములుమాత్రం తదితరప్రాంతాల్లోకంటె ఇంగ్లీషుచదువుకు అలవాటుపడినందున అక్కడ ఇది వర్తించదు. అయితే, బ్రిటిష్‌వారు పంజాబును స్వాధీనంచేసుకోకముందే హిందువు లెంతో ముందుకుసాగారు. పంజాబులోకూడా హిందూ, ముస్లింల స్థితిగతులు సామ్యంకలిగివున్నప్పటికి హిందువుల కొంత ఆర్థికసౌలభ్యం వుండేది హిందూ, ముస్లిం భాగ్యవంతులు, ప్రజాసామాన్యంకూడా విదేశీయులపట్ల వ్యతిరేకభావం కలిగి వుండేవారు. 1857 విప్లవంలో ఉభయులు కలిసే పనిచేశారు. కాని దానిననచివేయడంలో ముస్లిములే ఎక్కువగా దండించబడి, ఎక్కువ బాధ లనుభవించారు. ఈ తిరుగుబాటు ఢిల్లీసామ్రాజ్యం పునరుద్ధరింపబడగలదనే కలలను, కట్టుకథలను పూర్తిగా తుడిచివేసింది. ఆ సామ్రాజ్యం చాలాకాలంక్రితమే, బ్రిటిష్‌వారు రంగంలో ప్రవేశించకపూర్వమే అంతర్ధానమైంది. మహారాష్ట్రులు దాన్నివిచ్ఛిన్నంచేసి, ఢిల్లీని వశపరచుకున్నారు. రంజిత్‌సింహుడు పంజాబు నేలాడు. ఈవిధంగా బ్రిటిష్ వారిజోక్యంలేకుండానే ఉత్తరభారతంలో మొగలుపాలన అంతరించింది. అది దక్షిణదేశంలోకూడ శిథిలమైపోయింది. ఐనా ఢిల్లీసింహాసనం మీద నామమాత్రపు చక్రవర్తి వుంటూనేవున్నాడు. వరుసగా మహారాష్ట్రులనుండి, బ్రిటిష్‌వారినుండి భరణంపొందుతూ, వారిదయాధర్మంపై ఆధారపడి వున్నప్పటికి అతడు ఒక ప్రసిద్ధవంశానికి చిహ్నంగా నిలిచాడు. సహజంగానే విప్లవకాలంలో తిరుగుబాటుదారులు చక్రవర్తి అసమర్థుడై, అయిష్టత కనబరచినవాడే అయినా ఈ చిహ్నాన్ని తమ ప్రయోజనాలకొరకు వినియోగించుకో ప్రయత్నించారు. విప్లవాంతంతో, యీ చిహ్నమూ అంతరించింది.

విప్లవకాలంలో నిభయోత్పాతాలనుంచి ప్రజలు కోలుకునేసరికి వారిహృదయాలు వట్టిపోయినట్లయింది. ఆ ఖాళీస్థానం తన్ను భర్తీ చేయగలదానికోసం ఎదురుచూస్తోంది. తప్పనిసరిగా బ్రిటిష్‌పాలనను ఆమోదించవలసివచ్చింది. గతాన్ని విస్మరించడంవల్ల కొత్తప్రభుత్వం వచ్చి తిష్టవేయడమేగాక, అనుమానము, తికమకలు, ఆత్మవిశ్వాసాన్ని కోల్పోవడంకూడా సంభవించాయి. ఇలా గతాన్నివిస్మరించడం విప్లవానికిపూర్వమే సంభవించి, బెంగాలుమొదలైనచోట్ల నూతనభావనోద్యమాలకు దారితీసిందని ఇదివరకే మరొకచోట ఉదహరించాను. కాని ముస్లిములు సామాన్యంగా హిందువులకంటె తమగూళ్ళలో మరింత లోపలికి పోయి పాశ్చాత్యవిద్యను తప్పించుకుంటూ, పూర్వవిధానాలు నెలకొంటాయనే పగటికలలతో జీవించసాగారు. కాని, ఇప్పుడా పగటి కలలుకూడా దూరమైనందున మరోఆధారాన్ని చూచుకోవలసివచ్చింది. వారప్పటికీ నూతనవిద్యకుఎడంగానేవుండిపోయారు. సర్‌సయద్‌అహ్మద్ ఖాన్ క్రమక్రమంగా, అతికష్టంమీద, ఎన్నోచర్చల అనంతరం వారిని ఆంగ్లవిద్యకుసుముఖులనుచేసి, అలిఘుర్‌కళాశాలను నెలకొల్పాడు. ప్రభుత్వోద్యోగాలకు అదొక్కటేమార్గం. ఆ ఉద్యోగాలయెడ బలీయమైన పాతనిరసనలను ప్రతికూలభావాన్ని త్రోసిపుచ్చగలిగింది. హిందువులు విద్యలోను ఉద్యోగాల్లోను ఎంతోముందుకుపోయారనే అసూయచే, ముస్లింలుకూడా అలా ఎందుకుతయారుకారాదనే బలమైన వాదం బాగా పనిచేసింది. హిందువులు, పార్శీలు పారిశ్రామికంగా కూడా ముందంజవేస్తున్నారు. కాని ముస్లింలదృష్టి అంతా ఉద్యోగాల వైపే ఆకర్షింపబడింది.

కాని యీవిధమైనఆలోచనలవల్ల మనసులకుకొంతపనితగిలినా, అదీ కొద్దిమందికే పరిమితమై అనుమానం, తికమకలను తొలగించలేకపోయింది. అటువంటిక్లిష్టపరిస్థితులలో హిందువులు గతంలోనికిదృష్టినిసారించి, పురాతనఔన్నత్యాలను తలచుకొని ఊరటచెందారు. పురాతనవేదాంతము, సారస్వతము, కళలు, చరిత్ర వారిని కొంతవరకు స్వస్థచిత్తులను చేశాయి. రామ్‌మోహన్‌రాయ్, దయానందసరస్వతి, వివేకానందస్వామి మొదలగువారు నూతనభావనోద్యమాలను ప్రారంభించారు. హిందువులు ఆంగ్లసారస్వతంలోమధురరసాన్ని గ్రోలుతున్నా, వారిహృదయాలు-

భారతదేశఋషులు, పీరులు, వారిమోచనలు, ఘనకార్యాలు, పురాణ కథలు, బాల్యంనుంచిజీర్ణించుకొన్న సాంప్రదాయాలు మొదలగువాటితో కూడ నిండివున్నాయి.

ఈ సాంప్రదాయాలతో బాగా పరిచయంవున్న ముస్లింప్రజా సామాన్యంస్థితి కూడ ఇలాగే వుంది. కాని ముఖ్యంగా పైతరగతుల ముస్లిములు తామీ మతసంబంధమైన ఒకేమాదిరిసాంప్రదాయాలతోటి సహవాసంచేయడం సమంజసంకాదనీ, వాటినిప్రోత్సహించడం ఇస్లాంఆదర్శాలకు వ్యతిరేకమనీ భావించసాగారు. వారు తమజాతిపునాదులకొరకు ఎక్కడెక్కడో వెదికారు. అట్టివి కొన్ని భారతదేశంలో ఆఫ్ఘను, మొగలుయుగాల్లో కనుపించాయి. కాని ఇవే ఆ అభావాన్ని నింపేందుకు చాలవు. ఆ యుగాలు హిందూ, ముస్లిములకు సమానమే. హిందువులహృదయాల్లో అది విదేశీపాలనఅనేభావం అదృశ్యమైపోయింది. ఔరంగజేబువిషయంలో అభిప్రాయభేదాలున్నప్పటికీ, మొగలు చక్రవర్తులు భారతజాతీయులేనన్నభావం పాదుకొన్నది. హిందువులు ఎక్కువగా మెచ్చుకున్న అక్బరును ముస్లిములు ఇటీవల ఖండిస్తున్నారనేవిషయం గమనించదగ్గది. అక్బరు 400 వ జన్మదినోత్సవం గతసంవత్సరం ఇండియాలో జరుపబడింది. అన్నితరగతులప్రజలూ – అనేకమంది ముస్లిములుకూడా – అందులో పాల్గొన్నారు. ముస్లింలీగు మాత్రం 'అక్బరుభారతీయైక్యతకు చిహ్నం'మని దూరంగాఉండిపోయింది.

భారతీయముస్లింలు (కొందరు మధ్యతరగతులవారు) సాంస్కృతికమూలబీజాలను తెలుసుకోవడంలో ఇస్లాంచరిత్రవైపు బాగ్దాదు, కాన్‌స్టాంటినోపుల్, స్పెయిన్, మధ్యఆసియా మొదలగుచోట్ల ఇస్లాము విజయశక్తిగా, సృజనాత్మకశక్తిగా వెలుగొందినకాలంవైపు మళ్ళారు. ఈ చరిత్రమీద, పరిసరముస్లిందేశాలమీద ఆసక్తి ఉంటూనే వచ్చింది. మక్కాకువెళ్ళే హజ్‌యాత్రలు వివిధదేశాలముస్లిములను సన్నిహితంచేశాయి. కాని ఇట్టిసంబంధాలన్నీ పరిమితంగా, పైపైన కనిపించేవిగా వున్నాయేగాని, భారతీయముస్లింల సామాన్యదృక్పథాన్ని మార్చియుండలేదు. వారిదృక్పథం ఇండియాకేపరిమితం. ఢిల్లీనిపరిపాలించిన ఆఫ్ఘన్‌రాజులు – ముఖ్యంగా మహమ్మద్ తుగ్లక్ – కెయిరోలోనిఖలీఫాను మతగురువుగా గుర్తించారు. తరువాత కాన్‌స్టాంటినోపుల్

లోని ఆటోమన్ చక్రవర్తులు ఖలీఫాలయ్యారు గాని, భారతీయ ముస్లింలు వారిని గుర్తించలేదు. ఇండియానుపాలించిన మొగలు చక్రవర్తులు ఇండియాకువెలుపలి ఖలీఫాలనుగాని, మతనాయకులనుగాని గుర్తించలేదు. 19వ శతాబ్ది ఆరంభంలో మొగలుశక్తి పూర్తిగా నశించిన తర్వాతమాత్రమే - భారతదేశమసీదుల్లో టర్కీసుల్తానుపేరును ఉచ్చరించడం ఆరంభమయింది. విప్లవానంతరం ఈ అలవాటు ఖాయమైంది.

ఆవిధంగా భారతీయముస్లింలు ఇతరదేశాల్లోని - ఇస్లాంయొక్క పూర్వవైభవాన్ని, ప్రపంచంలో ఏకైక స్వతంత్రముస్లింరాజ్యంగా నిలచినటర్కీని తలచుకొని మానసికతృప్తిపొందసాగారు. ఈభావన భారత జాతీయతకు వ్యతిరేకమూ కాదు, ఘర్షణ హేతువూ కాదు. నిజానికి హిందువులలో కూడా ఇస్లాంచరిత్ర నవగాహనచేసుకొని, మెచ్చుకున్నవారెందరో వున్నారు. టర్కీప్రజలు యూరోపియనులదురాక్రమణకు బలియైనఆసియావాసులని భారతీయులందరూ సానుభూతికలిగిఉన్నారు. కాని, ఈ భావం ముస్లింలకేగాని హిందువులకు మానసికంగా అవుసరం వంటిది కాలేదు.

విప్లవానంతరం ఎటువైపు మళ్ళాలి అనేవిషయంలో భారతీయ ముస్లింలు కొంతతటపటాయించారు. బ్రిటిష్ప్రభుత్వం హిందువులకంటె ముస్లింలను మరింత ఎక్కువగా అణచింది. ఈ దెబ్బ కొత్తగా తలెత్తిన ముస్లింమధ్యతరగతులవారికే బలంగా తగిలింది. వారు దీనికెంతో కినిసి బ్రిటిష్వ్యతిరేకభావావేశంపొందారు. కాని 1870 తర్వాత వారిపట్ల ప్రభుత్వందృష్టి క్రమంగా మారిపోసాగింది. బ్రిటిష్ప్రభుత్వం కచ్చితంగా అనుసరించిన 'విభజించి పాలించు' విధానమే ఈ మార్పుకు ముఖ్యకారణం. కాని సర్ సయ్యద్ అహ్మద్ఖాన్ ఈవిషయంలో ఎంతో కృషిచేశాడు. బ్రిటిష్అధికారులతో సహకరించడంద్వారా మాత్రమే తాను ముస్లింలను బాగుపరచగలనని ఆయన విశ్వసించాడు. ఆంగ్లవిద్యకు ముస్లిములను ఒప్పించడంద్వారా వారు సాంప్రదాయిక మనస్తత్వాన్నివదిలేటట్లుచేయగలనని నమ్మాడు. యూరపునాగరికత లోనిసుగుణాలను చూచి ఆయన బాగా చలించాడు. యూరపునుండి

ఆయనవ్రాసినలేఖల్లో కొన్నిటినిబట్టి ఆయన పాశ్చాత్యనాగరికతకు సమ్మోహితుడై, నిష్పాక్షికతను కోల్పోయినాడనిపిస్తుంది.

సర్ సయ్యద్ పట్టుదలగలసంస్కర్త. ఆధునిక శాస్త్రీయచింతనను ఇస్లాంకు అన్వయించాలనుకున్నాడు. ఏ ప్రాథమికవిశ్వాసాన్నీ ఖండించకుండా మతసూత్రాలను హేతుబద్ధంగా వ్యాఖ్యానించడంద్వారా యీపనిచేయవలసివున్నది. ఆయన ఇస్లాము, క్రైస్తవమతాల ప్రాథమిక సూత్రాల్లోగలపోలికలను యెత్తిచూపాడు. ముస్లిముల 'పరదా' ఆచారాన్ని ఖండించాడు. టర్కీ ఖలీఫాలతో ఎట్టిసఖ్యత వనికిరాదన్నాడు. అన్నిటికంటె ఒక నూతనవిద్యావిధానాన్ని వ్యాపింపజేయాలని ఆత్రపడ్డాడు. బ్రిటిష్అధికారులను ఏమాత్రం వ్యతిరేకించినా, తన విద్యాప్రణాళికలకు వారిసహాయముండబోదని జాతీయోద్యమారంభాన్ని చూచి భయపడ్డాడు. బ్రిటిషువారిసహాయ మెలాగైనా సంపాదించితీరాలని,ముస్లిముల్లో బ్రిటిష్వ్యతిరేకభావాలను తగ్గించేందుకు, అప్పుడే రూపొందుతున్నజాతీయకాంగ్రెసువైపునుంచి ముస్లిములను మళ్ళించడానికి ప్రయత్నించాడు. ఆయనస్థాపించిన అలిఘర్ కళాశాల ముఖ్యాశయాల్లో ఒకటి – "ఇండియాలోనిముసల్మానులను బ్రిటిష్‌రాజరికానికి తగినఅర్హతగల, ప్రయోజనపరులైన పౌరులుగా తయారుచేయుట"అని ప్రకటించబడింది. ఆయన జాతీయకాంగ్రెసు ప్రధానంగా హిందువుల సంస్థయేనని దాన్ని వ్యతిరేకించలేదు. అది రాజకీయంగా మరీతీవ్రవాదిగా (అప్పటి కది మరీ మితవాది) వుంది గనుక, తాను బ్రిటిష్‌వారిసహాయ, సహకారాలను వాంఛిస్తున్నందువల్లనే వ్యతిరేకించాడు. తిరుగుబాటులో ముస్లింలు మొత్తంగా పాల్గొనలేదనీ, అనేకులు బ్రిటిష్అధికారానికి స్వామిభక్తులుగావున్నారనీ రుజువుచేసేందు కాయన ప్రయత్నించాడు. ఆయన ఏవిధంగాను హిందూవ్యతిరేకిగాని, కులతత్వవాదిగాని కాడు. మతవిభేదాలు రాజకీయ జాతీయరంగాల్లో ప్రధానంకావని ఆయన అనేక సార్లు నొక్కివక్కాణించాడు. "మీరందరూ ఇదేభూమిపై నివసించడం లేదా? హిందువు మహమ్మదీయుడనేపదాలు మతాలనువిడదీసేందు కుపయోగపడేవి మాత్రమే. హిందువైనా, మహమ్మదీయుడైనా, ఆఖరుకు క్రైస్తవుడైనా సరే – ఈదేశంలో నివసించేవారంతా ఒకేఒకజాతికి చెందినవారు"అన్నా డాయన.

సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్ పైతరగతులముస్లిములలో కొందరిని మాత్రమే ఆకర్షించగలిగాడు. బస్తీలలో, గ్రామాల్లోఉండే అసంఖ్యాక ప్రజాసామాన్యంమీద ఆయనప్రభావం ప్రసరించలేదు. ఈ సాధారణప్రజలు తమ పైతరగతులవారితో ఎలాంటిసంబంధాలూ లేక, హిందూప్రజాసామాన్యానికి చాలా దగ్గరగా ఉండేవారు. పైతరగతుల ముస్లిములలో కొందరు మొగలువంశీయులైనా; సామాన్య ప్రజలకు అట్టి చరిత్ర, సాంప్రదాయాలూ లేవు. వారెక్కువగా హిందూ కనిష్టవర్ణాలనుండి మతాంతరులైనవారే. వారందరికంటె నిరుపేదలుగా, అమితపీడనలకు గురియై శోచనీయస్థితిలోఉన్నారు.

సర్ సయ్యద్‌కు - సమర్థత, ప్రత్యేకతలుగల సహచరులనేకమంది ఉండేవారు. ఆయనహేతుబద్ధవిధానాలను సయ్యద్ చిరాగ్ ఆలి, నవాబ్ మోసినుల్‌ముల్క్ మొదలగువారనేకమంది బలపరిచారు. విద్యారంగంలో ఆయనచేసినకృషి మున్షీ కరమత్ ఆలి, మున్షీ జకావుల్లా (ఢిల్లీ), డాక్టర్ నజీర్ అహ్మద్, మౌలానా షిబ్లీ నోమాని ఉరుదూసారస్వతంలో దిగ్గజంవంటికవి 'హాలి' మొదలగువారి నాకర్షించింది. ముస్లింలకు సంబంధించినంతవరకు - ఆంగ్లవిద్యాభ్యాసానికి సుముఖుల్ని చేయడంలోను, రాజకీయోద్యమాలనుగురించి ఆలోచించకుండా మళ్ళించడంలోను - సర్ సయ్యద్ కృతకృత్యుడయ్యాడు. మహమ్మదీయవిద్యావిషయికసభ స్థాపించబడింది. అది వృత్తులు, ఉద్యోగాలలోని మధ్యతరగతిముస్లిములను ఆకర్షించింది.

ఎన్నివ్యతిరేకప్రయత్నాలు జరిగినా, పేరొందినముస్లిము లనేకులు జాతీయకాంగ్రెస్‌లో చేరారు. బ్రిటిష్‌వారివిధానం ముస్లిములకు, కనీసం జాతీయోద్యమాన్నివ్యతిరేకించినవారికి - స్పష్టంగా సుముఖమైంది. కాని 20వ శతాబ్దిఆరంభంలో ముస్లిముల్లో యువకులనేకమంది జాతీయవాదం, రాజకీయకార్యక్రమాలవైపు మొగ్గడం స్పష్టంగా కన్పించింది. ఈ ధోరణి సరికట్టి, మరొక నిరపాయకరమైన మార్గానికి మళ్ళించేందుకుగాను - బ్రిటిష్‌ప్రభుత్వప్రోత్సాహంతో, దానిని బలపరిచే ముఖ్యుడైన ఆగాఖాన్‌ఆధ్వర్యాన "ముస్లింలీగు" (1906లో) నెలకొల్పబడింది. బ్రిటిష్‌ప్రభుత్వంపట్ల స్వామిభక్తి, ముస్లిములప్రయోజనాలను రక్షించడం-ఈరెండూ ముస్లింలీగు ఆశయాల్లో ముఖ్యమైనవి.

ఈ సందర్భంలో గణించదగ్గవిశేషం ఒకటుంది. విప్లవానంతరం తలెత్తినభారతీయముస్లింనాయకుల్లో ఎక్కువమంది (సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్‌తోసహా) పూర్వ సాంప్రదాయికవిద్యవల్ల రూపొందిన వారే. అందులోకొందరు ఆతర్వాత ఆంగ్లాన్ని అభ్యసించి, నవీనభావాలచే సంచలితులైయుండవచ్చునుగాక. అప్పటికి – పాశ్చాత్యవిద్యావిధానం ముస్లిముల్లో గణనీయవ్యక్తులను సృష్టించలేదు. అగ్రశ్రేణి ఉరుదూకవి ఘాలిబ్ ఆ శతాబ్దపు భారతీయరచయితల్లో ముఖ్యుడు. విప్లవంనాటికి ఆయన నవయువకుడు.

20 వ శతాబ్ది తొలిసంవత్సరాల్లో ముస్లింవిద్యావంతుల్లో రెండు రకాలధోరణు లుండేవి. ముఖ్యంగా యువకులలో ఎక్కువమంది జాతీయవాదంవైపు మొగ్గారు. రెండవధోరణివారు భారతదేశచరిత్రకు, కొంతవరకు వర్తమానానికి దూరంగావుండాలనీ, ఇస్లాందేశాలపట్ల – ముఖ్యంగా ఖిలాపత్ కేంద్రమైన టర్కీపట్ల – భక్తిశ్రద్ధలు కలిగివుండాలనీ భావించేవారు. దేశదేశాల్లోని ముస్లిములందరూ టర్కీసుల్తాను ప్రజలేననేఉద్యమం, టర్కీసుల్తానగు అబ్దుల్‌హమీద్‌చే ప్రోత్సహింపబడింది. భారతీయముస్లిముల్లో అగ్రవర్గాలవారుకొందరు దీన్ని బలపరిచారు. కాని సర్ సయ్యద్ దీన్ని వ్యతిరేకించాడు. భారతీయులకు టర్కీపట్ల, సుల్తానుపట్ల ఆసక్తికూడదని విమర్శించాడు. ఈ టర్కీయువజనోద్యమం మిశ్రమపరిణామాలకు కారణమయింది. ఆదిలో భారతీయముస్లిములనేతలు ఆ ఉద్యమంపట్ల అనుమానాలు వెల్లడించారు. టర్కీలో యూరోపియన్‌శక్తులు ఆడుతున్న కపటనాటకాలకు సుల్తాన్ గొప్పవిరుగుడు అనేనమ్మకంతో, అతనిపట్ల సానుభూతిని ప్రదర్శించారు. మరికొందరు—వారిలో అబుల్‌కలాం ఆజాద్ ఒకరు-టర్కీయువజనోద్యమాన్ని, అది ప్రవేశపెట్టిన రాజ్యాంగ, సాంఘికసంస్కరణలను మనఃపూర్వకంగా ఆహ్వానించారు. 1911 లో ట్రిపోలీ యుద్ధంలోను, 1912, 1913 సం॥ లలోజరిగిన బాల్కన్‌యుద్ధాల్లో, ఇటలీ హఠాత్తుగా టర్కీపైదండెత్తినసందర్భాల్లో, భారతీయముస్లిములు టర్కీపట్ల ఆశ్చర్యకరమైన సానుభూతి చూపారు. అప్పుడు భారతీయులందరు ఈ సానుభూతినికలిగివున్నా, ముస్లిములసానుభూతిలో మరింత ఆవేశమూ, వ్యక్తిగతశ్రద్ధ వున్నట్లు కన్పించింది. చివరికిమిగిలివున్న ఏకైక

ముస్లింప్రభుత్వంకూడా నామరూపాల్లేకుండాపోయేటట్టు కనిపించింది తమ భవిష్యత్తుపైగలవిశ్వాసకవచం తమకళ్ళముందే విచ్ఛిన్నం చేయబడింది. డాక్టర్ ఎం.ఎ. అన్సారీ ఒకవైద్యసహాయకదళాన్ని టర్కీకి తీసుకువెళ్ళాడు. పేదవారుకూడా విరాళాలిచ్చారు. భారతీయముస్లింల ఏఅభివృద్ధిపథకానికీ రానంత వేగంగా ధనంప్రోగయింది మొదటిప్రపంచ యుద్ధంలో టర్కీ అవతలిపక్షంలో వున్నందున, అది భారతముస్లిములకు అగ్నిపరీక్షఅయింది. వారు నిస్సహాయులమనుకుని, ఏమీచేయలేక పోయారు. వారిలో దాగి, గూడుకట్టుకున్న ఆవేశమంతా - యుద్ధానంతరం - ఖిలాఫత్ ఉద్యమంలో పొంగి పొరలింది.

భారతీయముస్లింల మానసికాభివృద్ధికి 1912లో రెండు నూతన వారపత్రికలు-ఉరుదూలో "అల్-హిలాల్", ఆంగ్లంలో "దికామ్రేడ్" అనేవి-స్థాపించబడ్డాయి. "అల్-హిలాల్" నేటి కాంగ్రెసుఅధ్యక్షుడు అబుల్‌కలాం ఆజాద్‌చే 24 యేండ్లప్రాయంలో స్థాపించబడింది. ఆయన కైరోలోని అల్ అఝార్ యూనివర్సిటీలో విద్యనభ్యసించి యౌవనంలోఅడుగెట్టకముందే అరబ్బీ, పారశీకపండితుడుగా, గొప్పవిజ్ఞానిగా ప్రసిద్ధిపొందాడు. ఇండియావెలుపలి ఇస్లాంమతస్థులగురించీ, అప్పట్లో ఇక్కడ సంస్కరణోద్యమాలనుగురించీ, యూరపులోనిపరిణామాలగురించి ఆకళింపుచేసుకొని, ఆ జ్ఞానాన్ని పైవిజ్ఞానంతో మేళవింపజేసుకున్నాడు. ఇస్లాంచరిత్ర, పురాతనసారస్వతాలను కరతలామలకంచేసుకొని మత సూత్రాలను హేతువాదదృక్పథంతోవ్యాఖ్యానించాడు. ఇస్లాంసాంప్రదాయాల్లో మునిగితేలి ఈజిప్ట్, టర్కీ, సిరియా, పాలస్తీనా, ఇరాక్, ఇరాన్‌దేశాల్లోని ముస్లింనాయకులతోను, సంస్కరణలతోను వ్యక్తిగతసంబంధాలున్నందున ఆ దేశాల సాంస్కృతిక, రాజకీయపరిణామాలవల్లకూడా ఆజాద్‌సంచలితుడైనాడు. ఆయన తనరచనలద్వారా పైదేశాల్లో భారతదేశంలోనిమరేముస్లిముకూ లేనంతఖ్యాతి గడించాడు. టర్కీప్రజలుపాల్గొన్నయుద్ధాలు ఆయనలో సానుభూతిని, తీవ్రానుభూతిని రేకెత్తించాయి. కాని ముస్లింవృద్ధనాయకులదృక్పథానికి ఈయన దృక్పథం భిన్నం. వృద్ధనాయకులు మధ్యయుగాలనాటిమనస్తత్వం, సంకుచిత మతతత్వం, ప్రత్యేకజాతితత్వాలతో ప్రవర్తించగా, ఆజాద్ విశాలహేతువాదదృక్పథంతో భారతజాతీయవాది అయ్యాడు. టర్కీ

మొదలైన ఇస్లాందేశాల్లో జాతీయవాదం పెంపొందడం ఆయన స్వయంగా చూచినందున, ఆ అనుభవాన్ని ఇండియాకువర్తింపజేసి, భారతజాతీయోద్యమంలో అదేవిధమైనఅభివృద్ధిని చూచాడు. భారత దేశంలోనిఇతరముస్లింలకు, విదేశాల్లోని యీపరిణామాలస్వరూపం తెలియదు. తమ ఫ్యూడల్ వాతావరణంలోనే వుండిపోయి అక్కడజరిగే వాటెనిమెచ్చుకోలేకపోయారు. వారు మతదృష్టితోనే ఆలోచించడం అలవరచుకున్నందువల్ల టర్కీ మొదలైనవాటిపట్ల సానుభూతిని ప్రదర్శిం చడంకూడా మతబంధంవల్లనే. ఎంతగాఢమైనసానుభూతివున్నా, వీరికి టర్కీలోజరిగినమతాతీతమైన జాతీయోద్యమాలపట్ల సరియైనదృక్పథం యేర్పడలేదు.

అబుల్‌కలాం ఆజాద్ తనవారపత్రిక 'అల్-హిలాల్' ద్వారా, క్రొత్తభాషలోచెప్పాడు. అది భావన, దృక్పథాల్లోనేగాక, కూర్పులో కూడా క్రొత్తభాష. ఆజాద్‌శైలి పర్షియన్‌ప్రభావంవల్ల ఒక్కొకసారి కఠినపదభూయిష్టంగావున్నా, అందులో బిగువు, పటిష్టత వుంటాయి. ఆయన నూతనభావాలనుచెప్పేందుకు కొత్తకొత్తసమాసాలు వాడే వాడు. ఉరుదూభాషప్రస్తుతస్వరూపానికి పైవిధంగా ఆయనచేసినకృషి అనన్యమైనది. ముస్లిం వృద్ధమితవాదనాయకులు ఆజాద్‌అభిప్రాయా లను, దృక్పథాన్నీహర్షించలేక, ఖండించసాగారు. కాని, వారిలో అత్యు న్నత విజ్ఞానవంతులుకూడా; చర్చల్లోగాని, వాదనలోగాని ఆజాద్‌తో దీటురాలేకపోయారు. ఆజాద్ వారందరికంటె విషయాలలోతుపాతు లెరిగినవాడు గనుక మతసూత్రాలు, సాంప్రదాయాల్లోకూడా ఇతరు లాయన కెదురాడలేకపోయారు. ఆయన మధ్యయుగాలనాటి పాండిత్య ప్రకర్ష, 18 వ శతాబ్దపు హేతువాదపటిమ, నేటి ఆధునిక దృక్పథం - ఈ మూడింటిని జీర్ణించుకున్న విచిత్రవ్యక్తి.

వృద్ధులలోకొందరు ఆజాద్‌రచనలను బలపరచకపోలేదు. అట్టి వారిలో, స్వయంగాటర్కీనిసందర్శించి, ఆలీఘర్‌కళాశాలలో సర్‌సయ్యద్ అహ్మద్‌ఖాన్‌తో కలసిపనిచేసిన మౌలానా షిబ్లీ నోమాని ఒకడు. అలీఘర్‌కళాశాలసాంప్రదాయం - రాజకీయంగానూ, సాంఘికంగానూ కూడ - మితవాదియై, దూరంగా ఉండేది. మధ్యయుగాల సాంప్రదా యానికిచెందిన నవాబులు, పెద్దభూస్వాములు మాత్రమే ఆ కళాశాల

ధర్మకర్తలు. ప్రభుత్వసంస్థలతో సాన్నిహిత్యం గల ఆంగ్లేయులే వరుసగా ముఖ్యోపాధ్యాయులుగా ఉండడంవల్ల – యీకళాశాల, ప్రత్యేక జాతితత్వాన్ని, జాతీయోద్యమానికి, కాంగ్రెసుకు వ్యతిరేకతనూ మప్పింది. విద్యార్థులముందుంచబడిన దాని ముఖ్యలక్ష్యం సన్నకారు ప్రభుత్వోద్యోగులు కావడమే. ఆ లక్ష్యాన్ని చేరడానికి ప్రభుత్వానుకూలమైన దృక్పథం అవసరం గనుక, జాతీయవాదం మొదలైన ప్రభుత్వ వ్యతిరేకచర్యలు నిషిద్ధాలయ్యాయి. అలిఘర్ కళాశాలలో తయారైన వారే ముస్లింవిద్యావంతులకు ప్రాతినిధ్యము, నాయకత్వము వహిస్తూ తెరవెనుకనుంచీ, అప్పుడప్పుడూ ప్రత్యక్షంగాకూడ ముస్లిం ఉద్యమాలన్నింటిని నడుపసాగారు. ముఖ్యంగా వారిప్రయత్నంవల్లనే ముస్లిం లీగు అవతరించింది.

జాతీయవాదవ్యతిరేకతకు, అతిమితవాదానికి పట్టుగొమ్మలైన ఈ వర్గాలపై అబుల్ కలాం ఆజాద్ తీవ్రంగా దాడిచేశాడు. ప్రత్యక్షపోరాటానికిదిగక అలిఘర్ సాంప్రదాయాలను చిన్నబుచ్చేవిధంగా హేతుబద్ధభావాలను వ్యాపింపజేశాడు. యీ యువరచయిత – యీ పత్రికావ్యాసంగి ముస్లింవిజ్ఞానులలో అపూర్వ సంచలనం కలిగించాడు. వృద్ధులు ఈసడించినప్పటికీ, యువజనులహృదయాలు ఆయన ప్రబోధాలతో నిండి, ఆవేశపూరితమయ్యాయి. లోగడనే టర్కీ, ఈజిప్టు, ఇరాన్‌లలోనిసంఘటనలు, భారతజాతీయోద్యమము యీ ఆవేశాన్ని కల్గించాయి. ఇస్లాం, ఇస్లాందేశాలపట్లసానుభూతి, భారతజాతీయోద్యమము – ఈ మూడింటిలోనూ పరస్పరవైరుధ్యాలుండవలసిన అవసరం లేదని వివరించిచెప్పడంద్వారా, ఆజాద్ యీ రగులుతున్న ఆవేశానికొక ప్రత్యేకరూపాన్ని కల్పించాడు. ముస్లింలీగును కాంగ్రెసుకు సన్నిహితంచేయడానికిది ఎంతో వుపయోగపడింది. ముస్లింలీగ్ తొలి మహాసభ (1906) నాటికే, బాల్యంలోనే ఆజాద్ అందులో చేరాడు.

బ్రిటిష్‌ప్రభుత్వప్రతినిధులు 'అల్ – హిలాల్' ధోరణి నామోదించలేదు. ప్రెస్‌చట్టంక్రింద అనేకసార్లు ధరావతులుకోరారు. చివరికి 1914 లో ఆ ప్రెస్సును స్వాధీనంచేసుకున్నారు. ఆవిధంగా 'అల్ – హిలాల్' – రెండేళ్ళుమాత్రమే ప్రకటించబడి, ఆగిపోయింది. ఆజాద్ వెనువెంటనే 'అల్ – బలాఘ్' అనే మరోవారపత్రిక ప్రకటించ

సాగాడు. కాని, ఇదికూడా అంతత్వరలోనే- 1916లో ప్రభుత్వం ఆజాద్‌ను విడిఖైదుచేయగానే - అంతరించింది. దాదాపునాలుగేండ్లు జైలు నుంచి రాగానే ఆయన జాతీయకాంగ్రెసునాయకశ్రేణిలో చేరాడు. అప్పటినుంచి ఆయన కాంగ్రెసుకేంద్రసంఘంలో సభ్యుడుగా విడువకుండా వుంటున్నాడు. ఆయన వయసులో తక్కువైనప్పటికీ, అగ్రనాయకునివలె గౌరవింపబడేవాడు. రాజకీయ, జాతీయసమస్యలగూర్చి కులాలు, అల్పసంఖ్యాకులసమస్యలగూర్చి ఆయనసలహాలకు ఎక్కువ విలువయివ్వబడేది. ఆయన రెండుసార్లు కాంగ్రెసుఅధ్యక్షుడయ్యాడు. అనేకసార్లు జైలుశిక్షలనుభవించాడు.

1912 లో "అల్ - హిలాల్"కంటె కొద్దినెలలు ముందుగా స్థాపించబడిన "ది కామ్రేడ్"అనే ఆంగ్ల వారపత్రిక ఇంగ్లీషునేర్చిన ముస్లింయువకుల నెంతో సంచలింపజేసింది. ఇస్లాంసాంప్రదాయాలు, ఆక్స్‌ఫర్డ్ చదువులను జీర్ణించుకొన్న - మౌలానా మహమ్మదాలీ దానిసంపాదకుడు. ఆయన అలీఘర్‌సాంప్రదాయాలఛాయలో జీవితాన్ని ప్రారంభించి, తీవ్రరాజకీయాలను వ్యతిరేకించాడు. కాని, ఆయన సామర్థ్యము, సంచలనాత్మకవ్యక్తిత్వం గలవాడైనందున, ఆ జడవ్యవస్థలోనే వుండిపోవడం అసంభవమైంది. ఆయనభాష పటిష్ఠమై, కొట్టవచ్చినట్లుండేది. 1911లో బెంగాలువిభజనను రద్దుచేయడం - ఆయన్ని నిర్విణ్ణునిచేయడమేగాక, బ్రిటిష్‌వారి సద్భావాల్లో ఆయనకుగల విశ్వాసాన్ని సడలించింది. బాల్కన్‌యుద్ధాలు ఆయనలో ఆవేశాన్ని రేకెత్తించాయి. టర్కీని, అది ప్రాతినిధ్యంవహిస్తున్న ఇస్లాంసాంప్రదాయాలనూ సమర్థిస్తూ ఆవేశపూరితవ్యాసాలు రచించాడు. క్రమక్రమంగా బ్రిటిష్‌వ్యతిరేకత పెరిగి, మొదటిప్రపంచయుద్ధంలో టర్కీ చేరడంతో పూర్తిగా వ్యతిరేకిఅయ్యాడు. "ది కామ్రేడ్"లో "తురుష్కులు త్రొక్కినదారి"అనే మకుటంతో ఆయన వ్రాసిన సుదీర్ఘమైన, (ఆయన ఉపన్యాసాల్లోగాని, రచనల్లోగాని 'క్లుప్తత, ఏకాగ్రత' అనే పొరపాట్లు చేయలేదు.) ఒక ప్రఖ్యాతవ్యాసం ప్రకటించినందుకు బ్రిటిష్‌ప్రభుత్వం దాన్ని ఆపివేసింది. తరువాత కొద్దికాలానికే ప్రభుత్వం ఆయనను, ఆయనసోదరుడు షౌకత్ ఆలీని నిర్బంధించి, యుద్ధకాలంలోను, తర్వాత ఒక సంవత్సరంపాటు ఖైదులోఉంచింది 1919 చివరల్లో విడుదలకాగానే

వారిదువురూ జాతీయకాంగ్రెస్‌లో చేరారు. ఆలీసోదరులు ఖిలాఫత్ ఉద్యమంలోనూ, 1920 తర్వాత సంవత్సరాల్లో, కాంగ్రెస్ రాజకీయా ల్లోనూ విశిష్టపాత్రవహించి పనిచేసి, జైలుశిక్షలనుభవించారు. మహ మ్మదాలీ కాంగ్రెస్ మహాసభ కొకసారి అధ్యక్షుడైనాడు; అనేకసంవత్స రాలు కేంద్రకార్యవర్గసభ్యుడుగా ఉన్నాడు. ఆయన 1930 లో మరణించాడు.

మహమ్మదాలీదృక్పథంలో కలిగినమార్పు భారతీయముస్లింల మనస్తత్వంలో కలిగినమార్పుకు ప్రతిబింబం. జాతీయఉద్యోగాలకు ముస్లింలను దూరంగావుంచాలని స్థాపించబడిన ముస్లింలీగుకూడా-అది జమీందారీ, అభివృద్ధినిరోధకశక్తుల కీలుబొమ్మగావున్నా - యువజనులు తెస్తున్న వత్తిడిని గుర్తించకుండావుండలేకపోయింది. అది అయిష్టంగానే అయినప్పటికీ, జాతీయవాదప్రవాహంవైపుమళ్ళి కాంగ్రెసుసంస్థకు దగ్గ రకాసాగింది. 1913 లో 'ప్రభుత్వంపట్ల భక్తి, విశ్వాసాల'నే ఆశయాన్ని మార్చుకుని, భారతదేశానికి స్వరాజ్యం సాధించాలని తీర్మానించింది. మౌలానా అబుల్‌కలాం ఆజాద్ 'అల్ - హిలాల్'లో ప్రకటించిన తన శక్తివంతమైన రచనలద్వారా యీ మార్పును ప్రబోధించాడు.

## ౧౧ కెమాల్‌పాషా - ఆసియాలోజాతీయవాదం - ఇక్బాల్

కెమాల్‌పాషా భారతీయహిందూ - ముస్లింలిద్దరిచేత కొనియా డబడ్డాడు. ఆయన టర్కీని విదేశీవిచ్ఛిన్నశక్తులనుండి రక్షించడమేగాక యూరోపియన్‌రాజ్యాల (ముఖ్యంగా ఇంగ్లండు) కుట్రలను భగ్నం చేశాడు. కాని ఆయన 'అటాటుర్క్-విధానం'ఆయనమతతత్వరాహిత్యం, సుల్తానుపదవిని, ఖిలాఫత్‌ను రద్దుచేయడం, మతాతీతమైన రాజ్యాంగ పాలన నెలకొల్పడం, మతాచార్యులను విడిచిపుచ్చడం - వెల్లడయ్యే సరికి ఈ ప్రసిద్ధి తగ్గిపోసాగింది. మరీ పురాతనాభిప్రాయాలుగల ముస్లింలు ఆయన ఆధునికవిధానాలను నిరసిస్తూ, ఆయన్ను ఈసడించసాగారు. కాని, ఈ విధానంవల్లనే హిందూ, ముస్లింయువజనులు ఆయన్ని మెచ్చుకోవడంజరిగింది. తిరుగుబాటుజరిగినప్పటినుంచి భారతీయముస్లి ములలో పెరుగుతూవచ్చిన ఊహాసౌధాన్ని అటాటుర్క్-విధానం కొంత భగ్నంచేసింది. మళ్ళీ వారిహృదయాలలో ఒకవిధమైన శూన్య

భావం యేర్పడింది. అనేకమంది ముస్లింలు జాతీయోద్యమంలో చేరడం ద్వారా ఈ ఖాళీని భర్తీచేసుకున్నారు. అంతకుముందే కొంద రా వుద్యమంలో చేరారు. మిగిలినవారు తటపటాయించి, అనుమానంతో ఎడంగా ఉండిపోయారు. అసలు సంఘర్షణ ఫ్యూడల్ ఆలోచనావిధానాలకు ఆధునికధోరణులకు మధ్యనే. ఛాందసమనస్తత్వం గల నాయకత్వం తాత్కాలికంగా ప్రజల ఖిలాఫత్ ఉద్యమంచేత ప్రక్కకునెట్టివేయబడింది. కాని ఆ ఉద్యమమైనా సాంఘిక, ఆర్థికపరిస్థితులను, ప్రజానీకపు అవసరాలను ఆధారంచేసుకోలేదు. దాని కేంద్రం మరెక్కడో వుంది. ఆ కేంద్రమే అటాటుర్క్ చేత తుడిచివేయబడినప్పుడు బాహ్యానిర్మాణమంతా పతనమై పోయింది. దానితో ముస్లిములు నిర్విణ్ణులై, ఏ రాజకీయోద్యమాలకూ మొగ్గలేనిస్థితిలో పడ్డారు. అంతవరకు పొంచియున్న ఛాందసనాయకులు, తా మెప్పుడూ బలపరుస్తూవచ్చిన బ్రిటిష్ విధానసహాయంతో మళ్ళీ ప్రాముఖ్యతకు వచ్చారు. కాని, పరిస్థితులు చాలా మారిపోయి నందున వారు మళ్ళీ పూర్వపు మహోన్నతగౌరవస్థానాలు పొందలేక పోయారు. ముస్లిముల్లో కూడా – ఆలస్యంగానైనా – మధ్యతరగతి ఏర్పడుతోంది. జాతీయకాంగ్రెసు అధ్వర్యాన జరుగుతున్న ప్రజారాజకీయోద్యమానుభూతులుకూడా ఎంతో మార్పుకు కారణమయ్యాయి.

ముస్లిం ప్రజానీకము, మధ్యతరగతివారి మనస్తత్వాలు అనేక సంఘటనల ప్రభావంవల్లనే రూపొందుతున్నాయి. కాని, ముస్లింమధ్యతరగతులవారి, యువకుల మనస్తత్వాన్ని ప్రభావితంచేయడంలో సర్ మహమద్ ఇక్బాల్ నిర్వహించినపాత్ర అనన్యసాధ్యమైనది. ఆయన ప్రభావం సామాన్యప్రజలకు చేరలేదు. ఇక్బాల్ ఉరుదూలో సంచలనాత్మకమైన గేయాలు వ్రాయడంద్వారా తనకృషిని ప్రారంభించాడు. అవన్నీ ప్రసిద్ధిపొందాయి. బాల్కన్ యుద్ధాలకాలంలో ఇస్లాంమతవిషయాలపై రచనసాగించాడు. అప్పటిపరిస్థితులవల్ల, నాటిముస్లింల భావాలకనుగుణంగా వారిభావావేశాన్ని మరింత ప్రోత్సహించే కవితలవి. కాని ఆయన ప్రజానాయకుడు కాడు. ఆయన కాశ్మీరబ్రాహ్మణుడుగా జన్మించి జమీందారీభూస్వామ్యసాంప్రదాయాలతో సంబంధాలు కలిగినవాడు. ముఖ్యంగా కవి, మేధావి, తత్వవేత్త. ఆయన పారశీకము, ఉరుదూభాషల్లో చక్కని కవితలల్లి, ముస్లింవిద్యావంతులకు మతతత్వ

సారాన్ని అందించి, వారిహృదయాలను ప్రత్యేకజాతిసిద్ధాంతంవైపు మరల్చాడు. ఆయనప్రసిద్ధికి ముఖ్యకారణం ఆయనకవితలోని మాధుర్య మనడంలో సందేహంలేదు. కాని ముస్లింహృదయాలు చేయూతకాగల ఆధారంకోసం వెదకుతున్నకాలంలో, అలాంటి ఆసరాలను అందించడం వల్ల అంతకంటె ఎక్కువప్రసిద్ధి లభించినదనాలి. ముస్లిములంతా ఒకశే ననేపాతఆదర్శానికి అర్థంలేకుండాపోయింది. ఖిలాఫత్ అదృశ్యమైంది. ప్రతి ముస్లిందేశమూ – ముఖ్యంగా టర్కీ–జాతీయవాదాన్ని పెంపొం దించుకుని, ఇతరదేశాల్లోని ఇస్లాంజాతుల్నిగురించి ఆలోచించడం మానివేశాయి. ఇతరదేశాలవలె ఆసియాలోకూడా జాతీయవాదమే బలీయమైనశక్తిగా రూపొందింది. భారతదేశంలోకూడా జాతీయవాదం అత్యంతశక్తివంతమై, బ్రిటిష్అధికారాన్ని అనేకసార్లు సవాల్చేసింది. అట్టిజాతీయవాదం భారతముస్లింహృదయాలను కూడా ఆకర్షించింది. అనేకమందిముస్లింలు స్వాతంత్ర్యపోరాటంలో గణనీయమైనపాత్ర నిర్వహించారు. భారతజాతీయోద్యమంలో హిందువులపలుకుబడి, హిందూమతదృక్పథాన్ని గుర్తుకుతెచ్చేలక్షణాలూ ఎక్కువగావున్నాయి. అందువల్ల ముస్లింహృదయాల్లో గుంజాటన యేర్పడింది. కొందరు జాతీయవాదాన్ని అంగీకరించి, దాన్ని తమదృక్పథానికిమరల్చనెంచారు. అనేకు లెటూతేల్చుకోలేక, దానిపట్ల సానుభూతిచూపుతూనే, ఎడంగా వున్నారు. కాని, ఇంకా అనేకమందికి ఇక్బాల్కవిత, మతతత్వాల్లోని దృక్పథం నచ్చి, ప్రత్యేకజాతిధోరణికి మరలసాగారు.

ఈ పరిస్థితులనుంచి, ఈ చారిత్రకాధారాలనుంచే ఇటీవలి సంవత్సరాల్లో భారతదేశాన్ని విభజించాలనేవాదన ఉద్భవించిందని నా నమ్మకం. అనేకకారణాలు, వాటినిబలపరచేహేతువులు, ఇరుపక్షాల్లోని అనేకతప్పులు, పొరపాట్లు,–ముఖ్యంగా బ్రిటిష్వారి 'విభజించిపాలించే రాజనీతి' దీనికి దోహదమయ్యాయి. కాని ఈ అన్నింటివెనుక పైన చెప్పిన మనస్తత్వమే వుంది. ఈ మనస్తత్వం కొన్నిచారిత్రకకారణాల వల్ల, ముస్లింలలో మధ్యతరగతి చాలా ఆలస్యంగా ఉద్భవించడంవల్ల ఏర్పడినదే. ఇండియాలో విదేశీపాలనకువ్యతిరేకంగా జరుగుతున్న జాతీయవాదసంఘర్షణేగాక, మధ్యయుగాలసాంప్రదాయావశేషాలకూ, ఆధునికధోరణులకూమధ్య అంతస్సంఘర్షణకూడా జరుగుతోంది. ఈ

సంఘర్షణ జాతిమొత్తంలోను, హిందూ, ముస్లిం మొదలైన ప్రధాన తెగల్లో ప్రతిదానిలోను జరుగుతున్నది. జాతీయకాంగ్రెసు ప్రాతినిధ్యం వహించిన జాతీయోద్యమం ఈ ఆధునికధోరణులు, వ్యవస్థల వైపు జరుగుతున్న చారిత్రకపరిణామాలప్రభావాన్ని ప్రతిబింబిస్తోందనేదినిస్సందేహం. ఈ వుద్యమం వీటిలో కొన్నింటిని పాతపునాదులకనుగుణంగా మలచేందుకు ప్రయత్నించినా, పైవిషయంలో సందేహంలేదు. ఈగుణాలవల్లనే తమలోతమకు గాఢభేదాలుగల వివిధరకాలవ్యక్తులుకూడ యీ వుద్యమంలో చేరగలిగారు. హిందువులకుసంబంధించినంతలో స్వీయాధిక్యత,పాషాణతుల్యమైనసాంఘికవ్యవస్థలు, అభివృద్ధికి అడ్డంకులయ్యాయి. పైగా ఇతరవర్గాలను భయభ్రాంతుల్నిచేశాయి. కాని యీ సాంఘిక వ్యవస్థలోని పాషాణతత్వం హరించిపోతూ, సాంఘికంగా రాజకీయంగా అభివృద్ధిపథంలో ముందుకుపోయే జాతీయోద్యమాన్ని అడ్డగించేశక్తి లేకుండాపోయింది. ముస్లింలకు సంబంధించినంతవరకు, ఫ్యూడల్ మనస్తత్వంగలవారే యింకా శక్తివంతులైవుండి ప్రజాసామాన్యంపై తమ ఆధ్వర్యాన్ని నిలబెట్టుకోగలుగుతున్నారు. హిందువుల్లో, ముస్లింలలో మధ్యతరగతుల అభివృద్ధిలో ఒకతరంకాలం తేడా వుంది. ఈ తేడా రాజకీయ, ఆర్థిక,తదితరరంగాలన్నింట ద్యోతకమౌతూనేవుంది. ఈవెనుకబడివుండడమనేదే ముస్లింలలో భయాందోళిత మనస్తత్వాన్ని సృష్టించింది.

పాకిస్తాన్ – ఇండియాను విభజించాలనేప్రతిపాదన – కొంతమంది భావావేశులకెంతో ఆకర్షణీయంగా వుండవచ్చునుగాక. కాని, యీ "వెనుకబాటు"ను పరిష్కరించేమార్గంమాత్రం కాజాలదు. పైగా యిది ప్రతీపశక్తులపిడికిలిని మరికొంతకాలం బిగింపచేసి ముస్లింల ఆర్థికపురోభివృద్ధిని మరింత ఆలస్యంచేసేందుకే వుపయోగపడవచ్చు. ఇక్బాల్ పాకిస్తాన్ కావాలని వాదించినప్రముఖు[illegible] అయినా, ఆ వాదనలో అంతర్గతంగావున్న అపాయాన్నీ [illegible]న్నీ ఆయన గుర్తించినట్లే కన్పిస్తుంది. ఎడ్వర్డ్ థాంప[illegible] ముస్లింలీగుమహాసభకు అధ్యక్షతవహించినందువ[illegible]ను పాకిస్తాన్‌ను కోరుతున్నట్లుచెప్పాడు. [illegible] ముఖ్యంగా ముస్లిములకే [illegible]ని కూడా

చెప్పాడు." అని వ్రాశాడు. బహుశా ఇక్బాల్ తన దృక్పథాన్ని మార్చుకొనివుంటాడు. లేదా అంతకుపూర్వం ఆ నినాదాని కింత అర్థం లేదు గనుక, దాన్ని గురించి బాగా ఆలోచించియుండకపోవచ్చు. జీవితంపై ఆతని పరిపూర్ణదృక్పథం భారతవిభజన అనే భావానికి యిమిడేదిగా లేదు.

ఇక్బాల్ తన అంతిమసంవత్సరాల్లో ఎక్కువగా సామ్యవాదం వైపు మొగ్గాడు. సోవియట్ రష్యా సాధించిన అభ్యుదయం ఆయన్నాకర్షించింది. అతనికవిత్వంకూడా మారింది. ఆయన మరణించడానికి కొద్ది నెలలక్రితం, రోగగ్రస్తుడై మంచంపట్టియున్నప్పుడు నాకోసం కబురు పంపితే సంతోషంగా వెళ్ళాను. ఆయనతో అనేకవిషయాలు మాట్లాడుతూంటే మాకు కొన్ని అభిప్రాయబేధాలు వున్నప్పటికీ, ఎన్నో ఏకీభావాలుకూడా వున్నాయనీ, ఆయనతో కలసిపనిచేయడం ఎంతో సులభమనీ అనిపించింది. ఆయన పూర్వజీవితస్మృతులను తడుముతూ, ఒక విషయాన్నుంచి మరో విషయానికి సంభాషణను మార్చుతూ అనేకం చెప్పాడు. నేను మాట్లాడింది తక్కువ, విన్నది ఎక్కువాను. నేనాయన్నూ, ఆయనకవితనూ మెచ్చుకునేవాణ్ణి. ఆయనకు నేను నచ్చాననీ, నాపై ఆయనకు సదభిప్రాయంవున్నదనీ విని ఎంతో సంతోషించాను. నేనాయనవద్ద శెలవుతీసుకునేముందు "జిన్నాకూ నీకూ సామ్యమేముంది? ఆయన రాజకీయవేత్త, నీవు దేశభక్తుడవు" అన్నాడాయన. అయినా నాకూ జిన్నాకూ చాలా సామ్యాలున్నాయనే అనుకుంటున్నాను. నేను దేశభక్తుడననేదానికి ఈకాలంలో యిదొక విశిష్టలక్షణం కాదనే, కనీసం, ఆ పదానికిగల పరిమితమైనఅర్థంలో - భావిస్తున్నాను. భారత దేశంపట్ల నాకు ప్రాణప్రదమైనభక్తి వున్నా, మనసమస్యల నర్థం చేసుకుని పరిష్కరించడానికి యీజాతీయమమతకంటె మించిన దేదో వుండాలని నేను చాలా [illegible] భావిస్తున్నాను. మొత్తంప్రపంచాన్నే అర్థంచేసుకుని, దానిస[illegible]రించాలంటే ఇంకెంతటి గొప్ప లక్షణాలుండాలి! రా[illegible] బంధించి, తమ చెప్పుచేతల్లో వుంచుకుంటున్నా, నే[illegible]య వేత్తను కాదని ఇక్బాల్ కవి వెలిబు[illegible]కాడు.

## ౧౨ భారీపరిశ్రమల ప్రారంభం - తిలక్, గోఖలే - ప్రత్యేక నియోజకవర్గాలు

హిందూ - ముస్లింసమస్యలకు, భారతవిభజనకు, పాకిస్తాన్‌కు వెనుకగల చారిత్రకాధారాలను పరిశీలించాలనే కుతూహలంతో ఒక అర్ధశతాబ్దిముందుకు వెంతాను. ఈకాలంలో అనేకమార్పులొచ్చాయి. ప్రభుత్వయంత్రాంగరూపంలోకంటె ప్రజలమనస్తత్వంలోనే ఎక్కువ మార్పులు వచ్చాయి. కొన్ని చిన్నచిన్న రాజ్యాంగసంస్కరణలుచేసి, వాటిని గోరంతలుకొండంతలుజేసి ప్రగల్భంగా ప్రచారంచేసుకున్నారే గాని, బ్రిటిష్‌పాలనలోని కరుడుగట్టినఅధికారతత్వంలోమాత్రం మార్పు రాలేదు. ఆ పరిణామాలు పేదరికాన్ని, నిరుద్యోగసమస్యల్ని తాకనే లేదు. 1911 లో, ఇప్పుడు జమ్‌షెడ్‌పూర్ అనబడుచున్నచోట జంషెడ్‌జీ తాతా ఇనుము, ఉక్కుయంత్రాగారానికి పునాదులు వేయడంతో ఇండియాలో భారీపరిశ్రమలకు ప్రారంభోత్సవంచేశాడు. దీనిని, యితర భారీపరిశ్రమలు ప్రారంభించేప్రయత్నాలను ప్రభుత్వం నిరసనదృష్టితోచూడడమేగాక, అనేకఆటంకాలు కల్పించింది. ముఖ్యంగా అమెరికన్‌నిపుణులసాయంవల్లనే ఉక్కుయంత్రాగారం ఆరంభింపబడింది. అది అనేకబాలారిష్టాలకు లోనయింది. కాని 1914-18ల మధ్య జరిగిన యుద్ధం ఈ పరిశ్రమ కెంతో సాయపడింది. అది మళ్ళీ కష్టాలలోపడి ఆంగ్లేయవాటాదార్ల చేతుల్లోకిపోయే ప్రమాదం యేర్పడగా జాతీయ వాదంవత్తిడి దాన్ని రక్షించింది.

ఇండియాలో పారిశ్రామికకార్మికవర్గం పెంపొందసాగింది. కాని ఒకవ్యవస్థగాసంఘటితంకానందున, నిస్సహాయస్థితిలో వుంది. ఈకూలీలు ఆర్థికంగా మరీశోచనీయస్థితిలోవున్న రైతువర్గాలనుంచే వచ్చినందువల్ల, కూలి, ప్రతిఫలం, సౌకర్యాలు సక్రమంగా పెంపొందలేదు. నైపుణ్యం అవసరంలేని సాధారణకార్మికులు లక్షలాది నిరుద్యోగుల్లోనుంచి లభిస్తున్నందున ఏ సమ్మె జయప్రదమయ్యేఅవకాశం లేదు. షుమారు 1920 ప్రాంతాల్లో మొట్టమొదటి ట్రేడ్‌యూనియ[illegible]గ్రెస్ (కార్మికసంస్థల కూటమి) నెలకొల్పబడింది. ఈ కార్మికవ[illegible]ఖ్యాబలం భారత రాజకీయరంగాన్ని మార్చగలంతగా లేదు. భూముల్లో పనిచేసేరైతులు,

కూలీలనేసముద్రంలో ఈకార్మికవర్గం ఒక బొక్కెనసీళ్ళలాంటిది. 1920 తరువాతిసంవత్సరాల్లో పారిశ్రామికకార్మికవాణి బైటివారికి వినిపించ సాగినా, అది అతి నీరసంగా వుండేది. రష్యన్‌విప్లవం ఈ పారిశ్రామిక కార్మికులప్రాముఖ్యతను ప్రజలుగుర్తించేటట్లు చేసింది. కొన్నిసుసంఘటితసమ్మెలు కూడా ప్రజలదృష్టి నాకర్షించాయి.

దేశంలో ప్రతిప్రాంతానవున్న రైతుసమస్య భారతదేశంలో అత్యంత ప్రముఖసమస్యే అయినప్పటికీ, అతడు నోరుమెదపకుండాఉన్నందువల్ల, ప్రభుత్వమూ, రాజకీయనాయకులూ కూడా అతన్నివిస్మరించారు. రాజకీయోద్యమప్రథమదశలు మధ్యతరగతుల్లో పైవర్గాల (ముఖ్యంగా అధికారయంత్రంలో స్థానంకొరకు, స్వతంత్రవృత్తులకోసం ఎదురుచూస్తున్నవారి) ఆదర్శావేశాలతో నడుపబడ్డాయి. 1885లో స్థాపించబడ్డ జాతీయకాంగ్రెస్ బాల్యాన్ని గడచి, యుక్తవయసులో ప్రవేశించేసరికి, ఒక కొత్తతరహా నాయకత్వం యేర్పడింది. మరింత తీవ్రత, నిర్భయత్వంగల యీ నాయకత్వం మధ్యతరగతుల్లో దిగువస్థాయికి చెందిన అసంఖ్యాకులకు, విద్యార్థులకు, యువకులకు ప్రాతినిధ్యం వహించింది. బెంగాలువిభజనకు వ్యతిరేకంగా జరిగిన తీవ్రాందోళన బెంగాల్లో యిట్టి తీవ్రదృక్పథాలుగల సమర్థులైన నాయకులను సృష్టించింది. కాని, యీ కొత్తయుగానికి ప్రతినిధి మహారాష్ట్రుడైన బాల గంగాధర తిలక్. పాతనాయకత్వానికి ప్రతినిధికూడా. అత్యంతసమర్థుడు, అంతకంటె యువకుడు అయిన మరొక మహారాష్ట్రుడు గోపాలకృష్ణ గోఖలే. విప్లవనినాదాలు ఆకాశాన్నంటాయి. ఆవేశాలు ఉవ్వెత్తున లేచాయి. సంఘర్షణ తప్పనిసరిఅయింది. దీన్నితప్పించేందుకు దేశపితగా ఎంచబడి, గౌరవింపబడుతున్నవృద్ధకాంగ్రెసునాయకుడు దాదాభాయినౌరోజీని — విశ్రాంతినుండి, బయటికి తీసుకువచ్చారు. ఆ తెరపి ఎన్నాళ్ళో లేదు. 1907లో సంఘర్షణ జరగనేజరిగింది. తత్ఫలితంగా వృద్ధమితవాదవర్గాలకే విజయం లభించింది. కాని, యీ విజయం — సంస్థపై వారికిగల పలుకుబడివల్ల, కాంగ్రెస్‌లో నాటి పరిమిత ఓటింగు హక్కులవల్ల మాత్ర[illegible]ధించబడింది. రాజకీయాభిప్రాయాలు బలంగాలగ భా[illegible]తీయ[illegible]గా తిలక్ దృక్పథాన్నే బలపరిచారనేందుకు సందేహం లేదు. కాంగ్రెసు చాలవరకు తన ప్రాముఖ్యతను కోల్పో

యింది. ప్రజలదృష్టి యితర కార్యక్రమాలవైపు మళ్ళింది. బెంగాల్లో టెర్రరిస్టుఉద్యమం తలెత్తింది. రష్యన్, ఐరిష్ విప్లవాలఉదాహరణలు అనుసరించబడ్డాయి.

ఈ విప్లవాత్మకభావాలతో ముస్లింయువకులుకూడ సంచలితులైనారు. ఈధోరణిని అరికట్టేందుకు అలిఘర్ కళాశాల ప్రయత్నించింది. బ్రిటిష్ప్రభుత్వప్రోద్బలంతో, ఆగాఖాన్ "ముస్లింలీగు"ను నెలకొల్పి ముస్లింల కొరకు ప్రత్యేక రాజకీయవేదిక నేర్పరచి, కాంగ్రెసుకుదూరంగా వుంచేందుకు ప్రయత్నించాడు. అంతకంటె ముఖ్యమైనదీ, భావిభారత పరిణామాల్లో అతిప్రాముఖ్యతవహించినదీ ఏమిటంటే, ముస్లింలకు ప్రత్యేకనియోజకవర్గాలు యేర్పరచడం. అప్పటినుంచి ముస్లింలు తమ ప్రత్యేకనియోజకవర్గాలలోనే పోటీచేసి ఎన్నికకావలసివుంది. వారి చుట్టూ మిగతదేశంతోసంబంధంలేకుండా విడదీసే రాజకీయవలయం నిర్మింపబడింది. భారతీయులందరిని సమ్మిళితంచేసి, ఐక్యపరచేందుకు అనేకశతాబ్దాలుగా జరుగుతున్న - శాస్త్రీయాభ్యుదయంవల్ల మరింత వేగంగా వస్తున్న పరిణామాలను తలక్రిందులుచేసేందుకు కూడా యీ చర్య వుపయోగపడింది. ఈ రాజకీయవలయం ఆదిలో చాలా పలుచగా వుండేది. కాని ప్రత్యేకనియోజకవర్గాలసంఖ్య పెరిగినకొద్దీ క్రమంగా శరీరాన్నంతటినీ చెరిచే రాచపుండులాగా - ప్రజలసాంఘిక జీవననిర్మాణాన్నే కలుషితంచేసింది. అది పురపాలకసంఘం మొదలైన స్థానికసంస్థలపరిపాలనలను విషపూరితంచేసి, క్రమంగా అసంబద్ధమైన విభేదాలకు దారితీసింది. తర్వాత చాలాకాలానికి ముస్లింకార్మిక, విద్యార్థి, వ్యాపారసంఘాలు ప్రత్యేకంగా అవతరించాయి. ఈ అన్ని రంగాల్లోను ముస్లిము లెంతో వెనుకబడియున్నందున, ఈ సంస్థలు అట్టడుగునుంచి పెంపొందినవిగాక, పైనుంచి కృత్రిమంగా యేర్పరుపబడి, పాత భూసామ్యమనస్తత్వంగలవ్యక్తులఆధ్వర్యాన నడుపబడేవి. ఆవిధంగా ముస్లింప్రజాసామాన్యము, మధ్యతరగతులవారు భారత దేశాన్నంతటినీ ప్రభావితంచేస్తున్న పురోగమనప్రవాహాలకు దూరం చేయబడ్డారు. బ్రిటిష్ప్రభుత్వం సృష్టించి, పోషిస్తున్నస్వార్థశక్తు లనేకం వున్నాయి. ఈ ప్రత్యేకనియోజకవర్గాలవల్ల మరొక బలమైన స్వార్థ ప్రయోజకవర్గం సృష్టింపబడింది.

ఇది రాజకీయవిజ్ఞానాభివృద్ధితో అంతర్ధానంకాగల, తాత్కాలిక దుర్లక్షణం కాదు. ఇది అధికారులకనుసన్నలలో పెంచబడుతూ, పెరుగుతూ దేశంముందుగల రాజకీయ, ఆర్థిక, సాంఘికసమస్యలను మరుగు పరుస్తూ వ్యాపించింది. ఇదివర కెలాంటి భేదాలూ లేనిచోట్ల, ఇది విభేదాలను, వైరభావాలను సృష్టించింది. వాస్తవానికి యీ విధానం చేపట్టినవారు, ఆత్మవిశ్వాసంతో ఆలోచించడంమీదగాక, కృత్రిమాధారాలమీద నిలబడేందుకు ప్రయత్నించేటట్లుచేసినందున, వారినే బలహీనపరచింది.

విద్యలోను, ఆర్థికంగాను వెనుకబడియున్నవారిని, అల్పసంఖ్యాకులను బాగుపరచాలంటే ఈ లోటులను తప్పించేందుకు వారికి సర్వవిధాల, ముఖ్యంగా అభ్యుదయవిద్యావిధానంతో సహాయపడడ మొక్కటే మార్గం. ఈ ముస్లిములకుగాని, ఇతరఅల్పసంఖ్యాకవర్గాలకుగాని వెనుకబడియున్న దళితజాతులకుగాని ఇటువంటిసహాయమేమీ జరగలేదు. వీరికిజరిగినమేలంతా చిన్నచిన్న ఉద్యోగాలివ్వడమే. సామర్థ్య ప్రమాణాలు పెంచవలసినది పోయి, సామర్థ్యాన్ని త్రోసిరాజనడం మాత్రమే జరిగింది.

ఆవిధంగా ప్రత్యేకనియోజకవర్గాలు ఆయా వెనుకబడ్డ బలహీన వర్గాలనే మరింత బలహీనపరచి, మరింతవెనుకబడేటట్లు చేశాయి. విభేదాలను పెంపొందించాయి. జాతీయైక్యతను నిరోధించాయి. ప్రజాస్వామ్యసూత్రాలకువ్యతిరేకగుణంగలవైఅభివృద్ధినిరోధకతత్వంగల స్వార్థపరులవర్గాన్ని సృష్టించాయి. భారతీయులందరికీచెందిన ఆర్థికసమస్యల నుంచి వారిదృష్టిని పెడత్రోవలకు మళ్ళించాయి. ఆదిలో ముస్లిములకు మాత్రమే ప్రత్యేకనియోజకవర్గాలు ఏర్పరచినప్పటికి, క్రమంగా అన్ని రకాల అల్పసంఖ్యాకులకు కేటాయింపులుజరిగినందున, భారతదేశం అనేకగదులసాలిగూడుగా విభజింపబడింది. బహుశా అవి, కొంతకాలం కొంతమేలును కలిగించివుండవచ్చును. కాని, నా కలాంటిసూచనలేమీ కనిపించడంలేదు. అయినా భారతీయజీవితంలో ప్రతిశాఖకూ అవి చేసిన కీడుకుమాత్రం అంతులేదు. వాటినుంచే "ప్రత్యేకత" అనే ధోరణులు పెంపొంది క్రమంగా భారతదేశం విభజించబడాలనే వాదం జనించింది.

ఈ ప్రత్యేకనియోజకవర్గాలను ఏర్పాటుచేసినప్పుడు బ్రిటిష్ ప్రభుత్వఇండియాకార్యదర్శిగా లార్డ్ మోర్లే వుండేవాడు. ఆయన వాటిని వ్యతిరేకించినా, చివరికి వైస్రాయివత్తిడికి లొంగిపోయాడు. ఆయన తనడైరీలో ఈవిధానంలోగల అపాయాన్ని, ప్రజలు ఎన్నుకోగలసంస్థలపురోగమనాన్ని అరికట్టేలక్షణాన్ని స్పష్టంగా వివరించాడు. బహుశా వైస్రాయి, అతని అనుచరులూ ఇటువంటి పరిణామాన్నే ఆశించివుంటారు. భారతరాజ్యాంగసంస్కరణలమీద "మాంటేగు, ఛెమ్స్‌ఫర్డ్‌లనివేదిక" (1918) లో కూడ యీ మత నియోజకవర్గాల వల్లగల అపాయాలు మరొకసారి వక్కాణించబడ్డాయి. "మతాలు, కులాలప్రాతిపదికపై విభజించడమంటే ఒకదానికొకటి విరోధంగావుండే రాజకీయముఠాలను సృష్టించడమన్నమాట. ఈ విధానం మానవులను ముఠావ్యక్తులుగావుండమని నేర్పుతుందేగాని, పౌరులనుచెయ్యదు... కాబట్టి, ఏరకపుప్రత్యేకనియోజకవర్గాలైనా స్వపరిపాలనాఆశయవ్యాప్తికి నిరోధకములే కాగలవని మేము భావిస్తున్నాము".

# చివరిదశ (2)

## జాతీయత — సామ్రాజ్యతత్వం

### మధ్యతరగతిప్రజలనిస్సహాయత - గాంధిప్రవేశం

ప్రథమప్రపంచయుద్ధం ప్రారంభమైంది. రాజకీయములు చాలా అధ్వాన్నపుస్థితిలో ఉన్నవి. కాంగ్రెసు అతివాదులు, మితవాదులనబడే వారిమధ్యఉండే భేదాలవల్ల రెండుగా చీలిపోయింది. ఇందుకు యుద్ధ కాలపునిబంధనలు, అదుపాజ్ఞలు కారణం. ఏమైనా ఒక్కవిషయం గోచరమవుతుంది. మధ్యతరగతిముసల్మానుల జాతీయభావములు హెచ్చి, కాంగ్రెసువైపుకు ముస్లింలీగును మరలిస్తూవచ్చారు. కొందరు కాంగ్రెసుతో చేతులుకూడా కలిపేరు.

యుద్ధకాలంలో పరిశ్రమలు బాగా అభివృద్ధిచెంది, విపరీతమైన లాభాలు సంపాదించాయి. బెంగాలుజనపనారమిల్లులలోనూ, అహమ్మదాబాద్, బొంబాయి, తదితరప్రాంతాలలోని బట్టలమిల్లులలోనూ నూటికినూరు, రెండువందలు కూడా లాభాలు వచ్చినవి. అందులో కొంతభాగం డండీ, లండనులలోనివిదేశీపెట్టుబడిదారులకుచేరింది. కొంత హిందూదేశములోనికోటీశ్వరులను కుబేరులుగా చేసింది. కాని, ఈ లాభములన్నిటికీ కారణభూతులైన కార్మికులపరిస్థితిమాత్రం యథాప్రకారంగా, చాలా అధ్వాన్నముగానే ఉండినది. అశుభ్రమైన, రోగభూయిష్టమైనపూరిగుడిసెలే వారినివాసములు. వారిగుడిసెలకు కిటికీలుగాని, పొగగొట్టములుగాని, దీపములుగాని, మంచినీటిసదుపాయములుగాని, మురుగుదొడ్లువగైరా ఆరోగ్యసౌకర్యములుగాని ఏర్పాటుకాలేదు. అనేక మహాభవనాలకు నిలయమై, బ్రిటిష్ పెట్టుబడిదారులకు ముఖ్యకేంద్రమైన కలకత్తాలోనే యిల్లాంటిస్థితిగతులుండేవి. భారతీయులపెట్టుబడి ఎక్కువగాఉన్న బొంబాయినగరంలో 15'×12' వైశాల్యంగల ఒకేఒకగదిలో, పిన్నలుపెద్దలుకలసి ముప్పయిమంది గల ఆరుకుటుంబములవారు నివసిస్తూన్నట్లు ఒకవిచారణకమిటీవారు కనుగొన్నారు.

యిందులో ముగ్గురుస్త్రీలు త్వరలోప్రసవించేస్థితిలో ఉన్నారు. ప్రతీ కుటుంబమునకు ఆ ఒక్కగదిలోనే వేర్వేరుగా ఒక్కొక్కళ్ళకొకకుంపటి కూడా ఉండేది ఈవిషయాలు కొంచెంఅరుదేగాని యిటువంటివి లేకపో లేదు. కొంతఅభివృద్ధిచెందిన ఈశతాబ్దంలో 2, 3వ దశాబ్దాల్లోని పరి స్థితులే ఇలాఉంటే అంతకుపూర్వమెలాఉండేదో వేరేచెప్పనక్కరలేదు.

నేను పారిశ్రామికులునివసించే ఈ పూరిగుడిసెలను చూచాను. అచ్చట ఊపిరిపీల్చుకోడానికైనా వీలులేక ఉక్కిరిబిక్కిరై, చాలా ఆత్రతతోనూ, ఆవేశంతోనూ బయటపడ్డాను. విపరీతమైన కోపం వచ్చింది. ఝరియాలోని ఒకబొగ్గుగనిలోనికికూడా వెళ్ళి, అచ్చట మన స్త్రీలు ఏ పరిస్థితిలో పనిచేస్తున్నారో చూచాను. మానవులు అలా కష్టించిపనిచేసే ఆదృశ్యాన్ని నేను ఎన్నటికీ మరువలేను. స్త్రీలు బొగ్గు గనులలోపల పనిచేయడం నిషేధింపబడినప్పటికి, యుద్ధకారణంగా కార్మికు లెక్కువగా కావలసియున్నారు కాబట్టి, స్త్రీలను గనులలోనికి పంపుచున్నట్లు నాకు తెలిసింది. అయినప్పటికీ లక్షలాదిప్రజలు నిరుద్యో గులై, తిండిలేక మాడిపోతున్నారు. కూలీల కెప్పుడూ లోటులేదు. కాని, కూలి చాలతక్కువఅవడంవల్లనూ, పనియొక్క స్థితిగతులు చాలా అధ్వాన్నంగా ఉండడంచేతను ఆపనికి జనం ఎక్కువచ్చేవారు కాదు.

బ్రిటిష్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌వారిచే పంపబడ్డ ప్రతినిధి వర్గం 1928సం॥లో హిందూదేశాన్ని చూచారు. "అస్సాంతేయాకుల్లోకి ప్రతిసంవత్సరం పదిలక్షలభారతీయుల చెమట, ఆకలి, నిస్పృహ ఎక్కుతున్నాయి" అని ప్రతినిధివర్గంవారు నివేదికలో పేర్కొన్నారు. 'బెంగాలుపల్లెప్రజలు ఎలుకలుకూడా అయిదువారాలపాటు జీవించ లేని ఆహారం తీసుకుంటున్నారు' అని బెంగాలురాష్ట్రప్రజారోగ్యశాఖాధి కారి 1927-28 సం॥ రిపోర్టులో వ్రాశాడు.

తుదకు మొదటి ప్రపంచయుద్ధం అయిపోయింది. అందువలన కలిగిన శాంతిభద్రతలు మనకు అభివృద్ధి కలిగించడానికి బదులు నిర్బంధ విధానాలను, పంజాబులోని మార్షల్‌లాను ప్రసాదించాయి. మన ప్రజ లలో అవమానము, ఆవేశయుతమైనక్రోధము, పట్టుదలప్రభవించినై. రాజ్యాంగవిధానంలోని సంస్కరణలనుగురించి, పరిపాలనాయంత్రం

భారతీయులపరంచేయడంగురించి చెప్పే అంతులేని కబుర్లు ఎగతాళిగా పరిణమించాయి. ఒకప్రక్క ప్రజలను పరప్రభుత్వం అణగద్రొక్కుతూ, రోజురోజూ వారిని దోచుకుంటూ, వారిపేదరికాన్ని ఎక్కువచేసి నిర్వీర్యులనుచేస్తుంటే మనకు అవమానం కాక మరేమిటి? దిక్కుదివాణం లేని జాతిగా తయారైనాము.

అయినా మనం చెయ్యగల్గినదేమిటి? దుర్మార్గాన్ని మార్పు చేయడం ఎలా? మనం ఒక మహాశక్తివంతమైన రాక్షసిపిడికిలిలో చిక్కుకున్నట్లయ్యాం. మనం నిర్వీర్యులమైనాము. అంగాలు స్వాధీనం తప్పినాయి. మేధస్సు మొద్దుబారిపోయింది. కర్షకులు నిస్సహాయులై భయభ్రాంతులైనారు. పారిశ్రామికకార్మికులగతికూడా అలాగే తయారైంది. అంధకారాన్ని తొలగించే దీపములవంటివారు. తెలివితేటలు కలిగి విషయాలను ఆకళింపుచేసుకోగలిగిన మధ్యతరగతిప్రజలుకూడా ఈ అంధకారసముద్రంలో మునిగిపోయినారు. కొన్నివిషయాల్లో వీరి స్థితి కర్షకులస్థితికంటె అధ్వాన్నంగా వున్నది. వీరిలో తెలివితేటలుగల చాలామంది వ్యవసాయపుభూమికిదూరమై, కాయకష్టంచేయలేక నేర్పరితనముతోకూడిన ఏపనీ చేతగాక, దినదినప్రవర్థమానంగాఉండే నిరుద్యోగులసంఘంలో చేరిపోయి, అశక్తులై, హతాశులై మరింత అంధకారంలో పడిపోతున్నారు. వీరిలో కొద్దిమంది అదృష్టవంతులై, న్యాయవాదులుగానో, వైద్యులుగానో, ఇంజనీర్లుగానో, గుమాస్తాలుగానో ఉన్నా, జనసామాన్యంలో మార్పేమీ కలుగదు. కర్షకుడు తిండిలేక మాడుతున్నప్పటికీ, వేలాదిసంవత్సరములనుండి తనకతీతజీవితపరిసరాలతో పోరాడుతూండడంవల్ల ఓర్పు నేర్చుకున్నాడు. దారిద్ర్యంతో తిండిలేక బాధపడుతున్నప్పటికీ, ఒక గంభీరమైనశక్తితో బలీయమైన విధికి లొంగకతప్పదన్నట్లు గుంభనగాజీవించడం నేర్చుకున్నాడు. కాని, మధ్యతరగతిప్రజలస్థితి అలా కాదు. వారి కటువంటి పూర్వానుభవం, చరిత్ర లేవు. అసంపూర్తియైన మిడిమిడిజ్ఞానంకలవారు. హతాశులు. దేనిసహాయాన్నపేక్షించాలో వారికి తెలియదు. ఏమంటే పాతగాని కొత్తగాని వారికిసహాయంచేయడంలేదు. వారుకాలానుసారంగా సామాజికవిధులకు సరిపెట్టుకోలేరు. బాధలుపడుతున్నప్పటికి, ఏదో ఒక ఉపయోగమైనపనిచేస్తున్నామనే సంతృప్తికూడా వారికి లేదు. పూర్వా

చార సాంప్రదాయములుగల కుటుంబంలో పుట్టినప్పటికీ, పూర్వ కాలపుసంస్కృతి వారికి లేనేలేదు. నూతనమైన ఆలోచనలు వారినాకర్షించినప్పటికీ, అధునాతనమైన సామాజిక వైజ్ఞానికవిశేషాల ఆంతర్యం గ్రహింపలేకుండా ఉన్నారు. కొందరు ప్రస్తుతబాధలనుండి తప్పించుకొనుటకు నిర్జీవమైనపాతపద్ధతులనే వదలకుండా గట్టిగాపట్టుకొని ప్రాకులాడుచున్నారు. కాని దానివలన వారిబాధానివృత్తికావడంలేదు. టాగూర్ చెప్పినట్లుగా, మనం పురాతనమైన పద్ధతులనుపట్టుకొని ప్రాకులాడడం వ్యర్థం నిర్జీవపద్ధతులు నిర్జీవత్వానికే దారితీస్తాయి. మరికొందరు నిరర్థకమైన వెలవెలబోతుండే పాశ్చాత్యపద్ధతులను వృథాగా అనుకరిస్తున్నారు కనుక ఈతరహా మనుష్యులు దిక్కుదివాణంలేక, శరీరానికి మనస్సుకు కాస్తంత రక్షణ ఎక్కడైనా దొరకుతుందాఅని తహతహపడుతూంటారు. అలాంటిదేమీ దొరకక భారతీయజీవనం అనే బురద నీటిమీద ఏదిక్కూతోచక నిరర్థకంగా తేలిపోతున్నారు.

మనం చెయ్యగల్గినదేమిటి? అపారమైనదారిద్ర్యంతోనూ, నిస్పృహతోనూ కృంగికృశించుచున్న మన భారతదేశాన్ని ఊబిలోనుంచి ఉద్ధరించడం ఎల్లాగ? ఒకటీ రెండూ సంవత్సరాలు కావు. కొన్ని శతాబ్దాలనుండి భారతప్రజలు ఆవేదనపడి, చెమట, కన్నీరు, రక్తమాంసములు ధారపోసి శ్రమపడ్డారు. కృష్టాలు ఈ హిందూదేశపు ప్రజలహృదయాలలోను, శరీరంమీదను కూడా నాటి, వాటిని దొలిచేశాయి. మన సమిష్టిజీవనాన్ని సర్వవిధాలా విషపూరితంచేశాయి. దేహంలో క్షయవ్యాధి ప్రవేశించి, నెమ్మదిగా ఊపిరితిత్తులకణములను నాశనంచేసి, మెల్లిమెల్లిగా చంపునట్లుగా, ఈ విషం మనసాంఘికజీవనాన్ని హతమార్చింది. ఒక్కొక్కప్పుడు నిమిషాల్లో ప్రాణంతీసే కలరా, ప్లేగులే మెరుగనిపిస్తుంది. ఇదొక తాత్కాలికఊహావికారం మాత్రమే. అలాంటి సాహసం ఎచ్చటికి దారితీస్తుందో తెలియదు. జీర్ణించినదీర్ఘవ్యాధులు నాటువైద్యులచేతుల్లో బాగుపడవు.

ఇంతలో గాంధీజీ రంగంలోకొచ్చాడు. ఆయన చక్కని పైరుగాలివిసురులా వచ్చాడు. కాస్తంత విశ్రాంతిగా కాళ్ళుచాపుకుని, ఊపిరిపీల్చుకోవటానికి సావకాశం కలిగింది. అంధకారాన్ని ఛేదించుకుంటూవచ్చిన వెలుగుబాటలా వచ్చాడు. అనేకవిషయాలను,

ముఖ్యంగా ప్రజలమనోభావాలను తలక్రిందుచేయగలిగిన సుడిగాలిలా వచ్చాడు. ఆయ నెక్కడనుంచో ఆకాశంమీాదనుంచి ఊడిపడినట్లుగా దిగలేదు. లక్షలాదిభారతీయులలోనుంచే ఉద్భవించాడు. వారితో కలసి మెలసిఉంటూ, వారిభాషే మాట్లాడుతూ, వారిదుస్థితి ఎట్టిదో వారి కెరుకపరచాడు. కార్మిక, కర్షకులకష్టంమీాద బ్రతుకుతూ, వారిపై స్వారీచేసిజీవించే మనలను ప్రక్కకుతొలగిపొమ్మన్నాడు. ఈ దారిద్ర్యానికి, దుఃఖానికి కారణభూతమైన ప్రభుత్వవిధానాన్ని మును ముందుగా వదల్చుకోమన్నాడు. రాజకీయస్వాతంత్ర్యము క్రొత్తరూపం దాల్చి, క్రొత్తరకమైనమనుష్యుల నాకర్షించింది. ఆయనచెప్పినవిష యాల్లో కొన్నిటినిమాత్రమే అంగీకరించగలిగాము. ఒకొక్కప్పుడు పూర్తిగా ఏకీభవించలేకపోయాం. కాని, ఇదంతా రెండవపక్షం. ఆయన బోధనలలోనిసారాంశము నిర్భయత్వము సత్యం. 'నిర్భయత్వం' ఏమానవునకుగాని, జాతికిగాని అమూల్యమైన ఆభరణమువంటిదని మనపురాణగ్రంథములు చెపుతున్నాయి. శారీరకధైర్యమేగాక మాన సికంగాకూడా భయంలేకుండడం చాలా అవసరం. ప్రజలను నిర్భయు లుగాజేయుట ప్రజానాయకులకర్తవ్యమని, జనకుడు, యాజ్ఞవల్క్యుడు కొన్నివేలసంవత్సరాలక్రిందటనే చెప్పేరు. కాని, హిందూదేశంలో, బ్రిటిష్‌పరిపాలనలో సర్వవ్యాప్తమైనదీ, బాధాకరమైనదీ, జనాన్ని ఉక్కిరిబిక్కిరిచేసేదీ భయమే. పోలీసులభయం; సైనికులభయం; సి. ఐ. డి. లంటే భయం; ఉద్యోగస్థులంటేభయం; జైలంటేభయం; జమీాందారీఉద్యోగులంటేభయం; అప్పిచ్చేవాడంటేభయం; నిరుద్యోగ మంటేభయం, ఆకలిభయం, ఒకటేమిటి అన్నిభయాలు గుమ్మంలోనే ఉంటాయి. ఈ భయాలన్నిటిమీాదనే గాంధీజీ ధ్వజమెత్తేడు. మెల్లగా, నిదానంగా 'భయపడకండి' అనే మంత్రోపదేశంచేశాడు. కాని అది అంతటిస్వల్పవిషయమా? కాదు. అసలు నిజంగాజరిగేప్రమాదంకన్న దానిభయమే ఎక్కువ భయంకరమైనది. అసలుసంగతిని నిదానంగా విమర్శించుకుంటే భయమే పోతుంది.

కనుక హఠాత్తుగా ప్రజలభుజస్కంధాలమీాద బరువుగాఆనిన ఈ భయం తొలగింపబడింది. పూర్తిగాకాకపోయినా, ఆశ్చర్యంకలిగే టంతహెచ్చుగా భయంతొలగించబడింది. భయానికి అసత్యానికిచాలా

దగ్గర. అందువల్లనే సత్యాచరణ నిర్భయత్వాన్ని వెంటాడిస్తుంది. భారతీయప్రజలు హఠాత్తుగా మునుపటికంటె సత్యసంధులు కాకపోవచ్చును. తెల్లవారేసరికి ఒక్కసారిగా వారిస్వభావం మారలేదు. కాని మహత్తరమైనమార్పుమాత్రం గోచరించింది. అబద్ధమాడడానికీ,రహస్యప్రవర్తనకీ తావులేకపోవడమే ఇందుకుకారణం. ఇదొక గొప్ప మానసికపరివర్తన. ఎవ్వరో మానసికతత్త్వశాస్త్రజ్ఞుడు వచ్చి, రోగియొక్క పూర్వచరిత్రను సంపూర్ణంగాశోధించి,ఆతనిరోగమునకు మూలకారణములను నిదానము చేసి, ఒక్కక్షణంలో వాటిని చేతితో తీసివేసినట్లయింది.

మనలనునిర్వీర్యులుగాజేసి, న్యూనతపరచిన విదేశీపరిపాలన నిక భరించుట సిగ్గుచేటను నిశ్చయముతో ఫలితములను లెక్కచేయక దాని నెదుర్కొనవలెననే గొప్ప మానసికోత్తేజం కల్గింది.

పూర్వముకంటె మన మేమంత గొప్ప నిజాయితీపరులం కాకపోవచ్చును. కాని గాంధీజీ మూర్తీభవించిన శుద్ధసత్యంగా ప్రత్యక్షమై నందువలన సత్యమార్గాన్నే నడిపించాడు. సత్యమంటేఏమిటి? యిదమిత్థమని నాకే తెలియదు బహుశా మనమనుకునేసత్యం సందర్భానుసారమని చెప్పాలి. శుద్ధసత్యం మనకతీతమనుకుంటాను. సత్యాన్ని గురించి అనేకమందికి అనేకఅభిప్రాయాలున్నాయి. వారివారిపుట్టుపూర్వోత్తరాలను బట్టి, శిక్షణనుబట్టి, ఉపజ్ఞనుబట్టి అనేకవిధాలుగా అభిప్రాయాలు కలుగుతాయి. అలాగే గాంధీజీకి కూడ. ప్రతివ్యక్తికి తనకేదినిజమని తోస్తుందో,ఏదినిజమని తాను తెలుసుకుంటాడో అదే నిజం. ఈనిర్వచనం ప్రకారం గాంధివలె సత్యానికంటిపెట్టుకునేమనిషి మరొకడున్నాడని తోచదు. రాజకీయవేత్తలో ఆ సత్యదీక్ష చాలా ప్రమాదకరమైన లక్షణం. తనమనస్సులోనిభావాలను చటుక్కున వెల్లడిచేయడం, ఆ భావాల్లో కలిగేమార్పులను లోకానికి కన్పించేటట్లుచెయ్యడం చాలా హానికరం.

గాంధీజీ అనేకతరహాలుగా లక్షలాదిప్రజలమీద తనప్రభావాన్ని ప్రసరింపజేశాడు. కొందరిజీవితాలు పూర్తిగా మారిపోయాయి. కొందరు కొంతవరకే మార్పుచెందేరు. కొంతమందిలో ఆమార్పు కొద్దికాలంమాత్రమే ఉంది. కాని పూర్తిగామాత్రం ఆ ప్రభావాన్ని వదలించుకోలేకపోయారు. అనేకమంది అనేకవిధాలుగా ఆయనప్రభావానికి

లోనైనారు. ఎవరిమట్టుకువారే దానిని వివరించగలరు. కొందరు ఆల్సి బియాడిన్ చెప్పినట్లు ఈ క్రిందిమాటలే చెప్పగలరు.

"ఇతరు లెంత బాగా మాట్లాడినా, మాకు పిసరంతలక్ష్యముండదు. మీరు మాట్లాడినపుడుగాని, మీ మాట మరొకరు చెప్పినపుడుగాని, అత డెంతచెడ్డగాచెప్పినా మేము ముగ్ధులమై వింటాం. నామట్టుకు నేను చెప్పాలసొస్తే, ఆయనమాటలప్రభావం నన్ను తన్మయుడిని చేసింది. ఇప్పటికీ చేస్తోందని ప్రమాణంచేసి చెప్తాను. ఏమంటే ఆయన మాటలు నా చెవులలోపడిన తక్షణమే నాకొక పవిత్రమైన ఆవేశం వస్తుంది. నా హృదయం ఉప్పొంగుతుంది. కంట నీరు చేరుకుంటుంది. ఈ అనుభూతి నాకొక్కడికే కల్గుటలేదు. అనేకమందికి కలుగుతోంది.

'నేను పెరికిల్సువద్దరా గొప్ప వక్తలననేకమందిని విన్నాను. కాని,ఈరీతిగా నేనెప్పుడూ అనుభూతిపొందలేదు. నా ఆత్మను తలక్రిందు చేయలేకపోయినారు. నేనెంతో చిన్నవాడిననేభావాన్ని కలిగించలేక పోయారు. కాని ఈ మార్స్యాస్‌మాత్ర మికముందీవిధంగా జీవించడం అసంభవం అనేటట్లు నామనస్సును కదలించి వదిలేసినాడు...

'ఇతరులెవ్వరూ నాకు కలిగించలేనిఅవస్థ ఒకటున్నది. ఆ అవస్థ నాకు కలుగుతుందని ఊహించలేరు. అదే సిగ్గు. ఈ ప్రపంచంలో నన్ను సిగ్గుతో తలవంచుకొనేటట్లుచేసిన దొక్క సోక్రటీస్‌మాత్రమే. ఆయన నన్నేపనిచేయమంటే ఆపనిచేయాలని నాకు తెలుసును. ఏమంటే మరో లాగ చేయలేను కనుక. ఆయనదృష్టిపథంలోనుంచి తప్పుకున్నాక అందరితోపాటే ఏంచేసినా నే నంతలక్ష్యపెట్టను. కనుక బంధంలోనుంచి తప్పుకున్న బానిసలాగున పారిపోతాను. వీలైనంతవరకు ఆయనకంటపడకుండా ఉంటాను. కాని మరల ఆయనకలుసుకున్నప్పుడు జరిగినదంతా ఉన్నదున్నట్లు చెప్పకమానను. అప్పుడే సహజంగా నేను సిగ్గుపడవలసొస్తోంది...

'పాముకంటె విషపూరితమైన దేదో నన్ను కాటేసింది. అదిచాలా బాధాకరమైనకాటు. అది నన్ను హృదయంమీదనో,మనస్సుమీదనో కాటేసింది...'

## ౨ గాంధీజీనాయకత్వాన కాంగ్రెసుబలిష్టమైనసంస్థగా మార్పుచెందుట

గాంధీజీ ప్రప్రథమంగా కాంగ్రెసులో ప్రవేశించి, వెంటనే, దాని నిర్మాణములో పరిపూర్ణమైనమార్పులు తీసికొనివచ్చాడు. ప్రజాస్వామికపద్ధతిని దాని నొక జనసామాన్యమున కందుబాటులోనుండు సంస్థగాచేశాడు. పూర్వం కూడా కొంతవరకు ప్రజాస్వామికంగానే ఉన్నప్పటికీ, దాని ప్రాథమికసభ్యత్వం కొద్దిమంది ధనికులైన విద్యార్థికులకుమాత్రమే పరిమితమైఉండేది. ఇప్పుడు సామాన్యరైతులు అందులో ప్రవేశించగానే, అనంతమైన వ్యవసాయకులసంస్థగా మారింది. మధ్యతరగతిప్రజలు కూడా సకృతులుగా దానిని బలపరిచేరు. ప్రధానంగా అది రైతులసంస్థగానే పెరిగింది. ప్రారిశ్రామికకూలీలు వారిసంఘాలద్వారాకాకపోయినా వ్యక్తిగతంగానే కాంగ్రెసులో ప్రవేశించారు.

అహింసాత్మకమైనపద్ధతులపైన, చురుకుగా కార్యక్రమాలను నడిపించడమే కాంగ్రెసులక్ష్యం. అంతకుపూర్వం వాదోపవాదాలు జరిపించడం, తీర్మానాలను ఆమోదిస్తూఉండడం, లేకపోతే హింసాత్మకమైనపద్ధతుల నవలంబించడంమాత్రమే జరుగుతూండేది. హింసావిధానము కాంగ్రెసు మూలసూత్రాలకే విరుద్ధమని త్రోసిపుచ్చబడినది. శుష్కతీర్మానములపద్ధతి కూడా త్రోసిపుచ్చబడింది. శాంతియుతమైన నూతనకార్యవిధానమొకటి రూపొందించబడింది. విధానము అహింసాత్మకమేగాని, అక్రమమునకు అన్యాయానికి తలొగ్గక దానిని ధిక్కరించి అందువలనకలిగే కష్టనష్టాలను బాధలను సంతోషంతో భరించాలని సిద్ధాంతము. గాంధీజీ చిత్రమైన శాంతివాది. ఆయనలో అనంతమైన జీవశక్తి ఉంది. ఆయన కేదైనా చెడుగాతోస్తే ప్రారబ్ధకర్మమని దానికాయన తలొగ్గడు. శాంతియుతంగా, మర్యాదగా దాని నాయన పూర్ణమైనశక్తితో ప్రతిఘటిస్తాడు. ఆయనసంకల్పించిన కార్యవిధానం ద్వివిధం. ఒకవైపున విదేశీయులపరిపాలనను ప్రతిఘటించడం, మరోవైపున మనసంఘంలోనిదురాచారాల నెదుర్కొనేకార్యక్రమం. కాంగ్రెసుయొక్క ముఖ్యోద్దేశం, భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని అహింసాత్మకమైనపద్ధతులపై సంపాదించడం. కాని అస్పృశ్యతానివారణ,

జాతీయైక్యత, అల్పసంఖ్యాకులసమస్యలపరిష్కారం మొదలైనహంశాలు కాంగ్రెసుకార్యక్రమాలలో ముఖ్యాంశాలుగా ఉండేవి.

భారతదేశంలో బ్రిటిష్‌సామ్రాజ్యానికి పెట్టనికోటలు భయం, అధికార అహంకారం, గౌరవం, యిష్టమున్నా లేకపోయినా ప్రజా సహకారం, స్వలాభాపేక్షాపరులైన సామ్రాజ్యవేత్తలకండగా ఉండే కొన్నివర్గాలవారు. కనుకనే గాంధీజీ ఈ కోటలను బ్రద్దలకొట్టేడు. బ్రిటిష్‌వారొసంగిన బిరుదులను విసర్జించడం మొదటికార్యక్రమం. బిరు దాంకితులు కొద్దిమందిమాత్రమే అందుకంగీకరించినప్పటికీ, బ్రిటిష్ దత్తమైన బిరుదులకు జనులలో గౌరవం తగ్గిపోయింది. అవి దౌర్భాగ్య చిహ్నాలుగా పరిగణింపబడినాయి. కొత్తఅంతస్థులు, విలువలు ఏర్ప డ్డాయి. రాజప్రతినిధిదర్బారులన్నా, మహారాజులదర్బారులన్నా పూర్వముండే డాబు దర్పాలమీద అకస్మాత్తుగా ప్రజలలో మోజు తగ్గిపోయింది. చుట్టూఉన్న ప్రజలలో దారిద్ర్యదేవత తాండవిస్తూంటే ఈ దర్పప్రదర్శనల్లో పాల్గొనడం సిగ్గుచేటనుకునేస్థితికొచ్చింది. ధనికులు వారి ధనదర్పాన్ని ప్రదర్శించడానికి ఆత్రతపడుటలేదు. పైకిమాత్రమే అయినప్పటికీ, చాలామంది ధనికులు నిరాడంబరంగానే కనుబడుతూ వచ్చారు. వేషభాషల్లోకూడ సామాన్యంగానే ఉంటూవచ్చారు. వేషాన్నిబట్టి వారు ధనికులని పోల్చడానికి వీలులేకుండాపోయింది.

కాంగ్రెసులోని పాతనాయకులు కొత్తతనిదానమైన ఒడుదుడు కులులేని సాంప్రదాయాల్లో పెరిగినవారవడంచేత వారు అంతసులువుగా అలవాటుపడలేకపోయారు. జనసామాన్యంలోని ఈ పొంగువలన వారు అలజడిచెందారు. కాని దేశంలో ఈ పొంగు ఎంతో ఉధృతంగారావడం వల్ల వారిలో కొందరు ఆ ప్రవాహంలో పడిపోయారు. ఆ మైకం వారిలో చాలామందికికమ్మేసింది. ఆ ఉధృతానికి చలించనివారు అరుదు అలాంటి వారిలో చలించనివాడు మహమ్మదాలీ జిన్నా ఒకడు. హిందూమహమ్మ దీయసమస్యమీద అభిప్రాయభేదాలవల్ల ఆయన కాంగ్రెసును వదల లేదు. అభ్యుదయకరమైన కొత్తఆదర్శాల కనుగుణ్యంగా ఆయన తన జీవితాన్ని సరిపెట్టుకోలేకపోయాడు అంతకన్నకూడా, ఆషామాషీగా దుస్తులను ధరించి హిందూస్తానీభాషలో మాట్లాడుతుండే సామాన్య జనం కాంగ్రెసులో అసంఖ్యాకంగాచేరిపోతుండడం ఆయన సహించలేక

పోయాడు. ఆయనకుండే ఉన్నతాభిప్రాయాలు వేరు. శాసనసభలకు, చిన్నచిన్న సంఘసమావేశాలకుమాత్రమే అవి పరిమితమైనాయి. కొన్ని సంవత్సరాలపాటు రాజకీయరంగంలో ఆయన కడుగుపడనేలేదు. హిందూదేశాన్ని శాశ్వతంగా వదలిపెట్టి వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. ఇంగ్లండుకు మకాం మార్చి, చాలాకాలం అక్కడే ఉండి పోయాడు.

ప్రశాంతంగాజీవించడమే ప్రధానమైన భారతీయసాంప్రదాయమని చెప్పబడేమాటనిజమనే నాకూతోస్తుంది. పూర్వకాలంలో పెద్దలు జీవితంయడల అదేధోరణి నవలంబించారనుకుంటాను. సుదీర్ఘమైన వేదాంతసాంప్రదాయం కూడా ఆమార్గాన్నే సూచిస్తుంది. అయినప్పటికి భారతదేశానికి అసలైనప్రతినిధిగా బయలుదేరిన గాంధీజీ ఈప్రశాంత తత్వానికిసుద్ధవ్యతిరేకంగా వ్యవహరించాడు. శక్తిలో, చైతన్యంలో, ఆచరణలో ఆయనొక బ్రహ్మరాక్షసిలాప్రవర్తించాడు. తాను ఉద్వేగంతో ముందుకు వరుగెత్తడమేకాకుండా ఇతరులనుకూడా ముందుకుతరిమేడు. భారతప్రజలజడత్వాన్ని పోగొట్టడానికింతగాపోరాడినవాడు మరొకడు నాకు కనుబడడు. నూతనమైన కార్యక్రమాలనిచ్చి, మహత్తరమైన సందేశాలతో ఆవేశపరచి మమ్ముల్ని పల్లెటూళ్ళకు పంపించాడు. సామాన్యరైతులలో స్తబ్ధతపోయిచైతన్యమేర్పడింది. రైతు తనగూటిలో నుంచి బయటకొచ్చాడు. ఇందువల్ల మాకుకలిగినఅనుభూతి మరొకటి. అది మరీగొప్పది. ఆకలిబాధతో అలమటిస్తూ, పూరిగుడిసెలలో నికృష్టంగానివసించే బీదప్రజల నిజపరిస్థితులను మొట్టమొదటిసారి సన్నిహితంగా తెలుసుకున్నాం. ఈ సంచారాలవల్ల ఆర్థికశాస్త్రగ్రంథాల్లో చదివినవాటికన్నా, పండితులఉపన్యాసాలవల్లకన్నా ఎక్కువగా మన దేశపు ఆర్థికశాస్త్రాన్ని స్వయంగా నేర్చుకున్నాం. మాకుకలిగిన ఈ వాస్తవికానుభూతివలన మా అభిప్రాయాల కొక స్థిరత్వం ఏర్పడింది. ముందుముందు మా అభిప్రాయాలలో ఎన్నిమార్పులుకలిగినప్పటికీ, మళ్ళీ పాతజీవితవిధానాలకుగాని, ప్రమాణాలకుగానిమరలడంఅసంభవం.

గాంధీజీకి ఆర్థికసామాజికవిషయాలమీద కొన్ని నిశ్చితాభిప్రాయాలున్నాయి. కాని వాటినన్నిటిని కాంగ్రెసుమీద రుద్దడానికాయన ప్రయత్నించలేదు. కాని ఆయన అభిప్రాయాలనుగురించి నిరంతరం ఆలో

చిస్తూఉండేవాడు. ఒకప్పుడు తన అభిప్రాయాలను మార్చుకోవడానికి కూడా ఆయన సందేహించకుండా ఆవిషయాన్ని వ్రాసేసేవాడు. అయితే కొన్ని అభిప్రాయాలను కాంగ్రెసులోఒప్పించడానికి ప్రయత్నించేవాడు. కాని ప్రజలను తనతోకూడాతీసుకెళ్ళాలనే అభిప్రాయంతో బహుమెలకువతో, నెమ్మదిగా ప్రవేశపెట్టేవాడు. ఒక్కొక్కప్పుడు కాంగ్రెసుకంటె ముందుకుపోయి మరల వెనక్కివచ్చేవాడు. కొద్దిమందిమాత్రమే ఆయనఅభిప్రాయాలతో పూర్తిగా ఏకీభవించగలిగేవారు. కొందరికి ఆయనమూలసూత్రాలలోనే అభిప్రాయభేధంకలిగింది. చాలామంది అప్పటిపరిస్థితులనుబట్టి, కాంగ్రెస్ ఆమోదించినంతవరకు ఆయన అభిప్రాయాల నంగీకరించారు ముఖ్యంగా రెండువిషయాలలో, ఆయన భావాలలో వెనుకవుండేసందర్భం అస్పష్టంగా ఉన్నప్పటికీ గొప్పచైతన్యంమాత్రంకలిగింది. ఏవిషయంలోనైనా ప్రజాసామాన్యానికి అదెంతవరకు ఉపయోగిస్తుందనేదే ముఖ్యమైనపరీక్ష. లక్ష్యము లెంత గొప్పవైనా వాటిని సాధించేమార్గాలు చాలా ప్రధానం. లక్ష్యంగొప్పది, న్యాయమైనదికదా అని దానిని సాధించేమార్గాలను అలక్ష్యంగా త్రోసివేయడానికి వీలులేదు. గాంధీజీ ప్రధానంగా మతంలో నమ్మికకలవాడు. ఆయన హృదయాంతరాళంలో హిందువుడు. కాని మతంఅంటే ఆయనఅభిప్రాయంలో పిచ్చినమ్మకాలు, ఆచారవ్యవహారాలు, పూజాపునస్కారాలు మాత్రం కాదు.

నైతికధర్మంలో ఆయనకు గాఢమైనవిశ్వాసం దానినే ఆయన ప్రేమఅనీ సత్యంఅనీ చెపుతూఉంటాడు. *సత్యం, అహింస రెండూ ఒకటేననీ, ఒకటేపదార్థంయొక్క రెండురూపాంతరాలనీ ఆయన

---

* 1928 జనవరిలో గాంధీజీ ఫెడరేషన్ ఆఫ్ యింటర్‌నేషనల్ ఫెలోషిప్‌లో యిచ్చిన ఉపన్యాసం.

"చాలాచదివినమీదట, అనుభంవల్ల నేను ఈ క్రింది నిశ్చయాలకు వచ్చాను.

(1) అన్నిమతాలలో సత్యం ఉంది.

(2) అన్నిమతాలలోనూ కొన్ని కొన్ని తప్పులున్నాయి.

(3) అన్నిమతాలు, నాకు నా మతమంత హితవైనవే.

నాకు యితరమతాలమీద ఎంతగౌరవంఉందో, నామతంమీదకూడా అంతే గౌరవం ఉంది. అందుచేతనే ఒకమతంలోనుంచి మరొకమతంలోనికి మారుకూ

మతం. వీటిని ఒకదానికొకటి పర్యాయంగా వాడుతూఉంటాడు. హిందూమతంలోని ఆంతర్యాన్ని గ్రహించానని చెపుతూనే, ఆయన ఆ ధర్మాలకనుగుణ్యమైన అర్థంరానిశాస్త్రప్రమాణాలను, ఆచారాలను ఆయన నిరాకరించాడు. అలాంటివన్నీ మధ్యరకంగావచ్చినవంటాడు. "అర్థంలేని పాతకాలపు ఆచారవ్యవహారాలకు బానిసకాలేను. నైతికంగా సమర్థనీయంకాని ఆచారసాంప్రదాయాలను నేనర్థంచేసుకోలేను. బలపర్చను" అన్నాడు. అందువలన ఆయన మనకునచ్చిన నైతిక ధర్మాల నతిక్రమించకుండా ఆయనచిత్తమొచ్చినసిద్ధాంతాన్ని అనుసరించడాని కాయనకు పరిపూర్ణమైనస్వేచ్ఛ కద్దు. ఆయన జీవితసిద్ధాంతాన్నిరచించుకుని అనుకరించడానికి కావలసినంతస్వేచ్ఛ. ఆయన సిద్ధాంతాలు తప్పా, ఒప్పా అనేవిషయంలో రాద్ధాంతసిద్ధాంతాలు జరుగవచ్చును. మూలసూత్రాలకు సంబంధించినంతవరకు ఒకే కొలబద్ద ఉండాలనీ, ముఖ్యంగా తనవిషయంలో ఉండితీరాలనీ ఆయనవాదం. రాజకీయాలలో కూడా, జీవితంలోని యితరవిషయాలలోవలెనే సామాన్యమానవుడికీ సిద్ధాంతం చాలా చిక్కులుకలిగిస్తుంది. అనేక అపార్థాలకు కారణమవుతుంది. కాని తానేర్పరచుకున్న సక్రమమైన మార్గాన నడవడాని కాయన ఎంతమాత్రం సంకోచించడు. కాని కొన్నిపరిమితులలో సందర్భానుసారమైన మార్పులకు ఆయనసంసిద్ధపడుతూనే వుంటాడు. ఆయన సూచించే ప్రతిసంస్కరణ, యితరులకు యిచ్చే ప్రతిసలహా ముందు ఆయనమీదే ప్రయోగించుకుంటాడు. ప్రతిపని తనతోనేప్రారంభిస్తాడు. వరలో కత్తిఇమిడినట్లుగా మాటలు, చేతలూ సరిగా సరిపోతాయి. అందువలన ఫలితాలేమైనా తననిజాయితీ మాత్రం ఎన్నటికీ పోగొట్టుకోడు. ఆయనజీవితానికి, చేసినపనికి ఒక సమగ్రమైన పరిపూర్ణత ఉంటుంది. తాను సంకల్పించిన కార్యాలలో అపజయంపొందినా ఆయన ఉన్నతిమాత్రం పెరుగుతూనేవచ్చింది.

ఆయన స్వంతఅభిప్రాయాలతో, స్వంత ఆదర్శాలతో రూపొందించదలచుకున్న భారతదేశంయొక్క స్వరూపం ఏమిటి?

---

ఉండడం అసంభవం. మనప్రార్థన 'ఓభగవంతుడా వారి సంపూర్ణ అభివృద్ధికై వారికి కావలసిన పూర్తివెలుగును, సత్యమునూ ప్రసాదించు' అనే ఉండాలి. కాని, 'ఓభగవంతుడా! నాకుచూపించినటువంటివెలుగునే యితరులకుకూడా చూపించు' అనికాదు.

'బీదల్లో బీదలుకూడా ఈ దేశం నాది అనేభావంతో, దానిని తీర్చి దిద్దడంలోనే నేను భాగస్వామిననేభావంతో, ధనికులనీ, బీదలనే తారతమ్యంలేకుండా, అన్నికులములవారు ఐకమత్యంతో కలిసిమెలిసి ఉండే భారతదేశంకోసం నేను పనిచేస్తాను...

'అటువంటి భారతదేశంలో అస్పృశ్యతకుగాని, నిషాకలిగించే పానీయములకుగాని తావులేదు. స్త్రీలు పురుషులతో సమానహక్కుల ననుభవిస్తారు.........యిటువంటి భారతదేశంకోసమే నేను కలలు కంటున్నాను.'

హిందూసాంప్రదాయసంస్కృతులకు గర్వపడుతూ, హిందూమతానికొక సార్వజనికస్వరూపాన్ని కలిగించాడు. సత్యమనే ఒక వలయంలో అన్నిమతాలను ఆయన యిమిడ్చేడు. హిందూసాంప్రదాయాన్ని సంకుచితంచేయడానికాయ నెప్పుడూ అంగీకరించలేదు.

"భారతసంస్కృతి హిందూ, యిస్లాము, తదితరమతముల మిళితమే కాని విడిగా ఏఒక్కమతానికి చెందినదికాదు." అనివ్రాశాడు. సకలదేశాలలోని సంస్కృతులూ నా ఇంట స్వేచ్ఛగావుండవలసినవే. కాని ఏ పరదేశసంస్కృతీ నన్ను గాలిలోకి విసరిపారెయ్యలేదు. ఇతరుల ఇండ్లలో పరాయివాడినిగా ముష్టిబ్రతుకూ, దాస్యపుబ్రతుకూ బ్రతకదలచుకోలేదు అనికూడా అన్నాడు. నూతనభావకెరటాలప్రభావంవల్ల తన మూలసూత్రాలను ఆయన వదలకుండానే ఓర్పుతో పట్టుకు కూచున్నాడు.

ప్రజలలో ఆధ్యాత్మికంగా ఐకమత్యం పెంపొందించడానికాయన పూనుకున్నాడు. పాశ్చాత్యజీవనవిధానాని కలవాటుపడ్డ కొద్దిమంది పైతరగతులవారికి, సామాన్యప్రజలకూ మధ్యగల తారతమ్యాలను ఛేదించడానికి ప్రారంభంచేశాడు. ప్రజలపునరుద్ధణకు వీలైన పాతపునాదులను గాలించి పట్టుకున్నాడు. వారి స్తబ్ధతను, జడత్వాన్ని పోగొట్టి ఉత్తేజవంతులుగాచేయడానికి ప్రయత్నించాడు. ఆయన పంథా ఒక్కటైనా, పలుముఖమైన ఆయనస్వభావంలో ప్రస్ఫుటంగా కనిపించేది. ఆయన ప్రజానీకంయెడల కనుపరచిన మమేకత్వం, పేదప్రజలతో, నిరాశ్రయులతో, అనాథులతో, పీడితప్రజలతో ఆయనకుండే సన్నిహితభావమే ఆయనలో విశేషం. ఈవిషయంలో ఆయనకు ప్రపంచమంతా

ఒక్కటే అధోగతిలోనున్న ఈ పేదజనుల నుద్ధరించడమే ఆయనదీక్ష. ఇతరవిషయాలు – ఆఖరుకు మతంకూడా దాని తర్వాత విషయమే.

"కడుపునిండుగా తిండిలేక, ఆకలితో అలమటపడేజాతికి మతం గాని, కళగాని, సాంఘికకట్టుబాట్లుకాని ఉండవు." "ఆకలితోబాధ పడుతూన్న లక్షలాదిప్రజలకు ఏది ఉపయోగపడుతుందో అదే నా మనస్సుకు చాలా అందమైనది. ముందు జీవితానికి ముఖ్యంగా కావలసినఅవసరాలనుతీరిస్తే మడిమాన్యాలు, తళుకుబెళుకులు వాటంతటవే వస్తాయి...కళలు, సాహిత్యం ప్రజలతో మాట్లాడుతున్నట్లుండాలని నా అభిప్రాయం." సర్వమూకోల్పోయి, అసంతృప్తితో హతాశులైన వేలాదిప్రజలు ఎప్పుడూ తన్నావహించియున్నట్లే ఆయన భావించేవాడు. యావత్ప్రపంచం వాళ్ళచుట్టూఉన్నట్లేఉండేది. "లక్షలజనానికిదొక తన్మయత" అనీ "అశ్రుపూరితమైన ప్రతిపేదవానికంటిని తుడిచివేయాలని నా ఆశ" అనీ వ్రాశాడు.

ప్రతివ్యక్తియొక్క స్వాతంత్ర్యానికి, సమానమానవత్వానికీ, పాటుపడాలనే గొప్పఆత్మవిశ్వాసంగల ఈ అసాధారణ ప్రతిభావంతుడు సర్వమూ పేదప్రజలక్షేమం అనే దృష్టితోనే చూడగలమహావ్యక్తి. సూదంటురాయిలాగ భారతప్రజలను ఆకర్షించాడంటే ఏమీ ఆశ్చర్యం లేదు. పూర్వాపరాలను ఏకంచేసే కష్టభూయిష్టమైన వర్తమానం భావి జీవితానికొక మెట్టుఅనే ఆశగొలిపేలాగ కనిపించాడు. సామాన్య ప్రజలకేకాక మేధావులకుకూడా అలాంటిఆశయేకలిగింది. కాని చిరకాలంగా ఒక జీవితవిధానానికి అలవాటైనవారు తేలికగా దానిని మార్చుకోలేక కలవరపడి బాధపడ్డారు. ఆయన అనుచరులలోనేగాక, వ్యతిరేకులలోను, సంశయాత్ములైన మధ్యస్థులలోనూకూడా ఒకవిధమైన మానసికవిప్లవాన్నితీసికొనిరాగలిగేడు.

కాంగ్రెసులో వివిధాభిప్రాయాలు, వివిధప్రకృతులు, వివిధఅంతస్థులుకలవా రెందరున్నా, తేలికగా తమఅభిప్రాయాలను మార్చనివారెందరున్నా, విప్లవాత్మకమైనఅభిప్రాయాలుకలవారున్నా, మొత్తం మీద గాంధీదే పై చెయ్యి. గాంధీచెప్పుచేతల్లోనే కాంగ్రెస్ నడిచింది. గాంధీ తరచు తన అభిప్రాయాన్ని యితరులకోర్కెల కనుగుణ్యంగా మార్చుకోవలసివస్తూండేది. ఒక్కొక్కప్పుడు శుద్ధవ్యతిరేకాభిప్రాయా

లనుకూడా మన్నించవలసివచ్చేది. కొన్నిముఖ్యవిషయాలలో ఆయన అచంచలుడు. ఒకటి రెండు విషయాల్లో కాంగ్రెస్‌తో తెగ తెంపులు చేసుకొనేస్థితికూడావచ్చింది. అయినప్పటికీ ఉద్ధృతమైన జాతీయభావములుకల ఆయన హిందూదేశస్వాతంత్ర్యచిహ్నం. భారతదేశాన్ని దాస్యమునకు లోనుచేయదలచినవారందరికీ ప్రబలశత్రువు. కనుకనే అనేకయితరవిషయాల్లో ఆయనతో ఏకీభవించలేనివారుకూడా, జాతీయ చిహ్నంగా ఆయననాయకత్వాని కంగీకరించి ఆయననంటిపెట్టుకొని ఉన్నారు. స్వాతంత్ర్యపోరాటాలు జరగనిరోజుల్లో ఆయననాయకత్వాన్ని అంగీకరించకపోయినా, స్వాతంత్ర్యపోరాటం తప్పనిసరిఅయినప్పుడు గాంధీజీనాయకత్వం విధాయకమయ్యేది. మిగిలినవిషయాలన్నీ దాని తర్వాతే.

1920వ సంవత్సరంలో జాతీయకాంగ్రెసు, మొత్తంమీద దేశంలో చాలామంది, అపూర్వమైన ఈనూతనమార్గాన్ని అనుసరించి తరుచుగా బ్రిటిష్‌అధికారులతో సంఘర్షణపడుతూవచ్చారు. సంఘర్షణలు సహజం. అప్పటిపరిస్థితులట్టివి. పద్ధతులుకూడాఅట్టివే. ఆపద్ధతులు కేవలం రాజకీయచతురంగపుఎత్తులుమాత్రమే కాదు. భారతప్రజల స్వాతంత్ర్యవాంఛను బలపరచి వారిని శక్తివంతులనుచేయగలిగిన పథకములు. ఆ శక్తివల్లనే స్వాతంత్ర్యం సిద్ధిస్తుంది. దానిని నిలబెట్టుకోగలుగుతాము. శాసనధిక్కారోద్యమాలు ఒకటితర్వాత మరొకటి సాగినాయి. అందువల్ల చాలామందికి అనేకమైనబాధలు, కష్టనష్టాలు సంభవించినాయి. కాని అవన్నీ స్వయంకృతాలవడంచేత, నీరసంకలిగించడానికి బదులు, బలవర్ధకములైనాయి. బాధలననుభవించడానికి సిద్ధంగా లేకపోతేనే, నిస్పృహ,నిరాశ కలుగుతాయి. విచిత్రశాసనాన్యమైన ప్రభుత్వనిర్బంధవిధానాలకుగురియైన కొందరు,ఇష్టంలేనివారుకూడా అనేకబాధలు పడవలసివచ్చింది. శాసనధిక్కారోద్యమానికనుకూలురైనవారు కూడా ఒక్కొక్కప్పుడు బాధలకు తాళలేక లొంగిపోయారు. కాని చాలామంది ఈ బాధలకుతట్టుకొని, ధీరత్వంతో నిలబడ్డారు. బాధలెక్కువైనకొద్ది వారినిగ్రహశక్తి అధికమైంది. ఎట్టిపరిస్థితులలోనూ, ఏవిధమైనప్రత్యక్ష ఫలితాలు కనుపించకపోయినప్పటికీ కాంగ్రెసు విదేశీయుల ఉన్నత శక్తికి లొంగిపోలేదు. పరిపాలనకు వ్యతిరేకంగా, భారతస్వాతంత్ర్యవాం

ఛకు ప్రబలచిహ్నంగా కాంగ్రెస్ స్థిరపడిపోయింది. అందుచేతనే చాలా మంది భారతప్రజలు ఆదరాభిమానాలతో కాంగ్రెస్‌నాయకత్వాన్ని శిరసావహించారు. వారిలో చాలామంది స్వంతంగా ఏమీచేయలేని అశక్తులైనా కాంగ్రెస్‌నాయకత్వాని కెదురుచూస్తూండేవారు. కొన్ని విధాలుగాచూస్తే కాంగ్రెస్ ఒకపార్టీసంస్థయేకాని, తరచు యితరపార్టీలకుకూడా సమిష్టివేదికగా ఉంటూవచ్చింది. నిజానికి అశేషభారత ప్రజానీకంయొక్క హృదయాలలోని ఆకాంక్షలను ప్రతిఫలింపచేసేమహా సంస్థ కాంగ్రెస్. కాంగ్రెస్‌సభ్యులసంఖ్య హెచ్చుగానే ఉన్నప్పటికీ దాని ప్రాతినిధ్యాన్ని సూచించగలసంఖ్య కాదు. సంఖ్య ఇంకా హెచ్చుగా ఉండకపోవడానికికారణం ప్రజలసంకోచం కాదు. మారుమూలగ్రామాలకు వెళ్ళి ఆ ప్రజలను పట్టీలో చేర్చుకోవడానికి మాకు స్తోమతుచాలకపోవడమే కారణం. తరచుగా, (యిప్పటిలాగే) చట్టవిరుద్ధమైన సంస్థగా పనిచేయవలసివచ్చింది. అందుచేత మావద్దనున్న కాగితాలు, పుస్తకాలు పోలీసువారు పట్టుకుపోతూ ఉండేవారు.

ప్రత్యక్షమైన చట్టధిక్కారపుపోరాటాలు లేనిరోజుల్లో కూడా బ్రిటిష్‌పరిపాలితమైన యిండియాప్రభుత్వంతో స్థూలమైన సహాయనిరాకరణం ఉంటూనేఉండేది. కాని అంత ఉధృతంగామాత్రం ఉండేదికాదు. అట్లని, ఈ సహాయనిరాకరణం, ఆంగ్లేయులతోమాత్రం కాదు. కాంగ్రెసుప్రభుత్వాలు చాలారాష్ట్రాల్లో ఏర్పడ్డప్పుడు ఉద్యోగస్థులతో ప్రభుత్వకార్యకలాపాలవిషయంలో చాలా అన్యోన్యసహకారంతోనే వ్యవహారంసాగిపోయింది. అయినప్పటికీ పూర్వసాంప్రదాయాలు అంతగా మారలేదు. ఉద్యోగబాధ్యతలకు సంబంధంలేని వ్యవహారాలలో కాంగ్రెసువారి సాంఘికప్రవర్తననుగూర్చి అనేక హెచ్చరికలు చేయబడ్డాయి. భారతజాతీయత, విజాతీయసామ్రాజ్యతత్వం మధ్య విధిలేక తాత్కాలికంగా రాజీలుకుదిరినా సంపూర్ణమైనశాంతిమాత్రం లేదు. పూర్ణస్వాతంత్ర్యాన్నిపొందిన భారతదేశంమాత్రమే సమానస్థాయిలో యింగ్లండుతో సహకరించగలుగుతుంది.

## 3 రాష్ట్రంలో కాంగ్రెసుప్రభుత్వాలు

అనేక కమిషనులు, కమిటీలు, చర్చలు వగైరా తతంగమంతా అయినపిమ్మట బ్రిటిష్‌పార్లమెంటులో 1935 సం॥ ఇండియా ప్రభుత్వచట్టం ఆమోదింపబడింది. ఇందువల్ల రాష్ట్రములలో ఒక విధంగా కాస్తంత స్వపరిపాలనము, ఒక కేంద్రప్రభుత్వం ఏర్పడినాయి. కాని ఈ హక్కులలో లెక్కలేనన్ని మినహాయింపులు ఉండడంచేత నిజమైనరాజకీయ ఆర్థికాధికారాలన్నీ బ్రిటిష్‌ప్రభుత్వం చేతుల్లోనే ఉండేవి. నిజానికి కొన్నివిధాలుగాచూస్తే, బ్రిటిష్‌ప్రభుత్వానికి బాధ్యతవహించిన కార్యనిర్వాహకోద్యోగుల అధికారాలను ఈ చట్టం హెచ్చుచేసింది. కేంద్రప్రభుత్వనిర్మాణ మెంత బందోబస్తుగా ఉన్నదంటే, దానివలన ఎట్టిఅభ్యుదయమూ సాధ్యంకానంతగాఉన్నది. బ్రిటిష్‌వారి అదుపాజ్ఞలకులోబడుండే ఆవిధానాన్నిమార్చడానికి భారతప్రజలకేవిధంగానూ సావకాశంలేకుండాఉంది. దీనిలో మార్పులుచేయాలన్నా బ్రిటిష్‌పార్లమెంటుద్వారాజరుగవలసిందే. ఈ చట్టం ప్రజాభీష్టానికి శుద్ధప్రతికూలంగా ఉంది. స్వయంవికాసంచెందడానికి ఏవిధమైన బీజాలు అందులోలేవు. విప్లవంతప్ప స్వాతంత్ర్యసాధన కందులో ఏమీ సాధనం కనబడదు. ఈ చట్టంవల్ల ఆంగ్లపాలకులకు పెద్దభూస్వాములు, మహారాజులు వగైరా అభివృద్ధినిరోధకశక్తులతో మరింత సన్నిహితత్వం ఏర్పడింది. ప్రత్యేకవర్గప్రాతినిధ్యాలనేర్పరచడంవల్ల వర్గభేధాలు మరింత ఎక్కువైనాయి. ఈచట్టంవల్ల ఆంగ్లేయులవర్తకం, పరిశ్రమలు, వడ్డీవ్యాపారం, నౌకావ్యాపారం మరింత స్థిరపడి ప్రాముఖ్యతకొచ్చాయి. ఈవిధమైన ప్రత్యేకసదుపాయాలు నిరభ్యంతరంగా నిర్విరామంగా సాగడానికిమార్గాలు చట్టబద్ధంచేయబడ్డాయి. హిందూదేశపు ఆర్థిక, సైనిక, వైదేశికవిధానాలపైన సర్వహక్కులూ బ్రిటిష్‌వారిచేతుల్లోనే ఉంచబడ్డాయి. రాజప్రతినిధిసర్వాధికారాలు మునుపటికన్న ఎక్కువైపోయాయి.

రాష్ట్రీయస్వపరిపాలనాధికారాలు బహు పరిమితమైనా, ప్రజాయత్తముచేయబడిన అధికారాలు చాలా హెచ్చుగావున్నట్లే కనుపించాయి. కాని ప్రజాప్రభుత్వస్థితిమాత్రం చాలా అసాధారణంగా

ఉంటూవచ్చింది. వైస్రాయి నిత్యపరిపాలనలో జోక్యంకలుగచేసు కొనేహక్కులన్నీ యథాతథంగానే ఉన్నాయి. కేంద్రంలో బాధ్యతా రహితమైన ప్రభుత్వం అలాగేఉంది. రాష్ట్రగవర్నర్లకుకూడా వైస్రాయి లాగునే తనయిష్టప్రకారం పరిపాలనలో జోక్యంకలుగజేసుకొనే అధి కారమూ, ప్రజాప్రతినిధులుచేసినశాసనాలను త్రోసిపుచ్చుటకు, తనిష్టం వచ్చినట్లు శాసనాలుచేయుటకు, మంత్రులఅభిప్రాయాలకు శాసనసభా భిప్రాయాలకు విరుద్ధంగాకూడా చట్టాలుచేయడానికి అధికారమివ్వ బడింది. రాబడిడబ్బులో చాలాభాగం కొన్నిప్రత్యేకవినియోగాలకై కేటాయించబడింది. కొందరు ఉన్నతాధికారులకు, పోలీసుశాఖకు, కొన్ని ప్రత్యేకరక్షణలొసంగబడ్డాయి. వారిమీద మంత్రుల కంతగా అధికారము లేదు. ఆ అధికారులు సర్వస్వతంత్రులుగా ప్రవర్తిస్తూ, పూర్వంలోలాగే గవర్నరుఆజ్ఞలకై ఎదురుచూచేవారేకాని, మంత్రు లను లెక్కచేసేవారుకాదు. అయినప్పటికీ యిల్లాంటి అధికారులతోనే ప్రజాప్రభుత్వం నడిపించవలసివచ్చింది. ఈవిధంగా బహు క్లిష్టమైన ప్రభుత్వయంత్రాంగంయొక్కస్వరూపం, పైనున్న గవర్నరుమొదలు, క్రిందనున్న చిన్నఉద్యోగి, పోలీసువరకు యథాప్రకారంగా ఏమీ మారకుండానేఉంది. మధ్యస్థంగా కొద్దిమందిమంత్రులను, ప్రజాప్రతినిధు లైన శాసనసభ్యులకు బాధ్యతవహించి శక్తివంచనలేకుండా రాజ్యాన్ని నడిపించమనిమాత్రం ఒప్పించారు. బ్రిటిషువారిప్రతినిధియైన గవర్నరు, ఆయనక్రిందఉండే ఉద్యోగులు, మంత్రులతో పూర్తిగా సహకరిస్తేనే ప్రభుత్వం సాఫీగా నడుస్తుంది. సర్వసామాన్యంగా, ప్రజాప్రభుత్వపు పద్ధతులకు పూర్వపు పోలీసురాజరికపు పద్ధతులకు చాలా తేడాఉంది. అందుచేత తరుచుగా పేచీలువస్తూండడం సహజం. గవర్నరుగాని, ఉద్యోగస్థులుగాని ప్రజాప్రభుత్వపథకాలకు బహిరంగముగా అడ్డంరాక పోయినా, లోపాయికారీగా అడ్డుతగిలో, ఆలస్యంచేసో, మరో పెడమార్గాన్ననుసరించో మొత్తంమీద ప్రభుత్వం చెయ్యవలసినది చెయ్యకుండా చేయగలరు. లేక చేసినదిచెడగొట్టగలరు. వైస్రాయిగాని, గవర్నరుగాని మంత్రివర్గానికి, శాసనసభకు వ్యతిరేకంగా తనయిష్టం వచ్చినట్లు వ్యవహరించడానికి, చట్టంలో ఏవిధమైన అభ్యంతరమూ లేదు. సంఘర్షణవస్తుందేమోననే భయముయొక్కటే శాస్త్ర ఉన్నది. మంత్రులు

రాజీనామాచేయవచ్చును. మరొకరు శాసనసభలో అధికసంఖ్యాబలాన్ని సేకరించలేకపోవచ్చును. ఇతరమైన గొప్పమార్పులు జరుగవచ్చును. ఇతరదేశాల్లో నిరంకుశుడైనప్రభువుకు, ప్రజాప్రతినిధులసభకు అభిప్రాయభేదాలువచ్చినప్పుడు విప్లవాలు జరిగేయి. మహారాజులు అడుగంటిపోయారు. ఇక్కడ రాజు పరాయిదేశస్థుడు కూడాను. ఆయనకు ఉన్నబలం విదేశీయధనం, విదేశీసైన్యాలు, వారి దేశంలో తయారుచేసిన పెంపుడుకుక్కలవంటి 'జీ హుజూర్' రాజభక్తులు.

అప్పటికి హిందూదేశాన్నుంచి బర్మా విడిపోయింది. బర్మాలో భారతీయులకు, బ్రిటిష్‌వారికి, చైనావారికి మధ్య ఆర్థిక, వ్యాపారవ్యవహారాలలో వివాదాలు ఏర్పడ్డాయి. ఆమాత్రం సందుచూచుకొని భారతీయులకు చైనీయులకు వ్యతిరేకంగా బర్మాదేశప్రజలలో దుష్ప్రచారంచేశారు ఆంగ్లేయులు. ఈ తంత్రం కొద్దికాలంమాత్రమే ఉపయోగపడింది. కాని బర్మావారికికూడా స్వాతంత్ర్యంనిరాకరించేటప్పటికి వ్యవహారం విషమించింది. జపానుకనుకూలంగా అనేక ఉద్యమాలు రేగినాయి. 1942వ సంవత్సరంలో జపాను బర్మామీద దండెత్తినప్పుడు ఆ ఉద్యమాలు బాగా వెల్లడిలోకొచ్చాయి.

1935 సంవత్సరపు ఇండియాచట్టాన్ని హిందూదేశంలోని అన్ని రాజకీయపక్షాలవారు తీవ్రంగా వ్యతిరేకించారు. రాష్ట్రీయస్వపరిపాలనలో జోక్యంకలిగించుకోవడానికి, గవర్నరుల, వైస్రాయిల సర్వాధికారములనే నిరసిస్తూంటే కేంద్రపరిపాలన మరీ అధ్వాన్నంగా ఉంది. కేంద్రప్రభుత్వాన్ని రాష్ట్రాలసమాఖ్యగా ఉంచడానికెవ్వరికీ అభ్యంతరంలేదు. అట్టిసమాఖ్య హిందూదేశానికి అనుగుణ్యంగా ఉంటుందని చాలా మంది అభిప్రాయం. కాని బ్రిటిష్‌వారు రూపొందించిన సమాఖ్య మాత్రం బ్రిటిష్‌ప్రభుత్వాన్ని మరింతబలపరచడానికీ, మనదేశంలో వారికండగా ఉండే స్వార్థపరులకు బలంకలిగించేటట్లుగా మాత్రమే ఉన్నది. రాష్ట్రీయస్వపరిపాలనాభాగాన్ని అంగీకరించి, కాంగ్రెసు ఎన్నికలలో పోటీచేయడానికి నిశ్చయించింది. ఈచట్టానికిలోబడి రాష్ట్రపరిపాలన స్వీకరించడాన్నిగురించి కాంగ్రెసుసంస్థలో అనేక తీవ్రమైన వాదోపవాదాలు జరిగినాయి. ఎన్నికలలో కాంగ్రెసుకు సంపూర్ణవిజయం చాలా రాష్ట్రాలలోలభించినప్పటికీ, గవర్నరుగాని, వైస్రాయిగాని జోక్యం కల్గి

గించుకోమనే హామీయిస్తేనేగాని, మంత్రిత్వాలను స్వీకరించి పరిపాలనాబాధ్యతవహించడంవిషయంలో చాలా తర్జనభర్జనజరిగింది. కొన్ని నెలలైనతర్వాత అలాంటిజోక్యం ఉండదని సందిగ్ధంగానే కొన్నిహామీలివ్వబడడంచేత, 1937 జూలైనాటికి రాష్ట్రాల్లో కాంగ్రెసుప్రభుత్వాలు ఏర్పడ్డాయి. చివరికి సింధు, బెంగాలు, పంజాబురాష్ట్రాలలోతప్ప, మిగిలిన ఎనిమిది రాష్ట్రాలలోనూ కాంగ్రెసుప్రభుత్వాలు ఏర్పడినాయి. నూతనంగా ఏర్పడ్డ సింధురాష్ట్రం చాలా చిన్నది, అస్థిరమైనది. వంగరాష్ట్రంలో కాంగ్రెసుపార్టీ, ఉన్నపార్టీలలోకల్లా పెద్దదైనప్పటికీ, శాసనసభలో పూర్ణమైనమెజారిటీ లేనందువల్ల ప్రభుత్వనిర్వహణబాధ్యతను వహించలేదు. బెంగాల్ అంటే కలకత్తాలో– ఇండియాలోని పారిశ్రామిక ధనికవేత్తలకు బ్రిటిష్‌రాజధాని అవడంవల్ల, బ్రిటిష్‌వర్తకుల కధికంగా ప్రాతినిధ్యం ఇవ్వబడింది. 170 లక్షలజనసంఖ్యగల ముస్లిమేతరుల (హరిజనులుకాక)కు శాసనసభలో 50 స్థానాలుంటే, కొద్దివేలమందిమాత్రమే జనసంఖ్యగల్గిన ఆంగ్లేయులకు 25 స్థానాలుయిచ్చారు. అందువల్ల శాసనసభలోని ఈ బ్రిటిష్‌ముఠా వంగరాజకీయాల్లో ప్రముఖపాత్ర వహిస్తూ మంత్రివర్గాలను కీలుబొమ్మలులాగా ఆడించగల్గేవారు.

కాంగ్రెసు 1935 యిండియాచట్టాన్ని తాత్కాలిక పరిష్కారమార్గంగాకూడా ఆమోదించలేకపోయింది. ఈ చట్టాన్ని వ్యతిరేకించడానికి, సంపూర్ణస్వాతంత్ర్యసంపాదనకు దీక్షపూనింది. అయినప్పటికీ, అధికసంఖ్యాకులు రాష్ట్రస్వపరిపాలనలోమాత్రం పనిచేయడానికి నిశ్చయించారు. కొంతవరకు నిర్మాణాత్మకమైన సంస్కరణలను శాసనసభద్వారా సాధిస్తూ, పూర్ణస్వరాజ్యంకొరకు పోరాడాలనే ద్వంద్వవిధానంలోపడింది కాంగ్రెస్. రైతులసమస్యలను వెంటనే పరిష్కరించవలసిన ఆవశ్యకత ఏర్పడింది.

కాంగ్రెస్ అవసరమైతే ఇతరపార్టీలవారితోసహకరించి వారినికూడగట్టుకుని మిశ్రమమంత్రివర్గాలను ఏర్పరచాలని ఆలోచనచేసింది. కాని అలాంటి అవసరంలేకుండానే అన్నిరాష్ట్రాలలో అధికమైనసంఖ్యాబలం లభించింది. అయినప్పటికీ ప్రభుత్వకార్యకలాపాలలో సాధ్యమైనంతమందిని జొప్పించడం మంచిది. మిశ్రమమంత్రివర్గాలనిర్మాణం ఎల్లప్పుడూ తప్పనకూడదు. అస్సాంలోనూ, సరిహద్దురాష్ట్రంలోను

ఒకవిధమైన మిశ్రమమంత్రివర్గస్థాపన కంగీకరించబడింది. ఒకవిధంగా చూస్తే కాంగ్రెసుకూడా స్వాతంత్ర్యేచ్ఛ ప్రధానంగా కలిగిన వివిధ పార్టీలసమాఖ్యయే. కాని ఇన్నివివిధవర్గాలు కాంగ్రెసులో ఉన్న ప్పటికీ కాంగ్రెసు ఒకవిధమైన క్రమశిక్షణను, ఒక విశిష్టమైన సాంఘిక దృక్పథాన్ని పెంపొందించింది. ఒక ప్రత్యేకమైన శాంతమార్గంలో ప్రతి ఘటనాశక్తిని సంపాదించింది. విస్తృతమైన మిశ్రమమంత్రివర్గమంటే సాంఘికరాజకీయదృక్పథాల్లో ఏకీభావంలేనివారికలయిక కావచ్చును. వారందరికీ ఏకైకలక్ష్యం మంత్రిపదవుల నాక్రమించడమే. ఈలాంటిసంద ర్భంలో అనేకమైనపేచీలు కలుగడం సహజం. ఆంగ్లేయపెట్టుబడిదారుల ప్రతినిధులతో, వైస్రాయితో, గవర్నరుతో, పెద్ద ఉద్యోగస్తులతో, భూస్వాములతో, పారిశ్రామికవేత్తలతో, రైతుకూలీలసమస్యలమీద అనేక సంఘర్షణలు రావడానికి సావకాశాలున్నాయి. కాంగ్రెసేతర పక్షములవారి రాజకీయసాంఘికదృష్టి కొంచెం ఛాందసప్రవృత్తికలది. అందులో కొంతమంది శుద్ధస్వార్థపరులు. తమకాయుష్యం తమకారో గ్యం అనేవారు. అలాంటివారు ప్రభుత్వాలలో ప్రవేశిస్తే, మన ప్రజల సాంఘికాభ్యున్నతి పూర్తిగా కాకపోయినా, చాలవరకు కుంటుపడు తుంది. అనవసరమైన కాలయాపన జరుగుతుంది. గవర్నర్లతో కలసి ఇతరమంత్రులమీద కుట్రలుపన్నడంకూడా జరగవచ్చు. బ్రిటిష్ అధి కారాన్నెదుర్కోడానికి సంయుక్తమైన ప్రతిఘటన చాలా అవసరం. యిందులో ఆటంకంకలిగితే మన ఆశయసిద్ధికే నష్టంవస్తుంది. మంత్రు లందరూ ఒకేలక్ష్యమూ, ఒకే అన్యోన్యతా కలిగి పరస్పరవిశ్వాసం ఉంచుకోకపోతే ఒక కేటికిలాగితే మరొకరు కోటికిలాగడమవుతుంది.

మన ప్రజాహితజీవితంలో రాజకీయవేత్తలనబడేవారు అనేక మంది మంచీ చెడ్డా ఉన్నారు. కాంగ్రెసులోనూ, ఇతరపార్టీలలోనూ కూడా ప్రతిభావంతులు, దీక్షాపరులు, దేశభక్తులునైన స్త్రీపురుషు లున్నారు. స్వార్థపరులూ ఉంటారు. కాని 1920వ సంవత్సరంనుండి, కాంగ్రెసు కేవలం చట్టబద్ధమైన రాజకీయపార్టీగానేగాక విప్లవాత్మక మైన లక్ష్యాలతో పనిచేస్తోంది. అందుచేతనే తరచు చట్టవిరుద్ధమైన సంస్థగా పరిగణింపబడుతూవచ్చింది. దౌర్జన్యం, రహస్యకుట్రలు, పన్నా గాలుమొదలైన విప్లవసహజమైన కార్యక్రమాలేమీ లేకపోయినప్పటికీ,

విప్లవసంస్థగానే ఉంటున్నది. కాంగ్రెసువిధానాలు తప్పా, ఒప్పా అనే విషయం వివాదాస్పదం కావచ్చునుగాని, వాటిలో అచంచలమైన ధైర్య స్థయిర్యాలు, మహోన్నతమైనఓర్మి నిబిడీకృతమైఉన్నాయి. బహుళా క్షణికమైన ఆవేశంలో మహత్తరమైన సాహసకార్యాలుచేయడం తేలిక కావచ్చును. మృత్యువును కూడా ఎదుర్కొనవచ్చును. కాని కేవలం ఐచ్ఛికంగా దైనందినజీవితసౌఖ్యాలను విసర్జించి కష్టపడడం చాలా కష్ట మనుకుంటాను. ఈపరీక్షకు తాళగలిగినవారు చాలా తక్కువమందే ఉంటారు. కాని భారతదేశంలో ఈ పరీక్షలో ఉత్తీర్ణులైనవారు చాలా మంది ఉండడమే గొప్ప ఆశ్చర్యకరమైన సంగతి.

శాసనసభలలోని కాంగ్రెసుపక్షాలు, పరిస్థితులు విషమించ కుండా సాధ్యమైనంత త్వరలో రైతుకూలీలపరిస్థితులను బాగుచేయడా నికి శాసనాలుచేయాలనే ఆత్రత చూపాయి. ఎప్పటికప్పుడే పరిస్థితులు విషమించేలాఉండడం సహజం. చాలమటుకు అన్నిరాష్ట్రాలలోనూ, బహుపరిమితమైన ఎన్నికదారులవల్ల ఎన్నుకోబడిన ఎగువశాసనసభ లున్నాయి. భూస్వాములు, పారిశ్రామికవేత్తలుమొదలైన ధనికవర్గాల వారిందులో ప్రతినిధులుగా ఉన్నారు. అభ్యుదయదాయకమైన శాస నాలను నిరోధించడానికి అనేక అడ్డంకులున్నాయి. మిశ్రమమంత్రివర్గా లీవిధములయిన అడ్డాలకు దారితీస్తాయనే కారణంచేతనే అస్సాం, సరిహద్దురాష్ట్రాలలో తప్ప యితరచోట్ల ఆదిలోనే మిశ్రమమంత్రి వర్గాలను ఏర్పాటుచేయకూడదని నిర్ణయించబడింది.

ఈ నిర్ణయం అంతిమనిర్ణయం మాత్రం కాదు. అవసరమైతే మార్పుచేసుకునేదృష్టి లేకపోలేదు. రాష్ట్రాలలోని కాంగ్రెసుప్రభుత్వా లను, వెంటనే పరిష్కరించవలసిన అనేక గడ్డుసమస్యలెదుర్కోడంవల్ల ఏ మార్పులు జరగలేదు. కొన్నిసంవత్సరాల తర్వాత ఆ నిర్ణయంలోని ప్రాజ్ఞతగూర్చి అనేకవిధాలుగా వాదోపవాదాలు జరిగినాయి. అసలు పుణ్యకాలమతిక్రమించిన తర్వాత తెలివితేటలుకలుగడం సామాన్యమే. కాని, రాజకీయస్థితిగతులనుపట్టి ఆలోచిస్తే ఆ నిర్ణయమే సబబైన దని నాకుతోస్తుంది. కాని మతవిషయకంగాచూస్తే ఆ నిర్ణయంయొక్క పర్యవసానాలు చాలా దురదృష్టంగానే పరిణమించాయి. ముసల్మాను లలో కొంత అసంతృప్తి, అవిశ్వాసం కలిగింది ఈ అవకాశాన్ని పూర్తి

స్కరించుకొని కొందరు స్వార్థపరులు తమ తమ ముఠాప్రాబల్యాన్నభి వృద్ధిచేసుకున్నారు.

రాజకీయంగానూ, రాజ్యాంగదృష్ట్యానూ చూస్తే, ఈ కొత్త చట్టం అమలులోకి వచ్చి రాష్ట్రాలలో కాంగ్రెసుప్రభుత్వాలుఏర్పడినంత మాత్రాన ఆంగ్లప్రభుత్వమూలయంత్రాంగంలో ఏ మార్పు రాలేదు. నిజమైన అధికారం పూర్వమెక్కడుందో ఇప్పుడూ అక్కడేఉంది. కాని గ్రామప్రజలలోమాత్రం బ్రహ్మాండమైన మానసికమార్పు కలిగింది. విద్యుత్ శక్తివలె ఆ భావం వ్యాపించింది. ఈ మార్పు పట్టణాలలో కంటె పల్లెప్రాంతాలలో బాగా గోచరమైంది. పారిశ్రామిక కేంద్రాల లోని కార్మికులలోకూడా ఈ మార్పు కొంత ద్యోతకమైంది. ప్రజల నెత్తిమీదఉన్న ఒక మహాభారాన్ని తొలగించినట్లయింది. అంతర్భూ తంగా ఊటూవచ్చిన ఒక మహత్తరశక్తి విజృంభించింది. రహస్యపోలీ సులు, మామూలుపోలీసులభయం కొంతకాలంవరకైనా పోయి నిరుపేద రైతుసైతం ఆత్మగౌరవాన్ని, స్వయంశక్తిని పెంపుచేసుకున్నాడు. మొట్ట మొదటిసారిగా తనూ ఒక లెక్కలో మనిషిననీ,తన్నెవ్వరూ త్రోసిరాజన లేరనీ ఒక విశ్వాసం అతనిలో కలిగింది. యికనుండి ప్రభుత్వమనేది అతడి కర్థంకాని బ్రహ్మరాక్షసికాదు. తనకందుబాటులోలేని ఉద్యోగస్థులపరం పరకాదు. తనను పీడించుకుతినడమే ప్రధానలక్ష్యంగాగల ఉద్యోగస్థుల కూటం కాదు. ఆ మహోన్నతపదవులను ఈనాడు ఆక్రమిస్తున్నవారు తనకు చిరపరిచితులు. తనతో మాట్లాడుతూఉండేవాళ్ళే. కొందరు తనతోపాటు కారాగారంలో సోదరులవలె మెలగినవారే.

రాష్ట్రప్రభుత్వరాజధానినగరాల్లో ఒకప్పుడు నిరంకుశత్వం తాండవించిన సచివాలయాలలో కలిగినసంఘటనలు చాలాచిత్రమైనవి. పూర్వం అందులో గొప్పగొప్ప అధికారులుండేవారు. వారిఅంతస్థు చాలా పైనఉండేది. ఆ కార్యాలయాలనుంచి ఒక్కొక్కప్పుడు ఆశ్చర్య కరమైనఉత్తర్వులు పుడుతుండేవి. వాటినిధిక్కరించడానికి ఎవరికీ దమ్ము చాలేదికాదు. పోలీసులు, ఎర్రతలపాగాలు, చంకీదుస్తులు, మొలలో కత్తులుధరించిన బిళ్ళబంట్రోతులు ఆ సచివాలయాన్ని కాపలాకాస్తూ ఉండేవారు. ఏ కొద్దిమంది అదృష్టవంతులో, ధైర్యవంతులో, ధనవం తులోమాత్రమే వాళ్ళను దాటిపోగల్గుతుండేవారు. ఇప్పుడు ఎవరుబడితే

వాళ్ళు పట్టణవాసులుకానీ, పల్లెప్రజలుకానీ ఇష్టప్రకారంగా ఆ దివ్య సలంలో ప్రవేశించి నిర్భయంగాసంచరించగలుగుతున్నారు. అక్కడజరుగు ,డేసంగతులన్నీ తెలుసుకోవాలనే అభిలాష వారికికలిగింది. కొందరు శాసనసభామందిరంలోకి వెళ్ళి సమావేశాలను చూచారు. కొందరు మంత్రులగదులలోకికూడా తొంగిచూస్తూండేవారు. తాము పరాయి వాళ్ళమనేభావం వారికి లేదు. గనుక వారినిఆపడం చాలాకష్టమయ్యేది. వారికి విషయాలన్నీ తెలుసుకోడానికి కష్టంగానూ, గజిబిజిగానూ ఉన్న ప్పటికీ, అదంతా తమస్వంతంగానే భావిస్తూండేవారు. పోలీసువారు, విచ్చుకత్తులపహారాజవానులు విస్తుపోయి చూస్తుండేవారు. పాతకాలపు డౌలుయొక్క అంతస్థులు పడిపోయినాయి. తెల్లవాళ్ళుధరించే సూటుబూ టుల అధికారానికి చెలామణీ లేదు. తండోపతండాలుగావస్తుండే పల్లె ప్రజలలో శాసనసభ్యులను గుర్తుపట్టడంకూడా కష్టమైంది. అంతా ఒక్క విధంగానే గాంధీటోపీని, ఖద్దరుదుస్తులను ధరిస్తూండేవారు.

పంజాబు, బెంగాల్‌రాష్ట్రాలలో మంత్రివర్గాలు కొన్నిమాసాలు ముందుగా ఏర్పడ్డంవల్ల కొన్నిచిక్కులు కలిగినాయి. ఏవిధమైనలావా దేవీలు లేకుండానే అక్కడ ప్రభుత్వాలలో మార్పులు జరిగినాయి. ముఖ్యంగా పంజాబులో పూర్వంఉండిన ఉన్నతాధికారవర్గంతోనే మంత్రివర్గం ఏర్పడడంవల్ల పాతవ్యవహారమే సాగిపోయింది. చాలామంది మంత్రులు పాతవాళ్ళే వారంతా పూర్వం ఉన్నతాధికారులు. ప్రస్తుతం కూడా అలాగేఉన్నారు. వారికీ, ఆంగ్లప్రభుత్వాధికారులకూ ఏవిధమైన లావాదేవీలు సంఘర్షణలు లేకుండాపోయాయి. రాజకీయంగా బ్రిటిష్ అధికారానిదే పై చెయ్యి.

ప్రజల పౌరసత్వపుహక్కులవిషయంలోనూ, రాజకీయఖైదీల విడుదలవిషయంలోనూ మిగతా కాంగ్రెసురాష్ట్రాలకు, పంజాబు బెంగాలురాష్ట్రాలకుగల భేదం స్పష్టంగా కనబడిపోయింది. బెంగాలు, పంజాబురాష్ట్రాలలో పోలీసురాజ్యం ఏమాత్రం మారలేదు. రాజకీయ ఖైదీలు విడుదలచేయబడలేదు. బెంగాలులోని మంత్రివర్గం తరుచు బ్రిటిష్‌వోట్లపై ఆధారపడుతూ ఉండడంచేత, రాజకీయఖైదీలతోపాటు విచారణ, శిక్ష లేకుండా సంవత్సరాలతరబడి కారాగారాల్లో నిర్బంధితు లైనడిటెన్యూలుకూడా చాలమంది అలాగేఉండిపోయారు. కాంగ్రెసు

ప్రభుత్వాలు ముందుగా రాజకీయఖైదీలందరినీ విడిచిపెట్టేయి. వారిలో దౌర్జన్యనేరాలకు, శిక్షింపబడిన కొందరిని విడుదలచేయడానికి, గవర్నరు అనుమతిఇవ్వనందున వారివిడుదల కొంచెం ఆలస్యమయింది. సంయుక్తపరగణాలలోను, బీహారులోనూ ఈ సమస్యమీద పట్టుదలలు పెరుగడంవల్ల 1938 సంవత్సరారంభంలో మంత్రివర్గాలు రాజీనామా చేయడానికికూడా సిద్ధపడ్డాయి. అందుమీదట గవర్నర్లు తమ అభ్యంతరాలను ఉపసంహరించుకోవడం, రాజకీయఖైదీలను విడుదలచేయడం జరిగింది.

## ౪ భారతీయుల ముందడుగు – బ్రిటిష్‌వారి దిగతీత

కొత్తగా ఏర్పడిన రాష్ట్రశాసనసభల్లోనిప్రతినిధులు ఎక్కువగా పల్లెప్రాంతంవారవడంచేత వారంతా భూసంస్కరణలనుసాగించాలని పట్టుపట్టేరు. బెంగాలులో పర్మనెంటు సెటిల్‌మెంటువల్లనూ తదితర కారణాలవల్లనూ రైత్వారీస్థితిగతులు చాలా అధ్వాన్నంగాఉన్నాయి. తర్వాత పెద్దపెద్దజమీందారులున్న బీహారు, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలు, ఆతర్వాత ఏదోవిధమైన రైత్వారీయాజమాన్యం స్థిరపడిన మద్రాసు, బొంబాయి, పంజాబువగైరారాష్ట్రాలు. అక్కడే పెద్దపెద్దభూస్వాములు భారీకమతాలనుచేసుకున్నారు. బెంగాలులో శాశ్వత సెటిల్‌మెంటు అమలులో ఉండడంచేత ఉపయోగకరమైన సంస్కరణలు అమలుపరచడానికి వీలులేకుండాపోయింది. ప్రతివారూ పర్మనెంటు సెటిల్‌మెంటు రద్దుకావాలనేవారే. ఆఖరుకు ప్రభుత్వనియమితమైన కమీషను కూడా దానిరద్దుకే శిఫారుసుచేసింది. కాని స్వప్రయోజనపరులఆటంకాలవల్లనూ, వారుచేసే జాప్యంవల్లనూ ఆ పనిమాత్రం జరుగలేదు. పంజాబురాష్ట్రం యొక్క అదృష్టం వారిస్వాధీనంలో కొత్తభూములుండడమే.

కాంగ్రెస్‌కు భూసంస్కరణలసమస్య చాలా ముఖ్యమైనసాంఘికవిషయమవడంచేత, భవిష్యత్తులో అనుసరించదగువిధానాన్ని కూలంకషంగా చర్చించేనిమిత్తం ఎక్కువకాలం తీసుకుంది. వివిధరాష్ట్రాలలో వేర్వేరుగాఉండే స్థితిగతులనుబట్టిన్నీ ఆయారాష్ట్రాల్లో కాంగ్రెస్‌సంస్థను నిర్వహిస్తున్న మనుష్యులతరహాలనుబట్టిన్నీ కాంగ్రెస్‌విధానం మారుతూ వచ్చింది. యావద్భారతదేశానికే వర్తింపవలసిన భూసంస్కరణవిధా

హాన్ని స్థూలంగా కాంగ్రెస్ కేంద్రసంస్థ తయారుచేసింది. ప్రతిరాష్ట్రమూ వారి కక్కడ ఉండే ప్రత్యేకస్థితిగతులకనుగుణ్యంగా దానికి కొంతచేర్చి మరికొన్నిలోపాలను పూరించుకునీ సరిదిద్దుకుంది. ఈ విషయంలో ఉత్తరప్రదేశ్ రాష్ట్రం చాలాముందడుగు వేసింది. జమీందారీవిధానాన్ని రద్దుచేయాలని తీర్మానించింది. కాని 1935 సం॥ ఇండియాచట్టంక్రింద అది సాధ్యంకాదు. వైస్రాయికి కొన్ని ప్రత్యేకాధికారాలుండడంవల్ల, భూస్వాములతో నిండివున్న ఎగువశాసనసభలవల్లనూ ఆలాంటిచట్టం చేయడానికి వీలులేదు. ఏదైనావిప్లవంవచ్చి అసలు ఆ చట్టాన్నే తుడిచేస్తేతప్ప, ఆచట్టాననుసరించే సంస్కరణలు అమలుజరపాలి. అందువల్ల సంస్కరణల నమలుపరచడంలో అనుకున్నదానికంటె కాలాతీతమైనది.

ఏదిఎలాఉన్నప్పటికి చెప్పుకోదగిన భూసంస్కరణలు ప్రవేశపెట్టబడినాయి. గ్రామీణప్రజల ఋణవిమోచనకొరకు ప్రయత్నాలు జరిగాయి. కర్మాగారాలలోని కార్మికులపరిస్థితులు, పారిశుధ్యం, ప్రజారోగ్యం, స్థానికపరిపాలన, ప్రాథమికవిద్య, విశ్వవిద్యాలయాలలోని విద్యావిధానం, అస్పృశ్యత, పారిశ్రామికవిధానం, పల్లెప్రాంతాల అభివృద్ధివంటి అనేకసమస్యల పరిష్కారానికి ప్రయత్నాలు జరిగినాయి. ఈవిధమైన సాంఘిక, ఆర్థిక,సామాజికసమస్యల పరిష్కారానికి పూర్వపు ప్రభుత్వాలు శ్రద్ధవహించియుండలేదు. పోలీసు, రెవిన్యూశాఖలకు ప్రాధాన్యతనిచ్చి, మిగతాశాఖలపరిపాలనను వాటంతటవాటికి వదలివేశారు. అప్పుడప్పుడు ఏదో కొంచెంశ్రద్ధవహించి కమీషనులనుగాని, విచారణసంఘాలనుగాని నియమిస్తూండేవారు. వీరు దేశమంతటా పర్యటించి చాలాకాలం శ్రమపడి పెద్దపెద్దనివేదికలను సమర్పించేవారు. ఆపిమ్మట ఆ నివేదికలను బుట్టదాఖలాచేసేవారు. ఏమీ పని జరిగేదిగాదు. ప్రజలు ఎంతగా కోరినప్పటికీ, సరియైనలెఖ్ఖలనైనా సేకరించేవారు కాదు. సరియైనలెఖ్ఖలు, విచారణలు, అంచనాలు, కావలసిన భోగట్టాలేకపోవడంవల్ల ఎందులోనైనా ముందుకెళ్ళడానికి ఆటంకంగానే ఉంది. అందుచేత రాష్ట్రప్రభుత్వాలకు మామూలుగాఉండే ప్రభుత్వకార్యకలాపాలమాటటుండగా, చాలాకాలంనుంచి అశ్రద్ధచేయడంవల్ల గుట్టలుగుట్టలుగా పెరిగిపోయిన పనినికూడా చూచుకోవలసివచ్చేది. నలుమూలలా అతిముఖ్యమైన సమస్యల నెదుర్కొనవలసివచ్చింది.

పోలీసురాజ్యాన్ని సంక్షేమదాయకమైన రాష్ట్రంగా మార్చడం సులభమైనపని కాదు. రాష్ట్రప్రభుత్వాలకు బహుపరిమితమైన అధికారాలుండడంవల్లనూ, ప్రజలదారిద్ర్యంవల్లనూ రాష్ట్రప్రభుత్వాలకూ, వైస్రాయి నిరంకుశపరిపాలనకులోనైన కేంద్రప్రభుత్వానికీ మధ్యగల భేదాభిప్రాయాలవల్లనూ ఈ పని మరింత కష్టమైనది.

ఈ హద్దులు, అడ్డంకులు మేము తెలుసుకున్నాం. ఈవిధమైన పరిస్థితులు పరిపూర్ణంగామారితేనేతప్ప ఏమీ చెయ్యడంసాధ్యంకాదు. యిదే మాపూర్ణస్వాతంత్ర్యాభిలాషకుకారణం. ఇతరదేశాలతోపాటు అనేకవిధాల అభివృద్ధిచెందాలనే అభ్యుదయకాంక్ష మమ్మల్ని ఆవరించింది. అమెరికా పురోగమనాన్ని, కొన్ని తూర్పుదేశాల అభివృద్ధిని మేము పరిశీలించాం. రెండుదశాబ్దాలలో యుద్ధాలవల్లనూ, అంతర్యుద్ధాలవల్లనూ చెప్పనలవికాని కష్టాలనెదుర్కొని యిప్పుడు విపరీతమైన అభివృద్ధిగాంచిన సోవియట్ రష్యాను మేము చాలామందిమి ఉదాహరణగా తీసుకొన్నాము. కొందరిని కమ్యూనిజం ఆకర్షించినది. కొందరిని ఆకర్షించలేదు. కాని అందరిని సోవియట్ భూమిలో విద్య, సంస్కృతి, వైద్యసహాయం, ప్రజల దేహదారుఢ్యం మొదలైన విషయాలలో కలిగిన అభివృద్ధి ఆశ్చర్యచకితులనుచేసింది. వివిధజాతులను సమీకరించి, పాతకాలపు శకలాలనుంచి ప్రపంచాన్ని సృష్టించడం చాలా ఆశ్చర్యకరమైన విషయం స్వతంత్రాభిప్రాయాలుగల్గిన రవీంద్రనాథ టాగూర్‌లాంటివాడు కమ్యూనిస్టుసిద్ధాంతాలయెడల సానుభూతిలేనివాడైనా, ఈ నవీననాగరికతను మెచ్చుకొని ఆయన తన దేశంలోని పరిస్థితులతో పోల్చిచూచాడు. ఆయన మరణశయ్యపైనుండి "అసామాన్యమైనశక్తితో రష్యా వ్యాధిని, నిరక్షరాస్యతను ఎదుర్కొని, దారిద్ర్యాన్ని, అజ్ఞానాన్ని సువిశాలమైనదేశంలో రూపుమాపింది. రష్యాసంస్కృతిలో జాతిమతాలమధ్య ఏవిధమైన తేడాకాని, అసూయకాని లేదు. శీఘ్రంలో ఇంత ఆశ్చర్యకరమైన పురోగతినిచూచి నేను చాలా ఆనందిస్తున్నాను. ఒకవిధంగా మత్సరపడుతున్నానుకూడా యితరచోట్ల దాదాపు రెండువందలజాతులు మొన్నమొన్నటిదాకా వేర్వేరుగాఉండి అభివృద్ధివిషయంలో అనేక అంతస్థులుగానుండిన జాతులు, శాంతంగా అభివృద్ధిమార్గాన పురోగమిస్తుంటే, నా దేశంలో గొప్ప

మేధావులైనవారుకూడా అజ్ఞానంలోపడి కొట్టుకుపోతుంటే రెండింటినీ నిల్పకుండా ఉండలేను. ఒక ప్రభుత్వానికి పునాది పరస్పరసహకారం; రెండోప్రభుత్వానికి దోపిడీవిధానం మూలం" అన్నాడు.

యితరులకుసాధ్యమైనపని మనకెందుకు సాధ్యంకాదు? మనకు స్వశక్తి, తెలివితేటలు ఉన్నాయి. ఎలాగైనా దేశాన్నినిలద్రొక్కి ఓర్మితో విజయంసాధించగలమనేవిశ్వాసం, అచంచలమైననమ్మకం ఉంది. మనలనెదుర్కొనేకష్టాలేమిటో మనకు తెలుసును. మనదారిద్ర్యాన్ని మందగమనాన్ని, వర్గభేదాలను, సామాజికప్రతికూలశక్తులను-అన్నిటినీ మనం ఎదుర్కొని నిగ్రహించగలం. యిది చాలాకష్టతరమైనపనినీ,చాలా శ్రమపడాలనీ తెలుసును. కాని మనస్థితిగతులలో రోజూపడుతున్న కష్టాలలో యిదొక లెక్కకాదు. పైనుంచి బ్రిటిష్‌పరిపాలనవల్లనూ, ఆక్రమణలవల్లనూ జరిగే అనేకక్లిష్టసమస్యలు మనల నడుగడుగున వేధిస్తున్నప్పుడు, మన ఆంతరంగికసమస్యలపరిష్కారాని కెక్కడ మొదలు పెట్టాలనేదే ప్రశ్న. రాష్ట్రప్రభుత్వాలఅధికారాలు ఎంతతక్కువా,పరిమితమూ అయినప్పటికీ, ఉన్నఅవకాశంలోనే దాన్ని పరిపూర్ణంగా వుపయోగించుకోవాలని భావించాము. కాని, ఇది మా మంత్రులకు గుండెలవిసిపోయేటంతపని అయింది. వారికిమెడతిరగనిపనులు, బాధ్యతలు మరీ పెరిగిపోయాయి. పైగావారికి,స్థిరమైనఉద్యోగులకూమధ్యసామరస్యము, సద్భావాలు, ఏకదృక్పథంకూడా లేనందున యీభారాన్ని కొంత వారి కప్పగించడానికికూడా వీలులేదు. దురదృష్టవశాత్తు యీ మంత్రులసంఖ్యకూడా అతిస్వల్పం. వారు నిరాడంబరజీవితం గడపుతూ, ప్రభుత్వఖర్చులలో పొదుపుచేస్తూ ఆదర్శప్రాయమైనప్రమాణాలు నెలకొల్పవలసివుంది. వారిజీతాలూ తక్కువే. మంత్రిక్రిందపనిచేసేకార్యదర్శిగాని ఉన్నతోద్యోగిగాని, మంత్రికంటె నాలుగైదురెట్లు ఎక్కువజీతాలూ, బత్తాలూ తీసుకునే విచిత్రపరిస్థితికూడా ఉంది. మేము యీ ఉద్యోగుల జీతబత్తాలవిషయంలో జోక్యంకలిగించుకోరాదు. అంతేగాక, మంత్రి రెండవతరగతిలోనో, మూడవతరగతిలోనో మామూలురైలుపెట్టెలో ప్రయాణంచేస్తుంటే, అతనిక్రిందివుద్యోగి అదేరైలులో మొదటితరగతిలోనో, ప్రత్యేకించబడినరాజభోగాలసెలూన్‌లోనో ప్రయాణంచేస్తూండడం కూడా కద్దు.

కేంద్రకాంగ్రెసుకార్యవర్గం ఉత్తర్వులుపంపుతూ ఈ రాష్ట్రప్రభుత్వాలకార్యకలాపాలలో తరచుగా జోక్యంకలిగించుకుంటున్నదని అనేక సార్లు అపవాదువెయ్యబడింది. ఇది పూర్తిగా అసత్యం. అంతరంగపరిపాలనలో ఎట్టిజోక్యమూ కలిగించుకోబడలేదు. రాష్ట్రప్రభుత్వాలన్నీ కూడా ప్రాథమిక రాజకీయసమస్యలన్నింటిలో ఒకేరకమైనవిధానం అవలంబించాలని మాత్రమే కాంగ్రెసు ఆశించింది. ఇంకా, కాంగ్రెసు ఎన్నికలప్రణాళికలోని కార్యక్రమాలను సాధ్యమైనంతవరకు అమలుజరపాలనికూడా హెచ్చరికచేసింది. ప్రత్యేకంగా గవర్నరులకు, కేంద్రప్రభుత్వానికి సంబంధించినవిధానం ఒకేవిధంగా వుండాలన్నది.

కేంద్రప్రభుత్వంలో యేమార్పు లేకుండానే రాష్ట్రాల్లో ప్రజాప్రతినిధులపాలన యేర్పాటుచేయడం, కేంద్రప్రభుత్వం పూర్తిగా బాధ్యతారహితంగా, నిరంకుశంగా ప్రవర్తించడం – రాష్ట్రీయతత్వము పెంపొందడానికీ, విభేదాలకూ దారితీసి, భారతీయైక్యతాభావాన్ని తగ్గించుతుంది. బ్రిటిష్‌ప్రభుత్వం విచ్ఛిన్నకరశక్తులను, అట్టిభావాలను ప్రోత్సహించడమే తనప్రత్యేకవిధానంగా పెట్టుకుని, ఆవిధానాన్ని కొనసాగించాలని దృష్టిలోపెట్టుకునివుండవచ్చు. భారతప్రభుత్వం తొలగించ వీలులేనిదిగా, బాధ్యతారహితంగా, ఇప్పటికీ బ్రిటిష్‌సామ్రాజ్యతత్వ సాంప్రదాయాన్నే ప్రతిబింబిస్తున్నది. అది కొండంత దృఢంగా నిలబడి, రాష్ట్రప్రభుత్వాలన్నింటితోను ఒకేవిధంగా వ్యవహరిస్తున్నది. గవర్నరులు ఢిల్లీనుంచి, సిమ్లానుంచివచ్చే వుత్తర్వులప్రకారమే ప్రవర్తిస్తున్నారు. రాష్ట్రీయకాంగ్రెసుప్రభుత్వాలు యిందుకు భిన్నంగా దేనికదితనకులోచినట్లు ప్రవర్తించినట్లయితే, వాటిని విడివిడిగా ధ్వంసంచేసి వేసేవారే. అందువల్ల, రాష్ట్రప్రభుత్వాలన్నీ ఒకేవిధానమవలంబించి భారతప్రభుత్వాన్ని ఐక్యంగా ఎదుర్కోవడం అత్యవసరమయింది. మరోవైపున భారతప్రభుత్వం యిట్టిసహకారభావం యేర్పడకుండా అడ్డుపడేందుకు ఆతురతపడుతున్నది. అది ఒక్కొక్క-రాష్ట్రప్రభుత్వవ్యవహారాలను వేర్వేరుగా-ఇతరరాష్ట్రాలలోని అదేవ్యవహారాలతో పోలికలేకుండా పరిష్కరించాలని ప్రయత్నించింది.

రాష్ట్రాలలో కాంగ్రెసుప్రభుత్వాలు యేర్పడగానే, 1937 ఆగష్టులో కాంగ్రెసుకార్యవర్గం యీ క్రిందితీర్మానాన్ని ఆమోదించింది:

"ఏ జాతీయపునర్నిర్మాణప్రణాళికకుగాని, సాంఘిక కార్యక్రమానికిగాని అతివేగంగా పరిష్కరించవలసిన ముఖ్యసమస్యలు కొన్ని ఉంటాయి. అట్టిసమస్యలను పరిశీలించి, నివేదించుటకు ఒక నిపుణులసంఘాన్ని నియమించవలసిందిగా కాంగ్రెసుమంత్రులకు కాంగ్రెసుకార్యవర్గం శిఫారసు చేస్తున్నది. అట్టిపనికి కూలంకషమైన పరిశోధనలుజరపడం, వివరాలను సేకరించడం, సాంఘికప్రయోజనాన్ని స్పష్టంగా లక్ష్యంలోవుంచుకోవడం అవసరం. ఇట్టిసమస్యలలో అనేకం ఇరుగుపొరుగురాష్ట్రాలప్రయోజనాలతోకూడా ముడిపడివుంటాయి అందువల్ల వీటిని (రాష్ట్రానికే) పరిమితం చేసి సమర్థవంతంగా పరిశీలించడం సాధ్యంకాదు. విధ్వంసకరమైన వరదలను అరికట్టేందుకు, నీటిని వ్యవసాయానికై ఉపయోగించేందుకు, భూములు ప్రవాహాలవల్ల కోసుకుపోయేసమస్యను పరిశీలించేందుకు, మలేరియాను రూపుమాపేందుకు, జలవిద్యుచ్ఛక్తిఉత్పత్తి మొదలగు ప్రణాళికలకు – నదులను విస్తారంగా పరిశోధించవలసివుంటుంది. ఇందుకోసం ఒక్కొక్కనదీలోయను పూర్తిగాపరిశీలించి, కొలిచి, అంచనాలు వేయవలసిఉంటుంది భారీయెత్తున ప్రభుత్వప్రణాళికలు తయారుచేయాలి. పరిశ్రమలస్థాపన, నిర్వహణలకుకూడా అనేకరాష్ట్రాలుకలసి, సహకరించుకోవలసిఉంటుంది. కాబట్టి ముందుగా ఒక అంతర్రాష్ట్రీయనిపుణుల సంఘాన్ని ఏర్పరచవలసినదిగా యీ కార్యవర్గం సూచిస్తున్నది. ఆ సంఘం ఎదుర్కొనవలసిన సమస్యల సాధారణస్వభావాన్ని పరిశీలించి, ఆ సమస్యల నేవిధంగా ఏవరుసక్రమంలోపరిష్కరించాలో సూచించాలి. అట్టిసమస్యలను వేర్వేరుగా సాకల్యంగా పరిశీలించి, వాటికిసంబంధించిన రాష్ట్రప్రభుత్వాలకు సంయుక్తంగా జరుపవలసినకార్యక్రమాన్ని సూచించేందుకు ప్రత్యేకసంఘాలనుగాని, పాలకవర్గాలనుగాని యేర్పరచవలసినదిగా నిపుణులసంఘం సూచించవచ్చును."

అప్పుడప్పుడురాష్ట్రప్రభుత్వాలకు కాంగ్రెసుకార్యవర్గం అందిస్తూ వచ్చిన సలహాలస్వభావాన్ని తెలుసుకునేందుకు ఈ తీర్మానం చాలు. ఇది వివిధరాష్ట్రప్రభుత్వాలమధ్య ఆర్థిక, పారిశ్రామికరంగాలలో సహకారాన్నిప్రోత్సహించాలని కాంగ్రెసుకార్యవర్గం ఎంతగా కాంక్షిస్తున్నదోకూడా తెలియజేస్తుంది. ఈ తీర్మానం వారికే సంబోధింపబడినప్పటికి, ఇది కాంగ్రెసుప్రభుత్వాలకుమాత్రమే పరిమితంకావలసినది

కాదు. ఒక నదీలోయను పూర్తిగా పరిశోధించాలంటే అనేకరాష్ట్రాల సరిహద్దులను దాటవలసివుంటుంది. గంగానదీమైదానపరిశోధన, గంగానదీ సంఘ (అత్యంతప్రధానమైన యీ పని ఇంకా జరుగలేదు) స్థాపన జరగాలంటే – సంయుక్తరాష్ట్రాలు, బీహారు, బెంగాలురాష్ట్రాలు మూడూ సహకరించుకోవలసిఉంటుంది.

ఈ తీర్మానము ప్రభుత్వం భారీఎత్తున ప్రణాళికలు వేయాలనే దానికి కాంగ్రెసుసంస్థ యెంతటిప్రాముఖ్యాన్నిస్తున్నదో కూడా ఋజువు చేస్తున్నది. కేంద్రప్రభుత్వం ప్రజాప్రతినిధులఆధ్వర్యంక్రిందికివచ్చి, రాష్ట్రప్రభుత్వాలకున్న బంధనాలన్నింటినీ తొలగించితేనేగాని, యిట్టి ప్రణాళికారచన సాధ్యంకాదు. ఏమైనప్పటికి, ప్రస్తుతం అత్యవసరమైన ప్రాథమికకృషి జరుగవచ్చుననీ, ఆవిధంగా భవిష్యత్ప్రణాళికలకు పునాదులు వేసుకోవచ్చుననీ మేము ఆశించాము. దురదృష్టవశాత్తు, రాష్ట్ర ప్రభుత్వాలు తమస్వంతవ్యవహారాల్లో నిమగ్నమైవుండడంవల్ల, ఈ తీర్మానం అమలుజరిగేందుకు ఆలస్యమయింది. 1938 చివరలో జాతీయప్రణాళికాసంఘం ఏర్పరచబడింది. నేను దానికి అధ్యక్షుడనయ్యాను.

నేను తరచుగా కాంగ్రెసుప్రభుత్వాలకృషిని విమర్శిస్తూండేవాణ్ణి. వారు సాధిస్తున్న పురోగమనం అతినెమ్మదిగా జరగడాన్ని చూచి, నాకు కోపంవచ్చేది. కాని, వెనక్కితిరిగి, రెండుంపాతికసంవత్సరాల అల్పవ్యవధిలోనే, వారినిచుట్టుముట్టిన అసంఖ్యాకమైనచిక్కులతో కూడా వారు సాధించినవి చూస్తే, నా కాశ్చర్యంకలిగింది. దురదృష్టవశాత్తు వారిప్రధానమైనపనులలో కొన్ని ఫలించనేలేదు. వారికృషి పూర్తికాబోతూవుండగా, రాజీనామా లివ్వడం, ఆతరువాతవచ్చిన ప్రభుత్వం (గవర్నర్లే) ఆ పనులను వెనుకపెట్టివుంచడంజరిగింది. రైతులు, పారిశ్రామికకార్మికవర్గమూ లాభంపొంది, బలపడ్డారు. అన్నిటికంటె ముఖ్యమైనదీ, మహత్తరఫలితాలుసాధింపగలిగినదీ బేసిక్ విద్య అనబడే నూతనవిద్యావిధానాన్ని ప్రవేశపెట్టడం. ఈ విధానం అత్యంతాధునిక విద్యాసిద్ధాంతాలపునాదితోనేగాక, ప్రత్యేకంగా భారతదేశపరిస్థితులకు అనుగుణ్యంగా తయారుచేయబడింది.

ప్రతి స్వార్థప్రయోజకవర్గము అభ్యుదయకరమైనమార్పులకు అడ్డుతగిలింది. కాన్పూరువస్త్రపరిశ్రమలో పనిచేస్తున్న కార్మికులస్థితి గతులను పరిశీలించేందుకు యు. పి. ప్రభుత్వం నియమించినసంఘాన్ని యజమానులు (ఎక్కువమంది యూరోపియనులు) చాలా అమర్యాద కరంగాచూడడమేగాక, వారుకోరిన అనేకవివరాలు, సంఖ్యలు ఇవ్వ డానికి నిరాకరించారు. కార్మికులు బహుకాలంగా అటు యజమాను లను, యిటు ప్రభుత్వాన్నీ కూడా ఎదుర్కోవలసివచ్చింది. పోలీసు లెప్పుడూ యజమానులపక్షమే వహించేవారు. కార్మికవిధానంలో కాంగ్రెసుప్రభుత్వం ప్రవేశపెట్టిన మార్పులను యజమానులు నిరసిం చారు. ఇండియాలోని కార్మికోద్యమంతో బహుకాలపరిచయముకలిగి కార్మికసమస్యలపట్ల మితవాదదృష్టిగల బి. శివరావు యిలావ్రాశాడు : "సమ్మెలు మొదలైనసందర్భాలలో యజమానులు పోలీసులసహా యంతో వేసిన లెక్కలేనన్నిఎత్తులూ, అన్యాయమని సంకోచమైనా లేకుండా ప్రవర్తించినతీరులూ భారతదేశపరిస్థితులు తెలియనివారికి నమ్మశక్యంకాకుండావుంటాయి." అనేకదేశాలప్రభుత్వాలు - అవి నిర్మాణమైనవిధానాలవల్ల - సాధారణంగా యజమానులపక్షమే వహిస్తాయి. ఇండియాలో యీపక్షపాతం మరింత ఎక్కువగావుండడానికి మరోకారణంకూడా వున్నదని శివరావు ఎత్తిచూపాడు. "ఇండియాలో అధికారవర్గానికి వ్యక్తిగతంగా కార్మికవర్గాలంటే శత్రుభావం వుంది. అంతేగాక, కార్మికసంఘాలను పెంపొందనిస్తే ప్రజాచైతన్యాన్ని వృద్ధి చేస్తాయనేభయంకూడా వుంది. అసలే ఇండియాలో రాజకీయోద్యమం సహాయనిరాకరణ, శాసనోల్లంఘనరూపాలలో అప్పుడప్పుడూ ప్రజ్వ రిల్లుతూవుంటే, ప్రజావుద్యమం సంఘటితమయ్యే ప్రమాదాన్నిమాత్రం రానీయకూడదని అధికారవర్గం పట్టుదలతోవుంది."[2]

ప్రభుత్వాలు విధానాలను నిర్ణయిస్తాయి. శాసనసభలు చట్టాలు చేస్తాయి. కాని, చివరికి యీనిర్ణయాలను అమలుజరపడం, యీచట్టా లను వర్తింపజేయడం ఉద్యోగబృందంపైనా, అధికారవర్గంమీద ఆధార పడివుంటుంది. కాబట్టి ఈరాష్ట్రప్రభుత్వాలు ఐ. సి. ఎస్. ఉద్యోగుల మీద, పోలీసులమీద ఆధారపడకతప్పదు. ఈ పాలనాయంత్రం విభి న్నమైననిరంకుశాధికారసాంప్రదాయానికి అలవాటుపడివున్నది. ఈ

కొత్తవాతావరణాన్ని, ప్రజలు అధికారయుతంగా ప్రవర్తించడాన్ని, తమప్రాముఖ్యత తగ్గిపోవడాన్ని, తాము అరెస్టుచేసి జైలులోవుంచిన వ్యక్తులకే తాము వినయవిధేయతలు చూపవలసిరావడాన్ని - యీ అధికారులు సహించలేకపోయారు. మొదట్లో ఏంమంచుకొస్తుందోనని భయం కూడా పొందారు. కాని, విప్లవకరమైనదేమీ తమమీదికి రాలేదు. వారు క్రమంగా అధికారకార్యక్రమాలలో నిమగ్నులయ్యారు. మంత్రులు పనిచేసేఉద్యోగివిషయంలో - మరీస్పష్టంగాకనుపించే వ్యవహారసందర్భంలోతప్ప- జోక్యంకలిగించుకోవడం సులభంగాదు. ఉద్యోగి బృందమంతా ఒకేఒకసంస్థవలె ఐక్యభావాన్ని యేర్పరుచుకున్నారు. అందులోఒకవ్యక్తినిబదిలీచేసినా, తరువాతఆస్థానంలోవచ్చేవ్యక్తి కూడా అదేపద్ధతిలో ప్రవర్తించేవాడు. ఆ ఉద్యోగిబృందానికి వెనుకటి అభ్యుదయనిరోధక, నిరంకుశాధికారధోరణులను హఠాత్తుగా మార్చడం సాధ్యంకాదు. కొద్దిమందివ్యక్తులు మారవచ్చు. మరికొందరు నూతన పరిస్థితులకనుగుణంగా పరివర్తనచెందేందుకు ప్రయత్నించవచ్చు. కాని, వారిలో అధికసంఖ్యాకులు వేరుగా ఆలోచిస్తూ, వేరుగానే ప్రవర్తించే వారే. అలాంటివారు ప్రశాంతసముద్రంమీద గాలివీచగానే అలలు లేచినట్లుగా, హఠాత్తుగా మారిపోయి, నూతనసమాజస్థాపనకై తమ సర్వశక్తులను ఎలా కేంద్రీకరిస్తారు? మహాచేస్తే, నిర్వికారంగా, ఇష్టం లేనిస్వామిభక్తినిమాత్రమే ప్రదర్శించగలరు. ఉన్నపరిస్థితులను, మన స్తత్వాలను పరిశీలిస్తే, వారు నూతనవిధానంలో విశ్వాసంలేక, తమ స్వార్థాలుదెబ్బతింటాయనేదృష్టితోనే వున్నారుగనుక, వా రా విధానాలను అమలుపరచేందుకు ఉత్సాహం ప్రదర్శించలేరు. దురదృష్టవశాత్తు యిట్టి నిర్వికారస్వామిభక్తి కూడా వారిలో లేదు.

ఉద్యోగిబృందంలో ఉన్నతాధికారులు ప్రత్యేకంగా అధికారతత్వానికి, నిరంకుశపాలనకు, చిరకాలంగా అలవాటుపడినవారు. తమకోసం ప్రత్యేకించబడిన అధికారరంగంలో- యీ మంత్రులూ, శాసనసభ్యులూ పిలవనిపేరంటంగావచ్చారని వారు భావించేవారు. ఈ శాశ్వతాధికారవర్గం- అందులోను బ్రిటిష్‌వ్యక్తులు - మాత్రమే భారతదేశమనీ, మిగతవారంతా అప్రధానులనీ, వారి విశ్వాసం నశించలేదు. ఈ కొత్తగావచ్చినవారితో పనిచేయడం సులభమేమీ కాదు. ఇక, వారి

నుండి ఉత్తర్వులుపొందడం ఏంబాగుంటుంది! అస్పృశ్యులు తన స్వంత దేవాలయగర్భగుడిలోనికి వస్తే సనాతనహిందువుడు పొందేభావాన్నే యీ ఉన్నతాధికారవర్గం పొందింది. తా మెంతో శ్రమపడినిర్మించు కున్నగౌరవ, జాత్యౌన్నత్యాలభవనము, దాదాపు తమ మతమైపోయిన ఆ భావము- పగుళ్ళువారుతున్నది. 'ముఖం' విషయంలో చీనావారికి అపరిమిత నమ్మకమట. కాని, ఇండియాలోని బ్రిటిష్‌వారికంటే, ముఖం విషయంలో ఏ చైనీయుడూ అంతఅభిమానంగా వుండగలడని నేననుకోను. బ్రిటిష్‌వారి ఈస్వాభిమానం వారివ్యక్తిత్వానికీ, జాతికీ, జాతీయగౌరవానికీసంబంధించినదిమాత్రమే కాదు, తమపరిపాలన, స్వార్థప్రయోజనాలతోకూడా గట్టిగా ముడిపడియున్నటువంటిది.

అయినప్పటికి ఈ కొత్తగావచ్చినవారిని "సహించక" తప్పదు. వీరివల్ల అపాయంజరగవచ్చునన్నేభయం తగ్గిపోయినకొద్దీ, వారి "సహనం"కూడా తగ్గిపోసాగింది. ఈ దృక్పథం అన్నిశాఖలలోనూ వ్యాపించింది. కాని, రాష్ట్రరాజధానికి దూరంగావున్నవారిలో మరింత ఎక్కువయింది. ప్రత్యేకంగా "లాఅండ్ ఆర్డరు"లకు సంబంధించిన జిల్లా అధికారాలన్నీవుండే కలెక్టరు, పోలీసుఅధికారులలో యిది స్పష్టంగా కనుపించింది. కాంగ్రెసుప్రభుత్వాలు పౌరస్వత్వహక్కులు పరిమితం చేయరాదని నొక్కిచెబుతున్నారనేసాకుతో స్థానికాధికారులు, పోలీసులు సాధారణంగా ఏ ప్రభుత్వము అనుమతించజాలని సంఘటనలు జరుగుతూంటే చూస్తూఊరుకున్నారు. నిజానికి ఈ అవాంఛనీయసంఘటనలను స్థానికాధికారులూ, పోలీసులే అనేకసందర్భాలలో ప్రోత్సహించి వుంటారనికూడా నా నమ్మకం. అప్పుడుజరిగిన మతకలహాలలో అనేకానికి చాలాకారణాలుండవచ్చు. కాని, మేజస్ట్రేట్లూ, పోలీసులూ యీ నిందాబాధ్యతకు దూరులుకాదు. అనుభవంవల్ల తెలుస్తున్నదాన్నిబట్టి వేగంగా, సమర్థవంతంగా వ్యవహరించితే, యిలాంటి దుస్సంఘటనలను వెంటనే ఆపివేయవచ్చును. మేము తరచుగా చూచినదేమిటంటే - యీ అధికారులు ఆశ్చర్యకరమైనంత అశ్రద్ధగా, కావాలని బాధ్యతారహితంగా ప్రవర్తించడం. వారివుద్దేశం కాంగ్రెసుప్రభుత్వాలను అపనిందలపాల్జేయడమేనని తేలిపోయింది. స్థానికాధికారులు అధికారుల అధికారదుర్వినియోగం, హీనమైన అసమర్థత, దురుద్దేశ

పూర్వకంగా బాధ్యతలను విస్మరించడం — పారిశ్రామికనగరమైన కాన్పూరులో ప్రత్యేకంగా రుజువయింది. 1925-35 ల మధ్య అప్పుడప్పుడు మతకలహాలు జరిగాయి. అవి ఒక్కొకసారి స్థానికకొట్లాటలకు కూడా దారితీశాయి. కాంగ్రెసుప్రభుత్వాలు అధికారం స్వీకరించిన తర్వాత, యివి చాలా తగ్గిపోయాయి. ఈ కలహాలస్వభావం మారిపోయి, రాజకీయస్వరూపందాల్చి, దురుద్దేశపూర్వకంగా రెచ్చగొట్టబడిన ఉద్యమాలయ్యాయి.

ఐ. సి. ఎస్ వుద్యోగులు అత్యంతసమర్థులనేఖ్యాతి (ఎక్కువగా సొంతడబ్బాకొట్టుకున్నదే) వుంది. కాని, తమ కలవాటైన పనిలోతప్ప యితరవిషయాల్లో వట్టి అసమర్థులూ, నిస్సహాయులూనని తేటతెల్లమయింది. ప్రజాస్వామికంగా ప్రవర్తించడం వారికి నేర్పబడలేదు. ప్రజల మంచిని, సహకారాన్ని వారుపొందలేరు. ప్రజలంటే వారికి భయమూ, అసహ్యంకూడాను. వారికి వేగంగా అమలుజరిపే పెద్దపెద్ద సాంఘికాభ్యుదయప్రణాళికలు ఉంటాయనే తలంపే లేదు. వారికిచేతనైనది వాటిని తమ అధికారమందబుద్ధి కార్యకలాపాలతో, భావశూన్యతతో నిరోధించడం మాత్రమే. ఏ కొద్దిమందినో మినహాయిస్తే, ఉన్నతోద్యోగాల్లో వున్నబ్రిటిష్, భారతీయాధికారులందరూ ఇంతే; తా మెదుర్కోవలసిన నూతనకార్యక్రమస్వభావాలకు వా రెంతగా తగనివారో చెప్పడం సామాన్యంకాదు.

ప్రజాప్రతినిధులలోకూడా ఎంతో అసమర్థత, అయోగ్యతలు లేకపోలేదు. కాని, వారికి శక్తి, ఉత్సాహం, ప్రజలతోగలసాన్నిహిత్యం, తమతప్పులనుంచి గుణపాఠాలు నేర్చుకోవాలనేకాంక్ష-యీ లోపాన్ని సరిపుచ్చగలవు. వారి ఉజ్వలశక్తి, ఉత్సాహం, పొంగులువారేజీవితం, పరిస్థితులగడ్డుస్థితిని గుర్తించడం, కార్యం సాధించాలనేకాంక్ష కలసి-బ్రిటిష్‌పాలకవర్గము, వారినిబలపరిచేవారి ఉదాసీనమితవాదస్వభావాన్ని మరింత బట్టబయలుచేశాయి. సాంప్రదాయసిద్ధమైన భారతభూమి ఆవిధంగా తద్వ్యతిరేకమైనరూపాన్ని ధరించి, ప్రపంచాన్ని చకితపరచింది. ఒక గొప్ప చైతన్యవంతమైన సమాజానికి ప్రతినిధులుగా యిండియాకు వచ్చిన బ్రిటిష్‌వా రిప్పుడు స్తబ్ధసాంప్రదాయాన్ని అంటిపెట్టుకునే వారిలో ముఖ్యులయ్యారు. భారతీయుల్లో అనేకమంది నవచైతన్యంతో

ంగానేగాక, ఆర్థిక, సాంఘికమార్పులు జరగాలని ఆతురపడు
న్నారు. ఆ భారతీయులవెనుక, వారుకూడా గుర్తించనట్టి నూతన
శక్తులు పనిచేస్తున్నాయి. ఈ విధంగా పాత్రనిర్వహణలో తారుమారు
జరగడంవల్ల బ్రిటిష్‌వారు గతంలో ఇండియాలో ఎట్టిసృజనాత్మకము,
అభివృద్ధిదాయకమైన పాత్రనిర్వహించినా, ఏనాడో అది మానుషుని
ప్రవిధమైన అభ్యుదయానికైనా ఆటంకపరిచేవారూ, నిరోధకులూ
మాత్రమే అయ్యారని వెల్లడయింది. వారి ఉద్యోగజీవితసరణి చూటుకు
లేనిదై, ఇండియాను ఎదుర్కొంటున్న ఏ ప్రధానసమస్యను పరిష్క
రించే సామర్థ్యం వారికి లేదు. ఒకప్పుడు స్పష్టంగా, శక్తివంతంగా
ధ్వనించిన వారిపలుకులుకూడా ఇప్పుడు అస్పష్టంగా, బలహీనంగా,
అర్థవిహీనంగా ఉంటున్నాయి.

బ్రిటిష్‌అధికారులు ఒకకట్టుకథను బాగాప్రచారంచేసుకున్నారు.
తమ ఉత్తమసేవలద్వారా, స్వపరిపాలనమనే కష్టప్రదమైన, అతిచిక్కైన
కళను మనకునేర్పుతున్నారట. ఈ బ్రిటిష్‌వారు ఇక్కడికివచ్చి, తర్ఫీ
దివ్వకముందే మనం కొన్నివేలయేండ్లు స్వపరిపాలన విజయవంతంగానే
సాగించుకోగలిగాం. మనకు కావలసిన మంచిలక్షణాలన్నీ లేనిమాట
నిజమే. ఈలోపం బ్రిటిష్‌పాలనవల్లనే యేర్పడినదని కొందరు తప్పు
దారిలోపడ్డవారు అనవచ్చు. మనలోపాలేమైనప్పటికి, ఇక్కడవున్న
బ్రిటిష్‌ఉద్యోగులుమాత్రం భారతదేశాన్ని ఏ అభ్యుదయపథంలోను
ముందుకునడిపే సమర్థతకలవారు కాదని స్పష్టంగా కనిపిస్తుంది. పోలీసు
రాజ్యంలో వుండవలసినలక్షణాలకు, పురోగమిస్తున్న ప్రజాస్వామిక
సంఘానికుండవలసినలక్షణాలకు హస్తిమశకాంతరభేదంవున్నందువల్ల
బ్రిటిష్‌అధికారులకుగల లక్షణాలే వారిని నిరుపయోగపరులనుచేశాయి.
వారు యితరులను తర్ఫీదుచేయాలనుకొనేముందు, తాము పొందిన
తర్ఫీదును విడనాడుకోవడం, తామింతవరకువున్న పరిస్థితిని విస్మరించగలందులకు "లీథే" నీటిలో స్నానంచేయడం మంచిది.

ప్రజాప్రతినిధులుగల ఒకరాష్ట్రప్రభుత్వం నిరంకుశాధికారాలు
గల కేంద్రప్రభుత్వంక్రింద వుండి, పనిచేయడమనేది అనేక విభేదాలకు
దారితీసింది. కాంగ్రెసుప్రభుత్వాలుపౌరస్వాతంత్ర్యాలనుపరిరక్షించాలని
ఆతురతపడ్డాయి. రాజకీయవాదులను, ప్రభుత్వవ్యతిరేకభావాలుగల

వారని అనుమానించబడినవారిని నీడల్లాగా అనుసరించడమే వ్యాపకంగావుంటున్న సి. ఐ. డి. (రాష్ట్రీయ) శాఖయొక్క విచ్చ విహారాన్ని అరికట్టేందుకు కాంగ్రెస్ ప్రభుత్వాలు ప్రయత్నించాయి. చర్యలు అరికట్టబడేసరికి, కేంద్రప్రభుత్వ రహస్యపోలీసుశాఖ మరింత శక్తితో పనిచేయసాగింది. మా వుత్తరాలనేగాక, మంత్రులఉత్తరప్రత్యుత్తరాలనుకూడా అప్పుడప్పుడు సెన్సారుచేయడం జరిగింది. అయితే యిది రహస్యంగా జరుపుతూ, పైకి అంగీకరించేవారుకాదు. గత పాతికేండ్లుగా నేను స్వదేశంలోవారికి, విదేశాల్లోవారికిగాని వ్రాసినజాబులలో ఏ ఒక్కటీ ఇండియాలో పోస్టులోవేస్తే-అది యీ రహస్యపోలీసుశాఖ చూడకుండావుంటుందనిగాని, దానికి కాపీతీసుకోకుండావుంటుందనిగాని అనుకొని వ్రాసియుండలేదు. నాసంభాషణను దారికొట్టివింటారనే విషయం జ్ఞాపకంవుంచుకోకుండా టెలిఫోనులో ఒక్కసారికూడా మాట్లాడలేదు. నాకువచ్చేవుత్తరాలుకూడా సెన్సారులేకుండా వచ్చేవి కావు. అంటే, ప్రతియొక్కవుత్తరమూ సెన్సారుజరుగుతున్నదని కాదు. ఒక్కొక్కసారి అన్నీ, కొన్నిసార్లు కొన్నిటినిమాత్రమే ఏరి, సెన్సారు చేసేవారు. ఇది యుద్ధానికిసంబంధించినజాగ్రత కాదు. యుద్ధకాలంలో రెండేసిసెన్సార్లు జరిగేవి.

అదృష్టవశాత్తు, మేము ఏపనిచేసినా బహిరంగంగానే చేసేవాళ్ళం. రాజకీయంగా రహస్యంగాదాచుకోవలసిన దేమీ వుండేది కాదు. అయినా, యీ సెన్సారుచేయడం, పొంచివినడం, రహస్యంగా వెంబడించడం జరుగుతున్నాయనేవి సంతోషదాయకం కాదు. ఈ భావన చికాకును, యిరకాటాన్ని సృష్టించి, ఒక్కొక్కసారి వ్యక్తిగత బంధుత్వాలకు ఆటంకమవుతుంది. వీపువెనుకనుంచి సెన్సారువాళ్ళు చూస్తున్నారనేభావం వదలనప్పుడు, మనం అనుకున్నదంతా వ్రాయడం సులభంకాదు.

మంత్రులు ఎంతో శ్రమపడి పనిచేశారు. కొందరు ఆ వత్తిడివల్ల ఆరోగ్యాన్నికూడా కోల్పోయారు. కొందరిఉత్సాహతేజం మాసిపోయి, ముసలితనం, అలసటప్రతిఫలించాయి. కాని, తమ ప్రత్యేకబాధ్యతల గుర్తింపు వారిచేత మరింతపనిచేయించింది. వారు తమక్రింద ఐ. సి. ఎస్ కార్యదర్శులచేతా, వారిసిబ్బందిచేతకూడా అధికంగాపనిచేయించారు.

వారి కార్యాలయాలలో రాత్రులు ప్రొద్దుపోయేవరకూకూడా దీపాలు వెలుగుతూండేవి. 1939 నవంబరు మొదటిభాగంలో యీ కాంగ్రెసు మంత్రులు రాజీనామాలిచ్చేసరికి అనేకమంది హాయిగా వూపిరిపీల్చుకు న్నారు అప్పటినుంచీ ప్రభుత్వకార్యాలయాలు కచ్చితంగా సాయంత్రం నాలుగింటికే మూతలుపడేవి మళ్ళీ పూర్వపుతాబేలునడక, ప్రశాంత వాతావరణం, ప్రజలకుప్రవేశంలేకపోవడం యీకార్యాలయాలలో నెలకొన్నాయి. జీవితం మామూలుగాడిలో పడింది. సాయంత్రపు వేళల్లో పోలో, టెన్నిస్, పేక వగైరాఆటలాడుకోవచ్చును. క్లబ్బులో సరససల్లాపాలతో గడుపవచ్చును. ఒక పీడకల అదృశ్యమైంది. ఇక మళ్ళీ వ్యాపారము, ఆటలూ పూర్వంలాగా కొనసాగించుకోవచ్చును. యుద్ధంజరుగుతున్నమాట నిజమే. అయితే అది ఎక్కడో యూరపులో. హిట్లర్ సైన్యాలు పోలండును ధ్వంసంచేశాయి. కాని, ఇదంతా ఎంతో దూరంలో జరుగుతున్నది. అయినా యుద్ధం యుద్ధమే. సైనికులు తమ బాధ్యతనిర్వహించుతూ యుద్ధంచేస్తున్నారు, చస్తున్నారు. ఇక్కడ మాత్రం తమబాధ్యతలు నిర్వర్తించడంలేదూ! తెల్లవారిభారాన్ని సమర్థవంతంగా, ఠీవిగా మోయడం బాధ్యతే!

కాంగ్రెసుప్రభుత్వాలు రాష్ట్రపరిపాలనచేసిన కొద్దికాలపు అనుభవంలోనే, బ్రిటిష్‌వారు మనమీదరుద్దిన రాజకీయ, ఆర్థికవ్యవస్థలే మనపురోగమనానికి మహాఅడ్డంకులనే మావిశ్వాసం మరింత ధృవపడింది. పురోగమనానికి మనపురాతనసాంప్రదాయాలూ, సనాతనాచారాలూ, సాంఘిక స్వభావకృతులూ, ప్రధానకారణాలనేదికూడా వాస్తవమే. కాని, భారతదేశపుఆర్థికస్థితిగతి పురోగమించడానికి మనలోని యీ అవ లక్షణాలుమాత్రం కారణంకాదు. బ్రిటిష్‌వారి రాజకీయ కబంధహస్తాలే దీనికి పూర్తిగా కారణం. ఆ ఉక్కుచట్రమే మనల్ని బాధించకపోతే ఆర్థికపురోగమనం తప్పనిసరిగా జరుగుతుంది. దానితోపాటు ఉడిగి పోయిన ఛాందసాచారాలు తుడిచిపెట్టుకుపోయి, సాంఘికాభ్యుదయం సాధ్యమవుతుంది. అందువల్ల, ఆ ఉక్కుచట్రాన్ని తొలగించేందుకే శక్తి అంతావినియోగించాలి. ఇతరవిషయాల్లో వెచ్చించే శక్తి, సామర్థ్యాలు ఇసుకపర్రను దున్నితేకలిగే ఫలితాన్నే యిస్తాయి. ఆ ఉక్కుచట్రం భూస్వామికతత్వము, ఇంకా అలాంటి అవశేషాలపైనే నిర్మించబడి,

ఆ పురాతనలక్షణాలనే కాపాడుతున్నది. ఇండియాలో ఎటువంటి ప్రజాస్వామ్యమైనా బ్రిటిషువారి రాజకీయ, ఆర్థికవ్యవస్థలతో పొత్తు కుదరడంలేదు. ఈ రెండింటిమధ్య సంఘర్షణ తప్పనిసరి. అందువల్లనే 1937–39 సంవత్సరాల్లో యేర్పడిన పాక్షికప్రజాస్వామ్యం ఎప్పుడూ సంఘర్షణాభిముఖంగానేవుంది. అందువల్లనే బ్రిటిష్‌వారు, ఇండియాలో ప్రజాస్వామ్యవిధానం విజయవంతంకాదని ప్రచారంచేశారు. వారిదృష్టిలో తామేర్పరచియుంచిన స్వార్థశక్తులప్రయోజనాలను, ఆర్థికవ్యవస్థానిర్మాణమును, ఆ విలువలను యథాతథంగా వుంచగలదానికే ప్రజాస్వామ్యమని నిర్వచనం. తాము ఆమోదించగల్గిన అట్టిబానిసగుణంగల ప్రజాస్వామ్యం ముందుకురానందున, ప్రగతిశీలమైన వివరీతపుమార్పులు తలపెట్టబడినందున బ్రిటిష్‌వారు ప్రజాస్వామ్యమనినటించడం మాని, పూర్తిగా నిరంకుశాధికారపాలనకే మళ్ళారు. ఇట్టిదృక్పథం ఏర్పడడానికీ, యూరపులో ఫేసిజం పుట్టి, పెంపొందడానికీ చాలా దగ్గరపోలికలున్నాయి. ఇండియాలో చట్టబద్ధమైనపాలన సాగిస్తున్నామని గర్వించే బ్రిటిషువారు, ఇప్పుడు యుద్ధంలోఆక్రమించుకున్నరాజ్యాన్ని పాలించుతున్నధోరణిలో ఆర్డినెన్సులు, ప్రత్యేకచట్టాలతో భారతదేశాన్ని పాలించసాగారు.

## 2 అల్పసంఖ్యాకులసమస్య – ముస్లింలీగు – మహమ్మదాలీ జిన్నా

గడచిన ఏడుసంవత్సరాలలోనూ ముస్లింలీగుపొందిన అభివృద్ధివికాసము అసామాన్యము, అత్యద్భుతమూను. జాతీయకాంగ్రెసులోచేరకుండా ముస్లింయువకులను వేరుగావుంచేందుకుగాను బ్రిటిష్‌వారిప్రోత్సాహంతో 1906 లో స్థాపింపబడింది. అది ఫ్యూడల్‌మన సత్వంగలవారిచే నడుపబడుచు, కొద్దిమంది భాగ్యవంతులసంస్థగా మాత్రమే ఉండిపోయింది. దానిప్రభావమేమీ ముస్లింప్రజానీకంపై ప్రసరించలేదు. అసలు వారికి దానిసంగతే తెలియదు. దానినిర్మాణవిధానంవల్లనే అది ఒకచిన్నకూటమికిచెంది శాశ్వతనాయకత్వానికి కట్టుబడివుంటుందని తేలుతుంది. అయినా, కొన్నిసంఘటనలు, ముస్లిములలో పెంపొందుతున్న మధ్యతరగతిప్రజలూ దానిని కాంగ్రెసువైపుకునెట్టారు. మొదటి ప్రపంచయుద్ధము, టర్కీ– ఖిలాఫత్ ఉద్యమవిఫలత, పవిత్రముస్లిం

క్షేత్రాలు భారతీయముస్లింలను సంచలింపజేసి బ్రిటిష్వ్యతిరేకులుగా తయారుచేశాయి. ముస్లింలీగు తననిర్మాణస్వభావాన్నిబట్టే చైతన్య వంతులైన ముస్లింప్రజానీకానికి సరియైన దారిచూపడంగాని, నాయ కత్వంవహించడంగాని చేయలేకపోయింది. వాస్తవానికి, యీసంచల నాన్నిచూచి, లీగు భయంచే అల్లల్లాడిపోయి, రూపమేమాసిపోయింది. ఖిలాపత్కమిటీ అనే కొత్తముస్లింసంస్థ ఏర్పడి, కాంగ్రెసుసన్నిహిత సహకారంతో పెంపొందింది. ముస్లింలు అసంఖ్యాకులుగా కాంగ్రె స్లో చేరి, పనిచేయసాగారు. 1920-23లలోజరిగిన మొదటిసహాయ నిరాకరణోద్యమం తరువాత, ఖిలాఫత్కమిటీస్థాపనకు మూలాధార మైన టర్కిష్ఖిలాఫత్ అదృశ్యమవడంతో యీకమిటీకూడా అదృశ్యం కాసాగినది. ముస్లింప్రజానీకం రాజకీయాలనుంచి వైదొలగిపోయింది. హిందూప్రజలుకూడా కొంతతక్కువగా ముస్లిములవలెనే ప్రవర్తిం చారు. కాని, ముఖ్యంగా మధ్యతరగతుల ముస్లిములనేకమంది కాంగ్రె సులో పనిచేస్తూ వుండిపోయారు.

ఈకాలంలోనే అనేక చిన్నచిన్న ముస్లింసంస్థలు కుక్కగొడు గుల్లాగా లేచాయి. అవి తరచుగా పరస్పరంకలహించుకుంటూవుండేవి. వాటికి ప్రజాసభ్యత్వం లేదు. బ్రిటిష్ప్రభుత్వమిచ్చే ప్రాధాన్యతతప్ప, రాజకీయప్రాముఖ్యత ఏమీ లేదు. శాసనసభలలోనూ, ఉద్యోగాల లోనూ ముస్లిములకు ప్రత్యేకసౌకర్యాలు కల్గించాలని వత్తిడిచేయడం, ముస్లిములకు రక్షణకోరడం - ఇవే యీ సంఘాలప్రధానలక్ష్యాలు. విద్య, ఉద్యోగాలు, పరిశ్రమలు, వ్యాపారములలో తమకంటె హిందువు లెంతో మెరుగుగా అధికసంఖ్యలో వున్నారని, రోషంతో, భయంతో ముస్లిములు నిరసనభావం కలిగివుండేవారు. ఆ నిరసనభావాన్ని ప్రద ర్శించుటలో ఈ సంఘాలు బాగానే ప్రాతినిధ్యంవహించాయి. మహమ్మ దాలీ జిన్నా భారతరాజకీయరంగంనుంచి విరమించుకున్నాడు. వాస్త వానికి, ఆయన ఇండియానుంచే తప్పుకొని, ఇంగ్లండులో స్థిరనివాస మేర్పరచుకున్నాడు.

1930లో జరిగిన రెండవశాసనోల్లంఘనోద్యమంలో ముస్లిములు విరివిగా పాల్గొన్నారు. అయితే ఈసంఖ్య 1920-23నాటి ఉద్యమంలో చేరినవారికంటె తక్కువే. ఈ రెండవఉద్యమంలో జైళ్ళకెళ్ళినవారిలో

పదివేలమందికిపైగా ముస్లిములే. ఈ ఉద్యమంలో నూటికి 95 మంది ముస్లిములేగల సరిహద్దురాష్ట్రం గణనీయమైనపాత్రవహించింది. ఆ రాష్ట్రంలో పఠానుల ఏకైక ప్రియతమనాయకుడు ఖాన్ అబ్దుల్ గఫూర్‌ఖాన్ కృషీ, వ్యక్తిత్వమే దీనికికారణం. ఇటీవలికాలంలో ఇండియాలో జరిగిన-అత్యాశ్చర్యకరమైనసంఘటనగాపేర్కొనదగ్గది గఫూర్ ఖాన్‌కృషి. సాధారణంగా ఘర్షణలు, తగాదాపడే మనస్తత్వంతో చెలరేగే పఠానులను ఆయన తనబోధనలద్వారా రాజకీయచర్యను శాంతియుతపద్ధతులతోసాగించునట్లు, కిమ్మనకుండా అనేకబాధ లనుభవించేటట్టు చేశాడు. ఆ బాధలు భయంకరమైనవై, అనేక కఠినస్మృతులను శాశ్వతముద్రవేశాయి. అయినా, ఆ బాధలుపెట్టిన ప్రభుత్వశక్తులనుగాని, తమ్ము వ్యతిరేకించినవారిపైగాని ఏమాత్రం దౌర్జన్యచర్యకు దిగక, పఠానులు ప్రదర్శించిన సహనము, ఆత్మనిగ్రహము అద్భుతమైనవి. పఠాను తన సోదరునికంటె తనతుపాకి నెక్కువగా ప్రేమిస్తాడనీ, అతిస్వల్పవిషయానికే రేగిపోయి, ఎదుటివాడిని చంపివేస్తాడని చిరకాలప్రసిద్ధి వహించినవాడనీ గుర్తుంచుకుంటే - ఈ ఉద్యమంలో పఠానులు ప్రదర్శించిన ఆత్మనిగ్రహం విచిత్రంకంటె విచిత్రమే!

ఖాన్ అబ్దుల్ గఫూర్‌ఖాన్ నాయకత్వాన వాయవ్యరాష్ట్రం కాంగ్రెసుపక్షాన దృఢంగా నిలబడింది. ఇతరప్రాంతాలలో రాజకీయచైతన్యంగల మధ్యతరగతుల ముస్లిములుకూడా ఎక్కువగా కాంగ్రెసునే అనుసరించారు. రైతులు, కూలీలలో కాంగ్రెసుకుగల పలుకుబడి గణనీయమైనది. ప్రత్యేకంగా సంయుక్తరాష్ట్రాలలో అభ్యుదయకరమైన కర్షక - కార్మికకార్యక్రమాలున్నందున ఆ వర్గాలు మరీ సన్నిహితమయ్యాయి. అయినప్పటికీకూడా ముస్లింప్రజలలో ఎక్కువమంది తమస్థానికనాయకత్వంకేసి, పాత ఫ్యూడల్ నాయకత్వంవైపే మొగ్గారనేది యథార్థం. ఆ నాయకులు హిందువులు మొదలగువారినుండి ముస్లింప్రయోజనాలసంరక్షకులుగా వారిముందుకు వెళ్ళి, వారిని ఆకర్షించారు.

"మతసమస్య" - అది అలా పిలువబడింది - అధికసంఖ్యాకుల చర్యలనుండి అల్పసంఖ్యాకులకు తగురక్షణలుకల్పించాలన్నవాదనను తృప్తిపరచడంకన్న వేరేమీకాదు. ఈ సందర్భంలో ఒక ముఖ్యవిశే

షాన్ని గుర్తుంచుకోవాలి. ఇండియాలోని అల్పసంఖ్యాకులు యూరపు లోవలె తెగ, జాతులపరంగా అల్పసంఖ్యాకులుకాదు. వారుమతవిషయి కంగా అల్పసంఖ్యాకులు. జాతులపరంగా చూస్తే, ఇండియా అనేకానేక జాతులతో యేర్పడిన విచిత్రమిశ్రమస్వరూపంగలది. కాని, జాతుల పరంగా ఏసమస్యలూ ఇండియాలో తలెత్తలేదు; తలెత్తలేవు. మతము ఈ జాతివిభేదాలను మించిపోతుంది. ఈ జాతులు ఒకదానితో ఒకటి ఐక్యమై, విడమర్చడానికి వీలులేకుండా ఉంటాయి. మతసంబంధమైన హద్దులుకూడా శాశ్వతంగా వుండేవి కావు. మతాంతరీకరణాలు తరచుగా జరుగుతూనేవుంటాయి. మతాంతరుడయ్యేవ్యక్తి తనజాతి, భాష, సంస్కృతులవారసత్వాన్నీ, చరిత్రనుకూడా పోగొట్టుకోలేడుగదా! ఇటీవల 'మత'మనే పదాన్ని తరచుగా ఉపయోగించుకొని, అమాయకులను వంచించడం జరుగుతున్నప్పటికి, ఈ మతం సరియైన అర్థంలో భారతరాజకీయసంఘర్షణలలో ఎన్నడూ ప్రముఖపాత్రవహించలేదు. మతాలు పరస్పరసహనభావమెక్కువగాకలిగివున్నందువల్ల మతభేదాలనేవి రాజకీయాలకు అడ్డురాలేవు. రాజకీయవిషయాలలో మతము యొక్కస్థానాన్ని కులతత్వం ఆక్రమించింది. మతసంబంధమైన కులతత్వం ఆధారంగాగల యీ సంకుచిత ముఠామనస్తత్వం, వాస్తవానికి, ఆ తత్వాన్నిపెంచిన ముఠాకు రాజకీయశక్తిగా, ప్రాపుగా ఉపయోగపడుతుంది.

ఈ కుల, మతసమస్యలను, అందుకుసంబంధించిన ముఠాలసమ్మతితో అందరికీ తృప్తికరంగా పరిష్కరించాలని కాంగ్రెసు, తదితర సంస్థలు పదేపదే ప్రయత్నించాయి. కొంతవరకు అది సాధ్యమయింది. కాని, బ్రిటిష్‌ప్రభుత్వము, దానికుత్సితవిధానము వుండడమే ఎప్పుడూ ప్రధానఆటంకమైపోయింది. సహజంగా, బ్రిటిష్‌వారు తమకువ్యతిరేకంగా చెలరేగుతున్నప్రజావుద్యమాన్ని రాజకీయంగా బలపరచే ఏ పరిష్కారానికి సుముఖంగావుండరు. విభేదాలుగలవారిలో ఒకరికంటె మరొకరికి అధికసౌకర్యాలు కలిగిస్తూ, ఒకరిపైకి మరొకరిని రెచ్చగొడుతూ, బ్రిటిష్‌వారు నాటకమాడడానికి వీలుగావుంది. ఈ ముక్కోణపుఆటలో మిగత రెండుపార్టీలు తెలివిగలవైతే, అసలునాటకాన్ని గ్రహించి, బ్రిటిష్‌వారిఆటంకాన్ని అధిగమించగలిగేవి. కాని,

వారికి దూరదృష్టి, వివేకము తక్కువయ్యాయి. ఏదో ఒకఒడంబడికకు రావడం జరిగేసరికి, బ్రిటిష్ ప్రభుత్వం మరేదో కొత్తయెత్తువేసి ఒడంబడికకుచేసినకృషి అంతా తారుమారుచేసేది.

అల్పసంఖ్యాకులసంరక్షణసూత్రానికి - అఖిలపక్షమహాసభ సూచించినసూత్రాలవలె-ఏపేచీ లేదు. అందరికి సమానంగా వర్తించే అన్నివిషయాలు ఏకగ్రీవంగా అంగీకరింపబడినవి. ప్రజాస్వామికరాజ్యాంగంలో మతము, సంస్కృతి, భాష, వ్యక్తి లేక కూటమియొక్క ప్రాథమికహక్కులు రక్షింపబడగలవని ప్రాథమికఒడంబడికసూత్రాలలో హామీఇవ్వబడింది. ఇంతేగాక, భారతదేశచరిత్రఅంతా అల్పసంఖ్యాకులు వివిధతెగలవిషయంలో అత్యంతసహనానికి, ప్రోత్సాహానికి సాక్షిగా నిలచివుంది. యూరపులో విజృంభించిన తీవ్రమతకలహాలతోను, జరిగినపీడనలతోను పోల్చదగినవి ఇండియాచరిత్రలోనే లేవు. మత, సంస్కృతీసహనఆదర్శాలకోసం మనము విదేశాలకువెళ్ళనక్కర లేదు. ఇవి భారతీయజీవితంలోనే అంతర్గర్భితంగా వున్నాయి. వ్యక్తిగత, రాజకీయహక్కులూ, పౌరస్వేచ్ఛాస్వాతంత్ర్యాలను మేము అమెరికన్, ఫ్రెంచివిప్లవాలనుంచి, బ్రిటిష్‌పార్లమెంటు నిర్మాణచరిత్రనుంచి పాఠాలునేర్చుకున్నాం. తరువాత సోషలిస్టుఆదర్శాలూ, సోవియట్‌విప్లవమూ వచ్చి, మా ఆలోచనలకు బలీయమైన ఆర్థికదృక్పథాన్నికూడా చేకూర్చినవి.

వ్యక్తికీ, కూటమికీ వుండవలసినహక్కులనన్నింటిని రక్షించడమేగాక, ప్రభుత్వమూ, ప్రజాసంస్థలూ కూడా ద్వేషాన్ని, లేనిపోనిభేదాలను ప్రేరేపించే సాంఘిక, సాంప్రదాయకబంధనాలను పూర్తిగా తొలగించివేసేందుకు అందరూ కృషిచేయవలసినదే. ఈబంధనాలవల్ల వ్యక్తిగాని, కూటమిగాని పూర్తిగా వికసించేందుకు వీలుండదు. అంతేగాక విద్య, ఆర్థికరంగాలలో వెనుకబడియున్నవర్గాలకు మరింతసహాయపడి, వారి అశక్తతలను సాధ్యమైనంతశీఘ్రంగా తొలగిపోయేటట్టుచూడాలి. ఇది ప్రత్యేకంగా అణగద్రొక్కబడినవర్గాలకు వర్తింపజేయబడినది. పౌరులుగా పురుషులతోసమానంగా స్త్రీలుకూడా పాల్గొనే వెసులుబాట్లు కల్పించాలనికూడా అంగీకరించబడింది.

ఇక మిగిలిందేమిటి? అధికసంఖ్యాకులు అల్పసంఖ్యాకులను రాజకీయంగా మ్రింగివేస్తారనేభయం. నిజం చెప్పుకోవాలంటే – అధిక సంఖ్యాకు లెవరు? రైతులు, కూలీలు. వీరు అన్నిమతవిశ్వాసాలకు చెందిన అసంఖ్యాకజనం. చిరకాలంగా విదేశీపాలకులచేతనేగాక, తమ అగ్రవర్గాలచేతకూడా దోచుకోబడినవర్గం యిది. మతము, సంస్కృతి మొదలగునవి రక్షింపబడుతాయని హామీయిచ్చినతరువాత, ఇంక మిగిలేవి ఆర్థికసమస్యలే. వీటికి వ్యక్తియొక్క మతంతో ఏమాత్రం సంబంధంలేదు. వర్గసంఘర్షణలు వుంటేవుండవచ్చునుగాని, మతసంఘర్షణలు వుండవు. ఒకవేళ మతము స్వార్థపరులప్రయోజనానికి ప్రాతినిధ్యంవహించితే అప్పుడు సంభవమే. ఏమైనప్పటికి, మతవిభేదాలదృష్టితోనే ఈ సమస్యను ఆలోచించడానికి ప్రజలు అలవాటుపడిపోయారు. వారు అలా అలవాటుపడేటట్లు మతసంస్థలు నిరంతరకృషి, ప్రచారము చేశాయి. ప్రభుత్వచర్యకూడా అధికసంఖ్యాకమైన హిందూమతవర్గము – అంటే హిందువులు – అల్పసంఖ్యాకులగు మిగతవారిని తొక్కివేస్తుందనే భయాన్ని ముస్లిములలో కల్గించడానికి కొనసాగించబడినది. కొన్ని రాష్ట్రాలలో అత్యధికసంఖ్యాకులై మునుముందు, స్వతంత్రప్రతిపత్తి పొందగల ముస్లిముల ప్రయోజనాలకు ఎంత అధికసంఖ్యాకవర్గమైనా ఎలా నష్టంకల్గించగలదని భయపడ్డారో బోధపడకుండావుంది. కాని, భయం హేతుబద్ధంకాదుగదా!

ముస్లిములకు (తరువాత ఇతర చిన్నచిన్న వర్గాలకుకూడా) ప్రత్యేకనియోజకవర్గముల నేర్పాటుచేసి, వారిజనాభానిష్పత్తికంటే అధికస్థానాలను కేటాయించారు. కాని, ప్రజాప్రతినిధులసభలో ఎక్కువప్రాతినిధ్యం లభించినంతమాత్రాన అల్పసంఖ్యాకులు అధికసంఖ్యాకులైపోలేరు. వాస్తవానికి, యీ ప్రత్యేకనియోజకవర్గపద్ధతి పరిస్థితిని మరింతశోచనీయంచేసింది. అధికసంఖ్యాకులనియోజకవర్గానికి చెందిన అల్పసంఖ్యాకులు అచటి ఎన్నికలపట్ల శ్రద్ధవహించడం మానివేశారు. సంయుక్తనియోజకవర్గాలలో అభ్యర్థి అన్నివర్గాలతో, తెగలతో పరస్పరఒడంబడికలు, సర్దుబాట్లు చేసుకోవలసివుంటుంది. ఇప్పుడేర్పడిన పద్ధతివల్ల యీ అవసరం లేకపోయింది. కాంగ్రెసు యింతకంటె ముందంజవేసింది. అధికసంఖ్యాకవర్గానికీ, అల్పసంఖ్యాకమతవర్గానికీ

మధ్య ఆ అల్పసంఖ్యాకవర్గానికి సంబంధంగల ఏ విషయానికైనా హానికలిగేసమస్యపై భేదాభిప్రాయం ఉదయించినప్పుడు – ఆ సమస్యా పరిష్కారాన్ని అధికవోట్లననుసరించి నిర్ణయించకూడదనీ, దానిని నిష్పాక్షిక న్యాయసంఘానికిగాని, అంతర్జాతీయసంఘానికిగాని అంతిమ పరిష్కారంనిమిత్తం పంపవలసినదనీ కాంగ్రెసు ప్రకటించింది.

ఏప్రజాస్వామికవిధానంలోనైనా, ఏఅల్పసంఖ్యాకమతానికిగాని, ముఠాకుగాని ఇంతకంటే గొప్పరక్షణ ఏముంటుందో వూహించలేము. ఇంకొకసంగతికూడా గుర్తుంచుకోవాలి. కొన్నిరాష్ట్రాలలో ముస్లిములే అధికసంఖ్యాకులుగా వున్నారు. రాష్ట్రాలు చాలవరకు స్వాతంత్ర్యప్రతిపత్తి గలవి. కనుక భారతదేశంమొత్తానికి సంబంధించినసమస్యలను మినహాయిస్తే, ముస్లిములు ఆ రాష్ట్రాలలో తమ కిష్టమైనవిధానాలననుసరించ డానికి కొంతవరకు స్వేచ్ఛకలిగివుంటారు. కేంద్రప్రభుత్వంలోకూడా ముస్లిములకు ప్రముఖప్రాతినిధ్యం వుంటుంది. వారుపాలించేరాష్ట్రాలలో యీసమస్య తలక్రిందులౌతుంది. అధికసంఖ్యాకులైనముస్లిములనుండి తమహక్కులను కాపాడవలసినదిగా అక్కడి అల్పసంఖ్యాకులు (హిందువులు, శిఖ్ఖులు) ఆందోళనచేస్తారు. అదేవిధంగా పంజాబులో హిందూ–శిఖ్ఖు–ముస్లిముల ముక్కోణసంఘర్షణ యేర్పడుతుంది. ముస్లిములకుప్రత్యేకనియోజకవర్గాలుంటే, వారు అధికంగావున్నచోట యితరులుకూడా తమకురక్షణకావాలని వత్తిడిచేస్తున్నారు. ఒకసారి ప్రత్యేకనియోజకవర్గపద్ధతిని ప్రవేశపెట్టితే యిటువాదనలకు, ముఠాలకు, చీలికలకు అంతువుండదు. ఒకముఠాకు జనాభాదామాషాకంటె ఎక్కువ ప్రాతినిధ్యం యివ్వడమంటే, అధికసంఖ్యాకవర్గానికి జనాభానిష్పత్తిని ఉండవలసినప్రతినిధులసంఖ్యను తగ్గించడమే. ఇట్టివిధానం వూహాతీతమైన వికృతఫలితాలనుసృష్టించింది. ముఖ్యంగా బెంగాలులో యూరోపియనులకు మితిమీరినప్రాతినిధ్యం యివ్వబడినందున, సాధారణనియోజకవర్గాలు హాస్యాస్పదంగాఉండేటంతగా తగ్గిపోయాయి. భారతరాజకీయ, వైజ్ఞానికరంగాలలోను, స్వాతంత్ర్యోద్యమంలోను అతిప్రముఖపాత్రను నిర్వహించిన బెంగాల్‌నాయకులు రాష్ట్ర, కేంద్రశాసనసభలలో అత్యల్పమైనప్రాతినిధ్యాన్నిమాత్రమే పొందారు. వారు చట్టం సభ్యత్వ

సంఖ్యను నిర్బంధంలో పెట్టి పరిమితంచేయడంవల్ల రాష్ట్రశాసనసభలో తా మెంత బలహీనస్థితిలోవున్నారో గ్రహించారు.

కాంగ్రెసు అనేక పొరపాట్లుచేసింది. కాని, ఇవి ఎత్తుగడలకు, విధానాలకుసంబంధించిన స్వల్ప తప్పిదాలు మాత్రమే. కాంగ్రెసుసంస్థ పూర్తిగా రాజకీయకారణాలవల్లనే అయినా, యీ మతవిభేదాల సమస్యను వెంటనే పరిష్కరించాలనే తీవ్రఆసక్తినీ, ఆతురతను ప్రదర్శించింది. ఈపరిష్కారంద్వారా పురోగమనానికిగల ఆటంకాలను తొలగించాలనుకున్నది. పూర్తిగా ముతాతత్వము, మతతత్వంగలసంస్థలకు యిట్టి ఆతురతలేదు. అసలు వాటిమనుగడకు పునాదులే యీ విభేదాలు గనుక, తమముతాలప్రత్యేకప్రయోజనాలకొరకు వత్తిడిచేయడమే వాటి జీవితం గనుక, పరిస్థితులు యథాతథంగావుండడమే వాటికి మేలనిపించడం సహజమే. కాంగ్రెసుసభ్యులలో అత్యధికసంఖ్యాకులు హిందువులైనప్పటికి, అందులో ముస్లిములు, శిఖ్కులు, క్రైస్తవులు మొదలైన అన్ని మతాలవారూ వున్నారు. కాబట్టి అది జాతీయవాదదృక్పథంలోనే ఆలోచించకతప్పదు. జాతీయస్వాతంత్ర్యసాధన, ప్రజాస్వామికప్రభుత్వ స్థాపనలే కాంగ్రెసుప్రధానాశయాలు. విశాలమూ, నానావిధమైన ఇండియావంటి దేశంలో అధికసంఖ్యాకులు అన్నివిషయాలలోను అల్పసంఖ్యాకులను త్రోసిరాజనే సాధారణప్రజాస్వామికపద్ధతి తృప్తికరం కాదనీ, అట్టిది నెలకొల్పడం సాధ్యమైనా, వాంఛనీయంకాదనీ అది గుర్తించింది. కాంగ్రెసు సహజంగానే దేశైక్యతను వాంఛించి, దానిని నిర్వివాదాంశంగా భావించింది. అయితే, భారతీయసాంస్కృతికజీవితంలోని నానావిధశోభలను ఒకేరూపంలోనికి నిర్బంధించవలసినకారణం దానికి కనుపించలేదు. అందువల్ల, ప్రాంతీయస్వాతంత్ర్యానికి, సాంస్కృతికాభ్యుదయానికివ్యక్తుల, వర్గాల స్వాతంత్ర్యానికి తగినన్నిరక్షణలు వుండడానికి అంగీకరించింది.

కాని, జాతీయైక్యత, ప్రజాస్వామ్యం అనే రెండు ప్రాథమిక సమస్యలపై కాంగ్రెసు అచంచలంగా నిలబడింది. ఈ రెండింటిపునాదుల మీదనే కాంగ్రెసు పుట్టి, గత ఏబదిసంవత్సరాలనుంచి పెరుగుతూ వాటిని నొక్కిచెపుతూవచ్చింది. నాకు తెలిసినంతవరకు సిద్ధాంతరీత్యాను ఆచరణలోనూకూడా పూర్తిప్రజాస్వామికంగా వ్యవహరిస్తున్నసంస్థల్లో

కాంగ్రెసు ఒకటి. దేశమంతటా యేర్పడిన దానివేలాదిస్థానికసంఘాల ద్వారా, అది ప్రజలను ప్రజాస్వామ్యపద్ధతుల్లో తరిఫీతుచేసి, గణనీయ మైన విజయాన్ని సాధించింది. ప్రజాహృదయాలను చూరగొన్న మహోన్నతవ్యక్తిత్వంగల గాంధీకి కాంగ్రెసుపై అమితపలుకుబడి వున్న ప్పటికీ, అది అతిప్రధానమైన దాని ప్రజాస్వామ్యానికి భంగంకలిగించ లేదు. ఏ దేశంలోనైనా క్లిష్టపరిస్థితులలోను, పోరాటములుతటస్థించి నప్పుడు ముందుకునడిపే నాయకునికోసం దృష్టిని కేంద్రీకరించడం తప్పని సరి. అట్టిక్లిష్టసమస్యలు తరచుగా వుత్పన్నమౌతూంటాయి. ఇండి యాలో నిరంకుశత్వానికీ, అధికారగర్వానికీ ప్రతిబింబాలైన బ్రిటిష్‌అధి కారవర్గప్రతినిధులే కాంగ్రెసును నిరంకుశనాయకులఆధ్వర్యంగలసంస్థ అనడంకంటె విపరీతమేముంటుంది?

గతంలో సిద్ధాంతరీత్యానైనా బ్రిటిష్‌ప్రభుత్వంకూడా భారతీయ ఐక్యతకు, ప్రజాస్వామ్యానికి పాటుపడుతున్నానన్నది. అది తనపాలన ద్వారా ఇండియాలో రాజకీయైక్యతను – అది దేశాన్నంతటినీ బాని సగాచేసుకున్నరూపంలోనైనా – సాధించానని సగర్వంగా చాటుకుంది. అంతేగాక, ప్రజాస్వామికవిధానాలలో మనకు తరిఫీతునిస్తున్నానని కూడా చెప్పింది. కాని, విచిత్రమేమిటంటే, దాని విధానాలు ఆ ఐక్యతను, ప్రజాస్వామ్యాన్నే ప్రత్యక్షంగా వ్యతిరేకించడం. 1940 ఆగ ష్టులో కాంగ్రెసుకార్యవర్గం "ఇండియాలో బ్రిటిష్‌ప్రభుత్వవిధానం సాంఘికవిద్వేషాలను, సంఘర్షణలను ప్రత్యక్షంగాప్రోత్సహించి, రెచ్చ గొట్టేదిగావున్నది." అని ప్రకటించకతప్పలేదు. ప్రభుత్వబాధ్యతగల బ్రిటిష్‌ప్రతినిధులు – మరొకకొత్తఏర్పాటుకోసం ఇండియా ఐక్యతను త్యాగంచేయకతప్పదనీ, ఇండియాకు ప్రజాస్వామ్యవిధానం సరిపడదనీ మనకు బోధించసాగారు. స్వాతంత్ర్యము, ప్రజాస్వామికప్రభుత్వస్థాపన లకై ఇండియాచేస్తున్నవత్తిడికి వారిచ్చినసమాధాన మిది ఒక్కటే. తాము ఇండియాలో సాధించదలచినామని చాటుకున్న యీ రెండు ప్రధానలక్ష్యాలలోను బ్రిటిష్‌వారు విఫలులైనారనికూడా యీ సమా ధానం రుజువుచేస్తున్నది. ఇది గ్రహించేందుకే వారికి 150 యేండ్లు పట్టింది.

ఈ అల్పసంఖ్యాకులసమస్యపై అందుకు సంబంధించిన అన్నివర్గాలకు ఆమోదకరంగాఉండే పరిష్కారమార్గాన్ని కనుగొనుటలో మేము విఫలమయ్యాము. ఈవైఫల్యంచేరాగలఫలితాలనుకూడా మేమేఅనుభవించాలి గనుక; ఆ నిందనుకూడా మేమే భరించాలి. కాని, ఏ ముఖ్య ప్రతిపాదనకుగాని, ప్రధానమైనమార్పుకుగాని ప్రతిఒక్కరిని ఒప్పించడం ఎలా? ఎటువంటిమార్పునైనా వ్యతిరేకించే అభివృద్ధినిరోధక వర్గాలు ఎప్పుడూఉన్నాయి. పూర్తిగా రాజకీయార్థికసాంఘికమార్పులు రావాలనేవారూ ఉన్నారు. ఈ రెండుతరహాలవారిమధ్య ఇంకా అనేక రకాల ముఠాలు ఉన్నాయి. మార్పునుకోరేప్రతిపాదనను ఏచిన్నముఠా అయినా త్రోసిరాజనగలిగినప్పుడు, ఎన్నటికి ఏమార్పు జరుగజాలదు. జనాభా నిష్పత్తిలో కనుపించీకనుపించనంత చిన్నముఠాలను సృష్టించి ప్రోత్సహించడమే పాలకవర్గరాజనీతి అయినప్పుడు – ఇక, విజయవంతమైన మహావిప్లవం మాత్రమే మార్పును తీసుకురాగలదు. ఇండియాలో అనేక సనాతన, అభ్యుదయనిరోధకముఠాలువున్నవిషయం స్పష్టమే. అందులో కొన్ని యీగడ్డమీద పుట్టినవీ, మరికొన్ని బ్రిటిష్ వారు కృత్రిమంగా సృష్టించినవీను. సంఖ్యలో అవి అతిచిన్నవే కావచ్చును కాని, వాటికి బ్రిటిష్‌ప్రభుత్వమద్దతు ఉంది.

ముస్లిములలో లీగుగాక, ఇంకా అనేకసంస్థలు పెంపొందాయి. వాటిలో పురాతనమైనదీ, ప్రధానమైనదీ జమియత్ – ఉల్-ఉలేమా. అందులో ఇండియా అన్నిప్రాంతాలకుచెందిన మతగురువులు, సనాతన పండితులూ ఉన్నారు. అది అవశ్యం మతదృక్పథం కలిగియుండి, సాంప్రదాయక, మితవాద ఆదర్శాలుగలదైనప్పటికి రాజకీయంగా ముందంజ వేసింది. సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించినది. రాజకీయరంగంలో అనేకసార్లు కాంగ్రెసుతో సహకరించడమేగాక, కొందరు కాంగ్రెసులో కూడా సభ్యులై పనిచేశారు. తరువాతస్థాపించబడిన అహ్రార్‌సంస్థ పంజాబులో ఎక్కువబలాన్ని సంపాదించింది. అందులో క్రిందిమధ్యతరగతి ముస్లిములు ఎక్కువమంది వుండి, సామాన్యప్రజల అండదండ కూడా కొన్నిప్రత్యేకప్రదేశాలలో సంపాదించారు. మోమినులు (ముఖ్యంగా చేనేతవృత్తికిచెందినవారు) అధికసంఖ్యాకులైనప్పటికి, ముస్లిములలో కెల్ల నిరుపేదలూ, వెనుకబడిఉన్నవారూను. నిర్మాణయుక్తమైనసంఘం

లేక, బలహీనంగా ఉన్నారు. వారు ముస్లింలీగునువ్యతిరేకిస్తూ, కాంగ్రెసుతో మైత్రినెరపుతున్నారు. బలహీనులైనందున రాజకీయకార్యక్రమాలలోపాల్గొనలేదు. బెంగాలులో "కృషిక్‌సభ" (ముస్లింరైతులు) ఉన్నది. జమియత్ - ఉల్ - ఉలేమా, అహ్రార్‌సంస్థలవారు కాంగ్రెసు సాధారణకార్యకలాపాల్లోను, బ్రిటిష్‌ప్రభుత్వవ్యతిరేక తీవ్రపోరాటాల్లోను పూర్తిగాపాల్గొని అనేక కష్టనష్టాలనుభవించారు. ముస్లింసంస్థలలో ప్రధానమైన ముస్లింలీగు వాగ్వాదములతో తప్ప ఎన్నడూ బ్రిటిష్‌ప్రభుత్వంతో ఘర్షణపడియెరుగదు. ఇదితరువాత అనేకమార్పులు చెంది, అభివృద్ధిచెందినా, అసంఖ్యాకంగా ముస్లింప్రజలు అందులో చేరినప్పటికి సనాతన, అగ్రవర్గనాయకత్వంమాత్రం ఎన్నడూ వదల్లేదు.

షియాముస్లిములుకూడాప్రత్యేకసంఘంగాయేర్పడ్డారు. ఇదిఅస్పష్టంగావుంటూ, ముఖ్యంగా రాజకీయమైనకోర్కెలను వెలిబుచ్చేందుకు మాత్రమే పనిచేసింది. ఇస్లాంమతంతొలిదశల్లో అరేబియాలో ఖిలాఫత్ పదవికి ఎవరువారసులనేవిషయమై తీవ్రవివాద మేర్పడినప్పుడు షియాలు సున్నీలు అనే రెండు తెగలుగా చీలిపోయారు. ఆ వివాదానికి యిప్పుడెట్టి రాజకీయప్రాధాన్యత లేకపోయినా ఈ తెగలమధ్య విభేద, విద్వేషాలు కొనసాగుతూనేఉన్నాయి. ఇండియాలోను, ఇతరముస్లిందేశాలలోను సున్నీలు యెక్కువ. ఇరానులోమాత్రం షియాలే హెచ్చు. ఈ రెండుతెగలమధ్య మతవిషయికంగా అప్పుడప్పుడు సంఘర్షణలు కూడా జరిగాయి. ఇండియాలో షియాసంస్థ తనకుసంబంధించినంతవరకు ముస్లింలీగుకు వ్యతిరేకంగానే ఉన్నది. అందరికీ సంయుక్తనియోజకవర్గాలే ఉండాలని దానివాదన. కాని, ప్రముఖ షియాలుకూడా కొందరు లీగులో ఉన్నారు.

ముస్లింలీగుకు సంయుక్తవ్యతిరేకసంఘటనగా ఇతరముస్లింసంస్థలన్నీ కలసి "ఆజాద్‌ముస్లిసంఘం" యేర్పాటుకు కృషిచేశాయి. ఈ సంఘం ప్రథమమహాసభ 1940 లో విస్తృతప్రాతినిధ్యంతో ఢిల్లీలో జరిగింది.

ప్రధానహిందూమతసంస్థయైన హిందూమహాసభ సరిగ్గా ముస్లింలీగుకు ప్రతిద్వంద్వి. కాని, లీగుకున్నంతప్రాముఖ్యత లేదు. లీగువలెనే ఇదీ తీవ్ర మతవాది. కాని, తన అతిసంకుచితదృక్పథాన్ని అస్పష్టజాతీయ

పదాడంబరాలచాటున కప్పిపుచ్చుకో ప్రయత్నిస్తుంది. దానిదృక్పథం పురోగమనంకాదు, పునరుద్ధరణ మాత్రమే. ముస్లింలీగునాయకులవలెనే దీనికికూడా బాధ్యతారహితంగా, ఉద్రేకప్రేరకంగా ఉపన్యాసాలిచ్చే నాయకులు కొందరుండడం దురదృష్టకరం. ఈ కార్యాచరణకుబదులు రెండుతెగలనాయకులు తరచుగాచేసుకునే వాగ్వాదాలు ప్రజలను నిరంతరం రెచ్చగొట్టేవిగా వుండేవి.

ముస్లింలీగుయొక్క మతదృక్పథం గతంలో అసంబద్ధంగాను, క్లిష్టంగాను వుండేది. హిందూమహాసభదృక్పథం అంతకంటె తక్కువ దేమీకాదు. పంజాబు, సింధురాష్ట్రాలలోని అల్పసంఖ్యాకులైనహిందువులు, పంజాబులోని ప్రధానశిఖ్ఖువర్గం — తరచుగా ఒకపరిష్కారానికి రావడానికి ఆటంకాలు కల్పించుతూవచ్చారు. ఈ విభేదాలను ప్రోత్సహించి, పెంచుతూ కాంగ్రెసుకువ్యతిరేకంగా మత, కులసంఘాలకు ప్రాముఖ్యత నివ్వడమే బ్రిటిష్‌వారివిధానంగా వుంది.

ఒకపార్టీకిగాని, ముఠాకుగాని ముఖ్యమైనపరీక్ష — కనీసం దానికి ప్రజలపైగలపలుకుబడికి కొలబద్ద — ఎన్నికలే. 1937 లో సాధారణ ఎన్నికలుజరిగినప్పుడు హిందూమహాసభ చిత్తుగాఓడిపోయింది. దేశంలో ఎక్కడా దానిఛాయేలేదు. ముస్లింలీగు కొంత మెరుగు. కాని, దాని ప్రాతినిధ్యంకూడా ప్రత్యేకంగా ముస్లింజనాభా ఎక్కువగావున్నరాష్ట్రాలలోనే చాలతక్కువ. బెంగాలులోమాత్రం కొంతవరకు గెలుచుకున్నా సింధు, పంజాబులలో పూర్తిగా ఓడిపోయింది. తర్వాత సరిహద్దు రాష్ట్రంలో కాంగ్రెస్‌మంత్రివర్గంఏర్పడింది. ముస్లిములు అల్పసంఖ్యాకులుగావున్నరాష్ట్రాలలో ముస్లింలీగు ఎక్కువవిజయాలే సాధించింది. కాని, ముస్లిములు స్వతంత్రులుగానూ, కాంగ్రెసుసభ్యులుగానూ కూడా ఎందరో ఎన్నికయ్యారు.

తరువాత, రాష్ట్రాలలో కాంగ్రెసుప్రభుత్వాలకు కాంగ్రెసు సంస్థకు వ్యతిరేకంగా ముస్లింలీగుతరఫున విశేషప్రచారకార్యక్రమం ఆరంభమయింది. ప్రభుత్వాలు ముస్లిములమీద "అత్యాచారాలు" జరుపుతున్నాయని నిరంతరం ప్రచారంచేశారు. ఆ మంత్రివర్గాలలో ముస్లింమంత్రులుకూడావున్నారు. కాని, వారు ముస్లింలీగువారుమాత్రం కారు. ఈ "అత్యాచారాలు" ఏమిటో ఎవరూ చెప్పేవారేకాదు.

లేకపోతే, స్థానికంగాజరిగిన ప్రభుత్వానికిసంబంధంలేని ఏఅల్పసంఘటననో వక్రీకరించి, బ్రహ్మాండంగా ప్రచారంచేసేవారు. ప్రభుత్వశాఖలలో జరిగిన ఏచిన్నపొరపాటునో – అది వెంటనే సరిదిద్దబడినప్పటికి – పెద్ద 'అత్యాచారం'గా చిత్రించేవారు. ఒక్కొక్కసారి ఏ ఆధారమూలేని అసత్యాలనే నిందలుగా మోపేవారు. యదార్థాలతోసంబంధంలేని విచిత్ర కల్పితవివరాలతో ఒక నివేదికనుకూడా విడుదలచేశారు. కాంగ్రెసు ప్రభుత్వాలు యిట్టిఆరోపణలుచేసినవారిని విచారణకుపయోగపడేఆధారాలను పంపవలసినదనీ, లేక స్వయంగా తామేవచ్చి ప్రభుత్వాధికారుల సహాయంతో విచారణజరుపవలసిందనీ ఆహ్వానించాయి. ఈ అవకాశాలను ఎవ్వరూ స్వీకరించలేదు. కాని, వారిదుష్ప్రచారంమాత్రం సాగుతూనేవుంది. కాంగ్రెసు మంత్రివర్గాలరాజీనామాలఅనంతరం, 1940 ఆరంభంలో, నాటికాంగ్రెసుఅధ్యక్షుడుడా॥ రాజేంద్రప్రసాద్ ముస్లిం లీగుఅధ్యక్షుడు ఎం. ఎ. జిన్నాకు ఒకలేఖ, ముస్లింలీగుకు బహిరంగ ప్రకటన పంపించారు. వాటిలో కాంగ్రెసుప్రభుత్వాలకు వ్యతిరేకంగా ముస్లింలీగుచేస్తున్నఆరోపణలను ఫెడరల్‌కోర్టువిచారణకు, తీర్పుకు నివేదించవలసినదిగా ప్రసాద్ కోరాడు. జిన్నా ఈ ఆహ్వానాన్నికూడా తిరస్కరించి, బహుశా, ప్రత్యేకంగా ఒక రాయల్‌కమిషన్ నియమింపబడుతుందనికూడా సూచించాడు. అట్టిదాన్ని బ్రిటిష్‌ప్రభుత్వమే యేర్పాటుచేయగలిగివుంది. కాని, ఇందులో ఆ సమస్యే లేదు. కాంగ్రెసుహయాంలో గవర్నరులుగావున్న కొందరుబ్రిటిష్‌వారు అల్పసంఖ్యాకులపట్ల ప్రభుత్వాలు అభ్యంతరకరంగా ప్రవర్తించనేలేదని బహిరంగప్రకటనలుచేశారు. 1935 చట్టంక్రింద అవసరమేర్పడితే అల్పసంఖ్యాకులను రక్షించేందుకు గవర్నరులకు ప్రత్యేకాధికారాలున్నాయి.

హిట్లరు అధికారంలోకి వచ్చినప్పటినుంచి నాజీప్రచారపద్ధతులను నేను సునిశితంగా పరిశీలిస్తున్నాను. దాదాపు అటువంటిదే ఇండియాలోజరగడం చూచి, నేను ఆశ్చర్యచకితుణ్ణయాను. ఒకసంవత్సరం తరువాత, 1938 లో జెకోస్లావేకియా సుడేటన్‌లాండ్‌కుసంబంధించిన క్లిష్టసంఘర్షణ నెదుర్కోవలసివచ్చింది. అచ్చట అవలంబించబడిన నాజీప్రచారపద్ధతులను ముస్లింలీగు శ్రద్ధగా పరిశీలించి, ఆచరణీయమని సూచించుకోవడం జరిగింది. సుడేటన్‌లాండ్ జర్మనులతో భారతదేశ

ముస్లింలు పోల్చుకోబడ్డారు. ఉపన్యాసాలలోనూ, కొన్నిపత్రికల లోనూ రక్తపాతవాంఛ, విద్వేషప్రేరణ స్పష్టంగా కనుపించసాగాయి. ఒక కాంగ్రెసుముస్లింమంత్రి కత్తితోపొడిచివేయబడ్డాడు. కాని, ముస్లిం లీగునాయకులెవ్వరూ ఖండించలేదు. పైగా, ఆ హంతకుణ్ణి క్షమించారు. అనేక హింసాత్మకప్రదర్శనలు తరచుగా సంభవించాయి.

ఈ విషపరిణామాలకు, ప్రజాజీవితంలోనైతికవిలువలు తగ్గిపోయి నందుకు నే నెంతో విచారించాను. దౌర్జన్యము, దుర్భాషలు, బాధ్యతారాహిత్యం మితిమీరుతున్నాయి. వాటిని కొందరు బాధ్యతగల ముస్లింనాయకులు ఆమోదిస్తున్నట్లే కన్పించింది. నే నా నాయకులలో కొందరికి ఈధోరణిని అరికట్టవలసినదిగా ప్రార్థిస్తూ లేఖలువ్రాశాను. కాని, ఫలితంలేకపోయింది. కాంగ్రెసుప్రభుత్వాలకుసంబంధించినంత వరకు, ప్రతి అల్పసంఖ్యాకవర్గాన్నీ, ప్రతిముఠాను తమవైపుత్రిప్పుకోవడం తమ కేలాభంగనుక, వారు అందు కెంతో కృషిచేశారు. అందువల్ల ఇతరులకుఅన్యాయంచేసి, ముస్లిములకు అధికసౌకర్యాలు కల్పిస్తున్నారని కాంగ్రెసుమంత్రులమీద కొందరు ఫిర్యాదుచేశారుకూడాను. కాని, అది తీర్చగలిగిన ఒక ప్రత్యేకమైనఫిర్యాదు కాదు, లేక హేతుబద్ధంగా ఆలోచించవలసినసమస్యా కాదు. అది కొందరుముస్లింలీగుసభ్యులూ, వారిసానుభూతిపరులూ కలసి ప్రత్యేకంగా, అదేపనిగట్టుకొని చేస్తున్న దుష్ప్రచారం. ఏదో ఘోరదురాచారం జరుగుతున్నదనీ, దానికి కాంగ్రెసుదే బాధ్యత అనీ ముస్లింప్రజానీకం నమ్మాలనే వారిప్రచారోద్దేశం. ఆ "ఘోరం" ఏమిటో ఎవరికీ తెలిసినట్టులేదు. కాని, ఈ నినాదాలూ, శాపనార్థాలవెనుక ఏదో కొంత ఆధారంవుండకపోదు, ఇక్కడ కాకపోతే మరెక్కడో ఘోరం జరిగేవుంటుందని అనుకోవచ్చుగదా. ఉపఎన్నికలసందర్భంలో "ఇస్లాముకుఅపాయం" అనే నినాదం మార్మ్రోగించారు. తాము ముస్లింలీగుఅభ్యర్థికే ఓటుచేస్తామని పవిత్ర ఖురాన్ గ్రంథం చేతపట్టి ప్రమాణంచేయండని ముస్లింఓటర్లు కోరబడ్డారు.

ఈ విధానాలన్నీ ముస్లింప్రజానీకంలో బాగాపనిచేశాయి.కాని, దాన్నివ్యతిరేకించినవారెందరోవుండడం ఆశ్చర్యకరం. కాంగ్రెసుభూసంస్కరణకార్యక్రమంవల్ల ఆకర్షింపబడిన ముస్లింప్రజానీకం ముస్లింలీగుకు వ్యతిరేకంగా ఓటుచేశారు. లీగు ఉపఎన్నికలలో కొన్నిస్థానాలు

కోల్పోయినా, ఎక్కువగానే గెలిచింది. గెలిచినచోట్లకూడా కొందరు ముస్లింలు వ్యతిరేకంగా ఓటుచేశారు. కాని, దానిచరిత్రలో మొట్ట మొదటిసారిగా ముస్లింలీగుకు ముస్లింప్రజాసామాన్యపుమద్దతు దండిగా లభించింది. క్రమంగా అది ప్రజాసంస్థ కాగలదని ఆశించాను. జరుగు తున్నదానికి నే నెంతపరితపించినప్పటికి, లీగు ప్రజాసంస్థకావడంవల్ల, దాని సనాతననాయకవర్గం పోయి, అభ్యుదయదృక్పథంగలవారు నాయ కులుకావచ్చునని నే నాశించాను. కాని, అసలుస్థితి ముస్లింలు రాజ కీయంగా, సాంఘికంగా మరీవెనుకబడివుండి, అభివృద్ధినిరోధకులైన నాయకులచేత యిష్టంవచ్చినట్లు ఉపయోగించుకోబడడమే.

ముస్లింలీగులోని అనేకమంది సహచరులకంటె జిన్నాయే ముం దంజవేశాడు. వాస్తవానికి, మిగతావారిపైన ఆయన తలకాయగా ఉండడంవల్ల వారికి విడువరాని నాయకుడయ్యాడు. తనసహచరులదుర్ల క్షణాలను, అవకాశవాదాన్నీ తాను తీవ్రంగానిరసిస్తున్నట్లు ఆయన అనేకబహిరంగసభలలో ఒప్పుకున్నాడు. ముస్లింలలో అభివృద్ధికా ములు, నిస్వార్థపరులు, ధైర్యశీలురైనఅనేకమంది కాంగ్రెసులో చేరి, దాని ద్వారా కృషిచేస్తున్నారని ఆయనకు తెలుసు. అయినా, విధివిధానం వల్లనో, పరిస్థితులవల్లనో తాను గౌరవించలేనివారితోనే వుండకతప్పలేదు. ఆయన వారికి నాయకుడే అయినా, వారిఅభివృద్ధినిరోధకసిద్ధాంతాలకు తాను బందీకాకుండా వారిని కలిసికట్టుగావుంచలేడు. అదీగాక, ఆయన తనకిష్టంలేనిబందీమాత్రం కాడు. పైకి ఎంత ఆధునికుడుగా కనుపించి నప్పటికీ, ఆయన వృద్ధులతరానికిచెందినవాడు. ఆ తరంవారికి ఆధునిక రాజకీయాదర్శాలుగాని, పరివర్తనలుగాని తెలియవు. అందువల్ల సిద్ధాంతరీత్యా ఆయన తనఅనుచరుల కేమీ తీసిపోడు. ప్రస్తుత ప్రపంచంలో ప్రధానమైన ఆర్థికవిషయాలనుగురించి ఆయన కసలే తెలి యనట్టు కన్పిస్తాడు. ప్రథమప్రపంచయుద్ధానంతరం ప్రపంచమంతటా సంభవించిన అసాధారణసంఘటనలు ఆయనమీద ఏమీ పనిచేసినట్టు లేదు. కాంగ్రెసు రాజకీయంగా పెద్దముందంజవేయనున్నసమయంలో, జిన్నా కాంగ్రెసులోనుంచి వైదొలగిపోయాడు. తరువాత, కాంగ్రెసు ఆర్థిక, ప్రజాదృక్పథాలను పెంపొందించుకుంటున్నకొద్దీ, జిన్నా దానికి మరింతదూరమైపోయాడు. కాని, జిన్నామాత్రం సిద్ధాంతరీత్యా ఒక

తరంక్రితం ఉన్నచోటనే యిప్పుడూ వున్నట్లున్నాడు. ఇప్పుడు ఇంకా వెనక్కుపోయి, భారతీయైక్యత, ప్రజాస్వామ్యం అనే ఆదర్శాలను కూడా ఖండిస్తున్నాడు. ఆయన - "పాశ్చాత్య 'ప్రజాస్వామ్య' మనే వెర్రిమొర్రిభ్రమలమీద ఆధారపడే ఏప్రభుత్వంలోకూడా అవి మన జాలవు" అని వక్కాణించాడు. తనజీవితంలో చాలాకాలంగా యే ఆదర్శంకోసం నిలబడ్డాడో, అది "వెర్రిమొర్రిభ్రమ"యని గుర్తించ డానికి ఆయన కెంతకాలంపట్టింది!

జిన్నా ముస్లింలీగులోకూడా ఏకాకి. అతిసన్నిహితులైన సహచ రులకుకూడా ఎంతో దూరంగా వుంటాడు. అధికంగానే, అందని వ్యక్తిగా గౌరవింపబడతాడు. అతడంటే భక్తికంటే భయమెక్కువ. రాజకీయవేత్తగా ఆయనసామర్థ్యం నిస్సంశయం. కాని, ఆ సమర్థత నేటి ఇండియాలో బ్రిటిష్‌వారిపాలనవల్ల ఏర్పడిన విలక్షణపరిస్థితులతో ఏదోవిధంగా ముడిపడివుంది. ఆయన ఒక రాజకీయవేత్తయైన లాయ రుగా, యుక్తిపరుడుగా బ్రిటిష్‌ప్రభుత్వానికి, భారతజాతీయశక్తికీమధ్య మొగ్గుదేల్చగలిగినవాడని అనిపించేట్టుగారాణిస్తాడు. పరిస్థితులు యిప్పటి కంటె భిన్నంగావుంటే - ఆయన వాస్తవంగా రాజకీయార్థికసమస్యలను ఎదుర్కొనవలసివస్తే-ఆతనిసామర్థ్యం ఎంతవరకు వుపయోగపడగలదో చెప్పడం చాలాకష్టం. ఆయనకు స్వాభిమానం తక్కువకాదు గాని, యీవిషయంలోమాత్రం తనకే సందేహముండవచ్చు. అతనిలో అంతర్గతంగావున్న మార్పుఅంటేవ్యతిరేకత, యథాస్థితిని కొనసాగిం చాలనుకోవడము, చర్చలను తప్పించుకోవడము, తనతోఏకీభవించలేని వారితో ప్రశాంతంగా సమస్యలనుచర్చించడానికి ఇష్టంలేకపోవడానికి పై అనుమానమే కారణం కావచ్చు. ఆయన ప్రస్తుతపరిస్థితులకుసరిగ్గా సరిపోతాడు. ఆయనగాని, మరెవరైనాగాని నూతనపరిస్థితులకు సరిపడ గలరా, లేదా అనేది చెప్పడం కష్టం. ఆయన్ను కదిలించే వ్యామోహా మేది? ఏ లక్ష్యాన్నిచేరాలని ఆయనప్రయత్నం? లేక తా నాడుతున్న రాజకీయచతురంగంలో తానే తరచుగా ఆటకట్టించడంలో పొందుతున్న ఆనందంకంటె, మరోతీవ్రవ్యామోహమేదీ లేదా? అతనికి కాంగ్రెసంటే మహాద్వేషం వున్నట్లూ, అది కాలంతోపాటు పెరుగుతున్నట్లూ తోస్తు న్నది. ఆయన అయిష్టతలు, విముఖత్వాలూ విస్పష్టమే. అయితే,

మరి ఆయనకు నచ్చేదేమిటి? ఎంత శక్తి, పట్టుదల వున్నవాడైనా ఆయన ప్రతిదానికి 'లాకేత్వ'మిచ్చే విచిత్రమన స్తత్వంగలవాడు. అందువల్ల, ఆయన అసలుఉద్దేశ్యమేమిటో తెలుసుకోవాలనిచేసేప్రయత్నాలన్నీ వృథాయే. అది ఒకరికి అందేదికాదు.

ఇండియాకు బ్రిటిష్‌పాలనవచ్చినప్పటినుండి ముస్లిములలో ఉద్భవించిన ఆధునికమహాపురుషులు చాలతక్కువ. వారిలో అనేకమంది గణనీయవ్యక్తులున్నమాట నిజమే. కాని, వారు పాతసాంప్రదాయాలకు, సంస్కృతికే ప్రాతినిధ్యంవహించి ఆధునికాభివృద్ధిక్రమాలలో తేలిగ్గా ఇముడలేరు. మారేకాలంతోపాటు నడువలేని యీ అశక్తతకు, క్రొత్తవాతావరణానికి అనువుగా తమనుతాము మలచుకోలేని స్తబ్ధతకు కారణం—స్వాభావికమైన దుర్లక్షణం కాదు. అది కొన్ని చారిత్రక కారణాలవల్ల సంక్రమించిన వారసత్వం. క్రొత్తగా పారిశ్రామిక మధ్యతరగతి యేర్పడడంలో జరిగిన ఆలస్యం, ముస్లిములలో మరీఎక్కువగా వున్న సనాతనదృక్పథం ఇవే వారిపురోగమనాన్ని అరికట్టాయి. తెలివితేటలవికాసాన్ని నిలిపివేశాయి. బెంగాలులో ముస్లిములు వెనుకబడి వున్నట్లు స్పష్టంగా కన్పడుతుంది. అందుకు రెండుకారణా లున్నాయి. వారిలోభాగ్యవంతులు, భూస్వాములవర్గము బ్రిటిష్‌వారిపాలనారంభకాలంలోనే నాశనంచేయబడ్డారు. పైగా, అచ్చటిముస్లిములలో ఎక్కువమంది హిందువులలోనిమ్నజాతులనుంచి (వారికి హిందూసంఘం బహుకాలంగా పురోగమనావకాశాలులేకుండాచేసినందువల్ల) మతాంతరులైనవారే. ఉత్తరభారతంలోనిముస్లిములలో సంస్కృతీపరులైన అగ్రవర్గాలవారు తమ పురాతనసాంప్రదాయాలకు, భూస్వామ్యపద్ధతికి కట్టుబడివున్నారు. ఇటీవల కొన్నిసంవత్సరాలుగా చెప్పుకోదగినమార్పు కనుపిస్తున్నది. భారతీయముస్లిములలోకూడా క్రొత్తగా మధ్యతరగతులు అతివేగంగా యేర్పడుతున్నాయి. కాని, ఇప్పటికీ వారు హిందువులు మొదలగువారికంటె వైజ్ఞానికంగాను, పరిశ్రమలలోను చాలా వెనుకబడివున్నారు. హిందువులుకూడా చాలామంది వెనుకబడివున్నవారే. ఒక్కొకసారి ముస్లిములకంటె మూర్ఖంగా, సాంప్రదాయక ఆలోచనారీతులతోబంధింపబడివుంటారు. ఏమైనప్పటికీ, హిందువులు శాస్త్రీయ, పారిశ్రామికాదిరంగాలలో అత్యంతసముద్ధులైనవారిని

సృష్టించగలిగారు. చిన్నదైనపార్శీజాతిలోకూడా ఎందరో ఆధునిక పారిశ్రామికవేత్త లుద్భవించారు. జిన్నాకుటుంబం ఆదిలో హిందువులే ననేది మనోహరంగానేవుంటుంది.

హిందువులలోను, ముస్లిములలోను సమర్థులు, తెలివిగల వారంతా ప్రభుత్వోద్యోగాలలో చేరడం ఒక్కటే ఆకర్షణీయంగా వుండేది. స్వాతంత్ర్యోద్యమము పెంపొందినకొద్దీ ఆ ఆకర్షణ సన్న గిలింది. సమర్థత, చిత్తశుద్ధి, ధైర్యంగలవారందరూ కాంగ్రెసులో చేర సాగారు. ఆవిధంగానే ముస్లిములలో అనేకమంది ఉత్తములు కాంగ్రె సులో చేరారు. ఇటీవల సోషలిస్టు, కమ్యూనిస్టుపార్టీలలోకూడా ముస్లింయువకులు చేరుతున్నారు. ఈ అభివృద్ధికాములను మినహా యించితే, ముస్లింనాయకులలో ఉన్నతలక్షణాలుగలవారు చాలా తక్కువ. కాబట్టి, ముస్లింలు అభివృద్ధికోసం ప్రభుత్వోద్యోగాలకే దేవులాడవలసివచ్చింది. జిన్నా అదోతరహామనిషి. సమర్థుడు, పట్టుదల గలవాడు. ఇతరులనేకమందికి లభ్యంకాని ఉద్యోగహోదాలన్నా ఆయ నకు మోజులేదు. అందువల్లనే, ముస్లింలీగులో అనేకమంది ప్రముఖు లకులేని అసమానపదవి ఆయనకు లభించింది. దురదృష్టవశాత్తూ, ఆయనపట్టుదల మనస్సును దిగ్బంధంచేసి, నూతనభావాలకు ప్రవేశం లేకుండాచేసింది. లీగులో అతనికిగల సాటిలేనిఅధికారం, లీగులోని వ్యతి రేకులను, ఇతరసంస్థలను సహించలేనివానినిగా చేసింది. అతడే ముస్లిం లీగుగా తయారయ్యాడు. కాని, ఒకప్రశ్న ఎదురయింది. లీగు ఒక ప్రజాసంస్థగా తయారవుతున్నప్పుడు, యీ అవకతవకభావాలుగల సనాతననాయకత్వం ఎంతకాలం కొనసాగుతుంది ?

నేను కాంగ్రెసుఅధ్యక్షుణ్ణిగా వుండగా, మమ్మల్ని సరిగ్గా ఏం చెయ్యమంటాడో తెలుపవలసిందిగా జిన్నాకు అనేకలేఖలు వ్రాశాను. లీగుకు కావలసినదేమిటో, దాని స్పష్టమైనలక్ష్యమేమిటో చెప్ప మన్నాను. కాంగ్రెసుప్రభుత్వాలపై లీగుకుగల ఫిర్యాదులేమిటోకూడా స్పష్టంగా చెప్పమన్నాను. ఈలేఖలద్వారా సమస్యలను విస్పష్టంచేసుకుని తేలినముఖ్యాంశములనుగూర్చి స్వయంగాకలుసుకుని చర్చించుకోవచ్చు నని మావుద్దేశ్యం. జిన్నా సుదీర్ఘమైన జవాబులు వ్రాశాడు; కాని, దేన్నీ విశదమయ్యేటట్లు చెప్పలేకపోయాడు. నాకుగాని, మరెవరికైనా

గాని అసలు తాను కోరుతున్న దేమిటో, లీగుకున్న యిబ్బందులేమిటో స్పష్టంగా చెప్పకుండా తప్పించుకోవడం విచిత్రంగా వుంది. అనేకసార్లు వుత్తరప్రత్యుత్తరాలు జరిగాయి. అయినా, అదే అస్పష్టత, అసంపూర్ణత కొనసాగిందేగాని, అసలువిషయం యేమిటో స్పష్టంకాలేదు. నాకిది ఆశ్చర్యాన్ని కల్గించడమేగాక, దారిలేదనిపించింది. జిన్నా ఏవిధంగాను ఒకమాటకు కట్టుబడడానికి ఇష్టపడడంలేదనీ, పరిష్కారానికేమాత్రం ఆయన ఆతురత చెందడంలేదనీ అనిపించింది.

తరువాత, మాలో గాంధీజీ, మరికొందరు అనేకసార్లు జిన్నాను కలుసుకున్నారు. వారు గంటలతరబడి సంభాషణలుజరిపినా, ఎప్పుడూ యథాస్థితిలోనేవుండిపోయారు. కాంగ్రెస్ ముస్లింలీగుల ప్రతినిధులు కలుసుకొని, పరస్పరసమస్యలను చర్చించుకోవాలని మా ప్రతిపాదన. ముస్లిములీగే భారతీయముస్లిములందరికీ ఏకైకప్రతినిధియనీ, కాంగ్రెసు పూర్తిగా హిందువులసంస్థయనీ మేము స్పష్టంగా, ముందు అంగీకరించినట్లయితేనే, పరస్పరచర్చలకు అంగీకరించుతామని జిన్నా చెప్పాడు దీనితో స్పష్టమైన ఇబ్బంది. ఏర్పడింది. మేము లీగు ప్రాముఖ్యతను గుర్తించినమాట నిజమే. అలాగుర్తించబట్టే దానితో చర్చలకు సిద్ధమైనాము. కాని, దేశంలోని తదితరముస్లింసంస్థలన్నింటిని ఎలా వదలడం ? వాటిలోకొన్ని మాతో అతిసన్నిహితంగా పనిచేస్తున్నవాయె. పైగా, కాంగ్రెసులోనూ, ఉన్నతకార్యవర్గాలలోను అనేకమంది ముస్లిములు వున్నారుకూడాను. జిన్నాప్రతిపాదన నామోదించడమంటే, కాంగ్రెసులోని ముస్లింసహచరులనందరిని బైటికి తరిమివేయడము, వారికి కాంగ్రెస్‌లో స్థానంలేదని ప్రకటించడమన్న మాటేగదా. అంటే కాంగ్రెసుయొక్క ప్రధానసూత్రాన్నే మార్చివేయడము, అందరికి ప్రవేశంగల జాతీయసంస్థను ఒకమతసంస్థగా సంకుచితంచేయడమన్నమాట. ఇది మాకుదురూహ్యామైనవిషయం. ఇప్పటికే కాంగ్రెసుసంస్థ లేకపోయినట్టయితే, మేము ప్రతిభారతీయునికి ప్రవేశముండగల మరొకజాతీయసంస్థను స్థాపించుకోవలసి వుండేది.

జిన్నా యీవిషయంలో పట్టుబట్టడం, యితరవిషయాలచర్చకు నిరాకరించడం మాకు అర్థంకాలేదు. మళ్ళీ మేము జిన్నా ఏవిధంగాను దేనికీ కట్టుబడడానికి యిష్టపడడంలేదనీ, ఏవిధమైన పరిష్కారం కోరడం

లేదనీ నిర్ధారణచేసుకోగలిగాము. యథాస్థితి కొనసాగుతుండాలనీ, ఈవిధంగా తాను బ్రిటిష్‌ప్రభుత్వంనుంచి ఎక్కువప్రయోజనాలను సాధించుకోగలననీ ఆయన తృప్తిపడ్డాడు.

'ఇండియా అంటే రెండుజాతులు. అవి హిందూ ముస్లింజాతులు' అని ఇటీవల జిన్నాబయల్పెట్టిన నూతనసిద్ధాంతంమీదనే ఆయనవాదన ఆధారపడివుంది. రెండుజాతులే ననడమేమిటో నాకు తెలియకుండా ఉంది. మతాన్నిబట్టే జాతిని నిర్ణయించేటట్లయితే, ఇండియాలో అనేకజాతులున్నాయి. అన్నదమ్ముల్లో ఒకరు హిందూవూ, మరొకరు ముస్లిమూ అయితే – చెరొకజాతికి చెందుతారన్నమాట. దాదాపు భారతదేశపు అన్ని గ్రామాల్లోను వివిధదామాషాలలో యీ రెండుజాతులూ ఉంటాయి. ఇవి సరిహద్దులులేని జాతులు. ఒకదానిలో ఒకటి కలసిపోయివుంటాయి. ఒకబెంగాలీముస్లిము, ఒకబెంగాలీహిందువు కలసిమెలసిజీవిస్తూ, ఒకేభాష మాట్లాడుతూ, ఒకేరకపు సాంప్రదాయాచారాలను అనుసరిస్తూవున్నా, వారు రెండుజాతులవారన్నమాట. ఇదంతా మాకు గ్రహింపశక్యంగాకుండా ఉంది. ఏ మధ్యయుగాలనాటి సిద్ధాంతానికో తిరిగిపోయినట్టుంది. దీన్నిబట్టి జాతిఅంటే ఏమిటో నిర్వచించడమే చాలాకష్టంగా కన్పిస్తోంది. వాస్తవంలో– అందరమూ ఒకటేననే భావైక్యత, మిగతామానవాళినంతటినీ ఒకేదృష్టితో వీక్షించే స్వభావమూ కలిగివుండడమే జాతీయచైతన్యంయొక్క– మూలస్వభావం అయివుండవచ్చు. ఇండియాలో మొత్తంమీద ఇటువంటిభావన ఎంతవరకున్నదనే విషయం చర్చనీయాంశం. ఇండియా గతంలో అనేకజాతులుగల దేశంగా వుండి, క్రమేణ ఒకేజాతిగా పరిణమించినదని చెప్పుకోవచ్చు. కాని, ఇవన్నీ మనకుసంబంధించని సిద్ధాంతసంబంధమైన విశేషాలు. ప్రస్తుతం అమితశక్తివంతమైన దేశాలన్నీకూడా అనేకజాతులుగలవే. అయితే, అమెరికాసంయుక్తరాష్ట్రములు, యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్స్‌వలె క్రమంగా జాతీయతాభావాన్ని అభివృద్ధిచేసుకుంటున్నాయి.

జిన్నాద్విజాతిసిద్ధాంతంనుంచే పాకిస్థాన్ లేక భారతదేశవిభజన అనేభావన జనించింది. కాని ఈజాతులు ప్రతిరాష్ట్రంలో ప్రతిగ్రామంలో ఉన్నందువల్ల యీ రెండుజాతులసిద్ధాంతసమస్యను పరిష్కరించదు.

కాని, అది తాత్త్వికభావనకు ఒకరూపాన్నిచ్చింది. దీనివల్ల మళ్ళీ అనేక మందిలో ఐక్యభారతమనేఆవేశం రేకెత్తింది. సాధారణంగా, "జాతీ య్యైక్యత" చర్చలవసరంలేనిదిగా భావించబడింది. దాన్ని ఎవరైనా కాదంటేనో, విచ్ఛిన్నంచేయప్రయత్నించితేనో, దానిపై సవాలుచేస్తేనో, అప్పుడే ఐక్యతయొక్క విలువ స్పష్టమవుతుంది. అప్పుడే దాన్ని కాపాడేందుకు క్రియాత్మకకృషి జరుగుతుంది. ఆవిధంగా ఒక్కొక్కప్పుడు విచ్ఛిన్నకరప్రయత్నాలే ఐక్యతను దృఢతరంచేస్తాయి.

కాంగ్రెసుకు, మతసంస్థలకూ మధ్య ప్రధాన దృక్పథాలలోనే ఎంతో తేడా ఉంది. ఇట్టివాటిలో ముస్లింలీగు, హిందూమహాసభలు ప్రధానమైనవి. ఇవి ఇండియాకు స్వాతంత్ర్యం కావాలని కోరడంతోపాటు అంతకంటేముఖ్యంగాతమమతాలకు ప్రత్యేకరక్షణలు,సౌకర్యాలు కావాలని వత్తిడిచేయడంలోనే ఎక్కువశ్రద్ధవహిస్తాయి. కాబట్టి యివి బ్రిటిష్ ప్రభుత్వం దయాధర్మాలకోసమే యెదురుచూడవలసిఉంటుంది గనుక, దానితో సంఘర్షణకు సిద్ధపడవు. కాంగ్రెసుదృక్పథం భారతదేశమంతా ఒకేజాతిగా సంపూర్ణస్వాతంత్ర్యం సాధించడానికే కట్టుపడివుంది. ఇతర సమస్యలన్నీ దానిముందు అల్పమైనవే. అంటే బ్రిటిష్‌ప్రభుత్వంతో నిరంతరపోరాటమేనన్నమాట. కాంగ్రెసుప్రాతినిధ్యంవహిస్తున్నప్రకారం భారతజాతీయవాదం బ్రిటిష్‌సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటిస్తోంది. కాంగ్రెసు ఇంకా వ్యవసాయ, ఆర్థిక, సాంఘిక ప్రణాళికలుకూడా సిద్ధం చేసుకున్నది.ముస్లింలీగుగాని, హిందూమహాసభగాని అట్టివాటినిగురించి ఆలోచించనూలేదు,సమగ్రప్రణాళికలుయేర్పరచడానికి ప్రయత్నించనూ లేదు. సహజంగానే సోషలిస్టులు, కమ్యూనిస్టులు అట్టిసమస్యలనుగూర్చి శ్రద్ధకలిగియుండి, కాంగ్రెసులోనూ, విడిగానూకూడ అట్టిప్రణాళికలకు ప్రాముఖ్యతనిస్తూనే ఉన్నారు.

కాంగ్రెసువిధానాలకు, ఆచరణలకు ఇతరమతసంస్థలవిధానాలకు, ఆచరణలకు మరో ముఖ్యభేదంకూడా ఉంది. కాంగ్రెసు ఆందోళనచేయడము– శాసనసభాకార్యక్రమాలు, అవకాశంఉన్నప్పుడు – మాత్రమే గాక, నిరంతరం నిర్మాణకార్యక్రమాన్ని అమలుజరపడమే ముఖ్యాశయంగా కృషిచేస్తున్నది. ఈ కార్యక్రమంలో గృహపరిశ్రమలనుస్థాపించి ప్రోత్సహించడం, దళితవర్గాలనుబాగుపరచడం, బేసిక్ విద్యావిధానాన్ని

వ్యాపింపజేయడం మొదలైనవి వున్నాయి. గ్రామపారిశుధ్యం, కొన్ని వైద్యసహాయాలుకూడా గ్రామోద్ధరణకార్యక్రమంలో వున్నాయి. ఈ కార్యక్రమంలో నిర్వర్తించేందుకు కాంగ్రెసు ప్రత్యేకవ్యవస్థలను కూడా నెలకొల్పింది. ఇవి రాజకీయరంగంలోకృషిచేయడమేగాక, వేలాది శాశ్వతసేవకులద్వారా నిరంతరప్రజాసేవచేస్తుంటాయి. రాజకీయ కార్యక్రమాలు చప్పబడివున్నప్పుడుకూడా యీ నిర్మాణకార్య క్రమాలు రాజకీయప్రసక్తిలేకుండా జరుగుతూనేవుంటాయి. అయినప్ప టికీ, ప్రభుత్వం కాంగ్రెసుతో ప్రత్యక్షసంఘర్షణ ఏర్పడినప్పుడు యీ సంఘాలనుకూడా అణచివేసింది. ఈ కార్యక్రమాల ఆర్థికప్రయోజ నాన్నిగురించి కొందరిచే అభిప్రాయభేదాలు వెలిబుచ్చబడ్డాయి. అయినా, వీటి సాంఘికప్రయోజనంవిషయంలో సందేహంలేదు. ఈ కార్యక్రమాలవల్ల ప్రజలసన్నిహితసంబంధంతో వేలాదిస్వయం సేవకులకు తరఫీదిచ్చి. ప్రజలలో స్వయంశక్తి, స్వయంపోషణలమీద ఆధారపడాలనే చైతన్యం కల్గించింది. కాంగ్రెసులోని స్త్రీ-పురుషులు, రైతు, కార్మికఉద్యమాలలో ప్రధానపాత్రవహించి, వాటిని నిర్మించారు. దేశంలోఅన్నిటికంటె పెద్దదీ, సుసంఘటితమైనదీ అయిన అహమ్మదా బాదు బట్టలమిల్లులకార్మికసంఘాన్ని కాంగ్రెసే స్థాపించి, వారితో పూర్తిగా సహకరించి పనిచేసింది.

ఈ కార్యక్రమాలన్నీ కాంగ్రెసుకృషివెనుకగల మూలాధా రాన్ని స్పష్టంచేస్తాయి. ఇట్టిది కుల, మతసంస్థల్లో బొత్తిగా లేదు. అవి తాత్కాలికావేశంలోను, ఎన్నికలసందర్భంలోను ప్రచారంకోసం మాత్రమే ఆపనులు చేస్తాయి. వారికి కాంగ్రెసువారికివలె ప్రభుత్వంవల్ల నిరంతరభయము, వ్యక్తిగతహానికల్గుతుందనే సందేహము లేనేలేవు. అందువల్లనే, పదవీవ్యామోహపరులు, అవకాశవాదులు ఈసంస్థలలో చేరుతున్నారు. అహ్రార్, జమియత్ - ఉల్ - ఉలేమాలు మాత్రం తరచు రాజకీయంగా కాంగ్రెసుపద్ధతులనే అవలంబించడంవల్ల, ప్రభుత్వ దమననీతికి విశేషంగా గురిఅయ్యాయి.

నూతనబూర్జువావర్గాలతోపాటు పెంపొందిన భారతజాతీయ ప్రేరణమాత్రమేగాక, సాంఘికమార్పులురావాలనే పీడితప్రజల ఆశ యాన్నికూడా కాంగ్రెసుప్రతిఫలించింది. ప్రత్యేకంగా, విప్లవాత్మక

భూసంస్కరణలకోసం నిలబడింది. దీనివల్ల కాంగ్రెసులో తరచుగా అంతర్విభేదాలుకూడా తలెత్తేవి. ఇందులోని జాతీయవాదులైన భూస్వాములూ వారిశ్రామికవేత్తలూ సామ్యవాదవిప్లవభీతిచే వాటికి దూరంగా ఉండేవారు. కాంగ్రెసులో సోషలిష్టులు కమ్యూనిస్టులుకూడా స్థానం కలిగివుండి, తమభావాన్ని కాంగ్రెసువిధానాలపై ప్రసరింపజేసేవారు. మతసంస్థలు – హిందూసంస్థకాని, ముస్లింసంస్థకాని – సనాతన, భూస్వామికశక్తులతో దగ్గరసంబంధంకలిగియుండి, విప్లవాత్మకమైన సాంఘిక మార్పులన్నింటికి వ్యతిరేకించేవి. అందువల్ల వాస్తవసంఘర్షణకు మతంతో ఏనిమిత్తమూ లేదు. మతం తరచుగా అసలుసమస్యను మరుగు పరుస్తుంది. అసలు సంఘర్షణ జాతీయ, ప్రజాస్వామిక, సాంఘికవిప్లవాలను ఆశించేవారికీ సనాతనపాలనావశేషాలను యథాతథంగా భద్రపరచాలనేవారికీ మధ్యమాత్రమే. ఈ రెండవవర్గం క్లిష్టసమయంలో పరిస్థితులను యథాతథంగా వుంచాలనే బ్రిటిష్‌వారిమద్దతుపైనే ఆధారపడుతుంది.

రెండవప్రపంచయుద్ధం ప్రారంభంకావడంతో ఆంతరికక్లిష్టపరిస్థితియేర్పడి, రాష్ట్రాలలోని కాంగ్రెసుమంత్రివర్గాలు రాజీనామాలిచ్చాయి. ఇది జరగకముందే కాంగ్రెసు జిన్నాను, ముస్లింలీగును సమాధానపరచడానికి మరొకసారిప్రయత్నించింది. యుద్ధంప్రారంభమైన తర్వాత జరిగిన మొదటికాంగ్రెసుకార్యవర్గసమావేశానికి జిన్నాను ఆహ్వానించాము. ఆయన మాతో కలియలేకపోయాడు. తరువాత ఆయన్నికలుసుకుని, ప్రపంచసంధిగ్ధస్థితిని దృష్టిలోపెట్టుకుని, ఒక ఐక్య విధానాన్ని రూపొందించడానికి ప్రయత్నించాము. సత్ఫలితాలు కలుగకపోయినా, మా మంతనాలు కొనసాగించడానికే నిశ్చయించాము. ఈలోపుగా, ముస్లింలీగుతోగాని, మతసమస్యతోగాని సంబంధంలేని రాజకీయకారణాలవల్ల కాంగ్రెసుమంత్రివర్గాలు రాజీనామాలిచ్చాయి. ఏమైనప్పటికి, జిన్నా కాంగ్రెసుపై గట్టిదెబ్బతీయడానికి యిదే అదను అనుకున్నాడు. రాష్ట్రాలలో కాంగ్రెసుపాలననుండి "విముక్తదినం" జరుపవలసినదిగా ముస్లిమందరికీ పిలుపునిచ్చాడు. ఆవెంటనే, కాంగ్రెసులోని జాతీయముస్లింలను-ప్రధానంగా హిందువులు, ముస్లింలు ఉభయులచే అధికంగాగౌరవింపబడుతున్న కాంగ్రెసుఅధ్యక్షుడు మౌలానా

అబుల్‌కలాం ఆజాద్‌ను దుయ్యబట్టాడు. "విముక్తదినం" చాలావరకు విఫలమయింది. ముస్లింలలోనే అనేకమంది అందుకువ్యతిరేకప్రదర్శనలు జరిపారు. కాని, ఆరోజు విభేదాలను మరింతదృఢంచేసింది. జిన్నాకు ముస్లింలీగుకు కాంగ్రెసుతో వప్పందానికిసిద్ధామనేతలంపుగాని, భారత స్వాతంత్ర్యానికి పాటుపడదామనే చిత్తశుద్ధిగాని ఏకోశానాలేవని ధృవపరచింది. వారు యుదాస్థితినే మేలుగా ఎంచుకున్నారు.

## ౬ జాతీయ ప్రణాళికా సంఘం

1938వ సంవత్సరాంతమున, కాంగ్రెస్ ప్రేరేపణవలన జాతీయ ప్రణాళికాసంఘం ఏర్పాటుచేయబడింది. 15గురు సభ్యులతోనూ, వారితోసహకరించదలచుకున్న రాష్ట్రప్రభుత్వప్రతినిధులతోనూ ప్రణాళికాసంఘం నిర్మాణమైంది. విఖ్యాతులైన పారిశ్రామికవేత్తలు, ఆర్థికశాస్త్రవేత్తలు, విద్యావేత్తలు, విజ్ఞానశాస్త్రవేత్తలు, కార్మికసంఘప్రతినిధులు, గ్రామీణపరిశ్రమసంఘాలప్రతినిధులు ఈసంఘంలోసభ్యులు. కాంగ్రెసుప్రభుత్వాలు లేని బెంగాలు, పంజాబ్, సింధురాష్ట్రప్రభుత్వాలు, దేశీయసంస్థానప్రభుత్వప్రతినిధులు కూడా ప్రణాళికాసంఘానికి తోడ్పడ్డారు. ఒకవిధంగా ఆ సంఘం సమగ్రమైన ప్రాతినిధ్యం గలదని చెప్పాలి. ఒక్క భారతప్రభుత్వం ప్రతినిధులను పంపకుండా సహాయనిరాకరణంచేసినదన్నమాట తప్ప, రాజకీయభేదాలకు, ఉద్యోగీయ అనుద్యోగీయ విచక్షణకు తావులేకుండా ఏర్పాటైంది. కోటీశ్వరులైన వ్యాపారస్థులు, ఆదర్శవాదులు, సిద్ధాంతఛాందసులనిపించుకున్నవారు, సామ్యవాదులు, కమ్యూనిస్టులకు సన్నిహితులు అందరూ ఈ సంఘంతో సహకరించారు. రాష్ట్రప్రభుత్వప్రతినిధులుగా నిపుణులైనవారు, పరిశ్రమలశాఖకధిపతులైనవారూ పాల్గొన్నారు.

అటువంటి విచిత్రమైనసమ్మేళనం వివిధాభిప్రాయాలుగల అనేకతరహాలమనుష్యులతో ఏర్పడినసంఘం ఎలాపనిచేస్తుందో స్పష్టంకాలేదు. అనేకసంశయాలతోనూ, సంకోచంతోనూ ఆసంఘానికిచెయిర్మన్‌గా వుండుటకు ఒడబడ్డాను. ఆ పని నామనసుకు నచ్చినదవడంచేత దానికి దూరంగా ఉండలేకపోయాను.

మా కడుగడుక్కీ చిక్కులేవచ్చాయి. నిజమైన ప్రణాళికను తయారుచేయడానికి అవసరమైనసంజాయిషీ, అంకెలభోగట్టా మాదగ్గర లేదు. భారతప్రభుత్వమేమీ సహకారాన్నిచ్చేధోరణిలో లేదు. రాష్ట్రప్రభుత్వాలైనా సస్నేహంగానూ, సహకారంతోనూ ప్రవర్తించినా, దేశంమొత్తంమీద ప్రణాళికారచనకంతగాఉత్సాహాన్ని కనుబరచలేదు. వాళ్ళసమస్యలతోటీ, బాధలతోటీ వారికిసరిపోయేది. కాంగ్రెస్ ఈసంస్థను సృష్టించినప్పటికీ కాంగ్రెస్‌లో కొన్నిముఖ్యవర్గాలు, దానిని 'ఎవరికిపుట్టినబిడ్డరా' అన్నట్లే సవతితల్లిచూపుచూస్తుండేవారు. అదెల్లా వృద్ధిపొందుతుందాఅనేవిషయం వారికి అగమ్యంగాను, సంశయాత్మకంగానూ ఉండేది. అది భవిష్యత్తులో ఎట్లాపరిణమిస్తుందోఅని కూడా వారిఅనుమానం. కాకపోతే బయటఉండిచేసేది లేదుకనుక, ఆకమిటీలో చేరితేనే తమకుమంచిదనితలచి చేరేరు.

సమగ్రమైనప్రణాళికను నిర్వహించాలంటే సర్వస్వతంత్రంగల జాతీయప్రభుత్వం ఏర్పడితేనేగాని సాధ్యంకాదు. సాంఘికఆర్థికనిర్మాణంలో ప్రధానమైనమార్పులు తేవాలంటే తగినంతబలమూ ప్రజారంజకత్వమూగల జాతీయప్రభుత్వం ఉండాలి. కనుక ఏపునర్నిర్మాణపథకాన్నినిర్వహించాలన్నా ముందు దేశంలోనుంచి విదేశప్రభుత్వాధికారాన్ని తొలగించి, జాతీయప్రభుత్వాన్ని నిర్మాణంచేయడం ముఖ్యమనిపించింది. అంతేకాకుండా, మన మందస్థితి, ఆచారవ్యవహారాలు, పాతసాంప్రదాయములతోకూడిన దృక్పథము మొదలైన ఇతరఅడ్డంకులు కూడా ఉన్నాయి. కాని ఎట్లైన వాటినెదుర్కోకతప్పదు. మొత్తంమీద ప్లానింగు వర్తమానంలో అంతవిశేషప్రాముఖ్యతకు రాలేదు. భవిష్యత్తుకుసంబంధించిన వ్యవహారమైనది. అయినప్పటికీ ఆ భవిష్యత్తు ఎంతోదూరంలోలేదనేవిశ్వాసంతో కార్యక్రమం సాగించవలసి వచ్చింది. దొరకినంతమట్టుకు భోగట్టానుసేకరించి, దానిని సమన్వయపరచి ఒకక్రమంలోపెట్టి, చూచాయగా ఒకపథకాన్ని తయారుచేస్తే ముందుముందు రూపొందించబోయే ప్రణాళికకు పునాదులువేసినవాళ్ళమవుతాం. ఈలోగా రాష్ట్రప్రభుత్వాలను, సంస్థానాలను వారిఆర్థికస్తోమతును వృద్ధిచేసుకోమన్నాం. దేశంలోని ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక సంబంధమైన జాతీయకార్యక్రమాలన్నీ ఒకదానికొకటి అభివృద్ధికి

దోహదమయ్యేటట్లు ప్రణాళికనురచించేప్రయత్నం మాకూ, ప్రజా సామాన్యానికీ కూడా ఒక జ్ఞానదాయకమైన అనుభూతి. సంకుచితమైన ధోరణిలో కాకుండా విశాలదృష్టితోనూ సహకారభావంతోనూ దేశాభివృద్ధిసమస్యలను ఆలోచించి పరిష్కరించే ధోరణిలోపడ్డారు ప్రజలు.

ఆదిలో ప్లానింగుకమిటీవారి అభిప్రాయం ఇతోధికమైన పరిశ్రమాభివృద్ధి. "పరిశ్రమలభివృద్ధికానిదే దారిద్ర్యం, నిరుద్యోగం, సైనిక రక్షణ, ఆర్థికసౌష్ఠవం మొదలైన సమస్యలేమీ పరిష్కారంకావు. ఆ పరిశ్రమీకరణానికి ప్రథమసోపానంగా ఒక సమగ్రమైన జాతీయపథకాన్ని రచించాలి. ఆ పథకంలో భారీపరిశ్రమలు, కీలకపరిశ్రమలు, మధ్యరకంపరిశ్రమలు, కుటీరపరిశ్రమలు, అన్నిటిఅభివృద్ధికీ స్థానముండాలి... కాని ప్రజలకు ముఖ్యాధారమైన వ్యవసాయాన్ని ఏ పథకంలోకూడా అలక్ష్యంగా చూడడానికి వీలులేదు. సంఘానికంతకూ ఉపకరించే ఇతర సేవావృత్తులుకూడా అటువంటివే. ఆలాగే ఒకదానికొకటి అంటిపెట్టుకుని ఉండడంచేత చివరకు దేనినీ విడదీయడానికి వీలులేదు. ఒక దానిని విడచి మరొకదానిని వృద్ధిచేయడం అసాధ్యమైంది. ఈ ప్రణాళికారచనను గురించి మేము ఆలోచించినకొద్దీ, దాని వైశాల్యం పెరిగిపోయి, చివరకు సర్వవ్యాప్తమైంది. అంటే జీవితాన్నంతటినీబంధించేసి కదం నడిపించడం మా ఉద్దేశం కాదు. కాని ప్లానులో ఏభాగాన్ని గురించి ఏ నిర్ణయాలు చేసినప్పటికీ ఎప్పటికప్పుడు ఇతరభాగాల కవి ఎట్లా వర్తిస్తాయో చూచుకోక తప్పలేదు. సమగ్రదృష్టితో అన్నిభాగాలను చూచుకోవలసివచ్చింది. ఈపనియందు నాకు అపారమైన ఆసక్తి కలిగింది. నాతోడిసభ్యులకుకూడా కలిగిందనే నా అభిప్రాయం. కాని ఈ కార్యక్రమంలో ఒకవిధమైన అస్థిరత్వమూ, మబ్బూ ప్రవేశించాయి. ఏవోకొన్ని ముఖ్యవిషయాలమీద మా కృషిని కేంద్రీకరించి లక్ష్యం చేయడానికి బదులు, అన్నివిషయాల్లోనూ వ్రేలుపెట్టేము. అందువల్ల మేము వివిధవిషయాలను ఆలోచించడాని కేర్పాటుచేసిన ఉపసంఘాల కృషిలో జాప్యత ఏర్పడింది. ఫలానాలక్ష్యంకోసం, ఫలానా తేదీలోపుగా ఈపని జరుగాలనే నిర్దిష్టత లేకపోవడంచేత మందగతి సిద్ధించింది.

సాంఘికనిర్మాణంవిషయంలో ఒకవిధానాన్ని గురించిగాని, సిద్ధాంతాన్నిగురించిగాని మేమంతా ఏకీభావానికిరావడం తేలికకాదు. ఏమంటే

మాసంఘనిర్మాణమే అలాంటిది. ముందుగానే మూలసిద్ధాంతచర్చ ల్లోకెడితే విభిగా ఆదిలోనే అభిప్రాయభేదాలేర్పడి కమిటీ విచ్ఛిన్నమై పోయే సావకాశాలు చాలాఉన్నాయి. కాని మూలసూత్రాలమీద ఒక ఏకీభావంలేకపోవడమనేది చాలాపెద్దప్రతిబంధకమే కాని, గత్యంతరం లేదు. ప్లానింగునుగురించి ప్రత్యేకసమస్యలనుగురించి విపులంగాచర్చించి ఆ చర్చలలోనుండి సిద్ధాంతాలను పరిణమింపచేయాలని మేము నిర్ణయించుకున్నాం. స్థూలంగా చెప్పాలంటే రెండు దృక్పథాలు ఏర్పడి నాయి. ఒకటి సామ్యవాదదృక్పథం. కేవలం కొందరికే లాభసాటి వ్యాపారంకాకుండా, సంపత్తికి సరియైనపంపకముండాలని వారి అభిప్రాయం. రెండవది ధనికవర్గదృక్పథం. సాధ్యమైనంతవరకు స్వేచ్ఛావ్యాపారము, లాభసముపార్జనము వుండి, ఉత్పత్తినధికంచేయాలని వారివాదం. భారీపరిశ్రమలను త్వరత్వరగా అభివృద్ధిచేయాలనేవారికి, అసంఖ్యాకులైన నిరుద్యోగులకు పనికల్పించే గ్రామీణ కుటీరపరిశ్రమల కెక్కువ ప్రాముఖ్యతనివ్వాలనేవారికీ అభిప్రాయభేదాలొచ్చాయి. తుదినిర్ణయాలు చేయవలసినప్పుడు అభిప్రాయభేదాలు తప్పవు. కాని భోగట్టా అంతా సేకరింపబడి సమన్వయంచేయబడినపిమ్మట, అందులో సర్వసమ్మతమైన దానిని వేరుచేసి మిగిలినవాటిమీద అభిప్రాయభేదాలను సూచిస్తూ రెండు నివేదికలు తయారైనా మరేమంత ప్రమాదంలేదు. ప్రణాళికను అమలుజరిపేకాలమొచ్చినప్పుడు, అప్పుడుండే జాతీయప్రభుత్వమే సిద్ధాంతాన్ని అంగీకరించి అమలుపెట్టాలో నిర్ణయించుకుంటుంది. ఈ లోగా కొంత గ్రంథం సాగుతూవుంటుంది. వివిధరాష్ట్రప్రభుత్వాలు, ప్రజలు ఈ విషయాన్నిగురించి పరిశీలనచేస్తూ తర్జనభర్జనలుచేసుకుంటారు.

ఏదో ఒక సాంఘికలక్ష్యంలేకుండా ఏ పనీ చేయలేమనేసంగతి వేరే చెప్పనక్కరలేదు. అందులోనూ ప్రణాళికాకార్యక్రమం అసలే అసాధ్యమైనపని. ప్రజల దుర్భరదారిద్ర్యాన్నితొలగించి, వారి జీవిత ప్రమాణాన్ని తగుమాత్రంగావృద్ధిచేయడమే ఆలాంటిసాంఘికలక్ష్యమని ప్రకటించాము. ఆర్థికశాస్త్రపండితులు ప్రతిమనిషికీ నెలకు అధమం 15 రూపాయలు మొదలు 25 వరకూ ఆదాయముండాలని అంచనాలు వేశారు. (యుద్ధానికిముందు లెక్కలప్రకారం) పాశ్చాత్యప్రమాణాలను

బట్టి చూస్తే అవి చాలాహెచ్చే కాని, మనదేశంలో ఇప్పుడున్న ప్రమాణాలప్రకారం ఆ వృద్ధి ఎక్కువే. ఉజ్జాయింపుగా భారత దేశంలో సాలుసరిసగటుఆదాయం మనిషికి 65 రూపాయలనిఅంచనా. ధనికులు పేదలు, పట్టణవాసులు, పల్లెప్రజలు అందరిఆదాయం ఇందులో కలసిఉంది. ధనికులకూ పేదలకూమధ్య అంతరం చాలాఉండడంచేతనూ, ధనం కొద్దిమందిచేతుల్లోమాత్రమేఉండడంచేతనూ గ్రామీణప్రజల సాలుసరి సగటుఆదాయం 30 రూపాయలకు మించదని అంచనావేయ బడింది. ఈ అంకెలు ప్రజాసామాన్యంయొక్క దుర్భరదారిద్ర్యాన్ని, నిస్సహాయస్థితిని చాటుతున్నాయి. మానవజీవితానికి ముఖ్యావసరమైన ఆహారం, బట్ట, నివాసం మొదలైనవన్నీ కొరతలే. ఈకొరతలు నివారించి, ప్రజలజీవితప్రమాణాన్ని హెచ్చుచేయడానికి, అధికోత్పత్తిచేయడమే కాకుండా దానిని సమంగాపంపిణీచేసేఏర్పాట్లుకూడాచేయాలి. నిజంగా చెప్పుకోదగినరీతిగా జీవితప్రమాణాన్ని అభివృద్ధిచేయాలంటే, జాతీయ సంపత్తిని 5 లేక 6 రెట్లు వృద్ధిచేయాలని లెక్కలు తేల్చాం. అది మనపాలిట కొంచెం భారీలక్ష్యమే. కనుకనే పదేళ్ళలో రెండుమూడురెట్లు అధికం చెయ్యాలని లక్ష్యంగాపెట్టుకున్నాం.

మేము ప్రణాళికకు పదిసంవత్సరాలు లెక్కవేసుకుని, ఇన్నిసంవత్సరాలకు ఈరంగంలో ఇంతఅభివృద్ధి చూపించాలని నిర్ణయించేము. స్థూలముగా కొన్నినిదర్శనాలనుకూడా సూచించాము :

(1) ఆహారపుష్టిని వృద్ధిచేయడం - ప్రతి పనిచేసేపెద్దవానికీ రోజుకు 2400 మొ. 2800 యూనిట్ల ఆరోగ్యకరమైన, బలవర్ధకమైన ఆహారాన్ని ఇవ్వాలి.

(2) ప్రతిపెద్దవానికీ, ప్రస్తుతం సాలు 1కి ముడుతున్న 15 గజాలకుబదులు అధమం 30 గజాలైనా వస్త్రములను అందచేయాలి.

(3) మనిషిఒక్కంటికి అధమం నూరు చతురపుటడుగులు వైశాల్యంగలనివాసం ఉండాలి. ఇవికాక అభివృద్ధిసూచకమైన మరి కొన్ని విషయాలనుకూడా ఉదహరించాము :

1. వ్యవసాయఉత్పత్తి నధికంచేయడం.
2. పారిశ్రామికఉత్పత్తి నభివృద్ధిచేయడం.
3. నిరుద్యోగమును తగ్గించడం.

4. సాలుసరి వ్యక్తి ఆదాయాన్ని హెచ్చించడం.
5. నిరక్షరాస్యతను నిర్మూలించడం.
6. ప్రజాక్షేమదాయకమైనసౌకర్యములను హెచ్చించడం.
7. వెయ్యిజనాభా కొకటిచొప్పున వైద్యసహాయకేంద్రాలను స్థాపించడం.
8. సగటు జీవితపరిమాణాన్నెక్కువచేయడం.

దేశంమొత్తంమీద, సాధ్యమైనంతవరకుస్వయంపోషకత్వాన్ని, స్వయంసహాయాన్నిసాధించడమే పరమలక్ష్యంగాపెట్టుకున్నాం. విదేశాలతో వాణిజ్యవ్యాపారాన్నినిషేధించలేదుకాని, సాధ్యమైనంతవరకూ ఆర్థిక సామ్రాజ్యాధిపత్యమనేసుడిగుండంలోపడకూడదనిమాత్రం మా ఆత్రత. సామ్రాజ్యవేత్తలతృష్ణకు మేము ఆహుతికాదలచుకోలేదు. మేము ఆ తృష్ణకుదాసులమై ఇతరులను బాధించదలచుకోనూలేదు. ప్రజలకు ఆహారలోపంలేకుండా, ఉత్పత్తికి ముడిపదార్థాలకొరతరాకుండా, ప్రజలకు ఇతరత్రాఅవసరమైన తయారీవస్తువులకు లోటురాకుండా చూచుకోవడమే మాప్రధానలక్ష్యంగాపెట్టుకున్నాం. మన అవసరాలు తీరగా మిగిలినఅధికోత్పత్తిని బడుగుదేశాలనెత్తిని రుద్దదలచుకోలేదు. ఇతరదేశాలనుంచి మనకవసరమైనసామగ్రినితెచ్చుకోవడానికి బదులుగానే వాటినుపయోగిస్తాం. మన జాతీయఆర్థికవిధానాన్ని, విదేశీయమార్కెట్టులమీదఆధారంచేస్తే, వారితో తగాదాలురావచ్చును. అందువల్ల వారు తమమార్కెట్టుల్లోకి మనలను రానివ్వకపోతే, మన ఆర్థిక స్థితి హఠాత్తుగా తారుమారు కావచ్చును.

కనుక, ప్లానింగుప్రారంభంలో ఇదమిత్థమనే సాంఘికసిద్ధాంతాలు మా కంత స్పష్టంగా లేకపోయినా మాలక్ష్యాలుమాత్రం స్పష్టంగానే ఉన్నాయి. ప్రణాళికారచనకు తగినంత ఏకీభావంకూడా ఉండింది. ప్లానింగుకు ప్రధానంగా కావలసినది సరియైన పర్యవేక్షణ, పరిమితినిర్ణయం, సహకారం. అందుచేత స్వేచ్ఛావ్యాపారాన్ని నిషేధించలేదుకాని, దాని పరిమితిని నిర్దిష్టంచేయడం జరిగింది. దేశరక్షణకు సంబంధించిన పరిశ్రమలనన్నింటినీ ప్రభుత్వమే స్వయంగా నిర్వహించాలని నిర్ణయింపబడింది. ప్రధానమైన కీలకపరిశ్రమలనుకూడా ప్రభుత్వమే స్వయంగా స్థాపించి నిర్వహించాలని, కమిటీలో అధికసంఖ్యాకుల అభిప్రాయం.

కాని కొందరు ప్రభుత్వపర్యవేక్షణ ఉంటే చాలని అభిప్రాయపడ్డారు. కాని అలాంటి పర్యవేక్షణమాత్రం చాలా ఖచ్చితంగా ఉండాలన్నారు. ప్రజలకు నిత్యమూ ఉపయోగపడే రవాణా, నీటిసప్లయివంటివి మాత్రం ప్రభుత్వంలో ఏదో ఒక శాఖ యాజమాన్యంలోనే ఉండాలన్నారు. అనగా కేంద్రప్రభుత్వమో, రాష్ట్రప్రభుత్వమో, లేక స్థానికసంస్థో వాటిని నిర్వహించాలన్నమాట. అందుకొరకు లండన్‌లోని ట్రాన్సు పోర్టుబోర్డువంటి సంస్థల నిర్మాణం సూచింపబడింది. తదితర ముఖ్యపరిశ్రమలవిషయంలో ఏమీ విస్పష్టమైన నిర్ణయాలు చేయలేదు కాని ప్లానింగంటూ అమలుచేయబడినప్పుడు, ఆయా పరిశ్రమస్థితినిబట్టి ప్రతి పరిశ్రమవిషయంలోనూ కొద్దోగొప్పో ప్రభుత్వపర్యవేక్షణ, జోక్యం తప్పదని స్పష్టీకరించబడింది.

ప్రభుత్వస్థాపితమైన పరిశ్రమనిర్వహణ సాధారణంగా సర్వాధికారాలుకలిగిన ఒక పబ్లిక్ ట్రస్టుచేతులో ఉంటేబాగుంటుందని సూచింపబడింది. అందువల్ల పరిశ్రమనిర్వహణ, ఆధిపత్యం ప్రజలదే అనే విశ్వాసం కలుగుతుంది. అదీకాక, ప్రత్యక్షంగా ప్రభుత్వనిర్వాహకుల చేతుల్లోనే పరిశ్రమనిర్వాహణంకూడాఉంటే, ఒక్కొక్కప్పుడు సంభవించే అసమర్థత, ఇబ్బందులు ఉండవు. పరిశ్రమలను సహకారసంస్థల ఆధిపత్యంలో ఉంచాలనికూడా సూచింపబడింది. ప్లానింగు అమలులో ఉన్నప్పుడు, పరిశ్రమలఅభివృద్ధివిషయంలో సునిశితమైనపరిశీలనతప్పదు. పరిశ్రమల వివిధరంగములలో జరుగుచున్న అభివృద్ధినిగురించి అప్పుడప్పుడు సింహావలోకనంచేసితీరాలి. ఏ పరిశ్రమనైనా అంతకన్న అభివృద్ధిచేయాలంటే అందుకవసరమైన సాంకేతికనిపుణులను ఇతోధికంగా తయారుచేయడం చాలా అవసరం. కనుక ప్రభుత్వం, ఏ పరిశ్రమనిర్వాహకులనైనా అట్టి నిపుణులను తయారుచేయమని శాసించవలసిఉంటుంది.

భూస్వామ్యాన్నిగురించి స్థూలంగా కొన్నిసిద్ధాంతాలు ప్రతిపాదింపబడినాయి. 'వ్యవసాయపుభూమి, గనులు, కొండలు, నదులు, అడవులు జాతీయసంపత్తియొక్క వివిధస్వరూపాలు. కనుక వాటియాజమాన్యం భారతప్రజలందరిదీని'. సమిష్టివ్యవసాయక్షేత్రాలద్వారానున్నూ సహకారవ్యవసాయసంఘాలమూలంగానూ భూములను వ్యవసాయంచేయాలన్నారు. కాని చిన్నచిన్న రైతులు స్వంతంగా వ్యవసా

యంచేసుకొనేపద్ధతినిమాత్రం ముందు తప్పించదలచుకోలేదు. అయితే జమీందారులు, తాలుకదారులూ మొదలైన మధ్యస్తులనుమాత్రం కొంతకాలానికి తొలగించకతప్పదు. వారికి సంక్రమించిన ఆస్తిహక్కులను మెల్లగా కొనెయ్యాలి. వ్యవసాయానికి లాకీయైన బంజరుభూములలో ప్రభుత్వం సమిష్టివ్యవసాయకేంద్రాలను స్థాపించాలి. కొందరు వ్యక్తులనుచేర్చుకొని, జాయింటుఆస్తితోగాని సహకారవ్యవసాయ క్షేత్రాలను ప్రారంభంచేయవచ్చును. కొంతఅనుభవం సంపాదించిన మీదట ఏపద్ధతి బాగావుంటే దానిని ప్రోత్సహించవచ్చును.

మాలోకొందరం పరపతినిపెంపొందించడాని కొకవిధమైనసామ్యవాదవిధానాన్ని అనుసరించాలని అనుకున్నాం. బ్యాంకులను, భీమా కంపెనీలను పూర్తిగా జాతీయంచేయడానికి ఏమైనాసంకోచాలుండినా, అథమం వాటిని ప్రభుత్వపర్యవేక్షణక్రిందనైనా ఉంచాలని మాఅభిప్రాయం. ఎగుమతి దిగుమతి వర్తకవ్యాపారాన్నికూడా (కట్టుబాట్లలో) ఉంచడం అవసరం. ఇందువల్ల వ్యవసాయరంగంలోనూ, పారిశ్రామికరంగంలోనూకూడా అవసరమైనంతవరకూ స్థూలంగా ప్రభుత్వపర్యవేక్షణ, కంట్రోలు ఉంటుంది. కాక ఆ పర్యవేక్షణ సర్వత్ర ఒక్కమాదిరిగా ఉండకపోవచ్చును. కొంత హద్దుపద్దుల్లో, వ్యక్తిగతమైనపరిశ్రమ కూడా ఉంటూంటుంది.

ఈరీతిగా ప్రత్యేక సమస్యలను చర్చించుకుంటూ, క్రమక్రమంగా మా సాంఘికలక్ష్యాలనూ, సిద్ధాంతాలనూకూడా రూపొందించాం. అందులో కొన్నిఖాళీలు, కొంత అనిర్దిష్టత, కొన్ని పరస్పరవైరుధ్యాలు కూడా ఉన్నాయి. సూత్రప్రాయంగా చూస్తే అది పరిపూర్ణమైన పథకమనిచెప్పను, కాని మాకమిటీలో (తీర్థానికితీర్థం ప్రసాదానికిప్రసాదంగా) ఉన్న వివిధపక్షయులనుబట్టి చూస్తే, అంత ఏకీభావం కుదిరినందుకే నా కాశ్చర్యం కలిగింది. పెద్దవ్యాపారస్థులైన ధనికసంఘం, అనేక విషయాల్లో ముఖ్యంగా వాణిజ్యవిషయంలోనూ ఆర్థికవిషయంలోనూ చాలావరకు పాతధోరణిలోనే, పురాతనదృక్పథంతోనే ఉన్నారు. కమిటీలో వారిసంఖ్య ఉన్నముఠాలలోకల్లా పెద్దది. కాని, శీఘ్రంగా పురోగమించాలనే అభిలాషవల్లను, దారిద్ర్యాన్ని నిరుద్యోగాన్నిరూపుమాపడానికిదొకటే మార్గమనే విశ్వాసంవల్లనూ, మేమందరం మా

పాతధోరణులను మార్చుకుని కొత్తఆలోచనలకు పూనుకున్నాం. కేవలం సిద్ధాంతాలమీద తర్జనభర్జనచేస్తూ కాలక్షేపంచేయక, ప్రతి సమస్యనూ ఆచరణయోగ్యమైన విధానంలో పరిష్కరించడానికి ప్రయత్నించేసరికి అంతా ఒకదారికి విధిగారావలసివచ్చింది. ప్లానింగుకమిటీలో సభ్యులు చూపిన సహకారభావం నాకుమాత్రం చాలా ఆనందాన్ని, తృప్తిని కలిగించింది. రాజకీయాల్లో ఉండే చిలిపి తగాదాలు, సంఘర్షణలు లేకపోవడమే, అందుకు కారణం. మాలోఉండే అభిప్రాయభేదాలేమిటో మేమెరుగుదుము. అయినా వాటిని తగ్గించడానికి ప్రయత్నించేవాళ్ళం. మాలోమేము బాగా అన్నిఅభిప్రాయాలు చర్చించి, ఒకవిధంగా వాటిని సమన్వయపరచి, అధికసంఖ్యాకు లామోదించేటట్లు చేయడంవలన తరుచు విజయాన్నే సాధించగలిగేం.

మాకమిటీని సభ్యులవిభిన్నభావాలవల్లనేమి, అసలు దేశస్థితివల్లనేమి అప్పట్లో సామ్యవాదరాజ్యస్థాపనకొరకు పథకాన్ని వేయలేకపోయాం. కాని మాప్రణాళికవిస్తృతమైనప్పుడుమాత్రం సామ్యవాదప్రభుత్వ నిర్మాణానికే దారితీస్తుందని నాకు స్పష్టంగాకనుబడింది. సంపత్తినిప్రోగు చేసుకోవాలనేఆశ సంఘంలో ఒకపరిమితి నేర్పాటుచేసింది. అభివృద్ధికి ఆటంకాలను ఎన్నిటినో తొలగించి సాంఘికనిర్మాణానికి శీఘ్రంగాదోహదమిచ్చింది. సామాన్యమానవుని క్షేమాభ్యుదయాలకొరకు ఆప్రణాళిక నిర్మింపబడింది. ఆతడి జీవితప్రమాణాన్ని పెంచడానికి, ఆతడి అభివృద్ధిని పెంపొందించడానికి, ఆతడిలో నిబిడీకృతమైఉండినశక్తులను విజృంభింపచేయడానికి ప్రణాళిక సంకల్పించింది. ఇదంతా స్వాతంత్ర్యమేర్పడినపిమ్మట ప్రజాస్వామికవాతావరణంలో, సాధారణంగా సామ్యవాదపద్ధతులను ద్వేషించేవారి సహకారాన్నికూడా పొంది, ప్రణాళికను జయప్రదం చేయాలనిప్రయత్నం. ప్లాను ఆదర్శాల్లో, లక్ష్యాల్లో కొన్నింటిలో కొంత దిగజారినా మొత్తంమీద ఆలాంటిసహకారాన్ని సంపాదించడం ఘనతఅనే భావిస్తాను. బహుశా నాభావం కొంతవరకు వెర్రినమ్మకం కావచ్చు. కాని సరియైనమార్గాన ఒకపెద్దఎత్తుఎత్తితే, ఆ ఊపులోనే ముందుకెడతామని నా నమ్మకం. ఒకవేళ సంఘర్షణ అత్యవసరమైతే దాని నెదుర్కోకతప్పదు. కాని వీలైతే దానిని రాకుండాచేసుకున్నా, అథవా తగ్గించగలిగినా అంతవరకూ మంచిదని వేరేచెప్పనక్కరలేదు.

రాజకీయాల్లోలాగే ఇప్పటికే కొంత సంఘర్షణ ఉన్నది. ఇంకా ముమ్ముందు అస్థిరమైన స్థితిగతులు ఏర్పడవచ్చును. అందుచేత ప్రణాళిక మీద స్థూలంగా ఏకీభావం కలుగడం గొప్పవిశేషమే. ఏవో కొన్ని ఆదర్శాలను లక్ష్యంలో పెట్టుకొని కొన్ని పథకాలను తయారుచేయడం తేలికే. కానివాటికి అధికసంఖ్యాకుల ఆమోదాన్ని పొందడం కష్టం. ప్రణాళికను సంతృప్తికరంగా నిర్వహించడానికి ఆలాంటి ఆమోదం చాలా అవసరం.

ప్లానింగువల్ల కొంతవరకు విధిగా వ్యక్తిస్వాతంత్ర్యానికి అంతరాయం కలుగుతుంది. ఆ స్వాతంత్ర్యానికి కొంతహద్దేర్పడడం సహజం. కాని మొత్తంమీద నేటిభారతస్థితిగతులనుబట్టిచూస్తే, పర్యవసానంలో ఎక్కువ స్వాతంత్ర్యానికే దోహదమవుతుంది. మనకు పోయేస్వాతంత్ర్యమేమీ లేదు. మనస్వాతంత్ర్యాన్నింకా సంపాదించుకోవాలి. మనం ప్రజాస్వామికప్రభుత్వాన్ని నిర్మాణంచేసుకొని, సహకారసంస్థలను ప్రోత్సహిస్తే అధికారకేంద్రీకరణం లేకుండాచేసుకోవచ్చును. బొత్తిగా కదంనడిపించే నిరంకుశత్వం తలెత్తకుండాచేయవచ్చు.

మా ప్లానింగుసంఘం మొదటిసమావేశంలోనే సవిస్తరమైన ప్రశ్నావళిని తయారుచేశాం. వాటిని అన్నిప్రభుత్వాలకు, ప్రజాసంస్థలకు, విశ్వవిద్యాలయాలకు, వాణిజ్యసంఘాలకు, కార్మికసంఘాలకు, శాస్త్రపరిశోధనాలయాలకు, ఇంకా తదితరసంస్థలకు పంపేం. ప్రత్యేకవిషయాలను, ప్రత్యేకంగాపరిశీలించినివేదించడానికి 29 ఉపసంఘాలను నియమించాం. వ్యవసాయవిషయాలపరిశీలనకు 8, పరిశ్రమలకు కొన్ని, వాణిజ్య, ఆర్థికవిషయాలకు 5, రవాణాకు 2, జననమరణాదివిషయపరిశీలనకు 2, ప్లానింగులో స్త్రీలస్థానాన్ని పరిశీలించడాని కొక కమిటీ నియామకంచేశాం. ఆ సంఘాల్లో మొత్తం 350 మంది సభ్యులుగా ఉన్నారు. కొందరు రెండుమూడుసంఘాల్లోకూడా పనిచేస్తూవచ్చారు. వాళ్ళలో చాలామంది ఆయావిషయాల్లో గొప్పనిపుణులు. వ్యాపారస్థులు, ప్రభుత్వోద్యోగులు, మునిసిపల్ఉద్యోగులు, విశ్వవిద్యాలయ అధ్యాపకులు, శాస్త్రవేత్తలు, సాంకేతికనిపుణులు, కార్మికోద్యమనాయకులు, పోలీసులు వగైరా అన్నితరహాలవారికీ ఇందులో స్థానం కలుగచేశాం. ఈవిధంగా దేశంలోలభ్యమైన బుద్ధిమంతులనందరినీ

సమీకరించాం. మాతో సహకరించడానికల్లా వీలుపడనిది కేంద్ర ప్రభుత్వోద్యోగులకు మాత్రమే. వారు ఈపనికి తోడ్పడాలని ఎంత కుతూహలపడినా కేంద్రప్రభుత్వం అలాంటి సావకాశాన్ని కలిగించలేదు. ఇంతమంది మేధావులను ఈ కార్యక్రమంలో జొప్పించడంవల్ల దేశానికి చాలా లాభించింది. ఆ యా నిపుణులకున్న ప్రత్యేకజ్ఞానం అనుభవం రెంటిని మేము పొందగలిగేం. దేశం మొత్తంమీద, స్థూలదృష్టితో తమ ప్రత్యేకవిషయాన్ని వారు చూడగలిగేరు. ఏమైనా, ప్లానింగంటే దేశ వ్యాప్తంగా ఒకవిధమైన అభిలాషకలిగింది. కాని అంతమంది బహుళ సంఖ్యాకు లీపనిలో చేరడంవల్ల కొంత ఇబ్బందికూడా లేకపోలేదు. దేశం లోని అనేకరాష్ట్రాల్లో ఉంటూ చేతినిండాపనిగల ఈ శాస్త్రజ్ఞులంతా తరచు కలవడంలోగల ఇబ్బందులవల్ల పనిలో కొంత జాప్యం తప్పనిసరి అయింది.

దేశంనలుమూలల్లోనూ, వివిధములైనజాతీయాభ్యుదయ కార్య కలాపాల్లో పనిచేస్తుండే అనేకమంది ప్రముఖులైన విజ్ఞానవంతులతో కలసి పనిచేసేభాగ్యంకలిగినందుకు నా కెంతో ఆనందంకలిగింది. సహచర్యం నాకు జ్ఞానదాయకమైనది. ప్రణాళిక కార్యనిర్వహణం ఇలాచేయాలని నిశ్చయించాం. ప్రతి ఉపసంఘం తత్కాలంగా ఒక ప్రాథమికనివేదిక పంపాలి. దానిని ప్లానింగుకమిటీ చర్చించి ఆమోదించడంకాని, విమర్శిం చడంగాని చేస్తుంది. వారి అభిప్రాయాలతో ఆ నివేదికను తిరిగి ఉపసం ఘానికి పంపాలి. వాటిని పరిశీలించి తిరిగి నివేదికను పంపినపిమ్మటనే ప్లానింగుకమిటీసభ్యులమైన మేము మాఅభిప్రాయాలను తేల్చేవాళ్ళం. ఎప్పటికప్పుడు మేమేదైనా ఒకవిధమైన నిర్ణయాలకొస్తే, వాటికి సంబం ధించిన ఇతరవిషయాలమీద జరిపిన నిర్ణయాలతో సమన్వయపరచే వాళ్ళం. ఈవిధంగా అన్నినివేదికలను పరిశీలించి తుదినిర్ణయాలకొచ్చిన పిమ్మట, ప్లానింగుకమిటీ ప్రతివిషయాన్ని సింహావలోకనంచేసి ఒకసమ గ్రమైననివేదికను తయారుచేసింది. వాటికి అనుబంధాలుగా ఉపసంఘ నివేదికలను ప్రచురించింది. మేము వుపసంఘనివేదికలను చర్చిస్తున్న ప్పుడే, అసలునివేదిక రూపొందుతూ ఉండేది.

ఉపసంఘాలజాప్యంవల్ల ఒకొక్కప్పుడు చిరాకెత్తించేఆలస్యం అయ్యేది. కాని మొత్తంమీద చాలావరకు ఈపనిని కొనసాగించాం.

విద్యావిషయికంగా, రెండు ముఖ్యమైననిశ్చయాలుచేశాం. ప్రతి విద్యాతరగతికి అందుకుతగినశరీరసౌష్టవం, బలం ఉండాలన్న నిర్ణయం మొదటిది. 18-22, ఏండ్లమధ్యనున్న ప్రతివిద్యార్థీ, విద్యార్థినీ విధిగా ఏదో ఒకవిధమైన కాయకష్టాన్నో సాంఘికసేవనో ఒకసంవత్సరంపాటు చేయవలెనన్నది రెండవనిర్ణయం. వ్యవసాయంలోనో, పరిశ్రమలోనో లేక ఏదోవిధమైన సార్వజనికోపయుక్తమైనపనిలో నిమగ్నంకావాలి. శారీరకంగాగాని మానసికంగాగాని ఏదైనాఅరుగ్మత ఏర్పడినప్పుడుతప్ప ఈ నిర్ణయానికి తిరుగుండకూడదు.

సెప్టెంబరు 1939 సంవత్సరంలో ద్వితీయప్రపంచ మహాసంగ్రామం ప్రారంభమైనప్పుడు జాతీయప్రణాళికాసంఘం తనకార్యక్రమాన్ని కట్టిపెట్టాలన్నారు. నవంబరు నెలలో రాష్ట్రప్రభుత్వాలు రాజీనామాలివ్వడంతో గవర్నరులపరిపాలన ప్రారంభమైంది. ఆ నిరంకుశపరిపాలనలో మా ప్రణాళికాకార్యక్రమం యెడల శ్రద్ధతీసుకునేవారెవ్వరూ లేకపోయారు. వ్యాపారస్తులు యుద్ధసామాగ్రిని తయారుచేసి అధికలాభాలను సంపాదించేపనిలోపడి ప్లానింగుసంగతి మరచిపోయారు. రోజురోజు స్థితిగతులు మారిపోతూవచ్చాయి. మేముమాత్రం ఏమైనాసరే మా ప్లానింగుకార్యక్రమాన్ని కొనసాగించాలనుకున్నాం. యుద్ధంవల్ల దాని అవసరం మరింతగాకనుబడింది. అప్పట్లో మేము ఇంజనీరింగు పరిశ్రమ, రవాణా, రసాయనపరిశ్రమ, భారీఉత్పత్తిపరిశ్రమ మొదలైనవాటి ఉపసంఘనివేదికలను పరిశీలిస్తున్నాం. అవన్నీకూడా యుద్ధానికత్యంత అవసరమైనపరిశ్రమలే. కాని మేముచేసేపనిలో ప్రభుత్వానికేమీ జోక్యంలేదు సరికదా, మే మాపనిచేయడం వారికిష్టంకూడాలేదు. యుద్ధంప్రారంభదశలో, అంతా అనుమానంతోకూడుకున్నరోజుల్లో భారతీయపరిశ్రమలు వృద్ధిపొందడం ప్రభుత్వానికెంతమాత్రం ఇష్టంలేదు. తర్వాత అవసరాలనుబట్టి వారు ఈదేశంలోతయారైన వస్తువులనే విధిలేక కొనుక్కోవలసివచ్చింది. అంతయినాకూడా భారీపరిశ్రమలను భారతదేశంలో స్థాపించడానికి వారు అంగీకరించలేదు. ప్రభుత్వానుమతి లేనిదే యంత్రసామగ్రిని దిగుమతిచేయడానికి వీలులేదు. కనుక వారికిష్టంలేకపోతే నిషేధమన్నమాటే.

ప్లానింగు కమిటీపని చాలవరకు పూర్తిఅయింది. ఉపసంఘ నివేదికల పరిశీలన పూర్తిఅయేదాక వచ్చాం. ఆ కాస్తా ముగించుకుని సమగ్రమైన నివేదికను తయారుచేసేఘట్టంలో ఉన్నాం. అలాగా ఉండగా 1940 సంవత్సరం అక్టోబరు నెలలో నన్నరెస్టుచేసి దీర్ఘకాల కారాగారశిక్ష విధించారు. ప్లానింగుకమిటీలోని సభ్యులలో చాలా మందినికూడా అరెస్టుచేసి జైలులోపడేశారు. ప్లానింగుకమిటీకార్య కలాపం యధాప్రకారంగా జరగాలని నా అభిలాష. జైలుబైటనున్న వారి నాపనిని కొనసాగించమని కోరేను. నేను లేకుండా వా రాపనిని సాగించడానికిష్టపడలేదు. ప్లానింగుకమిటీతాలూకు కాగితాలను జైలు లోనికి తెప్పించుకుని వాటిని జాగ్రత్తగా పరిశీలించి నివేదిక ముసా యిదా నొకదానిని తయారుచేయాలని ప్రయత్నించాను. ఇండియా ప్రభుత్వంవారు అభ్యంతరపెట్టి ఆపుచేశారు. ఆబాపతుకాగితాలను నా కందకుండాచేశారు. ఆ సంబంధమైన మనుష్యులతో మాట్లాడ కూడదన్నారు.

కనుక, నేను జైల్లో కాలక్షేపంచేస్తుంటే, ప్లానింగుకమిటీ ఏమ్మైపోయింది. మేము చేసినపని అసంపూర్ణమైనా, యుద్ధకార్యక్రమాని కెక్కువగా ఉపయోగపడేదే కాని ఆ కాగితాలన్నీ అలాగే మా కార్యాలయంలో బూజుపట్టిపడున్నాయి. నేను 1941 సం॥రం డిశెంబరు నెలలో విడుదలై కొద్దిమాసములు మాత్రమే జైలుబయట ఉన్నాను. దేశమందరితోపాటు నాకూ ఈ కాలం చాలా ఆవేశకరమైనదై మన శ్శాంతిలేని కల్లోలయుతమైన రోజులు. అనేక కొత్తమార్పులు సంభ వించాయి. పసిఫిక్ మహాసముద్రంలో యుద్ధంసాగింది. భారతదేశం మీాదికి ఇతరదేశాలవారు దండెత్తివస్తారేమోనని భయపడినకాలం. అలాంటప్పుడు, ప్లానింగుకమిటీకాగితాలను బూజుదులిపి అసంపూ ర్ణంగా వదలిన ఆ పనిని పూర్తిచేయాలంటే రాజకీయవాతావరణంలో మార్పుకలిగితేకాని సాధ్యంకానిపని. మళ్ళీ నేను జైలుకు చేరుకున్నాను.

## ౭ కాంగ్రెసు - పరిశ్రమలు, భారీపరిశ్రమలా లేక కుటీరపరిశ్రమలా?

గాంధీజీనాయకత్వాన, కాంగ్రెస్ చాలాకాలంనుంచి, గ్రామీాణ పరిశ్రమలను, ముఖ్యంగా చేతివడుకు, చేనేతపరిశ్రమలను పునరుద్ధరించా

లని కంకణంకట్టుకుంది. కాని భారీపరిశ్రమల అభివృద్ధిని మాత్ర మెన్నడూ కాదనలేదు. శాసనసభల్లోగాని, ఇతరత్రాగాని ఏమాత్రం సావకాశంలభించినా వాటిఅభివృద్ధినే ప్రోత్సహించింది. కాంగ్రెస్ ఆధిపత్యానవడచిన రాష్ట్రప్రభుత్వాలు వాటిని అభివృద్ధిచేయడాని కెంతో అభిలాషపడ్డాయి. 1920 - 30 సంవత్సరాలమధ్య తాతాకంపెనీవారి ఇనుము, ఉక్కుపరిశ్రమ క్లిష్టస్థితిలోనున్నప్పుడు, అప్పట్లో కేంద్రశాసన సభలోని కాంగ్రెస్‌పక్షమువారికృషివల్లనే, ప్రభుత్వం వారి కెక్కువగా తోడ్పడింది. అందువల్లనే వారిముప్పు గడిచింది. భారతీయనౌకా నిర్మాణపరిశ్రమనుగురించీ, ఓడలను త్రిప్పడంవిషయంలోనూ ప్రభుత్వానికీ, జాతీయవాంఛకూ ఎప్పుడూ సంఘర్షణజరుగుతూనే ఉండేది. జాతీయవాదులు, కాంగ్రెస్‌పక్షంవారు, భారతీయనౌకాపరిశ్రమకు అధికంగా తోడ్పడాలని ఆత్రతపడేవారు. బాగా ఆర్థికస్తోమతుకలిగి పలుకుబడికలిగిన బ్రిటిష్‌నౌకాపరిశ్రమదారుల లాభాల కేమీ భంగం కలుగకుండా చూడాలని ఇండియా ప్రభుత్వాధికారులు ఆత్రతపడే వారు. భారతీయనౌకాపరిశ్రమకు కావలసినంతపెట్టుబడి ఉండింది. సాంకేతికశాస్త్రజ్ఞులూ, పరిపాలనాప్రతిభగలవారూ కూడా ఉండినారు. కాని ప్రభుత్వోద్యోగులపక్షపాతమువలన భారతీయనౌకాపరిశ్రమాభివృద్ధి కంతరాయంకలిగింది. బ్రిటిష్‌వారికి పరిశ్రమల్లోనూ వాణిజ్యంలోనూ, ఇతర ఆర్థికవిషయాల్లోనూ ఎక్కడెక్కడ ప్రత్యేకాభిమానాలున్నవో అక్కడక్కడ ఈ పక్షపాతబుద్ధి ప్రత్యక్షమవుతూనేవచ్చింది.

ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్ అనే బ్రిటిష్‌ప్రారిశ్రామికసంస్థ కెప్పుడూ, భారతీయపరిశ్రమకు దెబ్బకొట్టి సహాయపడుతూనే ఉండేది. భారతప్రభుత్వం కొంతకాలంక్రిందట పంజాబులోని ఖనిజసంపత్తిని త్రవ్వితీసుకోడానికి ఆకంపెనీవారికి దీర్ఘకాలపుకౌలుకిచ్చింది ప్రభుత్వం. ఆ కౌలుషరతులను నే నెరిగినంతవరకు ప్రభుత్వం బహిరంగపరుపలేదు. ఆలాంటిప్రకటన 'ప్రజాశ్రేయస్సుకు' భంగమని వారి అభిప్రాయం కాబోలు!

రాష్ట్రప్రభుత్వాలు పవర్ ఆల్కహాల్ (ఇంజనులను నడిపే చముకు) పరిశ్రమనువృద్ధిచేయడానికి చాలాయత్నాలుచేశాయి. అనేక

విధాలుగా అది చాలామంచిప్రయత్నం. ముఖ్యంగా ఉత్తరప్రదేశం లోనూ, బీహారురాష్ట్రంలోనూ ఎక్కువగా చక్కెరమిల్లులున్నాయి. వాటిలో ఎక్కువగాలభ్యమయ్యే చెరకుమడ్డి నిరుపయోగంగా పాడై పోతోంది. దానిలోనుంచి పవర్ ఆల్కహాలునుతయారుచేయాలని వారి ప్రయత్నం. తయారీచేయడంలో ఏవిధమైనకష్టమూలేదు. ఉన్నఇబ్బం దల్లా ఒక్కటే. బర్మాషెల్వగైరాకంపెనీల పెట్రోల్, కిరోసిన్ మొద లైనవ్యాపారాలకు అడ్డమొస్తుంది. భారతప్రభుత్వం విదేశీనూనెకంపెనీ లకు లాభాలుసమకూర్చిపెట్టటానికి పవర్ ఆల్కహాలుపరిశ్రమను తలెత్త కుండాచేశారు. కాని యుద్ధంప్రారంభమైన మూడోసంవత్సరంలో బర్మాపడిపోయినపిమ్మట అక్కడనుండివస్తూఉండిన నూనెపెట్రోలు. వగైరాలు రావడం ఆగిపోయాక, ఇండియాలో పవర్ ఆల్కహాలును తయారుచేసుకోవలసినఆవశ్యకతను గుర్తించారు. 1942 సంవత్సరంలో అమెరికా గ్రేడిసంఘం ఈసంగతిని గట్టిగా చాటింది.

భారతదేశంలో భారీపరిశ్రమలను నెలకొల్పాలనేకాంగ్రెస్ అభి ప్రాయం. కాని, వాటితోపాటు కుటీరపరిశ్రమలనుకూడా విరివిగా నెల కొల్పడానికే పూనుకుంది. ఈరెండువిధానాలకు అన్యోన్య వైరుధ్యం ఉన్నదా అని ప్రశ్న. బహుశా ఏదిముఖ్యం, ఏదిముందు అనే విషయంలో తేడా ఉండవచ్చును. మనదేశంలో ఇదివరకు అంతగా పాటింపబడని ఆర్థికస్థితిగతు లిప్పుడు గుర్తింపబడ్డాయి. భారతీయ పారిశ్రామికవేత్తలూ, వారి కండగానుండిన రాజకీయపరిజ్ఞాతలూ 19వ శతాబ్దంలో యూరోపులో పెట్టుబడిదారీపరిశ్రమల ధోరణి లోనే ఆలోచిస్తున్నారు. 20వ శతాబ్దంలో వచ్చిన ప్రమాదాలను వారు గమనించినట్లులేదు. భారతదేశంలో సహజమైన అభివృద్ధికొక వందసంవత్సరాలు ఆటంకం కలుగడంచేత ఈ ప్రమాదం మరీ ఎక్కువగా కనుబడుతుంది. భారతదేశంలో నిర్మింపబడుతున్న మధ్యతరగతి పరి శ్రమలవల్ల ప్రస్తుత ఆర్థికస్థితిలో కూలినాలిజనానికి ఎక్కువపనులు దొర కడానికి బదులు నిరుద్యోగం పెరిగింది. ఒకవైపున కొందరిదగ్గర ధనం పేరుకుంది. మరొకవైపున దారిద్ర్యం నిరుద్యోగం పెరిగిపోయింది. ఎక్కువమందికి వృత్తికల్పించే భారీపరిశ్రమలను స్థాపించడంవల్లనూ

ఒకప్రణాళికప్రకారం అభివృద్ధికార్యక్రమం జరిపించడంవల్లనూ ఇల్లాటి ఇబ్బందులను తొలగించిఉండవచ్చును.

దినదినప్రవర్ధమానంగా పెరుగుతున్న జనసామాన్యంయొక్క పేదరికం గాంధీజీని చాలా ఆందోళనపరిచింది. జీవితపరమార్థాన్ని గురించి ఆయనదృక్పథానికీ, నవీనులదృక్పథానికీ చాలా ప్రధానమైన అభిప్రాయభేదాలున్నాయని నా మతం. నైతిక ఆధ్యాత్మికవికాసం లేకుండా, కేవలం జీవితప్రమాణంపెరిగిపోవడం ఆయనకు ఎంతమాత్రం గిట్టదు. కేవలసుఖజీవనాన్నే ఆయన హర్షించడు. కష్టపడి జీవించడమే యోగ్యమైనజీవనమనిఆయన లెఖ్ఖ. విలాసజీవనం అవినీతికి, వక్రమార్గాలకుదారితీస్తుందంటాడు గాంధీజీ. పేదలకు, ధనికులకు మధ్యనుండే విశేషమైనఅంతస్థు ఆయనను చకితులనుచేస్తుంది. వారిజీవితవిధానాలలో తేడాలు, అభివృద్ధికిగలసావకాశాల్లో అంతస్థులు ఆయనకుగిట్టవు. అందుకే తన మనస్సంతుష్టికొరకు ఆయన పేదలపక్షంవహించాడు. స్వల్పమైనమార్పులతో ఆయన వేషభాషల్లో వారిజీవితపద్ధతినే అనుసరిస్తున్నాడు. పేదలకు ధనికులకుమధ్యనున్న ఈ తేడాకు రెండుకారణాలనాయన గ్రహించాడు. విదేశీయపరిపాలన, దానివలనకలిగే దోపిడీ విధాన మొకటి. ధనికవర్గముల పారిశ్రామికనాగరికత రెండు. ఈ రెండిటిమీదా ఆయన విజృంభించాడు. పూర్వకాలం, గ్రామాల్లో స్వయంపోషకసిద్ధాంతం అమలులోఉండేకాలంలో ఉత్పత్తి, పంపకం, వినియోగం మూడు వాటంతటవే సహజంగా సమంగానడిచినకాలం మంచిదని ఆయనకు తోచింది. అప్పట్లో ఆర్థికరాజకీయఅధికారాలు ఏకొద్దిమందిచేతుల్లోనో ఉండేవికాదు. ధనికులకూపేదలకూమధ్య ఇంత పచ్చిగాకనబడే తారతమ్యాలు ఉండేవికావు. మర్మములేని ప్రజాస్వామికవిధానం నడిచేది. పెద్దపెద్దనగరాలవల్లకలిగే అనర్థాలేమీలేకుండా ప్రజలు గ్రామాల్లో నిరాడంబరంగా జీవిస్తూఉండేవారు. జీవితానికి సర్వవిధాల తేజస్సునిచ్చేభూమిని ఆరాధిస్తూ విశాలమైనపచ్చికబయళ్ళల్లో స్వేచ్ఛావాయువులను పీల్చగలిగేవారు. ఆలాంటిజీవితపద్ధతి తిరుగ నెలకొల్పాలని గాంధీజీఅభిలాష.

గాంధీజీకి తదితరులుచాలామందికీ, జీవితదృక్పథాన్నిగురించీ, దానిపరమార్థాన్నిగురించీ ప్రధానమైన అభిప్రాయభేదాలున్నాయి.

అభేదమే, ఆయనచర్యల్లోనూ, భాషలోనూ స్పష్టంగాకనుబడుతుంది. ఆయనభాష విస్పష్టత, పటుత్వమూకలిగి, చిరకాలానుగతమైన ప్రాచీన భారత నైతిక, మతైకసాంప్రదాయములనుండి ఉత్పన్నమైనది. (ప్రధానంగా భారతీయమైనా ఇతరదేశాలలోని మతసిద్ధాంతాలనుండికూడా). ఏవిషయంలోనైనా నైతికవిలువలకు ప్రాధాన్యతనివ్వకతప్పదు. అసమంజసమైనపద్ధతులననుసరించి మంచిఫలితాన్ని సాధించడం హర్షింపదగిన విషయం కాదు. అలాచేస్తే వ్యక్తీ, జాతీకూడా నశిస్తుంది.

అట్లని గాంధీజీ కేవలం స్వప్నప్రపంచంలో విహరించేవాడు కాడు. జీవితసమస్యలకు దూరంగా ఉంటూ ఏనో ఊహాగానాల నాయ నెన్నడూ చేయలేదు. పక్కా వ్యాపారస్థుల జన్మస్థానమైన గుజరాతులో ఆయన పుట్టి పెరిగేడు. భారతదేశంలోని గ్రామాలు, అక్కడుండే స్థితిగతులు ఆయనకు తెలిసినట్లు మరొకరికి తెలియవు. ఇటువంటి నిరుపమానమైన అనుభవంవల్లనే ఆయన చేతిరాట్నకార్యక్రమాన్ని గ్రామీణపరిశ్రమలకార్యవిధానాన్ని రూపొందించగలిగేడు. అసంఖ్యాకులైన నిరుద్యోగులకు, సగం సగంపని కలవారికీ తక్షణం ఏదైనా కొంత సహాయం చేయాలన్నా, దేశమంతటా ప్రజాసామాన్యంలో వ్యాపిస్తున్న అలసత్వము, స్తబ్ధత ఆపాలంటే, ఏ కొంచెంగానైనా దేశమంతటా జీవనప్రమాణాన్ని లేవనెత్తాలంటే, ప్రజలు పరాపేక్షతో అర్రులు సాచి పడుండకుండా స్వయంశక్తిమీద ఆధారపడాలంటే, ఈ పనంతా విశేషమైన మూలధనం అక్కరలేకుండా జరగాలంటే, రాట్నము, గ్రామీణపరిశ్రమలుతప్ప మరొకమార్గం కనుబడదు. విదేశీయ పరిపాలనవల్లను, వారి దోపిడులవల్లను పెద్దపెద్ద సంక్షేమదాయకమైన పథకాలను అమలుపరిచే స్వేచ్ఛ లేకపోవడంవల్లను, సహజంగా కలిగే అనర్థాలసంగతి అలా ఉండగా, భారతదేశాన్నెదుర్కొనే పెద్ద సమస్య ఒకటున్నది. మూలధనం లేకపోవడం అసంఖ్యాకంగా కూలిజనం లభ్యంకావడం. ఏవిధమైన ఉత్పత్తికీ తోడ్పడకుండా నిరుపయోగంగా ఉంటున్న కూలిజనాన్నేమిచేయాలనేదే సమస్య. మనిషిచేసేపనిని మిషన్ చేసేపనిని మూర్ఖంగా పోలుస్తూవుండడం కద్దు. వెయ్యిమంది లేక పదివేలమంది చేసేపనిని పెద్దయంత్రం చేయగలదనడానికేమీ సందేహం లేదు. కాని ఆ యంత్రస్థాపనవల్ల అంతమందిజనం గోళ్ళుగిల్లుకుంటూ

పనిపాటలు లేకుండాకూర్చునేస్థితి ఏర్పడితే సంఘానికది లాభకరంకాదు. భవిష్యత్తులో ఆపని సాంఘికస్థితిగతులను మార్చివేయగలిగినదైతే ఆసంగతి వేరు. అసలు పెద్దయంత్రమే లేకపోతే ఈ పోలికప్రసక్తే లేదు. ఏదైనా జాతీయసౌభాగ్యందృష్ట్యా, మనుష్యుల శక్తిసామర్థ్యాలు ఉత్పత్తికి ఉపయోగపడాలి. భారీఎత్తున యంత్రాల నుపయోగించ వలసివచ్చినప్పుడు అట్టి ఉపయోగం కొత్తగా నిరుద్యోగసమస్యను తెచ్చిపెట్టకుండా కాయకష్టంచేసేవారికి పనికల్పించేటట్లయితే దానితో ఏవిధమైన సంఘర్షణా ఎవ్వరికీ ఉండదు.

పశ్చిమదేశాల్లో కొన్ని చిన్నదేశాల్లో భారీగా పరిశ్రమలు సాగుతున్నాయి. అమెరికా రష్యాలవంటి కొన్నిదేశాలు విస్తీర్ణంలో పెద్దవైనా జనసంఖ్య తక్కువగాఉన్నాయి. ఆలాంటి దేశాల్తో మనదేశాన్నిపోల్చడం చాలా అవ్యక్తమైనపని. పశ్చిమ యూరోపు లోనిదేశాల్లో పరిశ్రమీకరణం ప్రారంభమై దాదాపు నూరు సంవత్సరాలైనది. క్రమంగా ప్రజ లందుకలవాటుపడ్డారు. ఆదేశంలో జనాభా శీఘ్రంగా పెరిగింది. తర్వాత కాస్త స్తంభించింది. ఇప్పుడు తగ్గుతోంది. అమెరికాలోనూ, రష్యాలోనూ కొద్దిజనాభాగలిగి క్రమంగాపెరుగుతున్న విశాలఖండాలున్నాయి. ఆ ప్రాంతాలను వ్యవసాయంలోకి తేవాలంటే మరనాగళ్ళు (ట్రాక్టర్లు) ఉండితీరాలి. కాని కేవలం భూమి మీదనే జీవనానికి ఆధారపడుతున్న జనం కొల్లలుగానున్న గంగా మైదానంలో మరనాగలి అవసరమని చెప్పలేము. అమెరికాలోవలెనే ఇక్కడా అనేకసమస్యలు బయలుదేరుతాయి. వేలసంవత్సరాలుగా భారతదేశంలో వ్యవసాయంసాగుతోంది. ఇన్నిసంవత్సరాలుగా భూమి లోనుంచి సారం అపారంగా తీస్తూనేఉన్నారు. మరనాగళ్ళతో భూమిని కలబెట్టేస్తే, భూసారం ఇంకా తగ్గిపోవడం, భూమి కోతబడిపోవడం జరుగుతుందా? హిందూదేశంలో రైలుమార్గాలను నిర్మాణంచేసినప్పుడు ఎత్తైనకరకట్టలు నిర్మించారు. ఆనిర్మించేటప్పుడు, సహజంగావాననీరుప్రవహించడానికిచేయవలసినఏర్పాట్లను అంతగా పాటించలేదు. ఈ గట్లు సహజమైన నీటిప్రవాహాలకు అడ్డుతగలడంవల్ల తరచు వరదలువచ్చి అనేకవిధాలైన నష్టాలనుకలిగిస్తున్నాయి. చలిజ్వరం (మలేరియా) కూడా వ్యాపించింది.

భారీయంత్రాలు, మరనాగళ్ళు చాలాఅవసరమని నా అభిప్రాయం. త్వరితంగా భారతదేశంలో భారీపరిశ్రమలను నెలకొల్పాలని, తద్వారా సేద్యంమీదఆధారపడేవారివత్తిడి తగ్గించాలనీ, పేదరికాన్ని నిర్మూలంచేసి జీవితప్రమాణాన్ని పెంచాలనీ నా విశ్వాసం. దేశరక్షణకు తదితరపనులకు పెద్దపరిశ్రమలవసరమని నా మతం. కాని అందువల్ల వచ్చే అనేకకష్టాలను వారించి, లాభాలను పూర్తిగాపొందాలంటే జాగ్రత్తగా ఒకప్రణాళికనురచించి, దానికవసరమైనసర్దుబాట్లుచేసుకోవాలనికూడా నా అభిప్రాయం. ఈ ప్రణాళికలు వెనుకబడినదేశాలన్నిటి అభివృద్ధికీ చాలాఅవసరం. ముఖ్యంగా, స్వకీయమైన చరిత్రాత్మకమైన సాంప్రదాయంగల ఇండియా, చైనాలకు మరింతఅవసరం.

చైనాలో నిర్వహింపబడుతున్న పారిశ్రామిక సహకారసంఘాలు నన్నెంతో ఆకర్షించాయి. అలాంటిసంఘాలవంటివి మనదేశానికికూడా బాగాపనికివస్తాయని నాకుతోస్తుంది. అలాంటివి మనసాంప్రదాయాలకనుగుణ్యంగా ఉంటాయి. సహకారభావాన్ని పెంపొందించి, చిన్నపరిశ్రమల కొక ప్రజాస్వామికస్వరూపాన్ని తేగలుగుతాయి. భారీపరిశ్రమలకు అవి దోహదంచేసేటట్లుకూడా చూడవచ్చును. భారీపరిశ్రమలనెంత శీఘ్రంగా నెలకొల్పినా, ఇండియాలో చిన్నగృహపరిశ్రమలకు కావలసినంతస్థానం ఉన్నది. సోవియటురష్యాలోకూడా చిన్నపనివాండ్ల ఉత్పత్తిసహకారసంఘాలు పరిశ్రమాభివృద్ధికి చాలా ఎక్కువగా ఉపయోగపడ్డాయి.

చిన్నపరిశ్రమదారులు, విద్యుత్‌శక్తిని విరివిగాఉపయోగించడంవల్ల ఉత్పత్తినధికంచేసుకొని భారీపరిశ్రమలతో అడుగుకలపడానికికూడా వీలుంది. పరిశ్రమలరంగంలో వికేంద్రీకరణసిద్ధాంతం క్రమంగా బలపడుతోంది. హెన్రీఫోర్డుమహాశయుడుకూడా ఆ సిద్ధాంతాన్ని బలపరుస్తున్నాడు. పెద్దపెద్ద పారిశ్రామికనగరాల్లో జీవిస్తూ, భూమితోగల సంబంధాలను తెగగొట్టుకోవడంవల్ల ప్రజలకు మానసికంగానూ, ఇతరత్రా కలిగేప్రమాదాలనుగురించి విజ్ఞానశాస్త్రవేత్తలు బహుధా హెచ్చరికలు చేస్తున్నారు. మానవజాతి బ్రతికిఉండాలంటే విధిగా గ్రామాలకుపోయి, సేద్యంచేయాలనికూడా కొందరంటున్నారు. అదృష్టవశాత్తు, శాస్త్ర

విజ్ఞానం బాగా అభివృద్ధికావడంవల్ల సేద్యంచేసుకుంటూనే నవనాగరికతను సంస్కృతిని అనుభవించకలుగుతున్నారు.

ఏమైనా భారతదేశాన్ని ఈమధ్య కలవరపరుస్తున్న సమస్యఒక్కటే. పరప్రభుత్వదాస్యంచేత ఆవృతమై, అందువల్లకలిగే పీడనంతా అనుభవిస్తున్న ఈస్థితిగతులలో, ప్రజాసామాన్యంలో అలముకొనియున్న దారిద్ర్యాన్ని నిర్మూలనంచేసి వారికొకవిధమైన ఆత్మవిశ్వాసాన్ని కలిగించడం ఎలాగాఅనే దేసమస్య. కుటీరపరిశ్రమలను పెంపొందించాలనేవాదం ఎప్పుడూ ఉన్నది. కాని ఇప్పటిపరిస్థితుల్లో ముఖ్యంగా మనం ఆచరించగలిగినపని అదే. అందుకోసం మనం అవలంబిస్తున్నవిధానాలు సర్వోత్తమమైనవి కాకపోవచ్చు. ఈ సమస్యఅపారమైనది, జటిలమైనది. చాలా చిక్కైనది. ప్రభుత్వంవారిఆగ్రహానికికూడా తరుచు గురికావలసివుంటుంది. క్రమంగా వాటిని ఆచరిస్తూ లోపాలనుసవరించుకుంటూ ముందుకుపోవాలి. మొదటినుంచి మనం సహకారసంఘాలద్వారా కుటీరపరిశ్రమలనుప్రోత్సహించి యుండవలసింది. గ్రామాల్లోనూ కుటీరాల్లోనూ ఉపయోగపడగల చిన్నచిన్నఉత్పత్తియంత్రాలను నిర్మాణం చేయడానికి మనసాంకేతికనిపుణులనుపురిగొల్పవలసింది. ఇప్పుడు ఈచిన్నపారిశ్రామికసంస్థల్లో సహకారసూత్రాలు అమలుజరుపబడుతున్నాయి.

"చేతివడుకు, చేతినేతపరిశ్రమను (ఖద్దరుపరిశ్రమ) పునరుద్ధారణచేయడంకొరకొక ఉద్యమాన్ని నిర్వహించడంలో గాంధీజీ అభిప్రాయం కేవలం పురాతనయుగాన్ని పునఃస్థాపితంచేయడం కాదు. గ్రామాల్లో ఉన్న లేమిని తొలగించి, వారిజీవితప్రమాణాన్ని వెంటనే వృద్ధిచేయడమే ఆయన లక్ష్యం అని ప్రసిద్ధ ఆర్థికశాస్త్రజ్ఞుడు జి. డి. హెచ్. కోల్ వ్రాశాడు. ఆ మాట ముమ్మాటికీ సత్యం. అంతేకాదు. పేదవారైన రైతులుకూడా మానవులనేసంగతి జ్ఞప్తికితెచ్చింది. మహాపట్టణాల తళుకుబెళుకులవెనుక దుర్భరమైన దారిద్ర్యాంధకారం వ్యాపించిఉందని ప్రజలు కెరుకపరచింది. హిందూదేశంలో అభ్యుదయానికి చిహ్నాలు కోటీశ్వరులైన ధనవంతులు, వేలాదిగాఆర్జన చేసేవకీళ్ళు, శాసనసభలు, కౌన్సిళ్ళు మొదలైనవి కావనీ, సామాన్యసేద్యగాని జీవనానికి వికాసంకలిగించి, ఆతని బ్రతుకుతెరువు నభివృద్ధిచేయడమే నిజమైన అభ్యుదయచిహ్నమనీ గాంధీజీ ఖద్దరుపుద్యమంద్వారాచాటాడు.

బ్రిటిష్‌వారు ఇంగ్లీషు చదువుకున్న వారినందరినీ ఒక కొత్తకులస్థులుగా తయారుచేశారు. వాళ్ళకూ ప్రజలకూ ఏమీ సన్నిహితత్వంలేదు. అప్పుడప్పుడు కాస్త చిరాకుపడినా మొత్తంమీద వారు ఎంతసేపూ, పాలకుల చిత్తవృత్తి కెదురుచూస్తూనే ఉంటారు. ఈ తరగతివారికీ ప్రజలకూ మధ్యనుండిన అగాధాన్ని గాంధీజీ కొంతవరకు కప్పి, వాళ్ళుకూడా ప్రజల వైపుకు చూచేటట్లుచేశాడు.

యంత్రముల విషయంలో గాంధీజీఅభిప్రాయాలు క్రమక్రమంగా మార్పుచెందుతున్నట్లు తోస్తుంది. 'యంత్రాలకు నేను ప్రతికూలుడను కానుకాని దానినిగురించిన యావకే నా అభ్యంతరం...మనగ్రామాల్లో ప్రతిఇంటా విద్యుత్‌శక్తి లభ్యమైతే, దానితో గ్రామస్థులు తమ పరికరాలను పనిచేయించుకుంటే నాకెట్టి అభ్యంతరమూ లేదు' అన్నాడు గాంధీజీ. నేటి కాలస్థితినిబట్టి విధిగా అధికారాన్ని, సంపదను ఒకచోటికి కేంద్రీకరించే శక్తి భారీయంత్రాల్లో ఉన్నదని ఆయన అభిప్రాయం. 'ఎవ్వరో కొద్దిమందిచేతుల్లో అధికారాన్ని ధనాన్ని కేంద్రీకరింపచేయడానికే ఈ యంత్రసామగ్రిని వినియోగించడం మహాపాపం. అక్రమం. ఈనాడు యంత్రాలు అందుకే ఉపయోగపడుతున్నాయి.' అన్నాడు గాంధీజీ. కొన్ని భారీపరిశ్రమలు, కీలకపరిశ్రమలు అవసరమనికూడా ఆయన అంగీకరించాడు. కాని వాటిని ప్రభుత్వమే నిర్వహించాలనీ, అవి ఏ విధంగానూ కుటీరపరిశ్రమలఅభివృద్ధి కాటంకం కలుగచేయకుండా ఉండాలనీ ఆయన అభిప్రాయం. తన అభిప్రాయాలను విశదీకరిస్తూ ఆయన ఇల్లాచెప్పేడు. "ఆర్థికసమానత్వమనే స్థిరమైన పునాదిమీద ఈ నిర్మాణం జరుగకపోతే మాత్రం ఇదంతా ఇసుకమేడలా కూలిపోతుంది."

కనుక, కుటీరపరిశ్రమలను చిన్నపరిశ్రమలను ప్రోత్సహించాలనేవారుకూడా భారీపరిశ్రమలఅవసరాన్ని అంగీకరిస్తున్నారు. కొంతవరకు అవి విధాయకమనికూడా అంగీకరిస్తారు. కాని సాధ్యమైనంతవరకు వాటి నొక హద్దులోఉంచాలంటారు. కాబట్టి ఈరెండువిధాలైన ఉత్పత్తినీ, వాటి ఆర్థికఫలితాలను సమన్వయంచేయడమెట్లనే ప్రశ్న. నేటి ప్రపంచస్థితిగతులనుబట్టి, ఏ దేశమైనా పారిశ్రామికంగా గొప్ప అభివృద్ధినిపొంది, తనసంపత్తిని, నిర్మాణశక్తులను పరిపూర్ణంగా పెం

పొందించుకుంటేగాని ఆర్థికంగాగాని రాజకీయంగాగాని స్వతంత్రంగా ఉండలేవు. అంతర్జాతీయ పరస్పరసహాకారపుహద్దుల్లో మన్నాలన్నా కూడా పరిశ్రమాభివృద్ధి అవసరం. అంతేకాకుండా దేశంలోదారిద్ర్యాన్ని నివారించి, ప్రజల జీవితప్రమాణాన్ని హెచ్చుచేయడానికికూడా ప్రతి రంగంలోనూ ఈకాలపుశాస్త్రవిజ్ఞానం చాలా అవసరం. పారిశ్రామికంగా వెనుకబడిన దేశం, ప్రపంచానికనేకవిధాలుగా కలతలు తెస్తుంది. పారిశ్రామికాభివృద్ధిచెందిన దేశాల్లో దానిజోలికెళ్ళాలనే ఆశను పురిగొల్పుతుంది. అలాంటిదేశంలో రాజకీయస్వాతంత్ర్యం నామమాత్రంగాఉన్నా, ఆర్థికంగా పరాధీనంలోపడిపోతుంది. ఈ పరాధీనతవల్ల చిన్నఎత్తున నిర్వహింపబడే ఆర్థికవిధానంకూడా తలక్రిందై పోతుంది. కనుక కేవలం కుటీరపరిశ్రమలమీద, చిన్నపరిశ్రమలమీదా ఆధారపడి దేశంయొక్క ఆర్థికసంపత్తిని నిర్మాణంచేయడం నిరర్థకం. దేశంలోని ప్రధానసమస్యల నది పరిష్కరించలేదు. దేశస్వాతంత్ర్యాన్నది సంరక్షించలేదు. ప్రపంచనిర్మాణంలో ఒక వలసరాజ్యంగాకాకుండా స్వతంత్రమైనప్రతిపత్తితో మనలేదు.

ఏదేశంలోనైనా భారీపరిశ్రమలమీద పెద్దయంత్రాలమీదఆధారపడిన ఆర్థికవిధానమూ, కుటీరపరిశ్రమలమీద ఆధారపడిన ఆర్థికపద్ధతి, రెండూావర్తింపగలవాఅన్నది ప్రశ్న. అట్టిస్థితి అసంభవమనుకుంటాను. భారీయంత్రాలదే పైచేయికాకమానదు. బలవంతంగా వాటి అభివృద్ధి ఆపుచేస్తేతప్ప, ఈ రెండురకాలఉత్పత్తివిధానాలనూ సమన్వయపరచడం ప్రశ్నకాదు. ఏదోఒకవిధానం ప్రధానంగాఉండి రెండవది దానికనుబంధంగా ఉండాలి. నూతనమైన శాస్త్రవిజ్ఞానంమీద ఆధారపడుండే భారీఉత్పత్తివిధానానికే ప్రాధాన్యతకలుగకమానదు. ఉత్పత్తికి పెద్దయంత్రమే అవసరమైనప్పుడు ఎన్నికష్టనిష్ఠురాలతోనైనా దానినంగీకరింపకతప్పదు. ఆ యంత్రంసహాయంవల్ల, ఉత్పత్తిలో వికేంద్రీకరణం సాధ్యమైతే అదీమంచిదే. ఏమైనా నవ్యవిజ్ఞానంతోకూడిన ఉత్పత్తిపద్ధతిననుసరించక తప్పదు ఏదో తాత్కాలికావసరాలకుతప్ప, ఎల్లప్పుడూ తాతలనాటి పాతఉత్పత్తిపద్ధతులను అవలంబించడానికి ప్రయత్నించడం అభివృద్ధిని నిరోధించడమే.

చిన్నపరిశ్రమలు లాభదాయకమా, భారీపరిశ్రమలు లాభదాయకమా అనేచర్చ నేటి స్థితిగతుల్లో చాలా అప్రస్తుతం. భారీ పరిశ్రమల వైపుకే ప్రపంచం మొగ్గిఉంది. హిందూదేశంలోకూడా భారీపరిశ్రమలకే నిర్ణయంజరిగింది. శీఘ్రంగా మన దేశంలో పరిశ్రమలు అభివృద్ధిచెందుతాయనడానికికూడా సంశయంలేదు. ఇప్పటికే ఆవిషయంలో చాలా అభివృద్ధి కనుబడుతోంది. ఏవో కొన్నిహద్దుపద్దులకు లోబడకుండా, ఏదో విధమైనపథకాన్ని అనుసరించకుండా పరిశ్రమీకరణంసాగడంవల్ల కలిగే ప్రమాదాలు బాగా గుర్తింపబడ్డాయి. ఈప్రమాదాలు భారీపరిశ్రమలను విధిగా అనుసరించిఉండేవా, లేక దానివల్లకలిగే ఆర్థిక, సామాజికస్థితి వల్ల ఉత్పన్నమైనవా అనేది వేరుప్రశ్న. ఆర్థికనిర్మాణమే కారణమైతే దానిసంస్కరించడానికి పూనుకోవాలి. అంతేకాని, శాస్త్రజ్ఞానాభివృద్ధివల్ల కలిగే అభివృద్ధిని నిరసించి ప్రయోజనంలేదు.

ఉత్పత్తిలో స్వల్పమైన హెచ్చుతగ్గులుచేయడం సమస్యకాదు. అనేకమైనసామాజికమార్పులనుకలిగించే నూతన ఉత్పత్తిపద్ధతికి మారిపోవడమేకర్తవ్యం. ఈ మార్పులవల్ల కలిగే ఆర్థిక రాజకీయపరిణామాలు చాలాముఖ్యం. అంతకన్నకూడా అందువల్లకలిగేమానసిక సామాజికపరిణామము లెక్కువ ప్రధానం. ముఖ్యంగా పాతఆలోచనలను,పాతపద్ధతులను ఎక్కువప్రమాణంగాగణించే మనదేశంలో, కొత్తఅనుభవాలు, కొత్తఅభిప్రాయాలకు ఆదర్శాలకు దారితీసే కొత్తవిధానాలూ చాలా అవసరం. తద్వారా జీవితంలో ప్రవేశించి స్తబ్ధతనుపోగొట్టి కొత్తఉత్సాహాన్ని శక్తిని పెంపొందించగలుగుతాము. మనమనస్సులకుకూడా నూతనమైనవికాసం కలుగుతుంది. కొత్తపరిస్థితులు కొత్త అనుభవాలను ప్రసాదిస్తాయి. ఎందుచేతనంటే కొత్తవిషయంగురించి మనస్సు కొంత మథనపడి నూతనస్థితిగతులకు అనుగుణ్యంగా సర్దుకుంటుంది.

చిన్నబిడ్డలకు చదువుచెప్పేటప్పుడు వారికేదో చేతిపనినికూడా నేర్పడం, కాయకష్టంచేయించడం చాలా అవసరమని ఇప్పుడు గుర్తించబడింది. అందువల్ల చేతులతోచేసేపని వల్ల శారీరక చురుకుదనంతోపాటు,బుద్ధికికూడా చురుకుదనంకలుగుతుంది. రెండు ఒకదానికొకటి అనుగుణ్యంగాపనిచేస్తాయి. అలాగే యంత్రంకూడా ప్రవర్ధమానులైన యువ

కుల మనస్సునుకూడా కదిలిస్తుంది. యంత్రసంబంధంవల్ల నూతనమైన ఆశలుత్పన్నమవుతాయి. మామూలుగా పరిశోధనాగారాల్లో చేస్తుండే చిన్నచిన్న ప్రయోగాలు, సూక్ష్మవస్తుదర్శిని (మైక్రాస్కోపు) లో చూస్తున్నప్పుడుగాని ప్రత్యక్షంగాకనుబడుతున్న ప్రకృతిదృశ్యంలోని ఆంతర్యాన్ని తెలుసుకున్నప్పుడుగాని యువకులహృదయం ఉప్పొంగుతుంది.ఎవ్వరో ఎప్పుడో చెప్పినమాటలను కళ్ళుమూసుకుని నమ్మడానికి బదులు కొత్తవిషయాలను తెలుసుకునేందుకు కుతూహలంకలుగుతుంది. ఆత్మవిశ్వాసమూ, పరస్పరసహకారభావమూ హెచ్చుతాయి. పూర్వవాసనలవల్ల కలిగిన నిస్పృహ పోతుంది. నిరంతరం మార్పులు చెందుతూ, ప్రగతిలోనున్న యాంత్రికవిజ్ఞానమే ప్రాతిపదికగాగల సంస్కృతి కిది దారికాగలదు. ఆలాంటినాగరికత ప్రత్యక్షంగా కనుబడేమార్పు. ఈ కాలపుపరిశ్రమీకరణవిధానాని కిదెంతో దగ్గర. అందువల్ల తప్పకుండా కొన్ని కొత్తసమస్యలుత్పన్నమవుతాయి. కొన్ని కొత్తకష్టాలొస్తాయి. కాని వాటిని నిర్జించడానికి మార్గాలనుకూడా అదే చూపిస్తుంది.

విద్యావిధానంలో సాహిత్యరంగమంటే నాకు అభిమానమెక్కువ. పురాణకావ్యాలంటే నాకు ప్రీతి. కాని బాలురకు, బాలికలకు కూడా విధిగా శాస్త్రజ్ఞానం కొంతవరకైనా బోధించాలని నా విశ్వాసం. పదార్థవిజ్ఞానశాస్త్రం, రసాయనశాస్త్రం, జీవశాస్త్రం, జీవితంలో వాటి వాటి ప్రయోజనాలు కొంతవరకైనా బోధించాలి. అప్పుడే వాళ్ళు శాస్త్రజ్ఞానం ప్రధానంగాగల ఈ ప్రపంచాన్ని అర్థంచేసుకుని అందులో ఇముడగలుగుతారు. కొంతవరకైనా భౌతికవిజ్ఞానదృష్టి నలవాటుచేసుకుంటారు. నవయుగంలో, విజ్ఞానశాస్త్రంలోనూ వస్తువుత్పత్తివిధానంలోనూ శాస్త్రజ్ఞులుచూపుతున్న ప్రజ్ఞ అత్యాశ్చర్యకరమే. ముందు ముందు ఇంకా వృద్ధిఅవుతుంది. శాస్త్రపరిశోధనలకోసం నిర్మింపబడుతున్న కొత్తకొత్త ప్రయోగసాధనాలు ఎంతో సున్నితంగా ఉన్నా అత్యద్భుతశక్తిగల యంత్రాలూ, నిరంతరం శాస్త్రపరిశోధనలవలన కనిపెట్టబడిన కొత్తవిషయాలు, కర్మాగారాల్లో జరుగుతున్న కృషీ, అందులో కృషిచేస్తున్న అసంఖ్యాకులైన శాస్త్రజ్ఞులనూ తలుచుకుంటే శరీరం ఉప్పొంగుతుంది. అన్నిటికన్నాకూడా, ఈ విజ్ఞాన

మంతా మానవునిబుద్ధిలోనుంచే ఉత్పన్నమైనదని తెలిసినపుడు కలిగే ఆనందాశ్చర్యాలకు అంతుండదు.

## ౮ పారిశ్రామికాభివృద్ధికి ప్రభుత్వఅంతరాయం.

## యుద్ధకాలపుఉత్పత్తి - మామూలుఉత్పత్తి

హిందూదేశంలో భారీపరిశ్రమఅని చెప్పతగినది జమ్‌షెడ్‌పురం లోని తాతా ఇనుము, ఉక్కుఫాక్టరీ. అలాంటిది మరొకటి మన దేశంలో లేదు. తతిమ్మా ఇంజనీరింగుకార్ఖానాలు చిల్లరమల్లరపనిచేసే వాటి క్రిందే లెఖ్ఖ. తాతావారి పరిశ్రమాభివృద్ధికూడా ప్రభుత్వాజావ్యంవల్ల చాలానెమ్మదిగానే సాగింది. ప్రథమ యూరపుసంగ్రామకాలంలో, దేశంలో రైల్వేఇంజనులకు, ప్రయాణీకులపెట్టెలకు, గూడ్సుడబ్బాలకు చాలా కొరత ఏర్పడింది. తాతావారు ఇంజనులు తయారుచేయడానికి సంసిద్ధులైనారు. అందుకొరకు అవసరమైన యంత్రములనుకూడా దిగుమతిచేసుకున్నారనుకుంటాను. ఇంతలో యుద్ధంముగియడంతోనే అప్పటి ఇండియా ప్రభుత్వంవారున్నూ, రైల్వేలమీదపెత్తనంచేసే రైల్వేబోర్డు వారున్నూ, బ్రిటిష్‌పారిశ్రామికులనే అభిమానించుకుని వారుతయారు చేసిన ఇంజనులనేకొనాలని నిశ్చయించారు. రైల్వేలు ప్రభుత్వాధీనంలోనూ, బ్రిటిష్‌వారిపెత్తనంలోఉండిన కంపెనీలస్వాధీనంలోనూ మాత్రమే ఉండడంచేత ఇంజనులకు ఇతరత్రా విడుదల లేదు. అందుచేత తాతావారు ఇంజనులతయారీపనిని విరమించుకోవలసివచ్చింది.

భారతదేశం పారిశ్రామికంగానూ, ఇతరత్రాకూడా వృద్ధిపొందాలంటే ముఖ్యంగా మూడువిషయాలు అవుసరం. పెద్దపెద్ద ఇంజనీరింగు యంత్రాలనుతయారుచేసేపరిశ్రమ, వైజ్ఞానికశాస్త్రపరిశోధనాలయాలు, విద్యుత్‌శక్తి బాగా వృద్ధికావడం. ఏ జాతీయప్రణాళికారచనకైనా ఈ మూడే పునాదులు. జాతీయప్రణాళికానిర్వాహణసంఘం ఆవిషయాన్నే బలీయంగా ఉద్ఘాటించింది. మనకీ మూడూ లోపమే. అందుచేతనే పారిశ్రామికాభివృద్ధిలో అడుగడుక్కీ ఆటంకాలు కలుగుతున్నాయి. అభివృద్ధినే లక్ష్యంగాపెట్టుకున్న ప్రభుత్వవిధానంలో అయితే ఇలాంటి ఆటంకాలనుదాటవచ్చు. కాని ప్రభుత్వవిధానం దానికివ్యతిరేకం. భారీ పరిశ్రమలు అభివృద్ధికాకూడదనే వారిమతం. రెండవయుద్ధంప్రారంభ

మైనప్పుడుకూడా భారీపరిశ్రమలకవసరమైన యంత్రసామగ్రిని దిగుమతి చేసుకోవడానికి ప్రభుత్వం ఇష్టపడలేదు. తరువాత దిగుమతికి ఓడలసౌకర్యాలులేవన్నారు. భారతదేశంలో పెట్టుబడికి లోపంలేదు. పనిచేయగలిగిననిపుణులకు కొరతలేదు. కావలసినదల్లా యంత్రాలు. వాటికోసం భారతపారిశ్రామికవేత్తలు ఎన్నోవిధాలుగా ప్రాధేయపడ్డారు. అప్పుడే గనుక యంత్రసామగ్రిదిగుమతి కనుజ్ఞ నిచ్చిఉంటే మనదేశపుఆర్థికస్థితి చాలాబాగుండేది. అంతేకాకుండా ప్రాచ్యదేశాల్లో యుద్ధంయొక్కతీరు వేరుగాఉండేది. దూరదేశాలనుంచి ఎక్కువ వ్యయప్రయాసలకులోనై విమానాల్లో దిగుమతిచేయవలసినవస్తువుల నెన్నిటినో ఇక్కడనే తయారుచేయగలిగేవాళ్ళం. చైనాదేశానికి, ప్రాచ్యదేశాలకు, భారతదేశ మొక మందుగుండుసామగ్రిని తయారుచేసే కర్మాగారంలాగుండేది. పారిశ్రామికంగా భారతదేశం కెనడా, ఆస్ట్రేలియాలతో తులతూగుతూఉండేది. కాని యుద్ధసామగ్రియొక్క అవసరంఎంతహెచ్చుగాఉన్నప్పటికీ, ఉత్తరోత్తరా బ్రిటిష్‌పరిశ్రమలతో పోటీచేసే ఏపరిశ్రమనుగాని ఈదేశంలో అభివృద్ధికితేకూడదని ఇండియా పరిపాలకులు నిశ్చయించారు. ఇందులో రహస్యమేమీలేదు. బ్రిటిష్ పత్రికల్లో తరుచు ఈ అభిప్రాయం చర్చించబడింది. అందుపైన భారతదేశంయొక్కఅసమ్మతికూడా తెలియచేయబడింది.

తాతా ఉక్కుపరిశ్రమస్థాపకుడైన జమ్‌షెడ్జీ తాతా చాలా దూరదృష్టిగలవాడవడంచేత బెంగుళూరులో విజ్ఞానశాస్త్రపరిశోధనాలయాన్నిస్థాపించాడు. ఇది ఇండియాలోకల్లా చాలా అపురూపమైనసంస్థ. మిలిగినవి చాలా సంకుచితలక్ష్యాలుగల ప్రభుత్వసంస్థలు. అమెరికాలోనూ రష్యాలోనూ విజ్ఞానశాస్త్రపరిశోధనలను అపారంగా సాగించే సంస్థలు వేలాదిగా ఉన్నాయి. ఆవిషయంలో హిందూదేశం చాలా వెనుకపడివుంది. బెంగుళూరు ఇన్‌స్టిట్యూట్‌లోనూ సక్రుతుగా విశ్వవిద్యాలయాల్లోనూ జరిగినపనే పని. ద్వితీయసంగ్రామం ప్రారంభమైనాక కొంతకాలానికి పరిశోధనా కార్యక్రమాన్ని ప్రభుత్వం ప్రోత్సహించింది. కొన్ని సత్ఫలితాలు అందువల్ల కలిగినాయి. కాని చాలా పరిమితమనే చెప్పాలి.

భారీఎత్తున ఓడల నిర్మాణపరిశ్రమకు, రైలు ఇంజనులతయా రీకి ప్రభుత్వం ఏవిధమైన ప్రోత్సాహాన్ని కలిగించలేదుసరికదా, అనేక ఆటంకాలు కలిగించింది. మోటారుకారులపరిశ్రమనుకూడా తలెత్తనివ్వ లేదు. ద్వితీయసంగ్రామానికి కొద్ది సంవత్సరాలకు పూర్వం హిందూ దేశంలో మోటారుకారులను తయారుచేయాలని, అమెరికా దేశం లోని ఒక విఖ్యాత మోటారుకంపెనీవారిసహకారంతో గొప్ప ప్రయత్నంచేయబడింది. కారులకూర్పుచేసే యంత్రాలు కొన్ని ఇప్పుడు పనిచేస్తూనే ఉన్నాయి. మోటారుకారుకు కావలసిన అన్నిభాగాలను భారతదేశంలోనే భారతీయపెట్టుబడితో, భారతీయపనివాండ్రతోనే తయారుచేయాలని సంకల్పించబడింది. కొంతకాలంపాటు అమెరికా మోటారుకంపెనీలవారి పేటెంటులనే ఉపయోగించుకుంటూ, వారి ఇంజనీర్ల అజ్మాయిషీక్రింద మొదట్లో కొంతకాలం పనిచేయడానికి ఒప్పందంకుదిరింది. అప్పట్లో బొంబాయిరాష్ట్రాన్ని పరిపాలిస్తూఉండిన కాంగ్రెస్ మంత్రివర్గం, ఇందు కనేకవిధాలుగా సహాయపడడానికి హామీ ఇచ్చింది. ప్లానింగుకమిటీ ఈవిషయమై ఎంతో ఉత్సాహపడింది. వాస్త వానికి అన్నిఏర్పాట్లు పూర్తిఅయిపోయినాయి. యంత్రసామగ్రిని దిగు మతిచేయడమే తరువాయి. ఏమైతేనేమి? లండన్‌లోని భారతదేశ కార్యదర్శి అందుల కంగీకరింపక యంత్రముల దిగుమతిని నిరాకరిం చాడు. 'ఈ పరిశ్రమ నిప్పుడు ఇక్కడ ప్రారంభిస్తే, యుద్ధానికి అవస రంగా కావలసినకార్మికులు, యంత్రాలు లభ్యంకావు' అని నిరాకరణకు ఆయన చెప్పినకారణం. ఈగాథ జరిగినది యుద్ధంప్రారంభదశలో. మా మూలుకూలీలు, యంత్రాల్లో పనిచేయడానికి బుద్ధికౌశల్యంచూపగల కార్మికులూ కావలసినంతమంది దేశంలో అసంఖ్యాకంగా ఉన్నారనీ, వాస్తవానికి వారిలో చాలామంది పనిపాటులు లేకుండా ఉన్నారనీ కూడా ఆయనకు తెలియచేయబడింది. యుద్ధావసరం అనేది కేవలం సాకు. వాస్తవానికి మోటారుబండ్లపరిశ్రమకూడా యుద్ధానికి ముఖ్యావ సరమే. కాని లండన్‌లో కూర్చుని తుదినిర్ణయాలుచేసే ఇండియా కార్య దర్శికి ఈప్రశ్నలతో నిమిత్తంలేదు. అమెరికాలోనే మరొక బలవత్తర మైన పోటీమోటారుకంపెనీ · హిందూదేశంలో భారతీయులయాజ

మాన్యంలో ఇలాంటి పరిశ్రమను స్థాపించడానికి అంగీకరించలేదని తెలుస్తుంది.

హిందూదేశంలో యుద్ధకాలంలో రవాణా చాలాపెద్దసమస్యగా పరిణమించింది. మోటారుకారులు, పెట్రోలు, రైల్వేఇంజనులు, వాగనులు, రాతిసిబొగ్గు అన్నీ కొరతలే. యుద్ధానికిముందు రవాణాఅభివృద్ధికి భారతదేశంలో చేయబడినప్రయత్నాలను ప్రభుత్వం అంగీకరించి ఉంటే, ఈసమస్యలన్నీ తేలికగా పరిష్కరింపబడుండేవి. ఈకష్టాలు వచ్చేవేకావు. రైలుఇంజనులు, మోటారుబండ్లు, రైలుడబ్బాలు, ఆయుధాలమర్చినమోటారుబండ్లు వగైరాలన్నీ ఈదేశంలోనే తయారైఉండేవి. పెట్రోలుకొరతను పవర్ ఆల్కహాల్ తీర్చిఉండేది. రాతిసిబొగ్గు విషయంలో నిజంగా ఈదేశంలో కొరత లేనేలేదు. కావలసినంత భూమిలో ఉందికాని పైకిరాలేదు. రాతిసిబొగ్గుఅవసరం హెచ్చినా యుద్ధకాలంలో ఉత్పత్తిపడిపోయింది. బొగ్గుగనులలో కూలి చాలాతక్కువ. పనివారలస్థితి చాలా అధ్వాన్నంగా ఉండడంచేత ఎవ్వరూ ఆపనికెక్కలేదు. చివరకు అంతతక్కువకూలికి పనిచేయడానికి ఆడవాళ్ళుదొరకడంచేత, ఆడవాళ్ళు గనుల్లోపనిచేయకూడదనే నిషేధంకూడా తొలగించబడింది. బొగ్గుపరిశ్రమలో పనిచేయడానికివీలుగా స్థితిగతులను ఆకర్షణీయంగా చేయడాని కేమీ ప్రయత్నంజరుగలేదు. మొత్తంమీద బొగ్గుకొరతవల్ల పరిశ్రమలఅభివృద్ధికి ఆటంకంకలిగినది. కొన్నినడుస్తున్నఫ్యాక్టరీలనే ఆపుచేయాలసొచ్చింది.

దీనికితోడు యుద్ధంకొరకు, వందలకొద్దీ రైల్వేఇంజనులను, డబ్బాలను మధ్యప్రాచ్యదేశాలకు ఓడలలో పంపివేయవలసొచ్చింది. కొన్నిచోట్లనుండి రైలుపట్టాలనుకూడా పీకేసి వేరొకచోటికి పంపవలసొచ్చింది. అందువల్ల ముందుముందు ఏమైనా చిక్కులొస్తాయేమోననే సంకోచం కించిత్తైనాలేకుండా ఇలాంటిపనిజరిగిందంటే చాలా ఆశ్చర్యంగా ఉంటుంది. ఇలాంటిసందర్భంలో ఒకపథకంగాని, దూరాలోచనగాని కన్పడలేదు. ఏదో ఒక తాత్కాలికమైనఇబ్బందినిదాటడాని కొకఅఘాయిత్యంచెయ్యడం, అందువల్ల మరీ ఎక్కువచిక్కులుతటస్థించి ఇంకా ప్రమాదమైనసమస్య లుత్పన్నంకావడం జరిగింది.

1939 సంవత్సరాంతంలోనూ, 1940 సంవత్సరం ఆరంభం లోనూ ఇండియాలో విమానాలను తయారుచేసేపరిశ్రమను నెలకొల్పే ప్రయత్నం జరిగింది. అమెరికాలో విమానాలనుతయారుచేసే ఒకకంపె నీతో అన్నిఏర్పాట్లూ జరిగినాయి. ఇండియాగవర్న మెంటువారికీ, మిలిటరీఅధికారులకు వారి అనుమతికోసం టెలిగ్రాములమీద టెలిగ్రా ములు పంపడమైనది. జవాబిచ్చేదిక్కూ-దివాణం లేదు. అడగ్గాఅడగ్గా చాలాకాలానికి, ఆ స్కీమును అంగీకరించము అని జవాబొచ్చింది. ఇంగ్లండులోనూ, అమెరికాలోనూ కొనుక్కోవడానికి విమానాలు దొరుకుతుంటే మీ రెందుకు తయారుచేసుకోవాలి?

యుద్ధానికిముందు చాలారకాలైన మందులు, ఇంజక్షనులు, వగైరా జర్మనీనుండి మన దేశానికి దిగుమతిఅయేవి. యుద్ధంవల్ల అవి ఆగిపోయాయి. ముఖ్యమైన మందులుకొన్నిటిని ఇండియాలోతయారు చేయవచ్చునని ఒకసూచన ప్రభుత్వానికిచేయబడింది. కొన్నిమందులు ప్రభుత్వపరిశోధనాలయాల్లోనేతయారుచేయవచ్చునని సూచింపబడింది. ఇండియాగవర్న మెంటువా రందుకు అంగీకరించలేదు. కావలసినమందు లన్నీ ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్ కంపెనీద్వారా కొనుక్కోమని ఉత్తరువుచేశారు. ఆ మందులను చాలాతక్కువధరలకు ప్రభుత్వమే తయారుచేసి, సైనికావసరాలకూ ప్రజావసరాలకూకూడా ఉపయోగించ వచ్చునని సలహా చెపితే, ఉన్నతాధికారులకు చాలా ఉలుకొచ్చింది. గవర్నమెంటు తేలిక వ్యాపారసంస్థ కాదనీ, ఇలాంటి ఆలోచనలను చేయరాదనీ ఆగ్రహపడ్డారు.

ప్రభుత్వం వ్యాపారసంస్థకాదు. ఇంపీరియల్ కెమికల్ఇండస్ట్రీస్‌కు ప్రభుత్వం అనేక ప్రత్యేకసౌకర్యాలను కల్పించింది. ఆలాంటిసౌకర్యా లేమీ లేకపోయినా అది చాలాపెద్దకంపెనీ. బహుశా ఏతాతాకంపెనీ వారోతప్ప దానితో ఏభారతీయవ్యాపారసంస్థాపోటీచేయలేదు. వాళ్ళకు కల్గించిన ప్రత్యేకసౌకర్యాలు అలాఉండగా ఇండియాలోనూ, ఇంగ్లం డులోనూకూడా వారి కనంతమైన పలుకుబడి ఉన్నది. లార్డ్‌లిన్‌లిత్‌గో ఇండియాలో రాజప్రతినిధి పనినుండి విరమించినకొద్దినెలల్లోనే ఇంపీరి యల్ కెమికల్ ఇండస్ట్రీసులో డైరెక్టరుగా కొత్త అవతారాన్నెత్తేడు.

1942 సం॥ డిశెంబరునెలలో లిన్‌లిత్‌గో ప్రభువు రాజప్రతిని ధిగా ఈరీతిగా ప్రకటనచేశాడు.

"పరికరాలసప్లయివిషయంలో మనం చాలావిషయాలు సాధించాం. భారతదేశం చాలావిలువైనట్టిన్నీ, అవసరమైనట్టిన్నీ వస్తువులను సప్లయిచేయగలిగింది. యుద్ధంప్రారంభమైన ఆరునెలల్లోనూ సుమారు 29 కోట్లరూపాయల ఖరీదుచేసేవస్తువులను సప్లయిచేశాం. ఇచ్చాం. 1942 సం॥ రం ఏప్రిల్ మొదలు అక్టోబరువరకు 137 కోట్లు సప్లయి చేశాం. 1942 సం॥రం అక్టోబరు ఆఖరుకు మొత్తం సప్లయి 428 కోట్లు. ఇవికాక ఈదేశంలోని మందుగుండుసామానుకార్ఖానాలలో తయారైనవస్తువులఖరీదు కొన్నికోట్లుంటుంది." ఈమాట నిజమే. తర్వాత రోజుల్లో యుద్ధానికి తోడ్పడడానికి భారతదేశం ఇతోధికంగా పని చేసింది. అందువల్ల సాధారణంగా దేశంలో పారిశ్రామికాభివృద్ధి బాగాహెచ్చిఉండాలని అనుకోవడం సహజం. కాని చెప్పుకోదగిన మార్పేమీ రాకపోవడమే ఆశ్చర్యం. భారతదేశపరిశ్రమాభివృద్ధి 1938-1939 సం॥రంలో 111.1 యూనిట్లుమాత్రమే(1935 సం॥లో 100 యూనిట్లు ప్రమాణంలెక్కగా తీసుకుంటే) 1939 - 40 లో 114.0, 1940 - 41 లో 112.1 మొదలు 127.0; 1942 మార్చిలో 118.9, ఏప్రిల్‌లో 109.2, 1942 జూలైలో **116.2.** ఈఅంకెలు పూర్తియైన భోగట్టా కాదు. మందుగుండుసామాన్లు, రసాయనికవస్తువులు ఇందులో చేరలేదు. అయినా ఈ అంకెలు చాలాముఖ్యమైనవి.

1942 సం॥ జూలైనెల పారిశ్రామికఉత్పత్తిచూస్తే మందుగుండు సామానులుమినహా ఇతరత్రా, యుద్ధానికిపూర్వాంకంటె బహుకొంచెం గానే పెరిగింది. 1941 సం॥ డిశెంబరులోమాత్రం కొంచెం చురుకై 127.0 వరకూ పెరిగింది. కాని వెంటనే మందగించింది. కాని గవర్నమెంటు పరిశ్రమదారులకిచ్చిన కాంట్రాక్టులవిలువ మాత్రం క్రమంగా హెచ్చుతూనేఉంది. లిన్‌లిత్‌గో లెక్కప్రకారం 1939 అక్టోబరు మొదలు 40 వ సం॥ రం మార్చివరకు 29 కోట్ల రూపాయలు. 1942 సం॥ రం ఏప్రిల్ మొదలు అక్టోబరుకు 137 కోట్లు.

కోటానుకోట్ల విలువగల ఈ యుద్ధపరికరాలఉత్పత్తివలన మొత్తంమీద దేశంలో పారిశ్రామికాభివృద్ధి కలిగిందనడానికి వీలు

లేదు. మామూలుగా జీవితావసరములను ఉత్పత్తిచేసే పరిశ్రమలన్నీ యుద్ధపరికరాలను ఉత్పత్తిచేయడంలో నిమగ్నమైనాయి. తాత్కాలికంగా యుద్ధపరికరాలకొరత తీరినా, ప్రజల నిత్యజీవితాని కవసరమైన వస్తూత్పత్తిమాత్రం బాగా పడిపోయింది. అందువల్ల తప్పనిసరిగా అనేక చిక్కులు సంభవించాయి. లండన్‌లో మన స్టర్లింగునిల్వలు పెరిగినాయి. హిందూదేశంలో కొద్దిమందిదగ్గరమాత్రం ధనం పేరుకుంది. దేశమొత్తంమీద జీవితావసరవస్తువులు దొరుకక ప్రజలు అష్టకష్టాలు పడ్డారు. కరెన్సీనోట్ల చలామణి దినదినప్రవర్ధమానమైనది. ధరలు విపరీతంగా పెరిగిపోయినాయి. 1942 సం॥ సగమయేసరికే ఆహారకొరత ప్రబలమైన సమస్య అయింది. 1943 శరదృతువు ప్రారంభమయేసరికి, బెంగాలులో ముఖ్యంగానూ, తదితరచోట్లనూ లక్షలకొద్దీ ప్రజలను కాటకం తన పొట్టనుపెట్టుకుంది. యుద్ధంభారమంతా దానిని మోయజాలని భారతప్రజలమీద పడింది. అందువల్ల చివరకు తిండిలేక నెమ్మదిగా చాలమంది నికృష్టమైన చావుచచ్చారు.

నేనిచ్చిన అంకెలు 1942 సంవత్సరంతో ఆఖరు. తరువాతిఅంకెలు నా దగ్గర లేవు. అప్పటికీ ఇప్పటికీ భారతపారిశ్రామికవిధానం మార్పు చెందవచ్చును. పారిశ్రామికులఉత్పత్తి కొంచెం హెచ్చుగానే ఉండవచ్చును. కాని మూలంలోమాత్రం విశేషమైన మార్పులగుపడవు. పాతపద్ధతులు, పాత ఇబ్బందులు అలాగే ఉన్నాయి. వాటినివారణకు తాత్కాలికమైన ఉపశాంతులేజరుగుతున్నాయి. సమగ్రమైనఅభివృద్ధిని సాధించడానికి ఒకనిర్దిష్టమైనపథకమంటూ ఏర్పాటుకాలేదు. వర్తమానంలోనూ భవిష్యత్తులోనూకూడా బ్రిటిష్‌పరిశ్రమలకేవిధమైన దెబ్బ తగులకుండాచూడాలనే ఆత్రత, పక్షపాతమూ యథాప్రకారంగానే ఉన్నాయి. ఈలోగా ప్రజలుమాత్రం తిండిలేమివల్లనూ అంటువ్యాధులవల్లనూ మరణిస్తున్నారు.

ఇప్పుడు నడుస్తున్న కొన్నిపరిశ్రమలు, ముఖ్యంగా బట్టలమిల్లులు, ఇనుము ఉక్కుమిల్లులు, జనపనారమిల్లులు బాగా అభివృద్ధిచెంది ఐశ్వర్యవంతమైనమాట నిజం. కోటీశ్వరులు, పారిశ్రామికప్రముఖులు, మిలటరీ కంట్రాక్టరులు, అక్రమనిల్వలుచేసే వ్యాపారస్తులు అధికలాభాపేక్షాపరులు వగైరాలు అధికమైనారు. పన్నులనెంతపెంచినా, ఉన్నతశ్రేణికి

చెందిన కొద్దిమందిచేతుల్లో ధనం బాగాచేరుకుంది. కార్మికులకు ఏవిధమైనలాభమూ కలుగలేదు. యుద్ధకాలంలో దేశంలోని కార్మికులస్థితి బాగా దిగజారిపోయిందని కార్మికనాయకుడైన శ్రీ యన్. యమ్. జోషిగారు కేంద్రశాసనసభలో స్పష్టంగా చెప్పేరు. పంజాబ్‌లోనూ, సింధుదేశంలోనూ భూస్వాములు మధ్యతరగతిరైతులు బాగా బాగుపడ్డారు. కాని యుద్ధంవల్ల సన్నకారు రైతులందరూ చాలా కష్టాలుపడ్డారు. ధరలధికమవడంవల్లనూ, రూపాయివిలువ పడిపోవడంవల్లనూ, వినియోగదారులు చాలా బాధలుపడ్డారు.

1942 సంవత్సరం మధ్యకాలంలో అమెరికానుంచి గ్రేడీకమీషన్ అనేపేరుతో ఒక సాంకేతికనిపుణులసంఘం భారతదేశానికొచ్చింది. దేశంలోఉన్న పరిశ్రమలస్థితిగతులన్నిటిని సమీక్షించి,వాటి అభివృద్ధికవసరమైనసూచనలుచేయడంవాళ్ళఉద్దేశ్యం. వాళ్ళు యుద్ధసామగ్రి ఉత్పత్తి విషయంలోనే ఎక్కువఆసక్తులైఉండడం సహజమే. వాళ్ళనివేదికమాత్రం ఇంతవరకు ప్రచురణకాలేదు. బహుశా దానిప్రచురణకు భారతప్రభుత్వమంగీకరించలేదనుకోవాలి. వాళ్ళసలహాలుమాత్రం కొన్ని ప్రచురించబడ్డాయి. పవర్ ఆల్కహాల్ పరిశ్రమను, ఇనుము, ఉక్కుపరిశ్రమను, విద్యుత్ శక్తిని ఇతోధికంగా వృద్ధిచేయాలని వారు సలహాఇచ్చారు. అల్యూమినియంపరిశ్రమను, గంధకశుద్ధినికూడా వృద్ధిచేయమన్నారు. కొన్నిపరిశ్రమలను కొత్తపద్ధతులకనుగుణ్యంగా మార్పుచేయాలన్నారు. పారిశ్రామికఉత్పత్తిని తగినవిధంగా అదుపులోవుంచడానికి అమెరికాలో మాదిరిగా గవర్నమెంటుతో నిమిత్తంలేని ఒక ఉన్నతాధికారసంస్థను నెలకొల్పాలన్నారు. తాత్సారంగా, ఆషామాషీగా ఇండియాగవర్నమెంటువారు సాగిస్తున్న పారిశ్రామికవిధానాలు వారికంత నచ్చినట్లు కనుబడదు. బ్రహ్మాండమైన యుద్ధంకూడా ఇండియాగవర్నమెంటువారి తాత్సారాన్ని కదలింపలేకపోయింది. కాని సంపూర్ణంగా భారతీయయాజమాన్యంక్రింద నిర్వహింపబడుతున్న టాటా ఇనుముపరిశ్రమమాత్రం వారి నెక్కువగా ఆకర్షించింది. వారు ఆ పరిశ్రమనిర్వహణాన్ని బాగా మెచ్చుకున్నారు. గ్రేడీకమిటీవారి ప్రథమనివేదికలో భారతీయకార్మికులప్రాశస్త్యము, పనివాడితనము కమిటీవారికి నచ్చినట్టువ్రాశారు. భారతీయకార్మికునిచేతిలో మంచి పనివాడితనమున్నది. పనిచేయడానికి

సంతృప్తికరమైన స్థితిగతులనుకల్పించి, వృత్తికి స్థిరత్వమేర్పరిస్తే కష్టపడి పనిచేస్తాడనడానికేమీ సందేహంలేదు.*

గతించిన రెండుమూడేండ్లలో ఇండియాలో రసాయనసామగ్రి నుత్పత్తిచేసేపరిశ్రమ వృద్ధియైంది. ఓడలనిర్మాణం కొంతవరకు సాగుతోంది. విమానములనిర్మాణం శైశవావస్థలో ఉన్నది. యుద్ధానికి సంబంధించినజనపనార, బట్టలు మొదలైన మిల్లులు, ఇచ్చుకోవలసిన పెద్దపన్నులన్నీ ఇచ్చుకున్నా, చాలా లాభాలు సంపాదించాయి. వారిదగ్గరే బాగా మూలధనం చేరుకుంది. క్రొత్తపరిశ్రమలను స్థాపించడంకోరకు కంపెనీలను ఏర్పాటుచేయడానికి భారతప్రభుత్వం నిరాకరించింది. ఈ మధ్యనే ఆ నిషేధాన్ని కొంత సడలించారు. కాని యుద్ధం పూర్తి అయేవరకు చెప్పుకోదగపనేమీ జరుగదు. కొద్దిమాత్రంగా ఆ నిషేధాన్ని సడలించేటప్పటికే కోటీశ్వరులైన పారిశ్రామికవేత్తలు చొరవగా ముందుకొచ్చేరు. బ్రహ్మాండమైన పారిశ్రామికసంస్థలు రూపొందుతున్నాయి. ఇంతవరకు ప్రభుత్వం అనేక అడ్డాలుపెట్టిన కారణంచేత మందకొడిగానున్న భారతదేశంలో భారీఎత్తున పరిశ్రమీకరణం జరుగుతోంది.

* బొంబాయినుంచి వెలువడే 'కామర్సు' అనే పత్రిక 28-11-42 తేదీని గ్రేడీ కమిటీరిపోర్టును బయటికిరాకుండాచేసినపనినిగురించి ఇలావ్రాసింది. "ఈదేశంలో పరిశ్రమలు ఇంక వృద్ధికాకూడదని ప్రయత్నించేసే బలవత్తరమైనశక్తులు కొన్ని ఉన్నాయి. యుద్ధానంతరం ప్రాగ్దేశాలు పశ్చిమదేశాలపరిశ్రమలతో పోటీకిరాకుండా చూడడమే వారి సంకల్పం"

# చివరిదశ (3)

## ద్వితీయ ప్రపంచయుద్ధం

### కాంగ్రెస్ విదేశాంగనీతి

ఇండియాలోని అన్నిరాజకీయపక్షాలవలెనే జాతీయకాంగ్రెస్ కూడా చాలాకాలంగా పూర్తిగా దేశీయరాజకీయాలలోనే నిమగ్నమై వున్నదేకాని, విదేశీపరిణామాలపై శ్రద్ధచూపలేదు. 1920 – 30 ల మధ్య అది విదేశీవ్యవహారములయం దాసక్తి చూపనారంభించింది. చిన్నముఠాలైన సోషలిస్టు, కమ్యూనిస్టుపక్షాలుతప్ప, నిర్మాణాత్మకమైన మరేసంస్థ యిలాచెయ్యలేదు. ముస్లింసంస్థలు పాలస్తీనాసమస్యపట్ల మాత్రం ఆసక్తికనబరుస్తూ, అప్పుడప్పుడు అచటి ముస్లింఅరబ్బులపట్ల సానుభూతితీర్మానాలుచేశాయి. అవి టర్కీ, ఈజిప్ట్, ఇరాన్‌లలోని తీవ్రజాతీయవాదాలను పరిశీలిస్తూనేవున్నాయి గాని, ఇస్లాంసాంప్రదాయాలంటే తమకుగలవిశ్వాసాలకు భిన్నంగా, ఆ దేశాలు మతనిమిత్తం లేనిసంస్కరణలను పెంపొందించుకుంటున్నందువల్ల వీటిని భయంపట్టుకోకపోలేదు. కాంగ్రెస్ క్రమంగా ఒక విదేశాంగనీతిని రూపొందించుకున్నది. ఎక్కడైనాసరే రాజకీయ, ఆర్థికసామ్రాజ్యవాదం తొలగించబడాలని, స్వతంత్రరాజ్యాలన్నీ పరస్పరం సహకరించుకోవాలన్నేప్రాతిపదికలపై ఈ నీతి ఆధారపడింది. ఇది ఇండియాకు స్వాతంత్ర్యంకావాలనే కోరికకు సరిపోయింది. ఏనాడో 1920 లోనే ఇతరజాతులతో సహకరించాలనీ, ప్రత్యేకంగా యిరుగుపొరుగుదేశాలతో స్నేహసంబంధాలు నెలకొల్పుకోవాలనీ కాంగ్రెస్‌తీర్మానించింది. పెద్దయెత్తున మరొక ప్రపంచయుద్ధం రావచ్చుననికూడా తరువాత ఆలోచించబడింది. 1927 లో అనగా రెండవప్రపంచయుద్ధం మరోపుష్కరానికి ప్రారంభమవుతుందనగానే – మొట్టమొదటగా కాంగ్రెస్ ఆ యుద్ధంపట్ల తన వైఖరిని ప్రకటించింది.

ఇది జరిగినది హిట్లర్ అధికారానికిరావడానికీ, జపాన్ మంచూరియాలో దురాక్రమణకుదిగడానికీ అయిదారేండ్లుముందుగానే. అప్పటికి ఇటలీలో ముస్సోలినీ బలంచేకూర్చుకుంటున్నాడు కాని, ప్రపంచానికే ప్రమాదంకాగలవాడుగా కనుపించలేదు. ఫాసిస్టుఇటలీ ఇంగ్లండుతో సఖ్యంగావున్నది. బ్రిటిష్‌రాజకీయవేత్తలు 'డ్యూస్'ను మెచ్చుకున్నారు. యూరపులో అనేకమంది చిన్నచిన్ననియంతలు తలెత్తారు. వారందరు బ్రిటన్‌తో స్నేహభావంతోనే వుంటున్నారు. బ్రిటన్, రష్యాల మధ్య పూర్తిగా అఘాతంయేర్పడింది. ఆర్కోస్‌దాడి, రాయబారులను ఉపసంహరించుకోవడం జరిగింది. అఖిలజాతులసమాఖ్య (లీగ్‌ఆఫ్ నేషన్స్), అంతర్జాతీయకార్మికసంస్థలలో బ్రిటిష్, ఫ్రెంచిప్రభుత్వాలు మరీ మితవాదవిధానాల నవలంబిస్తున్నాయి. ఆయుధవిసర్జనపై జరుగుతున్న తెంపులేనిచర్చలలో అమెరికాతోసహా లీగులోని అన్ని దేశాలూ విమానాలనుంచి బాంబులువేయడాన్ని పూర్తిగా నిషేధించడానికి అనుకూలంగావుంటే, ఇంగ్లండుమాత్రం కొన్ని ప్రత్యేకసదుపాయాలు చేసుకున్నది. బ్రిటిష్‌ప్రభుత్వం అనేకసంవత్సరాలుగా ఇరాక్, ఇండియాలోనిసరిహద్దురాష్ట్రాలలో గ్రామాలు, పట్టణాలపై విమానాలనుంచి బాంబులువేస్తూ, "పోలీసుఅవసరాలకోసం" అనిచెప్పింది. ఈ "హక్కు" కోసం ఇంగ్లండు పట్టుబట్టడంవల్లనే, ఈవిషయంలో అఖిలజాతులసమాఖ్యలోగాని, తరువాత ఆయుధవిసర్జనసభలోగాని ఒడంబడిక జరక్కుండాపోయింది.

జర్మనీ (వెయిమార్ రిపబ్లికన్ జర్మనీ) అఖిలజాతుల సమాఖ్యలో పూర్ణసభ్యత్వం పొందింది. దాంతో లోకంలో యూరపులో శాశ్వతశాంతిస్థాపనకు సూత్రధారియనీ, ఇది బ్రిటిష్‌వారివిజయమనీ ప్రశంసలు వర్షించాయి. ఈ పరిణామాలన్నింటికి మరొకదృక్పథం ఏమిటంటే, సోవియట్‌రష్యా ఏకాకిగాచేయబడడం, దానికి వ్యతిరేకంగా యూరపులోనిమిగతరాజ్యాలన్నీ కలిసి, సమిష్టిరంగాన్ని నిర్మించడమూను. రష్యా అప్పుడే తన దశమవిప్లవవార్షికోత్సవం జరుపుకున్నది. టర్కీ, ఇరాన్, అఫ్ఘనిస్థాన్, మంగోలియా మొదలగు తూర్పుదేశాలతో స్నేహసంబంధాలు యేర్పరచుకున్నది.

చైనావిప్లవంకూడా శీఘ్రగతిని పురోగమించింది. జాతీయసైన్యాలు విదేశీ (ముఖ్యంగా బ్రిటిష్) శక్తులతో రేవుపట్టణాలలోను, దేశంఅంతర్భాగాలలోను సంఘర్షణలుపడుతూ, చైనాలోసగభాగం వశంచేసుకున్నాయి. తరువాత అంతఃకలహాలు యేర్పడి, కొమింటాంగ్ రెండు వ్యతిరేకపక్షాలుగా చీలిపోయింది.

ప్రపంచపరిస్థితి ఇంగ్లండు, ఫ్రాన్సులు యూరోపియన్‌రాజ్యాల నాయకులుగానూ, సోవియట్‌రష్యా కొన్ని తూర్పుదేశాలతోను ప్రతిద్వంద్వులై, గొప్పసంఘర్షణజరుగనున్నట్లు కనుపించింది. అమెరికా ఈ రెండుపక్షాలకు దూరంగానే ఉంటూవచ్చింది. కమ్యూనిజమంటే తనకుగల తీవ్రవ్యతిరేకతచే రష్యాకుదూరంగా ఉన్నది. బ్రిటిష్‌విధానమందలి అపనమ్మకంవల్ల బ్రిటిష్‌ఆర్థిక, పారిశ్రామికబలాలతో పోటీవల్ల అమెరికా ఈ కూటమితోకూడా సహవాసంచేయలేకపోయింది. ఈకారణాలవల్లనే గాక, యూరోపురాజ్యాలకలహాలలో తాను యిరుక్కుపోతాననేభయం వల్ల, ఎవరిని అంటీముట్టకుండావుండే సహజస్వభావంవల్లకూడ అమెరికా ఎడంగా ఉండిపోయింది.

ఇండియా సహజంగానే ఈ రెండుముఠాలలో రష్యా, తూర్పురాజ్యాలపక్షం వహించకతప్పలేదు. అంటే కమ్యూనిజాన్ని - సోషలిస్టు భావాలు అనేకమందిని ఆకర్షిస్తున్నప్పటికి-ఆమోదించినట్టుకాదు. చైనా విప్లవవిజయాలు దగ్గరపడుతున్న ఇండియాస్వాతంత్ర్యానికి సూచనలనీ, ఆసియానుంచి యూరోపియన్ దురాక్రమణను తొలగించబడగలదని సూచిస్తున్నాయనీ అభినందించబడ్డాయి. డచ్చి ఈస్ట్ఇండీస్, ఇండో చీనా, పశ్చిమాసియారాజ్యాలు, ఈజిప్టుల జాతీయోద్యమాలపట్ల మే మెక్కువ ఆసక్తికలిగివున్నాము. సింగపూరును గొప్ప నౌకాబలకేంద్రంగామార్చడం, సింహళంలోని ట్రింకోమలే నౌకాశ్రయాన్ని పెంపొందించడం గమనిస్తే, రాబోయేయుద్ధానికి ప్రాథమికయేర్పాట్లేననీ, ఆ యుద్ధంలో బ్రిటన్ తనసామ్రాజ్యస్థితిని సుసంఘటితము, సుస్థిరముచేసుకుని, సోవియెట్‌రష్యాను, తూర్పుదేశాలలో చెలరేగుతున్న జాతీయోద్యమాలను అణగద్రొక్కటానికిచేసే ప్రయత్నంగాను కనపడింది.

ఈ అన్నివిషయాలను ఆధారాలుగా చేసుకునే కాంగ్రెస్ 1927 లో తన వైదేశికవిధానాన్ని యేర్పాటుచేసుకుంది. ఇండియా

సామ్రాజ్యవాదయుద్ధంలో భాగస్వామికాజాలదనీ ఏపరిస్థితులలోనూ భారతప్రజలఅంగీకారంలేకుండా ఇండియాను ఏ యుద్ధముతాలోనికీ ఈడ్వరాదనీ కాంగ్రెసు ప్రకటించింది. తరువాతిసంవత్సరాలలో యీ ప్రకటనను తరచుగా పునరుద్ఘాటించడమేగాక, దానికనుగుణ్యంగా విస్తృతమైనప్రచారంకూడా జరుపబడింది. ఈ ప్రకటన కాంగ్రెసువిధానాలకు పునాదికావడమేగాక, ఇదే ఇండియాయొక్కవిధానమనికూడా సాధారణంగా అంగీకరించబడింది. ఇండియాలోని ఏ వ్యక్తిగాని, సంస్థ గాని దాన్ని వ్యతిరేకించలేదు.

ఇంతలో యూరపులో అనేకమార్పులు సంభవిస్తున్నాయి. హిట్లరు, నాజీజం తలెత్తడం జరిగింది. కాంగ్రెసు ఈమార్పులను వెంటనే ఖండించింది. హిట్లరూ, అతనిసిద్ధాంతమూ కాంగ్రెసువ్యతిరేకించుతున్న జాత్యహంకారం, సామ్రాజ్యవాదం మొదలైనవాటిని మరింత ప్రబలం చేయడంవంటిదేనని కాంగ్రెసు బహిరంగంగా ఆక్షేపించింది. చైనాపట్ల సానుభూతికూడావుండడంవల్ల మంచూరియామీద జపానుదురాక్రమణను మరింత తీవ్రంగా ఖండించాము. అబిసీనియా, స్పెయిన్, చైనా జపానుయుద్ధం, జెకోస్లొవేకియా, మూనిచ్ సమస్యలు మా భావాలను, రాగలయుద్ధసూచనలను మరింత దృఢపరిచాయి.

కాని, హిట్లర్ అధికారంలోనికి రాకముందు వూహించబడిన యుద్ధానికీ, యిప్పుడు రాగలదనుకున్నయుద్ధానికీ ఎంతో తేడా వుంటుంది. అయినప్పటికి, బ్రిటిష్‌విధానం ఫేసిస్టు, నాజీశక్తులకు సుముఖంగానేవుంది. ఆవిధానాన్ని హఠాత్తుగా మార్చుకుని, స్వాతంత్ర్యశక్తులను, ప్రజాస్వామ్యశక్తులను బ్రిటన్ బలపరుస్తుందని నమ్మలేము. ఎన్ని మార్పులుజరిగినా, దానితీవ్రసామ్రాజ్యవాదదృక్పథము, సామ్రాజ్యాన్ని నిలబెట్టుకోవాలనేకోరిక మాత్రం మారబోవు. రష్యాపట్ల, రష్యాప్రతిబింబించేగుణాలపట్ల బ్రిటనుయొక్కతీవ్రవ్యతిరేకతకూడా మారబోదు. కాని మరొకవిశేషంకూడా స్పష్టమయింది. హిట్లరును సంతృప్తిపరచాలని యెంతప్రయత్నించినప్పటికీ, అతడు యూరపులో అత్యంతశక్తివంతుడుగా తయారవుతూ, అదివరకటిబలాబలాలను తారుమారుచేస్తూ, బ్రిటిష్‌సామ్రాజ్యముఖ్యప్రయోజనాలకే ముప్పుతెచ్చేటట్లున్నాడు. ఇంగ్లండు జర్మనీలమధ్య యుద్ధంజరుగవచ్చుననిపించింది. ఇదే సంభవిస్తే

అప్పుడు మన మవలంబించేవిధానం ఏమిటి? మన విదేశవిధానంలోని ముఖ్యధోరణులు రెండు. బ్రిటిష్‌సామ్రాజ్యవాదానికీ వ్యతిరేకులమే, ఫేసిజం, నాజీజాలకూవ్యతిరేకులమే. ఈరెంటినీ సమన్వయంచేసేదెలాగు? మన జాతీయవాదాన్నీ, అంతర్జాతీయవాదాన్నీ ఒక్కత్రోవకు ఎలా త్రిప్పగలం? ఉన్నపరిస్థితులలో యిది క్లిష్టమైనసమస్యే. కాంగ్రెసుకే యీ సంకటం. కాని, బ్రిటిష్‌ప్రభుత్వం ఇండియాలో తనసామ్రాజ్య తత్వాన్ని వదులుకున్నానని రుజువుచేసి, ప్రజలసానుభూతిమీద నమ్మక ముంచుతున్నానని ప్రకటించితే, యిదేమీ క్లిష్టమైనప్రశ్న కాదు.

జాతీయ, అంతర్జాతీయవాదాలమధ్య పోటీజరిగితే, తప్పకుండా జాతీయవాదమే గెలుస్తుంది. ప్రతిదేశంలోనూ, ప్రతిసందిగ్ధస్థితిలోనూ యిదే జరిగింది. పరపాలనలోవున్న దేశం, నిరంతరపోరాటమూ వేదనలూ రేపే, కఠినస్మృతులుగలదేశం ఇలాచేయక తప్పదు, తప్పించుకోలేదు. ఇంగ్లండు, ఫ్రాన్సులు స్పెయినును ప్రజాప్రభుత్వాన్ని మోసగించాయి, జెకోస్లావేకియాకు ద్రోహంచేశాయి. ఆవిధంగా తమజాతీయ ప్రయోజనాలకోసం, (తరువాతిసంఘటనలు వారి యీ నమ్మకాలు భ్రమలేనని రుజువుచేశాయి) అంతర్జాతీయతత్వాన్ని బలిఇచ్చాయి. అమెరికాకు ఇంగ్లండు, ఫ్రాన్సు, చైనాలపట్ల సానుభూతి, నాజీజం, జపాన్‌సైనికవాదులపట్ల ద్వేషమూ వున్నప్పటికీ, తన ఏకాకివిధానాన్నే అవలంబిస్తోంది. పెరల్‌హార్బర్‌సంఘటనయే అమెరికాను యుద్ధంలోకి లాగింది. అంతర్జాతీయవాదానికిచిహ్నమేననుకున్న రష్యాకూడా పూర్తిగా జాతీయవాదాన్నే అవలంబించి తనమిత్రులను, సానుభూతిపరులను తికమకలుపరచింది. జర్మన్‌సైన్యాలు ప్రకటించకుండానే హఠాత్తుగా దండెత్తడంవల్లనే సోవియట్‌రష్యాకు యుద్ధంవచ్చింది. తమ్ము తాము రక్షించుకుందామనేఆశతో (నిష్ఫలమని తెలిసికూడా) స్కాండినేవియన్‌దేశాలూ, బెల్జియం, హాలెండ్‌లూ యుద్ధంలోజోక్యంలేకుండా తప్పించుకోవాలని ప్రయత్నించినాయి. అయినా, యుద్ధం వాటిని ముంచివేసింది. జాతీయప్రయోజనాలకోసం టర్కీ అయిదుసంవత్సరాలపాటు గోడమీదిపిల్లివాటంగా రకరకాలుగా తటస్థవిధానాన్నవలంబించింది. పైకి స్వతంత్రరాజ్యంగా కనిపించే అర్ధవలసరాజ్యమైన ఈజిప్టు యుద్ధరంగాలలో ఒకటైనప్పటికి, ఒకవిచిత్రమైన ద్వంద్వపరిస్థితిలో వుండి

పోయింది. ఆచరణలో అది ఐక్యరాజ్యసమితిసైన్యాలఆక్రమణలోవుండి, యుద్ధంచేస్తున్న దేశమే కాని, పైకి యుద్ధంచేస్తున్న దేశంమాత్రం కాదు.

వివిధప్రభుత్వాలూ, దేశాలూ అవలంబించిన యీ రకరకాల విధానాలకు అనేకకారణాలూ, సాకులూ ఉండవచ్చును. ఏ ప్రజాస్వామిక ప్రభుత్వమైనా తనప్రజలను సమాయత్తంచేయకుండా, వారిసహకారాన్ని పొందకుండా హఠాత్తుగా యుద్ధంలోకి దూకలేదు. నియంతృత్వదేశమైనా ప్రజల్లో ఒకరకమైన మనస్తత్వాన్ని సృష్టించకుండా యుద్ధానికిదిగలేదు. కారణాలు, సమర్థనలు ఏటివైనప్పటికీ, సందిగ్ధపరిస్థితి యేర్పడినపుడల్లా జాతీయప్రయోజనాలు (లేక అలాఅని భ్రమించినవి) అగ్రస్థానమాక్రమించడము; వాటితో ఏకీభవించని ప్రయోజనాలన్నీ తుడిచివేయబడడమూ మాత్రం స్పష్టం. మ్యూనిచ్‌సమస్య ప్రమాదస్థితిలో వున్నప్పుడు, యూరపులోని ఫేసిస్టువ్యతిరేకసంఘము మొదలగు వందలాది అంతర్జాతీయసంస్థలు మూగవోయి, నిస్సహాయంగావుండిపోవడం ఆశ్చర్యకరం. వ్యక్తులు, చిన్నచిన్నముఠాలు అంతర్జాతీయదృక్పథాన్ని పెంపొందించుకోవచ్చును. ఆ విశాలప్రయోజనం కోసం తత్క్షణావసరమైన జాతీయప్రయోజనాలను, వ్యక్తిగత ప్రయోజనాలను త్యాగంచెయ్యడానికి సిద్ధపడవచ్చును. కాని, దేశాలు అలా చెయ్యలేవు. అంతర్జాతీయప్రయోజనాలు జాతీయప్రయోజనాల త్రోవలో వున్నప్పుడే దేశాలు సముత్సాహం చూపగలవు. కొన్నినెలల క్రితం "ఎకనమిస్ట్" అనే లండన్‌పత్రిక బ్రిటిష్‌విదేశాంగ విధానాన్ని గురించి యిలావ్రాసింది. "జాతీయప్రయోజనాలు పూర్తిగా స్పష్టంగా రక్షింపబడగల అంతర్జాతీయవిధానం మాత్రమే ఎల్లప్పుడు అనుసరింపబడగలదు. ఏ దేశమూ తనజాతిప్రయోజనంకంటె, అంతర్జాతీయప్రయోజనాలకే అగ్రస్థాన మివ్వదు. ఈరెండుప్రయోజనాలూ ఏకీభవించినప్పుడే అంతర్జాతీయవాదం బలీయమయ్యే అవకాశం వుంది."

అస్వతంత్రదేశంయొక్క ఆలోచన, శక్తి పూర్తిగా దాని స్వాతంత్ర్యసాధనకే వినియోగింపబడతాయిగనుక, స్వతంత్రదేశంమాత్రమే వాస్తవంగా అంతర్జాతీయదృక్పథాన్ని పెంపొందించుకోగలదు. అస్వతంత్రపరిస్థితి శరీరంలోని రాచపుండువంటిది. అది ఏ అవయవాన్నీ ఆరోగ్యవంతంకాకుండా అడ్డుపడడమేగాక, మనసును చీకాకుపరుస్తూ,

ఆలోచనలను ఆచరణలనుకూడా వికృతంచేసివేస్తుంది. దానిస్వభావం లోనే సంఘర్షణ వుంది. అట్టి సంఘర్షణ ఆలోచనలనన్నింటినీ ఆఒక్క విషయంమీదనే కేంద్రీకరింపజేస్తుంది గాని, విశాలంగా ఆలోచించే అవకాశమివ్వదు. వరుసగా చిరకాలంగా జరిగిన సంఘర్షణ బాధల చరిత్ర వ్యక్తికీ, జాతికీకూడా విడువరాని సైదోడుగా తయారవుతుంది. ఎటుచూచినా అదే కనిపించినట్లవుతుంది. అదే వ్యసనతరంగా ఆక్రమించుకుంటుంది. దానిమూలకారణాన్ని తొలగించకుండా దాన్ని వదిలించుకోవడం జరుగదు. అప్పటికీ అస్వతంత్రభావం తొలగిపోయినా ఆ గుణం నయంకావడానికి ఆలస్యమవుతుంది. ఎందువల్లనంటే, శారీరకమైన గాయంకంటె, మానసికగాయం మానుపట్టడానికి చాలకాలం పడుతుంది.

ఇదేపరిస్థితి ఇండియాలో చాలాకాలంగా వుంది. అయినా, గాంధీ మనజాతీయోద్యమానికి ఒక కొత్తరూపంయిచ్చాడు. ప్రజలలో నిరాశ, ద్వేషభావాలను చాలవరకు తగ్గించాడు. ఈభావాలు పూర్తిగాపోయాయని నేను చెప్పను. నిజానికి ఏ అస్వతంత్రజాతీకూడా పాలకజాతిపై ద్వేషంలేకుండా వుండలేదు. గాంధీ తీవ్రజాతీయవాది. అదే సమయంలో తన ప్రబోధం ఇండియాకుమాత్రమే పరిమితంకాదనీ, ప్రపంచానికే తానా సందేశం యివ్వవలసివున్నదనీ భావించాడు. ప్రపంచశాంతిని హృదయపూర్వకంగా కాంక్షించాడు. అందువల్ల, ఆయన జాతీయతత్వంలో ప్రపంచదృక్పథంకూడా వున్నది. దురాక్రమణభావం మాత్రం లేదు. ఆయన భారతస్వాతంత్ర్యాన్ని కాంక్షిస్తూనే, ఒకదానిపైఒకటి ఆధారపడేప్రపంచదేశాలన్నీ నిఖిలదేశసమాఖ్యగా యేర్పడడమే సరైనలక్ష్యంగా నమ్మేవాడు. అట్టిలక్ష్యం బహుదూరంగానే వుండవచ్చు. దానిని ఆయన యిలావివరించాడు: "జాతీయవాదమంటే వాఉద్దేశ్యంలో నా దేశ స్వాతంత్ర్యం కావచ్చు. కాని, అవసరమైతే, మొత్తంమానవాళిమనుగడకోసం నా దేశీయులందరూ ఆహుతికావచ్చు. ఇక్కడ జాతిద్వేషానికి తావులేదు. ఇదే మా జాతీయభావం కావాలి ......నేను ప్రపంచంమొత్తాన్ని దృష్టిలోవుంచుకునే ఆలోచించాలనుకుంటాను. నా దేశభక్తిలో మొత్తంమానవాళిమేలుకూడా వుంది. అందువల్ల నా భారతదేశసేవలో మానవాళిసేవకూడా వుంది......

ప్రపంచరాజ్యాలకు విడిపడివుండే స్వాతంత్ర్యమే లక్ష్యం కారాదు. స్వచ్ఛందపరస్పరాధారమే ధ్యేయం కావాలి. ఉత్తమ విశ్వమానవ హృదయం నేడు కోరుతున్నది, ఒకదానికొకటి వ్యతిరేకంగా వేరుపడి వుండేదేశాల సంపూర్ణస్వాతంత్ర్యం కాదు; స్నేహపూర్వకంగా పరస్పరాధారభూతమైనదేశాలసమాఖ్యయే. అది సంభవించడం చాలా దూరానవుండవచ్చు. అందుకు నా దేశ మేదో మహత్కార్యం చేస్తుందని నే నేమీ వాదించను. కాని, మాదేశం ఏకాకిగా స్వాతంత్ర్యం పొందడంకంటె, ప్రపంచదేశాలన్నీ పరస్పరాధారంగలవయి, స్వాతంత్ర్యంపొందడ నే మంచిదనీ, మేమూ అందుకుసిద్ధమేననీ అనడం గొప్పా కాదు, అసంభవమూ కాదు. మేము స్వతంత్రులమని నొక్కిచెప్పనవసరంలేకుండానే, సంపూర్ణస్వతంత్రులంగావుండే సామర్థ్యం కావాలని నేను కోరుతున్నాను."

జాతీయోద్యమం బలాన్నీ, ఆత్మవిశ్వాసాన్నీ పెంపొందించుకుంటూంటే అనేకమంది స్వతంత్రభారతదేశధోరణి ఎలావుంటుందా, అది ఏంచేస్తుందా, ఇతరదేశాలతో దానిసంబంధా లెలావుంటాయా అని ఆలోచించసాగారు. ఈదేశానికిగల మహావైశాల్యం, శక్తివంతమైనబలం, మూలసంపదలనిక్షేపాలు వారు ఘనంగా ఆలోచించేటట్టు చేశాయి. ఇండియా ఏదేశానికిగాని, ఏముఠాకుగాని తోడుపెళ్ళికొడుకులా, తోకలా వుండబోదు. దాని స్వాతంత్ర్యం, అభివృద్ధి ఆసియాకే పెద్దమార్పును తేగలవు. తద్వారా ప్రపంచానికున్కాడాను. ఈ భావంవల్ల - సంపూర్ణస్వాతంత్ర్యము, ఇంగ్లండుతోను, దానిసామ్రాజ్యంతోనూ గల సంబంధాలన్నీ తెగతెంపులుచేసుకోవడము తప్పదనే భావాలు యేర్పడ్డాయి. అధినివేశప్రతిపత్తి - అది స్వాతంత్ర్యానికి దారితీసేదయినప్పటికీ - అర్థంలేనిపరిమితియనీ, సంపూర్ణాభ్యుదయానికి అంతరాయమనీ భావించబడింది. అధినివేశప్రతిపత్తివెనుకగలభావం - ఒకమాతృదేశము, దానిబిడ్డలైనదేశాలు - ఈ అన్నింటికీ ఒకేరకమైన సాంస్కృతికచరిత్రవుండి, మాతృదేశంతోదృఢసంబంధాలు కలిగియుండడంలాంటిది-ఇండియాకు ఏమాత్రమూ వర్తించదని తోచింది. ఈ ప్రతిపత్తివల్ల మనం వాంఛించేటట్లు ఎక్కువదేశాలతో అంతర్జాతీయసహకారభావంకలిగివుండేమాట నిజమే. కాని, ఆ సామ్రాజ్యానికి, ఆశాఖ

న్వేలుకుజైటగలదేశాలతో అతితక్కువసంబంధాలుమాత్రమే యేర్పడ తాయి. ఆవిధంగా యీ ప్రతిపత్తి ఒక పరిమితగుణాన్నికూడా కలిగి వుంది. భవిష్యత్తుమీద మహత్తరవిశ్వాసంగల మాభావాలుమాత్రం యీ సరిహద్దులనన్నిటినీ అధిగమించి, విస్తృతసహకారంకోసం చూచాయి. ప్రత్యేకంగా మా యిరుగుపొరుగులనున్న ప్రాక్పశ్చిమ దేశాలైన చైనా, ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్, సోవియెట్‌రష్యాలతో సన్నిహితసంబంధాలేర్పడాలని మా వాంఛ. బహుదూరానవున్న అమెరికాతోకూడా గాఢమైత్రిని కోరుకుంటున్నాము. రష్యానుంచివలెనే, అమెరికానుంచికూడా మేము చాలా నేర్చుకోవచ్చును. ఇంగ్లండునుంచి ఇంకేమినేర్చుకోవడానికైనా మేము అలసిపోయాము. ఏమైనప్పటికి, దానితో మాకు ఏర్పడిన అవాంఛనీయబంధనాన్ని ఛేదించుకొని, సమానస్థాయిలో కలుసుకుంటే ఏమైనానేర్చుకోగలది వుంటుందేమో!

బ్రిటిష్ అధినివేశాలలోనూ, వలసదేశాలలోనూ వారు భారతీయులను జాతిద్వేషంతో, మానవసభ్యతకువ్యతిరేకంగా చూడడంకూడా మేము ఆ ముఠాతో యేసంబంధమూలేకుండా చేసుకోవాలనే మా నిశ్చయానికి ప్రబలకారణాలయ్యాయి. ప్రత్యేకంగా దక్షిణాఫ్రికా, కెన్యా, తూర్పు ఆఫ్రికాలు నేరుగా బ్రిటిష్‌ప్రాబల్యంక్రిందవుండి చేస్తున్నపనులు మమ్మును నిరంతరం చీకాకుపరుస్తున్నాయి. కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ ప్రజలు నవ్యసాంప్రదాయాన్ని ప్రతిబింబిస్తూ బ్రిటిష్‌వారి దురభిమానాలూ, సాంఘికఛాందసత్వము లేనివారైనందున మేము వ్యక్తిగతంగా వారితో మంచిగావుండడం చిత్రమే!

మేము భారతస్వాతంత్ర్యాన్నిగురించి ఎప్పుడుమాట్లాడినా వేరుపడివుండాలనికాదు. సంపూర్ణ జాతీయస్వాతంత్ర్యమనే పురాతన భావన యిక పనికిరాదనీ, ప్రపంచసహకారమనేనూత్నశకం ఆరంభంకావాలనీ చాలా ఇతరదేశాలకంటె మేమే ముందుగా గుర్తించామనుకోవచ్చు. కాబట్టి, ఒకానొకఅంతర్జాతీయచట్టంలో ఇతరదేశాలతోపాటు పరిమితమైనస్వాతంత్ర్యానికి మేము పూర్తిగా సంసిద్ధులమని పదేపదే ప్రకటించాము. ఆ చట్టం ప్రపంచాన్నంతటినీ ఆవరించాలి. లేదా సాధ్యమైనన్నిఎక్కువదేశాలకు – కనీసం ప్రాంతీయంగానైనా ఆవరించాలి.

ఇందులో ఏరకానికీ బ్రిటిష్‌కామన్‌వెల్తు సరిపోదు. కాని, అది విశాల మైనచట్రంలో ఒకభాగం కావచ్చును.

మేము ఎంత తీవ్రజాతీయవాదులమైనా, ఎంతగానో అంతర్జాతీయభావాలను పెంపొందించుకోగలుగుతూండడం ఆశ్చర్యకరమే. ఏ అస్వతంత్ర దేశప్రజాతీయోద్యమంకూడా దీనికిదగ్గరగా చేరలేకపోయింది. అట్టిదేశాలసామాన్యధోరణి అంతర్జాతీయజోక్యాలకు దూరంగావుండడమే. భారత దేశంలోకూడా అనేకమంది మేము ప్రజాప్రభుత్వంగల స్పెయిను, చైనా, అబిసీనియా, జెకోస్లొవేకియాలపక్షం వహించినందుకు నిరసించారు. వారు ఇటలీ, జర్మనీ, జపానులను ఎడంచేసుకోవడం దేనికన్నారు. "బ్రిటన్‌శత్రువులందరూ మనమిత్రులే. రాజకీయాలలో ఆదర్శవాదానికి తావులేదు. అధికారాన్నిసమయోచితంగా ఉపయోగించుకోవాలి" అన్నారు. కాని, కాంగ్రెసు సృష్టించినప్రజాభిప్రాయాన్ని గ్రహించి, ఈ వ్యతిరేకులు తమభావాలను బహిరంగంగా చెప్పుకోలేకపోయారు. ముస్లింలీగు ఎప్పుడూ మౌనంవహించి, అటువంటి అంతర్జాతీయవిషయాలపైన నోరువిప్పలేదు.

కాంగ్రెసు 1938 లో ఒక వైద్యదళాన్ని అవసరమైనవైద్యసామగ్రితో చైనాకు పంపించింది. ఈ బృందం అనేకసంవత్సరాలు అక్కడ చక్కనిసేవచేసింది. ఈ దళంఏర్పరచబడినపుడు సుభాస్‌బోసు కాంగ్రెసుఅధ్యక్షుడుగా ఉన్నాడు. జపాన్, జర్మనీ, ఇటలీలకువ్యతిరేకంగా కాంగ్రెసుతీసుకున్న ఏచర్యను బోసు ఆమోదించలేదు. అయినా దీనికి, చైనాకు, ఫాసిస్టునాజీలదురాక్రమణలకుగురియైనవారికి కాంగ్రెస్ వెల్లడించినసానుభూతిని ఆయన బహిరంగంగా కాదనలేకపోయాడు. కాంగ్రెసువారిలోను, ప్రజలలోను గల అట్టి అభిప్రాయాలే దీనికికారణం. ఆయనఅధ్యక్షుడుగావుండగా, ఆయనఅంగీకరించని అనేకసమస్యలపై మేము సానుభూతిసభలూ, ప్రదర్శనలూ, తీర్మానాలు చేశాం. వాటి వెనుకగలబలాన్ని గ్రహించినందున ఆయ నేమీ వ్యతిరేకతను వెలిబుచ్చలేదు. విదేశవ్యవహారాలవిషయంలోను, ఆంతరంగికవిషయాల్లోనూ దృక్పథంలో బోసుకు, కాంగ్రెసుకార్యవర్గానికీమధ్య తీవ్రభేదాభిప్రాయాలేర్పడ్డాయి. అందువల్ల 1939 లో ఆయన కాంగ్రెసుఅధ్యక్ష పదవినుంచి వైదొలగాడు. 1939 ఆగస్టునుంచీ ఆయన బహిరంగంగా

కాంగ్రెసును విమర్శింపసాగాడు. కాంగ్రెసుకార్యవర్గం తనచరిత్రలో ఎన్నడూలేనివిధంగా, మాజీఅధ్యక్షుడైన ఆయనమీద క్రమశిక్షణ చర్యతీసుకున్నది.

•

ఆవిధంగా, కాంగ్రెసు యుద్ధాన్నిగురించి ద్వంద్వవిధానాన్ని యేర్పరచుకుని, పలుసార్లు పునరుద్ఘాటించింది. ఒకవైపున ఫేసిజం, నాజీజం, జపానుమిలిటరిజంలపట్ల తీవ్రవ్యతిరేకభావం వుంది. ఇందుకు ఆ దేశాల ఆంతరంగికవిధానాలూ, ఇతరదేశాలపై దురాక్రమణలూ కూడా కారణం. వారివల్ల బాధలనుభవిస్తున్న ప్రజలపట్ల కాంగ్రెసుకు ప్రగాఢమైన సానుభూతి ఉన్నది. ఈ దౌర్జన్యాన్ని అరికట్టేందుకు చేస్తున్న ఏ యుద్ధంలోనైనా, మరేప్రయత్నంలోనైనా పాల్గొనాలనే తీవ్రమైన కోరిక కూడా ఉంది. ఈ రెండోవైపున భారతదేశస్వాతంత్ర్యకాంక్ష ఉంది. ఇది మేము ఎడతెగనికృషిచేస్తూవచ్చిన కాంగ్రెసు ప్రధానలక్ష్యం కావడంవల్లనేగాక రాగలయుద్ధం దృష్ట్యా కూడా యీ విధానం అవలంబించబడింది. సంపూర్ణస్వాతంత్ర్యం వల్లమాత్రమే మాలో తరతరాలుగాఉంటున్న బ్రిటిష్‌వారిపై ద్వేషభావాన్ని తొలగించుకోగలం. అప్పుడే మా సర్వశక్తులను, సర్వనిధులను సమీకరించి సాయపడగలం. స్వతంత్రభారతదేశం మాత్రమే అట్టియుద్ధంలో పాల్గొనగలదని పదేపదే ప్రకటించాము. ఆ స్వాతంత్ర్యమే లేకపోతే, యీ యుద్ధంకూడా అనేకయితర యుద్ధాలవలె రెండు సామ్రాజ్యవాదాలమధ్య జరుగుతున్నట్లూ, బ్రిటిష్‌సామ్రాజ్యాన్ని యథాతథంగా రక్షించి, శాశ్వతంగా కొనసాగించేందుకే జరుగుతున్నట్లూ భావించబడుతుంది. మేము ఎన్నాళ్ళనుంచోపోరాడుతున్న సామ్రాజ్యవాదంతో చేతులుకలిపి, దానినేరక్షించడం హాస్యాస్పదంగాను అసంభవంగాను మాకు తోచింది. మాలోకొందరు విశాలభావంతో యీ సామ్రాజ్యవాదము ఫేసిజం వగైరాలకంటె తక్కువ ప్రమాదకరమైనదని తలచినప్పటికి, ప్రజల నావిధంగా నమ్మించడం మా శక్తికి మించినది. స్వాతంత్ర్యంమాత్రమే ప్రజలవిద్వేషాన్ని ఉత్తే

జంగా మార్చి, ప్రజాశక్తిని ఒక మహత్తర ప్రయోజనంకోసం మళ్ళించ గలదు. అంతకంటె మరోమార్గం లేదు.

భారతప్రజల, లేక ప్రతినిధులసమ్మతి లేనిదే, ఇండియాను యుద్ధంలోకి దించరాదనీ, భారతసైన్యాలను దేశంబయటికిపంపి, ఉప యోగించరాదనీ కాంగ్రెసు ముందే ప్రత్యేకంగా చెప్పింది. వివిధపార్టీలు, గ్రూపులతోవున్న కేంద్రశాసనసభకూడా యిదేతీర్మానం మరలచేసింది. మా సాయుధసైన్యాలు సామ్రాజ్యఅవసరాలకోసం విదేశాలకు పంప బడుతున్నాయనీ, మా కేవిధమైన తగాదాలేనివారిని జయించడానికో అణచడానికో పంపుతున్నారనీ, పైగా అట్టిదేశాలు మరల స్వాతం త్ర్యాన్ని పొందేకృషిపట్ల మా కెంతో సానుభూతివున్నదనీ, అయినా, మా సైన్యాలను వారిపైకి పంపుతున్నారనీ, ఇండియా యెంతోకాలంగా బాధపడుతున్నది. భారతసైన్యాలు యీవిధంగా బర్మా, చైనా, ఇరాను, మధ్యప్రాచ్యము, ఆఫ్రికాలో కొన్నిచోట్ల ఉపయోగింపబడు తున్నాయి. ఈసైన్యాలు ఆదేశాలలో బ్రిటిష్‌సామ్రాజ్యచిహ్నాలుగా కనుపించి, ఆదేశాలప్రజలు ఇండియాపట్ల శత్రుభావాలు యేర్పరచు కొనేటట్లు చేశాయి. ఒక ఈజిప్టుపౌరుడు "మీరు మీ స్వేచ్ఛను పోగొట్టుకోవడమేగాక ఇతరులనుకూడా బానిసలనుచేసేందుకు బ్రిటిష్ వారికి సాయపడుతున్నారు" అనడం నా కిప్పటికి జ్ఞాపకమే.

ఈ ద్వంద్వవిధానంలోని రెండుభాగాలూ పరస్పరం సరిపడవు. వాటిలో పరస్పరవైరుధ్యం ఉన్నది. కాని, వైరుధ్యం మేము సృష్టించినది కాదు. ఆ పరిస్థితులలోనే ఆ బీజాలున్నాయి. ఆ పరిస్థితులలో తలెత్తిన యేవిధానంలోనైనా వైరుధ్యం ప్రతిబింబించితీరుతుంది. ఫేసిజం, నాజీ జంలను ఖండిస్తూ, సామ్రాజ్యవాదాన్ని యథాతథంగా పోషించడం అసంబద్ధమని మే మెన్నిపర్యాయములో ఖండించాం. మొదటి పక్షం రాక్షసకృత్యాలుచేస్తుంటే, సామ్రాజ్యవాదం ఇండియాలోను ఇతరత్రా పడిపోయిందని అనడం యథార్థమే. భేదమల్లా తరతమమైనదీ, కాలానికి సంబంధించిన దేగాని, గుణసంబంధమైనది కాదు. మొదటివి కూడా మా కెంతో దూరాన వున్నాయి. వాటిని గురించి మేము చదివి తెలుసు కోవడం మాత్రమే. రెండవది మా గుమ్మంలోనే ఉన్నది. మమ్మల్ని చుట్టుముట్టి అంతటా వ్యాపిస్తోంది. ఎక్కడో ప్రజాస్వామ్యపతాకాన్ని

పైకి ఎగురవేస్తూ, ఇక్కడ ఇండియాలో దాన్ని కాదనడం అసంబద్ధమని నొక్కి చెప్పాము.

మా ద్వంద్వవిధానంలో ఎలాంటివైరుధ్యంవున్నా అహింసాసిద్ధాంతంమాత్రం దౌర్జన్యదురాక్రమణనుంచి స్వేచ్ఛనురక్షించుకునేందుకు సాయుధపోరాటాన్ని చేయవద్దని అడ్డంకిగాలేదు.

1938 వేసవిలో నేను ఇంగ్లండులోను, యూరపుభూభాగంలోను వున్నాను. నా ఉపన్యాసాలు, వ్యాసాలు, వ్యక్తిగతసంభాషణలలో మా యీ విధానాన్ని వివరించాను. సమస్యలనువదిలేయడంగాని, యథాస్థితిలోవుంచడంగాని అపాయకరమని విడమర్చిచెప్పాను. సుడేటన్ లాండ్‌సమస్య ఉద్రిక్తస్థితిలోవున్నప్పుడు — యుద్ధంవస్తే ఇండియా యేంచేస్తుంది అని జెక్‌వారు నన్నుప్రశ్నించారు. అపాయం వారినెత్తిని పడేందుకు సిద్ధంగావున్న భయంకరస్థితిలో సున్నితమైనసమస్యలను, పాతఫిర్యాదులను సానుభూతితో ఆలోచించలేరు. అయినప్పటికి, నేను చెప్పినదాన్ని వారు హర్షించి, నావాదనను అంగీకరించారు.

1939 మధ్యలో భారతసైన్యాలు సింగపూరుకో, మధ్యప్రాచ్యానికో పంపబడినట్లు తెలియవచ్చింది. ప్రజాప్రతినిధులకు చెప్పకుండా యీపనిచేసినందుకు పెద్దగల్లంతు చెలరేగింది. ప్రమాదసమయాల్లో సైనికులరాకపోకలు రహస్యంగావుంచడం అవసరమనేది అంగీకృతమే. అయినా, ప్రజాప్రతినిధులైననాయకులనైనా నమ్మి, ఆలోచించడానికి అనేకమార్గాలున్నాయి. కేంద్రశాసనసభలో పార్టీనాయకులున్నారు, రాష్ట్రాలలో ప్రజలచేఎన్నికైన ప్రభుత్వాలున్నాయి. సాధారణసమయాల్లో కేంద్రం యీ రాష్ట్రప్రభుత్వాలను విశ్వసించి సంప్రదించుతూనేవుంటుంది. కాని, ప్రజాప్రతినిధులకుగాని, ప్రజాభిప్రాయానికిగాని ఈషణ్మాత్రం గౌరవమివ్వబడలేదు. 1935చట్టంక్రింద రాష్ట్రప్రభుత్వాలు పనిచేస్తున్నాయి. యుద్ధావసరందృష్ట్యా అధికారమంతా కేంద్రప్రభుత్వంచేతిలోవుంచుకునేందుకు ఆ చట్టాన్ని బ్రిటిష్‌పార్లమెంటు సవరణ చేయించబోతున్నదనికూడా తెలిసింది. సాధారణంగా ప్రజాస్వామిక దేశంలో, పార్టీనాయకులనుసంప్రదించి యిలాచేయడం సహజమూ, ఆవశ్యకంకూడాను. ఒకసమాఖ్యలోని రాష్ట్రాలుగాని, రాజ్యాలుగానీ తమహక్కులను ప్రాణప్రదంగాయెంచుకుంటాయనీ, వాటిని ఏమాత్రం

తగ్గించుకోటానికైనా – ప్రమాదస్థితిలోనైనా సులభంగా అంగీకరించవని అందరికీ తెలుసు. అమెరికాసంయుక్తరాష్ట్రాలలో కేంద్రానికి, రాష్ట్రాలకూ మధ్య యిట్టివివాదమే కొనసాగుతున్నది. నేనిది వ్రాస్తూండగా ఆస్ట్రేలియాలో – యుద్ధావసరాలకోసం, యుద్ధకాలంలో మాత్రమే రాష్ట్రాలఅధికారాలుకొన్ని కామన్వెల్తుకు సంక్రమింపచేసేవిషయంలో ప్రజాభిప్రాయం సేకరించబడగా, ప్రజ లా సూచనను తిరస్కరించారు. అమెరికా, ఆస్ట్రేలియాలలోని కేంద్రప్రభుత్వాలలో ప్రజాప్రతినిధులు, ఆయారాష్ట్రాలప్రతినిధులుకూడా ఉన్న అమెరికా, ఆస్ట్రేలియాలలోనే అలా జరిగింది. ఇండియాలో కేంద్రప్రభుత్వం పూర్తిగా బాధ్యతా రహితమైన నిరంకుశప్రభుత్వం. అది ఎన్నుకోబడినదికాదు. ప్రజలకు గాని, రాష్ట్రశాసనసభలకుగాని బాధ్యతవహించేదికాదు. అది పూర్తిగా బ్రిటిష్‌ప్రభుత్వానికిప్రతినిధిగా ప్రవర్తించునట్టిది. రాష్ట్రప్రభుత్వాలఅధికారాలను ఇట్టి కేంద్రప్రభుత్వానికి ధారాదత్తంచేయడమంటే, రాష్ట్రప్రభుత్వాలను, వాటిశాసనసభలను, ఇంకా బలహీనపరచి, రాష్ట్రీయ స్వాతంత్ర్యాన్ని దెబ్బకొట్టడమే. ఇది తీవ్రంగానిరసించబడింది. కాంగ్రెసు మంత్రివర్గాలు యేర్పడేటందుకు ముందుగా బ్రిటిష్‌వారుయిచ్చిన హామీలకు యిది విరుద్ధం. లోగడనే సూచించినట్లు ఎన్నికయిన ప్రతినిధులతో సంప్రదించకుండానే ఇండియాను యుద్ధంలోనికి దించుతున్నారని కూడా స్పష్టమయింది.

కాంగ్రెసు, కేంద్రశాసనసభ చేసిన ప్రకటనలను లెక్కచేయని ఈ చర్యలకు కాంగ్రెసుకార్యవర్గం గట్టిగా అభ్యంతరం తెలిపింది. ప్రజాసమ్మతిపొందకుండా విస్తృతసంబంధాలుగల యిట్టివిధానానికి ఇండియానుబంధించడాన్ని, యిట్టిబరువును నెత్తినిరుద్దడాన్ని యెదిరించ వలసివుంటుందని కాంగ్రెసు ప్రకటించింది. 1939 ఆగస్టులో మరొకసారి యిలా తీర్మానించింది: "ఈ ప్రపంచప్రమాదస్థితిలో స్వాతంత్ర్యము, ప్రజాస్వామ్యాలకు అండదండగా నిలబడేప్రజలపట్ల యీ కాంగ్రెసు కార్యవర్గసానుభూతి పూర్తిగా ఉంటుంది. యూరపు, ఆఫ్రికా, దూరప్రాచ్యాలలో ఫేసిస్టులదురాక్రమణలనూ, జెకోస్లొవేకియా, స్పెయిన్‌లలో ప్రజాస్వామ్యాలకుద్రోహంచేసిన బ్రిటిష్‌సామ్రాజ్యవాదాన్ని కాంగ్రెస్ పదేపదే ఖండించివున్నది......బ్రిటిష్‌ప్రభుత్వం ప్రజాస్వా

మ్యాము స్వాతంత్ర్యములపక్షాన నిలబడదనీ, ఏసమయంలోనైనా వాటికి ద్రోహంచేయగలదనీ, ఆ ప్రభుత్వం లోగడ అనుసరించినవిధానాలూ, ఇటీవలచేస్తున్నచర్యలూ రుజువుచేశాయి. ఇండియా అటువంటి ప్రభుత్వపక్షాన నిలబడజాలదు. తనకేయివ్వబడని ప్రజాసామ్యంకోసం, ఏక్షణాన్నయినా ద్రోహంచేయగల ప్రభుత్వాన్ని నమ్మి, తన శక్తిసంపదలను వెచ్చించమని కోరకూడదు." ఈవిధానానికి వ్యతిరేకతను తెలిపేందుకు ప్రథమచర్యగా, కేంద్రశాసనసభలోని కాంగ్రెసుసభ్యులను జరుగుబోయేసమావేశాన్ని బహిష్కరించవలసినదిగా కాంగ్రెసుకార్యవర్గం ఆదేశించింది.

యూరపులో ప్రత్యక్షంగా యుద్ధం ప్రారంభమయ్యేందుకు మూడువారాలుముందుగనే యీ తీర్మానంచెయ్యబడింది. భారత ప్రభుత్వము, దానివెనుకగల బ్రిటిష్ప్రభుత్వమూ భారతీయులఅభిప్రాయాలను పూర్తిగా త్రోసివేసేందుకే నిశ్చయించుకున్నాయనీ, యుద్ధానికిసంబంధించిన గడ్డుసమస్యలపట్లనేగాక, సాధారణసమస్యలపట్లకూడా వారు ఆ విధానమే అవలంబించదలచినట్లు కన్పించింది. ఈవిధానం – రాష్ట్రగవర్నర్లు, సివిల్సర్వీసుఉద్యోగులు కాంగ్రెసుమంత్రులతో సహాయనిరాకరణంచేస్తున్నట్లు ప్రవర్తించడంలోనే ద్యోతకమయింది. ఈ కాంగ్రెసురాష్ట్రప్రభుత్వాలస్థితి మరీ గడ్డుగా తయారయింది. ప్రజలలో భయోద్రేకాలు ప్రజ్వరిల్లుతున్నాయి. బ్రిటిష్ప్రభుత్వం పాతికేండ్ల క్రితం 1914 లో ప్రవర్తించినట్లే, యిపుడూ ప్రవర్తిస్తుందని అనుమానించారు. రాష్ట్రప్రభుత్వాభిప్రాయాలను, ప్రజాభిప్రాయాలనుగాని, ఈ పాతికేండ్లలోజరిగిన సంఘటనలనుగాని లెక్కచేయక యుద్ధమనే ముసుగుచాటున ఇటీవలనే భారతదేశంపొందినఅతిసంకుచితమైన స్వాతంత్ర్యాన్ని హరించి, భారతదేశశక్తిసంపదలను దోచివేస్తుందని భయపడ్డారు.

కాని, యీ పాతికేండ్లలోనూ జరిగినది ఎంతో వుంది. ప్రజల మనస్తత్వంకూడా మారిపోయింది. ఇండియావంటిగొప్పదేశాన్ని ఒక గృహోపకరణంలాగా వాడుకోవడమనేభావన, దానిప్రజలు తృణీకారభావంతోచూడబడడం – ప్రజలు సహించలేకపోయారు. గత 20 ఏండ్ల కష్టాలూ, పోరాటాలూ వ్యర్థమేనా? భారతీయులు ఈ అవమానానికి

నీచత్వానికీ తలయొగ్గి, తమజన్మభూమికే తలవంపులు తెస్తారా? తాము చెడ్డఅనుకున్నదాన్ని ఎదుర్కోవడం, సిగ్గుచేటుగాతోచినప్పుడు అట్టి దానికిలొంగకపోవడం — చాలామంది నేర్చుకున్నారు. అలా లొంగక పోవడంవల్ల రాగలప్రమాదాలనన్నిటిని వారు హృదయపూర్వకంగా భరిస్తారు.

యువజనులతరహా వేరు. వీరు జాతీయపోరాటము, దానికున్న చిక్కులూ అంతగా అనుభవించనివారు. 1920తరువాత, 1930తరువాత జరిగిన శాసనోల్లంఘనోద్యమాలుకూడా వారికి గతచరిత్రాంశములే. వారు అనుభవం, బాధలు అనే అగ్నిపరీక్షలకు గురైనవారు కాదుగనుక, తమభావనలే సరైనవనుకుంటారు. వారికి పెద్దవారినివిమర్శించడమేపని. వృద్ధులు బలహీనులనీ, రాజీపడేస్వభావంగలవారనీ యువకులభావన. కార్యపటుత్వంకంటె కటువైనమాటలే మహాభాగనుకున్నారు. వ్యక్తినాయకత్వంకోసమో, సూక్ష్మరాజకీయసమస్యల మీదనో, ఆర్థికసిద్ధాంతాలనుగురించో వారిలోవారు కీచులాడుకుంటారు. వారు అపరిపక్వస్థితిలోవున్నవారు. నిండుకుండవలె మసలడం తెలియదు. ఏమీ తెలియకపోయినా, ప్రపంచసమస్యలు తర్కిస్తూం టారు. వారిలో అనేక సుగుణాలున్నాయి. మంచిలక్ష్యాలకు గొప్ప ఉత్సాహం వున్నది. కాని, ఎలాగైతేనేం, వారు సామాన్యంగా — నిరాశా, నిరుత్సాహవాతావరణాన్ని కల్గించారు. బహుశా యిది తాత్కాలికమే కావచ్చు. వారు దీన్ని అధిగమించనూవచ్చు. అసలు, ఇప్పటికే వారుచవిచూచినఅనుభవాలవల్ల ఈస్థితిని దాటిపోవలసింది.

తమవిభేదాలు ఏమైనప్పటికీ, యీ సందిగ్ధసమయంలో కాంగ్రెసులోనిఅన్నివర్గాలవారూ, ఇండియాపట్ల బ్రిటిష్‌విధానాన్ని ఏకముఖాన వ్యతిరేకించారు. ఆ విధానానికి మండిపడి, దాన్నిఎదురించవలసినదిగా కాంగ్రెసును వత్తిడిచేశారు. స్వాభిమానంగల జాతీయవాదం యిట్టిఅవమానాన్ని సహించదు. తతిమ్మాఆలోచనలన్నీ వెనక్కునెట్టి వేయబడ్డాయి.

యూరపులో యుద్ధం ప్రకటించబడింది. ఇండియావైస్రాయి కూడా భారతదేశం యుద్ధంలోచేరినట్లు ప్రకటించాడు. ఒక్కమనిషి — అతడైనా దేశీయులందరూ అసహ్యించుకునే విదేశీవిధానానికి ప్రతినిధి—

40 కోట్లప్రజలను ఒకేఒక్క మాటతో, కాస్తంతైనాసంప్రదింపులేకుండా, యుద్ధంలో ముంచివేయగలిగాడు. ఈ కోట్లాదిమానవుల అదృష్టాన్ని యీవిధంగా నిర్ణయించే యీవిధానంలో, ఏదో ప్రధానమైనతప్పు, కుళ్ళు వుండివుండాలి. అధినివేశాలలో అనేకదృక్పథాల్లో పూర్తిగా చర్చలుజరిగినతర్వాత ప్రజాప్రతినిధులఅంగీకారంతోనే నిర్ణయంచేయ బడింది. ఇండియాలో అట్టిదేమీలేదు. అదే మనసును బాధించింది.

## 3 యుద్ధ వ్యతిరేకత

యూరపులో యుద్ధమారంభమైనప్పుడు నేను చుంకింగ్‌లో వున్నాను. కాంగ్రెస్ అధ్యక్షుడు కేబుల్ యివ్వగా నేను తక్షణం తిరిగి వచ్చాను. అప్పటికే కార్యవర్గసమావేశం జరుగుతున్నది. జిన్నాను ఈసమావేశానికి రమ్మని ఆహ్వానంపంపినా, ఆయన రాలేనని జవాబు వ్రాశాడు. వైస్రాయి ఇండియాను లాంఛనప్రాయంగా యుద్ధంలోకిదింప డమేగాక, అనేక ఆర్డినెన్సులుకూడా ప్రకటించాడు. బ్రిటిష్‌పార్లమెం టుకూడా 1935 చట్టాన్ని మార్పుచేసింది. ఈ శాసనాలన్నీ రాష్ట్ర ప్రభుత్వాలఅధికారాలనూ, కార్యకలాపాలనూ దిగ్బంధంచేసి, పరిమి తంచేసివేశాయి. ప్రజాప్రతినిధులఅభిప్రాయాన్ని తెలుసుకునేందుకు ఏమాత్రం ప్రయత్నించనందున, ప్రజలు తీవ్రనిరసన వెలిబుచ్చారు. వాస్తవానికి, ప్రజలు పదేపదే వెలిబుచ్చిన అభిప్రాయలనూ, తీర్మా నాలనూ ప్రభుత్వం పూర్తిగా అలక్ష్యంచేసింది.

కాంగ్రెసు సుదీర్ఘచర్చల అనంతరం, 1939 సెప్టెంబరు 14న, యుద్ధాన్నిగురించి ఒక పెద్దప్రకటనచేసింది. వైస్రాయిచర్యలనూ, కొత్త శాసనాలను విమర్శిస్తూ – "యీపరిణామాలను యీ కార్యవర్గం తీవ్రంగా నిరసిస్తున్నది" అంటూ; ఫేసిజం, నాజీజంలను – జర్మన్‌నాజీ ప్రభుత్వం పోలండ్‌పై ఇటీవల జరిపిన దురాక్రమణను ప్రత్యేకంగా ఖండిస్తూ, దానినెదిరించినప్రజలకు హృదయపూర్వకసానుభూతి ప్రక టించింది.

బ్రిటిష్‌ప్రభుత్వాన్నిఉద్దేశించినభాగంలో యిలా స్పష్టంచేయ బడింది: "నెత్తిమీదరుద్దబడిన ఏనిర్ణయాన్నయినా వ్యతిరేకించకతప్పదు, ఉత్తమప్రయోజనంకోసం సహకారం కోరినట్లయితే, బలవంతంగాగాని,

నిరంకుశంగాశాసించడంవల్లగాని అది చేకూరదు. విదేశీఅధికారమిచ్చిన ఉత్తర్వులు ప్రజలచేఅనుసరించబడడాన్ని యీకార్యవర్గం ఆమోదించదు. ఇద్దరుసమానుల మధ్యనే ఇద్దరూ మంచిదని ఆమోదించినపనికే సహకారం యేర్పడుతుంది. ఇటీవలనే భారతప్రజలు తమస్వాతంత్ర్యసాధనకోసం, స్వతంత్రప్రజాస్వామ్యస్థాపనకోసం భయంకరప్రమాదాలనెదుర్కొని, మనస్ఫూర్తిగా మహత్తరత్యాగాలుచేశారు. వారిసానుభూతి పూర్తిగా స్వాతంత్ర్యము, ప్రజాస్వామ్యాలపక్షానే వుంటుంది. ఇండియాకు స్వాతంత్ర్యాన్ని నిరాకరించి, ఉన్నపరిమితస్వేచ్ఛనుకూడా దోచుకొని, ప్రజాస్వామికస్వాతంత్ర్యంకోసమే చేస్తున్నయుద్ధమనిచెప్పుకునే — యీయుద్ధంలో ఇండియా ఎలాంటిసంబంధము పెట్టుకోబోదు.

"బ్రిటిష్, ఫ్రెంచిప్రభుత్వాలు తాము ప్రజాస్వామ్యం, స్వాతంత్ర్యాలరక్షణకు, దురాక్రమణనిరోధానికీ పోరాడుతున్నామని ప్రకటించినసంగతి ఈకార్యవర్గానికి తెలుసు. కాని, చెప్పినమాటలకు ప్రకటించినఆదర్శాలకూ నిజోద్దేశాలకు, లక్ష్యాలకూమధ్య ఎడతెగనివైరుధ్యం వున్నట్లు వారి ఇటీవలిచరిత్రలే అనేకవుదాహరణలతో రుజువుచేస్తున్నాయి." ఇక్కడ మొదటిప్రపంచయుద్ధంలోజరిగిన కొన్నిసంఘటనలు ఉదహరింపబడ్డాయి — "బయటికి మనఃపూర్వకంగా కనబడునట్లుచేయబడినప్రకటనలను నాటి నలక్ష్యంచేసేగుణంకూడా అనుసరించివుంటుందని తరువాతచరిత్రలే మరల నిరూపించాయి......వీరు మరొక్కసారి ప్రజాస్వామ్యం ప్రమాదంలోవున్నదని ప్రకటించారు. దీనితో యీ కార్యవర్గం పూర్తిగా ఏకీభవిస్తున్నది. ఈఆదర్శము, లక్ష్యాలవల్లనే పాశ్చాత్యదేశాలప్రజలు ఉత్తేజితులయ్యారనీ, వాటికోసం యెట్టి త్యాగాలుచేయడానికైనా సిద్ధంగావున్నారనీ కూడా యీకార్యవర్గం విశ్వసిస్తున్నది. కాని, ప్రజల యీఆదర్శాలు, భావనలు, పదేపదే వారు చేసినత్యాగాలుకూడా మరలమరల విస్మరింపబడి, వారివిశ్వాసాన్ని వమ్ముచేశారు.

"ఉన్నస్థితిని రక్షించేందుకే — సామ్రాజ్యఆక్రమణలను, వలసలను, స్వార్థప్రయోజనాలను, ప్రత్యేకసౌకర్యాలను రక్షించేందుకే— యీయుద్ధం జరుగుతూంటే, ఇండియాకు దానితో ఎట్టిసంబంధమూ లేదు. ఒకవేళ, యీయుద్ధం ప్రజాస్వామ్యంకొరకు, ప్రజాస్వామ్య

సిద్ధాంతంమీదఆధారపడినప్రపంచంకోసమూ అయితేమాత్రం ఇండి యాకు దానిపట్ల ఎంతో శ్రద్ధవుంటుంది. ఇండియాప్రజాస్వామ్యా లక్ష్యాలు - బ్రిటిష్ ప్రజాస్వామ్యానికిగాని, ప్రపంచప్రజాస్వామ్యానికి గాని వ్యతిరేకం కాజాలవని యీ కార్యవర్గం విశ్వసిస్తున్నది. కాని; ఇండియాలోనూ, ఇతరదేశాలలోనూగల ప్రజాస్వామ్యలక్ష్యాలకు సామ్రాజ్యవాదము, ఫేసిజంలకూ మధ్య ఆజన్మసిద్ధమైన తొలగబోని వైరుధ్యం వుంది. గ్రేట్‌బ్రిటన్ ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించి, విస్తృ తంచేసేందుకే యుద్ధంచేసేటట్లయితే, తన అధీనంలోని ప్రాంతాలలో సామ్రాజ్యవాదాన్ని విసర్జించాలి,...స్వతంత్రభారతదేశం ఇతర స్వతం త్రదేశాలతో పరస్పరరక్షణకు, పరస్పర ఆర్థికసహకారానికీ సంతోష పూర్వకంగా సంబంధబాంధవ్యాలు నెరపుకుంటుంది. భారతదేశం స్వాతంత్ర్యము, ప్రజాస్వామ్యాలు పునాదులుగాగల వాస్తవప్రపంచ వ్యవస్థను నెలకొల్పేందుకు, ఆ ప్రపంచవిజ్ఞానాన్ని, శక్తియుక్తులను మొత్తం మానవాళి అభ్యుదయాభివృద్ధులకు ఉపయోగించేందుకు కృషి చేస్తుంది.”

కాంగ్రెసు కార్యవర్గం జాతీయతత్వంగలదైనప్పటికీ, అంతర్జా తీయదృక్పథంతో సమస్యలు పరిశీలించి - ఈ యుద్ధం రెండు సైనికశక్తు లమధ్య పోరాటంవంటిది మాత్రమే కాదనీ, అంతకంటే ఎక్కువఅర్థం గలదనీ ప్రకటించింది. “ఇపుడు యూరపును ఆవరించివేసినగండం యూరపుకుమాత్రమే సంబంధించినది కాదు. అది మానవాళికంతటికీ చెందినగండం. ఇది తదితరగండాలు, యుద్ధాలవలె, ఉన్న ప్రపంచవ్యవ స్థను యిలాగేవుంచిపోయేగండం కాదు. ఇది ప్రపంచాన్నంతటినీకూడా రాజకీయ, ఆర్థిక, సాంఘికరంగాలలో మంచిగానో, చెడుగానో మరో రూపానికిమార్చి మరీ పోతుంది. గతమహాయుద్ధకాలంనుంచీ భయంక రంగా విజృంభించిన సాంఘిక, రాజకీయ సంఘర్షణలూ, వైరుధ్యాల తప్పనిసరిఫలితాలను సృష్టించినప్పటిదే ఈ గండం. ఈ సంఘర్షణలు, వైరుధ్యాలు తొలగింపబడి, సమభావాన్ని నెలకొల్పేవరకు ఈగండం పూర్తిగా అదృశ్యంకాదు. ఒకదేశాన్నిమరొకదేశం అణగద్రొక్కడం, దోచుకోవడం నశిస్తేనేగాని, అందరియొక్క సమానమనుగడకోసం స్థిరమమైనపునాదిమీద ఆర్థికసంబంధాలు నూతనంగా నెలకొంటేనే

గాని ఈ సమభావం యేర్పడదు. ఆధునికసామ్రాజ్యవాదానికి ఇండి యాయే స్పష్టమైన ఉదాహరణ గనుక, ఈసమస్యకీలకస్థానం ఇండి యాయే. ఈ మహత్తరసమస్యను విస్మరించితే, ప్రపంచాన్ని ఏ నూతనరూపంలో మలచినా, అది విజయవంతం కాజాలదు. ఇండియా తన విస్తారమైన శక్తి సంపదలతో ప్రపంచపునర్వ్యవస్థీకరణంలో అత్యంత ప్రధానపాత్రవహించక తప్పదు. ఈ మహత్తరలక్ష్యంవైపు దాని శక్తు లన్నీ ప్రవహించేటట్లు అది స్వతంత్రమైతేనే కృషిచేయగలదు. ఈ నాడు 'స్వాతంత్ర్యం అవిభాజ్యం'. ప్రపంచంలో ఏభాగాన అయినా సామ్రాజ్యవాదాన్ని నిలబెట్టుకోవాలని ఎవరు ప్రయత్నించినా, అది ప్రపంచానికి మరో నూతన విపత్తునే తీసుకురాగలదు."

భారతసంస్థానాధీశ్వరులు యీ యుద్ధంలో యూరపులో ప్రజా స్వామ్యరక్షణకు సాయపడతామని చేసినప్రకటనను యీ కార్యవర్గం ఉదహరించి, ఘనీభవించిన నిరంకుశాధికారం స్వైరవిహారంచేస్తున్నతమ తమ సంస్థానాలలో ముందుగా ప్రజాస్వామ్యం నెలకొల్పడం సముచిత మని హెచ్చరికచేసింది.

ఈ కార్యవర్గం అన్నివిధాలా సాయపడుగోరుతున్నాననీ, కాని, గతంలోనూ, యిప్పుడూ బ్రిటిష్ప్రభుత్వవిధానాలు ఆశాభంగంగా వున్నాయన్నది: "బ్రిటిష్ప్రభుత్వం యిప్పుడు చేస్తున్న యుద్ధకాల ప్రకటనలను యిప్పుడు ఆచరణలోపెడుతున్నదనిగాని, ఇకముందు అలాచేస్తుందనిగాని నమ్మదగ్గప్రయత్నాలు యీ కార్యవర్గానికి కను పించడంలేదు. ప్రజాస్వామ్యాన్ని, లేక స్వయంనిర్ణయాధికారాన్ని పురోగమింపజేసేందుకు, నెలకొల్పేందుకు ప్రయత్నిస్తున్న సూచనే లేదు." ఇంకా – "ఇప్పటి గంభీరస్థితిని ఇటీవల కొద్దిరోజులలోనూ జరిగిన ప్రపంచసంఘటనలు మానవుడూహించగలిగినదానికంటె అతి వేగంగా పరిణమించడాన్ని దృష్టిలోవుంచుకొని, ఈ సమస్యపై తుది నిర్ణయాన్ని వాయిదావేసి; ఈ పరిస్థితుల, సమస్యల పూర్తిఅర్థాన్నీ, లక్ష్యాలనూ సాకల్యంగా ఆకళింపుచేసుకునేందుకూ, వర్తమానం లోనూ, భవిష్యత్తులోనూ ఇండియావుండగల స్థితిగతులనుకూడా బేరీజువేసుకునేందుకూ కార్యవర్గం నిశ్చయించింది.

కాబట్టి యీ కార్యవర్గం: “బ్రిటిష్ ప్రభుత్వం స్పష్టమైన పదాలలో ప్రజాస్వామ్యము, సామ్రాజ్యవాదములపట్ల తన యుద్ధలక్ష్యాలేమిటో, నూతనప్రపంచవ్యవస్థను గురించి తామూహిస్తున్న దేమిటో, ప్రత్యేకంగా నేటిఇండియాకు తమలక్ష్యాల నేవిధంగా అన్వయింపజేస్తారో ప్రకటించాలని కోరింది; వారు తమలక్ష్యాలలో సామ్రాజ్యవాదవిసర్జన, ప్రజలఅభీష్టానికనుగుణ్యమైన విధానం అమలుజరిగే విధంగా భారతదేశాన్ని స్వతంత్రదేశంగా చూడడమూ వుంటాయా? వర్తమానమే ఇప్పటిచర్యలను నడుపుతూ, భవిష్యత్తుకు రూపాన్నిస్తుంది కనుక, ఏప్రకటనకైనా వాస్తవపరీక్ష వర్తమానంలో అన్వయించేదే కాగలదు. యుద్ధానికీ, మానవత్వాన్నిహీనపరచడానికీ కారణమైన సామ్రాజ్యవాదాన్ని సుస్థిరంగా నిలబెట్టేందుకే యీ భయంకరయుద్ధం కూడా జరగడంకంటె విషాదాంతనాటకం మరొకటుండదు” అనికూడా స్పష్టంచేసింది.

ఇండియా ఇంగ్లండులమధ్య అనేక అడ్డుగోడలు లేచి, గత 150 యేండ్లుగా ఆ రెండింటిసంబంధాలను విషతుల్యంచేసివేశాయి. ఆ అడ్డుగోడలను అధిగమించేందుకూ, స్వాతంత్ర్యంపట్ల మాకుగలగాఢవాంఛనూ, మా వెనుకగల ప్రజాసముత్సాహాన్నీ యీ యుద్ధంలో పాల్గొనాలనే అభిలాషను సమన్వయంచేసే ఒకమార్గాన్ని కనిపెట్టేందుకూ - మేమెంతో ఆదుర్దాతో చర్చించి ఈ ప్రకటన విడుదలచేసినాము. భారతదేశస్వాతంత్ర్యహక్కు పునరుద్ఘాటించడం కొత్తవిశేషమేమీ కాదు. అది యీ యుద్ధంవల్ల, అంతర్జాతీయ క్లిష్టపరిస్థితివల్ల ఏర్పడినది కాదు. అది చిరకాలంగా మా ఆలోచనలకు, కార్యకలాపాలకూ మూలాధారమైన భావనే. ఆ భావనచుట్టూ మేమునేక తరాలుగా తిరుగుతున్నాము. భారతస్వాతంత్ర్యాన్ని స్పష్టంగా ప్రకటించి, నేటిపరిస్థితుల కనుగుణంగా దాన్నిఅన్వయించి, యుద్ధావసరాలన్నింటినీ దృష్టిలోవుంచుకుని ముందుకుపోవడం కష్టమేమీకాదు. అసలు యుద్ధావసరాలే యిట్టిచర్యను శాసిస్తున్నాయి. ఇంగ్లండు హృదయపూర్వకంగా ఇండియాకు స్వరాజ్యం యివ్వాలని వాంఛిస్తే పెద్ద అడ్డంకులన్నీ తొలగిపోతాయి. మిగిలేదల్లా పార్టీల సమ్మతితో సమర్థవంతమైన పరిష్కారం మాత్రమే. ప్రతిరాష్ట్రంలోనూ రాష్ట్రీ

ప్రభుత్వాలు పనిచేస్తున్నాయి. యుద్ధకాలానికిగాను ప్రజాప్రతినిధులు గల కేంద్రప్రభుత్వయంత్రాంగాన్ని ఏదో ఒకరూపంలో యేర్పరచడం సులభమే. అట్టి యంత్రాంగం – ప్రజలందరిసమ్మతితో సొష్టమైన పునాదులపై యుద్ధసహాయకృషిచేయగలదు. సైనికబలాలతో పూర్తిగా సహకరించగలదు. ప్రజలకు రాష్ట్రప్రభుత్వాలకూ, ప్రజలకు బ్రిటిష్ ప్రభుత్వానికీ మధ్య కొక్కెము కాగలదు. ఇతర రాజ్యాంగసమస్యలు మున్నగునవి వీలైనంతతొందరగా జరుపడం మంచిదేగాని, యుద్ధానంతరంవరకు వాయిదావేసుకోవచ్చును. యుద్ధానంతరం ప్రజలచే ఎన్నుకోబడిన ప్రతినిధులు నూతన రాజ్యాంగచట్టాన్ని నిర్మించుకుని, ఇంగ్లండుతో పరస్పరప్రయోజనాలనుగురించి ఒడంబడికచేసుకోవచ్చును.

మా ప్రజల్లో ఎక్కువమందికి అంతర్జాతీయస్థితిగతులు అంతగా పట్టవు. ఇటీవల బ్రిటిష్ప్రభుత్వం అవలంబించినవిధానాలపట్ల వారు క్రోధ, ద్వేషాలు కలిగియున్న ఈ పరిస్థితులలో కాంగ్రెసుకార్యవర్గం యిటువంటిప్రకటనచేయడం అంత తేలికైనవ్యవహారం కాదు. ఇరుపక్షాలమధ్య చిరకాలంగావున్న అనుమానము, అపనమ్మకము ఇంద్రజాలంలాంటి ఒక్కమాటతో మాసిపోవని మాకు తెలుసు. కొన్ని పరిస్థితులబత్తిడిచే బ్రిటిష్నాయకులు తమ సామ్రాజ్యవాదపుగూళ్ళలో నుంచి వెలికివస్తారనీ, వారు దూరదృష్టితోప్రవర్తించి మా ప్రతిపాదనలనంగీకరించుతారనీ, ఆవిధంగా యీ రెండుదేశాలమధ్యగల దీర్ఘవైరాన్ని అంతమొందించి, భారతీయులశక్తిఉత్సాహాలు యుద్ధకృషివైపు మళ్ళేటట్లు చేయగలరనీ ఆశించాము.

కాని, అలాజరుగలేదు. మే మడిగినవన్నీ నిరాకరించడమే వారి సమాధానం. మేము అదే "సహకారము"నేమాట నుపయోగించినా, రెండవపక్షం దానికి వేరేఅర్థాన్ని జోడించింది. మాదృష్టిలో సహకారం ఇద్దరుమిత్రులమధ్య లేక సమానులమధ్యనే సాధ్యమవుతుంది. వారి అర్థంలో, వారు శాసిస్తే మేము తలదాల్చడమే సహకారం. మే మింత కాలమూ దేనికోసం నిలబడ్డామో, దేనివల్ల మా జీవితాలకొకఅర్థమంటూ ఏర్పడిందో దానినే వదిలేయడం, దానికి ద్రోహంచేయడంలాంటి పరిస్థితిని అంగీకరించడం మా కసంభవమైంది. మాలోకొందరు అందు కిష్టపడినా మేము మా ప్రజలను మాత్రం మాతో తీసుకురా

లేము. పైగా ప్రజలలో ఉద్భావితమవుతున్న జాతీయభావవాహిని నుంచి, మేము లక్ష్యంగాపెట్టుకున్న అంతర్జాతీయఆదర్శాలనుంచీ ఏ ఒడ్డుకో విసరికొట్టబడేవాళ్ళం.

మా రాష్ట్రప్రభుత్వాలపరిస్థితి విషమంగాతయారయింది. ఇక నవి గవర్నరు, వైస్రాయిల నిరంతరజోక్యానికైనా తలవొగ్గాలి, లేక వారితో ఘర్షణలకైనా సిద్ధపడాలి. ఉన్నతాధికారులు పూర్తిగా గవర్నరులపక్షానవుండి, లోగడకంటె ఎక్కువగా మంత్రులను అనవసర బెడదగా భావిస్తున్నారు. సహజంగా నిరంకుశుడైన రాజుకూ, లేక అతనిప్రతినిధులకూ - ప్రజాప్రతినిధులకూ మధ్య చిరకాలంగావుంటున్న రాజ్యాంగ వైరుధ్యమేగాక, ఆ రాజు విదేశీయుడుకావడంవల్ల, అతని పాలన సాయుధబలాలతోనే సాగుతూండడంవల్ల మరింత అగాధం యేర్పడింది. పదకొండింటిలో బెంగాలు, పంజాబు, సింధు మినహా మొత్తం ఎనిమిదిరాష్ట్రాల్లోను కాంగ్రెసుమంత్రివర్గాలు నిరసనసూచకంగా వెంటనే రాజీనామా యివ్వాలని నిశ్చయించబడింది. కొందరు రాజీనామాయివ్వకుండా పనిచేస్తూనేవుండాలనీ, గవర్నరులే మంత్రివర్గాలను రద్దుచేసేపరిస్థితి కల్పించాలనీ అభిప్రాయపడ్డారు. సహజాతంగావున్న వైరుధ్యం రోజురోజుకూ పెచ్చుమీరుతున్నది గనుక, మంత్రివర్గాలకూ గవర్నర్లకూ మధ్య తరచు సంఘర్షణలేర్పడగలవనీ, చివరికి గవర్నరులు వాటినిరద్దుచేయగలరనీ స్పష్టమవుతూనేవున్నది. అయితే, యీ మంత్రివర్గాలు పూర్తిగా రాజ్యాంగచట్టాన్నే అనుసరిస్తూ, రాజీనామాలిచ్చి, శాసనసభలు రద్దయి, మరల ఎన్నికలుజరిగేపరిస్థితిని కల్పించారు. శాసనసభల్లో వారివెనుక అధికసంఖ్యాకుల బలాలున్నందువల్ల మరెవ్వరూ మంత్రివర్గాల నేర్పరచలేరు. ఏమైనప్పటికీ, గవర్నరులు క్రొత్తఎన్నికలను తప్పించుకోనిశ్చయించారు. ఎన్నికలు జరిగితే కాంగ్రెసు మరింత దిగ్విజయంపొందుతుందని వారికి తెలుసు. వారు శాసనసభలను రద్దుచేయక, వాయిదావేసి, మంత్రివర్గాల, శాసనసభల అధికారాలన్నీ తమపరంచేసుకున్నారు. వారు పూర్తిగా నిరంకుశాధికారులై, చట్టాలూ, వుత్తర్వులూ జారీచేస్తూ, ప్రజాప్రతినిధులతోగాని, ప్రజలతోగాని సంప్రదింపులులేకుండానే తమయిచ్చవచ్చినట్లు చేయసాగారు.

కాంగ్రెసుకార్యవర్గం రాష్ట్రమంత్రివర్గాలచేత రాజీనామా లిప్పించడంలో నిరంకుశంగా ప్రవర్తించిందని బ్రిటిష్‌నాయకులు అనేకసార్లు ప్రకటించారు. ఫేసిస్టు, నాజీపాలనలలోతప్ప మరెక్కడా లేనటువంటి నిరంకుశాధికారదర్పాలతో పాలనచేస్తున్నవారే యిట్టి ఫిర్యాదుచేయడం కొత్తకాదు. రాష్ట్రస్థాయిలో ఎట్టిచర్యలు తీసుకోవడానికైనా పూర్తిస్వేచ్ఛ ఉండగలదనీ, గవర్నరులు, వైస్రాయి జోక్యంకల్గించుకోరని వైస్రాయి హామీయిచ్చినందువల్లనే కాంగ్రెసు ఎన్నికలలో పాల్గొనడము, రాష్ట్రప్రభుత్వాల నేర్పాటుచేయడము జరిగింది. కాని, వారిజోక్యం యిప్పుడు తరుచయింది. పైగా 1935 చట్టంలో రాష్ట్రప్రభుత్వాలకు ఉన్న అధికారాలుకూడా పరిమితం చేయబడ్డాయి. యుద్ధంసాకుతో చట్టబద్ధమైన రాష్ట్రాల ప్రాథమిక అధికారాలనే బ్రిటిష్‌పార్లమెంటు ఒకసవరణతో ఊడలాక్కున్నది. రాష్ట్రప్రభుత్వవ్యవహారాలలో ఎప్పుడు ఏవిధంగా జోక్యంకలిగించుకోవచ్చునా అనేవిషయం పూర్తిగా వైస్రాయికే వదలబడింది గాని, రాష్ట్రప్రభుత్వాలకు చట్టబద్ధమైన హామీలేమీలేవు అందువల్ల అన్నింటికీ ఓర్చుకుంటూనే రాష్ట్రప్రభుత్వాలు సాగాలన్నమాట. రాష్ట్రప్రభుత్వాలూ, శాసనసభలూ చేసిన ప్రతినిర్ణయాన్ని యుద్ధావసరమనే ముసుగుచాటున వైస్రాయిగాని, అతడు నియమించుకున్న సలహాసంఘంగాని త్రోసిరాజనవచ్చును. ఈ పరిస్థితులలో బాధ్యతగల ఏ ప్రభుత్వమూ పనిచేయలేదు. అవి అటు గవర్నరుతోను, అధికారులతోగాని, ఇటు ప్రజాప్రతినిధులతోను, శాసనసభలతోగాని ఘర్షణ పడుతూవుండకతప్పదు. కాంగ్రెసు అధికారంలోవున్న ప్రతిశాసనసభ యుద్ధారంభకాలంలోనే, కాంగ్రెసుచేసినప్రకటననుసరించి తీర్మానాలుచేసింది. వైస్రాయి వాటిని త్రోసివేశాడు. అందువల్ల కాంగ్రెసు మెజారిటీగల రాష్ట్రప్రభుత్వాలు గవర్నర్‌లతో ఘర్షణకైనాదిగాలి, లేదా యిక రాజీనామాలైనాయివ్వాలి. ప్రజలలోనూ, నాయకులలోనూకూడా అనేకమందికి బ్రిటిష్‌అధికారానికి వ్యతిరేకంగా పోరాటం సాగించాలనేఅభిప్రాయం యేర్పడింది. ఏమైనప్పటికీ, కాంగ్రెసుకార్యవర్గం సాధ్యమైనంతవరకు యిట్టిఘర్షణను తప్పించేందుకే ఆతుర్దాపడింది. అందువల్లనే మధ్యేమార్గం అనుసరించింది. సాధారణ ఎన్నికలుజరిపి,

ఓటర్లయొక్క, ప్రజలయొక్క అభిప్రాయాలను తెలుసుకోవడం బ్రిటిష్ ప్రభుత్వానికి సులభమే. కాని, ఎన్నికలలో కాంగ్రెస్ దిగ్విజయం పొందుతుందని తెలిసియే ఎన్నికలులేకుండా తప్పించుకున్నారు.

పెద్దరాష్ట్రాలైన బెంగాలు, పంజాబులలోను, చిన్నరాష్ట్రమైన సింధులోను మంత్రివర్గాలు రాజీనామాలివ్వలేదు. బెంగాలు, పంజాబులలో ఎప్పుడూ గవర్నరులూ, వారివున్నతాధికారవర్గాలే పైచేయిగా వ్యవహరించుచున్నందున సంఘర్షణకు తావులేకపోయింది. అయినా, కొంతకాలానికి ప్రధానిమీద బెంగాలుగవర్నరుకు అయిష్టతకలిగి, ప్రధాని, అతనిమంత్రివర్గము రాజీనామానిచ్చేందుకు వత్తిడిచేశాడు. ఆతరువాత సింధురాష్ట్రంలోనూ అంతే. సింధుప్రధాని వైస్రాయికి ఒక దీర్ఘలేఖనువ్రాస్తూ బ్రిటిష్‌ప్రభుత్వవిధానాల్ని విమర్శించి, నిరసనగా ప్రభుత్వం తనకిచ్చినగౌరవబిరుదును విసర్జించాడు. ఆయన రాజీనామాయివ్వలేదు. అయినప్పటికి, ఆ లేఖ వైస్రాయిగారిహుందాకు భంగకరంగావున్నదన్నసాకుతో, ప్రధానిని పదభ్రష్టుణ్ణిచేయవలసిందిగా గవర్నర్‌కు వైస్రాయి ఆదేశించాడు.

కాంగ్రెసుమంత్రివర్గాలు రాజీనామాలిచ్చి అయిదేళ్ళయింది. ఇంతకాలమూ ప్రతిరాష్ట్రంలోనూ ఒకేఒకవ్యక్తిపాలన అమలులో వుంది. యుద్ధంసాకుతో యుద్ధపుపొగమంచుచాటున మమ్మల్ని 19వ శతాబ్దిమధ్యకాలపు నిరంకుశాధికారంలోనికి నెట్టివేశారు. సివిల్‌సర్వీసు ఉన్నతోద్యోగులు, పోలీసులు సర్వశక్తిసంపన్నులయ్యారు. వారిలో ఏ ఒకబ్రిటిష్‌వ్యక్తిగాని, భారతీయుడుగాని ప్రభుత్వఉత్తర్వులను అమలుపరచేందుకు సంకోచంచూపితే, అతన్ని దురదృష్టం చుట్టుముట్టేది. కాంగ్రెసుప్రభుత్వాలుచేసిన అనేక మంచిపనులు విఫలంచేయబడ్డాయి. వారువేసినపథకాలు రద్దుచేయబడ్డాయి. అదృష్టవశాత్తు, కౌలుదారీ సంస్కరణచట్టాలు మాత్రం ఉండిపోయాయి. కాని, వాటిని అనువర్తింపచేయడంలో కౌలుదార్లకు వ్యతిరేకంగా పెడర్థాలులాగబడేవి.

గత రెండేండ్లలోను చిన్నవైన అస్సాం, ఒరిస్సా, సరిహద్దు రాష్ట్రాలలో అనేకమందిశాసనసభ్యులను జైళ్ళలోనిర్బంధించారు. ఆవిధంగా కాంగ్రెసుసంఖ్యాబలం తగ్గించి మైనారిటీపక్షాలను మెజారిటీ

పత్యౌలుగా మార్చారు. బెంగాలులో ప్రస్తుత మంత్రివర్గం యూరోపియన్ముఠామద్దతుమీదనే నిలబడగలిగింది. ఒరిస్సామంత్రివర్గం ఎక్కువకాలం నిలబడలేకపోయింది. గవర్నరు - అంటేఏకవ్యక్తి-పాలనక్రిందికి మార్చబడింది. సరిహద్దురాష్ట్రమంత్రివర్గానికి శాసనసభలో బలంలేకపోయినా, అసలు శాసనసభనే సమావేశపరచకుండా, మంత్రివర్గం కొనసాగించబడుతోంది. పంజాబు, సింధురాష్ట్రాలలో జైళ్ళబైటవున్న కాంగ్రెసుసభ్యులు శాసనసభలకు వెళ్ళరాదనీ, బహిరంగసభలలో పాల్గొనరాదనీ ప్రత్యేకవుత్తర్వులు జారీచేయబడ్డాయి.

## ౪ కాంగ్రెసుచే మరొక ప్రతిపాదన - బ్రిటిష్‌వారి తిరస్కారణ మిష్టర్ విన్‌స్టన్ చర్చిల్

ఎనిమిదిరాష్ట్రాల్లో పరిస్థితులు ఏకవ్యక్తి నిరంకుశపరిపాలనలోకి మారిపోవడమంటే మంత్రివర్గాలవిషయంలో జరిగేమార్పులు సూచించేట్లుగా ఉన్నతస్థానాల్లోవున్న మనుషులకు బదలకాగా వచ్చిన మార్పుమాత్రంకాదు. మొత్తం ప్రభుత్వనిర్మాణాంగంయొక్క స్వభావం, కార్యవిధానం, పద్ధతుల్లో మొత్తంగా, మౌలికంగా మార్పురావడమే గాని అన్యంగాదు. అధికారవర్గాలమీద శాసనసభలకు, ఇతరవిధానాలకూ కల్పించబడిన అజ్మాయిషీఅధికారాలన్నీ త్రోసివేయబడ్డాయి. గవర్నరునుంచి క్రిందిజవానువరకుగల సివిలుఉద్యోగబృందము, పోలీసుశాఖ ప్రజలపట్లచూపేదృక్పథమే మారిపోయింది. అది కాంగ్రెసుప్రభుత్వాలుయేర్పడకముందున్నస్థితికి దిగజారడంమాత్రమే కాదు. ఇంకా నీచానికి దిగజారిపోయింది. చట్టప్రకారం అది 19వ శతాబ్దపుపరిస్థితులకు మళ్ళింది. ఆచరణలో అది మరింత కఠోరమయింది. పూర్వంవున్న ఆత్మవిశ్వాసము, పితృభావంకూడా నశించి, బ్రిటిష్‌వారిస్వార్థ ప్రయోజనాలన్నీ భగ్నంచేయబడుతున్నాయనేభయం ఆవరించింది. వారికి ఆ రెండున్నరసంవత్సరాలకాంగ్రెసుపాలనను భరించడమే కష్టమైపోయింది. తాము ఏ నిమిషానఅయినా జైలులో నిర్బంధించగలవారు తమకు ఉత్తర్వులీయడం బాగుండలేదు. ఇప్పుడు పూర్వవిధానాన్ని మళ్ళీ అనుసరించాలనేకోరికతోపాటు, ఆ 'అడ్డుపుల్లగాళ్ళ'ను జైళ్ళలో పెట్టాలనేకోరికకూడా యేర్పడింది. భూమిదున్నేరైతు, మిల్లుకార్మి

కుడు, చేతివృత్తులవారు, సన్నకారువ్యాపారులు, పారిశ్రామికులు, ఉద్యోగవృత్తులవారు, కళాశాలలలోని యువతీయువకులు, చిన్నఉద్యోగులు, పెద్దఅధికారాలలోవున్న భారతీయులుకూడా ప్రజాప్రభుత్వాల పట్ల అభిమానం ప్రకటించితే, అట్టివారికి బ్రిటిష్‌రాజ్యం యింకా బ్రతికేవున్నదని బుద్ధిగరపాలనుకున్నారు. వారికి తమరాజ్యమే తరణోపాయాలను చూపగలదుగాని, మధ్యలోవచ్చిపోయేవాళ్ళు కాదు. ఇంతవరకు మంత్రులకు కార్యదర్శులుగాపనిచేసినవారు ఇప్పుడు సర్వాధికారులైపోయారు. గవర్నర్‌క్రింద పనిచేస్తూ పూర్వపు నిరంకుశధోరణినే మరల అవలంబించారు. కలెక్టర్లు తమజిల్లాలలో మరల కసాయితనపు పర్యవేక్షణకు పూనుకున్నారు. పోలీసుఉద్యోగులు తాము తప్పుచేసినా సమర్థించే అధికారం పైన వున్నదనేధీమాతో తమ పాతఅలవాటులను సాగించారు. యుద్ధపుపొగమంచు అన్నింటిని కప్పిపుచ్చగలదుగదా!

కాంగ్రెసుప్రభుత్వాలను విమర్శించినవారిలోకూడా అనేకమంది యీ చర్యలను చూచి విస్తుపోయారు. ఆ ప్రభుత్వాలమంచిగుణాలు వారికి యిప్పుడు తెలిసొచ్చాయి. అవి రాజీనామాలివ్వడంపట్ల అసంతృప్తివెల్లడించారు. ఎట్టిఫలితా లేర్పడ్డాసరే, అధికారాన్ని వదలకుండా వుండాలని వారివాదన. ఆశ్చర్యకరమైనవిశేషమేమిటంటే, ముస్లింలీగు సభ్యులుకూడా భయపడసాగారు.

కాంగ్రెసేతరులు, కాంగ్రెసును విమర్శించినవారే యిట్టి అభిప్రాయాలుకలిగివుంటే, ఇక కాంగ్రెసువాదులూ, వారిఅనుయాయులూ ఎట్టిభావాలు కలిగివుంటారో వూహించుకోవచ్చు. మంత్రులు తమపదవులకు రాజీనామాలిచ్చారేగాని, శాసనసభాసభ్యత్వాలు వదలుకోలేదు. శాసనసభలఅధ్యక్షులు, యితరసభ్యులూకూడా రాజీనామాలివ్వలేదు. అయినప్పటికి, వారినందరినీ ప్రభుత్వం ఒకమూలకునెట్టివేసి, ఎరుగనట్లు ప్రవర్తించింది. మరల ఎన్నికలైనా జరుపలేదు. కనీసం రాజ్యాంగరీత్యా చూచినా, యిట్టిచర్య సహించడంసులభంకాదు. ఏదేశంలోనైనా యిట్టి చర్యకల్లోలాన్ని రేకెత్తించగలదు. దేశజాతీయభావాలను ప్రతిధ్వనించే కాంగ్రెసు, శక్తివంతంగా, విప్లవశక్తిగావుండే కాంగ్రెసు, ఎంతో స్వాతంత్ర్యపోరాటచరిత్రగల కాంగ్రెసు – ఇట్టి ఏకవ్యక్తినిరంకుశాధికారానికి ఎలా తలవాల్చగలదు? పైగా యీ చర్య తనమీాదనే సవా

లుగా చేయబడుతున్నప్పుడు, జరిగేదాన్ని చూస్తూ వూరుకోలేదు. ఈవిధంగా శాసనసభలనూ, ప్రజాచర్యలనూ అణచివేయడాన్నీ, బ్రిటిష్‌ప్రభుత్వం భారతదేశంపట్ల అనుసరిస్తున్నవిధానాన్నీ ఎదుర్కొని, ప్రత్యక్షచర్యలు జరుపవలసినదిగా పదేపదే ప్రజాభిప్రాయం వత్తిడి చేసింది.

తమ యుద్ధలక్ష్యాలను వివరించడానికీ, భారతదేశపరిస్థితిని బాగు చేయడానికీ బ్రిటిష్‌ప్రభుత్వం నిరాకరించినతర్వాత కాంగ్రెసుకార్యవర్గం యిలా తీర్మానించింది: "కాంగ్రెసుచేసిన వత్తిడికి బ్రిటిష్‌వారిచ్చిన సమాధానం ఏమాత్రం తృప్తికరంగా లేదు. వారు ప్రధానసమస్యను, నైతికసమస్యను మరుగుపరచి, అపార్థంతీసేందుకు ప్రయత్నించారు... యుద్ధాదర్శాలనుగురించీ, భారతస్వాతంత్ర్యాన్నిగురించీ ప్రకటించకుండా తప్పించుకోవడం, దేశంలోని అభివృద్ధినిరోధకులమద్దతుతో తమసామ్రాజ్యవాదాధికారాన్ని చెక్కుచెదరకుండా వుంచుకోవడంకోసమేనని ఈ కార్యవర్గం అభిప్రాయపడుతోంది. యుద్ధప్రమాదమూ, దానితోగల యితరసమస్యలూ నైతికసంబంధమైనవేనని కాంగ్రెసు అభిప్రాయపడుతున్నది. కాంగ్రెసు రాజీబేరాలతో లాభంపొందాలని కోరడంలేదు. యుద్ధలక్ష్యాలు, భారతస్వాతంత్ర్యాలనుగురించిన ప్రధాన నైతికసమస్యలు పరిష్కరింపబడేవరకు, మరోసమస్య ఆలోచించబడదు. ప్రజాప్రతినిధులకు సంపూర్ణాధికారాలు యివ్వకపోతే, కనీసం యుద్ధకాలం వరకైనాసరే కాంగ్రెసుమంత్రివర్గాలనేర్పరచి, బాధ్యతవహించేందుకు కాంగ్రెసు అంగీకరించదు".

బ్రిటిష్‌ప్రభుత్వంతరఫున చేయబడ్డప్రకటనలదృష్ట్యా కాంగ్రెసు ఆ ప్రభుత్వవిధానాలతో తెగతెంపులుచేసుకోకతప్పనిసరిపరిస్థితి యేర్పడింది. ప్రథమసహాయనిరాకరణచర్యగా మంత్రివర్గాలు రాజీనామాలిచ్చాయనికూడా కార్యవర్గం తీర్మానించింది. "బ్రిటిష్‌ప్రభుత్వం తనవిధానాన్ని మార్చుకోకపోతే, కాంగ్రెసు సహాయనిరాకరణాన్ని కొనసాగిస్తూనే వుంటుంది." ఏమైనప్పటికీ, కాంగ్రెసువారికి యీకార్యవర్గం ఒకవిషయాన్ని గుర్తుచేస్తున్నది. ఏవిధమైన సత్యాగ్రహంలోనైనా శత్రువుతో గౌరవనీయమైన ఒడంబడికచేసుకోవడానికి ప్రతి ప్రయత్నమూ చేయాలనే గుణం సహజంగానే వుంది. అందువల్ల, బ్రిటిష్‌ప్రభుత్వం

తలుపులు మూసుకున్నా సరే ఈ కార్యవర్గం అట్టి ఒడంబడికకు ప్రయత్ని స్తూనేవుంటుంది."

ప్రజలలో చెలరేగుతున్న క్రోధావేశం గమనించీ, యువతీయువకులు దౌర్జన్యవిధానాలవలంబించవచ్చుననీ సత్యాగ్రహంలోని అహింసా తత్వాన్ని ఈ కార్యవర్గం మరొకసారి గుర్తుచేస్తూ, దాన్ని మీరవద్దని ప్రబోధించింది. ఏవిధమైన నిరోధకచర్య జరిగినా, అది శాంతియుతం గానే జరగాలి. సత్యాగ్రహమంటే అందరిపట్ల, ప్రత్యేకంగా శత్రువుల పట్ల దయాభావనయేనని ప్రత్యేకంగా చెప్పబడింది. ఈ అహింసాతత్వం యుద్ధవిషయంలోను, దురాక్రమణనుంచి దేశాన్నిరక్షించుకోవడం లోను వర్తించదు. భారతస్వాతంత్ర్యంకోసం బ్రిటిష్‌పాలనకువ్యతిరేకంగా జరిగే ఏ చర్యలకైనా యీ తత్వం వర్తించాలనిమాత్రమే ఉద్దేశింప బడింది.

అప్పటికి యూరపులో పోలండ్ పతనమైపోయి, యుద్ధోద్ధతి కాస్త శాంతపడింది. దాన్ని "మధ్య" కాలం అంటారు. సామాన్య భారతీయునికి 'యుద్ధ'మంటే ఏదో దూరస్థవిషయం. ఇండియాలోని బ్రిటిష్‌అధికారులదృక్పథంకూడా యిటువంటిదే కాని, వారు యుద్ధా నికి సామగ్రి సరఫరాచేయవలసివుండడంవల్ల కొంత చేరువగా కన్పించి వుండవచ్చును. అప్పుడూ, 1941 జూన్‌లో రష్యామీదికి జర్మనీ దండెత్తేవరకూ భారతకమ్యూనిస్టుపార్టీ బ్రిటిష్‌వారి యుద్ధచర్యలలో సహకరించరాదనే పూర్తివ్యతిరేకభావంకలిగివుంది. వారిపార్టీ నిషేధించ బడింది. కొద్దిమంది యువకులు మినహా వారిపలుకుబడి గణించదగ్గది గాలేదు. కాని, ప్రజలలో ప్రబలంగావున్నభావాన్నే వారు తీవ్రంగా నినదించడంవల్ల వారొకవిధమైన తీవ్రవాదులుగా గుర్తించబడ్డారు.

ఈసమయంలో రాష్ట్ర, కేంద్రశాసనసభలకు ఎన్నికలుజరపడం సులభమే. యుద్ధమేమీ ఆటంకంగాలేదు. అట్టిఎన్నికలు జరిగితే, పరి స్థితులలోనిక్లిష్టత సమసిపోయి, ప్రజాభిప్రాయం స్ఫుటంగా ప్రకటించ బడేది. కాని, యీ వాస్తవం రుజువైపోతుందని బ్రిటిష్‌వారు భయ పడ్డారు. వివిధపక్షాలకు ఎంతెంతో బలంవున్నదని వారు రకరకాల వాదనలుచేస్తూ అసత్యవాదనలకుదిగి బుకాయిస్తున్నారు. కాని, ఎన్నికలు జరపనేలేదు. రాష్ట్రాలు ఏకవ్యక్తినియంతృత్వంక్రిందవున్నాయి.

కేంద్రింలో పరిమిత ప్రజా ప్రాతినిధ్యంతో మూడేళ్ళజీవితమని యేర్పరుప బడిన శాసనసభ, పదేళ్ళనుంచీ సాగుతూనేవుంది. 1939 లో యుద్ధం ఆరంభమయ్యేనాటికే అది పాతతుక్కు. అప్పటికే రెండేళ్ళ అధికజీవం పోయబడివుంది. ఏఏటా దానిజీవితాన్ని పొడిగించుతూనే వున్నారు. దాని సభ్యులు వృద్ధులూ, మాననీయులూ అయిపోతున్నారు. కొందరు చనిపోయారు. ఎన్నికల స్మృతియే అదృశ్యమైపోయింది. బ్రిటిష్ప్రభుత్వానికి ఎన్నికలంటే యిష్టంలేదు. అవి జీవితక్రమాన్ని చెడగొడతాయి. పరస్పరం కొట్లాడుకునే పక్షాలూ, సిద్ధాంతాలతో భారతదేశచిత్రపటం మసగవేసిపోతుంది. ఎన్నికలులేకుండానే అను గ్రహింపదగిన హోదాగలవ్యక్తికి ప్రాముఖ్యతనివ్వడం సులువుగదూ!

దేశంలో పరిస్థితి విషమించింది. ఏకవ్యక్తి నియంతృత్వంగల రాష్ట్రాలలో మరీ విషమించింది. సామాన్యకార్యకలాపాలకే కాంగ్రెసు వారిని జైళ్ళలో పెడుతున్నారు. పోలీసుల, చిన్న అధికారుల దౌర్జ న్యాలనుండి విముక్తికొరకు రైతులు మొరపెడుతున్నారు. ఆ అధికార వర్గం యుద్ధంపేరుతో అనేకరకాలైన వసూళ్ళుచేస్తూ, పైఅధికారుల ప్రశంసల నందుకుంటున్నారు. ఈపరిస్థితిని ఎదుర్కొనేందుకు ఏదోఒక గట్టిప్రయత్నం చేయడం విధిఅయింది. కాంగ్రెసు 1940 మార్చినెలలో బీహారులోని రాంఘుర్‌లో మౌలానా అబుల్‌కలాం ఆజాద్ అధ్య క్షతను వార్షికమహాసభ జరిపింది. శాసనోల్లంఘనమొక్కటే తరుణో పాయమని తీర్మానించింది. అయినా, అప్పుడే ప్రత్యక్షచర్యకుదిగ కుండా, ప్రజలను అందుకు సిద్ధంకావలసినదిగా కోరింది.

దేశంలో అంతర్గతంగా సంఘర్షణజరుగకతప్పనిపరిస్థితులు గాఢ మవుతున్నట్లు తోచింది. యుద్ధావసరమంటూ 'భారతరక్షణచట్టం' చేయబడి, సాధారణకార్యకలాపాలను కూడా అణచివేయడానికి విరివిగా ఉపయోగింపబడినది. అనేకమంది విచారణలేకుండానే జైళ్లలో నిర్బంధింపబడ్డారు.

డెన్మార్కు, నార్వేలపై హఠాత్తుగా దండయాత్రలుజరుగడం, తరువాత అనతికాలంలోనే ఫ్రాన్సుపతనము యుద్ధప్రకృతిని మరింత భయావహంచేశాయి. సహజంగా ప్రజలలో అనేకరకాల అభిప్రాయాలు యేర్పడ్డాయి. కాని, డన్‌కిర్క్ పతనం, ఇంగ్లండుమీద విమానదాడుల

తర్వాత ప్రజలలో ఆ దేశాలపట్ల గాఢమైనసానుభూతి యేర్పడింది. ఇంగ్లండుస్వాతంత్ర్యమే ప్రమాదపరిస్థితిలో వున్నప్పుడు, అంతకు ముందే నిర్ణయించుకున్నప్పటికీ, కాంగ్రెసు శాసనోల్లంఘనాన్ని గురించి ఏమాత్రం ఆలోచించలేకపోయింది. ఇంగ్లండుకుకలిగినకష్టాలూ, ప్రమాదాలూ భారతదేశానికి సదవకాశాలవంటివని భావించినవారు కొందరు లేకపోలేదు. కాని, కాంగ్రెసునాయకులు ఇంగ్లండు ప్రమాదంలోచిక్కుకొనివున్నప్పుడు దాని నవకాశంగాతీసుకోరాదని స్పష్టంగా ప్రకటించారు. తాత్కాలికంగా శాసనోల్లంఘనమనే ప్రసక్తే మాని వేయబడింది.

బ్రిటిష్‌ప్రభుత్వంతో ఒప్పందంచేసుకోవాలని కాంగ్రెసు మరో సారి ప్రయత్నించింది. క్రిందటిసారి యుద్ధాదర్శాలనుకూడా ప్రకటించాలనికోరగా, యీసారి క్లుప్తంగా భారతదేశాన్నిమాత్రమే దృష్టిలో వుంచబడింది. భారతస్వాతంత్ర్యహక్కును గుర్తించి, కేంద్రంలో ప్రజా ప్రతినిధులపాలనను నెలకొల్పితే చాలు, అన్నిపక్షాలసహకారమూ లభిస్తుందని తెలియజేయబడింది. అప్పుడే బ్రిటిష్‌ప్రభుత్వం నూతన చట్టంచేయవలసిన అవసరంలేదు. అప్పటికివున్న రాజ్యాంగచట్టపరిధి లోనే, వైస్రాయి జాతీయప్రభుత్వాన్ని నెలకొల్పవచ్చునని కాంగ్రెసు సూచించింది. సూచించబడినమార్పులు ఎంతప్రాముఖ్యంగలవైనప్పటికి, పరస్పరాంగీకారంతో, ఆచరణలో నిరూపించుకోవచ్చును. చట్టబద్ధమైనరాజ్యాంగనిబంధనలు యేర్పడవలసిన అవుసరం లేకపోలేదు. కాని వాటిని మరల సాకల్యంగా చర్చించుకునేఅవకాశం లభించినప్పుడు రూపొందించుకోవచ్చును. ఇప్పుడుకావలసినది భారతదేశం కోరుతున్న సంపూర్ణస్వాతంత్ర్యాన్ని ఆమోదిస్తూ ప్రకటించడమే. ఈ షరతుల ననుసరించి యుద్ధానికి సర్వవిధాల సహాయంచేయబడగలదని విశద పరచబడింది.

శ్రీ సి. రాజగోపాలాచారిచేత ప్రతిపాదించబడిన యీ సూచనలు కాంగ్రెసు పలుసార్లు ఉద్ఘాటించిన కోర్కెలతీవ్రతను చాలా తగ్గించాయి. మే మనేకసంవత్సరాలుగా కోరుతున్నదానికంటె యీ కోరికలు తక్కువే. న్యాయశాస్త్రసంబంధమైన ఇబ్బంది ఏమీ లేకుండానే, యీసూచనలను వెంటనే అమలుజరుపవచ్చును. జాతీయప్రభు

త్వంలో అన్నిపక్షాల ప్రతినిధులూ వుండకతప్పదుగనుక, అన్నిపక్షాలకు ఆమోదకరమైనసూచనలే చేయబడ్డాయి. భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వానికిగల విలక్షణపరిస్థితినికూడా మేము ఆలోచించాము. వైస్రాయి పదవిలోనే ఉంటాడు. అతడు జాతీయప్రభుత్వచర్యలను త్రోసిరాజనబోడనిమాత్రం మేము భావించాము. కాని, అతడు ప్రభుత్వాధినేతగా ఉన్నందువల్ల, ఆ ప్రభుత్వంతో సన్నిహితసంబంధాలు కలిగివుంటాడని భావించబడింది. యుద్ధయంత్రాంగమంతా సర్వసైన్యాధ్యక్షునిచేతుల్లోనే వుంటుంది. బ్రిటిష్‌వారునిర్మించిన గజిబిజిపొరపాలనా వ్యవస్థమాత్రం వుండిపోతుంది. ఈ యంత్రాంగంలో నూతనదృక్పథాన్ని నెలకొల్పి, నూతనోత్తేజం, నూతనశక్తులతో నడుపుతూ, దేశాన్నెదుర్కొన్న సమస్యలపరిష్కారానికి, యుద్ధప్రయత్నాలకు పూర్తిప్రజాసహకారాన్ని పెంపొందించటమే ఈ మార్పులప్రధానలక్ష్యం. యుద్ధానంతరం సంపూర్ణస్వాతంత్ర్యంయిస్తామనేప్రకటన, ఈ మార్పులూ ప్రజలలో నూతనమనస్తత్వాన్ని నెలకొల్పి, యుద్ధానికి వారిపూర్తిసహకారాన్ని సంపాదించడానికి దారితీస్తాయి.

లోగడ తానుచేసినప్రకటనలను, తన అనుభవాలను గుర్తుంచుకునికూడా, కాంగ్రెసు యిట్టిప్రతిపాదనలుచేయడం సులభంకాదు. ఈవిధంగా నిర్మింపబడి, పరిమితంచేయబడే జాతీయప్రభుత్వం ఆచరణలో నిరుపయోగము, నీరసము అయిపోతుందని కొందరు భావించారు. కాంగ్రెసువాదులలో చాలమంది తీవ్రంగా వ్యతిరేకించారు. నేనుకూడా ఎంతోకాలం మథనపడినతర్వాతనే అతికష్టంమీద దీనికంగీకరించాను. ముఖ్యంగా, మనం గౌరవప్రదమైన ఒడంబడిక కుదుర్చుకోగలిగితే, ఫేసిజం, నాజిజంలకు వ్యతిరేకంగా పోరాడే సదవకాశం లభిస్తుందనే అంతర్జాతీయదృక్పథంతోనే నేనిందుకంగీకరించాను.

కాని, మా కంతకంటె పెద్దచిక్కే అడ్డుపడింది. గాంధీయే దీన్ని వ్యతిరేకించారు. ఈ వ్యతిరేకతకుకారణం పూర్తిగా ఆయనగారి శాంతి సిద్ధాంతమే. మేము లోగడ యుద్ధప్రయత్నాలలో సహాయపడతామని ప్రతిపాదనలుచేసినప్పుడు ఆయనమనసు బాధపడినప్పటికీ, వ్యతిరేకత ప్రకటించలేదు. యుద్ధారంభంలోనే, కాంగ్రెసు నైతికసహాయంమాత్రమే చేస్తుందని ఆయన వైస్రాయితో చెప్పారు. కాని, పదేపదేచేసిన ప్రక

టనలనుబట్టి కాంగెసు ఆ స్థితిలో లేదు. ఇప్పుడుమాత్రం కాంగ్రెసు హింసాపూరితమైన యుద్ధప్రయత్నాలకు బాధ్యతతీసుకోవడం తనకిష్టం లేదని గాంధీ వ్యతిరేకించాడు. ఈసమస్యమీదనే ఆయన తనసహచరు లతో తీవ్రంగా భేదించి, కాంగ్రెసుసంస్థనుండి వైదొలిగాడు. నేటికాం గ్రెసు దాదాపు ఆయనసృష్టించినదేకావడంవల్ల యీ ఎడబాటుకు సహచరు లెంతో బాధపడ్డారు. ఏమైనప్పటికి, యుద్ధప్రయోజనాలకు ఆయన అహింసాతత్వాన్ని అన్వయించడానికి కాంగ్రెసు యిష్టపడలేదు. బ్రిటిష్‌ప్రభుత్వంతో యేదోఒక ఒడంబడికకు రావాలనేకాంక్ష బలీయం కావడంవల్ల, కాంగ్రెసు తన ప్రియతమనాయకుని విడచిపుచ్చేందుకు కూడా సిద్ధపడింది.

దేశంలో పరిస్థితి అనేకరకాలుగా దిగజారిపోతున్నది. రాజకీయ రంగంలో యిది స్పష్టంగానే కనుపించింది. యుద్ధపరిస్థితులవల్ల కొందరు రైతులు, శ్రామికులపని కొంతమెరుగైనప్పటికి. ఎక్కువమంది ఆర్థి కంగా చితికిపోతున్నారు. వాస్తవంగా వృద్ధిపొందుతున్నవారు పెద్దవ్యా పారులూ, కంట్రాక్టర్లూ, దొంగనిల్వలవారూ, యుద్ధకార్యక్రమం పేరుతో పెద్దపెద్ద జీతాలు పొందుతున్న అధికారులు ముఖ్యంగా బ్రిటి ష్‌వారుమాత్రమే. అధికలాభాలను ప్రోత్సహించితే, యుద్ధప్రయత్నా లకు ఎక్కువసహకారం లభిస్తుందని బ్రిటిష్‌ప్రభుత్వం విశ్వసించింది. అవి నీతి, లంచగొండితనం పెచ్చుమీరాయి. వాటిని అరికట్టడానికి సరియైన విధానమేదీ లేదు. బహిరంగవిమర్శ యుద్ధప్రయత్నాన్ని నిరుత్సాహ పరుస్తుందిగనుక, అట్టి విమర్శకులను "భారతరక్షణచట్ట" మనే సర్వాం తర్యామివంటి శాసనంక్రింద జైళ్ళలో పెట్టసాగారు. ఇది చాల నిరుత్సా హకరమైనదృశ్యం.

ఈ పరిస్థితులన్నీ, మేము బ్రిటిష్‌ప్రభుత్వంతో ఒడంబడికచేసు కునేందుకు శాయశక్తులా ప్రయత్నించేట్లు చేశాయి. ఉన్న అవకాశా లేమిటి? అవైనా అంత ఆశాజనకంగాలేవు. శాశ్వతప్రభుత్వయంత్రాంగం రెండుతరాలుగా లేని విశేషస్వేచ్ఛను అనుభవిస్తోంది. ఒకరిఅదుపుగాని విమర్శగాని లేకుండాపోయింది. తమకునచ్చని ఏవ్యక్తినైనాసరే న్యాయ విచారణతంతు జరిపిగాని, జరపకుండాగాని జైళ్ళలో త్రోక్కివేయ వచ్చు. గవర్నరులకు విశాలమైన రాష్ట్రాలమీద అదుపులేని నిరంకు

శాధికారాలు సంక్రమించాయి. పరిస్థితులు ప్రత్యేకంగా వత్తిడిచేస్తే తప్ప, వారు మార్పు కెందు కంగీకరిస్తారు? సామ్రాజ్యవాదయంత్రాంగ శిఖరాన, ఆ ఉన్నతికితగిన డాబు, దర్పం, హుందాలతో సహా వైస్రాయి లార్డ్ లిన్‌లిత్‌గో పీఠంవేసుకుకూర్చున్నాడు. ఆయనకు సనాతనసాంప్రదాయాల బ్రిటిష్‌రాజవంశీకులకుండే లోటుపాట్లు అన్నీ వున్నాయి. శరీరం బొద్దు, మేధ మందం. వ్యక్తిత్వం పాషాణసదృశం. రాతికివలెనే ఎటుక లేదు. ఇప్పు డేర్పడిన క్లిష్టపరిస్థితినుండి బైటపడేం దుకు ఆయన చిత్తశుద్ధితో, కార్యదీక్షతో ప్రయత్నించాడు. కాని, ఆయనపరిమితులు లెక్కలేనన్ని. ఆయనమేధ పాతబరవడిలోనే తిరు గుతూ, కొత్తమార్గం చూచేసరికి భయంతో కుంచించుకుపోయింది. ఆయన పుట్టిన పాలకవర్గసాంప్రదాయాలు ఆయనదృష్టిని సంకుచితం చేశాయి సివిల్‌సర్వీసు అధికారులు, తనచుట్టూవున్నవాళ్ళూమాత్రమే ఆయనకు కళ్ళూ, చెవులూను, ప్రాథమికరాజకీయ, సాంఘికమార్పులు రావాలనేవారంటే ఆయనకు అపనమ్మకం. బ్రిటిష్‌సామ్రాజ్యమూ, దానితరఫున ఇండియాలోవున్న ఉన్నతప్రతినిధీ నిర్వర్తిస్తున్న ఉత్తమ పుణ్యకార్యాన్ని సరిగా అభినందించలేనివాళ్ళంటే ఆయనకుతగనిమంట.

జర్మనులు పశ్చిమయూరపుమీద మెరుపుయుద్ధం జరుపుతున్న కాలంలో ఇంగ్లండులో పెద్ద మార్పువచ్చింది. నెవిలే ఛాంబర్లేన్ నిష్క్రమించాడు. అనేకవిధాలుగా అదెంతో వెసులుబాటు కల్పిం చింది. మార్క్విస్ ఆఫ్ జెట్లండ్ తనవంశానికే మణిపూసవంటివాడైనా ఒక్కకన్నీటిచుక్కైనా రాల్చనవసరంలేకుండా బ్రిటిష్‌ప్రభుత్వపు భారత కార్యాలయకార్యదర్శిపదవినుంచి వైదొలిగాడు. ఆయనస్థానంలో అమెరీ వచ్చాడు. ఈయన్నుగురించి తెలిసినది కొద్దే అయినా, ఆ కాస్త గణనీయమైందే. జపాను చైనాపై దురాక్రమణ జరపడాన్ని యీాయన కామన్స్ సభలో సమర్థించాడు. చైనాలో జపానుచేసినపనిని ఖండించినట్లయితే, బ్రిటన్ భారతదేశంలోనూ, ఈజిప్టులోనూ చేసిన పనులుకూడా ఖండించవలసివస్తుందని యీాయన వాదించాడు. ఈపటిష్ఠ మైన వాదన స్వీకరింపబడి దుర్మార్గులను సమర్థించేందుకు ఉపయోగించ బడింది.

అసలు గణనీయమైన వ్యక్తి నూతన ప్రధాని చర్చిల్. భారత స్వాతంత్ర్యాన్ని గుఱ్ఱించిన చర్చిల్ అభిప్రాయాలు స్పష్టమే. అవి అనేక సార్లు ప్రకటింపబడ్డాయి. ఆ స్వాతంత్ర్యానికి రాజీధోరణియేలేని వ్యతిరేకిగా ఆయన పేరొందాడు. 1930 జనవరిలో ఆయన ఇలా చెప్పాడు "గాంధీని, కాంగ్రెసునూ, వారిలక్ష్యాన్ని నేడుగాకపోతే రేపైనా మట్టుబెట్టకతప్పదు." అదేసంవత్సరం డిశెంబరులో "భారతీయ జీవితాన్ని, పురోగమనాన్ని అదుపులోపెట్టుకొనే అధికారాన్ని వదలుకొనే ఆలోచన బ్రిటిష్‌జాతికి ఏకోశానా లేదు ... భారతదేశం బ్రిటిష్‌చక్రవర్తికిరీటంలో దివ్యకాంతులు తేజరిల్లే అమూల్య రత్నం. బ్రిటిష్‌సామ్రాజ్యంలోని ఇతర డొమినియనులు, వలసరాజ్యాలన్నింటికంటె అదే మా సామ్రాజ్యవైభవాన్నీ, బలాన్నీ ద్యోతకంచేస్తున్నది. అట్టి అమూల్యరత్నాన్ని పోగొట్టుకునే వుద్దేశం మాకులేదు" అన్నాడు.

ఆతరువాత 1931 జనవరిలో "అధినివేశప్రతిపత్తి" అనే మాటలకు (ఇవి మనపట్ల అనేకసార్లు ఉపయోగింపబడ్డాయి) భారతదేశానికి అన్వయించే అర్థమేమిటోకూడా చర్చిల్ వివరించాడు. "మేము 'అధినివేశప్రతిపత్తి'నే చివరిలక్ష్యంగా ధ్యానంలోవుంచుకున్నాము. కాని, యుద్ధకాలంలో భారతదేశప్రతినిధులు లాంఛనప్రాయంగా యుద్ధసమావేశాలకు హాజరవడంమాత్రమేనని ఎవరూ వూహించివుండరు. మేము ఉచితసమయమనీ, మాకుప్రయోజనకరమనీ ముందుగా గ్రహించగలిగినప్పుడే యీ సూత్రాన్నీ, విధానాన్నీ భారతదేశానికి వర్తింపచేస్తాము" మళ్ళీ అదేసంవత్సరం డిశెంబరులో యింకా వివరంగా చెప్పాడు: "అగ్రశ్రేణినాయకుల్లోఅనేకమంది - వారిలో నేనూ ఒకణ్ణి - అధినివేశప్రతిపత్తినిగురించి ఉపన్యాసాలిచ్చేవారు (నేనూ యిచ్చాను). కాని, నేటికెనడాలోవున్న రాజ్యాంగహక్కులూ, విధానమూ ఏనాటికైనా భారతదేశంలో నెలకొనగలవని నేనెన్నడూ ఆలోచించలేదు...... ఇంగ్లండు ఇండియాలో తన సామ్రాజ్యం లేకపోతే ఇక అగ్రరాజ్యంగా పరిగణించబడడం కల్ల."

అసలు కీలకం అదీ! ఇండియాయే సామ్రాజ్యం. దాన్ని ఆక్రమించుకొని, దోచుకోవడంవల్లనే ఇంగ్లండుకు పుష్టి, ప్రాభవమూ

యేర్పడి, అగ్రరాజ్యమైకూర్చుంది. చర్చిల్‌దృష్టిలో విశాలసామ్రాజ్యమూ, దానిపైఅధికారంలేనిఇంగ్లండు లేవు. అదేవిధంగా స్వతంత్ర భారతదేశాన్ని ఆయన చూడలేడు. చేతులకందిస్తున్నట్లుగా ఆశపెట్ట బడుతున్న అధినివేశప్రతిపత్తిలో వాగాడంబరమూ, లాంఛనప్రాయపుతతంగాలూ తప్ప, అధికారము, స్వాతంత్ర్యమనేవి లేనేలేవని కూడా స్పష్టమయింది. వాస్తవంగా పరిపూర్ణార్థంగలఅధినివేశప్రతిపత్తిని కూడా మేము నిరాకరించాము. స్వతంత్రాన్నే మేము కోరాము. చర్చిల్‌కూ మాకూ మధ్యగల అగాధం అమితమైనది.

ఆయనమాటలు మేము గుర్తుతెచ్చుకున్నాం. ఆయన వలయాకారుడనీ, రాజీదృష్టిరహితుడనీకూడా మరచిపోలేదు. అతనిఆధ్వర్యంలో గల ఇంగ్లండునుంచి మే మాశించేదేమీ వుండదు. ధైర్యసాహసాలూ, సుగుణాలు మిక్కుటంగాగలవాడైనప్పటికి, అతడు 19వ శతాబ్దినాటి సనాతనబ్రిటిష్‌సామ్రాజ్యవాదానికే ప్రతినిధి. క్లిష్టసమస్యలు, సంక్లిష్టమైన శక్తులుగల నూతనప్రపంచాన్నిగాని, రూపొందుతున్న భావిప్రపంచాన్నిగాని ఆయన అర్థంచేసుకోలేడనిపించింది. అయినప్పటికి ఆయన గొప్పవాడు. ఉన్నతచర్యతీసుకోగలవాడు. అత్యంతప్రమాదకరపరిస్థితిలో ఇంగ్లండును ఫ్రాన్సుతో కలిపి సంయుక్తరాజ్యాన్ని యేర్పరుద్దామని ఆయనచేసినసూచన ఆయనదూరదృష్టినీ, పరిస్థితులకనుగుణంగా తన భావాలనుమార్చుకోగల చాకచక్యాన్నీ నిరూపించింది. అది భారత దేశాన్ని ఎంతో సంచలింపజేసింది. బహుశా అత డిప్పుడు ఆక్రమించిన ఉన్నతపదవీ, దాని అసాధారణబాధ్యతలూ అతనిదృక్పథాన్ని విస్తృతం చేశాయేమో! అత డందువల్ల పూర్వపు సంకుచితభావాలను, చిలిపి విశ్వాసాలనూ అధిగమించినవ్యక్తి అయ్యాడేమో! యుద్ధావసరాలే అతనికి అతిముఖ్యసమస్యలుకనుక, యుద్ధావసరాలదృష్ట్యానైనా భారత దేశానికి స్వాతంత్ర్యమీయకతప్పదనీ, తనప్రయోజనాలదృష్ట్యా 'అవసరం' అనీ భావిస్తాడేమో! 1935 ఆగష్టులో నేను చైనాకు వెళ్ళేటప్పుడు మాకిద్దరికీ మిత్రుడైన ఒకరిద్వారా, నేను యుద్ధంవల్ల ఛిన్నాభిన్నమైన చైనాకు వెళుతున్నందుకు శుభాకాంక్షలు తెలుపుతూ చర్చిల్ ఒకసందేశం పంపించినసంగతి గుర్తువచ్చింది.

అందువల్ల, మేము చివరిసారిగా పెద్దగా ఆశించి, క్రొత్తప్రతిపాదన చేయకపోయినా అది పూర్తినిరాశతోమాత్రం కాదు. త్వరలోనే బ్రిటిష్‌వారిసమాధానం వచ్చింది. అది పూర్తితిరస్కారమే. పైగా, వారు భారతదేశంమీదిఅధికారాన్ని వదలుకోబోరనీ, మా దేశంలో విభేదాలను రెచ్చగొట్టి, మధ్యయుగాలనాటిమన సత్వశక్తులను ప్రోత్స హించేందుకే మొగ్గివున్నారనీ, ఆ సమాధానంలో స్పష్టపడింది. వారు తమసామ్రాజ్యాధికారాలను తగ్గించుకోవడంకంటె, అంతఃకల్లోలాన్ని సృష్టించడమే మంచిదని అభిప్రాయపడుతున్నట్లు విశదమయింది.

ఇట్టి తిరస్కారాలు మాకు అలవాటేఅయినప్పటికీ, ఈ సమాధానం పెద్ద ఆఘాతంవలె తగిలింది. నిరాశ మితిమీరింది; నేను అప్పుడే వ్రాసిన ఒకవ్యాసానికి "మార్గాలచీలిక" అనే శీర్షికపెట్టినట్లు నాకు బాగా గుర్తు. నేను చిరకాలంగా సంపూర్ణస్వాతంత్ర్యం కోరుతున్న వాడను. ఆవిధంగా తప్ప దేశం అభివృద్ధిచెందదనీ, ఇతరదేశాలతో, ముఖ్యంగా ఇంగ్లండుతో సహకారసంబంధాలు నెరవుకోలేదనీ విశ్వ సించేవాణ్ణి. ఇప్పుడు హఠాత్తుగా ఆ భావం మారిపోయింది. ఇంగ్లండు పూర్తిగా మారిపోతేనేతప్ప, మా మార్గాలు కలియబోవనిపించింది. మేము వేర్వేరుమార్గాల ననుసరించకతప్పదు.

## ౫ వ్యక్తిసత్యాగ్రహం

స్వతంత్రులమనేభావాన్ని కల్పించి, సంతోషపరవశుల్ని చేసి, జాతియొక్క సర్వశక్తులను ప్రపంచసంఘర్షణలో కేంద్రీకరింపజేయు టకుబదులు, వారు మాకు స్వాతంత్ర్యాన్ని నిరాకరించారనే బాధాకరమైన నిరాశాసంతప్తహృదయులను చేశారు. తిరస్కారంతోపాటు అహంభావంతోకూడినమాటలూ, బ్రిటిష్‌ప్రభుత్వపాలనావిధానాలను గురించి స్వోత్కర్ష వర్షించారు. భారతదేశానికి స్వాతంత్ర్యంకావాలంటే ఫలానా ఫలానాపరిస్థితులు — అందులో అనేకం అసంభవమైనవే — యేర్పడాలని సవాలతోమరతులుకూడా ఏకరువుపెట్టారు. ఇంగ్లండులో పార్లమెంటులో జరుగుతున్న యీ ప్రకటనలూ, చర్చలూ వట్టి వాగాడంబరాలు మాత్రమేనని స్పష్టమయింది. తమకు సాధ్యమైనంతకాలం భారతదేశాన్ని తమయినుపపిడికిలిలో బిగించివుంచుకోవాలనేభావాన్ని

కప్పిపుచ్చడానికే యీ రాజకీయచమత్కారాలముసుగు అని కూడా తేలిపోయింది. భారతదేశపుసజీవశరీరంలో, బ్రిటిష్‌సామ్రాజ్యవాదపు పంజాగోళ్ళు ఇంకా లోతుకు పాతుకుపోతాయి. బ్రిటన్ తాను నూతన ప్రపంచవ్యవస్థాపనకోసమే యుద్ధంచేస్తున్నానని ప్రకటిస్తున్న దాని స్వాతంత్ర్యాదర్శానికిది ప్రమాణం.

మరొక గణనీయమైన ఉదాహరణకూడా ఉంది: యుద్ధానంతరం అధినివేశప్రతిపత్తి నిస్తామని ప్రకటించమని బర్మా కోరింది. ఇది పసిఫిక్ యుద్ధం ఆరంభంకాకముందే - పైగా, యుద్ధప్రయత్నాలకు ఏమాత్రం ఆటంకంలేకుండా, యుద్ధానంతరమే అర్ధస్వాతంత్ర్యం మాత్రమే యివ్వమన్నారు. ఇండియాలోవలెనే బర్మాలోకూడా అధినివేశప్రతిపత్తియే తమలక్ష్యమని బ్రిటన్ అనేకసార్లు ప్రకటించింది. ఇండియావిషయంలో బ్రిటన్ ప్రకటించిన వాస్తవమైన, వూహాభ్యంతరాలు బర్మావిషయంలో లేవు. అది ఏకగ్రీవంగా కోరినకోరికనుకూడా తిరస్కరించారు. అధినివేశప్రతిపత్తి యికముందెప్పుడో - మన తరానికిగాని, మనప్రపంచానికిగాని వర్తించని వూహామాత్రమైన లక్ష్యంగా - ఏ ఇతరలోకానికో వర్తించేది మాత్రమే. విన్‌స్టన్ చర్చిల్ సూచించినట్లు అవి బోలుమాటలూ, లాంఛనప్రాయమూ మాత్రమే. ఈకాలానికీ, ఈప్రపంచానికీ వర్తించవు. అదేవిధంగా, ఇండియా స్వాతంత్ర్యంవిషయంలో చేసిన ప్రకటనలలోని అభ్యంతరాలు, అర్థంలేనిషరతులు కూడా వాగాడంబరాలేగాని, అర్థవంతంకావని అందరికీ తెలిసిపోయింది. వాస్తవమైనవిషయాలు రెండేరెండు. భారతదేశాన్ని ఏవిధంగానైనాసరే తనపిడికిలిలోనే వుంచుకోవాలని బ్రిటన్‌తాపత్రయం. ఆ పిడికిలిని భగ్నంచెయ్యాలని భారతదేశసంకల్పం. మిగతామాటలన్నీ న్యాయవాదులతర్కాలూ, రాజకీయచమత్కారాలూ మాత్రమే. పరస్పరవిరుద్ధమైన ఈ రెండుశక్తులమధ్య జరుగుతున్నసంఘర్షణఫలితాన్ని భవిష్యత్తుమాత్రమే నిర్ణయించగలదు.

ఆ భవిష్యత్తు బర్మాలో బ్రిటన్‌విధానాన్ని త్వరలోనే రుజువుచేసింది. ఆ భవిష్యత్తు ఇండియాలోను క్రమంగా ద్యోతకంకాజొచ్చినది. అది సంఘర్షణలను, విద్వేషభావాలను, అష్టకష్టాలను మోసుకొచ్చింది.

బ్రిటిష్ ప్రభుత్వం దురహంకారంతో చేసిన తిరస్కారాన్ని సహించి, భారత దేశంలో జరుగుతున్న సంఘటనలను చూస్తూ వూరుకోవడం అసంభవమైపోయింది. ప్రమాదభరితమైనయుద్ధంలో చిక్కుకున్న బ్రిటన్, ప్రపంచప్రజలందరు స్వాతంత్ర్యపరిరక్షణపై విశ్వాసంతో మహత్తరత్యాగాలుచేస్తున్నపరిస్థితిలో కూడా యిట్టిదృక్పథాన్ని అవలంబించిందంటే, యీ ప్రమాదమూ, ప్రజాఘోషా తగ్గిపోయినతర్వాత ప్రభుత్వదృక్పథం ఎలావుంటుంది? ఈలోగా భారతదేశమంతటా మా ప్రజలను ఏరివేసి జైళ్ళలోపెడుతున్నారు. ప్రజల దైనందినకార్యక్రమాలలోకూడ అడ్డంకులు సృష్టిస్తున్నారు. బ్రిటిష్ప్రభుత్వం భారత దేశంలో జాతీయ, కార్మికోద్యమాలమీద ఎప్పుడూ యుద్ధంచేస్తూనేవున్నదనీ, అది సత్యాగ్రహం మున్నగు చర్యలులేకపోయినా, తన యుద్ధంమాత్రం మానదనీ మనం గుర్తుంచుకోవాలి. ఆ యుద్ధం ఒక్కొకసారి విజృంభించి, అన్నిముఖాలా దాడిచేయవచ్చు; మరొకసారి కొంత మందంగా సాగవచ్చు; కాని, నిరంతరం జరుగుతూనేవుంటుందిగాని, ఆగడమనేది లేదు. రాష్ట్రాలలో కాంగ్రెసుపాలన నెలకొన్నకాలంలో అది కొంచెం విశ్రాంతితీసుకున్నది. మంత్రివర్గాలు రాజీనామాలివ్వగానే మరల పంజా విప్పింది. ప్రఖ్యాతకాంగ్రెసువాదులను, శాసనసభ్యులను జైళ్ళలో పెట్టడానికి, వారిమీద యితరనిర్బంధాలు విధించడానికి అధికారబృందం సరదాపడుతుంది.

ఒక్కొకసారి ఏ చర్య తీసుకోకపోవడమే శక్తిహీనంగా పరిగణింపబడుతుంది. కనుక, మే మేదో ఒక ప్రత్యక్షచర్యతీసుకోక తప్పదనిపించింది. ఆ చర్య మా విధానాన్ననుసరించి సత్యాగ్రహరూపంలోనే ఉండాలి. కాని, ప్రజాందోళనలు కల్లోలానికి దారితీయరాదనేజాగ్రత్తతో వ్యక్తులు కొందరుమాత్రమే సత్యాగ్రహంచేయాలని నిశ్చయించాము. ఇది మామూలుప్రజాసత్యాగ్రహం కాదు, వ్యక్తిసత్యాగ్రహం. ఇది వాస్తవానికి ఒక మహత్తర నైతికనిరసన తెలియజేయడంవంటిది రాజకీయవాదులదృష్టిలో, మేము అధికారయంత్రానికి ఏమాత్రం ఆటంకంలేకుండాప్రవర్తించి, సత్యాగ్రహుల్ని తేలికగా జైళ్ళలోపెట్టే వెసులుబాటు కల్పిస్తున్నామని చులకనభావం కలుగుతోంది. ప్రపంచంలో మరెక్కడా తీవ్ర రాజకీయచర్యలు

గాని, విప్లవాలుగాని యీధోరణిలో జరుగలేదు. కాని, గాంధీజీ విప్లవరాజకీయాలతో నైతికసూత్రాలను మేళవింపజేసేపద్ధతి యిదే. అట్టిఉద్యమం ఏది జరుగవలసిఉన్నా తప్పనిసరిగా ఆయనే నాయకుడౌతాడు. మేము బ్రిటిష్‌విధానానికి తలొగ్గకుండా, స్వయంగా మాకుమేమే అష్టకష్టాలను కౌగిలించుకుంటూ, మా నిరసననూ, మా దృఢసంకల్పాన్నీ వెలిబుచ్చడానికి, గాంధీజీ అవలంబించేవిధానం యిదే. మా ఉద్దేశం కల్లోలాన్నిసృష్టించడంకాదని కూడా యీపద్ధతి నిరూపిస్తుంది.

ఈ వ్యక్తిసత్యాగ్రహం అల్పస్థాయిలో ఆరంభమయింది. ప్రతి వ్యక్తి కొన్నిపరీక్షలలో నెగ్గి, సత్యాగ్రహంచేసేందుకు అనుమతి పొందాలి. అలా ఎన్నుకోబడినవ్యక్తులు ముందుగా అధికారులకు తెలియజేసి, ఏదోఒక సాధారణశాసనాన్ని మాటలలో ధిక్కరించాలి. వారిని ప్రభుత్వం నిర్బంధించి, కారాగారశిక్షలు విధిస్తుంది మా అలవాటు ప్రకారం కాంగ్రెసుకార్యవర్గమూ, మాజీమంత్రులూ, శాసనసభ్యులూ, కేంద్ర-రాష్ట్రకాంగ్రెసుసంఘాలసభ్యులూ, పెద్దనాయకులూ ముందుగా కార్యరంగంలోకి దూకారు. క్రమంగా యీ ఉద్యమం విస్తృతమై, 25 నుండి 30 వేలమందివరకు జైళ్ళకు వెళ్ళారు. వీరిలో ప్రభుత్వం నిరవధికంగా వాయిదా వేసిన శాసనసభల అధ్యక్షులూ, సభ్యులూ కూడా వున్నారు. మా ప్రజాప్రతినిధులతోకూడిన శాసనసభలు అధికారయుతంగా పనిచేసే వీలులేకపోతే, వారు నిరంకుశాధికారానికి తలొగ్గరనీ, అంతకంటె జైళ్ళే సుఖంగాయెంచుతారనీ మేము ఈ చర్యద్వారా ప్రపంచానికి చాటాము.

వ్యక్తిసత్యాగ్రహంచేసినవారేగాక, ఉపన్యాసాలిచ్చినందుకు, సాధారణప్రదర్శనలలో పాల్గొన్నందుకూ మరి అనేకమంది నిర్బంధింపబడ్డారు. విచారణతంతు లేకుండానే కొందరిని జైళ్ళలోవుంచారు. ఈ సత్యాగ్రహం తొలిదశలోనే నేనొక ఉపన్యాసంయిచ్చినందుకు నాకు నాలుగేండ్ల జైలుశిక్ష విధించారు.

1941 అక్టోబరునుంచి దాదాపు సంవత్సరకాలం వీరందరూ జైళ్ళలో ఉన్నారు. జైళ్ళలోఉండగా మాకు లభించినవార్తలతోనే యుద్ధాన్నిగురించీ, భారతదేశంలోజరుగుతున్న సంఘటనలనుగురించీ

తెలుసుకునేవాళ్ళం. అమెరికాఅధ్యక్షుడు రూజ్‌వెల్టు చేసిన "చతుస్స్వాతంత్ర్య" ప్రకటనను చదివాము. అట్లాంటిక్ పథకాన్నీ, ఆవెంటనే అది భారతదేశానికి వర్తించదన్న చర్చిల్ వ్యాఖ్యానాన్నీ చదివాము.

1941 జూన్‌లో హిట్లర్ హఠాత్తుగా రష్యామీద దండెత్తడం చదివి, చకితులమైనాము. యుద్ధపరిస్థితులహఠాత్పరిణామాలను ఆతురతతో గమనించసాగాము.

1941 డిశెంబరు 4వతేదీని మాలో అనేకమందిని విడుదల చేశారు. తర్వాత మూడురోజులకే పెరల్‌హార్బర్ దాడి, పసిఫిక్ యుద్ధం ఆరంభమయ్యాయి.

## ౬ పెరల్‌హార్బర్ అనంతరం - గాంధీజీ, అహింస

మేము జైళ్ళనుంచి విడుదలయ్యేసరికి జాతీయసమస్య-(ఇంగ్లండ్ ఇండియాలవివాదం) - యథాతథంగానే వుంది. జైలుజీవితం ప్రజలను ఎంతో మార్చివేస్తుంది. కొందరు మానసికంగాను, శారీరకంగాను బలహీనులైపోతారు. కొందరు తమవిశ్వాసాలను మరింత దృఢతరం చేసుకుంటారు. ఈ చివరితరహావారిప్రభావమే ప్రజాసామాన్యం మీద యెక్కువప్రభావాన్ని ప్రసరిస్తుంది. జాతీయంగా మేము యథాస్థానంలోనే వుండిపోయినా, పెరల్‌హార్బర్ హఠాత్తుగా ధ్వంసంకావడం, తరువాత జరిగిన విషాదకరసంఘటనలూ మాలో ఒక ఉద్వేగాన్ని సృష్టించి, నూతనదృక్పథాన్ని యేర్పరిచాయి. వెంటనే ఈ నూతన ఉద్వేగవాతావరణంలో కాంగ్రెసుకార్యవర్గం సమావేశమయింది. అప్పటికి జపాన్ పెద్దగా దురాక్రమణలు జరుపలేదు గాని, ముఖ్యమైన, నిర్విణ్ణులనుచేసేసంఘటనలెన్నో జరిగాయి. యుద్ధం ఏదో దూరదృశ్యవిశేషంగా వుండిపోక, భారతదేశానికి చేరువఅవుతూ, సన్నిహిత ప్రమాదాలు తేనారంభించింది. కాంగ్రెసువారిలో అనేకులు ఈ ప్రమాదభరిత పరిణామాల నెదుర్కోవడంలో ప్రముఖపాత్రవహించాలని తహతహలాడుతున్నారు. ఈ పరిస్థితుల్లో జైళ్ళకువెళ్ళడం అర్థంలేనిపని అనిపించింది. కాని గౌరవమైనసహకారానికి మార్గం తెరువబడనిదే, ప్రజలు ఉత్సాహంతో సహకరించేందుకు ప్రత్యక్ష ఉత్తేజం కల్పించనిదే మే

మేంచేయగలం? ఏదో ఘోరప్రమాదం ముంచుకొస్తున్నదని చెప్పి భయపెడితే చాలదు.

గతచరిత్ర, జరిగిన విశేషాలు ఎలాంటివైనా, మేము యుద్ధంలో పూర్తిగా సహకరించాలని కాంక్షించాం. ప్రత్యేకంగా భారతదేశరక్షణకు పాటుపడాలని తహతహలాడాం. అయితే జాతీయప్రభుత్వం యేర్పడితేనే దేశంలోని తదితరశక్తులసహకారం లభిస్తుందనీ, మమ్మల్ని బానిసలుగాచేసుకున్న విదేశీయులు బలవంతంగా తలపైరుద్దినదికాక, ఇది వాస్తవంగా జాతీయకృషియేనని ప్రజలు విశ్వసించగలరనీ స్పష్టంచేశాం. ఈ ముఖ్యవిషయంమీద కాంగ్రెసువారిలోగాని, ఇతర జాతీయశక్తులలోగాని భేదాభిప్రాయమే లేకుండాపోయింది. కాని వూహించని మరో ప్రముఖవిభేదం తలెత్తింది. విదేశీయుద్ధంలోనైనాసరే తన అహింసాసూత్రాన్ని అనువర్తింపజేయకుండావుండలేనని గాంధీజీ పట్టుబట్టాడు. ఆ యుద్ధం మరీ దగ్గరవడంవల్ల, తన విశ్వాసాన్ని పరీక్షించేందుకు యిదే సవాలువంటిదని ఆయన అభిప్రాయపడ్డాడు. ఈ క్లిష్టసమయంలో తాను వెనుకంజవేస్తే, అహింసయే సర్వశిరోధార్యమైన ప్రాథమిక ఆచరణ కాగలదని తాను విశ్వసించినదంతా అబద్ధంకావాలి. లేకపోతే తాను దాన్ని విసర్జించడం, లేదా రాజీపడడం తప్పవుతుంది. గాంధీజీ తన జీవితకాలమంతా ఏ సిద్ధాంతాచరణకై వినియోగించాడో ఆ అహింసాసూత్రాన్ని విడనాడలేకపోయాడు. ఆ అహింసాసిద్ధాంతాచరణఫలితాలనూ, అందువల్ల రాగలప్రమాదాలనూ తాను భరించవలసినదేనని నిశ్చయించుకున్నాడు.

మొట్టమొదటగా 1938 లో మ్యూనిచ్ సంఘటనలసందర్భంలో యుద్ధం ముంచుకొస్తోందని తోచినప్పుడుకూడా యిటువంటి సందిగ్ధమే తలెత్తింది. నేనప్పుడు యూరపులోవున్నందున, అప్పుడుజరిగినకార్యవర్గచర్చల్లో పాల్గొనలేదు. కాని సందిగ్ధస్థితి, యుద్ధమూ తప్పిపోయినందున, ఆ ప్రమాదంకూడా తప్పిపోయింది. 1939 సెప్టెంబరులో, నిజంగానే యుద్ధం ఆరంభమైనప్పుడు అట్టి క్లిష్టసమస్య తలెత్తనేలేదు. 1940 వేసంగిలో మాత్రమే తాను యుద్ధకాలంలోనైనా అహింసాసూత్రాన్ని విడనాడలేననీ, కాంగ్రెసుకూడా అలాగే ప్రవర్తించాలనీ గాంధిజీ స్పష్టంచేశాడు. ఆయన యుద్ధానికి నైతికంగాను, ఇతర

విధాల సహాయంచేయడానికి సిద్ధంగానే వున్నాడు. సాయుధ, రక్తపాత పూరితమైన యుద్ధచర్యల్లోమాత్రం సాయపడబోనన్నాడు. స్వతంత్ర భారత దేశంకూడా అహింసాసిద్ధాంతాన్నే అనుసరిస్తుందని స్పష్టంచేయ మని కాంగ్రెసును కోరాడు. దేశంలో అనేకులు, కాంగ్రెసులో కొం దరూ 'అహింస' పట్ల అంత విశ్వాసంతో లేరని ఆయనకు తెలుసు. స్వతంత్రభారత దేశం దేశరక్షణసమస్య ఉత్పన్నమైనప్పుడు అహింసా తత్వాన్ని విడనాడుతుందనీ, సైనిక, నౌకా, విమానబలాలను పెంపొం దించుకోగలదనికూడా గాంధీకి తెలుసు. కనీసం కాంగ్రెసుసంస్థయినా అహింసాపతాకాన్ని దిగజార్చకుండా దృఢంగా నిలబెట్టాలని ఆయన వాంఛించాడు. ఆవిధంగా ప్రజలను తరిఫీతుచేసి, వారు శాంతియుత పద్ధతులనుమాత్రమే సర్వదాఅనుసరించేటట్లుచెయ్యాలని ఆయనకాంక్ష. భారత దేశం సైనికకూటమికావడాన్ని వూహించితేనే ఆయన భయంతో వణికిపోయేవాడు. భారత దేశం అహింసాసూత్రాలన్నీ అనుసరించే ఆదర్శ చిహ్నంగా రూపొంది, మిగతాప్రపంచాన్నుంచి దౌర్జన్యపద్ధతులు, యుద్ధవిధానాలు తొలగించబడేటట్లుచూడాలని ఆయన కలలుగన్నాడు. భారత దేశం మొత్తంగా యీ సూత్రాన్ని అంగీకరించకపోతే, కనీసం కాంగ్రెసుసంస్థయినా పరీక్షాసమయంలో దాన్ని విసర్జించరాదని ఆయనవిశ్వాసం.

మా స్వాతంత్ర్యపోరాటంలోను, జాతీయైక్యతనుసాధించడం లోను యిదేసూత్రాన్ని అనుసరించాలని కాంగ్రెసు ఏనాడో ఆమో దించింది. ఆపరిస్థితులనుదాటి దేశరక్షణావసరాలకై విదేశీయుల నెదు ర్కోవలసివచ్చినప్పుడు యీసూత్రాన్నే వర్తింపజేయాలని ఎన్నడూ అనలేదు. వాస్తవానికి భారతీయసైన్యం పెంపొందాలనీ, దానిఅధికార వర్గంలో భారతీయులే నియమింపబడాలనీ కాంగ్రెసు పట్టుదలతో ఎంతో ఆందోళనచేసింది. ఈవిషయంలో కేంద్రశాసనసభలోని కాం గ్రెసుపక్షం అనేకసార్లు తీర్మానాలు ప్రతిపాదించడం, విరివిగా చర్చల్లో పాల్గొనడం జరిగింది. 1920 తరువాత ఆ పక్షానికి నాయకుడుగా వున్న మాతండ్రి 'స్కీన్' సంఘంలో సభ్యుడుగా చేరాడు. భారతీయ సైన్యాన్నిపునర్వ్యవస్థీకరించి, భారతీయులనే అధికారులుగా నియమించే పథకాన్ని తయారుచేసేందుకే యీసంఘం నియమించబడింది. ఆ తరు

వాత అహింసాసూత్రంకోసంగాక, రాజకీయకారణాలవల్లనే - మా తండ్రి ఆ సంఘంనుంచి వైదొలిగారు. కాంగ్రెసుపక్షం సైనికబలాన్ని పెంచాలనీ, నవీనాయుధసంపన్నులను చెయ్యాలనీ, మరీ అల్పంగావున్న నౌకా, విమానదళాలను విరివిగా పెంపొందించాలనీ, బ్రిటిష్‌అధికారుల స్థానంలో, క్రమంగా బ్రిటిష్‌సైన్యాలస్థానంలో భారతీయులను నింపాలనీ కేంద్రశాసనసభలో 1937—38 లలో ఒక ప్రతిపాదనచేసింది. ముందుగా రాష్ట్రప్రభుత్వాలతోసంప్రదించే ఈపనిచేసింది. భారత సైన్యంఖర్చుకంటె భారతదేశంలోవున్న బ్రిటిష్‌సైన్యంఖర్చు నాలుగు రెట్లు అధికం గనుక, బ్రిటిష్‌వారిని తొలగించి, ఆ స్థానంలో భారతీయ సైన్యాలను నియమించితే అదనపుఖర్చులేకుండానే విరివిగా ఆయుధాలను సమకూర్చవచ్చు. మ్యూనిచ్‌సమస్య ఉదయించినప్పుడుకూడా వైమానికదళాన్ని పెంచవలసినఆవశ్యకత నొక్కిచెప్పబడింది. కాని, ప్రభుత్వం 'నిపుణుల' అభిప్రాయం అందుకుసుముఖంగాలేదని తిరస్కరించింది. 1940లో కాంగ్రెసుపక్షం ప్రత్యేకావసరంగా కేంద్రశాసనసభకు హాజరై, భారతరక్షణకు ప్రభుత్వంచేస్తున్నసైనికయేర్పాట్లు బొత్తిగా చాలవని విమర్శిస్తూ, తనప్రతిపాదనలను పునరుద్ఘాటించింది.

నాకు తెలిసినంతవరకు పోలీసు, సైనిక, నౌకా, విమానబలాల పట్ల అహింసాసూత్రాన్నివర్తింపజేయాలనేవిషయం ఎన్నడూ ప్రస్తావించబడలేదు. ఆ సూత్రం మా స్వాతంత్ర్యపోరాటానికిమాత్రమే వర్తిస్తుందని విశ్వసించాం. మా ఆలోచనావిధానంపై ఈ సూత్ర ప్రభావం ఎంతగానో ఉన్నదనేది నిజం. కాంగ్రెసుసంస్థ ప్రపంచమంతా ఆయుధవిసర్జనచేయాలనీ, జాతీయ అంతర్జాతీయసమస్యలపరిష్కారానికి శాంతియుతమైన ప్రయత్నాలే జరగాలనీ వాదించేందుకు యీ సూత్రం కారణభూతమయింది.

రాష్ట్రాల్లో కాంగ్రెసుపాలన నెలకొన్నప్పుడు కళాశాలల, విశ్వకళాపరిషత్తులవిద్యార్థులకు ఏదోఒకవిధమైన సైనికశిక్షణ నిచ్చేందుకు కాంగ్రెసుమంత్రివర్గాలు ప్రయత్నించాయి. ఈ ప్రయత్నాన్ని భారత ప్రభుత్వమే త్రోసిపుచ్చి, అడ్డుపడింది.

గాంధీజీ ఈ ధోరణులను అంగీకరించనిమాట నిజమే గాని, ఆయన కలుగజేసికోలేదు. కల్లోలాలను అణచేందుకైనాసరే పోలీసులు

ఆయుధాలనుపయోగించడం కూడదనీ, అది తనకెంతో బాధాకరమనీ ఆయన చెప్పాడు. కాని అది అంతప్రమాదకారి కాదులెమ్మని సరిపెట్టుకున్నాడు. తనప్రబోధం క్రమక్రమంగా భారతప్రజాహృదయంలో పాదుకుపోతుందని విశ్వసించాడు. కాంగ్రెసులోనే యిట్టిధోరణులు వుండడాన్ని ఆయన సహించలేకపోబట్టే, 1930 తరువాత ఆ సంస్థ సాధారణసభ్యత్వాన్నికూడా వదలివేశాడు. అయినప్పటికి కాంగ్రెసుకు అసమానానాయకుడుగా, సలహాదారుగా వుంటూనేవున్నాడు. ఇవి మాఅందరికీకూడా విపరీతమైన, అసంతృప్తికరమైన పరిస్థితులే. కాని కాంగ్రెసు గాంధీజీ సిద్ధాంతాలకు, విశ్వాసాలకు వ్యతిరేకమైననిర్ణయాలు అపుడపుడు చేస్తున్నదిగనుక, తాను యెడంగావుంటే వ్యక్తిగతబాధ్యత వుండదుగదా అని ఆయన తృప్తిపడివుండవచ్చు. ఆయనలోనూ మా జాతీయరాజకీయాల్లోనూ యిటువంటి ఆత్మసంఘర్షణ ఎప్పుడూ వుంటూండేది. జాతీయనాయకుడుగా గాంధీవ్యక్తిత్వానికీ భారతదేశానికేగాక ప్రపంచమానవాళికే వర్తించే ప్రవక్తోచితబోధకుడుగా కనుపించే గాంధీవ్యక్తిత్వానికీ మధ్య ఎప్పుడూ సంఘర్షణజరుగుతూనేవుండేది ఎవరైనా తాను సత్యమని నమ్మినదానికే పూర్తిగా కట్టుబడివుండడం సులభసాధ్యంకాదు. జీవితంలో అనేక అవసరాలూ, అనేకప్రయోజనాలూ వుంటాయి. రాజకీయజీవితంలో వీటిఅవసరం చెప్పలేము. సాధారణంగా ప్రజలు ఈ సమస్యనుగూర్చి అంతగా విచారించరు. వారు 'సత్య'మనేదాన్ని ఒకమూల ఎక్కడో ప్రత్యేకంగా ఉంచివేస్తారు. (అసలు దాన్ని వుంచుకుంటే). ప్రయోజనాన్నే ఆచరణకు చుక్కానిగా చేసుకుంటారు. రాజకీయాల్లో యిదే ప్రపంచవ్యాప్తమైనసూత్రం. దురదృష్టవశాత్తు రాజకీయవేత్తలు విలక్షణులైన అవకాశవాదులు. అంతేగాక, వారు ప్రతివిషయాన్నీ వ్యక్తిగతంగా పరిశీలించి, ఆచరించేఅవకాశం లేకపోవడంకూడా ఈ నియమాన్ని పాటించడానికి కారణమయింది. రాజకీయవాదులు ఒకదాన్ని తాము ఆచరించడమేగాక, యితరులు కూడా ఆచరించేటట్లు చేయాలి. అందువల్ల ఆ యితరులందరి హద్దులను దృష్టిలోఉంచుకోవాలి. ఇతరులు 'సత్య'మనేదాన్ని ఎంతవరకు గ్రహించగలరో, ఆ మేరకే యీ రాజకీయచర్యలు పరిమితంకాకతప్పదు. అందువల్లనే వారు 'సత్యం'తో రాజీపడి, పరిస్థితులకన్వయించుకోగల్గి

నంతవరకే ఆచరించగలరు. ఈ అన్వయించుకోవడం తప్పనిసరి అవుతుంది. కాని దానివెంట అనేకసందిగ్ధాలుకూడా వుంటాయి. సత్యాన్ని విస్మరించి, త్రోసివేసేధోరణులు పెంపొందవచ్చు. ప్రయోజనమే ఆచరణకు మూలసూత్రంగా యేర్పడవచ్చు.

గాంధీ కొన్నిసిద్ధాంతాలకు పాషాణమంతదృఢంగా కట్టుబడి వుంటాడు. కాని మారేపరిస్థితులకనుగుణంగా, ఇతరులదృక్పథానికి సమన్వయాత్మకంగా తాను మారేలక్షణంకూడా ఆయనలో వుంది. ప్రత్యేకంగా తాను సత్యమనినమ్మేదానిని యితరులు – ముఖ్యంగా సామాన్యజనం – ఎంతవరకు అర్థంచేసుకోగలరు, ఎంతవరకు దాన్ని అనుసరించగలరు, వారి శక్తి, బలహీనతలెట్టివి? అనేవిషయాలను బాగా ఆలోచిస్తాడు; రాజీకి అంగీకరిస్తాడు. కాని అప్పుడప్పుడూ తన రాజీధోరణి మరీ దూరంవెళ్ళిందనేభయంతో యథాస్థానానికి చేరుకుంటాడు. ఉద్యమచర్యల్లోనిమగ్నుడై వున్నప్పుడు ప్రజానీకపుధోరణికి వంతపాడుతున్నట్లు, వారిశక్తికితగినపనినే వప్పగిస్తున్నట్లు, అందుకనుగుణంగానే తాను మారినట్లు కనిపిస్తాడు. ఇతరసమయాల్లో అత్యంత ఆదర్శవాదిగా పరిస్థితికనుగుణంగామారలేనివ్యక్తిగా కనిపిస్తాడు. ఇదేవిధమైనతేడా ఆయనరచనలకూ ఆచరణలకూ మధ్యకూడా కనిపిస్తుంది. ఈ భేదం ఆయనవ్రాతలలోను, ఆచరణలోకూడ కన్పిస్తుంది. ఆయనఅనుచరులకే అయోమయంగా తోస్తుంది. మరి భారతదేశస్థితిగతులనెరుగనివారి కెలా వుంటుందో వేరే చెప్పాలా ?

ఒకే ఒకవ్యక్తి ప్రజలఆలోచనల్నీ, ఆదర్శాల్నీ ఎంతవరకు తన ప్రభావంచే మలచగలడా అనేది స్పష్టంగా చెప్పలేము. చరిత్రలో కొందరు శక్తివంతమైనతమపలుకుబడిని ఉపయోగించినట్లు కనుపిస్తారు. కాని ప్రజలహృదయాల్లోచిరకాలంగావున్న భావాలనే వారు పైకితెచ్చి నొక్కిచెప్పివుండవచ్చు. లేక ఆ తరంలో అస్పష్టంగా అనుభూతిలో వున్న వూహాలను వారు స్పష్టమైనమాటలలో చెప్పివుండవచ్చు. ఈ తరంలో భారతహృదయంపై గాంధిజీప్రభావం ఎనలేనిది. అది ఎంతకాలం, ఏరూపంలో మనగలుగుతుందో భవిష్యత్తుమాత్రమే నిర్ణయించగలదు. ఆయనప్రభావం ఆయననువిశ్వసించి, జాతీయనాయకుడుగా పరిగణించి, అనుసరించేవారివరకే పరిమితంకాదు; ఆయనతో ఏకీభవించ

లేనివారిమీద, ఆయన్ని విమర్శించేవారిమీదకూడా ప్రసరించింది. ఆయన అహింసాసిద్ధాంతాన్నిగాని, ఆర్థికసూత్రాలనుగాని సంపూర్ణంగా ఆమోదించేవారు భారతదేశంలోనే చాలా తక్కువ. అయినా ఏదో ఒకవిధంగా ఆయనప్రభావం తగిలినవారే ఎక్కువమంది వుంటారు. ఆయన మతసంబంధమైన విషయాలు మాట్లాడుతూనే రాజకీయ సమస్యలకు, దైనందినజీవితానికీ నైతికధర్మాన్ని వర్తింపజేయాలని వక్కాణిస్తాడు. మతవిషయికప్రబోధాలు అట్టిమనస్తత్వంగలవారినే ప్రభావితంచేయగా, నైతికధర్మప్రబోధాలు అందరినీ వశంచేసుకున్నాయి. అనేకమంది ఆయనప్రబోధాలవల్ల మహోన్నత నైతికస్థాయికి చేరగలిగారు. మరి అనేకమంది కనీసం ఆ సూత్రాలనుగురించి తప్పనిసరిగా ఆలోచించేట్టు చేశాయి. ఆ మనస్తత్వమే ఆచరణ, ప్రవర్తనలపై కొంతప్రభావం కలిగివుంటుందిగదా! ప్రపంచమంతటా రాజకీయాలు శీఘ్రఫలితాలనాశించే అవకాశవాదబద్ధంగా వుంటున్నట్టుమాత్రం ఇక్కడిరాజకీయాలు లేవు. ప్రతి ఆలోచనకు, చర్యకు ముందు నైతిక సంఘర్షణ జరుగుతూనేవుంటుంది. శీఘ్రఫలితాన్ని-వెంటనేచేయగలదీ, వాంఛించదగ్గదీ - పూర్తిగా విస్మరించలేము. కాని, దీర్ఘదృష్టి, యితర ఫలితాలూకూడా గుర్తులోవుండి ఆ వేగిరపాటును కొంత శాంతింపజేస్తాయి.

గాంధీజీప్రభావం ఇండియాలో అన్నిరంగాల్లోను ప్రసరించి, తన గాఢముద్రను వేసింది. కాని ఆయన భారతీయనాయకుల్లోకెల్ల ముఖ్యుడవడానికి కారణం ఆయన అహింసాసిద్ధాంతము, ఆర్థికసూత్రాలూ కాదు. భారతీయుల్లో అనేకమందిదృష్టిలో ఆయన భారతీయస్వాతంత్ర్యకాంక్షకు, వీరోచితజాతీయవాదానికి, నిరంకుశశక్తికిలొంగిపోనితత్వానికి, జాతీయగౌరవాన్నికుంచించే దేనినీ అంగీకరించకపోవడానికి సజీవ చిహ్నం. భారతీయుల్లో అనేకమంది వందలాది విషయాల్లో ఆయనతో ఏకీభవించకపోవచ్చు, ఒక ప్రత్యేకసమస్యమీద ఆయన్ని విమర్శించి, ఆయననుండి విడిపోవడానికూడా సిద్ధంకావచ్చు, కాని దేశస్వాతంత్ర్యమే ప్రమాదంలోపడ్డపుడు, ఏదైనా సందిగ్ధంపర్పడ్డప్పుడు, ఏదైనా చర్యతీసుకోవలసివచ్చినపుడుప్రజలందరూకూడా ఆయనచుట్టూ మూగి, తమ ఏకైకనాయకునిగా ఆయనవైపే చూస్తారు.

1940 లో గాంధీజీ అహింసాసూత్రాన్ని ఈ యుద్ధానికీ, భావి స్వతంత్రభారతదేశానికీకూడా వర్తింపచేయాలనేసమస్యను లేవనెత్తి నపుడు, కాంగ్రెసుకార్యవర్గం దాన్ని ఎదుర్కోవలసివచ్చింది. ఆయన కోరినంతదూరం తాము పోలేమనీ, ఈ సూత్రాన్ని భవిష్యత్తులోకూడా వైదేశికనీతికి అనువర్తింపజేసేందుకు కాంగ్రెసునుగాని, భారతదేశాన్ని గాని బాధ్యతాయుతం చేయలేమనీ కార్యవర్గసభ్యులు స్పష్టంచేశారు. అందువల్ల ఈ సమస్యమీద ఆయనతో బహిరంగంగా, స్పష్టంగా తెగ తెంపులు చేసుకోవలసివచ్చింది. రెండునెలలతర్వాత అనంతర చర్చ లలో ఒక నిర్ణయానికివచ్చారు. దాన్నే అఖిలభారతకాంగ్రెసుసంఘం ఒక తీర్మానంలోభాగంగా ఆమోదించింది. ఆ సూత్రం గాంధీగారి సిద్ధాంతాన్ని పూర్తిగా ప్రతిబింబించలేదు. కాంగ్రెసు అట్టిదృక్పథాన్ని అవలంబించడానికి ఇష్టంలేకపోయినా, ఆయన అంగీకరించడం జరిగింది. జాతీయప్రభుత్వం ఏర్పరిచేషరతుమీద, యుద్ధంలో సహకరిస్తామని కాంగ్రెసుచేసిన యిటీవలి ప్రతిపాదననుకూడా బ్రిటిష్‌ప్రభుత్వం అప్ప టికే తిరస్కరించింది. ఏదోఒకసంఘర్షణ సమీపిస్తోంది. తప్పనిసరిగా గాంధీజీ, కాంగ్రెసూ కర్తవ్యనిర్ధారణకై ఒకరినొకరు చూచుకున్నారు. ఆ యిరువురిమధ్య యేర్పడిన ప్రతిష్టంభనను తొలగించుకోవడానికి మార్గంకోసం వెతకవలసివచ్చింది. అంతకుపూర్వమే మన సహకార, సద్భావసూచన అమర్యాదకరంగాను, పూర్తిగాను నిరాకరించబడి నందున యీ సూత్రం యీసారి యుద్ధాన్నిగురించి ప్రస్తావించలేదు. అహింసావిధానంపై కాంగ్రెసుకుగల సిద్ధాంతాలు స్పష్టంచేయబడ్డాయి. భవిష్యత్తులో యేర్పడగల స్వతంత్రభారతం యీఅహింసాతత్వాన్ని వైదేశికవిధానాల్లో ఎలా అనుసరిస్తుందో మొట్టమొదటిసారిగా స్పష్టం చేయబడింది. ఆతీర్మానంలోని యీ సూత్రభాగం క్రిందివిధంగా వుంది.

అఖిలభారతకాంగ్రెసుసంఘం 'అహింసాతత్వాన్ని సిద్ధాంతం గానూ, ఆచరణీయంగానూ పూర్తిగా విశ్వసిస్తోంది. స్వరాజ్యపోరా టంలోనేగాక, స్వతంత్రభారతంలో కూడా సాధ్యమైనంతవరకు దాన్ని అన్వయింపచేయాలనే సంకల్పించింది. ప్రపంచం తననుతాను ధ్వంసం చేసుకుని బర్బరత్వానికి తిరిగిపోకుండావుండాలంటే, పూర్తిగా ఆయుధ విసర్జనచెయ్యాలి. నూతనంగా ధర్మసమ్మతమైన రాజకీయార్థికవ్యవస్థను

నెలకొల్పాలి. దీన్ని యీ సంఘం మనఃపూర్వకంగా విశ్వసించడమే గాక, ఇటీవలి ప్రపంచసంఘటనలుకూడా బలపరిచాయి. అందువల్ల స్వతంత్రభారతదేశం ప్రపంచమంతా ఆయుధవిసర్జనచేసేందుకు తన శాయశక్తులా ప్రయత్నిస్తుంది. తానే ముందుగా దాన్ని ఆచరించి, మార్గదర్శకంకావడానికి సిద్ధపడాలి. అలా ముందంజవేయడం దేశీయ పరిస్థితులమీద, ప్రపంచసంఘటనలమీద ఆధారపడియుండకతప్పదు. కాని, ప్రభుత్వంమాత్రం ఆయుధవిసర్జనసూత్రాన్ని ఆచరించేందుకు సర్వవిధాల ప్రయత్నిస్తుంది. ఆయుధవిసర్జన, ప్రపంచశాంతి సాధ్య పడాలంటే, జాతులమధ్య యుద్ధాలుజరక్కూడదు. జాతీయసంఘర్షణలకు, యుద్ధాలకుగలకారణాలను తొలగిస్తేగాని, యిది పొసగదు. ఒకముఠా మరొకముఠాను దోచుకోవడం, ఒకదేశం మరొకదేశంమీద అధికారం చలాయించడం తొలగించబడితేగాని, ఈ కారణాలు సమూలంగా నాశనంకావు. ఆ లక్ష్యంకోసమే భారతదేశం శాంతియుతంగా కృషి చేస్తుంది. ఈలక్ష్యాన్ని దృష్టిలోవుంచుకొనే భారతప్రజలు సంపూర్ణ స్వతంత్రజాతిస్థాయిని పొందాలని వాంఛిస్తున్నారు. అట్టి స్వాతంత్ర్యమే స్వతంత్రజాతులసమాఖ్యలోని యితరదేశాలతో సన్నిహితసహకారం నెరపుతూ, ప్రపంచశాంతి, అభ్యుదయాలను సాధించడానికి ప్రాతిపదిక కాగలదు.'' ఈ ప్రకటనను పరిశీలిస్తే కాంగ్రెసు శాంతియుతపద్ధతులను, ఆయుధవిసర్జనను దృఢంగా వాంఛిస్తున్నానంటూనే, అనేకపరిమితు లను, అర్హతలనుకూడా ఉద్ఘాటించినదని స్పష్టమౌతుంది.

కాంగ్రెసుసంస్థలోని అంతర్గతప్రతిష్టంభన 1940 లో తొలగి పోయింది. తరువాత మాలో అనేకమంది మరోసంవత్సరం జైళ్ళలో వుండవలసివచ్చింది. మళ్ళీ 1941 డిసెంబరులో గాంధీజీ అహింసా విధానాన్ని పూర్తిగా అవలంబించాలని పట్టుబట్టేసరికి, మళ్ళీ అటు వంటి విషమస్థితే ఏర్పడింది. కాంగ్రెసుఅధ్యక్షుడు అబుల్‌కలాం ఆజాద్, మరికొందరూ గాంధీజీతో ఏకీభవించలేకపోయారు. మళ్ళీ బహిరంగంగా చీలికవచ్చి ప్రతిష్టంభన యేర్పడింది. ఈవిషయంలో గాంధీజీ అభిప్రాయంతో కాంగ్రెసుసంస్థ, ఆయన అతిముఖ్యానుచరు లలో కొందరు -- ఏకీభవించడంలేదని స్పష్టమయింది. పరిస్థితుల ప్రాబల్యం, శరవేగంగాజరుగుతున్న హఠాత్సంఘటనలూ మమ్మ్మి --

గాంధీతోసహా - సంచలింపజేశాయి. గాంధీజీ కాంగ్రెసుదృక్పథమే తనదృక్పథమని అనకపోయినా, తనభావాన్ని కాంగ్రెసుమీద బలవంతంగా రుద్దేప్రయత్నం విరమించుకున్నాడు

ఆ తరువాత ఎన్నడూ గాంధీజీ యీవిషయాన్ని కాంగ్రెసులో ప్రస్తావించనేలేదు. తదుపరి సర్ స్టాఫర్డ్ క్రిప్సు తనప్రతిపాదనలతో యిక్కడికి వచ్చినప్పుడు అహింసాతత్వప్రసక్తే లేకపోయింది ఆయన ప్రతిపాదనలన్నీ పూర్తిగా రాజకీయదృక్పథంతోనే పరిశీలించబడినాయి. తరువాతినెలల్లో - 1942 ఆగష్టువరకు - గాంధీజీజాతీయవాదమూ, గాఢ స్వాతంత్ర్యకాంక్ష కలసి, 'భారతదేశం స్వతంత్రరాజ్యంగా వ్యవహరించేఅవకాశంకలిగితే కాంగ్రెసు ప్రత్యక్షంగా యుద్ధంలోపాల్గొనేందుకు' కూడా ఆయన అంగీకరించేటట్లుచేశాయి. ఆయనవిషయంలో యిది గణనీయము, ఆశ్చర్యకరమైన పరిణామమే. ఈ మార్పు ఎంతో మానసికవ్యథ, ఆంతరంగికబాధ కలిగించివుంటుంది. ఆయనజీవితలక్ష్యమూ, ఆయనమనుగడకే హేతుభూతమైన అహింసాతత్వానికీ ఆయన్ని పూర్తిగావశంచేసుకుని వ్యసనతరకాంక్షగారూపొందిన భారతస్వాతంత్ర్యకాంక్షకూ సంఘర్షణజరిగినప్పుడు ఆయనధర్మదండం రెండవదానివైపే మొగ్గింది. అయితే, ఆయన అహింసాతత్వంపట్లగలవిశ్వాసాన్ని సడలించుకున్నాడని మాత్రం భావించరాదు. అంటే, కాంగ్రెసు ఈ యుద్ధంలో ఆ సూత్రాన్ని అనుసరించకుండావుండేందుకు ఆయన వప్పుకునేందుకు సిద్ధమయ్యాడనిమాత్రమే. రాజీకి ఒప్పనిప్రవర్తకంటె కార్యవాదియైనరాజకీయచతురునిదే పైచేయిఅయింది.

గాంధీజీహృదయంలో యిట్టిసంఘర్షణ తరచుగా జరుగుతూ అనేక పరస్పరవైరుధ్యాలు సృష్టించినట్లు కన్పించేది. నన్నూ, నా చర్యల్నీ అతిసన్నిహితంగా ప్రభావితంచేసిన యీసంఘర్షణను చూస్తూ, దాన్నిగురించి ఆలోచిస్తూంటే, లిడెల్‌హార్ట్ గ్రంథాల్లోని ఒకభాగం నాకు జ్ఞప్తికొచ్చింది. "పరోక్షసంబంధమనేభావన, ఒకమేధపైమరొకమేధకుగలప్రభావానికి చెందిన అన్నిసమస్యలతోనూ సన్నిహితసంబంధం కలిగివుంటుంది. ఇది మానవచరిత్రలో ఎంతో ప్రభావంగలవిశేషం. మరొకగుణపాఠంకూడా వుంది. అది ఎక్కడికి తీసుకుపోతుందో, వివిధ ప్రయోజనాలమీద ఎట్టిప్రభావాన్ని ప్రసరింపజేస్తుందోననే ప్రసక్తి

లేకుండా, సత్యాన్ని వెంటాడితేనే సత్యనిర్ధారణలను చేయగలం, లేదా వాటిని చేరుకోగలం. కాని దీనికీ మొదటిపాత్రానికీ సమన్వయంకుదరడం దుస్తరం.

"మానవాభ్యుదయానికై 'ప్రవక్తలు' నిర్వర్తించిన కీలకపాత్ర లకు చరిత్రే సాక్ష్యం. ఎవరైనా తాము 'సత్యం'గా వీక్షించినదాన్ని నిస్సంకోచంగా వెల్లడించడంవల్లకలిగే అంతిమఫలితంయొక్క విలువకు యిదే ఋజువు. కాని, ఆ దృక్పథాన్ని అంగీకరించి, వ్యాపింపజేయడం మరొకతరగతివ్యక్తులమీద ఆధారపడివుంటుందనేది కూడా స్పష్ట మౌతుంది. ఆ వ్యక్తులే 'నాయకులు'. వారు తాత్త్వికఎత్తుగడలు తెలిసిన వారై 'సత్యానికీ, ప్రజలుదాన్ని స్వీకరించగలగడానికీ మధ్య సమన్వయం కుదర్చాలి. వారిప్రభావం తరచుగా వారు 'సత్యా'న్నివీక్షించగల పరిమితిమీదా, దాన్ని ప్రకటించడంలోగల ఆచరణయోగ్యతమీదా ఆధారపడివుంటుంది.

"ప్రవక్తలు రాళ్ళదెబ్బలుతినవలసిందే. అదే వారికిభోజ్యం, ఆత్మపరిపక్వతకు పరీక్ష. కాని, నాయకునిమీద రాళ్ళవర్షంకురిస్తే తెలివితేటలలోపంవల్లగాని, తనబాధ్యతలకూ ప్రవక్తలబాధ్యతలకూ మధ్యగల తేడాను గుర్తించలేనిపొరపాటువల్లగాని అతడు తన పాత్ర నిర్వహణలో విఫలుడయ్యాడని మాత్రమే రుజువౌతుంది. అట్టివ్యక్తి నాయకుడుగా విఫలుడుకావడంలో చేసిన త్యాగంయొక్క ఫలితం, వ్యక్తిగా అతనికి గౌరవాన్ని చేకూర్చగలదో లేదో కాలంమాత్రమే తెలుపగలదు. నాయకుల్లో సామాన్యంగావుండే లోపం - ఒకసమస్యకు అంతిమఫలితాన్ని లక్ష్యంలోపెట్టుకోకుండా, తక్షణావసరమనేసాకుతో సత్యాన్నిబలిపెట్టడం - ఇట్టివ్యక్తిలో లేకపోవడం కనీస సుగుణం. ఎత్తుగడకోసం సత్యాన్ని నొక్కివేసేఅలవాటుగలవాడు తన భావగర్భాన్నుంచి వికృతపిండాన్నే ప్రసవిస్తాడు.

"సత్యాన్నిసాధించడానికై జరిగే పురోగమనానికీ, దాన్ని అంగీక రించేందుకై జరిగే పురోగమనానికీ లంకెవేసే ఆచరణీయవిధానం ఏదైనా వుందా? ఈసమస్యకు సాధ్యమైనపరిష్కారమార్గంగా ఎత్తుగడలసిద్ధాంతాలను ఆలోచించడంలో సూచించబడింది. ఈసిద్ధాంతాలు ఎప్పుడూ ఉత్కృష్టసత్యాన్ని దృష్టిలోవుంచుకోవాలనీ, పరిస్థితులకనుగుణ్యమైనవిధంగా

దాన్ని అనుసరిస్తూండాలనీ బోధిస్తాయి. సత్యానికి - ముఖ్యంగా అదొక నూత్న భావంగా రూపొందినప్పుడు - వ్యతిరేకత తప్పనిసరి. కాని, ఆ లక్ష్యానికేగాక, దాన్ని చేరుకునేవిధానానికూడా శ్రద్ధవహించడం ద్వారా యిట్టి నిరోధబలాన్ని తగ్గించవచ్చు. చిరకాలంగా పాదుకొని వున్న స్థానంమీద ముఖాముఖి తలపడవద్దు. దానికిబదులు పక్కవాటుగా దెబ్బతీసేందుకు ప్రయత్నించు. ఆవిధంగా సత్యతృష్ణ సులభంగా చొచ్చుకుపోగలపార్శ్వాన్ని బహిర్గతంచెయ్యి. కాని, అలా ఎటువంటి పరోక్షచర్యతీసుకునేటప్పుడైనా సత్యమార్గాన్ని తప్పేవీల్లేకుండా జాగ్రత్త వహించు. సత్యపురోగమనానికి అసత్యంలోకి మళ్ళడంకంటె ప్రమాదకరమైనదేదీ వుండదు......వివిధనూతనాభిప్రాయాలు ఏవిధంగా ప్రజామోదాన్ని పొందగలిగాయో, ఆ పరిణామస్థితులను పరిశీలించినట్లయితే, అవి పూర్తిగా నూతనాభిప్రాయాలుగాగాక, మరచిపోబడిన పూర్వసిద్ధాంతాలుగానో, ఆచారాలుగానో, ప్రజలముందుంచబడినప్పుడే ఆ పరిణామాలు సులభతరమయ్యాయని తేలుతుంది. ఇందుకు మోసంతో పనిలేదు. 'సూర్యచంద్రులప్రపంచంలో క్రొత్తదనేదే లేదు గనుక, తత్సంబంధాలను వెలికితీయుటలో జాగ్రత్త అవసరం."

## ౭ ఉద్రిక్తత

1942 మొదటినెలల్లో భారతదేశంలో ఉద్రిక్తవాతావరణం ప్రబలింది. యుద్ధరంగం క్షణక్షణానికీ మరింత దగ్గరకాసాగింది. భారతదేశనగరాలమీద విమానదాడులుజరుగగల సూచనలు కానరాసాగాయి. యుద్ధం ప్రచండంగా జరుగుతున్న ఆ ప్రాచ్యదేశాల్లో ఏమి జరుగనున్నది? భారతదేశానికీ ఇంగ్లండుకూ మధ్యగల సంబంధాల్లో ఏ నూతనపరిణామం ఏర్పడనున్నది? ఒకరినొకరు కోపంగా చూచుకుంటూ, గతంలోని శోచనీయస్మృతులతో బంధింపబడి, వేరుచేయబడి, ఎవ్వరు తప్పించలేని దురదృష్టబాధితులంగా పూర్వంలాగే వుండిపోతామా? లేక సమానఘోరప్రమాదాలు వాటిల్లి, యిరువురిమధ్యగల అగాధానికి వారధి నిర్మింపజేస్తాయా? సాధారణంగా జోగుతూండే బజార్లుకూడా మేల్కొన్నాయి. ఒక ఉద్రిక్తవాయుతరంగం వీచి, బజార్లన్నీ రకరకాల పుకార్లతో ప్రతిధ్వనించాయి. అతివేగంగా

ముంచుకొస్తున్న భవిష్యత్తు ధనికవర్గాలకు భయంకరంగా కనుపించింది. ఆ భవిష్యత్తు - అది ఎలాంటిదైనా - ధనికులుఅలవాటుపడ్డ సంఘ వ్యవసను తారుమారుచేసి, వారిప్రయోజనాన్ని, ప్రత్యేకస్థానాన్నీ తలక్రిందులుచేసివేస్తుందనిపించింది. రైతు, కూలీ తాముకోల్పోవడ మేమీ లేనందువల్ల వారి కలాంటి భయమేమీలేదు. వారు ప్రస్తుత దైన్యస్థితికంటె ఎలాంటిమార్పు జరిగినా, మంచిదేనని ఎదురుచూచారు.

చైనాపట్ల భారతదేశంలో ఆదినుంచీ అత్యంతసానుభూతి వుంది. అందువల్ల జపానుపట్ల ఒకరకమైనవ్యతిరేకభావం యేర్పడింది. ఆదిలో పసిఫిక్ యుద్ధం చైనాకు సహాయకారికాగలదని భావించబడింది. చైనా ఒంటరిగా నాలుగున్నరయేండ్లకాలం జపానుతో పోరాడింది. ఇపుడు శక్తివంతమైనమిత్రరాజ్యాలుకూడా కలిశాయి. కాబట్టి చైనా భారమూ ప్రమాదమూ తగ్గకతప్పదు. కాని, ఆ మిత్రరాజ్యాలే దెబ్బమీదదెబ్బ తిన్నాయి. చొచ్చుకువస్తున్న జపానుసైన్యాలధాటికి బ్రిటిష్‌వలస సామ్రాజ్యం ఆశ్చర్యకరమైనంతత్వరగా బదాబదలైపోయింది. అయితే, ఈ గర్విష్ఠివ్యవస్థ పునాదులూ, అంతచ్ఛక్తీ లేని పేకమేడలాంటిదేనా? సహజంగానే, ఆధునికయుద్ధానికవసరమైన సాధనసంపత్తులేవీ లేకుండానే చైనా దీర్ఘకాలం జపానుదురాక్రమణ నెదుర్కోవడాన్ని ఈ బ్రిటిష్ ఓటమిలతో పోల్చుకోసాగారు. ప్రజలదృష్టిలో చైనాప్రతిష్ఠ పెరిగింది. జపానుపట్ల విముఖత కలిగినా, చిరకాలంగా నెలకొనివున్న యూరోపియన్ వలసరాజ్యశక్తులు ఒకానొక ఆసియారాజ్యసైనికబలంచే ఓడించబడడంవల్ల సంతృప్తికలిగింది. ఇటువంటి జాతిభేదము, ప్రాచ్య - ఆసియా భేదభావము బ్రిటిష్‌వారిలోకూడా స్పష్టంగా ద్యోతకమైంది. అసలు ఓటమి, ఘోరప్రమాదాలే సహించరానివి. అందులోను ఒక ప్రాచ్య జాతి, ఒకఆసియారాజ్యం తమనుజయించడం బ్రిటిష్‌వారి ఉడుకుబోతుతనాన్ని, అవమానాన్ని పెంచింది. ఉన్నతపదవిలోవున్న ఒక ఆంగ్లేయుడు 'ప్రిన్స్ఆఫ్‌వేల్సు', 'రిపల్స్'లు (బ్రిటిష్‌వారి యుద్ధనౌకల్లో గొప్పవి) పచ్చరంగు జపానువాళ్ళచేత గాక, ఏ జర్మనులచేతనో ధ్వంసం చేయబడినట్లయితే తాను సంతోషించేవాడి నన్నాడు.

చైనానాయకులు జెనరలిస్మో చాంగ్ కై - షేక్‌లు భారత దేశానికిరావడం ఒక మహత్తరసంఘటన. వారు ప్రజాసామాన్యంతో

కలసిమెలసితిరిగేవీల్లేకుండా ఉద్యోగసాంప్రదాయాలూ, భారతప్రభుత్వ వాంఛలూ అడ్డువచ్చాయి. కాని, ఆ క్లిష్టసమయంలో వారు భారత దేశానికిరావడం, వారికి భారతస్వాతంత్ర్యంపట్లగల గాఢసానుభూతి కలసి భారతదేశం జాతీయవాదమనేగూటినుంచి బైటికొచ్చేటట్లూ, ప్రమాదస్థితిలోవున్న అంతర్జాతీయసమస్యలపట్ల దృష్టిసారించేటట్లు చేశాయి. చైనా, భారతదేశాల మైత్రీబంధనాలు మరింత దృఢతర మయ్యాయి. సమాన విపత్తువిషయంలో చైనా, తదితరదేశాలతో కలసిపోరాడాలనే కాంక్షకూడా పెరిగింది. భారతదేశానికి రానున్న ప్రమాదం జాతీయ. అంతర్జాతీయవాదాలను సన్నిహితంచేసింది. ఈ రెండింటిని విడదీసేది ఒక్క బ్రిటిష్‌ప్రభుత్వవిధానం మాత్రమే.

రానున్న ఘోరప్రమాదాలు భారతప్రభుత్వానికి తెలుసుననడంలో సందేహం లేదు. వారిమనసులో ఆతురత సత్వరచర్య లవసర మనేభావన వుండకపోవు. కాని, భారతదేశంలోని బ్రిటిష్‌వారిమనుగడ అత్యంత సాంప్రదాయబద్ధమైనందున వారు స్థిరపడిపోయిన గాళ్ళల్లో పాదుకుపోయారు. అంతులేని అధికారదర్పం - అభ్యంతరపరంపరలకు అంకితమైపోయారు. ఇవన్నీకలసి వారిదృక్పథంలోగాని, కార్యకలాపాల్లోగాని చెప్పుకోదగ్గమార్పేదీ లేకుండాచేశాయి. తత్క్షణావసరం, వేగం, ఉద్రిక్తత, కార్యంసాధించాలనే ఆసక్తి కనుపించవు. వారుప్రాతినిధ్యం వహించేయంత్రాంగం మరొకతరానికి చెంది, వేరొకలక్ష్యంతో నిర్మించ బడింది. వారిసైన్యాలకుగాని, ఉద్యోగబృందానికిగాని 'భారతదేశాన్ని ఆక్రమించుకోవాలి, భారతీయులు స్వతంత్రులమ్యేందుకుచేసే ప్రయత్నాన్నైనాసరే అణచివెయ్యా'లనేదే లక్ష్యం. ఆ లక్ష్యసాధనకు ఉన్న వ్యవస్థ సరిపోతుంది. కాని, శక్తివంతము, నిర్దాక్షిణ్యమైన శత్రువుతో ఆధునికవిధానంలో యుద్ధంచేయడానికి సామ్యంలేదు. అందువల్ల, వారు ఈ యుద్ధపరిస్థితికి అనుగుణంగామారడం దుస్తరమైంది. వారు మానసికంగా యీపరిస్థితికి తగియుండకపోవడమేగాక, వారిశక్తులలో అధిక భాగం భారతజాతీయోద్యమాన్ని అణచివుంచడంలోనే నిమగ్నమై వున్నాయి. బర్మా,మలయాప్రభుత్వాల పతనం ఈకొత్తసమస్యలముందు గమనించదగ్గ ప్రత్యక్షప్రమాణమే. అయినా, ఆ గుణపాఠాన్ని భారత ప్రభుత్వం నేర్చుకోలేదు. బర్మాలోకూడా భారతదేశంలోని అధికార

వర్గంలాంటిదే పరిపాలించుతోంది. వాస్తవానికి కొద్దిసంవత్సరాలక్రితం వరకు బర్మా భారతప్రభుత్వాధికారంలోనే వుంది. భారతప్రభుత్వవిధానాలవంటివే బర్మాప్రభుత్వమూ అనుసరిస్తోంది. ఈ వ్యవస్థ ఎంత నిరర్థకమో బర్మా రుజువుచేసింది. అయినా, యీపద్ధతి మార్పులేకుండా కొనసాగుతూనేవుంది. వైస్రాయి, అతనివున్నతోద్యోగులూ యథావిధిగానే వ్యవహరిస్తున్నారు. పైగా, బర్మాలో విఫలులైనట్లు స్పష్టంగా తెలిసిపోయిన మరికొందరు ఉన్నతోద్యోగుల్నికూడా కలుపుకున్నారు. సిమ్లాపర్వతాగ్రంమీద మరో "గౌరవనీయుడు" పీఠంవేశాడు. లండన్‌లో 'కాందిశీక' ప్రభుత్వాలున్నట్లుగానే, మనదేశంలో బ్రిటిష్ వలసదేశాలనుంచి వచ్చిన 'కాందిశీక' అధికారులుండే సదవకాశాన్ని మనకు ప్రసాదించారు. అలా వచ్చినవారు భారతదేశంలోని బ్రిటిష్ వ్యవస్థతో చక్కగా అతికిపోయారు.

ఈ ఉన్నతోద్యోగులు నాటకరంగస్థలంమీది నీడల్లాగా తమ పాతపద్ధతుల్లోనే వ్యవహరించసాగారు. వారి సామ్రాజ్యలాంఛనాల ముమ్మరంతో, అధికారోత్సవకార్యకలాపాలతో, దర్బారులు, బిరుదు ప్రదానాలతో, కవాతుప్రదర్శనలతో, విందులతో, సాయంసంధ్యోచిత దుస్తులతో, ఆడంబరోపన్యాసాలతో మమ్మల్ని సమ్మోహితులజేయ ప్రయత్నించారు. న్యూఢిల్లీలోని వైస్రాయిభవనం ప్రధాన పూజారి వుండే ముఖ్యాలయ మయింది. కాని, యింకా అనేకదేవాలయాలూ, పూజారులూ కూడా కద్దు. ఈ సామ్రాజ్యాడంబరకార్యకలాపాలూ, ప్రదర్శనలూ ప్రజలను సమ్మోహితుల్నిచేసేందుకే వుద్దేశింపబడ్డాయి. యిటువంటికార్యకలాపాలకు అలవాటుపడివున్నవారయినందున,పూర్వకాలంలో మాప్రజలను ఆకర్షించాయి. కాని, యిప్పుడు కొత్తప్రమాణాలు తలెత్తాయి. విభిన్నమైనవిలువలు జన్మించాయి. ఈ విస్తృత ప్రదర్శనలు హాస్యాస్పదంగా ఎబ్బెట్టుగా మారిపోయాయి. భారతీయులు శీఘ్రగతీ, చురుకూ లేని మందగమనులని భావించబడేది. అలాంటిభారతీయులుకూడా పనులుముగించుకోవాలనేకాంక్ష ప్రబలమై, తమకృషిలో ఒకరకమైన వేగాన్నీ, ఉత్తేజాన్నీ పెంపొందించుకున్నారు. కాంగ్రెసురాష్ట్రప్రభుత్వాల్లో అనేకలోపాలున్నా, పూర్వంనుంచి పాదుకుపోయిన అధికారకార్యక్రమధోరణల్ని విడనాడి, శీఘ్ర

ఫలితాలు సాధించాలనే ఆత్రతతో అహరహం కృషిచేశాయి. మహా భయంకరవిపత్తు ముంచుకొస్తుంటే భారతప్రభుత్వమూ, దాని అసంఖ్యాకప్రతినిధులూ చీమకుట్టినట్లు మందకొడిగా వుండడం చూస్తే వళ్ళుమండిపోతుంది.

అట్టి సమయంలో అమెరికన్లు వచ్చారు. వారతిశీఘ్రగతిని, వేగంగా పనులుముగించాలనే ఆతురతగలవారు. వారికి భారతప్రభుత్వ విధానాలుగాని, సాంప్రదాయలాంఛనాలుగాని తెలియవు. అవి నేర్చుకోవాలనే ప్రత్యేకఆసక్తికూడా వారికి లేదు. వారు ఆలస్యాన్ని సహించలేక, నిరోధాలను, ఉద్యోగప్రతిబంధకాలను ప్రక్కకునెట్టివేస్తూ, న్యూఢిల్లీప్రశాంతజీవితనిశ్చలతను తలక్రిందులుచేశారు. వారికి ఏసందర్భాల్లో ఏయేదుస్తులు ధరించాలనే శ్రద్ధకూడా లేనందువల్ల, ఒక్కొకసారి అధికారికకార్యక్రమదృఢనియమాలను, లాంఛనాలను మీరేవారు. వారిసహాయాన్ని సంతోషంతో స్వీకరిస్తున్నా, ఉన్నతాధికారవర్గాలకు వారు నచ్చలేదు. అందువల్ల వారిమధ్య సంబంధాలు కొంత బెడిసినట్లుండేవి. మొత్తంమీద భారతీయులకుమాత్రం అమెరికన్లు నచ్చారు. చేతిలోపనిని త్వరగాముగించాలనేవుత్సాహమూ, పట్టుదలా చూచేవారినికూడా ఉత్సాహపరిచేవి. భారతదేశంలోని బ్రిటిష్అధికారవర్గాలలో యిట్టిగుణాలు లేకపోవడంవల్లవారికీ వీరికీ భేదం స్పష్టమయింది. అమెరికన్లు అరమరలేకుండా కచ్చితంగా ముఖాముఖీ మాట్లాడడమూ, అధికారనిరోధాలులేని స్వేచ్ఛాప్రవర్తన ప్రశంసింపబడ్డాయి. అధికారవర్గానికీ యీ నూతనాగంతుకులకూ మధ్య అంతర్గతంగా యేర్పడ్డ సంఘర్షణ ప్రజల కాహ్లాదకరంగా వుండేది. ఇందుకుసంబంధించిన యథార్థాలూ, కట్టుకథలూ విరివిగా వ్యాపించాయి.

యుద్ధం భారతదేశానికిదగ్గరకావడంవల్ల గాంధీ ఎంతో ఆందోళనచెందాడు. ఆయనగారి అహింసాసూత్రాన్నీ కార్యక్రమాన్నీ యీ కొత్తపరిణామంతో సమన్వయింపజేయడం సులభంకాదు. దండెత్తి వచ్చినసైన్యంముందుగాని, పరస్పరంపోరాడుకుంటున్న రెండుసైన్యాల మధ్యగాని శాసనోల్లంఘనాన్నిగురించి తలచలేమనేది స్పష్టం. అదే మాదిరిగా మిన్నకుండడంగాని, దాడుల నంగీకరించడంగాని ఊహించలేము. అయితే ఏంచెయ్యాలి? గాంధీజీ స్వీయఅనుచరులు, కాంగ్రెసూ

కూడా యిలాంటిసందర్భంలోగాని, సాయుధబలంతో వచ్చేదండ యాత్రనెదుర్కోవడానికిగాని అహింసాసూత్రంపనికిరాదని వదలివేశారు. వారలా చెప్పేందుకు హక్కుకలిగివున్నా, చివరి కాయన వప్పుకోక తప్పలేదు. కాని, తానుగా, ఒకవ్యక్తిగా ఎటువంటిహింసాపూరితచర్య లోనూ పాల్గొనలేనివాడైనందువల్ల, ఆయన ఎంతో బాధపడ్డాడు. అయినా, ఆయన ఒక 'వ్యక్తి' కంటె ఎక్కువైనవాడు. జాతీయోద్యమంలో అధికారపూర్వకమైనస్థానంలో వున్నా, లేకపోయినా ఒక మహత్తర, ప్రతిభాన్వితమైన స్థానాన్ని ఆక్రమించివున్నాడు. అసంఖ్యాక ప్రజానీకం ఆయనమాటను శిరసావహించేవారు.

భారతదేశాన్ని, ముఖ్యంగా భారతప్రజాసామాన్యాన్నిగురించి గాంధీజీ తెలుసుకున్నంత బాగా గతంలోగాని, వర్తమానంలోగాని బహుకొద్దిమందికిక్కూడా తెలియదు. ఆయన భారతదేశమంతటా సంచరించి, కోట్లాదిజనులను అతిసన్నిహితంగా ఆకళింపుచేసుకోవడం వల్లనేగాక, మరేదో ఒక ప్రత్యేకవిశేషంవల్లకూడా ఆయనకు ఆ జన సామాన్యపుఊహాపోహాలతో సాన్నిహిత్యం యేర్పడింది. ఆయన ప్రజానీకంలో ఒకడుగా కలసిపోయి, వారి అనుభూతినే పొందగలడు. ప్రజానీకం దీన్ని గ్రహించినందువల్లనే ఆయనపట్ల పరిపూర్ణభక్తి, విశ్వాసాలను కలిగివున్నారు. అయినా ఆయన తనబాల్యంలో గుజరాతులో అలవరచుకున్నదృక్పథంయొక్కప్రభావమే ఆయనకు భారతదేశంపట్ల గలదృష్టికి కొంతవరకు కారణమయింది. గుజరాతీలు ముఖ్యంగా శాంతిప్రియులైనవర్తకులు, వ్యాపారులు. వారిమీద జైనుల అహింసాసిద్ధాంతప్రభావం అధికం. భారతదేశంలోని యితరప్రాంతాలకు దీని ప్రభావం అంతగా తగల్లేదు. కొన్నిప్రాంతాల్లో అసలలాంటిసూచనే లేదు. దేశంలో అన్నిప్రాంతాల్లోనుగల క్షత్రియులు తమయుద్ధాలకూ క్రూరమృగాలవేటకూ యీ సిద్ధాంతం అడ్డుపడకుండా నిరోధించారు. ఇతరవర్గాలుకూడా - బ్రాహ్మణులతోసహా - యీ సిద్ధాంతప్రభావానికి అంతగా లోనుకాలేదు. కాని, గాంధీజీ భారతీయతత్వాన్నీ, చరిత్రనూ సమగ్రదృష్టితో పరిశీలించాడు. వాటివెనుకగల మూలసూత్రం అహింసాసిద్ధాంతమేనని - అనేకసందర్భాల్లో ఆ సిద్ధాంతానికి భిన్నంగా నడచినప్పటికీ - విశ్వసించాడు. ఈ దృష్టి మరీ సుదీర్ఘకట్టుపాటుల స్వాభావికంగా

కన్పించింది. అనేకమంది భారతీయతత్వవేత్తలూ, చరిత్రకారులూ యీదృష్టితో ఏకీభవించలేదు. దీనిలో మానవుడునికియొక్క ప్రస్తుత స్థితిలో అహింసాసూత్ర సద్గుణాల ప్రమేయం లేదు. కాని, గాంధీజీకి చారిత్రకమైనపక్షపాతదృష్టి వున్నదనిమాత్రం సూచించింది.

భౌగోళిక హఠాత్ సంభవాలు జాతీయస్వభావాన్నీ, చరిత్రనూ నిర్ధరించడంలో ప్రముఖపాత్రను నిర్వహించాయి. భారతదేశం మహోన్నతహిమాలయపర్వతాలచేతను, అగాధసముద్రాలచేతను వేరుచేయబడ్డంవల్లనే, యీ విశాలభూభాగంలో ఐక్యతాభావం జనించింది, ఏకాకితనాన్నికూడా సృష్టించింది. ఈ విశాలప్రాంతంలో సజాతీయనాగరికత పెంపొందింది. ఆ నాగరికత విస్తృతమయ్యేందుకూ, పురోగమించేందుకూ ఎంతో అవకాశం వుంది. అది సాంస్కృతికఐక్యతను భద్రంగా కొనసాగిస్తూనేవుంది. అయినా, భూగోళం అదేఐక్యతలో అనేక భిన్నత్వాలనుకూడా సృష్టించింది. బహువిశాలంగావుండే ఉత్తర, మధ్య భారతమైదానానికీ కొండలతో ముక్కచెక్కలుగావుండే దక్కనుపీఠభూమిలోనిప్రాంతాలకూ ఎంతో తేడావుంది. భౌగోళికంగా విభిన్న ప్రాంతాల్లోనివసించేప్రజలు నేర్వేరులక్షణాలను పెంపొందించుకున్నారు. చరిత్రకూడా ఉత్తరంలో ఒకవిధంగాను దక్షిణంలో మరొకవిధంగానూ— తరచుగా రెండుప్రాంతాలచరిత్రా ఏకంకావడం, చెట్టపట్టాలు పట్టుకోవడం జరిగినా - ఉండడం సంభవించింది. రష్యాలోవలె ఉత్తరభారతంలో చదునునేలలూ, విశాలమైదానాలూ వుండడంవల్ల విదేశీశత్రుదాడులనుంచి రక్షించుకునేందుకు బలిష్ఠమైనకేంద్రప్రభుత్వాలు అవసరమైనాయి. సామ్రాజ్యాలు దక్షిణాన, ఉత్తరానకూడా పరిఢవిల్లాయి. కాని, ఉత్తరాదే సామ్రాజ్యకేంద్రంగా వుంటూ, తరచుగా, దక్షిణాది పెత్తనం చేస్తూండేది. పూర్వకాలంలో బలిష్ఠకేంద్రప్రభుత్వమంటే రాచరికమనే అర్థం. మొగలాయి సామ్రాజ్యం అనేక కారణాలతోపాటు, మహారాష్ట్రులవల్లనే ఛిన్నాభిన్నంచేయబడడం చారిత్రక హఠాత్సంఘటన మాత్రమే కాదు. మహారాష్ట్రులు దక్కనుపీఠభూమిలోని పర్వతప్రాంతాలవారు. మైదానవాసులైన ఉత్తరభారతీయుల్లో ఎక్కువమంది లొంగుబాటుతనం బానిసమనస్తత్వాల నలవరచుకోగా,

మహారాష్ట్రులు కొంతవరకైనా స్వతంత్రభావో త్తేజాన్ని సంరక్షించుకోగలిగారు. బ్రిటిష్‌వారు బెంగాల్లో సులభంగా విజయాలు సాధించారు. అచటి సారవంతమైన మైదానవాసులు అత్యంత విధేయులుగా లొంగిపోయారు. అక్కడ వేళ్ళూనుకున్న బ్రిటిష్‌వారు యితర ప్రాంతాలకు వ్యాపించారు.

ఇప్పుడూ, ఇకముందుకూడా భౌగోళికప్రాముఖ్యత కలిగేవుంటుంది. కాని, ఇప్పుడు ఇతరవిశేషాలప్రాముఖ్యత మరింత హెచ్చింది. పర్వతాలూ, సముద్రాలూ యింక అడ్డుగోడలు కాలేవు. కాని, అవి ప్రజాస్వభావాన్నీ, రాజకీయార్థికస్థితినీ నిర్ణయించేవిగానే వుండగలవు. విభజన, పునర్వ్యవస్థీకరణలకుసంబంధించిన నూతనప్రణాళికలనురచించేటప్పుడు – ఆ ప్రణాళిక ప్రపంచపరివ్యాప్తంకాకపోతే – ఈ భూగోళ విషయాల్ని విస్మరించలేము.

భారతదేశము, భారతప్రజలనుగురించి గాంధిజీకి తెలిసినది అపారం. ఆయనకు చరిత్రయందు ఆసక్తి లేకున్నా, కొందరికున్నట్లు చారిత్రకపరిజ్ఞానం అంతగా లేకున్నా భారతీయులచారిత్రకమూలాలను ఆయన పూర్తిగా గుర్తించాడు. వర్తమానసంఘటనలు ఆయనకెప్పటికప్పుడు తెలుస్తూనేఉంటాయి. ఆయన వాటిని శ్రద్ధగా పరిశీలిస్తాడు. కాని, ఆయన ప్రస్తుతభారతసమస్యలమీదే దృష్టిని కేంద్రీకరిస్తాడు. ఏ సమస్యలోగాని, ఏ పరిస్థితులలోగాని అనావశ్యకాలనన్నింటినీ వదలిపేసి, అత్యావశ్యకవిశేషాలనుమాత్రమే ఏరి తీసుకోగల ప్రత్యేకశక్తి ఆయనకున్నది. ప్రతిదాన్నీ తాను నైతికదృక్పథంఅనుకునే దానితోనే పరీక్షించడంవల్ల, ఒకానొకవట్టుచిక్కించుకుని, దీర్ఘదృష్టిని ప్రదర్శించగలుగుతాడు. "ఆయన (గాంధీజీ) ఎత్తుగడల్లో ఎన్నితప్పులు చేసినా, కీలకవ్యూహంమాత్రం సరైనదే అయివుంటుం"దని జార్జి బెర్నార్డ్‌షా చెప్పాడు. ఏమైనా, అనేకమందికి దీర్ఘకాలంతో నిమిత్తంలేదు. వారికి తాత్కాలికఎత్తుగడలోని తత్క్షణఫలితంమీదే అధికశ్రద్ధ.

### ౧౦ భారతదేశానికి సర్ స్టాఫర్డ్‌క్రిప్సు రాక

పెనాంగ్, సింగపూరులు పతనమై, జపానీయులు మలయాలోనికి పురోగమించడంతో భారతీయులూ, తదితరులూ కాందిశీకులై,

తండోపతండాలుగా భారతదేశానికి రాసాగారు. వారు హఠాత్తుగా తమనెలవులను వదలి రావలసివచ్చినందువల్ల కట్టుకున్నగుడ్డలుతప్ప మరేమీ వెంటతెచ్చుకోలేకపోయారు. వెంటనే బర్మానుంచికూడా లక్షలాది - అందులో ఎక్కువమంది భారతీయులు - కాందిశీకులు రాజొచ్చారు. పౌరపాలన, తదితరశాఖల అధికారులు వారి నెలా దిక్కుమాలినవారినిగా ఎవరిగతికి వారిని వదలివేశారో ఆ స్థితి భారత దేశమంతటా వ్యాపించింది. ఆ కాందిశీకులు పర్వతాలమీదుగా, దుర్గమారణ్యాలగుండా శతృవులముట్టడులమధ్యగా వందలాదిమైళ్ళు కాలినడకను రావలసివచ్చింది. అనేకమంది కత్తిపోటులకెరమై, జబ్బులకూ, పస్తులకూ ఆహుతై, దారిలోనే చనిపోయారు. అది యుద్ధం యొక్క భయంకరఫలితాల్లో ఒకటి గనుక, దాని నంగీకరించవలసినదే. కాని, భారతీయ, బ్రిటిష్ కాందిశీకులు వేర్వేరుగా చూడబడడం మాత్రం యుద్ధఫలితం కాదు. బ్రిటిష్‌వారికి సాధ్యమైనంతవరకు సౌకర్యాలుకలిగిస్తూ, వారిసహాయానికీ, రవాణాకూ ప్రత్యేకపు యేర్పాట్లు చేయబడ్డాయి. బర్మాలో కాందిశీకులు అసంఖ్యాగా చేరే ఒకచోటు నుంచి భారతదేశానికి వచ్చేందుకు రెండు మార్గా లున్నాయి. వాటిలో మంచిస్థితిలో వున్నమార్గాన్ని బ్రిటిష్‌వారికీ, యూరోపియనులకూ మాత్రమే కేటాయించబడింది. అందువల్ల ఆ రోడ్డుకు "తెల్లరోడ్డు" అని కూడా పేరు ఏర్పడింది.

జాతివిద్వేషము, ప్రజాసంకటాలను గురించిన భయంకరమైన వార్తలు మాకు చేరాయి. చావకుండామిగిలిన కాందిశీకులు ఆకలి కల్లాడుతూ భారతదేశమంతటా వ్యాపించి, యీ వార్తలు చెబుతూ, భారతీయహృదయంపై గాఢముద్రవేశారు.

అదేసమయంలో బ్రిటిష్‌ప్రభుత్వయుద్ధకాలమంత్రివర్గప్రతిపాదనతో సర్ స్టాఫర్డ్ క్రిప్స్ భారతదేశానికి వచ్చాడు. ఆ ప్రతిపాదనలు గత రెండున్నరసంవత్సరాల్లోనూ పూర్తిగా చర్చించబడి, అప్పటికే, గతచారిత్రకాంశము లైపోయాయి. ఆ ప్రతిపాదనలఅనంతరం జరిగిన సంప్రదింపుల్లో పాల్గొన్నవ్యక్తి వాటినిగురించి వివరించిచెప్పడం కష్టమేమీ కాదు. కాని, ఆవిషయాలను మరో భవిష్యత్సమయంలో చెప్పేందుకు వాయిదావేయడమే మంచిది. వాస్తవానికి, ఆ ప్రతిపాద

నలకుసంబంధించినవిశేషాలూ, అంతర్గతాభిప్రాయాలూ ఎప్పుడో బహిరంగంచేయబడ్డాయి.

ఆ ప్రతిపాదనలను మొట్టమొదటగా చదివినప్పుడు నే నెంతో నిరాశాహతుడ నైనట్లు నాకు గుర్తు. సర్ క్రిప్సునుంచీ, అప్పు డుద్భవించిన క్లిష్టపరిస్థితినుంచీ ఈ ప్రతిపాదనలకంటె ఖచ్చితమైనదేదో జరుగుతుందని నే నాశించడమే యీనిరాశకు ముఖ్యకారణం కావచ్చు. ఆ ప్రతిపాదనలను చదివినకొద్దీ, వాటి అంతరార్థాలను పరిశీలించిన కొద్దీ నా నిరాశ మరింత అధికంకాజొచ్చినది. భారతీయసమస్యలతో పరిచయంలేని వ్యక్తి యీప్రతిపాదనలు మాకోర్కెలను చాలవరకు తీరుస్తున్నాయనుకోవడాన్ని నే నర్థంచేసుకోగలను. కాని, వాటిని సాకల్యంగా విడమర్చి పరిశీలిస్తే వాటిలో అనేక పరిమితులున్నాయి. మా స్వయంనిర్ణయసూత్రాన్ని అంగీకరించడంలోకూడా మా భవిష్యత్తును ప్రమాదభరితంచేసే దిగ్బంధనాలతో సంకుచితంచేశారు.

వర్తమానంలో మా సహకారాన్ని అస్పష్టంగా ఆహ్వానిస్తున్న తుదిసూచనఒకటి వున్నా, ఆ ప్రతిపాదనలు ముఖ్యంగా భవిష్యత్కాలానికి – యుద్ధానంతరసమయానికే వుద్దేశింపబడ్డాయి. ఆ భవిష్యత్తు స్వయంనిర్ణయసూత్రాన్ని ఉద్ఘాటిస్తూనే, రాష్ట్రాలు భారతసమాఖ్యలో చేరకుండావుండేందుకూ, ప్రత్యేకస్వతంత్రరాజ్యాలుగా వ్యవహరించేందుకూ స్వేచ్ఛనిస్తుంది. అంతేగాక, సంస్థానాలుకూడా భారతసమాఖ్యలో చేరకుండావుండేందుకు యిలాంటిహక్కే కల్పించబడింది. భారతదేశంలో ఆరువందలసంస్థానాలవరకు వున్నాయనీ, అందులో కొన్నిమాత్రం పెద్దవనీ, అనేకం మరీ చిన్నవనీ మనం గుర్తుంచుకోవాలి. ఈ సంస్థానాలూ, రాష్ట్రాలూ అన్నీకలసి, రాజ్యాంగచట్టాన్ని రచించబూనుకుంటాయి. రాజ్యాంగంరూపొందడంలో వాటి పలుకుబడి వుంటుంది. కాని, ఆ తర్వాత ఆచట్టంతో సంబంధంలేకుండా విడిపోవచ్చు. ఈ ప్రతిపాదనలవెనుక గల ముఖ్యాశయం వేరుపడాలనే మనస్తత్వా న్నేర్పరచడమే. వాస్తవమైన రాజకీయార్థికసమస్యలు రెండోస్థానంలోనే వుంటాయి ఒకదానికొకటి ఎన్నివిధాలుగానో భిన్నంగావుండే అభివృద్ధినిరోధకశక్తులు ఏకమై, బలీయము, అభ్యుదయకరమునైన ఐక్యజాతీయప్రభుత్వం రూపొందకుండా భగ్నంచేస్తాయి.

ఎవరెప్పుడు పడిపోతారోననే నిరంతరభయంవల్ల రాజ్యాంగచట్టంలో వాంఛనీయంకానిసూత్రాలు కొన్నిచేర్చబడవచ్చు. కేంద్రప్రభుత్వం బలహీనము, నిర్వీర్యము చేయబడవచ్చు. అయినా, వేరుపడడం ఆగకపోవచ్చు. అటువంటప్పుడు రాజ్యాంగచట్టాన్ని మళ్ళీ మరో విధంగా మలచి, మిగిలినరాష్ట్రాలకూ, సంస్థానాలకూ, మరింత ఆచరణీయంగాచేయడం దుస్తరమౌతుంది. రాజ్యాంగరచనాసంఘానికి రాష్ట్రాలప్రతినిధులు ప్రస్తుత ప్రత్యేకమతనియోజవర్గాలపద్ధతినే ఎన్నికవుతారు. ఇది వెనుకటి విడివడిపోవడాన్ని తెచ్చిపెడుతుంది గనుక దురదృష్టకరమే. కాని, ప్రస్తుతపరిస్థితిల్లో యిది అనివార్యం. సంస్థానాల విషయంలో మాత్రం ఎన్నికలకు అవకాశంలేదు. వాటిలోనివసిస్తున్న 9 కోట్లమంది పూర్తిగా విస్మరింపబడ్డారు. ఆ సంస్థానాలనుపాలిస్తున్న భూస్వామ్యమనస్తత్వంగలపాలకులు తమ జనాభాదామాషాప్రకారం తమ ప్రతినిధులను నియమిస్తారు. ఇలా నియమింపబడినవారిలో కొందరు సమర్థులైనమంత్రులే వుండవచ్చు. కాని, మొత్తంమీద సంస్థాన ప్రజలకు గాక, నిరంకుశసంస్థానాధీశునికే ప్రాతినిధ్యంవహించకతప్పదు. ఇట్టిప్రతినిధులు రాజ్యాంగరచనాసంఘంలో నాల్గవవంతువరకు వుండి, తమ సంఖ్యాబలంతో, సాంఘికమైన వెనుకచూపుమనస్తత్వంతో, తరువాత విడిపోగలమనే నిరంతరమైనబెదరింపుతో -- రాజ్యాంగరచనా సంఘంలో సభ్యులుగా ఎన్నికైనవారు, ఎన్నుకోబడనివారూకూడ - కలగూరగంపగా వుంటారు. కొందరు ప్రత్యేకమతనియోజకవర్గపద్ధతిని, మరికొందరు స్వార్థప్రయోజకశక్తులవల్ల ఎన్నుకోబడగా, మరికొందరు సంస్థానాధీశులచేత నియమింపబడుతారు. దీనికితోడు సంయుక్తనిర్ణయాలను అంగీకరించాలనే వత్తిడికూడా లేదు. అందువల్ల ఈ సంఘానికి సమగ్రమైన తుదినిర్ణయాలుచేయాలనే వాస్తవానుభూతి వుండదు. ఈ సంఘంలోనిఅనేకమంది సంఘనిర్ణయాలను అమలుపరచేబాధ్యతను స్వీకరించకుండా, ఎప్పుడైనా పైదొలగిపోవచ్చుగనుక, ఎక్కువగా బాధ్యతారహితంగాప్రవర్తించేధోరణి యేర్పడుతుంది.

భారతదేశాన్ని ముక్కచెక్కలుగా విభజించాలనేప్రతిపాదన ఏదైనా తలచుకోవడానికే బాధాకరంగా వుంటుంది, ప్రజలను సముత్సహింపజేసే మానసికగాఢానుభూతులను, గాఢవిశ్వాసాలను, యిది

దెబ్బకొడుతుంది. భారతజాతీయోద్యమమంతా కూడా భారతదేశ సమైక్యతమీదనే నిర్మింపబడింది. సమైక్యానుభూతి యీ జాతీయోద్యమంకంటె పురాతనమై, భారతచారిత్రకయుగాల్లోనే ప్రభవించింది. ఈ విశ్వాసానుభూతులు ఆధునికపరిణామాలవల్ల మరింత బలపరచబడి, కోట్లాదిప్రజల జీవితసిద్ధాంతంగా, ఏసవాలూ సందిగ్ధమూ లేనిదిగా రూపొందింది. ముస్లింలీగునుంచి ఒకసవాలు రాకపోలేదు. అయితే, దాన్ని ఎవరూ సరకుచేయలేదు. ముస్లిములలోకూడా ఎక్కువమంది దాన్ని అంగీకరించలేదు. ఆ సవాలైనా ఒక భూభాగాన్ని విభజించాలనే అస్పష్ట, అనిశ్చితసూచనచేసినా, ప్రాంతీయప్రాతిపదికే పునాదిగా జరిగియుండలేదు. మతవిభేదాలపై ఆధారపడిన మధ్యయుగాలనాటి జాతులమనస్తత్వమే దీనికి పునాది. ఆవిధంగా, ప్రతిగ్రామంలోను రెండు జాతులు వున్నాయి. భారతదేశవిభజనకూడా ఈ సర్వవ్యాపితమత విభేదాలను తప్పించలేదు. విభజన అది పరిష్కరించనుద్దేశించిన సమస్యలను మరింత క్లిష్టపరుస్తుంది.

భావానుభూతియేగాక అనేకగట్టికారణాలుకూడా దేశవిభజనను వ్యతిరేకిస్తున్నాయి. ముఖ్యంగా బ్రిటిష్‌ప్రభుత్వవిధానాలవల్లనే భారతదేశ సాంఘిక, ఆర్థికసమస్యలు ఒక ప్రమాదస్థితికి చేరుకున్నాయి. రాగల ఘోరవిపత్తులను తప్పించుకోవాలంటే శీఘ్రంగా, సమగ్రపురోగమనం సాధించవలసివున్నది. భారతదేశంలో ఒకప్రాంతానికిగల లోటును మరొకప్రాంతం తీర్చవలసివున్నందువల్ల, యావద్భారతానికీ ఒక వాస్తవ ప్రయోజనకరప్రణాళికను అమలుజరిపితేనే ఆ పురోగమనం సాధ్యమౌతుంది. భారతదేశాన్ని మొత్తంగాచూస్తే, స్వయంపోషకమైన బలిష్ఠదేశంగా కనుపిస్తుంది. కాని, ఒక్కొక్కప్రాంతాన్నే పరిశీలిస్తే, ప్రతిదీ బలహీనంగా, పరాశ్రయంగా కనపడుతుంది. ఇవీ, తదితర వాదనలూ గతకాలానికి సరిపోయినట్లయితే, ఆధునికరాజకీయార్థిక పరిణామాలవల్ల వాటిప్రాముఖ్యత రెట్టింపయింది. ప్రతిదేశంలోను చిన్నచిన్నరాజ్యాలు స్వతంత్రంగావుండడం తగ్గిపోతోంది. అవి పెద్ద రాజ్యాల్లో కలిసిపోవడమో, పెద్దవాటికి ఆర్థికోపాంగాలు కావడమో జరుగుతోంది. అభివృద్ధిచెందడానికి విశాలసమాఖ్యలుగా లేక అనేక రాజ్యాలు కలసి ఒకటిగా వ్యవహరించాలనే తప్పనిసరిధోరణివుంది.

జాతీయరాజ్యమనేభావం అనేకజాతులరాజ్యమనేభావానికి తావిస్తోంది. సుదూరభవిష్యత్తులో ప్రపంచసమాఖ్యదృశ్యం కనుపిస్తోంది. ఈ పరిస్థితిలో భారతదేశాన్ని విభజించాలని ఆలోచించడం ఆధునిక చారిత్రక, ఆర్థికప్రవాహానికేఎదురీదడంవంటిది. అదొక విచిత్ర ఊహాకల్పనయొక్క చరమదశగా కనుపిస్తుంది.

అయినా అత్యవసరపుఒత్తిడివల్లనో ప్రమాదనిర్బంధంవల్లనో వాంఛనీయంకాని విషయాలుకూడా వప్పుకోవలసివస్తుంది. హేతుబద్ధంగా, సాధారణంగా విభజించబడగూడనిదాన్ని విభజించేట్లు పరిస్థితులు వత్తిడిచేయవచ్చు. కాని, బ్రిటిష్ప్రభుత్వంతరఫున చేయబడిన ప్రతిపాదనలో భారతదేశాన్ని తప్పకుండా విభజించాలనే స్పష్టనియమాన్ని దేన్నీ సూచించలేదు. ఆ ప్రతిపాదనలు రాష్ట్రాలను, సంస్థానాలనుకూడా లెక్కలేనన్ని ముక్కలుచేసేందుకు మార్గమేర్పరిచాయి. ఇవి అభివృద్ధినిరోధక,ఫ్యూడల్వర్గాలను,సాంఘికంగా వెనుకబడ్డ ముఠాలను అన్నింటినీ గట్టిగా విభజనకోరేటట్టుగా రెచ్చగొట్టాయి. అందులో ఏ ఒక్కటీకూడా తనకాళ్ళపైతాను నిలబడలేదు గనుక, బహుశా ఎవ్వరూ మనస్ఫూర్తిగా విభజన కోరివుండరు. కాని, వా రెన్నో కష్టాలు కల్పించగలరు; స్వతంత్రభారతప్రభుత్వం యేర్పడకుండా అడ్డంకులుకల్పించి, నిలిపివేయగలరు. బ్రిటిష్విధానం వారిని సమర్థించేటట్లయితే – ఇంతే జరిగివుంటుంది – దీర్ఘకాలంవరకు స్వాతంత్ర్యసిద్ధిఅనే ప్రసక్తే వుండదు. బ్రిటిష్విధానపువిషం మాకు అనుభవేద్యమే. అది ప్రతిసందర్భంలోనూ చీలిపోయే ధోరణినే ప్రోత్సహించినదని మేమెరుగుదుము. ఇకముందుకూడా ఇదేవిధానాన్ని కొనసాగించదనీ, తర్వాత తాము చెప్పిన సత్పరిస్థితులేర్పడనందువల్ల, తమ వాగ్దానాలను చెల్లించలేమని ప్రకటించదనీ హామీ ఏమిటి? వాస్తవానికి, యిదేవిధానం కొనసాగుతుందనేసూచనలే ఎక్కువగా వున్నాయి.

కాబట్టి ఈ ప్రతిపాదన పాకిస్తాన్ను లేక మరోవిభజనను అంగీకరించడం మాత్రమే కాదు. అంతకంటె దుష్టంగా, లెక్కలేనన్ని విభజనలకు తలుపు తెరచివుంచడమే అవుతుంది. ఈధోరణి భారతస్వాతంత్ర్యానికి నిరంతరప్రమాదంవంటిది; యీప్రతిపాదనలుచేస్తున్నవాగ్దానాన్ని తీర్చడానికి అడ్డుగోడవంటిది.

భారతసంస్థానాలభవిష్యత్తునుగురించి ఆ సంస్థానాలప్రజలుగాని, వారు ఎన్నుకున్నప్రతినిధులుగాని నిర్ణయించరు. నిరంకుశపాలకులే ఆ నిర్ణయంచేస్తారు. ఈ సిద్ధాంతాన్ని మేము అంగీకరిస్తే, చిరకాలంగా నెలకొనివుండి, తరచుగా ఉద్ఘాటించబడిన మా విధానాన్నే త్రోసిపుచ్చినట్లయ్యేది; సంస్థానాలప్రజలకు ద్రోహంచేసి, వారు మరింకెంతోకాలం నిరంకుశపాలనక్రిందనే వుండాలని విధించినట్లయ్యేది. ప్రజాస్వామ్యంవైపు మొగ్గేందుకు సంస్థానాధీశులసహకారాన్ని పొందాలనే కాంక్షతో, మేము వారితో సాధ్యమైనంతమృదువుగా వ్యవహరించడానికి సిద్ధంగావున్నాం. బ్రిటిష్‌వారిలాగా మూడోపక్షమొకటి లేకపోతే, మా ప్రయత్నం సఫలమయ్యేదే. కాని, బ్రిటిష్‌ప్రభుత్వం సంస్థానాల్లో నిరంకుశరాజరికాన్ని సమర్థిస్తూంటే, సంస్థానాధీశులు భారతసమాఖ్యలోచేరకుండా విడిగానే వుండిపోవచ్చు. తమస్వంతప్రజలనుంచి తమనురక్షించుకునేందుకు బ్రిటిష్‌సైనికబలంమీదనే ఆధారపడవచ్చు. నిజానికి, అట్టిపరిస్థితు లేర్పడితే, సంస్థానాల్లో విదేశీసాయుధదళాలను వుంచుతామని మాకు చెప్పారుకూడాను. ప్రతిపాదింపబడిన భారతసమాఖ్యలో యీ సంస్థానాలు విడివిడిద్వీపాల్లాగా వుండగలవు. అందువల్ల, విదేశీసైన్యాలు ఆ సంస్థానాలకు ఎలాచేరుతాయి, ఒక సంస్థానంలోని సైన్యం మరొకసంస్థానంలోనిసైన్యంతో ఉత్తరప్రత్యుత్తరాలుజరుపుకునే దెలాగు అనే ప్రశ్నలుదయించాయి. అందువల్ల, విదేశీసైన్యాలు భారతభూభాగంమీదుగా పయనించేహక్కు నివ్వవలసినఅవసరం ఏర్పడుతుంది.

గాంధిజీ తాను సంస్థానాధీశులకు శత్రువుకాదని పదేపదే ప్రకటించాడు. ఆయన వారిపాలనాపద్ధతులను, ప్రజలకు కనీసపు ప్రాథమికహక్కులుకూడా లేకుండాచెయ్యడాన్ని తరచుగా విమర్శించినా, వాస్తవంలో సంస్థానాధీశులపట్ల ఎప్పుడూ స్నేహభావాన్నే ప్రదర్శించాడు. సంస్థానాలప్రజలే తమకుతాముగా ముందంజవేసి, ఆత్మవిశ్వాసము, బలము పెంపొందించుకోవాలనే నమ్మకంతో కాంగ్రెసు ప్రత్యక్షంగా సంస్థానాలవ్యవహారాల్లో జోక్యంకల్పించుకోకుండా అనేకసంవత్సరాలవరకు ఆపినది గాంధీజీయే. ఆయనగారి యీ దృక్పథాన్ని మాలో అనేకమందిమి సమర్థించలేదు. కాని, ఆ దృక్పథంవెనుక ఒక ప్రాథమిక

విశ్వాసం వుంది. దాన్ని ఆయనే యిలా వర్ణించాడు: "బ్రిటిష్‌వారి పాలనక్రిందగల భారతప్రజలస్వాతంత్ర్యంకోసమైనాసరే, సంస్థానాల ప్రజలహక్కులను అమ్మివేసేవర్తకుడను ఎన్నటికీ కాలేను. ఇదే నా దృక్పథంలోగల ఒక ప్రాథమికవిశ్వాసం." బ్రిటిష్‌కామన్వెల్తు, భారత రాజ్యాంగచట్టాలలో నిష్ణాతుడైన ప్రొఫెసర్ బెర్రీడేల్ కీత్ సంస్థానాలవిషయంలో గాంధీజీవాదాన్ని (అదే కాంగ్రెసుసంస్థవాదం) సమర్థించాడు. ఆయన ఇలా వ్రాశాడు: "సంస్థానాలప్రజలకు రాష్ట్రాల్లోని భారతీయులకిచ్చిన హక్కులవంటివి లేకుండాచెయ్యాలని చక్రవర్తి సలహాదారులు చెప్పడం అసంభవం. చక్రవర్తిగారు తనఅధికారాన్నిప్రయోగించి సంస్థానాధీశులు అద్యతనభావిలోనే బాధ్యతాయుతప్రభుత్వాలు యేర్పడేవిధంగా రాజ్యాంగసంస్కరణలుచేసేట్లు చూడాలని సలహాయివ్వడం, యీసలహాదారులవిస్పష్టబాధ్యత. భారతదేశప్రయోజనాలదృష్ట్యా దానిసమాఖ్యలో (కేంద్రప్రభుత్వంలో) రాష్ట్రాలనుంచి ఎన్నికైన ప్రతినిధులు బాధ్యతారహితులైన సంస్థానాదీశులప్రతినిధుల సరసను కూర్చోవాలనేది ఊహించరానిది. చక్రవర్తితోపాటు, సంస్థానాధీశులుకూడా తమఅధికారాలను ప్రజలపరంచేయకతప్పదని గాంధీ చేస్తున్నవాదనకు నిజంగా జవాబేలేదు." బ్రిటిష్‌ప్రభుత్వం అంతకుముందు భారతసమాఖ్యను ప్రతిపాదిస్తూ సూచనలుచేసిన సందర్భంలోనే ప్రొఫెసర్ కీత్ యిలా వ్రాశాడు: సర్ స్టాఫర్డ్ క్రిప్స్ తెచ్చిన ప్రతిపాదనలకు యీమాటలు మరింత చక్కగా వర్తిస్తాయి.

ఈ ప్రతిపాదనలనుగురించి ఆలోచించినకొద్దీ అవి మరింత విచిత్రంగా కనుపిస్తాయి. భారతదేశం నామమాత్ర స్వతంత్రంగల, అర్థ స్వాతంత్రంగల అనేకానేకరాజ్యాల పచ్చీసుబల్లలా తయారైంది. వాటిలో అనేకరాజ్యాలు నిరంకుశపాలనను రక్షించుకునేందుకు బ్రిటిష్ సైన్యాలపై ఆధారపడివుంటాయి. రాజకీయంగాగాని, ఆర్థికంగాగాని ఐక్యత వుండదు. బ్రిటన్ అనేక చిన్నచిన్నసంస్థానాలను అజ్మాయిషీ చేస్తూ, తద్వారా భారతదేశరాజకీయార్థికరంగాల్లో ఆధిపత్యం కొనసాగిస్తూనేవుంటుంది.

భవిష్యత్తునుగురించి బ్రిటిష్‌ప్రభుత్వయుద్ధకాలమంత్రివర్గం వుద్దేశ్యం యేమిటో నాకు తెలియదు, సర్ స్టాఫర్డు క్రిప్సు భారతదేశ

శ్రేయాన్నే కాంక్షించాడనీ, భారతదేశం స్వతంత్రంగా, సమైక్యంగా నెలకొనడం చూడాలని ఆశించాడనీ నేననుకుంటాను. కాని, ఇది వ్యక్తిగతదృక్పథాలకూ, అభిప్రాయాలకూ లేక వ్యక్తిగతశుభాకాంక్షలకూ సంబంధించినది కాదు. మేము పరిశీలించవలసినది ఒకదేశపు రాజకీయపత్రాన్ని. అది ప్రయత్నపూర్వకసందిగ్ధధోరణిలోనైనా ఎంతో జాగ్రత్తగా వ్రాయబడింది. పైగా మేము అంగీకరించినా, నిరాకరించినా మొత్తంగానే జరగాలి. దానివెనుక ఒకశతాబ్దంవెనుకనుంచీ నిరంతరం సాగుతూన్న బ్రిటిష్‌ప్రభుత్వవిధానం ఒకటి వుంది. అది భారతదేశంలో విభేదాలుసృష్టించడం, జాతీయపురోగమనాన్నీ, స్వాతంత్ర్యాన్నీ అడ్డగించే ప్రతిదాన్నీ ప్రోత్సహించడమే. గతంలో వేయబడ్డ ప్రతిముందడుగుకు అనేక నిబంధనలు, పరిమితులు అడ్డుగా వుండేవి. ప్రతిదీ ఆదిలో అత్యల్పంగా కన్పించి, క్రమంగా దాటలేని అడ్డంకిగా, గెంతలేని అగాధంగా తయారయ్యేది.

ఈ ప్రతిపాదనవల్ల జరుగగల విషమపరిణామాలన్నీ రూపొందడం సంభవించకపోవచ్చు. జ్ఞానము, దేశభక్తి, భారతదేశానికీ ప్రపంచానికీ ఏది మేలుకాగలదనే దీర్ఘదృష్టీ అనేకమందిపై – భారతసంస్థానాధీశులపైన, మంత్రులపైన కూడా – ప్రభావంకలిగివుంటాయనడంలో సందేహంలేదు. మాగతికి మమ్మల్ని వదలిపెడితే మేము పరస్పరవిశ్వాసంతో కలుసుకుని, సమస్యల్లోని చిక్కులను, ప్రతిముఖాను ఎదుర్కొనే కష్టాలనూ చర్చించుకునేవాళ్ళం. పూర్తిగా సంప్రదించుకున్నతర్వాత సమగ్రపరిష్కారాన్ని రూపొందించుకునేవాళ్ళం. కాని, మేము స్వయంనిర్ణయసూత్రాన్ని అమలుజరుపుకోబోతున్నామని సూచించినప్పటికి మా గతికి మమ్మల్ని వదలడంలేదు. బ్రిటిష్‌ప్రభుత్వం ఎప్పుడూ కీలకస్థానాన్ని ఆక్రమించుకొని, పొంచికూర్చుని, అనేకవిధాలుగా జోక్యం కల్పించుకుంటూ, అడ్డుపుల్లలు వేస్తూనేవుంది. అది పాలనాయంత్రాంగాన్నీ, సైనికశాఖ మొదలైనవాటినీ అదుపులోవుంచుకోవడమేగాక, సంస్థానాల్లో దానిరాజకీయప్రతినిధులు, రెసిడెంటులు, ప్రముఖస్థానాలాక్రమించుకునివున్నారు. వాస్తవానికి, సంస్థానాధీశులు తమప్రజలపట్ల నిరంకుశంగా ప్రవర్తించే స్వేచ్ఛకలిగివున్నా, నేరుగా వైస్రాయిఆధ్వర్యానవున్న రాజకీయశాఖయొక్క ఆజ్ఞాయిషీకిమాత్రం దాసులే,

వారిముఖ్యమంత్రుల్లో అనేకమంది బ్రిటిష్ప్రభుత్వాల్లోవుండి, బ్రిటిష్ వారిచేత బలవంతంగా సంస్థానాలకు అంటగట్టబడ్డవారే.

బ్రిటిష్వారి యీ ప్రతిపాదనలవల్ల రాగలదుష్ఫలితాల్లో అనేకం మేము తప్పించుకున్నా, భారతస్వాతంత్ర్యాన్ని హీనపరచి, పురోగమనాన్ని అరికట్టి, అపరిమితమైనకష్టాలను సృష్టించగల నూతనప్రమాదకరసమస్యలను రేకెత్తించేందుకు చాలినన్ని మిగిలేవున్నాయి. ఒకతరం క్రితమో, మరికొంచెముందో ప్రవేశపెట్టబడ్డ ప్రత్యేక మతనియోజక వర్గాలు తగినంతచెరుపు చెయ్యనేచేశాయి. ఇప్పుడు కల్లోలంసృష్టించే ప్రతి అప్రధానమైనవర్గానికి ద్వారాలు తెరువబడ్డాయి. భారతదేశం నిరంతరం విభజింపబడుతూనేవుండగలదనేభయాన్నికూడా తెచ్చిపెట్టారు. యుద్ధఫలితం ఎవరిని వరిస్తుందో తెలియనట్టే అనిశ్చితంగావున్నభవిష్యత్తుకోసం మమ్మల్ని యీయేర్పాట్లకు కట్టుబడివుంటామని ప్రతిజ్ఞచేయమన్నారు. జాతీయకాంగ్రెసుసంస్థయేగాక, ఎప్పుడూ బ్రిటిష్ప్రభుత్వాన్నేసమర్థిస్తూవచ్చిన మితవాదరాజకీయవేత్తలుకూడా యీ ప్రతిపాదనలను అంగీకరించలేమని ప్రకటించారు.

అయినా, అఖండభారతాన్నే గాఢంగా వాంఛించే కాంగ్రెసు సంస్థ అల్పసంఖ్యాకులను, తదితరవర్గాలను కలుపుకువచ్చేఆతురతతో, భారతదేశంలో ఏప్రాంతమూకూడా ఆ ప్రాంతంవారిఅభీష్టానికి వ్యతిరేకంగా భారతసమాఖ్యలో వుంచబడదని ప్రకటించింది కూడాను. అనివార్యపరిస్థితుల్లో దేశవిభజనకుకూడా కాంగ్రెసు అంగీకరించింది. కాని, అది యీధోరణిని ఏవిధంగానూ ప్రోత్సహించదలచలేదు. క్రిప్సుప్రతిపాదనలపై కాంగ్రెసుకార్యనిర్వాహకవర్గంచేసిన తీర్మానంలో యిలా చెప్పింది; "భారతస్వాతంత్ర్యము, ఐక్యతలకే కాంగ్రెసు కంకణంకట్టుకున్నది. ఆ ఐక్యతకు ఎలాంటి భిన్నంజరిగినా, ప్రత్యేకంగా ప్రజలు ఎప్పటికపుడు ఎక్కువవిశాలమైనసమాఖ్య లేర్పడాలని వాంఛిస్తున్న ఆధునికప్రపంచంలో అందుకుసంబంధించినవారందరికీ అపాయకరమే అవుతుంది. అట్టిదాలోచించడమే అతిబాధాకరంగా వుంటుంది. ఏమైనా ఈకార్యవర్గం ఏప్రాంతాన్నయినా అచటి ప్రజల ప్రకటితాభీష్టానికి, చిరకాలవాంఛకూ వ్యతిరేకంగా భారతసమాఖ్యలోనే వుండాలని వత్తిడి చేసేఆలోచనచేయలేదు. ఈ కార్యవర్గం ఈ సిద్ధాంతాన్ని అంగీకరిస్తూ,

భారతదేశంలోని ప్రతిభాగమూ ఒకేరకమైన, సహకారయుతజాతీయ జీవితాన్ని పెంపొందించుకునేందుకు తగినపరిస్థితుల్ని కల్పించడానికి శాయశక్తులా ప్రయత్నించాలని భావిస్తోంది. క్రొత్తసమస్యలనుసృష్టించ గల మార్పులేమీ చేయరాదనీ, ఆ ప్రాంతంలోవున్న ఇతర గణనీయ వర్గాలమీద వత్తిడితీసుకురారాదనీ పైసిద్ధాంతాన్ని అంగీకరించడంలోనే ఇమిడివుంది. సమాఖ్యలో బలమైనజాతీయప్రభుత్వాన్ని బలపరచాలనే సూత్రానుగుణ్యంగావుండి, ప్రతీప్రాంతమూ సాధ్యమైనంత సంపూర్ణ స్వయంనిర్ణయాధికారం కలిగివుండాలి. యుద్ధకాలపుబ్రిటిష్‌మంత్రివర్గం తరఫునచేయబడ్డ ప్రతిపాదన భారతసమాఖ్య పుట్టుకతోనే వేరుపడాలనే మనస్తత్వాన్ని, ప్రయత్నాన్ని ప్రోత్సహిస్తుంది. సంపూర్ణసహకారమూ, శుభాకాంక్షలూ అత్యావసరమైన ఆ శుభసమయంలో సంఘర్షణను సృష్టిస్తుంది. మతసంస్థల ఆందోళనను తృప్తిపరచేందుకే యీ ప్రతిపాదన ఇలాచేయబడిందని భావించవచ్చు. కాని, ఇంకా ఇతరఫలితాలుకూడా అనేకం ఏర్పడగలవు. వివిధవర్గాల్లో గల అభివృద్ధినిరోధక, అప్రధానశక్తులు కల్లోలంసృష్టించి, ప్రజలదృష్టిని దేశంముందున్న ప్రధానసమస్యలనుండి మరలించగలవు."

"నేటి భయానకవిషమపరిస్థితిలో వర్తమానానికే ప్రాముఖ్యత నివ్వాలి. భవిష్యత్తుకుసంబంధించినప్రతిపాదనలుకూడా ప్రస్తుతాన్ని మలచగలిగినంతవరకే ప్రాముఖ్యమైనవౌతాయి" అనికూడా కాంగ్రెసు కార్యవర్గం తీర్మానించింది. కార్యవర్గంవారు భవిష్యత్తుకుచెందిన క్రిప్సు ప్రతిపాదనలను అంగీకరించలేకపోయినా, భారతదేశం తనరక్షణబాధ్యతను సముచితంగా నిర్వహించేందుకుగాను ఏదోఒకపరిష్కారానికి రావాలని, తహతహలాడారు. అహింసాసిద్ధాంతచర్చగాని, ఏసందర్భంలోనూ దానిప్రసక్తిగాని రాలేదు. వాస్తవానికి, చర్చింపబడ్డవిషయాల్లో భారతదేశానికి రక్షణశాఖామంత్రిగా భారతీయుడే వుండాలనేది ఒకటి.

ఈస్థితిలో, భారతదేశానికి యుద్ధప్రమాదం ముంచుకొస్తున్నందున కాంగ్రెసుకార్యవర్గం భవిష్యత్తుకుసంబంధించినప్రశ్నలన్నింటినీ ఒక ప్రక్కనబెట్టి, యుద్ధంలో పూర్తిగా సహకరించగల జాతీయప్రభుత్వాన్ని యేర్పరచడానికే తనదృష్టిని కేంద్రీకరించేందుకు సిద్ధపడింది.

భవిష్యత్తునుగురించి బ్రిటిష్‌ప్రభుత్వంచేసిన ప్రత్యేకప్రతిపాదనలు అనేక రకాలప్రమాదకరబాధ్యతలకు దోవతీస్తున్నందువల్ల వాటిని కార్యవర్గం ఆమోదించలేకపోయింది. కార్యవర్గానికిసంబంధించినంతవరకు యీప్రతి పాదనలను కాంగ్రెసు అంగీకరించడంలేదని స్పష్టమైనందువల్ల, వాటిని బ్రిటిష్‌ప్రభుత్వం ఉపసంహరించుకోవచ్చు, లేదా వారిఉద్దేశచిహ్నంగా అలానే ఉండిపోవచ్చు. కాని, ప్రస్తుతంలో సహకారాన్నిసాధించే మార్గాన్వేషణకు యివి అడ్డంకి కానక్కరలేదు.

వర్తమానానికిసంబంధించినంతవరకు యుద్ధకాలపు బ్రిటిష్‌మంత్రి వర్గప్రతిపాదనలు అస్పష్టంగా, అసంపూర్తిగా వున్నాయి. భారతదేశ రక్షణ బ్రిటిష్‌ప్రభుత్వంచేతుల్లోనే వుండిపోవాలనిమాత్రం స్పష్టంచేయ బడింది. క్రిప్సు పదేపదేచేసినప్రకటనలనుబట్టి రక్షణశాఖనుతప్ప, మిగతా బాధ్యతలన్నింటినీ భారతీయులహస్తగతంచేస్తారనిపించింది. వైస్రాయి ఇంగ్లండుప్రభువులాగా నామమాత్రంగానే ప్రభుత్వపెద్దగా వ్యవహరిస్తాడనికూడా పేర్కొనబడింది. అందువల్ల ఇక మేము ఆలో చించవలసినది రక్షణసమస్యగురించిమాత్రమేననికూడా ఊహించాము. యుద్ధకాలంలో స్వరక్షణ అనేక తదితరజాతీయకార్యకలాపాలనూ, వ్యవహారాలనుకూడా పూర్తిచేసుకొనుస్తుండనేస్థితిలో మేము వున్నాము. చాలవరకు అలా జరిగిందికూడాను. జాతీయప్రభుత్వబాధ్యతలనుంచి రక్షణశాఖనే తొలగించేటట్లయితే, యింక మిగిలేది అతిస్వల్పమే. సాయుధదళాలమీద, సైనికకార్యకలాపాలమీద బ్రిటిష్‌సర్వసైన్యాధ్య క్షుడే పూర్తిఅధికారాన్ని కొనసాగిస్తుండడానికి అంగీకరించబడింది. సామాన్యయుద్ధవ్యూహాలన్నీ సామ్రాజ్యసిబ్బందే నిర్ణయించడాని కూడా ఆమోదించబడింది. ఇవన్నీ అలావుంచి జాతీయప్రభుత్వంలో రక్షణమంత్రికూడా వుండాలని కోరబడింది.

కొంత చర్చజరిగినతర్వాత భారతీయమంత్రిక్రింద రక్షణశాఖ వుండవచ్చునని సర్ క్రిప్సు అంగీకరించాడు. కాని, ఆ శాఖక్రింద పౌరసంబంధాలు, పెట్రోలు, కేంటీనులు (సైనికులకే సరుకులమ్మే అంగళ్ళు), ముద్రణ, వ్రాతసామగ్రి, విదేశీరాయబారవర్గాలకు పౌర సంబంధమైనయేర్పాట్లు, సైనికులకు సహాయసదుపాయాలుకూర్చడం మొదలైనవిమాత్రమే వుంటాయని ఆయన సూచించాడు. ఈ పట్టిక

విచిత్రంగా వుంది. ఇది రక్షణమంత్రిని అపహాస్యంపాలుచేయడమే. తరువాయిచర్చలు మరొకరకమైనయేర్పాటుకు దారితీశాయి. అయినా యిరుపక్షాలదృక్పథాలమధ్య ఇంకెంతో తేడావుంది. కాని, మాఅభిప్రాయాలు కొద్దికొద్దిగా దగ్గరకాసాగినవి. మొట్టమొదటిసారిగా నేనూ, మరికొందరుకూడా పరిష్కారం సాధ్యంకావచ్చుననే అనుకున్నాం. గాఢమౌతున్న యుద్ధప్రమాదం మా అందరిలోనూ ఒక అంగీకారానికిరావాలనే కాంక్షను వేగిరపెట్టింది.

యుద్ధము, దండయాత్రలప్రమాదం బలీయమైనది. ఏదిఏమైనా, దాన్ని ఎదుర్కోకతప్పదు. కాని దాన్ని ఎదుర్కోడానికి అనేకమార్గాలున్నాయి. వర్తమానంలోగాని, అంతకంటె ముఖ్యంగా భవిష్యత్తులోగాని దాన్ని వాస్తవంగా, ప్రయోజనకరంగా ఎదుర్కొనేపద్ధతి మాత్రం ఒక్కటే వుంది. ఈ మానసికపరిణామసదవకాశం చేజారిపోతుందేమోననీ, దానితోపాటు ప్రస్తుతఅపాయాలు చుట్టుముట్టడం, భవిష్యత్కాలపుటపాయాలు మరింతద్విగుణీకృతంకావడం జరుగుతుందేమో ననుకున్నాము. పాతఆయుధాలతోపాటు ఆధునికాయుధాలు కూడా కావాలి. వాటినుపయోగించే నూతనపద్ధతులు, నూతనోత్తేజాలు, నూతనావకాశాలు, భూతవర్తమానకాలాలకు తప్పకుండా భిన్నంగావుండే భవిష్యత్తుమీద ఒకనూతన విశ్వాసం అవసరం. అట్టి విశ్వాసానికి వర్తమానపరిస్థితియొక్కమార్పులోనే తగినరుజువు వుండాలి. బహుశా, మాఆతురత ఆశావాదాన్నిపెంచి, బ్రిటన్‌పాలకులకూ మాకూ మధ్యగలఅగాధాన్ని మరపించివుంటుంది. లేక దానిలోతునూ, వెడల్పునూ తగ్గించివుంటుంది. శతాబ్దాలుగావున్న శత్రుత్వము ఘోరప్రమాదము, విపత్తులభయంతోనైనా అంతరించడం అంతసులభంకాదు. సామ్రాజ్యవాదశక్తి అనివార్యమైనవత్తిడివస్తేనేతప్ప, తనవలసరాజ్యాధికారపుపిడికిలిని సడలించడం ఎన్నడూ సులభంగాజరుగలేదు. పరిస్థితులు అటువంటివత్తిడిని, తెలివిడిని సృష్టించాయా? మాకు తెలియదుగాని, అలాఅయివుండవచ్చుననే మేమాశించాము.

నేనెంతో ఆశతో ఉవ్విళ్ళూరుతున్నసమయంలోనే అనేకరకాలవిషపరిణామాలు సంభవించసాగాయి. లార్డ్ హాలిఫాక్స్ ఆమెరికాలో ఒకచోట ప్రసంగిస్తూ, జాతీయకాంగ్రెసును తీవ్రంగా నిందిం

చాడు. ఆసమయంలోనే అంతదూరానవున్న అమెరికాలో ఆయన అలా ఎందుకుచేశాడో స్పష్టంగాచెప్పలేము. కాని ఆయన బ్రిటిష్ ప్రభుత్వవిధానాన్నీ, అభిప్రాయాన్నీ ప్రతిబింబించేవాడుకాకపోతే, కాంగ్రెసుతో ముఖాముఖీ సంప్రదింపులుజరుగుతున్న సమయంలోనే అలా ప్రసంగించగలిగేవాడుకాదు. వైస్రాయి లార్డ్ లిన్‌లిత్‌గో, సివిల్ సర్వీసుఉన్నతాధికారులూ ఒకపరిష్కారం కుదరడానిగ్గాని, తమఅధికారాలను తగ్గించుకోవడానిగ్గాని పూర్తిగా వ్యతిరేకభావంచూపుతున్నారని ఢిల్లీలో యావన్మందికీ తెలిసిపోయింది. తెలిసీతెలియకుండా యింకెంతో జరిగింది.

రక్షణశాఖామంత్రివిధులనుగురించి తాజాపద్ధతిని చర్చించేందుకు మేము మళ్ళీ క్రిప్సును కలుసుకున్నప్పుడు, గతసంభాషణల్లోజరిగిన సూచనలన్నీ అప్రస్తుతమనీ, అసలు అధికారంగలమంత్రులే వుండబోరనీ తేలిపోయింది. వైస్రాయికార్యవర్గం యథాతథంగావుంటుంది. ఆ కార్యవర్గంలో రాజకీయపక్షాలప్రతినిధులైన భారతీయులనుకొందరిని అదనంగా నియమించడానికిమాత్రమే వుద్దేశింపబడింది. ఈకార్యవర్గం ఏదృష్టితోచూచినా మంత్రివర్గంవంటిది కాజాలదు. అది ప్రభుత్వశాఖాధిపతుల లేక కార్యదర్శులకూటమి మాత్రమే. అధికారాలన్నీ వైస్రాయిచేతుల్లోనే కేంద్రీకృతమైవుంటాయి. చట్టబద్ధమైనమార్పులు జరగాలంటే ఎక్కువవ్యవధికావాలని మేము గ్రహించాము. అందువల్ల మే మలాంటివాటికోసం వత్తిడిచెయ్యలేదు. కాని, వైస్రాయి యిలా ఏర్పడేకార్యవర్గాన్ని మంత్రివర్గసమంగా భావించి, దానినిర్ణయాలనామోదించేసాంప్రదాయాన్ని పాటించాలనిమాత్రం పట్టుబట్టాం. ఇది సాధ్యంకాదనీ, వైస్రాయిఅధికారాలు సిద్ధాంతరీత్యా, ఆచరణరీత్యా కూడా మార్చవీల్లేదనీ ఇప్పుడు చెప్పారు. గతంలో జరిగిన సంప్రదింపులన్నీ మరొకరకమైన ప్రాతిపదికమీద జరిగినందువల్ల, యీ పరిణామం మేము విశ్వసించలేనంత ఆశ్చర్యాన్ని కలిగించింది.

విదేశీదాడులనెదుర్కొనేందుకు భారతదేశశక్తులను ఎలా పెంపొందించగలమాఅని ఆలోచించాము. భారతసైన్యం తాను జాతీయసైన్యమేనని భావించేటట్లుచెయ్యాలనీ, ఆవిధంగా యుద్ధంలో దేశభక్తివాతావరణాన్ని చొప్పించాలనీ మేము ఆతురతపడ్డాము. దాడులుసంభ

విస్తే దేశీయాంతరంగికభద్రతనిమిత్తం కొత్తసైన్యాన్ని, యుద్ధదళాలను, హోంగార్డులను, మొదలైనవాటిని యేర్పాటుచెయ్యాలనికూడా చర్చించుకున్నాం. సహజంగా యివన్నీ సర్వసైన్యాధ్యక్షునిఅజ్మాయిషీకే లోబడివుంటాయి. మేము వీటినేర్పరచడానిక్కూడా వీల్లేదన్నారు. భారతసైన్యం వాస్తవానికి బ్రిటిష్‌సైన్యంలో ఒకభాగమేననీ, దానిని జాతీయసైన్యమని భావించడానికిగాని, పేర్కొనడానిగ్గాని వీల్లేదన్నారు. మేము పౌరసైనికదళాలను, హోంగార్డులను యేర్పాటుచెయ్యడానికైనా అవకాశమిస్తారనేది అనుమానాస్పదమే.

అందువల్ల, క్రిప్సుప్రతిపాదనలూ, సంపదింపులవల్ల తేలిన సారాంశ మేమిటి? ఇప్పుడున్నప్రభుత్వవ్యవస్థ యథాతథంగానే కొనసాగుతుంది. వైస్రాయికి నిరంకుశాధికారాలన్నీ వుంటాయి. మాలో కొందరు వైస్రాయి అనుయాయుల్లా నియమితదుస్తులు ధరించి, కేంటీనులవంటివాటిని అజ్మాయిషీచేస్తుండవచ్చు 18 నెలలక్రితం అమెరీ చేసినసూచనలన్నీ భారతదేశాన్ని అవమానించడంగా భావించాం. వాటికీ నేటి క్రిప్సుప్రతిపాదనలకూ ఏమాత్రం తేడాలేదు. ఈకాలంలో జరిగిన అనేక విశేషాలవల్ల మానసికంగా మార్పురావడం, వ్యక్తులనుబట్టికూడా విలువలుమారడం సత్యమే. బలిష్ఠులూ, సమర్థులూ సాధారణంగా వైస్రాయిసింహాసనంచుట్టూ మూగే బానిసలకంటె భిన్నంగా ప్రవర్తించగలరు.

కాని, ఏసందర్భంలోనైనా – ప్రత్యేకంగా ఆ సందర్భంలో – యిటిస్థితికి మేము వప్పుకోవడం అసంభవం. మేము అలా చెయ్యడానికి సాహసించినట్లయితే, మా ప్రజలే మమ్మల్ని ఈసడించి త్రోసిపుచ్చేవారు. వాస్తవానికి, ఆతర్వాత ప్రజలకీ విషయాలు తెలిసినప్పుడు సంప్రదింపుల్లో మేము దిగజారి బ్రిటిష్‌వారిసూచనల్లోకొన్నింటి కంగీకరించినందుకు గగ్గోలుపుట్టింది.

సర్ స్టాఫర్డ్ క్రిప్సుతో మేము సంప్రదింపులుజరిపినప్పుడు ఏసందర్భంలోనూ అల్పసంఖ్యాకులు, మతవర్గాలప్రసక్తే రాలేదు. ఆదశలో అసలది తలెత్తనేలేదు. భావిరాజ్యాంగచట్టపుమార్పులనుచర్చించేప్పుడు యిది ముఖ్యసమస్యే అయింది. కాని, బ్రిటిష్‌వారిప్రతిపాదనలకు ఆదిలోనే మేము తీవ్రవ్యతిరేకతను తెలిపేసరికి, ఈసమస్యలను ఉద్దేశ

పూర్వకంగా ఒకపక్కనుబెట్టారు. జాతీయప్రభుత్వానికి అధికారాన్ని వప్పగించాలనే మూలసిద్ధాంతాన్ని అంగీకరించినట్లయితే, ఆ ప్రభుత్వంలో ప్రాతినిధ్యంవహించిన ఏపక్షానికెంతబలంవుందో తేల్చుకోవలసి వచ్చేదిగనుక, యీ (అల్పసంఖ్యాక, మతవర్గ) సమస్య తప్పకుండా తలెత్తేది. కాని, ఆ సిద్ధాంతాన్నంగీకరించేస్థాయికే మేమెన్నడూ చేరనందువల్ల ఇతరసమస్యలప్రశ్న ఉదయించనూలేదు, దానినిగూర్చి ఆలోచించనూలేదు. మాకు సంబంధించినంతవరకు ప్రధానపార్టీలవిశ్వాసం చూరగొన్న బలిష్ఠజాతీయప్రభుత్వం యేర్పడాలనేఆతురత వున్నందువల్ల, ప్రాతినిధ్యంలో దామాషాసమస్య పెద్ద కష్టప్రదమైనది కాబోదని భావించాము. కాంగ్రెసు అధ్యక్షుడు అబుల్ కలాం ఆజాద్ సర్ స్టాఫర్డ్ క్రిప్సుకు ఇలా ఒకలేఖ వ్రాశాడు: "మేముప్రతిపాదించిన సూచనలు మావి మాత్రమే కాదనీ, అవి భారతప్రజలందరిఐక్యకాంక్షలుగా భావించవచ్చుననీ మేము మీకు స్పష్టంచేస్తున్నాము. ఈవిషయాలలో వివిధపక్షాలమధ్య, వర్గాలమధ్య అభిప్రాయభేదం లేదు. ఉన్నఅభిప్రాయభేదమల్లా మొత్తంభారతప్రజలకూ బ్రిటిష్ప్రభుత్వానికీ మధ్యనే. భారతదేశంలోగలఅభిప్రాయభేదాలు భావిరాజ్యాంగచట్టంలో రావలసినమార్పులకు సంబంధించినవి మాత్రమే. ప్రస్తుతక్లిష్టస్థితిలో భారతదేశరక్షణకై సాధ్యమైనంత ఎక్కువ ఐక్యభావాన్ని సాధించేందుగ్గాను మేమీ సమస్యను వాయిదావేసేందుకు వప్పుకుంటున్నాం. భారతదేశంలో యిట్టిఏకాభిప్రాయం ఏర్పడినప్పుడుకూడా స్వతంత్ర జాతీయప్రభుత్వం యేర్పడడాన్నీ, అది భారతదేశావసరాలను నేడు అష్టకష్టాలుపడుతూ, ప్రాణాలుకోల్పోతున్న లక్షలాదిప్రజల విశాలావసరాలను తీర్చేందుకు కృషిచెయ్యడాన్నీ బ్రిటిష్ప్రభుత్వం అడ్డగించడం విషాదాంతమునకే దారితీస్తుంది.

ఆ తర్వాత, చిట్టచివరిసారిగా కాంగ్రెసుఅధ్యక్షుడు వ్రాసిన లేఖలో యిలావుంది: "కాంగ్రెసు తానుగా అధికారాన్నిపొందాలని మేము వాంఛించడంలేదు. భారతప్రజలు మొత్తంగా స్వేచ్ఛను, అధికారాన్నీ పొందాలనిమాత్రమే మాకోరిక...బ్రిటిష్ప్రభుత్వం మాలో విభిన్నకరధోరణులను ప్రోత్సహించేవిధానాన్ని అనుసరించకపోతే, మేమందరం ఏపక్షానికి ఏవర్గానికి చెందినవారమైనాసరే, సన్నిహితు

లమై, ఒకే కార్యక్రమాన్ని అవలంబించగలిగేవాళ్ళమని మా నమ్మకం. కాని, దురదృష్టవశాత్తు ఈ భయంకరపరిస్థితిసమయంలో కూడా బ్రిటిష్‌ప్రభుత్వం తనవిచ్ఛిన్నకరవిధానాన్ని విడనాడలేకపోతోంది. అందువల్ల, బ్రిటిష్‌ప్రభుత్వం తనకుచేతనైనంతకాలం భారతదేశంపై తన అధికారాన్ని నిలబెట్టుకునేందుకే అధికప్రాముఖ్యతనిస్తున్నదనీ, ఆ లక్ష్యంతోనే మా దేశంలో అశాంతినీ, విచ్ఛిత్తినీ ప్రోత్సహిస్తోందనీ, మాపైన విరుచుకుపడబోతున్నదాడిని, దురాక్రమణను సమర్థవంతంగా ఎదురించి, రక్షించుకునేసమస్యకు ప్రాధాన్యతనివ్వడంలేదనీ మేము నిర్ణయించుకోవలసివచ్చింది. మాకు, భారతీయులందరికీగల ముఖ్యాలోచన భారతదేశభద్రత, రక్షణలే. మేము దేన్నయినా ఈ గీటురాయితోనే పరీక్షించి, నిర్ణయిస్తాము."

ఇదేవుత్తరంలో రక్షణసమస్యపై మా అభిప్రాయాన్నికూడా స్పష్టంచేశాడు – "సర్వసైన్యాధ్యక్షునిసాధారణాధికారాలను నిరోధించే సూచన లెవ్వరూ చేయలేదు. వాస్తవానికి, మేము అంతకంటె ముందంజవేసి, అతడే యుద్ధమంత్రిగావుంటూ, ఇంకా ఎక్కువఅధికారాలుకూడా పొందేందుకు అంగీకరించాము. కాని, రక్షణవిషయంలో మాకూ బ్రిటిష్‌ప్రభుత్వదృక్పథానికీ ఎంతో తేడావున్నదని స్పష్టమైంది. దానికి జాతీయరూపాన్నిచ్చి భారతదేశంలో ప్రతిస్త్రీ, ప్రతిపురుషుడూ అందులోపాల్గొనేటట్లు ప్రబోధించాలని మా భావన. అంటే, ఈ మహా ప్రయత్నంలో మాప్రజలపై విశ్వాసముంచి, వారిపూర్తిసహకారాన్ని కోరడమే. బ్రిటిష్‌ప్రభుత్వదృక్పథం భారతప్రజలమీదనమ్మకంలేకపోవడం మీద, ఆ ప్రజలకధికారంలేకుండా చెయ్యడంమీదా ఆధారపడివున్నట్లు కనిపిస్తుంది. ఘనతవహించిన బ్రిటిష్‌చక్రవర్తిప్రభుత్వం రక్షణవిషయంలో అత్యంత బాధ్యతకలిగివున్నట్లు మీరు సూచించారు. భారతప్రజలు తమబాధ్యతనుగుర్తించి, నిర్వర్తించకపోయినట్లయితే, మీప్రభుత్వం ఆ బాధ్యతను సక్రమంగా నిర్వర్తించలేదు. ఇటీవలజరిగిన సంఘటనలే దీనికి సాక్షీభూతాలు. ప్రజాసహకారప్రాతిపదికమీదనే యుద్ధం కొనసాగగలదని భారతప్రభుత్వం గుర్తించలేదు."

దాదాపు, కాంగ్రెసుఅధ్యక్షుడు ఈ చివరిలేఖను వ్రాసినవెంటనే సర్‌స్టాఫర్డ్ క్రిప్సు విమానంమీద ఇంగ్లండుకు వెళ్ళిపోయాడు. కాని,

అలా వెళ్ళకముందు, అక్కడికిచేరినతర్వాతకూడా కొన్ని బహిరంగప్రకట నలుచేశాడు. అవి వాస్తవానికి వ్యతిరేకంగావుండి, భారతీయులచే తీవ్రంగా నిరసింపబడ్డాయి. బాధ్యతగలభారతీయులు ఖండించినా, క్రిప్సు, తదితరులూ ఈ ప్రకటనలను పదేపదే పునశ్చరణచేశారు.

బ్రిటిష్‌ప్రతిపాదనలు కాంగ్రెసుచేతనేగాక, భారతదేశంలోని ప్రతిపక్షంచేత, ప్రతివర్గంచేత నిరాకరింపబడినవి. మా రాజకీయవేత్త లలో అత్యంతమితవాదులుకూడా ఆ ప్రతిపాదనలను నిరసించారు. ముస్లింలీగుతప్ప మిగతావర్గాలన్నీ దాదాపు ఒకేరకం కారణాలతో నిరాకరించాయి. ముస్లింలీగు దాని అలవాటుప్రకారం, ఇతరులందరు తమ అభిప్రాయాలు ప్రకటించేవరకు వేచియుండి, స్వకీయకారణాలతో తానూ ఆ ప్రతిపాదనలను నిరాకరించింది.

ఈ ప్రతిపాదనలను కాంగ్రెసు తిరస్కరించడానికిగలకారణం రాజీకిఇష్టంలేని గాంధీజీవైఖరియే కారణమని, బ్రిటిష్‌పార్లమెంటులోనూ యితరచోట్ల ప్రకటించబడింది. ఇది పూర్తిగా అసత్యం. ఈ ప్రతిపాదనల వల్లయేర్పడగల అస్పృష్ట, అసంఖ్యాకవిభజనను 9 కోట్లమంది భారతీయ సంస్థానాలప్రజలు తమభవిష్యత్తువిషయంలో మాట్లాడకుండా చేయ బడ్డవిధాన్ని అనేకమందితోపాటు, గాంధీజీకూడా తీవ్రంగానిరసించాడు. ఆ తర్వాత భవిష్యత్తునుగురించిగాక, వర్తమానంలో జరుగవలసిన మార్పులనుగురించే రాయబారాలుజరిగాయి. గాంధీజీసతీమణికి జబ్బుగా వున్నందువల్ల ఆయన ఆ రాయబారాల్లో పాల్గొనలేదు. కనుక ఆ చర్చల్లో ఆయనకేమీ బాధ్యతలేదు. కాంగ్రెసుకార్యవర్గం లోగడ అనేకసార్లు అహింసాసిద్ధాంతసమస్యమీద ఆయనతో ఏకీభవించలేదు. యుద్ధంలో సహకరించేందుకూ, ప్రత్యేకంగా దేశరక్షణకు కృషిచేసేం దుకూ జాతీయప్రభుత్వం ఏర్పడాలని కాంగ్రెసు తహతహలాడింది.

ప్రజలమనస్సుల్లో యుద్ధం తీవ్ర ఆలోచనకలిగించి అదే ముఖ్య సమస్యగా వుంది. భారతదేశంపై దాడి జరుగకతప్పదనిపించింది. కాని, పరిష్కారానికి అడ్డంకి యుద్ధం కాదు. ఎందువల్లనంటే, యుద్ధాన్ని నడుపవలసినది నిపుణులేగాని, సాధారణప్రజలు కాదు. యుద్ధాన్ని ఎలా నిర్వహించాలన్నవిషయంలో పరిష్కారంకుదరడం సులభమే. అధికారాన్ని జాతీయప్రభుత్వపరంచెయ్యాలనేదే అసలు

ప్రశ్న. ఇది భారతజాతీయవాదానికీ, బ్రిటిష్‌సామ్రాజ్యవాదానికీ మధ్య పాతవివాదాంశమే. యుద్ధం వున్నా లేకపోయినా ఇంగ్లండులోనూ, భారతదేశంలోనూగల బ్రిటిష్‌అధికారవర్గం తనపిడికిళ్లోవున్న దాన్ని బిగించివుంచుకోడానికే నిశ్చయించుకున్నది. వారివెనుక విన్‌స్టన్ చర్చిల్ గంభీరవిగ్రహం నిలబడివుంది.

## ౯ నిస్పృహ

క్రిప్సుసంప్రదింపులు తటాలున ఆగిపోవడం, ఆయన వెంటనే వెళ్ళిపోవడం ఆశ్చర్యాన్నికలిగించాయి. వర్తమానానికిసంబంధించినంత వరకు జరిగినపరిణామంప్రకారం, లోగడ అనేకసార్లుచెప్పినది మళ్ళీ చెప్పడానికేనా యీ బలహీనప్రతిపాదన చేసింది? ఇందుకేనా బ్రిటిష్ మంత్రివర్గసభ్యుడొకాయన భారతదేశానికి ప్రయాణమైవచ్చింది? లేక యిదంతా అమెరికాప్రజలను మభ్యపెట్టేందుకు ప్రచారపుఎత్తు మాత్రమేనా? ఇందుకు భారతీయులెంతో గట్టిగాను, తీవ్రంగాను నిరసించారు. ఇక బ్రిటన్‌తో రాజీకుదురుతుందనే ఆశ లేకపోయింది. భారతీయులకు వారుకోరినట్లు శత్రుదాడినుండి మాతృదేశాన్నిరక్షించుకునే అవకాశాన్నయినా యివ్వలేదు.

ఈలోగా దండయాత్రజరిగేసూచనలు పెరుగుతున్నాయి. ఆకలితోనకనకలాడే భారతీయకాందిశీకులు గుంపులుగుంపులుగా, తూర్పు సరిహద్దులగుండా భారతదేశంలోనికి వచ్చిపడుతున్నారు. తూర్పు బెంగాలులో శత్రుదాడిజరుగబోతోందనేభయభ్రాంతితో వేలాదిపడవలు ధ్వంసంచేయబడ్డాయి. (ఒక ప్రభుత్వఉత్తర్వును పొరపాటుగా అర్థంచేసుకున్నందువల్లనే యిది జరిగినదని, ఆతర్వాత చెప్పారు.) ఆవిశాల ప్రాంతమంతటా అనేకకాలువలున్నందువల్ల ఈ పడవలద్వారానే రాకపోకలు, రవాణా సాధ్యమౌతాయి. ఈ పడవలన్నీ ధ్వంసంచేయబడడంవల్ల అనేక జనపదాలకు బైటప్రపంచంతో సంబంధంలేకుండాపోయింది, అచటిప్రజల జీవనాధారాలూ, రాకపోకలసౌకర్యాలూ నాశనమైపోయాయి. బెంగాల్‌క్షామానికి యిదొకకారణమయింది. బెంగాలునుంచి భారీయెత్తున ప్రజలనుఖాళీచేయించేందుకు యేర్పాట్లుజరిగాయి. రంగూనులోను, దిగువబర్మాలోను, జరిగినదే బెంగాల్లోనూ జరుగవచ్చు

నని పించింది. జపానుయుద్ధనౌకాదళం మద్రాసువైపు వస్తున్నదనే అస్పష్టమైన, ధృవపడని పుకారు - ఇది అసత్యవార్తయని ఆతర్వాత తేలింది - వ్యాపించడంవల్ల, మద్రాసునగరంనుంచి. ఉన్నతప్రభుత్వోద్యోగులు హఠాత్తుగా దూరప్రాంతాలకు వెళ్ళిపోవడం, ఓడరేవులో కొన్నిసౌకర్యాలను ధ్వంసంచేయడం సంభవించాయి. భారతపౌరపాలనాశాఖ ఒకవిధమైన బలహీనతతో బాధపడుతున్నట్లు కన్పించింది. అది భారతజాతీయోద్యమాన్ని అణచడానికిమాత్రమే శక్తికలిగివుంది.

మే మిక యేంచెయ్యాలి? భారతదేశంలో యేభాగమైనా విదేశీదాడికి లొంగిపోవడానికి మేము సహించలేం. సాయుధరక్షణచర్యలకు సంబంధించినంతవరకు సైనిక, విమానదళాలదే బాధ్యత. అమెరికా సహాయం-ముఖ్యంగా విమానాలరూపంలో-విరివిగా వస్తూ, నెమ్మదిగా సైనికస్థితినే మార్చివేస్తోంది. దేశంలోని వాతావరణాన్ని పూర్తిగా మార్చడంతో, ప్రజల్లో ఉత్సాహాన్ని రేకెత్తించి, ఎట్టికష్టనష్టాలకైనా సిద్ధపడి, దాడులనెదుర్కోవాలనే తీవ్రకాంక్షనుకలిగించి, అందుకై పౌరదళాలను, హోంగార్డులను తయారుచెయ్యడంతో మాత్రమే మేము యుద్ధానికి తోడ్పడగలం. బ్రిటిష్‌విధానం మే మట్టికార్యక్రమాన్ని నిర్వహించడమే దుస్తరంచేసివేసింది. విదేశీదండయాత్ర గుమ్మంలోకొచ్చినతరుణంలోకూడా సైనికులకుతప్ప, మరేభారతీయుణ్ణీ నమ్మి తుపాకి నివ్వరాదన్నారు. గ్రామాల్లో నిరాయుధస్వయంరక్షకదళాలను యేర్పరచేందుకు మేముచేసినప్రయత్నాలనుకూడా ప్రభుత్వం నిరాకరించింది. ఒక్కోసారి అణచివేసిందికూడాను. ప్రజారక్షణసంఘాలు నేర్పరచడాన్ని ప్రోత్సహించకపోగా, అట్టిప్రయత్నాలు చూచి, బ్రిటిష్ అధికారులు భయపడేవారు. వారు చిరకాలంగా యిట్టి ఏర్పాటులను బ్రిటిష్‌పాలనకు ద్రోహకరములనీ, అపాయకరములనీ భావించడానికి అలవాటుపడ్డారు. వారు తమ పూర్వవిధానాన్నే అనుసరించకతప్పదు. లేకపోతే, ప్రజలపైఆధారపడి, వారిని రక్షణకు సమాయత్తంచేసే జాతీయప్రభుత్వస్థాపనకు అంగీకరించవలసివుంటుంది. ఇట్టిసూచనను వారు స్పష్టంగా తిరస్కరించారుగనుక, మరో మధ్యేమార్గంగాని, మజిలీగాని లేవు. తత్ఫలితంగా వారు ప్రజలను కేవలం గృహోపకరణాలుగా మాత్రమే చూచేవారు. వారి కెట్టి స్వప్రయత్నావకాశము లేకుండా

చేసేవారు. తమయిష్టంవచ్చినట్లు పనిముట్లుగా ఉపయోగించుకునేవారు. 1942 ఏప్రిల్ చివరలో సమావేశమైన అఖిలభారతకాంగ్రెసుసంఘం యీవిధానాన్ని, ప్రవర్తననూ తీవ్రంగా నిరసించింది. మమ్మల్ని విదేశీ అధికారానికి బానిసలుగాచేసేపరిస్థితిని ఎన్నటికీ అంగీకరించబోమని ప్రకటించింది.

ఏదిఏలావున్నా ముంచుకొస్తున్నట్లు కన్పించిన విషాదకరపరిణామాన్ని మౌనంగా చూస్తూకూర్చున్నే ప్రేక్షకులుగా వుండలేము. దండయాత్రవస్తే, ప్రజానీకం ఏంచెయ్యాలో వారికి మేము బోధించవలసి వుంది. ప్రజలకు బ్రిటిష్‌విధానంమీాద ఎంత కోపంవున్నా, వారు బ్రిటిష్, లేక మిత్రరాజ్యాలసైనికచర్యలకు అడ్డంకులుకల్పించరాదనీ, అలాచేస్తే దురాక్రమణకుదిగినశత్రువుకు పరోక్షంగా సాయపడినట్లే అవుతుందనే మేము బోధించాము. అంతేగాక, ప్రజలు ఏసందర్భంలోనూ దురాక్రమణదారులకు లొంగిపోరాదనీ, వారిఉత్తర్వులను పాటించరాదనీ, వారినుంచి ఎలాంటిప్రతిఫలాన్నీ స్వీకరించరాదనికూడా చెప్పాం. దండెత్తివచ్చినసైన్యం ప్రజలగృహాలను, భూములను ఆక్రమించుకో ప్రయత్నిస్తే, ఆమరణాంతం నిరోధించాలని చెప్పాము. ఈ నిరోధం శాంతియుతంగానూ, శత్రువుతో సంపూర్ణసహాయనిరాకరణగానూ ఉండాలన్నాము.

అహింస, సహాయనిరాకరణసిద్ధాంతాలతో దండెత్తివచ్చేసాయుధదళాల్ని ఎదుర్కోవడమనేది అసంగతమైన దుర్భ్రమగా తోచిన అనేకమంది, హేళనగా దీన్ని విమర్శించారు. కాని, ఇది అసంగతంకాకపోగా, ప్రజలకుమిగిలిన ఒకేఒక ధైర్యోచితచర్య. మే మీావిధంగా సలహాయిచ్చినది సాయుధదళాలకుకాదు. సాయుధులై శత్రువునెదుర్కోవడానికి బదులు శాంతియుత నిరోధం చాలుననీ మే మనలేదు. నిరాయుధ ప్రజానీకం సైనికదళాలు ఓడిపోయి, వెనుకకు మరలగానే, తమకుతెలియకుండానే దండయాత్రికులకు లొంగిపోవడం సహజం. అట్టి పౌరులకే మే మీా సలహాలిచ్చాం. శత్రువునుతిప్పలుబెట్టేందుకు మామూాలుసాయుధదళాలనేగాక, గెరిల్లాదళాలనుకూడా యేర్పరచుకోవచ్చు. అయితే, అందుకు తరిఫీతు, ఆయుధాలు, మామూాలుసైనికుల సంపూర్ణసహకారమూ అవసరం గనుక, మేము గెరిల్లాదళాల నేర్పరచడం సాధ్యంకాదు. ఒక

వేళ కొద్దిమంది గెరిల్లాసైనికులకు తరిఫీతునిచ్చినా, మిగతా ప్రజానీక మంతా నిస్సహాయులుగానే వుండిపోతారు. సాధారణంగా శత్రువుల ఆక్రమణకు ప్రజానీకం లొంగిపోతారని ఆశిస్తారు. నిజానికి, అపాయం రాగలదనుకున్న కొన్నిప్రదేశాల్లో సైన్యాలు, ఉన్నతాధికారులు తిరోగమించినతర్వాత ప్రజలకు దండయాత్రికులకు లొంగిపోవడమేమంచి దని బ్రిటిష్ అధికారులు కొందరు చిన్నఉద్యోగులకుకూడా ఉత్తర్వు లిచ్చినట్లు తెలిసింది.

శాంతియుత సహాయనిరాకరణం ముందుకుచొచ్చుకువచ్చే శత్రుసైనికబలాన్ని ఆపలేదని మాకు బాగా తెలుసు. పౌరులలో అనేక మంది శత్రువునునిరోధించాలనుకున్నా, అది దుస్సాధ్యమని గ్రహిస్తారని కూడా మాకు తెలుసు. అయినా, శత్రువు ఆక్రమించిన బస్తీలలో పల్లెలలోవుండే కొందరు ప్రముఖవ్యక్తులైనా శత్రువుకు లొంగేందుకూ, శత్రువుఆజ్ఞలను పాటించేందుకూ, ఆహారాదులుసంపాదించడంలో సహాయపడేందుకూ నిరాకరిస్తారని మే మాశించాము. అలా నిరాకరిస్తే వారికి కఠినదండన విధించబడుతుంది. శత్రువు కసిదీర్చుకునేచర్యలే గాక, మరణశిక్ష కూడా విధించవచ్చు. ఈవిధంగా ఎదురించి, ఆమరణాంతం శత్రువును ప్రతిఘటించేవారు బహుకొద్దిమందే అయినా, ఆ వీరోచిత చర్య ఆ ప్రాంతంలోనేగాక, భారతదేశమంతటా జనసామాన్యాన్ని ఉత్తేజపరచగలదని భావించాము. ఆవిధంగా శత్రువునునిరోధించాలనే జాతీయోత్తేజం ప్రభవించగలదని ఆశించాము.

తరచుగా అధికారులు వ్యతిరేకిస్తున్నా, బస్తీలలోను, పల్లెల లోను గత కొద్దినెలలుగా ఆహారసంఘాలను, స్వయంరక్షకదళాలను యేర్పాటుచేస్తున్నాం. ఆహారసమస్య మమ్మ ఆందోళనపెడుతోంది. యుద్ధపరిణామాలవల్ల రవాణాసౌకర్యాలు ధ్వంసమయ్యా, తదితర విధాలుగానూ యీసమస్య మరింత ప్రమాదకరం కాగలదని భయ పడ్డాము. ఈ విషయంలో ప్రభుత్వం ఏమాత్రమూ పనిచేయడం లేదు. మేము ప్రత్యేకంగా పల్లెప్రాంతాల్లో స్వయంపోషకసంఘాలను యేర్పాటుచేయ ప్రయత్నించాము. ఆధునికరవాణాసౌకర్యాలు ధ్వంస మైతే ఎడ్లబండ్లు మొదలైన నాటుసాధనాలవాడకాన్ని ప్రోత్సహించ ప్రయత్నించాము. తూర్పువైపునుంచి దాడివస్తే, చైనాలోవలె కాంది

శీకులు పెద్దపెద్దగుంపులుగా హఠాత్తుగా పశ్చిమానికి తరలివచ్చే అవకాశంకూడా వుంది. అలాంటివారి నాహ్వానించి, వసతిసౌకర్యాలు కలిగించేందుకు తగుయేర్పాట్లుచేశాము. ప్రభుత్వసహకారం లేకపోతే, ఇదంతా కష్టసాధ్యం - అసలు అసాధ్యమే - ఐనా, మేము చేయగలిగిన ప్రయత్నాలన్నీ చేశాము. ఇట్టిబాధ్యతల్ని నిర్వర్తించేందుకే స్వయం రక్షకదళాలను యేర్పరిచాము. ఆ దళాలు ప్రజలు భయభ్రాంతులు కాకుండా, ఆయాప్రాంతాల్లో వాతావరణం ప్రశాంతంగా వుండేటట్టు చేస్తాయి. దూరప్రాంతాలమీద విమానదాడులూ, సైనికదాడులూ జరిగాయనేవార్తలు తెలిసినా, పౌరజనం భయభ్రాంతులుకావచ్చు. దీన్ని అరికట్టడం అత్యావసరం. ఈ సమస్యపై అధికారులుతీసుకున్న చర్యలు ఏమాత్రం చాలవు; ప్రజలకు వాటిపట్ల అపనమ్మకంకూడాను. గ్రామసీమల్లో బందిపోట్లు, దోపిళ్ళు ఎక్కువౌతున్నాయి.

మేమిూ విస్తృతప్రణాళికలువేసుకున్నా, వీటిప్రభావం అంతగా లేకపోయింది. మమ్మల్నెదుర్కొన్న మహత్తరసమస్యపైభాగాన్నిమాత్రమే తడుమగలుగుతున్నామనేది స్పష్టమే. ప్రభుత్వయంత్రాంగము, ప్రజలు పూర్తిగా సహకరించుకుంటేనేగాని, వాస్తవపరిష్కారం సాధ్యంకాదు. అట్టి సహకారం అసంభవంగా కనుపించింది. హృదయవిదారకపరిస్థితి మమ్మల్ని సవాల్‌చేస్తోంది. మేము సముచితంగా వ్యవహరించాలనే ఉత్సాహంతో వురకలువేస్తున్నాం. అలా దృఢంగా ప్రవర్తించే అవకాశం మాకు నిరాకరించబడింది. ఘోరవిపత్తు పెద్దపెద్దఅంగలు వేసుకుంటూ మావైపువస్తోంది. భారతదేశం నిస్సహాయిగా, స్తబ్ధగా, ద్వేషంగా, కసిగా చూస్తూ శత్రుసైన్యానికీ విదేశీసైన్యానికీ యుద్ధరంగంగా తయారైంది.

నేను యుద్ధాన్నెంతగా ఏవగించుకునేవాణ్ణయినా, భారతదేశం మీదికి జపాను దండెత్తుతుందనే ఆలోచన నన్ను భయపెట్టలేకపోయింది. నా హృదయాంతరాళంలో ఎక్కడో భారతదేశానికిరానున్న యీయుద్ధం - భయంకరమైనదైనా - ఆకర్షణీయంగానేతోచింది. బ్రిటన్ మామీదరుద్దిన స్మశానప్రశాంతినుంచి ప్రజలందరూ మేల్కోవాలనీ, కోట్లాదిప్రజలకు వ్యక్తిగతంగాఅనుభూతికిరాగల ఒక మహత్తరసంచలనం జరగాలనీ నేను వాంఛించాను. ప్రజలు తమనుపట్టుకూర్చున్న భూత

కాలప్రభావాన్ని అధిగమించి, తమహృదయాల్లోనిండివున్న అల్పరాజకీయవిభేదాలను, తాత్కాలికసమస్యలను, అతిశయోక్తులుగాచేసుకునే మూఢత్వాన్నిదాటి, నేటివాస్తవాన్ని ముఖాముఖీ ఎదుర్కొనేటట్లు చేసేందుకు ఏదోఒకటి వత్తిడిచేస్తుంది. గతసంబంధాలను తెగతెంపులు చేసుకోనక్కర్లేదు. గతంలోనే బ్రతుకడంమాత్రం కూడదు. వర్తమానాన్నిగుర్తించి, భవిష్యత్తువైపు దృష్టిసారించాలి. జీవితగమనపులయను మార్చి ఈ వర్తమాన భవిష్యత్తుల స్వరానికి తగినట్లుగా మేళవింపజెయ్యాలి. యుద్ధనష్టం భరింవరానిది. దానిఫలితాలుమాత్రం ఇదమిత్థమని చెప్పలేము. అట్టియుద్ధాన్ని మేముగా కోరలేదు. కాని, అది రానే వచ్చింది గనుక, మా జాతిని దృఢతరంచేయవచ్చు, నూత్నజీవితాన్ని వికసింపజేయగల అత్యావశ్యకానుభూతుల్ని అందించవచ్చు. ప్రజలు అసంఖ్యాకంగా మరణిస్తారు. అది తప్పదు. కాని, కరువుతోకంటె యుద్ధంలో చావడం మేలు. ఆశాలేశమైనాలేని శోచనీయజీవితంకంటె చావే మేలు. మృత్యువునుంచే నవజీవనం ఉద్భవిస్తుంది. ఎలా మరణించాలో తెలియనివ్యక్తులకు, జాతులకు ఎలాజీవించాలోకూడా తెలియదు. "సమాధులున్నచోటనే పునర్జన్మ లభిస్తుంది."

కాని, భారతదేశానికి యుద్ధంవచ్చినా, అది మా కెలాంటి భావోత్తేజాన్నీ కలిగించలేదు. బాధను, మృత్యువును, ఆఖరుకు స్వాయాన్నికూడా మరచి, స్వాతంత్ర్యంమీద, భవిష్యత్కాలదృశ్యంమీద మాత్రమే లక్ష్యముంచి, ఆ సంతోషదాయకకృషిలో మా శక్తియుక్తులన్నింటినీ వినియోగించేఅవకాశం లభించలేదు. వ్యధలు దుఃఖాలే మా వంతుఅయినాయి. ముంచుకొస్తున్న ప్రళయాన్ని గుర్తించడంవల్ల, మా దృక్పథాలు సునిశితమయ్యాయి. బాధలను తప్పించుకోలేనివాళ్ళమైనందువల్ల అవి మరింతవేగంగా పెరిగాయి. తప్పించుకోలేని, అనివార్యవిషాదఛాయలు మా గుండెల్లో గూళ్ళుకట్టుకున్నాయి. ఇది వ్యక్తులకు, జాతికీ కూడా విషాదకరమే.

దీనికి యుద్ధవిజయంతోగాని, ఓటమితోగాని – ఎవరుగెలిచారు, ఎవరుఓడారనేదానితోగాని – ఏమీ నిమిత్తం లేదు. అక్షరాజ్యాలు జయిస్తే, తప్పకుండా ఘోరవినాశమే సంభవిస్తుందని మాకు తెలుసుగనుక, మేము వాటిజయాన్ని కోరుకోలేదు. జపానీయులు భారతదేశంలో

ఏభాగంలోనైనా ప్రవేశించి, ఆక్రమించుకోవాలనికూడా మేము వాంఛించలేదు. ఏమైనప్పటికీ, శత్రువులను నిరోధించవలసిందే. ఈసత్యాన్ని మేము ప్రజలకు పదేపదే నచ్చజెప్పాము. కాని, ఇదంతా పరోక్షవిధానమే. ఈయుద్ధంలో ప్రత్యక్షదృక్పథ మేమిటి? అందువల్ల ఎలాంటి భవిష్యత్తు ఉద్భవిస్తుంది? గతంలో జరిగిన తప్పిదాలూ, విధ్వంసాలూ పునరావృత్తంకావడమే ఫలితమా? మానవునికోర్కెలను ఆదర్శాలను గ్రహించని ప్రకృతియొక్క అంధశక్తులనాటకమేనా? భారతదేశఅదృష్టం ఎలా పరిణమించనున్నదో!

మేము రవీంద్రనాథటాగూర్ అంతిమసందేశాన్ని - ఆయన గతసంవత్సరం మరణశయ్యపైనుండి యిచ్చినసందేశాన్ని - స్మరించుకున్నాము - "క్రూరభూతం కృత్రిమనటనలు మానివేసింది. దాచుకొని పంజా విప్పి, మానవాళిని చీల్చడానికి ప్రళయకరాళనృత్యం చేసేందుకు సన్నద్ధమైంది. విషపూరితద్వేషజ్వాలలు ప్రపంచవాతావరణాన్ని కలుషితంచేశాయి. పాశ్చాత్యమనస్తత్వంలో (బహుశా) నివురుగప్పిననిప్పులా దాగియున్న దౌర్జన్యతత్వం తుదకు విజృంభించి, మానవాత్మను అపవిత్రంచేసివేసింది.

"అదృష్టచక్రం ఒకానొకనాడు, ఆంగ్లేయులు తమభారతసామ్రాజ్యాన్ని వదలుకోక తప్పదని వత్తిడిచేస్తుంది. కాని, వారు వదలిపెట్టిపోయేభారతదేశం ఎలా వుంటుంది? ఎట్టి దుస్సహాశోచనీయస్థితి! శతాబ్దాలతరబడి ప్రవహించిన వారిపరిపాలనాప్రవాహం చివరికి యెండిపోయి, అడుగున ఎలాంటి బురదనూ, దుర్గంధాన్నీ మిగుల్చుతుంది? సంస్కృతీసెలయేళ్ళు యూరపుహృదయంలోనుంచే ప్రవహిస్తాయని నేనొకప్పుడు విశ్వసించాను. కాని, నేనీ ప్రపంచాన్ని వదలిపోబోతున్న యీనాడు ఆ విశ్వాసం పూర్తిగా నశించింది."

"నేను చుట్టూచూస్తుంటే, ఒక సగర్వసంస్కృతియొక్క జీర్ణశిథిలాలు పసికిరానిచెత్తలాగా చెల్లాచెదరైపోవడం కనుపిస్తూంది. అయినప్పటికీ నేను మానవునియందు విశ్వాసాన్నికోల్పోవడమనే ఘోరపాపంమాత్రం చెయ్యను. అంతకంటె యీ ప్రళయాంతాన మానవుడు తనజీవితంలో మరోనూతనాధ్యాయాన్ని ప్రారంభించడం, త్యాగ, సేవాదృక్పథాలతో వాతావరణమంతటిని శుభ్రపరచడం చూడగోరు

తున్నాను. అట్లాంటి సుప్రభాతం బహుశా యీ కొసనుంచే - సూర్యు డుదయించే తూర్పుదిక్కునుంచే - ప్రభవిస్తుందనుకుంటాను. ఓటమి నెరుగని మానవుడు తాను కోల్పోయిన మానవవారసత్వాన్ని తిరిగి పొందేందుకు అన్ని అడ్డంకులను అధిగమించి, మళ్ళీ తన జైత్రయాత్రా మార్గాన్ని అనుసరించేరోజు వస్తుంది.

"ఈనాడు బలాధిక్యతయొక్క దుర్గర్వాట్టహాసంలోని ప్రమాదాలను చూస్తున్నారు. మహాత్ములు 'అధర్మవర్తనుడు అభివృద్ధిచెందుతాడు. వాంఛనీయమనిపించేలాభాలు పొందుతాడు, శతృవులను జయిస్తాడు, కాని మూలంలోనే నశిస్తాడు' అన్నమాటల పరిపూర్ణ సత్యం రుజువయ్యేరోజు వస్తుంది."

కాదు, మానవునిలో విశ్వాసాన్ని కోల్పోకపోవచ్చు, దేవుని నిరాకరించవచ్చు కాని, మనం మానవునే నిరాకరించి, ప్రతిదాన్ని నిరర్థకంగాచేసివేస్తే, యింక మనకు మిగిలే ఆశ ఏమిటి? ఏమైనప్పటికి, ఎందులోనైనా విశ్వాసంవుంచడంగాని, సన్మార్గం జయించకతప్పదని నమ్మడంగాని కష్టమే.

నేను శారీరకంగా అలసిపోయి, మానసికంగా వ్యధాకలితున్నాయి, నా పరిసరాలనుంచి తప్పించుకుపోవాలనేఆశతో హిమాలయాంతర్భాగాల్లోని 'కులు' మైదానాలకు ప్రయాణమయ్యాను.

## మా సవాలు : 'క్విట్ ఇండియా' తీర్మానం

ఒక పక్షంరోజులతర్వాత 'కులు' నుంచి నేను తిరిగివచ్చిచూస్తే, దేశపరిస్థితి అతివేగంగా మారుతున్నట్లు కన్పించింది. తుదిపరిష్కార ప్రయత్నం విఫలమైనందువల్ల కలిగిననిస్పృహ పెరిగింది. సంప్రదింపుల ద్వారా పరిష్కారంకుదురుతుందనేఆశ నశించింది. బ్రిటిష్ అధికార్లు పార్లమెంటులోనూ, ఇతరత్ర చేసినప్రకటనలు దానినిధృవపరచి, ప్రజల కోపానికి కారణమయ్యాయి. భారతదేశంలోనిఅధికారవిధానం మా సాధారణ రాజకీయ, బహిరంగకార్యక్రమాలను అణచివేసేందుకే ఉద్దేశింపబడుతున్నట్లు తేలిపోయింది. నలుముఖాలా వత్తిడి పెచ్చు మీరింది. క్రిప్పుసంప్రదింపులుజరుగుతున్నంతకాలం మా రాజకీయసేవకుల్లోఅనేకమంది జైళ్ళలోనేఉ న్నారు. ఇపుడు నా సన్నిహితులు,

ప్రియమిత్రులనేకమంది భారతరక్షణచట్టంక్రింద నిర్బంధింపబడ్డారు. రఫీ అహ్మద్ కిద్వాయి మేనెలారంభంలోనే అరెస్టయ్యాడు. ఆవెంటనే యు. పి. రాష్ట్రకాంగ్రెసుఅధ్యక్షుడు శ్రీ కృష్ణదత్ పాలివాల్‌ను జైల్లోపెట్టారు. అదేవిధంగా ఇంకెందరినో జైళ్ళకంపారు. మాలోఅనేక మందిని ఏరి, జైళ్ళలోపెట్టి, కార్యరంగానికి దూరంచేస్తారనీ, మా జాతీయోద్యమం కొనసాగకుండా నిరోధించి, శిథిలంచేసివేస్తారనీ అనిపించింది. దీనికంతటికి మేము ఊరకేచూస్తూ లొంగిపోగలమా? నే మావిధమైన తరిఫీతుపొందలేదు. మా వ్యక్తిగత, జాతీయపౌరుషాలు ఈ విధానానికి వ్యతిరేకంగా ఉవ్వెత్తునలేచాయి.

కాని, ఘోరయుద్ధప్రమాదము, రాగలదండయాత్రలు దృష్టిలోవుండగా మే మేంచెయ్యగలం? అయినా మిన్నకుండడంవల్ల మాప్రయోజనం నెరవేరదు. అలా వూరుకుంటే, యేపరిణామాలకు మేము ఆందోళన, భయాలు ప్రదర్శించామో ఆపరిణామాలే ప్రజలమనసుల్లో పెంపొందుతున్నాయి. ప్రజాభిప్రాయం అనేకవిధాలుగా వుంది. విశాలమైనదేశంలో యిలాంటిక్లిష్టకాలంలో ఇలావుండడం సహజమే. నిజానికి జపానురాకకు సుముఖమైనధోరణి లేనేలేదు. యజమానులను మార్చుకోవాలని ఎవరూకోరలేదు. చైనాపట్లమాత్రం బలమైనసుముఖత వ్యాపించివుంది. కాని, జపానుదండయాత్ర వస్తే, ఆ అవకాశాన్నుపయోగించుకుని భారతస్వాతంత్ర్యాన్ని సంపాదింపవచ్చునని నమ్మకంతో ఒక చిన్నవర్గంమాత్రం జపానుకు సుముఖంగావుంది. ఒక సంవత్సరంక్రితం రహస్యంగా భారతదేశాన్నుంచి తప్పించుకొనిపోయిన సుభాస్‌చంద్రబోసు చేస్తున్న రేడియోప్రసంగాలవల్ల ఈవర్గం యీ ధోరణిలోపడింది. సహజంగా ప్రజల్లోఎక్కువమంది నిర్లిప్తులుగావుండి, ఏంజరుగుతుందో చూద్దామన్నట్లు ఉన్నారనుకోండి. దురదృష్టవశాత్తు, పరిస్థితులువిషమించి భారతదేశంలో ఏభాగాన్నయినా దండయాత్రికులు పాలించడమే సంభవిస్తే, వారితోసహకరించేవారు నిస్సందేహంగా అనేకమంది ఉంటారు. ముఖ్యంగా ధనవంతులు తమనూ, తమఆస్తిపాస్తులను రక్షించుకోవడమే ధ్యేయంగాగలవారు గనుక, అలా ప్రవర్తించగలరు. ఇలా శత్రువుతోసహకరించేవంశాలను, మన స్తత్వాన్ని బ్రిటిష్‌ప్రభుత్వమే తనస్వార్థంకోసం తంలో ప్రోత్సహించి, పోషిం

చింది. అలాపెరిగినవారు ఎప్పటికప్పుడు తమ స్వార్థప్రయోజనాలనే దృష్టిలో వుంచుకుంటూ, మారేపరిస్థితులకనుగుణంగా మారగలరు. ఫ్రాన్సు, బెల్జియం, నార్వే తదితరయూరోపియన్ దేశాలను శత్రువులాక్రమించుకున్నప్పుడు నిరోధోద్యమాలెంతపెంపొందుతున్నా, శత్రువుతో సహకరించినవాళ్ళు కుప్పతెప్పలుగా పొంగిపొరలడం మనం చూచాము. విచీవీరులుకూడా 'పెర్టినాక్స్' మాటల్లో: "అవమానాన్ని గౌరవంగా, పిరికితనాన్ని ధైర్యంగా, స్వార్థము అజ్ఞానాలను తెలివితేటలుగా, అవహేళనను భరించడాన్ని ఉత్తమగుణంగా, జర్మనీవిజయాన్ని మనఃపూర్వకంగా ఆమోదించడాన్ని నైతికపునరుజ్జీవనంగా చెల్లుబడిచేసేందుకు తమ మెదళ్ళను ఎలా రాపాడించుకున్నారో" మనం చూచాం. విప్లవానికీ, తీవ్రదేశభక్తికీ నిలయమైన ఫ్రాన్సులోనే అలాజరిగితే, బ్రిటిష్‌వారి చల్లనిచూపుక్రింద ఎంతకాలంగానో నేవళంగాపెంపొంది, అనేకప్రతిఫలాలుపొందిన శత్రుసహకారమనస్తత్వంగలవర్గాలుకూడా గల భారతదేశంలో అలా జరగడంలో అసహజమేమీ లేదు. వాస్తవానికి, ఇప్పు డెవరైతే బ్రిటిష్ పాలనతో సహకరించి, ఆ పాలనపట్ల భక్తివిశ్వాసాలు చాటుకుంటున్నారో వారిలో అధికసంఖ్యాకులు దండయాత్రికులతోసహకరించే ముఖ్యులు కావడం అత్యంత సంభవమే. వారు శత్రుసహకారకళాపారంగతులుగాన, బాహ్యరూపం మారినా, అలాంటిపునాదినే అంటిపట్టుకునివుండడం వారికి కష్టంకాదు. ఒకవేళ ఆతర్వాత ఆ బాహ్యరూపం మళ్ళీమారిపోయినా, యూరోపులో తమలాంటివారివలెనే మళ్ళీ తమస్వామిభక్తిని మార్చుకోగలరు. అవసరంయేర్పడితే, వారు క్రిప్సు సంప్రదింపులు విఫలమైనతర్వాత ప్రజల్లోపెంపొందిన బ్రిటిష్ వ్యతిరేకభావాలనే ఆసరాచేసుకోగలరు. ఇతరులుకూడా వ్యక్తిగత, అవకాశవాదకారణాలవల్లగాక, ఇతరఉద్దేశాల్తో ప్రోత్సహింపబడి, వాస్తవదృక్పథాన్నికోల్పోయి, పెద్దసమస్యలను విస్మరించి, యీ బ్రిటిష్‌వ్యతిరేకభావాలను ఆసరాచేసుకుంటారు. ఇటువంటిపరిణామాలే మమ్మల్ని నిర్ణిణ్ణులనుచేశాయి. భారతదేశంలో బ్రిటిష్‌వారనుసరిస్తున్న విధానాన్ని నిర్లిప్తంగా, బలవంతంగా శిరసావహించినట్లయితే, అనేక

రకాలప్రమాదకరదుష్ఫలితాలు సంభవిస్తాయనీ, ప్రజలు పూర్తిగా నైతికపతనమైపోతారనీ అనుకున్నాం.

కొన్నితూర్పుప్రాంతాలపై దండెత్తాలనీ, ఆక్రమించుకోవాలనీ శత్రువుప్రయత్నిస్తే, తదితరవిశాలప్రాంతాల్లో పౌరపాలనాయంత్రాంగం విచ్ఛిన్నమైపోతుందనీ, అరాజకపరిస్థితులు చెలరేగుతాయనే భావన విస్తృతంగా వ్యాపించింది. మలయా, బర్మాల్లో జరిగినది మాముందు వున్నది. యుద్ధఫలితాలు తనకు సుముఖంగావున్నా శత్రువులు భారత దేశంలోని చెప్పుకోదగ్గ ఏభాగాన్నయినా ఆక్రమించుకోబడుతుందని ఎవరూ అనుకొనియుండరు. భారతదేశం సువిశాలమైనది. చైనాలో వైశాల్యమే ప్రముఖఫలితాన్నివ్వడం మేముచూచాం. కాని, ఆ వైశాల్యమనేసదవకాశాన్ని వినియోగించుకోవాలనీ, శత్రువునునిరోధించాలనీ ఓడిపోయి లొంగిపోరాదనీ పట్టుదలవుంటేనే అది సత్ఫలితాన్నిస్తుంది. చైనాలోవలె శత్రువు తానుగా ఆయాప్రాంతాలను ఆక్రమించుకోక పోయినా, మిత్రరాజ్యాలసైన్యాలు విశాలప్రాంతాలను శత్రువుకెరగా వదలివేసి, దేశాంతర్భాగంలోని రక్షణశ్రేణులవరకు తిరోగమిస్తాయని నమ్మదగ్గవార్తలు వ్యాపించాయి. అందువల్ల ఇలా శత్రువు సులభంగా ఆక్రమించుకునేందుకుఅనువుగా బదిలీచేయబడిన ప్రాంతాలలోనూ, పౌరపాలనాయంత్రాంగం విచ్ఛిన్నమైపోగల యితరప్రాంతాలోనూ యేర్పడే పరిస్థితులను మేమెలా ఎదుర్కోవాలా అనేప్రశ్న ఉదయించింది. అలాంటిక్లిష్టపరిస్థితుల నెదుర్కొనేందుకు ప్రజలను మానసికంగానూ, ఇతరవిధాలుగాను సమాయత్తంచేసేందుకు మేము శాయశక్తులా ప్రయత్నించాం. ప్రజాజీవితక్రమాన్ని కాపాడేందుకు స్థానికసంఘాలను ప్రోత్సహించి, అదేసమయంలో ఎట్టిత్యాగాలకైనా సిద్ధపడి శత్రువునునిరోధించాలనికూడా నచ్చజెప్పాం.

చైనాప్రజలు సంవత్సరాలతరబడి అంత ధైర్యంగా పోరాడిన దెందుకు? ప్రపంచంలో అందరికంటె ఎక్కువగా రష్యన్లూ, సోవియట్ యూనియన్‌లోనిఇతరప్రజలూ అంతధైర్యంగా, పట్టుదలతో, మనఃపూర్వకంగా పోరాడిన దెందుకు? ఇతరచోట్లకూడా ప్రజలు దేశభక్తి, దురాక్రమణపట్లభయం, తమజీవితవిధానాలను సంరక్షించుకోవాలనే కాంక్షలచే సంచలితులుకావడంవల్లనే ధైర్యంగా పోరాడగలిగారు.

అయినా యుద్ధకృషిలో రష్యాకూ, ఇతరదేశాలకూ "మనఃపూర్వక త"లో భేదం వున్నది. ఇతరులు డన్‌కిర్క్ సంఘటనాసమయంలోనూ, తర్వాత దివ్యంగా పోరాడారు. కాని, తత్క్షణప్రమాదస్థితి తొలగిపోగానే, వారికృషిలో నైతికపుష్టి లోపించేది. వారు ఎలాగైనా యుద్ధంలో జయించాలని కాంక్షించినా, వారికి భవిష్యత్తుపట్ల కొన్ని అనుమానాలున్నట్లు కన్పించింది. లభించిన వివరాలనుబట్టి నిర్ణయించాలంటే సోవియట్ యూనియన్‌లో అనుమానము, చర్చలు (అక్కడ చర్చలు ప్రోత్సహించబడలేదనేది నిజమైనా) వున్నట్లు కనుపించదు. అక్కడ వర్తమానంలోనూ, భవిష్యత్తునందుకూడా అత్యంతవిశ్వాసం వుంది.

భారతదేశంలోనో? ఇక్కడ వర్తమానమంటే గాఢంగా పాదుకుపోయినవిముఖత్వం వుంది. భవిష్యత్తుకూడా అంధకారంగానే కనుపించింది. ప్రజలను కార్యోన్ముఖులను చేసే దేశభక్తిప్రేరేపణ లేదు. దండయాత్రనుంచీ, ఘోరదురదృష్టాన్నుంచీ తమ్ముతాము రక్షించుకోవాలనే కోర్కెమాత్రమే వుంది. కొద్దమందిమాత్రం అంతర్జాతీయ దృష్టితో సంచలితులయ్యారు. ఈ ధోరణులతోపాటు, ఒక విదేశీ సామ్రాజ్యవాదశక్తి తమపై నిరంకుశాధికారం చలాయిస్తూ, అణచివేస్తూ, దోచుకుంటున్నందుకు నిరసనభావంకూడా వుంది. ఒక నిరంకుశాధికారియిష్టాయిష్టాలమీద, చాదస్తంమీద ప్రతిదీ ఆధారపడివుండే పద్ధతిలోనే ప్రాథమికమైన తప్పిదమొకటి వుంది. స్వేచ్ఛ అందరికీ ప్రియమైనదే. కాని అందరికంటె దాన్ని కోల్పోయినవారికీ, కోల్పోయే ప్రమాదం వాటిల్లినవారికే అది మరింత ప్రియంగావుంటుంది. ఆధునిక ప్రపంచంలో స్వేచ్ఛకు అనేక నియమాలూ, పరిమితులూ వున్నాయి. కాని, స్వేచ్ఛలేనివాళ్ళు ఆ పరిమితులను గుర్తించలేరు. స్వేచ్ఛఅనే భావాన్ని ఆదర్శంగాచేసుకుని, వ్యసనసమానమై శరీరంలోని ప్రత్యణువును ఆక్రమించుకునేటంతటికాంక్షగా రూపొందించుకుంటారు. ఏదైనా ఈకోర్కెలో యిముడలేకపోతే లేక దానికివ్యతిరేకమైనట్లు కనుపిస్తే అది నాశనంకావలసిందే. భారతదేశంలో దేనికోసం అనేకమంది శ్రమించి, కష్టాలనుభవించారో ఆ స్వాతంత్ర్యకాంక్ష ఎదురుదెబ్బతినడమేగాక, దానిఫలితం ఏదో అస్పష్టమైన సుదూరభవిష్యత్తులోనికి పారిపోయినట్లు తోచింది. ఆ వ్యసనతరకాంక్షను జరుగుతూన్న ప్రపంచపోరాటానికి

వినియోగించవలసింది. ఈ విశాలజలాశయంలోని ప్రవాహశక్తిని భారత, ప్రపంచస్వాతంత్ర్యాలకోసం, భారతదేశరక్షణకోసం ఉపయోగించవలసింది కాని, అందుకుబదులు యుద్ధానికి దీనితో సంబంధంలేకుండా చేశారు. ఈ సమస్యాపరిష్కారమే కీలకంవంటిదనే ఆశైనా చూపలేదు. ఏ ప్రజలనైనా-శత్రువునయినాసరే-ఆశలేనివారినిగా వదలడం ఎన్నటికీ విజతకాదు.

ఈ యుద్ధం అందులో చిక్కుకున్నదేశాల రాజకీయవేత్తల స్వల్పాభిలాషలకంటె చాలా గొప్పదీ, విశాలమైనదీనని భావించిన భారతీయులు లేకపోలేదు. కొందరు తమగృహాల్లో కూర్చొని, ఈయుద్ధం యొక్క విప్లవాత్మకప్రత్యేకతను గ్రహించారు ఈయుద్ధంయొక్క అంతిమ ఫలితాలు, పర్యవసానము, ఈ ప్రపంచాన్ని సైనికవిజయాలకంటె, రాజకీయవేత్తలసంధులు, ప్రకటనలకంటె ఎంతో ముందుకుతీసుకుపోతాయని గుర్తించారు. కాని, ఇట్టివ్యక్తులసంఖ్య అత్యల్పమే. అనేకదేశాల్లో వలెనే ఇక్కడ అధికసంఖ్యాకులు సంకుచితదృష్టినే ప్రదర్శించారు. అదే వాస్తవదృష్టియని అంటూ, వారు తాత్కాలికప్రయోజనాలను మాత్రమే గణనకుతీసుకొనేవారు. అవకాశవాదంవైపు మొగ్గే కొందరు బ్రిటిష్‌వారివిధానాన్నే అనుసరిస్తూ, ఆ ధోరణికి అతుక్కుపోయారు. అట్టివారు మరేఅధికారంతోనైనా, విధానంతోనైనా ఇదేవిధంగా సహకరించగలరు. కొందరు ఈవిధానాన్ని తీవ్రంగానిరసించి, దానికిలొంగడం భారతదేశప్రయోజనానికేగాక, ప్రపంచప్రయోజనానికే ద్రోహం చేయడంవంటిదని భావించారు. ప్రజానీకంలో ఎక్కువమంది నిర్లిప్తంగా, నిశ్చలంగా, జోగుతూ వుండిపోయారు. భారతీయుల్లో ప్రాచీనంగావున్న ఈ లోపాన్ని పోగొట్టాలనే మేమింతకాలంగా పెనగులాడుతున్నాము.

భారతహృదయంలో యిలాంటి విభిన్నాలోచనలగుంజాటనలు జరుగుతూ, నిస్పృహానుభూతి పెంపొందుతూండగా, గాంధిజీ అనేక వ్యాసాలువ్రాసి ప్రజలఆలోచనలకు హఠాత్తుగా ఒక నూతనమార్గాన్ని చూపాడు. లేక తరచుగా జరుగుతున్నట్లు ప్రజల అస్పష్టభావాలకు ఆయన ఒకరూపాన్నిచ్చాడనైనా అనుకోవచ్చు. అటువంటి గడ్డుసమయంలో చేతులుముడుచుకొనికూర్చోవడం, జరిగేఅన్నింటికీ తలొగ్గడం ఆయన సహించలేకపోయాడు ఆ గడ్డుపరిస్థితి నెదుర్కోవాలంటే, ఒకే ఒకమార్గం వుంది, భారతస్వాతంత్ర్యం గుర్తించబడి, స్వతంత్రభారతం

మిత్రరాజ్యాలసహకారంతో దండయాత్రలను, దురాక్రమణను యెదు ర్కోవాలి. ఆవిధంగా మా స్వాతంత్ర్యం గుర్తింపబడకపోతే, నెలకొని వున్నవ్యవస్థను సవాల్ చేసినందుకు ఏదో ఒకచర్య తీసుకోవాలి. ఆ విధంగా ప్రజలను చైతన్యహీనులనుచేస్తూ ప్రతిదురాక్రమణకు సుల భంగా ఎరగావేస్తున్న నిద్రమత్తునుంచి ప్రజలను మేల్కొల్పాలి.

ఈ వత్తిడిలో కొత్త యేమీ లేదు. మొదటినుంచీ మేము కోరు తున్నదాన్ని పునరుద్ఘాటించడమే. కాని, గాంధీజీ ఉపన్యాసాల్లోనూ, రచనల్లోనూ, ఒక నూతనావశ్యకత, నూతనోత్తేజము ఉన్నాయి. అందులో క్రియాపరమైనసూచనకూడా వుంది. అప్పుడు భారతదేశ మందుగల అనుభూతినే ఆయన ప్రతిబింబించాడనేందుకు సందేహం లేదు. జాతీయ, అంతర్జాతీయవాదాలమధ్య జరిగినసంఘర్షణలో మొద టిదే నెగ్గింది. గాంధిజీనూతనరచనలు భారతదేశమంతటా ఒక కదలి కను కలిగించాయి. కాని, జాతీయవాదం ఏనాడూ అంతర్జాతీయ వాదాన్ని వ్యతిరేకించియుండలేదు. నిజానికి గౌరవప్రదంగాను, ప్రయో జనకరంగాను వ్యవహరించే అవకాశం కలుగజేస్తే, జాతీయవాదం అంత ర్జాతీయవాదవిశాలదృక్పథంలో యిమిడిపోయేందుకు శక్తికొద్దీ ప్రయ త్నిస్తూనేవుంది. యురోపులోని జాతీయవాదాలవలె భారతజాతీయ వాదంలో దురాక్రమణోద్దేశాలు లేవుగనుక, ఇతరరాజ్యాలవ్యవహా రాల్లో జోక్యంకల్పించుకునే ఉద్దేశ్యం లేదు. పైగా అందరిప్రయోజ నాలకోసం ఇతరరాజ్యాలతో సహకరించగోరుతుంది. జాతీయవాదమే అంతర్జాతీయవాదానికి ప్రధానమైనపునాదియనీ, మొదటిది రెండవ దానికి రాచబాటయనీ, అందువల్ల ఫేసిజం, నాజీజాలను సంయుక్తంగా యెదురించేందుకు జాతీయవాదమే వాస్తవమైనపునాదియనీ భావించ బడింది. ఈలోపుగా ఎక్కువగా ఉద్ఘోషింపబడుతున్న అంతర్జాతీయ వాదం—అది సామ్రాజ్యవాదశక్తుల పురాతనవిధానం—నూతనదుస్తులను అలాగని, పూర్తిగా కొత్తవీకాదు – ధరించినట్లు అనుమానాస్పదంగా కన్పించసాగింది. వాస్తవానికి, ఆ అంతర్జాతీయవాదం సామ్రాజ్యం పేరుతోనో, కామెన్వెల్తు పేరుతోనో, ధర్మకర్తృత్వంపేరుతోనో తన అభీ ష్టాన్ని అందరిమీద రుద్దాలనే ఒకరకమైన దురాక్రమణవాంఛగల జాతీయవాదమే.

గాంధిజీ తెచ్చిపెట్టిన ఈ నూతనపరిణామం మాలో కొందరిని ఆందోళనపరచి కలవరపెట్టింది. ఎందువల్లనంటే, నిష్ప్రయోజకచర్య వల్ల ప్రయోజనంలేదు. ఏ ప్రయోజకరచర్యయైనా భారతదేశమే దండయాత్రకులోనుకాగలదనే ప్రమాదం ముంచుకొస్తున్నసమయంలో యుద్ధప్రయత్నాలకు అడ్డుతగిలేదే అయితీరుతుంది. గాంధీజీ మామూలు దృక్పథంకూడా ప్రధాన అంతర్జాతీయ ప్రయోజనాలను విస్మరించి, జాతీయవాదసంకుచితదృష్టిమీదనే ఆధారపడివున్నట్లు కనుపించింది. యుద్ధం జరుగుతున్న యీ మూడుసంవత్సరాలూ మేము ఎదుటివారికిబ్బందికలిగించరాదనే విధానాన్నే అనుసరించి, అసమ్మతి సూచకచర్యమాత్రమే తీసుకున్నాం. సూచనప్రాయమైన ఆ అసమ్మతి చర్య 1940 - 41 లో మా స్త్రీ, పురుషనాయకులలో 30 వేలమంది జైళ్ళకుపంపబడడంద్వారా విశ్వరూపందాల్చింది. అయినా, అలా జైళ్ళకువెళ్ళడంకూడా ఎంచబడినవారి వ్యక్తిగత వ్యవహారమే. ప్రజా విప్లవము, ప్రభుత్వయంత్రాంగాన్ని ప్రత్యక్షంగా నిరోధించడం తప్పించబడ్డాయి. మేము మళ్ళీ అదేరకం కార్యక్రమాన్ని చేపట్ట లేము. మేము మరోరకంగా ప్రవర్తించివుంటే, ఆ చర్య భిన్నంగావుండి అంతకంటె బలమైనస్థాయిలోవుండేది. అటువంటిచర్య భారతదేశ సరి హద్దుల్లో జరుగుతున్న యుద్ధచర్యలను బలహీనంచేసి, శత్రువును ప్రోత్స హించేది కాదూ ?

ఇవి స్పష్టంగా కనిపిస్తున్న గడ్డుసమస్యలు. ఒకరినొకరు మార్చు కుండానే మేము గాంధీజీతో యీసమస్యలను విపులంగా చర్చించాం. చిక్కులున్నమాట నిజమే. మేము యెలాంటిచర్యతీసుకున్నా, లేక వూరికేవున్నా ప్రమాదాలు రాకతప్పవు. ఇక వాటినితూచి, అందులో తక్కువఅపాయాన్ని ఎన్నుకోవడమే ప్రశ్న అయింది. మాచర్చలవల్ల అంతకుముందు అస్పష్టంగా, మసకగావున్న దెంతో స్పష్టమైపోయింది. మేము గాంధీజీదృష్టికి తెచ్చిన అనేక అంతర్జాతీయప్రయోజనాలను ఆయన ఆకళింపుచేసుకోవడం జరిగి, ఆసక్తికలిగించాయి. ఆయన తర్వాతరచనలు మార్పుచెందాయి. ఆయనే స్వయంగా ఈ అంతర్జా తీయప్రయోజనాలను నొక్కి చెబుతూ, భారతదేశసమస్యలను విశాల దృక్పథంలో చూడసాగాడు. కాని, బ్రిటిష్‌వారు భారతదేశంలో అను

సరిస్తున్న నిరంకుశ, దమనవిధానాలకు ఊరకే తలొగ్గడంపట్ల ఆయనకు గల అభ్యంతరభావము, దాన్ని సవాల్‌చేసేందు కేదోఒకచర్యతీసుకో వాలనే ప్రధానోద్దేశం మాత్రం మారలేదు. తలవొగ్గితే భారతదేశ
ఆత్మే దెబ్బతింటుందనీ, యుద్ధం ఏరూపాన్నిధరించి, ఎట్టిఫలితాన్నిచ్చినా భారతీయులు బానిసల్లాగానే ప్రవర్తించగలరనీ, మరెంతోకాలంవరకూ వారికి స్వాతంత్ర్యంలభించదనీ గాంధీజీ విశ్వాసం. అలా బ్రిటిష్‌విధానా నికి తలొగ్గితే దండెత్తివచ్చేవారికూడా తలొగ్గడమే అవుతుంది. తాత్కాలిక సైనికఓటమి, తిరోగమనాలతో కూడా సంబంధంలేకుండా, శత్రువును నిరోధించాలనేబాధ్యతే విస్మరింపబడుతుంది. తత్ఫలితంగా, మా ప్రజలు పూర్తిగా నైతికపతనంపొందడం, స్వాతంత్ర్యంకోసం పాతి కేండ్లుగా ఎడతెగనిపోరాటంజరుపుతూ నిర్మించుకున్న శక్తినంతటిని కోల్పోవడం జరుగుతాయి. అంటే, భారతదేశం స్వతంత్రాన్నికోరు తున్నదనేవిషయమే ప్రపంచం మరచిపోతుంది. పురాతనసామ్రాజ్య వాదధోరణులు, వాంఛలు మాత్రమే యుద్ధానంతరనిర్ణయాలుచేస్తాయి. గాంధీజీ భారతస్వాతంత్ర్యానికి తీవ్రకాంక్ష కలిగివున్నాడు గనుక, ఆయనదృష్టిలో భారతదేశం ప్రియమైనమాతృభూమికంటె మిన్న. అది ప్రపంచవలసప్రజలకు, దోచుకోబడ్డప్రజలకు ప్రతిబింబం. ప్రపంచ విధానాల్లో దేని మంచిచెడ్డలనైనా నిర్ణయించేందుకు నిశితమైన గీటు రాయి. భారతదేశం అస్వతంత్రంగానేవుండిపోతే, ఇతరవలసరాజ్యాలు అస్వతంత్రజాతులుకూడా ప్రస్తుతబానిసస్థితిలోనే వుండిపోతాయి. యుద్ధం వృధాగా జరిగినట్లవుతుంది. యుద్ధంయొక్క నైతికపునాదిని అవ శ్యం మార్చాలి. నౌకా, విమాన, పదాతిదళాలు తమతమరంగాల్లో సామర్థ్యంకలిగివుండి రక్తపాతవిధానాల్లో అనన్యంగా ప్రవర్తించి, విజ యాలుపొందవచ్చు. కాని, వారివిజయాలు ఏఫలితాలకోసం? పైగా, సాయుధయుద్ధానికూడా నైతికసమర్థన అత్యవసరం. నెపోలియన్ యుద్ధంలో శరీరబలంకంటె, నైతికబలం మూడురెట్లుండాలని అన లేదూ? ప్రపంచమంతటా బానిసలుగా, దోచుకోబడ్డవారుగా వున్న కోట్లాదిప్రజలు యీ యుద్ధం వాస్తవంగా తమస్వాతంత్ర్యంకోసమే జరుగు తోందనిగుర్తించి, విశ్వసిస్తున్నారు. అట్టివారి నైతికప్రాద్బలం యుద్ధం యొక్క సంకుచితదృష్టితో చూచినా ఆవశ్యకమే; ఆతరువాతరాగలశాంతి

కాలందృష్టితో చూచినా అత్యావశ్యకమే. ఈయుద్ధంలో అదృష్టం తారుమారై, మిత్రపక్షం క్లిష్టపరిస్థితిలోపడినదనేసత్యమే వారి దృక్పథాల్లో, విధానాల్లో మార్పురావాలనీ, అనుమానిస్తూ, కసిగా చూస్తున్న యీ కోట్లాదిప్రజలను సమూహోత్సాహం, ప్రోద్బలమిచ్చేవరుగాచేసుకోవాలనీ నొక్కిచెబుతోంది. ఈ ఆశ్చర్యకరపరిణామమే సంభవిస్తే, అక్షరాజ్యాల సైనికబలాధిక్యత అంతా నిష్ఫలమౌతుంది, వారి ఓటమి ఖాయమౌతుంది. ఇటువంటి శక్తివంతమైన ప్రపంచవ్యాపితానుభూతిప్రభావం అక్షరాజ్యాల్లోనిప్రజలపైనకూడా పడవచ్చు.

భారతదేశంలో చిఱుబుఱులాడుతూ మిన్నకున్న ప్రజలు "తలొగ్గక,నిరోధించా"లనే ఉత్తేజంపొందేటట్లుమార్చడం మేలు. అలా తలొగ్గకపోవడమనేది ఆదిలో బ్రిటిష్అధికారుల నిరంకుశహుకుములకే వర్తించినా, అది దండెత్తివచ్చినవారిని నిరోధించడంగా మారగలదు. ఒకరికి బానిసగా, తొత్తుగావుండడం మరొకరిక్రిందకూడా అలాగేవుండడానికి దారితీస్తుంది. ఆవిధంగా అప్రతిష్టకు, తలవంపుకు దారితీస్తుంది.

మాకీ వాదనలన్నీ బాగాతెలుసు. మేము వాటిని విశ్వసించాము. తరచుగా ప్రచారంచేశాం కూడాను. కాని, జరిగినవిషాదకర పరిణామం ఏమంటే, బ్రిటిష్ప్రభుత్వం ఇటువంటిఆశ్చర్యకరరూపం ఏర్పడకుండా అరికట్టడమే. యుద్ధకాలంలో తాత్కాలికంగానైనాసరే, భారత సమస్యను పరిష్కరించాలని మేముచేసినప్రయత్నాలన్నీ విఫలమైపోయాయి. యుద్ధాశయాలను ప్రకటించమని మే మెన్నిసార్లుకోరినా తిరస్కరించబడ్డాయి. ఇటువంటిప్రయత్నాలు మళ్ళీ చేసినా, ఫలితంవుండదని స్పష్టమైంది. ఇక నేంచెయ్యాలి? అది సంఘర్షణే అయితే, అది నైతికంగాను ఇతరవిధాల ఎంత సమర్థనీయమైనప్పటికి - దండయాత్ర ప్రమాదం ముమ్మరంగావున్న సమయంలో—భారతదేశంలో జరుగుతున్నయుద్ధకృషికి ఎంతో నష్టంవాటిల్లుటలో సందేహంలేదు. అయినా ఆశ్చర్యకరవిశేషమేమంటే, ఆ ప్రమాదమే మా మనసుల్లో ఈ క్లిష్ట భావాలను సృష్టించింది. ఈ పరిస్థితి నెదుర్కోవాలంటే, ప్రజలందరు శత్రువును నిరోధించాలి. ప్రజలను అలాప్రవర్తించేటట్లు సమాయత్తం చేయవలసినది ప్రభుత్వం. మాదృష్టిలో యీ ప్రభుత్వాధికారులు యీ మహత్తర బాధ్యతను నిర్వర్తించలేనిఅసమర్థులూ, అయోగ్యులూను.

అట్టివారి అసమర్ధయాజమాన్యంక్రింద మా దేశం ధ్వంసంకావడాన్ని చూస్తూ ప్రేక్షకుల్లా కూర్చోలేము. మాలో పుట్టి, పెరిగి, గూడుకట్టుకొనివున్నశక్తినీ, ఆవేశాన్నీ ఏదోఒకచర్యద్వారా బహిర్గతంచేయక తప్పదు. అందుకే దేదోఒకమార్గం కావాలి.

గాంధీజీ వయసుమళ్ళుతోంది. డెబ్బయ్యోపడిలోవున్నాడు. తన జీవితంలో ఎక్కువకాలం ఎడతెగనికార్యక్రమాలతో శారీరక, మానసికశ్రమతో గడపినందువల్ల ఆయనశరీరం దుర్బలమయింది. అయినా ఆయన ఇంకా హుషారుగానే వున్నాడు. అప్పుడు తాను పరిస్థితులకు లోబడి, ఏచర్యాతీసుకోకపోతే, తన జీవితకాలకృషిఅంతా వ్యర్థమౌతుందనీ, తాను జీవితంకంటె యెక్కువగాయెంచినదాన్ని నిరూపించుకునే అవకాశమేవుండదనీ భావించాడు. భారతదేశానికీ, ఇతరదళితజాతులకు స్వాతంత్ర్యంసాధించాలనే గాంధీజీకోరిక బలీయమై, ఆయన గట్టిగా అంటిపట్టుకొనివుండే అహింసాసూత్రాన్నికూడా జయించింది. రక్షణకోసము, అత్యవసరపరిపాలనావసరాల్లోనూ కాంగ్రెసు అహింసాసూత్రానికి కట్టుబడివుండనక్కరలేదని లోగడ గాంధీజీ సమ్మతించేటప్పుడు గుణుస్తూ బాధపడ్డాడు. తానుమాత్రం యిట్టిదృక్పథానికి దూరంగానే వుండిపోయాడు. తా నిలా సందిగ్ధదృక్పథంలో వుంటే అది బ్రిటన్‌తో, మిత్రరాజ్యసమితితో ఒకపరిష్కారం కుదుర్చుకునేందుకు అభ్యంతరం కావచ్చునని గాంధీజీ గుర్తించాడు. అందువల్ల తానే ముందడుగువేసి, కాంగ్రెసు ఒకతీర్మానంచేసేటట్లు ప్రతిపాదించాడు. ఆ తీర్మానంలో స్వతంత్రభారత తాత్కాలికప్రభుత్వం స్వాతంత్ర్యసమరంలో తన యావత్‌శక్తియుక్తులను ఉపయోగించాలి, దురాక్రమణ నెదిరించాలి, భారతదేశరక్షణకై తనసైన్యంతోను, తదితరశక్తులతోను మిత్రరాజ్యసమితితో పూర్తిగా సహకరించాలి. ఇదే దాని ప్రప్రథమచర్య"అని ప్రకటింపచేశాడు. ఆయన యీవిధంగా కట్టుబడడం సామాన్యవిశేషం కాదు. దురాక్రమణదారును భారతదేశం స్వతంత్రజాతిగా నిరోధించేట్లుచెయ్యాలంటే, బ్రిటన్‌తో ఏదోఒకవిధంగా పరిష్కారానికిరావాలనేకాంక్ష ప్రబలమై, గాంధిజీ యీ గరళాన్ని దిగమ్రింగాడు.

మాలోకొందరు తరచుగా గాంధీజీకి దూరమయ్యేటట్లుచేసిన సిద్ధాంత, తదితర విభేదాలు అనేకం మాయమైపోయాయి. కాని, మే

మెలాంటిచర్యతీసుకున్నా అది యుద్ధకృషికి ఆటంకమవుతుందనే ముఖ్య సంకోచంమాత్రం అలాగేవుండిపోయింది. గాంధీజీ యింకా బ్రిటిష్ప్రభుత్వంతో పరిష్కారంకుదురుతుందనేనమ్మకానికి అంటిపెట్టుకొనివుండడం మా కాశ్చర్యంకలిగించింది. పైగా, తాను ఆ పరిష్కారాన్ని సాధించేందుకు శాయశక్తులా కృషిచేస్తానన్నాడు. అందువల్ల, ఆయన ఏదో ఒక ప్రత్యక్షచర్య జరపాలని పదేపదే చెబుతున్నా, ఆ చర్యస్వరూపాన్ని నిర్వచించనూలేదు, తాను చేయదలచినదేమో సూచించనూ లేదు.

మే మిలా సంశయాల్లో, చర్చల్లో మునిగివుండగా, దేశ మానసికస్థితి మారిపోయింది. కసిగా చూస్తూ కూర్చునేస్వభావం పోయి, ఆశావేశాలు మిన్నుముట్టాయి. కాంగ్రెసునిర్ణయానికి తీర్మానాలకోసం సంఘటనలు వేచియుండడంలేదు. గాంధీజీపలుకులతో అవి ముందుకు కదలసాగాయి. ఇప్పు డవి స్వయంవేగంతో పరుగెత్తుకొస్తున్నాయి. గాంధీజీచెప్పినది తప్పోఒప్పో గాని, ఆయన ప్రజాహృదయాన్ని దృఢపరచాడు. ఆ ధోరణిలో సహించలేని తెగింపుభావం వుంది. ఆ ఆవేశోద్ధతిముందు హేతువాదానికీ, తమచర్యలవల్ల యేర్పడేపరిణామాలేమిటనే ఆలోచనాదృష్టికీ అంతప్రాముఖ్యత వుండదు. అయితే, రాగలపరిణామాలను గణించకపోలేదు. ఎలాంటి విజయమైనా లభించినా, లభించకపోయినా తాము చెల్లించవలసినమూల్యం మాత్రం మానవవ్యథారూపంలో బహుభారంగా వుంటుందని గుర్తించబడింది. కాని, వున్నస్థితిలోనే రోజురోజుకు చెల్లింపబడుతున్న మానసికవ్యథారూపమూల్యం అంతకంటె భారమైనదే. దీన్నుంచి తప్పించుకునేమార్గం కూడా లేదు. పగబట్టిన దురదృష్టదేవతను నోరుమెదపకుండా మోసేకంటే, లోతులు తెలియని సముద్రాలవంటికార్యక్రమంలోకి దూకి, ఏదోఒకటి చేయడం మంచిది. ఇది రాజకీయవాదులవిధానం కాదు. ఫలితాలను లక్ష్యపెట్టకుండా, ఏమైనాసరేనని తెగించిన ప్రజాపథం. అయినా, హేతుబుద్ధిని పురికొల్పడం, పరస్పరంఘర్షించేఆవేశాలను సమాధానపరచడం, మానవనైజంలో ప్రాథమికంగాగల విభిన్నత్వాల మధ్య ఏకత్వాన్నిసాధించడం మొదలైన ఉత్తమచర్యలు జరుగుతూనే వున్నాయి. యుద్ధం యింకా దీర్ఘకాలం జరుగుతుంది. ఇప్పటి కెన్నో

విధ్వంసాలు జరిగాయి, యింకెన్నో జరుగనున్నాయి. కాని, ఎన్నివిధ్వంసాలు జరిగినా యుద్ధాన్ని సృష్టించి, పోషించిన మనోవికారాలన్నీ నట్టుపోయేవరకు యీ యుద్ధం జరుగుతూనేవుంటుంది. ఈసారి ఓటమిల కంటె ఎక్కువ బాధాకరంగా వుండే అర్ధవిజయాలంటూ వుండవు. ఈయుద్ధం సైనికచర్యల్లోనేగాక, అది ఏప్రయోజనాలకోసం జరుపబడుతూవున్నదో ఆ ప్రాథమికలక్ష్యాలవిషయంలోకూడా తప్పుదారిబట్టింది. బహుశా, మేముతీసుకోగల ప్రత్యక్షచర్య ప్రపంచదృష్టిని యీ రెండవ దారివైపు ఆకర్షించి, సన్మార్గాన్ని పట్టించవచ్చు. అంతేగాక, ప్రస్తుతంలో విజయంలభించకపోయినా కొంతకాలానికి యీ యుద్ధలక్ష్యాన్ని రక్షించినప్రయోజనమైనా అనుభూతికిరావచ్చు. ఆవిధంగా భవిష్యత్తులోనిసైనికచర్యలకు బలమైనప్రోద్బలమిచ్చేసహాయాన్ని చేకూర్చవచ్చు.

ప్రజలఆవేశంతోపాటు ప్రభుత్వక్రోధంకూడా పెరిగింది. దానికి మానసికంగాగాని, మరోవిధంగాగాని ప్రేరణ అవుసరంలేదు. ఒక బానిసదేశాన్ని ఆక్రమించుకున్న విదేశీఅధికారానికి ఈ క్రోధధోరణీ, తద్విధానాచరణ సామాన్యలక్షణాలే. ప్రభుత్వం యిట్టిఅవకాశంకోసం ఎదురుచూస్తున్నట్లుంది. దేశంలో తన అభీష్టాన్ని వ్యతిరేకించసాహసించిన శక్తుల నన్నింటినీ, యీఅవకాశంలో, శాశ్వతంగా నాశనంచేసివేసేద్దామనుకున్నట్లు కనుపించింది. అందుకుతగ్గట్లుగా సర్వసన్నద్ధమైందికూడాను.

సంఘటనలు జరిగిపోతున్నాయి కాని, భారతదేశప్రతిష్ఠను కాపాడేందుకు, స్వరాజ్యం జన్మహక్కని చాటేందుకు, దురాక్రమణకెదురుగాజరిగేపోరాటంలో స్వతంత్రజాతిగా సహకరించేందుకు ఏదో 'చర్య'తీసుకుందామని ఎంతగానోచెప్పిన గాంధీజీ ఈ 'చర్య' స్వభావాన్నిగురించి ఏమీ చెప్పకపోవటం చిత్రమే. బహుశా, అది శాంతియుతచర్యగాక తప్పదు. కాని అంతకంటె వేరే ఏమైవుంటుంది? ఆయన బ్రిటిష్‌ప్రభుత్వంతో పరిష్కారంకుదిరే అవకాశాలున్నాయనీ, అందుకోసం తాను మళ్ళీ శాయశక్తులా ప్రయత్నించనెంచాననీ గట్టిగా చెప్పసాగాడు. అఖిలభారతకాంగ్రెసుసమావేశంలో ఆయనచివరిఉపన్యాసం పరిష్కారానికై ఆయనపడుతున్నతహతహను, అందుకై ఆయన వైస్రాయిని కలుసుకునేందుకు నిశ్చయించుకోవడాన్నీ స్పష్టంచేసింది.

బహిరంగంగాగాని కాంగ్రెసుకార్యవర్గ రహస్యసమావేశాల్లోగాని ఆయన తనమనసులోవున్న కార్యక్రమస్వభావాన్ని ఈషణ్మాత్రమైనా చెప్పలేదు. వ్యక్తిగతరహస్యమంతనాల్లో ఒకే చిన్నసూచనమాత్రం చేశాడు. అన్నిసంప్రదింపులూ విఫలమైపోతే ఒకరకమైనసహాయనిరాకరణం చేయమనీ, ఒకరోజు నిరసనసూచకంగా హర్తాళ్ చేయమనీ (ఒకజాతియొక్క నిరసనసూచనగా ఒకరోజు సర్వవ్యాపితసమ్మె లేక దేశంలో అన్నిపనులూ ఆపివేయడం) తాను ప్రజలకు పిలుపుయివ్వగలనని చెప్పాడు. ఇది చాలా అస్పష్టమైనసూచనే. పరిష్కారంకోసం తాను ప్రయత్నించేవరకు, ఆతరువాతికార్యక్రమానికి పథకాలు వేయడం ఆయన కిష్టంలేదుగనుక, ఆయన దీన్నికూడా యిదమిత్థంగా చెప్పలేదు. అందువల్ల ఆయనగాని, కాంగ్రెసుకార్యవర్గంగాని ప్రజలు అన్నిరకాల పరిణామాలకు సిద్ధంగావుండాలనీ, ఏసందర్భంలోనైనాసరే శాంతియుతంగా, అహింసాసిద్ధాంతాన్ననుసరించిమాత్రమే ప్రవర్తించాలనీ చెప్పడం జరిగిందిగాని, మరేరకమైనసూచనలను బహిరంగంగాగాని, రహస్యంగాగాని యిచ్చివుండలేదు.

ఈప్రతిష్టంభనకు పరిష్కారమార్గం దొరుకుతుందని గాంధీజీ పూర్తిగా ఆశిస్తున్నా, బహుకొద్దిమందికే ఆ నమ్మకం వుంది. సంఘటనలవైఖరీ అప్పటివరకు జరిగినపరిణామాలూ సంఘర్షణ తప్పదని సూచిస్తున్నాయి. అట్టిపరిస్థితి యేర్పడినప్పుడు మధ్యేమార్గాలప్రాముఖ్యత నశిస్తుంది. ప్రతివ్యక్తీ తా నేపక్షంవహించాలో నిశ్చయించుకోవాల్సివస్తుంది. కాంగ్రెసువారికీ, వారిమార్గంలోనే ఆలోచించేవారికీ ఏపక్షాన్నెన్నుకోవాలనే ప్రసక్తేలేదు. శక్తివంతమైన ప్రభుత్వబలమంతా ఏకమై మాప్రజలను అణచివేస్తుంటే, భారతస్వాతంత్ర్యసమస్యలపై సంఘర్షణ జరుగుతూంటే ప్రేక్షకుల్లా చూస్తూ వూరుకోవడమనేది వూహించశక్యంకానిది. సానుభూతిగలవారు అనేకమంది అలాచూస్తూ వుండిపోవడం సహజమే. కాని ముఖ్యకాంగ్రెసువాదులెవరైనాసరే, తాము లోగడచేసిన స్వీయచర్యలయొక్కపరిణామాలనుంచి తమ్మెతాము రక్షించుకునేందుకు యిలా ప్రేక్షకుల్లా వుండిపోవాలని ఏమాత్రం ప్రయత్నించినా అవమానకరంగాను, సిగ్గుచేటుగాను ఎంచబడుతుంది. ఈకారణంవల్లగాకపోయినా, వారు తప్పించుకునేవీల్లేదు. భారత

దేశగతచరిత్ర, ప్రస్తుతవ్యథ, భవిష్యదాశ వారిని వెంటాడుతూ, వారి చర్యలను పర్యవేక్షిస్తూ, ముందుకు నడిపించాయి. బెర్గ్‌సన్ "క్రియేటివ్ ఎవల్యూషన్" అనే గ్రంథంలో యిలా వ్రాశాడు: "గతంమీద గతం పడి దొంతరల్లాగా నిరంతరం పేరుకుంటూనేవుంటుంది. వాస్తవానికి 'గతం' తననుతాను భద్రపరచుకుంటుంది. బహుశా, అది అంతాకలిసి ప్రతిక్షణమూ మనలను వెంటాడుతుంది......మనం మన 'గతం'లోని కొద్దిభాగాన్నే మనసులోవుంచుకుని మాట్లాడుతామనేది నిస్సంశయం. కాని, మన 'గతం' అంతట్నీ – మనఆత్మయొక్క మూలవైఖరితో సహా – మనసులోవుంచుకునే, మనం కోరడం, ఇష్టపడడం, ప్రవర్తించడం జరుగుతాయి."

అఖిలభారత కాంగ్రెసుసంఘం 1942 ఆగష్టు 7, 8 తేదీలలో బొంబాయిలో సమావేశమై, యిప్పుడు "క్విట్ఇండియాతీర్మానం" అనబడుతున్నదాన్ని పరిశీలించి, బహిరంగంగా చర్చించింది. ఆ తీర్మానం దీర్ఘంగా, సమగ్రంగా వుంది. అందులో భారతదేశంలో బ్రిటిష్ పాలనను తొలగించి, భారతస్వాతంత్ర్యాన్ని గుర్తించవలసినఆవశ్యకత హేతుబద్ధంగా వాదించబడింది. ఇలాచేయడం భారతదేశానికీ ప్రయోజనమే, మిత్రరాజ్యాలఆశయసిద్ధికీ ఆవశ్యకమే. ఆ పాలన ఇంకా కొనసాగించబడడం భారతదేశాన్ని అవమానంపాలుజేసి, బలహీనపరచి, తననుతానురక్షించుకునేసామర్థ్యాన్ని తగ్గిస్తూ, ప్రపంచస్వాతంత్ర్యసాధనకు తనవంతుకృషిచేసేశక్తిని సన్నగిలజేస్తుంది......ఒకసామ్రాజ్యాన్నికలిగివుండడం, పాలకశక్తికి మరింతబలాన్ని చేకూర్చవలసినదిపోయి అదొక భారంగా, శాపంగా తయారైంది. బ్రిటను, మిత్రరాజ్యాల మంచిచెడ్డలు భారతస్వాతంత్ర్యాన్నిబట్టే నిర్ణయించబడాలి. దాన్నిబట్టే ఆసియా, ఆఫ్రికాలప్రజలు ఆశాసముత్సాహాలు పొందగలరు. అందువల్ల ఆధునికసామ్రాజ్యవాదానికి విశిష్ట ఉదాహరణమైన భారతదేశమే అసలుప్రశ్నగా తయారైంది." ఈతీర్మానం ప్రజల్లోఅన్ని ముఖ్యవర్గాలప్రతినిధులూవుండే సమగ్రతాత్కాలికప్రభుత్వం యేర్పడాలనీ, "అది తనఅదుపులోగల్ల సాయుధదళాలను, అహింసాశక్తులను పూర్తిగా వినియోగించి, తన మిత్రరాజ్యాలసహకారంతో శత్రువును నిరోధించి, భారతదేశాన్ని రక్షించడమే దాని ప్రాథమికబాధ్యత" యని

కూడా సూచించింది. ఈ ప్రభుత్వం రాజ్యాంగరచనాసంఘం యేర్పడే పథకంవేస్తుంది. ఆ సంఘం అన్నివర్గాలప్రజలకు ఆమోదకరమైన రాజ్యాంగచట్టాన్ని తయారుచేస్తుంది. రాజ్యాంగచట్టం సమాఖ్యప్రధానంగా వుండి, సమాఖ్యలోని ప్రతిరాష్ట్రము సాధ్యమైనంత ఎక్కువ స్వేచ్ఛ కలిగివుండేటట్లుంటుంది. "స్వాతంత్ర్యంవల్ల ప్రజల ఏకీకృతనిశ్చయమూ, బలమూ చేకూరి, భారతదేశం దురాక్రమణను విజయవంతంగా నిరోధించే సామర్థ్యాన్ని పొందుతుంది."

భారతదేశస్వాతంత్ర్యం ఇతర ఆసియాజాతులన్నింటికీ రాగల స్వాతంత్ర్యానికినాందీప్రస్తావనాచిహ్నమవుతుంది. అంతేగాక, స్వతంత్ర రాజ్యాలప్రపంచసమాఖ్య యేర్పడాలనీ, అందుకు మిత్రరాజ్యసమితి ఏర్పాటుతో కృషి ప్రారంభంకావాలనీ కూడా ప్రతిపాదించబడింది.

అఖిలభారతకాంగ్రెసుసంఘం "చైనా, రష్యాలస్వాతంత్ర్యం అమూల్యమైనదిగనుక తప్పకు రక్షించబడాలి. వాటిరక్షణచర్యల్లో ఏవిధమైనచీకాకూ కల్గించరాదని యీసంఘం ఆతురతపడుతోంది. మిత్రరాజ్యాల రక్షకచర్యలసామర్థ్యాన్ని తారుమారుచెయ్యడం మా ఉద్దేశంకాదు. (అప్పుడు చైనా, రష్యాలకు సంభవించినప్రమాదాలు చాలా గొప్పవి) కాని, భారతదేశానికీ యీరాజ్యాలకూ కూడా ప్రమాదాలు హెచ్చుతున్నాయి. ఈ స్థితిలో విదేశీపాలనకులొంగివుండడం, చేతులు ముడుచుకొనికూర్చోవడం భారతదేశాన్ని అగౌరవపరచడమేగాక, శత్రువునునిరోధించి తననుతానురక్షించుకునేశక్తిని తగ్గించివేస్తుంది. పైగా యిది పెరుగుతూన్నప్రమాదానికి పరిష్కారమూ కాదు, మిత్రరాజ్యాల ప్రజలకు ప్రయోజనకరమూ కాదు." అని చెప్పింది.

ఈసంఘం "ప్రపంచస్వాతంత్ర్యప్రయోజనంకోసం" మరొకసారి బ్రిటనుకూ, మిత్రరాజ్యాలకూ విజ్ఞప్తిచేసింది. కాని దానితీర్మానంలోని తర్వాతిభాగం యిలావుంది: "సామ్రాజ్యవాద, నిరంకుశాధికార ప్రభుత్వం ప్రజలమీద స్వారీచేస్తోంది. అందువల్ల ప్రజలు తమమేలుకోసంగాని, ప్రపంచమానవాళికోసంగాని కృషిచేసేవీల్లేకుండా ఆ ప్రభుత్వమే అడ్డంగావుంది. అట్టిప్రభుత్వానికి వ్యతిరేకంగా తమ నిశ్చయాన్ని వెల్లడించాలని ప్రజలు పరవళ్ళుత్రొక్కుతున్నారు. అట్టిప్రజలను ఇంకా అపివుంచడం యీ సంఘానికి ధర్మంకాదు. కాబట్టి అనన్యశరణ్యమైన

గాంధీజీనాయకత్వాన, అహింసాసూత్రానుసారం ప్రజాపోరాటాన్ని ప్రారంభించేందుకు, స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకు, భారత దేశజన్మ హక్కును ఎలుగెత్తిచాటేందుకు యీ కమిటీ అనుమతిస్తోంది.” ఈ అనుమతి గాంధీజీ అలా నిర్ణయించినతర్వాతనే అమల్లోకివస్తుంది. చివరికి “కాంగ్రెసుకోసమే అధికారాన్ని సంపాదించాలనేవుద్దేశం యీకమిటీకి లేదు. ఆ అధికారం వచ్చినపుడు అది భారతప్రజలందరికీ చెందుతుంది” అని కూడా స్పష్టంచేయబడింది.

కాంగ్రెసుఅధ్యక్షుడు మౌలానాఅబుల్‌కలాంఆజాద్, గాంధీజీ తమ అంత్యోపన్యాసాలలో ఇంక తాముతీసుకోగలచర్యలను సూచించారు. బ్రిటిష్‌ప్రభుత్వప్రతినిధిగావ్యవహరిస్తున్న వైస్రాయిని కలుసుకోవాలనీ, గౌరవప్రదమైన పరిష్కారాన్ని కుదిర్చి, తద్వారా భారత దేశస్వాతంత్ర్యాన్ని గుర్తించడమేగాక, దురాక్రమణకుదిగిన అక్షరాజ్యాలకువ్యతిరేకంగా మిత్రరాజ్యాలు జరుపుతున్నపోరాటం జయప్రదమయ్యే కృషి చేయవలసినదిగా ప్రధానమిత్రరాజ్యాధినాయకులను కోరాలనీ స్పష్టం చేశారు.

చివరికి 1942 ఆగష్టు 8 వ తేదీన రాత్రి చాలా ప్రొద్దుపోయిన తర్వాత ఈ తీర్మానం ఆమోదించబడింది. కొద్దిగంటలతర్వాత - ఆగస్టు 9 తేదీ తెల్లవారుజామున - బొంబాయిలోనూ, దేశమంతటా అసంఖ్యాకంగా అరెస్టులు జరిగాయి ఆవిధంగా అహమ్మద్‌నగరుకోటకు చేరాము.

# మళ్ళీ అహమ్మద్‌నగరంకోట

## ౧ సంఘటనాపరంపర

అహమ్మద్‌నగరంకోట. 1944 సం॥ ఆగస్టు 13 వ తేదీ. ఇక్కడికొచ్చి దాదాపు రెండుసంవత్సరాలు కావచ్చింది. బహుపరిమితమైన స్థలంలో ప్రతిరోజూ అదేమనుష్యులముఖాలను చూస్తూ, రోజూ ఒక్కమాదిరి కార్యకలాపాలనే సాగిస్తూ రెండుసంవత్సరాలు జీవితం కలగా గడిచిపోయింది. కొద్దిరోజుల్లో ఈ కలనుండి మేల్కొని విశాల ప్రపంచంలోపడి మళ్ళీ కార్యకలాపంలోపడతాం. అప్పటికి ప్రపంచం చాలా మారిపోతుంది. మేము ఎదుర్కొనవలసిన స్థితిగతులు, మనుష్యులు అంతా కొత్తగాకనబడుతున్నాయి. పూర్వస్మృతులను జ్ఞాపకం చేసుకుంటాం. కాని ఆ దృశ్యాలేమీ ఈకాలానికి సరిపోయేటట్లుగాని అతుకుతున్నట్లుగాని కనుబడడంలేదు. దైనందినజీవితమంతా ఒక కలగానే కనుబడుతుంది. ఈ కలలోనుంచి గభాలున ఎప్పుడో మెళకువ వస్తుంది కాబోలు. ఏది కలో, ఏది నిజమో తెలుసుకోవడం దుస్తరం. వాటిఅనుభవాన్ని విశేషంగా పొందుతూఉండడంవల్ల రెండూ నిజంగానే కనుబడుతాయి. లేకపోతే ఈ అనుభవాలన్నీ లీలామాత్రంగా కనుబడి అంతా అసత్యంగానే తోస్తుంది.

జైలుజీవితంవల్లకలిగే ఏకాంతవాసం, తనగతజీవితంలోని అనేక ఘట్టాలను స్మృతిపథంలోకి తెస్తుంది. మానవచరిత్రలోని అనేకఘట్టాలు కూడా జ్ఞాపకమొస్తాయి. గత నాల్గునెలల్లోనూ, ఈ పుస్తకం వ్రాసేటప్పుడు, భారతదేశంయొక్క గతప్రశస్తి, అనుభవాలు ఎన్నో నాకు జ్ఞాపకానికొచ్చాయి. అలావచ్చినజ్ఞాపకాలలోనుంచి కొన్నింటిని మాత్రమే ఏరి ఈ గ్రంథాన్నికూర్చేను. ఏనంతను పునఃపరిశీలనచేస్తే, ఇందులో పూర్ణత్వ ము. ఒక సమగ్రమైనచరిత్ర కాకుండా అతుకులవ్యావహ ఇదొక కలగూరగంప. నా వ్యక్తిత్వానికి ఎక్కువ ప్ర ుతుంది. చరిత్రదృష్ట్యా పరిశీలించవలసిన విషయాల్లోనూ, విమర్శనలో న్యా

కూడా నావ్యక్తిత్వమే అధికంగా కనుబడుతుంది. నాకిష్టంలేకపోయినా, నావ్యక్తిత్వధోరణే ప్రకోపించింది. అనేకసార్లు నేనాధోరణిని ఎదుర్కొన్నాను. కాని ఒక్కొక్కప్పుడు ఆ కళ్ళేలనువదిలేసి, నా కలానికి అడ్డు లేకుండావదిలేశాను. కొంతవరకు నామనస్సులోని ఆలోచనలను అద్దంలోలాగున చూడగలిగేను.

గతాన్నిగురించివ్రాయడంవల్ల నామనస్సులోని ఆ భారాన్ని తొలగించుకున్నాను. బహుక్లిష్టసమస్యలతోకూడినవర్తమానం అలాగే ఉన్నది. అంధకారావృతమైన భవిష్యత్తుకూడా అలాగే ఉన్నది గతం యొక్కభారంకంటె వర్తమాన, భవిష్యత్తులభారం ఏమీ తక్కువకాదు. చంచలమైనమనస్సు ఏవిధంగానూ కుదుటబడకుండా అశాంతితో సంచారంచేస్తోంది. తద్వారా తనకూ లోకానికీకూడా అసౌకర్యాన్ని కలిగిస్తోంది. ఆలోచనారహితమైన అమాయికమనస్కులెంత అదృష్టవంతులాయనే ఈర్ష్యకలుగుతోంది. పిసరంతైనా ఆలోచన, సంశయం లేకుండా జీవించగలిగితే ఎంతసుఖమోకదా అనిపిస్తోంది. అప్పుడప్పుడు ఏదైనా కొంతబాధో, ఆఘాతమో తగిలినా మొత్తంమీద ఆలాంటి ఆలోచనారహితమైనజీవితం సుఖంలా తోస్తుంది.

ఒకదానివెనుకఒకటిగా అనేకసంఘటనలు అనంతంగా జరుగుతుంటాయి. అందులో ఏదో ఒకసంఘటనను పట్టుకుని అదే ఆద్యంతమనుకుని దానిలోనుండి ఏవో నిర్ణయాలకురావాలనుకుంటాం. తాత్కాలికమైన ఏదోకారణాన్ని పురస్కరించుకుని దానినాధారంగాచేసుకుని నిర్ణయాలనుచేస్తుంటాం. అయినప్పటికీ దీని కొంక మొదలంటూ లేదు. పరంపరగావచ్చే అనేకసంఘటనలలో ఒక చిన్నలంకెమాత్రమే. అసంఖ్యాకులైన మానవమాత్రులకోరికలు, కలయికలు, సంఘర్షణలఫలితములే ఈ లంకెలు. వ్యక్తులు, తా మేలత్యంకోసం తహతహపడతారో, దానికి విరుద్ధమైనఫలితాలుకూడా కలుగుతుంటాయి. మానవులకోరికలు, లక్ష్యాలు, ఆశలు గతచరిత్రపర్యవసానములే. ఆలాగే వర్తమానంలో జరిగేఘటనలే భవిష్య[illegible] మార్గసూచకమవుతాయి. ఈ తతంగంలో జనసామాన్యాన్ని ఎక్కువగా ఆకర్షించగలిగి వారిమీద తనప్రభావాన్ని ప్రసరింపచేయగలిగినధన్యాత్ముడు నిస్సందేహంగా గొప్పపాత్రను ధరిస్తాడు. కాని ఆతడుకూడా గతచరిత్రలోనుంచి పరిణామంచెందినవాడే

అవుతున్నాడు. గతంలోనిసంఘటనలు శక్తులు ఆతడిని రూపొందింప చేస్తాయి.

## ౨ రెండు తెరలు-ఇండియన్ తెర-బ్రిటిష్ తెర

1942 సంవత్సరం ఆగస్టునెలలో జరిగినసంగతులన్నీ అకస్మాత్తుగా పుట్టుకొచ్చిన పరిణామం కాదు. అంతకు పూర్వం జరిగిన అనేకవిషయాల చరమావస్థమాత్రమే. ఆ గాథనుగురించి చాలాగ్రంథం వ్రాయబడింది. దానిని తీవ్రంగా ప్రతికూలించినవారు, సమర్థించినవారుకూడా కావలసినన్ని సమాధానాలు వ్రాశారు. కాని ఇంతగ్రంథం వ్రాయబడినప్పటికీ, అసలు ఆంతర్యాన్నిమాత్రం చాలావరకు తెలిసికోలేకపోయారు. కేవలం రాజకీయమేకాకుండా అంతకన్న నిగూఢమైనవ్యవహారాన్ని, ఒక్క రాజకీయదృష్టితో పరికించడమే ఇందుకుకారణం. విదేశీయనిరంకుశపరిపాలనలో ఒక్క క్షణం కూడా ఉండజాలమని ప్రజల్లో బయలుదేరిన తహతహాయే ఆ ఉద్యమానికి మూలకారణం. తదితరసమస్యలన్నీ రెండవపక్షం. విదేశీపరిపాలనక్రింద కొన్నిముఖ్యరంగాల్లో అభ్యుదయాన్నిసాధించగలమా అన్నదేసమస్య. ఆలా కాకపోతే దానినెదుర్కొనడంవల్ల ఫలితాలు మరింతప్రమాదకరం కాకుండాఉండాలి. ఏమైనా, పరపాలననుండి విముక్తిచెందితీరాలనీ, అందుకోసం ఏవిధమైనత్యాగానికైనా సిద్ధంకావాలనీ గాఢమైనకోరిక కలిగింది. ఏమైనాసరే, ఈపరప్రభుత్వాన్నిమాత్రం ఒక్కఘుడియకూడా భరించడానికి వీలులేదనేనిశ్చయం దేశంలో ఏర్పడిపోయింది.

అయితే, ఆలాంటిభావం కొత్తఅనుభూతిమాత్రంకాదు. ఆకోరిక చాలా సంవత్సరాలుగా అట్లాగే ఉంది. కాని లోగడ ఆ స్వేచ్ఛాభావాలు హద్దులనతిక్రమించకుండా కట్టుబాట్లలో ఉండిపోయాయి యుద్ధం ఆలాంటి నిగ్రహాన్నీకలిగించింది. ఆ స్వేచ్ఛావాంఛను విడుదలాచేసింది. ముందుముందురానున్న విప్లవాత్మకమైన మార్పులను, పరిణామాలను గురించి ఊహించుకోవడానికి యుద్ధం సావకాశంకల్పించింది. అచిరకాలంలో మన చిరకాలవాంఛితమైన స్వాతంత్ర్యాసిద్ధించేసావకాశాన్నికనుపరచింది. కాని అక్షరాజ్యాల నిరంకుశత్వాన్ని ఎదిరించడానికి జరుగుచున్నపోరాటాన్ని ఏవిధంగానైనా బలహీనపరచడంగాని ఆటంకంకలుగ

చేయడంకాని మనఅభీష్టం కానికారణంచేత, స్వాతంత్ర్యసిద్ధికోరకు సహజంగా పడవలసినంత తొందరపాటును మనం కనుబర్చలేదు.

కాని, యుద్ధంసాగి, బాగా విస్తృతమైనపిమ్మట పాశ్చాత్యప్రజాస్వామికాలు పాతవిధానాలను మార్చడానికి కాకుండా, వాటిని శాశ్వతంచేయడానికే యుద్ధాన్ని సాగిస్తున్నారని మరీ బట్టబయలుగా కనబడిపోయింది. యుద్ధానికిముందు వారు ఫాసిస్టునిరంకుశవిధానానికి అనేకవిధాలైన ఉపహారాలను సమర్పించి దానిని శాంతపరచుకున్నారు. కేవలం దానికి భయపడిమాత్రమే వారావిధంగా సమాధానపరచుకోలేదు. వాస్తవానికి ఆ నిరంకుశవిధానాలపట్ల వారికొక సహజమైనఅభిమానమున్నది. అంతేకాకుండా దానిస్థానే రాగల రాజ్యాంగస్వరూపమంటే వారికి ఉండే అయిష్టతకూడా అలాంటిదే. నాజీజం, ఫాసిజం హఠాత్తుగా వెలసినవికావు. చరిత్రలో గభాలునవచ్చినప్రమాదాలు కావు. సామ్రాజ్యతత్వం, జాత్యహంకారం, జాతీయపోరాటాలు, అధికారకేంద్రీకరణం, ప్రస్తుతసంఘంయొక్క పరిమితులనుదాటిపోయిన సాంకేతికశాస్త్రజ్ఞానం, అన్నిటికన్నా ప్రజాస్వామికఆదర్శానికి, దాని ప్రతికూలశక్తులకు సహజంగాఉండేసంఘర్షణ మొదలైన అనేకసంఘటనల సహజపరిణామం నాజీజం. పశ్చిమయూరోపుదేశాలలోను, ఉత్తర అమెరికాదేశాల్లోనూ రాజకీయప్రజాస్వామికాలు జాతీయంగానూ, వ్యక్తిగతంగానూకూడా అభివృద్ధిచెంది, ఆర్థికసమత్వమే లక్ష్యంగాగల కొత్తఆదర్శాలను, కొత్తశక్తులను ప్రకోపింపచేశాయి. అందుచేత సంఘర్షణతప్పనిసరియైనది. రాజకీయప్రజాస్వామికం విస్తృతమైనా కావాలి. లేక దానిఅభివృద్ధికంతరాయంకలిగి అంతమైనాపొందాలి. ఎన్ని అడ్డంకులొచ్చినా ప్రజాస్వామికమే వృద్ధిచెందింది. రాజకీయసంస్థల కదే నిర్వివాదమైన లక్ష్యమైంది. కాని ఒకకాలంనాటికి దాని అభివృద్ధి సాంఘిక నిర్మాణంయొక్కపునాదులనే కదలించేస్థితిగతు లేర్పడ్డాయి. ఆ సాంఘిక నిర్మాణాన్ని అలాగే ఉంచాలనేవారు ఆందోళితులై, ఆ మార్పును ఎదిరించడానికి నడుములుబిగించి ముందుకొచ్చారు. కొన్నిదేశాల్లో ఈ విజృంభణవల్ల, అతిత్వరలో ప్రజాస్వామికం బహిరంగంగా అడుగంటిపోయింది. దానిస్థానే ఫాసిజం, నాజీజంలు ప్రత్యక్షమైనాయి. పశ్చిమయూరోపులోని ప్రజాస్వామికాల్లో ఈతంతే సాగిందికాని, అపేక్ష

ఇతరకారణాలచేత ముఖ్యంగా చిరకాలగతమైన సాంప్రదాయంవల్ల ప్రజాస్వామికానికి ప్రమాదంమాత్రం రాలేదు. ఈ ప్రజాస్వామికాల అధీనంలో పెద్దసామ్రాజ్యాలు కూడా ఉన్నాయి. ఆ సామ్రాజ్యాలకు చెందిన అధీనదేశాల్లో ఫాసిస్టుపద్ధతులమీదనే రాజ్యాంగం నడుస్తోంది. అక్కడకూడా, ఫాసిస్టురాజ్యాల్లోలాగునే పరిపాలకులైనవారు, స్వాతంత్ర్యవాంఛను నిరోధించడానికి, అభ్యుదయనిరోధకులు అవకాశవాదులు నైన ధనికవర్గాలవారితో చేరిపోయారు. ప్రజాస్వామికపరిపాలనావిధానం తమదేశాల్లో అమలుజరగడంఅవసరమే కాని సిద్ధాంతరీత్యా ఆ విధానమెంతమంచిదైనా, తమఅధీనంలోనున్నవలసరాజ్యాల్లోమాత్రం అక్కడి స్థితిగతులనుబట్టి వర్తింపచేయకూడదని ఘంటాపథంగా చెపుతూ ఉంటారు.కనుక ఫాసిజంయొక్క దుష్టత్వాన్ని, వికారస్వరూపాన్ని వారెంత అసహ్యించుకున్నా, ఈ పాశ్చాత్యప్రజాస్వామికాలకున్నూ ఫాసిస్టురాజ్యాలకున్నూ ఒకసిద్ధాంతరీత్యా సన్నిహితత్వముందని వారనుకోక తప్పలేదు.

ఆత్మరక్షణకోసం వారు పోరాటంలోనికిదిగడం తప్పనిసరి అయినప్పటికీ, ఏ విధానం బొత్తుగా అధ్వాన్నంగా పాడైపోయిందో దాని పునరుద్ధరణకే వారు పోరాటంలోదిగవలసొచ్చింది. ఈమహాసంగ్రామమంతా ఆత్మరక్షణకోసం అనే నిరూపించబడింది. ఒకవిధంగా ఆమాట కొంతవరకు నిజమే. కాని యుద్ధంవిషయంలో మరొకదృక్పథం ఉన్నది. సైనికలక్ష్యాలకు, సిద్ధాంతాలకు అతీతమైన నైతికదృక్పథం. నిరంకుశ పరిపాలనావిధానాన్ని ఆ దృక్పథం తీవ్రంగాఎదుర్కొంది. ప్రపంచప్రజల ఆత్మలను సంరక్షించడానికే యుద్ధమని ప్రకటించబడింది. ఫాసిస్టురాజ్యాల్లోనేకాకుండా, యునైటెడ్ నేషన్సులో మార్పును తీసుకునిరాగలిగిన బీజాలు యుద్ధంలోఉన్నాయి. దాని ఈనైతికదృక్పథంమాత్రం బలవత్తరమైన ప్రచారకార్యక్రమంముందర, దాని ధాటికాగలేకపోయింది. ఎంతసేపూ ఆత్మరక్షణ, గతాన్ని శాశ్వతంగాచేయడమే జరిగింది కాని, నూతనమైనభవిష్యత్తును సృష్టించేపనేమీజరుగలేదు. పశ్చిమదేశాల్లో ఈ నైతికదృక్పథమందు విశ్వాసంకలిగి నూతనప్రపంచాన్ని సృష్టించాలనేవారు చాలామంది ఉన్నారు. యుద్ధంలో ప్రాణాలనర్పించినవారిలో కూడా అలాంటిమార్పును కాంక్షించినవారెందరో ఉన్నారు. దరిద్రులైన

వారు, జీవితసౌఖ్యాలనుపోగొట్టుకున్న వారు జాత్యహంకారంవల్లబాధలు పడినవారు యూరోపు అమెరికా దేశాల్లో కోటానుకోట్లుగా ఉన్నారు. ఆసియా, ఆఫ్రికా దేశాల్లో ఇంకా ఎక్కువగా ఉన్నారు. అలాంటివాళ్ళు తమగతాన్ని విస్మరించలేరు. వర్తమానంలోని మహాబాధలను మరచిపోలేరు. అలాంటివాళ్ళు తగినంతకారణం లేకపోయినాకూడా ఈ యుద్ధంవల్ల ఇంతవరకు క్రుంగతీస్తున్న తమకష్టాలన్నీ గట్టెక్కుతాయని ఉవ్విళ్లూరేరు.

కాని సంయుక్తరాజ్యాలనాయకుల దృష్టి ఎంతవరకూ వెనుకవైపేగాని ముందుచూపు లేదు. అప్పుడప్పుడుమాత్రం, ప్రజల ఆశాపిపాసనుచల్లార్చుటకోయన్నట్లు పెద్దపెద్ద ధర్మవన్నాలను చెప్పుతూఉండేవారు. కాని ఆచరణలో వారిమాటలకు చేతలకు సంబంధంఉండేదికాదు. విన్‌స్టన్‌చర్చిల్ లెఖ్ఖలో పోగొట్టుకున్నది తిరిగిసంపాదించడమే యుద్ధంయొక్కప్రథమలక్ష్యం. స్వల్పమార్పులతో ఇంగ్లండుయొక్క సాంఘికవ్యవస్థ అలాగే ఉండాలనీ, బ్రిటిష్‌సామ్రాజ్యరూపం చెక్కుచెదరకుండా ఉండాలనే ఆయనఅభిప్రాయం. అమెరికా అధ్యక్షుడు రూజ్వెల్టు మరికొంత ఆశాజనకంగానూ అభ్యుదయకరంగానూ మాట్లాడినాడుకాని, చేతలలోమాత్రం ఏమీా తేడా కనుబడలేదు. అయినా ప్రపంచంలో అనేకమందిమాత్రం, ఆయన చాలా దూరదృష్టిగల రాజకీయవేత్త కనుక, ఏదో కొంత అభ్యుదయం ఆయనవల్ల కలుగుతుందని ఆశించారు.

కనుక బ్రిటిష్‌పాలకులకు సంబంధించినంతవరకు, ఇండియాలోకాని ప్రపంచంలోకాని ఏవిధమైనమార్పు కలుగదనే వారివిశ్వాసం. గతంలోలాగునే తమరాజ్యాలు యథాతథంగా నడిచిపోతాయనీ, కనుక వర్తమానంకూడా దానికనుగుణ్యంగానే ఉండాలనీ వారి అభిప్రాయం. ఆస్థితిగతులలో క్రిప్సురాయబారంచేసినరాజ్యాంగసూచనలు పైకి చాలా అభ్యుదయకరంగా కనుబడినా మనకుమాత్రం చాలా ప్రమాదకరమైన సమస్యలను తెచ్చిపెట్టినాయి. మనస్వాతంత్ర్యసిద్ధికి అవి అనుల్లంఘనీయమైన అంతరాయాలులా కనుపించాయి. కొంతవరకు వాటిఫలితాలను వెంటనే చవిచూచాం. సర్వవ్యాప్తమైన బ్రిటిష్‌ప్రభుత్వనిరంకుశత్వం, యుద్ధంపేరిట సర్వసామాన్యమైన పౌరస్వాతంత్ర్యపుహక్కులన్నిటినీ అణగ

ప్రాకేసింది. నిరంకుశత్వంచరమావస్థకొచ్చింది. ఈకాలపువారెవ్వరూ ఆలాంటి నిర్బంధములనుచూచిఉండరు. లజ్జాకరమైన మనబానిసత్వపు స్థితిని ఈనిర్బంధవిధానం పదేపదే జ్ఞాపకానికి తెస్తూఉండేది. దానినిబట్టి భవిష్యత్తు ఎలాఉంటుందోకూడా ఊహించుకోవలసివచ్చేది. ఈ వర్తమానంలోనుండేకదా భవిష్యత్తు రూపొందవలసినది! దుర్భరమైన ఈబానిసత్వానికి తలొగ్గడంకన్న ఏమైపోయినామంచిదే ననిపించేది.

లక్షలాదిజనాభాకలిగిన ఈభారతదేశంలోఎంతమంది ఈవిధంగా ఆవేదనపడుతున్నారనేదే ప్రశ్న. ఏమంటే, దుర్భరమైనదారిద్ర్యబాధవల్ల లక్షలాదిప్రజలకు ఆలోచనాశక్తినశించిపోయింది. ఏ కొద్దిమందైనా మిగులుంటే, వారిలో కొంతమంది అధికారమదాంధులైనారు. ధనాధిక్యతవల్లనో, ప్రత్యేకసౌకర్యములవల్లనో, మరికొందరిమనస్సులు కలుషితమైనాయి. అయినప్పటికి బానిసత్వవిమోచనకోసం కొద్దో గొప్పో అంతా ఆవేదనపడ్డారు. కాకపోతే అంతస్థులవారీగా ఉన్నది స్వాతంత్ర్య వాంఛ కొందరతిగాఢమైనవిశ్వాసంతో ఏలాంటికష్టాలనైనా ఎదుర్కొనడానికి సిద్ధపడ్డారు. ఆలాంటివారు సహజంగా కార్యరంగంలో దూకేరు. మరికొందరు కాస్తదూరాన్నుండి సానుభూతిచూపడంతో సంతృప్తిపడ్డారు. ఎలాంటికష్టాలొచ్చినా వెనుదీయకుండా ముందుకు పోగలిగిన ఆవేశపరులకు తమ్మావరించిన ఈబానిసత్వం ఉక్కిరిబిక్కిరిగా ఉండేది. సాధారణస్థాయిలో జీవించేవాళ్ళు ఆ స్థితిలోకూడా ఎలాగో సర్దుకుని కాలక్షేపంచేయగలిగేవాళ్ళు.

భారతదేశంలోని బ్రిటిష్‌పరిపాలకులధోరణి చాలావికృతంగా ఉంది. వారిమనోభావాలకు, భారతీయభావాలకు ఎక్కడా పోలికలేదు. రెంటికీమధ్య ఒకఅగాధం ఏర్పడింది. ఇందులో తప్పెవ్వరిదైనా మొత్తం మీద బ్రిటిష్‌వారు భారతదేశంలో పరిపాలకులుగా ఉండడానికనర్హులనిమాత్రం నిర్ధారణైపోయింది. ఏమంటే, నిజంగా ఏదేశంలోనైనా అభివృద్ధిజరగాలంటే పాలకులకు పాలితులకుమధ్య ఒకసామరస్యం, ఒక దృక్పథం ఉండాలి. లేకపోతే ప్రత్యక్షంగానో పరోక్షంగానో సంఘర్షణ తప్పదు. హిందూదేశంలోని బ్రిటిష్‌వారు, సాధారణంగా బ్రిటిష్‌కన్సర్వేటివ్‌వర్గానికి ప్రతినిధులుగా ఉండేవారే. బ్రిటిష్‌లిబరల్‌వర్గాలవారికీ ఈవర్గాలవారికీ ఏమీ పోలికేలేదు. ఎంతఎక్కువకాలం బ్రిటిష్‌వారు

ఇక్కడ నివసిస్తే అంత ఎక్కువ కన్సర్వేటివ్‌లుగా బిర్రబిగిసిపోతారు. అలాంటివారే ఇంగ్లండుచేరి, హిందూదేశసమస్యలమీద పండితులుగా చలామణిఅవుతూ అక్కడిప్రభుత్వానికి సలహాదారులవుతారు. వారి నిజాయితీయందు వారికి చాలావిశ్వాసం. హిందూదేశంలో బ్రిటిష్‌పరిపాలన ఉండితీరాలనీ అందువల్ల ప్రజలకు చాలా లాభదాయకమనీ వారిఅభిప్రాయం. సామ్రాజ్యసాంప్రదాయములు రక్షించడమనేమహాత్కార్యంచేయడానికే వారు నిర్దేశింపబడినారని వారిఅహం. ఈ మూలసూత్రాలనన్నిటినీత్రోసిరాజని, హిందూదేశంలోనుంచి ఈ పరరాజరికాన్నితొలగించడానికి కాంగ్రెస్‌కంకణంకట్టుకోవడంవల్లనే వారిదృష్టిలో కాంగ్రెసు తమకు మొదటిశత్రువైంది. 1942 సం॥రంలో అప్పటి ప్రభుత్వంలో హోంమెంబరైన సర్ రెజినాల్డ్ మాక్సువెల్ కేంద్రశాసనసభలోమాట్లాడుతూ ఈభావాన్నే వెలిబుచ్చాడు. కాంగ్రెసువాదులను సోషలిష్టులను, కమ్యూనిష్టులను ఏవిధమైనవిచారణ లేకుండా నిర్బంధంలోఉంచి, జర్మనీ,ఇటలీదేశపు ఖైదీలకంటె కనాకష్టంగా, అమానుషంగాబాధిస్తున్నారని సభ్యులుచేసినఆరోపణల కాతడుప్రత్యుత్తరమిస్తూ ఆ భావాన్నిప్రకటించాడు. జర్మనులు, ఇటాలియనులు తమదేశరక్షణకోసంపోరాడుతున్నారు కాని, ఈకాంగ్రెస్‌వాదులు ఉన్న సాంఘికవిధానాన్నిపూర్తిగాతారుమారుచేయడానికి సంకల్పించినవారు కనుక, వారు సంఘవిద్రోహులని ఆయనవాదం. బహుశా భారతీయుడైనవాడు తనదేశానికి స్వాతంత్ర్యాన్ని కోరడంకాని, దేశంలోని ఆర్థికవిధానాలలో మార్పులుకోరడం కాని, మహాపరాధమని ఆయనఅభిప్రాయం కాబోలు! ఈ ఉభయులమధ్య తనస్వదేశం ఇటలీ జర్మనీలతోఘోరంగా యుద్ధంచేస్తున్నా ఆయనఅభిమానం భారతీయులకంటె వారిమీదనే ఉన్నట్లు స్పష్టమవుతోంది. ఇదంతా రష్యా యుద్ధంలోదిగడానికి ముందు జరిగినవిషయం. సాంఘికస్థితిగతులను మార్చడాని కెవ్వరే ప్రయత్నంచేసినా దానిని నిరసించడం అప్పట్లో బహుసులువుగాఉండేది. ద్వితీయప్రపంచమహాసంగ్రామం ప్రారంభంకావడానికిముందు ఫాసిస్టు రాజ్యాలను ప్రశంసిస్తూఉండడం తరుచు జరుగుతుండేది. హిట్లర్ తన స్వీయచరిత్రలో బ్రిటిష్‌సామ్రాజ్యం చెక్కుచెదరకుండా ఉండాలని వ్రాశాడు కదూ!

భారతప్రభుత్వంవారు, యుద్ధంలో అక్షరాజ్యాలనోడించడానికి సర్వవిధాలా సహాయపడాలనే ఆదుర్దాతో ఉన్నారు. ఆ విజయంతో వారికి సంతృప్తిలేదు. ముఖ్యంగా కాంగ్రెస్ ఆధిపత్యాన జరుగుతుండేజాతీయపోరాటాన్ని విధ్వంసంచేస్తేగాని వారికి తృప్తి లేదు. క్రిప్సురాయబారం వారిని కొంతకలవరపరచింది. కాని అది విఫలంకావడంతోనే వారు పరమానందభరితులైనారు. కాంగ్రెస్‌పై, కాంగ్రెస్‌తో చేరిన ఇతరవర్గాలపై మరల లేవకుండా దెబ్బతీయడానికి వారి కిదొక మహత్తరమైన అవకాశం. ఇలాంటిఅవకాశం వారి కిదివర కెప్పుడూ దొరకలేదు. కేంద్రంలోనూ రాష్ట్రాల్లోనూకూడా తమ ఇష్టంవచ్చిన అధికారాలనుచలాయించడాని కిదివర కెప్పుడూ వైస్రాయికి ఆతడి ముఖ్యతాబేదారులకు ఇలాంటిసావకాశం లభించలేదు. యుద్ధం చాలాప్రమాదకరమైనసంగతి కనుక యుద్ధంజరుగుతున్నప్పుడు ఏవిధమైన ప్రతికూలశక్తులను తలెత్తనీయకూడదనేసాకు చాలా విలుగాదొరికింది. ఇంగ్లండులోనూ, అమెరికా దేశంలోనూ భారతీయాశయాలయెడల సానుభూతి గలిగిన ఉదారులను క్రిప్సురాయబారమూ, తరువాత జరిగిన ప్రచారమూ కొంత జోకొట్టింది. ఇంగ్లండులో భారతదేశాన్నిగురించి ఎప్పుడూఉంటున్న 'నిజాయితీఅహంకారం' మరింత హెచ్చింది. భారతీయులు చాలమంది కొరకరానికొయ్యలనీ, ఏవోతంటాలు తెస్తూఉంటారనీ, సంకుచితమైన దృక్పథంగలవారనీ, రానున్నప్రమాదాన్ని గుర్తింపలేనివారనీ, జపాన్‌యడలసానుభూతికలవారనీ ఇంగ్లండులోనివారు అనుకుంటూఉండేవారు. గాంధీజీప్రకటనలవల్ల ఆయనవ్యాసాలవల్ల ఆయనతోసమాధానం కుదురడం అసంభవమని నిర్ధారణైపోయింది. కనుక, గాంధీజీని, కాంగ్రెస్‌ను అణగద్రొక్కేయ్యాలనే వారు నిశ్చయించుకున్నారు.

## ప్రజాసామాన్యం తిరుగుబాటు - ఉపశమనం

1942 సం॥రం. ఆగష్టు తొమ్మిదవ తేదీ ఉదయం, భారతదేశమంతటా అసంఖ్యాకమైన అరెష్టులు జరిగినాయి. తరువాత ఏమైనదో? కొన్నివారాలైనతర్వాత ఏవోవార్తలు మాకు అసంపూర్ణంగా కర్ణాకర్ణిగా తెలిసినాయి. అప్పుడేంజరిగిందో ఈనాటికికూడా మాకు సమ

గ్రంగా తెలియదనే చెప్పాలి. ముఖ్యులైన నాయకులంతా ఒక్కసారిగా హఠాత్తుగా నిర్బంధింపబడ్డారు. తరువాత ఏమిజరగాలో ఎవరి కేమీా తెలిసినట్లు కనుపించదు. అసమ్మతిసూచకమైన ప్రదర్శనాలు జరుగక తప్పదుకదా! తాత్కాలికమైన ఆవేశపూరిత ప్రదర్శనాలు జరిగేయి. ఆ ప్రదర్శనాలను పోలీసుమిలిటరీ అధికారులు చెదరగొట్టేరు. గుంపుల మీాద తుపాకులు కాల్చేరు. కన్నీటిబాంబులనుప్రయోగించారు. ప్రజాభి ప్రాయాన్ని ప్రకటించే సాధనాలన్నీ బందైపోయినాయి. ఈవిధంగా ఎక్కడకక్కడే అణగద్రొక్కబడిన భావాలన్నీ ఒక్కసారి పొంగి, గట్లు తెగగొట్టినాయి. పెద్దనగరాల్లోనూ, పల్లెటూళ్ళలోనూ ఆవేశపూరితు లైనప్రజలు పోలీసులతోనూ, మిలిటరీతోనూ సంఘర్షణలకుదిగారు. ఏవి బ్రిటిష్‌వారి అధికారచిహ్నాలని వారికి తోచిందో వాటన్నిటిమీాద వారు దాడిచేశారు. పోస్టాఫీసులపై, రైల్వేస్టేషనులపై, పోలీసుఠాణాల మీాద దండయాత్రలుచేశారు. టెలిగ్రాఫ్‌తీగలను తెంపేరు. నాయక త్వములేని నిరాయుధులైన ప్రజలు, ప్రభుత్వలెక్కలప్రకారం 538సార్లు పోలీసు, మిలిటరీవారి కాల్పులకు గురియైనారు. అనేకసార్లు నేలబారుగా ఎగిరే విమానాలమీాదనుంచి మిషన్‌గన్‌లతో కాల్చబడ్డారు. రెండు మూడు నెలలపాటు మూాకఅల్లరులు వరుసగాసాగినాయి. కాని క్రమంగా తగ్గిపోయి, అప్పుడప్పుడుమాత్రమే పొంగుపొంగులుగా విజృంభిస్తూ ఉండేవి. "ఈ అల్లరులను బ్రిటిష్‌ప్రభుత్వం తనశక్తినంతా వినియో గించి అణగద్రొక్కేసింది"అని కామన్సుసభలో బ్రిటిష్‌ప్రధాని చర్చిల్ చెప్పేడు. భారతీయపోలీసుదళాల రాజభక్తిపరాయణత్వాన్ని, ధైర్య సాహసాలను, పట్టుదలను ఆయన ప్రశంసించాడు. మొత్తంమీాద భార తీయఉద్యోగులప్రవర్తన చాల ప్రశంసనీయమనికూడా ఆయన అభినం దించాడు. ఇండియాకు చాలామంది తెల్లసైనికులుకూడా పంపబడ్డారు. బహుశా బ్రిటిష్‌వారు హిందూదేశంలో అడుగొట్టినప్పటినుంచి నేటి వరకు ఇంతమంది తెల్లసైనికు లెప్పుడూ ఆదేశంలోఉండలేదు' అనికూడా ఆయనచెప్పేడు. విదేశీయసైన్యాలు, భారతపోలీసుదళాలు నిరాయుధు లైన పేదరైతులమీాద అనేకయుద్ధాలుచేసి జయంపొందేరు. బ్రిటిష్ రాజ్యానికి మరొక బోటని చెప్పదగిన భారతీయఉద్యోగస్థులు ఈ యు ద్ధాల్లో ప్రత్యక్షంగానో పరోక్షంగానో పూర్తిగా తోడ్పడ్డారు.

గ్రామాల్లోనూ పట్టణాల్లోనూకూడా ఆగష్టుఉద్యమం విపరీతంగా వ్యాప్తిచెందింది. అన్నిరాష్ట్రాల్లోనూ, సంస్థానాల్లోనూ అధికారుల ఉత్తర్వులనుధిక్కరించి బ్రహ్మాండమైన ప్రదర్శనాలు జరిగాయి. దుకాణాలు మూసేయడం, హర్తాళులు, వ్యాపారాలు బంద్ చేయడంజరిగింది. కొన్నిచోట్లరోజులు, వారాలు నెలలపాటుకూడా ఈ ప్రదర్శనాలు సాగేయి అల్లాగే కార్మికులసమ్మెలుకూడా జరిగాయి. కొంతకట్టుబాటుతోనూ, శిక్షణతోనూ సమ్మెలుసాగించే అలవాటుకలవారవడంచేత కార్మికులు కొన్నిముఖ్య కేంద్రాలలో జాతీయనాయకుల నిర్బంధానికసమ్మతిసూచకంగా హఠాత్తుగా సమ్మెలుచేశారు. జంషెడ్‌పురంలో తాతాకంపెనీవారియాజమాన్యంక్రింద నడుపబడే ప్రధానపరిశ్రమయైన ఇనుపకార్ఖానాలోనిపనివారు పదిహేనురోజులు పనిమానేశారు. యావద్భారతదేశంలోనుంచి వచ్చిన పనివాళ్ళు కాంగ్రెస్‌నాయకులను విడుదలచేయించి, జాతీయప్రభుత్వ మేర్పాటుచేయడానికి కృషిచేస్తామని కంపెనీఅధికారులు వాగ్దానంచేసేవరకు పనిలోచేరలేదు. బట్టల మిల్లుపరిశ్రమకు ప్రధానకేంద్రమైన అహమ్మదాబాదునగరంలోని అసంఖ్యాకమైన ఫాక్టరీలలోనికూలీలు, కార్మికసంఘాలనుండి ఆదేశాలు రాకపోయినా తమంతటతామే పనిలోకిపోకుండా మానివేశారు. అహమ్మదాబాదులోని ఈ సమ్మెను చెడగొట్టడానికి ఎందరెన్నిప్రయత్నాలు చేసినా మూడుమాసాలపాటు నిర్విఘ్నంగాసాగింది. నిజానికది కార్మికుల హృదయాలలో, రాజకీయచైతన్యంవల్లకలిగిన వీరావేశం. ఆసమయానుగుణ్యంగావచ్చినపొంగు. ఆ సమయంలో వారికి అధికంగాకూలిలభిస్తూ ఉండేది. ఆ కూలినిపోగొట్టుకుని వారు చాలాత్యాగంచేశారు. అప్పుడు వా రెవ్వరిదగ్గరనుంచీ ఏవిధమైన ధనసహాయాన్నీ పొందలేదు. ఇతర కార్మికకేంద్రాల్లోకూడా ఏకొద్దిరోజులో సమ్మెలుజరిగినాయి. మరొక ముఖ్యమైన బట్టలమిల్లుకేంద్రమైన కాన్పూరులో సమ్మెలు జరుగలేదు. అక్కడ మిల్లుకూలీలనాయకత్వం కమ్యూనిస్టులచేతుల్లో ఉండడంచేత వారు సమ్మెలను జరుగనీయలేదు. గవర్నమెంటువారి అధీనంలో నిర్వహింపబడుతుండిన రైల్వేలలోకూడా పనిఆగలేదు. ఆగస్టులో జరిగిన గలభావల్లమాత్రం ఎక్కువగానే పనిఆగిపోయింది.

రాష్ట్రాలకు సంబంధించినంతవరకు బాగాతక్కువఅలజడి జరిగింది పంజాబులో. కాని అక్కడకూడా ఎక్కువగానే సమ్మెలు, హర్తాళులు జరిగినాయి. చాలవరకు మహమ్మదీయజనాభాతో నిండిఉన్న పశ్చిమోత్త రపరగణా ఒకచిత్రమైనస్థితిలో ఉండినది. దరహంమీాద అరెస్టులు చేయ డంగాని, తదితర దుడుకుపనులనుగాని అక్కడ ప్రభుత్వం చేయలేదు. అక్కడేదైనా అగ్నిహోత్రంఅంటుకుంటే కార్చిచ్చులాదహిస్తుందనేభయం ప్రభుత్వానికుంది. అంతేకాకుండా, ముసల్మానులు ఈ ఉద్యమంలో పాల్గొనలేదని లోకాన్నిమభ్యపెట్టాలనికూడా ప్రభుత్వంవారిఆశ కా వచ్చును. కాని ఇండియాలో తక్కినచోట్ల జరుగుతున్నకథలన్నీ వారి చెవుల్లోపడినప్పుడు వాళ్ళుమాత్రం ఊరుకోగలరా? అక్కడకూడా చిచ్చురగిలింది. అనేక అసమ్మతిప్రదర్శనాలు జరిగేయి. కొన్నిచోట్ల బహిరంగంగా బ్రిటిష్‌అధికారాన్నే సవాల్‌చేశారు. తుపాకికాల్పులు వగైరా దారుణతతంగాలన్నీ అక్కడా అమలుజరిగేయి. కొన్నివేల మంది అరెస్టయినారు. పఠానులనాయకుడైన బాద్షాఖాన్ (అబ్దుల్ గఫార్‌ఖాన్) పోలీసులాఠీప్రయోగానికిగురియై ప్రమాదమైన దెబ్బలు తిన్నాడు. అక్కడిపఠానుల నావేశపరచడానికింతకంటె వేరేకారణ మక్కరలేదు. కాని ఆశ్చర్యమేమంటే, గఫారుఖానొసంగిన అద్భుత మైనశిక్షణవలన ప్రజలేమీచలించలేదు. శాంతంగా ఉండిపోయారు. ఇతరచోట్లజరిగినట్లు ఎక్కడా దౌర్జన్యాలు జరుగలేదు.

ఏవిధమైన శిక్షణగాని, కూడబలుక్కోవడం కాని లేకుండా హఠా త్తుగా ఈవిధమైన ఆవేశప్రదర్శనాలు, దౌర్జన్యం, ఆస్తిపాస్తులవిధ్వంసం జరిగినాయంటే ప్రజలు ఎంతఉడుకెత్తిపోయారో తెలుస్తుంది. మహాశక్తి వంతమైన సాయుధసైన్యాలను ఎదుర్కొన్నారంటే వారిఆవేశం ఎంతటి స్థితిలో ఉన్నదో తెలుస్తుంది. నాయకులఅరెస్టుకుపూర్వమే నిజానికి ప్రజల భావాలు ఉడుకెత్తిఉన్నాయి. కాని నాయకులనిర్బంధాలు, తర చుగా తుపాకికాల్పులు వారిని బాగా రెచ్చగొట్టేయి. తత్ఫలితంగా ఆవేశపూరితులైనగుంపులు ఏమిచేస్తారో అదేచేశారు. కొంతకాలం వరకు ఏమిచేయాలో వాళ్ళకే తెలిసినట్లులేదు. ఒక సలహానిచ్చేవారు కాని కార్యక్రమాన్నినిర్ణయించేవారు కాని లేరు. ఇలాచెయ్యమని చెప్పగలప్రసిద్ధుడైన నాయకుడెవ్వడూ లేదు. కాని వారిఆవేశం అగ్ర

హంమాత్రం చాలాఉన్నతస్థాయిలో ఉండడంచేత ఏమీచేయకుండా కూర్చోలేకపోయారు. అలాంటప్పుడు సహజంగా ఎక్కడికక్కడే స్థానిక నాయకులు బయల్దేరేరు. వారు ఇచ్చినసలహాకూడా అంతగాలేదు. కాని జరిగినదేదో తాత్కాలికంగా సామాన్యజనంలోనుంచి పుట్టు కొచ్చినదే. దేశమంతటా కూడా యువకులు ముఖ్యంగా విశ్వవిద్యాల యాల్లోనివిద్యార్థులు 1942 సం॥రం దౌర్జన్యఉద్యమాల్లోనూ, శాంతి యుతమైనఉద్యమాల్లోనూకూడా చాలాప్రముఖపాత్రను వహించారు. చాలా విశ్వవిద్యాలయాలు మూతపడిపోయాయి. స్థానికనాయకులు కొందరు శాంతియుతంగా శాసనోల్లంఘనఉద్యమాలను నడిపించాలని ప్రయత్నాలుచేశారు. కాని అప్పటి క్లిష్టపరిస్థితులలో అది సాధ్యం కాలేదు. గతించిన 20 ఏండ్లుగా వారిచెవుల్లో నూరిపోస్తున్న అహింసా పాఠాలనన్నిటినిప్రజలుమరచిపోయారు. అలాగని మనసాగాని ఇతరత్రా గాని దౌర్జన్యపద్ధతులను జయప్రదంగా కొనసాగించడానికి సంసిద్ధులు కాలేదు. లోగడనేర్చుకున్న అహింసాపాఠాలు వాళ్ళను సంశయాత్మ లనుగాచేయడంచేత దౌర్జన్యపద్ధతులకు పూనుకోలేకపోయారు. కాం గ్రెస్ తనమూలసిద్ధాంతానికి కాస్తంత బొడ్డుతుంబాలుపెట్టి ముందు గానే దౌర్జన్యచర్యలుచేయమని ప్రజలకు పిసరంత సూచన ఇచ్చి ఉంటే, జరిగిన దౌర్జన్యాలకంటె నూరురెట్లు హింసాకాండ జరిగి ఉండేది.

కాని అలాంటిసూచనేమీ చేయబడలేదు. కాంగ్రెస్ ఇచ్చిన తుదిసందేశంలోకూడా అహింసాప్రబోధమేచేసింది. కాని ఒక్కవిష యంమాత్రం ప్రజలతలకెక్కిఉండవచ్చును. శత్రువర్గాలు మీదకొచ్చి నప్పుడు వారిని తరిమెయ్యడానికి సాయుధసంరక్షణ న్యాయమైనప్పుడు, ఆ న్యాయం మనదేశాన్ని దురాక్రమణచేసికూర్చున్నవారిపట్లమాత్రం ఎందుకు వర్తించదు? హింసావిధానాలు ప్రయోగించడం తప్పు అనే నిషేధాన్ని ఒకసందర్భంలో కాస్తంత సడలించేసరికి, అనుకోనిఫలితాలు కలిగేయి. అంత సునిశితంగా విచక్షణచేయడం ప్రజలకుచేతనైనపని కాదు. ప్రపంచమంతటా తీవ్రమైనహింసాకాండ నడుస్తోంది. దాన్ని ప్రేరేపిస్తూ బ్రహ్మాండమైనప్రచారం జరుగుతోంది. కనుక సిద్ధాంతం మాట అలాఉండగా దౌర్జన్యప్రయోగం వీలునుబట్టి ప్రజలఆవేశాన్ని

బట్టి జరిగేపనిగా పరిణమించింది. పైగా కాంగ్రెస్‌లోనూ బయటా కూడా అహింసాసిద్ధాంతంలో ఎన్నడూ విశ్వాసంలేనివారున్నారు. దౌర్జన్యకార్యక్రమాలను సాగించడానికి వారి కేవిధమైనశంకగాని భీతి కాని లేదు.

మంచి ఆవేశంమీదఉన్నప్పుడు నిదానంగాఆలోచించడం చాల మందికి సాధ్యంకాదు. లోపల అణగిమణగిఉన్నఊహలు హఠాత్తుగా ముందుకుత్రోసేస్తాయి. కనుక, 1857 సం॥రం విప్లవం తర్వాత మళ్ళీ మొదటిసారిగా బ్రిటిష్‌ప్రభుత్వంమీద ప్రజలు దౌర్జన్యపద్ధతులతో తిరుగుబాటుచేశారు. కాని ఆయుధాలుమాత్రం లేవు. ప్రతిపక్షంవారి దగ్గర కావలసినన్ని ఫిరంగులు, తుపాకులు వగైరాఆయుధాలుండడంచేత వాళ్ళమీద ఏవిధమైనక్రమశిక్షణగాని నాయకత్వముగానిలేని నిరాయుధప్రజలు తిరుగబడడం అవివేకమే. గుంపులోని జనంస్తోమతుఎక్కువే కావచ్చును. కాని సాయుధులైన సైనికులముందు ఏమిచేయగలరు? ఆ సాయుధదళాలుకూడా మారిపోతే తప్ప, ఆలాంటి నిరాయుధమైన తిరుగుబాటు విఫలంకాకతప్పదు. ఇంతకూ ఆలాంటితిరుగుబాటుచేయాలని వారికి కోరికాలేదు, అందుకొరకు ఫలానాసమయమనే నిర్ధారణా చేసుకోలేదు. అమాంతంగా ఈ తిరుగుబాటు వారిమీదపడింది. కాని ఎంత అనాలోచితమైన వ్యవహారమైనప్పటికి ప్రజలు భారతస్వాతంత్ర్యం కోసం వారెంతతహతహపడుతున్నారో చూపించారు. విదేశీపరిపాలన యెడల వారికిగల అసహ్యతను ప్రకటించారు.

తాత్కాలికంగానైనా అహింసా సిద్ధాంతం అంతర్ధానమైపోయింది. కాని చిరకాలంగా ఆ సిద్ధాంతాన్ని మననంచేసుకున్న కారణంచేత కొంతలో ఒక్కసుగుణం అగుపడింది. ఆవేశాలు ఎంతగా పెచ్చుపెరిగి పోయినప్పటికీ, ఏవిధమైన జాతిద్వేషము ప్రబలలేదు. మొత్తంమీద శత్రువులను అకారణంగా హింసపెట్టాలనేభావం అంతగా ప్రకోపించ లేదు. రహదారులను పాడుచేయడం, ప్రభుత్వమువారి ఆస్తులకు నష్టం కలిగించడం జోరుగానేజరిగింది. కాని అందులో ప్రాణనష్టం కలుగకుండా చూస్తూవచ్చారు. పోలీసులువగైరా సాయుధబలాలతో తగాదాపడిన పుడు అలాంటిజాగ్రత్త ఎల్లప్పుడూ సాధ్యంకాదు. ప్రభుత్వరిపోర్టులవల్ల నేను తెలుసుకోగలిగినంతవరకు మొత్తంమీద భారతదేశమంతటిలోనూ

ఈ గలభాలవల్ల నూరుమందిమాత్రమే చనిపోయారు. ఇంతవిశాలమైన దేశంమొత్తంమీద, ఎన్నోసార్లుజరిగిన సంఘర్షణలలో మృతులైన వారి ఈ సంఖ్య తక్కువనేచెప్పాలి. బీహారులో ఎక్కడో ఇద్దరుకెనడా దేశస్థులైన వైమానికులను చంపడమే విచారకరము. మొత్తంమీద జాతి విద్వేషం రేగకుండాఉండడమే ఆశ్చర్యకరం.

1942 సం॥రం అల్లరులలో పోలీసువారికాల్పులవల్ల 1028 మంది చనిపోయారనీ, 3200 గాయపడ్డారనీ ప్రభుత్వంవారి లెఖ్ఖ. ఈలెఖ్ఖచాలా తక్కువనడానికి సందేహంలేదు. ప్రభుత్వప్రకటనవల్లనే మొత్తం 538 సార్లు కాల్పులుజరిగినట్లు తేలింది. ఇదిగాక పోలీసులు, మిలిటరీవారు నడుస్తున్నలారీలలోనుంచే జనంమీద కాల్చేరు. సుమారు 25000 మందైనా చచ్చిపోయుంటారని ప్రజలనమ్మకం. ఈసంఖ్య కొంత హెచ్చు కావచ్చును. అధమం పదివేలమంది మరణించిఉండవచ్చును.

కొన్నిచోట్ల పల్లెప్రాంతాల్లోనూ పట్టణాల్లోనూకూడా బ్రిటిష్ రాజ్యం ఏలాగున స్తంభించిపోయిందో ఆశ్చర్యంగానేఉంది. తిరిగి వాటిని జయించడానికి కొన్నిచోట్ల రోజులు, వారాలుపట్టింది. ముఖ్యంగా బీహారులోనూ, బెంగాలులో మిడ్నపూర్ జిల్లాలోనూ, ఉత్తరపరగణాలలో ఆగ్నేయభాగంలోనూ అలా జరిగింది. సంయుక్తపరగణాలలో బాలియాజిల్లాలో గుంపులవల్ల మనుష్యులెవ్వరికీ పిసరంతకూడా హింసజరుగలేదని తర్వాతజరిగిన కొన్నివిచారణలవల్ల ఋజువైంది. సాధారణపోలీసుసిబ్బంది అక్కడ ఏమీచేయలేకపోయారు. 1942 సం॥రం ఆరంభంలోనే ఇలాంటిజనసమూహాల ప్రదర్శనాలను చెదరగొట్టడానికి ప్రత్యేకసైనికపోలీసుదళాలను తయారుచేశారు. ఐర్లండులో బ్లాక్' అండ్ టాన్సు'లోవలెనే ఈప్రత్యేకపోలీసుదళాలు ఆగష్టువిప్లవాన్ని అణగగొట్టడంలో బాగా పనిచేశాయి. ఈసందర్భంలో భారతీయసైనికదళాలను అంతగా ఉపయోగించలేదు. ఎక్కువగా తెల్లసిపాయిలనే ఉపయోగించేవారు. గూర్ఖాలనుకూడా ఉపయోగించారు. భారతసైనికుల నుపయోగింపవలసివచ్చినపుడు వారికి భాషాజ్ఞానంలేని రాష్ట్రాలకు, బొత్తుగా కొత్తగాఉండే ప్రదేశాలకు పంపేవారు.

ప్రజాసమూహాలలో ఉద్రేకంకలుగడం సహజమైనట్లే, ఆసందర్భంలో ప్రభుత్వంకూడా తగినట్లు వ్యవహరించక తప్పదు. అందుచేత

ప్రభుత్వం గుంపులఆవేశప్రదర్శనాలను అణగకొట్టడంతోపాటు, శాంతి యుతంగాజరిగే ప్రదర్శనాలనుకూడా ఆపుచేయకతప్పేదికాదు. ఆత్మ రక్షణకోసమైనా శత్రువులనుకున్న వారిని నాశనంచేయడానికి ప్రయత్నిం చకతప్పలేదు. ఇంత బ్రహ్మాండమైన వేగంతో ప్రజలు విజృంభించడానికి కారణమేమిటని యోచించాలనే కోరికగాని, శక్తిగాని ప్రభుత్వాని కున్నట్లయితే, అంతగా ప్రమాదించేదికాదు. భారతసమస్య తేలికగా పరిష్కారమైయుండేది. ఇకముందెప్పుడూ ప్రభుత్వాధికారాన్ని ధిక్క రించడమనేకోరికకూడా తలెత్తకుండా కొట్టాలని ప్రభుత్వం చాలాజాగ్ర త్తగా పథకంవేసింది. మంచిసమయంచూచి మొట్టమొదటగా గట్టిదెబ్బ కొట్టింది. జాతీయరంగంలోను, కార్మికకర్షకరంగంలోను, ప్రముఖ పాత్రలనువహించిన స్త్రీపురుషులను వేలాదిగా జైళ్ళల్లోపెట్టేరు. కాని ప్రజలలో హఠాత్తుగా బయలుదేరిన విప్లవభావాన్నిచూచి అదిరిపో యారు. నిర్బంధవిధానం అనేకచోట్ల నిరుపయోగమైనందుకు వాళ్ళు చాలా ఆశ్చర్యపడ్డారు. ఉన్నతవర్గాలకుచెందిన అనేకమంది జాతీయ వాదులుకూడా దేశవ్యాప్తంగా ప్రజాసామాన్యంలోకలిగిన ఈ విప్లవా నికి హడలిపోయారు. ధనికవర్గాలవారిని లక్ష్యంచేయని ఈరాజకీయవిప్ల వం అంతటితోఆగదనీ, ఆర్థికరంగంలోకికూడా వ్యాపిస్తుందనీ వారు పసి పట్టగలిగేరు. ఎప్పుడైతే ఆ ఉద్యమాన్నిప్రభుత్వం అణిచేస్తుందని వారు రూఢిగా గ్రహించగలిగేరో వెంటనే వారంతా ప్రభుత్వానికండగాచేర డమేకాకుండా ప్రభుత్వాధికారాన్ని ధిక్కరించినవారినందరిని తీవ్రంగా నిరసించారు.

బాహ్యంగాకనబడే విప్లవాన్ని నాశనంచేశాక, దానిమూలా లనుకూడా పెకలించడం అవసరమనుకున్నారు. అందుకొరకే ప్రభుత్వ నిర్మాణం యావత్తూకూడా ప్రజలను బ్రిటిష్‌అధికారానికి దాసులను చేయడానికి పూనుకుంది. వైస్రాయి ఒకఆర్డరుతోగాని ఆర్డినెన్సుతో కాని క్షణంలో చట్టాలనుచేయగలిగేడు. రానురాను ఈ చట్టాలను తయారుచేసేతంతుకూడాపోయింది. బ్రిటిష్‌వారి సృష్టియైనఫెడరల్‌కోర్టు హైకోర్టులు ఇచ్చినతీర్పులనుకూడా అధికారులు ధిక్కరించారు. కొన్ని సందర్భాల్లో ఆ తీర్పులను త్రోసిరాజనడానికి కొత్తచట్టాలు సృష్టింప బడ్డాయి. కొన్నిట్రిబ్యునల్సునుకూడా సృష్టించి వాటిద్వారా న్యా

మూలు న్యాయకార్యవిధానాల నతిక్రమించి శిక్షలువిధించారు. ఆ ట్రిబ్యునల్సు తర్వాత రద్దయిపోయినాయి. కాని దీర్ఘమైనశిక్షలను, ఒక్కొక్కప్పుడు ఉరిశిక్షలనుకూడావిధించాయి. పోలీసులు, ప్రత్యేకసాయుధ పోలీసుదళాలు, రహస్యపుపోలీసులు ప్రభుత్వానికి ప్రధానాంగాలైనారు. ఏవిధమైన నదురూబెదురూలేకుండా ఎన్నిదుర్మార్గాలుచేసినా అడిగే వాళ్ళు లేరు. లంచగొండితనం పరిపూర్ణంగా పెరిగిపోయింది. స్కూళ్ళల్లోనూ కాలేజీల్లోనూ విద్యార్థులను అనేకవిధాలుగా శిక్షించారు. కొందరిని కొరడాలతో కొట్టేరు. ప్రభుత్వానికనుకూలమైన వ్యవహారం మినహా మిగిలిన ప్రజాహితకార్యాలన్నీ బందైపోయినాయి.

కాని అందరికన్న అధ్వాన్నంగా బాధలపాలైనవారు అమాయకులైన పేదగ్రామీణప్రజలు. అనేకతరాలుగా వాళ్ళు బాధలకలవారైనారు. అయినప్పటికీ ఎప్పుడో ముందు మంచిరోజులొస్తాయని కలలుకనడంకూడా వారికభ్యాసమైంది. ఆ ఆశతోనే వారు కార్యోత్సాహాన్ని పుంకొల్పుగుంటున్నారు. వాళ్ళుచేసినపనులు కొన్నిపొరబాట్లు కావచ్చును. అవివేకమైనవి కావచ్చును. కాని భారతస్వాతంత్ర్యసిద్ధికి మాత్రం వారికిగల అకుంఠితదీక్షను ధృవపరిచారు. వాళ్ళప్రయత్నాలు ఫలించలేదు. ఆ భారం వంగిపోయినవారిభుజాలమీద, విరిగిపోయిన వారినడుములమీద పడింది కొన్నిగ్రామాల్లో మొత్తంజనాన్నంతనూ కూడా కొరడాదెబ్బలు మొదలుకొని ఉరిశిక్షలవరకూ పాల్పడజేసిన గాథలున్నాయి. 1942సం.రంలో వంగదేశంలోని టామ్లుక్, కాంటాయి తాలూకాల్లో సంభవించిన వరదలకు ముందు, వెనుకకూడా ప్రభుత్వాధికారులు 193 కాంగ్రెస్‌శిబిరాలను, ఇండ్లను తగులబెట్టినట్లు చెప్పబడింది. ఆపరిసరాల్లో తుఫాను చాలా గొప్పగా ప్రళయతాండవంచేసింది. కాని ప్రభుత్వంకార్యవిధానంమాత్రం పిసరంతైనా మారలేదు.

గ్రామాలమీద ఉమ్మడిగా వేలకొద్దీధనాన్ని అపరాధాలుగా విధించారు. పార్లమెంటుకామన్సుసభలో ఇండియామంత్రి అమెరీనివేదిక ప్రకారం పైవిధంగా విధింపబడిన జరిమానాలమొత్తం 90 లక్షలు. అందులో వసూలైనది రు 7850000 లు. ఇంతమొత్తాన్ని ఆకలిబాధచేత అలమటించిపోయే పేదజనందగ్గర ఎలావసూలుచేయగలిగినారా అనేది వేరుప్రశ్న. 1942 సంవత్సరంలో జరిగిన పోలీసుకాల్పులవల్ల, ఇతర

మారణకర్మలవల్ల ప్రజలకు కలిగినబాధకంటె ఈ మూకుమ్మడిజరిమానాలవసూలుబాధ మరింతహెచ్చింది. వేసినజరిమానాలు వసూలుచేయడమేకాకుండా ఆ వసూలుచేసినదానిలో చాలావరకు దారిలోనే ఎప్పుమైపోతూఉండేది.

సాధారణంగా పరిపాలనావిధానంలో ఉంటూండే సాంప్రదాయాలకు, మెళకువలకూ, గుంభనకూ తిరుగుళ్ళకు స్వస్తిచెప్పబడింది. కేవలం పశుబలమే బ్రిటిష్‌అధికారానికి చిహ్నంగా ఉండిపోయింది. తాత్కాలికంగానే కావచ్చునుకాని మొత్తంమీద బ్రిటిష్‌సామ్రాజ్యం, మనదేశస్వాతంత్ర్యంకొరకుజరిగిన దార్జన్యరహితవిప్లవాన్ని దార్జన్యయుతమైన తిరుగుబాటునుకూడా అణగగొట్టి, నిరంకుశప్రభుత్వంగా నిలబడిపోయింది. బలం, శక్తిప్రధానమైనప్పుడు ఇండియూ ఓడిపోయింది. మరోలాగునచెప్పడం కేవలం మాయమాటలు. భారతదేశ పరాజయానికి కారణం బ్రిటిష్‌బలాన్ని ఎదిరించగలశక్తి లేకపోవడం, యుద్ధంవల్లకలిగిన గలభామాత్రమే కాదు. భారతప్రజలలో చాలామంది ఆఖరుసారిగా, స్వాతంత్ర్యసంపాదనకు కావలసిన త్యాగపటిమను చూపలేకపోయినారు. అందుచేతనే బ్రిటిష్‌రాజ్యాధికారులు, భారతదేశంలో తిరిగి తమ రాజ్యాన్ని బలంగా స్థాపించగలిగినామనుకుని, తమ పట్టును ఏమాత్రమూ సడలింపదలచుకోలేదు.

## ౪ విదేశాలలో అభిప్రాయము

భారతదేశంలో జరుగుచున్నసంగతులు ఎంతమాత్రమూ ఇతరదేశాల్లో తెలియకుండాఉండేఏర్పాట్లను ప్రభుత్వంచేసింది. హిందూదేశంలోని వార్తాపత్రికల్లోకూడా ఇక్కడ నిత్యమూజరుగుతుండే వ్యవహారాలను యథాతథంగా ప్రకటించడానికివీలులేకుండా నిషేధాలేర్పడినాయి. పరదేశాలకుపంపే వార్తాసందేశాలను ప్రభుత్వాధికారులు ఎంతో శ్రద్ధగా పరిశీలనచేస్తుండేవారు. పైగా ప్రభుత్వయాజమాన్యం క్రింది విదేశాల్లో అసత్యప్రచారం జోరుగాసాగింది. అనేకఅభూతకల్పనలతోకూడిన వార్తలుప్రచారమైనాయి. ముఖ్యంగా అమెరికాలో ఈవిధమైనప్రచారం మరీజోరుగాసాగింది. ఆ దేశంలో ఇలాంటిప్రచారం సాగించి వారిఅభిప్రాయాలను మార్చడంవల్ల తమకు లాభదాయకమనే

ఉద్దేశ్యంతో వందలకొలది ఇంగ్లీషువారిని, భారతీయులనుకూడా ఆ దేశానికి ప్రచారంనిమిత్తం పంపేరు.

ఈ ప్రచారంమాట అలాఉండగా, యుద్ధంవల్ల సతమతమవుతూ దినదినగండంగా కాలక్షేపంచేస్తున్న ఇంగ్లండులో, మంచి కటకటసమయంలో తమకు చిక్కులు తెచ్చిపెడుతున్న భారతప్రజలమీద చిరాకు కలుగడంసహజం. భారతప్రజలతరఫున ప్రచారంలేకపోవడంవల్ల తమమాటే ధర్మమనివిశ్వసించే బ్రిటిష్‌వారిదే పైచెయ్యిఅయినది. భారతప్రజల దృక్పథము, లక్ష్యమూ వారికి ఎరుకలేకపోవడమే వారిపాలిటిబలమైనది. కనుక ఇండియాలోని పాలకులు తమపేరుతోచేసిన అన్నిపనులను వారు సమర్థించి, ఎదుటివారిపైననే నిందమోపుతూవచ్చారు. ప్రత్యక్షంగాకనుబడుతున్న బ్రిటిష్‌వారిసహృదయతను గుర్తించలేని అవివేకులుగా భారతీయులను పరిగణించారు. బ్రిటిష్‌వారి సైనికబలము, ఇండియన్ పోలీసుదళాలు, ఈదేశంలోని తిరుగుబాటును అణగగొట్టగలగడంచేత తమదే ధర్మమనే విశ్వాసం వారిలో మరింత ప్రబలింది. సామ్రాజ్యంలోనివిశిష్టత మరొకసారి ఉగ్గడింపబడింది. "బ్రిటిష్‌సామ్రాజ్యాన్ని విచ్ఛిన్నంచేయడానికి నేను బ్రిటిష్‌రాజుకు ప్రధానమంత్రిని కాలేదు" అన్నాడు విన్‌స్టన్ చర్చిల్. చర్చిల్ ఆమాట చెప్పేడంటే నిజంగా ఆయన బ్రిటిష్‌ప్రజలలో అధికసంఖ్యాకుల అభిప్రాయాన్నే చెప్పేడు. లోగడ సామ్రాజ్యతత్వాన్ని విమర్శించినవారిఅభిప్రాయం కూడా అలాగే మారింది. సామ్రాజ్యాన్ని యథాతథంగా కట్టుగాఉంచడానికి తామితరపార్టీలవారికేవిధంగానూ తీసిపోమని ప్రకటించడానికా అన్నట్లు బ్రిటిష్‌కార్మికపక్షంవారుకూడా చర్చిల్‌ప్రకటనను బలపర్చారు. 'యుద్ధానంతరం బ్రిటిష్‌సామ్రాజ్యాన్ని చెక్కుచెదరకుండా ఉంచాలనే బ్రిటిష్‌ప్రజలనిశ్చయాన్ని వారుకూడా వెలిబుచ్చారు.

అమెరికాలో తమకు దూరంగాఉన్న భారతదేశంయొక్క సమస్యలమీద భిన్నాభిప్రాయాలున్నాయి. భారతీయదృక్పథంగురించి ఏఅభిప్రాయమున్నా, బ్రిటిష్‌పాలకులుమాత్రం ధర్మజ్ఞులుగారని వారి అభిప్రాయం. ఇతరుల సామ్రాజ్యాలను వారంతగాహర్షించరు. పైగా హిందూదేశంయొక్క సద్భావాన్ని సంపాదించి, జపాన్‌దేశాన్ని ఎదుర్కొనడానికి యుద్ధంలో వారిశక్తియుక్తులను సంపదను పూర్తిగా ఉప

యోగించుకోవాలనికూడా వారి అభిప్రాయం కాని, బ్రిటిష్‌అధికారం సాగించిన అసత్యప్రచారంయొక్క ప్రభావం వారిమీద బాగానేసోకింది. భారతసమస్య తాము పరిష్కరించగలతేలికవిషయం కాదనే అభిప్రాయంలోపడ్డారు. ఏమైనా తమమిత్రులైన బ్రిటిష్‌వారి ఆంతరంగికవ్యవహారంలో కలుగచేసుకోవడం కష్టమని వదలుకున్నారు.

రష్యాదేశంలోని పరిపాలకులు, ప్రజలు భారతదేశంగురించి ఏమనుకున్నారో చెప్పడం అసాధ్యం. వారిదేశాన్నాక్రమించినవారిని తమహద్దులనుండి తరుమగొట్టడానికి వారు చేసుకుంటూఉండిన మహత్తర యుద్ధసన్నాహాలతో, వారి కితరవిషయాలనుగురించి ఆలోచించే తీరికేలేదు. కాని కొంచెం దూరదృష్టితో విషయపరిశీలనచేయడాని కలవాటుపడిన రష్యావారు ఆసియాలో తమదేశపు సరిహద్దుగానున్న హిందూదేశంగురించి అసలే ఆలోచించకుండా అలక్ష్యంగా ఉన్నారనడానికి వీలులేదు. వారి భవిష్యత్కార్యక్రమం ఎలాఉంటుందో ఎవ్వరూ చెప్పలేరు. కాని ఏదైనా రష్యాదేశపు ఆర్థికరాజకీయస్తోమతు నభివృద్ధి చేసుకునే వాస్తవికస్థితిలోనే ఉంటుందనడాని కేమీ సందేహంలేదు. రష్యావారు బహుజాగ్రత్తగా హిందూదేశాన్నిగురించిన ప్రస్తావనే చేయకుండా కాలయాపనచేశారు. కాని 1942 సం॥రం నవంబరులో మాత్రం స్టాలిన్ సోవియట్‌విప్లవం ఇరువదైదవవార్షికోత్సనసందర్భంలో తమ లక్ష్యాలను వివరిస్తూ ఇలాఅన్నాడు: "జాతులప్రత్యేకాధిక్యతలను తొలగించడం, వివిధదేశాలసమానత్వం, వారిసరిహద్దులరక్షణ, దాస్యంలోఉన్న దేశాలను ఉద్ధరించి వారికి పరిపూర్ణస్వామ్యాలను కలిగించడం, ఏదేశమైనా తనఇచ్ఛవచ్చినరీతిగా తన ఆంతరంగికవ్యవహారాలను రూపొందించుకునేహక్కును స్థాపించడం, ఆర్థికంగా దెబ్బతిన్న జాతులకు తిరిగి కోలుకోవడానికి తగినంత స్తోమతునివ్వడం, ప్రజాస్వామికస్వాతంత్ర్యాన్ని పునరుద్ధరించడం, హిట్లరుతత్వాన్నినశింపచేయడం"

చైనాలో, మనంచేసిన ప్రత్యేకకార్యాలమీద తత్కాలంగా ఏలాంటి అభిప్రాయంకలిగినా, మొత్తంమీదమాత్రం భారతస్వాతంత్ర్యోద్యమంపట్లమాత్రం చైనాప్రజలకు పరిపూర్ణమైనసానుభూతిఉన్నది. కొంతవరకు మనకూవారికీగల చారిత్రకఅనుబంధం ఆ సానుభూతికి కారణంకానచ్చును. కాని భారతదేశం పూర్ణస్వాతంత్ర్యంపొందితేకాని

చైనాస్వాతంత్ర్యానికి రక్షణలేదనే నమ్మకమే వారిసానుభూతికిమూలం. చైనాలోనేకాకుండా ఆసియాఖండమంతటా ఈజిప్టు, మధ్యప్రాచ్య దేశాలలోనూ యీ భావమే వ్యాప్తమైఉంది. ప్రపంచంలోని పరాధీన దేశాలస్వేచ్ఛకంతకూ భారతదేశమే ప్రధాన చిహ్నమైంది. ప్రస్తుతాని కదే పరీక్షాసాధనం. భవిష్యత్తుకు అదే కొలబద్ద. వెండెల్‌విల్కీ వ్రాసిన 'ఒకేప్రపంచం'అనేపుస్తకంలో "ఆఫ్రికామొదలుకొని అలాస్కావరకూ నేనుమాట్లాడిన స్త్రీపురుషులందరూ 'ఇండియావ్యవహారమేమిటి'అనే ప్రశ్న వేస్తూవచ్చారు. ఆసియాకంతకూ అదే చిహ్నమైనది. కైరోమొదలు ఎక్కడికివెళ్ళినా అదేప్రశ్న. చైనాలోఅందరికన్న బుద్ధిమంతుడు నాతో ఇలా అన్నాడు. "భారతస్వాతంత్ర్యవాంఛనుగూర్చినసమస్యను ఎప్ప టికోవాయిదావేయడంవల్ల తూర్పుదేశాల్లోని ప్రజలసుహృద్భావాన్ని పోగొట్టుకొనేది బ్రిటన్‌కాదు, అమెరికాయే"

ప్రపంచంలోఅంతటా హిందూదేశంలోజరుగుచున్న సంఘట నలగూర్చినవివేచన విధాయకమైనది. ఎంత యుద్ధంలో నిమగ్నమై యున్నా దేశాలన్నీ భారతదేశవిషయాలపై దృష్టిసారించకతప్పలేదు. తూర్పుదేశాలకుసంబంధించిన మూలసమస్యలమీద వారిమనస్సు లగ్నంచేయవలసివచ్చింది. ఆసియాఖండంలోని అన్నిదేశాలయొక్క హృదయాలను మనస్సును ఒకసారికుదిపింది భారతదేశం. తత్కాలంగా బ్రిటిష్‌వారి ముష్కరమైనపిడికిలిలోచిక్కుకుని భారతప్రజలు నిస్సహా యులుగా కనబడవచ్చును. కాని భారతదేశానికి స్వాతంత్ర్యంసిద్ధిస్తేకాని ఇండియాలోకాని ఆసియాలోకాని శాంతికలుగదనిమాత్రం భారత దేశం ధృవపరచింది.

## ౫ హిందూదేశంలో పరిణామం

నాగరికతగల జనాభామీద విదేశీయపరిపాలన సాగించడంలో కొన్నిసహజమైన అసౌకర్యాలుంటాయి. అందువల్ల అనేకఇబ్బందులు కూడా కలుగుతుంటాయి. విదేశీపాలకులు తమకుకలిగే సహజమైన ఇబ్బందులను కప్పిపుచ్చడానికి, సంఘంకాదన్న కొంతమందిమీద ఆధా రపడవలసివస్తుంది. కాస్తంత ఆదర్శశుద్ధిగలవాళ్ళు, పౌరుషంగలవాళ్ళు మావసంకలిగినవాళ్ళు, ఆత్మగౌరవంకలవారు, స్వాతంత్ర్యప్రియులు,

విదేశీయపరిపాలనకు తలొగ్గలేనివారు వారికి దూరంగానైనాఉంటారు; లేక సంఘర్షణలోకైనావస్తారు. విదేశీయప్రభుత్వపుఅండను చేరే వారిలో ఉద్యోగసద్యోగములనాశించే స్వార్థపరులు అవకాశవాదులు ఎక్కువగాఉంటారు. స్వతంత్రపరిపాలనలో అలాంటివారంతగాచేరరు. స్వతంత్రదేశాల్లోనైనా నిరంకుశప్రభుత్వం సాగుతుంటే, మానసంగల స్వాతంత్ర్యప్రియులు ప్రభుత్వపరిపాలనలో అంతగా జోక్యంకలిగించు కోరు. అందుచేత దక్షత, శక్తిగల కొత్తవారు ముందుకురాలేరు. విదేశీయపరిపాలన విధిగా నిరంకుశంగానే ఉంటుంది. అందుచేత పైఇబ్బందు లన్నిటికి గురికాకతప్పదు. ఏమంటే, అది నిరంతరం ప్రతికూలశక్తులనెదు ర్కుంటూనేఉండవలసొస్తుంది. పాలకులు పాలితులుకూడా నిరంతరం పరస్పర భయోత్పాతంలోనే ఉంటారు. ప్రభుత్వంలో పోలీసులు, రహస్యపోలీసులే ప్రధానోద్యోగులుగా చలామణవుతుంటారు.

ప్రభుత్వానికీ ప్రజలకూమధ్య సంఘర్షణఏర్పడినప్పుడు, నిరంకుశ ప్రభుత్వానికి, అంతగా పెద్దమనుష్యులుగావరిగణించడానికి వీలులేని జనంమీద ఆధారపడవలసినఅవసరం మరింతహెచ్చవుతుంది. కాస్తంత అంతరాత్మంటూఉన్నవాళ్ళు, గత్యంతరంలేక వారికిష్టమున్నా లేక పోయినా ప్రభుత్వయంత్రంలో చిక్కుకుని పనిచేస్తూఉంటారు. కాని ప్రభుత్వరంగంలో బాగా పైకెక్కివచ్చి ప్రధానపాత్రలుధరించేవాళ్ళు మాత్రం వాళ్ళజాతీయప్రతికూలతవల్లనూ, వినయవిధేయతలవల్లనూ, తమదేశస్థులనే బాగా అవమానపరచి అణగగొట్టినందువల్లనూ పెద్ద వాళ్ళుగా గుర్తింపబడతారు. అధికసంఖ్యాకులైన ప్రజలఆశయాలను బాగాప్రతిఘటించడమే వారిప్రజ్ఞ. ఇలాంటి దుర్గంధవాతావరణంలో, మహత్తరమైన ఆదర్శాలకుగాని, ఉదారాశయాలకుగాని స్థానంలేదు. అక్కడ లభించేవి పెద్దపెద్దఉద్యోగాలు, ఘనమైనజీతాలు మాత్రమే. ప్రభుత్వాన్నినిరోధించేశక్తులను అణగగొట్టడమే నిరంకుశప్రభుత్వం యొక్క పరమలక్ష్యంకావడంచేత ఇలాంటి అసమర్థులను వారు భరించక తప్పదు. ప్రభుత్వం తప్పనిసరిగా చిత్రమైనమనుష్యులతోను, పేరుఊరు లేనివారితోనూ చేతులుకలుపవలసివస్తుంది. అందువల్ల అవినీతి, లంచ గొండితనం, దుర్మార్గం, బండతనం, ప్రజాక్షేమమంటే అలక్ష్యం మొదలైన అవగుణాలతో వాతావరణమంతా కలుషితమైపోతుంది.

పరప్రభుత్వం ఏపనిచేసినా ప్రజలు చిరాకుపడుతుండడం సహజం. అందులోనూ విదేశీయప్రభుత్వంవెనుకాలచేరిన భారతీయులు చేసే దుండగాలను ప్రజలు మరింతఅసహ్యించుకున్నారు. అలాంటిమనుష్యుల యెడల సాధారణభారతీయపౌరుడు చిరాకుపడ్డాడు. ఇంగ్లండు, జర్మనీ జపాన్ దేశాలు నెలకొల్పినవిచీప్రభుత్వంవంటి మట్టిబొమ్మప్రభుత్వాల వంటిదే ఇక్కడకూడాను. ఈఅభిప్రాయం ఒక్కకాంగ్రెస్‌వారిలోనే కాకుండా ముస్లింలీగుమొదలైన ఇతరసంస్థలలోకూడా ప్రబలింది. మిత వాదరాజకీయవేత్తలుకూడా ఆ అభిప్రాయాన్నే వెల్లడించారు.

యుద్ధంవంకతో ప్రభుత్వం అనేకవిధాలుగా జాతీయోద్యమా లకు ప్రతికూలప్రచారం సాగించింది.

కార్మికులసహాయం పొందడానికి బాగా డబ్బుఖర్చుపెట్టి ప్రభు త్వమే కుక్కగొడుగుల్లాంటి కార్మికసంఘాలను స్థాపించింది. ఎక్కడా పత్రికలకు కాగితం తగినంతగా దొరుకనికాలంలో ప్రభుత్వం డబ్బిచ్చి కొత్తపత్రికలను నెలకొల్పడానికి సహాయంచేసి వాటిచేత గాంధీని కాంగ్రెస్‌ను తిట్టించింది. యుద్ధకార్యక్రమాలకు సంబంధించిన ప్రకట నలుకూడా ఇందుకు బాగాతోడ్పడినాయి. ఇండియాప్రభుత్వం తరఫున ప్రచారంచేయడానికి విదేశాల్లో సమాచారకేంద్రాలు నెలకొల్ప బడ్డాయి. ఈ దేశంలో ఊరుపేరులేనివారిని గుంపులుగుంపులుగా రాయ బారాలవంకపెట్టి విదేశాలకు, ముఖ్యంగా అమెరికాకు పంపేరు. కేంద్ర శాసనసభ పదేపదే తనఅసమ్మతిని తెలిపినా బ్రిటిష్‌ప్రభుత్వం యీ జోహుకుములను ప్రచారకులుగా పంపింది. స్వతంత్రభావాలుకలిగి, ప్రభుత్వవిధానాలను విమర్శించేవారికి విదేశాలకు వెళ్ళడానికి ప్యాసు పోర్టులుగాని ప్రయాణసౌకర్యాలుకాని లభించేవికావు.

ఇలాంటి తంత్రాలెన్నోపన్ని మొత్తంమీద గతించిన రెండే ళ్ళల్లోనూ వారిలెఖ్ఖప్రకారం ప్రజాభద్రతను కాపాడింది. రాజకీయ జీవితం, ప్రజాహితజీవితం మృగ్యమైపోయింది. సైనికరాజ్యంక్రింద జరిగే పరిపాలనలో ప్రజాహితజీవితం మృగ్యంకాక ఏమవుతుంది? కాని ప్రజాశక్తిని, అభిప్రాయాన్ని ఈరీతిగా అణచిపెట్టడంవల్ల నిజానికి రోగం ఎక్కువవుతుంది. హిందూదేశం చాలాఎక్కువైన రుగ్మతలోనేఉన్నది సాధ్యమైనంతవరకెల్లప్పుడూ బ్రిటిష్‌ప్రభుత్వానికి సహకారంచేస్తూనే

ఉండాలనే మితవాదులకుసైతం, ఇలా తాత్కాలికంగా మూతిదగ్గర మాత్రమే బిగించబడిన అగ్నిపర్వతాన్నిచూచి ఆశ్చర్యంగానేఉండేది. బ్రిటిష్‌ప్రభుత్వంమీద ఇంతద్వేషంకలుగడం తామెన్నడూ చూచి ఎరుగమని వారు అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

గత రెండేళ్ళలోనూ ప్రజలభావాల్లో ఏలాంటి మార్పులుకలిగినాయో, ఏఉద్రేకాలు వారిహృదయాలను కలచివేస్తున్నాయో చెప్పాలంటే నేను వారితో కొంతకాలంపాటు ప్రత్యక్షంగా కలసిమెలసిఉండేనేగాని సాధ్యంకాదు. కాని వారికిటీవలకలిగిన అనుభవాలవలన వారిలో ఎన్నోవిధాలైనమార్పుకలిగిందనడానికిమాత్రం ఏమీసంశయం లేదు. అనేకసార్లు నేను ఆత్మపరిశోధనచేసుకుంటూ లోకంలోజరుగుతుండిన సంఘటనలు అప్రయత్నంగానే నాలో ఏభావాలనురేకెత్తిస్తున్నాయో గమనించుకోవడంకద్దు.ఇంగ్లాండులో నాకనేకమంది స్నేహితులున్నారు. పూర్వస్మృతులెన్నో నన్నాకర్షిస్తుంటాయి. అందుచేత అవకాశంలభిస్తే ఇంగ్లండువెళ్ళాలనే అభిలాష కలుగుతూనేఉండేది. కాని ఈసారిమాత్రం అలాంటిఅభిలాష కలుగలేదు. ఆలాంటిభావం కూడా హితవుగాలేదు. ఇంగ్లండుకు వీలైనంతదూరంగా ఉండాలనిపించింది. ఇంగ్లీషువారితో భారతదేశసమస్యలను చర్చించడానికికూడా నాకిష్టంలేకపోయింది. ఆసమయంలో కొందరు ఇంగ్లీషుమిత్రులు జ్ఞప్తికి రావడం తటస్థించి కాస్తంత మెత్తబడ్డాను. ఒకజాతినిగురించి ఈవిధంగా ఒకనిర్ణయానికిరావడం చాలాతప్పని నేనే గ్రహించాను. యుద్ధంలో ఇంగ్లీషుప్రజలుపడిన అపారమైనకష్టాలను జ్ఞప్తికి తెచ్చుకున్నాను. కొన్నిసంవత్సరాలపాటు అత్యంతమైనభీతితో భీభత్ససమయంలో కాలంగడిపి, అనేకమందిఆప్తులనుగోల్పోయినవారికష్టములను స్మరించుకున్నాను. అందువల్ల నాకు వారిమీదకలిగినఆగ్రహం కొంత ఉపశమించినది. కాని అసలు మూలంలో ఏర్పడిన చిరాకుమాత్రం పోలేదు. బహుశా కాలం, ముందుజరుగబోయేసంఘటనలు ఆ చిరాకునుతగ్గించి ఒక నూతనదృక్పథాన్ని కలిగించవచ్చు. కాని ఎన్నోవిధాలుగా ఇంగ్లండుతోనూ, ఇంగ్లీషుప్రజలతోనూ అనేకసంబంధబాంధవ్యాలుకల నాకే యింత చిరాకు కలిగినప్పుడు ఆలాంటివేమీ లేనివారిసంగతి వేరే చెప్పాలా?

## ౬. కరువు

మానసికంగానూ, శారీరకంగానూకూడా హిందూదేశం చాలా జబ్బుస్థితిలోఉన్నది. యుద్ధకాలంలో కొన్నిదేశాలు ఐశ్వర్యవంతమైనాయి. ఇతరదేశాలమీద ఆధారం విరుచుకుపడింది. దీనికితోడు కఱువుకూడా దాపురించింది. ఈ కాటకం వంగదేశంలోనూ, తూర్పుతీరాన, దక్షిణభారతదేశంలోనూ బాగా వ్యాపించింది. గత 170 సంవత్సరాల బ్రిటిష్‌పరిపాలనలో ఇటువంటి సర్వనాశనకరమైనకాటకం ఎన్నడూ సంభవించలేదు. 1766 – 1770 సంవత్సరాల్లో బ్రిటిష్‌రాజ్యం స్థాపింపబడిన మొదటిసంవత్సరాల్లో, దానిఫలితంగానే బెంగాలు, బీహారు రాష్ట్రాల్లోకలిగినకరువుతో ఇది పోల్చతగినది. కరువుకు అంటువ్యాధులు తోడైనాయి. ముఖ్యంగా కలరా, మలేరియావ్యాధులు ఇతరరాష్ట్రాలకుకూడా వ్యాపించాయి. ఇప్పటికీ అవి అలాగేఉండి వేలాదిప్రజల ప్రాణాలుతీస్తున్నాయి. లక్షలప్రజలు కరువుకాటకాలవల్ల, రోగాలవల్ల మరణించారు. ఇప్పటికీ ఆ ప్రమాదం అలాగేఉండి అనేకమందిప్రాణాలను బలిపుచ్చుకుంటోంది.

కఱువు భారతదేశంయొక్క నిజస్వరూపాన్ని బయటపెట్టింది. పైపైని పల్చపల్చగా ధనికులైనవారు బహుకొద్దిమందిమాత్రమే ఉండి మిగిలినవారు ఘోరమైనదారిద్ర్యస్థితిలో ఉంటుండే బ్రిటిష్‌పరిపాలనయొక్క వికారస్వరూపం బయటపడిపోయింది. అది బ్రిటిష్‌అధికారంయొక్క చరమపరిణామం. ప్రకృతివల్లకలిగిన ప్రమాదం కాని, పంచభూతాలు ఆగ్రహించడంవల్ల కాని ఈ కాటకం సంభవించలేదు. ప్రత్యక్షంగా ఈగడ్డమీద యుద్ధంజరుగుతూ, శత్రువులఅవరోధంవల్ల భోజనసామగ్రి ప్రజలకు అందకపోవడంచేత ఈకాటకం ఏర్పడలేదు. కాస్తంత బుద్ధికౌశల్యంగలిగి మంచీచెడ్డా విచక్షణచేయగలవారంతా ఈకరువు మనిషి తెచ్చిపెట్టుకున్నదే అని అంగీకరించకతప్పదు. దాని రాకసంగతి కొంచెంముందుగా తెలుసుకుని దానిని నివారించియుండవచ్చునని అందరూ అంగీకరిస్తారు. ఆశ్చర్యకరమైన నిర్లక్ష్యం, అసమర్థత, తాత్సారం, చూపి వీటినిప్రదర్శించారు అప్పటి అధికారులు. బహిరంగంగా వీధుల్లో వేలాదిజనం మరణించిపడిపోతుంటేకూడా ఆఖరువరకూ అసలు

కఱువుస్థితిగతులున్నట్లుకూడా ప్రభుత్వం అంగీకరించలేదు. ఆవార్త లేమీ పత్రికల్లోపడకుండా సెన్సార్ బాగాపనిచేసింది. కలకత్తాలోని ప్రముఖవార్తాపత్రిక స్టేట్సుమన్, ప్రజలు ఆకలిచేత అలమటించిపోయి వీధుల్లోమరణించిపడిపోతున్న స్త్రీలు, పురుషులు, పిల్లలయొక్క భీకర దృశ్యాలను ప్రకటిస్తే, ఇండియాప్రభుత్వపు ఉన్నతోద్యోగి కేంద్ర శాసనసభలో మాట్లాడుతూ అదంతా అతిశయోక్తితోకూడిన నాటక మని త్రోసిపుచ్చాడు. బహుశా ఆయనదృష్టిలో ప్రతిరోజూ వేలాది ప్రజలు తిండిలేకచచ్చిపోవడం సామాన్యవిషయం కాబోలు! ఇండియామంత్రి అమెరీ ఈ కాటకస్థితిఅంతా కల్పితమైన అతిశయోక్తిగా చెపుతుండేవాడు. చివరకు ఈ నిజస్థితినెవ్వరూ కాదనలేనిస్థితి కొచ్చినప్పుడు, కఱువుకాటకాలుయథేచ్ఛగా తాండవంచేస్తున్నాయని అంగీకరించకతప్పనిసరైనప్పుడు, దాని బాధ్యతను వివిధఅధికారవర్గాల వారుఒకరిమీదనుంచి మరొకరిమీదత్రోసేశారు. ఇండియాప్రభుత్వం ఆ లోపమంతారాష్ట్రప్రభుత్వంనెత్తిమీదవేశారు.కానినిజానికి,రాష్ట్రాల్లో కేంద్రంపర్యవేక్షణక్రింద గవర్నరు, సివిల్‌సర్వీసుఉద్యోగులుద్వారా పరిపాలనజరుగుతూవచ్చింది. ఈవిషయంలోఅందరూబాధ్యులే. ముఖ్యంగా రాజప్రతినిధిఅజ్మాయిషీలో జరుగుతూ, ఏపనికావాలంటే ఆపనిచేయగలిగిన భారతనిరంకుశప్రభుత్వమే ఇందుకు బాధ్యతవహించకతప్పదు. మరేప్రజాస్వామిక దేశంలోనైనా ఇలాంటిస్థితిగతులు సంభవించిఉంటే ఈపాటికా ప్రభుత్వము తుడిచిపెట్టుకుపోయేది. దానితోపాటు అందుకు సంబంధమైన ప్రభుత్వాలుకూడా ఈపాటికి తుడుచుకుపోయిఉండేవి. ఇండియాలోమాత్రం అలాంటిదేమీ జరుగలేదు. అన్నివ్యవహారాలు యథాప్రకారంగానే సాగిపోతున్నాయి.

యుద్ధందృష్ట్యాచూచినా, ఈకాటకం ప్రత్యక్షంగా యుద్ధంజరుగుతున్నరంగాలకు సమీపంగానే, శత్రువులు దాడిచేయడాని కందుబాటులోఉన్నచోట్లనే తాండవమాడింది. కఱువు విస్తృతమై, ఆర్థిక వ్యవస్థ కుంటుబడిపోతే సహజంగా ప్రజలకు ఆత్మసంరక్షణశక్తి తగ్గిపోతుంది. శత్రువుమీద విజృంభణచేసేశక్తి అసలే ఉండదు. భారత ప్రభుత్వం ఈవిధంగా భారతరక్షణవిషయంలోనూ, జపానీయుల మీద యుద్ధాన్ని సాగించడంలో నూతనబాధ్యతను నిర్వర్తించినది.

శత్రువులకు తృణకాష్టాలు దొరుకకుండా చేయడమే కాదు, భారత ప్రభుత్వ యుద్ధవిధానంవల్ల యుద్ధాని కెంతో ఆయువుపట్టైన ఇలాంటి స్థలాల్లో వేలాదిగా లక్షలాదిగా ప్రజలు ఆకలితో అలమటించి మరణించారు. వారిశవాలే యుద్ధవిధానానికి చిహ్నాలు.

భారతదేశంలోని ఉద్యోగేతర సేవాసంఘాలు, సమర్థులైన జీవ కారుణ్యవాదులు అనేకవిధాలుగా కాటకనివారణకు అమోఘమైన కృషిచేశారు. ఇంగ్లాండులోని క్వేకర్సుకూడా గొప్పసేవచేశారు. తుదకు కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు కూడా మేల్కొని, కాటంకంవల్ల ఏర్పడిన ప్రమాదాన్ని గుర్తించారు. కాటకనివారణకు సైన్యాలుకూడా ఉపయోగపడినాయి. కరువు వ్యాప్తంకాకుండా తాత్కాలికమైన ఏర్పాట్లు చేయబడ్డాయి. దానివల్ల ముందుముందు అంతగా ప్రమాదంరాకుండా బందోబస్తుజరిగింది. కాటకనివారణసాధనాలు బహు తాత్కాలికం. దాని దుష్ఫలితాలు అలాగేఉన్నాయి. ఇంతకన్నకూడా కనాకష్టంగా మరల ఏనాడైనా కాటకం రావచ్చును. మొత్తంమీద వంగరాష్ట్రం తునకలుతునకలైపోయింది. సాంఘిక ఆర్థికజీవనం, పటాపంచలైపోయింది. నిర్వీర్యమైనజాతి మిగిలిపోయింది.

ఇలాంటి ప్రమాదస్థితి ఏర్పడి కలకత్తావీథుల్లో శవాలుపడుంటే కలకత్తాలో ధనికవర్గానికి చెందిన పదివేలమందిసాంఘికజీవితంలోనూ ఏమాత్రంకూడా మార్పురాలేదు. గానా బజానా, విందులుమీద విందులు, విలాసజీవనం యథాప్రకారంగా మూడుపువ్వులు ఆరుకాయలుగా సాగిపోతూనేఉంది. చాలాకాలంఅనంతరంవరకూ ఆహారపదార్థాలరేషనింగు కూడా లేదు. కలకత్తాలో గుర్రపుపందెములుకూడా మామూలుగానే సాగిపోయాయి. విలాసవంతులైన స్త్రీపురుషు లందులోపడి కేళింతలుకొడుతూనేవచ్చారు. ఆహారపదార్థాల రవాణాకు రైలుపెట్టెలులేకపోయినాయికాని, పందెపుగుర్రాలు, పరరాష్ట్రాలనుంచి ప్రత్యేకపుపెట్టెలలో కలకత్తాకు దిగుమతిఅవుతూనేవచ్చాయి. యుద్ధవ్యాపారంలో ఇంగ్లీషువ్యాపారస్థులు, భారతీయవ్యాపారస్థులు సమంగానే కొల్లలుగా లాభాలను సంపాదించారుకనుక, ఈ విలాసజీవితంలో కూడా ఉభయులూ సమానంగానే ఓలలాడేరు. కొన్నిసందర్భాల్లో ఏ ఆహారపదార్థాలూ చిక్కకపోవడంవల్ల రోజూవేలాది లక్షలాది మను

ష్యాలు ప్రాణాలు పోగొట్టుకున్నారో ఆ ఆహారపదార్థాలు సప్లయి చేయడంలోనే ఈ ధనికులు అపారమైన లాభాలను రాబట్టుకున్నారు.

భారతదేశం అపారమైన తారతమ్యాలుగలదేశమని చెప్తారు. చాలాధనవంతులు, మిక్కిలిబీదవారు, నవనాగరికులు పూర్వకాలపు తరహాలోనిఛాందసులు, రాజులు, ప్రజలు, బ్రిటిష్‌వారు, భారతీయులు ఈరీతిగా తారతమ్యాలుగలవారున్నారు. 1943 సం॥ రెండవభాగంలో కఱువుకాటకాలు భీభత్సంగా తాండవించినప్పుడు ఈ తారతమ్యాలు మరీస్పష్టంగా కనుబడ్డాయి. సాధారణంగా వేర్వేరుగా ఒకరికంట ఒకరు పడకుండాఉండే ఈ రెండుతరహాలవారు, హఠాత్తుగా ఒకదగ్గర చేర్చబడ్డారు. అందువల్ల ఈ అంతరాలు చాలా ఆశ్చర్యంగా కనుబడ్డాయి. అంతకన్నా ఆశ్చర్యమేమంటే, చాలామందిజనం ఆలాంటి తారతమ్యాలలోఉండే అసమంజసత్వాన్ని, అన్యాయాన్ని, గుర్తించకుండా పాతపంథాలోనే జీవయాత్రసాగించడం. వారు లోపల ఏమనుకొనేవారో తెలియదు కాని, వాళ్ళుచేసేపనులవల్లనే వారిమంచిచెడలను గమనించాలి. ఇంగ్లీషువారికి ఈవిషయంలో అంత బాధలేకపోవచ్చును. ఏమంటే వారెప్పుడూ జాత్యహంకారపూరితులై ప్రత్యేకంగానే జీవిస్తూ వచ్చారు. ఏ కొద్దిమందైనా మార్పుకోదలచుకున్నా మిగిలినవారు వాళ్ళపాతపద్ధతిలోనే ఉంటున్నారు. కాని ఈపద్ధతిగాజీవించేభారతీయులు తమప్రజల కెంతదూరంగాఉన్నారోమాత్రం బాగా స్పష్టంగా కనుబడిపోయింది. మానవత్వంగాని, మామూలుమర్యాదగాని ఈ అంతరాన్ని తగ్గించలేదనే చెప్పాలి.

ఇతరకష్టాలలోలాగునే ఈకాటకంలోకూడా భారతీయులలోని మంచీచెడ్డాకూడా బయటపడ్డాయి. దేశంలోకల్లా శక్తివంతులు, నిగ్గువంటివారంతా జైళ్ళల్లో ఉండడంవల్ల వారేమీ చేయలేకపోయినారు. అయినప్పటికీ ఉద్యోగేతరులయాజమాన్యంక్రింద నిర్వహింపబడుతూ వచ్చిన కఱువునివారణకార్యక్రమాల్లో అనేకమంది స్త్రీపురుషులు ముందుకొచ్చి చాలా నిరుత్సాహమైనస్థితిగతుల్లోకూడా అతిసమర్థతతో పాల్గొని పరస్పరసహకారాన్ని, త్యాగాన్ని ప్రదర్శించారు. కొందరు తమలోతమకుగలవిభేదాలను పురస్కరించుకుని పరస్పరం సహాయంచేసుకొనక, ఈర్ష్యాళువులై నన్నుముట్టుకోకు నామాలకాకి

అన్నట్లున్నవారుకూడా ఉన్నారు. అలాంటివారు కొద్దిమందిఅయినా, వారిలో మానవత్వం, జాతీయత నశించిపోయింది. లోకమేమై పోయినా వారికి చీమకుట్టినట్లయినా లేదు.

యుద్ధపరిస్థితులు, అధికారుల హ్రస్వదృష్టి, నిర్లక్ష్యంవల్లనే కరువుసంభవించినదనడానికేమీ సందేహంలేదు. దేశంలో ఆహారకొరత ఏర్పడి ప్రమాదంరావచ్చుననేసంగతి ఆలోచనగల ప్రతివారికీ విస్పష్టంగా కనుబడుతున్నా, ఆహారసమస్యయెడల అధికారులు చూపుతూ వచ్చిన అలక్ష్యం ఆశ్చర్యంగానేఉంది. యుద్ధారంభంలోనే ఏమాత్రం ముందాలోచనతో జాగ్రత్తపడినా కఱువుసంభవించేదికాదు. యుద్ధంలో తగుల్కొన్న ఇతరదేశాలన్నిటిలోనూ, యుద్ధం ప్రారంభంకాక పూర్వమే ఆర్థికస్థితికి ఆయువుపట్టయిన ఆహారసమస్యాపరిష్కారానికి తగినబందోబస్తుచేయబడింది. భారతదేశంలో ప్రభుత్వం యూరపులో యుద్ధంప్రారంభమైన 3½ సంవత్సరాలఅనంతరం, జపాన్‌యుద్ధంప్రారంభమైన ఒకసంవత్సరానికి ప్రత్యేకంగా ఆహారపరిపాలనాశాఖ అంటూ ఒకదానిని ఏర్పాటుచేశారు. బర్మాను జపానువారాక్రమించుకోవడం వల్ల బెంగాలురాష్ట్ర ఆహారపరిస్థితి తలక్రిందైనసంగతి అందరికీతెలిసినదే. 1943 సంవత్సరం మధ్యకాలంలో ప్రత్యక్షంగా కఱువుప్రారంభమై సర్వనాశనంచేయడానికి మొదలుపెట్టేదాకా ఆహారవిషయంలో ఇండియా ప్రభుత్వానికొక నిర్దిష్టమైనవిధానమేలేదు. తనఅధికారాన్ని ఎదిరించిన వారిని అణగద్రొక్కడంలోతప్ప మిగిలిన అన్నివిషయాల్లోనూ ప్రభుత్వం అసమర్థతనేకనుబరచడం చిత్రమే. ప్రభుత్వస్వరూపాన్నిబట్టిచూస్తే ఏదోవిధంగా తను అధికారంలోఉండడం ఎల్లాగనే తప్ప ప్రభుత్వానికి మరొకధ్యాస లేదనే చెప్పాలి. ప్రత్యక్షంగా ప్రమాదం మీదకు త్రోసుకొచ్చినప్పుడు తప్ప ఇతరవిషయాలను గురించిన ఆలోచన తోచదు. ప్రభుత్వంయొక్క సద్భావంలోనూ, సమర్థతలోనూ, ఎవరికీ విశ్వాసంలేకపోవడంవల్ల ఈ ప్రమాదం మరింత తీవ్రమైనది

యుద్ధస్థితిగతులే కఱువుకు ప్రధానకారణమనుట తథ్యం. దానిని రాకుండాచేయుటసాధ్యం. అయినప్పటికీ ఈ కాటకానికి ఇంకా లోతైన కారణాలులేకపోలేదు. లక్షలాదిప్రజలు తిండిలేక మలమలమాడవలసిన స్థితిని తెచ్చిపెట్టినబ్రిటిష్‌ఆర్థికవిధానమే ప్రధానకారణం. 1933 సంవ

త్సరంలో భారతదేశంలోని ప్రజారోగ్యస్థితిగతులనుగురించిన నివేదికలో, ఇండియన్ మెడికల్‌సర్వీసుల డైరెక్టర్‌జనరల్ సర్ జాన్ మేగా ఇలా వ్రాశాడు: "భారతదేశంమొత్తంమీద నూటికి 39 మంది మాత్రమే పుష్టిగలఆహారాన్ని పొందగలుగుతున్నారనీ, 41 మంది హీనమైన ఆహారాన్నిపొందుతున్నారనీ, 20 మంది నికృష్టమైన ఆహారాన్ని తీసుకుంటున్నారని భారతీయవైద్యులఅభిప్రాయం. బెంగాలులో నూటికి 22 మందికిమాత్రమే పుష్టికరమైనఆహారం లభిస్తోందనీ 31 మందికి నికృష్టమైనఆహారంలభిస్తోందనీ బెంగాలీడాక్టర్ల అభిప్రాయం"

బెంగాలుకఱువు, ఒరిస్సా, మలబారువగైరారాష్ట్రాల్లో కఱువులు ఇండియాలో బ్రిటిష్‌పరిపాలనమీద తుదితీర్పు అని చెప్పాలి. బ్రిటిష్ వారు హిందూదేశాన్ని విడిచివెళ్ళకతప్పదు వారి భారతసామ్రాజ్యం కేవలం స్మృతిమాత్రంగా ఉండకమానదు. కాని వెళ్ళిపోయేటప్పుడు వారు వదలిపెట్టేదేమిటి? పతితమైన మానవజాతినా? గడ్డకట్టుకున్న దుఃఖాన్నా? మహాకవి ఠాగూరు చనిపోవడానికి 3 సంవత్సరాలకు ముందు ఈ విషాదదృశ్యాన్ని చూడగలిగేడు. "ఎటువంటి భారతదేశాన్ని వారు వదలిపెట్టివెడుతారు? ఎట్టిబాధ? వందలసంవత్సరాల పరిపాలనాస్రవంతి ఎండిపోయినాక వారు మిగిల్చేది అడుసూ, చెత్తా" అని ఆయన వాపోయాడు.

## ౭ భారతదేశంయొక్క ఉద్వేగశక్తి

కఱువుకాటకాలు, యుద్ధం సంభవించినా జీవితం ప్రవాహంవలె పారుతూనేఉంది. అనేకసంఘర్షణలు, పరస్పరవిరుద్ధాలు ఉండినప్పటికీ వాటివల్లకలుగుతుండే ప్రమాదాలనుండే జీవశక్తినిగ్రహిస్తూ జీవితం నడచిపోతుంది. ప్రకృతి తనంతటతానే జవసత్త్వలను సేకరించుకుంటుంది. నిన్నటిరణరంగము నేడు పచ్చికతోనూ పుష్పములతోనూ కళకళలాడుతుంది. రణరంగంలోస్రవించిన రక్తము భూమినిసత్తువచేసి నూతనోత్తేజాన్నికలిగిస్తుంది. జీవితరంగానికి నూత్నమైనరంగులు కల్పిస్తుంది. మానవులకు జ్ఞాపకశక్తి అంటూ ఉండడంచేత గతాన్నిస్మరించుకుంటూ, అతిత్వరితంగా మార్పులుచెందుతున్న వర్తమానంతో కదం కలుపలేకుండాఉన్నారు. మనకుతెలియకుండానేవర్తమానం గతంలో

లీనమైపోతోంది. నిన్నటిపరిణామమైన 'నేడు' క్షణంలో గతమైపోయి భవిష్యత్తుకు చోటిస్తోంది. విజయోత్సాహం రక్తసిక్తమైన అడుసులోకి దింపవచ్చును. పైకి అపజయంలా కనుపించినా, ఆ కష్టాల్లోనుంచే నూతనశక్తినీ, విశాలదృష్టినీ ప్రసాదించేఉత్సాహం ఉత్పన్నం కావచ్చును. ఉత్సాహహీనులు అంతరించిపోతారు. ఇతరులు దేదీప్యమానమైనదివ్వెను చేతబట్టి ముందుకుచొచ్చుకునిపోయి కేవటిజయపతాకధారులకు అందిస్తారు.

హిందూ దేశంలో సంభవించిన కాటకంవల్ల, ఈ దేశంలోని సమస్యలను తక్షణమేపరిష్కరించవలసినఆవశ్యకతను అందరూగుర్తించారు. మీదపడడానికి సిద్ధంగాఉన్నప్రమాదం గుర్తింపబడింది. ఇంగ్లండులోని ప్రజలు ఏమనుకున్నారో నాకు తెలియదు. కాని వారిలో కొందరు మాత్రం యథాప్రకారంగానే ఈముప్పుకంతా భారతప్రజలే బాధ్యులన్నారు. ఆహారంలేదు, వైద్యుల్లేరు, ఆరోగ్యవిధానంలేదు, మందుల సప్లయిలేదు, రవాణాసౌకర్యాలులేవు; ఒక టేమిటి ఏమీలేవు. ఉన్నదల్లా దినదినప్రవర్ధమానమవుతుండే జనాభా. ఒకదారీ తెన్నూ లేకుండా అధికంగాపెరిగిపోతుండే ఈ జనాభామీదనే బాధ్యతపెట్టడం ప్రభుత్వానికి సహజమే. కనుక, అమాంతంగా ఆర్థికసమస్యల కధికమైనప్రాముఖ్యత కలిగింది. ఈసమస్యలను పరిష్కరించాలంటే రాజకీయాలను వెనుకకు నెట్టాలని చెపుతూవచ్చారు. కాని, మనలనెదుర్కుంటున్న సమస్యలను పరిష్కరించుకోవడంకాక రాజకీయాలంటే మరేమిటోమాత్రం అవగాహనకావడంలేదు. సాధారణంగా ప్రజల ఆర్థికవ్యవహారాల్లో జోక్యంకలుగచేసుకోని సాంప్రదాయంగల ఇండియాగవర్నమెంటుకూడా ప్రణాళికంటూ ప్రస్తావనచేయడం ప్రారంభించింది. కాని ఫలానాపద్ధతిలో ఆ ప్లానింగు జరగాలనే అభిప్రాయమేమీ వారికి స్ఫురించలేదు. ఉన్ననిర్మాణాన్ని అలాగేఉంచి, తమహక్కులను, ధనికవర్గాలహక్కులను రక్షించుకోవడం ఎట్లనే వారి ఆత్రత.

భారతదేశప్రజలభావాలలోమాత్రం ఈ కాటకం చాలా గొప్ప మార్పును కలిగించింది. కాని ఆభావాలను వ్యక్తపరచడానికిమాత్రం సావకాశంలేకుండా ఇండియారక్షణచట్టం అన్నివిధాలా అడ్డుగాఉంది. వంగదేశంలోని ఆర్థికనిర్మాణంకట్టుబాట్లన్నీ పటాపంచలైపోయాయి.

లక్షలాదిప్రజలజీవితం అధోగతిపాలైపోయింది. బెంగాలుస్థితి బాగా చరమావస్థకొచ్చింది. కాని నిజానికి భారతదేశమంతా ఒక్కలాగే హీనస్థితికొస్తోంది. ఇక మళ్ళీ వెనుకటి ఆర్థికవ్యవస్థ వస్తుందని ఎవ్వరికీ నమ్మకం కలుగడంలేదు. యుద్ధకాలంలో బాగాబాగుపడిన పారిశ్రామిక ధనికవర్గాలుకూడా టకటకలాడడం ప్రారంభించాయి వారుకూడా వెనుకటి సంకుచితదృష్టిని వదలి ముందాలోచనలోపడ్డారు. వారు ఒక విధంగా యథార్థవాదులు. కొందరురాజకీయవాదుల ఉదారాశయాలు వారికి భయంకలిగించినా, చివరకు వారి యథార్థవాదదృక్పథమువల్లనే వారు సాహసమైననిర్ణయాలకురాగలిగేరు. బొంబాయిలోని పారిశ్రామిక వేత్తలు – ముఖ్యంగా టాటాపరిశ్రమలకు సంబంధించినవారు భారతాభ్యుదయానికి 15 సంవత్సరముల ప్రణాళికను తయారుచేశారు. ఆ ప్రణాళిక పూర్ణమైనదికాదు. అందులో చాలా ఖాళీలున్నాయి. పెద్దపరిశ్రమదారుల మనోవృత్తిననుసరించే ఆప్రణాళిక రచింపబడింది. కాని దేశంలో రానున్న విప్లవాత్మకమైనమార్పులనుగురించి వారంతగా గణించలేదు. అయినప్పటికిన్నీ, ఆనాటిస్థితిగతులయొక్క ఒత్తిడిచేత వారుకూడా చాలా భారీఎత్తుననే ఆలోచించకతప్పినదికాదు. అనేకవిషయాల్లో వారిపాతపద్ధతులను విడిచిపెట్టవలసివచ్చింది. ప్రణాళికారచయితల కిష్టమున్నా లేకపోయినా ప్రణాళికలో సహజంగా అనేకవిప్లవాత్మకమైన మార్పులున్నాయి. ఈ ప్రణాళికారచయితల్లో కొందరు జాతీయప్రణాళికాసంఘంలో సభ్యులుగావుండేవారు. అందువల్ల వారికి కొంతలాభించింది. ఆ ప్రణాళికలో అనేకవిధాలైనమార్పులు చేయవలసిఉంటుంది. కాని ప్లానంటూఒకటి అలాంటివర్గాలవల్ల తయారుకావడమే సంతోషింపతగినవిషయం. భారతస్వాతంత్ర్యము, ఆర్థికరాజకీయసమైక్యత దానికి ప్రాతిపదికలు. సాధారణంగా ధనికవర్గాల అలవాటుప్రకారంగా, డబ్బుకే పూర్ణమైనప్రాధాన్యత ఇవ్వబడలేదు. సహజసంపత్తి, మానవ బలం, ఈ రెండూ ఏదేశానికైనా ముఖ్యమైన మూలధనమనేసిద్ధాంతం మీదనే ఈప్రణాళిక రచింపబడింది. ఈ ప్రణాళికేకాదు ఏప్రణాళికైనా విజయంకావాలంటే ఉత్పత్తిని అభివృద్ధిచేయడంతోపాటు, దానివంపిణీ విషయంలోకూడా న్యాయమైనవిధానాన్ని ఏర్పాటుచేయాలి. భూసంస్కరణంకూడా ముందుగా జరగాలి.

సంఘానికొకప్రణాళికుండాలనీ ఆప్రకారం సంఘం వృద్ధికావాలనీ అందరూ అంగీకరించేవిషయమే. కాని ప్రణాళికారచన ఒక్కదాని వల్లే సత్ఫలితాలు కలుగవు. అందులో అర్థమూ లేదు. ప్రణాళికయొక్క లక్ష్యాలమీద, దానిని అమలుపరచే నిర్వాహకులమీద, దానికి అధిష్ఠాతలైన ప్రభుత్వంమీద దాని విజయమంతా ఆధారపడుంటుంది. స్థూలంగా ప్రజలందరిఅభ్యుదయాన్ని ఈ ప్రణాళిక కాంక్షిస్తున్నదా? ప్రజలందరికీ సమానంగా అన్నిఅభివృద్ధిఅవకాశాలు, స్వాతంత్ర్యము లభిస్తున్నవా? ఉత్పత్తినధికంచేయడం ముఖ్యమేకాని, కేవలం అందువల్లే ప్రయోజనంకలుగదు. పైగా కొన్నికొత్తచిక్కులుకూడా ఏర్పడతాయి. పాతకాలంనాటి హక్కులను ఆలాగేఉంచడానికి ప్రయత్నిస్తే ప్రణాళికకు మొదటికేమోసంవస్తుంది. సంఘంయొక్క సమిష్టిశ్రేయస్సుకొరకు రచింపబడిన ఏ పథకానికైనా అభ్యంతరంకలిగించే ప్రత్యేక హక్కులను తొలగించితీరాలి. పార్లమెంటుచట్టాన్ననుసరించి ఆలాంటి ప్రత్యేకహక్కుదారుల నెవ్వరినీ ముట్టుకోవడానికి వీలులేకపోయింది. కనుకనే రాష్ట్రాలలోని కాంగ్రెస్ప్రభుత్వాలే అభ్యుదయకార్యక్రమంలోనూ ముందడుగువేయలేకపోయినాయి. భూసంస్కరణలను కొనసాగించడానికి, వ్యవసాయఆదాయాలమీద పన్నువెయ్యడానికికూడా వారు చేసిన చిన్నచిన్నప్రయత్నాలనుకూడా సాగనివ్వకుండా లాకోర్టుల కెక్కించారు.

ప్రణాళిక పెద్దపెద్దపారిశ్రామికవేత్తలచేతుల్లోపడితే సహజంగా దానికి వారిదృక్పథమే అబ్బుతుంది. లాభాలుతీయడం, ఆస్తిని సంపాదించడమే దాని లక్ష్యమవుతుంది. పారిశ్రామికవేత్తలలో చాలామంది అనేకసద్భావాలుకలవారున్నప్పటికీ వారు కొత్తపంథాలో ఆలోచించడంకష్టం. ప్రభుత్వయాజమాన్యాన నిర్వహింపబడే పరిశ్రమలంటే, వారిదృష్టిలో ఇప్పుడున్న రాజ్యాంగమనే అభిప్రాయం.

ఇప్పుడున్న ఇండియాప్రభుత్వం, రైళ్ళను స్వంతంగా నడుపుతూ ఉండడంచేతను, పరిశ్రమలు, ఆర్థికవిధానము, మొత్తంమీద ప్రజల జీవితాన్ని చాలావరకు అదుపులోపెడుతుండడంచేతనూ ఇదికూడా సామ్యవాదపద్ధతిలోనే నడుస్తోందని కొందరుఅప్పుడప్పుడు చెపుతున్నారు. ఇప్పుడున్న విదేశీప్రభుత్వంఅజ్మాయిషీమాటల్లాఉండగా, ప్రజాస్వా

మిశ్రప్రభుత్వ అజ్మాయిషీకి సామ్యవాదవిధానానికీకూడా సహస్రం తేడాఉంది. ధనికవర్గాల కార్యకలాపాలను అదుపులోపెట్టినా కొందరి తాలూకు కొన్నిహక్కులను ముట్టుకోకూడదనే మూలసిద్ధాంతమే నేటి ప్రభుత్వంయొక్క ప్రాతిపదిక. పూర్వకాలపు విదేశీనిరంకుశప్రభుత్వం, కొన్ని ప్రత్యేకవర్గాలకుసంబంధించినవిషయాల్లోతప్ప మొత్తంమీద ప్రజలఆర్థికసమస్యలవిషయంలో ఏమీ పట్టించుకోలేదు. కొత్తపరిస్థితులలో తామిదివరదాకా అనుసరిస్తున్న 'నన్నుముట్టుకోకు నామాలకాకి' అనేపద్ధతి సాగేటట్లులోచక జబర్దస్తీవిధానాలను అనుసరించడం ప్రారంభించారు. ఆర్థికవిషయాల్లోనూ ప్రజాపరిపాలనారంగంలోనూకూడా స్వల్పమార్పులతో నిరంకుశవిధానాలను అవలంబించి, ప్రజల పౌరసత్వపుహక్కులను అణగద్రొక్కడం ప్రారంభించారు. ఫాసిస్టురాజ్యాల్లో లాగునే ఏకచ్ఛత్రాధిపత్యంగా పరిపాలనసాగించారు. జాతీయజీవనాన్ని, పరిశ్రమలను ప్రభుత్వం పర్యవేక్షణచేయడం కలదు గాని ఈఅజ్మాయిషీ అంతా పూర్వసాంప్రదాయాలమీదనే జరుగుతూవచ్చింది. దీనికి సామ్యవాదానికి చాలాదూరంఉంది. విదేశీయపరిపాలనలోనున్న దేశంలో సామ్యవాదవ్యవస్థనుగురించి మాట్లాడడమే హాస్యాస్పదం. తాత్కాలికంగానైనా అల్లాంటిఏర్పాటు సాగుతుందనడం సాధ్యంకాదు. పైగా ఉన్నసమస్యలు మరింతక్లిష్టమవుతాయి. కాని యుద్ధవాతావరణం వలనమాత్రం ఆ సిద్ధాంతాన్ని అమలుజరుపడానికనుకూలమైన స్థితేర్పడింది. రాజకీయమైన ప్రజాస్వామికంలేకుండా ప్రభుత్వం పెద్దపరిశ్రమలను ప్రభుత్వవశంచేయడంవల్ల మరొకవిధంగా అక్రమమైన లాభసాటిబేరం సాగుతుంది. అప్పుడు పరిశ్రమలు ప్రభుత్వంచేతిలో ఉంటాయి. కాని ప్రభుత్వంమాత్రం ప్రజలచేతుల్లో ఉండదు.

భారతదేశంలో ఏవిషయమైఆలోచించినా ఒకపెద్దచిక్కు సిద్ధమవుతోంది. ఆర్థిక, సాంఘిక, వ్యవసాయికసమస్యలు కానివ్వండి, భారతసంస్థానాలవిషయం కానివ్వండి, దేనినిగురించి ఆలోచించవలసివచ్చినా ఇప్పుడున్నస్థితిగతులహద్దుల్లోనే ఆలోచనచేయాలి. ఇప్పుడున్న రాజ్యాంగచట్రంలోనే ఎవరనుభవిస్తున్నహక్కులు వారికే ఉండనివ్వవలసివచ్చేసరికి ఏచిక్కూ విడడంలేదు. అవసరంకొద్దీ విధిలేక ఏదైనా అతుకులబొంతగా ఒక నిర్ణయానికొచ్చినా అదెంతోకాలం నిలవడానికి

సావకాశంలేదు. పాతచిక్కులు అలాగేఉండగా కొత్తసమస్యలు కలుస్తున్నాయి. ఈలాంటిఆలోచనకు కొంతవరకు మన అలవాటు, సాంప్రదాయమూ కారణమేకాని, ప్రధానంగా బ్రిటిష్ప్రభుత్వంయొక్క ఉక్కుచట్రమే కారణం.

రాజకీయంగానూ, ఆర్థికంగానూ, సాంఘికంగానూ ఇండియాలో ఉన్న పరస్పరవైరుధ్యాలను యుద్ధం మరింత హెచ్చుచేసింది. రాజకీయంగా భారతస్వాతంత్ర్యాన్నిగురించిన ప్రసక్తి చాలా హెచ్చుగా ఉన్నది. కాని బహుశా సుదీర్ఘమైనచరిత్రలో భారతీయులు ఇదివరకెన్నడూ పడనంతగా నిర్బంధవిధానమునకు గురియైనారు. నిరంకుశప్రభుత్వము స్వేచ్ఛాతాండవంచేస్తున్నది. ఇంకా ముందుముందు ఎక్కువకావడం తథ్యం. ఆర్థికంగాచూస్తే బ్రిటిష్వారిసర్వాధిపత్యంసాగుతోంది. కాని భారతీయఆర్థికవిధానం ఆ కట్టుకొయ్యనుండి త్రెంచుకుబయటపడడానికి ఎంతో గిజగిజలాడుతోంది. ఒకప్రక్కన కాటకం తాండవంచేస్తున్నది. మరొకప్రక్కన కొందరిదగ్గర ధనంమురిగిపోతున్నది. పేదరికము ఐశ్వర్యము జంటగాసాగిపోతున్నాయి. నాశము, నిర్మాణము, విభిన్నత, ఐకమత్యము, పాతఆలోచనలు, కొత్తఆలోచనలు అన్నీజంటగా నడుస్తున్నాయి. ఈనిరుత్సాహస్థితిగతులిట్లాఉన్నా, దానివెనుక అజేయమైన జీవశక్తిమాత్ర మొకటున్నది. భారతదేశంలో యుద్ధంవల్ల పరిశ్రమలు బాగావృద్ధిఅవుతున్నట్లు పైకి కనుబడుతుంది. కాని నిజానికి కొత్త పరిశ్రమలేమైనా వెలసినాయా అన్నది అనుమానం. ఎంతవరకూ పాత పరిశ్రమలే కొంతవిస్తరించబడ్డాయి. భారతపారిశ్రామికాభివృద్ధి యుద్ధకాలంలో బాగానిల్రదొక్కుకున్నట్లు కనబడినా చెప్పకోదగినఅభివృద్ధి మాత్రం కనుబడదు. ఈవిషయాలను బాగా అవగాహనచేసుకొన్నవారు, యుద్ధంవిషయంలో బ్రిటిష్వారవలంబించినధోరణివల్ల పరిశ్రమాభివృద్ధి అడ్డిపోయినదని అభిప్రాయపడుతున్నారు. ప్రసిద్ధ ఆర్థికవేత్త, టాటాకంపెనీ డైరెక్టరునైన డాక్టర్ జాన్ మత్తయ్ ఇలా అన్నాడు "భారతదేశంలో యుద్ధంవల్ల పరిశ్రమాభివృద్ధి బ్రహ్మాండంగా జరిగినదని సామాన్యజనంలోకలిగిన అభిప్రాయం సరిగా ధృవపడలేదని, అందుకుతగినఆధారాలు లేవనీ చెప్పాలసొస్తుంది. యుద్ధావసరాలకోసం ఇదివరకే స్థాపించబడినపరిశ్రమలు కొంత ఉత్పత్తినధికంచేసుకున్నాయి.

కాని యుద్ధానికిముందు కొత్తగా నెలకొల్పడానికి సంకల్పింపబడినఅనేక కొత్తపరిశ్రమలు యుద్ధంవత్తిడివల్ల స్థాపింపబడనేలేదు. అథవా ప్రారంభింపబడినా పూర్తికాలేదు. బాగా పరిస్థితులన్నీ తహతహలు వేసిచూస్తే ఆస్ట్రేలియా కెనడా దేశాలలోమాదిరిగా కాకుండా, యుద్ధం భారతీయ పరిశ్రమాభివృద్ధి కడ్డంతగిలిందనే నా స్వంతఅభిప్రాయం. భారతీయుల జీవితావసరాలను తయారుచేసుకోవడానికి తగినసాధనసంపత్తి, సావకాశాలుమాత్రం ఉన్నాయని నేనంగీకరిస్తాను." మనకులభ్యమైనంతవరకు ప్రభుత్వలెఖ్ఖలు కూడా ఈఅభిప్రాయాన్నే బలపరుస్తున్నాయి. యుద్ధానికి పూర్వం పరిశ్రమాభివృద్ధిజరిగినంతవేగంగా యుద్ధకాలంలో జరిగి ఉంటే నిస్సందేహంగా కొత్తపరిశ్రమలు ఉత్పన్నంకావడమేకాకుండా మొత్తంమీద ఉత్పత్తికూడా బాగా అధికమైఉండేదే.

తగినంతసావకాశంఇచ్చిఉంటే అతిశీఘ్రంగా భారతదేశం తనశక్తినంతావినియోగించి సర్వతోముఖమైన పారిశ్రామికాభివృద్ధిని నిస్సందేహంగా సాధించిఉండేదనిమాత్రం ఈయుద్ధంవల్ల తేలింది. ఆర్థికంగా చిన్న ఎత్తునపనిచేస్తూకూడా ఎన్నోఅడ్డంకులను తప్పించుకుంటూ యుద్ధం 5 ఏళ్ళల్లోనూ మనదేశంలో బ్రహ్మాండంగా పెట్టుబడులను వృద్ధిచేసుకుంది. ఈపెట్టుబడుల జమలన్నీ పౌనులలో ఉన్నాయి. ఆ ధనం మనకెప్పుడుపడితే అప్పుడు లభ్యంకాకుండా చిక్కబడిపోయింది. ఈ పౌనుల సంపాదనంతా బ్రిటిష్‌ప్రభుత్వంతరఫున అమెరికాతరఫున భారతప్రభుత్వంచేసినఖర్చన్నమాట. ఇండియాలో కాటకంవల్లచనిపోయినజనాభా ఆకలి, అంటురోగాలు, నిర్వీర్యత మొదలైన దోషాలకుకూడా ఈ పౌనులదే బాధ్యత.

పెట్టుబళ్ళు బాగా పేరుకోవడంచేత ఇంగ్లండుకు ఇండియా ఇవ్వవలసిన ఋణాలనన్నిటిని తీర్చేసింది. అంతేకాకుండా కొంతఅప్పుకూడా ఇచ్చింది. కాని కేవలం ప్రభుత్వంయొక్క క్షమింపరానటువంటి అశ్రద్ధవల్ల, అసమర్థతవల్ల, భారతప్రజలు భరింపరాని బాధలకులోనైనారు. ఏమైనా స్వల్పకాలంలో ఇంతటిమూలధనాన్ని హిందూదేశం జమచేయగలిగిందనడంమాత్రం నిశ్చయం. యుద్ధకాలం 5 సంవత్సరాల్లోనూ హిందూదేశం యుద్ధంకోసం బ్రిటిష్‌వారితరఫునచేసినఖర్చుమొత్తం గతశతాబ్దమంతటిలోనూ బ్రిటిష్‌వారు పెట్టినపెట్టుబడులకన్న ఎంతోఎక్కు

వని తేలింది. ఈ ఒక్క సంగతివల్ల గతశతాబ్దం అంతటిలోను బ్రిటిష్‌పరిపాలనలో భారతదేశ మెంత తక్కువవృద్ధియైనదో స్పష్టంగా తెలుస్తోంది. రైల్వేలు నీటివనరులు మొదలైనవాటి విషయంలో వారు చేసిన ఘనత ఎంతో వింటున్నాం. కాని దాని అంతరమింతే. అవకాశమున్నట్లయితే సర్వతోముఖంగా భారతదేశ మెంతశీఘ్రంగా వృద్ధిచెందగలదో కూడా ఈ విషయంవల్లనే ఋజువవుతోంది.

భారతపరిశ్రమాభివృద్ధిని కాంక్షించని విదేశీప్రభుత్వం యాజమాన్యంలో, ఎంతో నిరుత్సాహకరమైన స్థితిగతుల్లోనే ఇంత మాత్రంగా పారిశ్రామికాభివృద్ధి జరిగినప్పుడు, స్వతంత్రభారతజాతీయ ప్రభుత్వంయాజమాన్యంలో ఒక ప్రణాళిక ప్రకారం పనిజరుగుతుంటే పరిశ్రమ లధికంగా వృద్ధియై భారతదేశంయొక్క బాహ్యరూపమే మారిపోయిఉండేదని వేరే చెప్పనక్కరలేదు.

ఏనాడో చాలాకాలంనాటి స్థితిగతులను పురస్కరించుకొని ఆ కొలబద్దతోనే నేటి అభివృద్ధిని పోల్చడం బ్రిటిష్‌వారి కొక ఆచారమైనది. నూరుసంవత్సరాలక్రితంస్థితిగతులతో నేడు వారుచేసినపనులను పోల్చుకొని ఏదోవిశేషంగాచేసినట్లు సంతృప్తిపడుతూఉంటారు. పారిశ్రామికవిప్లవము, ముఖ్యంగా గత 50 సంవత్సరాల్లోజరిగిన సాంకేతిక విజ్ఞానాభివృద్ధి మానవజీవితంయొక్క గమనాన్ని చాలా ఉద్వేగపరచిందనేసంగతి హిందూదేశంవిషయంలో వారికి స్ఫురించదు. వాళ్ళు ఈదేశంలోకాలెట్టినప్పుడు హిందూదేశం పాడిపంటల్లేని ఎడారికాదు. నిర్జనప్రదేశమూ కాదు. అనాగరకదేశమూకాదు. చాలాగొప్పదైన సంస్కృతినిగలిగి అభివృద్ధిలోనున్న దేశం. కాని తాత్కాలికంగా మాత్రమే అభివృద్ధి స్తంభించిపోయి, సాంకేతికవిజ్ఞానంలో వెనుకబడిపోయింది.

ఈలాంటిపోలికలు చేయవలసివచ్చినపుడు వాటికి ప్రమాణాలేమిటి? జపాన్‌వారు తమప్రయోజనంకోసమైనా 8 సంవత్సరాల్లో మంచుకోను పారిశ్రామికంగాగొప్పవృద్ధిలోనికి తెచ్చారు. కొన్నితరాల శ్రమఅనంతరంకూడా ఇండియాలోఉత్పత్తిచేసే బొగ్గుకన్న మంచుకోలోనే ఎక్కువ తయారవుతోంది. ఇతరసామ్రాజ్య దేశాలఐశ్వర్యంతో పోల్చిచూస్తే కొరియావారిపని బాగానేఉంది. కాని ఎన్నిఉన్నా,

వారి ఈచరిత్రవెనుక దాస్యము, దుర్మార్గము, న్యూనత, దోపిడివిధానం వగైరాలున్నాయి. ప్రజాహృదయాన్ని పాతాళంలోకి తొక్కే-స్వేచ్ఛయ త్నం కనుబడుతుంది. నాజీలు, జపానువారుకూడ ప్రజలస్వేచ్ఛకుభంగం కలుగచేయడంలో గొప్పప్రశస్తి సంపాదించారు. ఈసంగతి మనకు జ్ఞాపకంచేస్తూ, మొత్తంమీదచూస్తే బ్రిటిష్‌వారు మన కంత అపకారం చేయలేదంటారు. పోలికలుపట్టడంలో ఇవేనా కొత్తప్రమాణాలు?

ఈనాడు భారతదేశంలో కావలసినంత నిస్పృహ, నిరుత్సాహం ఉన్నాయి. ఈ రెండింటికీ తగినంతకారణం లేకపోలేదు. ఈమధ్య జరిగిన సంఘటనలే అందుకుకారణం. భవిష్యత్తులోకూడా ఏమీ ఆశారేఖ లగుపించడంలేదు. కాని కొంచెం లోతుకెళ్ళి పరిశీలిస్తే, ఒకవిధమైన నూతనజీవనం, శక్తి జివజివలాడుతాయి. మన ఊహాకతీతమైన శక్తులు పనిచేస్తూఉంటాయి. నాయకులైనవారు పైనుండి కార్యక్రమం నడిపిస్తుంటారు. కాని అజ్ఞాతంలోఉన్న అమాయకప్రజల అభిప్రాయ వేగంలో కొట్టుకుపోతూ ఉంటారు. ప్రజలు తమగతానికంతకూ అతీతులైపోతున్నట్లుతోస్తుంది.

## ౮ భారతదేశాభివృద్ధికి ఆటంకం

ఒకవ్యక్తికున్నట్లే ఒకజాతికికూడా అనేకవ్యక్తిత్వాలు, జీవితంపట్ల అనేకదృక్పథాలు ఉంటాయి. ఈ విభిన్నవ్యక్తిత్వాలమధ్య తగినంత గట్టి అంగసంబంధమైనబంధం వుంటే మంచిదే. లేకపోతే, ఈ వ్యక్తిత్వాలు చీలిపోయి విచ్ఛిత్తికీ, కష్టాలకూ దోవతీస్తాయి సాధారణంగా అటువంటి పరస్పరాన్వయపరిణామం నిరంతరం జరుగుతూ, ఒకరకమైన సమరసభావం నెలకొంటూవుంటుంది. సాధారణపురోభివృద్ధి నిరోధించబడినప్పుడు, లేక ఒక్కొ-కసారి సులభంగా హత్తుకుపోని ఒకానొక మార్పు అతివేగంగా జరిగినపుడు ఆ విభిన్నవ్యక్తిత్వాలమధ్య సంఘర్షణ చెలరేగుతుంది. చిరకాలంగా అభివృద్ధి నిరోధింపబడడంవల్ల పైకి కనుపించే మన విభేదాలు, విభాగాలచాటున, భారతహృదయంలో, ఆత్మలో ఈ ప్రధానసంఘర్షణ జరుగుతూనేవుంది. ఏ సమాజమైనా సౌష్టవంగానూ, పురోగామిగానూ వుండాలంటే, దానికి దాదాపు నిశ్చలమైన కొన్నిఆశయాలపునాది, సంచలనాత్మకమైనదృక్పథం వుం

డాలి. ఈ రెండులక్షణాలూ కూడా అవసరమేననిపిస్తోంది. సంచలనా త్మకదృక్పథం లేకపోతే, ఒకరకమైన స్థబ్దత్వము, వినాశము యేర్పడ తాయి. ఒక స్థిరమైన ఆశయపునాది లేకపోతే, విచ్ఛిన్నత, వినాశము సంభవించేఅవకాశం వుంది.

భారతదేశంలో మార్పులేని, సార్వజనిక, పరిపూర్ణ ప్రాథమిక ఆశయాలకోసం ఆదిమకాలంనుంచీ అన్వేషణ జరుగుతోంది. దాంతో పాటు సంచలనాత్మకదృక్పథము, జీవితాన్నీ మారేప్రపంచాన్నీ అవ గాహనచేసుకోవడంకూడా భారతదేశంలో వున్నాయి. సౌష్టవం, భద్రత, జాతివర్ధిల్లడంమీదనే ఎక్కువఆసక్తిచూపబడినా ఈ రెండు పునాదులమీదనే సౌష్టవమైన అభ్యుదయసమాజం నిర్మింపబడింది. అందులో జాతిస్థిరత్వానికి, భద్రతకు, శాశ్వతమనుగడకు ప్రాధాన్య మీయబడింది. తరువాతియేండ్లలో సంచలనాత్మకదృక్పథం అదృశ్యం కానారంభించి, శాశ్వతాశయాలపేరుతో సామాజికనిర్మాణం మార్పు లేనిదిగా, పాషాణసదృశంగా చేయబడింది. నిజంచెప్పాలంటే, అది పూర్తిగా గట్టిదికాక, క్రమానుగతంగా నిరంతరం మారుతూనేవుంది. కాని, దానివెనుకగలసిద్ధాంతం, సాధారణయంత్రాంగం మార్పులేనివి గానే ఉండిపోయాయి. దాదాపు స్వయంస్వతంత్రమైనకులాలు, సమిష్టి కుటుంబం, వర్ణధర్మస్వయంపాలకవిధానమైన గ్రామీణజీవితం మొదలైన వాటిలోగల 'సంఘ'మనేభావనలు పైనపేర్కొన్న సామాజికవ్యవస్థకు మూలస్తంభాలు. వాటిలో లోపాలున్నా, మానవప్రకృతికీ, సంఘానికీ ఆవశ్యకమైన కొన్నిప్రయోజనాలను అవి తీరుస్తున్నందువల్ల, ఈ మూలసంభాలు అంతకాలం నిలబడగలిగాయి. అవి ప్రతి కూటమికీ (వర్గానికీ) భద్రతను, సౌష్టవాన్ని చేకూర్చి ఒకరకమైన వర్ణస్వాతంత్ర్య మనే భావనను కలిగించాయి. సమాజంలో సాధారణంగావుండే, అధి కారికతరతమబాంధవ్యాలకు ప్రాతినిధ్యంవహించడంవల్ల కులాలు నిలబడ గలిగాయి. వర్గాలకుగలప్రత్యేకావకాశాలను ఆచరణలోవున్న ఆద ర్శాలు సమర్థించడంవల్లనేగాక, అవి చైత్యము, తెలివితేటలు, సామర్థ్యం, ఆత్మత్యాగశక్తులచేత బలపరచబడడంవల్లకూడా కొనసా గింపబడ్డాయి. అలా ఆచరణలోవున్నఆదర్శాలు హక్కులసంఘర్షణ మీద ఆధారపడలేదు. అవి వ్యక్తికి యితరులపట్లగలధర్మాలమీద,

తనబాధ్యతలను తృప్తికరంగా నిర్వర్తించడంమీద, వర్గంలోనివ్యక్తుల మధ్య వివిధవర్ణాలమధ్యావుండే సహకారంమీద, అన్నిటికంటె ముఖ్యంగా, యుద్ధాన్నిగాక శాంతినివర్ధిల్ల జేయాలనేభావనమీద ఆధారపడ్డాయి. సాంఘికవ్యవస్థావిధానం కఠినంగావున్నా, భావస్వాతంత్ర్యానికి యే పరిమితీ యేర్పరచబడలేదు.

భారతీయనాగరికత లక్ష్యంలోపెట్టుకున్నదంతా సాధించగలిగింది. కాని ఆ నాగరికత ఎక్కువకాలం కఠినమైన, మార్పులేనివాతావరణంలో వుండలేనంతటి విశేషసంచలనాత్మకస్వభావంగలది గనుక, ఆ లక్ష్యసాధనలోనే జీవితం వాడిపోసాగింది. మారనివని చెప్పుకునే ప్రాథమికసిద్ధాంతాలుకూడా పరిపాటైయిపోయి, వాటికొరకై అన్వేషణ జరగడం ఆగిపోయినప్పుడు వాటినవీనత, వాస్తవికతలనుకోల్పోయాయి. సత్యం, సుందరం, స్వతంత్రం అనేభావనలు క్షీణించి, మనం ఒకే నిర్జీవ మార్గంలో నడిచే బందీలమైపోతాం.

భారత దేశానికిలేనిగుణం ఆధునికపాశ్చాత్యఖండానికి వుంది. ఆ గుణం ముబ్బడిగావుంది. పశ్చిమఖండానికి సంచలనాత్మకదృక్పథం వుంది. అది మార్పులేని, సార్వజనీన, అంతిమసిద్ధాంతాలను లెక్క చేయకుండా మారేప్రపంచంలోనే నిమగ్నమైవుంది. బాధ్యతలు, ధర్మాలను, హక్కులనుగూర్చి అట్టే పట్టించుకోలేరు. అది చురుగ్గా, దార్ష్టికంగా, స్వార్థంగా అధికారాన్నీ, పెత్తనాన్నీఅన్వేషిస్తూ, ప్రస్తుత లాభాలనే గణిస్తూ, తనచర్యలవల్ల భవిష్యత్తులో యేర్పడగల ఫలితాలను విస్మరిస్తూఉండేది. అది సంచలనాత్మకమైనదిగనుక, పురోగామిగా, జీవనోత్తేజంతో నిండివుండేది. కాని, ఆ జీవితం జ్వరగ్రస్తమై, ఉష్ణోగ్రత ఎప్పుడూ పెరుగుతూనే వుంది.

భారతీయనాగరికత కరుడుగట్టి, అంతర్ముఖియై, ఊహాలోకాన్నే నమ్ముకునేధోరణిగలదైనందువల్ల కలుపువేసిపోయింది. ఆధునిక పాశ్చాత్యనాగరికత అనేక మహత్తరవిశేషాలు సాధించినా, ప్రత్యేకంగా చెప్పుకోదగ్గంతవిజయవంతమైనట్లుగాని, జీవితప్రాథమిక సమస్యలను ఇంతవరకు పరిష్కరించినట్లుగాని కన్పించదు. ఆ నాగరికతలో సంఘర్షణ ఒకసహజగుణం. అందువల్ల అప్పుడప్పుడు అది తన్ను తానే భారీయెత్తున నాశనంచేసుకుంటూవుంటుంది. ఆ నాగరికతలో

దానికి స్థిరత్వాన్నిచ్చే ఒకానొకగుణం, జీవితార్థాన్నిచ్చే. కొన్ని ప్రాథమికసిద్ధాంతాలు లోపించాయనిపిస్తుంది. ఆ గుణం, ఆ సిద్ధాంతాలు ఫలానాఅని నేను చెప్పలేను. అయినా ఆ నాగరికత సంచలనాత్మకము, జీవనోత్తేజభరితము, జిజ్ఞాసాపూరితం కావడంవల్ల, దాని భవిష్యత్తు ఆశాజనకంగా వుంది.

ఈ యుగస్వభావానికి ప్రతినిధి ప్రశ్చిమఖండమే ఆధునిక పశ్చిమఖండం యితరదేశాలకు నేర్పగలిగిన దెంతో వుంది. అందువల్ల భారతదేశము, చైనాకూడా ఆ పశ్చిమఖండాన్నుంచి పాఠాలు నేర్చుకోక తప్పదు. కాని, పశ్చిమఖండంకూడా ఎంతో నేర్చుకోవలసిన ఆవశ్యకత వుంది. అన్ని దేశాల్లోని అన్నియుగాలవిజ్ఞానులు జీవితపులోతునుగురించిన పాఠాలు నేర్చుకోవడంలోనే తమ మేధస్సులను నిమగ్నంచేశారు. పశ్చిమఖండం అలాంటిపాఠాల్లో కొన్నయినా నేర్చుకోకపోతే, అది సాంకేతికంగా వేసినముందంజ లేమాత్రం సుఖాన్నివ్వలేవు.

భారతదేశం స్తబ్ధగావున్నమాట నిజమే. కాని, అది బొత్తిగా యేమార్పూలేనిదనుకోవడం మాత్రం పూర్తిగా పొరపాటు. ఏమార్పూ లేకపోవడమంటే మృత్యువే. ఉన్నతపరిణతిగలజాతిగా మనగలగడమే దానిలో కాలానుగుణ్యంగా తననుతాను మలచుకోవడమనే ఒకానొక నిరంతరపరిణామం జరుగుతూనేవున్నదని రుజువుచేస్తోంది. బ్రిటిష్‌వారు వచ్చేప్పటికి భారతదేశం సాంకేతికంగా కొంతవెనుకపడివున్నా, ప్రపంచంలో వాణిజ్యపరంగా పురోగమించినజాతుల్లో ఒకటిగావుంది. సాంకేతికపరిణామాలు వచ్చి, కొన్నిపాశ్చాత్యదేశాలను మార్చినట్లే, అవి భారతదేశంలోకూడా వచ్చి, మార్పులుచేసివుండేవనేది నిస్సంశయం. కాని, దానిసాధారణపురోగమనాన్ని బ్రిటిష్‌అధికారం నిరోధించింది. పారిశ్రామికాభివృద్ధిని నిరోధించడంవల్ల సాంఘికపురోగమనంకూడా అరికట్టబడింది. అధికారమంతా విదేశీప్రభుత్వాధీనంలో కేంద్రీకరింపబడింది. ఆ ప్రభుత్వం బలప్రయోగంమీద ఆధారపడి, వాస్తవప్రత్యేకత లేకుండాపోయిన ముఠాలను ప్రోత్సహించింది. అందువల్ల, సంఘంలో సాధారణంగాఉండే అధికారికబాంధవ్యాలమధ్య సమరసభావం సాధ్యంకాక, సాదృశ్యం యేర్పడలేదు. ఆవిధంగా ప్రముఖ

పాత్రనిర్వహిస్తున్నట్లుకన్పించే అనేకమందివ్యక్తులకు, వర్ణాలకు సంఘంలో వహించదగ్గ ముఖ్యబాధ్యతలేమీ మిగల్లేదు. వారికీ, వాటికీ విదేశీప్రభుత్వం ప్రాముఖ్యతనివ్వబట్టే, వారూ, అవీ మనడం జరిగింది. అందువల్ల భారతీయజీవితం క్రమంగా మరింత కృత్రిమంకాసాగింది. ఆ వ్యక్తులూ, వర్ణాలూ చరిత్రలో నిర్వహించదగ్గపాత్రలు యేనాడో అంతరించాయి. వాటికి విదేశీరక్షణే లభించకపోతే, అవి ఏనాడో నూతనశక్తులచేత ప్రక్కకునెట్టివేయబడేవే. అవి విదేశీప్రభుత్వపు దిష్టిబొమ్మల్లాతయారై జాతిసజీవప్రవాహానికి తమకుతామే మరింత దూరమైపోయాయి. సాధారణంగా అవి కలుపుమొక్కల్లా సమూలంగా నాశనంచేయబడేవి, లేదా విప్లవంద్వారాగాని, ప్రజాస్వామిక పరిణామంద్వారాగాని మరొక ఉచితకార్యనిర్వహణకు మళ్ళించబడేవి. కాని, విదేశీనిరంకుశపాలన కొనసాగినంతకాలం అలాంటిఅభివృద్ధి సంభవించదు. అందువల్ల భారతదేశం యీ భూతకాలచిహ్నాలతో నిండిపోయింది. దేశంలోజరుగుతున్న వాస్తవపరిణామాలు యీ చిహ్నాలకృత్రిమప్రవహరీలవెనుకనే దాగివున్నాయి. (ఇట్టిపరిస్థితుల్లో) నిజమైన సాంఘికసమానతలుగాని, అధికారికతరతమబాంధవ్యాలుగాని పురోగమించడం, స్పష్టంకావడం అసంభవం. అందువల్ల, అవాస్తవసమస్యలు అవసరంలేనంత అధికప్రాముఖ్యతవహించాయి.

ఈవిధంగా అభివృద్ధినిరోధించబడి, బ్రిటిష్‌ప్రభుత్వం సాధారణకాలానుగుణ్య పరిణామాలు జరక్కుండా నిరోధించడంవల్లనే నేటి మా సమస్యల్లో అనేకం రూపొందాయి. విదేశీప్రమేయం తొలగించబడితే, భారతీయసంస్థానాధీశులసమస్య సులభంగా పరిష్కారంకాగలదు. మా అల్పసంఖ్యాకులసమస్య యితర దేశాల్లోని అల్పసంఖ్యాకులసమస్యల కెందునా పోలికలేనట్టిది. అస లది అల్పసంఖ్యాకులసమస్యే కాదు. ఆ సమస్యపట్ల అనేకదృక్పథా లున్నాయి. దానికి గతంలోనూ, వర్తమానంలోనూ మేమే నిందార్హులమనడం నిస్సంశయం. ఏమైనా, యీ సమస్యలకు, తదితరసమస్యలకు వెనుక బలవత్తరమైన ముఖ్యకారణం బ్రిటిష్‌ప్రభుత్వమే. అది భారతప్రజల ఆర్థిక, రాజకీయ వ్యవస్థలను సాధ్యమైనంతవరకు యథాతథంగానేవుంచాలని కాంక్షిస్తూ అందుకోసం సాంఘికంగా వెనుకబడిఉన్నవర్గాలను యథాస్థితిలోనే

వుండేట్లు ప్రోత్సహించాలనుకుంటోంది. రాజకీయార్థికపురోగమనాన్ని ప్రత్యక్షంగా నిరోధించడమేగాక అభివృద్ధినిరోధకవర్గాలూ, స్వార్థ శక్తులూ పరస్పరం 'అంగీకరిస్తేనే' యీ పురోగమనం సాధ్యమయ్యేట్లు చేశారు. అట్టి ప్రతీశక్తులకుగల అధికావకాశాలను బలపరచడం ద్వారా లేదా భవిష్యత్తుకుసంబంధించిన యే యేర్పాటులోనైనా వారికే బలాధిక్యమైనస్థానంయివ్వడంద్వారా మాత్రమే యిట్టి "అంగీకారం" సాధ్యమౌతుంది. ఈవిధంగా వాస్తవమైనమార్పు, పురోగమనాలకు అధిగమించలేనిఅడ్డంకులు సృష్టించారు. కొత్తరాజ్యాంగం దృఢంగా, ప్రయోజనకరంగా వుండాలంటే, ప్రజల్లో ఎక్కువమంది కోర్కెలకు ప్రాతినిధ్యంవహించడమేగాక, సాంఘికశక్తులమధ్యవుండవలసిన బాంధవ్యాన్నీ, ఆకాలపు అధికారికతరతమబాంధవ్యాలనుకూడా ప్రతిబింబించాలి. బ్రిటిష్‌వారూ, అనేకమందిభారతీయులూకూడా సూచిస్తున్న భవిష్యద్భారతరాజ్యాంగవిధానాలు వర్తమాన భారతదేశ సాంఘికశక్తుల్ని విస్మరిస్తున్నాయి. బహుకాలంగా నిరోధింపబడి, యిప్పుడే తలెత్తుతున్న ప్రముఖసమస్యలను అంతకంటె మరచిపోతున్నాయి. ఆవిధంగా ఈనాటికి వాస్తవంగా అన్వయించక అదృశ్యమౌతున్నబాంధవ్యాలమీదా, భూతకాలంమీదా ఆధారపడే ఒక కఠిన చట్రాన్ని నిర్మించేందుకూ, ప్రజలనెత్తిమీదరుద్దేందుకూ ప్రయత్నిస్తున్నారు. ఇదే భారతదేశంలో ప్రధానచిక్కుసమస్యగా వుంటోంది.

బ్రిటిష్‌సైనికఆక్రమణ, అది బలపరిచేవిధానము—ఇదే భారతదేశంలోని ప్రధానసత్యం. ఆవిధానం అనేకవిధాలుగా వెల్లడించబడింది. తరచుగా సందిగ్ధసమాసాలముసుగుతో వెల్లడైంది. కాని, ఇటీవల ఒక సైనికవైస్రాయిఆధిపత్యాన ఆ విధానం స్పష్టంగా వివరించబడింది. బ్రిటిష్‌వారు తోడ్పడినంతకాలము ఆ సైనికఆక్రమణ కొనసాగుతూంటుంది. కాని, బలప్రయోగానికి కొన్నిపరిమితులున్నాయి. బలప్రయోగం ప్రతిపక్షశక్తులను పెంపొందించడమేగాక, దానిమీదనే ఎక్కువగా ఆధారపడేవాళ్ళు వూహించని అనేకయితరపరిణామాలకుకూడా దోవ తీస్తుంది.

ఈ భారతదేశపుఅభివృద్ధిని నిరోధించడం, అది దానిపురోగమనాన్ని అరికట్టినఫలితాలను మనం చూస్తున్నాం. వాటిలో మరీ స్పష్టంగా

కనిపించేది భారతదేశంలో బ్రిటిష్‌పాలనయొక్క గొడ్డలితనము, దానివల్ల భారతీయజీవితం భగ్నంచేయబడడమూను. పరపాలన అది పాలిస్తున్నప్రజలసృజనాత్మకశక్తులకు సంబంధంలేకుండా ఎడమైపోవడం తప్పనిసరి. ఈ విదేశీపాలనయొక్క ఆర్థిక, సాంస్కృతికకేంద్రం బానిస దేశానికి ఎంతోదూరంలో వుండి, జాత్యహంకారముచేత బలపర్చబడే దైతే, యీ ఎడబాటు పరిపూర్ణమవుతుంది. అది బానిసప్రజలఆత్మీయ, సాంస్కృతికజీవితాలతమానికి దారితీస్తుంది. ఇక ఆ బానిసజాతియొక్క సృజనాత్మకశక్తికిగల వాస్తవఅవకాశమల్లా ఆ పాలనను "వ్యతిరేకించ డంలో"మాత్రమే బహిర్గతంకావడం. కాని ఆ అవకాశంకూడా బహు పరిమితంగావుండి, దృక్పథం సంకుచితంగా, పాక్షికంగా తయారౌతుంది. సజీవ, పురోగామిశక్తులు తమనుబంధించినకవచాన్ని బ్రద్దలుచేసి, బైట పడేందుకు ప్రయత్నపూర్వకంగానో, అప్రయత్నంగానో చేసే ప్రయ త్నాన్ని యీ "వ్యతిరేకత" ప్రతిబింబిస్తుంది. ఆవిధంగా అది తప్పనిసరి యైన అభ్యుదయధోరణి. కాని, అది మరీఏకాకిబాటయై, మనజీవితా ల్లోని అనేక వాస్తవదృక్పథాలతో సాన్నిహిత్యంలేనిదౌతుంది. చిక్కులు దురభిమానాలు, మూఢవిశ్వాసాలు పెచ్చుపెరిగి మతాలమేధను అంధ కారబంధురంచేస్తాయి. వర్ణ, వర్గారాధనాతత్త్వాలు రూపొందుతాయి. వాస్తవసమస్యలనన్వేషించవలసినదిపోయి, నినాదాలూ, ఊతపదాలూ ఎక్కువౌతాయి. గొడ్డుమోతువిదేశీపాలనాచక్రంలో ప్రయోజనకర మైనపరిష్కారాలు సాధ్యంకావు. జాతీయసమస్యలు పరిష్కారం గోచ రించక, మరింత క్లిష్టరూపంధరిస్తాయి. మేము భారతదేశంలో అరకొర ప్రయత్నాలు మాసమస్యలను పరిష్కరించలేనిస్థితికి చేరుకున్నాము. ఇక ఒకరంగంలో పురోగమనం చాలదు. అన్నిరంగాల్లోనూ పెద్దఅంగ వేసి పురోగమించాలి. లేదా ముప్పిరిగొన్నమహావిపత్తే దాపు రించవచ్చు.

మొత్తంప్రపంచంలోలాగానే భారతదేశంలోకూడా శాంతియుత పురోగమననిర్మాణానికీ, విధ్వంసము, వినాశనాలకి మధ్య పోటీజరుగు తోంది. ప్రతివిధ్వంసమూ గతించినదానికంటె యిబ్బడిముబ్బడిగా వుంటోంది. మనం మన ఊహాపోహాలను మానసికశక్తులనుబట్టి ఈ భవి ష్యద్రూపాన్ని ఆశావహంగాను, నిరాశావహంగానూ కూడా చూడ

వచ్చు. ప్రపంచమంతటా ఒక నైతికవ్యవస్థ నెలకొంటుందనీ, చివరికి మంచియే జయిస్తుందనీ విశ్వసించేవారు అదృష్టవంతులు. వారు భార మంతా భగవంతునిమీద వేసి, ప్రేక్షకుల్లాగానో, నిమిత్తమాత్ర సహాయకుల్లాగానో వుండిపోవచ్చు. ఇతరులు ఆ భారాన్నంతటిని తమ బలహీన భుజస్కంధాలమీదనే మోస్తూ, మేలు నాకాంక్షిస్తూ, అన్నిదుష్ఫలితాలకు సిద్ధమై నడవాలి.

## ౯ మతం - వేదాంతం - విజ్ఞానశాస్త్రం

భారత దేశం తన భూతకాలసంబంధాలతో చాలవరకు తెగతెంపులుచేసుకొని, గతం వర్తమానంమీద స్వారీచేయకుండా చూచుకోవాలి. ఈ 'గత'మనే నిర్జీవపుకట్టె మన జీవితాలను ప్రతిబంధిస్తోంది. మరణించినవీ, తమప్రయోజనాలు తీరినవీ, అన్నీ పోవలసిందే. అంటే ఆ ''గతం''లో ప్రాణాధారమైనవి, సజీవకారకమైనవాటినుంచి తెగతెంపులు చేసుకోవడము, మరలిపోవడమో కాదు. మనజాతిని కదలించిన ఆదర్శాలను, యుగయుగాలుగా భారతీయులుకన్నకలల్ని, పూర్వీకుల విజ్ఞానాన్ని, మాతాతముత్తాతల్లో ఉరకలు వేసినశక్తిని, వారికిజీవితంపట్ల ప్రకృతిపట్లగలప్రేమను,వారిజిజ్ఞాసాహృదయాలను,మానసికసాహసాన్ని వారిభావనలధైర్యాన్ని,సారస్వతము,కళ,నాగరికతలలో వారుసాధించిన మహత్తరవిజయాలను, సత్యం సౌందర్యం స్వాతంత్ర్యాలపట్ల వారికి గల అనురక్తిని, వారు నెలకొల్పిన ప్రాథమికవిలువలను, జీవితపువిచిత్ర విధానాలను వారు ఆవగాహనచేసుకోవడాన్ని, ఇతరులవిధానాలపట్లవారి సహనభావం, ఇతరప్రజలనూ, వారినాగరికతలోని విశిష్టతలను తమలో యిముడ్చుకుని, వాటిసారాంశాన్నిగ్రహించి, మిశ్రమనాగరికతను పెంపొందించిన వారిసామర్థ్యాన్ని మనం మరువలేము. మనప్రాచీనజాతిని నిర్మించి, మనహృదయాంతరాళాల్లో పాదుకుపోయివున్న అనేకానేక అనుభవాలజ్ఞానాన్నికూడా మనం మరువలేం. ఆయా విషయాలనుగాని, వాటినుంచి మనం పొందిన ఉదాత్తవారసత్వాన్నిగాని ఎన్నటికీ మరువలేము. వాటిని భారత దేశం మరచిపోతే, అది ఇంక భారత దేశం అనిపించుకోదు. మనసంతోషానికీ, గర్వానికీ కారణమైన దానిగుణగణాలు మన కింక అట్టిఅనుభూతి నీయలేవు.

మనం తెగ తెంపులుచేసుకోవలసినది యీవిశిష్టతలతో గాదు. భారత దేశాన్ని క్రమ్మి, దాని ఆంతరంగికసౌందర్యాన్ని, ప్రత్యేకతను మరుగుపరచిన యుగయుగాలదుమ్మును, మురికినీ వదల్చుకోవాలి. దాని ఆత్మ వాడి వత్తలానట్లు, వక్రించునట్లు చేసి, దాన్ని కఠినచట్రాల్లో బిగించి, దాని అభివృద్ధి నరికట్టిన కణుతులు, గర్భస్రావములనుంచి తెగ తెంపులుచేసుకోవాలి. ఈ కణుతులను ఖండించిపారవేసి, మన ప్రాచీన విజ్ఞానమూలోద్దేశాన్ని మరల గుర్తుకుతెచ్చుకుని, దాన్ని ప్రస్తుతస్థితి గతులకనుగుణంగా అన్వయించుకోవాలి. ఆలోచనల్లో, జీవితంలో సాంప్రదాయికవిధానాలు గతంలో ఎంత మేలుచేసినా, ఇప్పటికీవాటిలో సులక్షణాలున్నా, వాటి కీనాడు ఏప్రత్యేకత లేకుండాపోయింది. గాన, మనం వాటిని విసర్జించాలి. మానవజాతి సాధించినవిజయాలన్నింటినీ మనం మన స్వంతంచేసుకుని, మానవుని సముల్లాససాహసయాత్రలో - ఇది గతయుగాల్లోకంటె నేడు మరింత సముత్తేజకరంగా వుంది - యిత రులతోకలియాలి. ఈ యాత్రకు జాతీయసరిహద్దులుగాని, పురాతన విభాగాలుగాని లేవనీ, ఇది ఏప్రాంతవాసులకైనా సమాన పోటీవరుగు వంటిదని గుర్తించాలి. జీవితాని కొక అర్థాన్నిచ్చే సత్య సౌందర్య స్వాతంత్ర్యపిపాసలను పునరుద్ధరించుకోవాలి. అనేకయుగాలక్రితం యీ గట్టి పునాదులమీదనే మనసౌధాన్ని నిర్మించిన మనజాతీయులు ప్రపంచంలో విశిష్టగౌరవం పొందారు. వారి ఆ సాహసికయాత్రాతే జాన్ని, సంచలనాత్మకదృక్పథాన్ని మనం మళ్ళీ కొత్తగా పెంపొందిం చుకోవాలి. మనజ్ఞాపకాలు, మానవచరిత్రా, మానవకృషి ఆరంభమైన బహుపురాతనకాలంవరకు పరచుకొనివున్నాయి. మనం అంతటిప్రాచీ నులమైనా, ప్రస్తుతస్థితిగతులకనుగుణంగా యౌవనంలోవుండే సంతోష సముత్సాహ, ఆంతర్యాలు వెల్లుబికేటట్లు, భవిష్యత్తుపై గాఢవిశ్వాసం వుండేటట్లు మరొకసారి యువకులంగా పెంపొందాలి.

చిట్టచివరి సత్యం - అస లిలాంటిదివుంటే - చిరస్థాయిగా, అవిచ్ఛి న్నంగా, మారనిదిగా వుండిపోవాలి. కాని, ఆ అనంతమైన, మార్పు లేని శాశ్వతసత్యం పరిమితమానవమేధకు సంపూర్ణంగా అర్థంకాదు. మానవమేధస్సుకు కాలం, స్థలం అనే పరిధులూ, ఆ మేధస్సువికసించిన పరిణామస్థితీ, ఆకాలంలో చలామణిలో వున్న ఆదర్శాలు పరిమితంకావ

డంవల్ల ఆ మేదస్సు మహాప్రయత్నిస్తే, ఆ సంపూర్ణసత్యంయొక్క స్వల్పప్రకృతినిమాత్రమే అర్థంచేసుకోగలదు. మేదస్సు వికసిస్తూ, తన దృక్పథాన్ని విస్తృతంచేసుకుంటూంటే, ఆదర్శాలు మారి, ఆసత్యాన్ని వెలిబుచ్చడానికి నూతనచిహ్నాలు వాడుకలోకివస్తూంటే – ఆ శాశ్వత సత్యంయొక్క ఆంతర్యం యథాతథంగానే వుండిపోయినా – దాని నూతనముఖాలనేకం వెలుగులోకి వస్తాయి. అందువల్ల ఎప్పటికప్పుడు సత్యాన్ని అన్వేషించుతూ, పునరుజ్జీవింపజేస్తూ, నూతనరూపంకల్పించుకుంటూ అభివృద్ధిచేసుకోవాలి. ఆవిధంగా మానవు డర్థంచేసుకోగల విధంగా అతసిభావనలపెంపుతోనూ, మానవజీవితపురోగమనానుగుణంగాను సత్యాన్నినిర్దేశించుకోవాలి. అప్పుడుమాత్రమే అది మానవాళికి "సజీవసత్యం" కాగలదు. అప్పుడే అది అత్యవసరకోర్కెలను తీర్చుతూ వర్తమానంలోను, భవిష్యత్తుకు మార్గదర్శికాగలదు.

కాని, సత్యంయొక్క ఏదృక్పథమైనా గతతరంలో మూఢ విశ్వాసంచేత వడిలిపోజేయబడితే అది పెంపొందడం, పురోగటుంచడం, మారుతూండే మానవాళిప్రయోజనాలకనుగుణంగా మలచుకోవడం ఆగిపోతుంది. దాని తదితరదృక్పథాలు మరుగుననే వుండిపోతాయి. తరువాతియుగపు అత్యవసరప్రశ్నలకు అది (ఆ సత్యం) సమాధానాలీయ లేకపోతుంది. అది ఇంక సంచలనాత్మకంగా వుండక, స్తబ్ధుగావుంటుంది. సజీవచైతన్యాన్నిచ్ఛేద్రక్రియకుబదులు నిర్జీవభావన, తంతూ అవుతుంది. మానవమేధపెంపుదలకు తీరనిఅడ్డంకిగా మారుతుంది. వాస్తవానికి ఆ సత్యం పెంపొంది, ఆకాలంలో అర్థంకాగలభాష, చిహ్నాలను అలంక రించుకున్న గతకాలంలోవలె ఈకాలంలో అర్థంచేసుకోబడడంలేదని కూడా అనవచ్చును. ఎందువల్లనంటే, మానసికవాతావరణం మారి పోయింది. నూతన సాంఘికాచారాలూ, అలవాట్లూ పెంపొందాయి. అందువల్ల అది తరువాతయుగానికి అతకదు. ఆ ప్రాచీనరచనయొక్క అర్థం, అంతకంటె ఎక్కువగా దానిఆంతర్యం అర్థంకావడం చాలాకష్టం. అంతేగాదు, అరవిందఘోషు చెప్పినట్లు ప్రతి "సత్యము" తనకుతానెంతసత్యమైనదైనా, దాన్ని పరిమితంచేస్తూ, అదేసమయంలో పూరిస్తూవుండే యితరవిశేషాలనుంచి వేరుచేస్తే, అది మేధనుబంధించే ఖోను, పెడదోవనుపెట్టే మాధ్యమూ అవుతుంది. ఎందువల్లనంటే,

వాస్తవానికి ప్రతిసత్యము ఒక సంకీర్ణమైన పిచ్చుకగూడులోని ఒక్కొక పోచవంటిది. ఆ గూడులోనుంచి ఏ ఒక్కపోచనూ వేరుపరచగూడదు.

మానవాళిపురోభివృద్ధికి మతాలు చాలా తోడ్పడ్డాయి. అవి మానవజీవితానికి మార్గదర్శకంగా కొన్నివిలువలను, కొన్నితరతమ స్థాయిలను నిర్ధరించాయి; కొన్నిఆదర్శాలను సూచించాయి. కాని, అవి యింతమేలుచేసినా, సత్యాన్ని కొన్ని నియమితచట్రాల్లో మూఢ సిద్ధాంతాల్లో బంధించేందుకు ప్రయత్నించాయి. త్వరలోనే మూలార్థాలను కోల్పోయి, లాంఛనప్రాయమైన క్రతుతంతుల్నీ, ఆచారాల్నీ (మతాలు) ప్రోత్సహించాయి. మానవునిచుట్టూవుండే "తెలియనిదాని" యొక్క నిగూఢవైచిత్రినీ, భక్తిపూర్వకభయాన్నీమానవుడు ఘట్టిగా నమ్మేటట్లుచేశాయి గాని, అతడు ఆ తెలియనిదాన్నేగాక, తన సాంఘికకృషికి అడ్డురాగలదాన్నయినా అర్థంచేసుకోకుండా నిరుత్సాహపరిచాయి. మానవునిలో జిజ్ఞాసను, ఆలోచనను ప్రోత్సహించడానికిబదులు ప్రకృతికి, నెలకొనివున్నమతాలయాలకు, చలామణిలోవున్న సాంఘికవిధానానికి, ఉన్నవ్యవస్థకు లొంగిపోయేతత్వాన్ని మతాలు బోధించాయి. మానవాతీతమైన ఒక పరలోకశక్తియే ప్రతిదాన్ని సృష్టించి, నడుపుతోందనేవిశ్వాసం సాంఘికరంగంలో ఒకరకమైన బాధ్యతావిహీనతకు దోవతీసింది, హేతుబద్ధమైనఆలోచన, అన్వేషణలస్థానాన్ని ఆవేశం, ఊహానుభూతీ ఆక్రమించాయి. మతం అసంఖ్యాకమానవాళికి సుఖాన్నిచ్చి, తాను నిర్మించినవిలువలద్వారా సంఘాన్ని సౌష్ఠవపరచినమాట నిస్సందేహమే అయినా, మానవ సంఘంలో సహజసిద్ధంగావుండే మార్పు,పురోగమనధోరణిని అరికట్టింది.

తత్వశాస్త్రం ఈ తప్పటడుగుల్లో ఎక్కువభాగాన్ని తప్పించి, ఆలోచన, జిజ్ఞాసలను ప్రోత్సహించింది కాని, అదికూడా జీవితానికి, దైనందినసమస్యలకు ఎడంగా ఊహాసౌధంలో వుంటూ, అంతిమప్రయోజనాలపైనే దృష్టినికేంద్రీకరించింది గాని, ఆ ప్రయోజనాలను మానవ జీవితంతో కలిపి ఆలోచించలేకపోయింది. తర్కము, హేతువు, తత్వశాస్త్రానికి మార్గదర్శకాలై, దాన్ని అనేకదిక్కుల్లో ఎంతో దూరం తీసుకుపోయాయి. కాని, ఆ తర్కంలోచాలపాలు మేదస్సుచే సృష్టింపబడినదే. దానికి వాస్తవంతో అంతగా సంబంధంలేదు.

విజ్ఞానశాస్త్రం అంతిమప్రయోజనాలను విస్మరించి, వాస్తవము నందుమాత్రమే దృష్టినిలిపింది. అది ప్రపంచాన్ని లంఘించి ముందుకు దూకేట్లుచేసింది, తళతళలాడేనాగరికతను నిర్మించింది, విజ్ఞానాభివృద్ధికి లెక్కలేనన్నిమార్గాలు తెరిచింది. మానవశక్తి నెంతో పెంపొందించి, మానవుడు భౌతికవాతావరణాన్ని జయించి, తనయిచ్ఛవచ్చినట్లు రూపొందించుకోగలడని మొట్టమొదటిసారిగా ఊహించడం సాధ్యం చేసింది. మానవుడు భూగ్రహరూపాన్ని రసాయనికంగా, భౌతికంగా, మరెన్నోవిధాలుగా మార్చివేయగల ఒక భూగర్భశక్తిగా తయారయ్యాడు. అయినా, విచారకరవ్యవస్థలోవున్న యీ విషయాలన్నీ తనచేతిలోచిక్కి, తనహృదయకాంక్షకనుగుణంగా మలచుకోవచ్చునను కునేసరికి, ఏదోఒక ముఖ్యమైన లోపంవున్నట్లు ఒక ముఖ్యమూల పదార్థం లోపించినట్లు కనుపించింది. విజ్ఞానశాస్త్రం జీవితంలో ఏప్రయోజనాన్నిగురించికూడా మనకు చెప్పలేదు. అందువల్ల, అంతిమప్రయోజనాలను గురించినవిజ్ఞానం లేదు. కనీసం తత్క్షణప్రయోజనాలను అవగాహనచేసుకోవడమైనా లేదు. ప్రకృతినివశంచేసుకోవడంలో ఎంతో శక్తివంతుడైన మానవునికి తన్నుతాను అదుపులోపెట్టుకునేశక్తి లేదు. అతడుసృష్టించినభూతం స్వైరవిహారంచేసింది. బహుశా, శరీరశాస్త్రం, మానసికశాస్త్రము అలాంటి ఇతరశాస్త్రాలూ, శరీర, పదార్థవిజ్ఞాన శాస్త్రాల నూతన వ్యాఖ్యానాలూ కలసి, మానవుడు గతంలోకంటె ఇప్పు డెక్కువగా తననుతానర్థంచేసుకునేందుకు, తన్నుతా నదుపులో పెట్టుకునేందుకూ సాయపడవచ్చు. లేక అలాంటి పురోగమనాలు మానవజీవితాన్ని తగినంత ప్రభావితంచేయకముందే, మానవుడు తాను నిర్మించిన నాగరికతను ధ్వంసంచేసి, పునర్నిర్మాణానికి ఘ్రానుకో వలసిరావచ్చు.

విజ్ఞానశాస్త్రానికి పురోగమించే అవకాశం యిస్తే, యిక ఆ పురోగమనానికి కనుచూపుమేరలో పరిమితిఅనేది వుండదు. అయినా, శాస్త్రీయపరిశీలనావిధానం మానవానుభూతుల్లో అన్నిరకాలకూ వర్తింపజేయడం ఎల్లప్పుడూ సాధ్యంకాకపోవచ్చు. ఆ విధానంతో మనచుట్టూ వున్న అంచుతెలియనిసముద్రాన్ని దాటలేకపోవచ్చు. అది తత్వశాస్త్ర సహాయంతో మరికొంచెం ముందుకు పోవచ్చు. ఆఖరుకు యీ మహా

సముద్రాలమీదికూడా లంఘించవచ్చు. ఇక యీ విజ్ఞానశాస్త్రము, తత్వశాస్త్రంకూడా మనకుసహాయపడలేకపోతే, మనకున్న అవగాహన శక్తులమీదనే మనం ఆధారపడాలి. ఎందువల్లనంటే, మనమేధ ఇప్పుడున్నస్థితిలో హేతువాదం ఒకానొకనిర్దిష్టహద్దును దాటిపోలేదనిపిస్తోంది.

హేతుబుద్ధికీ, శాస్త్రీయవిధానానికీ యిలాంటి పరిమితులున్నాయని గుర్తించినా, మనం మనశక్తికొలదీ వాటినంటిపట్టుకునివుండవలసినదే. అటువంటిదృఢమైనపునాది, మద్దతు లేకపోతే మన కేరకమైన సత్యంమీద, వాస్తవంమీద పట్టువుండదు. దేన్నీ అర్థంచేసుకోకుండా నిగూఢవిచిత్రసృష్టిలోనికి చొచ్చుకుపోవాలని గాలిలోసాముచేసి విఫలంకావడంకంటె 'సత్యం'యొక్క కొంతభాగాన్నయినా అర్థంచేసుకుని, దాన్ని మనజీవితాల కన్వయించుకోవడం ఉత్తమం. నేడు అన్ని దేశాలకు, అన్నిజాతులకూ విజ్ఞానశాస్త్రాన్ని అన్వయించుకోవడం అనివార్యము, తప్పనిసరికూడాను. కాని దాన్ని అన్వయించుకోవడంకంటె ముఖ్యఆవశ్యకతఒకటున్నది. అదే శాస్త్రీయదృక్పథం. సాహసోపేతులు, సహేతుకమైనశాస్త్రీయధోరణి, సత్యంకోసం, నవీనవిజ్ఞానంకోసం అన్వేషణ; దేన్నయినాసరే పరీక్షించకుండా, ప్రయోగించిచూడకుండా అంగీకరించకపోవడం; కొత్తబుజువులదృష్ట్యా పాతనిర్ణయాలను మార్చుకునేసామర్థ్యం; ఊహాజనితసిద్ధాంతంమీదగాక ప్రత్యక్షంగాచూచిన వాస్తవంమీదనే ఆధారపడడం, మేధకుకఠినక్రమశిక్షణ, ఇవన్నీ అవసరం. విజ్ఞానశాస్త్రాన్ని ఉపయోగించుకోవడంకోసమే గాదు, జీవితానికీ, దాని అనేకానేకసమస్యలపరిష్కారానికీ కూడా అత్యంతావశ్యకం. శాస్త్రవిజ్ఞానాన్ని ప్రమాణంగా శిరసావహిస్తున్నామనే నేటి శాస్త్రవేత్తల్లో అనేకమంది, తమతమప్రత్యేకరంగాలకుబైట ఆ విజ్ఞానశాస్త్రాన్నే విస్మరిస్తారు. శాస్త్రీయదృక్పథము, స్వభావమనేవి ఒక జీవితపథము, ఒక ఆలోచనాక్రమము, మన తోటివారితో కలసివ్యవహరించే ఒకానొక విధానమూను. ఆ దృక్పథం అలాగే వుండాలి. ఇదంతా తలకుమించిన విధానం. మనలో బహుకొద్దిమంది – అసలెవరైనావుంటే – అయినా యీవిధంగా ప్రవర్తించి, స్వల్పవిజయాన్నైనా పొందలేరు. కాని, యీవ్యాఖ్యానం తత్వశాస్త్రము, మతము మనకు ఆదేశించిన సూత్రాలన్నిటికీ సమంగాగాని, యింతకంటె ఎక్కువగాగాని అనువర్తి

స్తుంది. శాస్త్రస్వభావం మానవుడే మార్గంలో ప్రయాణించాలో చూపిస్తుంది. అది ఒక స్వతంత్రవ్యక్తిస్వభావంలాంటిది. మనం వైజ్ఞానిక యుగంలో వుంటున్నామని చెబుతున్నారు. కాని, ఏదేశప్రజల్లోగాని, కనీసం వారినాయకుల్లోగాని యీధోరణి వున్నసూచన ఈషణ్మాత్ర మైనా లేదు.

విజ్ఞానశాస్త్రం ప్రత్యక్షజ్ఞానంతోమాత్రమే వ్యవహరిస్తుంది. కాని, ఆ శాస్త్రంసృష్టించేస్వభావమాత్రం ఆ జ్ఞానాన్ని దాటిపో తుంది. విజ్ఞానసముపార్జన, సత్యాన్నిగుర్తించడం, మంచితనాన్ని, సౌంద ర్యాన్ని గ్రహించడం మానవుని అంతిమప్రయోజనాలుగా పేర్కొన వచ్చు. ప్రతిఫలాపేక్షతో అన్వేషణాదృష్టిగల శాస్త్రీయవిధానం యిందులో అన్నింటికీ అన్వయించదు. కళ, కవితలకు సంచలించడం, సౌందర్యం సృష్టించే ఆవేశం, అంతరంగంలో మంచితనాన్నిగుర్తించడం వంటి జీవితకీలకశక్తులనేకం పైనపేర్కొన్న శాస్త్రీయవిధానాని కందవని తోస్తుంది. వృక్ష, జంతుశాస్త్రజ్ఞులు ప్రకృతిసౌందర్య, ఆకర్షణానుభూతి నొక్కసారైనా పొందలేకపోవచ్చు. సాంఘికశాస్త్రజ్ఞునిలో మానవ ప్రేమ పూర్తిగా లోపించవచ్చు. కాని, మనం శాస్త్రీయవిధానానికి అందుబాటులోలేని ఆవలిరంగాలకు వెళ్ళి తత్వశాస్త్రంనివసించే పర్వత శిఖరాలను సందర్శించి, ఉన్నతావేశభరితులమైనప్పుడు లేక ఆవలనున్న మహత్త్వాన్ని వీక్షించినప్పుడూ ఆ శాస్త్రీయదృక్పథము, ధోరణి అవసరం.

మతవిధానం యిందుకు పూర్తిగా భిన్నం. అది ముఖ్యంగా లక్ష్యాన్వేషణకు అందుబాటులోలేనిరంగాలతోనే వ్యవహరిస్తూ,ఆవేశం సహజజ్ఞానములమీద ఆధారపడుతుంది. ఆ తర్వాత యీవిధానాన్ని జీవితంలోని ప్రతివిషయానికీ – వైజ్ఞానికాన్వేషణకు, పరిశీలనకు సాధ్య మయ్యేవాటికక్కూడా – అన్వయింపజేస్తుంది. నిర్మాణాత్మకమైనమతం వేదాంతంతో చేతులుకలుపుతుంది. తరచుగా ఆ తత్వంలోగలస్వార్థ శక్తులవల్లే అధికశ్రద్ధ చూపుతుంది గాని, ఆత్మసంబంధమైనవిశేషాల నంతగా లెక్కచెయ్యదు. అందువల్ల మతం విజ్ఞానశాస్త్రసంబంధమైన దానికి పూర్తిగా వ్యతిరేకధోరణిని ప్రోత్సహిస్తుంది. సంకుచితత్వం, అసహనం, అమాయకత్వం, మూఢవిశ్వాసం, ఆవేశపరత్వం, హేతు

విహీనతలను సృష్టిస్తుంది. మతం మానవునిమేధను పరిమితమై, ముకు ళించుకుపోయేటట్లుచేస్తూ, అస్వతంత్ర, పరాధీనస్వభావాన్ని సృష్టిస్తుంది.

"ఒకవేళ దేవుడు లేకపోతే, ఆయన్ని సృష్టించవలసినఅవసరం వున్న"దని వాల్టేర్ చెప్పాడు. అది నిజమేకావచ్చు. నిజానికి మానవమేధ అలాంటిమానసికమూర్తిని, లేక భావనను రూపొందించుకునేందుకు ఎప్పుడూ ప్రయత్నిస్తూనేవుంది. మేదస్సుతోపాటు అదీ పెరిగింది. కాని దీనికి వ్యతిరేకమైనప్రతిపాదనకూడా ఒకటుంది. "దేవుడున్నప్పటికీ, ఆయనవైపే చూడడం, ఆయనమీదనే ఆధారపడడం వాంఛనీయం కాదు." అస్వాభావికమైనశక్తులమీద మరీ ఎక్కువగా ఆధార పడడంవల్ల తరచుగా మానవుడు ఆత్మవిశ్వాసాన్ని కోల్పోవడానికీ అతని సామర్థ్యమూ, సృజనాత్మకశక్తీ మొద్దుబారిపోవడానికే దారితీసింది. అయినప్పటికీ, మనభౌతికప్రపంచానికిఅవలవున్న ఆత్మసంబంధమైనవిశే షాలను విశ్వసించడం, నైతిక, ఆత్మిక, ఆదర్శభావనలమీద ఆధార పడడం అవసరమని తోస్తుంది. లేకపోతే, మనజీవితాలకు చుక్కాని, లక్ష్యం, ప్రయోజనమే వుండవు మనం భగవంతునిపై విశ్వాసంవున్నా లేకపోయినా ఏదోఒకదాన్ని విశ్వసించకపోవడం అసాధ్యం. అలా విశ్వసించేదాన్ని మనం సృజనాత్మకప్రాణశక్తి అనవచ్చు. పదార్థంలో సహజంగా ఒకానొక సంచలనాత్మకశక్తి వుంటుంది, దానికి స్వయంగా సంచలించి, మారి, పెంపొందే సామర్థ్యం వున్నదనవచ్చు. లేక మరో పేరున పిలువవచ్చు. ఆ ఒకానొకవిశేషం – మృత్యువుతోపోల్చినప్పుడు జీవితం సత్యమైనట్లే – యితమిత్థంగా తేలనప్పటికి, పూర్తిసత్యమేనని అనవచ్చు. తెలిసో, తెలియకో మనలో ఎక్కువమందిమి తెలియబడని ఒకానొకదేవుణ్ని అగోచరాలయంలో పూజిస్తూ, బలిదానాలు సమర్పి స్తూనేవున్నాం. ఆ దేవుడొక ఆదర్శమో, వ్యక్తో, జాతో, అంతర్జా తీయమో, మరేదో కావచ్చు. ఆ సుదూరలక్ష్యం మనల్ని బలంగా ఆకర్షిస్తుంది. హేతుబుద్ధికి అందులో ఏరుజువూ కన్పించకపోయినా, ఒక పవిత్రవ్యక్తి, ఒకఉత్తమలోకం అనే అస్పష్టభావనను మన మావిధంగా ఆరాధిస్తాము. పరిపూర్ణత్వాన్ని సాధించడం అసంభవంకావచ్చు. కాని మనలోని ఒకభూతం, ఒకచైతన్యశక్తి మనల్ని ముందుకునెట్టుతూంటుంది. మనం తరతరాలుగా, యుగయుగాలుగా ఆమార్గాన్నే నడుస్తుంటాం.

విజ్ఞానం పురోగమించినకొద్దీ (మతసంబంధమైనరంగం) మతం యొక్క అవధి - మతమనేవదానికి గల సంకుచితార్థంలో - కుంచించుకు పోతుంది. జీవితాన్ని, ప్రకృతినీ మనమెంతఎక్కువగా అర్థంచేసుకుంటే లోకాతీతశక్తులవైపుచూడడం అంత తక్కువౌతుంది. మనం అర్థంచేసుకుని, అదుపులోపెట్టగలదంతా "నిగూఢవిచిత్రం" కాకుండాపోతుంది. వ్యవసాయపద్ధతులు, మనంతినేఆహారం, మనంకట్టేబట్టలు, మనసాంఘిక సంబంధాలు మొదలైనవన్నీకూడా ఒకప్పుడు మతానికీ, మతాచార్యులకు అధీనమైవుండేవి. క్రమంగా అవి ఆ అదుపులోనుంచి తప్పించుకుని, శాస్త్రీయపరిశీలనావిశేషాలయ్యాయి. ఏమైనా, ఇప్పటికీ వీటిలో అనేకం మతవిశ్వాసానికీ, దానినంటివుండే మూఢవిశ్వాసాలకూ లొంగివుంటున్నాయి. అంతిమ నిగూఢవిచిత్రాలనేకం ఇప్పటికీ మానవమేధస్సుకు అందకుండానే వుండిపోయాయి; అవి అలానే వుండిపోవచ్చుకూడాను. కాని, జీవితనిగూఢవిచిత్రాల్లో అనేకం పరిష్కారసాధ్యమే! అవి పరిష్కరింపబడవలసివున్నాయి. చిట్టచివరి నిగూఢవైచిత్రినిగురించి అదేపనిగా ఆలోచించడం అవసరమూకాదు, సమంజసమూ కాదు. జీవితం ఇప్పటికీ ప్రపంచసౌందర్యాన్నేగాక ఎన్నటికీ ఆగిపోని నిత్యనూతనాన్వేషణల సాహసికయాత్రోత్సాహాన్నీ, సువిశాలదృశ్యదర్శనాన్నీ, నూతనజీవితవిధానాల్నీ మనకందిస్తూ, మనజీవితాలను పరిపూర్ణంచేస్తూ ఎప్పటికప్పుడు మరింతసౌభాగ్యం, నిండుదనం చేకూరుస్తోంది.

కాబట్టి, మనం శాస్త్రీయదృక్పథాలను, ధోరణులను తత్వశాస్త్రంతోమేళవించి, మన అవగాహనకందని విశేషాన్ని సముచితంగా గౌరవిస్తూ జీవితాన్నెదుర్కోవాలి. ఆవిధంగా మనం జీవితంపట్ల సమగ్రదృక్పథం ఏర్పరచుకోవాలి. ఆ దృక్పథం గతాన్నీ, ప్రస్తుతాన్నీ, వాటిమిట్టపల్లాలతోసహాపర్యావలోకించగలంతవిశాలమై భవిష్యత్తువైపు ధైర్యంగా చూడగలుగుతుంది. జీవితంలో అనేక అగాధాలున్నాయి; వాటిని విస్మరించలేము. మనచుట్టూవుండే సౌందర్యంప్రక్కనే ఎప్పుడూ ప్రపంచదౌర్భాగ్యంకూడావుంటుంది. మానవజీవితయాత్ర సుఖ,దుఃఖాల విచిత్రమిశ్రమం. మానవుడావిధంగానే నేర్చుకుని, ముందుకుపోగలడు. ఆత్మవేదన విషాదకరము, ఏకాకివ్యవహారం. బాహ్యసంఘటనలు వాటి ఫలితాలు మనపైన ఎంతో ప్రభావంచూపుతాయి. అయినా, మన

ఆంతరంగికభయాలూ, సంఘర్షణలవల్లనే మనమేదస్సులకు బలమైన ఆఘాతాలు తగుల్తాయి. మనం మనగలగాలంటే భౌతికరంగంలో పురోగమించవలసిందే. అలా పురోగమిస్తూనే, మనం మనవ్యక్తిత్వాల తోను, చుట్టునున్నవాటితోను శాంతియుతసంబంధాలు నెలకొల్పు కోవాలి. ఆ శాంతి మన శారీరక, భౌతికఅవసరాలను తీర్చి, తృప్తి నీయడమేగాక, మానవుడు కృషి, భావనారంగాల్లో ఒడుదుడుకుల ప్రయాణంఆరంభించిననాటినుంచీ అతన్ని ప్రత్యేకజీవిగాచేసిన ఆంతరం గికఊహాశక్తుల్నీ, సాహసోత్తేజాలనుకూడా సంతృప్తిపరుస్తుంది. ఆ ప్రయాణానికి ఏదైనా అంతిమప్రయోజనం ఉన్నదో లేదో మనకు తెలియదుగాని, దానికి సముచితప్రతిఫలాలుమాత్రం వున్నాయి. ఆ ప్రయాణం మనంసాధించగలమనిపించే దగ్గరిగమ్యస్థానాన్నిచూపిస్తుంది. ఆ గమ్యస్థానం మరో నూతనపురోగమనానికి ఆరంభస్థానం కావచ్చు.

విజ్ఞానశాస్త్రం పశ్చిమఖండంలో ప్రబలంగా వుంది. అచ్చటి ప్రతివ్యక్తీ దానికి నీరాజనాలిస్తున్నాడు. అయినా, పశ్చిమఖండం వాస్తవమైన శాస్త్రీయదృక్పథాన్ని పొందించుకోడానికి ఇంకెంతో దూరంలోనే వుండిపోయింది. అది ఇంకా ఆతన్కు, శరీరానికి సృజనా త్మకంగా శృతికలుపవలసివుంది. భారతదేశంలో మనం అనేక విస్పష్ట విధానాల్లో ఇంకెంతోదూరం పయనించవలసివుంది. అయినా, మన మార్గంలో పెద్దపెద్దఅడ్డంకు లంతగా వుండకపోవచ్చు. గత అనేకయుగా లుగా భారతీయదృక్పథానికి ముఖ్యపునాది-తరువాతవచ్చినవికృతాలను వదిలేస్తే - శాస్త్రీయధోరణి, దృక్పథాలతోను, అంతర్జాతీయవాదం తోను ఏకీభవిస్తుంది. అది భయంలేని సత్యాన్వేషణమీద, మానవుని దృఢత్వంమీద, ఆఖరుకు జీవంగల ప్రతీదానిలోనూ దైవత్వంవున్నదనే విశ్వాసంమీద, వ్యక్తులూ జీవజాతులూ స్వతంత్రంగా పరస్పరసహకా రంతో పొందడంమీద, ఎప్పటికప్పుడు ఉన్నతస్వేచ్ఛకు, మానవ పురోగమనంతో ఉన్నతోన్నతస్థాయికిచేరడంమీద ఆధారపడివుంది.

## ౧౦ జాతీయభావప్రాముఖ్యత - భారతదేశంలో అత్యవసరమార్పులు

గతాన్ని గ్రుడ్డిగా గౌరవించడం ఎంతచెడ్డదో, దాన్ని ద్వేషిం చడంకూడా అంతచెడ్డదే. ఈ రెండురకాలదృక్పథాలమీదకూడా

భవిష్యత్తు నిర్మింపబడజాలదు. వర్తమానం, భవిష్యత్తూ గతంలోనుంచే జనించి దానిముద్రనుధరించితీరుతాయి. దీన్ని మరచిపోవడమంటే, పునాదులు లేకుండా సౌధాన్ని నిర్మించడం, జాతీయాభివృద్ధి వేరులనే తెగనరకడం ప్రజలను ప్రభావితంచేసే ఒకముఖ్యశక్తిని విస్మరించడంవంటిది...జాతీయవాదముఖ్యలక్షణం గతకాలంలో సాధించినవాటిని, సాంప్రదాయాల్నీ, అనుభవాన్నీ సామూహికంగా గుర్తుంచుకోవడమే. జాతీయవాదం నేడు మున్నెన్నడూ లేనంతబలంగా వుంది. అనేకమంది జాతీయవాద ప్రాబల్యం అంతరించిందనీ, క్షణక్షణం పెంపొందుతున్న ఆధునిక ప్రపంచంలో అంతర్జాతీయధోరణులే యింక ఆ స్థానా న్నాక్రమిస్తాయనీ అనుకున్నారు. శ్రామికవాదం దన్నుగాగల సోషలిజం "జాతీయవాదసంస్కృతి క్షీణిస్తున్న మధ్యతరగతితో బంధింపబడిన విశేష"మని దుమ్మెత్తిపోసింది. పెట్టుబడిదారీవిధానంకూడా సంధులు, సంయుక్త వ్యవస్థలద్వారా జాతీయసరిహద్దులుదాటి, క్రమక్రమంగా అంతర్జాతీయ భావమైపోయింది. వర్తకవాణిజ్యాలు, సులభమైన ఉత్తరప్రత్యుత్తర సౌకర్యాలు, త్వరితరవాణాసౌకర్యాలు, రేడియో, సినిమా మొదలైనవి అంతర్జాతీయవాతావరణం ఏర్పడడానికి దోహదమిచ్చి జాతీయవాదం నశించకతప్పదనే దుర్భ్రమను సృష్టించాయి

కాని, ఎప్పుడే తీవ్రక్లిష్టపరిస్థితి దాపురించినా, తిరిగి జాతీయవాదం తలెత్తి, వాతావణంలో ప్రాబల్యంవహించింది. ప్రజలు తమ ప్రాచీనసాంప్రదాయాలనుంచి తృప్తినీ, బలాన్నీ పొందారు. ఈ యుగపు గణనీయపరిణామాల్లో ముఖ్యమైనది గతవైభవాన్నీ, జాతివిశిష్టతనూ పునర్దర్శించడమే. అంతర్జాతీయచర్యలకు ముందంజవేసే వీరులుగా యెంచబడే శ్రామిక, వ్యవసాయకవర్గాల్లోనే యీవిధంగా జాతీయసాంప్రదాయాలవైపు మళ్ళడం అధికం. యుద్ధమో, అటువంటి క్లిష్టపరిస్థితో ఆ వర్గాల అంతర్జాతీయవాదాన్ని అదృశ్యంచేస్తుంది. దానితో వారు యితరవర్గాలకంటె ఎక్కువగా జాతీయద్వేషాలకూ, భయాలకూ లోనౌతారు. ఇందుకు చేతిఅద్దంవంటి వుదాహరణలు ఇటీవల సోవియట్ యూనియన్‌లో జరిగిన పరిణామాలు. ఆ దేశం ప్రధాన సాంఘికార్థికవ్యవస్థను ఏమాత్రం వదలకుండానే జాతీయవాదదృక్పథాన్నెక్కువచేసుకున్నది. ఇప్పుడు అంతర్జాతీయశ్రామికరాజ్యం కంటె,

పితృభూమియే వారికెక్కువ ఆకర్షణీయంగా వుంది. జాతీయచరిత్రలోని ప్రఖ్యాతవ్యక్తులను తిరుగదోడారు. వారు మళ్ళీ సోవియట్‌ప్రజల ఆరాధ్యవీరు లయ్యారు. ఎదుటివారిను త్తేజపరిచేంతగా యీ యుద్ధంలో సోవియట్‌ప్రజలు సాధించినవిజయాలకు, వారు ప్రదర్శించినబలానికి, ఐక్యతకు కారణా లేమిటి? వారి సాంఘికార్థికవ్యవస్థలేనని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఆ వ్యవస్థలవల్లనే ప్రణాళికాబద్ధమైన ఉత్పత్తి వినిమయాలు జరగడం, విజ్ఞానశాస్త్రము, దానిప్రయోజనాలు పెంపొందడం, నాయికత్వానికిఅవసరమైన నూతననైపుణ్యాన్నీ సామర్థ్యాన్నీ విరివిగా రూపొందించడం, ఉత్తమోత్తమనాయకత్వాన్ని సృష్టించడం మొదలైన బహుముఖసంఘపురోగమనం సాధ్యమైంది. కాని, జాతీయ స్మృతులు, సాంప్రదాయాలు పునరుద్ధరణ, గతాన్ని సరికొత్తగా గుర్తించడం, ఆ గతాన్ని కొనసాగించడమే వర్తమానమనే అనుభూతి కూడా పైనపేర్కొన్న విజయాదులకు కొంతవరకు కారణంకావచ్చును. రష్యాయొక్క యీ జాతీయదృక్పథం ప్రాచీన జాతీయవాదానికి మళ్ళడమేనని భావించడం పొరపాటు. అదెంతమాత్రమూ కాదు. విప్లవంయొక్క మహత్తరానుభూతులు, ఆతరువాతిచరిత్ర మరువలేనివి. తత్ఫలితంగా సాంఘికవ్యవస్థలోను, మానసికదృక్పథంలోను జరిగిన మార్పులు చిరస్థాయికావలసిందే. ఆ సాంఘికవిధానం తప్పకుండా అంతర్జాతీయదృక్పథానికి దోవతీస్తుంది. ఏమైనప్పటికీ, నూతనవాతావరణంలో యిమిడిపోయి, ప్రజాశక్తిని పెంపొందించేవిధంగా జాతీయవాదం పునర్విజృంభించింది.

ఇతర దేశాల్లోనికమ్యూనిస్టుపార్టీలఅదృష్టం రకరకాలుగావుంది. దానితో సోవియట్‌రాజ్యపురోగమనాన్ని పోల్చుకుంటే అనేకసంగతులు తెలుసుకోవచ్చు. సోవియట్‌విప్లవం జరిగినవెంటనే అన్నిదేశాల్లోనూ - ముఖ్యంగా శ్రామికవర్గాల్లో - ప్రథమోత్సాహం వెల్లివిరిసింది. ఆ ఉత్సాహముమ్మురంనుంచి కమ్యూనిస్టుపార్టీలూ, కూటములూ ఉద్భవించాయి. తర్వాత ఈ కూటమిలకు జాతీయకార్మికపక్షాలకు మధ్య సంఘర్షణలు తలెత్తాయి. సోవియట్‌పంచవర్షప్రణాళికలు అమలుజరుగుతూండగా మరోసారి ఇలాంటి సముత్సాహం పెల్లుబికింది. దీనివల్ల శ్రామికులకంటె మధ్యతరగతిమేధావులే ఎక్కువగా

ప్రభావితులయ్యారనుకోవచ్చు. మళ్ళీ సోవియట్ యూనియన్‌లో వీరి వేతలుజరుగుతున్నప్పుడు పై ఉత్సాహం చల్లారింది. అనేకదేశాల్లో కమ్యూనిస్టుపార్టీలు అణచివేయబడ్డాయి; మరికొన్ని దేశాల్లో అవి పెంపొందాయి. కాని, ప్రతిదేశంలోనూ అవి అప్పటికేర్పడివున్న జాతీయశ్రామికసంఘాలతో ఘర్షణపడవలసివచ్చినది. ఇందుకుశ్రామిక వర్గమితవాదధోరణి కొంతవరకున్నా, కమ్యూనిస్టుపార్టీ ఒక విదేశీకూట మికి ప్రాతినిధ్యంవహిస్తున్నదనీ, అది రష్యానుంచే విధానాలను దిగుమతి చేసుకుంటున్నదనీ అనుకోవడం ఎక్కువగానూ కారణం. శ్రామికులు కమ్యూనిజానికి సుముఖులుగావున్నా, వారికి సహజ జాతీయవాదం కమ్యూనిస్టుపార్టీసహకారాన్ని పొందడానికి అడ్డుగా నిలిచింది. సోవి యట్‌విధానలో అనేక మార్పులు రష్యాదృష్ట్యా అర్థంచేసుకోదగిన వైనా, ఇతరదేశాల్లోని కమ్యూనిస్టుపార్టీలు అనుసరించేవిధానాలకు పొంతనలేనివైపోయాయి. ఆ విధానాలమార్పులు రష్యాకుమేలైనది మిగతాప్రపంచానికూడా మేలయినదే అవుతుందనే దృక్పథంతో మాత్రమే అర్థమౌతాయి. ఈ కమ్యూనిస్టుపార్టీలు సమర్థులైన పట్టు దలగల స్త్రీ, పురుషులను సభ్యులుగా కలిగివున్నా, ప్రజలజాతీయ భావాలతో సంబంధాన్ని కోల్పోయి, తత్ఫలితంగా బలహీనమై పోయాయి. సోవియట్ యూనియన్ జాతీయసాంప్రదాయాలతో నూతన సంబంధాలు యేర్పరచుకుంటూండగా, ఈ ఇతర దేశాలకమ్యూ నిస్టుపార్టీలు వాటినుంచి మరింత దూరంకాసాగాయి.

ఇతరదేశాల్లో ఏంజరిగినదో నేను పూర్తిగా తెలిసి మాట్లా డడంలేదు. కాని, భారతదేశంలో కమ్యూనిస్టుపార్టీ ప్రజాహృదయా లను నింపే, జాతీయసాంప్రదాయాలను ఏమాత్రం ఎరుగదనీ, వాటికి పూర్తిగా విడాకులిచ్చినదనీ మాత్రం నాకు తెలుసు. అది కమ్యూ నిజం గతంపట్ల ద్వేషంకలిగివుంటుందని విశ్వసిస్తుంది. దానికిసంబంధించి నంతవరకు ప్రపంచచరిత్ర 1917 నవంబరులోనే ప్రారంభమైంది; అంతకు ముందు జరిగినదంతా ఆ ప్రారంభానికి నాందీప్రస్తావనవంటిదిమాత్రమే. మామూలుగా చెప్పుకోవాలంటే, ప్రజల్లో అధికసంఖ్యాకులు క్షామా నికి సమీపంలోవుండి, ఆర్థికవ్యవస్థ బదాబదలైపోతున్నా భారతదేశం వంటిదేశంలో కమ్యూనిజానికి గొప్ప ఆకర్షణ వుండాల్సింది. ఒక

విధంగా అలాంటి ఆకర్షణ అస్పష్టంగా వుందికూడాను. కాని, కమ్యూనిస్టుపార్టీ జాతీయభావాలనుంచి తెగతెంపులుచేసుకోవడంవల్లను, ప్రజా హృదయాల్లో ప్రతిధ్వనించని మాటలు మాట్లాడడంవల్ల యీ అవకాశాన్ని వినియోగించుకోలేకపోయింది. ఆ పార్టీ శక్తివంతమైన ఒక చిన్న కూటమిలాగా, గట్టివేళ్ళు పాదుకోకుండా వుండిపోతుంది.

ఈవిధంగా భారతదేశంలో విఫలమైనది కమ్యూనిస్టుపార్టీ మాత్రమే కాదు. ఆధునికవాదం, ఆధునికతత్వం, పాశ్చాత్యనాగరికతాసారం అంటూ జోరుగా మాట్లాడుతూ, తమ స్వీయనాగరికతే తెలియనివాళ్ళుకూడా వున్నారు. వీరికి కమ్యూనిస్టులకున్నట్లు, ఒక ఆదర్శంగాని, ముందుకుతీసుకుపోయే చోదకశక్తిగాని లేవు. వీరు పశ్చిమదేశాలబాహ్యరూపాల్నీ, పైకికనుపించేతళతళల్నీ (తరచుగాఏమాత్రం వాంఛనీయంకానిలక్షణాలనుకూడా) ఒరవడిగా తీసుకొని, తామే పురోగమిస్తున్ననాగరికతకు అగ్రగాములుగా భావించుకుంటారు. మిడిమిడిజ్ఞానము, అహంభావమనే దుర్భ్రమలలో మునిగిపోవడం లక్షణాలుగాగలవారు ముఖ్యంగా కొన్నిమహానగరాల్లో వుంటారు. ప్రాక్పశ్చిమాల్లో దేనిసంస్కృతితోనూ సంబంధంలేని వారిజీవితాలు కృత్రిమంగా వుంటాయి.

కాబట్టి, జాతీయపురోగమనం గతాన్ని పునశ్చరణచేయడం మీదగాని, దాన్ని విస్మరించడంమీదగాని ఆధారపడివుండలేదు. నూతనవిధానాలను అనుకరించవలసిందే, కాని, వాటిని ప్రాచీనవిధానాలతో మేళవింపచెయ్యాలి. ఒక్కొక్కసారి నూతనవిధానాలుపూర్తిగా భిన్నమైనవైనా, అంతకుముందున్నవిధానాలవలెనే కన్పించి, గతమే కొనసాగుతూ జరిగినపరిణామా లనిపిస్తాయి. జాతిచరిత్రఅనే పొడవైన గొలుసులో బలమైనలంకె లనిపిస్తాయి; భారతదేశచరిత్ర యీవిధంగా మార్పులుప్రవేశపెట్టబడ్డ గణనీయమైనఉదాహరణ. పురాతనభావాలను మారేవాతావరణానికనుగుణంగా మలచడం, పాతవిధానాలను కొత్తవిధానాలతో మేళవింపజేయడం ఎడతెగకుండా జరిగింది. ఈ కారణంవల్ల అనేకసార్లు మార్పులుజరిగినా, బహుపురాతనమైన మహెంజొదారోకాలంనుంచి నేటివరకు క్రమానుగతపరిణామంవలె, సాంస్కృతికంగా ఏ ఎడబాటూలేని ఎడతెగని చరిత్రవలె తోస్తుంది. గతానికి,

సాంప్రదాయికరూపాలకు గౌరవం వుంది. మేదస్సుకు స్వేచ్ఛ, అనుగుణంగామారే అవకాశం, ఆత్మసహనం వున్నాయి. ఆవిధంగా తరచుగా రూపాలు యథాతథంగావున్నా, అంతరంగం మారుతూనేవుంది. మరే విధంగానూ ఆ సంఘం ఈ వేలాదిసంవత్సరాలు మనగలిగేదికాదు. సజీవ, పురోగామియైనమేదస్సు మాత్రమే సాంప్రదాయికరూపాల కాఠిన్యతను అధిగమించగలదు. ఆ రూపాలుమాత్రమే మేదస్సుకు నిరంతరత్వాన్ని, స్థిరత్వాన్ని యివ్వగలవు.

అయినా, యీ త్రాసు అతిసున్నితం గావచ్చు. ఒకదశ మరొకదాన్ని అధిగమించి, కొంతవరకు దాన్ని అణచివేయవచ్చు. భారతదేశంలో కొన్ని కఠినసాంఘికరూపాలకు సంబంధించినంతవరకు మేదస్సుకు అసాధారణస్వేచ్ఛ వుంది. ఈ రూపాలు చివరికి మానసిక స్వేచ్ఛను ఆకట్టి, సిద్ధాంతరీత్యా గాకపోయినా ఆచరణలో దాన్ని మరింత కఠినము, పరిమితము చేసివేశాయి. పశ్చిమయూరపులో అలాంటి స్వేచ్ఛా లేదు, సాంఘికరూపాల్లో అంత కాఠిన్యతా లేదు. ఈ స్వేచ్ఛకోసం యూరపు సుదీర్ఘవిప్లవం జరిపింది. తత్ఫలితంగా సాంఘికరూపాలుకూడా మారిపోయాయి.

మేదస్సుకు మృదుస్వభావంవుండడం భారతదేశంలోకంటె చైనాలోనే యెక్కువ. దానికి ప్రాచీనసాంప్రదాయాలపట్ల ప్రేమ, గాఢానుబంధం అధికమేఅయినా మేదస్సుమాత్రం ఆవశ్యకమైన సహనాన్నీ, మృదుస్వభావాన్ని కోల్పోలేదు. ఒక్కొకసారి సాంప్రదాయం మార్పులకు జాగుచేసింది. కాని, మేదస్సుమాత్రం పురాతనవిధానాలను వుంచుకుంటూకూడా మార్పులంటే భయపడలేదు. భారతదేశంలోకంటె చైనాలో సంఘం అధికస్థాయీభావాన్నీ, సమపాళాన్నీ నిర్మించుకుంది. అందువల్లనే అది వేలాదిసంవత్సరాలుగా అనేకమార్పులుజరుగుతున్నా మనగలిగింది. చైనాలో ఇతరదేశాల్లోవలెఛాందసత్వంగాని,పరిమితసంకుచితమతదృక్పథంగాని లేకపోవడం; అది హేతుబుద్ధిపైన,లోకజ్ఞానంమీద ఆధారపడడం – ఇవే దానికిగల మహత్తరవిశిష్టావకాశా లనవచ్చును. చైనా మతంమీద ఆధారపడకుండా నీతిమీద, ధర్మసూత్రాలమీదా, మానవజీవితవివిధత్వాన్ని గాఢంగా అవగాహనచేసుకోవడంమీదా

ఆధారపడి, సంస్కృతిని నిర్మించుకున్నది. మరేదేశంలోనూ యిలా జరుగలేదు.

భారతదేశంలో ఆత్మస్వాతంత్ర్యం పూర్తిగా గుర్తించబడడం వల్ల - ఆచరణలో అదెంతపరిమితమైనా - నూతనభావాలు నెట్టివేయబడలేదు. జీవితంమీద మరెంతో కఠిన, ఛాందసదృక్పథంవున్న దేశాల్లో కంటె, భారతదేశంలో నూతనభావాలను దీర్ఘంగా పరిశీలించడానికీ, ఆమోదించడానికీ ఎక్కువ అవకాశం వుండేది. భారతీయసంస్కృతి మూలాదర్శాలు విశాలమైనపునాదులు కలిగివున్నందువల్ల వాటిని దాదాపు ఎలాంటి వాతావరణానికైనా అనుగుణ్యంగా మలచుకోవచ్చు. యూరపును 19 వ శతాబ్దంలో కుదిపివేసిన తీవ్రసంఘర్షణకు (విజ్ఞానశాస్త్రానికీ, మతానికీమధ్య) భారతదేశంలో వాస్తవికత లేదు. విజ్ఞానశాస్త్రాధారంతో చేయబడేమార్పులు కూడా భారతీయాదర్శాలతో సంఘర్షణను రేకెత్తించలేవు. అటువంటిమార్పులు సహజంగా భారతదేశాన్ని సంచలింపజేసేమాట నిస్సందేహమే. కాని, భారతదేశం అలాంటిమార్పులతో సంఘర్షించేబదులు, లేక వాటిని నిరాకరించేబదులు తన ఆదర్శసూత్రాలదృక్పథంతో వాటిని ఆచరణీయంచేసి, తన మానసికచట్రంలో యిముడ్చుకుంటుంది. ఇలాంటిపరిణామం జరిగేటప్పుడు పురాతనదృక్పథంలో అనేక ముఖ్యమార్పులు జరగడం సంభవమే. అయితే, అవి బైటనుంచి రుద్దబడినట్లుగాక, ప్రజల సాంస్కృతికఆధారాలనుంచి సహజంగా ఉద్భవించినట్లు కన్పిస్తాయి. ఇట్టిది లోగడకంటె యిప్పుడు మరింత కష్టసాధ్యపరిణామం. ఎందువల్లనంటే, భారతదేశాభివృద్ధి చిరకాలంగా నిరోధింపబడి మహత్తరమైన గొప్పమార్పులు జరుగవలసిన తత్క్షణావసరం యేర్పడింది.

మన ప్రాథమికాదర్శాలచుట్టూ పై నిర్మాణం పెంపొంది, నేడు మనకు ఉపిరాడకుండాచేస్తున్నది. ఏది ఏమైనప్పటికీ, ఆ బాహ్యానిర్మాణంతో సంఘర్షణమాత్రం అనివార్యం. ఆ బాహ్యానిర్మాణం చాలవరకు చెడ్డదేగాక, ఈ యుగాంతర్యానికి వ్యతిరేకమైనదికూడా గనుక, అది నశించకతప్పదు. దాన్ని అదేవిధంగా వుంచగోరువారు మంచినీ, చెడునూ మిశ్రమంజేసి, మంచికి ప్రమాదంవాటిల్లేటట్లుచేస్తారు. గనుక, భారతసంస్కృతియొక్క ప్రాథమికాదర్శాలకే ద్రోహంచేసినవారౌ

తారు. మంచికీ, చెడ్డకూ మధ్య ఒక కచ్చితమైన శాశ్వతసరిహద్దురేఖను గీయడం, రెంటినీ వేరుచేయడం అంతసులభంగాదు. ఈ విషయంలో ప్రజాభిప్రాయాలు భిన్నంగావుంటాయి. కాని, మనం అలాంటిరేఖను సిద్ధాంతరీత్యాగాని, హేతువాదరీత్యాగాని గీయవలసిన అవసరంలేదు. మారే జీవితహేతువూ, సంఘటనలపురోగతే క్రమక్రమంగా అలాంటి రేఖను గీసిపెడతాయి. ఏరకమైన పురోగమనమైనా-సాంకేతికంగాని, తాత్వికంగాని-జీవితంతో, సాంఘికావసరాలతో, ప్రపంచసజీవోద్యమాలతో సంబంధాలుంచుకోవలసినఅవసరాన్ని కలిగిస్తుంది. అలాంటి సంబంధాలు లేకపోతే స్తబ్ధతయేర్పడి చేతనశక్తి సృజనాత్మకశక్తి నశిస్తాయి. కాని, మనం యీసంబంధాలు నెలకొల్పుకుంటూ, ఆమోదిస్తూవుంటే, మనం అమూల్యంగాభావించే ముఖ్యలక్షణాలను కోల్పోకుండానే జీవితపుమళుపులకుఅనుగుణంగా మనల్నిమనం సరిదిద్దుకోగలం.

గతంలో మనం విజ్ఞానంపట్లచూపినదృక్పథం సమగ్రమైనది. కాని, అది భారతదేశానికే పరిమితం. ఆ హద్దు కొనసాగి, సమగ్ర దృక్పథంస్థానే క్రమంగా ప్రత్యేక భిన్నదృక్పథం పెంపొందింది. ఇప్పుడు మనం సమగ్రదృక్పథంపైనే ఎక్కువ శ్రద్ధజూపి, ప్రపంచమంతటిని మన పరిశీలనారంగంగా చేసుకోవాలి. అనేకమందిప్రజలు చాలాకాలంగా సంకుచితాలోచనా, కృషిపరిధుల్లో నివసిస్తున్నారు. ఏ జాతిగాని, ఏ వ్యక్తిగాని ఆ సంకుచితపరిధుల నధిగమించి పురోగమించాలంటే, పైన జెప్పినట్లు సమగ్రదృక్పథంపట్ల ఎక్కువ శ్రద్ధజూపక తప్పదు. విజ్ఞానశాస్త్రాభివృద్ధి, దానిప్రయోగములవల్ల మన కట్టి శ్రద్ధజూపడం సాధ్యమైంది. కాని, నూతనవిజ్ఞానం మితిమీరి ఈ శ్రద్ధజూపడాన్ని కష్టప్రదంచేసిందికూడాను. ప్రత్యేకత సాధించడంవల్ల వ్యక్తిజీవితం ఒకానొకగాడికే సంకుచితమైపోయింది. పరిశ్రమల్లో ఒకవ్యక్తిచేసేకృషి మొత్తంవస్తువులో అత్యల్పభాగానికి మాత్రమే పరిమితమైపోయింది. విజ్ఞానంలోను, పనిలోను ప్రత్యేకకృషి కొనసాగవలసిందే. అయితే, మానవజీవితాన్నీ, యుగయుగాలుగాచేస్తున్న మానవుని తెగింపును సమగ్రదృక్పథంతో చూడడాన్ని లోగడకంటె ఇప్పుడెంతో ఎక్కువగా ప్రోత్సహించవలసివున్నదనిపిస్తోంది. ఈ దృక్పథం గతాన్నీ, ప్రస్తుతాన్నీ

కూడా దృష్టిలోవుంచుకొని, తనఆలోచనాపరిధిలో అన్నిదేశాల్నీ, అన్నిజాతుల్నీ యిముడ్చుకోవాలి. ఈవిధానం అవలంబించడంద్వారా మనం స్వీయజాతీయపూర్వరంగాలు,సంస్కృతులతోపాటు ఇతరదేశాల ప్రజలనుఅర్థంచేసుకొని, సహకరించేశక్తినికూడా పెంపొందించుకోవచ్చు. ఆవిధంగా నేటి వికృతవ్యక్తులకు మారుగా పరిపూర్ణవ్యక్తిత్వాలను నిర్మించుకోవడంలో కొంతవరకు కృతకృత్యులంకావచ్చు. ప్లేటో మాటల్లో "అన్నికాలాలను, అందువ్యక్తుల్నీ చూచే ప్రేక్షకులం" కావచ్చు. ఆవిధంగా మానవాళి ప్రోగుచేసివుంచిన భాగ్యరాసులన్నింటి నుంచీ మూలబలాన్ని పొందుతూ, వాటిని పెంపొందించుకుంటూ, భావినిర్మాణానికి వాటిని ఉపయోగించుకోవచ్చు.

ఆధునికవిజ్ఞానశాస్త్రం ఎంతో అభివృద్ధిచెంది, అంతర్జాతీయతనుగురించి మాట్లాడుతున్న గతచరిత్రలోని ఏకాలంతో పోల్చుకున్నా నేటికీ జాత్యహంకారం, తదితరవిచ్ఛిన్నకరలక్షణాలూ — అంతకంటె అధికంగాకపోయినా - ముమ్మరంగా కనిపిస్తూనేవున్నాయి. ఇది పరిశీలనాత్మకంగా గణించదగ్గ విశేషం. నేటిపురోగమనంలో ఏదో లోపించివుంటుంది. ఈ పురోగమనం జాతులమధ్యగాని, మానవుని ఆత్మలోగాని ప్రశాంతిని సృష్టించలేకపోతోంది గతం మానవజాతి అనుభవాలకూడిక మాత్రమే. అలాంటిగతంయొక్క విజ్ఞానంపట్ల కొంత నమ్రత, గౌరవభావమూ, ఎక్కువ సమన్వయభావమూ వుంటే, మనం నూతనదృక్పథాన్ని, ఉన్నతప్రశాంతినీ పొందడం సులభంకావచ్చును. అలాంటిది, గతాన్ని పూర్తిగా మరచిపోయి, వర్తమానంలో మాత్రమే జ్వరగ్రస్తులంత వేగిరపాటుతో బ్రతికే ప్రజలకు మరింతఅవసరం కాని, భారతదేశంవంటిదేశాలకు మరొకరకమైన ప్రత్యేకశ్రద్ధ అవసరం మనం ప్రస్తుతాన్ని విస్మరించి, గతంతో కావలసినంత సంబంధాల నేర్పరచుకున్నాం. ఇవి ప్రపంచాన్నీ, మనల్ని మనం అర్థంచేసుకోనీయకుండా అడ్డగించే సంకుచిత మతదృక్పథాన్నీ, లోకాతీత పారలౌకిక ఊహాసౌధాలభ్రమల్లో మునిగిపోవడాన్నీ. ఆత్మనిగ్రహాన్ని మతసంబంధక్రతుతంతుల్లోసడలించడాన్నీమనంవదిలెయ్యాలి. వర్తమానంతో, యీ జీవితంతో, యీ ప్రపంచంతో, తన అనంత వైవిధ్యంతో మనచుట్టూ ఆవరించివున్న యీప్రకృతితో ముఖాముఖి

పోరాడాలి. కొందరుహిందువులు మనం తిరిగి వేదకాలానికి వెళ్ళాలం టారు. కొందరుముస్లిములు ఇస్లాంధర్మపాలనగురించి కలలుగంటారు. ఇవి సోమరిపోతుల ఊహలు. వెనక్కిమళ్ళడం వాంఛనీయమనుకున్నా సరే, గతంలోకి వెళ్ళడమనేది లేదు. ఇప్పుడు ప్రయాణం ఒక్కవైపుకే.

అందువల్ల భారతదేశం తన మతధోరణి తగ్గించుకొని, విజ్ఞాన శాస్త్రంవైపు మళ్ళాలి. దానికి ఖైదుగాతయారై, దానిఆత్మను స్తబ్ధ చేసి, అభివృద్ధి నాటంకపరుస్తున్న ఆలోచనలోను సాంఘికాచారాల లోను మడిగట్టుకున్నట్లుండే - ఏకాకితనాన్ని విడనాడాలి. మతాచా రాల పవిత్రభావన సంఘంలో వివిధవర్ణాలు కలుపుగోలుగావుండ కుండా అడ్డుగోడలు నిర్మించింది; సాంఘికకార్యకలాపాలరంగాన్ని సంకుచితంచేసింది. ప్రాచీనసాంప్రదాయాలుపాటించే హిందువు దైనం దినజీవితంలో అనుష్టించేమతం ఏం తినాలి, ఏం తినరాదు. ఎవరితో కలిసితినాలి, ఎవరికి దూరంగావుండాలి మొదలైనవాటితోనే సతమత మవుతుంది గాని, ఆత్మసంబంధమైన విలువలను అంతగా పట్టించు కోదు. అతనిసాంఘికజీవితాన్ని వంటయింటి నిబంధనలే శాసి స్తాయి. ముస్లిముకు ఇటువంటిఛాందసాభిప్రాయాలు లేకపోవడం అదృ ష్టమే కాని, అతనికీ కొన్నిసంకుచిత నియమనిబంధన లున్నాయి. వాటి నాతడు నిత్యానుష్ఠానములుగా శిరసావహిస్తూ తనమతంనేర్పిన సౌభ్రా తృత్వాన్నిమర్చిపోతాడు. బహుశా, జీవితంపట్ల హిందువునిదృక్పథం కంటె, ముస్లిందృక్పథం మరింత సంకుచితంగా, నిర్జీవంగా ఉంటుంది. నేటి సామాన్యహిందువుడు సాంప్రదాయసిద్ధమైన భావస్వాతంత్ర్యాన్ని, జీవితాన్ని అనేకవిధాలుగా సౌభాగ్యవంతంచేసే అనుభూతుల్ని కోల్పో యాడు. అందువల్ల అతడు హిందూమతానికి ప్రతినిధిగా పరిగణించ దగడు.

హిందువుల యీ ఏకాకితనానికి చిహ్నము, రూపమూ కులమే. కులాల మూలాదర్శం అలాగే వుండవచ్చుననీ, తరువాత ఏర్పడిన ప్రమాదకరపరిణామాలుమాత్రం పోవాలనీ, పుట్టుకనుబట్టిగాక, సామ ర్థ్యాన్నిబట్టే కులవిచక్షణ జరగాలనీ అప్పుడప్పుడు చెప్పబడింది. ఈ దృక్పథం అసంబద్ధమైనది. ఇది అసలుసమస్యను తికమకల్లోపెడు తుంది. చారిత్రకపరిశీలనల్లో కులాలపెంపుకు కొంత విలువ వుంటుంది.

కాని, మనం ఆ కులాలు ప్రారంభమైనకాలానికి తిరిగివెళ్ళలేము. నేటి సాంఘికవ్యవస్థలో కులానికి తావులేదు. సామర్థ్యాన్నే విశిష్టలక్షణంగా పరిగణించి, ప్రతిఒక్కరికీ అవకాశాలివ్వబడితే, ఇప్పుడు కులాలకున్న ప్రత్యేకలక్షణాలన్నీ నశిస్తాయి. అసలు కులాలే అంతమౌతాయి. గతంలో కులాలు కొన్నివర్గాలను అణచివేసేందుకు దోవతీయడమే గాక నిర్మాణకౌశల్యంనుంచి సిద్ధాంత, పాండిత్యవిద్యల్ని వేరుచేశాయి. వాస్తవజీవితంనుంచి, దానిసమస్యలనుంచి తత్వశాస్త్రం విడాకులుపుచ్చుకునేటట్లుచేశాయి. కులవ్యవస్థ సాంప్రదాయవాదంమీద ఆధారపడ్డ అహంభావదృక్పథం. ఈ దృక్పథం ఆధునికపరిస్థితులకు, ప్రజాస్వామ్యాదర్శానికీ పూర్తిగా వ్యతిరేకంగనుక, అది పూర్తిగా మారిపోవలసిందే. భారతదేశంలో ప్రయోజనకరంగా (వృత్తిరీత్యా) నెలకొనివున్న సాంఘికవర్గాలు అలాగే కొనసాగవచ్చు. కాని, ఆధునికపరిశ్రమలు క్రొత్తప్రయోజనాలను(వృత్తుల్ని)సృష్టించి,అనేకపాతవృత్తుల్ని ముగింపజేసేప్రకృతిగలవి గనుక – ఆ వృత్తిప్రధానవర్ణాలుకూడా ఎంతో మారిపోవాలి. నేడు ప్రతిదేశంలోనూ, సాంఘికవ్యవస్థలోవృత్తి,ప్రయోజనాలనుబట్టి వర్ణాలనుపేర్కొనేధోరణి హెచ్చుతూ, ప్రత్యేకహక్కులస్థానే వృత్తిప్రయోజనాలకే ప్రాముఖ్యత లభిస్తోంది. ఇది ప్రాచీన భారతీయాదర్శంతో చక్కగా మేళవిస్తుంది.

ఈ యుగాత్మ సర్వసమానత్వానికి సుముఖంగా వుంది. దాదాపు ప్రతిదేశంలోనూ ఆచరణలో యిట్టిది జరుగడంలేదనేది వేరే విషయం. ఒకమానవుడు మరొకవ్యక్తియొక్క ఆస్తి అనే సంకుచితార్థంగల బానిసత్వాన్ని మనం వదిలించుకున్నాం. కాని, పాతదానికంటే అనేకవిధాల చెడ్డదైన ఒక నూతనబానిసత్వం ప్రపంచమంతటా యేర్పడింది. వ్యక్తిస్వాతంత్ర్యమనేసాకుతో రాజకీయార్థికవ్యవస్థలు మానవాళిని దోపిడీచేస్తూ, వారిని వర్తకపుసరకులాగా చూస్తున్నాయి. అంతేగాదు, ఒకవ్యక్తి మరోవ్యక్తియొక్క ఆస్తి కాకపోయినా, ఒకజాతి మరోజాతికి ఆస్తిగావుండడం సంభవిస్తోంది. ఆవిధంగా సామూహికబానిసత్వం చలామణిలో వుంది. మనకాలంలో జాత్యహంకారం కూడా ఒక ప్రత్యేకరూపం దాల్చింది. మన కిప్పుడు యజమానిదేశాలేగాక, యజమానిజాతులు కూడా వున్నాయి.

అయినా, యుగాత్మ జయించితీరుతుంది. ఏదిఏమైనా, భారత దేశంలో మనం సర్వసమానత్వాన్నే లక్ష్యంగాపెట్టుకోవాలి. అంటే, ప్రతివ్యక్తీ శారీరకంగా, వైజ్ఞానికంగా, ఆత్మసంబంధంగా ఎదుటివాడితో సమానమని కాని, అలా చేయబడగలడనికాని కాదు. కాని, దాని అర్థం అందరికీ సమానావకాశాలనీ, ఏవ్యక్తికీగాని, ఏవర్గానికిగాని రాజకీయార్థికసాంఘికఅడ్డంకు లుండవని. అంటే, మానవత్వంమీద విశ్వాసముంచడం, అవకాశమివ్వబడితే ఏ జాతియైనా, ఏ వర్ణమైనా తనవిధానంలో పురోగమించి, ఉత్తమపథాన్ని చేరుకోగలదనీ విశ్వసించడమే. ఒకవర్గం వెనుకబడి, నీచస్థితిలోవుండడానికికారణం దానికి జన్మతఃసంక్రమించినలోపంవల్లకాదనీ, ముఖ్యంగా అవకాశాలుయివ్వకపోవడంవల్లను ఇతరవర్గాలు అణచడంవల్లనే అలావున్నాయనీ గుర్తించడమన్నమాట. ఆధునికప్రపంచంలో వాస్తవపురోగమనము, అభివృద్ధి-జాతీయమైనా, అంతర్జాతీయమైనదైనా అందరికీ సంబంధించినదిగా అర్థంచేసుకోవడమే సర్వసమానత్వం. వెనుకబడివున్నవర్గం మిగతాఅందర్నీ వెనక్కులాగి పడుతుంది. అందువల్ల, అందరికీ సమానావకాశాలు కలిగించడమేగాక, వెనుకబడియున్నవారికి విద్య, ఆర్థిక, సాంస్కృతికపురోగమనాలకై ఎక్కువఅవకాశాలు కలిగించి, ముందున్నవారితో కలిసేటట్లు చెయ్యాలి. భారతదేశంలో ఆవిధంగా అందరికీ అవకాశద్వారాలు తెరచేందుకు ఎటువంటి ప్రయత్నం జరిగినా నిద్రాణమైవున్న మహత్తర శక్తిసామర్థ్యాలు పెల్లుబికి, దేశాన్ని ఆశ్చర్యకరమైనంతవేగంగా మార్చివేయగలవు.

యుగచైతన్యం సర్వసమానత్వాన్ని వాంఛించినట్లయితే అది ఆ విధానంలోయిముడగల ఆర్థికవిధానాన్నికూడా వాంఛిస్తూ, ప్రోత్సహించకతప్పదు. నేటిభారతదేశంలోనివలసవిధానం ఇందుకు పూర్తిగా వ్యతిరేకం. నిరంకుశాధిపత్యం అసమానత్వాన్ని ఆధారంగాచేసుకోవడమేగాక, జీవితంలోని ప్రతిరంగంలోను అసమానత్వాన్ని నిరంతరాయంగా కొనసాగిస్తుంది. అది జాతియొక్క సృజనాత్మక, పునర్నిర్మాణాత్మక శక్తుల్ని అణచివేస్తుంది. ప్రజ్ఞ, సామర్థ్యాలను నిర్బంధిస్తుంది. బాధ్యతాచైతన్యాన్ని నీరుగార్చివేస్తుంది. దాని ఆధిపత్యాన్ని శిరసావహించవలసినవారు ఆత్మగౌరవం, విశ్వాసాలన్ను కోల్పోతారు. భారతదేశ

...స్యలు ఎంత చిక్కైనవిగా కనుపించినా, రాజకీయార్థికవ్యవస్థను దాదాపు యథాతథంగానే వుంచి, పురోగమించాలని ప్రయత్నించడం వల్లనే అట్టిసమస్యలు యేర్పడ్డాయి ఇప్పుడున్నవ్యవస్థను, స్వార్థప్రయోజకవర్గాలను యథాతథంగావుంచితేనే రాజకీయపురోగమనం సాధ్యమౌతుందనేస్థితి కల్పించబడింది.

రాజకీయంగా మార్పురావలసిందే, కాని, ఆర్థికంగాకూడా అంతమార్పూ అవుసరం. ఆ మార్పు ప్రజాస్వామికంగా ప్రణాళికాబద్ధం చేయబడ్డ సాంఘికవాదానికి సుముఖంగా వుండాలి. ఆర్. హెచ్. టానే "మనం ఎన్నుకోవలసినది పోటీ, గుత్తాధికారాల్లో ఒకదాన్ని కాదు. బాధ్యతలేనివ్యక్తుల గుత్తాధికారం, బాధ్యతాయుతమైన ప్రజాప్రభుత్వ గుత్తాధికారం—ఈ రెండింటిలోనే ఒకదాన్ని ఎంచుకోవాలి" అన్నాడు. ఆఖరుకు పెట్టుబడిదారీదేశాల్లోకూడా ప్రజాప్రభుత్వగుత్తాధికారాలు పెంపొందుతున్నాయి, ఇంకా పెంపొందుతూనేవుంటాయి. అట్టివాటి వెనుకగల ముఖ్యోద్దేశానికీ, వ్యక్తులగుత్తాధికారానికీ మధ్యగల సంఘర్షణ రెండోది సమూలంగా నాశనమయ్యేవరకు కొనసాగుతూనే వుంటుంది. ప్రజాస్వామికఏకత్వం వ్యక్తిగతఆస్తిని నిషేధించనవసరంలేదు. ప్రాథమిక, భారీపరిశ్రమలు ప్రజల(ప్రభుత్వ)పరం కావడమే దానిమూలాశయం. భూమిని సహకారపద్ధతి లేక సామూహిక అజ్మాయిషీ చేయాలనడమే దానిఅర్థం. ప్రత్యేకంగా భారతదేశంలో భారీపరిశ్రమలకు తోడుగా సహకారపద్ధతిని నడుపబడే లఘు, గ్రామీణపరిశ్రమలుకూడా వుండవలసినఅవుసరం వుంది. అలాంటి ప్రజాస్వామికసంఘవిధానంలో నిరంతరప్రణాళికలు జాగ్రత్తగా అమలుజరగాలి. ప్రజావసరాలమార్పు కనుగుణంగా విధానాలు మారుతూండాలి. దేశంయొక్క ఉత్పత్తిసామర్థ్యాన్ని సాధ్యమైన అన్నివిధాలా పెంపొందించడం, ఏదోఒకకృషిలో దేశంలోని శ్రామికశక్తులన్నింటినీ యిముడ్చుకోవడం, నిరుద్యోగాన్ని నిరోధించడం లక్ష్యంకావాలి. సాధ్యమైనంతవరకు వ్యక్తికి ఇచ్చవచ్చిన వృత్తిని స్వీకరించే స్వాతంత్ర్యం వుండాలి. ఇవన్నీ ఆచరించబడినా, వ్యక్తులఆదాయాల్లో సమానత్వం యేర్పడదు. కాని, నేటికంటెఎక్కువ సమంగా ఉత్పత్తులలోపాలుపంచుకోవడం జరిగి, అన్నిరంగాల్లోను సర్వసమానత్వం నెలకొనేందుకు తగుధోరణి ప్రబలుతుంది. ఏదిఏమైనా,

నేడున్న విపరీతమైన తేడాలు పూర్తిగా అదృశ్యమైపోతాయి. – వ్యత్యాసాలపై ఆధారపడిన వర్గవిభేదాలుకూడా అదృశ్యంకానారంభిస్తాయి.

ముఖ్యంగా లాభదృష్టితోనే నిర్మాణమైన సంపాదనాలక్ష్యం గల నేటి సంఘం పైమార్పులవల్ల పూర్తిగా తలక్రిందులౌతుందన్న మాట. అప్పటికీ, కొంతవరకు లాభదృష్టి కొనసాగుతూనే వుండవచ్చు. కాని, దానికి నేడున్నంత ప్రేరణాధిక్యతగాని, అవకాశంగాని వుండవు. సామాన్యభారతీయుడిని లాభోద్దేశం ఆకర్షించదనడంలో అర్థంలేదు. కాని, దానికి పాశ్చాత్య దేశాల్లోవున్నంత ఆధిక్యత భారత దేశంలో లేదనడంమాత్రం సత్యం. మన దేశంలో ధనవంతుని జూచి, అసూయపడవచ్చుగాని, అతన్ని ప్రత్యేకంగా గౌరవించడం, పొగడడం మాత్రం వుండదు. కీర్తి, గౌరవాలు మంచివారు, విజ్ఞానులని మెంచబడే స్త్రీ, పురుషులకు, తమనుతాముగాని, తమకున్న దానినిగాని ప్రజా శ్రేయస్సుకై త్యాగంచేసినవారికీ లభిస్తున్నాయి. భారతీయదృక్పథం – ప్రజాసామాన్యందృక్పథంకూడా – సంపాదనోద్దేశాన్ని ఎన్నడూ సమర్థించలేదు.

సమిష్టివాదం ఆచరింపబడాలంటే సహకారకృషీ సామూహిక బాధ్యత అవసరం. సంఘశ్రేయస్సునే దృష్టిలోపెట్టుకుని నిర్మింపబడిన ప్రాచీనభారతీయసాంఘికాశయాలూ, యీ సమిష్టివాదం ఏ ఘర్షణ లేకుండా, చక్కగా మేళవిస్తాయి. బ్రిటిష్‌పాలనక్రింద సంఘప్రాధాన్యం గల విధానాలు ముఖ్యంగా గ్రామీణస్వయంపాలన బాగా దెబ్బతిని పోయి, భారతప్రజానీకానికి ఆర్థికంగాకంటె, మానసికంగా తీవ్రమైన హానికలిగింది. దానిస్థానే మరే ప్రత్యామ్నాయవిధానమూ అమల్లోకి రాలేదు. అవి స్వాతంత్ర్యం, బాధ్యతాప్రేరణ, సంఘప్రయోజనార్థం ఇతరులతోసహకరించేసామర్థ్యం కోల్పోయాయి. సజీవంగా, కళకళ లాడుతూవుండేగ్రామం క్రమక్రమంగా నిర్లక్ష్యంచేయబడి, కొన్ని మట్టి గుడిసెలూ, కొందరు వికృతిచెందినవ్యక్తులూగల ప్రదేశంగా మారి పోయింది. అయినా, ఒక అదృశ్యసంబంధం ఇప్పటికీ గ్రామాన్ని ఒక ప్రత్యేకసంఘంగా నిలబెడుతూనేవుంది. ప్రాచీనస్మృతులను తిరుగదోడు తోంది. యుగయుగాలుగా వున్న యీ సాంప్రదాయాలను సద్వి

నియోగంచేసుకుని భూములకూ, లఘుపరిశ్రమలకూ సమిష్టి, సహకారసంఘాలను నిర్మించడం సులభసాధ్యమే. గ్రామం ఇక నెన్నటికి స్వయంసమృద్ధమైన ప్రత్యేకభాగం (అది ఒక సహకారసంఘానికో, సమిష్టిక్షేత్రానికో బంధింపబడివున్నా) కాజాలదు. కాని, అది ప్రభుత్వానికీ, ఎన్నికలకూ ఒక ప్రత్యేకప్రాతిపదిక మాత్రం కాగలదు. అలాంటి ప్రతిగ్రామము దేశరాజకీయచట్రానికి లోబడిన స్వయంపరిపాలనతో, గ్రామంయొక్క అత్యవసరాలను తీర్చేదిగా వుండవచ్చు. ఎన్నికలకు గ్రామాన్ని ప్రాతిపదికగాతీసుకుంటే, రాష్ట్ర, కేంద్రసభలకు ఎన్నికలుజరగడం సులభతరమవుతుంది. సరాసరి ప్రజలందరూ ఎన్నికల్లోపాల్గొనే అవసరం వుండదు. గ్రామంలోని వయోజనులందరూ కలసి ఎన్నుకునే ప్రతినిధులే అంతకుపైసంఘాల ఎన్నికల్లో ఓటుచేస్తే సరిపోతుంది. ఈవిధంగా పరోక్షంగాజరిగేఎన్నికలవల్ల కొన్నిదుష్ఫలితాలు కలుగవచ్చు. కాని, భారతదేశచారిత్రకదృష్ట్యా గ్రామాన్ని ఒక ప్రత్యేకప్రాతిపదికగాచేసుకోవడం అవసరమని నా దృఢవిశ్వాసం. అది మరింత వాస్తవమైన, బాధ్యతాయుతమైనప్రాతినిధ్యాన్నిస్తుంది.

ఈవిధంగా ప్రాంతీయప్రాతినిధ్యంతోపాటు భూముల, లఘుపరిశ్రమల సహకారసంఘాలనుంచీ, సమష్టిక్షేత్రాలనుంచీ కూడా సరాసరి ప్రాతినిధ్యం వుండాలి. ఆవిధంగా వృత్తులకు, ప్రాంతాలకుకూడా ప్రాతినిధ్యం లభించి, ప్రాంతీయ స్వయంపరిపాలనమీద ఆధారపడే దేశీయ ప్రజాస్వామ్యవ్యవస్థ యేర్పడుతుంది. అటువంటియేర్పాటు భారతదేశగతచరిత్రకు, ప్రస్తుతావసరాలకు కూడా చక్కగా అతికిపోతుంది. మధ్యలో ఏదో అగాధం యేర్పడిందనేభావం బ్రిటిష్‌పాలనవల్ల యేర్పడిన పరిస్థితుల్లోతప్ప ఉండదు. ప్రజానీకం తా నిప్పటికీ గుర్తుంచుకొని, అమూల్యంగా భావిస్తున్న ప్రాచీనతే కొనసాగింపబడుతున్నదని భావిస్తుంది.

భారతదేశంలో జరిగే అలాంటిపరిణామం రాజకీయార్థిక అంతర్జాతీయవాదంతో చక్కగా మేళవిస్తుంది. అది ఇతరదేశాలతో సంఘర్షణలను ప్రేరేపించదు; ఆసియాలోను, ప్రపంచంలోను శాంతిని నెలకొల్పేందుకు గణనీయమైనకృషిచేస్తుంది. వ్యామోహాలు మనకు దుర్భ్రమలు కల్గించినా, మనం దాన్ని అర్థంచేసుకోలేకపోయినా, లోకధోరణి

మనల్ని వసుధైకకుటుంబంవైపే నడుపుతుంది. పైనపేర్కొన్న పరిస్థితులేర్పడితే భారతదేశం యీ ఆదర్శాన్ని సులభసాధ్యం చేస్తుంది. భారతప్రజలు దారుణహానిసత్వం, నిరాశలనుంచి విముక్తులై, మళ్ళీ తమ ప్రతిష్ఠను పెంపొందించుకుని, సంకుచితజాతీయతత్వాన్నీ, ఏకాకి తనాన్నీ వదలివేస్తారు. తమ భారతీయసంస్కృతీవారసత్వానికి గర్విస్తూ, ఇతరప్రజలకు జాతులకు, తమ మానసిక, హృదయకవాటాలను తెరచి ఆకర్షణీయమైన యీ విశాల ప్రపంచపౌరులై, తమ తాతముత్తాతలు దారితీసిన ఆ ప్రాచీనాన్వేషణలో ఇతరులతోపాటు ముందంజవేస్తారు.

## ౧౧ భారతదేశం: విభజనయా, బలమైనజాతీయప్రభుత్వమా, లేక కొన్ని జాతీయప్రభుత్వాల కేంద్రస్థానమా?

ఒకనిఆశలకూ, భయాలకూమధ్య ఒక న్యాయసమ్మతమైన సరిహద్దును కనుక్కోవడంగాని, ఒకనివాంఛలప్రభావం అతనిమానసికాలోచనలపై పడకుండా ఆపడంగాని చాలా కష్టం. మనవాంఛలు వాటిని సమర్థించేకారణాల్నే ఎన్నుకుంటూ, అందుకుసుముఖంగాలేని వాస్తవాలను హేతువులను విస్మరించడం సహజం. నేను పరిస్థితుల్ని కచ్చితంగా సమీక్షించి, పనిచేసేందుకుకావలసినమూలాధారాన్ని తెలుసుకునేందుకు మొదటపేర్కొన్న సరిహద్దును నిర్వచించేందుకు ప్రయత్నిస్తాను. కాని, నేనా గమ్యస్థానాన్ని చేరడాని కెంతోదూరంలో నేవుండిపోయానని నాకు తెలుసు. అసంఖ్యాకమైనభావనలు, అనుభూతులూ కలసి నన్ను నిర్మించాయనీ, అవి తమ అదృశ్యకుడ్యాలతో నన్ను చుట్టుముట్టి ఖైదుచేశాయనీ కూడా నే నెరుగుదును. అదేవిధంగా ఇతరులూ విభిన్నమార్గాల్లో తప్పటడుగులు వేయవచ్చు. భారతదేశాన్ని గురించీ దానికి ప్రపంచంలోగల స్థానాన్ని గురించీ ఒకభారతీయునికీ, ఒక ఆంగ్లేయునికీగల దృక్పథాల్లో ఎంతో భేదంవుండక తప్పదు. దానికి ఆ వ్యక్తియొక్క ప్రత్యేకత, అతని జాతీయచరిత్ర కారణమౌతాయి. వ్యక్తీ, జాతీయసంఘమూ తమగతులను తమ చర్యలద్వారానే రూపొందించుకుంటారు. గతచర్యలు వర్తమానానికి దోవతీస్తాయి. వారు నేడుచేసేది రేపటిచర్యలకు పునాదిఅవుతుంది. దీన్ని భారతదేశంలో "కర్మ" అన్నారు. అదే కార్యకారణన్యాయం; మన గతచర్యలు మనకై

సృష్టించే అదృష్టం. ఆ గతి తప్పనిసరి కానక్కరలేదు. అది రూపొంద డానికి అనేక కారణాలప్రభావంవుంటుంది; అందులో వ్యక్తియొక్క దీక్షకు కొంత పాత్ర వుంటుందంటారు. గతచర్యలఫలితాలను మార్చగల యిట్టి స్వాతంత్ర్యమే లేకపోతే, మనమందరం తప్పించుకోలేని దురదృష్టంయొక్క ఇనుపపిడికిలిలోని నిర్జీవయంత్రాల్లా కావడం తథ్యం. అయినా, ఆ గతకాలపు "కర్మ" వ్యక్తినీ, జాతినీ రూపొందించడంలో అత్యంత ప్రముఖపాత్రవహిస్తుంది. జాతీయవాదంకూడా ఆ "కర్మ" యొక్క నీడమాత్రమే; అందులో గతస్మృతుల మంచిచెడులన్నీ వుంటాయి.

ఒకవ్యక్తికంటె, ఒకజాతిసమూహం తనకు తెలియకుండానే, తనకు ప్రత్యక్షసంబంధంలేని గతవారసత్వప్రభావానికిలోనవడం సహజం. అట్టివారిని ఆమార్గాన్నుంచి తప్పించడం అతికష్టం. నైతికయోచనలు ఒకవ్యక్తిని శాసించవచ్చుగాని, ఒకకూటమిమీద వాటిప్రభావం చాలా తక్కువ; ఆ కూటమి ఎంతపెద్దదైతే వాటిప్రభావం అంతతక్కువౌతుంది. ముఖ్యంగా యీ ఆధునికప్రపంచంలో మోసపుప్రచారంద్వారా ఒక కూటమిని వశంచేసుకోవడం బహుసులభం. అయినా, ఒక్కొకసారి - ఇది చాలా అరుదుగా జరిగినా - కూటమికూడా మహోన్నతనైతికా చరణ నవలంబించి, వ్యక్తి తన సంకుచిత, స్వార్థవిధానాల్ని మరచిపోవుటకు వత్తిడిచేస్తుంది. కాని, తరచుగా వ్యక్తికంటె కూటమిస్థాయే ఎక్కువ దిగజారిపోతుంది.

యుద్ధం ఈ రెండురకాలపరిణామాల్నీ సృష్టిస్తుంది. కాని నైతిక బాధ్యతలనుంచి తప్పించడం, నాగరికత ఎంతో శ్రమించి నిర్మించిన నైతికవిలువలను కూల్చదోయడం దాని ప్రధానవైఖరి. విజయవంతమైన యుద్ధము, దురాక్రమణలు యింతకుముందుపేర్కొన్నవిధానాన్ని సమర్థించి,కొనసాగించబడడానికి దారితీస్తాయి.సామ్రాజ్యతత్త్వస్వైరవిహారం, యాజమాన్యజాతియనే భావనా పెంపొందుతాయి. ఓటమి నిరాశకు, ప్రతీకారభావాభివృద్ధికి కారణమవుతుంది. గెలుపు, ఓటముల్లో ఏది సంభవించినా విద్వేషము, రక్తపాతవిధానాలూ పెంపొందుతాయి. రాక్షసత్వాం, కౄరత్వాం, ఎదుటివారిదృక్పథాన్ని అర్థంచేసుకోప్రయత్నించడానికికూడా నిరాకరించడం తప్పవు. ఆవిధంగా భవిష్యత్తుకు

బీజాలుపడి, ఇంకా ఎక్కువ యుద్ధాలు, సంఘర్షణలు, వాటి దుష్ఫలితాలూ దాపురిస్తాయి.

గత 200 యేండ్లుగా బ్రిటను, భారతదేశాలమధ్య బలవంతంగా యేర్పర్చబడ్డ బాంధవ్యం యీ రెండింటికీ యిలాంటి "కర్మ"ను, గతిని నిర్మించింది. వారిపరస్పరసంబంధాలను యిదే నడుపుతూవుంటుంది. మనం దానిబంధనాల్లో చిక్కుకుపోయి, యీవారసత్వాన్ని వదిలించుకుని, మరొకరకమైనప్రాతిపదికతో నూతనమార్గాన్ని త్రొక్కాలని విఫలప్రయత్నాలు చేశాం. దురదృష్టవశాత్తు గత అయిదేండ్లయుద్ధం యీ దుష్ట"కర్మ"ను ద్విగుణీకృతంచేసి, ఈ రెండు దేశాలమధ్య రాజీనీ, సాధారణసంబంధాలు నెలకొనడాన్ని మరింత కష్టతరంచేసింది. ఇతర విషయాలన్నిటివలెనే గత 200 యేండ్లచరిత్ర కూడా మంచిచెడుల కలగూరగంప. ఆంగ్లేయునిదృష్టికి చెడుకంటే మంచి ఎక్కువగా తోస్తే, భారతీయునిదృష్టికి మంచికంటే చెడు ఎక్కువై, ఆ కాలాన్నంతటినీ కశ్మలంచేసిం దనిపిస్తుంది. కాని, మంచిచెడుల తారతమ్యా లెటువంటివైనా, బలవంతంగా యేర్పరచబడ్డ సంబంధం ఏదైనాసరే విద్వేషాన్ని, పరస్పర తీవ్రఅయిష్టతనూ సృష్టిస్తుందనీ, వీటివల్ల దుష్ఫలితాలు మాత్రమే కలుగుతాయనీమాత్రం స్పష్టం.

భారతదేశంలో రాజకీయంగాను, ఆర్థికంగానుకూడా విప్లవాత్మకమైనమార్పు అవసరమేగాక, జరుగక తప్పదనితోస్తుంది. 1939 చివరలో యుద్ధమారంభమైనవెంటనే ఒకసారీ, 1942 ఏప్రిల్‌లో మరొకసారీ ఇంగ్లండు, భారతదేశాల పరస్పరాంగీకారంతో యిలాంటిమార్పు జరుగగలఅవకాశం లీలగాకనుపించింది. కాని, ప్రతిప్రాథమికమార్పుకూ భయపడడంవల్ల అలాంటిమార్పు కలుగుతుందనే ఆశలూ, అవకాశాలూ గతించిపోయాయి. అయినా, మార్పు వచ్చితీరుతుంది. అంగీకారంకుదిరేపరిస్థితి దాటిపోయిందా? ఇద్దరికీసంభవించే ఘోరప్రమాదం దృష్ట్యా గతం తననుచుట్టుకొనివున్నకొన్నిటిని కోల్పోతుంది. భవిష్యత్తునుదృష్టిలోవుంచుకునే వర్తమానం పరిశీలింపబడుతుంది. ఇపుడు గతస్మృతులు తిరిగివచ్చి, ద్విగుణీకృతద్వేషాలతో ముసురుకున్నాయి. సమాధానవైఖరి మారి, కాఠిన్యత, ద్వేషము పాదుకొన్నాయి. త్వరలోనో ఆలస్యంగానో, మరింత సంఘర్షణవల్లనో, అదిలేకుండానో

ఏదో ఒకపరిష్కారం కుదరకపోదు. కాని, అది వాస్తవానికి, నిష్కపట, సహకారభావాలకు చాలా దూరమైనది. బహుశా ఇరుపక్షాలూ నెత్తిమీదికి ముంచుకొస్తున్న పరిస్థితులప్రాబల్యానికి లొంగిపోవడం వల్లనే అట్టిపరిష్కారంకుదిరి, ద్వేషము, అనుమానాలు కొనసాగడానికే ఎక్కువ అవకాశంవుండవచ్చు ఆఖరుకు సిద్ధాంతరూపేణా అయినా సరే, భారత దేశాన్ని బ్రిటిష్‌సామ్రాజ్యభాగంగా వుంచాలనేభావంతో యీ సమస్యాపరిష్కారాని కెలాంటి ప్రయత్నం జరిగినా దాన్ని భారతీయులు ఆమోదించడాని కేమాత్రం అవకాశంలేదు. భారత దేశంలో మధ్యయుగాలనాటి లక్షణావశేషాలను నిలిపివుంచాలనేపరిష్కారం ఏదీకూడా మనజాలదనుకుంటాను.

భారత దేశంలో జీవితం బహుచవుక. అలాంటప్పుడు జీవితం బోలుగా, వికృతంగా, కశ్మలంగా మారి, పేదరికపు భయంకరదుష్ఫలితాలన్నీ చుట్టుముట్టుతాయి. అనేక సహజకారణాలవల్ల-బలవంతంగా రుద్దబడినకారణాలవల్ల- ముఖ్యంగా ఘోరపేదరికము క్షామాలవల్ల భారత దేశంలో బలహీనవాతావరణం నెలకొనివుంది. మన జీవన పరిమాణం భయపడవలసినంత హీనంగానూ, మరణసంఖ్య అత్యధికంగానూ ఉన్నాయి. పారిశ్రామికంగా పురోగమించి, సౌభాగ్యవంతంగావున్న దేశాలు వెనుకబడివున్న నిరుపేదదేశాలను భాగ్యవంతుడు నిరుపేదల్ని, నిర్భాగ్యుల్ని చూచినట్లే చూడడం కద్దు. భాగ్యవంతుడు తనకు సంపదలూ, అవకాశాలూ సమృద్ధిగావుండడంవల్ల ఉన్నత ప్రమాణాలూ, తృప్తిలేని అభిరుచులూ పెంపొందించుకుని, పేదవారిని వారిఅలవాట్లకు, నాగరికతావిహీనతకు నిందిస్తాడు. వారు బాగుపడేందుకు తగినఅవకాశాల నివ్వకపోవడమేగాక, వారిపేదరికము, దాని దుష్ఫలితాలనే అందుకు అనర్హతలుగా నిర్ణయిస్తాడు.

భారత దేశం నిరుపేద దేశం కాదు. ఏ దేశాన్నయినా సౌభాగ్యవంతంచేసే ప్రతిదీ దానికి సమృద్ధంగా ఉంది. అయినా దానిబిడ్డలు పేదలయ్యారు. దానికి ఉత్తమ సంస్కృతీరూపాలవారసత్వం ఉంది. దానిసాంస్కృతికశక్తి చాలగొప్పది. కాని ఆధునిక వికాసాలు సాంస్కృతిక ఉపాంగాలూ లోపించాయి. ఈ లోపాని కెన్నో కారణాలున్నా, దురుద్దేశపూర్వకంగా అవకాశాలులేకుండా చేయబడడమే ముఖ్య

కారణం. ఇలాంటిస్థితిలో ప్రజలజీవశక్తి అడ్డంకుల నధిగమించి, యీ లోపాన్ని పూరించుకోవాలి. ఈనాడు భారతదేశంలో యిదే జరుగుతోంది. భారతదేశానికి మూలసంపదలు, నైపుణ్యము, విజ్ఞానం, శీఘ్రగతిని పురోగమించగల సామర్థ్యం వున్నాయనే యథార్థంకంటె స్పష్టమైనది మరొకటి ఉండదు. దానికి గత యుగయుగాల సాంస్కృతిక, నైతిక అనుభవాల నిక్షేపం వుంది. అది విజ్ఞానశాస్త్రసిద్ధాంతాల్లోను, దాన్ని ప్రయోగించుకోవడంలోను కూడా పురోగమించి, ఒక గొప్ప పారిశ్రామిక దేశం కాగలదు. దాని కనేక పరిమితులూ, ఆటంకాలూ వున్నా, యువజనాళి వైజ్ఞానికకృషిచేసేందుకు అవకాశాల్లేకపోయినా ఇప్పటికే విజ్ఞానశాస్త్రంలో అది సాధించినవిజయం గణనీయమైనది. దేశవైశాల్యాన్నీ, అవకాశాల్నీ పోల్చుకుంటే ఆ విజయం అంత గొప్పది కాకపోవచ్చు. కాని జాతీయశక్తులకు స్వేచ్ఛలభించి, అవకాశాలు కల్పించబడినప్పుడు కలుగగల విజయాల కిది నిదర్శనం.

అంతర్జాతీయపరిణామాలవల్ల భారతదేశంమీద విదేశీవత్తిడి రావడం, దేశమంతటికీ ఒకేఒకలక్ష్యం లేకపోవడం; ఈ రెండు విషయాలుమాత్రమే పురోగమనానికి అడ్డంకులు కావచ్చు. చివరికి బలంగా నిలిచేకారణంరెండవదే. భారతదేశం రెండుమూడుభాగాలుగావిభజించబడి, ఒకే రాజకీయార్థికవ్యవస్థగా వ్యవహరించలేకపోతే, దానిఅభివృద్ధి తీవ్రంగా దెబ్బతింటుంది. దేశాన్నిబలహీనపరచే ఆ ప్రత్యేకకారణం ఉన్నా, దేశాన్ని మళ్ళీ ఏకంచెయ్యాలనేవారికి, అందుకు వ్యతిరేకించేవారికీ మధ్య జరిగే మానసికసంఘర్షణ మరింత దుష్ఫలితంకాగలదు. కొత్త స్వార్థపరవర్గాలు సృష్టింపబడి, మార్పును, పురోగమనాన్ని అడ్డగిస్తాయి. భవిష్యత్తులో ఒక నూతన "దుష్కర్మ" మనల్ని వెంటాడుతుంది. ఒక తప్పటడుగు మరోతప్పిదానికి దోవతీస్తుంది. గతంలో అలా జరిగింది, భవిష్యత్తులోనూ అలాగే జరుగవచ్చు. అయినా, అంతకంటె ఘోరప్రమాదం ముంచుకొస్తున్నప్పుడు ఒక్కొక్కసారి తప్పటడుగులైనా వేయకతప్పదు. ఇదే రాజకీయాల్లోని గొప్ప విచిత్రసత్యం. చివరికి ఇప్పుడువేసినతప్పటడుగు ఊహించుకున్న ఘోరప్రమాదంకంటె మెరుగౌతుందో కాదో ఎవ్వరూ కచ్చితంగా చెప్పలేరు. అనైక్యత కంటె ఐక్యత ఎప్పుడూ మంచిదే. కాని బలవంతంగా ఏర్పరచబడ్డఐక్యత

కృత్రిమముప్రమాదకరవ్యవహారమునై, ఏతీణాన్నయినా పెరిల్లునబ్బద్దలు కాకతప్పదు. ఐక్యత అనేది మనసా, వాచా, కర్మణా జరగాలి. అందరూ ఒకటేనని, దాని నెదురించేవారిని ఏకముఖంగా ఎదుర్కోవాలనీ భావించాలి. భారతదేశంలో అలాంటి ప్రాథమికఐక్యత వున్నదనే నా విశ్వాసం. కాని, అది కొంతవరకు మరికొన్ని ఇతరశక్తులచే అణచబడి, దాగివుంది. ఈ ఇతరశక్తులు తాత్కాలికమైనవి, కృత్రిమాలు కావచ్చు; దూరంగా తొలగిపోవచ్చు, కాని ఈనాడు వాటి కొక విలువవుంది; ఎవ్వరూ దాన్ని కాదనలేరు.

ఇది మా తప్పిదమే కావచ్చు. తప్పులఫలితాన్ని మేము అనుభవించవలసినదే. కాని, బ్రిటిష్‌అధికారులు భారతదేశాన్ని విచ్ఛిన్నం చేసేందుకు దురుద్దేశపూర్వకంగా నిర్వహించినపాత్రను మాత్రం నే మరువలేను, క్షమించలేను. తతిమ్మా గాయాలన్నీ మానిపోతాయి కాని, యీ గాయంమాత్రం చాలాకాలంవరకు అంటుజాడ్యమై మమ్ము పీడిస్తూనేవుంటుంది. నేను భారతదేశాన్నిగురించి ఆలోచిస్తూంటే తరచుగా ఐర్లండు, చైనాలు గుర్తుకొస్తాయి. ఆ రెండుదేశాలకు భారతదేశానికీ మధ్య, ఆ రెండింటికీమధ్య కూడా గతానికి, వర్తమానానికి సంబంధించిన సమస్యల్లో ఎంతో తేడావుంది. అయినా మరెన్నో దగ్గరపోలికలుకూడావున్నాయి. మేముకూడా ఆ రెండుదేశాలఅడుగుజాడలనే భవిష్యత్తులో అనుసరించవలసివుంటుందా?

జిమ్ ఫెలాన్ తన "జైల్‌జర్నీ" అనే గ్రంథంలో జైలుజీవితం మానవస్వభావంమీద ఎటువంటిప్రభావాన్ని ప్రసరింపజేస్తుందో యిలా చెప్పాడు: "జైలు మానవప్రవర్తనమీద భూతద్దంలాగా పనిచేస్తుంది. అతనిలోని ప్రతి స్వల్పబలహీనతా బహిరంగంచేయబడుతుంది; మరింత స్పష్టంగా కన్పిస్తుంది, నొక్కిచెప్పబడుతుంది, మేల్కొలుపబడుతుంది. చివరికి ఆ బలహీనతగలఖైదీగాక, ఖైదీదుస్తుల్ని ధరించిన బలహీనత మాత్రమే కన్పిస్తుంది". ఎక్కువకాలం జైలులో గడపిన ప్రతిఒక్కరికీ యీ మాటల్లోనిసత్యం బోధపడుతుంది. విదేశీపాలనవల్ల జాతీయ స్వభావంమీద అటువంటిగుణమే ప్రసరింపచేయబడింది. ఈ దుష్ఫలితంమాత్రమే కాదు, ఉత్తమలక్షణాలుకూడా పెంపొందుతాయి. ఎదుటివారిని ఎదుర్కోవడంవల్ల క్రమక్రమంగా బలం సమకూడుతుంది.

కాని, విదేశీప్రభుత్వం మొదటిదుర్లక్షణాన్ని ప్రోత్సహిస్తూ, తరువాతి సుగుణాలను అణచివేస్తుంది. మన జైళ్ళలో ఇతరఖైదీలను కనిపెట్టివుండేందుకు ఖైదీవార్డర్లున్నట్లే కానిసదేశంలో విదేశీప్రభుత్వచిహ్నాలు ధరించి, దానిప్రతినిధులుగా వ్యవహరించే తొత్తులకు, ఇచ్ఛకాలరాయుళ్ళకు కొదువవుండదు. ఈవిధంగా బుద్ధిపూర్వకంగా విదేశీపాలకులపక్షం వహించకపోయినా అధికారులవిధానాలకూ, వ్యూహాలకు లోనయ్యేవారు కూడా చాలమంది వుంటారు.

భారతదేశాన్ని విభజించాలనేసూత్రాన్ని ఆమోదించడం లేక బలవంతపుఐక్యత కూడదనేసూత్రాన్ని అంగీకరించడంవల్ల దాని ఫలితాలను ప్రశాంతంగా, నిర్వ్యామోహంగా పరిశీలించే సదవకాశం కలుగుతుంది. అది అందరిమేలుకు ఐక్యత అవసరమని గుర్తించేందుకు దోవతీస్తుంది. కాని, ఒకసారి యీ తప్పటడుగువేస్తే, అది మరి అనేక తప్పిదాలకు దోవతీయగలప్రమాదంకూడా ఉంది. ఒకసమస్యను తప్పుమార్గాన పరిష్కరించాలనేప్రయత్నం ఇంకా అనేకసమస్యల్ని సృష్టించవచ్చు. భారతదేశం రెండుగానో, అంతకంటె ఎక్కువభాగాలుగానో విభజించబడితే, పెద్దపెద్దసంస్థానాలను భారతదేశంలో విలీనంచెయ్యడం మరింత కష్టప్రదమవుతుంది. ఆ సంస్థానాలు విడిగానేఉండి, తమనిరంకుశాధికారాలను చలాయిస్తూనేవుండేందుకు అంతకుముందు లేని కారణమొకటి అదనంగా ఈ విభజనవల్ల లభిస్తుంది. *

భారతదేశాన్ని హిందువులు, ముస్లిములు పంచుకోవాలని నేటిముస్లింలీగు ఊహించినట్లు, మతప్రాతిపదికమీద దేశాన్ని విభజించినా, భారతదేశముఖ్యమతాలైన ఆ రెండింటిఅనుయాయులను విభ

* భారతసంస్థానాల్ని మొత్తంగాతీసుకుంటే అవి తమ ఆంతరంగికాధికారాన్ని నిలబెట్టుకోవాలని ఎంతగానో తహతహలాడుతున్నా, తాముకూడా సమానాధికారాలుగల సభ్యులుగావుండే భారతసమాఖ్య నిర్మింపబడాలనికూడా వాంఛిస్తున్నారనాలి. సంస్థానాల ప్రముఖమంత్రులూ, రాజకీయవేత్తలూ భారతదేశవిభజనోద్దేశాన్ని తీవ్రంగా నిరసించారు. వారు భారతదేశవిభజనజరిగితే తమ సంస్థానాలు ఆ భాగాల్లో దేనితోనూసంబంధంపెట్టుకోకుండా ఎడంగా, సర్వస్వతంత్రంగా వుండిపోవడానికే నిశ్చయించుకుంటామనికూడా విస్పష్టంగా ప్రకటించారు.

జించినట్లుకాదు. ఆ మతాలవారు దేశమంతటా మిశ్రమంగా వ్యాపించి వున్నారు. ఏమతస్థులు అత్యధికంగావున్నప్రాంతాన్ని ఆ మతప్రాం తంగా విభజించినా, ప్రతిప్రాంతంలోనూ, రెండవమతానికిచెందిన అసంఖ్యాకులు అల్పసంఖ్యాకవర్గాలుగా వుండిపోతారు. అందువల్ల, అల్పసంఖ్యాకులసమస్యను పరిష్కరించలేకపోగా, ఒకసమస్యస్థానే అనేక అల్పసంఖ్యాకసమస్యల్ని సృష్టించినవారమవుతాం. సిక్కులవంటి తది తరమతాలవారు తమయిష్టానికివ్యతిరేకంగా అన్యాయంగా విభజింపబడి రెండువేర్వేరురాష్ట్రాల్లో వుంచబడ్డారు. ఒకవర్గానికి వేసపడే స్వాతంత్ర్యాన్ని యిస్తూ, ఇతరవర్గాలకు – అవి అత్యల్పసంఖ్యాబలంగల వైనా – అలాంటిస్వాతంత్ర్యం నిరాకరింపబడి వారిదృఢాభిప్రాయాలకు వ్యతిరేకంగా మిగతాభారతదేశాన్నుంచి వేరుచేయబడతారు. విభజనకు సంబంధించినంతవరకు ఒకప్రాంతంలోని అధికసంఖ్యాకులఅభిప్రాయమే (మతప్రాతిపదికపై) ఆప్రాంతంవిషయంలో పరిగణింపబడాలనేటట్లయితే యావద్భారతదేశసమస్యపై దేశంలోని అధికసంఖ్యాకులఅభిమతం చలామణీకారాదనడానికి కారణం కన్పించదు. లేక ప్రతి చిన్నప్రాం తమూ తనస్వతంత్రప్రతిపత్తిని తానే నిర్ణయించుకుని, అసంఖ్యాకమైన చిన్నచిన్నరాష్ట్రాల నెందుకేర్పరచుకోరాదో? ఇది నమ్మశక్యంగాని, విచిత్రఊహాపరిణామం! ఆవిధంగాకూడా హేతుపూర్వకంగా సమస్యా పరిష్కారం జరగదు. వివిధమతాలప్రజలు దేశమంతటా సమ్మిశ్రమంగా వున్నారు.

విభిన్నజాతులకుసంబంధించిన సమస్యలను విభజనద్వారా పరి ష్కరించడం కష్టం. ఇంక మతప్రాతిపదికమీదనే యిలాంటివరీతు జర గాలంటే, దాన్ని ఏ హేతుపూర్వకంగా పరిష్కరించడమైనా దుస్సా ధ్యమే. అట్టిది ఆధునికప్రపంచంలో యిముడజాలని మధ్యయుగాల భావాలకు తిరోగమించడంవంటిది.

విభజనలోని ఆర్థికదృక్పథాన్ని పరిశీలిస్తే, భారతదేశం ఏకంగా వుంటేనే బలంగా, దాదాపు స్వయంపోషక ఆర్థికభాగంగా వుండగల దనేది స్పష్టం. ఎలాంటి విభజనైనా దాన్ని బలహీనపరుస్తుంది. ఒక భాగం మరోభాగంమీద ఆధారపడవలసివస్తుంది. హిందూ, ముస్లిం ప్రజ లెక్కువగా వుండడాన్నిబట్టి దేశాన్ని రెండుభాగాలుచేస్తే, ఖనిజ

నిక్షేపాలూ, పారిశ్రామికప్రాంతాల్లో చాలవరకు హిందువులభాగంలోనే వుంటాయి. ఈ దృక్పథంతో చూస్తే, హిందూప్రాంతాలు అంతగా దెబ్బతినవు. ఇక మిగిలిన ముస్లింప్రాంతాలు మాత్రం ఆర్థికంగా వెనుకబడి, తరచుగా లోటుప్రాంతాలై, బైటినుంచి ఎంతో గొప్పసహాయం లభిస్తేనేగాని మనలేవు. అందువల్ల, ఈనాడు దేశవిభజనను కోరుతున్నవారే, దానివల్ల తీవ్రంగా బాధపడగలరనేవిచారకరసత్యం బైటపడుతోంది. ఈ సత్యాన్ని కొంతవరకు గుర్తించబట్టి, వారికి ఆర్థికసౌష్టవంగలప్రాంతాన్ని సమకూర్చేవిధంగానే దేశవిభజన జరగాలని వారితరఫున ఇప్పుడు వాదించబడుతోంది. ఏపరిస్థితుల్లోనైనా సరే ఇది సాధ్యమౌతుందో లేదో నాకు తెలియదు కాని, నా కా నమ్మకం అంతగాలేదు. ఏదిఏమైనా, అలాంటివిభజన జరగాలని ప్రయత్నిస్తే, హిందూ, సిక్కుప్రజానీకం అత్యధికంగాగల పెద్దపెద్దప్రాంతాలను బలవంతంగా రెండోభాగంలో చేర్చినట్లవుతుంది. అది స్వయంనిర్ణయసూత్రాన్ని చిత్రవిచిత్రంగా అమలుజరపడమవుతుంది. ఈ సందర్భంలో ఒకడు తల్లిదండ్రులను చంపి, తాను అనాథననీ, దయజూపవలసినదనీ న్యాయస్థానాన్ని ప్రార్థించినకథ నాకు గుర్తుకొస్తోంది.

మరొక పరస్పరవ్యతిరేకవిచిత్రంకూడా తలెత్తుతుంది. స్వయంనిర్ణయసూత్రాన్ని వల్లెవేస్తూనే, దాన్ని నిర్ణయించేందుకు ప్రజాభిప్రాయం సేకరించాలనేవాదాన్ని అంగీకరించడంలేదు. మహాఅవసరమైతే ఆప్రాంతంలోని ముస్లింప్రజలఅభిప్రాయాన్ని మాత్రమే సేకరిస్తే చాలునంటున్నారు. అలాగైతే బెంగాలు, పంజాబుల్లో ముస్లిములు నూటికి 54 మందో, అంతకుతక్కువగానో వుంటారు. ఒకవేళ ఓటింగు జరగడం అవసరమైతే, యీ 54 మందిమాత్రమే ఓట్లువేసి, మిగతా 46 (అంతకంటె ఎక్కువో) మందిభవిష్యత్తును నిర్ణయించాలనీ, వారికి (46 మందికి) ఓటుచేసేహక్కు వుండరాదనీ విభజనవాదులు సూచిస్తున్నారు. ఇలాజరిగితే నూటికి 28 మందిమాత్రమే మిగతా 72 మందిఅదృష్టాన్ని నిర్ణయించినట్లవుతుంది. (54 గురిలో 28 మంది ఏదిఅంటే అదే ప్రజాభిప్రాయం అవుతుందిగదా!)

ఏమాత్రం హేతుబుద్ధిగలవాడైనా యిలాంటిప్రతిపాదనలను ఎలాచేయగలడో, అవి ఆమోదింపబడాలని ఎలా ఆశించగలడో

దురూహ్యం. ఈసమస్యమీద ఓటింగుజరిగేవరకూ ఆయాప్రాంతాల్లోని ముస్లిముల్లో ఎంతమంది విభజనకావాలని అంటారో నాకు తెలియదు, మరెవ్వరికీకూడా తెలియబోదు. వారిలో అనేకమంది-బహుశా అత్యధిక సంఖ్యాకులు-విభజనకువ్యతిరేకంగానే ఓటుచెయ్యగలరని నే నూహిస్తున్నాను. అనేక ముస్లింసంస్థలు విభజనను వ్యతిరేకిస్తున్నాయి. ప్రతి ముస్లిమేతరుడూ-హిందూ, సిక్కు, క్రైస్తవ, పార్సీ, తదితరులెవరైనా సరే-విభజనను వ్యతిరేకిస్తారు. ముఖ్యంగా ముస్లిములు అల్పంగావున్న ప్రాంతాల్లోనే యీ విభజనోద్దేశం ప్రబలింది. ఏసందర్భంలోనైనా ఆ ప్రాంతాలు మిగతా భారతదేశంలో వుండిపోయేవే. ముస్లిములు అధికసంఖ్యాకులుగావున్నప్రాంతాల్లో విభజనవాదాని కంతగా ప్రాబల్యం లభించలేదు. వారు తమకాళ్ళమీద తాము నిలబడగలరు గనుక, ఇతరవర్గాలకు భయపడవలసినఅవసరం లేకపోవడం సహజమే. ధైర్యం, ఆత్మవిశ్వాసంగల పఠానులకు భయపడే బలహీనధోరణే లేదు గనుక, వాయవ్యసరిహద్దురాష్ట్రంలో (నూటికి 95మంది ముస్లిములు) విభజన ప్రసక్తే అంతగా కనుపించదు. ఆవిధంగా ముస్లింలీగు భారతదేశాన్ని విభజించమంటున్నవాదానికి ముస్లిములు తక్కువగాగలప్రాంతాల్లో కంటె, ముస్లిములభాగానికి రాగలదనే ముస్లింప్రాంతాల్లోనే సమర్థన తక్కువగావుండడం విచిత్రమే! అయినా, యీ విభజన అనే భావాన్ని దానివల్ల యేర్పడగలపరిణామాలనుగురించి అంతగాఆలోచించకుండానే ముస్లిముల్లో ఎక్కువమంది అభిమానిస్తున్నారనేవిషయం మాత్రం యథార్థం. నిజానికి ఇంతవరకూ యిలాంటిప్రతిపాదన అస్పష్టంగా జరిగినదేగాని, ఎన్నిసార్లు కోరినా విస్పష్టంగా వివరించబడనేలేదు.

ఈ భావన కృత్రిమంగా సృష్టింపబడిందేగాని, ముస్లింహృదయాల్లో వేళ్ళూనుకోలేదనే అనుకుంటాను. కాని, తాత్కాలికభావాలు కూడా తగినంతబలీయమై సంఘటనలమీద తమప్రభావాన్ని ప్రసరింపజేసి, నూతనపరిస్థితిని సృష్టించగలవు. సాధారణంగా అప్పుడప్పుడు విభేదాలపరిష్కారానికి మార్పులూ, చేర్పులూ జరుగుతుంటాయి. కాని, భారతదేశం నేడున్న ప్రత్యేకపరిస్థితుల్లో, అధికారమంతా విదేశీపాలకులచేతుల్లోనే వున్నప్పుడు ఏంజరిగినా జరుగవచ్చు. విభేదాలున్న అందరిమధ్యా సద్భావం వుండి, అన్నిపక్షాలవారూ ఒకసమానలక్ష్యం

కోసం సహకరించుకున్నప్పుడే వాస్తవమైనపరిష్కారం సాధ్యమౌతుం దనేది స్పష్టం. అలాంటిదాన్ని సాధించడానికోసం సహేతుకంగా ఎట్టి త్యాగంచేసినా దానికి విలువవుంటుంది. ప్రతివర్గము సిద్ధాంతరీత్యానే గాక, వాస్తవంగాకూడా స్వతంత్రంగా వుండాలి. అభివృద్ధికి సమానావ కాశాలుండాలి. అంతేగాక, ఆ స్వతంత్ర, సమత్వాలఅనుభూతి కూడా ఉండాలి. వ్యామోహాలు, సహేతుకం కాని ఆవేశాలూ వదలుకుంటే, రాష్ట్రాలకూ, సంస్థానాలకు విశాలస్వయంపాలనాధికారం వుండేటట్లూ, కేంద్రంలో దృఢసంబంధం వుండేటట్లూ, స్వతంత్రప్రతిపత్తినిపొందే పథకాన్ని వేసుకోవడం కష్టంకాదు. సోవియట్ రష్యాలోవలె పెద్దపెద్ద రాష్ట్రాల్లోను, సంస్థానాల్లోను స్వతంత్రపాలకప్రాంతా లుండడం కూడా సాధ్యమే. వీటికితోడు అల్పసంఖ్యాకుల రక్షణార్థం ఊహించగలప్రతిహా మీని రాజ్యాంగసూత్రాల్లో చేర్చుకోవచ్చును.

ఇవన్నీ చేసుకోగలం. కాని, నడుమనున్న వివిధవిశేషాలు, శక్తులప్రభావంవల్ల – వాటిలో ముఖ్యశక్తి బ్రిటిష్‌విధానం-భవిష్యత్తు ఎలా రూపొందుతుందో నాకు తెలియదు. బహుశా, ఏదోఒక ప్రాతి పదికమీద భారతదేశాన్ని బలవంతంగా విభజించడం, విభజింపబడ్డ భాగాలమధ్య ఏదోఒక నామమాత్రపుసంబంధం నెలకొల్పడం జరుగ వచ్చు. ఇలా జరిగినా ఆతర్వాత ప్రజల్లోగలఐక్యతాభావము, ప్రపంచ పరిణామాలూకలసి, విభజింపబడినభాగాలను సన్నిహితంచేయవచ్చు. తత్ఫలితంగా వాస్తవమైనఐక్యత ఏర్పడవచ్చునని నా నమ్మకం.

భౌగోళిక, చారిత్రక సాంస్కృతికకారణాలవల్లను, అంతకంటె ముఖ్యంగా ప్రపంచసంఘటనల ప్రాబల్యంవల్లనూ అలాంటిఐక్యత యేర్పడగలదు. మనలో అనేకమంది భారతదేశం అవశ్యం ఏకజాతి యని విశ్వసిస్తున్నాము. జిన్నా ద్విజాతిసిద్ధాంతాన్ని పేర్కొనడమేగాక, ఇటీవల కొన్నిమతవర్గాలను "ఉపజాతు"లంటూ (వాటి అర్థమేమిటో!) వర్ణించడంద్వారా రాజకీయపదకోశంలో కొత్తపదాల్ని చేర్చాడు. ఆయనదృష్టిలో జాతికి, మతానికీ తేడాలేదు. నేటి ప్రపంచదృక్పథం అదికాదు. కాని, భారతదేశాన్ని సక్రమంగా ఒకేజాతియన్నా, లేక రెండు, మూడు జాతులన్నా వాస్తవంగా పట్టించుకోనక్కరలేదు. ఆధునికదృక్పథంలో జాతీయత అనేది ఒకేదేశానికి పరిమితంకాకుండా

దాదాపు అధిగమించిపోయింది. "ఒకజాతి కొక దేశ" మనేభావం మరీ చిన్న దేశాలను సృష్టిస్తుంది. నేడు చిన్న దేశాలు స్వతంత్రంగా మన లేవు. అనేక పెద్దపెద్దదేశాలైనా వాస్తవస్వతంత్రంతో మనగలగడం అనుమానాస్పదమే. అందువల్ల జాతికొక దేశమనేభావం "అనేకజాతుల దేశం" లేక "వివిధజాతుల విశాలసమాఖ్య" అనేవాటికి తావిస్తోంది. ఈ పరిణామానికి సోవియట్‌యూనియన్ చక్కనిబరవడి. అమెరికా సంయుక్తరాష్ట్రాలు బలమైనజాతులతో ఏర్పడినదైనా, ముఖ్యంగా "అనేకజాతులదేశం" గానే వుంది. హిట్లరు యూరపుఖండంమీద దండెత్తడానికిగలకారణం నాజీతత్వంలోని విజయవ్యామోహంమాత్ర మేకాక, అంతకుమించిన కారణమేదో వుంది. యూరపులో చిన్న చిన్న దేశాలను అంతర్ధానంచేసేందుకు కొత్తశక్తులు పనిచేస్తున్నాయి. ఇప్పుడుహిట్లర్‌సైన్యాలు శరవేగంతో నిరోగమిస్తున్నాయి లేదా ధ్వంసం చేయబడుతున్నాయి. కాని, విశాలసమాఖ్యలేర్పడాలనేభావం మాత్రం ఉండిపోతుంది.

హెచ్. జి. వెల్స్ ప్రాచీనప్రవక్తోచిత తీవ్రప్రజ్వలనంతో "మానవాళి ఈ యుగాంతిమదశలో ఉంది. తనవ్యవహారాల యాజమాన్యంలో విచ్ఛిన్నత, వేర్వేరు స్వతంత్రరాజ్యాలమధ్య రాజకీయవిచ్ఛిన్నత, లాభాలకోసం పోటాపోటీలుపడే అదుపులేని వ్యాపారసంస్థలమధ్య ఆర్థికవిచ్ఛిత్తి లక్షణాలుగల దీయుగం. వేరుపడివుండే జాతీయలుగా వాదం పరస్పర ఏకసూత్రసంబంధంలేని వ్యాపారసరళి అనేవే నేటిప్రపంచానికి వ్యాధులు." అని ప్రపంచానికి చాటిచెబుతున్నాడు. మనం అటువంటి జాతీయవాదరాజ్యానికి స్వస్తిజెప్పాలి. మనల్ని హీనపరచని బానిసలుగాచేయని సమిష్టివిధానాన్ని రూపొందించుకోవాలి. ప్రవక్తలు విస్మరింపబడడం, ఒక్కొకసారి తమతరంవారిచే రాళ్ళురువ్వబడడంకూడా పరిపాటి. అందువల్ల వెల్స్, మరి అనేకమందీ చేసే హెచ్చరికలు అధికారంలోవున్నవారికి సంబంధించినంతవరకు అరణ్యరోదనం లాంటివి. ఏమైనా, ఆ హెచ్చరికలు తప్పనిసరిగా సంఘటిల్లేధోరణుల్ని సూచిస్తాయి. ఆ ధోరణులను వేగిరపరచవచ్చు, ఆలస్యమయ్యేటట్లూ చేయవచ్చు, లేక అధికారంలోవున్నవారు మరీ అంధులైతే అవి వాస్తవ

రూపంధరించేలోగా మరో భయంకరవిధ్వంసంకోసం వేచివుండవలసి రావచ్చు.

ఇతరదేశాల్లోవలెనే భారతదేశంలోకూడా మనం నినాదాలకు, నియమితసమాసాలకు బానిసలంగా వున్నాం. ఆ నినాదాలూ, సమాసాలూ నేటి పరిస్థితుల కెలాంటిసందర్భశుద్ధిలేని గతసంఘటనలనుంచి, ఆదర్శాలనుంచి కొనితెచ్చుకోబడ్డాయి. వాటిముఖ్య ప్రయోజనం వున్నపరిస్థితిపై సహేతుకాలోచనల్నీ, నిష్పాక్షికపరిశీలనలను నిరోధించడమే. అస్పష్టాదర్శాలవైపు దోవతీసే ధోరణికూడా ఉంది. అవి ఆవేశాన్నికలిగిస్తాయి. అంతవరకు అవి మంచివే. కాని, అవి మేదస్సును చిక్కుదోవల్లోపెట్టి, అవాస్తవికతకుదారితీయడంకూడా కద్దు. ఇటీవలి సంవత్సరాల్లో భారతదేశభవిష్యత్తునుగూర్చి – ముఖ్యంగా భారతవిభజన, ఐక్యతలనుగురించి – ఎంతో వ్రాయబడింది. అయినా, పాకిస్తాన్‌ను లేక దేశవిభజనను ప్రతిపాదిస్తున్నవారు తమ ఆంతర్యాన్ని వివరించడానిగ్గాని, అలాంటివిభజనవల్ల యేర్పడగలపరిస్థితులనుగురించి ఆలోచించడానిగ్గాని సుతిరామూ యిష్టపడడంలేదనే ఆశ్చర్యకరమైనసంగతిమాత్రం అలాగే వుండిపోయింది. వారొకవిధమైన ఆవేశస్థితిలో సంచరిస్తారు. వారినివ్యతిరేకించేవారిలో అనేకమందికూడా ఊహాస్థితితో, అస్పష్టకాంక్షతో వ్యవహరిస్తారు. దానివెనుక "ఊహించబడిన" ప్రయోజనాలు మాత్రమే ఉంటాయి. సహజంగా ఈ రెండురకాల ఆవేశ, ఊహాదృక్పథాలమధ్య సయోధ్య కుదరదు. అందువల్ల "పాకిస్తాన్", "అఖండ హిందూస్తాన్" (అవిభాజ్యభారతదేశం) నినాదాలు గొంతులుచించుకొని, ఒకదానిమీదఒకటి విసురుకోబడుతున్నాయి. సంఘావేశాలు, తెలిసినవో, తెలియనివో ప్రేరేపణలు ఎంతో విలువగలిగివుంటాయనీ, వాటిని సరకుచేయకతప్పదనీ స్పష్టమయింది. పరిస్థితులూ, వాస్తవాలూ మనం విస్మరించినా, ఆవేశపుముసుగుతో కప్పివేయాలని చూచినా, అంతర్ధానంకావనేదికూడా స్పష్టమే. వాటికి ఏ దుస్సమయానో, ఏ ఊహించనివిధానో తలెత్తేగుణంకూడా వుంది. ఆవేశాలఆధారంతోగాని ఆవేశాలే హృదయాలను వశపరచుకున్నసమయంలోగాని చేయబడ్డ నిర్ణయాలు సాధారణంగా తప్పునిర్ణయాలై, ప్రమాదకరఫలితాలకు దోవతీస్తాయి.

భారతదేశభవిష్యత్తుఏమైనప్పటికి, క్రమబద్ధమైనవిభజన జరిగినా సరే, భారతదేశంలోనివివిధభాగాలు శతవిధాల పరస్పరంసహకరించుకోవలసివుంటుందనేది స్పష్టం. ఆఖరుకుస్వతంత్రజాతులుకూడా పరస్పరం సహకరించుకోవలసివుంటుంది గనుక, భారతదేశంలోని వివిధరాష్ట్రాలుగాని, విభజనవల్లయేర్పడేభాగాలుగాని అంతకంటె ఎక్కువగా సహకరించుకోకతప్పదు. ఈభాగాలు అతిసన్నిహితసంబంధాలు కలిగివుండి, అవన్నీకలిసికట్టుగా వుండాలి. లేదా క్షీణించి, విచ్ఛిన్నమై, తమస్వాతంత్ర్యాన్ని కోల్పోవాలి. అందువల్ల మొట్టమొదట తలెత్తే ప్రత్యక్షప్రశ్న ఒకటుంది. భారతదేశం పురోగమిస్తూ, స్వతంత్రంగావుండేందుకు దేశంలోని వివిధభాగాలను కలిపి, అత్యంతసన్నిహితంచేయవలసిన ముఖ్యబంధనా లేవి? ఆఖరుకు ఆ భాగాలన్నీ స్వయంపాలనాధికారం, సాంస్కృతికాభివృద్ధి పొందడానిక్కూడా అవసరమైన ఆ బంధనాలేమిటి? స్పష్టంగా, ప్రముఖంగా కన్పించే సమస్య దేశరక్షణ. దాని వెనుకనే ఆ శాఖ కవసరమైనపరిశ్రమలు, రవాణా, వార్తాశాఖలు, కనీసం కొంతవరకైనా ఆర్థికప్రణాళిక వుంటాయి. ఎగుమతి, దిగుమతి సుంకాలు, కరెన్సీ, ద్రవ్యమారకం కూడా రక్షణశాఖాప్రభావానికి లోనౌతాయి. దేశీయఅంతర్వాణిజ్యానికి ఎటువంటిసరిహద్దులు, అవరోధాలు యేర్పడినా, అవి దేశీయపురోగమనానికే ఆటంకాలు కాగలవు. గనుక, భారతదేశమంతా అంతర్వాణిజ్యానికి స్వేచ్ఛారంగంగావ్యవహరించబడాలి.ఆవెంటనే మొత్తందేశందృష్ట్యా, వివిధభాగాల దృష్ట్యాకూడా సమిష్టిగా, కేంద్రంనుంచి అమలుజరుపవలసిన విషయాలు అనేకం ఉన్నాయి. మనం తాత్కాలికోద్రేకాన్నిగాక, మరి దేన్నీచూడలేని అంధులమయితే తప్ప, మనం పాకిస్తాన్‌కు సుముఖులంగావున్నా లేకపోయినా, యీ పైవాటినుంచి తప్పించుకోలేము. నేడు విమానయానం విరివిగా పెరిగిపోయినందున, ఆ శాఖను అంతర్జాతీయశాఖగానో, అంతర్జాతీయఅజ్మాయిషీగలదిగానో చెయ్యాలనే వాదం ప్రబలింది. వివిధదేశాలు ఈ ప్రతిపాదనను అంగీకరించేటంత విజ్ఞత కలిగివున్నాయో లేదో చెప్పలేం. కాని, భారతదేశంలో యావద్భారతప్రాతిపదికమీద మాత్రమే విమానయానశాఖ పురోగమించగలదు. విభజితభారతదేశంలో విమానయానశాఖను ప్రతి

భాగము వేర్వేరుగా పెంపొందించుకోగలదనుకోవడం ఊహాకందనిది. ఈసూత్రం యిప్పటికే జాతీయహద్దులను దాటిపోయేధోరణిలోవున్న అనేకచర్యలకుక్కూడా వర్తిస్తుంది. భారతదేశాన్ని మొత్తంగాచూస్తే, ఆయాశాఖలు పెంపొందేందుకు తగినంత విశాలమైనదే. కాని, విభజిత భారతదేశంలో అట్టిఅవకాశం అంతగావుండదు.

ఈవిధంగా పరిశీలిస్తే, పాకిస్తాన్ వచ్చినా రాకపోయినా, భారతదేశం స్వతంత్రంగా బ్రతుకుతూ, పురోగమించాలంటే, అనేక ముఖ్య, ప్రాథమికకార్యకలాపాలు యావద్భారతప్రాతిపదికమీదనే సాగించవలసివుంటుందనే మార్పులేని, తప్పనిసరి నిర్ణయానికొస్తాం. అలా జరుగనినాడు స్తబ్ధత్వం, క్షయం, విచ్ఛిన్నతలు సంభవించి, యావద్భారతదేశము, దానివివిధభాగాలు కూడా రాజకీయార్థికస్వాతంత్ర్యం కోల్పోయేప్రమాదానికి దారితీస్తాయి. ఒకానొక ప్రముఖాధికారి చెప్పినట్లు: "ఈయుగంయొక్క అకుంఠితహేతువాదం దేశానికి పరస్పరవిరుద్ధమైన రెండుమార్గాలను ప్రసాదిస్తోంది – ఐక్యతతో స్వాతంత్ర్యం, అనైక్యతతో అస్వాతంత్ర్యం". పేర్లు తమ ప్రత్యేకతను, మానసికవిలువ కలిగివున్నా, అఖండభారతాన్ని "యూనియన్" అని పిలవాలా, మరోపేరున పిలవాలా అనేది, ఆ యూనియన్ ఎలాంటిరూపాన్ని పొందాలనేది కూడా అంత ముఖ్యంకాదు. వివిధరకాలైన అనేకకార్యక్రమాలను యావద్భారతప్రాతిపదికమీదనే ప్రయోజనకరంగా నిర్వహించగలమనేదే ముఖ్యమైనసంగతి. బహుశా యీ కార్యక్రమాల్లో అనేకం త్వరలో అంతర్జాతీయసంస్థయాజమాన్యంక్రిందికి పోవచ్చు. ప్రపంచం ముకుళించుకుపోతుంది;సమస్యలు అంతటాపెనవేసుకుంటాయి. నేడు ప్రపంచంలో ఏప్రదేశాన్నుంచైనాసరే, ఆవలివైపుననున్న మరో ప్రదేశానికి వెళ్ళాలంటే, విమానంలో మూడురోజుల్లో చేరవచ్చు. అంతరిక్షయానం అభివృద్ధిచెందితే రేపు ఇంకా తక్కువకాలమే సరిపోవచ్చు. భారతదేశం ప్రపంచవిమానయానానికి ప్రముఖకేంద్రం అయితీరుతుంది. భారతదేశాన్నుంచి అటు ఆసియా, యూరపులకు, ఇటు బర్మా, చైనాలకు రైలుమార్గాలు వేయబడతాయి. భారతదేశానికి దగ్గరలోనే, ఉత్తరాన హిమాలయాలకావలనున్న సోవియట్ ఆసియాలో గొప్పగొప్ప పారిశ్రామికకేంద్రా లున్నాయి. వాటికి

బ్రహ్మాండమైన భవిష్యత్తు సంభవనీయం. వీటిప్రభావం భారతదేశం మీద పడి అది అనేకవిధాలుగా సంచలిస్తుంది.

అందువల్ల ఐక్యభారతమూ పాకిస్తానా అనేసమస్యను ఆవేశ దృక్పథంతో చూడక, నేటిప్రాపంచికదృష్టితో అనుభవపూర్వకంగా పరిశీలించాలి. ఈ దృక్పథం భారతదేశమంతటా కొన్ని ముఖ్యకార్య క్రమాలు, సమస్యలను పరిష్కరించేందుకు గాఢసంబంధాలు అవసర మనే స్పష్టమైన నిర్ణయాలకు దోవతీస్తుంది. మిగతావిషయాల్లో దాని లోని వివిధభాగాలకు సంపూర్ణస్వాతంత్ర్యం వుండవచ్చు, వుండాలి కూడాను. పైగా భాగాలూ, కేంద్రమూ, సమిష్టిగాను, వేర్వేరుగాను అజ్మాయిషీచేసే మాధ్యమికరంగంకూడా ఉండవచ్చు. ఏరంగం సరి హద్దు ఎక్కడ మొదలు, ఎక్కడ తుది అనే సమస్యలమీద భేదాభి ప్రాయాలుండవచ్చు, కాని, అలాంటి భేదాలను ఆచారణదృష్ట్యా పరి శీలిస్తే, వెసులుబాటుగా పరిష్కరించుకోవడం అతిసులభం.

కాని, ఇదంతాకూడా హృదయపూర్వకసహకారంమీద, నిర్బం ధానుభూతి ఏమాత్రం లేకపోవడంమీద, ప్రతిభాగం, ప్రతివ్యక్తి స్వేచ్ఛానుభూతిపొందడంమీద ఆధారపడాలి. పురాతన స్వార్థ శక్తులు నశించాలి. అలాంటిశక్తులు కొత్తగా సృష్టింపబడకపోవడం కూడా అవసరం. ఏ యేవ్యక్తులు కలసి ఒకవర్గం అవుతున్నదోననేది మరచి, ఊహామాత్రభావనల ఆధారంతోనే వర్గాలను పేర్కొనే కొన్ని ప్రతిపాదనలు రాజకీయంగా ఒకవ్యక్తిని ఇద్దరుముగ్గురు ఇతర వ్యక్తులతో సమానంగాచేసి కొత్తస్వార్థశక్తుల్ని సృష్టిస్తాయి. అలాంటి యేర్పాటేదైనాసరే ఉపేక్షింపరాని అసంతృప్తికి, అస్థి మితానికీ దారితీస్తుంది.

ప్రత్యేకసరిహద్దులుగల యేభాగమైనాసరే, భారతసమాఖ్య నుంచి విడిపోయేహక్కు వుండాలని తరచుగా చెప్పబడుతోంది. ఈ వాదానికి బలంగా సోవియెట్ సోషలిస్ట్ రిపబ్లిక్‌ల సమాఖ్యను ఉదహ రిస్తున్నారు. ఆదేశంలోవున్న పరిస్థితులు వేరు, ఆచరణలో ఆ హక్కు కంత విలువకూడా లేదు. అందువల్ల, ఆ వాదం మనదేశానికి వర్తిం చదు. భారతదేశంలో నేడున్న ఉద్రేకవాతావరణంలో భవిష్యత్తు కోసం ఏ బలవంతమూలేదనే అత్యంతావశ్యకమైన స్వతంత్రభావాన్ని

కలిగించడంకోసం పై వాదాన్ని అంగీకరించడం వాంఛనీయంకావచ్చు. కాంగ్రెసు దీన్ని అంగీకరించింది కూడాను. కాని, ఆ హక్కును వినియోగించుకోవాలన్నా, పైనపేర్కొన్న సమిష్టిసమస్యలన్నింటిని గురించి ముందుగా ఆలోచించుకోవలసివుంటుంది. అంతేగాక, ఆదిలోనే అనేక విభజనలుజరిగే ప్రమాదకర అవకాశంకూడావుంది. అలాంటి ప్రయత్నం స్వాతంత్ర్యానుభవారంభదశను, స్వతంత్ర జాతీయరాజ్యనిర్మాణాన్నీ వికృతం చేస్తుందికూడా. అధిగమించలేని సమస్యలు తలెత్తి, వాస్తవ సమస్యలను చీకాకుపరుస్తాయి. విఛ్ఛిన్నకరవాతావరణం చెలరేగుతుంది. ఈ హక్కు లేకపోతే సంయుక్త, ఐక్యపాలనకు అంగీకరించగల అనేకరకాల ముఠాలు ఈ హక్కు కల్పించబడినప్పుడు తమకు ప్రత్యేక రాష్ట్రాలుకావాలనీ, ఇతరులహక్కులను దురాక్రమణచేయగల ప్రత్యేక అవకాశాలు కావాలనీ కోరుతారు. భారతసంస్థానాలసమస్యాపరిష్కారం మరింత దుస్సాధ్యమవుతుంది. సంస్థానాలవిధానం నేడున్నస్థితిలోనే ఇంకా బ్రతికివుండడానికి పునర్జీవనం పొందుతుంది. సాంఘిక ఆర్థికసమస్యలపరిష్కారం మరింత కష్టప్రదమవుతుంది. నిజానికి అలాంటికల్లోలం నుంచి ఎలాంటి స్వతంత్రరాజ్యమైనా అవతరించగలదని ఊహించలేము. ఒకవేళ ఏదోఒకటి అవతరించినా, అది అనేక ఆత్మవైరుధ్యాలతో, పరిష్కరించలేనిసమస్యలతో నిండివుంటుంది.

అలా విడిపోయేహక్కును వినియోగించుకోకముందే క్రమబద్ధంగా నిర్మింపబడి, పాలిస్తున్న స్వతంత్రభారతప్రభుత్వం వుండితీరాలి. అలాంటప్పుడు బయటివారిపలుకుబడులు తొలగింపబడి దేశం వాస్తవసమస్యల్ని ఎదుర్కొంటుంది. అప్పుడు ఇలాంటిప్రశ్నలను నేటి ఆవేశతత్వానికి దూరంగావుండి, నిష్పాక్షికంగా పరిశీలించే అవకాశం వుంటుంది. నేటి ఆవేశతత్వవైఖరి దురదృష్టకరపరిణామాలకుమాత్రమే దోవతీస్తుంది. ఆతర్వాత మనమందరం అందుకు పశ్చాత్తాపపడవలసి వస్తుంది. కాబట్టి ఒక వ్యవధిని నిర్ణయించడం మంచిది. అంటే, స్వతంత్ర భారతప్రభుత్వం యేర్పడినతర్వాత పదేండ్లు లేక మరొక నియమిత వ్యవధి అనంతరం సక్రమరాజ్యాంగపద్ధతులద్వారా, ఆ ప్రదేశంలో నివసిస్తున్నప్రజలందరూ విస్పష్టంగాప్రకటించగలదాన్నిబట్టి యీ విడి

పోయేహక్కును వినియోగించుకోవచ్చునని యిప్పుడు నిర్ణయించుకోవాలి.

ప్రస్తుత భారతదేశస్థితిగతులంటే మనలో ఎక్కువమందికి విసుగెత్తింది. వాటినుంచి తప్పించుకునేందు కెంతగానో తపిస్తున్నాము. కొందరు యీ ఉక్కిరిబిక్కిరిపరిస్థితినుంచి బయటపడి, ఒక్కసారైనా ఊపిరిపీల్చుకునేఅవకాశం దొరుకుతుందని, తాత్కాలికంగానయినా తృప్తిలభిస్తుందని తమనెప్పుకొట్టుకొచ్చే యే గడ్డిపోచనైనాసరే ఆసరా చేసుకునేందుకు సిద్ధపడుతున్నారు. ఇది చాలా సహజమే కాని, దాదాపు ఉన్మాదం, అంధసాహసంవంటి యీ దృక్పథాలవల్ల కోట్లాది ప్రజలశ్రేయస్సుకు, భావిప్రపంచశాంతికి ప్రమాదంవాటిల్లగలదు. మేము భారతదేశంలో నిరంతరం ఒకఉపద్రవంఅంచున నివసిస్తున్నాం. నిజానికి గతసంవత్సరం బెంగాలులోను, ఇతరప్రాంతాల్లోను జరిగినట్లు ఒక్కొక్కసారి ఆ ఉపద్రవం మమ్మల్ని ముంచెత్తడం కద్దు. బెంగాలుకరువు, దాని ఫలితాలు అసాధారణము, ఊహాతీతము, అనివార్యములైన హఠాత్ విషాదపరిణామంవల్ల సంభవించలేదు. తరతరాలుగా శరీరంలోగూడు కట్టుకొనియున్న దీర్ఘవ్యాధి అన్నిముఖ్యాంగాలను తినివేయడంవల్ల యేర్పడిన భారతదేశనికృష్టస్థితిని భయంకరంగా కళ్ళకుకట్టినట్టుచూపిన చిత్రాలవి. మనమందరం సమిష్టిబలంతో దాన్ని సమూలంగా నాశనం చేసి, నయంచేసేందుకు కృషిచెయ్యకపోతే, ఆ వ్యాధి యింతకంటె ప్రమాదకర, విధ్వంసకరరూపాలు ధరిస్తుంది. భారతదేశం విభజింపబడి, ప్రతిభాగము స్వార్థంతోనే ప్రవర్తిస్తూ, ఇతరులనుగురించి ఆలోచించకుండా, సహకరించకుండా వుంటే, యీ వ్యాధి మరింత ముదిరి, మొత్తంభారతదేశం నిస్సహాయ, నిరాశా, నికృష్టనరకంలో మునిగిపోతుంది. ఇప్పటికే చెప్పలేనంత ఆలస్యమైపోయింది. ఆ ఆలస్యాన్నంతటిని మనం కూడదీసుకోవాలి. బెంగాలుకరువు నేర్పినపాఠంకూడా మనకు చీమకుట్టినట్లయినా కాకుండా పోవాలా? ఇప్పటికీ అనేకమంది ఆలోచనలు కొన్నిపరిధులను దాటిపోలేవు. వారెప్పుడూ రాజకీయ సంఖ్యాబలాలనుగురించో, బలబలాలతారతమ్యాలనుగురించో, ప్రత్యేక హక్కులుగల మతాలను భద్రంగావుంచడాన్నిగురించో, కొత్తమతాలకు అలాంటిప్రత్యేకహక్కులను కలుగజేయడాన్ని గురించో, తాము

పురోగమించాలనే ఆతురత, సామర్థ్యమూ లేక యితరుల పురోగమనాన్నికూడా అరికట్టడాన్నిగురించో, స్వార్థప్రయోజనాలనుగురించిన పెద్దపెద్ద సాంఘికార్థికమార్పులను తప్పించుకోవడాన్నిగురించో, ప్రస్తుత భారతదేశస్వరూపాన్నే ఏ స్వల్పమార్పులతోనో యథాతథంగా ఉంచడాన్నిగురించో మాత్రమే ఆలోచించుతూ ఉంటారు. అది మరీ తెలివితక్కువపని.

తక్షణసమస్యలు పెద్దవిగా కన్పించి, మనదృష్టిని పూర్తిగా అటువేపుకే ఆకర్షిస్తాయి. కాని, దూరదృష్టితోచూస్తే, వాటి కెట్టి ప్రాముఖ్యత వుండకపోవచ్చు. పైపైనమాత్రమే కన్పించే ఆసంఘటనలచాటున అంతకంటె బలీయమైనశక్తులు పనిచేస్తుండవచ్చు. అందువల్ల కాస్సేపు ప్రస్తుతసమస్యలను మరచి, దృష్టిని ముందుకుసారిద్దాం. భారతదేశం బలమైన సంయుక్తదేశంగా స్వతంత్రరాష్ట్రాలసమాఖ్యగా, ఇరుగుపొరుగుదేశాలతో సన్నిహితసంబంధబాంధవ్యాలు కలదిగా, ప్రపంచవ్యవహారాల్లో ప్రముఖపాత్రనిర్వహించేదిగా, ప్రభవిస్తుంది. తమ కాళ్ళపైతాము నిలబడగల మూలశక్తులూ, సామర్థ్యము గల బహుకొద్ది దేశాల్లో భారతదేశం ఒకటి. బహుశా, నేడలాంటిదేశాలుగా పేర్కొనదగ్గవి అమెరికా, రష్యాలు మాత్రమే. గ్రేట్‌బ్రిటన్ దాని సామ్రాజ్యమూలశక్తులుకూడా కలిస్తేనే (అలాచూచినా చెల్లాచెదరుగా, అసంతృప్తిగావున్న సామ్రాజ్యం బలహీనకారణమే అవుతుంది) యీకోవలో చేరగలదు. చైనా, భారతదేశాలకు యీవర్గంలో చేరేటంత శక్తి, సామర్థ్యా లున్నాయి. వీటిలో ప్రతిదేశానికి సహజమైన యెల్లలూ, ఏకభూఖండం, సహజ సౌభాగ్యసమృద్ధీ, జనబాహుళ్యం, మానవనైపుణ్యం, సామర్థ్యం వున్నాయి. చైనాకంటె ఇండియాకు పరిశ్రమలకుకావలసిన అనేకరకాలముడిపదార్థాలు ఎక్కువగావున్నాయనవచ్చు. భారతదేశానికి కావలసిన దిగుమతులకు చాలినంత ఎగుమతిపదార్థాలుకూడా వున్నాయి. ఈ నాలుగూగాక మరేదేశాన్ని విడదీసి చూచినా, యిటువంటిస్థితిలో లేదు. బహుశా యూరపులోను, ఇతరఖండాల్లోను వివిధజాతుల విశాలసమాఖ్యా లుద్భవించి, మహత్తరమైన "నానాజాతులప్రభుత్వా" లేర్పడవచ్చు.

ఇప్పటి అట్లాంటిక్‌వలె భవిష్యత్తులో పసిఫిక్ మహాసముద్రం ప్రపంచకీలకస్థానం కావచ్చును. భారత దేశం సరాసరి పసిఫిక్ రాజ్యం కాకపోయినా, అక్కడ ప్రాబల్యం సంపాదించితీరుతుంది. భారత దేశం హిందూమహాసముద్రప్రాంతం, ఆగ్నేయాసియానుంచి మధ్యప్రాచ్యం వరకూగలప్రాంతాల ఆర్థిక, రాజకీయ కార్యకలాపాలకుకూడా కేంద్రంగా అభివృద్ధిచెందుతుంది. భారత దేశస్థానబలిమిచే, భవిష్యత్తులో అతివేగంగాపురోగమించే ఒక ప్రపంచభాగంలో దానికి ఆర్థిక, రాజకీయ ప్రాముఖ్యత లభిస్తుంది. భారత దేశాని కిరువైపుల హిందూమహాసముద్ర తీరానగల దేశాలనన్నింటినీ ఒక ప్రాంతీయమండలిగా చేస్తే, ఇరాన్, ఇరాక్, ఆఫ్ఘనిస్థాన్, ఇండియా, సిలోన్, బర్మా, మలయా, సయాం, జావా మొదలైనవన్నీ కలియుటచే – నేటి అల్పసంఖ్యాకుల సమస్యలన్నీ అదృశ్యమైపోతాయి; లేదా కనీసం ఆ సమస్యలను యిప్పటికి పూర్తిగా భిన్నమైన దృక్పథంతో పరిష్కరించవలసివుంటుంది.

జి. డి. హెచ్. కోల్‌దృష్టిలో భారత దేశం నానాజాతులప్రాంతం. కాలక్రమేణ ఈజిప్ట్, అరేబియా, టర్కీ కలసి "సినో – జపనీస్ సోవియట్ రిపబ్లిక్" అనే కొత్తరాజ్యం యేర్పడుతుందనీ, దానికీ రష్యా ఉత్తరాదికి మధ్యగల మధ్యప్రాచ్యమంతటిని ఆవరించే మహత్తర "బహుళజాతులసమాఖ్య"కు భారత దేశం కేంద్రంకాగలదనీ కోల్‌గారి విశ్వాసం. ఇదంతా ఊహామాత్రమే. ఎన్నటికైనా అలాంటిపరిణామం జరుగుతుందో, లేదో ననేది ఏమానవుడూ చెప్పలేడు. నామట్టుకునాకు ఈ ప్రపంచం కొద్ది "బహుళజాతులసమాఖ్యలు"గా విభజింపబడడం యిష్టంలేదు. ఈ భాగాలను సన్నిహితంచేయగలదృఢబంధనాలుంటే ఫరవాలేదు. కాని, ప్రజలు ప్రపంచైక్యతను, ఒక ప్రపంచవ్యవస్థను ఏర్పరచుకోలేనంత వెర్రివారైతే ఈ విశాల "బహుళజాతులసమాఖ్య" లేర్పడి, ప్రతిదీ "విశాలరాజ్యం"వలె వ్యవహరిస్తూ, ప్రాంతీయస్వయం పరిపాలన కొనసాగుతూవుండేందుకు ఎక్కువ అవకాశంవుంది. చిన్న చిన్న జాతీయరాజ్యాలు అంతంకాకతప్పదు. అలాంటివి సాంస్కృతిక స్వయంపాలకప్రాంతాలుగా నిలబడగలవేమోగాని, స్వతంత్రత రాజకీయ ప్రాంతాలుగా మాత్రం మనలేవు.

ఏది ఎలాజరిగినా, భారతదేశం తనపలుకుబడిని ప్రసరింపజేయగలిగితే ప్రపంచానికే మేలు. ఎందువల్లనంటే, ఆ పలుకుబడి ఎప్పుడూ శాంతిని, సహకారాన్ని బలపరుస్తుంది; దురాక్రమణను నిరసిస్తుంది.

## ౧౨ వాస్తవికవాదం, భౌగోళికరాజకీయాలు. ప్రపంచవిజయము, ప్రపంచసమాఖ్య, అమెరికాసంయుక్తరాష్ట్రములు, సోవియెట్ సోషలిస్ట్ రిపబ్లిక్కులు

ప్రపంచయుద్ధం యూరపులో అంతిమదశకు చేరుకున్నది. ప్రాక్పశ్చిమదిశల్లో పురోగమిస్తున్న సైనికధాటికి నాజీశక్తి కూలిపోతోంది. ఫ్రెంచిస్వాతంత్ర్యపోరాటంతో అత్యంతసాన్నిహిత్యంగల ఆ ఉదాత్త, సుందరనగరం – పేరిస్ – మళ్ళీ స్వతంత్రమయింది. యుద్ధసమస్యలకంటె కష్టతరమైన శాంతిసమస్యలు తలెత్తి, మానవహృదయాలను కలగుండుపరుస్తున్నాయి. ఆ సమస్యలవెనుక మొదటిప్రపంచయుద్ధానంతరసంవత్సరాల్లో మానవాళిపొందినఘోరపరాజయచ్ఛాయలున్నాయి. మరెన్నడూ అలాంటిపొరపాటు చెయ్యమని చెప్పబడింది. 1918 లో కూడా అలాగే అన్నారు.

విన్‌స్టన్ చర్చిల్ పదిహేనేండ్లక్రితం, 1929 లో యిలా అన్నాడు: "ఇది వినికిడైపోయినకథ. దాన్నుంచి మనం గుణపాఠాలు నేర్చుకోవాలి. భవిష్యత్తుకుకావలసిన ఇంగితాన్నలవరచుకోవాలి. జాతులమధ్యవచ్చే కీచులాటల్లోనూ, వాటినితీర్చుకునేందుకుజరిగే యుద్ధాల్లో బాధపడడంలోను ఎన్నో అస్తవ్యస్తాలుంటాయి. యుద్ధరంగంలో నిరాడంబరంగాజరిగే కృషికి నిర్జీవఅల్పబహుమానాలు లభిస్తాయి. యుద్ధవిజయోత్సాహం తటిల్లతలా సాగిపోతుంది. మెల్లమెల్లగా ఎంతో కాలంపునర్నిర్మించుకోవలసివుంటుంది.యుద్ధంలో ప్రత్యక్షపుకూగలశక్తిని వినియోగించి, అనేక ఘోరప్రమాదాలను ఎదుర్కోవడమేఅవుతుంది. ఏ వెంట్రుకవాసిలోనో, ఏ చిత్తు బోకుల తేడాలోనో, ఏ ప్రమాదంచేత ప్రమాదానికి ప్రమాదం రావడంవల్లనో ప్రళయధ్వంసం తప్పిపోతుంది. మానవాళిహృదయాలను ప్రథమసమస్యగా ఆవరించియున్న మరోప్రపంచయుద్ధం రాకుండా ఆపాలంటే పై సత్యాలన్నింటినీ మనం మననం చెయ్యాలి."

చర్చిల్ యుద్ధంలోను, శాంతికాలంలోను ప్రముఖపాత్ర నిర్వహించాడు. తన దేశం కల్లోల, ప్రమాదాల్లో చిక్కి వున్నప్పుడు దాన్ని ఊహాతీతమైన ధైర్యంతో ముందుకునడిపాడు. విజయానంతరం ఆ దేశాన్నిగురించి గొప్పగొప్పఆశలు సృష్టించుకున్నాడు. అందువల్ల ఆయన కిదంతా తెలిసేవుంటుంది. మొదటి ప్రపంచయుద్ధానంతరం బ్రిటిష్‌సైన్యాలు పశ్చిమాసియా - భారతసరిహద్దులనుంచి ఇరాన్, ఇరాక్, పాలస్తీనా, సిరియాల మీదుగా కాన్‌స్టాంటినోపిల్‌వరకు - అంతటినీ ఆక్రమించుకున్నాయి. అప్పుడు చర్చిల్ మధ్యప్రాచ్యంలో కొత్తబ్రిటిష్‌సామ్రాజ్యం అవతరిస్తుందని ఆశించాడు. కాని, అదృష్టం తల్లక్రిందులైంది. ఇప్పుడు భవిష్యత్తునుగురించి ఆయన కంటున్నకల లేమిటి? నా సహచరుల్లో ఒక ప్రముఖ వీరపురుషుడు (ఇప్పుడు...... జైల్లోవున్నాడు) యిలా వ్రాశాడు: "యుద్ధం ఒక విచిత్రరసవాదివంటిది. దానిరహస్యగృహాంతర్భాగాల్లో అనేక శక్తియుక్తులకషాయాలు కాచి, వడపోయబడుతూంటాయి. అవి జయించినవారిపథకాలను, ఓడినవారి పథకాలను కూడా నిర్లక్ష్యంగా తినివేస్తుంటాయి. గతయుద్ధానంతరం జరిగిన ఏ శాంతిసమావేశమూ కూడా యూరపు, ఆసియాలలోని రష్యన్, జర్మన్, ఆస్ట్రియన్, ఆటోమన్ - నాల్గు మహత్తరసామ్రాజ్యాలూ - నేలమట్టమైపోవాలని నిర్ణయించలేదు. లేక రష్యన్, జర్మన్ టర్కిష్ విప్లవాలు జరగాలని లాయడ్‌జార్జి, క్లిమెన్‌సీ, విల్సన్‌లచేత నిర్ణయింపబడనూలేదు."

తమకృషిని విజయం వరించిన అనంతరం, గెలిచిన దేశాల నాయకులు సమావేశమైనపుడు ఏంచెబుతారు? భవిష్యత్తువారిబుర్రల్లో ఎలా రూపొందుతోంది? వారిలోవారి కెలాంటిసామరస్యం లేక భేద భావా లుంటాయి? యుద్ధోన్మాదంచల్లారి, ప్రజలు అరుదుగామాత్రమే జ్ఞప్తిలోవుంచుకునే శాంతివిధానాలకు మళ్ళెందుకు ప్రయత్నించినప్పుడు ఎలాంటి ప్రతిసంచలనాలు సంభవిస్తాయి? యూరపులోని ప్రచ్ఛన్న శత్రునిరోధకోద్యమాలూ, అది సృష్టించిన యితరశక్తులూ ఏమౌతాయి? యుద్ధప్రకృతిలో రూపొందిన లక్షలాదిసైనికులు అనుభవజ్ఞానాల్లో మరింతవృద్ధులై యిండ్లకు తిరిగివెళ్ళినపుడు ఏంచెబుతారు? ఏం చేస్తారు? వా రెక్కడో దూరంగావుండగా నిరంతరంమారుతూవచ్చిన

జీవితంలో వాళ్ళెలా యిముడగలరు? ధ్వంసం, వినాశంచేయబడ్డ యూరపుకు, ఆసియా, ఆఫ్రికాలకూ ఏంసంభవిస్తుంది? వెండెల్‌విల్కీ వర్ణించిన కోట్లాది ఆసియావాసుల్లో అనివార్యంగా పొంగిపొర్లుతున్న స్వాతంత్ర్యపిపాస ఏమౌతుంది? ఈ ప్రశ్నలకు, ఇతరప్రశ్నలకు సమాధానమేమిటి? అన్నిటికంటె ముఖ్యంగా మననాయకులు అత్యంత శ్రద్ధతో వేసినపథకాలను తలక్రిందులుచేసేందుకు అదృష్టం తరచుగా ఆడే విచిత్రనాటకం ఇక నెలా వుంటుంది?

యుద్ధం తీవ్రమై, ఫేసిస్టుశక్తులు జయించగలవనే సూచనలు వెనుకబడుతూంటే, మిత్రరాజ్యాలనాయకుల కన్సర్వేటిజం బలపడుతూ మితిమీరుతోంది. చతుస్సూత్రస్వాతంత్ర్యం, అట్లాంటిక్ ప్రణాళికలు అస్పష్టంగా, అతిపరిమితంగా వున్నాయి. అయినా తెరచాటున అదృశ్యమవుతూ, గతాన్ని యథాతథంగావుంచేదిగా భవిష్యత్తు రూపొందాలని ఉపలక్షింపబడుతోందని తేలుతున్నది. పోరాటం పూర్తిగా సైనిక రూపందాల్చి, అంగబలంతో అంగబలాన్ని ఢీకొంటున్నట్లున్న దేగాని, నాజీ, ఫేసిస్టుతత్వాలపైజరుగుతూన్నయుద్ధమనేభావం నశించిపోయింది. యూరపులో జనరల్ ఫ్రాంకో, చిన్న (లేక భవిష్యత్తులో అలా కాగల) రాజవంశపాలకులు ప్రోత్సహింపబడ్డారు. ఇప్పటికీ చర్చిల్ సామ్రాజ్యభావాన్నే కీర్తిస్తున్నాడు. ఇటీవల జార్జి బెర్నార్డ్‌షా ఇలా ప్రకటించాడు: తన ఆధిక్యతలోనే మునిగితేలుతూండేశక్తి బ్రిటిష్ సామ్రాజ్యంకంటె ప్రపంచంలో మరేదీ లేదు. ఆఖరుకు చర్చిల్ 'సామ్రాజ్య' మనేమాట ఉచ్చరించ ప్రయత్నించినప్పుడల్లా అది అతనికంఠంలో అతుక్కుపోతూంటుంది."

భవిష్యత్తు గతంకంటె భిన్నంగావుండాలనీ, అలాజరక్కపోతే, యీ యుద్ధంతర్వాత యింతకంటె భయంకరమైనయుద్ధాలూ, విధ్వంసాలూ రాగలవనీ భయపడేప్రజలు ఇంగ్లండు, అమెరికా, తదితర దేశాల్లో చాలామంది వున్నారు. కాని, శక్తి, అధికారంవున్నవారిపై యిటువంటి ఆలోచనలప్రభావంపడినట్లు కన్పించడంలేదు. లేక, వారు తమ అదుపులోలేనిశక్తులపిడికిలిలో బందీలైపోయారేమో! ఇంగ్లండు, అమెరికా, రష్యాలలో మళ్ళీ అధికారవాంఛగలరాజకీయాలపాతఆటే భారీయెత్తున సాగవచ్చును. దానినే వాస్తవికవాదం, ప్రత్యక్షరాజ

కీయ మని భావిస్తారు. ప్రపంచరాజకీయాల్లో నిపుణుడైన అమెరికన్ ప్రొఫెసర్ ఎన్. జె. స్పైక్‌మన్ ఇటీవలవెలువడిన ఒకపుస్తకంలో ఇలా వ్రాశాడు: "వైదేశికవిధానాన్ని కొనసాగించే రాజకీయవేత్త న్యాయ, ధర్మ, సహనములవిలువలను పాటించవచ్చు. కాని, అవి అధికారమనే లక్ష్యాన్ని బలపరచడం, దానితో జోక్యంకలిగించుకోకపోవడం వరకే యీ చెల్లుబడి. అధికారాన్వేషణను నైతికంగాసమర్థించుకునేందుకు పైవిలువలను సాధనాలుగా ఉపయోగించుకోవచ్చు. కాని, ఆ విలువ లనుపాటించడంవల్ల లక్ష్యంబలహీనమయ్యేస్థితి ఆరంభంకాగానే వాటిని విసర్జించాలి. అధికారాన్వేషణ నైతికవిలువలను సాధించేందుకు కాదు. అధికారాన్ని కైవశంచేసుకోవడం సులభతరమయ్యేందుకే నైతికవిలువ లను ఉపయోగించాలి."

ఇది అమెరికాఉద్దేశాన్ని ప్రతిబింబించకపోవచ్చు. కాని, అమెరి కన్లలో ఒక ముఖ్యవర్గంయొక్క భావాలను స్పష్టంచేస్తుంది. వాల్టర్ లిప్‌మన్ దృష్టిలో ప్రపంచమంతా మూడు, నాలుగు ప్రాంతాలుగా రూపొందాలి. అవి అట్లాంటిక్‌సంస్థ, రష్యన్‌సంస్థ, చైనాసంస్థ, చివరికి దక్షిణాసియాలో హిందూ-ముస్లింసంస్థ. ఇలా అనడం అధికారతృష్ణ గలరాజకీయాలను మరింత విస్తృతంగా కొనసాగించేందుకే. ఇలాంటి యేర్పాటువల్ల ప్రపంచశాంతి, ప్రపంచసహకారం ప్రభవిస్తాయనిఆయన ఎలా ఊహించాడో అర్థంచేసుకోలేము. అమెరికా దృఢాభిప్రాయాలు గలవాస్తవికవాదం, అస్పష్టఆదర్శవాదం, మానవతావాదముల విచిత్ర మిశ్రమదేశం. భవిష్యత్తులో యీ మూడింటిలో దేని కెక్కువ ఆధి క్యత వుంటుంది? లేక వాటిమిశ్రమంవల్ల యేర్పడగల ఫలిత మేమిటి? ప్రజాసామాన్యం ఏమైనా అనుకోనీండి, వైదేశికవిధానం, ఆ శాఖాధి పతులైన నిపుణుల ప్రత్యేకహక్కుగానే వుండిపోతుంది. ఆ నిపుణులు సాధారణంగా ప్రాచీనసాంప్రదాయాలను కొనసాగించాలనేభావానికే అంకితమై, ఏ నూతనవిధానమైనాసరే తమదేశాలను కొత్తప్రమాదా లకులోనుచేస్తాయేమోనని భయపడుతూంటారు. ఏదేశమైనాసరే, శుభా శాంతులు, ఊహాచిత్రాలఆధారంతోనే తన జాతీయ, వైదేశికవిధానా లను రూపొందించుకోదుగనుక, సహజంగా వాస్తవికవాదం ఉండవల సినదే. కాని, ఆ వాస్తవికవాదం విచిత్రమైనది. అది గతంయొక్క

ఖాళీకవచాన్నే అంటిపెట్టుకుంటుంది. అదిప్రస్తుత రాజకీయార్థికసత్యాలనే గాక, అసంఖ్యాకప్రజానీకపు అనుభూతులను, కాంక్షలనుకూడా ప్రతిబింబించే యథార్థాలను కూడా త్రోసిపుచ్చుతుంది, లేదా అర్థంచేసుకో నిరాకరిస్తుంది. అనేకమందియొక్క "ఆదర్శవాద" మనబడేదానికంటె ఎక్కువగా ఇలాంటి వాస్తవికవాదమే వర్తమాన, భవిష్యత్సమస్యలకు దూరమై, ఊహామాత్రంగా వుండిపోతుంది.

ఇప్పుడు వాస్తవికవాదికి "భౌగోళికరాజకీయవాదం" పట్టుగొమ్మఅయింది. దానిక్లిష్టపదజాలంలోని "కేంద్రభూమి" "అంచుభూమి" అనేపదాలు జాతీయాభివృద్ధి-క్షయాలనే నిగూఢరహస్యాలపై వెలుగుప్రసారిస్తాయని భావిస్తున్నారు. భౌగోళికరాజకీయవాదం ఇంగ్లండులో పుట్టి (లేక స్కాట్లండ్‌లోనా?), నాజీలకు మార్గదర్శకజ్యోతియై ప్రపంచాన్నంతటిని వశంచేసుకోవాలనే వారిఆశలను, కలలను పోషించి, వారిని వినాశంవైపు నడిపింది. అసంపూర్ణత్వం ఒక్కొకసారి అసత్యం కంటె యెక్కువప్రమాదకారిఅవుతుంది. ఒకసందర్భంలోనిసత్యం ఆ సందర్భంగడచిపోయేసరికి దాన్నినమ్మినవారిని ప్రస్తుతయథార్థాన్ని కానలేని అంధులనుగాచేస్తుంది. హెచ్. జె. మేకిండర్, భౌగోళికరాజకీయవాదసిద్ధాంతం-ఆతర్వాత జర్మనీలో వికసించింది – ఆసియా,యూరపుల సముద్రతీరప్రాంతాల నాగరికతాభివృద్ధిమీద ఆధారపడింది. ఆ నాగరికతను "కేంద్రభూమి"-యూరేషియాప్రాంతానికి కేంద్రమని భావింపబడినదానినుంచి వచ్చే దండయాత్రికులనుంచి రక్షించవలసివుంటుంది. యీ కేంద్రభూమిని వశంలోవుంచుకోవడమంటే ప్రపంచాధిపత్యాన్ని సాధించడమని అర్థం. కాని, నాగరికతఅనేది ఇకను సముద్రతీరాల్లోనే వుండిపోదు.దానిఅవకాశాలు, పరిధులు ప్రపంచమంతటికీ వర్తించగలవు. ఉత్తర, దక్షిణఅమెరికాలఅభివృద్ధికూడా యూరేషియన్ కేంద్రభూమి ప్రపంచాధిపత్యాన్ని వహించగలదనేభావానికి యిముడదు. అంతేగాక, విమానశక్తి మరో క్రొత్తవిశేషాన్ని సృష్టించి, సముద్ర, భూశక్తుల మధ్యగల తారతమ్యాలను తలక్రిందులుచేసివేసింది.

జర్మని ప్రపంచాన్నిజయించాలనే కలలుకంటూ, తనచుట్టూ శత్రువులుకమ్ముతారనే భయంతో మ్రగ్గిపోయింది. సోవియట్‌రష్యా తన శత్రువులందరూ ఏకమౌతారేమోనని భయపడింది. ఇంగ్లండు జాతీయ

విధానం బహుకాలంగా యూరపుదేశాల బలాబలాలను తనకను కూలంగావుంచుకోవడంమీద, అక్కడ గల యేఅధికశక్తివంతమైన దేశాన్నయినావ్యతిరేకించడంమీదా ఆధారపడివుంది. దానికెప్పుడూ యితరు లేంచేస్తారోననేభయం వుంటూనేవుంది. ఆ భయం దురాక్రమణకు, చిత్రవధలవంటికుట్రలకు దోవతీసింది. ప్రస్తుతయుద్ధానంతరం యిందుకు పూర్తిగా భిన్నమైన నూతనపరిస్థితి తలెత్తుతుంది. అమెరికా, రష్యాలు రెండు ప్రబల ప్రపంచశక్తులౌతాయి. మిగతా దేశాలన్నీ ఏదోఒకరకమైన మండలిగా యేర్పడకపోతే, పై రెండుదేశాలకంటె ఎంతో వెనుకబడిపోతాయి. ఇప్పుడు ప్రొఫెసర్ స్పైక్‌మన్ తన చివరిప్రకటనలో అమెరికానుకూడా యిలా హెచ్చరిస్తున్నాడు: 'అమెరికాను శత్రువులు చుట్టుముట్టేప్రమాదం వుంది. అమెరికా ఒక "అంచుభూమి" దేశంతో సఖ్యతనెరపడం అవసరం. ఏ సందర్భంలోనైనాసరే "కేంద్రభూమి" (రష్యా అని ప్రస్తుతార్థం)అంచుభూమితో సఖ్యంనెరపడాన్ని అమెరికా ఆటంకపరచకూడదు.

ఇదంతా ఎంతోతెలివితేటలుగా, వాస్తవికంగా కన్పిస్తుంది. కాని, ఇది రాజ్యవిస్తరణ, సామ్రాజ్యస్థాపన, ఇతరదేశాలశక్తుల నదుపులో పెట్టడం అనే పురాతనవిధానాలమీదనే ఆధారపడిందిగనుక, ఆవిధానం సంఘర్షణకు,యుద్ధాలకు దారితీయకతప్పదుగనుక, ఇంతకంటె మూర్ఖాతి మూర్ఖత్వం మరొకటుండదు. ప్రపంచం గుండ్రంగావుంది గనుక, ప్రతి దేశము ఇతరదేశాలచేత చుట్టుముట్టబడేవుంటుంది. అలాకమ్ముకోవడాన్ని అధికారతృష్ణగలరాజకీయవిధానాలతో తప్పించుకోవాలంటే, సంధులు, ప్రతికూలసంధులు, రాజ్యవిస్తరణ, దండయాత్రలు జరుగక తప్పదు. కాని, ఒకదేశవైశాల్యంగాని, దానిప్రభావంప్రసరించగల వైశాల్యంగాని ఎంతగొప్పదైనా, దానికివెలుపలనున్న దేశాలన్నింటిచేత చుట్టుముట్టబడేప్రమాదం వుండనేవుంటుంది. ఆ యితరదేశాలు తమకువ్యతిరేకంగాఏదేశమైనా అసాధారణశక్తిని పెంపొందించుకోవడం చూచి భయపడుతాయి. ఈ ప్రమాదాన్ని తొలగించుకోవాలంటే ప్రపంచాన్నిజయించాలి. లేదా, శత్రువుకాగల ప్రతిదేశాన్నీ నాశనమైనా చెయ్యాలి. అంతకంటె మార్గంలేదు. ప్రపంచాధిపత్యంకోసం ఇటీవలనే చేయబడ్డప్రయత్నం విఫలంకావడాన్ని నేడు మనం చూస్తు

న్నాం. ఈ గుణపాఠాన్ని నేర్చుకుంటారా? లేక అత్యాశ, జాత్యహం కారం, అధికారగర్వాలప్రోద్బలంచేత తమఅదృష్టాన్ని తేల్చుకునేందుకు ఈ ప్రమాదభరితరంగానికే నడుపబడడం మళ్ళీమళ్ళీ జరుగుతుందా?

నిజానికి ప్రపంచవిజయం, ప్రపంచసమాఖ్యలకంటె మరోమార్గం గాని, మధ్యేమార్గంగాని కన్పించడంలేదు. పురాతన విభాగాలకూ అధి కారరాజకీయాన్వేషణకూ యీనాడు అర్థంలేకుండాపోయింది. మన వాతావరణాని కవి యిముడవు. అయినా, కొనసాగుతూనేవున్నాయి. దేశాలప్రయోజనాలూ, ప్రయత్నాలూ దేశాలసరిహద్దుల్లోనేవుండి పోక, పరిసరాలకూ, ప్రపంచమంతకూకూడా వ్యాపిస్తున్నాయి. ఏ దేశ మైనా ఏకాకిగా వుండలేదు. ఇతరదేశాలరాజకీయార్థికగతులకు భిన్నంగానూ వుండలేదు. దేశాలమధ్య సహకారం సాధ్యంకాకపోతే సంఘర్షణ, దానివెంటనే తప్పనిసరిగావుండగల విషమపరిణామాలూ యేర్పడితీరుతాయి. సర్వసమానత్వం, పరస్పరశ్రేయమూ, వెనుకబడిన జాతుల్నీ ప్రజల్నీ సమానస్థాయికిపెంచడం, సమానసంస్కృతీపురోగమ నం, జాత్యహంకారాన్నీ పెత్తనాన్నీ తొలగించడం — వీటి ఆధారం మీదనే సహకారం సాధ్యమౌతుంది. ఏ జాతిగాని, ప్రజలుగాని మరో కరుదోచుకోవడాన్ని — దానికి మరొకటియ్యనిపేరు పెట్టినాసరే — సహించబోరు. ప్రపంచంలో యితరభాగాలన్నీ మూడుపూవులారు కాయలుగా పరిఢవిల్లుతుంటే తమపేదరికాన్నీ, దుఃఖాన్నీ చూస్తూ ఏ దేశాలూ వూరకుండవు. ఇతరచోట్ల యేమిజరుగుతోందో తెలియ నప్పుడుమాత్రమే అలాంటిది సంభవం.

ఇదంతా స్పష్టంగా కన్పిస్తున్నా, సంఘటనలగమనానికంటె మానవమేదస్సు యెంతో వెనుకబడివుంటుందనీ, నెమ్మదిగామాత్రమే పరిస్థితులకనుగుణంగా మారుతుందనీ గతంలోజరిగిన సంఘటనలచరి త్రలు మనకు తెలియజేస్తున్నాయి. భవిష్యత్తులో వినాశనంనుంచి తప్పించుకోవాలనే స్వార్థప్రయోజనమే ప్రతిదేశమూ అనేకదేశాలతో సహకరించి, ఇతరులస్వాతంత్ర్యంమీద ఆధారపడి, తనస్వాతంత్ర్యజీవితాన్ని నిర్మించుకోవడానికి ముందుకుతోస్తుంది. కాని, "వాస్తవికవాది"యొక్క "స్వప్రయోజనం" గతకాలపుపుక్కిటిపురాణాలు, మూఢనమ్మకాలచేత మరీసంకుచితంచేయబడివుంటుంది. అతడు ఒకయుగానికి తగిన భావ

నలు, సాంఘికకట్టుబాట్లు ఇంక మార్చరానివనీ, అవి మానవునియొక్క, సంఘంయొక్క మార్చరాని సహజప్రకృతిలో భాగాలనీ తలుస్తాడు. మానవప్రకృతి, సంఘమూ మారినంతసులభంగా మరేదీ మారలేదని ఆతడు గుర్తించలేడు. మతవిధానాలూ, భావనలూ శాశ్వతరూపం ధరిస్తాయి. సాంఘికసంస్థలు విశృతాలుగా తోస్తాయి. యుద్ధాన్ని ఒక శారీరకావసరంగా చూస్తారు. సామ్రాజ్యం, రాజ్యవిస్తరణ పురోగమించే సంచలనాత్మకజాతుల విశేషాధిక్యతగా భావిస్తారు. లాభదృష్టి మానవసంబంధాలనుపాలించే కేంద్రవిశేషమౌతుంది. జాత్యున్నతిపట్ల నమ్మిక ఆదర్శశ్రేణిలో ఒకటై, బహిరంగంగా ప్రకటింపబడకపోయినా, సహజవిశేషంగా భావించబడుతుంది. వీటిలో కొన్ని భావాలు ప్రాక్పశ్చిమనాగరికతలకు సర్వసామాన్యలక్షణాలే. వాటిలోఅనేకం ఆధునిక పాశ్చాత్యనాగరికతకు మూలకందాలు. వాటినుంచే ఫేసిజం, నాజీజం పెంపొందాయి. మానవజీవితాన్నీ,మానవాదర్శాల్నీ అసహ్యంగాభావించడంలోఫేసిజం మరింత ముందడుగువేసినా, దానికీ, పైనపేర్కొన్న భావాలకూ నైతికమైనతేడా అంతగాలేదు. నిజానికి బహుకాలంగా యూరపుదృక్పథాన్ని ప్రభావితంచేసిన మానవతావాదం ఇప్పుడు అంతరిస్తున్నసాంప్రదాయమయిపోయింది. పాశ్చాత్యదేశాల రాజకీయార్థిక వ్యవస్థల్లో ఫేసిజంబీజా లున్నాయి. ఈ ప్రాచీనాదర్శాలసంబంధం వదులుకుంటేతప్ప, యుద్ధవిజయంవల్ల గొప్పమార్పేమీ సంభవించదు. పురాతనపుక్కిటిపురాణాలూ, భ్రమలూ కొనసాగుతూనేవుంటాయి. గతకాలంలోవలెనే అహంకారులు వాటిననుసరిస్తూంటారు. మనం మళ్ళీ అదే చరిత్రచక్రంలో తిరుగుతాము.

ఈ యుద్ధాన్నుంచి ప్రభవించే ప్రముఖసత్యాలు రెండు. అమెరికా, రష్యాల శక్తి, నిజమైన సౌభాగ్యాలు పెంపొందుతాయి. సోవియట్‌యూనియన్ యుద్ధకాలంలో విపరీతవిధ్వంసాలకు లోనుకావడంవల్ల, వాస్తవాని క్షది యుద్ధానికిపూర్వంకంటె పేదదైపోయింది. కాని, దాని శక్తిసంపదలు అపారం. అందువల్ల అది త్వరితంగా కోలుకోవడమేగాక, ఎంతోముందుకుపోతుంది. అంగబలం, ఆర్థికశక్తుల్లో దాన్నెదురించగలదేశం యూరేషియామొత్తంమీద ఏదీ వుండదు. ఇప్పటికే అది రాజ్యవిస్తరణధోరణిని ప్రదర్శిస్తూ, దాదాపు జార్‌సామ్రాజ్యపద్ధ

తులమీద విస్తరిస్తోంది. ఇదిఎంతవరకుపోతుందో చెప్పడం కష్టం. దాని పోషలిస్టుఆర్థికవిధానం దాన్ని స్వయంపోషకంచేయగలదు గనుక, రాజ్యవిస్తరణకు దోవతీయనవసరంలేదు. కాని, ఇతరశక్తులూ, పాత అనుమానాలూ స్వైరవిహారంచేస్తున్నాయి. మళ్ళీ ఇతరులు చుట్టుముట్టుతారనేఅనుమానం తలెత్తుతున్నట్లు మనం గమనిస్తున్నాము. ఏదిఏమైనా, సోవియట్‌రష్యా అనేకసంవత్సరాలవరకు యీ యుద్ధగాయాలను మాన్పుకోవడంలోనే నిమగ్నమైవుండగలదు. అయినా వైశాల్యంలోకాకున్నా, యితరవిధాలుగానైనాఅది తనప్రాబల్యాన్నివిస్తరింపజేసుకునేధోరణి స్పష్టమౌతూనేవుంది. నేడు మరేదేశంకూడా సోవియట్‌రష్యావలె రాజకీయదృఢత్వం, ఆర్థికసౌష్టవం కలిగియుండ లేదు. రష్యాను చిరకాలంగా అభిమానిస్తున్నవారికి అక్కడ ఇటీవల జరిగిన కొన్నిపరిణామాలు దిగ్భ్రమకలిగించేవిగా వున్నాయనేవిషయం వేరు. నేటి రష్యానాయకులు ఎదురులేనిస్థితిలో వున్నారు. ప్రతిదీ వారు భవిష్యత్తునుచూచేవైఖరిమీదనే ఆధారపడివుంటుంది.

అమెరికాసంయుక్తరాష్ట్రాలు అపారమైన ఉత్పత్తి, వ్యవస్థాపనా సామర్థ్యాలతో ప్రపంచాన్నే ఆశ్చర్యచకితంచేశాయి. ఆవిధంగా యీయుద్ధంలో అగ్రపాత్రనునిర్వహించడమేగాక, అమెరికన్‌ఆర్థికవ్యవస్థలోగల ఒక పరిణామలక్షణాన్ని అతిత్వరితంచేసి తమకుతామై ఒకసమస్యను సృష్టించుకున్నాయి. ఆ సమస్యకై వారిశక్తియుక్తులన్నీ పూర్తిగా వినియోగించవలసివుంటుంది. నిజానికివారిఆర్థికవ్యవస్థలోఉన్న పరిమితులనుబట్టి జాతీయ, విదేశీసంఘర్షణలు లేకుండా వారీసమస్య నెలాపరిష్కరించగలరోననేది ముందుగా చెప్పుకోవడం సులభంకాదు. అమెరికా ఇప్పుడు ఏకాకిదృక్పథంలోవుండడంలేదంటున్నారు. అది యిప్పుడు ఎంతవరకు విదేశాలకు తనసరుకులను ఎగుమతిచేయడంమీదనే ఆధారపడవలసివున్నది. గనుక, అంతే కావచ్చు. యుద్ధానికిపూర్వం గణించనక్కరలేనంతస్వల్పవిషయంగావున్న ఆర్థికవిధానము ఇప్పుడు ముఖ్యాతిముఖ్యసమస్య అవుతుంది. యుద్ధోత్పత్తులకుబదులు శాంతికాలోత్పత్తులు పెరిగినప్పుడు, సంఘర్షణలను సృష్టించకుండా, అవన్నీ ఎక్కడికి కెగుమతికావాలి? ఇండ్లకుమరలుతున్న లక్షలాదిసైనికులను ఏవృత్తుల్లోపెడతారు ? యుద్ధంచేస్తున్నప్రతిదేశం యీ సమస్యల నెదు

రోవలసిందే. కాని, ఏదేశమూ యీ సమస్యలను అమెరికాఅంత ఎక్కువగా లక్ష్యపెట్టనవసరంవుండదు. సాంకేతికరంగంలో అపారంగా వచ్చిన మార్పులవల్ల అవసరానికిమించిన ఉత్పత్తులుగాని, భారీయెత్తున నిరుద్యోగంగాని, లేక రెండూకాని సంభవిస్తాయి. నిరుద్యోగం ఏ మాత్రం ఎక్కువైనా, ప్రజలు నిరసిస్తారు. అది అమెరికాప్రభుత్వలక్ష్యాలకు విరుద్ధంకూడాను. యుద్ధరంగంనుంచి తిరిగివస్తున్న సైనికులు మొదలైనవారిని లాభదాయకమైనవృత్తుల్లో చేర్చేందుకూ, నిరుద్యోగాన్ని నివారించేందుకూ ఇప్పటికే అనేకపథకాలు ఆలోచిస్తున్నారు. వీటన్నిటివల్ల దేశస్థితి ఎలావున్నా, ప్రధానమైన మార్పులు జరక్కపోతే యిదెంతో గడ్డుగా పరిణమించగలదు. అంతర్జాతీయంగాకలిగించేప్రభావంకూడా అంత ముఖ్యమైనదే.

ఉత్పత్తులు భారీగాజరుగుతున్న యీరోజుల్లో, వర్తమానార్థిక విధానాలప్రకృతి అతివిలక్షణంగా వుంది. ప్రపంచంలోకల్లా భాగ్యవంతమూ, శక్తివంతమూ అయిన అమెరికాదేశం దానిఅధికోత్పత్తులను వినియోగించుకునే యితరదేశాలమీాద ఆధారపడవలసినదేశ మవుతుంది. యుద్ధానంతరం కొన్నిసంవత్సరాలవరకు యూరపు, చైనా, భారతదేశాలు యంత్రాలను, ఉత్పత్తిచేయబడిన వస్తువులను విరివిగా దిగుమతిచేసుకుంటాయి. ఇది అమెరికా తన అదనపుఉత్పత్తుల్ని విడుదలచేసుకోవటాని కెంతో సహాయపడుతుంది. కాని, ప్రతిదేశమూ తనకవసరమయ్యేవస్తువులను తానే ఉత్పత్తిచేసుకునేసామర్థ్యాన్ని అతిత్వరితంగా పెంపొందించుకుంటుంది. మరెక్కడా ఉత్పత్తికాని ప్రత్యేక వస్తువుల ఎగుమతికిమాత్రమే వీలు యేర్పడుతుంది. వినియోగ ప్రమాణం ప్రజలకొనుగోలుశక్తినిబట్టి పరిమితమౌతుంది. ఈ పరిస్థితిని మార్చాలంటే ఆర్థికపునాదుల్లోనే మార్పుఅవసరం. జీవనప్రమాణాన్ని ప్రపంచమంతటా తగినంతపెంచడంద్వారా అంతర్జాతీయవాణిజ్యం, వస్తుమార్పిడి విస్తృతంగా పెంపొందుతాయి. కాని, అలా కొనుగోలుశక్తిని పెంచాలంటే, వలసదేశాల్లోను, వెనుకబడ్డదేశాల్లోను ఉత్పత్తి, వినియోగాలమీాదగల ఆర్థికరాజకీయబంధనాలు తొలగించబడాలి. అలా జరగాలంటే, పెద్దపెద్ద మార్పులుజరగడం, అందువల్లయేర్పడే తెగతెంపులు, మళ్ళీ కొత్తవిధానాలకనుగుణంగామార్పు అనివార్యం.

గతంలో ఇంగ్లండుఆర్థికస్థితి భారీఎగుమతివ్యాపారంమీద, విదేశాల్లోపెట్టుబడులమీదా, లండన్‌నగరపు ఆర్థికనాయకత్వంమీదా వాణిజ్యరవాణానౌకలమీదా ఆధారపడి వుండేది. యుద్ధానికిపూర్వం బ్రిటన్ తనకుకావలసినఆహారపదార్థాల్లోసగం దిగుమతులుచేసుకోవడం మీదే ఆధారపడేది. అది ఇప్పుడు అధికాహారోత్పత్తిఉద్యమాన్ని తీవ్రంగాకొనసాగించడంవల్ల యిలా దిగుమతులమీద ఆధారపడడం తక్కువే. ఇలా దిగుమతిచేసుకునే ఆహారపదార్థాల, ముడిపదార్థాల విలువలను తయారువస్తువులు, పెట్టుబడులు, నౌకారవాణా, ఆర్థికసేవల తోనూ, "అదృశ్య" ఎగుమతులనబడేవాటితోనూ చెల్లించవలసి ఉంటుంది. అందువల్ల విదేశవర్తకం – ముఖ్యంగా ఎక్కువగా ఎగుమతులుచేయడం – బ్రిటిష్‌ఆర్థికవిధానంలో ప్రధానం. అలాంటి ఆర్థిక విధానాన్ని వలసప్రాంతాలపై గుత్తాధికారం చలాయించడంద్వారా, తనసామ్రాజ్యంలోని అన్నిప్రాంతాలమధ్య ఏదోఒకరకమైన అచల సదృశపరిణామాన్ని అదుపులోవుంచే ప్రత్యేకయేర్పాట్లద్వారా నిల బెట్టుకుంటోంది. ఆ గుత్తాధికారము, ప్రత్యేకపు యేర్పాట్లూ వలస దేశాలకు, పరాధీనదేశాలకు ఎంతో అన్యాయంచేస్తున్నాయి. అందువల్ల భవిష్యత్తులోకూడా వాటిని పూర్వరూపాల్లోనే కొనసాగించడం సాధ్యంకాదు. బ్రిటనుకు విదేశాల్లోగలపెట్టుబడులు అంతరించిపోయి, అప్పులు ఎక్కువైపోయాయి. లండన్ ఆర్థికనాయకత్వంకూడా అంతరించింది. అంటే, బ్రిటన్ యుద్ధానంతరసంవత్సరాల్లో ఎగుమతులు, నౌకారవాణాలమీదనే మరింతఎక్కువగా ఆధారపడకతప్పదన్నమాట. కాని, ఎగుమతులను పెంచడం, ఆఖరుకు యిప్పటిస్థాయిలోనైనా వాటినిసాగించడం సాధ్యపడనిపరిమితు లేర్పడ్డాయి.

యుద్ధానికి పూర్వపుసంవత్సరాల్లో (1936 – 38) గ్రేట్‌బ్రిటన్ దిగుమతులు (మరలమరలచేయబడ్డ ఎగుమతులుమినహా) సాలీనా సగటున 86,60,00,000 ల పౌన్లమేరకు వుండేవి. వాటికి ప్రతిఫలాన్ని యీ దిగువవిధంగా చెల్లించేది:

| | | | |
|---|---|---|---|
| ఎగుమతులు | ... | 4780 | లక్షలపౌనులు |
| విదేశాల్లోని పెట్టుబడులమీదరాబడి | | 2030 | ,, |
| నౌకా రవాణా | ... | 1050 | ,, |
| ఆర్థికసహాయాలు | ... | 400 | ,, |
| లోటు | ... | 400 | ,, |
| | | 8660 | లక్షల పౌనులు |

విదేశీపెట్టుబడులపద్దుక్రింద పెద్ద రాబడిరావడానికి బదులుగా ఇండియా, ఈజిప్ట్, అర్జెంటీనా, తదితర దేశాలనుంచి (అమెరికా ఇచ్చిన దీర్ఘకాలరుణాలుగాక) వస్తురూపేణా, సేవలరూపేణా తీసుకున్న విదేశీ అప్పులు ఎంతో భారంకాగలవు. యుద్ధాంతాన యీవిధంగా నిలబడిపోయినస్టెర్లింగ్‌అప్పులు 300 కోట్ల పౌనులు అవుతాయని లార్డ్ కీనెస్ అంచనావేశాడు. నూటికి అయిదువంతులచొప్పున సంవత్సరానికి 15 కోట్లపౌనులు వడ్డీ చెల్లించాలి. ఆవిధంగా యుద్ధాత్పూర్వసగటు ఆధారంగా బ్రిటను ఏడాదికి 30 కోట్ల పౌనులలోటును ఎదుర్కోవలసివస్తుంది. ఎగుమతులు, వివిధసేవలద్వారా రాబడినిపెంచుకొని, ఈ లోటును పూర్తిచేసుకోలేకపోతే బ్రిటన్‌జీవనప్రమాణాలు ఎంతో తగ్గిపోతాయి.

ఇదే బ్రిటన్‌యొక్క యుద్ధానంతరవిధానాన్ని రూపించేముఖ్యాంశంగా తోస్తోంది. అది నేటిఆర్థికస్థాయిని నిలబెట్టుకోవాలంటే, తన వలససామ్రాజ్యాన్ని యథాతథంగా నిలబెట్టుకోవాలని – అనివార్యమైన అత్యల్పమార్పులతో మాత్రమే – భావిస్తోంది. కొన్ని దేశాలసముదాయంలో – వలసలుగాని, కానివిగాని – ఆధిక్యతగల భాగస్తురాలుగా వుంటేనే తాను నాయకపాత్రను నిర్వహించగలననీ, ప్రపంచంలోని రెండు మహోన్నతశక్తుల (అమెరికా, రష్యాల) విస్తారమైన రాజకీయార్థిక సంపదలతో సరితూగగలననీ బ్రిటన్ ఆశిస్తోంది. అందువల్లనే తన సామ్రాజ్యాన్నికొనసాగించాలనీ, తనకున్నవాటిని తనగుప్పిట్లోనేవుంచుకోవాలనీ కాంక్షిస్తోంది. అంతేగాక, తనపలుకుబడిని కొత్తప్రాంతాల మీదకూడా (ఉదాహరణకు తాయిలండ్) విస్తరింపచేసుకోవాలను

కుంటున్నది. తన అధినివేశాలతోనూ, పశ్చిమయూరపులోని కొన్ని చిన్నచిన్న దేశాలతోనూ సన్నిహితసంబంధాలు నెలకొల్పుకోవాలనేది బ్రిటిష్‌విధానంకావడంకూడా పైకారణాలవల్లనే. వలసలు, పరాధీన దేశాలకుసంబంధించినంతవరకు సాధారణంగా డచ్చి, ఫ్రెంచి దేశాల వలసవిధానంకూడా బ్రిటిష్‌విధానాన్నే బలపరుస్తుంది. నిజానికి డచ్చి సామ్రాజ్యం చాలవరకు ఒక "ఉపగ్రహసామ్రాజ్యం" వంటిది. బ్రిటిష్ సామ్రాజ్యం లేకపోతే అది మనలేదు.

ప్రాచీనదృక్పథము,స్థాయిలమీద ఆధారపడి, ఆ ప్రాచీనతలోనే మునిగితేలుతున్నవ్యక్తులచేత రూపొందించబడ్డ యీ బ్రిటిష్‌రాజనీతిని అర్థంచేసుకోవడం సులభమే, అయినా గతించిన 19వ శతాబ్ది ఆర్థిక స్థితితో పోల్చుకున్నా నేడు బ్రిటన్ ఎదుర్కోవలసినకష్టాలు అపారం. తుదకు దానిస్థితి బలహీనమై, నేటిపరిస్థితులకు దాని ఆర్థికవిధానం పనికి రానిదై, దానిఆర్థికమూలాలు పరిమితమై, దాని పారిశ్రామిక, సైనిక బలాలను పూర్వస్థాయిలో నిలుపుకోలేకుండావుంది. ఆ పాత ఆర్థిక స్థాయిని నిలబెట్టుకునేందుకు సూచించబడినవిధానాలు ఎడతెగని సంఘర్షణకు, భద్రతాశూన్యతకు, సామంత దేశాల్లో ద్వేషం యేర్పడేందుకు దోవతీస్తాయి. ఆ ద్వేషభావం బ్రిటన్‌భవిష్యత్తును మరింత ఘోర ప్రమాదభూయిష్ఠంచేయవచ్చు. అందువల్ల ఆవిధానాల్లోనేఅస్థిరత్వంపాదుకొనివుంది.బ్రిటిష్‌వారు తమజీవనప్రమాణాన్ని పూర్వస్థాయిలోనేవుంచుకోవాలని, వీలైతే పెంచుకోవాలనీకూడా కాంక్షించడాన్ని మనం అర్థం చేసుకోగలం.కాని, అది బ్రిటన్ యెగుమతులకు తగువాణిజ్యరంగాలను రక్షించుకోవడంమీద,ముడివస్తువులు,చౌకఆహారపదార్థాలూ సరఫరా చేసేవలసలు, తదితరప్రాంతాలమీద అధికారం చలాయించడంమీదా ఆధారపడేకాంక్ష. అంటేబ్రిటిష్‌వారిజీవనప్రమాణాన్ని ఉన్నతస్థాయిలో వుంచేందుకు ఆసియా, ఆఫ్రికాలలోని కోట్లాదిప్రజలను చాలీచాలని స్థితిలోనో, అంతకంటెహీనస్థితిలోనో వుంచడమన్నమాట. బ్రిటిష్‌వారి స్థాయిని తగ్గించాలని ఎవ్వరూకోరరు. కాని, ఆసియా, ఆఫ్రికాప్రజలు తమను మానవత్వాన్నుంచి దిగజార్చేస్థాయిలో వుంచే వలసఆర్థిక విధానాన్ని కొనసాగించేందుకు ఏమాత్రం అంగీకరించబోరు. యుద్ధానికిపూర్వం బ్రిటన్‌లో వ్యక్తియొక్క సాలుసరి సగటుకొనుగోలుశక్తి

97 పౌను లన్నారు. అమెరికాలో అంతకంటె ఎక్కువే. ఇండియాలో వ్యక్తిసంవత్సరాదాయం సగటున 6 పౌనులకంటె తక్కువ. ఇంతవిపరీత మైన తేడాలు సహింపబడవు. నిజానికి ఈ వలసఆర్థికవిధానంవల్ల రాబడి తగ్గిపోతుంటుందిగనుక, చివరికి అధికారదేశానికూడా చెరుపే కలుగు తుంది. ఈ సత్యాన్ని అమెరికనులు పూర్తిగా గుర్తించారు. అందు వల్లనే పరిశ్రమలస్థాపన, స్వయంపరిపాలనలద్వారా వలసదేశాలప్రజల కొనుగోలుశక్తిని పెంచాలని అమెరికన్లు కాంక్షిస్తున్నారు. ఆఖరుకు బ్రిటనులోకూడా కొంతమంది భారతదేశాన్ని పారిశ్రామికంచేయవలసిన ఆవశ్యకతవున్నదని గుర్తించారు. బెంగాలుకరువు అనేకమంది ఈ విష యాలనుగురించి తీవ్రంగా ఆలోచించేటట్లుచేసింది. కాని, బ్రిటిష్‌యాజ మాన్యంక్రింద, బ్రిటిష్‌పరిశ్రమల కెక్కువసౌకర్యాలు ఉండేవిధంగా మాత్రమే భారతదేశంలో పరిశ్రమలుస్థాపించబడాలని బ్రిటిష్‌రాజనీతి ఉద్దేశిస్తోంది. ఆసియాలోని ఇతరదేశాలవలెనే భారతదేశంకూడా పారిశ్రామికమయితీరుతుంది. ఎంతకాలంలో అనేదే ప్రశ్న. కాని, అది ఏరకమైన వలసఆర్థికవిధానంతోగాని, విదేశీఆధిపత్యంలోగాని సాధ్యమాతుందనేది అనుమానాస్పదమే.

బ్రిటిష్ సామ్రాజ్యం నేడున్నస్వరూపంలో ఒకే భౌగోళిక ఖండమూ కాదు; ప్రయోజనకరమైన ఆర్థిక సైనిక ఖండమూ కాదు. అది ఒక చారిత్రక, మానసికభ్రమాఖండం మాత్రమే. మనోభావానికి ప్రాచీనబంధనాలకు యిప్పటికీ విలువవున్నమాట నిజమే. కాని, తుద కవి అంతకంటె బలమైన కారణాలను త్రోసిరాజనడం కష్టం. పైగా యీ భావము బ్రిటిష్‌జాతిపాలికలేగల కొన్నిజాతులు నివసించే కొన్ని ప్రాంతాలకు మాత్రమే వర్తిస్తుంది. భారతదేశానికి, బానిసవలస సామ్రాజ్యంలోని మిగతాభాగాలకు - అక్కడిపరిస్థితులు మరోవిధంగా వున్నాయిగనుక, వాటికి వర్తించదు. ఆఖరుకు బోయర్లకు సంబంధించి నంతవరకు అది దక్షిణాఫ్రికాకు కూడా వర్తించదు. ముఖ్యఅధినివేశా లలో నిగూఢమైనమార్పులు జరుగుతున్నాయి. అవి బ్రిటన్‌తోటి సాంప్రదాయిక సంబంధాలను బలహీనపర్చగలవు. యుద్ధకాలంలో పారిశ్రామికస్థాయి నెంతో పెంపొందించుకున్న కెనడా అమెరికాతో సాన్నిహిత్యం కలిగివుంది. అదినిరంతరం విస్తృతమయ్యే ఆర్థికవిధానాన్ని

యేర్పరచుకుంది. ఆవిధానం బ్రిటిష్‌పరిశ్రమలనే ఎదుర్కొనవచ్చు. అలాంటి విస్తృత ఆర్థికవిధానమేగల ఆస్ట్రేలియా, న్యూజిలండ్ దేశాలు తాము గ్రేట్‌బ్రిటన్‌యొక్క యూరోపియన్‌మండలంలో లేమనీ; ఆసియా – అమెరికాల పసిఫిక్‌సముద్రప్రాంతంలో వున్నామనీ; అచట అమెరికాయే ప్రముఖపాత్రను నిర్వహించగలదనీ గుర్తిస్తున్నాయి. సాంస్కృతికంగాకూడా కెనడా, ఆస్ట్రేలియాలు క్రమక్రమంగా అమెరికా వైపుకే మొగ్గుతున్నాయి.

నేటి బ్రిటిష్‌వలసదృక్పథం అమెరికావిధానంతోనూ, విస్తరణ వైఖరితోనూ ఏకీభవించదు. అమెరికాకు కావలసినది తమఎగుమతులకు స్వేచ్ఛావ్యాపారరంగం. ఇతరదేశాలు యీ అవకాశాన్ని పరిమితంచేయడం లేక వశంలోవుంచుకోవడాన్ని అమెరికా సహించలేదు. అమెరికా కోరేది ఆసియా త్వరితంగా పారిశ్రామికం కావాలనీ అచ్చటి కోట్లాదిప్రజలకొనుగోలుశక్తి పెంపొందాలనీ మాత్రమే. ఇలా కోరడానికికారణం తన అధికోత్పత్తుల్ని వారికిఅమ్మాలనేవుద్దేశమే. అందువల్ల అమెరికా బ్రిటన్‌ల ఎగుమతి, నౌకావ్యాపారాలమధ్య సంఘర్షణ తప్పదనిపిస్తోంది. అమెరికాకు విమానబలం సమృద్ధిగావుంది. అది విమానయానంలో ప్రపంచాధిపత్యాన్నిసాధించాలని కాంక్షిస్తోంది. దీనిని బ్రిటన్ సహించలేకపోతున్నది. అమెరికా బహుశా థాయిలండ్ స్వతంత్రంగా వుండాలనవచ్చు, బ్రిటన్ దాన్ని అర్థవలసదేశంగా చెయ్యాలనుకుంటోంది. ఈ పరస్పరవిరుద్ధదృక్పథాలు ప్రతిదానివిషయంలోను, అది లక్ష్యంగాపెట్టుకునేఆర్థికవిధానంమీద ఆధారపడివుంటాయి, వలసదేశాలన్నిటిపట్ల యిదే వర్తిస్తుంది.

బ్రిటన్ నేడున్న విలక్షణపరిస్థితులదృష్ట్యా కామన్వెల్తు దేశాలతోనూ, సామ్రాజ్యభాగాలతోనూ సన్నిహితసంబంధాలేర్పరచుకోవాలనేవిధానాన్ని అనుసరించడం మనం అర్థంచేసుకోగలం. కాని, వాస్తవాల హేతువాదం,ప్రపంచధోరణులూ, డొమీనియన్‌లలోజాతీయవాదాభివృద్ధి, సామ్రాజ్యవలసభాగాల్లోని అశాంతిధోరణులూ బ్రిటన్‌కోర్కెకు వ్యతిరేకంగా పనిచేస్తున్నాయి. పాతపునాదులమీదనే నిర్మించాలనుకోవడం, గతించినతరంలోవలెనే ఆలోచనలుకొనసాగించడం, తన సామ్రాజ్యము, ఆధిపత్యము ప్రపంచమంతటా వ్యాపించివున్నాయని

కలుగంటూ వదరడం ఇతరదేశాలకంటె బ్రిటన్ తెలివితక్కువ, హ్రస్వ దృష్టిని ప్రదర్శించడమే; బ్రిటన్‌కు రాజకీయ, పారిశ్రామిక, ఆర్థికరంగాల్లో ఆధిపత్యాన్ని తెచ్చిపెట్టిన అనేక కారణాలు నేడంతరించడమే యిందులకు కారణం. ఏమైనా, బ్రిటన్‌కు గతంలోనూ, ఇప్పుడూకూడా ధైర్యం, కూడదీసుకోవాలనే పట్టుదల, శాస్త్రీయ, నిర్మాణాత్మకసామర్థ్యం, పరిస్థితులకనుగుణంగామారే శక్తీ వున్నాయి. దానికిగల యీ ఉత్తమ లక్షణాలూ, ఇతరలక్షణాలూ కలసి దాన్ని గొప్పజాతిగాచేసి, అది ఎదుర్కొనే అపాయాలను, ప్రమాదాలను అధిగమించేసామర్థ్యం చేకూర్చగలవు. అందువల్ల అది మరొక సాష్టవార్థికవిధానాన్ని చేపట్టి తననెదుర్కొంటున్న ప్రధాన, తక్షణసమస్యలను పరిష్కరించుకోవచ్చు. కాని, అది పూర్వంవలెనే తననుపోషించే సామ్రాజ్యపుతోకను తగిలించుకొని పూర్వవిధానాలే అనుసరిస్తే, విజయంపొందడం అసాధ్యమే.

ఎక్కువభాగం తప్పకుండా అమెరికా, రష్యాలవిధానాలమీద, ఆరెంటికీ బ్రిటనుకూమధ్య యేర్పడగల సామరస్యం లేక సంఘర్షణల తారతమ్యంమీదా ఆధారపడివుంటుంది. ప్రతివారు ప్రపంచశాంతి, సహకారాలకోసం అగ్రరాజ్యత్రయం ఏకంకావలసిన అవుసరంవున్నదని ఎలుగెత్తిచాటుతున్నారు. కాని, ప్రతిసందర్భంలోనూ, ఆఖరుకు యుద్ధంలోకూడా వారిమధ్య విభేదాలూ, అగాధాలూ యేర్పడుతున్నాయి. భవిష్యత్తు ఎలాగైనావుండనీ, యుద్ధానంతరం అమెరికా ఆర్థికవిధానం శక్తివంతంగా విస్తరించేలక్ష్యంగలిగివుండడం, దాదాపు విధ్వంసకరఫలితాలు సంభవించడంమాత్రం స్పష్టం. ఇది మరొక కొత్తరకంసామ్రాజ్యతత్వానికి దోవతీస్తుందా? అలాజరిగితే, అది మరొక విషాదాంతం కాగలదు. ఎందువల్లనంటే, భవిష్యత్ గమనాన్ని నిర్ణయం చేసేశక్తి, అవకాశము అమెరికాకే వున్నాయి.

సోవియట్‌యూనియన్‌యొక్క భవిష్యద్విధానం యింకా ముసుగులోనే వుంది. అయినా, ఇప్పటికే దానిరూపాన్ని వెల్లడిచేసే సూచనలు కొన్ని వున్నాయి. అది తనసరిహద్దులకుదగ్గరగా సాధ్యమైనన్ని ఎక్కువదేశాలు మిత్రులుగానో, సామంతులుగానో, అర్ధసామంతులుగానో వుండాలనేలక్ష్యంపెట్టుకుంది. అది ఇతరశక్తులతోకలసి ఒక రకమైన ప్రపంచవ్యవస్థను నెలకొల్పేందుకు ప్రోద్బలమిస్తున్నా, తాను

యితరులకుసాధ్యంగానిపునాదులమీద తనబలాన్ని నిర్మించుకోవడం మీదనే ఆధారపడుతోంది. ఇతరదేశాలుకూడా అదేవిధంగా శక్తి కొలది ప్రయత్నిస్తున్నాయనుకోవచ్చును. ఇది ప్రపంచసహకారానికి తగిన అవతారిక కాజాలదు. బ్రిటన్, అమెరికాలమధ్యనున్నట్లు సోవియట్‌యూనియన్‌కూ, ఇతరదేశాలకూమధ్య ఎగుమతుల, వాణిజ్య రంగాలకోసం పెనుగులాటలు లేవు. కాని, యీఅగ్రరాజ్యాలమధ్య నున్నవిభేదాలు గాఢమైనవి; వారిదృక్పథాలు ఒకదానికొకటి ఎంతో దూరంగావున్నాయి. యుద్ధంలో కలసి కృషిచేస్తున్నా, పరస్పరానుమానాలు తొలగిపోలేదు. ఈ విభేదాలు పెంపొందితే, అమెరికా, బ్రిటన్‌లు పరస్పరమైత్రి నెరపుకొని, రష్యాకూటమిలోని దేశాలకు వ్యతిరేకంగా బలపడగలవు.

ఈ చిత్రపటంలో ఆసియా, ఆఫ్రికాఖండాల లక్షలాది ప్రజల స్థానం యెక్కడ? వారు తమపరిస్థితుల్నీ, గతులనుగురించి బాగా ఎరుగుదురు. ప్రాపంచికవిషయాలుకూడా అవగాహనచేసుకున్నారు. వారిలో అనేకమంది ప్రపంచసంఘటనలను ఆసక్తితో పరిశీలిస్తున్నారు. వారిదృష్టిలో ప్రతి కదలిక, ప్రతిసంఘటన యీగీటురాయిమీదే పరిశీలించబడడం సహజం. అది మనం స్వతంత్రులమయ్యేందుకు సాయపడుతుందా? ఒకదేశంమీద మరొకదేశం పెత్తనంచేయడాన్ని అంతరింపజేస్తుందా? మనం యితరులసహకారంతో మనయిచ్ఛవచ్చినస్వతంత్ర జీవితాన్నిగడిపే అవకాశాన్నిస్తుందా? అది జాతులకూ జాతులకు మధ్య, ఒకజాతిలోని వివిధవర్గాలమధ్యసమానత్వాన్ని, సమానావకాశాలనూ కల్పించగలదా? అదిత్వరలోనే పేదరికాన్ని,నిరక్షరాస్యతనూ పోగొట్టి, ఉత్తమజీవనప్రమాణాలను నెలకొల్పే హామీనిస్తుందా? ఈ ప్రజలు జాతీయవాదులు. ఇతరప్రాంతాలను ఆక్రమించాలనిగాని, ఇతరులవిషయాల్లో జోక్యంకలిగించుకోవాలనిగాని ప్రయత్నించరు. ప్రపంచసహకారం, అంతర్జాతీయపాలనావ్యవస్థలు నెలకొల్పేందుకు చేయబడే ప్రతిప్రయత్నానికీ వారు స్వాగతమిస్తారు. కాని, ఇదికూడా పురాతన పెత్తనపువిధానాలనే కొనసాగించేందుకు వేయబడిన మరోయెత్తేమో నని వారు అనుమానిస్తారు. ఆసియా, ఆఫ్రికాలలోని విశాలప్రాంతాల్లో చైతన్యవంతులై, అసంతృప్తులై, మానవత్వాన్నికోరే మానవాళి నిండి

వుంది. వారిప్పుడున్న పరిస్థితులను ఇకనెంతమాత్రం సహించబోరు. ఆసియాలోని వివిధదేశాలపరిస్థితులూ, సమస్యలూ ఎంతో భేదించవచ్చు. కాని యీ విశాలప్రాంతమంతటా - ఇండియా, చైనా, ఆగ్నేయాసియా, అరబ్ దేశాల్లో - ఒకేరకమైన భావస్పందనలున్నాయి. అదృశ్యబాంధవ్యాలు వాటినన్నింటిని కలుపుతున్నాయి.

దాదాపు వెయ్యిసంవత్సరాలకుపైగా యూరపు వెనుకబడియుండి, తరచుగా అంధయుగపరిస్థితుల్లో మునిగివుండగా, ఆసియా మానవుని అభ్యుదయ దృక్పథాన్ని ప్రతిబింబించింది. ఆసియాలో మహోన్నత సాంస్కృతికచరిత్రలపరంపర పరిఢవిల్లింది. గొప్ప నాగరికతాకేంద్రాలు, శక్తి పెంపొందాయి. సుమారు 500 యేండ్లక్రితం యూరపు జాగరితమైంది. క్రమక్రమంగా ప్రాక్పశ్చిమాలకు వ్యాపించింది. శతాబ్దాలుగడచినకొద్దీ ప్రపంచంలోకల్లా మహత్తరశక్తి, సంపద, నాగరికతలుగలఖండంగా రూపొందింది. ఇలాంటిమార్పుల చక్రమేదైనా వుందా? ఆ చక్రం యిపుడు ఎదురుతిరుగుతున్నదా? శక్తి, అధికారాలు దూరప్రాచ్యంలోని అమెరికాకూ, యూరోపియన్ వారసత్వాన్ని సల్పంగానైనాపొందని తూర్పుయూరపుకూ చేరినమాట నిస్సంశయం. తూర్పునకూడా సైబీరియా అద్భుతంగా పెంపొందింది ఇతర తూర్పుదేశాలుకూడా మార్పుకు, త్వరితపురోగమనానికి అనువుగా తయారయ్యాయి. భవిష్యత్తులోసంభవించేది సంఘర్షణా, లేక ప్రాక్పశ్చిమాలమధ్య నూతన సమానత్వమా?

కాని, సుదూరభవిష్యత్తుమాత్రమే యీ ప్రశ్నకు సమాధానమివ్వగలదు. మరీ ముందుకు చూడడంవల్ల అంతగా ప్రయోజనం వుండదు. ప్రస్తుతానికి మనం నిత్యసమస్యలభారాన్ని మోయవలసిందే. మనల్ని చుట్టుముట్టేసమస్యలన్నింటినీ ఎదుర్కోవలసిందే. అనేక యితరదేశాల్లోవలెనే భారతదేశంలోకూడా అసలు సమస్య యీనిత్యసమస్యలవెనుక ఎక్కడో దాగివుంటుంది. ఆ సమస్య 18వ శతాబ్దినాటి యూరపుపద్ధతిలో ప్రజాస్వామ్యాన్ని స్థాపించడమే కాదు, అంతకంటె తీవ్రమైన సాంఘికవిప్లవంకూడా కలసివుండాలి. ప్రజాస్వామ్యసిద్ధాంతమే అనివార్యమనిపించే అలాంటిమార్పుకు గురి అయింది. అందువల్ల మార్పునుసహించలేనివారిదృష్టిలో ప్రజాస్వామ్యం

ఆచరణీయమా, కాదా అనే సందేహాలూ, ఖండనలూ చెలరేగుతు న్నాయి. ఈ పరిస్థితి ఫేసిస్టుధోరణులకు, సామ్రాజ్యతత్వదృక్పథం కొనసాగడానికీ దోవతీస్తుంది. నేటిభారతదేశంలో మనసమస్య - కులసమస్య లేక అల్పసంఖ్యాకులసమస్య, సంస్థానాధీశులు, మతవర్గాలు స్వార్థశక్తులు, పెద్దభూస్వాములు, దేశంలోపాదుకుపోయిన బ్రిటిష్‌అధి కారపరిశ్రమలసమస్యలు - అనీ కలసి, చివరికి సాంఘికవిప్లవాన్ని వ్యతి రేకించేవిగా సిద్ధమౌతాయి. వాస్తవమైన ప్రజాస్వామ్యంపైనాసరే అలాంటి సాంఘికమార్పుకు దోవతీస్తుందిగనుక, ప్రజాస్వామ్యానికే అభ్యంతరంచెబుతారు. భారతదేశవిలక్షణపరిస్థితుల కది అతకదని భావి స్తారు. అందువల్ల భారతదేశసమస్యలు పైకి అనేకరకాలుగాను, ఇతర దేశాలకు భిన్నంగానూ కనుపించినా, చైనా, స్పెయిన్, యూరప్, తదితరఖండాల్లోని అనేకదేశాలసమస్యలవంటివే. ఈసమస్యల్ని యుద్ధమే బహిరంగంచేసింది. యూరపులోని అనేక శతృనిరోధకోద్యమాలు యిలాంటిసమస్యలసంఘర్షణలను ప్రతిబింబిస్తున్నాయి. ప్రతిచోట సాంఘికశక్తులపురాతనస్థితిగతులు తలక్రిందులయ్యాయి. మరొక నూతన స్థితి నెలకొనేవరకు ఉద్రిక్తత, క్లిష్టత, సంఘర్షణలుండక తప్పదు. ఈ తక్షణసమస్యలనుంచి మనం మనకాలపు కేంద్రసమస్యవైపు మరలాలి. ప్రజాస్వామ్యాన్ని సామ్యవాదంతో జతపరిచే దెలాగు? వ్యక్తిస్వాతం త్ర్యం, చొరవలను ప్రోత్సహిస్తూనే, జాతీయ, అంతర్జాతీయరంగాల్లో కేంద్రీకృతసాంఘికాధిపత్యాన్ని, ప్రజల ఆర్థికప్రణాళికాధ్వర్యాన్ని సాధించే దెలాగు?

## ౧౩ స్వాతంత్ర్యం, సామ్రాజ్యం

అమెరికా, రష్యాలు భవిష్యత్తులో అత్యంతప్రముఖపాత్రవహించక తప్పదనిపిస్తోంది. ఆ రెండింటిమధ్యగలతేడాలు పురోగమించిన ఏ రెండు దేశాలమధ్యనైనావుండగలంత ఎక్కువగా వుంటాయి. ఆఖరుకు వాటి లోపాలుకూడా భిన్నమార్గాల్లోనే ఉంటాయి. పక్కా రాజకీయ ప్రజాస్వామ్యానికుండే చెడుగులన్నీ అమెరికాలో స్పష్టంగా కన్పిస్తాయి. రాజకీయప్రజాస్వామ్యం లేనందువల్ల ఉండే చెడుగులన్నీ రష్యాలో ఉన్నాయి. అయినా, సంచలనాత్మకదృక్పథం, విశాలసంపదలు,

సాంఘికసరళత్వం, మధ్యయుగాలనాటిచరిత్ర లేకపోవడం, విజ్ఞాన శాస్త్రంలోనూ, దాని అన్వయంలోనూ విశ్వాసం, విస్తృతవిద్యా వ్యాప్తి, ప్రజల కధికావకాశాలు - ఇవన్నీ ఆ రెండుదేశాల్లోను చాల వరకు సమంగానే ఉన్నాయి. అమెరికాలో గొప్పగొప్పదేశాలున్నా, అనేక యితరదేశాల్లోవలె శాశ్వతవర్గాలు లేవు, సమతాభావం ఉంది. రష్యాలో గత 20 ఏండ్లలోను జరిగినసంఘటనల్లోకల్లా అతిముఖ్యంగా కన్పించేది, ప్రజానీకం అద్భుతంగా విద్య, సంస్కృతులను సాధించడం. ఆవిధంగా ఆ రెండుదేశాల్లోనూ ప్రజాస్వామిక అభ్యుదయసంఘానికి కావలసిన ముఖ్యపునాదులు ఉన్నాయి విజ్ఞానహీనులుగా, పరిస్థితులను గురించి పట్టించుకోని నిర్లక్ష్యజీవులుగావుండే ప్రజానీకంమీద కొద్దిమంది విజ్ఞానవంతులు మాత్రమే పరిపాలనసాగించడమే ఆధారంగా పైనపేర్కొన్నటువంటి సంఘం యేర్పడజాలదు. ఇలాంటివిజ్ఞానవంతులు విద్యా, సంస్కృతుల్లో పురోగమించినప్రజలమీద ఎన్నాళ్ళో పెత్తనం చలాయించలేరు కూడాను.

ఒక వందసంవత్సరాలక్రితం, ఆనాటి అమెరికనులనుగురించి వ్యాఖ్యానిస్తూ డీ టాక్విల్లీ యిలా అన్నాడు —"ప్రజాస్వామ్యసిద్ధాంతం ఒకవైపున విజ్ఞానశాస్త్రంలో విజ్ఞానశాస్త్రంకోసమే కృషిచేయమని ప్రజలను ప్రోత్సాహించదు, మరోవైపున ఆ శాస్త్రంలో కృషిచేసేవారి సంఖ్యను విపరీతంగా పెంచివేస్తుంది......శాశ్వతంగా అనుమానంగా వుండేపరిస్థితులు ప్రజలు నిర్జీవసత్యాలనుపరిశీలించడంలో యావచ్ఛక్తిని వ్యర్థంగావినియోగించేటట్లుచేస్తాయి. ప్రజాస్వామ్యసాంఘికపరిస్థితులూ, సంస్థలూ ప్రజలను విజ్ఞానశాస్త్రాలతక్షణప్రయోజనకరప్రత్యక్షఫలితాలను అన్వేషించేందుకు సిద్ధంచేస్తాయి. ఈ ధోరణి సహజము, అనివార్యంకూడాను" అమెరికా అప్పట్నుంచీ పురోగమించింది, మార్పుచెందింది. అనేకజాతులమిశ్రమమయింది. కాని దానిముఖ్యలక్షణాలు మాత్రం కొనసాగుతునేవున్నాయి.

అమెరికన్, రష్యన్‌ప్రజల మరొక లక్షణంలోకూడా సామ్యం ఉంది. ఆసియా, యూరపులను కృంగదీసి, వారికృషినీ, సంఘర్షణల్ని చాలవరకు షరతులకులోనుగావించిన గతంయొక్క భారాన్ని మోయడంలేదు. ఈ తరంయొక్క భయంకరభారాన్ని మనందరివలెనే తప్పించు

కోలేరు కాని, ఇతరదేశాలప్రజలకు సంబంధించినంతవరకు వారి గతచరిత్ర తేటగావుంది. కాబట్టి భవిష్యత్తులోనికి వారుచేసేప్రయాణానికి ఆటంకాలంతగా వుండవు.

తత్ఫలితంగా ఆ దేశాలు యితరప్రజలను నిష్కళంకులుగా సమీపించవచ్చు. పాదుకుపోయిన సామ్రాజ్యతత్వదేశాలు ఇతరులతో ఎలాంటిసంబంధాలు పెట్టుకుంటున్నా గతచరిత్రయొక్కపరస్పరానుమానాలు తలెత్తుతాయి. అమెరికా, రష్యాల కిలాంటిబెడద లేదన్నంతమాత్రాన వాటిగతచరిత్రలో మచ్చలూ, మరకలూ, అనుమానాలూ లేవనికాదు. అమెరికాకు నీగ్రోసమస్య వుంది. వారు ప్రజాస్వామ్యమనీ, సర్వసమానత్వమనీ, చేసేప్రకటనలకు ఇదొక తీరని మచ్చ. రష్యనులు గతంలో తూర్పుయూరపులోను, ఇప్పుడీ యుద్ధంలోనూ కలిగించుకున్న ద్వేషంయొక్కస్మృతులను మాపివేసుకోవలసి వుంది. అయినా, అమెరికనులు ఇతరదేశస్థులతో తేలిగ్గా మైత్రినేర్పరచుకోగలరు. రష్యనులకు జాత్యహంకారం ఏమాత్రంలేదు

యూరోపియన్‌జాతుల్లో పెక్కింటిమధ్య పరస్పరద్వేషాలూ, చారిత్రకసంఘర్షణలూ, అన్యాయాలూ పూర్తిగా వున్నాయి. దీనికితోడు సామ్రాజ్యతత్వదేశాలు తాముపాలిస్తున్నప్రజల తీవ్రఅయిష్టతనుకూడా తెచ్చిపెట్టుకున్నాయి. ఇంగ్లండుసామ్రాజ్యపాలనాచరిత్ర సుదీర్ఘంకావడంవల్ల దానిపై నిందాభారం మరింతయెక్కువగా వుంది. ఇందువల్ల, లేక జాతీయవిలక్షణాలవల్ల ఆంగ్లేయులు కలుపుగోలుతనం లేనట్లుగా, అంటీముట్టనట్లు వుండి, ఇతరులతో తేలిగ్గా స్నేహంచేయలేరు. వారితరఫున విదేశాల్లో అధికారులుగావుంటున్నవారు ఆంగ్లేయుల ఉదారవాదానికి, సంస్కృతికి ధ్వజధరులుకాదగ్గవారు కాదు. తాముమహాపవిత్రులమన్నట్లు,ఇతరులుఅపరిశుద్ధులన్నట్లుప్రవర్తించడం యెక్కువ. దురదృష్టవశాత్తు అలాంటిఅధికారులనుబట్టే ఆంగ్లేయులందరూ అదేకోవవారని విదేశాల్లో ఎంచబడుతున్నది. ఈఅధికారుల్లో ఇతరులను విరోధులుగాచేసుకునే విలక్షణచమత్కారధోరణికూడా వుంది. కొద్దినెలలక్రితం భారతప్రభుత్వకార్యదర్శిఒకాయన డిటెన్షన్‌లోవున్నగాంధీకి ఒక సాధికారలేఖ వ్రాశాడు. అది ప్రయత్నపూర్వకంగా అహంకారాన్నిప్రదర్శించే ఉదాహరణవంటిది. దాన్ని అనేక

మంది ప్రజలు భారతీయులను దురుద్దేశపూర్వకంగా అవమానించడంగా భావించారు. గాంధీజీ భారతదేశచిహ్నం గదా!

భవిష్యత్తులో అవతరించేది మరొక సామ్రాజ్యవాదశకమా? లేక, అంతర్జాతీయసహకారయుగమా, లేక ప్రపంచకామన్వెల్తు యుగమా? ప్రపంచాభిప్రాయం మొదటిదానివైపే మొగ్గుతోంది. పాతవాదాలను పునరుద్ఘాటిస్తున్నారు. కాని, వాటిలో పూర్వపునిష్కాపట్యం లేదు. మానవాళినైతికోత్తేజాన్ని, త్యాగాన్ని నీచలక్ష్యాల కోసం ఉపయోగించుకుంటున్నారు. పాలకులు మానవునిమంచితనాన్ని ఉదాత్తతను దుష్టప్రయోజనాలకోసం వినియోగిస్తున్నారు. ప్రజల భయాలను, ద్వేషాలను, తప్పుడుకాంక్షలను తమదుర్మార్గాలకు అవకాశాలుగాచేసుకుంటున్నారు. వారు పూర్వం తమసామ్రాజ్యాన్ని గురించి దాపరికంలేకుండా మాట్లాడేవారు. ఎథీనియన్‌సామ్రాజ్యాన్ని గురించి వర్ణిస్తూ, థూసిడైడ్స్ యిల్లావ్రాశాడు. "మే మొక్కరమే ఆ కిరాతుని ఓడించాంగనుక, మా ఆశ్రితులకోసం, నాగరికతనురక్షించేందుకు మాజీవితాలనే ఒడ్డినాముగనుక, మాకీ సామ్రాజ్యాన్నిపాలించే హక్కున్నదని దర్పంగా ప్రకటించుకోవడంలేదు. తగినభద్రతకోసం యేర్పాట్లుచేసుకున్నందుకు ప్రజలను నిందించలేనట్లే, దేశాలనుకూడ నిందించలేం. మే మిప్పుడీ సిసిలీలో వున్నామంటే, మా స్వీయభద్రత కోసమే......మేము మా గ్రీకుసామ్రాజ్యాన్ని అంటిపెట్టుకుని, ఆలంబనంచేసుకునివుండేటట్లుచేసినది భయమే. ఆ భయమే మమ్మల్ని మా మిత్రులసహాయంతో సిసిలీపరిస్థితులను చక్కబెట్టేందుకు ఇక్కడికి తోలింది." మళ్ళీ ఎథీనియన్‌వలసల కప్పములనుగూర్చి పేర్కొనేటప్పుడు ఆయన ఇల్లావ్రాశాడు "దాన్ని జయించడం క్రూరంగా కన్పించవచ్చు, కాని, దాన్నివదలివేయడం ఘోరతప్పిదమనేది ఖాయం."

ఎథెన్సుచరిత్రనిండా ప్రజాస్వామ్యానికీ సామ్రాజ్యతత్వానికీ పొసగదనీ, ప్రజాస్వామికదేశం తనవలనదేశాలమీదచేసే ప్రజోపద్రవాన్నిగురించి, ఆ సామ్రాజ్యం అతివేగంగాక్షీణించి, పతనమైపోవడాన్నిగురించీ తెలుసుకోవలసిన పాఠా లనేకం వున్నాయి. నేడు స్వతంత్రాన్నిగాని, సామ్రాజ్యవాదాన్నిగాని సమర్థించేవారెవ్వరూ తమవాదనలను థూసిడైడ్స్ చెప్పినంత చక్కగా, విస్పష్టంగాచెప్పలేరు.

"మేము నాగరికతకు నాయకులం, మానవజాతికి అగ్రగాములం. మా సంఘమూ, సంబంధబాంధవ్యాలూ మానవుడివ్వగలిగిన మహోన్నత వరాలు. మా పలుకుబడిలోవుండడం పరాధీనతకాదు, మహదవకాశం. తూర్పుఖండపుసంపదలన్నీ కలిపినా మేముప్రసాదిస్తున్నసిరులతో సరి పోలవు. అందువల్ల మేము మాకుప్రవాహంగావస్తున్నధనాన్నీ, సాధనా లను ఉపయోగించుకుంటూ, ఎవరెంతప్రయత్నించినా మేము అప్పు లిచ్చేదాతలంగానే వుంటామనే ఆత్మవిశ్వాసంతో, సంతోషంగా కృషి చేయగలం. ఎందువల్లనంటే, ప్రయత్నంద్వారా, శ్రమించడంద్వారా, దెబ్బతిన్నసంఘటనలనుండి మేము మానవశక్తియొక్క రహస్యాన్ని గ్రహించాం. అదే సుఖానందాలనిచ్చే రహస్యం. మానవులు దాన్ని అనేకపేర్లలో ఊహించుకున్నారు. కాని. మేంమాత్రమే తెలుసుకోవడం నేర్చుకున్నాం, మానగరంలో నెలకొల్పుకున్నాం. సేవించడమే స్వాతం త్ర్యమని అది మాకునేర్పింది. అందువల్ల, మేముగుర్తించిన దానిపేరు స్వాతంత్ర్యం. మానవాళిమొత్తంలో మేముమాత్రమే లాభాల నెందుకు పంచిపెడుతున్నామోనని మీరాశ్చర్యపడుతున్నారా? స్వప్రయోజన కరపద్ధతుల్లో కాదు, స్వాతంత్ర్యంపట్లగల నిర్భయఆత్మవిశ్వాసంతోనే!"

స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం ఎలుగెత్తిచాటబడుతున్నా అవి కొద్దిమందికిమాత్రమే పరిమితమైన ఈరోజుల్లో పైమాటలన్నీ చిరపరి చితంగానే ధ్వనిస్తాయి. అందులో సత్యమూ వుంది, సత్యాన్ని కాదన డమూ వుంది. థూసిడైడ్స్ దృష్టి మధ్యధరాప్రాంతదేశాలమీదనే వుంది. మిగతాప్రాంతాలమానవాళినిగురించి అతనికితెలిసినది అల్పం. తన ప్రఖ్యాతనగరంయొక్క స్వాతంత్ర్యానికి గర్వించాడు. ఈ స్వాతం త్ర్యమే మానవశక్తికి, సుఖానందానికీ గల రహస్యమని కీర్తించాడు. కాని, ఇతరులుకూడా యీ స్వాతంత్ర్యంకోరుతున్నారని గుర్తించలేక పోయాడు. స్వాతంత్ర్యాన్నిప్రేమించే ఏథెన్సే మెలోస్‌ను దోచుకుంది, ధ్వంసంచేసింది. వయసుమళ్ళినపురుషులందర్నీ చంపివేసింది, స్త్రీలను, పిల్లలను బానిసలుగా అమ్మింది. ఏథెన్సుసామ్రాజ్య, స్వాతంత్ర్యాలను గురించి థూసిడైడ్స్ వ్రాస్తూవుండగానే, ఆ సామ్రాజ్యం అంతరించి పోయింది.

స్వాతంత్ర్యాన్ని అధికారాతిశయంతో, బానిసత్వంతో ఎక్కువ కాలం ముడిపెట్టివుంచడం సాధ్యంకాదు. అందులో ఒకదాన్నొకటి అధిగమించిపోతాయి. సామ్రాజ్యకీర్తిప్రతిష్ఠలకు, దానిపతనానికీ మధ్య అత్యల్పవ్యవధిమాత్రమే వుంటుంది. స్వాతంత్ర్యం అవిభాజ్యమనేది నేడు లోగడ ఏనాడూలేనంతనగ్నసత్యం. తాను ప్రాణప్రదంగాప్రేమించే నగరాన్ని కీర్తిస్తూ, పెరికిల్స్ అమోఘకావ్యం రచించాడు. వెన్వెంటనే ఆనగరం పతనమై, అక్రోపోలిస్ స్పార్టన్‌సైన్యంచేత ఆక్రమించబడింది. అయినా, ఆయనకవితలో సౌందర్యం, విజ్ఞానం, స్వాతంత్ర్యం, ధైర్యం పట్లగల ప్రేమానురక్తికి మనమిప్పటికీ ముగ్ధులమైపోతాం. ఆ కవిత ఆనాటి ఎథెన్సునగరానికే గాదు, విశాలపూర్వోత్తరసంబంధమైన ప్రపంచానికే వర్తిస్తుంది: "మేము ఆడంబరంలేని సౌందర్యాన్ని, మానవతావిహీనంకాని విజ్ఞానాన్ని ప్రేమిస్తాం. మాదృష్టిలో సంపద వట్టి భౌతికాడంబరం కాదు, విజయసాధనకు ఒక ఆలంబనం. పేదరికాన్ని అవమానకరంగా తలచము, కాని, దాన్నిఅధిగమించేందుకు ప్రయత్నమూచేయకపోవడం వాస్తవమైనపతనంగా భావిస్తాం...... పునర్వచింపబడ్డ వాదనల (యుద్ధంలో ధైర్యప్రదర్శన గొప్పఉదాత్తతకదూ!) నుంచేగాక, మనం ప్రతినిత్యముచూస్తున్న మనమహానగరజీవితపుహడావుడిదృశ్యాన్నుంచికూడా మనం ఉత్తేజాన్ని పొందుదాం. మనం మన నగరాన్నిచూస్తూనే, దాన్నిప్రేమిస్తాం. సైనికసాహసం, వైజ్ఞానికునివలె బాధ్యతనర్థంచేసుకునేశక్తి, ఆ బాధ్యతానిర్వహణలో సద్వ్యక్తికుండే ఆత్మసంయమనంగల పురుషులే ఈమహానగరకీర్తికి కారణం. ఆపురుషులే కఠినపరీక్షలోనైనా విఫలులైనా, ఆనగరానికి తమసేవలులేకుండాచేసినా, దానికోసం తమజీవితాలనే గొప్పపూజాపుష్పాలుగా సమర్పించుకున్నారు. ఇవన్నీ మనం స్మరించుతూ ఉత్తేజంపొందుదాం. ఆవిధంగా ఆ పురుషులు సర్వజనశ్రేయంకోసం తమశరీరాలను అర్పించారు. ప్రతిఫలంగా ప్రతిఒక్కరూ అమరకీర్తిని, తమభౌతిక దేహాలను దాచివుంచే అపూర్వసౌందర్యసమాధినేగాక, మానవహృదయాల్లోనే స్థానంపొందారు. వాటిలో వారికీర్తి నిత్యనూతనంగావుంటూ, సమయంవచ్చినపుడు వాక్కుల్లో, చర్యల్లో సంచలిస్తుంది. ఎందువల్లనంటే, ప్రఖ్యాత పురుషులకు యీప్రపంచమంతా ఒకేసమాధివంటిది. వారిగాథలు వారి

స్వస్థానాల్లో రాళ్ళమీద చెక్కబడడమేగాక, దూరదూరాల్లోకూడా కంటికగుపించేచిహ్నం లేకుండానే ఇతరమానవజీవితాల్లో అల్లుకొని వుంటాయి. అలాంటివారందరు చేసినఘనకార్యాలతో నీ విపుడు పోటీ పడాలి. సుఖానందంలోనిరహస్యం స్వాతంత్ర్యమేననీ, స్వాతంత్ర్య రహస్యం ధైర్యోపేతమైన హృదయమేననీ తెలుసుకోవాలి. పైపైకి వస్తున్నశత్రువుకు తప్పుకుని, సోమరిగా ప్రక్కను నుంచోరాదు."

## ౧౪ జనాభాసమస్య, జననముల తగ్గుదల, జాతీయక్షయము

అయిదుసంవత్సరాలుగా జరుగుతున్న యుద్ధంవల్ల పెద్దపెద్ద మార్పులు జరిగాయి. గతచరిత్రలో ఎన్నడూలేనంత భారీయెత్తున ప్రజల స్థలమార్పిడి, నష్టాలు సంభవించాయి. యుద్ధంవల్ల కోట్లాది జనం చనిపోవడమేగాక, ముఖ్యంగా చైనా, రష్యా, పోలండ్, జర్మనీలలో ఎక్కువమందిప్రజలు తమస్వగృహాలను, స్వదేశాలును విడచి పోవలసివచ్చినది. సైనికావసరాలకోసం, శ్రామికులకోర్కెలు తీర్చడం కోసం బలవంతంగా ఖాళీచేయించడంవల్ల దండెత్తివస్తున్నసైనికులకంటె ముందుగా ప్రజలు తండోపతండాలుగా కాందిశీకులైపోయారు. యుద్ధానికి పూర్వంకూడా నాజీసిద్ధాంతంవల్ల యూరపులో కాందిశీకులసమస్య ఆకాశాన్నంటుకుంది. కాని' యుద్ధపరిణామాలతో పోల్చితే, యివి గణనకేరావు. యూరపులోనిమార్పులకు యుద్ధఫలితాలు ప్రత్యక్ష కారణం కావచ్చు. కాని, నాజీలు పట్టుదలతో అనుసరించిన జాత్యహంకార పైశాచికవిధానం అంతకంటె ముఖ్యకారణం. వారు లక్షలాదియూదులను చంపివేయడం, తా మాక్రమించిన అనేక దేశాలజనసాంద్రతను విచ్ఛిన్నంచేయడం స్పష్టమే. సోవియెట్ యూనియనులో లక్షలాదిప్రజలు తూర్పువైపుకు వలసవెళ్ళి, యూరల్ పర్వతాలకావలివైపున క్రొత్తనివాసా లేర్పరచుకున్నారు. అవి బహుశా, శాశ్వతనివాసాలే కావచ్చు. చైనాలో అయిదుకోట్లమంది స్వస్థలాలకు దూరమయ్యారని అంచనావేయబడినది.

ఈ ప్రజలకు - యుద్ధానంతరం మిగిలివున్నవారికి - తిరిగి స్వస్థలాల్లోనో, మరొకచోటనో పునర్నివాసం కల్పించేందుకు - అది అసంఖ్యాక క్లిష్టసమస్యలతోకూడిన కార్యమైనాసరే-ప్రయత్నాలుచెయ్య

బడతాయనేది నిస్సంశయం. అనేకమంది స్వగృహాలకు తిరిగి వెళ్ళారు. మరి అనేకమంది తమ కొత్తనివాసాల్లోనే వుండాలనుకోవచ్చు. ఇంకో విధంగాచూస్తే యూరపులోజరిగే రాజకీయమార్పులవల్లమళ్ళీయెందరో కాందిశీకులుగావడం, జనాభామార్పిడి జరగడం సంభవమనిపిస్తోంది.

అంతకంటె గాఢంగా, దీర్ఘప్రభావంగలవిగా జరుగుతున్న జీవ, జంతు శాస్త్ర సంబంధమైన మార్పులు ప్రపంచజనాభానే త్వరితంగా మార్చివేయగలవు. పారిశ్రామికవిప్లవం, ఆధునికసాంకేతికశాస్త్రవ్యాప్తి కారణంగా యూరపుజనాభా - ముఖ్యంగా వాయవ్య, మధ్య యూరపులలో - అతిత్వరితంగా పెంపొందింది. ఈ సాంకేతికశాస్త్రం తూర్పు ముఖంగా సోవియెట్‌యూనియనుకు వ్యాపించి, నూతన ఆర్థికవ్యవస్థ మొదలగువాటి సహాయాన్ని పొంది, ఆప్రాంతాలజనాభాను మరింత ఆశ్చర్యకరంగా పెంపొందించింది. ఈ సాంకేతికప్రవాహం తూర్పు ముఖంగా ప్రవహిస్తూనేవుంది. దానికి విద్య, ఆరోగ్యం, పరిశుభ్రతలు తోడై, ఆసియాలో అనేక దేశాలను ప్రభావితంచేస్తున్నాయి. అందులో కొన్ని దేశాలు ఇండియావలెనే ఇంకా జనాభాపెరగాలని కోరుకో నక్కరలేదు. జనసంఖ్య తక్కువగావుండడమే మేలు.

ఈలోపుగా పశ్చిమయూరపుజనసంఖ్య అపసవ్యముఖంగా పరిణమించసాగింది. అక్కడ జనసంఖ్య తగ్గుముఖం పట్టిందనేసమస్యకు ప్రాముఖ్యత హెచ్చుతోంది.

ఈధోరణి విశాలవ్యాప్తమై, ప్రపంచంలో అనేకదేశాలమీద దాని ప్రభావాన్ని ప్రసారిస్తున్నట్లుంది. కాని, చైనా, ఇండియా, జావా, రష్యా మున్నగుదేశాల కిది వర్తించదు. పారిశ్రామికంగా పురోగమించిన దేశాల్లో యిది విస్పష్టంగా కనిపిస్తోంది. ఫ్రాన్సుజనాభా పెరుగుదల చాలాయేండ్లక్రితమే ఆగిపోయింది. ఇప్పుడుక్రమంగా క్షీణిస్తోందికూడా. ఇంగ్లండులో 1880 తర్వాతనుంచీ జననాలసంఖ్య క్రమక్రమంగా తగ్గిపోవడం గమనింపదగినది. ఇప్పుడు ఫ్రాన్సుమినహా మిగతాయూరపులో జననదామాషా అత్యల్పంగా ఉంది. జర్మనీ, ఇటలీలలో జననసంఖ్యను పెంచేందుకు హిట్లర్, ముసోలినీలు చేసినప్రయత్నాలు తాత్కాలికంగా మాత్రమే ఫలించాయి. దక్షిణ, తూర్పు (రష్యామినహా) యూరపులలోకంటె ఉత్తర, పశ్చిమ, మధ్యయూరపులలో ఈ క్షీణింపు

మరింత స్పష్టంగావుంది. కాని, ఈ ప్రాంతాలన్నిటిలోను ఈ వైఖరులే ఉన్నాయి. ఇప్పటి వైఖరులనుబట్టి యూరపు (రష్యామినహా) 1955 ప్రాంతాల్లో అత్యధికజనాభాస్థాయికి చేరుకుని, తదాది క్షీణించడం ఆరంభమౌతుంది. ఈ క్షీణింపును ఉధృతంచేసే యుద్ధంతో యీ అంచనాలకు సంబంధంలేదు.

ఇది యిలావుండగా, సోవియట్‌యూనియన్‌లోమాత్రం జనాభావృద్ధిఅవుతూనే వుంటుంది. 1870 నాటికి దాని జనసంఖ్య 25 కోట్లకు పెరుగవచ్చు. ఈ అంచనాలో యుద్ధఫలితంగా ఏర్పడే ప్రాంతీయ మార్పులు చేర్చబడలేదు. ఈ జనాభావృద్ధిని సాంకేతిక, తదితర పురోగమనాలతో కలిపిచూస్తే, రష్యాదేశం యూరపు, ఆసియాలలో అగ్రరాజ్యంగా భావించకతప్పదు. ఆసియావిషయం చాలవరకు చైనా, ఇండియాల పారిశ్రామికాభివృద్ధిమీద ఆధారపడివుంటుంది. ఈ దేశాల జనాభాను సక్రమంగా, ఉత్పత్తిరంగాల్లో వినియోగించుకోకపోతే ఆ జనబాహుళ్యం వాటికి భారమూ బలహీనకరంకూడాను. గతంలో గొప్పవలసలుగల యూరోపియన్‌దేశాలు విస్తరణ, దురాక్రమణల స్థాయిని దాటిపోయినట్లు స్పష్టమవుతోంది. వాటి రాజకీయార్థిక వ్యవస్థలు వాటిప్రజల నైపుణ్య సామర్థ్యాలు వాటికి ప్రపంచవ్యవహారాల్లో యిప్పటికీ ప్రముఖస్థానాన్నియ్యవచ్చు. కాని, అవన్నీ ఒకేకూటమిగా వ్యవహరించకపోతే, క్రమక్రమంగా అగ్రశక్తులనేపేరునుకూడా పోగొట్టుకోగలవు. ఈ సందర్భంలో ఫ్రాంక్. డబ్లు. నోటెస్టెయిన్ మాటలు గమనార్హం: "వాయవ్య, మధ్యయూరపులలోని ఏదేశమైనా మళ్ళీ ప్రపంచాన్ని సవాల్‌చేయగల సూచనలు కన్పించడంలేదు. త్వరితంగా పెంపొందుతున్న జాతులన్నింటికి సాంకేతికనాగరికత వ్యాపిస్తున్నందువల్ల, జర్మనీ తనయిరుగుపొరుగుపాశ్చాత్యదేశాలవలెనే, ప్రపంచంలో కల్లా అగ్రశక్తికాగల తరుణాన్ని కోల్పోయింది.

సాంకేతిక, పారిశ్రామికాభివృద్ధివల్ల అనేక పాశ్చాత్యజాతులకు, దేశాలకు గొప్పశక్తివచ్చింది. ఈ శక్తికారకనిక్షేపం కొలదిజాతుల గుత్తాధికారంలోనే వుండిపోవడం అసంభవం. అందువల్ల యూరప్ ప్రపంచంలో ముఖ్యభావాలమీద రాజకీయార్థికపెత్తనం చలాయించడం వేగంగా క్షీణించిపోకతప్పదు. యూరపు, యూరేషియా, ఆఫ్రికా

ఖండాలకు కీలక కేంద్రంగావుండడంకూడా సమాప్తమవుతుంది. ఈ ప్రాథమికకారణంవల్ల పాత యూరోపియన్ అగ్రరాజ్యాలు శాంతి, అంతర్జాతీయసహకారాలదృష్టితోనే ఆలోచనలూ, కార్యక్రమాలూ సాగిస్తూ, సాధ్యమైనంతవరకు యుద్ధాన్ని తప్పించుకోజూస్తాయి. దురాక్రమణ తప్పకుండా విధ్వంసానికే దారితీస్తుందని స్పష్టమైనపుడు, అది మరి ఆకర్షించలేదు. కాని, ఇప్పటికీ పైచేయిగావున్న ప్రపంచాగ్రరాజ్యాలకు ఇతరులతో సహకరించాలనే ప్రేరణ – పైనపేర్కొన్నటువంటిది–లేదు. ఒకవేళ నైతికప్రేరణ వున్నదేమో కాని, తరచుగా దానికీ శక్తికీ సాన్నిహిత్యం వుండదు.

పైనచెప్పినట్లుగా, జననాలసంఖ్యపడిపోవడమనే విశ్వవ్యాప్త సమస్యకు కారణ మేమిటి? సంతాననిరోధకసాధనాలను విరివిగా ఉపయోగించడం, తగినంత కొద్దిమందిగలకుటుంబాలే కలిగివుండాలన్న కాంక్ష కొంతవరకు కారణంకావచ్చు. కాని, ఇందువల్లనే పెద్దమార్పు రాలేదని సర్వసాధారణంగా గుర్తింపబడింది. కేథలిక్ మతదేశమైన ఐర్లండులో, సంతాననిరోధకసాధనా లంతగా ఉపయోగింపబడక పోయినా, అక్కడ ఇతరదేశాలన్నింటికంటె ముందే జననాలసంఖ్య క్షీణించసాగింది. బహుశా, పాశ్చాత్యదేశాల్లో వివాహాలు నానాటికీ ఆలస్యంగాజరగడం ఒకకారణమేమో! ఆర్థికపరిస్థితులప్రభావంకూడా కొంతవుండవచ్చునుగాని, అదీ అంతలెక్కించదగ్గకారణం కాదు. భాగ్యవంతులకంటె పేదలకు, నగరాల్లోకంటె గ్రామాల్లోను సంతానప్రాప్తి యెక్కువనేది సర్వసాధారణంగా అందరికీ తెలిసినదే. మందితక్కువైతే ఉన్నతస్థాయిలో బ్రతుకవచ్చు. వ్యక్తివాదాభివృద్ధి సంఘము, జాతుల ప్రాముఖ్యతను తగ్గిస్తుంది. సంఘంలోకల్లా ఏ వర్ణాలు లేక వర్గాలు గొప్పవని ఆ సంఘంచే భావించబడతాయో, ఆ వర్గాలలో సంతానప్రాప్తి ఇతరప్రజాసామాన్యంలోకంటె అనేకనాగరికసంఘాల్లో చాలా తక్కువ కావడం సర్వసామాన్యమని ప్రొఫెసర్ జె. టి. ఎస్. హాల్డేన్ చెపుతున్నాడు. ఆవిధంగా ఆ సంఘాలు శారీరకస్థిరత్వంలేనివైనట్లు కనిపిస్తాయి. పెద్దపెద్దకుటుంబాల్లో సాధారణంగా విజ్ఞానగంధం తక్కువగావుంటుంది. ఆర్థికసాఫల్యంకూడా శారీరకసాఫల్యానికి వ్యతిరేకమని భావించబడుతోంది.

జననాలసంఖ్య క్షీణించడానికి ఉపకారణాలనేకం చూపబడుతున్నా, అసలుకారణా లేమిటో అంతగా తెలిసినట్లులేదు. ఏమైనా, దీనికి నివాస, దైహికకారణాలు కొన్నివుండవచ్చు. పారిశ్రామికప్రాంతీయులుగడిపేజీవితమూ, వారునివసించేవాతావరణమూ ఇట్టికారణాలు కావచ్చు. పోషకశక్తిచాలనిఆహారము, త్రాగుడు, మత్తుపదార్థములు లేక అనారోగ్యము,మానసిక,శారీరకబలహీనతలు ఉత్పత్తినితగ్గిస్తాయి. అయినా, వ్యాధులతోమూలుగుతూ, చాలీచాలనితిండితినేవర్గాలు భారతదేశంలోవలెనే విపరీతంగా సంతానోత్పత్తిచేస్తున్నాయి. బహుశా ఆధునికజీవితంలోని ఉద్రిక్తత, పనులవత్తిడి, ఎడతెగనిపోటాపోటీలు, వ్యథలు సంతానశక్తిని తగ్గించివేస్తాయి. జీవనప్రదాయినియగు సారవంతమైనభూమికి దూరంకావడం ముఖ్యకారణం కావచ్చు. ఆఖరుకు అమెరికాలోకూడా వృత్తిపనులవర్గాలకంటె వ్యావసాయికశ్రామికుల్లో సంతానోత్పత్తి రెట్టింపు యెక్కువ.

మొదట పశ్చిమఖండంలోను, తర్వాత యితరప్రాంతాల్లోను వ్యాపించిన ఆధునికనాగరికత – ముఖ్యంగా ఆ నాగరికతయొక్క ప్రధానలక్షణమైన బస్తీజీవితం స్థిరత్వంలేనిసమాజాన్ని సృష్టిస్తుందనీ, ఆ సమాజం క్రమక్రమంగా జీవశక్తిని కోల్పోతుందనీ తోస్తోంది. జీవితం అనేకరంగాల్లో పురోగమిస్తుంది, కాని, తన ఆయువుపట్టునే కోల్పోతుంది. అది కృత్రిమమై నెమ్మదిగా అణగారిపోతుంది. దినదినము నిద్రించడానికి, ఇతర దైహికకృత్యాలుజరపడానికీ కూడా మందులు జీర్ణకోశాన్ని సంచలింపజేసి, తాత్కాలికోత్తేజాన్నిచ్చే ఆహారపదార్థాలూ, పానీయాలూ (అవి జీర్ణమండలాన్ని బలహీనపరుస్తాయి.) మనకు తాత్కాలిక, సంతోషాన్నీ, ఆవేశాన్నీ ఇచ్చే ప్రత్యేకసాధనాల అవసరం హెచ్చుతుంది. ఉత్తేజంతరువాత సంభవించే పరిణామం నీరసం. ఆ తర్వాత ఏదో లోపించిందన్నభావం. మనం సృష్టించిన యీ నాగరికతలో బ్రహ్మాండమైననైపుణ్యాలూ, వాస్తవమైన విజయాలూ వున్నా, అందులో కొంత నకిలీతనంకూడా వుంది. మనం రసాయనికయెరువులతో సృష్టించబడ్డ రసాయనికఆహారపదార్థాలు తింటాం, రసాయనికోత్తేజాల్లో మునకవేస్తాం. మనమానవసంబంధాలు బాహ్యరంగాన్నిదాటి లోతుకుపోవడం అరుదు. మన

తరానికి చెందిన చిహ్నాల్లో ప్రకటనదారొకడు. అతడు నిరంతరదృష్ఠ ప్రయత్నాలతో మనల్ని విభ్రాంతులనుచేసి, మన గ్రహణశక్తులను మొద్దుబారించి, అనవసరవస్తువులను – ఆఖరుకు హానికరమైనవాటిని కూడా – మనం కొనేటట్లుచేస్తాడు. మనమందరమూ యీతరంయొక్క ఫలితాలమే. మనసులో యీ తరంలక్షణాలన్నీ వున్నాయి గనుక, మనం దానిమంచికీ, చెడుకూకూడా బాధ్యులమే. నేను ఈపరిస్థితులకు ఇతరులను నిందించడంలేదు. నిజానికి నేను కూడా ఈ నాగరికతలో ఒకభాగాన్నే గనుక, అందరివలె నేనూ దాన్ని కీర్తిస్తాను. విమర్శిస్తాను. నా అలవాట్లూ, ఆలోచనాపద్ధతులూ దాని ప్రభావంవల్లనే రూపొందాయి.

మూలంలోనే యీ సంతానవిహీనతను, జాతిక్షయాన్ని సృష్టిస్తున్న యీ ఆధునిక నాగరికతలోగల లోప మేమిటి? కాని, యిది కొత్తవిశేషమేమీకాదు. ఇలాంటిది లోగడకూడా జరిగింది. చరిత్రనిండా అనేక ఉదాహరణ లున్నాయి. రోముసామ్రాజ్యం క్షీణదశలో యింతకంటే హీనంగా వుంది. ఈ అంతర్గతక్షీణతనుశాసించే 'చక్ర'మేదైనా వుందా? దానికి కారణాలను అన్వేషించి, తొలగించగలమా? ఆధునికపారిశ్రామికాభివృద్ధి, పెట్టుబడిదారీసాంఘికవ్యవస్థలే దీనికి పూర్తి కారణం కావు; అవి లేనప్పుడుకూడా క్షీణస్థితి ఏర్పడింది. ఏమైనా, అవి నేడున్నరూపంలో, ఆ కారణాలు సఫలంకాదగిన సుముఖ– శారీరక, మానసిక – వాతావరణాన్ని సృష్టించవచ్చు. మూలకారణం ఆత్మసంబంధమైనదైతే–మానవునిమనసునూ, ఆత్మనూ ప్రభావితంచేసేదైతే – మనం దాన్ని అర్థంచేసుకునేందుకు ప్రయత్నించవచ్చు; అంతరాత్మలో దాన్నిస్పృశించవచ్చు. కాని, దాన్ని ఇదమిత్థమని తేల్చడం మాత్రం కష్టం. కాని,సుక్షేత్రానికిదూరంకావడం వ్యక్తికీ, జాతికీ కూడా చెరుపే ననేదిమాత్రం స్పష్టంగా ద్యోతకమవుతోంది. భూమి, సూర్యుడు జీవనప్రదాన నిధానాలు. మనం దీర్ఘకాలం వాటికి దూరంగావుంటే, జీవితం కృశించిపోనారంభిస్తుంది. ఆధునిక పారిశ్రామికవర్గాలు భూమితో సంబంధాల్నే కోల్పోయాయి. ప్రకృతియిచ్చే ఆనందాన్ని అనుభవించడం, భూమాతసాన్నిహిత్యంవల్లవచ్చే ఆరోగ్యజ్యోతిని పొందడం వారెరుగరు. వారు ప్రకృతిసౌందర్యాన్నిగురించి ప్రశంసిస్తారు.

దాన్ని పొందేందుకు అప్పుడప్పుడూ (శెలవుల్లో) ప్రయత్నిస్తారు. గ్రామప్రాంతాలను తమకృత్రిమజీవితలక్షణాలతో కళ్మలంచేస్తారు. కాని వారు ప్రకృతిఅంతర్యాన్ని గ్రహించలేరు. అందులో తాము భాగాలమే నని అనుకోలేరు. తా మలాచెయ్యాలని విన్నారు గనుక, వారు ప్రకృతిని చూస్తూ, ప్రశంసించుతారు. వారిదృష్టిలో అదొక – చూచి, ఆనందించ దగ్గ – విశేషం. అలా చూచి, ఏదో భారంతగ్గినట్లు నిట్టూర్పువిడచి, స్వగృహాలకు చేరుకుంటారు. ఇదెలావుంటుందంటే, వారొక మహాకవి (లేక గొప్పరచయిత) రచనను శ్లాఘించప్రయత్నించి, ఆ ప్రయత్నంలో అలసిపోయి, దాన్ని అవతలబెట్టి, తనుమేధ పనిచేయనవసరంలేని ఏ అభి మానవవలనో, అపరాధపరిశోధకకథనో చదువనారంభించినట్లుంటుంది. వారు ప్రాచీనగ్రీకులు, భారతీయుల్లాగా ప్రకృతిబిడ్డలుకారు. తమకంతగా తెలియని దూరబంధువును తప్పనిసరియై చూడబోయి, యిబ్బందిపడే అపరిచిత మానవులుమాత్రమే. అందువల్ల వారు ప్రకృతియొక్కపుష్కలజీవి తాన్నీ, అగణితవైవిధ్యాన్నీ అవగాహనచేసుకోలేరు. మనపూర్వీకులవలె నిండి తొణికిసలాడే గాఢజీవితానుభూతినీ పొందలేరు. అలాంటప్పుడు ప్రకృతి వారిని ఇష్టంలేని సవతిబిడ్డల్లా చూస్తుందంటే ఆశ్చర్యమేముంది?

మనం ఆ ప్రాచీన అద్వైతదృక్పథానికి మళ్ళీ పోలేము. కాని, యిప్పటికీ ప్రకృతినిగూఢవైచిత్రిని ఆస్వాదించగలం; దానిజీవిత, సౌంద ర్యగానాన్ని వినగలం. దానినుంచి శక్తిని పుంజుకోగలమనుకుంటాను. ఆ పాట కొన్ని ప్రత్యేకప్రదేశాల్లోమాత్రమే పాడబడదు. మనం వినా లనుకుంటే, దాదాపు ప్రతిచోట దాన్నివినగలం. కాని, అందుకు సిద్ధంగాలేనివారినికూడా ముగ్ధుల్నిచేసేప్రదేశాలు కొన్నివున్నాయి. ఆ గానం ఎంతోదూరానవున్న ఒకశక్తివంతమైన సంగీతసాధనంనుంచి వస్తు న్నట్లుంటుంది. అలాంటి వరప్రసాదితప్రదేశాల్లో కాశ్మీరు ఒకటి. అది సౌందర్యనిలయం. ఆ సౌందర్యశోభ మంత్రముగ్ధుల్ని చేసివేస్తుంది. ప్రఖ్యాత ఫ్రెంచి పండితుడు ఎం. ఫోచర్ కాశ్మీరునుగురించి యిలా వ్రాశాడు: "కాశ్మీరులో ఒక ప్రత్యేక ఆకర్షణ వుంది. దాన్ని విపులీక రించుకోప్రయత్నించనివారుకూడా దానికోసం అశ్రులుచాస్తారు. నే నింకొంచెం ముందంజవేసి, ఆ ప్రత్యేకవైచిత్రికి నిజకారణం ఏమిటని విశ్వసిస్తున్నానో చెప్పమంటారా? దాని సుందరారణ్యాలూ, నిశ్చల

నిర్మలజలకాసారములూ, మంచుక్రమ్మిన పర్వతశిఖరాల విభ్రమసౌందర్యము, చల్లనిపిల్లగాలుల్లో మర్మరధ్వనులుచేసే అనేకానేక సెలయేళ్ళూ మాత్రమే యిందుకు కారణం కాజాలవు. సముద్రంలోకి చొచ్చుకొనివున్న ఒక భూమిఅగ్రంమీద నిలచిన గ్రీకుదేవాలయమంతసగర్వంగా కాశ్మీరులోని మార్తాండశిథిలాలు 'కారెవా'నొకాగ్రం వద్ద నిలచియున్నా, లిస్‌క్రేట్స్‌స్మృతిచిహ్నాలను సరిపోలే సర్వాంగసౌష్టవంతో పదిరాళ్ళతోమలచబడ్డ 'పాయార్' దేవాలయం వున్నా, దాని ప్రాచీనసౌధాలు అత్యంతకోవిగా, సుందరంగా వున్నా, అవే కాశ్మీర్ సౌందర్యచమత్కృతికికారణంకాజాలవు. సుందరదృశ్యాలమధ్య మహోన్నతసుందరసౌధాలుండడం ఇంకా అనేకదేశాల్లోకూడా సహజమేగనుక కళ, ప్రకృతీసౌందర్యాలసమ్మేళనమే యిందుకు కారణమని కూడా ఎవ్వరూ అనలేరు. కాని, కాశ్మీరులోమాత్రమే ప్రత్యేకంగా కన్పించే దేమిటి? ఇప్పటికీ నిగూఢవైచిత్ర్యజీవితంతో మూర్తీభవించే ప్రకృతిమధ్య పైనపేర్కొన్న రెండురకాలసౌందర్యశోభ మేళవించడమే! ఆ వైచిత్రికి మనచెవుల్లో గుసగుసలుచెప్పడం తెలుసు, మనలోని అగాథాంతరాలను సంచలింపజేయడం తెలుసు. ఆ సంచలనం మనఅంతరాత్మలకు తెలిసీ, తెలియకుండానే ఆ గతించినకాలంలోకి, మహాకవులు ఆనాడు లేకపోయామని విలపించేకాలంలోకి, ప్రపంచం బాల్యదశలో వున్నకాలంలోకి తీసుకుపోతుంది."

నాకు కాశ్మీరుపట్ల పక్షపాతము, అభిమానం ఉన్నాయి. అవి నన్నెప్పుడప్పుడు అసలువిషయానికి దూరంగాతీసుకుపోతాయి. అయినా కాశ్మీర్‌ను కీర్తించడమే నా ఉద్దేశం కాదు. నేనొకరకమైన ప్రకృతి ఆరాధకుణ్ణి. ప్రకృతిఆరాధనాతత్వం కొంచెమైనావుండడం మనసుకూ, శరీరానికీ కూడా మంచిదని నా విశ్వాసం. అయినా అద్వైతతత్వాన్ని సమర్థిస్తూ వాదించడం నా అభిమతంకాదు. భూమినుంచి పూర్తిగా సంబంధంలేకుండాపోయే జీవితం చివరికి కృశించి, వాడిపోతుందని నా నమ్మకం. సహజంగా అలా పూర్తిగా సంబంధంలేకపోవడం అరుదే. ప్రకృతిపరిణామాలు కొంత నిదానంగా జరుగుతాయి. కాని ఆధునిక నాగరికత క్రమక్రమంగా జీవనప్రదాయినులైన మూలశక్తులకు మరింత దూరంకావడం ఒకబలహీనతే. ఆధునికపెట్టుబడిదారీసమాజంయొక్క

పోటీ, ఆర్జనలక్షణాలూ, అన్నిటికంటె ధనానికే అగ్రస్థానాన్నిచ్చి, పూజించడం, అనేకమంది నిరంతరం శ్రమిస్తున్నా భద్రతలేకుండాపోవడం మొదలైనవి మనోవ్యాధులను పెంచుతాయి. మందబుద్ధిని సృష్టిస్తాయి. ఇంతకంటె ఎక్కువదీర్ఘదృష్టి, స్థిరమైనఆర్థికవ్యవస్థలు యీపరిస్థితులను బాగుపర్చగలవు. అప్పుడైనా, ప్రకృతితో, భూమితో సజీవసంబంధాలు ఎక్కువగా అవసరం. అంటే, పూర్వకాలపు సంకుచితార్థంలో భూమి వైపుమళ్ళడం కాదు, లేక ఆదిమమానవజీవితమార్గాలకు మళ్ళడమూ కాదు. అటువంటిమందుకంటె వ్యాధే నయం. స్త్రీ, పురుషులు సాధ్యమైనంతవరకు భూమాతకు సన్నిహితంగాఉండేవిధంగా ఆధునికపరిశ్రమలను ఏర్పాటుచేసి, పల్లెసీమలనాగరికతాస్థాయిని పెంపొందించడం సాధ్యంకావాలి. జీవిత శారీరక, మానసికాభివృద్ధికి సంపూర్ణావకాశాలుండి, సమగ్రపరిపూర్ణజీవితం గడుపగలగాలి.

ప్రజ లిలా చేయదలచుకుంటే, యిది సాధ్యంకాగలదనేది నిస్సందేహం. ప్రస్తుతం అలాంటికోరిక వ్యాప్తిలో లేదు. ప్రస్తుతం మనశక్తులన్నిటినీ ఒకరినొకరు చంపుకోడానికేగాక, ఉద్రిక్తపరచే వస్తూత్పత్తుల్నీ, క్రీడావిలాసాలనూ సృష్టించుకోవడంవైపే మళ్ళిస్తున్నాం. అలాంటివాటిలో చాలవాటికి నా అభ్యంతరంలేదు. అందులోకొన్ని తప్పక వాంఛనీయాలనికూడా నేననుకుంటున్నాను. కాని అవి మరొక సుప్రయోజనంకోసం వినియోగించదగినకాలాన్ని ఎక్కువగా ఆక్రమించుకుంటూ, జీవితానికి వికృతరూపా న్నిస్తున్నాయి. నేడు కృత్రిమయెరువులవాడకం చాలా ఎక్కువగావుంది. అవి వాటిమార్గంలో మేలునే చేస్తాయనుకుంటాను. కాని కృత్రిమోత్పత్తులపై మోజు విపరీతమై ప్రజలు సహజమైనయెరువులను విస్మరించడం ఆఖరుకు వాటిని వృథాగా పారవేయడం నాకెంతో విడ్డూరంగా కన్పిస్తోంది ఒకజాతిగా చైనామాత్రమే సహజపదార్థాలను పూర్తిగా వినియోగించుకునే తెలివితేటలు కలిగివుంది. కృత్రిమయెరువులు సత్వరఫలితాన్నిచ్చినా కొన్ని ముఖ్యమైనసారములులేకుండాచేయడంద్వారా భూమిని నిస్సారంచేస్తాయనీ, అందువల్ల భూమి క్రమక్రమంగా పంటలుపండనివ్వర అయిపోతుందనీ కొందరునిపుణులు చెబుతున్నారు. మనవ్యక్తిగతజీవితాలవలెనే భూమినికూడా రెండువైపులా వెలిగించిన దివిటీలా త్వరత్వరగా కాల్చి

వేస్తున్నాం. భూమిలోని సౌభాగ్యాన్నంతటినీ విపరీతవేగంతో లాక్కుంటున్నాం, కాని, తిరిగిదానికిచ్చేదిఅతితక్కువ. ఒక్కొక్కసారిఅదీవుండదు.

మనం రసాయనికప్రయోగశాలలో దాదాపు దేన్నయినాసరే సృష్టించగలమని గర్విస్తాం. 'ఆవిరి' యుగంనుంచి విద్యుద్యుగానికి పయనించాము. ఇపుడు బయోటెక్నిక్స్, ఎలెక్ట్రానిక్స్‌యుగంలో వున్నాము. మనల్ని ఎంతగానో వేధిస్తున్న అనేక సన్నిహితసమస్యలను సాంఘికవిజ్ఞాన యుగం పరిష్కరించగలదని ఆశిస్తున్నాము. అది దగ్గరౌతోంది. మనం మెగ్నీషియం – అల్యూమినియంయుగప్రాంగణంలో వున్నామనికూడా చెప్పబడుతోంది. ఈ రెండులోహాలూ ప్రపంచమందంతటా సమృద్ధిగా వున్నాయి గనుక, వాటిలో దేనికీ కొరతఉండబోదు. నూతన రసాయనశాస్త్రం నవీన మానవ జీవితాన్ని నిర్మిస్తోంది. మన మిప్పుడు మానవాళికి శక్తినిచ్చేనిధులను అమితంగా పెంపొందించుకోగల యుగంలో అడుగుపెడుతున్నాం. త్వరలోనే చరిత్రనుసృష్టించగల నూతనాన్వేషణాపరంపర సఫలంకాగలదు.

ఇదంతా చాలా తృప్తికరంగానే వుంది. అయినా, నామనసులో ఒకఅనుమానం కలకవేస్తూవుంది. మనం బాధపడుతున్నది, శక్తిలేక పోవడంవల్ల కాదు; ఆ శక్తిని దురుపయోగంచేయడంవల్ల, లేక దాన్ని సరిగా వినియోగించుకోలేకపోవడంవల్లనే. విజ్ఞానశాస్త్రం మనకు 'శక్తి' నిస్తుంది. కాని, అది మనవశంచేసినజ్ఞానాన్ని మనం ఎలావుపయోగించుకుంటామోననే ప్రసక్తిలేకుండా, తనకునిమిత్తంలేనట్లుగా, నిరర్థకంగా వుండిపోతుంది. ఆ శాస్త్రం ఇంకా అనేకవిజయాలను సాధిస్తూనేవుండవచ్చు. కాని, అది ప్రకృతిని మరీయెక్కువగా విస్మరిస్తే, దానిమీద ప్రకృతే హఠాత్తుగా ప్రతీకారంచెయ్యవచ్చు. జీవితం బాహ్యరూపంలో పెంపొందుతున్నట్లే కన్పించినా, విజ్ఞానశాస్త్రం ఇంతవరకు కని పెట్టలేని విశేషమేదో లోపించడంవల్ల, ఆంతరంగికంగా జీవితం క్షీణించిపోవచ్చు.

## ౧౩. ప్రాచీనసమస్యకు నూతనదృక్పథం

ఆధునికమేధస్సు – అంటే ఆధునికమేధస్సులలో ఉత్తమశ్రేణికి చెందినది – అనుభవంగలవ్యవహారజ్ఞానంకలది, నీతిగలది, కలుపుగోలు

తనంగలది, మానవత్వంగలదిగానూ పరోపకారిగానూ వుంటుంది. అది ఆచరణీయమైనఆదర్శవాదంచే సాంఘికపురోభివృద్ధివైపు నడువబడుతుంది. దాన్ని సంభవింపజేసే ఆదర్శాలు ఈ యుగాంతర్యాన్ని, యుగధర్మాన్ని ప్రతిబింబిస్తాయి. అది ప్రాచీనులతాత్వికదృక్పథాన్నీ, అంతిమసత్యంకొరకుజరిగే అన్వేషణనీ, మధ్యయుగాలనాటి దైవారాధనాతత్వాన్నీ, గూఢమతవాదాన్నీ చాలవరకు తోసివేసింది. మానవత్వమే దానిదేవుడు, సాంఘికసేవే దానిమతం. ప్రతి యుగాత్మ దాని పరిసరాలనుబట్టి పరిమితమైవుంటుంది. ప్రతియుగము సత్యంలోని ఏదొక భాగమో పరిపూర్ణసత్యానికి కీలకమని విశ్వసించింది. కాబట్టి పైన పేర్కొన్నభావం అసంపూర్ణమే కావచ్చు. ప్రతితరము, ప్రతిజాతీ కూడా తనదృక్పథమే సరైనదనీ, కనీసం అదే అన్నిటికంటె దగ్గరి మార్గమన్నేభ్రమలోపడి కొట్టుమిట్టాడుతుంది. ప్రతి సంస్కృతికి కొన్ని విలువలు ఆపాదింపబడివుంటాయి. ఆ విలువలు ఆ సంస్కృతిచే పరిమితంచేయబడి, నియమబద్ధంచేయబడివుంటాయి. ఆ సంస్కృతిచే నడుపబడేప్రజలు ఆ విలువలను శిరోధార్యములుగా భావిస్తూ, వాటి చెల్లుబడి శాశ్వతమని విశ్వసిస్తారు. అందువల్ల, మన వర్తమానసంస్కృతియొక్కవిలువలు శాశ్వతాలు, ఆఖరువి కాకపోవచ్చు. అయినా, అవి మన తరంయొక్క ఆంతర్యాన్నీ, భావననీ ప్రతిబింబిస్తున్నాయి గనుక, మన కవి ముఖ్యమైనవే. కొద్దిమంది ఋషులు, మేధావంతులూ భవిష్యత్తులోనికి చూస్తూ, మానవాళియొక్క, ప్రపంచం యొక్క పరిపూర్ణదృశ్యాన్ని దర్శించవచ్చు. అట్టివ్యక్తులు దేనినుంచి వాస్తవపురోగమనం ఉద్భవిస్తుందో ఆ ప్రాణాధారమైనపదార్థంలోని భాగాలే. ప్రజల్లో చాలమంది ఈనాటి అస్పష్టభాషలో వాటినిగూర్చి మాట్లాడినా, వారు నేటివిలువలస్థాయినైనా అందుకోలేరు. వారు 'గతం' లోనే బంధితులై జీవిస్తూంటారు.

అందువల్ల మనం మనతరానికిచెందిన అత్యున్నతాదర్శాలకు కొంత చేర్చినా, మన జాతీయబుద్ధికుశలతకనుగుణంగా వాటిని మలచుకొన ప్రయత్నించినా, వాటికనుగుణంగా ప్రవర్తించాలి. ఆ ఆదర్శాలను మానవత్వం, శాస్త్రీయచైతన్యం అని వ్యక్తీకరించవచ్చు. ఈ రెండింటిమధ్య సంఘర్షణజరుగుతున్నట్లు కన్పిస్తుంది. కాని, పైకి

లేస్తున్న నేటి భావావేశం అన్నివిలువలను ప్రశ్నార్థకంగా పరీక్షిస్తూ ఈ రెండుదృక్పథాలమధ్య, వైజ్ఞానికబాహ్యప్రపంచానికీ అంతర్ముఖదృష్టి యొక్క ఆంతరంగికప్రపంచానికీ మధ్యగల ప్రాతసరిహద్దుగోడలను తొలగించివేస్తోంది. మానవత్వానికీ, వైజ్ఞానికచైతన్యానికీమధ్య సంయోగ సమ్మేళనాలు పెంపొందుతూ, ఒకరకమైన శాస్త్రీయమానవవాదాన్ని సృష్టిస్తున్నాయి. విజ్ఞానశాస్త్రం ప్రత్యక్షయథార్థాన్నే ఆధారం చేసుకుంటూ కూడా, ఇతరరంగాల్లో జొరబడబోతోంది. కనీసం వాటిని యేహ్యంగాచూడడం మానివేసింది. మన పంచేంద్రియాలూ, అవి ప్రత్యక్షంగా గ్రహించగలవీ మాత్రమే ప్రపంచం కాదు. భౌతికప్రపంచాన్నిగురించి శాస్త్రవేత్తభావదృశ్యంలో గత పాతికేండ్లలోనూ విపరీతమైన మార్పువచ్చింది. లోగడ విజ్ఞానశాస్త్రందృష్టిలో ప్రకృతి మానవునితో ఏలాంటిసంబంధమూలేని పదార్థంగా కన్పించేది. కాని, ఇప్పుడు సర్ జేమ్స్ జీన్స్ చెబుతున్నట్లు "మానవు డింక ప్రకృతి తనకు దూరంగావుండేవిశేషమని అనుకోవడం లేదు" అనేదే నేటివిజ్ఞానశాస్త్రసారాంశం. అలాంటిసందర్భంలో ఉపనిషత్తులపరిశోధకులను కలగుండుపరచిన వెనుకటిప్రశ్న తలెత్తుతుంది. అన్నీ తెలుసుకున్నవానిని తెలుసుకోవడ మెలాగు? బయటిపదార్థాలను చూడగల కండ్లు తమనుతా మెలా చూచుకోగలవు? బాహ్యవిశేషం అంతర్విశేషంలోనిభాగమూ, భావమే అయితే, మనం చూచేదీ భావించేదీ మనమనసు సినిమాయంత్రంలాగా ప్రసరింపజేసినవిశేషం మాత్రమే అవుతుంది. అంటే, ప్రపంచం, ప్రకృతి, ఆత్మ, మేధ, శరీరం, సర్వశ్రేష్ఠమైనది, లోనున్నది, మొదలైనవన్నీ మూలంలో ఒకటే. అలాగైతే, మన పరిమితమేధతో ఈ మహత్తరవిషయాల పథకాన్నంతటినీ ఎలా అర్థంచేసుకోగలం? విజ్ఞానశాస్త్రం ఈసమస్యలను తడుముసాగింది. అవి దానికందకపోవచ్చు. అయినా, నేటి పట్టుదలగలశాస్త్రవేత్త తొలియుగాలనాటి తత్వవేత్తకు, మతసిద్ధాంతికి పోలినవాడు. "మన ఈ భౌతికవాదయుగంలో పూర్తిగా మతాన్ననుష్ఠించేవ్యక్తులు వైజ్ఞానికరంగంలో తీవ్రకృషిచేస్తున్నవారే" నన్నాడు ప్రొఫెసర్ ఆల్బర్ట్ ఐన్‌స్టీన్. వివేకానందుడు ఏబదేండ్లక్రితం "ఆధునికవిజ్ఞానశాస్త్రం చిత్తశుద్ధితో

కృషిచేస్తూ, సత్యాన్ని అర్థంచేసుకో ప్రయత్నిస్తోంది గనుక, అదే వాస్తవమైన మతాంతర్యంగల"దని భావించాడు.

ఇవన్నీ పరికిస్తే, విజ్ఞానశాస్త్రంపట్ల గాఢవిశ్వాసం వున్నట్లూ అయినా, ప్రత్యక్షాధారాలకుమాత్రమే పరిమితమై, లక్ష్యవిహీనంగా వుండేశాస్త్రం చాలదనేభయం కూడా వున్నట్లూ గోచరిస్తుంది. విజ్ఞానశాస్త్రం జీవితవస్తుసామగ్రిని అపారంగాఅందించడంలో జీవితప్రాముఖ్యతనే విస్మరించిందా ? భౌతికప్రపంచంమీదనే అధికంగా ఆధారపడడంవల్ల మానవుని అంతరంగం నులిమివేయబడుతోందని స్పష్టమవుతోంది. అందువల్ల, భౌతికప్రపంచానికీ, ఆంతరంగికప్రపంచానికీ శృతి కలపడానికి ప్రయత్నంజరుగుతోంది. ప్రాచీనతత్వవేత్తలను బాధించిన ప్రశ్నేమరోరూపంలో మరొకవిధంగా తిరిగి తలెత్తింది; ప్రాపంచిక బాహ్యజీవితాన్ని వ్యక్తియొక్క ఆంతరంగికజీవితంతో సమన్వయించే దెలాగు? వ్యక్తి లేక సంఘంయొక్క శరీరానికి మాత్రమే చికిత్సచేయడం చాలదని వైద్యవేత్తలు కనిపెట్టారు. వైద్యులు ఇటీవలి సంవత్సరాల్లో ఆధునికమన స్తత్వశాస్త్రపరిశోధనాఫలితాలను గ్రహించి 'అంగసంబంధమైనవ్యాధులు, క్రియాసంబంధమైనవ్యాధుల' మధ్యగల సిద్ధాంతవిభేదాలను వదలివేసి, మానసికస్థితిని పరిశీలించడంమీదనే అధికాసక్తి చూపుతున్నారు. "శరీరచికిత్సకొకరు ఆత్మచికిత్సకొకరుగా వేర్వేరు వైద్యులుండడం వ్యాధులచికిత్సావిధానంలోని ముఖ్యలోపం. ఆ రెండు రకాలవ్యాధులూ ఒకటే; విడదీయరానివి" అన్నాడు ప్లేటో.

విజ్ఞానశాస్త్రవేత్తలో అగ్రగణ్యుడైన ఐన్‌స్టీన్ "మానవజాతి భవిష్యత్తు గతంలోకంటె నే ఎక్కువగా నైతికబలంమీదనే ఆధారపడి వుంది. అన్నిరంగాల్లోనూ త్యాగం, ఆత్మసంయమనములే సుఖానంద స్థితికిచేరేమార్గం"అని బోధిస్తున్నాడు. ఆయన హఠాత్తుగా మనల్ని యీ సగర్వ వైజ్ఞానికయుగాన్నుంచి ప్రాచీనతత్వవేత్తలకాలంలోకి, అధికారతృష్ణ, లాభదృష్టులనుంచి భారతదేశానికత్యంతపరిచితమైన త్యాగదృష్టివైపుకు తీసుకుపోతాడు. బహుశా, నేటి విజ్ఞానశాస్త్రవేత్తల్లో ఎక్కువమంది ఆయనభావాలతో ఏకీభవించరనుకుంటాను. ప్రపంచసంపదలన్నీ కలసినా, సక్రమవినియోగంకోసం దాన్ని అత్యంత చిత్తశుద్ధిగల సంఘసేవకుని చేతుల్లో ఉంచినా, మానవాళిపురోగమిం

చడం సాధ్యంకాదని నేను గాఢంగా విశ్వసిస్తున్నాను. ఉత్తమ, పవిత్రవ్యక్తిత్వాల ఉదాహరణలుమాత్రమే ఉత్తమభావాలను, ఉత్తమ చర్యలను సృష్టించగలవు. ధనం స్వార్థాన్నిమాత్రమే పురికొల్పుతుంది, శ్రీమంతులను దాని దుర్వినియోగానికే ప్రలోభపెడుతూంటుంది.” అన్న ఐన్‌స్టీన్ మాటలనుకూడ అందగూ సమర్థించలేరనుకుంటాను.

ఈప్రశ్న నాగరికతాప్రారంభంనుంచీ వున్నదే. దానిని పరిష్కరించేందుకు ప్రాచీనతత్వవేత్తలకంటె నేటి విజ్ఞానశాస్త్రానికనేక ప్రత్యేకావకాశాలున్నాయి. ఆ శాస్త్రానికి అనేక విజ్ఞాననిధుల ప్రోది వుంది; సమర్థవంతమని రుజువుచేసుకున్న విధానం వుంది. ప్రాచీనులకు తెలియని అనేకప్రాంతాలను విజ్ఞానశాస్త్రం కొలిచి, బేరీజువేసి, చిత్రీకరించింది. అది మానవుల అవగాహనాశక్తిని, అనేకవిషయాలపై అధికారాన్ని విస్తృతంచేయడంవల్ల మతపూజారులు ప్రజలను మభ్యపెట్టి దోచుకునే నిగూఢవిచిత్రాలన్నీ బట్టబయలైపోయాయి. కాని, విజ్ఞానశాస్త్రానికి కొన్ని అసౌకర్యాలు కూడా వున్నాయి. దానికి విజ్ఞాననిధులు అపారంగా వుండడంవల్లనే, ఆ మొత్తాన్ని మానవుడు ఒకే సమగ్రదృక్పథంతో చూడడం అసాధ్యమయింది. అందువల్ల మానవుడు ఆ ప్రోదిలోని ఏ ఒకభాగంలోనికో చొచ్చుకుపోయి, అందులో చిక్కుకుపోతాడు. దానినే అధ్యయనంచేస్తాడు, ఆభాగాన్నిమాత్రమే అర్థంచేసుకోగలుగుతాడు. దానికి మొత్తంతోగలసంబంధాన్నిమాత్రం గ్రహించలేడు. విజ్ఞానశాస్త్రం ప్రసాదించిన అపారశక్తులు అతన్ని ముంచివేస్తాయి. ఊపిరాడకుండా ముందుకు తోసుకుపోతాయి. ఆఖరుకు ఇష్టంలేని బలిపశువుగా, అపరిచితతీరాల్లో పారవేస్తాయి. ఆధునిక జీవితగమనవేగం – క్లిష్టపరిస్థితులపరంపర – నిరోత్సాహసత్యాన్వేషణకు అడ్డుతగులుతుంది. విజ్ఞానమే అటునిటు త్రోయబడి, వాస్తవవిచక్షణకు ఆవశ్యకమైన ప్రశాంత, ప్రత్యేకదృక్పథాన్ని సాధించడమే కష్టసాధ్యమైపోతుంది. “వివేకమార్గాలు నిశ్చలం, దానిఆంతర్యం తొణకదు.”

బహుశా, మనం మానవాళికి స్వర్ణయుగమనదగినయుగంలో జీవిస్తున్నాము. ఆ సదవకాశానికి తగ్గ మూల్యం చెల్లించవలసిందే. గొప్పయుగాలన్నిట్లోను పాతవిధానాలనుంచి మారాలనే ప్రయత్నాలు విరివిగా జరిగి, అవి సంఘర్షణ, అస్థిరత్వాలతో నిండిపోయాయి.

శాశ్వతనిశ్చలత్వం, భద్రత, మార్పులేకపోవడం వుండదు. అలావుంటే జీవితమే సమాప్తమవుతుంది. మహాసాధ్యమైతే, మనం యిప్పటికంటె మెరుగైన నిశ్చలతను, సమానస్థాయిని మాత్రమే చేరుకోగలం. మానవునికి మానవునికీ మధ్య, మానవునికీ పరిసరాలకు మధ్య శారీరక, వైజ్ఞానిక, నైతికరంగాల్లో నిరంతరం జరుగుతూండేసంఘర్షణే జీవితం. ఆ సంఘర్షణనుంచే నూతనవిశేషాలు రూపొందుతాయి. నూతనభావాలు జనిస్తాయి. విధ్వంసం, పునర్నిర్మాణాలు సైదోడులుగా సాగుతూంటాయి. మానవునియొక్క, ప్రకృతియొక్క దృక్పథాలు రెండూ ఎప్పుడూ ద్యోతకమవుతూనేవుంటాయి. జీవితం పెరుగుదలగలదేగాని నిశ్చలంగా ఉండిపోవడంకాదు. నిరంతరపరిణామమే గాని, జడస్థితిని కలుగనిచ్చేదిగాదు.

ఈనాడు రాజకీయ, ఆర్థికప్రాబల్యంగలప్రపంచంలో అధికారాన్వేషణస్థానంలో రాజకీయద్రోహం, కుట్రలు వచ్చాయి. నిస్వార్థధైర్యంస్థానే పిరికితనం, స్వార్థం పీఠంవేసుకుకూచున్నాయి. పదార్థానికంటె రూపానికి ఆధిక్యత ఎక్కువైంది. ఎంతో తాపత్రయంతో సాధించుకునే అధికారం, ఎందువల్లనో తాను లక్ష్యంగాపెట్టుకున్న దానిని సాధించుకోలేకపోతోంది. అధికారానికికూడా కొన్ని పరిమితులున్నాయి గనుక, బలప్రయోగక్రియ దానిమీదికే ఎదురుతిరుగుతోంది. ఆత్మను కఠినంచేసినా మొద్దుబార్చినా పైరెండూకూడ (అధికారం, బలప్రయోగం) ఆత్మను అదుపులోపెట్టలేవు. "నీవు ఒక సైన్యాధ్యక్షునిసైన్యాన్ని దొంగిలించవచ్చు, కాని, అత్యల్పమానవుని నుంచైనా అతనిఆత్మను దొంగిలించలేవు" అంటాడు కన్ఫ్యూషియస్.

జాన్ స్టూవర్ట్ మిల్ తనఆత్మకథలో ఇలావ్రాశాడు: "మానవాళి ఆలోచనావిధానాల పునాదులనిర్మాణంలోనే గొప్పమార్పురావాలి. అంతవరకు మానవాళిపరిస్థితిలో గొప్పమార్పురావడం సంభవంకాదని నే నిప్పుడు విశ్వసిస్తున్నాను." కాని, అలాంటిప్రాథమికమార్పే మారే వాతావరణంనుంచీ, జీవితపుయెడతెగనిపోరాటాల్లోవుండే బాధ, వ్యథల నుంచీ ఉద్భవిస్తోంది. అందువల్ల మనం ఆ ఆలోచనావిధానాన్ని నేరుగా మార్చప్రయత్నించినా, ఆ భావాలు దేనిసారంతో పెంపొందుతాయో ఆ వాతావరణాన్ని మార్చడం అంతకంటె ముఖ్యం. అవి

పరస్పరం ఆశ్రయించుకొని ఒకదానిపైనొకటి ప్రభావంకలిగివుంటాయి. మానవమేదస్సులరకాలు అనంతం. ప్రతిదీ తనమార్గంలోనే సత్యాన్ని వీక్షిస్తుంది. తరచుగా యితరులదృక్పథాన్ని అవగాహనచేసుకోలేక పోతుంది. అందువల్ల సంఘర్షణ తటస్థిస్తుంది. ఈ పరస్పరసంఘర్షణ నుంచికూడా యింతకంటే పరిపూర్ణసత్యం తలెత్తుతుంది. సత్యం బహుముఖాలుగలదనీ, అది ఏ ఒకవర్గానికో, జాతికో, మాత్రమే లోబడిపోయేది కాదనీ మనం గుర్తించాలి. క్రియావిధానాలనుకూడా యిదే దృష్టితో గ్రహించాలి. వేర్వేరు ప్రజలు వేర్వేరు పరిస్థితుల్లో వేర్వేరువిధానా లవలంబించవచ్చు. ఇండియా, చైనా, తదితరదేశాలూ తమతమ ప్రత్యేక జీవితవిధానాలను రూపొందించుకున్నాయి. వాటికి దృఢమైన పునాదులు వేసుకున్నాయి. వారు తమమార్గమే ఏకైకమార్గమని భ్రమించారు. ఇప్పటికీ అనేకమంది అలాంటి దుర్భ్రమలోనే వుంటున్నారు. అమెరికా ఇంగ్లండులు తమతమప్రత్యేకజీవితవిధానాలను రూపొందించుకున్నాయి. నేడవి ప్రపంచవ్యాప్తమై ప్రాబల్యంలో వున్నాయి. ఆదేశాలప్రజలు తమదే ఏకైకమార్గమని ఊహిస్తారు. కాని, వీటిలో ఏఒక్కమార్గమూ కూడా వాంఛనీయమైన ఏకైకమార్గం కాకపోవచ్చు. ప్రతిదీ యితర మార్గాలనుంచి గ్రహించవలసిన దెంతో వుండవచ్చు. భారత, చైనా దేశాలు జడస్థితిలో వున్నాయి గనుక, అవి నేర్చుకోవలసిన దెంతో వున్నదనేది వాస్తవం. పశ్చిమఖండం యీ యుగాంతర్యానికి ప్రాతినిధ్యంవహించమేగాక సంచలనాత్మకంగా, నిత్యనూతనంగా వుంది. పెంపొందేసామర్థ్యం—అది ఆత్మవిధ్వంసంద్వారా, అప్పుడప్పుడు మానవమారణహోమం జరపడంద్వారా సిద్ధించేదైనా—వున్నది.

భారతదేశంలో – బహుశా యితరదేశాల్లోకూడా – స్వీయప్రశంస, తమపైతామేజాలిపడడం అనే ధోరణులు ఒకదానితర్వాత ఒకటిగా ఉన్నాయి. ఈ రెండులక్షణాలూ కూడా అవాంఛనీయము, నీచమూను. మనం పక్షపాతబుద్ధి, ఆవేశదృక్పథాలద్వారా జీవితాన్ని అర్థంచేసుకోలేము. వాస్తవాలను ముఖాముఖీ, ధైర్యంగా ఎదుర్కోవడంద్వారానే అది సాధ్యం. అదృష్టచక్రం నడుస్తూనేవుంటుంది గాని, మనకోసంబడికోసం వేచివుండదు. కనుక, మనం జీవితంతోసంబంధంలేని

లక్ష్యవిహీన, అద్భుతాన్వేషణల్లో మునిగిపోలేము. మానవుని అంత రంగికజీవితప్రాముఖ్యాన్ని మరచి, బాహ్యజీవితాన్నేపట్టుకుని ప్రేళ్ళా డనూలేము. ఆ రెండింటిమధ్య సామరస్యంకలిగించేప్రయత్నం అవసరం. 17వ శతాబ్దిలో స్పినోజా యిలా వ్రాశాడు: "మేదస్సుకు మొత్తం ప్రకృతితోగల ఐక్యతను తెలుసుకోవడమే మహామేలు......మేదస్సు ఎంతఎక్కువగా తెలుసుకోగలిగితే అది ప్రకృతినైజాన్ని, శక్తుల్నీ అంత బాగా అర్థంచేసుకోగలదు. అప్పుడది అంతబాగా తనకుతాను నియ మాలు నిర్ణయించుకుని, తననుతాను పాలించుకోగలదు. మేదస్సు ప్రకృతినైజాన్ని ఎంత బాగా అర్థంచేసుకోగలిగితే అంతసులభంగా తనను తాను అనవసరవిషయాలనుంచి విముక్తిచేసుకోగలదు. ఇదే పరిపూర్ణవిధానం."

మనం మనవ్యక్తిగతజీవితాల్లోకూడా శరీరానికీ ఆత్మకూ మధ్య, ప్రకృతిలోభాగమైనమానవునికీ సంఘంలోభాగమైన మానవునికీ మధ్య సామరస్యాన్ని కనిపెట్టాలి. టాగూర్ ఇలా అన్నాడు: "మనం పరి పూర్ణంగావుండాలంటే శారీరకంగా అనాగరికులమై, మానసికంగా నాగ రికులమై వుండాలి; ప్రకృతితో ప్రకృతిసిద్ధంగాను, మానవసంఘంతో మానవులంగాను మెలగే సహజచాతుర్యం వుండాలి." పరిపూర్ణత్వం అంటే అంతమేగనుక, అది మన కసాధ్యం. మనం ఎప్పుడూ పయనిస్తూనే వుంటాం. ఎప్పటికప్పుడు వెనక్కుపోతున్నదాన్ని చేరుకోవాలని ప్రయత్నిస్తూనే ఉంటాము. మనలో ప్రతిఒక్కరిలోను అనేక వేర్వేరు మానవవ్యక్తిత్వా లున్నాయి. వాటి పరస్పర అసంబద్ధా లతో, వైరుధ్యాలతో ప్రతిదీ వేర్వేరుదిశకు లాక్కుపోతూంటుంది. జీవి తాన్ని ప్రేమిస్తాం; అదంటే విసుగుపడతాం. జీవితంలో అనుభవానికి వచ్చేవాటన్నింటినీ ఆమోదిస్తాం; అందులో అధికభాగాన్ని ఈసడిస్తాం. ఈ విరుద్ధధోరణులను సమన్వయాత్మకంగా మేళవించుకోవడం అసాధ్యం; ఒకప్పు డొకటీ, మరొకప్పు డింకొకటీ ప్రాబల్యంవహిస్తాయి. 'లావో త్సే' యిలా అన్నాడు: "జీవితరహస్యాన్ని దర్శించడానికి ఎవరైనా వ్యామోహాన్ని విసర్జించడం తరచుగా జరుగుతుంది. జీవితపు అసం ఖ్యాకఫలితాలను చూచేందుకుగాను దాన్ని వ్యసనంగా భావించడం తరచుగా జరుగుతుంది."

మన హేతువాద, అవగాహనాశక్తులూ, అనుభవ, విజ్ఞాననిధులూ అపారమైనా, జీవితరహస్యాలనుగురించి మనకు తెలిసినది అతి స్వల్పం. దానినిగూఢపరిణామవిధానాలనుగురించిమాత్రమే ఊహించగలం. కాని, మనం దానిసౌందర్యాన్ని ఆస్వాదించవచ్చు. కళద్వారా బ్రహ్మదేవునివలె సృష్టికలాపాన్ని సాగించవచ్చు. మనం బలహీనులము, తప్పటడుగులువేసే నశ్వరజీవులము, నిర్ణయంలేని అల్పకాలమే జీవించేవారము కావచ్చు. కాని, చిరంజీవులైన దేవుళ్ళలక్షణం కూడా కొంత మనలో వుంది. అరిస్టోటిల్ యిలా చెప్పాడు: "కాబట్టి మనం మానవులము, అశాశ్వతజీవులము గనుక, మానవులుగానే మర్త్యులుగానే ఆలోచించుదామనివాదించేవారికి దాసోహమనరాదు. మనకుసాధ్యమైనంతవరకు మనం అమర్త్యత్వాన్నే అలవరచుకోవాలి. మనలోవున్న ఉత్తమత్వానికనుగుణంగా బ్రతికేందుకు ఏ ప్రయత్నాన్నీ వదలకూడదు."

## ౧౭. తుదిమాట

ఈ పుస్తకం నేనువ్రాయడం ప్రారంభించి సుమారు ఐదుమాసాలయింది. కలగూరగంపలా పరిపరివిధాలుగానున్న మనస్సుతో దాదాపు వెయ్యిపేజీల వ్రాతగ్రంథాన్ని పూర్తిచేశాను. ఐదు నెలలలో నేను వేలసంవత్సరాలచరిత్రను సమీక్షించాను. భవిష్యత్తులోనికి తొంగిచూచాను. గతానికీ భవిష్యత్తుకీ సంధిసమయంలో నేనుతూలిపోకుండా నిలద్రొక్కుకున్నాను. ఈకాలంలో ప్రపంచంలో అనేక గొప్పసంగతులు జరిగినాయి. యుద్ధము, సైనికవిజయాలకు సంబంధించినంతవరకు త్వరితంగా ముగింపుకొస్తోంది. నాదేశంలోకూడా అనేక గొప్పవిషయాలు సంభవించాయి. కాని వాటిని నేను దూరాన్నుంచిచూడవలసినవాడినే. అందుచేత ఒక్కొకసారి నాకు అసంతృప్తి బాధ పొంగుపొంగులుగావచ్చి సద్దుకుంది. ఈ విషయాలన్నిటినిగురించి ఆలోచించడంలోను, అభిప్రాయాలను ప్రకటించడంలోనూ కొంతవరకు ప్రత్యక్షంగా ఉన్న వర్తమానాన్నివదలిపెట్టి, సువిశాలమైన భూతభవిష్యత్తులలో సంచారంచేశాను.

కాని ఈ అగమ్యసంచారానికి అంతుఉండకతప్పదు. మిగతా కారణాలెట్లాఉన్నా, ఒక్కకారణంవల్లనైనా ఆ అగమ్యసంచారాన్ని విరమించకతప్పలేదు. చాలాకష్టపడి సంపాదించుకున్న కాగితాలు అయిపోయినాయి. ఇంకా సంపాదించడం తేలికగా సాధ్యమైనపనిగాతోచదు.

భారతదేశాన్ని కనుక్కోవడం! ఇంతకూ నే నేమి కనుక్కున్నాను? భారతదేశాన్ని ఆవరించిన ముసుగు తొలగించి, ప్రస్తుతం ఆమె ఏ పరిస్థితిలో ఉన్నదో, చిరకాలమైనభవిష్యత్తులో ఎలాఉండేదో తెలుసుకోగలననుకోవడం చాలాసాహసం. ఈనాడు భారతదేశమంటే 40 కోట్లమంది ఎవరికివారేగాఉండే స్త్రీపురుషులు; ఒకరికొకరికి సంబంధం లేదు. ఎవరిమట్టుకువారే వారి ఆలోచనాప్రపంచంలో మునిగితేలుతున్నారు. ఇప్పుడే ఇల్లాఉంటే, ఎన్నోతరాలనాటిస్థితిగతు లెల్లావుండేవో సరిగా గ్రహించడం ఎంతకష్టమో వేరే చెప్పనక్కరలేదు. కాని గతంలో ఈ జనాన్నందరిని కలిపి కట్టినబంధమేదో ఉండేది. నేటికికూడా ఆ బంధమే ఉన్నది. భౌగోళికంగానూ, ఆర్థికంగానూ భారతదేశమంతా ఒక్కటే. ఎన్నెన్నిమతభేదాలున్నా, సాంస్కృతికంగాకూడా హిందూదేశమంతా ఒక్కటే. ఎన్నెన్నిఅభిప్రాయభేదాలున్నా, అందరినికలిపి కట్టే అగోచరమైన బలవత్తరమైన బంధాలున్నాయి. అనేకసార్లు జయింపబడినా, భారతదేశంయొక్క ఆత్మనుమాత్ర మెవ్వరూ జయింపలేకపోయినారు. ఈనా డొకానొక గర్వోన్నతుడైన విజేతచేతులలో భారతదేశం ఒక ఆటబొమ్మ కావచ్చునుకాని, ఆమెనుజయించి అణగద్రొక్కడాని కెవ్వరితరమూ కాదు. ఆమె కొక పురాతనగాథ ఉన్నది. ఏదో ఒకమహామాంత్రికశక్తి ఆమెనావహించిఉంది. ఏదోఒకవిచిత్రం, ఒకభావం, ఒకకల, అయినప్పటికీ ఆమె ప్రత్యక్షంగాకనుబడుతూ సర్వవ్యాప్తమై ఉన్నది. అక్కడక్కడ కాళరాత్రిని స్ఫురింపచేసే చీకట్లున్నాయి. వాటి వెనువెంటనే వెచ్చనైనవెలుగుతో పట్టపగలును సూచిస్తుంటాయి. ఒక్కొక్కప్పు డామె చిరాకుకలిగిస్తుంది. పట్టినపట్టు విడువదు. అప్పుడప్పుడు అత్యంతసుకృతచరిత్రగల ఆమె వికృతంగాకూడా ప్రవర్తిస్తుంది. ఏమైనా, ఆమె అత్యంతప్రేమాస్పదురాలు. ఆమె సంతానము ఏదేశంలో ఉన్నా, ఏ అవస్థలపాలైనా ఆమెను మరువజాలరు. వారు ఆమె మహత్తరప్రశస్తిలో భాగస్వాములు. ఆమె

లోపములకూ భాగస్వాములే. జీవితంలో సుఖదుఃఖాలను, రాగద్వే షాలను అనుభవించి అనంతమైన అగాధమైనవిజ్ఞానాన్ని చూరగొన్న ఆ మహాతల్లికనుపాపల్లో భారతప్రజలు ప్రతిబింబిస్తుంటారు. ప్రతిభార తీయుడు ఆ మహాతల్లిబడిలో చేరుతారు. ఆమెదగ్గరకుచేరడాని కెవరి కారణాలు వారికే ఉంటాయి. కొందరి కసలు కారణమేలేకపోవచ్చును. బహుముఖప్రజ్ఞలతో కూడిన ఆమెవ్యక్తిత్వము ఒక్కొక్కరికొక్కొక రూపమున సాక్షాత్కరించి ఆకర్షిస్తుంది. యుగయుగాలనుండీ ఆమె అనేకమంది మహాపురుషులను, స్త్రీలను ప్రసాదించింది. కాలానుగుణ్యా మైనమార్పులతో కదంకలుపుతూనే తనపూర్వసాంప్రదాయాన్ని నిల బెట్టుకుంది. ఆ మహాపురుషులపరంపరలోనివాడు రవీంద్రనాథఠాగూరు. నవయుగానికి అనుగుణ్యామైనకోరికలు, అనుభూతులు ఆయనలో ఎన్ని ఉన్నప్పటికీ, ఆయనమూలం మాత్రం సనాతన భారతసాంప్రదాయా ల్లోనే ఉంది. ఆయన తనజీవితాన్ని పాతకొత్తల మేలుకలయికగా సరిదిద్దగలిగేడు. "నేను భారతభూమిని గాఢంగాప్రేమిస్తున్నా. ఆమె భౌగోళికస్వరూపం చూచి నేను ప్రేమించడంలేదు. కేవలం ఈగడ్డమీద జన్మించినకారణంగానూ ప్రేమించడంలేదు. అనేక అల్లకల్లోలములు సంభవించినా, ఎన్నోయుగాలనుంచీ ఆ గడ్డపైజన్మించిన మహాపురుషుల విజ్ఞానఖండములైన మహోపదేశములను ఆమె సురక్షితముగా ఉంచ గలిగినందులకే ఆమెను ప్రేమిస్తున్నాను." అన్నాడు ఠాగూరు. అనేక మంది అనేకవిధాలుగా ఆమెయెడలగల ప్రేమను వివరిస్తారు.

పాతకాలపుఆకర్షణలు నేడు క్రమంగా సడలిపోతున్నాయి. ఆమె కొత్తఅభిరుచులకనుకూలంగానే తన అలంకరణములను ఆకర్షణ లను మార్చుకుంటున్నది. మార్పులుచెందడం విధాయకం. కనుకనే ఆమె ఎన్నిమార్పులుచెందినప్పటికీ తనప్రజలను ఆకర్షించేమాంత్రికశక్తి మాత్రం కొరవపడడంలేదు. పైవేషభాషలెన్నిమారినా ఆమె పూర్వ కాలంలాగుననే ఉంటుంది. ఆమె సమానమైన విజ్ఞానవివేకసంపత్తి ఈ కఠోరప్రపంచంలో, ద్వేషపూరితవాతావరణంలోకూడా ఆమె ప్రశ స్తిని చాటుతుంది.

ఈనాడు ప్రపంచం అనేక మహత్తర విశేషాలను సాధించింది. అయినప్పటికీ మానవునికి మానవత్వాన్నిప్రసాదించే సద్గుణాలమీద

కన్న, ద్వేష, దౌర్జన్యాలమీదనే ప్రపంచం ఆధారపడుతున్నది. సత్యానికి మానవత్వానికికూడా యుద్ధం శుద్ధభిన్నమనేచెప్పాలి. ఒక్కొక్కప్పుడు యుద్ధం తప్పనిసరికావచ్చును. కాని దానిఫలితములను ఊహించుకుంటే చాలా భీతికలుగుతుంది. పుట్టినవాడు గిట్టడం విధాయకమేకనుక కేవలం హత్యాకాండవల్లనే యుద్ధం భయంకరం కాదు. కాని గుండెల్లేకుండా అసత్యాన్ని ద్వేషాన్ని ప్రచారంచేస్తుండడమే యుద్ధంలో జరిగే ఘోరం. క్రమంగా ఇదే ప్రజల కలవాటైపోతుంది. రాగద్వేషాలు జీవితవిధానానికి మార్గదర్శకములు కాకూడదు. ఏమంటే అవి మనస్సునెన్నోవిధాలుగా మెలికలుపెట్టి ఆయాసంకలిగిస్తాయి. అందువలన మనస్సు సత్యాన్ని గ్రహించలేకపోతుంది. దురదృష్టవశాత్తు ఈనాడు భారతదేశంలో అసహనం చాలా హెచ్చుగా ఉంది. తీవ్రమైన ద్వేషాలుకూడా ఉన్నాయి. గతం అలాగే తరుముకొస్తోంది. వర్తమానంలోకూడా ఏమంత మార్పుకనబడదు. మహాప్రశస్తిగాంచిన భారతజాతికి కలిగిన అవమానాలను తేలికగామరచిపోవడం మాటలుకాదు. అయినప్పటికీ భారతీయులు ద్వేషాన్ని ఎంతోకాలం కడుపులో దాచుకునేస్వభావంకలవారుకారు. త్వరలో సహృదయులైపోయి, ప్రసన్నులవుతుంటారు.

స్వాతంత్ర్యం సిద్ధించినపిమ్మట భారతదేశం మరల నూతన వికాసంతో వర్ధిల్లుతుంది. గతంలో, అనగా కొద్దికాలంక్రిందట అనుభవించిన న్యూనతను నిస్పృహను నిర్జించి, భవిష్యత్తుకొరకై ఉవ్విళ్లూరుతుంది. ఆత్మవిశ్వాసంతో ముందడుగువేస్తుంది. తనవ్యక్తిత్వాన్ని స్థిరపరచుకుంటూ ఇతరులవద్ద కొత్తవిషయాలను నేర్చుకుంటూ సహకారంచేస్తుంది. ఈనాడు తన పూర్వసాంప్రదాయానుసరణానికీ, గ్రుడ్డితనంగా విదేశీయాచార అనుకరణానికీ మధ్య తికమకలుపడుతోంది భారతదేశం. ఈ రెండుమార్గాలవల్లనూ అభివృద్ధిగాని, నిజమైన జీవనోత్తేజంగాని కనబడుటలేదు. ఆమె ఈ ముసుగులోనుంచి బయటపడి నవయుగంయొక్క కార్యకలాపాల్లో పాల్గొంటేనేకాని ప్రయోజనం లేదనడం నిర్వివాదాంశం. శుద్ధఅనుకరణవల్ల నిజమైన సాంస్కృతిక వికాసం కలుగుతుందనడంకూడాకల్ల. జనసామాన్యంతోనూ సహజమైన జాతీయజీవనంతోనూ, సంబంధంలేని ఏ కొద్దిమందికో అలాటి అను

కరణం చెల్లుబాటవుతుంది. నిజమైన సంస్కృతి, ప్రపంచంలో అన్ని మూలల్లోనున్న విజ్ఞానాన్ని గ్రహించి వికాసంపొందుతుంది. కాని జనసామాన్యంయొక్క అంగీకారాన్నిపొంది స్వసాంప్రదాయాల్లో పెరిగి నపుడే దానివిశేషం. కళలు, సాహిత్యం నిరంతరం విదేశీయలక్ష్యాల మీదనే జీవించవలసివస్తే, అవి నిర్జీవమైపోతాయి. ఎవ్వరో కొద్దిమందికి మాత్రమే సంబంధంఉండే సంకుచితనాగరికతకు తావులేదు. మనం స్థూలంగా బహుళప్రజానీకందృష్టితో, యావత్తువిషయాలనూ పరిశీలిస్తూఉండాలి. ఈ ప్రజాసంస్కృతి వారి పూర్వసాంప్రదాయానికి పరిణామమైనదిగా ఉండాలి. అయినప్పటికీ కొత్తఅభిరుచులకు, పోకడలకు, సృష్టికి అనుగుణ్యంగాకూడా ఉండాలి.

సుమారు నూరుసంవత్సరాలకుపూర్వం అమెరికాలోనివసిస్తుండే తన దేశస్థులకు యూరపుఖండాన్ని విశేషంగా అనుకరించవద్దనీ, సంస్కృతిని వికసింపచేయడానికి దానిపై ఆధారపడవద్దనీ మహాకవి ఎమర్సన్ చెప్పేడు. అమెరికాదేశంలో కొత్తగా నివాసమేర్పరచుకున్నవారిని తరచుగా యూరపుకేసిచూస్తూఉండవద్దనీ, తమ కొత్తస్థావరంలోనుంచే కొత్తఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని పొందమనీ ఆయన చెప్పేడు. 'మనమిక ఇతరులమీద ఆధారపడేరోజులు గతించాయి. మన ఈ ప్రాంతాల్లో రోజురోజుకూ ఉద్భవిస్తుండే జనాన్ని విదేశీయసాంప్రదాయశకలాల మీద బ్రతికించలేము. అనేకసంఘటనలు ఏర్పడతాయి. వాటిని మనం ప్రశంసించకతప్పదు. వాటంతటవే ప్రశంసాపాత్రమవుతాయి...... సృజనాత్మకమైనమాటలు చేష్టలు ఉత్పన్నమవుతున్నాయి. ఇవేమీ ఒక అధికారాన్ననుసరించినవి కాని, ఒక సాంప్రదాయాన్ననుకరించినవి కాని కావు. మనస్సే మంచిచెడ్డలను నిర్ణయంచేస్తుంది." అన్నాడు ఎమర్సన్. మరొకచోట ఆత్మవిశ్వాసంగురించివ్రాస్తూ 'ఆత్మీయమైన సంస్కృతిలేక, ప్రయాణవిషయమైన చాదస్తాలు సంకోచాలు అమెరికా వారికల్లాగే ఉండిపోయాయి. వారి ఆదర్శం ఎంతసేపూ ఇంగ్లండు, ఇటలీ, గ్రీసు. ఈదేశాలవారు భూమియొక్క అక్షాంశంలాగే తమదేశాలనుండి కదలకుండాఉండడంవల్లనే వారికా ఘనతకలిగిందని అమెరికా వారి నమ్మకం. కర్తవ్యపాలనమే మనవిధాయకమనుకుంటున్నాం. ఆత్మ సంచారంచేయదు. వివేకవంతుడు ఇంటిదగ్గరే ఉండిపోతాడు. ఒకవేళ

ఆతడు తన ధర్మనిర్వహణంకోసం పరదేశాలకు పరస్థలాలకు వెళ్ళవలసి వచ్చినా, వాటినికూడా తన స్వగృహంలాగే చూచుకోగలుగుతాడు. విజ్ఞానాన్ని వివేకాన్ని ప్రచారంచేసే మిషనరీలాగే ఆయనెక్కడికైనా వెళ్ళకలుగుతాడు. ఎక్కడికెళ్ళినా రాజులా వెడతాడు కాని, ఎవరో నౌకరు పరస్థలానికి వెళ్ళినట్లు వెళ్ళడు" అన్నాడు.

"విద్యాసముపార్జనకు, కళోపాసనకు మానవుడు ప్రపంచాన్నంతనూ చుట్టివచ్చినా నాకభ్యంతరంలేదు. కేవలం తనకుతెలియని దేదో తెలుసుకుందామని జిజ్ఞాసతోనూ, తనకులేనిదేదో సంపాదించుకుందామనే ఆశతోనూ ప్రపంచమంతా తిరుగుతాననేవాడు ముందు తనకేమారమవుతున్నాడు. చిన్నవయస్సులోనే వృద్ధుడైపోతున్నాడు. థీబిస్‌లోనూ పాల్మైరాలోనూ ఉన్న ఆ శిథిలాలలాగునే అతనిమనస్సు కూడాశిథిలమైపోతుంది. శిథిలాలను శిథిలాలదగ్గరకు తీసుకెడుతున్నాడు.

అదేపనిగా సంచారంచేయాలనే అభిలాష ఒకవిధమైన మానసిక రుగ్మత. అది బుద్ధిని పనిచేయకుండా అడ్డుతగుల్తూ ఉంటుంది...మనం అనుకరణచేస్తుంటాం...... విదేశీయఅభిరుచులతో మనఇండ్లు కట్టుకుంటున్నాం. మనఅద్దాలబీరువాలను విదేశీయఆభరణాలతో అలంకరించుకుంటున్నాం. మనఅభిప్రాయాలు అభిరుచులు, ప్రజ్ఞావిశేషాలు అన్నీకూడా గతాన్నే అనుసరిస్తున్నాయి. కళ ఎక్కడ అభివృద్ధిచెందినా దానికి కారణం ఆత్మ. కళాకారుడు తనమనస్సులోనే తానుసృష్టించదలచుకున్నకళాఖండంయొక్క నమూనాను సృష్టించుకుంటాడు. ఆ ఆలోచనప్రకారమే పనిచేస్తాడు...కనుక స్వబుద్ధితో ఆలోచించు. కేవలం అనుకరణం చేయవద్దు. నీవు స్వంతంగా సృష్టించిన కళాఖండాన్ని హృదయపూర్వకంగా జీవితకృషియొక్క సత్ఫలంగా ఎవ్వరికైనా అర్పించవచ్చును. ఇతరులసృష్టియొక్క అనుకరణ నిచ్చేటప్పుడు ఆ తృప్తిలో సగంమాత్రమే ఉంటుంది."

గతాన్నిగురించి అన్వేషించడానికి భారతీయులమైన మేము దేశదేశాంతరాలకు పోనక్కరలేదు. గతచరిత్ర, సాంప్రదాయమూ కావలసినంత ఇక్కడేవున్నది. మేము విదేశాలకు వెడుతున్నామంటే, వర్తమానాన్నిగురించిన అన్వేషణకే. ఈ అన్వేషణ చాలా అవసరం. ప్రపంచంలోని ఇతరదేశాలతో ఏవిధమైన సంబంధంలేకుండా ఒకమూల

హూచోడం మంచిదికాదు. అది నీరసలక్షణం. నాశహేతువు. ఎమర్సన్ నాటికాలం మారిపోయింది. పాతకాలపుహద్దుపద్దులు ఆటంకాలు రూపుమాసిపోతున్నాయి. జీవితం అంతర్జాతీయమైపోతోంది. రాబోయే అంతర్జాతీయజీవితంలో మన దేశం ఉచితమైనపాత్రనుధరించాలి. అందుకోసమే మనం విరివిగా సంచారంచేస్తూ అందరితోనూ పరిచయం చేసుకోవాలి. వాళ్ళదగ్గరనుంచి నేర్చుకోవాలి. కొన్నివిషయాల్లో వారికి నచ్చచెప్పాలి. నిజమైన అంతర్జాతీయతఅంటే ఆకాశంమీదనుంచి ఊడిపడేదికాదు. జాతీయసంస్కృతులలోనుండి అది ఉద్భవించి వృద్ధి చెందాలి. స్వాతంత్ర్యం, సమానత్వం, నిజమైన అంతర్జాతీయభావం నే పునాదులమీదనే అది వృద్ధిచెందుతుంది. అయినప్పటికీ ఏనాడో ఎమర్సన్‌చెప్పిన సత్యం ఈనాటికీ ఒప్పుతుంది. మన అన్వేషణ ఆయన చెప్పిన పరిస్థితుల కనుగుణ్యంగా ఉన్నప్పుడే ఫలప్రదమవుతుంది. అందరికీ సంబంధించిన ఒక అన్వేషణ జరిగేటప్పుడు, మనలను సమాన స్థాయీలో, సహచరభావంతో ఆహ్వానించినపుడుతప్ప, పిలువనిపేరంటమునకు పానకంలోపుడుకలలాగున జోక్యం కలుగచేసుకొనము. బ్రిటిష్‌సామ్రాజ్యాంతర్భాగాలైన కొన్నిదేశాలు మనలను న్యూనతపరచడానికి ప్రయత్నిస్తున్నాయి. అలాంటిదేశాలతో మనకేమీ సంబంధంలేదు. తత్కాలంగా మనం పరప్రభుత్వదాస్యంలోపడుండడంచేత దుర్భరమైనభారాన్ని భరిస్తున్నాం. కాని మనకు స్వాతంత్ర్యం లభించే తరుణం ఆసన్నమైంది. మనదేశం ఏమీ సాధారణదేశం కాదు. ఈ దేశంలో జన్మించి ఇందులో పౌరులైనందుకు చాలా సంతోషిస్తున్నాం. మనజనాన్ని, మన సంస్కృతీసాంప్రదాయాలను గాఢంగా ప్రేమిస్తున్నాం. అయితే ఈగర్వమంతా కేవలం మనగతంలోని గొప్ప చూసుకునే కాదు. దానినిపట్టుకుని ప్రేలాడుతామనీ కాదు. అందువల్ల ఇతరులలోని మంచిని గుర్తించలేక ఎవ్వరితోనూ జోక్యంకలుగచేసుకోకుండా ఒకమూల కూర్చుంటామనీ కాదు. మనలో ఉన్న అనేక లోపాలను మరువనూకూడదు. ఆ లోపాలను సవరించుకోవడంలో ఉపేక్షచేయనూకూడదు. మానవాభ్యుదాయాన్ని, సంస్కృతిని పెంపొందించడానికి ప్రపంచమంతటా జరుగుతుండే ప్రయత్నాలతో మనంకూడా అడుగుకలపాలంటే ఇంకా మనం చాలాదూరం పయనంచేయ్యాలి.

ప్రపంచం చాలాచురుకుగా ముందుకెడుతోంది. మనకున్నకాలం బహు తక్కువ. కనుక మనంకూడా తొందరగా అడుగెయ్యాలి. ఇతరసంస్కృతులను చక్కగా ఆకళింపుచేసుకుని తనలో లీనంచేసుకోవడం గతంలో భారతసాంప్రదాయం. ఈనాడు ఆ సాంప్రదాయా న్ననుసరించడం మరింత అవుసరం. ఏమంటే అనేకమైన జాతుల సంస్కృతు లన్నిటిని చక్కగా మేళవింపచేసి ఒక్కటేమానవజాతియొక్క అంతర్జాతీయ సంస్కృతిని రేపో మరునాడో రూపొందించడం కర్తవ్యం. కనుక, వివేకము, సంస్కృతి, స్నేహము, సహచర్యము ఎక్కడున్నా మనం వాటిని అన్వేషించాలి. అందరికొక్కటైన లక్ష్యాలను సాధించడానికి వారితో చేతులు కలుపుతాం. కాని మన మెవ్వరికి అడుగులకు మడుగులొత్తనక్కరలేదు. వాళ్ళ దయాధర్మభిచ్ఛముల నాసించనక్కరలేదు. అందువల్ల, నిజమైన భారతీయులం ఆసియావాసులం అనిపించుకుంటాం అంతేకాకుండా మంచి అంతర్జాతీయవాదులమనీ, మంచి ప్రపంచపౌరులమనీ కూడా అనిపించుకుంటాం.

భారతదేశంలోనూ, ప్రపంచంలోనూకూడా నా తరంవారం చాలా బాధలుపడినవాళ్ళం. మేమింకా కొంతకాలంపాటు ఈజీవితాన్ని ఇల్లాగే లాగగలుగుతాం. కాని కొంతకాలానికైనా మా పనైపోతుంది. మాస్థానాలను కొత్తవారికి వదలిపెట్టకతప్పదు. అప్పుడు వాళ్ళు తమ జీవితాలను సాగించుకుంటారు. రెండవమజిలీప్రయాణానికి అవసరమైన భారాలను వారే భరిస్తారు. ఇప్పుడే ముగియుచున్న ఈ చిన్న అంతర్నాటకం[illegible] మాపాత్రల నెల్లా నటించామో నాకు తెలియదు. ముందు కాలాలవాళ్ళు నిర్ణయంచేయాలి. జయాపజయాలను నిర్ధారణచేసే ప్రమాణాలేమిటి? అవికూడా నాకు తెలియవు. మాజీవితం కష్టభూయిష్టమైనదని, సుఖప్రదంకాదనీ మేము చెప్పుకోవలసిన న్యాయం లేదు. ఏమనగా ఈ జీవితవిధానాన్ని మేము స్వయంగా వరించినదే. బహుశా స్థూలంగాచూస్తే మాజీవితం అంతకష్టంగాకూడా లేదేమో! జీవితంలో చరమ[illegible]స్థకువచ్చినవారు ముఖ్యంగా మృత్యువంటే భయపడనివారు దానివి[illegible]న్నిగ్రహించగలుగుతారు. మేము అనేకమైన పొరబాట్లను చేసిఉండవచ్చును. కాని మా హృదయంలోఉండిన తేలికతనం, సిగ్గున




| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA126B170 |
| పుస్తకం పేరు | భారత దర్శనము |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 855 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | B, D |
| లేని పేజీలు | 1,TO,16,153,154,225,226,355,356 |
| తయారు చేసినది | B. Jayamma |
| పేజీలు విడదీసినది | B. Jayamma |
| స్కాన్ చేసినది | MOUNIKA |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |